## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120029405

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

NAA JEEVITA YATRA—VOL. I
(Auto Biography of Andhra Kesari
Prakasam Pantulu in four Volumes)
By
TANGUTURI PRAKASAM

Publishers :
M. SESHACHALAM & CO.

First Edition :
EMESCO POCKET BOOKS
July 1972

Cover Design :
BAPU

Printers :
KRANTI PRESS, Madras-1.

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
RASHTRAPATHI ROAD, SECUNDERABAD.

Price Rs. 2-50

Four Volumes bound in one hard Cover Edition Rs. 15/-




205

# నా జీవిత యాత్ర

## ప్రథమ ఖండం

# ప్రస్తావన

## రాష్ట్రపతి డాక్టర్ వరాహగిరి వెంకటగిరి

ఆంధ్ర కేసరి ప్రకాశం పంతులుగారు ఒక్క వ్యక్తికాదు; అర్ధ శతాబ్దికి పైగా ఆంధ్ర రాజకీయ ప్రజాహిత జీవన రంగంలో ఆయన ఒక మహా సంస్థ. ఆయన వ్యక్తిత్వం మహా గోపుర శిఖరోన్నతం. ఆయన జీవిత గాథ బహుముఖ ప్రకాశం గలది; బహురస సంపన్నమైనది. బొడ్డున మాణిక్యం పెట్టు కొని పుట్టిన భాగ్యశాలి కారు ఆయన. అతి సామాన్య స్థితి —కాదు, నిరుపేద దశ—లో నుండి ఎదిగి ఎదిగి మహా వైభవ శృంగాన్ని అందుకొన్న అతిసత్త్వుడాయన. ఉజ్జ్వల దేశ భక్తి, నిరుపమ త్యాగశీలం, అన్నింటికన్న ముఖ్యంగా ఆయన అక్షయ శక్తి, స్వభావ సౌష్ఠవం—ఆయన విజయ హేతువులు. ప్రకాశంగారు నాకు మరీ సన్నిహితులు; మన స్వాతంత్ర్య సమర చరిత్రలో అతిక్లిష్ట దశలో ఆయన నాయకత్వాన ఆయనకు అత్యంత సన్నిహితుడనై పనిచేసే భాగ్యం నాకు కలిగింది. అటువంటి అప్పుని గురించి వ్రాయటం కష్టం. ఆ రోజులు తలుచుకుంటే, వాస్తవంగా నాకు ఒళ్ళు పులక రిస్తుంది. ఆ సంరంభాలు, ఆ సంచలనాలు, ఆ సంఘటనలు ఇప్పటికీ నాకు అపరిమితమైన ఆనందం, ఉత్సాహం కలిగిస్తాయి.

నాకు పదేళ్ళు వచ్చిన నాటినించి ప్రకాశంగారిని ఎరు గుదును. మా నాయనగారు, ప్రకాశంగారు సమకాలికులు, ఆజీవ మిత్రులు. ఇద్దరూ న్యాయవాద వృత్తిలో ప్రముఖులు. గాంధి మహాత్ముని నాయకత్వాన సాగుతున్న స్వాతంత్ర్య సమరంలో ప్రవేశించక పూర్వం ప్రకాశం పంతులుగారు మద్రాసులో ప్రముఖ న్యాయవాదిగా ప్రాక్టీసుచేస్తూ అమి

తంగా ఆర్జిస్తూ ఉండేవారు. చిరకాలం మా నాయనగారు, ప్రకాశంగారూ ప్రక్క ప్రక్కనే ప్రవహిస్తూన్న రెండు నదుల్లాగ సారవంతమైన మన తెలుగు నేలను ఫలవంతం చేశారు. ఇద్దరూ ఇంచు మించు ఏక కాలంలో జన్మించారు. ఒకే కళాశాలలో—రాజమండ్రి ఆర్ట్స్ కాలేజ్‌లో—ప్రిన్సిపల్ మెట్‌కాఫ్‌గారివద్ద చదువుకున్నారు. 1891 సుమారులో ఇద్దరూ ఫస్ట్‌గ్రేడ్ ప్లీడరు పరీక్షకు చదివి, గంజాం, గోదావరి జిల్లా కోర్టులలో ప్రాక్టీసు చేశారు. 1927—29 లో ఇద్దరూ మాన్యులైన పండిత మోతీలాల్ నెహ్రూగారి నాయకత్వాన మన దేశంలో నాటి పెద్దలంతా ఉన్న స్వరాజ్య పార్టీ పక్షాన కేంద్ర శాసన సభకు ఎన్నిక అయారు. 1937—39 లలో ఇద్దరూ మద్రాసు శాసన సభా కాంగ్రెస్ పక్షంలో - ప్రకాశంగారు శాసన సభలోను, మా నాయనగారు శాసన మండలిలోను—సభ్యులుగా ఉండేవారు. ఈ సమయంలోనే నేను అనేక పర్యాయాలు ఆ మహా మానవుణ్ణి దర్శించగలిగాను. జీవితం పొడుగునా నేను ప్రకాశంగారిని మాననీయులైన మా తండ్రిగారితో సమానులుగానే చూసుకున్నాను. ఆయన విజ్ఞానము, ఆయన జీవితానుభవము నాకు ఎంతో ప్రోత్సాహం ఇచ్చాయనీ, పదేళ్ళ పసితనం నించీ నేను ఆయనను మన మహా నాయకులలో ఒకరుగా భావిస్తూ, ప్రజాసేవారంగంలో ఆయన కార్యక్రమాలను అమితాసక్తితో గమనిస్తూ ఎంతో లాభం పొందాననీ సగర్వంగా చెప్పుకుంటున్నాను.

ప్రకాశంగారు రాజకీయాలలో ప్రవేశించక పూర్వం గొప్ప సంఘ సంస్కరణవాది. మన సంఘంలోని మూఢాచారాలను, కుల వర్గ వర్ణ విభేదాలను రూపు మాపడంలో ఆయన ఎంతో శ్రద్ధ చూపేవారు. పందొమ్మిదవ శతాబ్దిలో భారత దేశంలో అవతరించిన మహాపురుషులలో ఆయన ఒకరు. అమృతసర్‌లో దారుణ హత్యాకాండ జరిగిన తరువాత

గాంధి మహాత్ముడు సహాయనిరాకరణోద్యమం ప్రారంభించిన మీదట, సైమన్ కమీషను భారతదేశం వచ్చినప్పుడు మద్రాసులో పెద్దగా ఆందోళన జరిపారు. ప్రకాశంగారు 144 వ సెక్షనును ధిక్కరించినప్పుడు, బ్రిటిష్ సైనికులు తుపాకులు చూపి ఆయనను సవాల్‌చేయగా, వెంటనే ప్రకాశంగారు తన ఎదురు రొమ్ము చూపి, 'కాల్చుకో'మని ఎదురు సవాల్ చేశారు. దాంతో, ఆ సైనికులు స్తబ్ధులై నిలబడిపోయి, ప్రకాశంగారిని ముందుకు పోనిచ్చారు. ఈ నిర్భయతే, ఈ గుండెలు దీసిన బంటుతనమే ప్రకాశంగారి 'ఆంధ్ర కేసరి' బిరుదుకు కారణమయింది. అయన దక్షిణ భారత నాయకా గ్రణి అయారు.

మొదట మంత్రిగాను, స్వాతంత్ర్యం వచ్చిన తరువాత ముఖ్య మంత్రిగాను ప్రకాశంగారు గురుతర నూతన బాధ్యతలు స్వీకరించవలసి వచ్చినప్పుడు, ఆయన ఇంకా ఎత్తుగా పెరిగి, అత్యంత సమర్థులు, ప్రజానురంజకులు అయినకాంగ్రెస్ మంత్రులలో ఒకరుగా పేరు తెచ్చుకున్నారు. ఉమ్మడి చెన్న రాష్ట్రంలో రాజాజీ మంత్రి వర్గంలో ప్రకాశంగారు, నేనూ మంత్రులం. 1946 లో మరల కాంగ్రెస్ మంత్రి వర్గాలు ఏర్పడినప్పుడు నేను ముఖ్య మంత్రిగా ఉంటే రాష్ట్రానికి సుస్థిరమైన ప్రభుత్వం ఏర్పడగలదనే ఒక అభిప్రాయం వ్యక్తమయింది. నేను ఎంత త్యాగమైనా చేసి ప్రకాశంగారి నాయకత్వాన్నే బలపరుస్తాననీ, ఆయన కోరితే తప్ప నేను ముఖ్య మంత్రిత్వం స్వీకరించననీ, నేను ముఖ్య మంత్రిని కావాలని సూచించిన నాయకులందరికీ ఒక విధమైన కృతజ్ఞతా పూర్వక నమ్ర భావంతో స్పష్టంగా చెప్పాను. ఆ మాట నిలబెట్టుకుని, నాకు కొన్ని ప్రమాదాలు, కష్టాలూ ఎదురైనా చెదరిపోకుండా నిలబడి, ప్రకాశంగారు నాటి ఉమ్మడి చెన్న రాష్ట్ర ముఖ్య మంత్రిగా ఎన్నిక అవడానికి సాయపడ్డాను.

అయితే, ఆ మంత్రివర్గం ఒక్క సంవత్సరంకన్న నిలవలేక పోయింది. తమ నాయకత్వంలో రెండవస్థానం నాది అని ఎప్పుడూ ప్రకాశంగారి విశ్వాసం. ఆ విశ్వాన్ని నిలుపుకోడానికి నేను నా శక్తివంచనలేకుండా పనిచేస్తూ, ఆయన ఆశయాలను, ప్రభుత్వం నడపడంలో ఆయన విధానాలను బలపరుస్తూ ఉండేవాణ్ణి. వాస్తవంగా ఆధునిక ఆంధ్రప్రదేశ్ పిత అయిన ఆ మహానాయకునిపట్ల ఈ విధంగా, గాఢ కృతజ్ఞతాభావంతో నా ఋణం తీర్చుకున్నాననే సంతృప్తి నాకు ఉంది.

ప్రకాశంగారు ఎప్పుడూ దూరదృష్టిగల ప్రజానాయకుడు. సామాన్య ప్రజల సౌకర్యాలు, శ్రేయస్సు ఆయన నిరంతర ధ్యేయాలు. అందుకే, ప్రకాశంగారిపట్ల ఆయన జీవితం పొడుగునా ప్రజలు అపారమైన భక్తి విశ్వాసాలు ప్రదర్శించడంలో ఆశ్చర్యమేమీ లేదు.

ప్రకాశంగారు తమ జీవిత కాలంలోనే భారత స్వాతంత్ర్యం సిద్ధించడం, సర్వతంత్ర స్వతంత్ర గణతంత్రంగా ప్రకటించటం, ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ప్రాప్తించటం—అన్నీ స్వయంగా చూసి, ఏళ్ళు నిండిన పండు వయస్సులో, పరిపూర్ణ గౌరవాలతో పరమపదించారు.

ప్రకాశంగారి నిర్భీకత, నిస్వార్థ త్యాగశీలం ఎప్పటికన్న ఎక్కువగా ఈనాడు మన దేశీయులకు అవశ్యక సుగుణాలు. ఆంధ్రకేసరి జీవిత చరిత్ర తరతరాలుగా మన యువజనులకు ఉత్తేజం కలిగించగల దనటంలో నా కేవిధమైన సందేహం లేదు

రాష్ట్రపతి భవన్
6-7-1972

(సం.) వి. వి. గిరి
భారత రాష్ట్రపతి

# ప్రకాశిక

ఆంధ్రకేసరి ప్రకాశంపంతులుగారు మహా పురుషులు. నూటికి కోటికి ఒక్కడుగ జన్మించే మహా మానవుల కోవలోని వారు ఆయన. ఈ సంవత్సరం ఆయన శతజయంతి ఉత్సవం దేశమంతటా వైభవంగా జరుపుకుంటున్నాం. ఈ మహోత్సవ సందర్భంలో పంతులుగారి సమగ్ర జీవిత చరిత్ర ఆంధ్రులకు అందజేయ గలుగుతున్నందుకు ఆనందిస్తున్నాం.

ఇటీవలే, ఎమెస్కో పాకెట్ పుస్తక ప్రచురణలలో ద్విశతమానం (200) పూర్తిచేయ గలిగామని మా పాఠకులకు తెలుసు. ఈ విజయానికి కారకులైన మా పాఠకులను, ఈ పుస్తకాలు పంపకం చేసే మా ఏజెంట్లను ఈ సందర్భంలో మేము హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాము. కాగితము కొరత, కాగితపు ధరలతోపాటు ప్రచురణకు సంబంధించిన ఖర్చులన్నీ పెరిగిపోతూండటం, ఏమైనా ఈ పుస్తకాల వెలలు పెంచరాదన్న నియమం-మొదలైన ఇబ్బందులన్నీ ఎదుర్కొంటూ ఇంతవరకు ఈ ప్రచురణ కార్యక్రమాన్ని సాగించ గలగడానికి నిశ్చయంగా మా పాఠకుల, ఏజంట్ల ప్రోత్సాహాదరణలే కారణం.

ఎమెస్కో పోకెట్ పుస్తక పరంపరలో ఇంతవరకు ప్రచురిస్తూన్న నవలలు, కథలు, ఆధునిక సాహిత్యంలోను, కావ్యాలలోను ఎన్నికైన ప్రముఖ రచనల ఎమెస్కో ముద్రణలు, సంప్రదాయ సాహిత్యం వగైరాలతో పాటు మహాపురుషుల జీవిత చరిత్రలు కూడా ప్రచురించడం మంచిదని, అవశ్యకమనీ మిత్రులు, అభిమానులు కొంత

కాలంగా మాకు చేస్తూ వచ్చిన సూచనను ఇప్పుడు కార్యరూపంలో పెట్ట గలుగుతున్నాం.

ఈ ఎమెస్కో చరిత్రల పరంపరలను ఆంధ్రమహానాయకులలో అగ్రగణ్యులైన ప్రకాశం పంతులుగారి ఆత్మకథ "నా జీవితయాత్ర"తో శుభారంభం చేయగలగటం అదృష్టం.

ప్రకాశం పంతులుగారు 1942 లో క్విట్టిండియా ఉద్యమంలో పాల్గొని బ్రిటిష్ ప్రభుత్వపు అతిథిగా కారాగారవాసం చేస్తూన్న సమయంలో ఈ గ్రంథం రచించారు. అనంతరం 1945 లో ఆయన విడుదల అయి వచ్చి; 1946 లో చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రిగా ఎన్నిక అయిన తరువాత ఈ ఆత్మకథలో ప్రథమఖండం మాత్రం 'శిల్పి' ప్రచురణల వారు ప్రకటించారు. మిగిలిన వ్రాతప్రతి యావత్తూ అచ్చు కాకుండా అలాగే ఉండిపోయింది. ఆ వ్రాతప్రతిని ఇప్పుడు మాకు అందించిన మిత్రులు శ్రీ అద్దేపల్లి నాగేశ్వరరావు (అద్దేపల్లి అండ్ కో, సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరం) గారికి మా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాం.

అయితే, పంతులుగారి "నా జీవితయాత్ర" రచన 1940-41 వరకు సాగిన చరిత్రతోనే ఆగిపోయింది. "మిగిలిన కథ నా స్నేహితులెవరైనా వ్రాసి పూర్తిచేస్తారు" అని పంతులుగారు 3 వ ఖండం చివర రాశారు. పంతులుగారి సంకల్పానుసారంగానే ఇప్పుడు ప్రకాశం గారి పరిశిష్ట జీవిత చరిత్ర రచించి ఈయవలసినదిగా మేము పంతులుగారి సన్నిహిత అనుచరులై, చిరకాలం ఆయనకు కుడిభుజంగా ప్రస్తుతిగన్న శ్రీ తెన్నేటి విశ్వనాథం గారిని కోరగా, వారు ఎంతో సంతోషంగా ఈ పనికి పూనుకుని, పంతులుగారి శేషరాజకీయ జీవిత విశేషాలే కాక, 1, 2, 3 ఖండాలలో పంతులుగారు వ్రాయకుండా

వదిలివేసిన 1937 లో చెన్నరాష్ట్ర మంత్రివర్గంలో ఉపనాయకులుగాను, రెవిన్యూ మంత్రిగాను పనిచేసిన కాలపు విశేషాలు వగైరాలు కూడా ఈ అనుబంధ సంపుటిలో అభివర్ణించారు. ఉత్సాహంతో, దీక్షగా, స్వల్పకాలంలో ఈ అనుబంధ సంపుటిని రచించి ఇచ్చిన శ్రీ తెన్నేటి విశ్వనాథం గారికి మా ధన్యవాదాలు.

ప్రకాశం శతజయంతి సందర్భంలో ఆ మహనీయుని సంస్మరణ చిహ్నంగా ఈ ప్రచురణను వెలువరించ దలచుకొన్నామని మా సంకల్పం తెలిపి ఈ గ్రంథానికి ఉపోద్ఘాతం రచించవలసినదిగా పంతులుగారి ముఖ్యసహచరులైన రాష్ట్రపతి శ్రీ వి. వి. గిరిగారిని, ప్రస్తావనవ్రాయ వలసినదిగా ఆంధ్ర ప్రదేశ ముఖ్యమంత్రి, విద్వాంసులూ అయిన శ్రీ పి. వి. నరసింహారావు గారిని మేము అర్థించగానే ఆ ప్రముఖ నాయకు లిద్దరూ ఈ ప్రయత్నానికి హర్షించి ఈ గ్రంథానికి పరిచయ వ్యాసాలు రచించి మాకు సకాలంలో అందచేసినందుకు వారికి మా కృతజ్ఞతా పూర్వక అభివందనములు.

ఆంధ్రకేసరి ప్రకాశం పంతులుగారి అమర స్మృతికి ఇది ఎమెస్కో అంజలి!

భవదీయులు,

యం. శేషాచలం అండ్ కో.

# ప్రస్తుతి

శ్రీయుతులు ఎమ్. శేషాచలం అండ్ కంపెనీ వారు కీర్తి శేషులు టంగుటూరి ప్రకాశం పంతులుగారి సమగ్ర జీవిత చరిత్రను నాలుగు సంపుటములుగా ప్రకటింప బూనుకొనుట ముదావహము.

మొదటి మూడు సంపుటములు ప్రకాశంగారు స్వయముగ రచించినవి. ఆ కథ 1940—41 వరకే సాగినది. అనంతర చరిత్రగల 'అనుబంధ సంపుటి' యను నాల్గవ సంపుటము పంతులుగారి సన్నిహిత అనుచరులగు శ్రీ తెన్నేటి విశ్వనాథముగారు రచించినది.

తెలుగు పాఠకులు హెచ్చుమంది ఈ సంపుటములను సంపాదించుకొని చదివి, ఇంటింట పదిల పరచుకొన గలుగుటకు అనువుగ ఒక్కొక్క సంపుటము వెల రూ. 2-50 లుగ నిర్ణయించిరి. ఆంధ్ర కేసరి శతజయంత్యుత్సవ పురస్కృతిగ ఈ గ్రంథమును ప్రకటించుచున్నందులకు ఈ ప్రకాశకులను నే నభినందించుచున్నాను.

తెలుగు మాటాడు ప్రజల ముఖ్య లక్షణములు ప్రకాశము పంతులుగారిలో పుంజీభవించినవి. రాజఠీవి గల పురుష సింహుడు ఆయన. పాత పద్ధతులను అంటిపట్టుకొనని విప్లవవాది.ప్రాచీన దురాచార విరోధి. స్వాభావికముగ ఆయునది విప్లవ ప్రకృతి. 1953 లో ఆంధ్ర రాష్ట్రావతరణ శుభసమయమున కారాగారములలో నుండిన బందీ లందరికి విమోచనము కలిగించుచు ఆయన చేసిన ఉత్తరువు చరిత్రాత్మకమైనది. ఆయనయెడల ప్రజల భక్తి విశ్వాసములు ఆయన వైయక్తిక గుణ వైభవ ప్రేరితములు. ఆయన పార్టీలు మారి

నను, ఆయనపట్ల ప్రజల అభిమానమున కెన్నడు కొదువలేదు. రాజకీయ రంగమున హాలాహలమును మ్రింగి నిర్వికారముగ నిలిచిన సదాశివు డాయన. అది ప్రకాశంగారి విశిష్టత. ఉదాత్తత, ఔదార్యము గూడు కట్టుకొనిన స్వచ్ఛహృదయ మాయనది. ఆయన పటిమ సాటిలేనిది. మన రాజకీయ రంగమున ఆయనదొక మహామానవ పాత్ర. బహుముఖ వైభవోజ్జ్వలమైన జీవిత మది. హిమాలయమువలె అత్యున్నత మైన, అతి గంభీరమైన, అక్షయ క్షమాపూర్ణమైన మహౌదార్య మూర్తి ఆయన. ప్రకాశము ప్రజల ఆప్త బంధువు. ఆంధ్ర ప్రజానీకమున ఆయన పలుకుబడి, అఖిలభారతమున జవహర్ లాల్ పలుకుబడితో పోలిక చెప్పదగినది.

మన ప్రియ ప్రధాన మంత్రి శ్రీమతి ఇందిరాగాంధిగారు ప్రకాశముగారిని "ఆధుని కాంధ్ర ప్రదేశ పిత" అనియు, "మన జాతీయ ఉద్యమ ప్రముఖ నాయకులలో ఆయన ఒక" రనియు ప్రస్తుతించుట ఎంతయు సముచితముగ నున్నది. పేరునకు దగినట్లు ప్రకాశము ఆంధ్ర దిక్చక్రమున అనుపమోజ్జ్వలతారగ ప్రకాశించెను. ఆయన ఎల్లప్పుడు క్రొత్త బాటలనే తీర్చుకొనుచుండెను. ప్రజల భక్తి విశ్వాసములపై ఆయనకు గల ప్రభుత్వము గాఢమైనది, అగాధమైనది. కను కనే ఆయనను గూర్చిన విమర్శను లేశమైనను ప్రజలు సహింపకుండిరి. స్వాతంత్ర్యము కొరకు ఆయన చేసిన త్యాగము మహనీయమైన దగుటచే, ప్రజలాయన లోపముల నెన్న నిరాకరించిరి. 1952 లో చెన్నరాష్ట్ర ఉభయ శాసన సభల సంయుక్త సమావేశమున ఉపన్యసించుటకు గవర్నరు అధికారమును ఆయన సవాలుచేయుట పెద్ద సంచలనము కలిగించినది. నాటి మంత్రులపై ఆయన తెచ్చిన అభియోగ

ములను వివరించుచు శాసన సభలో ఆయన మూడు దినములు వరుసగ నుపన్యసించుట అది ఒక కొత్త రికార్డు. 1953 లో ప్రత్యేకాంధ్రరాష్ట్రము ఏర్పడినప్పుడు ప్రకాశము పంతులుగారే ప్రథమాంధ్ర ముఖ్యమంత్రిగ నుండవలెనని సూచించుటతో నెహ్రూజీ ప్రకాశముగారికి రాజకీయ చరిత్రలో నెందును కని విని యెరుగని సత్కారము చేసిరి. నిజమునకు అనాడు ప్రకాశముగారు ఏ రాజకీయ పక్షమునకు చెందినవారు కారు. సంఖ్యాధిక్యముగల పక్షమునకు ఆయన నాయకుడు కారు. ఆయన రాజకీయ స్థాయికి, స్వాతంత్ర్యము కొరకు ఆయన చేసిన అనుపమ త్యాగమునకు కృతజ్ఞతా ప్రకటన మది. ప్రకాశము తెలుగు ప్రజల స్వతస్సిద్ధ నాయకుడు. ఆయన ప్రజల మనిషి. నిత్యము ప్రజల నాడిని పట్టి చూచుచు, వారికి హితవైన కార్యములనే ఆయన చేపట్టుచుండెను.

ప్రకాశము పంతులుగారి స్వస్థలము ఒంగోలు. ఒంగోలు కేంద్రముగ ప్రత్యేకముగ ఒక జిల్లాను ఏర్పరుపవలెనని ఆయన చిరసంకల్పము. ఆంధ్రప్రదేశ ప్రభుత్వము ఆ సంకల్పమును సఫలము చేయుటయే కాక, దివంగతుడైన ఆ మహానాయకుని యెడ కృతజ్ఞతా సంస్మృతి చిహ్నముగ దానికి ''ప్రకాశము జిల్లా'' యని నామకరణము చేసినది. ప్రకాశము మిగుల దూరదృష్టిగల నేత. ఆయన ప్రవేశపెట్టిన ఫిర్కా డెవలెప్మెంట్ కార్యక్రమమును అనాడు చాలామంది అపార్థము చేసికొనిరి. కాని, అదియే నేటి మన పంచాయతీ రాజ్య ప్రణాళికకు మార్గదర్శి అయి, అందరికి కనువిప్పు కలిగించినది. జమీందారీల రద్దు ప్రణాళిక ప్రకాశకర్తృకము. పేద ప్రజల సంక్షేమమే సదా ప్రకాశముగారి ప్రధానాశయముగ నుండెను.

తెలుగు జాతి ఆశయాదర్శములకు రూపు కట్టిన ఉజ్జ్వలమూర్తి, తెలుగు జాతీయతకు ప్రతీక, ఆంధ్రప్రదేశ నిర్మాత, నవీనాంధ్ర పిత—ప్రకాశము పంతులుగారు. యావదాంధ్ర దేశముతో, అందలి మూల మూలల గ్రామములతో, గూడెములతో, ముఖ్యముగ అందలి బహు వర్గముల ప్రజలతో అంత విస్తృత పరిచయముగల నాయకుడు బహుశః మరొకడు లేడు. దారిద్ర్యమును, అవిద్యను, మూఢ విశ్వాసములను రూపుమాపవలెనను ఆయన ఆశయ సిద్ధికి దీక్షతో కృషి సేయు సజీవాంధ్ర స్త్రీ పురుష ప్రజానీకమే ఆ మహానాయకునికి ఉత్తమ స్మారక చిహ్నము. అన్యస్మారక చిహ్నమేదియు ఆయనకు అంత సంతృప్తి కల్గింపజాలదు

హైదరాబాదు, (సం.) పి. వి. నరసింహారావు
12-6-72.

## 'నా జీవితయాత్ర' ప్రథమ ఖండము

## ప్రథమ ముద్రణ (1946) కు

## శ్రీ తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రి

# పరిచయము

అమెరికా దేశీయుడు ఒకడు స్వీయచరిత్రకు Education అని పేరు పెట్టినాడు. ఆంగ్లేయ స్త్రీ My Apprenticeship అనీ, ఐర్ దేశీయుడు Summing up అనీ తమ చరిత్రలకు నామము లుంచినారు. వారి ఉద్దేశానుసారముగా ఆ నామకరణము అనుగుణ మైనది. మన నాయకుడు ఆంధ్రకేసరి పూజ్యశ్రీ టంగుటూరి ప్రకాశం పంతులు "నా జీవితయాత్ర" అని స్వీయచరిత్రకు పేరు పెట్టడమువల్ల జీవితాన్ని యాత్రగా భావించినట్టు కనిపిస్తున్నది. ఒక దృష్టితో చూస్తే జీవితము యాత్రాప్రాయమే. కొందరు యాత్రికులు లక్ష్య శుద్ధితో బయలుదేరి గమ్యస్థానము చేరుతారు. చాలామంది యాత్ర చేస్తూ అవాంతర విషయాలలో అడుగు పెట్టడమూ, కొంతదూరము పోవడమూ, పక్కకు తిరగడమూ, కడకు గమ్యస్థానము చేరడమూ సంభవిస్తుంది. ప్రకాశం పంతులు ద్వితీయ శ్రేణిలో చేరిన యాత్రికుడు. నలుగురితో పాటు జీవయాత్ర ప్రారంభము చేసినప్పటికీ క్రమేణ నాయకుడై ఆఖరుకు ఆంధ్రకేసరి అయినాడు.

పూవు పుట్టగానే పరిమళము అన్నట్టు పంతులు బాల్యమునుండీ ప్రముఖుడే. పల్లెపట్టున గాని, పట్టణాలలో గాని, ప్రధాన నగరములో గాని, చివరకు పరదేశములో గాని అయన ప్రాముఖ్యము ఎప్పుడూ ప్రకట మవుతూనే ఉన్నది. సహజముగానే దృఢగాత్రు డైన వానికి బుద్ధివైభవము తోడైనప్పుడు ప్రాముఖ్యము కలగక తప్పదు. కృష్ణా నదికి దక్షిణమున రాతి భూమిలో పుట్టుక, సావాసగాండ్లతో సాము గరిడీలు, స్వచ్ఛందవృత్తి. అనూచాన సంపదనుబట్టి ఆరువేల నియోగికి

సంక్రమించే సహజదర్పము, ప్రథమములో సౌఖ్యము, అనంతరము అర్థనాశము, అధిక కష్టములు, ఆత్మోద్ధరణ వాంఛ—ఇవి అన్నీ కదంబ ప్రాయము అయి పంతులు అద్భుత వ్యక్తి అయినాడు. దుఃఖాభిభూతుడు కానివాడు ధీరుడు కాలేడు. ఆదినుంచి నేటివరకు ఆంధ్ర కేసరికి వివిధ వ్యథలు కలుగుచునే ఉన్నవి. అందుచేతనే అంతటి ద్రఢిమ ఏర్పడి అంతరాయములలో ఆయన ప్రముఖుడే కాని పరాఙ్ముఖుడు కావడము లేదు.

మొన్న మొన్నటి వరకు ఆంధ్రుడికి సంపన్న న్యాయవాదే గణ్యుడు. అందుచేతనే ఆనాడు పంతులు న్యాయవాద వృత్తిమీద మనసు పోయి మదరాసు లా కాలేజీలో చదవడమూ, రాజమహేంద్రవరములో వకీలుగా ఉండడమూ సంభవించినది. ఊర్ధ్వదృష్టి ఉన్నవాడు ఊరుకో లేడు. ఆయన ఉత్త ప్లీడరుగా ఉండక న్యాయ విద్యలో ప్రశస్తమైన బారిష్టరు పట్టము తెచ్చుకొని రాజధానికే పోయి నిరుత్సాహ చ్ఛాయ దగ్గరకు రానీయక ధైర్యముతో అడ్డంకులను అన్నిటినీ ప్రతిఘటించి అన్ని విధముల ప్రాభవము పొందినాడు. సడలని పట్టుదల వల్లనే జయము సమకూరుతున్నది.

అభిమానవంతుడు, ఆత్మోద్ధర ణాభిలాషి, అన్య జన లక్ష్యము లేనివాడు, అగ్రగణ్యుడు అయినప్పటికీ ప్రకాశ ప్రధాని బాల్యములో పడిన అవమానములు, అనుభవించిన కష్టములు, చేసిన చిలిపి పనులు, శృంగార చేష్టలు దాచిపెట్టకుండా నిజముగా ఉద్ఘాటించినాడు. సహజముగా స్వచ్ఛ బుద్ధి కలవారు, ధైర్యస్థైర్యములు ఉన్నవారూ ఉన్నది ఉన్నట్టుగా సత్యము చెప్పగలరు. పంతులు ప్రకటము చేసిన విషయములు ఆయనమీద ఆదరము కలిగించడమే కాక, అన్యులకు ఆదర్శము కూడా అవుతవి. కృతజ్ఞతా మాధుర్యము "జీవిత యాత్ర"లో చాలా తావుల వెల్లివిరిసింది. ప్రత్యుపకార పరిమళము బహుస్థానాలలో వాసించినది.

పురుష పుంగవము ఆత్మ లాభముతో సంతుష్టి చెందక అన్య క్షేమము ఆకాంక్షిస్తుంది. ఉత్తముడు దేశ సౌభాగ్యము కోసము నిజ శక్తులు వినియోగిస్తాడు. దేశసేవ వివిధ విధాల జరుగుతుంది. ఉత్తేజకములైన ఉపన్యాసములవల్ల గాని, ఉత్తమ పత్రికా నిర్వహణమువల్ల గాని, ఉదారాచరణవల్ల గాని పురుషుడు కర్మవీరుడు కాగలుగుతాడు. పంతులు వీటన్నిటిలో పరిశ్రమ చేసి కలికాప్రాయముగా అంతర్నిహితమైన దేశభక్తిని కమనీయ కుసుమముగా వికసింపజేసినాడు. మహాపురుషుల సాంగత్యమువల్లను, సహజ ప్రతిభవల్లను ఆంధ్రకేసరికి పంచాశద్వర్ష ప్రాంతములో జీవ యాత్రలో లక్ష్యము గోచరించింది.

ఈ గ్రంథములో వివృతమైన వ్యక్తికీ, నాకు సుపరిచితమైన మూర్తికీ వ్యత్యాసము కనపడదము లేదు. ఆయన మాటల వలెనే ఇందులో పలుకులు కూడా తేటలు. రచన సానపెట్టిన రత్నమువలె రమణీయము. విస్తరించి విశేషములు చెప్పినట్లయితే మరింత దీప్తి కలిగేది. తాత్పర్యార్థము తలపోసినట్టయితే కథానాయకుడు ఆంధ్ర కేసరి అని అన్వర్థము అవుతుంది.

ఇతి శివమ్!

సాహితీ సమితి, తెనాలి,<br>
1946 ఆగష్టు 20.

శివ శంకర శాస్త్రి



బారిష్టరు శ్రీ ప్రకాశం పంతులు

# 1

## పూర్వ గాథ

మా ముత్తాతలనాడు స్వగ్రామం ప్రస్తుతం ఒంగోలు తాలూకా టంగుటూరు. మా ముత్తాత నరసరాజుగారు టంగుటూరు గ్రామానికి కరిణీకం చేస్తూ మంచి ఆస్తిపాస్తులు సంపాదించారని వినికిడి. ఆయన కాలంలోనే మాకు టంగుటూరికి ఆరుమైళ్ళ దూరంలో వెంకటగిరి రాజాగారి ఎస్టేటులో ఉన్న వల్లూరు గ్రామంలో సుమారు 40, 50 ఎకరాల భూవసతి ఉండేది. వల్లూరు, టంగుటూరికీ ఒంగోలుకీ మధ్య మద్రాసు కలకత్తా ట్రంకురోడ్డు మీద ఉన్న గ్రామం.

నరసరాజుగారి కాలంలో ఆయనకి వెంకటగిరి సంస్థానంలోనూ, ఆ చుట్టుపక్కల గ్రామాల్లోనూ విశేషం పలుకుబడి ఉండేది. వారు పేరు ప్రఖ్యాతులతో గౌరవంగా కాలక్షేపం చేసివారు. ఆయనకి అప్పాస్వామి, నరసరాజు అని ఇద్దరు కుమారుళ్ళు ఉండేవారు. ఆ రోజుల్లో నియోగి కుటుంబాలు కరిణీకం వగైరాలతో లౌక్యజీవనం చేస్తూ గ్రామ పాలకత్వం వహిస్తూ ఉండేవి. అందుచేత మా ముత్తాతగారు, అప్పాస్వామి టంగుటూరులో కరిణీకం చేసుకుంటూ అక్కడే నివసించడానికీ, ఆయన తమ్ముడూ మా తాతగారూ అయిన నరసరాజుగారు వల్లూరులో కాపరం చేస్తూ, కరిణీకమూ దానితోబాటు భూములూ చూసుకుంటూ జీవయాత్ర చేయడానికిన్నీ నిర్ణయించారు. ఆ ప్రకారంగా మా తాతగారు వల్లూరు రావడం తటస్థించింది. అందుచేతనే టంగుటూరు ఇంటి పేరు అయినా మా గ్రామం వల్లూరే అని చెప్పవలసివస్తుంది.

వల్లూరులో మా తాతగారు పెద్ద నాలుగిళ్ళ భవంతి ఒకటి కట్టారు. ఆయనకి నలుగురు కుమారుళ్ళూ, ఇద్దరు కుమార్తెలూ జన్మిం

చారు. వాళ్ళు పెద్దవాళ్ళై ప్రయోజకులైన తరవాత, ఆయన ఆ భీవంతి కెదురుగానే ఉండే ఒక పూరింట్లో కాపరం ఉండేవారు. నేనైతే ఆయన్ని ఎరగను. మా నాయనమ్మ సావిత్రమ్మగారినీ, ఆవిడ చెల్లెలు ఆదెమ్మగారినీ ఎరుగుదును. మా తాతగారినిగురించి నే నెరిగినదల్లా ఆయన తాలూకు పాత రికార్డులు. మేదరతడకలతో పంజరం కట్టి, దానిపైన తోలుతో బిగించిన పెద్ద కావిడిపెట్టెలవంటి పెట్టెల్లో ఆ రికార్డు లన్నీ ఉండేవి. మా అవ్వ లిద్దరూ పాడి సమృద్ధిగా చేస్తూ ఉండేవారు. మా తాతగారు 85 సంవత్సరాలు పైగా సంపూర్ణమైన జీవితం గడిపి కీర్తిశేషు లయ్యారు.

మా తాతగారికి మా తండ్రులు నలుగురు. వారి నలుగురిని నేను కొంచెం ఎరుగుదును. మా పెత్తండ్రిగారైన రాఘవయ్యగారు కొంత కాలానికి భార్యా పుత్రులతోసహా కుటుంబంతో సంబంధం ఒదులుకుని తిరపతి వెళ్ళిపోయారు. రెండో ఆయన రామస్వామిగారు. ఆయన సంగీతసాహిత్యాల్లో మంచి ప్రవేశం కలవారు. తరుచుగా పొగాకుతో తమలపాకులు నములుతూ సంగీతసాధన చేస్తూ ఉండేవారు. మూడో ఆయన అప్పాస్వామి. ఆయన తాతగారి తాలూకు కరిణీకం చేపట్టి గ్రామ పాలకత్వం సాగిస్తూ ఉండేవారు. మా తండ్రిగారైన గోపాల కృష్ణయ్యగారు వ్యవసాయంపని చూస్తూ ఉండేవారు. మా తాతగారి మరణానంతరం మా తండ్రులు నలుగురూ ఇల్లూ, ఆస్తీ పంచుకుని వ్యష్టిగా అనుభవిస్తూ కార్యకలాపాలు వచ్చినప్పుడు సమష్టిగా వ్యవహరిస్తూ ఉండేవారు.

అంతకు పూర్వపు సంగతులు నాకు అంతగా తెలియవుగాని, మా మేనత్త లిద్దరిలో పెద్దామె పార్వతమ్మగారు చిన్నతనంలో వైధవ్యంపొంది, ఇంట్లోనే ఉండి మా కందరికీ కంటికి రెప్పలా ఉండేది. ఆమె చెప్పిన విషయాలవల్లనే నాకు మా పూర్వుల విషయం తెలిసింది. ఆ కాలంలో పండగలూ, పర్వాలూ వచ్చినప్పుడు మా అమ్మగారూ, మా పెత్తల్లులూ అంతా కలిసి పండుగలు చేసుకుంటూ, వినోదాలతో కాలక్షేపం చేస్తూ ఉండేవారు. అంతే కాకుండా పని అవసరం అయిన

సమయాల్లో పొలాలకికూడా వెళ్ళి వ్యవసాయపు పనిపాటల్లో పాల్గొనే వారు- ముఖ్యంగా దూడలకి గడ్డి సేకరించడం వాళ్ళ అభిమాన విషయం.

మా రెండో మేనత్తగారైన నరసమ్మగారికి అప్పట్లో అద్దంకి పరగణా ఉత్తరఖండంలో చేరిన కొరిసపాడు గ్రామంలో వివాహం చేశారు. ఆవిడికి నరసింహం, నారయ్య అని ఇద్దరు పిల్లాళ్ళు.

మా తండ్రిగారు, సుమారు 30 వ ఏట కనపర్తిగ్రామం దాపు వినోదరాయుడుపాలెంలో కనపర్తి కామాక్షమ్మగారి ఏకపుత్రిక సుబ్బమ్మ గారిని వివాహం చేసుకున్నారు. ఆమెవల్ల ఆయనకి సంతానం ఆరుగురు. అందులో మొదటి ఇద్దరూ ఆడవాళ్లు. మూడోసంతానం నేను. నా తర వాత శ్రీరాములు. అతని తరవాత అన్నపూర్ణ అనే ఆడపిల్ల. ఆమె సుమారు 13 సంవత్సరాలు జీవించి, వివాహం అయిన తరవాత చని పోయింది. ఆమె తరవాత మా నాయనగారు చనిపోయిన ఏడు మాసాలకి జానకిరామయ్య జన్మించాడు. ఈ సందర్భంలో మా తండ్రి గారి జీవితాన్నిగురించీ, నేను స్వయంగా ఎరిగినంతవరకు ఆ కాలంలో ఉండే జీవిత వ్యవహారాలనిగురించీ కొంచెం వ్రాస్తాను.

మా తండ్రుల్లో మొదటి ఆయన రాఘవయ్యగారు తిరుపతి వెళ్ళి పోయినట్లు లోగడ వ్రాశాను. తరవాత కొంతకాలానికి మిగిలినవారు వల్లూరులో ఉన్న ఇల్లూ, భూములూ పంచుకుని కాలక్షేపం చేశారు. క్రమంగా మా తండ్రు లందరికీ కుటుంబాలు పెరిగిపోయి, భూములవల్ల వచ్చే ఆదాయాలతో జీవనం చెయ్యడం సాధ్యంకాని రోజులు వచ్చాయి. నా పుట్టుకకి పూర్వమే అల్లాంటి చిక్కొచ్చి కనిపించింది. మా తండ్రి గారు, ఆ ఆదాయంలోనే నా అప్పగార్లిద్దరి వివాహాలూ చేశారు. వా రిద్దరినీ మంచి సంప్రదాయమూ, భూవసతీ కలిగిన కుటుంబాలలో ఇచ్చి వివాహం చేశారు.

ఆ కాలంలో వాళ్ళ జీవితాలు మంచి హుందాగానూ, గంభీరం గానూ, నిగ్రహంతోనూ గడిచిపోయేవి. కుటుంబాల్లో అన్యోన్యప్రేమాతి శయాలు చాలా ఎక్కువగా ఉండేవి. ఆస్తి పాస్తుల్లో వ్యష్టిగా ఉన్నా, ప్రేమానుబంధాల్లో సమష్టి భావమూ, ఏకతా ప్రతి నిమిషమూ కన

బడుతూ ఉండేవి. జీవితావసరాలు కలిసి పంచుకుని అనుభవించే లక్షణం ఒక పవిత్రతగా భావింపబడేది. ఈ నాడు మన కళ్ళఎదట కనబడే స్వార్థం ఆ రోజుల్లో అంతగా కనబడేదికాదు. సుమారు అర్ధశతాబ్దం పైనాటి ఆ రోజుల సంగతి తలుచుకుంటే, నాకు, అది అంతా ఒక స్వప్నంలా తోస్తుంది.

మనుష్యుల్లో ఉండే ప్రేమాతిశయాలు గంభీరంగా కనబడేవి. ఆనాడు మనుష్యులికి కావలసిన వస్తువిశేషాలు కూడా బహుస్వల్పమే. మా తండ్రు లందరూ దేశంలో తయారైన నూలుతో అక్కడి సాలె వాళ్లు తయారుచేసిన బట్టలే కట్టుకునేవారు. 1702 వగైరా మల్లుల భ్రమలు అప్పటికి లేనేలేవు. నే నయితే స్వయంగా ఎరగను కాని, మా అమ్మగారు చెప్పిన దానిని బట్టి చూస్తే మా యిళ్ళల్లో కదురు కవ్వాలు ఆడడం వల్లనే లేమి అనేది లేకుండా ఉండింది. ఈ నాడు మట్టి పాత్ర లంటే ఐశ్వర్యవంతులం అనుకునేవాళ్ళు చాలా న్యూనతగా చూస్తారు. ఆ కాలంలో గౌరవకుటుంబాల లెఖ్ఖలో ఉన్న మా యిళ్లల్లో కూడా మట్టి పాత్రల్లోనే వంటకాలు జరిగేవి. ఆనాటి జీవితంలో విశేషం ఏమి టంటే, నాణెం ఎంత సకృత్తుగా కనిపించినా జీవితావసరాలు, మర్యాదలు ఎంతమాత్రమూ లోపించేవి కావు. కుటుంబం ఎంత పెద్దదైనా పండుగలూ, పబ్బాలూ వచ్చినప్పుడు కూతుళ్ళు, అల్లుళ్ళు, కోడళ్ళు అంతా కలిసి వేడుకలు చేసుకోవడమూ, అంతా సాలెవాళ్ళు తయారుచేసి ఇచ్చిన నూతన వస్త్రాలు ధరించడమూ, 'ఇది లోటు' అనే మాట లేకుండా తృప్తిపడడమూ ఉండేది. ఇందులో బంధుమర్యాదలు, స్నేహమర్యాదలు కూడా లోట్లు లేకుండా జరుగుతూ ఉండేవి. ఈనాటి పద్ధతులతో పోల్చి చూసుకుంటే ఆ రోజుల్లో జీవితమే పరిపూర్ణమైన దనీ, సుఖప్రదమైనదనీ తోచక తప్పదు. గతించిన రోజులన్నీ మంచివి గానే తలవడం లోకంలో ఉన్నదే. అందులోనూ ఆ రోజుల సంగతి తలుచుకుంటే "సత్యయుగం అంటే అదేనా?" అనిపిస్తుంది.

ఇంతటితో మా పూర్వులగాథ విరమించి స్వీయ గాథకి వద్దాము. నేను పుట్టిన తేదీ నాకు సరిగ్గా తెలియదు. నా దగ్గిర ఎక్కడా

ఏవిధమైన ఆధారాలూ,—అంటే జాతకం వగైరాలు—లేవు. నేను పుట్టినప్పుడు మా నాయనగారు నా జాతకం వ్రాయించినట్లు తెలిసింది. కాని, నాకు జ్ఞానం వచ్చి నేను దాన్ని సంపాదించడానికి ప్రయత్నం చేసేసరికి జాతకం వ్రాసిన దైవజ్ఞుడు పిల్లుట్ల పిచ్చయ్యగారు మరణించడంచేతను, మేము దేశాంతరాలు పట్టి ఉండడంచేతనూ అది లభ్యమయింది కాదు. తరవాత, నా పుట్టినతేదీ అవసరమైనప్పుడు మా అమ్మగారితో సంప్రతించగా నిర్ధారణయిన సంవత్సరం 1872. ఆ సంవత్సరం సరి అయినదే అనడానికి తరవాత అనేక నిదర్శనాలు కనిపించాయి.

అప్పటికి మా ఇద్దరు అక్కగార్లకీ కొంచెం ఆదాయం వచ్చింది. వాళ్ళిద్దరికీ వయస్సు తేడా నాలుగు సంవత్సరాలు. నాకూ మా రెండో అక్కగారికీ వయస్సుతేడా నాలుగు సంవత్సరాలు. అంతే కాకుండా, మా అన్నదమ్ములకీ, అక్కచెల్లెళ్ళకీ ఒకొక్కరికీ మధ్య వయస్సు తేడా సరిగ్గా నాలుగు సంవత్సరాలు. నాకు సుమారు నాలుగైదు సంవత్సరాల వయస్సుండగా ధాత సంవత్సరం నాటి దారుణ క్షామం వచ్చింది. ఆ కరువు సంగతి నాకు బాగా తెలుసును. అప్పటికి మా అప్పగార్లిద్దరికీ జరిగిన వివాహాలు నే నెరుగుదును. అందుచేత 1872 వ సంవత్సరమే నా స్థిరమైన జన్మ సంవత్సరంగా నిర్ధారణ చేసుకోవచ్చును.

నేను 1872 వ సంవత్సరంలో కనపర్తి గ్రామంలో మా మేనమామల ఇంట్లో జన్మించాను. నేను పుట్టిన తరవాత ఒక సంవత్సరం పాటు అక్కడే ఉండి, వల్లూరు వచ్చినట్లు మా అమ్మగారివల్ల వినికిడి. నేను పుట్టిన రెండుమూడు సంవత్సరాలకి దేశంలో అనావృష్టి అధికమై మా నాయనగారికి వల్లూరు భూములవల్ల వచ్చే ఆదాయంతో కుటుంబ పోషణ దుస్తరం అనిపించింది. దానివెంట ధాత సంవత్సరపు కరువు. ఇక చెప్పే దేముంది? ఆయనకి ఇంకొక ఉపజీవనం సంపాదించా లనే సంకల్పం కలిగింది. ఆ రోజుల్లో మా నాయనగారితోనూ, మా పెద్ద మేనత్తగారితోనూ ఆ పొలాల్లో తిరుగులాడడం నా కిప్పటికీ జ్ఞాపకం

ఉంది. కరువురోజుల్లో ఆహారం తక్కువైనప్పుడు మా మేనత్తగారు ఆకుకూరలు ఎక్కువగా సంగ్రహించి అన్నంకన్న ఆకుకూరలు ఎక్కువగా పెట్టడం కూడా నాకు జ్ఞాపకం ఉంది.

నాకు 5 ఏళ్ళు వచ్చేవరకూ మా నాయనగారు అతి కష్టంగా కాలక్షేపం చేశారు. ఈ కాలంలోనే నా అప్పగార్ల వివాహాలు, నాకు ఉపనయనమూ కూడా చేశారు. ఉపనయనం నాటికి నా కింకా 5 ఏళ్ళు పూర్తికానట్టు మా అమ్మగారు చెప్పింది. నాకు ఇంచుమించుగా 5 ఏళ్లు వెళ్ళగానే ఉపనయనం చేసినట్లు ఆమె చెప్పింది. ఉపనయనం విషయంలో నాకు జ్ఞాపకం ఉన్నదల్లా అరుగుమీద కూర్చోపెట్టి సంధ్యావందనం చెప్పడం! మా పురోహితులైన పిల్లుట్ల చెంచయ్యగారు ఎంతో కష్టంమీద నన్ను అరుగుమీద కూర్చోపెట్టి సంధ్యావందనం చెప్పేవారు.

ఇక అప్పటి చదువువిషయం. నా అక్షరాభ్యాసం వల్లూరులో వెంకటప్పయ్య అనే ఆయన వీథిబడిలో. ఆయన నాకు ఓనమాలు నేర్పిన ఆది గురువు. ఆయన విద్యే నాకు మొదటి పునాది రాయి. అయితే, ఆయన శుశ్రూషవల్ల ఇప్పటికీ నాకు జ్ఞాపకం ఉన్నవి ఆనాటి తొడపాయసాలు! ఆయన చదవకపోతే చర్మం ఊడి చేతుల్లోకి వచ్చేటట్లు పట్టేవాడు! అంతే కాకుండా, నన్ను బడికి పంపడానికి మావాళ్ళు పడిన పాట్లుకూడా నాకు కొంచెం జ్ఞాపకం ఉన్నాయి. చేతులూ కాళ్ళూ కట్టి ఈడ్చుకువెళ్ళి బడిలో వెయ్యడమూ, నేను ఆ బంధనాలు తెంచుకోవడమూ కూడా నాకు బాగా జ్ఞాపకం! నా వీథిబడి చదువు వల్లూరులో కొంతవరకు అయిన తరవాత కుటుంబ నిర్వహణం కోసం మా నాయనగారు వేరొక గ్రామానికి మారదలచుకుని నన్ను అద్దంకి గ్రామంలో మా పెద్దబావగారైన పోరూరి నరసింహంగారి వద్ద అప్పజెప్పారు.

ఆయన ఆ గ్రామంలో వీథిబడి నడుపుగుంటూ, గౌరవంగా కాలక్షేపం చేస్తూ ఉండేవారు. ఆ బ్రాహ్మడు నాకు పునాదికట్టుదిట్టంగా చదువు చెప్పాడు. కాని, ఆ చదువుకోసం ఆయన నాతో పడ్డ బాధ నాకు తెలియాలి; ఆ పరమేశ్వరుడికి తెలియాలి! అల్లా నన్ను పెద్ద అల్లుడిదగ్గిర

చదువుకి అప్పజెప్పి మా నాయనగారు వెంకటగిరి సంస్థానంలో ఉద్యోగ సంపాదన కోసం వెళ్ళారు. ఆయన అక్కడ ఎందరో ప్రముఖుల్ని ఆశ్రయించి చిట్టచివరికి నాయుడుపేట దగ్గర సువర్ణముఖి నది ఒడ్డున మేనకూరు ఒంటు పారుపత్యందారు ఉద్యోగం సంపాదించారు. పారుపత్యందారు అంటే ఈ రోజుల్లో సముద్దారు అన్నమాట. ఆ రోజుల్లో ఆయన జీతం ఎనిమిది రూపాయలు. ఆయన, కుటుంబం పల్లెటూరిలో ఒదిలివేసి, రెండు సంవత్సరాలపాటు ఆ ఊళ్ళో ఒక్కరే ఉద్యోగం చేశారు.

రెండు సంవత్సరాలు అయిన తరవాత కుటుంబం నాయుడుపేట పంపించారు. అప్పటికే అద్దంకిలో నా వీథిబడి చదువై పోయింది. ఇంగ్లీషు చదువు ప్రారంభానికి నాయుడుపేట చేరాను. అప్పటికే నాయుడుపేటలో ఒక ఇంగ్లీషుస్కూలు ఉండింది. మా తమ్ముడు శ్రీరాములూ, నేనూ ఆ స్కూల్లో చేరాము. మా నాయనగారు మా చదువుకోసం నాయుడుపేటలో ఉండి, మేనకూరు మొదలయిన గ్రామాల పనిమీదా ఉండేవారు. ఆ రోజుల్లో రెవిన్యూ వసూళ్ళు ధాన్యరూపంలోనే జరుగుతూ ఉండేవి. నేను మా నాయనగారితో అప్పుడప్పుడు గ్రామాల్లోకి వెళుతూ ఉండడం కూడా జరిగేది. అలాంటప్పుడు రైతులు పిల్లవాడు వచ్చాడని మెహనతుగా రూపాయీ, అర్ధా బహుమతీగా ఇచ్చేవారు. నేను అవి అన్నీ ఒక డబ్బాలో జాగ్రత్తపెడుతూ వుండేవాణ్ణి. పెద్దపెద్ద ఆసాముల ముందు కూర్చోబెట్టి ఆయన అప్పుడప్పుడు నాచేత లెక్కలు కూడా వ్రాయిస్తూ ఉండేవారు.

అప్పట్లో వెంకటగిరి సంస్థానం గురించి కొంచెం వ్రాస్తాను. ఆ రోజుల్లో వెంకటగిరి సంస్థానం ఉత్తరఖండం, దక్షిణఖండం అని రెండు భాగాలుగా ఉండేది. ఒక్కొక్క ఖండానికి ఒక్కొక్క పేష్కారు అధిపతి. పేష్కారు కింద అమల్దారు అని ఒక 30 రూపాయల ఉద్యోగి ఉండేవాడు. ఆయన కింద మా నాయనగారు పారుపత్యందారు వుద్యోగం చేసేవారు. ఈ సంస్థానంలో అప్పటికే తక్కువ జీతాలు, లంచగొండితనం, ఆశ్రయింపులు, వుద్యోగం నిలకడ లేకపోవడం,

మొదలైనవి వుంటూ వుండేవి. ఆ రోజుల్లో బి. ఏ. పరీక్షలో ఉత్తీర్ణత పొందడం అంటే ఘనమైన మాట! అప్పట్లో నారాయణస్వామిచెట్టి అనే ఆయన బి. ఏ. అయి, పేష్కారు వుద్యోగంలో ప్రవేశిస్తే ఆయనకి బి. ఏ. నారాయణస్వామిచెట్టి అనే పేరు వచ్చింది. ఇల్లాంటి సంస్థానంలో మా నాయనగారు రెండుసార్లు ఉద్యోగం పోగొట్టుకుని, మళ్ళీ అనేకమైన ఆశ్రయింపులు ఆశ్రయించి ఉద్యోగం సంపాదించుకున్నారు.

నాయుడుపేటలో నా చదువుని గురించీ, జీవితాన్ని గురించీ కొంచెం విస్తరించి వ్రాస్తాను. నాయుడుపేటలో ఒక గవర్నమెంటు స్కూలు ఉండేది. అందులో ఫస్టు, సెకండు, థర్డు, ఫోర్తు, అప్పరు ఫోర్తు అని అయిదు క్లాసు లున్నట్లు జ్ఞాపకం. ఆ క్లాసుల్లో బ్రౌన్‌షా రీడర్లు చదువుతూ ఉండేవాళ్ళం. ఆ రోజుల్లో ఇంగ్లీషు తెలుగు వగైరాలతోబాటు ఉర్దూ కూడా చెబుతూ వుండేవారు. నేను అలీబేగ్ అనే ఒక సాహేబుల కుర్రవాడితో కలిసి ఉర్దూ చదవడం జ్ఞాపకం వుంది. నాయుడుపేటలో చదువుకునే రోజుల్లో నేను బుద్ధిమంతుణ్ణి అనిపించుకున్నానని చెప్ప వీలులేదు. వయస్సు ఎంతో లేకపోయినా, స్కూలులో వున్న అల్లరి పిల్లలలో మనపేరు మొదటిదిగా వుండేది.

నాకు, ఎక్కడికి వెళ్ళినా రెండురకాల మిత్రుల స్నేహాలు తటస్థపడుతూ వుండేవి. పరమపోకిరీల స్నేహం ఒకవైపున! బుద్ధిమంతులు, సంపన్న గృహస్థులు, విద్యావంతులు మొదలైన పెద్దవాళ్ళ స్నేహం రెండోవైపున! కానూరి రంగడు అని ఒకడు ఉండేవాడు. అతని అసలు పేరు రంగారావు. అతను మాధ్వుడు. అతనితో మొదటి స్నేహం సాము, గరిడీ, కుస్తీలు, చెడుగుళ్ళు మొదలైన వాటిల్లో. అతనొక చిత్రమైన మనిషి. రోజూ అతను సువర్ణముఖి ఒడ్డున వుండే ఆంజనేయస్వామికి కోడిగుడ్లు నైవేద్యం పెట్టి ఆ ప్రసాదం అందరికీ ఇస్తూండేవాడని ప్రతీతి. చాలామంది, "అతను దుర్మార్గుడు; చదువూ సంధ్యా లేనివాడు; అల్లాంటి వాడితో నీకు స్నేహం ఏమి?"టని నన్ను మందలించేవారు. నాకు అతని స్నేహంవల్ల అలవా టయినవి బడి

పిల్లలిని ఏడిపించడం, వాళ్ళ పుస్తకాలు పారవెయ్యడం, ఉపాధ్యాయుల్ని వుడికించడం మొదలైన ఘనకార్యాలు!

ఒకసారి పుదూరు సుబ్రహ్మణ్యయ్యర అనే మాష్టరుగారు బోర్డువైపు తిరిగి లెఖ్ఖలు చెబుతూ వుండగా నేను వేళ్ళాడుతూ వున్న ఆయన గోచీ కుర్చీకి కట్టాను. దాంతో బెత్తాల దెబ్బలు, మొట్టికాయలు మొదలయిన శిక్ష లన్నీ సంపాదించాను! అంతేకాదు! నన్ను స్కూలు లోంచి డిస్మిస్ చేశారు. ఈ సంగతి మా నాయనగారికి తెలిసి, ఆయన ఆ రోజుల్లో అక్కడ డిప్యూటీకలెక్టరుగా వుండే అడక్కి నారాయణ రావుగారి నాశ్రయించగా, ఆయన దయవల్ల మళ్ళీ స్కూల్లో ప్రవేశించాను.

కాని మరికొద్ది రోజులకే ఇంకొక తవ్వాయి వచ్చింది. అప్పట్లో అల్లాడి ఆదెయ్యకొడుకు సూర్యనారాయణ అప్పర్ మిడిల్ క్లాసు చదువుతూ వుండేవాడు. అతను నన్నేదో తిరస్కారంగా మాట్లాడి కొట్టేసరికి, నేను అతని ఇంగ్లీషు టెక్స్టు పుస్తకం ఎత్తుకుపోయి సువర్ణముఖి ఒడ్డున ముక్కలు ముక్కలుగా చింపివేశాను. ఆ చింపడం నా వెనకాలే వున్న యానాది వా డొకడు చూసి, నేను చింపి పారవేసిన కాగితం ముక్కలన్నీ తెచ్చి నా వెనకాలే స్కూల్లో అప్పచెప్పాడు. దాని ఫలితంగా నాకు మళ్ళీ బెత్తం ప్రహరణాలు జరిగించి, డిస్మిసు చేశారు. తిరిగి ఆ డిప్యూటీ కలెక్టరుగారి మూలంగానే ఆ స్కూల్లో పునః ప్రవేశం లభించింది.

ఈ సారి ఆయన నన్ను ఇంటికి పిలిపించి, "ఎందు కిల్లాంటి తప్పుపని చేశావ్?" అని అడిగారు. నేను నిర్భయంగా వున్నది వున్నట్లు చెప్పాను. అతిక్రితం రోజున అతను నన్ను కొట్టాడనీ, అతను నా కన్న పెద్దవా డవడంచేత మళ్ళీ కొట్టలేననీ, కాబట్టి నా పగ తీర్చుకో డానికి ఈ పని చేశాననీ చెప్పాను. దాంతో ఆయన నన్ను మందలించి మళ్ళీ స్కూల్లో ప్రవేశపెట్టాడు. నాకు ఒకవంక ఇల్లాంటి అల్లరి స్నేహాలున్నా, రెండోవంక పెద్దవాళ్ళతో స్నేహాలు కూడా వుండేవి. అప్పుడు నరసింహరాజు అనే ఒకాయన బి. ఏ. చదువుతూ వుండే

వాడు. ఆయనతో స్నేహంచేస్తూ అనేక విషయాలు నేర్చుకుంటూ ఉండేవాణ్ణి. ఆయన తరవాత సబ్‌జడ్జీ పనికూడా చేశాడు. మొత్తం మీద అల్లరికి ప్రఖ్యాతి పొందుతూ, చదువు సాగించాను. ఏవైనా వస్తువులు కావలిస్తే అవి వున్నవాళ్ళ దగ్గిర లాక్కో-వడమూ, వాళ్ళు మా అమ్మగారిదగ్గిర ఫిర్యాదులు చేయడమూ జరుగుతూ వుండేవి. ఇల్లాంటి తవ్వాయి లెన్నో ఆ ఇల్లాలు తీర్చింది!

నేను దండాలు, కుస్తీలు మొదలయిన తాలింఖానా వ్యవహారాల్లో అప్పటికే ముందంజ వేశానని ఇదివరకే చెప్పాను. దేశంలో అప్పటికే క్రికెట్టు ఆట ప్రవేశించింది. ఆ ఆటలోకూడా నేను ప్రవేశం కల్పించుకున్నాను. ఆ కాలంలో వెంకటగిరి రాజాగారి ఏనుగులు వేసవికి సువర్ణముఖి దగ్గిర తోటల్లో విడిసి వుండేవి. నేనూ, కొంతమందీ కలిసి మావటివాడికి కానో అర్ధణో ఇచ్చి, ఆ ఏనుగు లెక్కి- షికారులుకొట్టే వాళ్ళము. తరుచు ఆ సువర్ణముఖి ఇసక తిన్నెల్లోకి తినుబండారాలు పట్టుకుపోయి, అక్క-డ ఒకటి రెండు రోజులు మకాంవేసి, ఆటపాటలతో కులాసాగా కాలక్షేపం చేస్తూ వుండేవాళ్ళము. మొత్తంమీద నాయుడుపేట విద్యార్థి దశ మొదటికాలం ఒక విధమైన గణనీయతతో, కులాసాగానూ, నిర్లక్ష్యంగానూ గడిచిపోయింది.

ఆ రోజుల్లో నాయుడుపేట ఒక చిన్న గ్రామం. ఇళ్ళు చాలా సకృత్తుగా వుండేవి. ఆ గ్రామానికల్లా ఘనమైన విషయాలు మా బడీ, సువర్ణముఖి కాలువగట్టున వుండే అన్నపూర్ణ దేవాలయమూ, వెంకటగిరివారి ఏనుగులు విడిసే ఠాణా మాత్రమే. మా నాయనగారికి పోరుగూళ్ళో ఉద్యోగం అవడంచేత మమ్మల్ని ఒక స్వాములవారి మఠానికి చేరి వుండే చిన్న పూరి ఇంట్లో వుంచారు.

రెండుమూడు సంవత్సరాలు - అంటే నేను మోడరన్ థర్డుఫారం చదివేవరకూ - మా కుటుంబం అంతా నాయుడుపేటలోనే వున్న రోజుల్లో, మా నాయనగారిని ఎస్టేటువారు మల్లాం పారుపత్యానికి బదిలీ చేశారు. అందుచేత, ఆయన కుటుంబం మల్లాం తీసుకుపోయారు. నన్ను ఆ మఠంలోనే వుంచారు. అక్క-డ కన్నేపల్లి వెంకమ్మగారనే

ఆవిడ ఇంట్లో నన్ను భోజనానికి కుదిర్చారు. ఈ కాలంలోనే వల్లూరు గ్రామంలో మాకు వున్న భూములపైని కాటకంచేత పన్నులు చెల్లక పోవడంవల్ల, వెంకటగిరి ఎస్టేటువారు వాటికి జప్తులు పెట్టి, వేలం పాడించి అమ్మించారు. మా నాయనగారు నాయుడుపేటలో వుండగానే వల్లూరులో మా పెత్తండ్రుల స్థితికూడా చితికిపోయింది. వల్లూరు కరిణీకం చేస్తూవున్న అప్పాస్వామిగారు అప్పుడే మరణించారు. ఆయన పిల్లలు చిన్నవా ళ్ళవడంచేత కరిణీకం ఇంకొక కుటుంబంలోకి సంక్రమించింది. ఆనాడు కరిణీకాలు జమీన్‌దారుల కటాక్షం మీదనే ఆధారపడి వుండేవికదా!

# 2

# తండ్రిగారి మరణం

**1884** వ సంవత్సరంలో మా నాయనగారి ఆకస్మిక మరణంతో నా జీవితంలో ఒక పెద్ద అగాధం ఏర్పడింది. మా నాయన గారికి అప్పుడప్పుడు, శూలనెప్పి వస్తూవుండేది. ఆయన ఆ శూలనెప్పి తోనే 1884 సంవత్సరంలో మల్లాంలో స్వర్గస్థులైనారు. ఆయన ఇంకా జీవించి ఉండగానే నాకు నాయుడుపేటకి కబురు వచ్చింది. కాని, నేను ఊరు చేరుకునేసరికి ఆయన ప్రాణం పోయింది. అప్పటికి మా తమ్ముడు జానకిరామయ్య 8 వ మాసం గర్భంలో ఉన్నాడు. శ్రీరాములుకి 8 సంవత్సరాలు. అప్పటికి మా చెల్లెలు అన్నపూర్ణ వయస్సు సుమారు 4 సంవత్సరాలు. ఆనాటికి అప్పగా ర్లిద్దరూ కాపరాలకి వెళ్ళారు. ఈ స్థితిలో కుటుంబభారం అంతా మా తల్లిగారి మీద పడింది. ఈ సంసారం పోషించడానికి ఆమెకి ఉన్న సాధనాలు కూడా కొరతపడిపోయాయి. పిత్ర్యం ఖర్చయిపోయింది. తండ్రిగారి స్వార్జితంలో నిలవ అనేది శూన్యం. ఈ స్థితిలో మాకు కలిగిన విపత్తునుగురించి తెలియపరచగా మా మేనమామగారు కొంతకాలానికి వచ్చి, మమ్మల్ని ఆదరించి, ఆ

ఊరినించి కనపర్తి తీసుకువెళ్లారు. ఆ తరవాత మేము కనపర్తి శివారు వినోదరాయుడుపాలెం గ్రామంలో కొంతకాలం ఉన్నాము.

మా తమ్ముడు జానకిరామయ్య అక్కడే జన్మించాడు. అతను జన్మించిన కొద్దిరోజులకి మా అమ్మగారికి మా కుటుంబం భవిష్యత్తు విషయమై ఆత్రత హెచ్చయింది. మా మేనమామల కుటుంబం కూడా సామాన్యమైన మధ్య తరహా కుటుంబమే. మా అమ్మగారికి వారిపైన ఆధారపడి ఈ సంసారం అంతా అక్కడ ఉంచడం ఎంతో అభిమానంగా ఉండేది. ఆకాలంలో కుటుంబ నిర్వహణం అంటే చాలా దుస్తరమైన పని. ఉన్న భూమిలోనే సంవత్సరాని కంతకీ కుటుంబానికి కావలసిన ధాన్యాదులూ, దూడలికి కావలసిన మేతా పండించుకోవలసి వచ్చేది. మా మేనమామల ఊళ్ళో వాళ్ళ వ్యవసాయపు స్థితిగతులు నాకు ఇప్పటికీ స్మరణకి వస్తున్నాయి. నేను కూడా తరుచు పొలంవెళ్ళి మంచె మీద కాపలా కాస్తూ ఉండేవాణ్ణి. వాళ్ళిపొలంలోనే నాలుగుమూలలా నాలుగురకాల తినుబండారపు ధాన్యాదులు—అంటే జొన్న, పెసర, కంది, మినుము, వరిగె, పత్తి మొదలైనవి—పండించేవాళ్ళు. అల్లాగ మనుష్యుల కాయకష్టంమీద జీవించవలసిన రోజుల్లో ఒక సంసారంమీద ఇంకొక సంసారం పడడం అంటే మాటలా?

అప్పటికే ఇంగ్లీషు చదువుల ప్రాభవం ప్రారంభమైంది. కాస్త ఇంగ్లీషు చదువుకున్న వాళ్ళంతా పెద్దపెద్ద ఉద్యోగాల్లో చేరడం, ఇంగ్లీషు పరీక్షలు ఇంటిపేరు ళ్ళవడం ప్రారంభించాయి. అంటే బి.ఏ. నారాయణస్వామి, యఫ్. ఏ. శేషగిరి అయ్యరు అనే అన్వర్థనామాలు ఏర్పడ్డాయి. అందుచేతనే మా నాయనగారు మొదటినించీ మమ్మల్ని ఎల్లాగైనా ఇంగ్లీషుచదువు చదివించాలనే శ్రమపడుతూ ఉండేవారు. ఆడపిల్లల పెళ్ళిళ్ళు అనే పెద్దసమస్య తేలిపోయింది కనక, మమ్మల్ని ఇంగ్లీషు చదువుల్లో ప్రవీణుల్ని చెయ్యాలని ఆయన కోరిక. మా అమ్మగారు ఆయన కోరిక ఎల్లాగైనా సఫలం చెయ్యాలని సంకల్పించుకుంది. మా నాయనగారు పోయినప్పుడే మా అమ్మగారు "పువ్వులు అమ్మిన చోట కట్టెలు అమ్ముకోవలసి వస్తుందేమో!" అని అంటూఉండేది.

అప్పుడు ఆ మాట నా కంతగా అర్థం కాలేదు; కాని, ఇంగ్లీషు చదువులు ఉన్న ఒంగోలులో హోటలు పెట్టి, అందువల్ల వచ్చే ఆదాయంతో మా చదువు సాగించడానికి ఆమె నిర్ణయం చేసినప్పుడే ఆమె మాటల అర్థం నాకు బోధపడింది. ఆ రోజుల్లో హోటలు వ్యాపారం అంటే ఈ రోజుల్లోలాగ గౌరవకరమైన వ్యాపారంగా పరిగణింపబడేది కాదు. ఇప్పుడు హోటలు యజమానులకి సంఘంలో కొంత గౌరవాదరాలు కలుగుతున్నాయి. ఆ రోజుల్లో హోటలు పెట్టుకున్న వాళ్ళంటే సంఘంలో ఎంతో చులకనగా చూసేవారు. అందరూ "పూటకూళ్ళ వాళ్లు, పూటకూళ్ళ వాళ్లు" అని చులకనగా మాట్లాడేవారు. కాని, ఒకరి కుటుంబంమీద ఆధారపడి, వారికి బాధ కలిగించడం కన్న స్వోదర పోషణార్థం, నలుగురి కింత అన్నం పెట్టి జీవించడమే గౌరవప్రదం అని మా అమ్మగారు నిర్ణయించింది. ఎల్లాగైనా నాలుగు కాలాలపాటు శ్రమపడి, తల కాచుకుని, ఈ పిల్లల్ని ప్రయోజకుల్నిగా చేస్తే తన కష్టాలు గట్టెక్కుతా యని ఆమె నమ్మకం. అదే మాతృప్రేమలో ఉండే అమృతం!

బంధువులు కొందరు నిరుత్సాహపరిచినా, మా అమ్మగారు ఆ నాడు ఆ సాహసం చేసి, సహాయానికి మా అమ్మమ్మగారిని వెంటబెట్టుకుని మా జానకిరామయ్య పుట్టిన 5, 6 మాసాలకే ఒంగోలు చేరుకుంది. ఒంగోలులో అప్పటికే మునసబుకోర్టు ఉండింది. ఆ కోర్టుకి ఎదురుగా నెల కొక రూపాయో, అర్ధో అద్దె యిచ్చి ఒక యింట్లో హోటలు ప్రారంభించింది. అప్పటి కప్పుడే మా మేనమామ నన్ను ఒంగోలు తీసుకు వచ్చి గవర్నమెంటు నార్మల్ స్కూలులో లోవర్ ఫోర్తులో ప్రవేశపెట్టాడు. ఆ నాడు ఈ ట్రాన్స్ఫర్ సర్టిఫికేట్లు మొదలైనవి ఏమీ లేవు. ఒంగోలులో స్కూలు అధికారులు నన్ను పరీక్షచేసి లోవర్ ఫోర్తుకి నేను అర్హుణ్ణని నిర్ణయించారు.

1884 వ సంవత్సరంలో ఈ రీతిగా చదువుకోసం ఒంగోలు చేరుకున్నాము. అప్పటికి నా వయస్సు 12 సంవత్సరాలు. అప్పటికి గవర్నమెంటు మిడిల్ స్కూల్లోనే అప్పర్ ఫోర్తు దాకా చదివాను.

అక్కడనించే మిడిల్ స్కూలు పరీక్షకి హాజరై మొదటి తరగతిలో ఉత్తీర్ణుణ్ణయ్యాను.

అప్పటి హెడ్మాస్టరు సుందరశివయ్యా అనే ఆయన, కొంచెం చదివితే పనికొచ్చే పిల్లల్ని ఇంటికి తీసుకువెళ్ళి వాళ్ళకి ప్రత్యేకంగా చదువు చెప్పేవాడు. అల్లాంటి వాళ్ళల్లో నేను ఒకణ్ణి. అక్కడ కూడా ప్రవర్తనవిషయంలో మనకి మామూలు యోగ్యతా పత్రికే సంప్రాప్తమైంది! పోకిరీ పిల్లల సహవాసం, జబర్దస్తీ, మాష్టర్లని ధిక్కరించడం మొదలైన గుణాలు మన్ని వదలనే లేదు. బొంగరాలు, గోలీలు, మొదలయిన ఆటల్లో మనది అందివేసిన చెయ్యి. సామాన్యంగా చెడుగుడు ఆటకి పెందేసి బద్దని నేనే! క్రికెట్టు ఆటలో రెండు జట్లుండేవి. ఒక జట్టులో నా పేరు ప్రధానంగా ఉండేది. ఇంతకీ ఈ ఆటలకి డబ్బు కావాలి గదా! ఆ డబ్బు మనదగ్గిర లేదు. అందుచేత అల్లాంటివాళ్ళం అంతా కలిసి, చిన్న ముఠాగా చేరి, బజారులో వస్తువు లమ్మే వాళ్ళ కళ్ళల్లో కారం కొట్టి డబ్బు సంపాదించేవాళ్ళము. నిరంతరం ఈ డబ్బుకోసం తడుముకోవడమే ఒక ఆలోచనగా ఉండేది.

ఒక రోజున మా ముఠా అంతా చేరి, "ఈ డబ్బు సంపాదించడం ఎల్లాగా?" అనే ఆలోచనలో పడ్డాము. మా ముఠాలో అద్దేపల్లి అప్పడు అనే అతను మంచి గట్టివాడు. ముఠా కంతటికీ ఏకైక నాయకుడు! మే మంతా కలిసి అతని నాయకత్వం కింద డబ్బు సంపాదించడానికి ఒక పన్నాగం పన్నాము. ఒంగోలికి చేరి ఉన్న రంగారాయుడు చెరువు కింది పొలంలో వరిగె పంటి కోతకి సిద్ధంగా ఉంది. మేము రాత్రి రాత్రి ఆ పంట కోసి, అమ్మి, డబ్బు సంపాదించడానికి నిశ్చయించి, రాత్రి 12 గంటలకి కోత ముగించి, కట్టలు కట్టి నెత్తిని పెట్టుకున్నాము. ఇంతలో ఆ కాపలావాడికి మెళుకువ రావడమూ, వాడు కేకలు పెట్టగా నలుగురూ లేచి మమ్మల్ని పట్టుకోవడమూ జరిగాయి.

అప్పట్లో మా జట్టు నలుగురు. ఆ నలుగురిలో నేనే చిన్నవాణ్ణి. మాలో మస్తాన్ అని ఒక సాహేబుల కుర్రవాడు ఉన్నాడు. మేము కొంతసేపు ధైర్యసాహసాలతో ప్రతిఘటించాము. కాని, చివరికి దొరికి

పోయాము. వాళ్ళు మమ్మల్ని పట్టుకుని పోలీసులికి అప్పజెప్పే లోపల మా పెద్దవాళ్ళు నలుగురూ వచ్చి వాళ్ళ పంట వాళ్ళ కిప్పించారు. ఇంతకీ, చేను కోతకి సిద్ధంగా ఉందిగదా! ఆ రయితుకి ఖర్చు లేకుండా కోత అయిందని పెద్దమనుష్యు లంతా తగాదా తీర్చారు. ఆ దొంగ తనంవల్ల కలిగిన న్యూనత మూలంగా మేము ఎవళ్ళం కూడా రెండు రోజులు దాకా ఇళ్ళకి వెళ్ళలేదు. ఆ రోజుల్లో మురాకి 'ఊట్' కంపెనీ అని పేరు వచ్చింది. నాకు అప్పటికే నవులూరి రమణయ్య అనే ఒక పోకిరీ సహవాసం లభ్యమైంది. వాడి పెత్తండ్రి పురుషోత్తం అనే అతను బాగా వడ్డీ వ్యాపారం చేసి డబ్బు సంపాదించాడు. అతని తమ్ముడి కొడుకే ఈ రమణయ్య. ఇతను తన జబరదస్తీవల్ల 'కింగ్ ఆఫ్ ఒంగోలు' అనే బిరుదు సంపాదించాడు. వాడు కూడా ఆ మొలం దోపిడీలో ఉన్నాడు.

# 3

## నాటకరంగ ప్రవేశం

ఈ కాలంలోనే నా జీవితాని కంతకీ మార్పు తెచ్చిన నాటకాల ప్రకరణం ప్రారంభం అయింది. నాకు లోవర్ ఫోర్తు చదువు పూర్తి అయ్యే సరికి పూనా కంపెనీ ఒంగోలు వచ్చింది. వాళ్ళు హిందీలో నాటకాలు ప్రదర్శించేవారు. అప్పుడు వాళ్ళు ప్రమీలా స్వయం వరం, పీష్వా నారాయణరావు వధ, ఉషా పరిణయం, కీచక వధ మొదలైన నాటకాలు ఆడారు. మేమంతా నాటకాలు చూచాము. మాకు అప్పట్లో అల్లాంటి నాటకాలు ఆడాలనే సంకల్పం కలిగింది. మా సంక ల్పానికి తోడు ఆ ఊళ్ళో నాటకాలంటే చెవి కోసుకునే ఉండదల్లి సాహేబు అనే ఆయన ఉండేవాడు. నాకు పితృసమానులూ, నా జీవి తాభివృద్ధి కంతకీ మూలకందమూ అయిన ఇమ్మానేని హనుమంత రావు నాయుడుగారు కూడా అక్కడ మిషన్ స్కూల్లో ఉపాధ్యాయు

లుగా ఉండి నాటకాలంటే అభిమానంగా ఉండేవారు. ముందు ఆయన్ని గురించి విపులంగా వ్రాస్తాను.

అల్లాంటి స్థితి గతుల్లో నేను నాటకాల్లో పాత్రధారణ ప్రారంభించి, ఆడవేషాల్లో కొంచెం పేరు ప్రఖ్యాతులు సంపాదించాను. పీష్వా నారాయణరావు వధలో నారాయణరావు పాత్ర నేనే ధరించేవాణ్ణి. అందులోనే మనకీర్తి బాగా వ్యాపించింది. అందువల్లనే ఊళ్ళో ఉన్న ఉండదల్లీ సాహేబు, హనుమంతరావుగార్లకి అభిమానపాత్రుణ్ణి అయ్యాను. ఆ నాటకాల యావ కొంతవరకు నన్ను ఇతరమైన చిలిపి పనులనించి కాపాడింది. ఉండదల్లీసాహేబు మేనల్లుడు ఒకడు మాతో వేషాలు వేసేవాడు. ఎప్పుడూ నాకు తురకల సహవాసం ఉంటూనే వుండేది. ఆ ఉండదల్లీసాహేబు ఉర్దూలో పండితుడు. ఆయన ఉర్దూలోనే నాటకాలు వ్రాసేవాడు. మేము తెలుగు లిపిలో ఆ ఉర్దూ వ్రాసుకుని నాటకాలు కంఠస్థంగా వల్లించే వాళ్ళము. ఈ స్థితిలోనే ఒక వైపున నాటకాలూ, రెండోవైపున చదువూ సాగిస్తూ, నేను మిడిల్ స్కూలు పరీక్షకి తయారు కావలసివచ్చింది.

నేను ఈ నాటకాల్లో తిరుగుతూ వుంటే మా అమ్మగారు, అమ్మమ్మగారు కూడా చాలా బాధపడుతూ వుండేవారు. కాని, నేనెప్పుడూ వారి అదుపు ఆజ్ఞల్లో లేకుండా వుండడంవల్ల నన్నేమీ చెయ్యలేకపోయేవారు. కన్న ప్రేమవల్ల నేను చేసే అకృత్యాలన్నీ కాసుకుంటూ వచ్చేవారు. బయట ఎంత అల్లరి చేసినా స్కూల్లో చదువువిషయంలో ఏ లోపమూ లేకపోవడంవల్ల కొంత తృప్తిపడుతూ వుండేవారు. నేను ఆ మిడిల్ స్కూలు పరీక్షకి వెళ్ళడం ఒక బ్రహ్మాండమైన పని అయింది. హోటలు పెట్టుకున్నా మా దారిద్ర్యం తీరలేదు. అందువల్ల వచ్చే ఆదాయం కుటుంబ పోషణకీ, నా చదువుకీ సరిపోయేది కాదు. అందుచేత మా అమ్మగారు నన్ను సంపన్న గృహస్థుల ఇళ్ళల్లో వారాలకి అప్ప జెప్పింది. బ్రతికి చెడిపోయిన సంసారం అనే మర్యాదవల్ల ఊళ్ళో వాళ్ళు మా అమ్మగారిని సామాన్యంగా వంటపూటి వాళ్ళని చూసేటట్లు చులకనగా చూసేవాళ్ళు కారు.

ఆ కాలంలో ఒంగోలు ప్లీడర్లు అంతా తెలుగు ప్లీడర్లే. అందులో నాగరాజు సూర్యనారాయణరావు అనే ఒక తెలుగు ప్లీడరు వుండేవాడు. ఎప్పుడైనా నాకు ఏ పుస్తకాలకైనా డబ్బు తక్కువైతే మా అమ్మగారు నన్ను ఆయనదగ్గిరికి పంపించేది. మా కుటుంబం పూర్వపు ప్రతిష్ఠ మన్నించి ఆయన నేను ఎప్పుడు వెళ్ళినా ఆప్యాయంగా నాలుగు అణాలు యిచ్చేవాడు. ఇప్పటికీ ఆయన నా కళ్ళల్లో మసులుతూనే వున్నాడు. ఇల్లాంటి నిక్కచ్చిలో మిడిల్ స్కూలుకి 3 రూపాయలు దరఖాస్తు కట్టవలసి వచ్చింది. నేను ఒంగోలుకి 25 మైళ్ళ దూరంలో వున్న మా బావగారి యింటికి నడిచి వెళ్ళాను.

తీరా నడిచి వెళ్ళాక మా బావగారు సాయం చెయ్యలేక పోయారు. కాని నడక అనేది మనకి కొత్త కాక పోవడంవల్ల అట్టే ఆశాభంగం కలగలేదు. నాకు—ఒంగోలుకి 10 మైళ్ళలో వున్న మా చిన్నక్కగారి ఊరు కొత్తపట్నానికీ, మా మేనమామల ఊరు వినోద రాయుడిపాలానికీ, ఇంకా ఆ దగ్గిర గ్రామాలకీ—నడిచివెళ్ళడం అనే అలవాటు వుంటూనే వుండేది. ఆనాటి నడక సత్తువే యిప్పటికీ నన్ను బలిష్ఠంగా వుంచిందని నా నమ్మకము. మా బావగారిదగ్గిర ఆశాభంగం అయ్యాక—పాపం! మా అమ్మగారే తను కట్టుగునే పట్టుబట్ట తాకట్టు పెట్టి ఆ మూడు రూపాయలూ తెచ్చి యిచ్చింది. ఆ గండంతో నా మిడిల్ స్కూలు పరీక్ష పూర్తి అయింది.

మిడిల్ స్కూలు పరీక్షకి వెళ్ళడానికి ముందే నా మనస్సులో రెండు అభిప్రాయాలు వుండేవి. ఒంగోలులో మా ఇల్లు మునసబు కోర్టుకి యెదురుగా వుందని యిదివరకే వ్రాశాను. ఆ కోర్టులో ప్లీడర్లు లాంగు కోట్లు వేసుకుని తిరుగుతూ, డబ్బు సంపాదిస్తూ వుండే నాకు కూడా ప్లీడరీ చెయ్యాలనే సంకల్పం కలిగింది. ఆ లాంగు కోటు మీద ప్రేమ చాలావరకూ వెళ్ళింది. మిడిల్ స్కూల్లో చదువుతూ వుండగానే ఒక లాంగుకోటు కుట్టించాను.

# 4

## రాజమహేంద్రవర ప్రయాణం

ఇంక నా భవిష్యత్తుకి కారణం అయిన రాజమహేంద్ర వరాన్ని గురించి వ్రాస్తాను. ఆ రోజుల్లో రాజమహేంద్రవరం ఖ్యాతి చాలా గొప్పగా వుండేది. అది విద్యావంతులకి నిలయమనీ, మహా పండితులకి ఆస్థానమనీ, గోదావరి బ్రహ్మాండమైనదనీ, ఆదేశం వెళ్ళిన వాళ్ళంతా పండితు లవుతారనీ చెప్పుగుంటూ వుండేవారు. నాకు ఆ వూరు, ఎల్లా ఉంటుందో చూడాలని ఒక సంకల్పం వుండేది. నా మిత్రుడు నవులూరి రమణయ్య, నేనూ, మరి కొందరమూ కలిసి ఇళ్ళల్లో కూడా చెప్పకుండా అక్కడికి వెళ్ళిపోవాలని ఒక ప్లాను వేశాము.

ఆ కాలంలో ఒంగోలుకి కలరా వచ్చింది. మేము ఉండే చోట ఒక కేసు రావడంవల్ల భయపడి మా అమ్మగారు మమ్మల్ని ధారావారి వీథిలో ఉన్న నిమ్మగడ్డవారింట్లో పెట్టింది. పిల్లి పిల్లలిని పెట్టి ఏడు చోట్లకి తిప్పినట్లు ఆమె మాకు ఎక్కడ ఏమి ఆపత్తు వస్తుందో అని అతి భయంతో అక్కడికీ ఇక్కడికీ మారుస్తూ వుండేది. ఆ నిమ్మగడ్డ వారి ఇంట్లో కొందరు రాజమహేంద్రవరంలో చదువుకుని పండితులై వైదిక విద్యలో పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. వారింట్లో ఉండడం వల్ల నాకు రాజమహేంద్రవరం చూడాలనే కోరిక మరింత హెచ్చ యింది. ఈ మానసికస్థితిలో మిడిల్‌స్కూల్ పాసయి ఆ అవకాశం కోసం ఎదురు చూస్తూ వున్నాను.

అప్పటికి ఆ ఊళ్ళో ఇమ్మానేని హనుమంతరావు నాయుడు గారు మిషన్ స్కూల్లో ఉపాధ్యాయులుగా వుండేవారు. ఆయన మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయినవారు. ఆయనకి నెలకి 30 రూపాయలు జీతము. ఆయనకి నాటకాలంటే ఉండే అభిరుచినిగురించీ,

# 4

## రాజమహేంద్రవర ప్రయాణం

ఇంక నా భవిష్యత్తుకి కారణం అయిన రాజమహేంద్ర వరాన్ని గురించి వ్రాస్తాను. ఆ రోజుల్లో రాజమహేంద్రవరం ఖ్యాతి చాలా గొప్పగా వుండేది. అది విద్యావంతులకి నిలయమనీ, మహా పండితులకి ఆస్థానమనీ, గోదావరి బ్రహ్మాండమైనదనీ, ఆదేశం వెళ్ళిన వాళ్ళంతా పండితు లవుతారనీ చెప్పుగుంటూ వుండేవారు. నాకు ఆ వూరు, ఎల్లా ఉంటుందో చూడాలని ఒక సంకల్పం వుండేది. నా మిత్రుడు నవులూరి రమణయ్య, నేనూ, మరి కొందరమూ కలిసి ఇళ్ళల్లో కూడా చెప్పకుండా అక్కడికి వెళ్ళిపోవాలని ఒక ప్లాను వేశాము.

ఆ కాలంలో ఒంగోలుకి కలరా వచ్చింది. మేము ఉండే చోట ఒక కేసు రావడంవల్ల భయపడి మా అమ్మగారు మమ్మల్ని ధారావారి వీథిలో ఉన్న నిమ్మగడ్డవారింట్లో పెట్టింది. పిల్లి పిల్లలిని పెట్టి ఏడు చోట్లకి తిప్పినట్లు ఆమె మాకు ఎక్కడ ఏమి ఆపత్తు వస్తుందో అని అతి భయంతో అక్కడికీ ఇక్కడికీ మారుస్తూ వుండేది. ఆ నిమ్మగడ్డ వారి ఇంట్లో కొందరు రాజమహేంద్రవరంలో చదువుకుని పండితులై వైదిక విద్యలో పేరు ప్రతిష్ఠలు సంపాదించారు. వారింట్లో ఉండడం వల్ల నాకు రాజమహేంద్రవరం చూడాలనే కోరిక మరింత హెచ్చ యింది. ఈ మానసికస్థితిలో మిడిల్‌స్కూల్ పాసయి ఆ అవకాశం కోసం ఎదురు చూస్తూ వున్నాను.

అప్పటికి ఆ ఊళ్ళో ఇమ్మానేని హనుమంతరావు నాయుడు గారు మిషన్ స్కూల్లో ఉపాధ్యాయులుగా వుండేవారు. ఆయన మెట్రిక్యులేషన్ పరీక్షలో ఉత్తీర్ణులయినవారు. ఆయనకి నెలకి 30 రూపాయలు జీతము. ఆయనకి నాటకాలంటే ఉండే అభిరుచినిగురించీ,

నేను మిడిల్‌స్కూలు పరీక్ష పాసవడంతోనే నా దగ్గిర బంధువులు అంతా నన్ను ఏదైనా నౌఖరీలో ప్రవేశించమని చాలా బాధ పెట్టారు. వాళ్లు అందరూ "ఎంతకాలం మీ అమ్మగారు నీకోసం ఇల్లా పాటుపడా" లని అంటూ ఉండేవాళ్లు. ఆ రోజుల్లో మిడిల్‌స్కూలు పరీక్ష మొదటి తరగతిలో పాసవడ మంటే మెట్రిక్యులేషన్ పాసవడంతో సమానమే. అందుచేతనే నాకు వాళ్లు అల్లాంటి సలహా ఇచ్చారు. నా దృష్టిమాత్రం యిదివరలో నేను చెప్పినట్లు పై చదువుమీదా, తరవాత, ప్లీడరీమీదా వుండేది. మా అమ్మగారుకూడా మరి రెండు సంవత్సరాలపాటు చదివితేనే మంచిదని నిశ్చయించింది. అందుచేత నేను చదవడానికే నిశ్చయించాను. ఈ చదువుకి నెలజీతం ఒక సమస్య! ఈ సమస్య పరిష్కారంచేసి నా జీవితం అభివృద్ధిలోకి తీసుకువచ్చినది హనుమంతరావునాయుడుగారే.

ఆయన మిషన్‌స్కూల్లో ఉపాధ్యాయు లని వ్రాసే వున్నాను. ఆ రోజుల్లో ఆ మిషన్‌స్కూలుకి మాస్లీ అనే ఆయన ప్రధానోపాధ్యాయుడుగా వుండేవాడు. ఆయన అర్హులయిన బీదవిద్యార్థులకి వేతనాలిప్పించి అనేకమంది కృతజ్ఞతకి పాత్రు లయ్యారు. నాటకాల పరిచయంలో నాయందు కలిగిన అవ్యాజకరుణవల్ల హనుమంతరావు నాయుడుగారు నన్ను ఆయన దగ్గిరికి తీసుకువెళ్ళి సిఫారసు చేశారు. దానికి ఆయన అంగీకరించారు.

దాంతో నా కష్టం గట్టెక్కింది. మిడిల్‌స్కూల్లో చదివేకాలంలో కూడా హనుమంతరావు నాయుడుగారు రాత్రిళ్ళు నాకు యింటిదగ్గిర ప్రత్యేకంగా పాఠాలు చెప్పేవారు. ఆ నాటి విద్యావిధానంలో మిడిల్ స్కూలుకే చాలా లెఖ్ఖలు వుండేవి. హనుమంతరావు నాయుడుగారి బోధనలో ఉండే విశేషం యేమిటంటే ఆయన ఒక్కసారి పాఠంలో సూత్రం చెబితే అది తలకెక్కి దానినిబట్టి అల్లాంటి కొత్త సూత్రాలు అవగాహన చేసుకునే శక్తి కలుగుతూ వుండేది.

మాస్లీ దొరగారి స్కూల్లో హనుమంతరావు నాయుడుగారి శిక్షణకింద ఐదవతరగతి చదివాను. ఐదవతరగతి అంటే మెట్రిక్యు

నేను మిడిల్‌స్కూలు పరీక్ష పాసవడంతోనే నా దగ్గిర బంధువులు అంతా నన్ను ఏదైనా నౌఖరీలో ప్రవేశించమని చాలా బాధ పెట్టారు. వాళ్లు అందరూ "ఎంతకాలం మీ అమ్మగారు నీకోసం ఇల్లా పాటుపడా" లని అంటూ ఉండేవాళ్లు. ఆ రోజుల్లో మిడిల్‌స్కూలు పరీక్ష మొదటి తరగతిలో పాసవడ మంటే మెట్రిక్యులేషన్ పాసవడంతో సమానమే. అందుచేతనే నాకు వాళ్లు అల్లాంటి సలహా ఇచ్చారు. నా దృష్టిమాత్రం యిదివరలో నేను చెప్పినట్లు పై చదువుమీదా, తరవాత, ప్లీడరీమీదా వుండేది. మా అమ్మగారుకూడా మరి రెండు సంవత్సరాలపాటు చదివితేనే మంచిదని నిశ్చయించింది. అందుచేత నేను చదవడానికే నిశ్చయించాను. ఈ చదువుకి నెలజీతం ఒక సమస్య! ఈ సమస్య పరిష్కారంచేసి నా జీవితం అభివృద్ధిలోకి తీసుకువచ్చినది హనుమంతరావునాయుడుగారే.

ఆయన మిషన్‌స్కూల్లో ఉపాధ్యాయు లని వ్రాసే వున్నాను. ఆ రోజుల్లో ఆ మిషన్‌స్కూలుకి మాస్లీ అనే ఆయన ప్రధానోపాధ్యాయుడుగా వుండేవాడు. ఆయన అర్హులయిన బీదవిద్యార్థులకి వేతనాలిప్పించి అనేకమంది కృతజ్ఞతకి పాత్రు లయ్యారు. నాటకాల పరిచయంలో నాయందు కలిగిన అవ్యాజకరుణవల్ల హనుమంతరావు నాయుడుగారు నన్ను ఆయన దగ్గిరికి తీసుకువెళ్ళి సిఫారసు చేశారు. దానికి ఆయన అంగీకరించారు.

దాంతో నా కష్టం గట్టెక్కింది. మిడిల్‌స్కూల్లో చదివేకాలంలో కూడా హనుమంతరావు నాయుడుగారు రాత్రిళ్ళు నాకు యింటిదగ్గిర ప్రత్యేకంగా పాఠాలు చెప్పేవారు. ఆ నాటి విద్యావిధానంలో మిడిల్ స్కూలుకే చాలా లెఖ్ఖలు వుండేవి. హనుమంతరావు నాయుడుగారి బోధనలో ఉండే విశేషం యేమిటంటే ఆయన ఒక్కసారి పాఠంలో సూత్రం చెబితే అది తలకెక్కి దానినిబట్టి అల్లాంటి కొత్త సూత్రాలు అవగాహన చేసుకునే శక్తి కలుగుతూ వుండేది.

మాస్లీ దొరగారి స్కూల్లో హనుమంతరావు నాయుడుగారి శిక్షణకింద ఐదవతరగతి చదివాను. ఐదవతరగతి అంటే మెట్రిక్యు

కనక యింట్లోవాళ్ళు విధిలేక చిట్టచివరికి అంగీకరించారు! నాయుడు గారు కూడా మా ఇంటికి వచ్చి, "అంత పట్టుదలగా ఉన్నప్పుడు పంపండి. నేను జాగ్రత్తగా తీసుకువస్తాను" అని చెప్పారు. మా అమ్మమ్మగారు "మా వాడికి భోజనం ఎల్లాగ?" అని ఆత్రతగా అడి గింది. నాయుడుగారు "అతని కేమీ లోటు రానివ్వ," నని మా అమ్మమ్మ గారికి ధైర్యం చెప్పారు.

నాయుడుగారు, ఆయన భార్య, నలుగురు పిల్లలు, తల్లి, నేనూ కలిసి అంచె బళ్ళమీద ప్రయాణం ప్రారంభించాము. అక్కడికి రాజ మహేంద్రవరం 180 మైళ్ళ దూరంలో వుంది. బెజవాడ గ్రాండు ట్రంకు రోడ్డుమీద 90 మైళ్ళు, బెజవాడనించి విశ్వేశ్వరం 90 మైళ్ళు. అప్పట్లో బెజవాడ నాలుగు మకాముల్లో చేరే వాళ్ళం. అప్పటికాలంలో సామాన్యంగా రాత్రిళ్ళంతా ఏ 20 మైళ్లో నడవడమూ, పగలు సత్రా లున్నచోట మకాములు చెయ్యడమూ, ఒక ప్రయాణ పద్ధతిగా వుండేది. కావలిస్తే, మకాముల్లో బెజవాడవరకూ అంచె బళ్ళు సిద్ధంగా దొరికేవి. కాని, బెజవాడనించి రాజమహేంద్రం వరకూ మాత్రం బళ్ళు సులు వుగా దొరికేవి కావు. దారి కూడా చాలా భయంకరంగా వుండేది. దారి పొడుగునా అరణ్యమార్గంలా కనబడేది. దానికి తోడు ఎడ్లు కూడా నాసి రకం అయితే బెజవాడనించి రాజమహేంద్రవరం చేరేసరికి సుమారు 10 రోజులు పట్టేది. దారిలో ప్రతి మకాముదగ్గిరా నాయుడుగారు నాకు ప్రత్యేకంగా బ్రాహ్మణుల యింట్లో భోజనం ఏర్పాటుచేసి, ఆయనా, కుటుంబమూ, అంతా వంట చేసుకునేవారు.

ఇల్లాగ రెండువారాలు ప్రయాణం చేసి విశ్వేశ్వరం చేరు కున్నాము. అక్కడ గోదావరి దాటి రాజమహేంద్రవరం చేరాము. ఒంగోలునించి గుంటూరువరకూ దారిపొడుగునా కొండలూ గుట్టలూ వున్నాయి. మకాముల్లో నీటి సౌకర్యాలు లేక దేశం బొగులు బొగులు మంటూ వుండేది. ఆ రోజుల్లో కాస్త కృష్ణ సమీపించేసరికి పచ్చని నేల కనబడేది. దారిలో దొంగల భయం కూడా వుండేది. అందుచేత బళ్లు ఒంటరిగా కదిలేవి కావు. ఆ ప్రయాణంలోనే మేము ఏలూరులో

కనక యింట్లోవాళ్ళు విధిలేక చిట్టచివరికి అంగీకరించారు! నాయుడు గారు కూడా మా ఇంటికి వచ్చి, "అంత పట్టుదలగా ఉన్నప్పుడు పంపండి. నేను జాగ్రత్తగా తీసుకువస్తాను" అని చెప్పారు. మా అమ్మమ్మగారు "మా వాడికి భోజనం ఎల్లాగ?" అని ఆత్రతగా అడిగింది. నాయుడుగారు "అతని కేమీ లోటు రానివ్వ," నని మా అమ్మమ్మ గారికి ధైర్యం చెప్పారు.

నాయుడుగారు, ఆయన భార్య, నలుగురు పిల్లలు, తల్లి, నేనూ కలిసి అంచె బళ్ళమీద ప్రయాణం ప్రారంభించాము. అక్కడికి రాజమహేంద్రవరం 180 మైళ్ళ దూరంలో వుంది. బెజవాడ గ్రాండు ట్రంకు రోడ్డుమీద 90 మైళ్ళు, బెజవాడనించి విజ్ఞేశ్వరం 90 మైళ్ళు. అప్పట్లో బెజవాడ నాలుగు మకాముల్లో చేరే వాళ్ళం. అప్పటికాలంలో సామాన్యంగా రాత్రిళ్ళంతా ఏ 20 మైళ్లో నడవడమూ, పగలు నీళ్ళు ఉన్నచోట మకాములు చెయ్యడమూ, ఒక ప్రయాణ పద్ధతిగా వుండేది. కావలిస్తే, మకాముల్లో బెజవాడవరకూ అంచె బళ్ళు సిద్ధంగా దొరికేవి. కాని, బెజవాడనించి రాజమహేంద్రం వరకూ మాత్రం బళ్ళు సులువుగా దొరికేవి కావు. దారి కూడా చాలా భయంకరంగా వుండేది. దారి పొడుగునా అరణ్యమార్గంలా కనబడేది. దానికి తోడు ఎద్దు బండ్లా నాపి రకం అయితే బెజవాడనించి రాజమహేంద్రవరం చేరేసరికి సుమారు 10 రోజులు పట్టేది. దారిలో ప్రతి మకాముదగ్గిరా నాయుడుగారు నాకు ప్రత్యేకంగా బ్రాహ్మణుల యింట్లో భోజనం ఏర్పాటుచేసి, ఆయనా, కుటుంబమూ, అంతా వంట చేసుకునేవారు.

ఇల్లాగ రెండువారాలు ప్రయాణం చేసి విజ్ఞేశ్వరం చేరుకున్నాము. అక్కడ గోదావరి దాటి రాజమహేంద్రవరం చేరాము. ఒంగోలునించి గుంటూరువరకూ దారిపొడుగునా కొండలూ గుట్టలూ వున్నాయి. మకాముల్లో నీటి సౌకర్యాలు లేక దేశం బొగులు బొగులు మంటూ వుండేది. ఆ రోజుల్లో కాస్త కృష్ణ సమీపించేసరికి పచ్చని నేల కనబడేది. దారిలో దొంగల భయం కూడా వుండేది. అందుచేత బళ్లు ఒంటరిగా కదిలేవి కావు. ఆ ప్రయాణంలోనే మేము ఏలూరులో

కులాసాగా వుండేవి. ఆ ప్రయాణాల్లోనే గోదావరీ మహానది విస్తీర్ణమూ, ప్రయోజనమూ బాగా అవగాహన అయ్యాయి.

అప్పట్లో రాజమహేంద్రవరం అంటే నేటి పాతపట్టణం మాత్రమే. ముఖ్యమైనభవనా లల్లా చిత్రాంగి రత్నాంగుల మేడలే. అప్పటికి గోదావరికి గట్టు లేదు. బ్రిడ్జి అసలే లేదు. నేటి ఆర్యాపురాని కంతటికీ రెండో మూడో ఇళ్ళువుండేవి. మిగతా వన్నీ విలువ అడివిలే. ఇన్నీసుపేట కొంచెమే వుండేది. కాని అది అప్పట్లో ఊళ్ళో కెల్లా శుభ్రంగా వుండేది. గచ్చు కాలవలు లేకపోయినా డ్రెయినేజీ పద్ధతులు చక్కగా వుండేవి.

నేను రాజమహేంద్రవరం చేరేసరికి అప్పట్లో కొద్దిమంది న్యాయవాదులు వుండేవారు. అప్పటికి ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులు, మాకర్ల సుబ్బారావునాయుడు, మాదిరెడ్డి వెంకటరత్నం నాయుడుగార్లు బి. ఏ., బి. ఎల్. పాసయి ప్లీడరీ చేస్తున్నారు. జిల్లా కోర్టూ, మునసబు కోర్టూ ఒక పాతఇంట్లో వుండేవి. ఏలూరు లక్ష్మీ నరసింహంగారు, నేతి సోమయాజులుగారు మొదలయినవారు ప్లీడర్లు. సరిపల్లి కొంటశివరావు, గోపాలకృష్ణమ్మ, దామరాజు నాగరాజు ప్రభృతులు పట్టాలు పొందిన ప్లీడర్లు. ఇక పాండిత్యవిషయంలో,—అప్పటికే వీరేశలింగం, వద్దాది సుబ్బారాయుడుగార్ల పేర్లు మోగి పోతున్నాయి. వారిద్దరికీ సాహిత్యసంబంధమైన శాత్రవ్యవుండేది. సంస్కృత పండితుల్లో కల్లూరి వెంకటరామశాస్త్రులుగారి కీర్తి బాగా వుండేది. అప్పుడు శుద్ధ గ్రాంథికభాషలో మాట్లాడతారని పేరు పొందిన కొక్కొండ వెంకటరత్నంగారికి కూడా మంచి ప్రసిద్ధి వుండేది.

మా సెలవలు పూర్తి కావచ్చాయి. నాయుడుగారి భార్య లక్ష్మమ్మగారికి మొదటినించీ బంధువులకి సమీపంగా రాజమహేంద్రవరంలో వుండాలనే కోర్కె వుండేది. ఒంగోలులో అప్పులు పెరిగి పోవడంవల్లా, ఆ అప్పులు తీరే మార్గం కనిపించకపోవడంవల్లా ఆమె కోరిక మరింత దృఢపడింది. ఆమెకి రాజమహేంద్రవరంలోనూ రామచంద్రపురంలోనూ వుండే బంధువులంతా, "అంతదూరంలో ఏమిటా

ఖులాసాగా వుండేవి. ఆ ప్రయాణాల్లోనే గోదావరీ మహానది విస్తీర్ణమూ, ప్రయోజనమూ బాగా అవగాహన అయ్యాయి.

అప్పట్లో రాజమహేంద్రవరం అంటే నేటి పాతపట్నం మాత్రమే. ముఖ్యమైనభవనా లన్నీ చిత్రాంగి రత్నాంగుల మేడలే. అప్పటికి గోదావరికీ గట్టు లేదు. బ్రిడ్జి అసలే లేదు. నేటి ఆర్యాపురాని కంతటికీ రెండో మూడో ఇళ్ళువుండేవి. మిగతా వన్నీ బీలు అడివీలే. ఇన్నీసుపేట కొంచెమే వుండేది. కాని అది అప్పట్లో ఊళ్ళో కల్లా శుభ్రంగా వుండేది. గచ్చు కాలవలు లేకపోయినా డ్రెయినేజీ వగైరాలు చక్కగా వుండేవి.

నేను రాజమహేంద్రవరం చేరేసరికి అప్పట్లో కొద్దిమంది న్యాయవాదులు వుండేవారు. అప్పటికి ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులు, మాకర్ల సుబ్బారావునాయుడు, మాదిరెడ్డి వెంకటరత్నం నాయుడుగార్లు బి. ఏ., బి. ఎల్. పాసయి ప్లీడరీ చేస్తున్నారు. జిల్లా కోర్టూ, మునసబు కోర్టూ ఒక పాతఇంట్లో వుండేవి. ఏలూరు లక్ష్మీ నరసింహంగారు, నేతి సోమయాజులుగారు మొదలయినవారు ప్లీడర్లు. సరిపల్లి సాంబశివరావు, గోపాలకృష్ణమ్మ, దామరాజు నాగరాజు ప్రభృతులు పట్టాలు పొందిన ప్లీడర్లు. ఇక పాండిత్యవిషయంలో,—అప్పటికే వీరేశలింగం, వడ్డాది సుబ్బారాయుడుగార్ల పేర్లు మోగి పోతున్నాయి. వారిద్దరికీ సాహిత్యసంబంధమైన ఈర్ష్యవుండేది. సంస్కృత పండితుల్లో కల్లూరి వెంకటరామశాస్త్రులుగారి కీర్తి బాగా వుండేది. అప్పుడు శుద్ధ గ్రాంథికభాషలో మాట్లాడతారని పేరు పొందిన కొక్కొండ వెంకటరత్నంగారికి కూడా మంచి ప్రసిద్ధి వుండేది.

మా సెలవలు పూర్తి కావచ్చాయి. నాయుడుగారి భార్య లక్ష్మమ్మగారికి మొదటినించీ బంధువులకి సమీపంగా రాజమహేంద్రవరంలో వుండాలనే కోర్కె వుండేది. ఒంగోలులో అప్పులు పెరిగిపోవడంవల్లా, ఆ అప్పులు తీరే మార్గం కనిపించకపోవడంవల్లా ఆమె కోరిక మరింత దృఢపడింది. ఆమెకీ రాజమహేంద్రవరంలోనూ రామచంద్రపురంలోనూ వుండే బంధువులంతా, "అంతదూరంలో ఏమిటా

ఎదట కనిపించాను. ఆయనకి ఎక్కడలేని సంతోషమూ కలిగింది. ఆపైన కొంత సంభాషణ అయ్యాక "పోనీ నువ్వుకూడా ఇక్కడే చదువుకోరాదా?" అని అడిగారు. దానిమీద నేను, "మా వాళ్ళంతా అక్కడ వున్నారు కదా! నన్ను ఇక్కడ ఎవ్వరు చూస్తారు?" అన్నాను. దాని మీద ఆయన "అక్కడ మాత్రం ఎవ రున్నారు? మీ అమ్మగారూ, అమ్మమ్మగారూ కష్టపడవలసిందే గదా? ఇక్కడైతే నాతోపాటు తంటాలు పడకూడదా?" అని ఆప్యాయంగా అన్నారు.

ఒక్కక్షణం అట్టే ఆలోచించాను. నా జీవితంలో అది ఒక అపూర్వమైన ఘడియ! అదే ఈ జీవితం యావత్తూ ఇల్లాగ పరిణామం చెందడానికి మూలకారణమైన నిమిషం! "Life is a series of Accidents" అంటే జీవితమంతా "ఆకస్మిక ఘటనావళి" అనే మాటల్లో ఎంతో అర్థం వుంది. నాకు పడవే అంది, ఒంగోలు తిరిగి చేరితే జీవితం ఏమి అయి వుండేదో, ఎట్లా పరిణమించేదో పరమే శ్వరుడికే ఎరుక! నేను పడవ దాటిపోయి వెనక్కి రావడమూ, నాయుడు గారికి మనస్తాపం కలిగి నన్ను తమ దగ్గర వుండమనడమూ, రెండూ కూడా దైవఘటనలే! ఒక్కక్షణం ఆలోచించి చేతులో వున్న బట్టల మూట అలాగే కింద పడవేసి, "మీ అభిప్రాయం అల్లా వుంటే సరే ఉండిపోతాను!" అన్నాను. వెంటనే ఆ థీయిస్టిక్ హైస్కూల్లోనే 6 వ క్లాసులో రెండో అర్ధసంవత్సరంలో చేరాను. ఆ రోజుల్లో చదువులికి దేశమంతా ఒకటే పాఠ్యవిధానం వుండడంచేత స్కూలు మారడంవల్ల చదువు కేమీ ప్రతిబంధకం కలగలేదు. నాయుడుగారు నా విషయమై ఏలూరి లక్ష్మీనరసింహంగారికి శిఫారసు చేసి, 'విద్యార్థివేతనం' కూడా సంపాదించారు. ఇల్లాగ దైవికంగా రాజమహేంద్రవరంలో చదువుకి ప్రవేశించాను. ఈ సంగతి మా వాళ్ళకి ఉత్తరం వ్రాస్తే వాళ్ళు చాలా బాధపడ్డారు. కాని, నాయుడుగారితో వుండడంవల్ల వాళ్ల మనస్సులు కొంత సమాధానపరచుకున్నారు.

ఎదట కనిపించాను. ఆయనకి ఎక్కడలేని సంతోషమూ కలిగింది. ఆపైన కొంత సంభాషణ అయ్యాక "పోనీ నువ్వుకూడా ఇక్కడే చదువుకోరాదా?" అని అడిగారు. దానిమీద నేను, "మా వాళ్ళంతా అక్కడ వున్నారు కదా! నన్ను ఇక్కడ ఎవ్వరు చూస్తారు?" అన్నాను. దాని మీద ఆయన "అక్కడ మాత్రం ఎవ రున్నారు? మీ అమ్మగారూ, అమ్మమ్మగారూ కష్టపడవలసిందే గదా? ఇక్కడైతే నాతోపాటు తంటాలు పడకూడదా?" అని ఆప్యాయంగా అన్నారు.

ఒక్కక్షణం అట్టే ఆలోచించాను. నా జీవితంలో అది ఒక అపూర్వమైన ఘడియ! అదే ఈ జీవితం యావత్తూ ఇల్లాగ పరిణామం చెందడానికి మూలకారణమైన నిమిషం! "Life is a series of Accidents" అంటే జీవితమంతా "ఆకస్మిక ఘటనావళి" అనే మాటల్లో ఎంతో అర్థం వుంది. నాకు పడవే అంది, ఒంగోలు తిరిగి చేరితే జీవితం ఏమి అయి వుండేదో, ఎట్లా పరిణమించేదో పరమే శ్వరుడికే ఎరుక! నేను పడవ దాటిపోయి వెనక్కి రావడమూ, నాయుడు గారికి మనస్తాపం కలిగి నన్ను తమ దగ్గర వుండమనడమూ, రెండూ కూడా దైవఘటనలే! ఒక్కక్షణం ఆలోచించి చేతులో ఉన్న బట్టల మూట అలాగే కింద పడవేసి, "మీ అభిప్రాయం అల్లా వుంటే సరే ఉండిపోతాను!" అన్నాను. వెంటనే ఆ థీయిస్టిక్ హైస్కూల్లోనే 6 వ క్లాసులో రెండో అర్ధసంవత్సరంలో చేరాను. ఆ రోజుల్లో చదువులికి దేశమంతా ఒకటే పాఠ్యవిధానం వుండడంచేత స్కూలు మారడంవల్ల చదువు కేమీ ప్రతిబంధకం కలగలేదు. నాయుడుగారు నా విషయమై ఏలూరి లక్ష్మీనరసింహంగారికి శిఫారసు చేసి, 'విద్యార్థివేతనం' కూడా సంపాదించారు. ఇల్లాగ దైవికంగా రాజమహేంద్రవరంలో చదువుకి ప్రవేశించాను. ఈ సంగతి మా వాళ్ళకి ఉత్తరం వ్రాస్తే వాళ్ళు చాలా బాధపడ్డారు. కాని, నాయుడుగారితో వుండడంవల్ల వాళ్ల మనస్సులు కొంత సమాధానపరచుకున్నారు.

వరసకి, మా నాయనగారు ఏ పెద్దబళ్ళల్లోనూ చదవలేదు. ఏ డిగ్రీలు సర్టిఫికెట్లులూ పొందలేదు. జీతం ఎనిమిదిరూపాయలైనా, అప్పట్లో ఆయన ఆ చదువుతోటే ఎనిమిది ఊళ్ళపైన రెవిన్యూ అధికారు చేసి జీవనం చెయ్యగలిగారు. ఆ చదువు ఉపాధికి మార్గంగా ఉండేది. మా నాయనగారు చిన్ననాడు చదువుకున్న భారత భాగవతాలు నిరంతరమూ పారాయణ చేస్తూ, తమ ఆత్మోద్ధరణకి కృషి చేస్తూ వుండేవారు. మా అమ్మమ్మగారు, పెద్దత్తగారు ఎక్కువ చదువుకోకపోయినా, భారత భాగవత రామాయణాదికథలు యావత్తూ కంఠస్థంగా నేర్చుకుని, మమ్మల్ని ఒళ్ళో కూర్చోపెట్టుకుని అవన్నీ ఉపదేశం చేసేవారు. ఆ విద్యా విధానపు ఆదర్శం జాతీయమైనది; విశాలమైనది. ఈ నూతన విద్యకి ఆదర్శం నౌఖరీ, ధనసంపాదనా, స్వార్థమూనూ.

ఎప్పుడైతే మిడిల్‌స్కూళ్ళ చదువు పూర్తిచేసినవాళ్లూ, మెట్రిక్యులేషన్ పాసైనవాళ్లూ కూడా పెద్దపెద్ద ఉద్యోగస్థులై అమితంగా ధన సంపాదనలో పడ్డారో, అప్పుడే దేశంలో విద్యాదర్శాలు క్షీణించాయి. ఆంగ్లేయ పాలకులు కూడా తమ రాజ్యానికి వేళ్ళు పారించడానికి మన దేశీయ సంస్థల నన్నింటినీ క్రమక్రమంగా పెరలించారు. ఆ రోజుల్లో పంచాయితీ పద్ధతిని న్యాయ నిర్ణయం చేసుకోవడం అమలులో ఉండేది. ఆ పద్ధతి తొలగించి కోర్టుల పద్ధతి స్థాపించారు. దాంతో కాని మన పతనం ప్రారంభంకాదు. ఆ కోర్టులకి జడ్జీలూ, వకీళ్ళూ కావాలి గదా! అందుకోసం ముందుగా ఆంగ్లేయ పాలకులు మన సంఘంలో వుండే పెద్దల్ని ఏరి, వాళ్ళకి పెద్దపెద్ద పదవులుఅంటగట్టారు. క్రమంగా కొంచెం చదువు—అంటే ఏ మిడిల్‌స్కూలు చదువో—చదువుకుంటే జిల్లా మునసబీ అయ్యేది. అందుచేత దేశంలో వివేకవంతు లనబడే వాళ్ళ దృష్టి అటు మళ్ళింది. జనం ఇంగ్లీషు చదువులికి తియ్య నీటికి చేప లెక్కినట్లు ఎక్కారు. క్రమంగా మెట్రిక్యులేషను పాసయిన వాళ్ళ సంఖ్యా, ఎఫ్. ఏ. ల సంఖ్యా, బి. ఏ. ల సంఖ్యా పెరిగింది. దాంతో పాలకులు ప్లీడరీలకీ, నౌకరీలకీ అర్హతలు ఏర్పరిచారు. అప్పట్లో ఈ చదువుల్లోకి వెళ్ళినవాళ్ళంతా ఉద్యోగస్థులై

వరసకి, మా నాయనగారు ఏ పెద్దబళ్ళల్లోనూ చదవలేదు. ఏ డిగ్రీలు సర్టిఫికెట్టులూ పొందలేదు. జీతం ఎనిమిదియూపాయలైనా, అప్పట్లో ఆయన ఆ చదువుతోటే ఎనిమిది ఊళ్ళపైన రెవిన్యూ అధికారు చేసి జీవనం చెయ్యగలిగారు. ఆ చదువు ఉపాధికి మార్గంగా ఉండేది. మా నాయనగారు చిన్ననాడు చదువుకున్న భారత భాగవతాలు నిరంతరమూ పారాయణ చేస్తూ, తమ ఆత్మోద్ధరణకి కృషి చేస్తూ వుండేవారు. మా అమ్మమ్మగారు, పెద్దత్తగారు ఎక్కువ చదువుకోకపోయినా, భారత భాగవత రామాయణాదికథలు యావత్తూ కంఠస్థంగా నేర్చుకుని, మమ్మల్ని ఒళ్ళో కూర్చోపెట్టుకుని అవన్నీ ఉపదేశం చేసేవారు. ఆ విద్యా విధానపు ఆదర్శం జాతీయమైనది; విశాలమైనది. ఈ నూతన విద్యకి ఆదర్శం నౌఖరీ, ధనసంపాదనా, స్వార్థమూను.

ఎప్పుడైతే మిడిల్‌స్కూళ్ళ చదువు పూర్తిచేసినవాళ్లూ, మెట్రిక్యులేషన్ పాసైనవాళ్లూ కూడా పెద్దపెద్ద ఉద్యోగస్థులై అమితంగా ధన సంపాదనలో పడ్డారో, అప్పుడే దేశంలో విద్యాదర్శాలు క్షీణించాయి. ఆంగ్లేయ పాలకులు కూడా తమ రాజ్యానికి వేళ్ళు పారించడానికి మన దేశీయ సంస్థల నన్నింటినీ క్రమక్రమంగా పెకలించారు. ఆ రోజుల్లో పంచాయితీ పద్ధతిని న్యాయ నిర్ణయం చేసుకోవడం అమలులో ఉండేది. ఆ పద్ధతి తొలగించి కోర్టుల పద్ధతి స్థాపించారు. దాంతో కాని మన పతనం ప్రారంభంకాదు. ఆ కోర్టులకి జడ్జీలూ, వకీళ్ళూ కావాలి గదా! అందుకోసం ముందుగా ఆంగ్లేయ పాలకులు మన సంఘంలో వుండే పెద్దల్ని ఏరి, వాళ్ళకి పెద్దపెద్ద పదవులుఅంటగట్టారు. క్రమంగా కొంచెం చదువు—అంటే ఏ మిడిల్‌స్కూలు చదువో—చదువుకుంటే జిల్లా మునసబీ అయ్యేది. అందుచేత దేశంలో వివేకవంతు లనబడే వాళ్ళ దృష్టి అటు మళ్ళింది. జనం ఇంగ్లీషు చదువులికి తియ్య నీటికి చేప లెక్కినట్లు ఎక్కారు. క్రమంగా మెట్రిక్యులేషను పాసయిన వాళ్ళ సంఖ్యా, ఎఫ్. ఏ. ల. సంఖ్యా, బి. ఏ. ల సంఖ్యా పెరిగింది. దాంతో పాలకులు ప్లీడరీలకీ, నౌకరీలకీ అర్హతలు ఏర్పరిచారు. అప్పట్లో ఈ చదువుల్లోకి వెళ్ళినవాళ్ళంతా ఉద్యోగస్థులై

1886 లో నేను థీయిస్టిక్ హైస్కూలులో శివకుమారస్వామి శాస్త్రిగారి ప్రధానాధ్యాపకత్వం కింద, 5 వ క్లాసు చదివాను. ఆ రోజుల్లో హనుమంతరావు నాయుడుగారు నేనంటే ఎంతో ఆప్యాయంగా వుండే వారు. 1886 లో కమిటీ అధ్వర్యంకింద వుండే ఇన్నీసుపేట హైస్కూలు, ఏలూరి లక్ష్మి నరసింహంగారు స్థాపించిన థీయిస్టిక్ హైస్కూలూ కలిసిపోయాయి. ఇన్నీసుపేట హైస్కూలు కమిటీవాళ్లు స్కూలు, ఆధ్వర్యవమూ కూడా ఏలూరి లక్ష్మినరసింహంగారికే అప్పచెప్పారు. అల్లా ఏకమైన ఆ స్కూల్లో మెట్రిక్యులేషన్ చదివాను. ఆ స్కూలు మొదట కాలేజీదగ్గిర వుండే పూరి ఇంట్లో వుండేది. తరవాత అక్కడి నించి నాళంవారి సత్రానికి ఎదురుగా వున్న చిత్రపు నరసింహారావుగారి ఇంట్లోకి మార్చబడింది. ఆ స్కూలుకి వేదం వెంకటాచలంగారు ప్రధానోపాధ్యాయులుగా వుండేవారు.

# 6

## నాటకాలు

ఈ కాలంలో రాజమహేంద్రవరంలో కూడా నాటకాల గొడవ ప్రారంభం అయింది. నేను రాజమహేంద్రవరం చేరేసరికే కుందూరి వెంకటరత్నం, దాసు మాధవరావు ప్రభృతులు ఇంగ్లీషులో షేక్సుపియరు నాటకాలు ఆడుతూ వుండేవారు. మా హనుమంతరావు నాయుడుగారికి వుండే నాటకాల పిచ్చికి అంతం లేదుగదా! దాంతో దాటు మాకు పిల్లారిసెట్టి త్రియంబకరావు అనే ఒక కంట్రాక్టరు తోడైనాడు! అతను ఆనాటి నాటకాలకి కావలసిన డబ్బూ, హంగూ సమకూర్చేవాడు.

సుప్రసిద్ధకవిశేఖరులైన బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మినరసింహం గారు అప్పటికి మెట్రిక్యులేషను పాసయ్యారో లేదో జ్ఞాపకం లేదు. అప్పటికి ఆయనదృష్టి ఇంకా బాగానే వుండేది; కళ్ళు జబ్బుగా వుండ డమే గాని అంధత్వం రాలేదు. అప్పట్లో ఆయనకి అంత ప్రసిద్ధిలేదు.

వరసకి, మా నాయనగారు ఏ పెద్దబళ్ళల్లోనూ చదవలేదు. ఏ డిగ్రీలు సర్టిఫికెట్టులూ పొందలేదు. జీతం ఎనిమిదిరూపాయలైనా, అప్పట్లో ఆయన ఆ చదువుతోటే ఎనిమిది ఊళ్ళపైన రెవిన్యూ అధికారం చేసి జీవనం చెయ్యగలిగారు. ఆ చదువు ఉపాధికి మార్గంగా ఉండేది. మా నాయనగారు చిన్ననాడు చదువుకున్న భారత భాగవతాలు నిరంతరమూ పారాయణ చేస్తూ, తమ ఆత్మోద్ధరణకి కృషి చేస్తూ వుండేవారు. మా అమ్మమ్మగారు, పెద్దత్తగారు ఎక్కువ చదువుకోకపోయినా, భారత భాగవత రామాయణాదికథలు యావత్తూ కంఠస్థంగా నేర్చుకుని, మమ్మల్ని ఒళ్ళో కూర్చోపెట్టుకుని అవన్నీ ఉపదేశం చేసేవారు. ఆ విద్యా విధానపు ఆదర్శం జాతీయమైనది; విశాలమైనది. ఈ నూతన విద్యకి ఆదర్శం నౌఖరీ, ధనసంపాదనా, స్వార్థమూనూ.

ఎప్పుడైతే మిడిల్‌స్కూళ్ళ చదువు పూర్తిచేసినవాళ్లూ, మెట్రిక్యులేషన్ పాసైనవాళ్లూ కూడా పెద్దపెద్ద ఉద్యోగస్థులై అమితంగా ధన సంపాదనలో పడ్డారో, అప్పుడే దేశంలో విద్యాదర్శాలు క్షీణించాయి. ఆంగ్లేయ పాలకులు కూడా తమ రాజ్యానికి వేళ్ళు పారించడానికి మన దేశీయ సంస్థల నన్నింటినీ క్రమక్రమంగా పెకలించారు. ఆ రోజుల్లో పంచాయితీ పద్ధతిని న్యాయ నిర్ణయం చేసుకోవడం అమలులో ఉండేది. ఆ పద్ధతి తొలగించి కోర్టుల పద్ధతి స్థాపించారు. దాంతో కాని మన పతనం ప్రారంభంకాదు. ఆ కోర్టులకి జడ్జీలూ, వకీళ్ళూ కావాలి గదా! అందుకోసం ముందుగా ఆంగ్లేయ పాలకులు మన సంఘంలో వుండే పెద్దల్ని ఏరి, వాళ్ళకి పెద్దపెద్ద పదవులుఅంటగట్టారు. క్రమంగా కొంచెం చదువు—అంటే ఏ మిడిల్‌స్కూలు చదువో—చదువుకుంటే జిల్లా మునసబీ అయ్యేది. అందుచేత దేశంలో వివేకవంతు లనబడే వాళ్ళ దృష్టి అటు మళ్ళింది. జనం ఇంగ్లీషు చదువులికి తియ్య నీటికి చేప లెక్కినట్లు ఎక్కారు. క్రమంగా మెట్రిక్యులేషను పాసయిన వాళ్ళ సంఖ్యా, ఎఫ్. ఏ. ల సంఖ్యా, బి. ఏ. ల సంఖ్యా పెరిగింది. దాంతో పాలకులు ప్లీడరీలకీ, నౌకరీలకీ అర్హతలు ఏర్పరిచారు. అప్పట్లో ఈ చదువుల్లోకి వెళ్ళినవాళ్ళంతా ఉద్యోగస్థులై

మహేంద్రవరం ఎందుకు వచ్చానో జ్ఞప్తికి తెచ్చుకుని ప్రైవేటుగా మెట్రిక్యులేషన్ చదివిపాసయ్యాను.

ఈ సందర్భంలో సాధారణంగా లోకదృష్టిలో నాటకాలు నా జీవితానికి చేసిన మంచిచెడ్డలు చర్చించడం చాలా అవసరము. నాయుడు పేటలోనూ, ఒంగోలులోనూ ఉన్నప్పుడు నాటకాలప్రవృత్తి నన్ను ఒక విధంగా చిన్నతనపు చిలిపిచేష్టలనించి తప్పించింది. కాని, ఆకతాయిలతో సాహచర్యం కలిగింది. నా జీవితప్రారంభంనించేకూడా బహుశః ఒక అదృష్టం నన్ను వెంటాడిస్తోందని చెప్పాలి. స్నేహాలవల్ల, సాహచర్యాలవల్ల జీవితం అధఃపాతాళంలోకి పడిపోయే పరిస్థితులలో పడడమూ, మళ్ళీ వాటిల్లోనించి దైవికంగా తప్పుగుని బయట పడడమూ జరుగుతోంది. అదే ఈ నాటకాల ప్రకరణంలో కూడా జరిగింది. రాజమహేంద్రవరం నాటకాలలో కూడా ఇదే జరిగింది. నా నాటకాలలో అభినయనైపుణ్యం చూసి పేరుపొందిన పెద్దలంతా, మన్నించి, హర్షించే వారు.

మేము ఆ రోజుల్లో ప్రస్తుతం టౌనుహాలుకి తూర్పున ఉన్న పెద్ద ఖాళీస్థలంలో తాత్కాలికంగా ఒక పెద్ద నాటకపు హాలు నిర్మించాము. ఒకసారి మేము అందులో నాటకం ఆడుతూవుంటే, సుప్రసిద్ధ న్యాయవాదులై, కాంగ్రెసు అధ్యక్షపదవి అలంకరించిన పి. ఆనందాచార్యులుగారు వచ్చి చూశారు. ఆయన అప్పుడు పిఠాపురంవారి కేసు సందర్భంలో వచ్చారు. అప్పుడు నా అభినయానికి మెచ్చి ఏదో బహుమతీ కూడా ఇచ్చారు. ఆ మెప్పు అలా వుండగా ఆ సంవత్సరం 1887 లో మెట్రిక్యులేషన్ తప్పింది! క్రమంగా రౌడీలతో స్నేహం చేసి కొట్లాటలు, కక్షల్లో పడ్డాను.

ఇంతకన్నా ప్రమాదమైనది నా నైతికప్రవర్తన. నేను నా అభినయంవల్ల నాకు తెలియకుండానే కొందరు అమాయికస్త్రీల మనస్సులు కలవరపెట్టాను. ఆ కలవరంలో నేను కూడా ప్రమాదంలో పడ్డాను. చారిత్రిక పౌరాణిక నాటకాలవల్ల నటకుల్లోనూ, ప్రేక్షకుల్లోనూ కొంత జాతీయతా, స్వాతంత్ర్యభావమూ హెచ్చినా నైతికంగా కొన్ని ప్రమా

మహేంద్రవరం ఎందుకు వచ్చానో జ్ఞప్తికి తెచ్చుకుని ప్రైవేటుగా మెట్రిక్యులేషన్ చదివిపాసయ్యాను.

ఈ సందర్భంలో సాధారణంగా లోకదృష్టిలో నాటకాలు నా జీవితానికి చేసిన మంచిచెడ్డలు చర్చించడం చాలా అవసరము. నాయుడు పేటలోనూ, ఒంగోలులోనూ ఉన్నప్పుడు నాటకాలప్రవృత్తి నన్ను ఒక విధంగా చిన్నతనపు చిలిపిచేష్టలనించి తప్పించింది. కాని, ఆకతాయిలతో సాహచర్యం కలిగింది. నా జీవితప్రారంభంనించేకూడా బహుశః ఒక అదృష్టం నన్ను వెంటాడిస్తోందని చెప్పాలి. స్నేహాలవల్ల, సాహచర్యాలవల్ల జీవితం అధఃపాతాళంలోకి పడిపోయే పరిస్థితులలో పడడమూ, మళ్ళీ వాటిల్లోనించి దైవికంగా తప్పుకుని బయట పడడమూ జరుగుతోంది. అదే ఈ నాటకాల ప్రకరణంలో కూడా జరిగింది. రాజమహేంద్రవరం నాటకాలలో కూడా ఇదే జరిగింది. నా నాటకాలలో అభినయనైపుణ్యం చూసి పేరుపొందిన పెద్దలంతా, మన్నించి, హర్షించేవారు.

మేము ఆ రోజుల్లో ప్రస్తుతం టౌనుహాలుకి తూర్పున ఉన్న పెద్ద ఖాళీస్థలంలో తాత్కాలికంగా ఒక పెద్ద నాటకపు హాలు నిర్మించాము. ఒకసారి మేము అందులో నాటకం ఆడుతూవుంటే, సుప్రసిద్ధ న్యాయవాదులై, కాంగ్రెసు అధ్యక్షపదవి అలంకరించిన పి. ఆనందాచార్యులుగారు వచ్చి చూశారు. ఆయన అప్పుడు పిఠాపురంవారి కేసు సందర్భంలో వచ్చారు. అప్పుడు నా అభినయానికి మెచ్చి ఏదో బహుమతీ కూడా ఇచ్చారు. ఆ మెప్పు అల్లా వుండగా ఆ సంవత్సరం 1887 లో మెట్రిక్యులేషన్ తప్పింది! క్రమంగా రౌడీలతో స్నేహం చేసి కొట్లాటలు, కక్షల్లో పడ్డాను.

ఇంతకన్నా ప్రమాదమైనది నా నైతికప్రవర్తన. నేను నా అభినయంవల్ల నాకు తెలియకుండానే కొందరు అమాయికస్త్రీల మనస్సులు కలవరపెట్టాను. ఆ కలవరంలో నేను కూడా ప్రమాదంలో పడ్డాను. చారిత్రిక పౌరాణిక నాటకాలవల్ల నటకుల్లోనూ, ప్రేక్షకుల్లోనూ కొంత జాతీయతా, స్వాతంత్ర్యభావమూ హెచ్చినా నైతికంగా కొన్ని ప్రమా

ఉండేవాళ్ళము. అందులో నేను మంచి ఆటగాడి కిందే లెఖ్క. ఇక దీపావళి పండుగ రోజులసంగతి చెప్పనే అక్కరలేదు. పండుగనాడు రకరకాల బాణా సంచాలతో యుద్ధాలు సాగపలసిందే! పండుగ పది రోజులు వుంది అనగా ఈ మందుగుండు సామాను తయారు చేసి పార్టీలకి సవాళ్ళు చేసేవాళ్ళము. నేను ఈలాంటి ఒడుదుడుకు పరిస్థితుల్లో చదువుకుంటూ వుండేవాణ్ణి.

అప్పట్లో రాజమహేంద్రవరంలో రౌడీజట్లు బాగా వుండేవి. పెద్దమనుష్యు లనుకునే వాళ్ళల్లో చాలామందికి ఈ రౌడీలతో సంబంధాలు వుండేవి. చూస్తూ వుండగా ఏ వీథిలోనో రెండుపార్టీలు తటస్థపడి అమాంతంగా ఒకళ్ళని ఒకళ్ళు పడపడ కొట్టుకుంటూ వుండేవాళ్ళు. నేను కూడా ఈ పార్టీల గందరగోళంలో పడ్డాను. ఆ పడడంలో సంఘంలో కింద్రశ్రేణిలో వుండే జనంతో సంపర్కం కలగడంలో ఆశ్చర్యం ఏమి వుంది? చేపలు పట్టుకుని జీవించే బెస్తలతోనూ, వాళ్ళ నాయకులతోనూ చేతులు కలపవలసి వచ్చింది. వాళ్ళ అభిమానం సంపాదించడానికి వాళ్ళ యిళ్ళకికూడా వెళ్ళేవాణ్ణి. వాళ్లు కల్లు తాగుతూ వుంటే పక్కని వుండవలిసిన అవస్థ కూడా కలిగేది. కాని, యెన్నడూ అది ముట్టుకోవాలనే ధోరణిమాత్రం కలగలేదు.

ఈ కాలంలోనే నాకొక బ్రహ్మాండమైన గండం తప్పింది. ఒక సారి గోదావరి మంచి వరదలో వున్నప్పుడు నేనూ కొంతమంది స్నేహితులూ కలిసి ఒక చిన్న పడవ ఏట్లోకి తోసుకువెళ్ళాము. తెడ్డు ఒకటే దానికి చుక్కాని. నేను చుక్కానిదగ్గిర వున్నాను. పడవ కోటి లింగాలదాకా బాగా ఎగువుకి పోనిచ్చి ఏట్లోకి వాలుగా ఒదిలి వేశాము. నావ ప్రవాహంలో మంచి జోరుగా వస్తూ వుంటే నా చేతిలో వున్న చుక్కాని జారిపోయింది. దానికోసం నేను గభాలున ఏట్లోకి దూకాను. దాంతో నా స్నేహితులు కంగారు పడ్డారు. నేను తెడ్డు పట్టుకుని పడవ దగ్గిరికి చేరాను; కాని పడవ యెక్కలేకపోయాను. పడవలో వున్న స్నేహితులు నన్ను చూసి కంగారు పడడమే కాని తెడ్డు చేతి కందివ్వాలని యెవరూ అనుకోలేదు. నేను అల్లాగే ఒకటిరెండు సార్లు పడవ

ఉండేవాళ్ళము. అందులో నేను మంచి ఆటగాడి కిందే లెఖ్క. ఇక దీపావళి పండుగ రోజులుసంగతి చెప్పనే అక్కరలేదు. పండుగనాడు రకరకాల బాణా సంచాలతో యుద్ధాలు సాగవలసిందే! పండుగ పది రోజులు వుంది అనగా ఈ మందుగుండు సామాను తయారు చేసి పార్టీలకి సవాళ్ళు చేసేవాళ్ళము. నేను ఈలాంటి ఒడుదుడుకు పరిస్థితుల్లో చదువుకుంటూ వుండేవాణ్ణి.

అప్పట్లో రాజమహేంద్రవరంలో రౌడీజట్లు బాగా వుండేవి. పెద్దమనుష్యు లనుకునే వాళ్ళల్లో చాలామందికి ఈ రౌడీలతో సంబంధాలు వుండేవి. చూస్తూ వుండగా ఏ వీథిలోనో రెండుపార్టీలు తటస్థపడి అమాంతంగా ఒకళ్ళని ఒకళ్ళు పడపడ కొట్టుకుంటూ వుండేవాళ్ళు. నేను కూడా ఈ పార్టీల గందరగోళంలో పడ్డాను. ఆ పడడంలో సంఘంలో కిందశ్రేణిలో వుండే జనంతో సంపర్కం కలగడంలో ఆశ్చర్యం ఏమి వుంది? చేపలు పట్టుకుని జీవించే బెస్తలతోనూ, వాళ్ళ నాయకులతోనూ చేతులు కలపవలసి వచ్చింది. వాళ్ళ అభిమానం సంపాదించడానికి వాళ్ళ యిళ్ళకికూడా వెళ్ళేవాణ్ణి. వాళ్లు కల్లు తాగుతూ వుంటే పక్కని వుండవలిసిన అవస్థ కూడా కలిగేది. కాని, యెన్నడూ అది ముట్టుకోవాలనే ధోరణిమాత్రం కలగలేదు.

ఈ కాలంలోనే నాకొక బ్రహ్మాండమైన గండం తప్పింది. ఒక సారి గోదావరి మంచి వరదలో వున్నప్పుడు నేనూ కొంతమంది స్నేహితులూ కలిసి ఒక చిన్న పడవ ఏట్లోకి తోసుకువెళ్ళాము. తెడ్డు ఒకటే దానికి చుక్కాని. నేను చుక్కానిదగ్గిర వున్నాను. పడవ కోటి లింగాలదాకా బాగా ఎగువుకి పోనిచ్చి ఏట్లోకి వాలుగా ఒదిలి వేశాము. నావ ప్రవాహంలో మంచి జోరుగా వస్తూ వుంటే నా చేతిలో వున్న చుక్కాని జారిపోయింది. దానికోసం నేను గభాలున ఏట్లోకి దూకాను. దాంతో నా స్నేహితులు కంగారు పడ్డారు. నేను తెడ్డు పట్టుకుని పడవ దగ్గిరికి చేరాను; కాని పడవ యెక్కలేకపోయాను. పడవలో వున్న స్నేహితులు నన్ను చూసి కంగారు పడడమే కాని తెడ్డు చేతి కందివ్వా లని యెవరూ అనుకోలేదు. నేను అల్లాగే ఒకటిరెండు సార్లు పడవ

రిజిష్ట్రారు ఆఫీసులో రెండో గుమస్తాపనికి దరఖాస్తు చేశాను. జీతం 14 రూపాయలు. నేను దరఖాస్తు చేసినట్లుగానే సబ్‌రిజిష్ట్రారుగారు నా దస్తూరీ పరీక్ష చెయ్యాలనీ, తెలివితేటలు చూడ్డం నిమిత్తమై ఒకసారి తనని చూడవలసిందనీ నోటీసు చేశారు. ఆ నోటీసు నా ఆత్మగౌరవానికి భంగకర మని తోచింది. నేను "మెట్రిక్యులేషన్ పాసు అయినట్టు సర్టిఫికెట్టు ఉండగా మళ్ళీ ఈ పరీక్ష ఏమిటి? నీ వుద్యోగం నా కక్కరలేదు పో"మ్మని జవాబు వ్రాశాను. దాంతో ఆ వుద్యోగం తప్పింది. ఏ మనిషి జీవితంలో నైనా యిల్లాంటి స్వల్పవిషయాలతోనే జీవిత పంథా మారిపోతూ వుంటుంది. బహుశః ఆనాడు నేను సబ్ రిజిష్ట్రారు ఆఫీసులో చేరివుంటే ఏమయ్యేవాణ్ణో! చెప్పడం కష్టము.

నేను మెట్రిక్యులేషన్ మొదటి సంవత్సరం చదువుతూ వుండగానే యిక్కడ రౌడీలతో స్నేహం చేస్తున్నాననీ, నాటకాల్లో తిరుగుతున్నాననీ, చదువు గుంటపెట్టి గంట వాయిస్తున్నాననీ మా అమ్మగారికీ, బావగారికీ, బంధువులికీ తెలిసింది. ఈ విషయం మా అమ్మగారిని చాలా బాధపెట్టింది. నాకు వండిపెట్టడానికి వచ్చిన మా అమ్మమ్మగారు కూడా నా అవస్థ చూసి బాధపడుతూ వుండేది. నేను 5 వ క్లాసు చదువుతూ ఉండగానే మా అమ్మగారు నాకు వివాహం చెయ్యాలని సంకల్పించింది. ఆవంకనైనా దూరాన్ని వున్న నేను అక్కడ ఎక్కడో వుండి పాడైపోకుండా ఇంటికి వస్తానేమో నని ఆమె ఆశ.

నేను రాజమహేంద్రవరం వచ్చాక, మా కుటుంబానికి ఇంకొక ఆపత్తు వచ్చింది. మా పెద్దక్కయ్య జానికమ్మగారు చనిపోయింది. అప్పటికి ఆవిడికి చాలామంది పిల్లలు పుట్టి పోయారు. చివరికి హనుమాయమ్మ అనే పిల్ల ఒక్కర్తే మిగిలింది. ఆవిడ చనిపోయేటప్పుడు మా అమ్మగారిని దగ్గిరికి పిలిచి ఆ పిల్లని ఆవిడ చేతుల్లో పెట్టి పిల్లని జాగ్రత్తగా పెంచమనీ, ప్రకాశాని కిచ్చి పెళ్ళి చెయ్యమనీ చెప్పింది. అందుచేత హనుమాయమ్మ నిచ్చి నాకు పెళ్ళి చెయ్యాలని మా అమ్మగారు ఆత్రతపడింది. కాని రాజమహేంద్రవరంలో నాకు వచ్చిన పేరుప్రతిష్ఠలు విని మా బావగారు మాత్రం నాకు పిల్లని ఇవ్వ

దానికి సందేహించారు. చివరికి మెట్రిక్యులేషన్ పాసయ్యాక కొంత ధైర్యం వచ్చి, మా బావగారు నాకు కూతుర్ని ఇవ్వడానికి అంగీకరించారు.

మా అమ్మగారు అద్దంకిలో వివాహం చెయ్యడానికి నిశ్చయించి ముహూర్తం పెట్టించి, కబురు పంపించింది. నేను మా అమ్మమ్మ గారిని ముందు పంపించి 1890 ఫిబ్రవరిలోనో, మార్చిలోనో అద్దంకి చేరాను. రాజమహేంద్రవరంనించి బెజవాడదాకా కాలవమీద వచ్చి, అక్కడినించి గుంటూరుమీదుగా అంచెబళ్ళమీద అద్దంకి చేరుకున్నాను. వివాహం చాలా సామాన్యంగా జరిగింది. కావలసిన బంధువులు నలుగురూ వచ్చి ఐదురోజులూ పెళ్ళి సులువుగా తేల్చారు. మా అమ్మగారు నా పెళ్ళితోబాటు మా చెల్లెలు అన్నపూర్ణ పెళ్ళి కూడా చేసింది. అప్పటికి అన్నపూర్ణకి సుమారు 8 సంవత్సరాల వయస్సు వుంటుంది. మా అమ్మగారు మా పెద్దఅప్పగారు చనిపోయింది కనక అన్నపూర్ణని మా బావగారికే ఇచ్చి వివాహం చేసింది. నేను పెళ్ళికి వచ్చేసరికే మా అమ్మగారు కార్యక్రమం యావత్తూ నిర్ణయించింది. మొత్తంమీద నా అభిప్రాయా లెల్లా వున్నా పెళ్ళి జరిగిపోయింది.

నా వివాహం అయిన వెంటనే మళ్ళీ కాలేజీలో చేరడానికి రాజమహేంద్రవరం వచ్చాను. అప్పటికి యమ్. యస్. యమ్. రైల్వే లైను వేస్తున్నారు. ఆ రోజుల్లో బెజవాడనించి సంతమాగులూరువరకూ రైలు పడింది. నాకు యఫ్. ఏ. పుస్తకాలు ఒక మోపెడు వుండేవి. అవన్నీ ఒక మనిషి నెత్తిని పెట్టి, మా ఊరినించి నడిచి, సంతమాగులూరు వచ్చి, అక్కడ రైలెక్కి, బెజవాడ చేరి, మళ్ళీ పడవమీద రాజమహేంద్రవరం చేరుకున్నాను. వివాహసందర్భంలో నేను చెప్పవలసిందల్లా ఆనాటి పెళ్ళిళ్ళసొంపు. పెళ్ళి అంటే వేలకివేలు మూట కట్టుకుని బెంగపడవలసిన అవసరం వుండేది కాదు. అయిదురోజులు పెళ్ళి అయినా నలుగురూ కలిసి పనిచెయ్యడంవల్ల సూక్ష్మంగా తేలిపోయేది. లక్షాధికారులైనా పల్లెటూళ్ళో ఉన్న భజంత్రీలమేళం, పల్లకీ, రామ డోళ్ళు మాత్రమే కుదుర్చుకునేవారు. భిక్షాధికారులైనా అంతే! వంట బ్రాహ్మణుల ఆర్భాటాలూ అవీ ఏమీ లేవు. తరవాత నా చేతిమీదుగా

నేను మా కుటుంబంలో అయితే ఏమి,—హనుమంతరావు నాయుడు గారి కుటుంబంలో అయితే ఏమి—అనేక వివాహాలు చేయించాను. ఈ వివాహాల్లో ఆర్భాటమూ, ఆడంబరమూ, శ్రమేకాని,ఆనాటి సౌలభ్యమూ, సౌఖ్యమూలేవని అనిపిస్తోంది.

ఈ కాలంలో నా సహాధ్యాయుల్నిగురించీ, సహచరుల్నిగురించీ కొంచెం వ్రాస్తాను. నేటి సర్ కె. వి. రెడ్డినాయుడు నేను రాజ మహేంద్రవరంలో చదువుకి ప్రవేశించి నప్పటినించీ కూడా నా సహా ధ్యాయి. అతని తండ్రిగారు అప్పట్లో తాలూకా కచ్చేరీలో చిన్న బంట్రోతుగా వుండేవారు. అతను అరుగుమీద కూర్చుని చదువుకో వడం నా కిప్పటికీ జ్ఞాపకం వుంది. అతనైతే క్లాసులో'Good boy' అంటే—'మంచి పిల్లవాడి' కిందే లెఖ్ఖ. నేను నా సహాధ్యాయుల్ని ఏదో విధంగా అదమాయిస్తూ వుండేవాణ్ణి. ఇన్ని సంవత్సరా లయిన తరవాత ఈ విషయాలు జ్ఞాపకం చేసుకుని వ్రాయడానికి నేను చాలా గర్వపడుతున్నాను. నా మిత్రుడు కూడా అల్లాగే గర్వపడతాడని అనుకుంటాను. "ఎటువంటి సామాన్య పరిస్థితుల్లోనించి మేము నిగ్ర హించుకు వచ్చాము!" అని తలచుకున్నప్పుడు ఇదంతా నాకే ఆశ్చ ర్యంగా వుంటుంది. తరవాత మునిసిపల్ వ్యవహారాల్లో వెంకటరెడ్డి నాకు కొంచెం దూరం అయ్యాడు. క్రమంగా రాజకీయాల్లో మేము యింకా దూరులమై ఇప్పుడు కేవలమూ ప్రతికూల రాజకీయ పక్షాల్లో వున్నాము. కాని, వ్యక్తిగతంగా నా మనస్సులో వున్న ఆనాటి ప్రేమ కేమీ కొరత కలగలేదు. అతనికీ అల్లాగే వుంటుందని నమ్ముతున్నాను.

మహమ్మదుబజులుల్లా సాహేబుకూడా నాకు సహాధ్యాయి. అతను ఎంతెంత పుస్తకాలైనా బట్టీ పట్టడంలో మంచి ఘనుడు; ఇంగ్లీషు బాగా వ్రాస్తాడనే ప్రతీతి వుండేది. అతను బి. ఏ. అయి, సర్వీసులో పడి పోయాడు గనక, ఆ పైన మాకు అంతగా సంబంధం లేకపోయింది. ఇక రాజమహేంద్రవరంలో ఇప్పటికీ జీవించి ఉన్న సారంగు భీమ శంకరం కూడా నా సహచరుడే. అతని తమ్ముడు సోమసుందరమూ, నేనూ సహాధ్యాయులము. భీమశంకరం మాకన్న పెద్దక్లాసులో చది

నేను మా కుటుంబంలో అయితే ఏమి,—హనుమంతరావు నాయుడు గారి కుటుంబంలో అయితే ఏమి—అనేక వివాహాలు చేయించాను. ఈ వివాహాల్లో ఆర్భాటమూ, ఆడంబరమూ, శ్రమేకాని,ఆనాటి సౌలభ్యమూ, సౌఖ్యమూలేవని అనిపిస్తోంది.

ఈ కాలంలో నా సహాధ్యాయుల్నిగురించీ, సహచరుల్నిగురించీ కొంచెం వ్రాస్తాను. నేటి సర్ కె. వి. రెడ్డినాయుడు నేను రాజ మహేంద్రవరంలో చదువుకి ప్రవేశించి నప్పటినించీ కూడా నా సహాధ్యాయి. అతని తండ్రిగారు అప్పట్లో తాలూకా కచ్చేరీలో చిన్న బంట్రోతుగా వుండేవారు. అతను అరుగుమీద కూర్చుని చదువుకో వడం నా కిప్పటికీ జ్ఞాపకం వుంది. అతనైతే క్లాసులో 'Good boy' అంటే—'మంచి పిల్లవాడి' కిందే లెఖ్ఖ. నేను నా సహాధ్యాయుల్ని ఏదో విధంగా అదమాయిస్తూ వుండేవాణ్ణి. ఇన్ని సంవత్సరా లయిన తరవాత ఈ విషయాలు జ్ఞాపకం చేసుకుని వ్రాయడానికి నేను చాలా గర్వపడుతున్నాను. నా మిత్రుడు కూడా అల్లాగే గర్వపడతాడని అనుకుంటాను. "ఎటువంటి సామాన్య పరిస్థితుల్లోనించి మేము నిగ్ర హించుకు వచ్చాము!" అని తలచుకున్నప్పుడు ఇదంతా నాకే ఆశ్చ ర్యంగా వుంటుంది. తరవాత మునిసిపల్ వ్యవహారాల్లో వెంకటరెడ్డి నాకు కొంచెం దూరం అయ్యాడు. క్రమంగా రాజకీయాల్లో మేము యింకా దూరులమై ఇప్పుడు కేవలమూ ప్రతికూల రాజకీయ పక్షాల్లో వున్నాము. కాని, వ్యక్తిగతంగా నా మనస్సులో వున్న ఆనాటి ప్రేమ కేమీ కొరత కలగలేదు. అతనికీ అల్లాగే వుంటుందని నమ్ముతున్నాను.

మహమ్మదుబజులుల్లా సాహేబుకూడా నాకు సహాధ్యాయి. అతను ఎంతెంత పుస్తకాలైనా బట్టీ పట్టడంలో మంచి ఘనుడు; ఇంగ్లీషు బాగా వ్రాస్తా డనే ప్రతీతి వుండేది. అతను బి. ఏ. అయి, సర్వీసులో పడి పోయాడు గనక, ఆ పైన మాకు అంతగా సంబంధం లేకపోయింది. ఇక రాజమహేంద్రవరంలో ఇప్పటికీ జీవించి ఉన్న సారంగు భీమ శంకరం కూడా నా సహచరుడే. అతని తమ్ముడు సోమసుందరమూ, నేనూ సహాధ్యాయులము. భీమశంకరం మాకన్న పెద్దక్లాసులో చది

వాడు. చిన్నప్పుడే అతనికి ఈ దేశంలో పెద్దపెద్ద పరిశ్రమలు సాగిం చాలని ఉండేది. పెద్దవాడయ్యాక వాటికోసం అనేక ప్రయత్నాలు చేసి కొంత డబ్బు ఖర్చుపెట్టాడు. రాజమహేంద్రవరానికి అతను మహత్తరమైన సేవ చేశాడు. అతని ఆత్మకి శాంతి కలుగుగాక!

నాకు ఇంకా జ్ఞాపకం చేసుకుంటూ ఉంటే చిట్టూరి సూరయ్యప్రభృతులు స్ఫురణకి వస్తున్నారు. వాళ్ళందరిని గురించీ వ్రాయడానికి ఈ సందర్భంలో అవకాశంలేదు కాని, లేకపోతే వ్రాసేవాణ్ణే. వాళ్ళలో ఎవరైనా జీవించి ఉంటే దీనికి అన్యథా భావించరని నమ్ముతున్నాను. మొత్తంమీద, అప్పటైన స్నేహితుల మధ్య వాళ్ళందరికీ ఇష్టుడుగా ఉంటూ కులాసాగా విద్యార్థి దశ పూర్వభాగం గడిపివేశాను.

ఇంక కాలేజీచదువు మాట, 1890 ఫిబ్రవరిలో రాజమహేంద్రవరం ఆర్ట్సుకాలేజీలో యఫ్. ఏ. క్లాసులో జేరాను. మళ్ళీ ఆ కాలేజీలో చేరడానికి కారకుడు హనుమంతరావు నాయుడుగారే! తమజీతం 30 రూపాయిలే అయినా, ఒక పెద్దకుటుంబం భరించవలిసి వచ్చినా, మరి ఎల్లాగ తంటాలు పడేవారో ఆయనకే తెలియాలి! ఆ పరమేశ్వరుడికే తెలియాలి! నేను "ఈ చదువు గట్టెక్కడం ఎల్లాగ?" అని ఆత్రత పడుతూంటే ఆయన ఎల్లాగో డబ్బు సంపాదించి ఇస్తూ ఉండేవారు. యఫ్. ఏ. లో ప్రవేశించడానికి కావలిసిన జీతంకూడా అల్లాగే ఇచ్చారు; దానికి ఆయన ఇంట్లోవాళ్ళు సహజంగా కొంత బాధపడేవాళ్ళు. ఆయన భార్య లక్ష్మమ్మగారు మాత్రం మహాఇల్లాలు. హనుమంతరావు నాయుడుగారు నన్ను తన బిడ్డలకంటె కూడా ఎక్కువగా ఆదరిస్తూ ఉంటే, ఆమె కొంచెం అయినా బాధపడేది కాదు. నాయుడుగారి తల్లి కొంత మమకారంతో ఏదో బాధపడేది కాని నాయుడుగారు లెఖ్ఖపెట్టేవారు కారు; వాళ్ళకి ఏదో విధంగా సమాధానం చెప్పేవారు. ఆయనా నేనూ కలుసుకున్న వేళావిశేషం ఎట్లాంటిదోగాని ఆయనకి నేనంటే అంత వాత్సల్యం ఉండేది.

అప్పట్లో, మా కాలేజీ పరిస్థితులు కొంచెం వ్రాస్తాను. కాలేజీ ప్రిన్సిపాల్ మహావిద్యావేత్త అయిన మెట్కాఫ్. ఒక్క రాజమహేంద్ర

వరంలోనే కాక, ఆంధ్రదేశంలో ఉన్న ఆంగ్లవిద్యావంతు లెందరో ఆయనకి కృతజ్ఞులై ఉండాలి. ఆయన విద్యార్థుల్ని తనబిడ్డలకంటే కూడా ఎంతో అప్యాయంగా చూసుగునేవాడు. ఆయన లెఖ్ఖలూ, ఇంగ్లీషూ, షేక్సుపియరూ కూడా అత్యద్భుతంగా చెప్పేవాడు. ఆ ఆ రోజుల్లో హెన్సుమన్ అనే అత నొక ప్రొఫెసర్‌గా వుండేవాడు. యమ్. రంగాచారిగారు కూడా ఒక ప్రొఫెసరే. ఆయన ఇంగ్లీషు చెప్పే వాడు అనుకుంటాను. రామలింగయ్యరు అనే ప్రొఫెసరు ఫిజిక్సు చెప్పే వాడు. బజులుల్లాలాగ నాకు బట్టీ పట్టే అలవాటు వుండేదికాదు. చదువు మీద కూడా అంతగా శ్రద్ధ వుండేదికాదు. కాని చదివిన కాస్సేపూ ఏకా గ్రతతో చదివి ప్రొఫెసర్ల అభిమానం సంపాదించేవాణ్ణి.

ఆ రోజుల్లో చదువు చాలా హెచ్చుస్థాయిలో వుండేది. ఎఫ్. ఏ. క్లాసులోనే ఇంగ్లీషులో చాసరు, డీక్వెన్సీ, కార్లైలు మొదలయినవారి వుద్గ్రంథాలన్నీ చెప్పేవారు. హిష్టరీలో ప్రపంచ చరిత్ర అంతా పూర్ణంగా చెప్పేవారు. లెఖ్ఖలలో ట్రిగ్నామెట్రీ, ఆల్జీబ్రా బాగా బోధించేవారు. అప్లయిడ్ సైన్సెస్ కూడా బాగా చెప్పేవారు. అన్నిటికన్నా ముఖ్యంగా మెట్కాఫ్ వడ్రంగం మొదలయిన చేతిపనులుకాలేజీలోఅందరికీ నేర్పించే వాడు. ఆయన దానికి కారణంగా "నీ ఇంటి సామాగ్రి నువ్వు చేసు కోవడమూ, నీ ఇల్లు నువ్వు కట్టుకోవడమూ నేర్చుకోవా"లని చెప్పే వాడు; తన శిష్యకోటిలో జాతీయాభిమానమూ, జాతీయసంప్రదాయమూ బాగా వృద్ధిచేసేవాడు.

ఈ కాలంలోనే నాకు బాగా గట్టైన తగాదాలూ, కొట్లాటలూ సంభవించాయి. నా భవిష్యత్తు విషయంలో ఎంతో ఆశ పెట్టుకున్న హనుమంతరావు నాయుడుగారికి ఇతర బంధుమిత్రులికీ ఎంతో ఆదుర్దా కలగజేశాను. కొట్లాటలు, కేసులు, ఒకటేమిటి? తెల్లవారి లేస్తే రాత్రి అయ్యేలోగా ఏమి వస్తుందో తెలిసేది కాదు!

ఆ కాలంలో నాలో ఎక్కడలేని పౌరుషం, అహంభావమూ వుండేవి. ఎవరైనా నన్ను కొంచెం 'ఆఁ' అన్నా రంటే చెయ్యెత్తి

మాట్లాడే టంత గోరోజనం వుండేది. చివరికి హనుమంతరావు నాయుడు గారు కూడా నన్ను అదిలించలేని స్థితి వచ్చేసింది. ఈ స్థితిలోనే 1891 వేసవికాలంలో కాకినాడలో కొందరు నాట్యకళాభిమానుల కోరికమీద నాటకా లాడడానికి అంగీకరించి అక్కడ మకాము వేశాము. అప్పట్లో కాకినాడలో కూడా తాలింఖానాలూ, వాటికి సంబంధించిన గంద్రగోళాలూ చాలా హెచ్చుగా వుండేవి.

సింగితపు అబ్బాయి అనే వేపారిపంతులు ఈ తాలింఖానాలకీ, అందులోని వస్తాదులకీ గురువు. మనిషి మంచి ఆజానుబాహువు; అప్పటికే అతనికి 50 ఏళ్ళు పైగా వుండేవి; మీసాలు, కనుబొమ్మలు నెరిసిపోయి వుండేవి; పెద్ద బొజ్జకూడా వుండేది. కాని, మనిషి మంచి భీకరంగా వుండేవాడు. వృత్తి ఆయుర్వేదవైద్యం. అప్పట్లో పెద్ద వాళ్ళందరితోనూ ఆయనకి వైద్యసంబంధం వుండేది. ఆయన పెద్ద వాళ్ళల్లో పెద్దవాడు; రౌడీలలో రౌడీ! ఆ కాలపు కాకినాడ చరిత్రలో ఆయన ముఖ్యపాత్రధారి. సామాన్యంగా నాటకాలకి ఇల్లాంటి పలుకు బడిగల బలశాలుల సాహాయ్యం ఎప్పుడూ అవసరమే. ఆ రోజుల్లో నాటకాల శాంతి భద్రతలు ముఖ్యంగా వాళ్ళమీద ఆధారపడి వుండేవి. ఆనాటి కాకినాడలో ఏ కసరత్ చేసినా, కఱ్ఱ తిప్పినా ప్రత్యక్షంగానో పరోక్షంగానో ఆయన శిష్యుడు అయి తీరాలి!

అందులో తాడి వెంకటరత్నం, ముమ్మడి వెంకటరత్నం, బావాజీ మొదలయిన ముఖ్యులు బాగా ప్రఖ్యాతి సంపాదించారు. ఆ తాడి వెంకటరత్నం మరీ ఒడ్డూ పొడుగూ, కండపుష్టీ ఉన్నమనిషి. మా హనుమంతరావునాయుడుగారు ఈ మనిషి ఒడ్డూ పొడుగూ చూసి నాటకం బందోబస్తుకి ఇతన్నీ, ముమ్మడి వెంకటరత్నాన్నీ, బావాజీనీ దగ్గిరికి జేర్చుకున్నారు. అంటే వాళ్ళకి నాటకాలకి ఫ్రీటిక్కెట్లు ఇచ్చి గౌరవించారన్నమాట. మా నాయుడుగారు ఆ తాడి వెంకటరత్నాన్ని చూసి ఆయన బలశాలి అనీ, ధైర్యవంతుడనీ అపోహపడడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఈ శాండోల బలం నమ్ముకుని నాయుడుగారు అబ్బాయి తోడ్పాటు ఆశించలేదు. ఒకటి రెండు నాటకాలు అయ్యాక

సింగితం అబ్బాయి మేనల్లుడు గోపాలకృష్ణుడు ఫ్రీటిక్కెట్టు ఇవ్వాలని అడిగాడు. ఆయన ఫ్రీటిక్కెట్టు ఇవ్వలేదు. దాంతో అతను అబ్బాయి దగ్గిరికి వెళ్ళి "చూశావా! నీ శిష్యులు వెంకటరత్నం వగైరాలని ఆసరా చేసుకుని నన్ను తోసివేశా," రని పురి ఎక్కించాడు. అబ్బాయి సాధారణంగా అరుగు దిగకుండానే ఈ తాలింఖానా జనాభా నంతనీ స్వాధీనంలో వుంచుకునేవాడని ప్రతీతి. మనిషి అకారణంగా తొందరపడే స్వభావం కలవాడు కాదని కూడా చెప్పేవారు. అయితే, తన మేనల్లుడు వచ్చి పురి ఎక్కించేటప్పటికి అతను కొంచెం తొందరపడ్డాడు.

మర్నాడు మా నాటకం హాలుమీద రాళ్ళు పడ్డాయి. మా వీధిలో వున్న ఈ తాడి వెంకటరత్నం వగైరాలు బయటికి వచ్చి, రాళ్ళువేసే వాళ్ళని పట్టుకున్నారు. ఆ పట్టుబడ్డ వాళ్ళలో ఈ గోపాలకృష్ణు డున్నాడు. వాళ్ళతో కొంత కొట్లాట జరిగింది. ఆ పైన ఆ గోపాలకృష్ణుడు మేనమామతో చెప్పుకోగా అతను కదిలి వచ్చాడు. వెంటనే మా పెందాలు మీదికీ, మేము వున్న యింటి మీదికీ ఆ అబ్బాయిసేన కదిలి వచ్చింది. మేము తలుపులన్నీ వేసుకుని లోపల కూర్చున్నాము. యనమంద్ర కొండయ్య అనే అతను ఇల్లెక్కి వచ్చి చీకట్లో మేడమీద కిటికీలో కూర్చున్న నన్ను ఒక్క దెబ్బ తీశాడు. అదృష్టవశాత్తు ఆ దెబ్బ కొంచెం ఊచకి దూసుకుపోవడంచేత నాకు గట్టిగా తగలలేదు కాని, లేకపోతే మూతి పగలవలసిందే!

ఈ దెబ్బతో బాగా పౌరుషాలు రేగాయి. "మా సహాయం లేకుండా నాటకా లాడతారా!" అని అబ్బాయి పార్టీవాళ్ళూ, "మే ముండగా మీ కేమీ పరవాలే "దని తాడి వెంకటరత్నం ముఠావాళ్ళూ చెలరేగారు. మా నాయుడుగారికి బాగా పౌరుషం వచ్చింది. ఆయన అల్లరి చేస్తే ఝడిసి వెళ్ళిపోతామా! నాటకాలు ఆడవలసిందే!" అని నిర్ణయించారు. ఇలాంటి విషయాల్లో నాయుడుగారు చాలా పట్టుదల మనిషి. మొత్తంమీద బందోబస్తుతో నాటకాలు ఆడాము; అది అంతటితో ఆగలేదు. "విచ్చలవిడిగా ఊరేగుతాము" అనే ప్రగల్భాలు

మా ముఠాలోనించీ, "ఊరేగితే తంతాము" అనే ప్రగల్భాలు వాళ్ళ ముఠాలోనించీ బయలుదేరాయి.

ఇల్లా వుండగా నాలుగయిదురోజుల్లో దేవుడి ఊరేగింపు వచ్చింది. ఆ ఊరేగింపులోకి మేము కొందరం తయారయ్యాము. తాడి వెంకట రత్నం ధీమాకబుర్లవల్ల మేము ఎదటివాళ్ళ బెదిరింపులు లక్ష్య పెట్టలేదు. ఉత్సవం కాకినాడ బజారు దగ్గిర మసీదుదాకా వచ్చింది. అంతవరకూ ఏ గంద్రగోళమూ రాలేదు. "ఇంక ఇంటికి వెళ్ళిపోదా" మని అనుకుంటూ వుండగా ఆ ఎదటనించి 'ఘల్లుఘల్లు' మని గొలుసు చప్పుడు చేసుకుంటూ అబ్బాయి స్వయంగా మా మీదికి వచ్చాడు. అతని చేతుల్లో చెయ్యెత్తు బాణాకర్ర ప్రత్యక్ష మయింది. ఆ కర్రకి ఆ చివరనించి ఈ చివరిదాకా ఒకే గొలుసు! మనిషి తన ముఠాతో కేవలం కాలాంతకుడులాగ వచ్చి పడ్డాడు. పడుతూనే వస్తాద్ తాడి వెంకటరత్నాన్ని ఒక దెబ్బ తీశాడు! దాంతో పక్కని నిలబడ్డ నాకే గిరెత్తింది! తాడి వెంకటరత్నానికి నఖశిఖపర్యంతమూ దెబ్బతగిలింది! అబ్బాయి, ఆ తరవాత తాడి వెంకటరత్నానికీ, ముమ్మిడి వెంకట రత్నానికీ కూడా తగిలేటట్లుగా ఒక్క దెబ్బ కొట్టాడు. ఇది ఎందుకు ఇంత వివరంగా వ్రాస్తున్నానంటే—ఆ నాడు అబ్బాయి పోరాటపుచాక చక్యాన్ని వుదహరించడానికే! అతని నేర్పు, సాహసమూ అత్యద్భుతంగా వుండేవి. దెబ్బ కొట్టడంలో మంచి శాస్త్రోక్తంగా కొట్టాడు. మూడో దెబ్బ తగిలే సరికి ఇంత బలమైన మనిషీ ఒక్కసారిగా, కాలికి బుద్ధి చెప్పాడు!

అప్పటి కింకా తాలింఖానాల్లో దెబ్బ నేర్పుగా కొట్టడమూ, ఎదటివాళ్ళు కొట్టేటప్పుడు ఒడుపుగా తప్పుకోవడమూ, నేర్పుతూ వుండేవారు. ఇంగ్లీషురాజ్యం వచ్చి అప్పటికి కొంచెం కాలమే అవడం చేత జాతిలో యింకా ఆ విషయంలో ప్రావీణ్యం మిగిలే వుంది. పింగితం అబ్బాయి ఆ రోజున మా జనంమీద వీరవిహారం చేశాడు. నాతోకూడా వుండిన దుగ్గిరాల గోపాలకృష్ణయ్య అనే మా ప్రధాననట కుడికి తల పగిలిపోయి మెదడు బయటపడింది. నాకు చేతులమీదా,

బుజాలమీదా దెబ్బలు తగిలాయి. మాలో ముమ్మిడి వెంకటరత్నం మాత్రం ఎదటివాళ్ళ దెబ్బలు తిని మమ్మల్ని కాచాడనే చెప్పాలి.

ఈ స్థితిగతుల్లో నేను, విధిలేక పక్కనే ఓరగా తెరచివున్న ఒక కోమటియింట్లో దూరాను. ముమ్మిడి వెంకటరత్నం సుమారు 200 దెబ్బలు తిని పడిపోయాడు. నిజంగా ఈ ముమ్మిడి వెంకటరత్నం మాకు అడ్డపడి, దెబ్బలు కాయకపోతే ఈ చరిత్ర అంతా జరిగేదే కాదు! వాళ్ళు పడిపోయిన కొంతసేపటికి పోలీసు లంతా యథాప్రకారంగా విచ్చేశారు! వాళ్ళతోబాటు నేనూ బయటపడ్డాను! పోలీసులు మామూలు నాటకం జరిపించి అప్పట్లో వాళ్ళను ఆసుపత్రిలో చేర్చారు. మాకు పట్టుదలలు హెచ్చాయి. ఆ ఊళ్ళో యింకా నాటకాలు ఆడాము. తరవాత పోలీసువాళ్ళు పింగళం అబ్బాయి మీదా అతని యోధవర్గం మీదా కేసులు పెట్టారు. కాని సాక్ష్యం ఎల్లాగ? ఎవ్వరూ సాక్ష్యం పలకడానికి సాహసించలేదు. అందరికీ సాక్ష్యం చెబితే ఏమి కొంప మునుగుతుందో అన్న భయమే! కేసు విచారించే మేజిస్ట్రేటుకి కూడా భయమే అయింది!

ఆ భయంచేతనే చామర్లకోటలో విచారణ జరిగింది. విచారణ జరిగిన తరవాత సాక్ష్యం లేదనే కారణంచేత కేసు కొట్టేశారు. దాంతో మా కసి మరింత హెచ్చయింది. మమ్మల్ని నడిబజారులో కొడితే కేసు లేకుండా పోవడమా!'' అని బాధ కలిగింది. దీనికి ఎల్లాగయినా ప్రతీకారం చెయ్యాలనే పట్టుదల కలిగింది. ఇదీ కాకినాడ చరిత్ర!

కొద్ది రోజులకి నేను కిటికీలో కూర్చుని వుండగా కొట్టిన యినమంద్ర కొండయ్య అనే అబ్బాయి పార్టీమనిషి ఒకనాడు రాజమహేంద్రవరం వచ్చాడు. అతను వర్తకులదగ్గిర లెఖ్ఖలు వ్రాస్తూ వుండేవాడు. అతను ఊళ్ళోకి వచ్చాడని తెలిసి నేనూ, మాదిరెడ్డి వెంకటరత్నం నాయుడుగారి తమ్ముడు చలపతిరావూ—(అతను తరవాత చనిపోయాడు) మరికొందరు జట్టువాళ్ళూ బయలుదేరి దారికాశాము. ఆ కొండయ్య ఊళ్ళో పని చూసుకుని కాకినాడ వెళ్ళడానికి పడవ ఎక్కాలనే వుద్దేశంతో ఒంటెద్దు బండిమీద ధవళేశ్వరం వెడుతున్నాడు. అప్పటికి సాయంకాలం సుమారు 4 గంట లయింది. "సమయం దొరి

కిందిరా!" అని నేను ముందుగా వెళ్ళి బండి దిగమన్నాను. అతను దిగకపోతే ఒంటెద్దుబండి ఎదటకి వెళ్ళి ఎద్దుని విప్పివేసి కాడి పైకి ఎత్తివేశాను. ఆ మనిషి అమాంతంగా లుంగజుట్టుకుని కిందికి జారాడు. వెంటనే చలపతిరావు, జట్టు జనాభా, నేను కలిసి అతన్ని పచ్చడికింద చితకగొట్టాము!

ఇది జరిగింది రాజమహేంద్రవరం తాలూకాకచ్చేరి ఎదట! ఆర్ట్సు కాలేజీకి 100 గజాల దూరంలో వున్న మెయిన్‌రోడ్డుమీద! జనం గుంపులుగా చేరారు గాని, ఎవళ్లూ "ఇదేమి?" టని దగ్గిరికి రాలేదు. గట్టిగా కొట్టివేసిన తరవాత మేము మా దారిని పారిపోయి, గోదావరి ఒడ్డున వున్న పత్రివారి దొడ్లో పడ్డాము. కొందరు మొదట మా వెంట పడ్డారు; కాని చివరికి ఝడిసి చక్కాపోయారు. మేము కొడుతూ వుండగా దుగ్గిరాల కాశీవిశ్వనాథం అనే షావుకారూ (ఆనరరీ బెంచి మేజిస్ట్రీటు), కొరళ్ళ సుబ్బారాయుడూ (టి. డి. పి. కాకినాడ) కలిసి ఫీటన్‌మీద వస్తున్నారు. వాళ్ళుకూడా చూసి చక్కాపోయారు; అంతే!

తరవాత పోలీసులు మా మీద కేసు పెట్టారు. మాదిరెడ్డిచలపతి రావు, నేనూ ముద్దాయిలము. పోలీసులు అన్యాయంగా హనుమంతరావు నాయుడుగారిని కూడా ముద్దాయిగా చేర్చారు. కేసు నడిచింది. నా జీవితంలో తీగెమీద నడిచిన ఘట్టాల్లో ఇది చాలా ముఖ్యమైనది. ఆ చలపతి రావు ప్లీడరే చేస్తూవున్న వెంకటరత్నం నాయుడుగారి తమ్ముడే! అయినా అతనికీ ఈయనికీ పడేదికాదు. అతను తమ్ముడికి యింట్లో భోజనం అయినా పెట్టేవాడు కాడు. అతనికి తన సంఘం తాలూకు బంధువులు అనేకు లున్నారు కాని, ఎవ్వరూ సహాయపడేవాళ్ళే లేక పోయారు. ఎవరి మట్టుకు వాళ్ళే వెనక్కి తీశారు.

ఇక నా సంగతి చెప్పనే అక్కరలేదు కదా! హనుమంతరావు నాయుడిగారి భవిష్యత్తు దానిమీదనే ఆధారపడివుంది. పోలీసులు వార్డు అనే ఒక పెద్దప్లీడర్‌ని పెట్టారు. మా దగ్గిర ప్లీడరు ఫీజు మాట అల్లా వుండగా వకాల్తనామా ఖర్చులకి కూడా డబ్బులేదు. అల్లాంటి స్థితిలో మాకు తోడ్పడింది మంచిరాజు పాపారావు. అతను కేవలం తెలుగు

వకీలు. పైగా, చెట్టుకింద వకీళ్ళలో ఒకడు! కాని ప్రయోజకుడుగా పేరుపడ్డాడు. అతను వకాల్తనామా ఫీజు ఎనిమిదణాలూ కూడా చేతిది పెట్టుకుని వకాల్తా దాఖలు చేశాడు. వెంకటరత్నం నాయుడుగారు తన తమ్ముడి విషయంలో అంతగా శ్రద్ధ వహించకపోయినా, అతని కులస్థుడైన సామినేని బుచ్చిఅబ్బాయి నాయుడు,—(రిటైర్డు సబ్‌జడ్జి) తాయి సూర్యప్రకాశరావు—(తహసీల్దారు) గార్లు మమ్మల్ని పిలిచి "ఏమిటిరా అబ్బాయిలు! ఇట్లాంటి కేసు వచ్చిం దేమిటి మీ మీద?" అనిఅడిగారు. మేము వున్నది వున్నట్లుగా చెప్పాము; ఆ సూర్యప్రకాశరావునాయుడు గారు నన్ను పిలిచి, "మిమ్మల్ని వాళ్ళు ఏ వేళ కొట్టారు?" అని అడిగాడు. "రాత్రి" అని చెప్పాను. "వాళ్ళు రాత్రి కొడితే మీరు పగలెందుకు కొట్టారు!" అని సంయుక్తికంగా అడిగి మామీద నేరం ఆరోపించాడు! కేసు నడిచింది.

మేమంతా, మమ్మల్ని కాకినాడలో కొడితే వాళ్ళమీద సాక్ష్యానికి ఎవ్వరూ రాలేదు గదా! ఇప్పుడు మేము వాళ్ళని కొడితే ఈ ఊళ్లోవాళ్లు సాక్ష్యానికి ఎల్లా వస్తారో చూదా మనే ధీమాతో వున్నాము! పోలీసులు ఘరానాగా దుగ్గిరాల కాశీవిశ్వనాథం, కొరశళ్ళ సుబ్బారాయుడుగార్ల నిద్దరినీ సాక్ష్యం వేశారు. సుబ్బారాయుడికి "కాకినాడనించి సాక్ష్యానికి వస్తే ప్రాణాలు అరిచేతిలో పెట్టుకుని రావాలి అనీ ధవళేశ్వరం రాజమహేంద్రవరాల మధ్యన మాట దక్క" దనీ ఆకాశరామన్న ఉత్తరం వెళ్ళిపోయింది. ఇంక నేనూ చలపతిరావూ కలిపి ఒకనాడు రాత్రి 12 గంటలకి దుగ్గిరాల కాశీవిశ్వనాథం ఇంటికివెళ్లాము. తలుపు కొట్టేసరికి అతను ఉలికిపడి లేచి వచ్చాడు. మేము కాస్త తమాయించి, మామీద సాక్ష్యం చెప్పడం సబబు కాదని చెప్పాము. చలపతిరావు కొంచెం మొరటుతనంగా "మా మీద సాక్ష్యం చెప్పి, మా కే ఆరునెలలో శిక్ష వేయించినా, తిరిగి వచ్చిన తరవాత నీ ప్రాణాలు దక్కవు సుమా!" అని బెదిరించాడు.

ఏ మైతేనేమి, తీరా సాక్ష్యానికి వచ్చేసరికి దుగ్గిరాల కాశీవిశ్వనాథం "దెబ్బలాట జరుగుతూ వుంటే చూచాననీ, అక్కడ దెబ్బలు

తగులుతూ వుంటే తనకి గిర ఎత్తిందనీ, ఇంక అక్కడ ఆగలేక వెళ్ళిపోయాననీ, ఎవరు కొట్టారో చెప్పడం అసాధ్యం," అనీ చెప్పాడు. కొరళ్ళ సుబ్బారాయుడు సాక్ష్యానికి రానేలేదు. అతనికోసం కేసు రెండు మూడు వాయిదాలు వేశారు; గాని చివరికి పోలీసులు అతని సాక్ష్యానికి నీళ్ళు వదులుకున్నారు. చివరికి కేసు విచారించిన మేజిస్ట్రేటు మేము నేరం చేసివుండడానికి అవకాశా లున్నాయనీ, కాని, శిక్షించడానికి తగిన సాక్ష్యం లేదనీ వ్రాసి కేసు కొట్టేశాడు.

50 ఏళ్ళయిన తరవాత ఇప్పుడు ఆ విషయం తలచుకుంటే నాకే ఆశ్చర్యం వేస్తుంది. ఆనాడే ఏ ఆరునెలలో శిక్షవేసి జైలుకి పంపించి వుంటే, ఈ జీవితం ఏ పంథాపట్టేదో, ఏ మైపోయేదో ఆ పరమేశ్వరుడికే ఎరుక! కాలు అణుమాత్రం జారితే అథఃపాతాళంలోకి పడిపోయే స్థితిలోనించి బయటపడ్డాము. ఎప్పటికప్పుడు కొండయ్య చచ్చిపోతాడనీ, కేసు కూనీ కేసవుతుందనీ భయంకరమైన వార్తలు వస్తూవుండేవి. కాని, ప్రారబ్ధం ఎల్లా నడిపిస్తోందో ఎవరు చెప్పగలరు? కాకినాడలో అక్రమంగా కొట్టినప్పుడు మేము బ్రతకడమూ దైవికమే; మేము మళ్ళీ కొండయ్యని కొట్టినప్పుడు అతను బ్రతకడమూ దైవికమే! ఈ సంఘటనలన్నీ దైవికంగా ఈ జీవితపు భవిష్యత్తు ఈ విధంగా నిర్ణయించాయి.

ఈ గాథ సందర్భంలో ఆనాడు నా మనోభావాల పోకడలు కొంచెం వ్రాస్తాను. పాఠకులు వాటిని గురించి, ఈనాటి శాంతిసూత్రాలతో ఆలోచిస్తే లాభంలేదు. నేను ఎన్నో సాహసకార్యాల్లోపడి, ప్రమాదావస్థలు తప్పించుకున్నానంటే దానికి దైవికమైన బలం అల్లా వుండగా, నేను చేసిన పనిలో ఒకన్యాయం వున్నదనే విశ్వాసం కూడా నాకు తోడ్పడిందనుకుంటాను. కొండయ్యని మెయిన్‌రోడ్డుమీద వుతికే సాహసం వచ్చిందంటే, దానివెనకాల నా మనస్సు ఎంతగా ఆందోళన పడిందో గమనించాలి. కాకినాడలో అర్ధరాత్రివేళ మమ్మల్ని అక్రమంగా కొట్టారు; వాళ్ళమీద న్యాయంగా కేసు పెడితే న్యాయపక్షాన్ని సాక్ష్యం ఇచ్చేవాళ్లే లేకపోయారు! చివరికి వాళ్ళకి కాస్త బుద్ధిచెప్పే

పెద్ద మనిషి కూడా లేకపోయాడు! అందుచేతనే నా మనస్సులో బయలుదేరిన తీవ్రమైన ప్రతీకార బుద్ధిచేత నేనిందుకు పాల్పడ్డాను. ఆ రోజుల్లో నా మనఃప్రకృతి అల్లా వుండేది. బహుశః అల్లాంటిదే ఇప్పుడు జరిగితే ఆ ప్రతీకారం మరో రూపం ధరించేదేమో!

ఈ కేసు సందర్భంలో నేను చూపించిన ధైర్యం తలుచుకుంటే ఇప్పటికి నాకే ఆశ్చర్యంగా వుంది. కొట్టడం అంటే నలుగురూ కొట్టారు. కాని, కేసు వచ్చేటప్పటికి అంతా జావ అయిపోయారు. ఏ పాపమూ ఎరక్కపోయినా, నాకు అన్నివిధాలా సంరక్షకులుగా వుండిన హనుమంతరావు నాయుడుగారు కూడా కేసులో ఇరుక్కున్నారు. ఎందుకైనా డబ్బు కావలిస్తే, ఎల్లాగో అల్లాగ సంపాదించి ఇవ్వగలరు గాని, ఆయన ఇల్లాంటి పిల్లసమ్మోర్లకి కూడా ఎక్కడ అవస్థ పడ గలరు? ఈ విషయంలో ఆయన కూడా నిరుత్సాహపడ్డారు. అయితే నేను చేసిన దాంట్లో ఏమీ తప్పు లేదనే ఒక ఘనవిశ్వాసంవల్ల ధైర్యం చిక్కబట్టుకుని బయటపడ్డాను.

సహాధ్యాయు లంతా "నేను ఈ రౌడీగందరగోళాల్లో పడిపోయాననీ, ఇంక బయటపడడం అసాధ్యం అనీ" అనుకుంటూ వుండేవాళ్లు. నాకు మాత్రం ఎందుచేతనో నిస్పృహ కలగలేదు. ఇన్ని గత్తర్లలో పడినప్పటికీ నాకు చదువుమీద మాత్రం లక్ష్యం తప్పలేదు. యథా ప్రకారంగా పాఠాలు చదువుతూనే వుండేవాణ్ణి. ఆ విషయంలో మాత్రం నా మనస్సు ఏ విధంగానూ చెదరలేదు.

కాలేజీలో నేను మెట్కాఫ్ అభిమాన శిష్యుల్లో ఒకణ్ణి. నేను నాటకాల గంద్రగోళంలో వున్నా, నామీద కేసులు నడిచినా, ఆయన నన్ను ఒక కంటితో కాపాడుతూ వుండేవారు. ఒకసారి చింతలూరి కృష్ణారావూ—(ఆయన ఇటీవల చనిపోయినట్లు వింటున్నాను)—నేనూ తగువులాడుకున్నాము. అతను నాకన్న పెద్దవాడై వుండి నేను ఒంటరిగా వున్నప్పుడు నన్ను కొట్టాడు. నేను అదును చూసుకుని, కొందరి జట్టు చేర్చుకుని, అతన్ని మళ్ళీ కొట్టి, కసి తీర్చుగున్నాను. అప్పట్లో

నా మనస్తత్వం అంతే! ఆపైన కృష్ణారావు మెట్కాఫ్‌తో ఫిర్యాదు చేశాడు. మెట్కాఫ్ మమ్మల్ని ఇద్దర్నీ ఎదట నిలబెట్టి, "ఏమిటి సమాచారం?" అని అడిగాడు. నేను అక్షరమైనా తప్పకుండా వున్నది వున్నట్లుగా చెప్పివేసి, "నాకన్న పెద్దవాడై పై క్లాసు చదువుతూ వుండి మాట పట్టింపు మాత్రానికి నన్ను కొట్టాడు. కనక నాకసి తీర్చుకున్నాను," అన్నాను.

దానిమీద దొర కేమీ తోచలేదు. కృష్ణారావుకేసి చూసి, "దాని కేమి చెబుతా?" వని అడిగాడు. పైగా, "నీకు ఏమి శిక్ష వెయ్యమన్నావు?" అని కూడా అడిగాడు. "అది నే నేం చెబుతాను; మీ యిష్టం," అన్నాడు కృష్ణారావు. దొర విచారణ మర్నాటికి వాయిదా వేశాడు. మర్నాడు మెట్కాఫ్, మూడు రోజులు తన ఇంటిదగ్గిర పని చెయ్యడమే శిక్షగా విధించాడు. అది బహు ఆనందదాయకమూ, విద్యాదాయకమూ అయిన శిక్ష! మెట్కాఫ్ బొమ్మూరు మెట్టమీద తను వుండే చోట రాళ్ళు పేర్చి రోడ్డు వేస్తూ వుండేవాడు. ఆ కొండమీద ఎప్పుడూ ఏదో పని చేస్తూ వుండేవాడు. నేను కూడా ఆయనతోబాటు పనిచేశాను. ఆయన పనిచేస్తూ వుంటే అనేక విషయాలు బోధపరుస్తూ వుండేవాడు.

మెట్కాఫ్ దొరకి రాజమహేంద్రవరం అన్నా, తనశిష్యులన్నా చాలా అభిమానం. నేను తరవాత చాలా కాలానికి ఇంగ్లాండు వెళ్ళినప్పుడు అవకాశాయ తీసుకువెళ్ళి ఆయన్ని చూశాను. మెట్కాఫ్ దంపతులు నన్నెంతో ఆదరించి భోజనంపెట్టి వంపించారు. ఆయన ఉండే చోటికి రాజమహేంద్రవరంనించి, వెదురు మొక్కలు తీసుకువెళ్ళి, వాటిని రాజమహేంద్రవరం స్మారక చిహ్నాలుగా తనగదిలో పెట్టుకున్నాడు. ఇంకా ఆ గదినిండా రాజమహేంద్రవరం చిహ్నాలు అనేకం వున్నాయి. మెట్కాఫ్ నా యెడల ఎంత శాంతం చూపించేవాడో, నేను ఆయన యెడల అంతస్వేచ్ఛ కనబరచేవాణ్ణి!

ఒకరోజున రాత్రి నాటకంలో వేషంవేసి పొద్దున్నే కాలేజీకి వచ్చాను. హడావిడిగా రావడంలో రాత్రివేషం తాలూకు పౌడరు కొంచెం వుండిపోయింది. అది పురాణపండ మల్లయ్యశాస్త్రిల్లుగారి క్లాసు.

ఆయన క్లాసు చాలా కులాసాగా వుండడంచేత, బాగా శ్రద్ధగా వింటు న్నాను. ఇల్లా వుండగా మల్లంపల్లి వీరభద్రుడు అనే ఒక సహాధ్యాయి నా పొడరు చూపి హేళనగా మాట్లాడడం ఆరంభించాడు. ఒకటి రెండు సార్లు సహించుకుని, అతను అదేపనిగా విసిగించడంచేత బాగా చిరాకుపడి, శాస్త్రిల్లుగారు బోర్డుకేసి తిరిగి వుండగా, వెనక్కి తిరిగి పెళ్ళున ఒక్క చెంపకాయ లాగాను! దాంతో క్లాసంతా గొల్లుమన్నారు! శాస్త్రిల్లుగారు చటున నాకేసి తిరిగి, విషయం అంతా గ్రహించి, "ఏమిరా, వీర భద్రంతో షేక్‌హాండ్ చేశావా ఏమిటి?" అన్నారు! క్లాసు మరింత గొల్లుమన్నారు!

ఈ విషయం అంతా సహజంగా మెట్కాఫ్ దగ్గిరికి ఫిర్యాదుకి వెళ్ళింది. మెట్కాఫ్ నన్ను పరీక్షకి పంపించకుండా నిలిపివేస్తా నని బెదిరించాడు. దానిపైన నేను వీరభద్రుడికి క్షమాపణ చెప్పడంతో ఆ వ్యవహారం సద్దుణిగిపోయింది. మెట్కాఫ్ పరిపాలనలో వుండే విశేషం కూడా అదే! ఏదో విధంగా తను సద్దిచెయ్యడమే కాని విద్యార్థి భవిష్య త్తుకి ఎప్పుడూ భంగం కలిగించేవాడుగాడు. ఆ తరవాత చాలా కాలానికి నేను ఇంగ్లాండులో కలుసుకున్నప్పుడు ఆయన ఎంతో ఆశ్చర్యపడి, "నువ్వు ఇంత వృద్ధిలోకి వస్తా వని అనుకోలేదుసుమా!" అన్నాడు.

ఈ కాలంలో రాజమహేంద్రవరంలో వీరేశలింగంగారి సంస్క రణోద్యమం చాలా తీవ్రంగా సాగుతూ వుండేది. నేను రాజమహేం ద్రవరం వచ్చేసరికి ఆ ఊళ్ళో ఈ ఆందోళన చాలా హెచ్చుగా వుండింది. నేను మెట్రిక్యులేషన్ చదువుతూ వుండగా, వీరేశలింగంగారి ఆధి పత్యం కింద విధవా వివాహాలు జరుగుతూ ఉండడం జ్ఞాపకం వుంది. మానూరి పురుషోత్తం వివాహ సందర్భంలో పంతులుగారి దాకచక్యమూ, పద్ధతులూ నేను బాగా గమనించాను. తమ కార్యసాధనకి అవసరమని తోస్తే ఆయన రౌడీల సహాయమూ, లౌక్యుల సహాయమూ కూడా పొందేవాడు.

అప్పట్లో విద్యావంతులై సంఘానికి నాయకులుగా వుండినవాళ్ళు అంతా సంస్కర్తలే. న్యాపతి సుబ్బారావు పంతులుగారు, పెద్దాడ

సాంబశివరావుగారు నేతి సోమయాజులుగారు మొదలైన పెద్దలు చాలా మంది ఆయనకి తోడ్పడుతూ వుండేవారు. కాని ఈ పెద్దలంతా ఆ సిద్ధాంతాలు ఆచరణలో పెట్టడానికి సమయం వచ్చినప్పుడు, ఆ సిద్ధాంతాలు ఆయనకి అప్పజెప్పి, తప్పుగున్నవాళ్ళే! ఆ కాలంలోనే నా వివాహంతో బాటు మా చెల్లెలు అన్నపూర్ణ భర్త ఆకస్మికంగా మరణించాడు. పెళ్ళి నాటికే ఆయన పెద్దవాడు. నా చెల్లెలు వ్యక్తురాలు కాకుండానే ఆయన మరణించడంచేత, నాకు రాజమహేంద్రవరంలో కలిగిన సంస్కరణ భావాలవల్ల, ఆమెకి పునర్వివాహం చెయ్యాలని దృఢసంకల్పం కలిగింది. నే నీ ప్రయత్నంలో వుండగానే ఆమె కూడా చనిపోవడం తటస్థించింది.

యఫ్. ఏ. క్లాసు ఈ విధంగా సాగింది. కేసుల గందరగోళాలతో వుడుకు రక్తం కాస్త చల్లారింది. పైగా, జీవితలక్ష్యం అంతా ప్లీడరీమీద వుండడంచేత చదువుకి ఏమీ ప్రతిబంధకం కలగనియ్యకుండా చూడాలనే ధృఢసంకల్పం ఒకటి తోడుపడింది. అందుచేత చదువంటే బాగా శ్రద్ధ పట్టాను. నాటకాల వ్యవహారం మాత్రం ఏమీ తగ్గలేదు. మొత్తంమీద 1891 వ సంవత్సరంలో యఫ్. ఏ. పరీక్షకి హాజరై పాసయ్యాను. అప్పట్లో యఫ్. ఏ. పాసయితే ఫస్టుగ్రేడు పరీక్షకి ప్రైవేటుగా చదవవచ్చును. అందుచేత కూడా ఆ లక్ష్యశుద్ధి ఎక్కువైంది.

1892 వ సంవత్సరంలో ప్లీడరు పరీక్షకోసం బాగా క్షుణ్ణంగా చదివాను. అప్పటికి ఏలూరి లక్ష్మీనరసింహంగారు బి. ఏ. పాసయి స్కూలు పెట్టుకుని వున్నారు. ఆయన అప్పటికి మునిసిపల్ చెయిర్మన్‌గా వుండి మునిసిపల్ వ్యవహారమంతా ఏకటాకీగా నడిపించేవాడు. ఆయన కూడా నాతోబాటు ప్లీడరుపరీక్షకి చదువుతూవుండేవాడు. ఉభయులమూ కలిపి పరీక్షకి చదువుతూ వుండేవాళ్ళము. తీరా చదువంతా పూర్తి అయ్యాక నా కొక విఘ్నం వచ్చింది. 21 సంవత్సరాల వయస్సు పూర్తి అయితేనేగాని ఫస్టుగ్రేడుపరీక్షకి కూర్చోడానికి వీలులేదని ఎక్కడో ఒక నియమం వుందిట. నేను అది చూసుకోకుండానే చదువు

పూర్తిచేశాను. చివరికి ఆ అభ్యంతరం బయటికి వచ్చింది. వయస్సు సర్టిఫికెట్ కోసం అక్కడ సివిల్ సర్జనుగా వున్న మేజర్ కోమా దగ్గిరికి వెడితే, అతను నాకు 'జ్ఞాన దంతం' (Wisdom tooth) రాలేదని సర్టిఫికెట్ నిరాకరించాడు.

దాంతో నా ఆశయానికి భంగం కలిగింది. ఒక్క సంవత్సరం వృథా అయింది. ఆ సంవత్సరంతో ఫస్టుగ్రేడ్‌కి ప్రైవేటుగా వెళ్ళడానికి అవకాశం తీసివేస్తారు. త్వరలో బి. ఏ. పాసయితే కాని ఫస్టుగ్రేడు పరీక్షకి వెళ్ళడానికి వీలులేదనే నియమాలు వస్తున్నాయి. అందుచేత 1892 లో లాకాలేజీకి వెళ్ళి చదవడం తప్ప వేరే మార్గం లేదు. మద్రాసులో లాకాలేజీలో చదువంటే తాడూ బొంగరమూలేని నాబోటివాడికి ఎల్లాగ సాధ్యం అవుతుంది? మళ్ళీ హనుమంతరావు నాయుడుగారి కొక సమస్య. నే నాయన్ని శ్రమపెట్టడానికి మొహమాటపడ్డాను. కాని, ఆయనే "ఎల్లాగో తంటాలు పడదాము; సాహసించు" మన్నారు. ఆయన డబ్బు ఎల్లాగ తెచ్చేవారో నాకు తెలియదు. అప్పుడప్పుడు అప్పులు కూడా చేశారనుకుంటాను. కొణితివాడ జమీందారువద్దనుండి 90 రూపాయలు తేవడం మాత్రం నాకు తెలుసును. ఆ జమీందారు థీయిస్టిక్ స్కూలులో నాకు సహాధ్యాయి. ఆ చనువుచేత నాయుడుగారు జమీందారు దగ్గిరికి నడిచివెళ్ళి 90 రూపాయిలు పట్టుకుని వచ్చి నాకు పంపించారు.

అప్పటి కింకా మదరాసుకి రైలు పడలేదు. బెజవాడవాకా పడవ మీద వెళ్ళి, అక్కడనించి గుంతకల్లు పోయి, గుంతకల్లునించి మదరాసు వెళ్ళాము. ఆ తరవాత మదరాసులో నేను లాకాలేజీలో చేరాను. అక్కడ పెమ్మరాజు గుర్రాజు, సారంగు భీమశంకరం, వనహరిగిరి జోగయ్య, వేములూరి వెంకట్రాయుడు మొదలైనవారు నా సహాధ్యాయులు. మేము నలుగురైదుగురమూ కలిసి నల్లతంబివీథిలో ఒక చిన్న భోజనవసతి ఏర్పాటు చేసుకున్నాము.

అప్పుడు లాకాలేజీకి ప్రిన్సిపాల్ నెల్సన్. అధ్యాపకులు వి.కృష్ణస్వామయ్యరుగారు, టి. వి. శేషగిరయ్యరుగారు, హెచ్. రంగప్పగారు

సెకండు గ్రేడు ప్లీడర్లు, వాలస్ పట్టాదార్లు అని నాలుగు విధాలుగా ఉండేవాళ్ళు. సుబ్బారావు పంతులుగారు, మాదిరెడ్డి వెంకటరత్నం నాయుడుగారు, మాకర్ల సుబ్బారావునాయుడుగారు, చిత్రపు వెంకటాచలంగారు మొదలైన వాళ్ళంతా ఒక తరహా. వీళ్ళందరికీ సుబ్బారావు పంతులుగారు నాయకుడు. ఆయన్ని గురించీ, ఆయన రాజకీయాలని గురించీ, ముందుముందు వ్రాస్తాను. మాకర్ల సుబ్బారావునాయుడుగారు మారడుగులవారి సందులో వున్న కంచుమర్తివారి మేడలో ప్రాక్టీసు చేస్తూ వుండేవారు. ఆయన దివ్యజ్ఞాన సమాజసభ్యుడు. అస్తమానమూ ఆ ధ్యాసలోనే వుండేవాడు. అప్పటికి వెంకటరత్నంనాయుడుగారు, వెంకటాచలంగారు, అట్టే అంత పెద్ద ఎన్నికలో పడలేదు.

ఇంక ఫస్టుగ్రేడ్‌లో, నిడమర్తి దుర్గయ్యగారు అనే జలదుర్గ ప్రసాదరాయుడుగారు, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, నేతి సోమయాజులుగారు, వగైరాలు వుండేవారు. వారంతా మంచి ప్రాక్టీసుదారులు. సెకండు గ్రేడులో కనపర్తి శ్రీరాములు, ఏలూరి వెంకట్రామయ్యగార్ల పైలు జోరుగా వుండేది. ఇక వాలస్ (wallace) పట్టాదార్లలో దామరాజు నాగరాజుగారి ప్రభ జోరుగా వుండేది. ఆయన ఒక్క అక్షరం ఇంగ్లీషు ముక్కఅయినా లేకుండా ఎంతసేపైనా చాలా సరసంగా ఆర్గ్యుమెంటు చెప్పేవాడు. అప్పట్లో కాకినాడలో ఉన్న గంజాం వెంకటరత్నం, కృత్తివెంటి పేర్రాజుగార్లు జిల్లా కంతటికీ పెద్ద ప్లీడర్లుగా వుండేవారు. వీరు జమీందారుల ప్లీడర్లుగా వుండి పేరు ప్రఖ్యాతులు, డబ్బూ కూడా సంపాదించారు. వీరుభయులూ కాకినాడ మునిసిపల్ రాజకీయాల్లో కూడా బాగా పేరుపడ్డారు. ఉభయులూ మెట్రిక్యులేషన్ పాసయిన ప్లీడర్లయినా కేసులు నడిపించడంలో వారికి ఏ బి. ఎల్. లూ సరిపోయేవారు కారు. పేర్రాజుగారు మంచి హుందా అయిన సరళిలో కేసు ఆర్గ్యుమెంటు చెప్పేవాడు. వెంకటరత్నంగారు మంచి మేధావి. ఇక ఇటు ఏలూరులో ములుకుట్ల అచ్యుతరామయ్యగారు అనే ఆయన వుండేవాడు. ఆయన శుద్ధ తెలుగు ప్లీడరు. మనిషి మంచి స్ఫురద్రూపి. చంకీజోళ్ళు వగైరాలు ధరించి బాగా దర్జాగా

వుండేవాడు. వెంకటేశ్వరరావుగారి ప్రాపకంవల్ల మాజీవీదు జమీం దార్లకి ప్లీడరీ చేస్తూండేవాడు. ఆయనకి ఫీజురూపాయలు ఏనుగుల మీద వేసుకుని తీసుకువచ్చి ఇచ్చేవారు. ఆనాటి వృత్తి స్థితి అది.

# 7

## నా వృత్తి

ప్లీడరీ ప్రారంభించినప్పటినించీ నాకు ఫైలు బాగానే వుండేదని చెప్పాలి. ఆరు మాసాల్లో పెద్ద ప్లీడర్లకి కూడా తీసిపోని ఫైలు ఉండేది. నన్నంతవరకూ వెంటాడించిన లేమి క్రమంగా వెనకపట్టింది. ఏ వృత్తిలోనైనా పేరు రావాలంటే ముందుపట్టిన కేసుల్లో మంచిపేరు సంపాదించాలి. నేను ప్రాక్టీసుకి వచ్చిన కొద్ది రోజులకే మంచిపేరు వడింది. క్లయింటుల విషయమై పట్టుదలగా పనిచేస్తాననే మంచి వాడుక వడింది. ఆ రోజుల్లో క్రిమినల్ కేసుల్లో మేజస్ట్రీటుల ధాటీలకి నిలబడే ప్లీడర్లకి ఫైలు బాగానే వుండేది. కేసుల్లో బలంలేదని ఇతర ప్లీడర్లు వదులుకున్న కేసులు కొన్ని నా పరం అవుతూ వుండేవి.

ఒకప్పుడు ఇద్దరు కుర్రవాళ్ళ మీద రైల్వే పార్సెల్‌లోనించి వెండి పాళీలు తస్కరించారని కేసు వచ్చింది. పోలీసులు సారంగ ధరుడి మెట్ల దగ్గిర దాచిపెట్టబడిన వెండిపాళీలు చూపించారు. అందులో ఒకకుర్రవాడి తండ్రి నా దగ్గిర నౌఖరీ చేస్తూ వుండేవాడు. నేను ఆ కేసు పట్టి, చోరీ ఆస్తి చూపించి నంత మాత్రాన నేరం రుజువు కాదని వాదించాను. మేజిస్ట్రేటు కేసు సెషన్సుకి పంపించాడు. సెషన్సుజడ్జీ ముందే ఒక అభిప్రాయానికి వచ్చాడు. అందులోనూ ఒక ముద్దాయి నేరం ఒప్పుకున్నాడు. దాంతో నేరం ఒప్పుగున్న ముద్దాయికి ఒక సంవత్సరం శిక్ష, ఒప్పుకోనివాడికి ఐదేళ్ళ శిక్ష విధించాడు. నేను పట్టి

దలకొద్దీ, వెంటనే ఆకేసు హైకోర్టుకి తీసుకువెళ్ళి, అదమ్సు అనే ఆయన్ని ప్లీడరుగా పెట్టి, కేసు నడిపించాను. అక్కడ వున్న లా పుస్తకా లన్నీ తిరగవేసి రిపోర్టు కాని కేసుల్లోనించి ఒక తీర్పు పట్టుకున్నాను. చోరీ ఆస్తిని గురించి ఆచోకీ ఇచ్చినంత మాత్రం చేత నేరం రుజువు కాదని తీర్పు దొరికింది. ఆ తీర్పు చూపించడంతోటే సర్ డేవిస్, సుబ్రహ్మణ్య అయ్యరుగార్లు శిక్ష కొట్టివేసి, ముద్దాయీలని విడుదల చేశారు. దాంతో మరింత గణనలో పడ్డాను.

మునసబు కోర్టులో లా ఫైలు ఆకర్షించాను. అప్పుడు రంగ మన్నారు అనే ఆయన మునసబు. ఆయన కోర్టులో గుమాస్తాగా వుండి క్రమంగా పైకివచ్చినవాడు. మంచి తెలివైనవాడు. జడ్జిమెంటు మంచి పకడ్బందీగా వ్రాసేవాడు. అయితే ఆయనకి లంచగొండి అనీ, పక్షపాతి అనీ కొంత అపఖ్యాతి వుండేది. అప్పట్లో ఆయనకి ఏలూరి వెంకట్రామయ్యగారు అంటే అభిమానం. ఎందుచేతనో రంగమన్నారు నాయెడల కొంచెం సద్భావం చూపించేవాడు. నే నెన్నడూ ఆయన్ని ఆశ్రయించలేదు. కాని, ఎందుచేతనో ఆయన నాకు చాలా సహాయం చేస్తూ వుండేవాడు. అందుచేత కూడా ఫైలు పెరిగింది. ఈ ప్రభ కొంతకాలం నడిచాక ఈ రంగమన్నారుకీ నాకూ తగాదా వచ్చింది.

సుబ్బారావుపంతులు ప్రభృతులు, ఆయన లంచగొండి అనీ, కొందరు ప్లీడర్లంటే ప్రత్యేకాభిమానం చూపిస్తాడనీ, తద్వారా న్యాయ వ్యవహారాలకి నష్టం వస్తోం దనీ, హైకోర్టుకి పిటీషన్ పెట్టారు. అందులో నన్ను కూడా సంతకం చెయ్య మన్నారు. అల్లాంటి కిం వదంతులు, గోల వుండేవి. కనక నేను కూడా దస్కతు పెట్టాను. దాంతో ఆయనకీ, నాకూ చెడిపోయింది. ఇంతమంది ప్లీడర్ల పిటీషన్ మీద హైకోర్టువారు అది విచారణకి పంపారు. రంగమన్నారు చాలా ఘాటైన సమాధానం వ్రాశాడు. అసలు వ్యవహార మెట్లా ఉన్నా సమాధానం మంచి చాకచక్యంగా వ్రాశాడు.

దాంతో అతను నిర్దోషిగా నిర్ణయించబడ్డాడు. హైకోర్టువారి నిర్ణయంచేత ఆయన మరీ తాడుబారిపోయాడు. ఆయనకి ఆశ్రితపక్ష

పాతం మరింత హెచ్చయింది. కాని, నాకు మాత్రం ఆయన వ్యతిరేకి అయ్యాడు. దాంతో నాకు స్థానికంగా కొంత సివిల్‌ప్రాక్టీసు తగ్గింది. కాని, క్రిమినల్ వ్యవహారం బాగానే నడిచింది. నా ప్రాక్టీసు రాజమహేంద్రవరంలోనే కాకుండా జిల్లాలోనూ, పక్క నున్న ఏలూరు వగైరా పట్టణాల్లోనూ కూడా బాగానే వుండేది. డబ్బు కూడా దానికి తగినట్లుగానే వస్తూ వుండేది. ప్లీడరు, సంపాదనలో తన విలువ తానే నిర్ణయించుకోవాలి. నేను నా విలువ చాలా హెచ్చుగానే వుంచా నని చెప్పా లనుకుంటాను. నా తోటి ప్లీడర్లు అందులోనూ బి.ఏ., బి.ఎల్.లు కూడా 25 రూపాయలు పుచ్చుకునే కేసులో నేను నిర్మొహమాటంగా వందరూపాయలు పుచ్చుకునే వాణ్ణి. ఒక కేసులో పోలవరం, జంగారెడ్డిగూడెం మొదలయిన చోట్లకి వెళ్ళినందుకు పల్లకీ వగైరాల ఖర్చులు గాక, రోజుకి నూరురూపాయిలు పుచ్చుగున్నాను. డబ్బనేది పోయేటప్పుడు ఎల్లాగ చేతులూ, కాళ్ళూ వచ్చిపోతుందో వచ్చేటప్పుడు కూడా అల్లాగే వస్తుంది.

నాకు డబ్బు వస్తూన్నట్టుగానే, సంసారం ఖర్చు కూడా చాలా దూబరాగానే అయింది. ఒంగోలులో వుండే కుటుంబం అంతా బంధువులతో సహా రాజమహేంద్రవరం చేరారు. హనుమంతరావు నాయుడు గారి కుటుంబభారం కూడా కొంతవరకు భరించడంలో నేను నా విధి కొంచెం మాత్రమే నిర్వర్తించగలిగాను. డబ్బు కనపడ్డప్పటినించీ ఖర్చు కూడా ఎక్కువైంది. మొట్టమొదట కొన్ని రోజులుదాకా, కోర్టుకి వెళ్ళడానికి ఒంటెద్దుబండి పెట్టాను. స్వయంగా ఆ బండికి రంగులు వేయించి ఒక ప్రత్యేకత ఏర్పడేటట్లు చేశాను. తరవాత కొంతకాలానికి ఒక డాకార్టూ, చక్కని పోనీ కొన్నాను. ఆ తరవాత గుఱ్ఱాల్ని కొనడం, వాటిని పెంచడం కొంతకాలం అయింది. అప్పటికి డాకార్టు పెద్ద ప్లీడరైన నేతి సోమయాజులుగారికి ఒక్కరికే వుండేది. అప్పట్లో ఆయనతోబాటు నాకు కూడా డాకార్టు వుండాలని సరదాగా వుండేది.

మొదట్లో—అనగా ప్రాక్టీసు ప్రారంభించిన కొద్దిరోజుల్లోనే

నేను పెద్ద కేసుల్లో మాగంటి లక్ష్మణదాసు కేసు ఒకటి. దానికి అర్ధణాకేసని పేరు. లక్ష్మణదాసు ఏలూరుదగ్గిర చాటపఱ్ఱు గ్రామస్థుడు. కమ్మ. మంచి పలుకుబడి గలవాడు. అతను ఒకసారి టోలుగేటు ఫీజు అర్ధణా ఇవ్వకుండా పోయి, కంట్రాక్టరుమీద జబర్దస్తీ చేశాడని కేసు. ముందు బెంచికోర్టులో కేసు పెట్టారు. కాని, ఎప్పుడైతే అతను పట్టుదలకొద్దీ వాదించదలచుకున్నాడో అప్పుడు పోలీసులు దాన్ని పెద్ద కేసుగా మార్చి ఏలూర్ సబ్‌కలెక్టరుదగ్గిర పెట్టారు. అప్పుడు సబ్ కలెక్టరు కెర్షాప్ అనే పార్శీ ఐ. సి. యస్. ఉద్యోగి; అతను మొదటి నించీ ముద్దాయికి వ్యతిరేకమైన రిమార్కులు వ్రాసుచేస్తూ ఉండడం వల్ల, అతను కేసు విచారణ చేయకూడదనీ, ఇంకొక మేజస్ట్రీటు దగ్గిరికి కేసు మార్చవలసిందనీ హైకోర్టుకి పిటీషన్లు పెట్టాను. అతను ఆ పిటీషన్‌లు లక్ష్యం చెయ్యకుండానే కేసు విచారించి, 500 రూపాయలు జరిమానా విధించేటట్లు కనబడ్డాడు. అతని ధోరణి చూస్తే శిక్ష కూడా విధించేటట్లు కనబడ్డాడు. నేను అడుగడుగుకీ అడ్డు పిటీషన్లు తగిలించి అతన్ని మరీ విసిగించాను. అందుచేత రాజమహేంద్రవరం జిల్లాకోర్టులో అప్పీలు వచ్చింది. ఎవరో సీనియర్ ప్లీడర్‌ని ఏర్పాటు చేసి కేసు నడిపించాను. కాని, కిందికోర్టు తీర్పే ఖాయపడింది. అపైన హైకోర్టుకి అప్పీలు చేయించి, అప్పీలు విషయంలో స్వయంగా కృషి చేసి, కేసు గెలిపించాను. దాంతో నా పేరు అటువైపుని బాగా పాకింది. ప్లీడరీలో మొదటినించీ కూడా స్వతంత్రత చూపిస్తూ, సీనియర్లు అనే వాళ్ళ నాశ్రే లక్ష్యపెట్టకుండా, తొందరగా ప్రాక్టీసు సంపాదించడం వల్ల, తోటి ప్లీడర్ల అసహనానికి పాత్రుణ్ణి అయ్యాను. తత్ఫలితంగా కొందరు ప్లీడర్లు నామీద కక్ష కట్టారు కూడాను. దానికి ఏమీ కారణం లేదని నా నమ్మకము. అందులో ముఖ్యులు నేతి సోమయాజులు, ములుకుట్ల అచ్యుతరామయ్యగార్లు. నేతి సోమయాజులుగారు గవర్నమెంటు ప్లీడరు కూడాను. ఆయన నామీద కక్ష సాధించడానికి ఏ పని చెయ్యడానికీ కూడా సందేహించలేదు.

ఇల్లాగ ప్రాక్టీసు బాగా సాగుతూండగా నేను అనాడు రాజ

మహేంద్రవరం అంతటినీ కలవరపరుస్తూ వున్న మునిసిపల్ వ్యవహారాల్లోపడ్డాను. ఒక కేసులో ముద్దాయి తరఫున నేను, ఫిర్యాది తరఫున ఆయన హాజరయ్యాము. కేసు తాడినాద వెంకట్రామయ్య అనే మేజస్ట్రీటు దగ్గిర. ఆయన వింతపద్ధతి అవలంబించి, వకీలుగా ఉన్ననన్ను, సాక్షిగా పిలిపించాడు. నాచేత సాక్ష్యం పుచ్చుకుని తన తరఫున మరి కొందరి సాక్షులచేత నేను చెప్పినదానికి విరుద్ధంగా చెప్పించి, అబద్ధం సాక్ష్యం ఇచ్చినందుకు నామీద ప్రాసిక్యూషన్‌కోసం పిటీషన్ పెట్టాడు. ఒక ప్లీడరు ఇంకొక ప్లీడర్ని ఇలాగ కక్ష సాధించడం చాలా అపూర్వమైన విషయం! మేజస్ట్రీటు చాలా క్లిష్టపరిస్థితుల్లో పడ్డాడు. కాని, సోమయాజులుగారు గవర్నమెంటు ప్లీడరుగా తనకి వున్న పరువుప్రతిష్ఠలు ఉపయోగించి మేజస్ట్రీటుని స్వాధీనపరచుకున్నాడు. కేసు ఫైలయింది రాజమహేంద్రవరం జాయింటు మేజస్ట్రీటుదగ్గిర. వెనక లక్ష్మణదాసు కేసులో ఏలూరులో వున్న క్రెస్టాప్ అప్పటికి రాజమహేంద్రవరం సబ్‌కలెక్టరుగా వచ్చాడు.

ఇంక అడిగే దేముంది! అందరూ 'అతనికి నా మీద ఏదో కొంచెం ఆగ్రహం ఉండకపోదనీ, నాకు తప్పకుండా శిక్ష పడుతుందనీ' అనుకున్నారు. నేనే క్రెస్టాప్ దగ్గిర స్వయంగా హాజరయ్యాను. ఆ క్రెస్టాప్ దగ్గిర నేను చూపిన ఉత్కృష్టత ఏమి టంటే—ఆయన నన్ను చూపి ముందుగానే "ఏమండీ! ఈ కేసు నేను విచారించడానికి ఏమైనా అభ్యంతరం వుందా? ఏలూరు సమాచారంవల్ల మీకు నామీద ఏదైనా అనుమానం వుందా?" అని అడిగాడు. నాకు అల్లాంటి సంకోచం ఏమీ లేదనీ, కేసులో విచారణ న్యాయంగా జరుగుతుందనే నమ్మకం నాకు వుందనీ చెప్పాను. ఆపైన ఆయన కేసు విచారించాడు. సోమయాజులుగారు తను అల్ల గలిగిన కథ అంతా అల్లాడు. కాని క్రెస్టాప్ చివరికి నేను నిర్దోషి నని తీర్పు ఇచ్చి, ఇల్లాంటి అభూత కల్పనాయుతమైన కేసు ఎన్నడూ జరగలేదనీ, గవర్నమెంటు ప్లీడరు తన పలుకుబడి దుర్వినియోగం చేశాడనీ వ్రాశాడు.

# 8

## మునిసిపల్ రాజకీయాలు

నేను స్వతంత్రంగా కాలక్షేపం చేస్తూ, రెండు చేతులా డబ్బు సంపాదిస్తూ వుండి, ఆనాటి రాజమహేంద్రవరం మునిసిపల్ రాజకీయాల్లో పడ్డాను. రాజమహేంద్రవరం మునిసిపాలిటీ ఆంధ్రదేశంలో కల్లా పురాతనమైన మునిసిపాలిటీ. దానికి సుమారు 50, 60 వేల రూపాయలు ఆదాయం వుండేది. నేను రాజమహేంద్రవరం చదువుకోసం వచ్చే రోజులకే మునిసిపల్ రాజకీయాలు బాగా జోరుగా వుండేవి. అప్పటికి శ్రీ ఏలూరి లక్ష్మీనరసింహంగారు మునిసిపల్ ఛైర్మన్‌గా వుండేవారని ఇదివరకే వ్రాశాను. ఆయనకి పూర్వం వుద్యోగస్థులు—అంటే కాలేజీ ప్రొఫెసర్లు, రెవిన్యూ వుద్యోగస్థులు ఛైర్మన్లుగా వుండేవారు. ఏలూరి లక్ష్మీనరసింహంగారే మొదటి నానఫీషియల్ ఛైర్మన్. మునిసిపాలిటీలో ఆయన కిరీటంలేని రాజులాగ చలామణీ అయ్యాడు. అప్పటికే సుబ్బారావు పంతులుగారు, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, నేతి సోమయాజులుగారు మొదలైనవారు పురప్రముఖులై, ఏలూరి లక్ష్మీనరసింహంగారిని ఓడించడానికి అవకాశం వచ్చినప్పుడల్లా ఏదో విధంగా ప్రయత్నిస్తూనే వుండేవారు. ఆయనమీద ఏవో రకరకాల పన్నాగాలు పన్నేవారు. సుబ్బారావు పంతులుగారు ప్రసిద్ధ రాజకీయ నాయకులై ఆ తరవాత 'ఆంధ్రభీష్మ' బిరుదం పొందగలిగారు; కాని, అప్పట్లో స్థానిక రాజకీయాల్లో బహూలౌక్యులు. తమరు వెనకాల వుండి తమ ముఖ్యశిష్యులచేత తమాషాగా నాటక మాడించేవారు. ఆయనకి అదొక విలాసం. ఇతరులమీద బహు నేర్పుగా దెబ్బలు తీస్తూ వుండేవారు. కాని, ఏలూరి లక్ష్మీనరసింహంగారు మాత్రం లొంగేవారు కారు. మెరక వీధి తెలగాలు, షాహుకార్లు కొందఱూ ఆయనకి పట్టుగా వుండి సుబ్బారావుపంతులు ప్రభృతులుచేసే ఎత్తులు అన్నీ భగ్నం చేసేవారు.

లక్ష్మీనరసింహంగారిమీద రకరకాల నిందలు పడ్డాయి. ఆయనకి

ష్ఠీ లోలత్వం వుండేది. కాని ప్రజల సొమ్ము స్వ వినియోగం చేసు కునే మనిషి మాత్రం కాదు. కాని, చాలాకాలానికి సుబ్బారావుపంతులు ప్రభృతులు ఆయనమీద ఎత్తిన దండయాత్రలకి లొంగిపోయాడు. సుబ్బారావుపంతులు ప్రభృతులకి వీరేశలింగం పంతులుగారు, ఆయన వివేకవర్ధనీపత్రిక కూడా తోడయ్యాయి. ఏలూరి లక్ష్మీనరసింహంగారి మీద ఆ పత్రికలో వ్యంగ్యంగా అనేక చిత్రమైన కథలు వ్రాసేవారు. దానిమీద లక్ష్మీనరసింహంగారు, పరువునష్టం దావా వేశారు. ఆ దావాలో జస్టిఫికేషన్ ప్లీ పెట్టి లక్ష్మీనరసింహంగారిని అనేక సాక్ష్యాలతోటీ, సంప న్నులతోటీ బాగా అల్లరి పెట్టారు. అందుచేత, ఆయన నిస్పృహ చెంది ఈ రాజకీయాల్లో నిడమర్తి దుర్గయ్యగారిని తనస్థానే ప్రవేశ పెట్టారు.

దుర్గయ్యగారు చాలాకాలం ఛైర్మన్‌గా వున్నారు. ఈ మునిసి పల్ వ్యవహారాల్లో రాయపూడి సుబ్బారాయుడు అనే వైశ్య ప్రముఖుడు ఒకాయన చాలా ఎన్నికలోవాడు. ఆయన అట్టే చదువుకున్నవాడు కాడు. కాని, మునిసిపల్ వ్యవహారాల్లో అందెవేసిన చెయ్యి. ఎవరు మునిసిపల్ కౌన్సిలరు కావా లన్నా, ఛైర్మన్ కావాలన్నా ఆయన సహాయం లేకపోతే అది అసంభవమే! ఆయన చాలా ప్రతిభావంతు డనే చెప్పాలి. దుర్గయ్యగారు ఆయన సహాయంతోటే చాలాకాలం ఛైర్మన్ చేశారు. ఏలూరి లక్ష్మీనరసింహంగారు కూడా దుర్గయ్యగారికి అండగా నిలిచి పనిచేశారు. సుబ్బారావు పంతులుగారు, నేతి సోమ యాజులుగారు మొదలయిన వారు కౌన్సిల్లోకి రావడానికి ఎన్నో విధా లుగా ప్రయత్నాలు చేశారు కాని, జయించలేకపోయారు. చివరికి ప్రభు త్వపు ప్రాపకంవల్ల సోమయాజులు, సుబ్బారావు పంతులుగార్లు కౌన్సిల్లో నామినేటెడ్ సభ్యులుగా ప్రవేశించారు. కాని, దుర్గయ్యగారికి వుండిన మెజారిటీవల్ల వాళ్ళమాట సాగేది కాదు. వాళ్ళు చివరకి విసిగి వేసారి రాజీనామాలు ఇచ్చివేశారు.

ఈ వ్యవహారాల్లో రాయపూడి సుబ్బారాయుడు బొమ్మల్ని ఎక్కించి దింపించేటంత ప్రతిభాశాలి అని వ్రాశాను. అతనికి మునసబు

కోర్టులో చాలా దావాలు వుండేవి. రంగమన్నారు కాలంలో అతను నాకు క్లయింటు అయ్యాడు. అప్పటికి ఆయనకీ దుర్గయ్యగారికీ ఏవో అంతశ్శీతలాలు బయలుదేరాయి. బయలుదేరడంలో ఆశ్చర్యం ఏమీ లేదు! ఛైర్మన్ పదవికి సహాయం చేశారు కనక, పరిపాలనలో కొంచెం లోతుగా జోక్యం కలగజేసుకునేవారు. దుర్గయ్యగారివంటి స్వతంత్రుడు దానికి అంగీకరించకపోతే సహజంగా తగాదా వచ్చేది. కనక, ఆ రాయపూడి సుబ్బారాయుడి దృష్టి నామీద పడింది. అప్పట్లో నాకు ఎల్లాగైనా బి. ఏ. పూర్తిచేసి ఫస్టుగ్రేడు పాసు కావాలని వుండేది. హనుమంతరావు నాయుడిగారి సలహా పైని బి. ఏ. పార్టుగా పాసు కావడానికి సంకల్పించుకుని ముందు తెలుగుకి హాజరై పాసయ్యాను. కాని, ఈ మునిసిపల్ వ్యవహారాల్లో పడి ఆ చదువుకి స్వస్తి చెప్పవలసివచ్చింది.

ఆకాలంలో మునిసిపాలిటీకి ప్రతి సంవత్సరమూ ఎన్నికలు జరుగుతూ వుండేవి. ఖాళీ అయిన ప్రతిస్థానంలోనూ మనుష్యుల్ని కూర్చుకుని ఛైర్మన్ ఎన్నిక వచ్చేసరికి బలాబలాలు తేల్చుకుంటూ వుండేవాళ్ళు. సుబ్బారాయుడు ప్రభృతుల ప్రోత్సాహంమీద నేను ఎన్నికలకి నిలిచినప్పుడు దుర్గయ్యగారు నన్ను రాకుండా చెయ్యడానికి ప్రయత్నించేవారు. నేను అతి శ్రమపడి అన్ని ఏర్పాట్లూ చేసుకునేసరికి, ఆఖరురోజు రాత్రి ఆయన తన ఛైర్మన్ పలుకుబడి అంతా ఉపయోగించి వోటర్లని తిప్పివేసేవాడు. నేను మొట్టమొదట ఏ వార్డుకి నిలబడ్డానో జ్ఞాపకం లేదు కాని 1896 లో ఎన్నికలకి నిలబడినట్లు గుర్తు. కాని, అప్పుడు ఓడిపోయాను.

మళ్ళీ 97, 98 సంవత్సరాల్లో బై ఎలక్షన్‌లలో అభ్యర్థిగా వున్నాను. దుర్గయ్యగారు మొత్తం మూడుసార్లూ కూడా నన్ను ఓడించారు. నేను ఏవో ఎన్నికల పిటీషన్లు వగైరాలు పెడుతూ వుండేవాణ్ణి. వాటిని అన్నిటినీ దుర్గయ్యగారు ఎదురుకుంటూ వుండేవారు. దుర్గయ్యగారు మొత్తంమీద చాలా ప్రతిభావంతులు. మేధావులు. సర్వస్వతంత్రులు. నైతికోన్నతీ, పరిపాలనాశక్తీ, ధైర్యస్థైర్యాలూ వున్నవారు. మరి ఒకరు అయితే సుబ్బారావు పంతులుగారి ఎత్తుల్లో పడి పట్టీలు కొట్టవల

సినవారే! ఆయన పరిపాలనలో కూడా చాలా హుందాతనం చూపించారు. ఆనాటి పార్టీకక్షలెంత తీవ్రంగా వెళ్ళాయంటే—ప్రతిపక్షులు చివరికి దుర్గయ్యగారిమీద కూడా అక్రమమైన ఆరోపణలు చేసేవారు. దుర్గయ్యగారు నాకు ప్రతికక్షిగా పనిచేసినా ఆయన ధైర్యమూ, సమర్థతా మొదలయిన సుగుణాలుచూస్తే నాకు ఆయనయందు అభిమానం ఉండేది.

నేను 1898 లో కాటోలు మంచపల్లి సుబ్బారావుగారిమీద పోటీ చేసి ఓడిపోయాను. అప్పుడు ఛైర్మన్ పదవిపలుకుబడి అంతా వినియోగించి, వోటర్లని తిప్పివేసి నా ఎన్నికకి భంగం కలిగించారు కనక, ఎన్నిక రద్దు చెయ్యవలసిందని సబ్‌కలెక్టరుకి పిటీషన్ పెట్టాను. దానిమీద సబ్‌కలెక్టరు దుర్గయ్యగారికి నోటీసు పంపించి, కోర్టుకి రప్పించి, కుర్చీమీద కూర్చోపెట్టాడు. అప్పుడు నేను ఆ సబ్‌కలెక్టరుతో "ఏమండీ! నేను ఆ పెద్దమనిషిమీద నేరం ఆరోపిస్తే, మీరు ఆయనకి కుర్చీ ఇచ్చి కూర్చోబెట్టి, నన్ను దోషారోపణ చెయ్యమనడం ఏమి సబబుగా ఉంది?" అని అడిగాను. అందుమీద సబ్‌కలెక్టరు దుర్గయ్యగారికేసి చూసి, "దీనికి మీరు ఏమంటారు?" అన్నాడు. ఆ పైన దుర్గయ్యగారు నిర్భయంగా "నేను కాన్వాసు చేసినమాట నిజమే! ఆ పెద్దమనిషి కౌన్సిల్లోకి రావడానికి ఎంత ప్రయత్నం చేస్తున్నాడో, రాకుండా చెయ్యడానికి వోటర్ని అయిన నాకూ అంత హక్కుంది," అని వాదించారు. నేను ప్రతివాదన చెప్పినా, ఆయన చెప్పిన సాహసపద్ధతికి చాలా సంతోషించాను.

సబ్‌కలెక్టరు ఏమీ కలగజేసుకోలేదు. ఆఖరికి నన్ను 1899లో, నాలుగవవార్డులో కౌన్సిలరుగా ఎన్నుకున్నారు. దుర్గయ్యగారిని తప్పించడానికి ప్రయత్నంచేస్తూ వచ్చిన సుబ్బారావుపంతులుగారు కూడా కొంచెం సంతోషించారు. నేను కౌన్సిలర్ని అయినప్పటినించీ ప్రతి సంవత్సరమూ వచ్చిన బై ఎలక్షన్లలో పోటీలు పెట్టి దుర్గయ్యగారి మనుష్యుల్ని ఓడించాను. క్రమంగా రెండేళ్ళలో దుర్గయ్యగారి పార్టీమనుష్యుల్ని అందర్నీ

ఓడించి,రాయపూడి సుబ్బారాయుడూ నేనూ మా మనుష్యుల్ని కౌన్సిల్లో ప్రవేశ పెట్టగలిగాము.

1901 వ సంవత్సరంలో దుర్గయ్యగారి ఛైర్మన్‌పదవి ఖాళీ అయింది. అప్పుడు స్నేహితులు అంతా నన్ను ప్రోత్సాహం చేశారు. సుబ్బారావు పంతులుగారు దుర్గయ్యగారి పార్టీని ఓడించినంతవరకు అంతర్యంలో సంతోషించేవారే కాని, నేను ఛైర్మన్ అవుతా నంటే ఎంతమాత్రమూ ఇష్టపడే వారు కారు. ఆయన స్వతః నేను స్వతంత్రుణ్ణి అనీ, తమ చెప్పు చేతలలో ఉండననీ నిశ్చయించుకుని వ్యతిరేకంగా పనిచేశారు.

అప్పటికి నా ప్రాక్టీసు బాగానే వుండేది. చిన్నప్పుడు నా సహాధ్యాయీ, హనుమంతరావు నాయుడుగారి మేనల్లుడూ అయిన పిళ్లారిసెట్టి నారాయణరావు బి. ఎ., బి. ఎల్. పాసయి హైకోర్టు వకీలు అయ్యాడు. మేము వుభయులమూ రిజిష్టర్డు పార్టనర్‌షిప్ ఏర్పాటు చేసుకుని జాయింటు ప్రాక్టీసు ప్రారంభించాము. సెంట్రల్ మార్కెట్టుకి ఎదురుగా వున్న కోకా వెంకటేశ్వరరావుగారి ఇంట్లో మా ప్రాక్టీసు. జిల్లా కోర్టు పని అతనూ, మిగతా పని నేనూ చూసుకుంటూ వుండేవాళ్ళము. మా తమ్ముడు శ్రీరాములు బి. ఏ. పాసయి ఫస్టుగ్రేడుకి చదువుకుంటున్నాడు. అతను ఫస్టుగ్రేడు పాసయ్యాక కొద్దికాలం నా దగ్గిరే ప్రాక్టీసు చేశాడు.

ఆ సమయంలోనే కొత్తగా లెజిస్లేటివ్ కౌన్సిలు ఎన్నికజరిగింది. మునిసిపల్ కౌన్సిలర్లు అంతా వోటర్లు. ఆ రోజుల్లో అప్పుడే ఇంగ్లండు వెళ్ళి వచ్చిన కోలాచలం వెంకట్రావుగారికీ, సుబ్బారావు పంతులుగారు ఏర్పాటుచేసిన కృత్తివెంటి పేర్రాజుగారికీ పోటీ జరిగింది. కోలాచలం వెంకట్రావుగారు అంతవరకూ బళ్ళారిలో ఫస్టుగ్రేడు ప్లీడరుగా వుండేవారు.

అల్లాంటప్పుడు "ఛైర్మన్ ఎవ్వరా?" అనే తర్జనభర్జన వచ్చింది. కొందరు దుర్గయ్యగారినే మళ్ళీ వుండమని అడిగారు. కాని, ఆయన తనకి మెజారిటీ లేనప్పుడు అల్లాగ వుండడం సబబు కాదని చెప్పి

నిర్మోహమాటంగా తప్పుకున్నారు. అందులోనూ, ఆయన ఘనత ఎక్కడ వుందంటే—ఒకసారి తప్పుకున్నాక మరి ఆ పని చేస్తున్న వాడికి ఇంక అడ్డుపుల్ల వెయ్యకుండా వుండడంలోనే! చేసినన్నాళ్ళూ ఆయన చేశారు. ఇంక బలం లేనప్పుడు మెల్లిగా తప్పుకుని ఎదటివాడికి పూర్తి అయిన అవకాశం ఇచ్చివేశారు. నిజానికి ప్రజాస్వామిక సంస్థలలో ఇల్లాంటి పద్ధతి అవలంబించడం చాలా ప్రశంసనీయమైన విషయము.

దుర్గయ్యగారు, తరవాత నా మీద పిటీషన్లు వగైరాలు ఇచ్చిన రోజులలో కాని, లేని పోని కేసులు పెట్టే కాలంలోగాని, ఎప్పుడూ ఏవిధమయిన జోక్యమూ కలిగించుకో లేదు. అందుకు ఆయన అంటే నాకు చాలా గౌరవం.

దుర్గయ్యగారు వుండగనప్పుడు మళ్ళీ ఏలూరి లక్ష్మీనరసింహం గారు ఛైర్మన్‌పనికి తయారయ్యారు. "నేను కదా దుర్గయ్యగారికి ఇంత కాలం సహాయం చేశాను. ఆయన వుండకపోతే, మళ్ళీ నే నెందు కుండకూడదు!" అని ఆయన వాదన. కాని నేను ఆయనతో, "మీ మీద ఎన్నో కేసులు ఇదివరకే వ్యాపించి వున్నాయి. పైగా, మీకు చాలామంది శత్రువులు ఏర్పడ్డారు; మీరు నాకు చిన్నప్పుడు అధ్యాపకులు కూడాను. ఆ గౌరవంచేత మీరు తప్పుకోవడం చాలా మంచి దండి!" అని సలహా ఇచ్చాను. ఆయనకి మనస్సులో కొంచెం కష్టం కలిగింది. కాని, ఎదట కాదనలేకపోయారు. అయితే, నా సలహా మాత్రం రుచించలేదు. అయినా తమకి నా సహాయం లేనిదే ఆ పదవి లభించే అవకాశం లేదని కూడా గ్రహించారు.

అందుచేత, ఒక పెద్దఎత్తు ఎత్తారు. లక్ష్మీనరసింహంగారు కూడా ఎత్తు పైయెత్తు వెయ్యడంలో సుబ్బారావు పంతులుగారికి తీసి పోయేవారు కారు. నెమ్మదిగా స్థానిక సబ్‌కలెక్టరు యస్. వి. యస్. రైస్ అనే ఆయన దగ్గిరికి వెళ్ళి ఆయన్ని ఛైర్మన్ పదవికి అభ్యర్థిగా తయారుచేశారు. రైస్ ప్రభుత్వోద్యోగి, కనక వుద్యోగస్థు లంతా వోట్లు ఇస్తారనీ, వర్తకులు మొదలైనవాళ్ళు వ్యతిరేకంగా వుండరనీ, నాతోటి

ప్లీడరులు కూడా సబ్‌కలెక్టరుకి వ్యతిరేకంగా పనిచెయ్యలేరనీ, అందు చేత విజయం నిశ్చయమనీ చెప్పి బాగా పురి ఎక్కించారు. ప్రభుత్వో ద్యోగంతోబాటు ప్రజల ప్రాతినిధ్యం కూడా లభిస్తే ఆయనకి ఎక్కువ గౌరవంగా వుంటుందని హెచ్చరిక చేశారు. దాంతో రైస్ బోల్తా కొట్టాడు. కాబో లంటే కాబోలనుకుని కాన్వాసింగు ప్రారంభించాడు.

అప్పటికి దుర్గయ్యగారి ఛైర్మన్ గిరీ టైము అయిపోవడంచేత సబ్‌కలెక్టరే తాత్కాలికాధ్యక్షుడు. రైస్ నా అభిప్రాయం కనుక్కోడా నికి మునిసిపల్ సెక్రటరీ దామరాజు బసవరాజుని నా దగ్గిరికి పంపిం చాడు. ఆయనవచ్చి నన్నడిగినప్పుడు నేను నిర్మొహమాటంగా "నా వోటివ్వను సరిగదా! నా కంఠంలో ప్రాణం వున్నంతవరకు ఆయన కాకుండా నా సర్వశక్తులూ వినియోగిస్తాను. ఇది వుద్యోగులు కాని వాళ్ళకోసం ఏర్పడిన పదవి అయి వుండగా, తను ఇందులోకి రావడం అప్రశస్తమని నా మాటగా చెప్పండి!" అని చెప్పాను. బహుశః ఆయన ఆ మాటలు రైస్‌తో చెప్పే వుంటాడు.

ఇక మా ఛైర్మన్ అభ్యర్థి నిర్ణయంలో నా విషయం మొదట చర్చకి వచ్చింది. నా వయస్సు అప్పటికి సుమారు 27, 28 సంవత్స రాలు మాత్రమే. నాకు అంత చిన్న వయస్సులో చైర్మన్ పదవికి తొందరపడకూడ దనిపించింది. దాంతోబాటు నా కిప్పుడు స్ఫురణకి రాని ఎన్నో కారణాలు తోడయ్యాయి.

అప్పటికి కొద్దికాలం కిందట మోచర్ల రామచంద్రరావు పంతులు గారు (తరవాత సర్) బి. ఏ., బి. ఎల్. పానయి సుబ్బారావు పంతులు గారి దగ్గిర జూనియర్‌గా ప్రవేశించారు. ఆయన అక్షరాలా పంతులుగారి శిష్యుడే. వేషంలో కూడా సరీగా అల్లాగే వుండేవాడు. ఆఖరికి చేతికర్ర కూడా అల్లాగే పట్టుకునేవాడు. సుబ్బారావు పంతులుగారి పలుకుబడివల్ల ఆయన కూడా 'మునిసిపాలిటీలో నామినేటెడ్ కౌన్సిలరుగా చేరాడు. మేము ఆయన్ని ఛైర్మన్‌గా పెట్టడానికి సంకల్పించాము. ఈ నిశ్చయం ఏలూరి లక్ష్మీనరసింహంగారికి మరింత కష్టం కలిగించింది. వాస్తవానికి లక్ష్మీనరసింహగారికీ సుబ్బారావుపంతులుగారికే పార్టీ. లక్ష్మీనరసింహం

గారికి నేను వుండడమో, లేక ఆయన ఉండడమో అంతేగాని తనకి ప్రత్యక్ష ప్రతికక్షి అయిన పంతులుగారి శిష్యుణ్ణి ఈ పదవి కెక్కించడం ఎంత మాత్రమూ ఇష్టం లేదు. లక్ష్మీనరసింహంగారు ఆ కారణంచేత కూడా రైసుని బాగా ఎగసనతోశారు.

రైసు కాన్వాసింగు చాలా బలమైనది. అప్పటికి ఇన్‌కంటాక్సు అధికారం సబ్‌కలెక్టరుదే కనక, ఆలపాటి భాస్కరరామయ్యగారు, మారడుగుల వెంకటరత్నంగారు మొదలయిన వైశ్యసభ్యులంతా కేవలమూ భయంచేత రైసుకి అనుకూలంగా మెత్తబడ్డారు. రైస్‌నామినేషను, మోచర్ల నామినేషను కలెక్టరుదగ్గర దాఖలయ్యాయి. ఎప్పుడైతే బసవరాజుగారు నా దగ్గిరికి వచ్చి రైస్ ఆలోచన నాతో చెప్పారో, ఎప్పుడైతే షాహుకార్లు మెత్తబడుతున్నారో అప్పుడే నేను రామచంద్రరావు పంతులుగారితో జాగ్రత్తగా వుండమనీ, ఒకసారి రైస్‌ని చూడమనీ చెప్పాను.

దానిమీద రామచంద్రరావుగారు ఆయన్ని చూడడానికి ఇంటికి వెళ్ళగా రైస్ ఆయన్ని చూడనని కబురు పంపించాడు. రామచంద్రరావుగారు నిస్పృహతో తిరిగి వెనక్కి వచ్చేశారు. మరి రెండు రోజులకి మునిసిపల్ కౌన్సిలు మీటింగు జరిగింది. ఆ మీటింగుకి మా పార్టీ పూర్తిగా హాజరై, మునిసిపల్ కంట్రాక్టు వ్యవహారాలని గురించి కొన్ని విషయాలు సేకరించి, వాటినన్నిటినీ ఒక సీలువేసిన కవరులో పెట్టి, రైస్‌ని ప్రశ్నలు వెయ్యడం ఆరంభించుకుంది. మేము ఓవర్సీరుని పిలిపించి సమాధానాలు చెప్పించమన్నాము! చాలావరకు చర్చ అయ్యాక రైస్ నన్ను ఒకసారి ఇంటికి వచ్చి మాట్లాడమని కోరాడు.

నేను సరేనని ఆ మర్నాడు రైస్ ఇంటికి వెళ్లాను. ఆయనకి ఛైర్మన్ అభ్యర్థిత్వాన్ని గురించి గట్టిగా చెప్పాను. రిప్పన్‌ప్రభువు చేసిన ఈ మునిసిపల్ ఆక్టు ఉద్దేశం ఉద్యోగస్థులు పరిపాలన చెయ్యడం కాదనీ, తను పోటీ చెయ్యకూడదనీ, ఇదంతా ఏలూరి లక్ష్మీనరసింహంగారి ప్రోత్సాహమనీ, 'కాదు కూడ'దని నిలబడితే మా పార్టీ బలంగా నిలబడి ఓడిస్తామనీ చెప్పాను. రైస్ విషయం అంతా సమగ్రంగా

గ్రహించి, "ప్రకాశంగారూ! నేను ఏలూరి లక్ష్మీనరసింహంగారి మాయ మంత్రంలో పడను. రేపు రామచంద్రరావుగారిని ఒకసారి పంపించండి! కలెక్టరుకి నా నామినేషన్ ఉపసంహరించుకునే ఉత్తరం వ్రాసి ఇస్తాను," అన్నాడు.

మర్నాడు రామచంద్రరావు ఆయనదగ్గిరికి వెళ్ళి, ఉత్తరం తీసుకున్నాడు. రామచంద్రరావుపంతులుగారు పోటీ లేకుండా ఛైర్మన్ అయ్యారు.

రామచంద్రరావుపంతులుగారు సుబ్బారావుపంతులుగారి వరవడి దాటనివాడని ఇదివరకే వ్రాశాను. ఆయన ఆ జన్మాంతమూ వదలని అ తలపాగా, ఆ నడికట్టూ, ఆ బుజంమీదా కర్రా, నాకు ఇప్పటికీ కూడా కళ్ళకి కట్టినట్టున్నాయి. ఆయన సహజంగా శుద్ధ మితవాది. దానికితోడు న్యాపతివారి గురుత్వం. రామచంద్రరావుగారి దినచర్య ఆశ్చర్యంగా వుండేది. తెల్లవారి లేస్తూనే ఆయన కర్ర బుజాన వేసుకుని ముందు గ్రామమునసబు కోటీశ్వరరావుగారిని పలకరించి వెళ్ళేవాడు. తరవాత తాసిల్దార్ ఇంటిమీదుగా వెళ్ళి, ఆయన్ని పలకరించేవాడు. ఒకసారి సబ్ కలెక్టరు శిరస్తాదారు రామభద్రుడుగారిని పలకరించేవాడు. మొత్తంమీద ఉద్యోగస్థుల ప్రాపకంకోసం తికమకలు పడుతూ వుండేవాడు.

రామచంద్రరావుగారు ఛైర్మన్ అయిన తరవాత ప్రజల అసంతృప్తికీ, ఆగ్రహానికీ పాత్రులు కావడానికి ఎంతో కాలం పట్టలేదు. ఆయన పరిపాలనలో ఎక్కువగా ఉద్యోగస్థుల సలహాలు అనుసరించే పోయేవారు. కాని, ప్రజల అవసరాలు అవగాహన చేసుకుని సంతృప్తి పరచలేకపోయేవారు. ప్రతి విషయమూ ముందు కలెక్టరుతో సంప్రదించి ఆయనకి ఇష్టమైతేనే ముందు అడుగు వేసేవారుగాని, ప్రజల అవసరం గ్రహించలేకపోయేవారు. రైస్ పార్టీవాళ్ళు నిస్పృహ చెంది, "ఆ పక్షంలో రైస్‌నే పెట్టుకో లేకపోయామా!" అని నాతో చెప్పేవారు. ఆయన ఏ విధమైన కొత్తపద్ధతులూ ప్రవేశపెట్టలేకపోయారు. చివరికి ప్రజలకీ, ఆయనకీ కూడా ఆ విషయంలో విసుగు కలిగింది.

ఇల్లా వుండగా, అప్పట్లో లెజిస్లేటివ్ కౌన్సిల్‌కి తెలుగుజిల్లా

కొత్త స్థానం ఖాళీ అయింది. ఆ స్థానానికి ఆ రోజుల్లోనే ఇంగ్లండునించి తిరిగి వచ్చి, బళ్ళారిలో ప్లీడరీ చేస్తూన్న కోలాచలం వెంకట్రావుగారు పోటీ చేశారు. కాకినాడలో ప్లీడరీ చేస్తూన్న కృత్తివెంటి పేర్రాజుగారు కూడా ఆ స్థానానికి నిలబడ్డారు. ఆయన సుబ్బారావుపంతులుగారి అభ్యర్థి. కోలాచలం వెంకట్రావుగారు అప్పుడే విదేశాలనించి తిరిగి వచ్చారని వ్రాశాను.

ఆ కాలంలో అల్లాంటి మనుష్యులమీద మోజు ఎక్కువగా వుండడంచేత నేనాయనకి అనుకూలంగా పనిచేయడానికి నిశ్చయించాను. అందుచేత సుబ్బారావుపంతులుగారికి నామీద విపరీతమైన ఆగ్రహం కలిగింది. కృత్తివెంటి పేర్రాజుగారు నాకు కొద్దో గొప్పో బంధువర్గంలో వాడైనప్పటికీ, నేను రాజమహేంద్రవరంలోనే కాకుండా ఇతర గ్రామాలకి కూడా వెళ్ళి, వెంకట్రావుగారి తరఫున ప్రచారం చేశాను. వెంకట్రావుగారు గెలిచారు. కృత్తివెంటి పేర్రాజుగారు ఓడిపోవడంతోనే సుబ్బారావుపంతులుగారు నన్ను ఏవిధంగానూ కూడా పైకి రానియ్యనని శపథం పట్టారు.

రామచంద్రరావుగారు రెండు సంవత్సరాలు మునిసిపాలిటీని పరిపాలించారు. ఆ తరవాత మళ్ళీ ఛైర్మన్ ఎన్నిక వచ్చింది. ఈ రెండు సంవత్సరాల్లోనూ ములుకుట్ల అచ్యుతరామయ్యగారు కౌన్సిల్లో ప్రవేశించారు. 1901 వ సంవత్సరంలో ఛైర్మన్ ఎన్నిక. అప్పుడు కౌన్సిలులో మార్కు హంటరు మెంబరు.

పి. టి. శ్రీనివాసయ్యంగారి తమ్ముడైన ఆరాముదయ్యంగారు కూడా ఒక సభ్యుడు. ఆయన ఆలపాటి భాస్కర రామయ్యగారితో కలిసి కలప వ్యాపారం చేస్తూ, మొట్టమొదట రంపపు కోతమిల్లు పెట్టి నడిపించాడు. ఆయన నా పార్టీకి సంబంధించినవాడే. అంతవరకూ సుబ్బారావుపంతులుగారి వెనక వుండి ఓడిపోతూవచ్చిన కనపర్తి శ్రీరాములుగారు మా పార్టీలో చేరి, నాతోబాటు కౌన్సిలర్ అయ్యారు. రాయపూడి సుబ్బారాయుడు సంగతి చెప్పనే అక్కరలేదు కదా! నామినేటెడ్ సభ్యుల్లో కూడా చాలామంది నాకు సహాయకులుగా వుండేవారు.

పిఠాపురిసెట్టి నారాయణరావు నాయుడుగారు కూడా కౌన్సిలరయ్యారు.

కౌన్సిల్లో బజులుల్లా సాహేబు సోదరుడుఅజీముల్లా అని ఒక అతనువుండేవాడు. అతను అసిస్టెంటు ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్సుగా పనిచేస్తూ వుండేవాడు. చాలా స్వతంత్రుడు. ఈ నాటి నామినేటెడ్ మనుషుల్లాగ ఒట్టి డిటోగాడు కాడు. వెనక రైస్ రామచంద్రరావుగారి మీద పోటీ చెయ్యదలుచుకున్నప్పుడు కూడా అతను ఉద్యోగేతరుల తరఫునే నిలబడ్డాడు.

మొత్తంమీద మా పార్టీ చాలా బలంగానే వుండింది. మోచర్ల రామచంద్రరావుగారు తమంతట తామే తప్పుకున్నారు. మా పార్టీ వారంతా నన్ను అభ్యర్థిగా నిర్ణయించారు. సుబ్బారావుపంతులుగారు నా మీద తీవ్రమైన కక్ష కట్టారని ఇదివరకే వ్రాశాను. ఆయన నేను ఛైర్మన్ కాకూడదని బ్రహ్మాండంగా పట్టుపట్టారు అప్పట్లో ఉద్యోగస్థు లంతా ఆయన పక్షాన్ని వుండేవారు. ఆ రోజుల్లో హేమ్లెట్ అనే ఆంగ్లో ఇండియన్ జిల్లాజడ్జీగా వుండేవాడు. ఆయన ఉద్యోగస్థు లందరి తోటీ నా మీద ఏవేవో చెప్పేవాడు. వాళ్ళకి నామీద బాగా అనిష్టం కలిగేటట్లు చేసేవాడు.

అయితే ఎన్నికలు సమీపించేసరికి, మార్క్సు-హంటరు మొదలయిన ఉద్యోగస్థు లంతా నాకు అనుకూలం అయ్యారు. అప్పుడు సుబ్బారావుపంతులుగారు ములుకుట్ల అచ్యుతరామయ్యగారిని లేవదీశారు. పంతులుగారు చివరిదాకా నాకు సహాయం చేస్తానన్న సబ్‌కలెక్టరు విన్‌సీ, హంటర్‌నీ కూడా, జిల్లాజడ్జీచేత చెప్పించి, నాకు ప్రతికూలంగా తయారు చేశారు. ఇన్‌కంటాక్సు బూచిని చూపించి, నాకు అనుకూలంగా వుండే వైశ్య ప్రముఖుల్ని కూడా బెదిరించడానికి ప్రయత్నించారు. రాయపూడి సుబ్బారాయుడు అప్పులతో బాధపడుతూ వుండేవాడు. అతనికి అప్పు ఇస్తామని కూడా ఆశపెట్టారు. కాని, పని జరగలేదు. నన్ను ఓడించగలమనే ధైర్యంతో బ్యాలటుకూడా పెట్టించారు. కాని, చివరికి ఎంత చేసినా అసలు మార్క్సు-హంటరు సబ్‌కలెక్టరు మీటింగుకి రానేలేదు.

ఏమైతేనేమి! అత్యధికసంఖ్యాకులచేత నేను ఎన్నుకోబడ్డాను. అచ్యుతరామయ్యకి రెండో మూడో వోట్లు వచ్చినట్లు జ్ఞాపకం. ఎన్నిక అయిన తరవాత అచ్యుతరామయ్య ఏదో ఎలెక్షన్ పిటీషన్ దాఖలు చేశాడు. అందులో అతను తప్ప రెండోవాడెవడూ దస్కతు పెట్టలేదు. అప్పటినించీ సుబ్బారావుపంతులు ప్రభృతులు నా ఎన్నిక గెజెట్ కాకుండా చేయించడానికి ఎంత ప్రయత్నం చెయ్యాలో అంతా చేశారు. చాలా ఆశ్చర్యకరములూ, అపూర్వములూ అయిన పద్ధతులన్నీ అవలంబించారు. నాకు వయస్సు తక్కువనీ, ఆస్తి లేదనీ, మునిసిపల్ సొమ్ము దుర్వినియోగం చేస్తాననీ, మనుష్యుల్ని హడలు గొడ్తేస్తాననీ, చాలా స్వతంత్రుణ్ణి అనీ, గవర్నమెంటుకి వ్యతిరేకుణ్ణి అనీ వ్రాసి పిటీషన్లు ఇచ్చారు. కలెక్టరుతో చాడీలు చెప్పారు. హేమ్నెట్ ద్వారా మునిసిపాలిటీల మెంబరైన ఫోర్బ్సుతో అనేకమైన చాడీలు చెప్పారు. అచ్యుతరామయ్య, కె. వి. రెడ్డినాయుడుగార్ల దొంగసంతకాలతో ఆకాశరామన్న అర్జీలు ఇప్పించారు. నేను కోలాచలం వెంకట్రావుగారి ఎన్నికసందర్భంలో కాసులు పంచిపెట్టి సభ్యుల్ని మోసం చేశానన్నారు.

ఈ విధంగా నేను ప్రజాప్రతినిధులచేత ఎన్నుకోబడ్డ ఎన్నిక మూడు మాసాలపాటు గెజెట్ కాకుండా చెయ్యగలిగారు. ఆ రోజుల్లో ఎన్నిక గెజెట్ కాకపోతే ఛైర్మన్ చార్జి పుచ్చుకోవడానికి వీలులేదు. నేను "ఎవరెన్ని చేస్తేమాత్రం ఏముంది? క్రమంగా జరిగిన ఎన్నిక ఎవరు రద్దు చేస్తా,"రనే మామూలు ధీమాతో వుండేవాణ్ణి.

ఇంతలో గవర్నరు ఆంప్టిల్ రాజమహేంద్రవరం వచ్చాడు. అప్పుడు తాత్కాలికంగా ఛైర్మన్ అయిన విన్ తన అధికారం పూర్తిగా వెంకటరెడ్డి నాయుడుగారికి ఇచ్చి ఆయనచేత కౌన్సిలు అడ్రస్ చదివించాడు. గవర్నరు వచ్చినప్పుడు నన్ను ఛైర్మన్ ఎలెక్టుగా కూడా పరిచయం చెయ్యలేదు. తరవాత, నామీద గవర్నమెంటుకి పంపబడిన పిటీషన్లు అన్నీ విచారణకి వచ్చాయి. సామాన్యంగా ఈ పిటీషన్లు గవర్నమెంటుమెంబరు కలెక్టరుకీ, కలెక్టరు సబ్‌కలెక్టరుకీ, ఆయన తహసిల్దారుకీ, అతను గ్రామమునసబుకీ పంపించి, ఆచోకీ తియ్యడం

మామూలు. నేను ఏమైనాసరే దీనిఅంతం కనుక్కోవాలని అనుకున్నాను.

ఈ సందర్భంలో సుబ్బారావుపంతులుగారు స్వయంగా కదలడమే కాకుండా డిసెంబరులో హేమ్నెట్‌ని ఫోర్బ్సుదగ్గిరికి పంపించారు. అప్పుడు సబ్‌కలెక్టరు విస్. అతను నా స్వతంత్రపు పోకడలకి కొంత కటకట పడినా అసలు పిటీషనులలో బలం లేదని తెలుసుకున్నాడు. గవర్నమెంటుకి పంపబడిన పిటీషన్ విచారణకి వచ్చినప్పుడు దస్కత్దారులు తప్పితే మరో మనిషి ఎవడూ కనబడలేదు.

ములుకుట్ల అచ్యుతరామయ్యగారు ఉల్లితోటలో వుండే అకునూరి రంగారావునాయుడుగారి దగ్గిరికి వెళ్ళి ఆయన ప్రమత్తులై వుండగా పట్టి తెల్లకాగితంమీద దస్కత్ చేయించారు. ఆ సంగతి తెలిసి వెంటనే కలెక్టరుకి టెలిగ్రాము ఇప్పించాను. అధికారం కోసమూ, దానికి సంబంధించిన కక్ష సాధించడానికీ, ఎంత విద్యావంతులైనా ఏరీతిగా పతనమవుతారో తెలుసుకోవడానికి ఇది ఒక నిదర్శనం. చివరికి కలెక్టరు కూడా పిటీషన్లలో సంగతులు ఋజువు కాలేదనీ, అయినప్పటికీ తన వాకబువల్ల నేను ప్రభుత్వానికి చాలా ప్రతికూలుడననీ, స్వతంత్రుడననీ తెలిసిందనీ, అందుచేత గెజెట్ చెయ్యకూడదనీ వ్రాసి పంపించాడు.

ఈలోగా నేను మద్రాసులో ఫోర్బ్సుని చూశాను. ఆయన దర్శనం అవడమే బ్రహ్మాండం అయింది. పది పదిహేను రోజులు ఇంటికి వెడితే ఇంట్లో ఉండగానే ఇంటిదగ్గిర లేరని జవాబు వచ్చేది. చివరికి నాకు ప్రాణం విసిగింది. కార్డు వెనకాల "15 రోజులనించి రోజూ దర్శనం కోసం ప్రయత్నిస్తున్నాననీ, దర్శనం ఇచ్చేదీ, లేనిదీ నిర్దిష్టంగా తెలియపరచమనీ" వ్రాసి పంపించాను. దానిమీద అతను "ఉపేక్ష మన్నించమనీ, ఆ సాయంత్రమే కూనూరు పోవడానికి సామాను సర్దుకుంటున్నాననీ, తిరిగి మద్రాసు వచ్చాక తప్పక చూస్తాననీ," బదులు వ్రాశాడు.

ఆయన కూనూరునించి తిరిగి వచ్చాక నేనాయన్ని చూశాను. అది డిసెంబరునెలలో అని నా జ్ఞాపకం. సుబ్బారావు పంతులుగారి ప్రోత్సాహం పైని హేమ్నెట్ కూడా, డిసెంబరులో ప్రత్యేకంగా

కూనూరు వెళ్ళింది. ఆ కాలంలోనే అనుకుంటాను. హేమ్చెట్టూ, ఫోర్బ్సూ పెరంబూరువరకూ కలిసే ప్రయాణం చేశారనీ, ఆ లోగా ఈ విషయమే మాట్లాడుకున్నారనీ నాకు తెలిసింది. ఉభయులూ కూనూరులోకూడా ఈ విషయమే ప్రస్తావన చేసుకున్నట్లు ఫోర్బ్సు వేసిన ప్రశ్నలనిబట్టి నాకు బాగా నిర్ధారణ అయింది. ఫోర్బ్సు మద్రాసు చేరాక నే నాయన్ని చూశాను. ఇంతకాల మయ్యాక నాకు జ్ఞాపకం వున్నంతవరకూ మా సంభాషణ వివరిస్తాను.

ఆయన నన్ను, "మీకు ఇల్లు లేదుట కదా?" అని అడిగాడు. నేను "లేదు—ఛైర్మన్ పనికి ఇల్లు ఎందుకుండాలి? రాజమహేంద్రవరానికి ప్రొఫెసర్ ఉద్యోగం చెయ్యడానికి వచ్చిన ప్రతి అలాయిదా మనిషి ఛైర్మన్ ఉద్యోగం చెయ్యగా నే నెందుకు చెయ్యకూడదూ? ఇంటి సంగ తెందుకు?" అని అడిగాను. దాంతో ఆయన తెల్లబోయాడు. తరవాత నేను రాజమహేంద్రవరం పరిస్థితులన్నీ వివరించాను. "రిప్పన్ ప్రభువు పరిపాలన ప్రజలవశం చెయ్యడానికి మునిసిపల్‌చట్టం నిర్మిస్తే, పరిపాలనకి సంబంధంలేని కారణాలు పెట్టుగుని గెజెట్ చెయ్యకుండా వుండడం ఎక్కడైనా ఉందా? ఇల్లాంటి దారుణం ఎప్పుడైనా విన్నారా?" అని అడిగాను. ఆ తరవాత, "జీతం భత్యం లేని ఈ పనికి యింత అభ్యంతరం ఏమిటి?" అని కూడా అడిగాను. దానికి ఆయన సమాధానం చెప్పకనే, "నాకు వచ్చిన పిటీషన్ సంగతి మీకు ఎల్లా తెలిసింది?" అన్నాడు. నేను "మీ పిటీషన్ సంగతి రాజమండ్రీలో వున్న ముసలమ్మ లంతా నడిబజారుల్లో చెప్పుకుంటున్నా," రని చెప్పాను. ఆయన 'ఎందుచేత?' అని అడిగాడు. "ఊరికల్లా ప్రథమ పౌరుడైన వ్యక్తిమీద ఈర్ష్యాళువులు వ్రాసే కాగితం విచారణ చెయ్యడానికి మామూలు ఉద్యోగస్థులకి పంపితే తెలియక ఏమి అవుతుంది! నా అర్హతని గురించి రిపోర్టు చెయ్యడం గ్రామమునసబా?" అని అడిగాను.

అందుకు ఆయన ఉలక్కుండా పలక్కుండా ఊరుకున్నాడు. ఆపైన కోలాచలం వెంకట్రావు ఎన్నికల్లో కాసుల సంగతి అడిగాడు. నేను దానికి కూడా తగిన జవాబు చెప్పి, "నా యిష్టంవచ్చిన అభ్యర్థికి

పనిచెయ్యడంలో తప్పేమిటి?" అని అడిగాను. చివరికి, "ఆకుకీ పోకకీ అందని కబుర్లమీద ఆధారపడి, న్యాయపరీక్షకి నిలబడని కథలు ఆధారంచేసుకుని, శాస్త్రోక్తంగా జరిగిన ఎన్నిక రద్దుచెయ్యడానికి మీకు ఏమి అధికారం ఉన్న?" దని కూడా అడిగాను. ఆ సంభాషణలో ఉభయులమూ చురుగ్గానే మాట్లాడుకున్నాము. చివరికి ఆయన, "సరే జాగ్రత్తగా చూస్తా" నన్నాడు.

ఆ తరవాత గవర్నరుగా ఉన్న ఆంప్టల్‌ని కూడా చూశాను. ఆయనతో విషయాలన్నీ చెప్పాను. చెప్పేసరికి ఆయన ఆశ్చర్యపోయి "ప్రకాశంగారూ! మీరు చెప్పిన విషయాల్నిబట్టి చూస్తే, నా ప్రభుత్వం మీ ఎన్నిక రద్దుచేసేటంత గుడ్డిగా వుండదు అనుకుంటాను. అయినా, అది నాకు సంబంధించినదీ, నేను కలగజేసుకునేదీ కాదు. ఫోర్బ్సు జాగ్రత్తగానే చూస్తా డనుకుంటాను. అయినా, అంతగా విషమిస్తే చూద్దాం లెండి!" అన్నాడు.

ఈలోగానే రాజమహేంద్రవరంలో పంతులుగారి వర్గం నా ఎన్నిక రద్దయిపోయిం దని పుకారు పుట్టించారు.

ఫోర్బ్సు వెంటనే కాగితాలు తెప్పించి, కలెక్టరు రిపోర్టు చూసి, నాతో మాట్లాడిన మాటలు మనస్సులో వుంచుకుని, వెంటనే ఇల్లాగ ఆర్డరు పాస్ చేశాడు. "He is certainly a troublesome man. But we cannot avoid him. Gazette his name." దాని మీద నా పేరు గెజెట్ అయి నేను ఛార్జి పుచ్చుకున్నాను.

ఈ ఛైర్మన్ ఎన్నిక అయిన తరవాత సుబ్బారావుపంతులుగారు, ములుకుట్ల అచ్యుతరామయ్యగారు, సోమయాజులుగారు మొదలయినవాళ్లు నా మీద మరింత పట్టుదల వహించారు. కాని, మునిసిపల్‌వ్యవహారాల్లో నాజోలికి రాలేకపోయేవారు. నేను మునిసిపల్ పని శక్తివంచన లేకుండా జాగ్రత్తగా చేసేవాణ్ణి. పొద్దున్నే 6 గంటలకే గుఱ్ఱంమీద బయలుదేరి ఊరు నాలుగుమూలలూ తిరిగి చూసేవాణ్ణి. అప్పటి కింత ఊరులేదు సరి గదా, దాని కనుగుణంగానే ఉద్యోగస్థులు కూడా ఎంతోమంది వుండేవారు

కారు. అప్పటికి గోదావరికి కట్టలేదు. అయినా, జనం స్నానపు రేవులు పాడు చెయ్యకుండా కొంతకాలం పోలీసు బందోబస్తు ఏర్పాటు చేయించాను. గట్టు నా కాలంలో పడకపోయినా, గోదావరికి ఒక గట్టు వుండాలనీ, దాన్ని సొగసుగా వుంచాలనీ ఒక అభిప్రాయం ప్రచారంచేసి ఆ సిద్ధాంతాన్ని కూడా అంగీకరింపచేశాను. మునిసిపల్ పరిపాలన కొంత కాలం ఎవ్వరి పేచీ లేకుండా సాగిపోయింది.

కాని, కొంతకాలానికి రాయపూడి సుబ్బారాయుడుకీ, నాకూ కంట్రాక్టుల విషయంలో తగాదా వచ్చింది. అతను చిరకాలంనించి ఈ కౌన్సిల్లో వుండి, ఎన్నికలలో కిందా మీదా పడుతూ వుండడంచేత, కొందరి యెడల ప్రత్యేకాభిమానం చూపించేవాడు. నా కా సంబంధాలేమీ లేకుండా ఒక పద్ధతిని పోకపోతే కష్టంగా వుండేది. అంతేకాదు, అతను చెప్పిన ట్లల్లా చెయ్యకపోతే అతనికి బాధగా వుండేది. అతను "దుర్గయ్యగారిని ఒదులుకుని, నిన్ను తెచ్చిపెట్టుకున్నందుకా ఈ గొడవ అంతా?" అంటూ బాధపడేవాడు. నేను నిర్మొహమాటంగా, "అబ్బాయి! నువ్వు చేసిన సహాయానికి సంతోషమే, కాని ఈ నాలుగు రోజులూ నా స్వాతంత్ర్యానికి భంగం రాకుండా నన్ను ఈ వుద్యోగం చెయ్యనియ్యి!" అని చెప్పాను.

ఇల్లా వుండగా, ప్రతికక్షులు నాకు ఛైర్మన్ ఎలక్షనులో సహాయం చేసిన వాళ్ళమీద ఏదో ఒక తంటా తెచ్చి కక్ష సాధించడానికి పూనుకున్నారు. ఆరాముదయ్యంగారు నా పార్టీలో నాకు బాగా సహాయంగా వుండేవాడు. ఆయన ఆలపాటి భాస్కర రామయ్యగారితో వ్యాపారం చేసి విడిపోయేటప్పుడు సామానులు పంచుకుని పట్టుకుపోవడంలో రెండు తీగెలకట్టలు కూడా పట్టుకు వెళ్ళాడు. అందుకని కక్ష కట్టి ఆయనమీద దొంగతనం నేరం ఆరోపించారు. ఆ కేసులో ఫిర్యాదీ తరఫున అచ్యుత రామయ్యగారు, ముద్దాయి తరఫున నేను వాదించాము. మేజస్ట్రీటు జిళ్ళేళ్ళ కృష్ణారావు పంతులుగారు. ఆయన దేవాంతకపు మేజస్ట్రీటు, ఈ కేసు సుమారు ఐదారు నెలలు విచారించాడు. ఈ విషయంలో ఆరాముదయ్యంగారి అన్నగారు పి. టి. శ్రీనివాసయ్యంగారు

కూడా ఎంతో ఆత్రతగా వుండేవాడు. కృష్ణారావుపంతులుగారి ధోరణిని పట్టి ఆయన వాలకం కనిపెట్టాను. ఆయన ఆరాముదయ్యంగారికి శిక్ష వేసే ధోరణిలో పడ్డాడు. ఏమీ బలం లేని కేసు మోపు చెయ్యడానికి మేజస్ట్రీటు చెయ్యగలిగిన సహాయం అంతా చేశాడు. చివరికి, 120 పేజీల జడ్జిమెంటు వ్రాసి, ఒకనాటి మధ్యాహ్నం 11 గంటలవేళ 6 నెలలు శిక్ష విధించాడు.

ఆ తీర్పు అంతా వెంటనే కోర్టులో చదవమని పిటీషన్ పెట్టి, ఆయన చదువుతూ వుంటే నోట్సు వ్రాసుకోమని ఒక జూనియర్ వకీలుకి అప్పచెప్పి, తిన్నగా నా ఫీటన్ మీద సబ్ కలెక్టర్ విస్ దగ్గిరికి వెళ్ళాను. ఈ కేసు సమాచారం అంతా ఆయనతో చెప్పి, నాకు సహాయం చేసిన పక్షంమీద కక్ష కట్టి, భాస్కర రామయ్యగారిని ప్రోత్సహించి అచ్యుత రామయ్య ప్రభృతులచేత కేసు పెట్టించారని నచ్చజెప్పి, అప్పీలు దాఖలు చేసి బెయిలు అడిగాను. "జడ్జిమెంటు కాపీలు వగైరాలు లేకుండా ఎట్లాగా?" అని ఆయన సంకోచించారు. కాని, నా కోరిక పైని బెయిలు ఇచ్చి గుమస్తాచేత పంపిస్తానన్నారు. అల్లాగ కాదనీ, ఆ బెయిలు ఆర్డరు స్వయంగా పట్టుకుని వెళ్ళడానికే నేను వచ్చాననీ చెప్పిన మీదట, ఆయన గుమాస్తాని పిలిచి, బెయిలు ఆర్డరు వ్రాయించి నాచేతికిఇచ్చారు. వెంటనే రెండు దౌడుల్లో కోర్టులోకి వచ్చాను.

నేను వచ్చేసరికి మేజస్ట్రీటు ఇంకా తీర్పు చదువుతూనే వున్నాడు. అచ్యుతరామయ్య ప్రభృతులు మంచి ఉత్సాహంగా ఉన్నారు. ఆ తీర్పు చదవడం పూర్తి కావడంతోనే నేను దొర ఆర్డరు మేజస్ట్రీటు ఎదట పెట్టేసరికి మేజస్ట్రీటు, ప్లీడర్లు, పార్టీలు అంతా కూడా స్తబ్ధులై పోయారు. అప్పటికి ఆరాముదయ్యంగారు జైలుముఖం చూడకుండా తప్పించగలిగాము. తరవాత విస్ దగ్గిర జడ్జిమెంటు కాపీకి పైలు చేశాము. అతను కాకినాడలో కేసు విచారించాడు. కేసు చూస్తూండగానే అది పార్టీ కక్షలచేత వచ్చిన వ్యవహారం అని గ్రహించి, అప్పీలెంటు తరపున నేను మాట్లాడకుండానే, ఎదట పార్టీతరపున హాజరైన బారిష్టర్ బర్టం రాఘవయ్యగారిని, "క్రింది కోర్టు తీర్పు ఎందుకు రద్దు

చేయకూడదో చెప్పమని" అడిగాడు. ఆయన సమాధానం విని కింది కోర్టు తీర్పు రద్దు చేశాడు. అంతటితో ఆ కేసు ముగిసింది.

అక్కడినించి నా ప్రతికూల పక్షంవారు తమ ఆయుధాలు ఇంక తిన్నగా నామీదే ప్రయోగించడానికి పూనుకున్నారు. రాజమహేంద్రవరంలో కాకి కృష్ణమూర్తి అనే ఒక వైశ్యప్రముఖుడు ఉండేవాడు. 10, 12 ఏళ్ళ వయస్సు వున్న అతని కుమారుడు తోటిపిల్లలతో గోదావరికి స్నానానికి వెళ్ళి, ఏ కారణంచేతనో కాలుజారి, నీటిలో పడి చని పోయాడు. ఆ పిల్లవాణ్ణి పెరుమాళ్ళ రంగయ్య అనే అతని బంధువు కొందరు హంతకుల్ని ఏర్పాటుచేసి చంపించాడని ఒక కేసు వచ్చింది. ఆ పెరుమాళ్ళ రంగయ్యకూడా అప్పటికి రాజమహేంద్రవరం లక్షాధి కారుల్లో లెఖ్ఖ. అతను అప్పటికి చాలాకాలం క్రితంనించీ నా క్లయింటు. మునిసిపల్ ప్రతికక్షులు ఆ పెరుమాళ్ళ రంగయ్యకి నేను సలహా ఇచ్చానవే ఆరోపణచేసి, నన్ను ఆ కేసులో ఇరికించాలని బ్రహ్మ ప్రయత్నం చేశారు. అప్పుడే పిఠాపురంవారి కేసులో పనిచేస్తూ ఉన్న మద్రాసు వకీలు వి. కృష్ణస్వామయ్యరుగారు రాజమహేంద్రవరం వచ్చారు.

ఆయన ఒకరోజున క్లబ్బులో సుబ్బారావు పంతులుగారు మొదలయిన వాళ్ళంతా ఉండగా, "ప్రకాశం దుర్రవాడు. సెకండుగ్రేడు ప్లీడరు. హేమాహేమీలైన మిమ్మల్ని అందరినీ ఓడించి ఛైర్మన్ అయ్యాడు. మీ ప్రతిభ ఇంతేనా!" అని హేళన చేశాడు. అందుచేత వాళ్ళ పట్టుదల మరింత హెచ్చయింది. ఆ కారణంవల్ల నన్ను ఎల్లాగైనా ఈ హత్యకేసులో ఇరికించాలని సంకల్పించారు. ముఖ్యంగా పెద్దాడ సాంబశివరావు, ములుకుట్ల అచ్యుతరామయ్యగార్లు బహిరంగంగా దీనికి పూనుకున్నారు. దీంట్లో పంతులుగారిసలహా, వెంకటరెడ్డిగారి ఎరుకా కూడా లేకపోలేదు. మొదటి పెద్దలిద్దరూ ఇద్దరు వడ్రంగి కుర్రవాళ్ళని తయారుచేసి వాళ్ళచేత హత్యజరిగిన క్రితం రోజుని 11 గంటలకి కోర్టుకి వస్తూ ఉండే నాళంవారి సత్రంసమీపంలో పెరుమాళ్ళ రంగయ్య నాకు ఎదురుపడ్డాడనీ, అక్కడ నా దాకార్టుఆపి అతనితో మాట్లాడాననీ, ఆ మాట్లాడడంలో చనిపోయిన కుర్రవాడి అనంతరం కాని తనకి

ఆస్తికి హక్కులేదని సలహా ఇచ్చాననీ ఒక పెద్ద కథ అల్లారు. సాంబశివరావు, అచ్యుతరామయ్యగార్లు ఆ కుర్రవాళ్ళని స్వయంగా మేజస్ట్రీటు జిల్లేళ్ళ కృష్ణారావు పంతులుగారి దగ్గిరికి తీసుకుపోయి వాళ్ళచేత అఫిడవిట్ ఇప్పించారు. ఆరాముదయ్యంగారి కేసు సందర్భంలో విస్ దొరతో తన్ను గురించి ఏదో చెప్పానని ఆయనకి అనుమానం ఉండడంచేత నా మీద కొంచెం గుర్రుగా ఉండేవాడు. ఆ ప్రమాణ పత్రిక ముఖం చూస్తేనే నమ్మడానికి వీలులేని స్థితిలో ఉండడంవల్ల, స్థానికంగా ఉన్న పోలీసు వాళ్ళు సరియైన చర్య తీసుకుంటారో తీసుకోరో అని డిస్ట్రిక్టు సూపరింటెండెంటు దగ్గిరికి వెళ్ళారు.

అప్పుడు డి. యస్. పి. సి. బి. కన్నింగుహామ్ అనుకుంటాను. ఆయనకి కూడా ఈ అభూతకల్పన ఆశ్చర్యంగా తోచి, రాజమహేంద్రవరం వచ్చి సబ్‌కలెక్టరు విస్‌తో సంప్రతించాడు. విస్ చిరాకుపడి "ఏమిటీ? ఎన్నికల్లో ఓడించడానికి ప్రయత్నంచేసి ఓడిపోయారా? ఇప్పుడిక అతన్ని ఉరితీయించడానికి ప్రయత్నిస్తున్నారా?" అన్నాడు. ఆపైన ఆ కథ అసంభవమనీ, నా శత్రువుల అభూతకల్పన అనీ, నా ప్రస్తావన లేకుండా కేసు ఇన్‌క్వయిరీ చెయ్యమనీ సలహా చెప్పాడు. నా దగ్గిరికి పోయి స్టేటుమెంటుకూడా తీసుకోమన్నాడు. కన్నింగ్‌హామ్ మా యింటికి వచ్చి ఈ సంగతులన్నీ అడిగాడు. నేను మొదటినించీ ఉన్నదంతా పూసగుచ్చినట్లు చెప్పాను. వీరంతా మునిసిపల్ వ్యవహారాలలో నాకు శత్రువు లయినదీ, ఆ శత్రుత్వం కారణంచేత కక్ష సాధిస్తున్నదీ అంతా సవిస్తరంగా చెప్పినతరవాత అతను పూర్తిగా తృప్తిపడి నన్ను ఇంక్వయిరీలోనించి తప్పించివేశాడు.

ఈ సందర్భంలో నా మిత్రుడైన కుందూరి వెంకటరత్నం విషయంలో కూడా నాస్నేహితులు కొందరు బాధపడ్డారు. ఆ కుర్రవాడి శవం పంచాయితీ చేసే సందర్భంలో కుందూరి వెంకటరత్నం కూడా పంచాయితీదారు. అప్పుడు ఈ పెరుమాళ్ళ రంగయ్య అతన్ని హత్య చేయించి ఉంటాడేమో అనే కథ వచ్చినప్పుడు యాథాలాపంగా

రంగయ్య ఆ క్రితం రాత్రి ప్రకాశం ఇంటికి వచ్చాడని అన్నాడు. ఆ క్రితం రాత్రి 8, 9 గంటలకి నేనూ, వెంకటరత్నమూ, ఇంకా కొందరు స్నేహితులూ కుర్చీలు వేసుకుని మా ఇంటిముందర కూర్చుని పిచ్చా పాటీ మాట్లాడుకుంటూ ఉండగా రంగయ్య వచ్చినమాట వాస్తవమే. క్లయింట్లు రాత్రిళ్ళు వచ్చి మాట్లాడి పోవడంలో విశేష మేముంది? ప్రాక్టీసు వృద్ధి చేసుకోవా లని కష్టపడే ప్రతీ ప్లీడరూ, క్లయింట్లతో రాత్రిళ్ళు నిదానంగా మాట్లాడుకోవడం సహజమే కదా. ఈ సామాన్య విషయాన్ని గోరంతలు కొండంతలు చేసి, నా శత్రువులు నా మీదికి దూకదలచినపుడు, నా స్నేహితులు కొందరు వెంకటరత్నం దగ్గిరికి వెళ్ళి, "నువ్వు అన్న ఆ మాటలవల్ల ప్రకాశానికి ఆపత్తు వచ్చేటట్టు వుంది. పోనీ, నువ్వు ఆ విషయం చెప్పకుండా ఉండకూడదా?" అని సలహా యిచ్చారు. అతను, "ఒకసారి నేను చెప్పిన తరవాత-అందు లోనూ ఆ సంగతి నిజమైనప్పుడు-నేనెందుకు కాదనాలి?" అన్నాడు. దానికి స్నేహితులు బాధపడ్డారు. కాని, అప్పుడూ ఇప్పుడూ కూడా "వెంకటరత్నం మాటే సరి అయినది" అని నా అభిప్రాయం.

తరవాత పోలీసులు పెరుమాళ్ళ రంగయ్యమీద కేసు పెట్టారు. ఆ కేసులో మేజస్ట్రీటుకోర్టులో నేనే పని చేశాను. కేసు సెషన్సుకి వెళ్ళింది. అప్పుడు నాయందు సుముఖుడు కాని హేమ్మెంట్ దొరే జిల్లా జడ్జీ. ఆ కారణంచేత కూడా నా శత్రువులు నన్నందులో ఇరికించ డానికి ఉబలాట పడ్డారు. నేను సెషన్సు విచారణకి మద్రాసునించి బారిష్టర్ జాన్ ఆడమ్సుని తీసుకుని వచ్చాను. సహజంగా కేసులో ఏమీ బలంలేక పోవడంచేత, ఆ జడ్జీ రంగయ్యని నిర్దోషిగా నిర్ణయించి ఒదిలివేశాడు. అంతటితో శత్రువులు పన్నిన మరొక ఉచ్చునించి బయటపడ్డాను. ఒక్కొక్కప్పుడు జీతం భత్యంలేని ఈ స్వల్పాధికారాల కోసం ఎందుకింత శత్రుత్వం వచ్చిందా అనే విషయం ఆలోచిస్తే నాకే ఆశ్చర్యంగా వుంటుంది.

ఈ గంద్రగోళా లెట్లా వున్నా మునిపిపల్ పరిపాలన యథా

రీతిగా జరుగుతూనే వుంది. మొదటిసంవత్సరం పరిపాలనా నివేదికలో పరిపాలన సంతృప్తికరంగానే వున్నదని గవర్నమెంటు వ్రాసింది. ఈ హత్యకేసు సందర్భంలో పోలీసుల హడావిడి చూసి నాతో భాగస్థుడుగా ఉండిన పిళ్ళారిసెట్టి నారాయణరావు భయపడిపోయేవాడు. తరవాత, అతన్ని మా పార్టీ తరఫున మునిసిపల్ కౌన్సిలరుగా కూడా చేశాము. చివరికి అతనికి కూడా ధైర్యం చెప్పవలసివచ్చేది.

ప్రతి కక్షుల ప్రయత్నాలు ఇంతటితో ఆగలేదు. నా పార్టీలో నాకు బలంగా వుండే ఏలూరి లక్ష్మీనరసింహంగారిమీద మళ్ళీ ఒక కేసు బయలుదేరదీశారు. ఆ రోజుల్లో రాగి బంగారం చేస్తామనే మంత్రగాళ్ళు, వాళ్ళ మాయల్లో పడే అమాయికులూ వుంటూండేవాళ్ళు. శనివారపు పేట ఎస్టేటులోకి ఇల్లాంటి మంత్రగాడొకడు సిద్ధమై, రాగి బంగారం చెయ్యడానికి పూనుకున్నాడు. ఒక గదిలో దేవతని పెట్టి, ఇంట్లో వుండే బంగారమూ, జవాహరీ అంతా ఆ దేవతకి అలంకరించి పూజచెయ్యాలని చెప్పి బంగారం అంతా సేకరించాడు. నాలుగురోజులు జపం అయ్యాక ఆ బంగారం అంతా మూటకట్టుకుని, రాత్రికి రాత్రి ప్రయాణమై మాయమైపోయాడు. ఆ బంగారంలో కొన్ని వస్తువులు ఏలూరి లక్ష్మీనరసింహంగారి ఇంటికి దగ్గరగా ఉన్న, ఆయన స్నేహితుడైన ఒక మహమ్మదీయుడి దగ్గిరికి చేరాయి. అతను పెద్ద గడ్డంతో భయంకరంగా వుండేవాడు. ఆ మహమ్మదీయుడు బజారులో ఆ జవాహరీ అమ్ముతూ వుండగా షరాబులు కొనడానికి కొంచెం సంకోచించారు. వెంటనే పోలీసులు వచ్చి ఆ మహమ్మదీయుణ్ణి పట్టుకున్నారు.

అందుమీద ఏలూరి లక్ష్మీనరసింహంగారు ఆ జవాహరీ ఆ సాహేబుదే నని మేజస్ట్రీటుదగ్గిర స్టేటుమెంటు ఇచ్చారు. పోలీసులు ఆ స్టేటుమెంటు విశ్వసించకుండా ఆ అమ్మకం ఆపుజేశారు. ఈ లోగా పోలీసులు ఆ జవాహరీని గురించి ప్రకటన చెయ్యగా శనివారపుపేటవారు వచ్చి ఆజవాహరీ పోల్చుకున్నారు. వెంటనే పోలీసులు ఏలూరి లక్ష్మీనరసింహంగారిమీద, సాహేబుమీద కేసుపెట్టారు. ఏలూరి లక్ష్మీనరసింహంగారి నేరం అంతా ఆయన "జవాహరీ సాహెబుదే" అని

చెప్పడం. ఆయన తెలిసే చెప్పారో, లేక ఆశ్రిత పక్షపాతంచేతనే చెప్పారో నిర్ణయించడం కష్టం. దానికితోడు స్థానికంగా లక్ష్మీనరసింహంగారిమీద వుండే కక్షలు కూడా కలిశాయి.

విచారణ సబ్‌కలెక్టరు ఎదట. లక్ష్మీనరసింహంగారి తరఫున నేను హాజరయ్యాను. ముద్దాయి స్థానికంగా చాలా ప్రముఖులనీ, ఇక్కడ ఈ కేసు జరగకూడదనీ, మరి ఒక జిల్లాకి ట్రాన్సుఫరు చెయ్యమనీ పిటీషను పెట్టాను. ఆ పిటీషను కొట్టివేశారు. అందుమీద ట్రాన్సుఫరుకోసం హైకోర్టుకి వెళ్ళాను. హైకోర్టులో డాక్టరు స్వామినాథన్ గారిని ప్లీడరుగా ఏర్పాటుచేశాను. స్వామినాథన్‌గారు బారిష్టరు పాసయి కొద్దికాలం కిందటే ప్రాక్టీసు పెట్టారు. కేసు హైకోర్టులో దేవిస్ బెంచి దగ్గిరికి వచ్చింది.

ఆ దేవిస్ లావుగా వుండేవాడు. చాలా భీకరంగా మాట్లాడుతూ వుండేవాడు. కేసు చూస్తూనే "No points to argue: case dismissed" అన్నాడు. స్వామినాథన్‌గారు నోరు విప్పనైనా విప్పలేదు. నాకు చాలా చిరాకు కలిగింది. కోర్టులోనే స్వామినాథన్‌గారిమీద పడి, "ఇదేమి బారిష్టరీ అండీ! కేసు ఆర్గ్యుమెంటు చెప్పకుండానే డిస్మిస్ చేస్తే, మాట్లాడక ఊరుకున్నారు!" అని కేకలు వేశాను. ఆయన "ప్రకాశంగారూ! రాత్రి మా యింటికి భోజనానికి రండి! మీతో మాట్లాడాలి," అన్నారు.

రాత్రి భోజనానికి వెళ్ళాను. డాక్టరు స్వామినాథన్‌గారు బ్రాహ్మణులే కాని, అప్పటికే ఒక బట్లరుచేత వండించుకుని తింటూ వుండేవారు. ఆయన చాలా జాగ్రత్త మనిషి. బహు కష్టంగా ఖర్చుపెట్టుకుంటూ డబ్బు కూడబెట్టేవారు. ఆయన నన్నెంతో ఆప్యాయంగా ఆదరించి, "ప్రకాశంగారు! మీలో మంచి చురుకుతనమూ, ధైర్యమూ కనిపిస్తున్నాయి. మీరు ఎందుకు బారిష్టరు కాకూడదు?" అన్నారు. నాకు ఆశ్చర్యం వేసింది! "నేను సెకండు గ్రేడు ప్లీడర్‌ని. బీదవాణ్ణి. నాకేమిటి! వేలకువేలు ఖర్చయే బారిష్టరీ ఏమిటి? నాకు అది ఎల్లాగ లభ్య

మౌతుంది!" అన్నాను. అందుమీద ఆయన వేలకి వేలు అవసరం లేదనీ, ఆరువేల రూపాయలతో కోర్సు అంతా పూర్తిచెయ్యవచ్చుననీ, నేను నెలకి ఆరు పౌనులతో కాలక్షేపం చేశాననీ చెప్పారు. నేను, "అది అంత సుళువై, ఐదారువేల రూపాయలలో అయితే ప్రయత్నం చేస్తా" నని చెప్పాను.

వాస్తవానికి ఆ సంభాషణే నా జీవితాన్ని ముందుకి తోయగలిగిన విశేష ఘట్టం. నేను రాజమహేంద్రవరంలో సెకండుగ్రేడు ప్లీడరుగా పనిచేస్తూ శత్రువుల్ని నిర్జించుకుంటూ అప్పటికి తృప్తికరమైన జీవితం గడుపుతూ వున్నా, నాకుమాత్రం ఆ స్థానం ఇరుకుగా కనిపించేది. విశాలమైన ఆవరణలో విచ్చలవిడిగా సంచారం చేసే మన స్తత్వం కావడంచేత, ఈ ఆలోచన నాకు బాగా తల కెక్కింది. వెంటనే రాజ మహేంద్రవరం వచ్చివేసి నా మిత్రులైన కంచుమర్తి రామచంద్రరావు గారితో, నాకూ స్వామినాథన్‌గారికీ జరిగిన సంభాషణ అంతాచెప్పాను. ఆయన అప్పుడే సగం ఖర్చుపెట్టుకోడానికి అంగీకరించి ప్రోత్సహిం చారు. నాకు మిత్రులూ, చాటపర్రు వాస్తవ్యులూ అయిన మాగంటి లక్ష్మణదాసుగారికి కబురు పంపించగా, ఆయన వచ్చి మిగిలిన మూడు వేలూ ఇవ్వడానికి అంగీకరించారు. నేను డబ్బు సర్దుబాటు కావడం తోనే ఇంగ్లండు వెళ్ళిపోవడానికి నిశ్చయం చేశాను.

ఇంక ఇక్కడ ఏలూరి లక్ష్మీనరసింహంగారి కేసు మిగిలి వుంది. కొంత కేసు విస్ దగ్గిర జరిగింది. ఆ కేసు క్రాస్ పరీక్షలో మునిసిపల్ కక్షలు వగైరాలన్నీ చాలావరకు రుజువు చేశాను. ఆ తరవాత మళ్ళీ హైకోర్టుకి ట్రాన్సుఫరు పెట్టాను. కొంత సాక్ష్యం రుజువుమీద జాన్ ఆడమ్సునిపెట్టి వాదిస్తే ట్రాన్సుఫరుకి ఆర్డరు పాసయింది. ఆ కేసు విశాఖపట్నానికి ట్రాన్సుఫరు చేశారు. విశాఖపట్నంలో కూడా నేనే కేసు నడిపించి లక్ష్మీనరసింహంగారిమీద కేసు లేకుండా తప్పించి వేశాను.

# 9

## ఇంగ్లండు ప్రయాణం

అప్పటికి రాజమహేంద్రవరంలో నా సంసారం స్థిరపడింది. సంపాదన పుష్కలంగా ఉండడమూ, బంధువు లంతా తృప్తి పడడమూ జరిగింది. ఇల్లాంటి స్థితిలో లండన్ ప్రయాణం అనేసరికి ఇంట్లో కల్లోలం పుట్టింది. ఆ కాలంలో సముద్రయానం అంటే కులం పోయిం దన్నమాటే. ఆ కారణం పురస్కరించుకుని రేకపల్లి లచ్చయ్య గారు అనే పురోహితుడు మా యింట్లో ఆడవాళ్ళకి—ముఖ్యంగా మా అమ్మగారికి—బాగా ఆందోళన కలిగించాడు.

అంతకి పూర్వమే సుబ్బారావుపంతులుగారికి సుస్తీచేస్తే, వైద్యులు ఆయనకి, "ఆరోగ్యంకోసం సముద్రయానం అవసరం" అని చెప్పారు. ఆయన అప్పుడే వీరేశలింగం పంతులుగారితో తగాదా పడి సనాతన హిందూ ధర్మోద్ధరణకోసం హిందూ సమాజం స్థాపించి ఉండడంచేతనూ, మాధ్వస్వాముల వారి ప్రాపకం చెడగొట్టుకోవడం ఇష్టంలేని వారవడం చేతనూ, చాలా తటపటాయించి, చివరికి తూర్పు తీరాన్ని ఓడప్రయాణంచేసి చక్కావచ్చారు. దీనికి మాధ్వస్వాముల వారు అంగీకరించారు కూడాను. ఆ సంగతి మా అమ్మగారితో చెప్పి ఆవిడ మనస్సుకి తృప్తి కలిగించాను.

అసలు అప్పటికి మనదేశంలో ఎవ్వరూ బారిష్టరు చదువుకోసం ఇంగ్లండు పోయినవారులేరు. అంతకిముందు ఎవరో ఒక క్షత్రియుడు 50 సంవత్సరాల క్రితం విశాఖపట్నంనించి సీమ వెళ్ళారట. కాని ఆయన లెఖ్ఖలో పడలేదు. యమ్. ఆర్. అయ్యంగారు అనే దాక్షిణాత్యులు ఒకరు బారిష్టరు అయి రాజమహేంద్రవరంలో కొంతకాలం క్రిందట ప్రాక్టీసుచేస్తూ వచ్చారు. ఆయన చాలా తెలివైనవాడేగాని, తాగడం అలవాటు అయింది. ఒక్కొక్కప్పుడు ఆ నిషామీద వాదితరఫున వకాల్తీ పుచ్చుకుని ప్రతివాది తరఫున ఆర్గ్యుమెంటు చెప్పేవారు. ఆయన

ఇంగ్లాండునించి వచ్చాక ఆయన భార్య ఆయనతో కాపరం చెయ్యడానికి నిరాకరించింది. ఆయన రాజమహేంద్రవరంలో ఒక ఆంగ్లో ఇండియన్ యువతిని పెళ్ళాడి చాలా నిర్భాగ్య జీవితం గడుపుతూ ఉండేవాడు.

మా వాళ్ళకి బారిష్టరు అంటే అదే అభిప్రాయం. కష్టాలు పడి, పడి నామీదే ఆశలన్నీ కేంద్రీకరింపచేసుకున్న మాఅమ్మగారికి నా భవిష్యత్తుని గురించి భయం కలిగింది. అందుచేత ఆవిడకి లండన్ప్రయాణం అంటే కొంచెం జంకు పుట్టింది. నేను ఆవిడకి ఆ విషయమై భయం ఉండనవసరం లేదనీ, బారిష్టరు చదువంతా రెండుమూడు టెరముల్లో పూర్తిచేస్తాననీ, మత్స్య మాంసాలు ముట్టుకోననీ చెప్పి శపథంచేసి, ఎల్లాగో అల్లాగ చిట్టచివరికి ఒప్పించాను. ఆవిడ సహజంగా ధైర్యస్థురాలు. కనక అతికష్టంమీద అంగీకరించింది. ఆ తరవాత నా భార్యని కూడా ఒప్పించి, ఆవిణ్ణి గుంటూరుజిల్లా కొత్తపట్నంలో ఆవిడ పినతల్లిగారింట్లో—అంటే మా చిన్నక్కయ్యగారింట్లో—దిగబెట్టాను. మా అమ్మగారిని మా తమ్ముడు శ్రీరాములు దగ్గిర ఉంచి ఇంగ్లండుకి ప్రయాణం అయ్యాను.

ఈ రీతిగా సంసారపు సర్దుబాట్లన్నీ చేసుకుని అక్టోబరు మొదటి వారంలో లండన్ వెళ్ళడానికి నిశ్చయించాను. ప్రయాణానికి కావలసిన ఏర్పాట్లన్నీ—అంటే స్టీమరు బుక్కింగు వగైరాలన్నీ—డాక్టర్ స్వామినాథన్గారి ద్వారా చేశాను. మునిసిపల్ ఛైర్మన్పని శ్రీ పి. నారాయణరావుగారికి తెలిగేటుచేశాను. ముందు మద్రాసువచ్చి అక్కడ రెండురోజులున్నాను. రెంటాల వెంకట సుబ్బారావుగారు నా ప్రయత్నం మెచ్చుకుని స్వయంగా నాకు కావలసినవన్నీ ఏర్పాటుచేశారు. ఆవకాయ వగైరా ఊరగాయలన్నీ చక్కగా మూటలు కట్టించి ఇచ్చారు. అక్కడనించి బొంబాయివెళ్ళి బొంబాయిలో నా క్లయింట్లూ, శ్రీమంతులూ అయిన గొల్లపూడి చిన నరసింహంగారి ఇంట్లో రెండురోజు లుండి, మెయిల్ బోట్మీద ఇంగ్లండుకి ప్రయాణం అయ్యాను. మా అమ్మ

గారికి మత్స్య మాంసాదుల విషయమై మాట ఇవ్వడంచేత, రెండు బస్తాల బత్తాయి కాయలు కూడా ఓడలో వేయించాను.

నాతోబాటు చెంగల్రాయనాయుడుగారు అనే ఒకాయన ప్రయాణం అయ్యారు. ఆయన రంగూన్‌లో ఎక్కాంటెంటుగా వుండి, బాగా డబ్బు సంపాదించి, ఆ తరవాత బారిష్టరు చదువు ప్రారంభించారు. నాతో ప్రయాణం చెయ్యడానికి ముందు అప్పుడే ఆయన ఒకసారి లండన్ వెళ్ళి ఒక టెరమ్ పూర్తిచేసుకుని వచ్చారు. అది కారణంగా అక్కడి వ్యవహారాలన్నీ పూర్తిగా ఆకళించుకున్నవా రవడంచేత నాకు మంచి సహాయంగా ఉండేవారు. ఓడ ఎక్కిన మర్నాడే నాకు సముద్రపు జబ్బు (సీ సిక్‌నెస్) వచ్చింది. మొదటి రోజున డైనింగు హాలు లోకి వెళ్ళేసరికి ఓడలో మాంసాదులు వండుతూన్న వాసన భరించలేక పోవడంవల్ల నాకు వాంతి చేసుకునేటంత పని అయింది. వెంటనే నా గదిలోకిపోయి సర్దుకున్నాను. రెండు రోజులవరకూ ఆ జబ్బుతోనే పడుకున్నాను. క్రమంగా అయిదు రోజులకి ఏడెన్ చేరుకున్నాము. మరి మూడు రోజులకి పోర్టుసెడ్ చేరాము. ఈ రేవుల్లో కనబడే జనం అంతా అరబ్బులు. వాళ్ళు సామాన్యంగా నల్లచర్మంవాళ్ళే. మొత్తం మీద 12 రోజులు ప్రయాణంచేసి మార్సెల్సు చేరాను.

మార్సెల్సు చేరేసరికి నావలో ఉండే ప్రయాణీకుల వ్యవహారం అంతా మారిపోయింది. నాతోపాటు ప్రయాణం చేస్తూన్న వాళ్ళల్లో ఈ దేశంలో పెద్దపెద్ద వుద్యోగాలలో వుండి, నవాబ్‌దర్బారీ సాగిస్తూ వుండే వాళ్ళు చాలామంది వున్నారు. మధ్యధరా సముద్రం దాటేవరకూ ఈ వుద్యోగస్థుల దర్బారీ, టీపీ యథారీతిగానే వున్నాయి. కాని, మార్సెల్సు రేవులో దిగడంతోనే ఎవరి సామాన్లు వారు జాగ్రత్త పెట్టుకుని బుజాన వేసుకుని మిగిలిన సామాన్య జనంలాగే దిగడం ప్రారంభించారు. అల్లాగ లండన్‌కేసి వెళ్ళిన కొద్దీ వాళ్ళధోరణి మారిపోయింది.

పాశ్చాత్య ప్రపంచాన్ని గురించి మొట్టమొదటి చూపులో నాకు కలిగిన అభిప్రాయాలు కొంచెం వివరిస్తాను. అకాలానికే పాశ్చాత్య నాగరకతా వాసనలతో నిండిన నాకు, ఆ ప్రపంచం తెల్లవాడి మాయగా

కనిపించడంలో ఆశ్చర్యం ఏమి వుంది! పూర్తిగా బ్రిటిష్‌పాలనలో పడి పోయి, స్వీయమైన నాగరకత గుంటపెట్టి గంటవాయించి, కొత్త నాగరకతకి వరవళ్ళు దిద్దుతూ వుండే ఈ దేశంలో నించి వెళ్ళిన నన్ను, చక్కటి సురక్షితమైన పాశ్చాత్య నాగరకత ఆకర్షించడం ఒక వింత కాదు. మార్సెల్సులో దిగేసరికే ఓడ దగ్గిరా, రైలు దగ్గిరా పోర్టరు దగ్గిరనించి పై వుద్యోగస్థుడి దాకా, అందరూ చూపే శిక్షణా, మర్యాదా నన్ను బాగా సంతోష పెట్టాయి. హోటళ్ళలో స్త్రీ పురుషుల నడవడీ, వాళ్ళ మర్యాదలూ కూడా భేష్ అనిపించాయి. అన్నిటికన్నా వాళ్ళు అనుభవించే స్వాతంత్ర్య వాయువులు నా కెంతో ఆనందం కలిగించాయి. పాశ్చాత్య పద్ధతులమీద ఆలోచనలు పారే ఆ రోజుల్లో "ఎప్పటికైనా మనదేశం ఈ వున్నత స్థితికివచ్చి, ఈ జాతులతో తులతూగుతుందా!" అని అనిపించింది.

లండన్‌లో చెంగల్రాయన్ నాయుడుగారు నివసిస్తూ వున్న చెస్ వాటర్ చేరుకున్నాము. మొదటిరోజున ఆయనతోపాటే ఒక గృహస్థు ఇంట్లో వున్నాను. రెండో రోజున ఆ నాయుడుగారు నన్ను ఆ పక్కని వున్న ఇంట్లో బసకీ, భోజనానికీ కుదిర్చారు. ఆ దేశంలో సామాన్య గృహస్థులు కొంచెం డబ్బు తీసుకుని అతిథులికి ఆశ్రయం ఇస్తారు. అల్లాచేస్తే ఆ దేశపు సాంఘిక జీవనంలో తప్పు లేదు. నెలకి రెండు పౌనులు ఇచ్చే పద్ధతిమీద నేను బస, భోజనమూ కుదుర్చుకున్నాను. ఒక పెద్ద స్టవ్ కొనుక్కొని ఒకగదిలో ప్రత్యేకంగా కాయగూరలు, పప్పులుపచనం చేసుకుని భోజనంచేస్తూవుండేవాణ్ణి. చెంగల్రాయన్‌గారు గ్రే ఇన్‌లో మెంబరుగా వుండి, బారెట్లాకి చదువుతూ వుండేవారు. ఆయన నన్ను కూడా ఆ ఇన్‌లోనే చేర్చారు.

ఈ సందర్భంలో ఈ బారిష్టరీ చదువుని గురించి కొంచెం వ్రాస్తాను. ఆ సమయంలో మన దేశంనించి, ముఖ్యంగా వంగ దేశం నించి ఎందరో యువకులు ఈ చదువుకోసం వచ్చేవారు. విశేషంగా చదువుకోసం శ్రమపడకుండానే డిన్నర్‌లకి హాజరై, పరీక్షలకాలంలో ముఖ్యమైన విషయాలు పరీక్షల ఏజంట్లద్వారా సంపాదించి, ముక్కుని పెట్టుకుని బారిష్టరయి మనదేశానికి తిరిగి వచ్చేవాళ్ళు. వాళ్ళల్లో చాలా

మంది వృత్తిలో ముందుకి రాలేక కేవలం డిన్నరు బారిష్టర్లనే అప్రతిష్ఠ తెచ్చుకున్నారు. అందుచేతనే మద్రాసులో కొద్ది కాలానికే బారిష్టర్ల పరువు సన్నగిలింది. మైలాపూరు మేధావుల సునిశిత బుద్ధివిశేషం ఈ డిన్నరుబారిష్టర్లని నెట్టివేయడంలో ఆశ్చర్యమేమివుంది? బారిష్టరు చదువు పద్ధతి అల్లాగ వున్నప్పటికీ, కష్టపడి చదువుకునేవాళ్ళకి పరిపూర్ణమైన అవకాశాలు ఉండేవి. ఆ కాలంలో ఈ న్యాయవిద్య అంతా ఇంగ్లండులో కౌన్సిల్ ఆఫ్ లీగల్ ఎడ్యుకేషన్ చేతుల్లో వుండేది. ఆ దేశంలో నాలుగుచోట్ల పెద్దపెద్ద న్యాయశాస్త్ర గ్రంథాలయాలు ఏర్పాటుచేసి వాటికి చేరికగా, నివాసానికీ, భోజనానికీ చక్కని వసతులు ఏర్పాట్లు చేస్తారు. వాటినే 'ఇన్'లు అంటారు. టెరముకి ఇన్ని డిన్నర్లు-అంటే విందు లని- పరిమితి వుంటుంది. ఈ విందులికి తప్పకుండా హాజరు కావాలి. మన యూనివర్సిటీల్లో అట్టెండెన్సు ఎంత ముఖ్యమో ఇక్కడ ఇది అంత ముఖ్యము.

ఆ విందులే కాకుండా కౌన్సిల్ ఆఫ్ లీగలు ఎడ్యుకేషన్‌వారు ఏర్పాటు చేసిన లెక్చర్లు వుంటాయి. వాటికీ హాజరు కావాలి. ఆ లెక్చర్లు చాలా ఉన్నతశ్రేణిలో ఉంటాయి. ఆ లెక్చర్లు విని లైబ్రరీలో కూర్చుని శ్రద్ధగా చదువుకుని మిగిలిన కాలంలో సమీపంలో వుండే ఇంగ్లీషు కోర్టుల్లో వ్యవహారాలు పరిశీలించే శ్రద్ధావంతులికి బారిష్టరు చదువు ప్రశస్తమైనదని చెప్పక తప్పదు. నేను మన దేశంలో 8 సంవత్సరాలు సివిల్, క్రిమినలు కేసుల్లో పనిచేసి న్యాయశాస్త్ర ప్రధానసూత్రాలు అవగాహన చేసుకుని అనుభవం సంపాదించాను. అంతేకాక, చిన్ననాటినించీ ఈ వకీలు వృత్తి అంతం కనుక్కోవాలనే కుతూహలంతో వుండేవాణ్ణి. అందుచేత ఈ విద్యమీద బాగా లక్ష్యం ఉంచి చదివేవాణ్ణి. లా కౌన్సిలు ఉపన్యాసాలు అన్నీ శ్రద్ధపట్టి సంగ్రహంగా వ్రాసుకునేవాణ్ణి. కోర్సు పూర్తి అయ్యేసరికి నోట్సు పుస్తకాలన్నీ నా యెత్తుని పెరిగాయి. నేను పాఠ్యగ్రంథాలు శ్రద్ధగా చదువుతూ, అవకాశం ఉన్నప్పుడల్లా ఇంగ్లీషు కోర్టులలో పద్ధతులూ, పెద్దపెద్ద బారిష్టర్లు నడిచే రీతులూ చూస్తూ వుండేవాణ్ణి.

మొట్టమొదటి కొద్దిరోజుల్లో ఆంగ్ల జీవితం చూశాక నాకు కలిగిన అభిప్రాయాలు వ్రాస్తాను. రైలు దిగుతూంటేనే కూలీల కట్టుబాట్లని గురించి నాకు కలిగిన ఆశ్చర్యం ఇదివరకే వెలిబుచ్చాను. మొత్తంమీద బజారులోగాని, హోటళ్ళలో గాని, సినిమాలలో గాని ఎక్కడ చూసినా సాధారణ జీవితంలో నిజాయితీ, శ్రద్ధ ఎక్కువగా కనిపించాయి. అక్కడ కాలం వృథా చెయ్యకుండా వుండే చురుకుతనం బాగా గోచరించింది. బజారులోకి వెడితే కూరగాయ లమ్మే స్త్రీలతో గాని, పురుషులతోగాని బేరమాడ నక్కరలేదు. ఒకే వెల. మంచి నాణ్యం. ఇక పోస్టాఫీసుకి వెడితే అక్కడ వుండే స్త్రీ అతి మర్యాదగా, క్షణం ఆలస్యం లేకుండా కౌంటరు దగ్గర మన పని చూసి, వెంటనే పంపించివేస్తుంది.

ఒకసారి నేను ఎడింబరోకి కొన్నిపౌనులు మనియార్డరు చేద్దామని ఒక పోస్టాఫీసుకి వెళ్ళాను. 16, 17 ఏళ్ళ యువతి నా దగ్గర డబ్బూ, ఫారమూ పుచ్చుకుని ఉత్తరక్షణంలోనే ఇతరుల పని చూడడం మొదలు పెట్టింది. నేను మన దేశంలో అలవాటుకొద్దీ రసీదుకోసం కాచుకుని కూర్చున్నాను. కొంతసేపటికి ఆమె నన్ను చూసి "అట్లాగ నిలబడ్డారేమిటి?" అని అడిగింది. "రసీదు కోసం" అని చెప్పేసరికి, "ఇక్కడ రసీదు లివ్వరు. ఈ పాటికి మీ డబ్బు చేరవలసిన చోటికి చేరే వుంటుంది, మీరు వెళ్ళవచ్చును," అని చెప్పింది.

అక్కడ సామాన్యజనులు స్నానం చెయ్యడానికి స్నానాలగదులు ఏర్పాటై వుంటాయి. వాటిని ఉపయోగించే జనం ఒకరి నొకరు తోసుకోరు. ముందు వచ్చిన వాళ్ళు ముందు తమపని ముగించుకుని పోతూ ఉంటారు. నాటకశాలల దగ్గిర టిక్కట్లు కొనేచోట, హోటళ్ళలోనూ, రైలుస్టేషన్‌లలోనూ ముందువచ్చిన వాళ్ళకి ముందుగా టిక్కట్లు ఇచ్చి వేసి పంపిస్తారు. జనంకూడా గుంపులుగూడి తోసుకోకుండా ఒక్కవరసగా నిలబడి, ఒకళ్ళ వెనక ఒకళ్ళు తమతమ పనులు నెరవేర్చుకుంటూ ఉంటారు. ట్రాముల్లోనూ, గుర్రపుబళ్ళలోనూ డ్రైవర్లు ప్రయాణీకుల్ని అతిమర్యాదగా చూస్తారు. ఈ గుఱ్ఱపు బళ్ళవాళ్ళు

మద్రాసులో రిక్షాబళ్ళవాళ్ళలాగు కాకుండా పట్టణం అంతా బాగా తెలుసు కుని ఉంటారు. దానికి తోడుగా వాళ్ళు మంచి నిజాయితీ ఉన్నవాళ్ళు.

ఒకసారి నేను నా లా పుస్తకం ఒకటి గుఱ్ఱపు బండిలో మరిచి పోయి ఇంటికి వెళ్ళిపోయాను. తీరా ఇంటికి వెళ్ళాక ఆ దేశంలో సి.ఐ.డి. పోలీసులకి హెడ్ ఆఫీసు అయిన స్కాట్లండు యార్డుకి తెలియ పరచాలని అనుకుంటూ ఉండగా కొన్ని గంటలలో పుస్తకం నా గదిలోకి వచ్చిపడింది. జరిగింది ఏమిటంటే—ఆ గుఱ్ఱపుబండివాడు ఆ పుస్తకం పోలీసులకి అప్పచెప్పాడు. ఆ పోలీసులు నా చిరునామా తెలుసుకుని పుస్తకం నాకు పంపించారు. మనదేశంలో లాగు యజమాని ఫలానా అని నిర్ధారణ చేసే ఐడెంటిఫికేషన్ హంగామా ఏమీ చెయ్యలేదు.

ఇల్లాంటి చిన్న విషయాలే నాకు ఆంగ్ల జాతీయ జీవనం మీదా, నీతి వర్తనంలోనూ బాగా గాఢాభిమానం కలిగించాయి. ఆ అభిప్రాయాల తోనూ,అభిమానంతోనూ వెనక్కి తిరిగి మనదేశం సంగతి తలుచుకుంటే నిస్పృహ కలిగింది. "ఎప్పటికైనా మన ప్రజాసామాన్యం ఈ ఔన్నత్యా నికి రాగలదా?" అని బాధ కలిగింది. అప్పట్లో నా మనస్సు నా ఒక్కడిదే కాదు. అది నా సమకాలికు లందరిదీని! అదీగాక ఒక కొత్త వింతలాగ పాశ్చాత్యనాగరకతను అత్యంత వ్యామోహంతో చూస్తూవుండే రోజు లవడంవల్ల కూడా నా కీ నిస్పృహ కలిగింది. తరవాత నా అనుభవం వల్ల మనదేశంలో మన జాతిలో కూడా ఒకప్పుడు ఇల్లాంటి నీతినియ మాల ఔన్నత్యం ఉండేదనీ, మాట ఖరానా ఒకటేగాని, ఇచ్చి పుచ్చుకోవడాలలో రాతకోతలు, రిజిస్టరీలు లేవనీ తెలుసుకోగలిగాను. తమ స్వార్థంకోసం ఆంగ్ల రాజనీతిజ్ఞులు తమ సభ్యత్వ పద్ధతులు అసం పూర్తిగా మన నెత్తిని రుద్ది, మన సభ్యతను మరిపించడంవల్లనే మన జాతికి పతనం కలిగిందని కూడా తెలుసుకున్నాను. ఈ విషయాలు ఇంకొకసందర్భంలో వ్రాస్తాను. ఈ విధమైన అభిప్రాయాలతో ప్రారం భించిన బారిష్టరీ చదువు మొదటి టెరము పూర్తి అయింది.

లండనులో నాకు మొట్టమొదట పరిచితులు అయిన భారతీయులు డెల్గాడో అనే గోవా సొలిసిటరూ, పరేష్ అనే పార్సి బారిష్టరూ

మాత్రమే. పరేష్ అనే ఒకాయన అంగ్లస్త్రీని పెళ్ళాడి అక్కడే బారిష్టరుగా ప్రాక్టీసు చేస్తూవుండేవాడు. ఆయన ఒకరోజున నా గదికి వచ్చి నేను కాయగూరలు వండుకు తింటూవుంటే చూసి, "ఏమండీ! ఈ చలిదేశంలో మాంసాహారాలు తినకపోతే ఆరోగ్యం చెడిపోతుంది సుమండీ!" అని హడలగొట్టాడు.

# 10

## రాజకీయాలతో పరిచయం

ఆయనే అప్పుడు లండన్‌లో ఉంటూ ఉండిన 'లండన్ ఇండియన్ సొసైటీ'లో నన్ను మెంబరుగా చేర్చారు. రాజకీయమే ప్రధానమైన నా జీవితంలో రాజకీయ స్వాతంత్ర్యం విషయమై ఆకాంక్ష అప్పుడే ఉదయించిన రోజులవి. ఇంగ్లీషువారు ఈ పవిత్ర భూమిని అక్రమంగా ఆక్రమించుకొన్నారనీ, మళ్ళీ మన జన్మభూమి స్వాతంత్ర్యంకోసం వంగ రాష్ట్రంలోని విప్లవకారులు సాహసచర్యలు చేస్తున్నారని నాకు తెలుసును. వాళ్ళ కథలన్నీ నా మనస్సులో ఉన్నాయి. పశ్చిమ భారతదేశంలో లోకమాన్య బాలగంగాధరతిలక్ మహాశయుడి స్వాతంత్ర్య సంపాదనా కృషి, రాండ్‌హత్య, తిలక్ మహారాజుమీద కేసు, మొదలయిన విషయాలు నా మనస్సులో బాగా నాటుకుని ఉన్నాయి. తిలక్, గోఖలేల అభిప్రాయభేదాలు, వాళ్ళకీ, ఫిరోజిషా మెహతా ప్రభృతుల మధ్య వుండే పోటాపోటీలు కూడా నేను తెలుసుకున్నాను. పంజాబ్‌లో లాలాలజపతిరాయ్ కృషి, ఆయన అనుభవించే కష్టాలు నన్నాకర్షించాయి. కాంగ్రెసు పుట్టి అప్పటికి 17, 18 సంవత్సరాలు అయింది. దేశాభ్యుదయంకోసం ఆ సంస్థపడుతూ ఉన్న శ్రమనే నెరుగుదును. అయితే బెంగాలులో విప్లవకారులు, పశ్చిమదేశంలో తిలక్ మహాశయుడూ, ఉత్తరదేశంలో లజపతిరాయీ, నన్ను బాగా ఆకరించారు.

కాని, "ఇప్పటిలాగ ఈ దేశం ఒకసంస్థ యాజమాన్యం కిందకి వచ్చి ఒక నాయకుడి కింద ఇంతటి ఏకీభావంతో ఉండడం నా జీవితంలో చూడగలుగుతానా!" అనే సంశయం మాత్రం నన్ను బాధిస్తూ ఉండేది. ఇల్లాంటి అభిప్రాయాలు మొలకెత్తి ఆ విషయమైన ఆలోచనలో వుండే సమయంలో ఇంగ్లండులో లండన్ ఇండియన్ అసోసియేషన్‌లో చేరడం తటస్థించింది. అప్పటికి ఆ సభలోని ప్రముఖులలో దాదాభాయి నౌరోజీ ముఖ్యుడు. ఆయన అప్పటికే ఇండియన్ పోవర్టీ (Indian poverty) అనే గ్రంథం రచించాడు. ఆ గ్రంథం అంతా, సమగ్రంగా చదివేసరికే నాకు దేశంలోని దరిద్రనారాయణుల స్వరూపం గోచరించింది.

దాదాభాయి నౌరోజీ కాంగ్రెసు స్థాపకులలో ఒకడై దేశాన్ని ఏకటాకీగా నడిపించడానికి కృషిచేసి, ఇంగ్లండులో కూడా పనిచేసి, ఇంగ్లీషు ప్రజలకి దాని నిజస్థితి తెలియజెయ్యడానికి ఆదేశం చేరాడు. అక్కడ ఎంతో కష్టపడి పలుకుబడి సంపాదించి పార్లమెంటు మెంబరు కూడా కాగలిగాడు. బెంగాలులో సివిలియన్‌గా వుండి, పింఛన్ పుచ్చుకుని, కాంగ్రెసు స్థాపకుల్లో ఒకడైన సర్ హెన్రీ కాటనూ, బొంబాయి సివిలియన్ అయి, కాంగ్రెసు స్థాపకులలో ఒకడయిన సర్ విలియమ్ వెడర్‌బర్న్నూ కూడా ఈ సంఘానికి ప్రధానులు. బెంగాలులో ఐ.సి.ఎస్. వుద్యోగంచేసి రిటైర్ అయి అనేక గ్రంథాలు వ్రాసిన రమేశచంద్ర దత్తు, కాంగ్రెసు ప్రథమాధ్యక్షుడైన డబ్ల్యు. సి. బోనర్జీ కూడా ఆ సంఘంలోనే ఉండేవారు. అప్పుడే నేను దత్తు వ్రాసిన 'ఇకనామిక్ సర్వే ఆఫ్ ఇండియా' అనే పుస్తకం చదివాను.

దాంతో నాకు ఆంగ్ల పరిపాలన యెడల విముఖత్వమూ, భారత స్వాతంత్ర్య సంపాదన యెడల ఆకాంక్ష హెచ్చు కావడంలో ఆశ్చర్యం ఏమీలేదు. ఈ లండన్ ఇండియన్ అసోసియేషన్‌లో చక్కని లైబ్రరీ ఉండేది. ఇందులో ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా మొదలైన వివిధ దేశాల్లో ప్రజాస్వామికం కోసమూ, ప్రజల స్వాతంత్ర్యం కోసమూ జరిగిన పోరాటాల గాథల్ని గురించిన గ్రంథా లెన్నో

వున్నాయి. ఆ గ్రంథాలు చదవడానికి నాకు గొప్ప అవకాశం లభించింది. ఈ సంఘ ప్రధానోద్దేశం కూడా అదే. విద్యాభిలాషులై ఆదేశం వచ్చిన భారతీయులకి తమ దేశం వచ్చిన పిమ్మట దేశసేవలో నిమగ్నులు కావడానికి తగిన విద్యావివేకాల్ని కలిగించడమే ఆ సంఘాదర్శం. అంతే కాకుండా హిందూదేశపు ఐశ్వర్యంమీద జీవయాత్రచేస్తూ ఆ దేశం ఎక్కడ వుందో, ఎంత దేశమో తెలియకుండా కాలక్షేపంచేసే ఆంగ్ల ప్రజలకి కాస్త వివేకం కలిగించడం మరి ఒక ఆదర్శం.

ఆ సంఘం తరపున తరచు సభలు జరుపుతూ ఉండేవాళ్ళు. నేను ఆ సంఘంలో చేరిన కాలానికి అప్పుడే మనదేశంలో అతివాద మితవాద విభేదాలు పెచ్చు పెరుగుతున్నాయి. నేనక్కడ ఉండగానే డబ్ల్యు. సి. బోనర్జీగారు మరణించారు. ఆయన అంత్యక్రియల సందర్భంలో రమేశచంద్రదత్తు ఉపన్యాసం చేస్తూ మన దేశంలో అతివాదం పెరిగిపోతూ ఉందనీ, వంగదేశంలో అరాజకం హెచ్చిపోతూ ఉందనీ విచారిస్తూ మాట్లాడారు. అసలు విషయం మాట అటుంచి ఆ సందర్భంలో ఆ విషయాలు మాట్లాడినందుకు అస్మదాదులకి కొందరికి కష్టం తోచి కొంచెం కటకట పడ్డాము.

నేను లండన్‌లో ఉండగానే దాదాభాయి నౌరోజీ పార్లమెంటు ఎన్నిక కూడా వచ్చింది. ఆయన తరపున మేమంతా ప్రచారకులుగా పనిచేశాము. ఆ ఎన్నిక విధానం అంతా ఆంగ్లేయులే ఏర్పాటు చేసినా, అందులో భారతీయులం అందరమూ కూడా పాల్గొన్నాము. అప్పుడు నేనొక ఏజంటుగా పనిచేశాను. ప్రతిపక్షీయులు, కొన్ని చోట్ల నౌరోజీ నల్లవాడనీ, తెల్లవాళ్ళు తెల్లవాళ్ళకే వోట్లు ఇవ్వాలనీ ప్రచారంచేశారు.

అప్పుడు మాకు ఏమీ తోచక మా నాయకుడైన ఇంగ్లిషు ఆయన్ని సలహా అడిగాము. ఆయన, "ఇంత మాత్రానికే నా దగ్గిరికి రావాలా? దాదాభాయి నల్లవాడైతే ఆయనమీద పోటీ చేసేవాడు తెల్లదనంలో రంగు తగ్గిన జ్యూ. అందుచేత సమర్థతనిబట్టి వోటు ఇవ్వండి!" అని చెప్పమన్నాడు. పైగా, దాదాభాయి రంగులో తెల్లవాళ్ళకన్న తెల్లగా వుంటాడని చెప్పమన్నాడు. దాదాభాయి మంచి తేజశ్శాలి. యోగీ

శ్వరుడులా వుండే ఆయన ముఖవర్చస్సు ఈ నాటికి కూడా నా కన్ను లకి కట్టినట్లుంది.

ఆ రోజులలో లండన్ ఇండియన్ సొసైటీ తరఫున 'ఇండియా' అనే వారపత్రిక కూడా ప్రచురించబడుతూ ఉండేది. మేము ప్రముఖు లైన భారతీయుల్ని రప్పించి, వారిచేత ఉపన్యాసాలు కూడా ఇప్పిస్తూ వుండేవాళ్ళము. ఒకసారి, "సురేంద్ర నాథ బెనర్జీని పిలవాలా! గోఖ లేని పిలవాలా?" అనే మీమాంస వచ్చింది. బెంగాల్ సివిలియన్ అయిన కాటన్‌కి సురేంద్రనాథ బెనర్జీ అంటే అభిమానం. బొంబాయి సివిలియన్ అయిన వెడ్డర్‌బర్న్‌కి గోఖలే అంటే ఇష్టం. చాలా దీర్ఘ మయిన చర్చ అయిన తరవాత గోఖలేని ఆహ్వానించారు. అయితే గోఖలేని ముందు తను చెప్పబోయే ఉపన్యాసం వ్రాసి పంపమన్నారు. ఆయన అల్లాగే తన ఉపన్యాసం వ్రాసి పంపించాడు. అంతలో ఉండేది ఆ సంఘం స్వేచ్ఛ.

ఆ సమయంలో మా సంఘం తరఫున లాలా లజపతిరాయ్‌గారు కూడా వచ్చారు. ఆయన్ని నేను శ్యాంజీ కృష్ణవర్మ ఇంట్లో కలుసు కున్నాను. మొట్ట మొదటి సందర్శనంతోనే నాకు ఆయన దేశభక్తి తీవ్రతా, ఆవేశమూ ప్రస్ఫుటం అయ్యాయి. ఆయన, "ఎన్నాళ్ళు మన దేశం ఇల్లాగ ఈ దాస్య బంధంలో పడి వుండాలి?" అని ఎంతో ఆత్రంగా నిట్టూర్పు విడిచేవాడు. ఆయన మహారాష్ట్ర దేశీయుడు. సంపూర్ణ స్వాతంత్ర్య విప్లవవాది. బ్రిటిష్ పాలన అంటే పరమ ద్వేషి. హిందూ దేశంలో సాయుధ విప్లవం తీసుకురావా లనే విశ్వాసం కలవాడు. చాలా ధనవంతుడు. 'ఇండియన్ సోషియాలజిష్టు' అనే పత్రిక మంచి తీవ్రంగా నడుపుతూ ఉండేవాడు. హెర్బర్టు స్పెన్సరు అంటే ఆయనకి అభిమానం. స్పెన్సరు పేరిట లండన్‌లో భారతీయ విద్యార్థులికి విద్యార్థి వేతనాలు ఇచ్చేవాడు.

ఆయన దగ్గిర స్కాలర్‌షిప్ పుచ్చుకున్నవాడు ఆయన రాజకీ యాల్లో పనిచెయ్యాలని బాండు వ్రాసి యివ్వాలి. నాకు కూడా ఆయన స్కాలర్‌షిప్ ఇస్తానన్నాడు. నేను నా మిత్రుడు ఒకడు వ్రాసినబాండు

చూసి అందులో నవ నాడులూ బంధించే షరతులు నా కిష్టం లేక, అది నాకు అక్కరలేదని చెప్పాను. కృష్ణవర్మ దేశభక్తి అపారము. తరవాత ఇండియా స్కాలర్‌షిప్ అనే పేరుతో సావర్కారు, వి. పి. యస్. అయ్యరు, మదన్‌లాల్ ధింగ్రా ప్రభృతులకి ఆశ్రయమిచ్చిన దీయనే. ఆయన ఇంగ్లండులో ఉండడానికి వీలు లేకపోవడంవల్ల ఫ్రాంసులో వుంటూ ఇటీవలనే చనిపోయాడు.

# 11

## బారిష్టరుచదువు పూర్తి

ఈ రీతిగా భారత స్వాతంత్ర్యం కోసం పాటుబడే మనుష్యులతోటీ, సంస్థలతోటీ నాకు సాహచర్యం కుదిరింది. కాని, ఈ పనులేవీ నా బారిష్టరు చదువుకి ప్రతిబంధకం అవదు. రోమన్ లా, కాన్‌స్టిట్యూషన్ లా, లా హిష్టరీ వగైరా విషయాల్లో ప్రిలిమినరీ పరీక్షలు జరుగుతూ ఉండేవి. నేను వాటి అన్నింటిలోనూ బాగానే ఉత్తీర్ణుణ్ణి అవుతూ వచ్చాను. ఆ కాలంలోనే సర్ శంకరన్ నాయరుగారు బారిష్టరు చదువుకోసం వచ్చి, మా గ్రే ఇన్‌లోనే చేరారు.

శంకరన్ నాయరుగారు అప్పటికప్పుడే రాజకీయాల్లో ఒక వెలుగు వెలిగారు. కాంగ్రెసు అధ్యక్షులు అయ్యారు. అక్కడనించి మద్రాసు గవర్నమెంటు ప్లీడరు, పబ్లిక్ ప్రోసిక్యూటరు కూడా అయ్యారు. కాని, హైకోర్టు జడ్జీ కావాలని ఆయన ఆశ. కేవలం వకీలుగా ఉంటే మైలాపూరు మేధావులతో పోటీవల్ల ఆ పదవి రాదని ఆయన భయం. హైకోర్టులో విధిగా కొంతమంది బారిష్టరు జడ్జీలు వుండాలి కనక, అల్లాగయినా హైకోర్టు జడ్జీ కావాలనే ఉద్దేశంతో వేసవి సెలవలలో వచ్చి డిన్నర్లకి హాజరు అవుతూ వుండేవారు. చివరికి, ఆయన బారిష్టరు కోర్సు పూర్తి కాకుండానే జడ్జీ అయ్యారు.

ఒకసారి ఆయనా, నేనూ లండనులో భోజనం చేస్తూండగా ఆయన షాంపేన్ ఆర్డరిచ్చారు. నేను కేవలం కాయగూరలు తినడం, సారా తాగకపోవడం చూసి, ఆశ్చర్యపోయి, "ఇల్లాగైతే డిన్నర్ల దగ్గర మీరు పనికిరా రన్నమాటే!" అన్నారు. నా యీ కాయగూరల తిండి చాలామందికి ఆశ్చర్యంగా ఉండేది. ఇంగ్లీషు సహపాఠులు కొందరు నన్ను గడ్డితిని బ్రతికేవాడని హేళన చేస్తూండేవారు. అప్పటి కింకా ఈ విటమిన్ సిద్ధాంతం అమలులోకి రాలేదు. నేను విందుల్లో ఇంగ్లీషువాళ్ళ పంక్తికి బొత్తిగా పనికిరాకుండా ఉన్నానని, అన్నిటికన్నా తక్కువ ప్రమాదకరమైన సిగరెట్టు అలవాటు చేసుకున్నాను. దీనికి కూడా ఒక గాథ జరిగింది.

బారు విందులు జరిగినప్పుడు అందరిలోనూ చిన్నవాడైన విద్యార్థి భోజనానంతరం ఒక చిన్న ఉపన్యాసం ఇచ్చి, పొగ తాగడానికి మాష్టరు అనుజ్ఞ పొందాలి. ఇది అనుశ్రుతంగా వచ్చే ఒక తంతు. అంతవరకూ దాన్ని ఎవ్వరూ ధిక్కరించలేదు. నేను మొదట్లో అక్కడికి వెళ్ళిన రోజుల్లో నా వంతు వచ్చింది. మా ఇన్‌కి అధ్యక్షుడు-మాష్టరు సర్ ఆర్థర్ కాలిన్సు. ఈయన మద్రాసు హైకోర్టు మొదటి ఛీఫ్ జడ్జిగా ఉండి చాలా స్వాతంత్ర్యం చూపించిన ప్రముఖుడు. ఆయన మద్రాసు హైకోర్టు నూతన భవనాలు తెరుస్తూ చాలాగంభీరంగా ఉపన్యసించి, "మతాలూ, కులాలూ, ధనికులూ, పేదలూ అనే తారతమ్యం లేకుండా నేనూ, నా సోదర న్యాయాధిపతులూ న్యాయం చేస్తాము," అని చెప్పిన ధీరుడు. ఆయన ఈ ఇన్‌కి మాష్టరుగా ఉండడం చేతనే చాలామంది మద్రాసీయులు ఈ ఇన్‌లో చేరుతూ ఉండేవారు. నావంతు వచ్చేసరికి నేను నిలబడి, "సిగరెట్టు తాగి ఇల్లాంటి ఉపన్యాసం ఇవ్వను," అని చెప్పాను.

విందులో పాల్గొన్న వాళ్ళంతా నిర్ఘాంతపోయారు. "ఇన్నాళ్ళ నించీ వున్న ఆచారం ధిక్కరించడమా?" అని హాహాకారాలు బయలుదేరాయి. నా బల్ల దగ్గిర ఉన్నవాళ్ళు కొందరు నన్ను తిట్టారు. కాని,

నేను చలించలేదు. మాష్టరు దగ్గిరికి నా మీద రిపోర్టు వెళ్ళింది. ఆయన నన్ను తన బల్లదగ్గిరికి పిలిచారు. ఆ బల్లమీద ఇంకా ఎందరో మాజీ జడ్జీలు మొదలయినవారు ఉన్నారు. నేను "నాకీ ఆచారం ఇష్టంలేదు. ఇష్టం కానిపని చెయ్యకుండా ఉండడానికి నాకు స్వాతంత్ర్యం లేదా?" అని అడిగాను. ఆయన ఒక్క క్షణం నా ముఖంకేసి నవ్వుతూ చూసి "సరే! నీ బల్లదగ్గిరికి వెళ్ళ" మన్నాడు. ఈ రీతిగా నేను ఇంగ్లీషు ఇన్‌లోని పొగతాగే ఆచారం ధిక్కరించాను. అయితే, ఆ తరవాత నేనుకూడా సిగరెట్టు అలవాటు చేసుకున్నాను.

నేను మొదటిసారి అక్కడ ఉన్న ఎనిమిది మాసాలలోనూ ఇంగ్లండులోని ముఖ్య పట్టణా లన్నీ చూశాను. అక్కడ ఉన్న యూనివర్సిటీలు కూడా చూశాను. బారిష్టరు పట్టాతోబాటు ఆర్టుడిగ్రీ కూడా పొందాలని నా సంకల్పం. అందుకుకూడా చదువు ప్రారంభించాను. కాని ఇన్ని చదువులవల్ల అసలు గ్రంథానికి అభ్యంతరం కలుగుతుందని విరమించాను. షేక్సుపియరు మహాకవి ఇల్లు, ఆయన భార్య నివాసము మొదలైన చారిత్రక స్థలాలు ఎన్నో దర్శించాను. వాళ్ళ దేశంలోని ప్రసిద్ధ రచయితలకి వాళ్ళు చూపే ఆదరణమూ, గౌరవమూ చాలా ప్రశంసనీయాలు. ప్రభుత్వమే వాళ్ళు ఉండే ఇళ్ళు వగైరాలు కొని, వాటిని జాతీయ ప్రతిష్ఠాపనలుగా రక్షించి ఉంచుతారు.

మనదేశంలో, ముఖ్యంగా తెలుగుదేశంలో భారతం వ్రాసిన నన్నయాదులకీ, భాగవతం వ్రాసిన పోతన్నకీ వాళ్ళ గ్రంథాలు తప్ప వారి సంతతి వారికి ఉత్సాహం కలిగించి గర్వం కలిగించే చిహ్నా లేమీ లేనేలేవుకదా! అప్పుడే ఎప్పటికైనా రాజమహేంద్రవరంలో తిక్కనకీ, నన్నయకీ, ఎఱ్ఱన్నకీ ఒక స్మారకచిహ్నం కట్టాలని నాకు సంకల్పం కలిగింది. కాని, తరవాత జీవితపు ఆందోళనలో నే నా పని చెయ్యలేక పోయాను.

నేను లండన్‌లో ఉన్న మొదటి మూడు నెలలూ కూడా రాజమహేంద్రవరం మునిసిపల్ ఛైర్మన్‌గానే ఉన్నాను. కాని, ఆ తరవాత నా ఛైర్మన్ పదవికి లండన్‌నించే రాజీనామా ఇస్తూ మద్రాసు గవర్న

మెంటు మెంబరు ఫోర్బ్సుకి "రాజమహేంద్రవరం మునిసిపల్ సొమ్ము జాగ్రత్తగా నీకు అప్పచెబుతున్నాను సుమా!" అని ఉత్తరం వ్రాశాను. ఆయన దానిలో ఉన్న ఎత్తిపొడుపు గ్రహించి, నన్ను అభినందిస్తూ తిరిగి ఉత్తరం వ్రాశాడు. తన సోదరి ఒక ఆమె ఎడింబరోలో లాంచ్ లేడీ—అంటే హోటలు యజమానురాలుగా—ఉన్నదనీ, ఆమెను కలుసుకోమనీ నాకు వ్రాసి, ఆ విషయంలో ఆమెకి కూడా ఒక ఉత్తరం వ్రాశాడు. నన్ను ఛైర్మన్ పదవినించి లాగివేయదలుచుకున్న ఫోర్బ్సుకీ నాకూ ఉన్న సంబంధం అల్లాగ పరిణమించింది.

మొదటి టెరము ఎనిమిది మాసాలూ ముగించుకుని, జూన్ 30 వ తేదీని బయలుదేరి, జూలై 15 వ తేదీని బొంబాయిమీదుగా రాజమహేంద్రవరం చేరాను. నేను తిరిగి రాజమహేంద్రవరం చేరే టప్పటికి నా మిత్రులకీ, శత్రువులకీ కూడా ఒకటే ఆశ్చర్యం. ఇంట్లో వాళ్ళ సంగతీ, బంధువుల సంగతీ వేరే చెప్పనే అక్కరలేదు. కాశీకి వెడితేనే కాటికి వెళ్ళినట్లు లెక్క చూసుకునే రోజుల్లో ఇంగ్లండు వెళ్ళి రావడం అంటే అందరికీ ఆశ్చర్యంగా వుండేది. నా మిత్రులూ, శత్రువులూ చాలామంది నేను లండన్‌లో పాడైపోతాననీ, మళ్ళీ రావడం సంశయమనీ అనుమానిస్తూ ఉండేవారు. ఒక్క రామచంద్రరావు మాత్రం నేను సంపూర్ణంగా పని నెరవేర్చుకుని వస్తాననే ధైర్యంతో ఉండేవాడు. ముఖ్యంగా ఈ దేశంలో లండన్‌లో స్త్రీల స్వేచ్ఛని గురించీ, తాగుబోతుతనాన్ని గురించీ వ్యాపించిఉన్న కల్లిబొల్లి కథల వల్లనూ, నా చిన్ననాటి చర్యలవల్లనూ, ఇక్కడ ఆ విషయాల్లో నాకు కొంత బలహీనత ఉండిన కారణంవల్లనూ అందరూ నేను పూర్తిగా పాడైపోతా నని అనుకున్నారు. కాని, నిజానికి ఆదేశం జీవితమే నన్ను మానసికంగా కొంత ఆ బలహీనతనించి తప్పించి, మంచిమార్గా నికి మళ్ళించింది. పై కారణం చేతనే నేను తిరిగి వచ్చా ననేసరికి రాజమహేంద్రవరం అంతా ఒక వింతగా పరిగణించారు.

# 12

## రాజమహేంద్రవరం రాక

అప్పటికి రాజమహేంద్రవరంలో వీరేశలింగంగారి ప్రభ బాగా వెలుగుతోంది. అప్పటికే సుబ్బారావుపంతులు ప్రభృతులు ఆయనకి విరోధులు అయ్యారు. వితంతు వివాహాలు ప్రోత్సహించిన సుబ్బారావు పంతులుగారు, తీరా తన తమ్ముడే కందుకూరివారి ప్రోత్సాహంచేత కొమ్మూరి నరసింహారావుగారి చెల్లెల్ని వివాహమాడేసరికి, పంతులు గారికి ఎదురు తిరిగి హిందూసమాజం స్థాపించారు. నూతన వైష్ణవానికి పంగనామాలు పెద్దిన్నట్లు పంతులుగారి సనాతన హిందూధర్మం చాలా కరుడు గట్టింది. చివరికి ఆ సనాతన ధర్మం అంతా భయంకరంగా నా మీదికి తిరిగింది.

నేను ఇంగ్లండునించి వచ్చాక ప్రాయశ్చిత్తం చేసుకుంటేనే కాని ఇంట్లో కలవడానికి వీలులేదన్నారు. నేను దానికి వల్లకాదన్నాను. మా తమ్ముడు శ్రీరాములు అప్పుడు వీరేశలింగంగారి శిష్యులలో ముఖ్యుడు. అతను ముందే వద్దని పట్టుపట్టాడు. కుందూరి వెంకట రత్నం, దామెర్ల రమణారావు ప్రభృతులు కూడా వద్దనే వాళ్ళలోవాళ్ళే. కొందరు మిత్రులు నేను తిరిగి వచ్చిన కొత్తరికంలో విందులు చేశారు. ఆ విందుల్లో పాల్గొన్నవా ళ్ళందరికీ సంఘబహిష్కారం అన్నారు. ఈ బహిష్కారం గందరగోళంవల్ల నేను ఎక్కడ లొంగిపోతానో అని వీరేశలింగంగారికి బాగా ఆత్రతగా ఉండేది. అందుచేత ఆయన ఒకసారి నేను ధార్వాడ కృష్ణారావుగారి ఇంట్లో కూర్చుని ఉండగా వచ్చి నన్ను హెచ్చరించిపోయారు. బహిష్కరణవాదులంతా ఒక సభ చేసి, నా విషయమూ, నాతో భోజనం చేసిన ఇతరుల విషయమూ గుదిగుచ్చి, శంకర పీఠాధిపతులైన రాణీచయనులు స్వాములవారికి ఫిర్యాదు చేశారు.

దానిమీద ఆయన నాకు ఒక రిజిస్టరు నోటీసు పంపించారు. సముద్ర యానం హిందూ మతానికి విరుద్ధం కనక, తగిన ప్రాయశ్చిత్తం లేనిదే హిందూ సంఘంలో కలవ కూడదనీ, వెంటనే తన ఎదట హాజరు

కమ్మనీ నా కొక తాఖీదు ఇచ్చారు. దానికి వెంటనే నేను జవాబు ఇచ్చాను. గత 25 సంవత్సరాలనించీ ఆయన్ని ఎప్పుడూ మేము ఎరగమనీ, మా పెద్దలు అయినా ఆయన అధికారాన్ని ఎప్పుడూ అంగీకరించలేదనీ, నా కల్లాంటి తాఖీదు ఇవ్వడానికి ఆయనకి అధికారం లేదనీ వ్రాసి పంపించాను. ఆ బహిష్కారపు గందరగోళం ఒక పెద్ద ఆందోళనకి కారణం అయింది. నేను మళ్ళీ అక్టోబరునెలలో లండన్ వెళ్ళిపోయాక సుబ్బారావుపంతులు ప్రభృతుల ప్రోత్సాహంవల్ల స్వాములవారు రాజమహేంద్రవరం వచ్చారు. ఆయన్ని ఏనుగుమీద ఊరేగించి మార్కండేయస్వామి గుడిలో ఒక పెద్ద సభ చేశారు.

ఆ సభలో నా విషయమూ, నాతో విందు ఆరగించినవారి విషయమూ తీర్పు చెయ్యడానికి ఉపక్రమిస్తూ ఉండగా, కొందేపూడి భద్రిరాజు ప్రభృతులు లోపలికి వెళ్ళి స్వాములవారిని అడ్డుప్రశ్నలు వెయ్యడం లంకించుకున్నారు. "స్వామీ! తమ రెన్నడూ రాజమహేంద్రవరం రాలేదే! ఇప్పుడు తమర్ని ఎవరు రమ్మన్నారు? ఏమిటి సమాచారం? ఈ వ్యవహారమంతా ఏమిటి?" అని ప్రశ్నలు వేస్తూ ఆయన గౌరవార్థం వెలిగించిన దీపాలు ఊదివెయ్యడం ఆరంభించారు. దాంతో స్వాములవారు కంగారుపడి పావుకోళ్ళు చేత్తో పట్టుకుని, "బ్రతుకు జీవుడా!" అని పలాయనం చిత్తగించారు. ఈ విషయం అంతా వివేకవర్ధనిలో ప్రచురించబడింది. నేను లండన్‌లో ఉండగా వీరేశలింగంగారు నాకు ఈ పేపరు కటింగు పంపించారు.

నేను జూలై, అక్టోబరు నెలలకి మధ్య రాజమహేంద్రవరంలో ఉన్నప్పుడు మళ్ళీ ప్రాక్టీసు చేశాను. ముఖ్యంగా పోతునూరు కేసు నాకు పూర్తిగా పని చెప్పింది. పోతునూరులో చెలసాని పట్టాభిరామయ్యగారి భార్య రామమ్మగారిమీద (మాగంటి బాపినీడు అక్కగారు), దాయాదులు ఆస్తి జబర్దస్తీగా స్వాధీనపరుచుకున్నారని నేరం మోపి క్రిమినల్ ప్రొసీజరుకోడు 145 సెక్షను ప్రకారం చార్జి ఇచ్చారు. నేను ఇంగ్లండు వెళ్ళబోయే టప్పటికి ఆ కేసు ఆరంభం అయింది. అది నేను తిరిగి వచ్చేవరకూ నడుస్తూనే ఉంది. అవతల

పార్టీ వాళ్ళు డాక్టర్ స్వామినాధన్‌ని తీసుకువచ్చి కేసు నడిపిస్తున్నారు. నేను తిరిగి వచ్చాక ఆ కేసులో స్వామినాధన్‌కి వ్యతిరేకంగా పనిచేసి కొట్టివేయించాను. తరవాత అది సివిల్ కేసుగా పరిణమించింది. నేను ఆ కేసులో ప్లెయింటు దాఖలుచేసి మళ్ళీ ఇంగ్లండు వెళ్ళిపోయాను. ఆ కేసు 5, 6 సంవత్సరాలపాటు కిందుమీదులు పడి చివరికి ఆమె పక్షం అయింది. మొట్టమొదట ఆమెదగ్గిర కేసు ఖర్చులికి కూడా డబ్బు లేకుండా ఉన్న రోజుల్లో నేను ఆ కేసు పట్టి పనిచేశాను. ఆ ఆస్తి సుమారు పది లక్షల రూపాయల విలువగలది. ఆ ఆస్తి ఆమె స్వాధీనం అయ్యాక ఆమె నాకు 70 వేల రూపాయిల ఫీజు ఒక్కసారిగా ఇచ్చింది.

# 13

## మళ్ళీ ఇంగ్లండు ప్రయాణం

రెండవసారి చదువుకి మళ్ళీ అక్టోబరులో బయలుదేరి లండన్ వెళ్ళాను. లండన్‌లో కౌన్సిల్ ఆఫ్ లీగల్ ఎడ్యుకేషన్ వాళ్ళు ఇప్పించే ఉపన్యాసాలు శ్రద్ధగా ఆలకిస్తూ పైనలు పరీక్షకి తయారు అయ్యాను. అన్ని ఇన్‌లలోనూ ఈ కౌన్సిల్ ఆఫ్ లీగల్ ఎడ్యుకేషన్ వాళ్ళే ఉపన్యాసాలిప్పిస్తూ అందరికీ పరీక్షలు జరిపి పట్టాలిస్తారు. అంతకి పూర్వం మన దేశంలో వాలస్ పట్టాల్లాగే డిన్నర్‌లకి క్రమంగా హాజరయిన బుద్ధిమంతులకి పట్టాలు ఇచ్చేవాళ్ళు. ఈ కౌన్సిల్ ఆఫ్ లీగల్ ఎడ్యుకేషన్ ఏర్పడ్డాకే మనదేశంలో లా కాలేజీలు కూడా ఏర్పడ్డాయి.

ఈ కాలంలో నేను ఇంగ్లండు దేశం చాలా తిరిగాను. కాస్త వీలైనప్పు డల్లా ఒక్కొక్కదేశం ట్రిప్పు కొడుతూ ఉండేవాణ్ణి. ఇంగ్లండులో ఉన్న ముఖ్యపట్టణాలు, పరిశ్రమల స్థానాలు అన్నీ చుట్టు ముట్టాను. అప్పుడే కేంబ్రిడ్జిలో సి. ఆర్. రెడ్డిగారిని కలుసుకున్నాను. ఆయన అప్పటికే చాలా తెలివైనవాడని పేరుపడ్డారు. యూనివర్సిటీలో కూడా ఆయన ప్రతిభ గణనీయంగా ఉంది. అప్పటి కప్పుడే గోఖలే

గారు ఉపన్యాసాలివ్వడమూ, కొంద రాయన్ని అడ్డుప్రశ్నలు వెయ్య డమూ, మరికొంద రాయన చెప్పినదానికి హర్షించడమూ జరిగింది. సి. ఆర్. రెడ్డిగారు ఎమ్. ఏ. కీ, బారిష్టరు పరీక్షకీ కూడా తయారు అయ్యారు. చివరిదాకా డిన్నర్లు వగైరాలకి హాజరై పరీక్షకి మాత్రం హాజరు కాకుండా ఊరుకున్నారు. నేను ఆయన్ని కలుసుకున్నప్పుడు తెనుగు భారతం చదువుతున్నారు. నాకు తెనుగు భారతంమీద చిన్న ఉపన్యాసం కూడా ఇచ్చారు. నేను "డిన్నర్లు అయ్యాయి కదా! బారిష్టరు పరీక్షకి హాజరై పరీక్ష ఎందుకు పూర్తి చెయ్య,"రని అడిగాను. ఆయన "గోఖలేగారు నాకు బారిష్టరు పనికి వెళ్ళవద్దని సలహాయిచ్చారు. పరీక్ష పాసై ఉంటే ఎప్పటికి అయినా ప్రాక్టీసు చెయ్యాలి అని చపలత్వం కలుగుతుంది. కాబట్టి, ఒక్కసారే దానికి తిలోదకాలు ఇచ్చాను," అన్నారు. అంత దీక్షతో ఉన్నారు ఆయనప్పుడు!

నేను ఈ కాలంలో ఇంగ్లీషు కోర్టులలో పని చాలా శ్రద్ధగా గమనించాను. అప్పుడే రెండుమూడు గొప్ప కేసులుకూడా వచ్చాయి. ఒక కేసులో సర్ ఎడ్వర్డు కార్సన్ అనే ఐరిషు బారిష్టరు పనిచేశాడు. ఒక ఇంగ్లీషు యువతి ఒక జర్మన్ రాజకుమారుడిమీద తనని పెళ్ళి చేసుకుంటానని మభ్యపరచి దగా చేశాడని, వాగ్దాన భంగాని (Breach of promise)కి కేసు తెచ్చింది. ఆ కేసులో జడ్జీకూడా మొదటినించీ ఆమె పట్లనే అభిమానం చూపిస్తూ వచ్చాడు. ఆ సంగతి సర్ ఎడ్వర్డు కార్సన్ గ్రహించి కేసు మంచి నేర్పుతో నడిపించాడు. క్రాసు పరీక్షలో చాలా అమాయికంగా కనిపించే ప్రశ్నలు తగిలించి, వాటి ఆధారంతో ఆమె చాలా మాయల మారి అనీ, ఎందరో ధనవంతులకి టోపీ వేసే సమర్థురాలనీ వాదించాడు. జ్యూరీకి ఆర్గ్యుమెంటు చెపుతూ గుండె బెదురులేకుండా, "జడ్జీలు ముందుగా తమబుద్ధి కోర్టు బయట వదిలిపెట్టి వచ్చినా సాగుతుంది, కాని జ్యూరర్లు మాత్రం ఏవిధమైన అభిమాన దురభిమానాలూ ఉంచుకోకుండా తమ వివేకాన్ని ఉపయోగించ,"మని ఉపోద్ఘాతం చెప్పాడు. చివరకి ఆ కేసులో జ్యూరీ రెండు భాగాలు అవడంచేత కేసుపోయింది.

ఆ దేశంలో బారిష్టర్లు అల్లాంటి స్వాతంత్ర్యం చూపించేవాళ్లు. జడ్జీలని లక్ష్యపెట్టకుండా క్లయింట్ల కేసులు బలపరచేవాళ్ళు. ఆ స్థితికి సంబంధించిన ఇంకొక కేసులో కోర్టు ప్రెసిడెంటు అయిన లార్డు జస్టిస్ మెల్లన్ మీద అతని సవతికూతురు దావా తెచ్చింది. ఆ జడ్జి తన తరపున సాక్ష్యం ఇచ్చుకున్నాడు. జడ్జీ మాట తోసివేయడం అనేది సాధారణ విషయం కాదు.—ఆ కేసులో ఆ కూతురు తరపున సర్ మాంటేగ్ హాజరు అయ్యాడు. అసలు కేసు క్రిందికోర్టు కింగ్సుబెంచి డివిజనులో జడ్జీపక్షం అయింది కాని, సర్ మాంటేగ్ న్యాయం విషయంలో సుప్రీమ్ కోర్టు జడ్జీ అనే అభిమానం ఉండకూడదనీ, న్యాయం కోసం ఆయనమాట తోసివెయ్యాలనీ బహు సున్నితంగా వాదించాడు.

చివరికి కోర్టువారు ఆ జడ్జి సాక్ష్యం తోసివేసి అతని కూతురు మాట అంగీకరించారు. దాంతో ఇంగ్లీషుపత్రికల్లో చాలా గందరగోళం చెలరేగింది. "ఒక జడ్జి సాక్ష్యాన్ని ఇంకొక కోర్టువారు నమ్మకపోతే ఆయన రాజీనామా ఇవ్వాలి." అన్నారు. ఆ జడ్జి అంతకన్న మొండి వాడు. "అప్పీలు కోర్టు జడ్జీలు తప్పు అభిప్రాయం వద్దారు కాని నేను అబద్ధాలు చెప్పలేదు. కనక రాజీనామా ఇవ్వను" అన్నాడు. అక్కడ అల్లాంటి లావాదేవీలు జరుగుతూ ఉండేవి. అటువంటి కేసులు ఏమన్నా వస్తే వాటికి స్వయంగా హాజరై చూస్తూ ఉండేవాణ్ణి.

ఈ కాలంలోనే మద్రాసు హైకోర్టు జడ్జీపని చేసి పింఛను పుచ్చుకున్న షెప్పర్డు అనే ఆయనతో నాకు పరిచయం కలిగింది. అప్పుడాయన ఇండియన్ కంట్రాక్టు ఆక్టు—అనే లాపుస్తకం మార్చి వ్రాస్తూ ఉండే వారు. ఆయన దానికి నన్ను సహాయం చెయ్యమని అడిగారు. అప్పటికే నేను సుమారు 10 ఏళ్ళు కోర్టులో ప్రాక్టీసు చేసి ఉండడంవల్ల ఆయన కోరిన పని తృప్తికరంగా చెయ్యగలిగాను. ఆయన తన పుస్తకంలో కూడా ఈ విషయం వ్రాశారు. తరవాత ఒకసారి ఆయనే నన్ను ఐసాక్ రూఫస్‌కి, (తరవాత ఇండియా వైస్రాయి లార్డు రీడింగుకి) ఎరుకపరచారు. ఐసాక్ రూఫస్ అప్పట్లో పెద్ద లాయర్లలో లెక్క. పుష్కలంగా డబ్బు సంపాదించేవాడు. ఆయన పంజాబ్ వాస్తవ్యుడూ,

రంజిత్‌సింగ్ వారసుడూ అయిన దులీప్‌సింగ్ తరఫున పంజాబు తిరిగి ఆయనకి ఇచ్చివెయ్యాలని గవర్నమెంటుమీద దావా వేశాడు. అది ఒక పెద్దకేసు. లార్డు రీడింగు హిందూదేశంలో ఆచార వ్యవహారాలు, వాటికి సంబంధించిన కేసులు మొదలైనవి ఏరి చెప్పడానికి ఎవరైనా ఒక భారతీయుడు తనకి సాయం కావాలని షెప్పర్డు నడిగాడు. ఆయన నన్ను అప్పగించాడు. నేను కొంతకాలం ఆ రూఫస్ ఆఫీసులో పని చేశాను. ఆ కేసు కొంతకాలం జరిగింది. చివరికి కేవలం శాస్త్రీయ కారణాలచేత అది ఆక్టు ఆఫ్ స్టేటు కనక కేసు లేదని కొట్టివేశారు. ప్రభుత్వం తరఫున అటార్నీ జనరల్ సర్ రాబర్టు ఫిన్‌లేగారు హాజరై కేసు నడిపించారు.

సామాన్యంగా అనుకునేటట్టు బారెట్లా ఫైనల్‌పరీక్ష అంత సులభమైన విషయంకాదు. ఇంగ్లండుకి సంబంధించిన ఆస్తిపాస్తుల చట్టాలు, సివిల్ క్రిమినల్ ప్రొసీజరు, ఈక్విటీ కోర్టులకి సంబంధించిన చట్టాలు కలిపి, చాలా పెద్ద గ్రంథం ఉండేది. మన ఉన్నతవిద్యలాగే మన లాయర్లకి పనికి వచ్చేది కాని, హిందూదేశానికి సంబంధించినది గాని ఏమీ ఉండేదికాదు. లాకి సంబంధించినంతవరకు ఈ బారిష్టరు పరీక్షే చాలా పెద్దపరీక్ష. ప్రీవీ కౌన్సిలులో ప్రాక్టీసు చెయ్యడానికికూడా, ఇదే అర్హత. జడ్జీలకి కూడా ఇదే అర్హత. ఏది ఎల్లా ఉన్నా, హిందూదేశస్థులకి ఈ చదువు చాలా ఖర్చుతో కూడుకున్న పని.

ఆ రోజుల్లో బారిష్టరు పరీక్షకి చదవడానికి ఏమీ డిగ్రీలు అక్కర లేదు. ప్రవేశపరీక్ష అని ఒకటి ఉండేది. అందులో తృప్తికరంగా పాసయితే చేర్చుకునేవారు. బాగా ఇంగ్లీషు రానివాళ్ళు కూడా చేరి ట్యూటర్ల సహాయంతో గట్టెక్కేవారు. కాని, హిందూదేశపు చట్టాల సంగతీ, వాటి అనుభవమూ లేనివాళ్ళకి ఈ చదువు అంతా ఊబిదంపులా కనిపిస్తుంది. కాని నాకూ, అప్పట్లో నా సహాధ్యాయి అయిన సర్ యస్. యన్. సర్కారుగారికీ హిందూదేశంలో లాతో అనుభవం ఉండడంవల్ల, అది అంతా చాలా సరదాగా ఉండేది. ఆయన ఇక్కడ బి. ఎల్. పాసయి, జిల్లా మునసబుపని చేస్తూ బారిష్టరుగా వచ్చారు.

మేము ఉభయులమూ ఫస్టుక్లాసులో రావాలని కృషిచేస్తూ ఉండేవాళ్ళము. ఈ దేశంలో 10 ఏళ్ళపాటు ప్రాక్టీసుచేసి ఉండడంవల్ల ఆ చదువులోతు అంతా బాగా తెలుసుకోవడానికి వీలయింది. నేను లెక్చర్లు శ్రద్ధగా వినడమే కాకుండా, వాటికి సంబంధించిన ప్రధాన గ్రంథాలన్నీ చదివాను. నేనూ, సర్కారుగారూ కూడా సర్టిఫికేట్ ఆఫ్ ఆనరు సంపాదించాలని కృషిచేస్తూ ఉండేవాళ్ళము. అది 50 పౌనుల బహుమానము. ఈ బహుమానమూ, ఈ గౌరవమూ రావాలంటే నూటికి 75 మార్కులు పైగా రావాలి. పైగా, నోటిపరీక్ష ఒకటి ఉంటుంది. దాన్నికూడా నిగ్రహించుకుని రావాలి.

ఆయన వేరే ఇన్‌కి చెందినవాడేగాని మేము ఇద్దరమూ స్నేహంగా ఉండేవాళ్ళము. ఆయన ఈక్విటీ పేపరు ఇచ్చిన (Straughn) స్ట్రాన్‌ని చూడడానికి వెళ్ళారట. ఆయన "ప్రకాశం పేపరు అన్నిటికన్నా ఉత్తమంగా ఉంది. అతన్ని ఒకసారి చూడాలి," అన్నాడట. ఆ సంగతి సర్కారుగారు నాతో చెప్పిన తరవాత నేను ఆయన్ని దర్శించడానికి కనిపెట్టుకుని ఉన్నాను. కాని, ఒకరోజున ఆయనే నా గదికి వచ్చి నన్ను అభినందించి వెళ్ళిపోయినారు. ఈ రీతిగా పరీక్షలు ముగించుకున్నాను.

పరీక్షలు ముగిసేటప్పటికి నా దగ్గిర ఆర్‌బత్‌నాట్ అనే అతను స్థాపించిన బాంకులో 500 రూపాయిలు ఉన్నాయి. ఆర్‌బత్‌నాట్ అనే అతను మద్రాసు ప్రెసిడెన్సీలో పెద్ద బాంకు ఒకటి నడిపించి, చాలా మంది డబ్బు సేకరించాడు. ఆ కంపెనీ దివాలా తీయడంతోటే చాలా మందీ ఉద్యోగస్థులూ, సామాన్య సంసారులూ కూడా చాలా డబ్బు పోగొట్టుకున్నారు. వి. కృష్ణస్వామయ్యరుగారి డబ్బుకూడా కొంత పోయింది. అందుచేతనే ఆయన పట్టుదల వహించి ఆర్‌బత్‌నాట్‌ని ప్రాసిక్యూటు చేయించి, ఇండియన్ బాంకు స్థాపించాడు. ఆ ఆర్‌బత్ నాట్ కంపెనీ శాఖే లండన్‌లో మాక్‌ఫిడెన్ కంపెనీ. ఇక్కడ బాంకు దివాలా తీయడంతోటే అక్కడ కంపెనీ బోర్డు కూడా తిప్పివేశారు. మాక్‌ఫిడెన్ రైలుకిందపడి ఆత్మహత్య చేసుకున్నాడు. అందుచేత మన

డబ్బుకి కూడా దెబ్బతగిలింది. అప్పుడు బహుమతీగా సంపాదించుకున్న 50 పౌనులే గతి అయ్యాయి. ఇంటికి వెళ్ళిపోయేటప్పుడు యూరోపు అంతా సంచారం చెయ్యాలని బుద్ధిపుట్టింది. అప్పుడు చాటపర్రులో మిత్రుడు లక్ష్మణదాసు అనే ఆయన కావలసిన డబ్బు పంపించాడు.

మద్రాసులో జడ్జీగా ఉండిన షెప్పర్డుతో నాకు పరిచయం అయిన సంగతి ఇదివరకే వ్రాశాను. ఎందుకైనా మంచిదని ఆయన్ని మద్రాసులో ఉండే జడ్జీలకి పరిచయం చేస్తూ ఉత్తరాలు ఇమ్మని అడిగాను. ఆయన లేదనలేక పోయాడు. కాని, ఉత్తరాలకి సరియైన మన్నన కలుగదేమో అనే అనుమానం ఆయన్ని బాధించింది. అప్పుడు మద్రాసులో సర్ సుబ్రహ్మణ్యయ్యరు ఒక జడ్జీ. షెప్పర్డు "ఆయన మైలాపూర్ కూటంలో వాడు. ఆయనకి నేను ఉత్తరం వ్రాస్తే మాత్రం మన్నిస్తాడా?" అన్నాడు. చివరికి అంటీ అంటని మాటలతో సర్ సుబ్రహ్మణ్యయ్యరుగారికీ, జస్టిస్ వాలస్‌కీ కూడా ఉత్తరాలు ఇచ్చాడు.

బారిష్టరు ఫైనల్ పరీక్షకి చదివే రోజుల్లోనే భవిష్యత్తుని గురించి కొంత ఆలోచించడం జరిగింది. బారిష్టరై మళ్ళీ రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు పెట్టడమా అనే సంశయం ప్రారంభం అయింది. చాలాకాలం అచ్చటి స్థానిక రాజకీయాల్లో కొట్టు మిట్టయిన నాకు ఆ ఊరంటేనే ప్రాణం విసిగింది. మళ్ళీ అదే బురదలో పడకూడ దనిపించింది. అసలు బారిష్టరు చదువు చదివి కాస్త విశాలమైన ఆవరణలో బ్రతుకుదామని వెళ్ళాను. అల్లాంటప్పుడు రాజమహేంద్రవరంలో తిరిగి బారిష్టరుగా ప్రవేశించి స్థానికమైన గందరగోళాలలో పడకుండా ఉండడానికే నిశ్చయించుకున్నాను. అందుచేత ఏమైనా సరే మద్రాసులో ప్రాక్టీసు పెట్టడానికి నిశ్చయించుకుని షెప్పర్డు దగ్గిర పైన చెప్పిన ఉత్తరాలు తీసుకున్నాను. రాజమహేంద్రవరంలో ఉన్న నా స్నేహితులు, నా శ్రేయోభిలాషులు కూడా నేను తొక్కినదారి మంచిదని అంగీకరించారు.

ఈ నిశ్చయంతోనే సెకండ్ హాండు లా పుస్తకాలు అమ్మే షాపులికి వెళ్ళి, స్వల్పంగా అడ్వాన్సు ఇచ్చి, సుమారు 10 వేల రూపాయల ఖరీదయిన అపురూపపు లా పుస్తకాలు కొన్నాను. వాటిని అన్నింటినీ

సామాను ఓడలో పడవేయించి నేను పి. ఓ. బోటులో వచ్చేశాను. అయినా ఖర్చు ఎల్లాగా అయింది కనక, ఒకటవరకమైన లైబ్రరీకూడా ఉంచాలని సంకల్పించాను. నేను 1906 వ సంవత్సరం చివరికి భారత దేశం చేరుకున్నాను. కొందరు మిత్రుల దగ్గిర ఋణంచేసి లా పుస్తకాలు విడుదల చేయించాను. సకుటుంబంగా చెన్నపట్టణం చేరి కొండి చెట్టి వీథిలో 25 రూపాయిల అద్దెమీద ఒక చిన్న ఇల్లు కుదుర్చుకున్నాను. లైబ్రరీకీ, ఆఫీసుకీ మాత్రం ఒక విశాలమైన హాలు కుదుర్చుకున్నాను.

# 14

## మైలాపూరు మేధావులు

అప్పట్లో మైలాపూర్ వకీళ్ళ ప్రభ బాగా వెలిగిపోతూ ఉంది. భాష్యం అయ్యంగారు మద్రాసుబారుకి నాయకుడు. సర్ సుబ్రహ్మణ్యయ్యరు జడ్జీ. పి. ఆర్. సుందరయ్యరు పెద్ద వకీలుగా పేరుపడ్డాడు. ఇక కృష్ణస్వామయ్యరు అట్టహాసానికి పరిమితేలేదు. అప్పటికి బారిష్టర్లకి ప్రాక్టీసు, పలుకుబడీ కూడా తగ్గాయి. జాన్ ఆడమ్సు, న్యూజంటు గ్రాంటు, పెర్సీ గ్రాంటు, బ్రాన్సన్, వెడ్డర్‌బర్న్ మొదలైనవాళ్ళు కొద్దిమంది గుట్టుగా కాలక్షేపం చేస్తూవచ్చారు. సుప్రసిద్ధుడైన నార్టన్ అప్పటికే క్రిమినలులో బాగా పెద్దపేరు సంపాదించుకున్నాడు. అల్లాంటి వాడికి క్రిమినలులో పనేలేదు. అప్పటికి మైలాపూరులో ఉన్న ఈ ప్రముఖులూ, ఎగ్మూరులో ఉన్న టి. వి. శేషగిరయ్యరు, శంకరన్‌నాయరు ప్రభృతులూ రెండు ముఠాలుగా ఉండి పోటీలు పడుతూ ఉన్నట్లు అనుకునేవారు. వీళ్ళమధ్య చేరి ప్రాక్టీసు పెట్టడం అంటే చాలా సాహసం అని మిత్రులు అనేవారు. కాని నాకు, "మొదటినించీ లా విషయంలో ఒక విధంగా సమగ్రమైన కృషిచేసి ఉన్నాంగదా! దానికి తగిన శ్రమతీసుకుంటే ఎందుకు అభివృద్ధిలోకి రామూ?" అని ఒక విశ్వాసం!

షెపర్డు ఇచ్చిన పరిచయం ఉత్తరం పట్టుకుని, సర్. సుబ్రహ్మణ్యయ్యరు దగ్గిరికి వెళ్ళి దర్శనం చేశాను. ఆయన నన్ను ఎగాదిగా చూసి ఇక్కడ బారిష్టర్లకి ఏమీ ప్రయోజనం ఉన్నట్టు లేదని పెదవి చప్పరించాడు. చివరికి షెపర్డు అనుమానించినట్లే చేశాడు. తరవాత వాలస్‌ని చూశాను. ఆయన నన్ను ఆదరణతో పరిశీలించి "ప్రకాశం గారు! బారిష్టర్లకి ఇక్కడ చోటు ఉన్నట్టు కనిపించదు. ఈ మైలాపూరు వకీళ్ళముందు వాళ్ళు తట్టుకోలేరు. వీళ్ళ పలుకుబడీ, ఆర్భాటమూ చాలా హెచ్చు. ఆ కృష్ణస్వామయ్యరుని చూడండి! కోర్టుకి నాలుగు గుర్రాల బండిలో వస్తాడు! వాళ్ళతో మీరు ఏమి వేగ గలుగుతారు!" అని అన్నాడు. ఆపైన "మీరు ఏమైనా ధనవంతులా?" అని అడిగాడు. నేను 'బీదవాణ్ణే' అని చెప్పిన మీదట, ఆయన "మీరు ఎక్కడయినా ఒక చిన్న పట్టణంలో ప్రాక్టీసు చెయ్యండి. చూడండి! మైలాపూర్ ధాటి కాగలేక పి. సి. లోబోమళ్ళీ మధుర చేరుకున్నాడు!" అని నిరుత్సాహ పరిచాడు. అందుమీద నేను కొంచెం ధైర్యం తెచ్చుకుని "అయ్యా, మీదేశం వెళ్ళి ఈ బారిష్టరీ చదివి వచ్చిన తరవాత కూడా నేను ఎక్కడ ప్రాక్టీసు పెట్టాలో నిర్ణయించుకో లేకపోతే నా చదువు వృథాయే! నేను ఇక్కడే ప్రాక్టీసు పెడతాను. అది నా నిశ్చయం! నాకేమీ ఆర్భాటాలు అక్కరలేదు! అదిగో హైకోర్టు కెదురుగా అక్కడే 25 రూపాయిలు అద్దె ఇచ్చి ఒక చిన్న ఇంట్లో ఉంటాను. నాకు పని ఎందుకు రాదో చూస్తాను!" అని చెప్పివచ్చాను.

అప్పట్లో మైలాపూరులోని దాక్షిణాత్య మేధావుల ప్రతిభని గురించి కొంచెం విస్తరిస్తాను. భాష్యంఅయ్యంగారు అడ్వొకేటు జనరల్. ఆయన అప్పటికే కొంచెం పెద్దవాడు అయ్యాడు. చాలా స్వతంత్రుడు. తనకేసు తగిన శాస్త్రాధారలతో నిదానంగానూ, విపులంగానూ జడ్జీ ఎదట పెట్టగలిగేవాడు. బారులోనూ, బెంచిమీదాకూడా మంచి గౌరవానికి పాత్రుడు అవుతూ వుండేవాడు. లాలో మంచి పండితుడు. ఒకసారి ఒక తుందుడుకు జడ్జీ ఆయన ఆర్గ్యుమెంటు చెప్పబోతూ ఉంటే అడుగడుక్కీ అడ్డు తగిలాడు. వెంటనే ఆయన చేతులో ఉన్న పుస్త

కాన్ని బల్లమీద వేసి, "చెప్పదలచుకున్న విషయం సమగ్రంగా చెప్ప నియ్యకపోతే ఏం చెయ్యాలి?" అన్నాడు. ఆ ప్రతీకారంతో జడ్జీ చల్ల బడ్డాడు.

ఇంక వి. కృష్ణస్వామయ్యరుగారి తరహా దీనికి పూర్తిగా వ్యతిరేకం. కృష్ణస్వామయ్యరుగారు నాకు లా కాలేజీలో ప్రొఫెసరు. ఆయనకి న్యాయశాస్త్రంలో ప్రవేశం అమోఘం! అందుచేత గబాగబా తనకేసు విస్తరించేవాడు. ఎదటివాడిని మాట్లాడనిచ్చేవాడు కాడు. చూడడానికి మంచి దర్జాగా ఉండేవాడు. ఎదటివాడు ఏదైనా ఒక మాటంటే దానికి నాలుమాటలతో జవాబు చెపితేకాని ఆయనకి తృప్తి ఉండేదికాదు. పి. ఆర్. సుందరయ్యరు మంచి మేధావి. ఎదటివాడు నొప్పకుండా తనకేసు సుస్పష్టంగా చెప్పగలిగేవాడు. ఇప్పటి సర్ పి. యస్. శివస్వామయ్యరుగారుకూడా అప్పటికి సీనియర్లలోవాడే. లాలో చాలా పండితుడైనా, కేసు చెప్పడంలో ఈ ప్రజ్ఞావంతులకి అందేవాడుకాడు.

ఇక తెలుగులాయర్ల సంగతి కొంచెం వ్రాస్తాను. వేపా రామేశం (ఇప్పుడు సర్), పురాణం నాగభూషణం, రంగావఝుల నాగభూషణం, యల్లెపద్ది వెంకట్రామశాస్త్రిగార్లు ఏదో మర్యాదగా కాల క్షేపం చేస్తూఉండేవారు. వాళ్ళు ఎవ్వరూకూడా దాక్షిణాత్య న్యాయ వాదుల ధాటీకి నిలబడలేని స్థితిలోనే ఉండేవారు. నేను రాజ మహేంద్రవరంలో ప్లీడరుగా ఉండి, పెద్దకేసులు హైకోర్టుకి పట్టుకువచ్చి, వీరిని సలహా చేస్తే ఏ అయ్యర్‌కో, ఏ అయ్యంగారికో—లేకపోతే క్రిమినల్ కేసయితే ఏ ఆడమ్సుకో—అప్పచెప్పి వారిదగ్గిర సహాయకులుగా పనిచేస్తూ ఉండేవారు. అందుచేతనే ఆంధ్రదేశంలో జమీందారీలు ఎన్ని ఉన్నా, వాటి తాలూకు పెద్దకేసు లన్నీ అరవప్లీడర్ల చేతుల్లోనే ఉండేవి. భాష్యంఅయ్యంగారు, కృష్ణస్వామయ్యరుగారు మొదలయిన పేరుకెక్కిన వకీళ్ళ ఐశ్వర్యం అంతా ఈ జమీందారుల వల్ల సంపాదించినదే. ఆ కాలంలో మదరాసులో ప్లీడరీ స్థితి ఇది.

# 15

## యూరపు సంచారం

నేను మిత్రుల సహాయం పొంది యూరపులో సంచారం చేశాను. రాకపోకల్లో పారిస్ ఇదివరకే చూశాను. ఇంక హాలండు, డెన్మార్కు, స్విట్జర్లండు, స్వీడన్, ఇటలీ, గ్రీసు, జర్మనీదేశాలు ఆఖరున చుట్టబెట్టాను. డెన్మార్కు వ్యవసాయపు దేశం. అక్కడి వ్యవసాయపు పద్ధతులు చాలా ఆకర్షకంగా ఉంటాయి. స్విట్జర్లాండ్‌లో అప్పుడు ముఖ్యమైన పరిశ్రమ లన్నీ గృహపరిశ్రమలుగానే నడప బడుతూ ఉండేవి. నేను ఇటలీలో విసూవియస్ పొంగుతూ ఉన్నప్పుడు చూశాను. ఇంకా నేపుల్సు, పైసాటరు మొదలయిన అపురూపపు ప్రదేశా లన్నీ చూశాను. థెర్మాపోలిస్ కనుమ కూడా చూశాను. ఇవన్నీ చూసిన తరవాత జర్మనీ వెళ్ళాను. ఆనాడు ప్రపంచ చరిత్రలో ప్రముఖస్థానం అలంకరించిన జర్మనీనిగురించి కొంచెం వ్రాస్తాను. మిగిలిన దేశాల్లో రెండురోజులో, మూడురోజులో మాత్రమే ఉన్నాను. కాని జర్మనీలో 15 రోజులున్నాను.

బారిష్టరు చదువుకి పోవడానికి ముందే నాకు లూయీ ఖూన్ తొట్టి వైద్యంలో నమ్మకం కుదిరింది. ఆ వైద్యం అలవాటు చేసుకున్నాను. ఆ ఖూన్‌ని స్వయంగా చూడా లని కూడా నాకు అభిలాష. అందుచేత జర్మనీ వెడుతూనే ఆయన ఉంటూన్న లిప్‌జిగ్ వెళ్ళాను. అప్పుడు నాదగ్గిర ఒక చిన్న చేతిపెట్టి మాత్రం ఉంది. రైలు దిగడంతోటే ఒక మనిషి నా పెట్టి పట్టుకుని చక్కాపోవడం ప్రారంభించాడు. వాడికి నా భాష అర్థంకాదు. అందుచేత చివరికి నా భాష తెలిసే మనిషి దొరికేవరకూ వాడి వెనకాల పడి పోవలసివచ్చింది. నేను లిప్‌జిగ్‌లో ఖూన్ యింట్లోనే మొదట మకాం చేశాను. అప్పటికి ఆయన ఆస్పత్రి ఏదో కారణంచేత కట్టివేశారు. ఇంట్లోనే వైద్యం చేస్తూ ఉన్నా డాయన. ఆయనతోపాటే నాకూ కొన్ని ఉడక వేసిన కాయగూరలు ఫలహారం పెట్టాడు. తరవాత నేను సెయింట్ పీటర్స్బర్గ్ అనే పెద్ద హోటల్లో మకాంచేసి, రెండురోజులు ఆయనదగ్గిర ఉండి, నాకు

అభిమాన విషయమైన తొట్టి వైద్యాన్నిగురించి వివిధమైన చర్చలు సాగించి సంగతులు అన్నీ తెలుసుకున్నాను. ఆయన ముఖవర్చస్సు పరీక్షించి మనిషి మానసిక తత్వాన్ని తెలియచేసే వా డని వాడుక. నేనుకూడా దానికి రెండు సావరనులు యిచ్చాను. ఆయన నా నెత్తిని చెయ్యిపెట్టి ఏమో చెప్పాడు. కాని నాకు భాష రాకపోవడంచేత అది ఏమీ తెలియలేదు. రెండు పౌనులు మాత్రం ఊడాయి.

జర్మనీలో మొదటివారం అయ్యేసరికి నాకు పోలీసుల దగ్గిర నించి నోటీసు వచ్చింది. విదేశీయులు ఆ దేశంలో వారం రోజుల కంటె ఎక్కువ ఉంటే పోలీసు వాళ్ళకి రిపోర్టు చేసుకుని వాళ్ళ అనుమతి పొందాలి. ఆ ప్రకారంగా నేను అనుమతి పొందాను. ఈ రోజున ప్రపంచా న్నంతటినీ సంక్షోభపరుస్తూన్న జర్మనీనిగురించి నాకు కలిగిన మొదటి అభిప్రాయం వ్రాస్తాను. జర్మనీ శుద్ధ మిలిటరీదేశం. మిలిటరీ అధికారులకి అక్కడ జరిగే గౌరవం అపారం. ట్రాఫిక్ పోలీసులు ఎవరైనా పెద్ద మిలిటరీ అధికారులు వస్తూంటే, వారిదగ్గిర వుండే ఢంకాలు మోగిస్తూ వుండేవారు. ఆ ఢంకా బజాయించేసరికి బాటలమీద నడిచే జనం అంతా పక్కకి ఒత్తిగిలి వాళ్ళకి దారి యివ్వవలసిందే. "భూ గర్భంలో మిలిటరీ కోర్టులు ఉన్నాయనీ, ఒకసారి వాటిలోకి వెడితే వెళ్ళినవాడు మళ్ళీ వస్తాడో, రాడో సందేహం!" అనీ భయంకరంగా చెప్పుకుంటూ ఉండేవారు. ఎంత మిలిటరీ అధికారం ఉన్నా, ప్రజలలో సుహృద్భావం చాలా హెచ్చు. వాళ్ళు ఇతర దేశీయులు—అందులోనూ భాష తెలియనివాళ్ళు—అంటే ఎక్కువ ఆదరమూ, మర్యాదా చూపిస్తారు. నేను రెండుసార్లు దారి తప్పితే నన్ను సరియైన చోటికి తీసుకువెళ్ళి దిగవిడిచారు.

అప్పటికి యూరపులో ఉండే అన్ని జాతులవాళ్ళకన్నా జర్మనులు మంచి భోజనప్రియులు. వారి హోటళ్ళు మంచిదర్జాగా ఉండేవి. ఇంగ్లీషు హోటల్లోలాగ కాకుండా లెఖ్ఖపెట్టడానికి వీలులేనన్ని వంటకాలు ఉండేవి. నేను మొదటిసారి ఇంగ్లండులో ఉన్నప్పుడు శుద్ధ శాకాహారిగా ఉండి, ఇంగ్లండులో కూడా శాకాహారజీవనము సాధ్యం

అని పూర్వాచార పరాయణులైన నా బంధువులకీ, స్నేహితులకీ కూడా నచ్చజెప్పగలిగాను. కాని, రెండోసారి ఇంగ్లండు వెళ్ళినప్పుడు ఆ ఆచారం ఐచ్ఛికంగానే సడలించాను. అందుచేతనే అక్కడ ఒక్క చేపలకి సంబంధించిన వంటకాలే నా ఎదట పెట్టారు. అవి 124 రకాలు ఉన్నాయి. నేను జర్మన్ యూనివర్సిటీల్లో ముఖ్యంగా సైన్సు లేబరేటరీలు చూడాలని అనుకున్నాను. కాని నాకు అనుమతి దొరక లేదు. నేను విద్యార్థిననీ, కేవలం చూడాలనే ఆకాంక్ష గలవాణ్ణి మాత్రమే అనీ చెప్పినా వాళ్ళకి నమ్మకం కలగలేదు. చివరకి లండన్ టెలి గ్రాము యిచ్చి నా సంగతి కనుక్కొని ఆ తరవాతే నాకు అనుజ్ఞ యిచ్చారు.

# 16

## బారిష్టరు వృత్తి

నేను మద్రాసులో బారిష్టరు వృత్తి ప్రారంభించిన కొద్దిరోజులలోనే ప్రాక్టీసు బాగా అందుకుంది. 10 సంవత్సరాలు కిందట కోర్టుల్లో ప్రాక్టీసు చేసి ఉండడంవల్లనూ, దేశంలో చాలామంది పరిచితులూ, అభిమానులూ ఉండడంచేతనూ ప్రాక్టీసు దినదినాభివృద్ధి పొందింది. 1907వ సంవత్స రంలో నేను మద్రాసులో ప్రవేశించి 14 సంవత్సరాలు—అంటే 1921వ సంవత్సరంలో ప్రాక్టీసు మానివేసేవరకూ—ఏకటాకీగా ప్రాక్టీసు చేశాను. ప్రపంచక దృష్టితో చూస్తే నా జీవితంలో ఈ 14 సంవత్సరాలూ అన్నివిధాలా భోగభాగ్యాలతో కూడిన కాలము. ఈ కాలంలో సంగ తులు వ్రాయడానికి దీన్ని రెండు భాగాలుగా విభజిస్తాను. మొదటి 7 సంవత్సరాలలోనూ కొత్తచోట ప్రవేశించడమూ, పదిమంది స్నేహి తులూ వద్దు అన్నా, మద్రాసులో హేమా హేమీల మధ్య చేరి పడి పోకుండా క్రమంగా నిర్జించుకు రావడమూ తలచుకుంటే, నాకు బ్రహ్మాం డమైన విషయాల్లాగ కనబడతాయి. తరవాత 7 సంవత్సరాల్లోనూ నాకే

ఆశ్చర్యం కలిగేటట్లు డబ్బు సంపాదించడమూ, లౌకికంగా పేరు ప్రఖ్యాతులు పొందడమూ జరిగింది. ముందు మొదటి 7 సంవత్సరాలిని గురించి వ్రాస్తాను.

నేను మద్రాసు చేరి ప్రాక్టీసు ప్రారంభించేసరికి ఇంగ్లండు ప్రయాణం బాపతు 8 వేలూ, పుస్తకాలు వగైరాలు కొన్నబాపతు పన్నెండువేలూ కలిసి మొత్తం ఇరవై వేల అప్పు ఉంది. నేను ఆ అప్పుతో ప్రాక్టీసు ప్రారంభించాను. కాని, దైవికంగా కొద్దిరోజులకే ఆ అప్పు తీర్చి వెయ్యగలిగాను. నేటి యువకులకి జీవితంలో ఉత్సాహం కలిగించడం కోసం, ఆ సంపాదనకి కావలసిన పేరు సంపాదించుకోవడం కోసం నేను పడ్డశ్రమని గురించి కొంచెం వ్రాస్తాను.

నేను ప్రవేశించేటప్పటికే భారతీయులలో మాధవన్‌నాయర్—(తరవాత జస్టిస్)—డాక్టర్ స్వామినాధన్, కె. పి. యస్. మీనన్‌గార్లు (క్రౌన్ ప్రాసిక్యూటరు) ప్రాక్టీసులో వుండేవారు. పి. సి. లోబో—(రిటైర్డు జిల్లాజడ్జీ)—సర్ జాన్ వాలస్ అడ్వకేట్ జనరలుగా ఉండేటప్పుడు ఆయన దగ్గిర అప్రెంటిస్‌గా ఉండేవాడు. ఆయన మధురకి పబ్లిక్ ప్రాసిక్యూటరుగా వెళ్ళిపోయాడు. బారిష్టర్లకి అప్పట్లో ఎక్కువ ప్రతిష్ఠలేని సంగతీ, వాలస్ నాకు ఇచ్చిన సలహా సంగతీ ఇదివరకే వ్రాశాను గదా! అల్లాంటి స్థితిగతులలో ప్రాక్టీసు ప్రారంభించి నిగ్రహించుకుంటూ వచ్చాను.

నేను మద్రాసు వచ్చిన సంవత్సరంలోనే కాకినాడలో వకీలుగా ఉండిన పేరి నారాయణమూర్తిగారు మద్రాసు చేరారు. ఆయన మంచి ప్రతిభాశాలి. ఆయన చేరిన కొద్దికాలానికే మేము తెలుగు ప్రాంతాల్లో ఉన్న పైలు ముప్పాతిక మూడుపాళ్ళవరకూ ఆకర్షించగలిగాము. కాజులిస్టు తీసుకుంటే తెలుగువాళ్ళలో మా పేర్లు తరుచుగా కనిపిస్తూఉండేవి. నేను బారిష్టరుగా వచ్చిన కొద్దిరోజులకే ఒక సివిల్ అప్పీలులో లాకాలేజీలో ప్రొఫెసరుగా ఉండిన టి.వి. శేషగిరి అయ్యరుగారితో కలపి పనిచేయవలసి వచ్చింది. ఆయన వయస్సులోనూ, ప్రాక్టీసులోనూ నాకు సీనియరు. అయినా బారిష్టర్ని అవడంవల్ల నాకు సీనియారిటీ వచ్చింది.

అలాంటి స్థితిలో ఆయన నాతో పనిచేయడానికి ఇష్టంలేక కేసులోనించి తప్పుకున్నారు. నేనే కేసు ఆర్గ్యుమెంటు చెప్పి మొట్టమొదటగా బారిష్టర్ల మీద ఉంటూండే దురభిప్రాయం పోగొట్టగలిగాను.

ఆ తరవాత నాకు చిరకాలమిత్రుడు అయిన ఆర్. కుప్పుస్వామయ్యరుగారికి ఒక కేసులో నాతో పనిచేయవలసిన అవసరం కలిగింది. ఆయన సర్ వేపా రామేశంగారిలాగే బి. యల్.లో ఫస్టు క్లాసులో, ఫస్టుగా పాసయ్యారు. పాపం ఆయన శేషగిరి అయ్యరుగారిలాగ తప్పుకోలేదు. తప్పుకోమని శేషగిరి అయ్యరుగారు ఇచ్చిన సలహా కూడా గణించలేదు.

ప్రాక్టీసుకి వచ్చిన ప్రారంభంలో ఇంకొకసారి సర్ సుబ్రహ్మణ్యయ్యరుగారి కోర్టులో ఆర్గ్యుమెంటు చెపుతూ ఉన్నాను. ఆ సమయంలో ఆయన కోర్టులో కూర్చుని ఉన్న ఆర్. వెంకట్రామశాస్త్రిగారిని పిలిచి దానికి సంబంధించిన కేసు ఏదో ఉండాలి తియ్యమన్నారు. వకీలు పనిచేసే వాళ్ళకి అది అంత గౌరవకరం అయిన విషయం కాదు. దాని మీద నేను వెంటనే లేచి, "అయ్యా! నేను, నా మిత్రులూ ఇందుకు సంబంధించిన కేసులన్నీ వెతికాము. ఎక్కడా ఈ తీర్పుకి వ్యతిరేకంగా కనిపించలేదు," అని గట్టిగా చెప్పాను. దాంతో ఆయన శాంతించారు. మొత్తంమీద మొదట్లో మద్రాసు బారు నాకంతగా స్వాగతం ఇవ్వలేదు; సరిగదా, నాకు కాలూనడానికే కొంత కష్టం కలిగించిందని చెప్పాలి. పెద్దల్లో భాష్యం అయ్యంగారు, కృష్ణస్వామయ్యరు, సుందరయ్యరు ప్రభృతులూ, పిన్నల్లో అప్పటికే మంచి చురుకుగా వస్తూన్న శ్రీనివాసయ్యంగారు, అల్లాడి, యస్. వరదాచారి, టి. ఆర్. వెంకట్రామశాస్త్రి, వి. వి. శ్రీనివాసయ్యంగార్లూ మంచి గడ్డుగా ఉండేవారు. కాని, మొదటినించీ నాకు ఉన్న ఆత్మవిశ్వాసమే సహాయం అయింది.

ఏ వృత్తిలోనైనా ఆత్మవిశ్వాసం అవసరం. అందులో లాయరు వృత్తికి అది మరీ అవసరం. జడ్జీలని ఆశ్రయించి, వారి దయవల్ల వృద్ధిలోకి రావడం అనేది ఎక్కడోగాని ఉండదు. అక్కడక్కడ ఉన్నా అది సిద్ధాంతం కాదు. ఆత్మవిశ్వాసమూ, దానికి తోడు పరిశ్రమా ఉండాలి.

నేను కేసులు వచ్చినప్పుడు చాలా శ్రద్ధగా చదివేవాణ్ణి. దాంతోబాటు లా కూడా క్షుణ్ణంగా చదివేవాణ్ణి. లండన్‌లో ఉన్నప్పుడు అక్కడ ఉన్న పెద్దపెద్ద బారిష్టర్లు, జడ్జీలు రాత్రి ఒకటి, రెండు గంటలదాకా చదువుతూ కృషిచెయ్యడం చూశాను. అల్లాగే నేనుకూడా చాలా కృషి చేసేవాణ్ణి. ఆత్మ విశ్వాసమూ, నిర్భయత్వమూ, పరిశ్రమా విడవకుండా ఈ మూడింటి సమన్వయంవల్లా నేను మద్రాసుబారులో నా స్థానాన్ని ఆక్రమించుకో గలిగానని చెప్పాలి. ఇంతే కాకుండా నా క్లయింట్లకి నే నంటే పరిపూర్ణమైన విశ్వాసం కూడా ఉండేది. వాళ్ళ కేసులు నా దగ్గిర ఉంటే, వాటితో ఐక్యం అయి పట్టుదలతో పనిచేస్తా ననే ప్రఖ్యాతికూడా గడించుకున్నాను. ఆ విశ్వాసమే నాకు ఆ వృత్తిలో జయం చేకూర్చింది. ఈ సందర్భంలో జడ్జీలతో ప్రవర్తించేటప్పుడు లాయర్లకి ఉండే ధైర్యం కూడా గొప్పగా సహాయం చేస్తుంది. జడ్జీలని ఎదురుకునే సాహసం చూపించే వాళ్ళకి మంచి పేరు వస్తుంది. దానివల్ల అల్లాంటి సందర్భాలలో అవసరమైన వాళ్ళు తమ కేసులు పట్టుకుని వెతుక్కుంటూ వస్తారు. రాజమహేంద్రవరంలో మునసబు రంగమన్నారుతో వ్యవహరించినప్పుడు కూడా నా అనుభవం ఇదే. నాకు జడ్జీలతో వచ్చిన పట్టింపుల్ని గురించి ముందు వేరుగా వ్రాస్తాను.

మొత్తంమీద నేను కొద్దికాలంలోనే మద్రాసు హైకోర్టులో అప్పెలెటుసైడునా, సివిల్‌లోనూ, క్రిమినల్‌లోనూ మంచి ప్రాక్టీసు గడించేసరికి నన్ను ఏ జిల్లాలకి అయినా వెళ్ళి ప్రాక్టీసు పెట్టమని సలహా ఇచ్చిన సర్ జాన్ వాలెస్సూ, ఛీఫ్ జస్టిస్ అర్నాల్డు వైటూ మొదలైన వారు కొంచెం ఆశ్చర్యపడ్డారు. మద్రాసులో కొంతకాలం ప్రాక్టీసుచేసి పిమ్మట హైకోర్టు జడ్జీ అయిన నేపియర్ ఒకసారి నాతో, "హిందూ లాని గురించి పుస్తకం వ్రాసిన జాన్ డి. మెయిన్ తరవాత మద్రాసు బారిష్టరులలో ఇంత సివిల్ ప్రాక్టీసు సంపాదించిన వాళ్ళు ఎవ్వళ్ళూ లేరు!" అన్నాడు. మొత్తానికి విశేషం శ్రమలేకుండానే నాకు పుష్కలంగా కేసులు లభించేవి. నేను ఎప్పుడూ కేసులకోసం బాధపడలేదు.

అప్పుడే నాకు రాజమహేంద్రవరంలో స్నేహితుడైన కోకా

వెంకటేశ్వరరావుగారు, తన అల్లుడైన పి. వెంకటరమణారావుగారిని—(ఇప్పుడు జస్టిస్)—నాతో పనిచెయ్యడానికి అప్పగించారు. అప్పటికి వెంకటరమణారావుగారు బి.యల్. పాసయినారు. ఆయన మంచి చురుకైన బుద్ధిశాలి. ఆయనకి ఉన్న జ్ఞాపక శక్తి చాలాగొప్పది. కేసుల్లో చాలా గట్టివాడు. సివిల్ కేసుల్లో లా పాయింట్లు తీసి, వాటిని క్షుణ్ణంగా జడ్జీ ఎదటపెట్టి, కేసులు గెలవడానికి నాకు ఆయనవల్ల లభించిన సాహాయ్యం చాలా గొప్పది.

క్రిమినలు సైడున నేను మొట్ట మొదట పనిచేసిన పెద్దకేసు ఆష్ హత్యకేసు. అది రాజకీయమైన కేసు. 1907-8 సంవత్సరాల్లో తిరునల్వేలిలో కలెక్టరుగా ఉండిన ఆష్‌ని ఎవరో రైలుస్టేషనులో రివాల్వరుతో కాల్చి చంపివేశారు. అప్పటికి బిపినచంద్రపాలు మన రాష్ట్రానికి రావడమూ, ఆయన ఉపన్యాసాలు దేశంలో గాఢమైన దేశాభిమానాన్ని రగులుకొల్పడమూ జరిగాయి. అవి వందేమాతరం రోజులు. వంగ విభజనవల్ల భారత జాతీయత రగుల్కొల్పబడింది. ఇది ఆ గందరగోళంలో వచ్చిపడిన కేసు! ఆ కేసులో మొదటి ముద్దాయి తరఫున బారిష్టరు దేవదాసు, రెండవ ముద్దాయి శంకరకృష్ణన్ తరఫున నేనూ వకాల్తా పుచ్చుగున్నాము. అసలు తిరునల్వేలిలో జరిగిన ఈ హత్య విచారణ సహజంగా తిరునల్వేలిలోనే జరగవలసిఉంది. కాని రాజకీయ కారణాల చేత, ఆ కేసు మద్రాసు హైకోర్టువారే - అందులోనూ ఫుల్ బెంచివారు- విచారించారు. అల్లాంటప్పుడు ఆ కేసు నడిపించడం ఎంత కష్టమో వేరే చెప్పనక్కరలేదు. ఫుల్ బెంచికి అధ్యక్షుడు చీఫ్ జస్టిస్ సర్ ఆర్నాల్డు వైటు. ఆ విచారణలో నేను జడ్జీలని చాలా శ్రమ పెట్టాను! అడుగడుక్కీ డిఫెన్సు తరఫున హక్కులు స్థాపించుకుంటూ, వాళ్ళప్రాణాలు విసిగించే వాణ్ణి. పోలీసులు F. I. R. లో ఆ దొరని కొట్టినవాడికి క్రాపింగు ఉందని వ్రాసి తరవాత సవరించుకున్నారు. నా క్లయింటుకి పెద్ద జుట్టు ఉండేది. ఆ పాయింటు పట్టుకుని సాగదీసే సరికి చాలా లాభించింది! పర్యవసానంలో నా క్లయింటుకి రెండు సంవత్సరాల

శిక్ష వేశారనుకుంటాను. ఆ కేసు నడిపించడంలో నాకు కొంత ప్రఖ్యాతి వచ్చింది. అదే క్రిమినల్ ప్రాక్టీసులో మొదటి కేసు.

నేను మొత్తం ప్రాక్టీసు చేసిన 14 సంవత్సరాల్లోనూ మొదటి 7 సంవత్సరాల్లో ప్రాక్టీసు బాగా నిలదొక్కుకున్నాను. కాని, అప్పుడు నెలకి రెండుమూడువేల దాకా సంపాదన ఉన్నా, ఖర్చుకూడా అల్లాగే ఉండేది. ఏమయినా బారిష్టరుచదువుకీ, దాని ఉపాంగాలైన లైబ్రరీ వగైరాలకీ అయిన ఋణం తీర్చివేశాను. నా మిత్రుడు లక్ష్మణదాసు ఇంగ్లండు ప్రయాణంకోసం ఇచ్చిన డబ్బు వెంటనే తీర్చివెయ్యవలసిన అవసరం వచ్చింది. అందుచేత, నేను ప్లీడరుగా ఉన్నప్పుడు చాటపర్రులో కొన్న భూమి అమ్మి ఋణం అంతా తీర్చివేశాను. లైబ్రరీకోసం కంచుమర్తి రామచంద్రరావుగారి దగ్గిర చేసిన ఋణం అంతా ప్రాక్టీసులో సంపాదన వల్ల తీర్చివేశాను. ఈ కాలంలో కుటుంబం పరిస్థితిని గురించి ముందు ముందు వ్రాస్తాను. మొదటి 7 సంవత్సరాలూ ఇల్లా గడిచిన తరవాత, మిగిలిన 7 సంవత్సరాల్లోనూ పుష్కలంగా సంపాదించి తోటలు, దొడ్లు, బంగాళాలు కొన్నాను.

# 17

## మాటపట్టింపులు

ఈ సందర్భంలోనే నేను ప్రాక్టీసుకి వచ్చినప్పుడు బారు సంగతుల్ని గురించీ, జడ్జీల కయ్యాళీలనిగురించీ, నాకూ వాళ్ళకీ వచ్చిన పట్టింపుల్నిగురించీ కొంచెం వ్రాస్తాను. చాలామంది జడ్జీలతో నాకు మాట పట్టింపు రావడమూ, నా మీద మాట ఉంచుకోకుండా వెంటనే వాళ్ళకి మాట అప్పజెప్పి, నా ఆత్మగౌరవమూ, స్వాతంత్ర్యమూ కాపాడుకోవడమూ జరిగాయి.

నేను మొదట్లో ప్రవేశించినప్పుడు—అంటే 1907 వ సంవత్సరంలో—మద్రాసు బారులో ఒక ఆచారం ఉండేది. ఒక పెద్ద ప్లీడరు హైకోర్టు జడ్జీ అవడంతోనే అతని జూనియర్‌గా ఉంటూ ఉండిన

లాయరు బారుకి నాయకుడై పలుకుబడి సంపాదిస్తూ ఉండేవాడు. ఆ ఆచారం కూడా నాకు మొదట్లో ఒక అడ్డే. నాకు అల్లాంటి ప్రాపకం లేదు. మొదటినించీ నాకు ఉన్న ధైర్యంతోనే అప్పటి హేమా హేమీలకి ఎదురుగా నిలబడేవాణ్ణి. అందులోనూ జడ్జీలుగా ఉండిన హేమా హేమీలు కేసులలో ముందే ఒక అభిప్రాయానికి వచ్చి లాయరుకి అడ్డు తగులుతూ శ్రమ కలగచేస్తూ ఉండేవారు. దాంతో లాయర్లకీ, జడ్జీలకీ కొంచెం తగాదాలు వస్తూ ఉండేవి. అందులోనూ, ఒక్కొక్క జడ్జీకి ఒక్కొక తిక్క ఉండేది. అందుచేత కాస్త స్వాతంత్ర్యం చూపించే లాయరుకి జడ్జీతో తగాదా తప్పేదికాదు. నేను వచ్చేసరికి జడ్జీలలో స్వతంత్రంగా ఉండే వాళ్ళలో నార్టు బాగా ప్రసిద్ధికి ఎక్కాడు.

నేను ప్రాక్టీసు ప్రారంభించిన కొద్ది రోజుల్లోనే సర్ శంకరన్ నాయరు జడ్జీగా ఉండగా ఒక లిమిటేషన్ కేసు అప్పీలులో ఆర్గ్యుమెంటు చెపుతూఉన్నాను. ఆయన నేను చెప్పేది వినకుండానే ఇల్లాంటి కేసుల్లో ఇదివరకే చాలాపర్యాయాలు హైకోర్టు ఒక తీర్పు ఇచ్చిందని చెప్పి నాకు అడ్డుతగిలాడు. వెంటనే నేను అందుకుని, "ఇల్లాంటి కేసు ఎప్పుడూ ఈ హైకోర్టులో తీర్పుకాలేదు. సరిగదా, మీరు అసలే తీర్పు చెప్పలేదు. మీరు అనుకునే కేసుకీ దీనికీ అసలు సంబంధమే లేదు," అని చెప్పాను. అంతటితో ఆయన చల్లబడ్డాడు.

ఇంకొక సారి వాలస్‌తో వచ్చింది తగాదా. ఆయన లాపాయింటు గ్రహించడంలో సునిశితబుద్ధికలవాడే కాని, యథార్థం (Fact) గ్రహించడంలో నిదానం ఉండేది కాదు. ఎంత బుద్ధిశాలి అయినా యథార్థం గ్రహిస్తేనే కాని న్యాయం జరగదు. లా యథార్థాన్ని అనుసరించే ఉంటుంది. కనక అది గ్రహించి న్యాయం చెప్పాలి. పైగా, ఈ వాలస్ నిద్రపోయేవాడు. ఒకసారి ఆయన బెంచీమీద నిద్రపోయాడు. నేను కాగితాలు కిందపడవేసి కూర్చున్నాను. కొంచెం సేపటికి ఆయన మేలుకుని "Mr. Prakasam! Where are we?"అన్నాడు. నేను, "My lord! I don't know where we are!" అన్నాను. దానికి ఆయన చాలాబాధపడ్డాడు. అక్కణ్ణించి నేను హాజరయిన కేసుల్లో

మాత్రం ఎప్పుడూ నిద్రపోలేదు. ఆయనే ఒకసారి, అంతకుముందు అడ్వకేటు జనరల్‌గా ఉండిన ఒక భారతీయ ప్రముఖుడు ఆర్గ్యుమెంటు చెబుతూ ఉంటే తల వేలవేసి నిద్రపోయాడు. ఆయన కునుకుతున్నా ఈయన ఆర్గ్యుమెంటు మానలేదు. ఒకనిద్ర తీసి లేచి, "ఏమండీ! మీరు ఏవిషయం ఆర్గ్యూచేస్తున్నారు?" అన్నాడు. ఈయన, "అయ్యా! నేను కమర్షియల్ లా విషయం ఆర్గ్యూ చేస్తున్నాను," అన్నాడు. అపైన ఆయన "ఆఁ అసందర్భంగా మాట్లాడతారేమిటి? కమర్షియల్‌లా మీకేం తెలుసును?" అన్నాడు. అంటే ఆయ నేమీ మాట్లాడలేదు. ఆ ముక్కలు విన్న సి. కృష్ణస్వామయ్యరుగారు పెదవిచప్పరించి, "అవును! ఇది మనకి ఇల్లాగ అవవలసిందే!" అన్నాడు. అంటే వారులో ఐకమత్యం లేదనీ, ఉంటే జడ్జీలు అల్లా ప్రవర్తించలేరనీ ఆయన అభిప్రాయము.

మరి, ఒక సందర్భంలో సర్ అబ్దుల్ రహీముగారితో నాకు మాటపట్టింపు వచ్చింది. ఆయన కోర్టు శుద్ధ బహదూరీ పద్ధతిగా ఉండేది. మొదటి రోజుల్లో ఆయన చాలా నిదానంగా వింటూ, న్యాయం సరిగ్గా పాలించేవాడు. కొన్ని స్వతంత్రమైన పోకడలు కూడా కనపర్చాడు. కాని, రానురాను లాయర్ల మీద బెంచీమీదనించే చిరాకుపడేవాడు. పైగా, అప్పటికి వి. కృష్ణస్వామిఅయ్యరుగారు హైకోర్టుజడ్జీపని విడిచిపెట్టి ఎక్జిక్యూటివ్‌కౌన్సిలర్ అయ్యారు. ఆయనకికూడా తన రాష్ట్రమైన బెంగాలుకి ఎక్జిక్యూటివ్‌కౌన్సిలరు కావాలని ఆశ ఉండేది. ఆయన ఎంత సేపూ అదే దృష్టిలో ఉండేవాడు. ఒకసారి నేను ఒక సివిల్ అప్పీలు ఆయన దగ్గిర వాదిస్తున్నాను. నేను రిపోర్టు పాయింటు వివరించకుండానే, "ఆఁ ఇందులో ఏముంది?" అన్నాడు. నాకు ప్రాణం విసిగి, "అయ్యా! ఈ కేసులో నేను నా పార్టీల దగ్గిరనించి చాలా డబ్బు తీసుకున్నాను. వాళ్ళకేసు అంతా శ్రద్ధగా చదివి తమకు నివేదించదలచుకున్నాను. అల్లాం టప్పుడు నేను చెప్పకుండానే మీరు 'ఇందులో ఏముందని' అంటే ఇంక నేను చెప్పేదేమిటి? ఇది న్యాయమూర్తులకి న్యాయమైన పని కాదు," అన్నాను. అంతటితో ఆయన తట్టుకుని నిదానపడ్డాడు. తర వాత నాకూ, ఆయనకీ ఎప్పుడూ తగాదా రాలేదు.

నేపియర్ అనే ఇంకొక బారిష్టరు జడ్జీగా ఉండేవాడు. ఆయనైతే చురుకైనవాడే కాని శాంతం తక్కువ. ఒక కేసులో ఆయన నన్ను 4 గంటలకి పిలిచారు. అది ఒక క్రిమినలు కేసు. నేపియరుగారు ఆ కేసు అంతా పదినిమిషాలలో ముగించాలన్నారు. నేను అది అల్లాగ ముగించడం సాధ్యం కాదనీ, ఆయన ఇచ్చిన టైములో కేసులోని ముఖ్యవిషయం చెప్పడానికైనా వీలుండదనీ చెప్పాను. ఆయనకి ఆగ్రహంవచ్చి, "చాలు! సోది కట్టిపెట్టండి!" అన్నాడు. వెంటనే నేను కాగితాలకట్ట బల్లమీద కొట్టి, ఆయన అన్నమాట ఉపసంహరించుకుంటే కాని ఈ కోర్టులో ఆర్గ్యుమెంటు చెప్పడానికి నిరాకరిస్తున్నా నన్నాను. ఆయన ముఖం ఎర్రనై అక్కడనించి లేచిపోయాడు. అప్పటికి బారిష్టర్ల అసోసియేషన్ అని ఒక సంఘం ఉండేది. ఆ సంఘంలో ఆస్బర్న్, గ్రాంటు, నార్టన్, స్వామినాథన్ ప్రభృతులు నాకంటె సీనియర్లు ఎందరో ఉన్నా నన్ను అధ్యక్షుడుగా ఎన్నుకొన్నారు. ఆ సంఘం నేపియర్ అగౌరవ చర్యని గురించి తీవ్రమైన అసమ్మతి తెలుపుతూ ఒక తీర్మానం పాసుచేసి పంపించింది. చివరికి ఆయన క్షమాపణ చెప్పాక కేసు నడిచింది.

వి. కృష్ణస్వామయ్యరుగారు జడ్జీగా ఉండినప్పుడు ఒకసారి నాకూ, ఆయనకీ కొంచెం పట్టింపు వచ్చింది. ఆయనా, జస్టిస్ వాలస్నూ బెంచిమీద ఉండగా నే నొక Batch దావాలో వాదించవలసివచ్చింది. మొదటనే కృష్ణస్వామయ్యరుగారు నా కేసు తోసిపేశారు. అన్ని కేసుల్లోనూ దావా కారణం ఒకటైనా నేను ఎప్పటి కప్పుడే ఒక్కొక్క పాయింటుగా వాదిస్తూ వచ్చాను. కృష్ణస్వామయ్యరుగారు, "ఏమి ఇల్లా వాదిస్తున్నా?" రని అడిగారు. నేను, "తాము నేను, చెప్పే విషయం సరిగ్గా అవగాహన చేసుకోకముందే ఒక తీర్పుకి వచ్చారు. అవకాశం ఉంది కనక ఒకసారి కాకపోతే ఒకసారి అయినా నా మాటలకి విలువ ఇస్తారేమో అనే ఆశకొద్దీ తంటాలు పడుతున్నాను," అన్నాను. ఆయన, "అది ప్రకాశంగారి పట్టుదలకి నిదర్శనం," అన్నారు. కేసు నాకు వ్యతిరేకంగా అయింది.

కాని, మరి పది,పదిహేను రోజులకి వి. కృష్ణస్వామయ్యరుగారు తమంతట తమరే ఈ కేసు పిలిపించారు. పిలిపించి, తాము ఇదివరలో పొరపాటు అభిప్రాయానికి వచ్చామనీ, అందుకోసం తిరిగి వినవలెననీ, అదిసవరించుకుంటున్నామనీ చెప్పి, నా కేసు అంతా విని నా కనుకూల మైన తీర్పు చెప్పారు. అది హైకోర్టు జడ్జీలలో సామాన్యం అయిన విషయం కాదు. పొరబాటు పడడం మానవ మాత్రులకి సహజమేకాని, అది పొరబాటని తెలిసిన తరవాత ఈరీతిగా సవరించుకోవడం అనేది అసాధారణ విషయం. అప్పుడే నేను లాటైమ్సులో ఆయన ఘనత ప్రశంసిస్తూ వ్రాశాను. కృష్ణస్వామయ్యరుగారు కోర్టులో దడదడ లాడించినా మనసులో కక్షవహించే తరహా మనిషికాదు. తరవాత, ఆయన ఎక్జిక్యూటివ్ కౌన్సిలర్ అయినప్పుడు నేను ఆయన్ని చూడడానికి వెళ్ళాను. ఆయన నన్నెంతో ఆదరించి, "Prakasam! Good friends do not carry any prejudices in their minds" అన్నాడు.

ఒకప్పుడు సర్ కె. శ్రీనివాసయ్యంగారు బెంచీమీద ఉండగా నా కొక పేచీ వచ్చింది. ఆయన గొప్ప మేధావి. సునిశితమైన బుద్ధి విశేషం కలవాడు. దానికితోడు కేసు తానే స్వయింగా అవగాహన చేసుకునివచ్చి ఒక అభిప్రాయంతో కూర్చునేవాడు. అల్లాంటప్పుడే సామాన్య లాయర్ల పని చాలా ఇరుకుని పడిపోతుంది. అయినా, కూట్సు ట్రాటరూ ఇద్దరూ ఉండగా నే నొక కేసు ఆర్గ్యుమెంటు చెబుతున్నాను. ఆయన మధ్య మధ్యని నాకు అడ్డుతగిలి అప్పుడే జడ్జిమెంటుకి వచ్చేసినట్లు సూచించాడు. అప్పుడు నేను, "అయ్యా ఈ కేసులో నేను మీ కోసం ఆర్గ్యుమెంటు చెప్పడంలేదు. మీరు అప్పుడే ఒక నిశ్చయానికి వచ్చినట్లు తోస్తుంది. నేను ఇది అంతా రెండో జడ్జీగారి కోసం చెబుతున్నాను," అన్నాను. దాంతో ఆయన మరి మాట్లాడలేదు.

పి. ఆర్. సుందరయ్యరుగారు జడ్జీగా ఉండేటప్పుడు ఆయనతో కూడా నాకు ఒక తగాదా వచ్చింది. సుందరయ్యరుగారు చాలా వివేకవంతుడు. చురుకైనవాడే కాని, తాను విచారించబోయే కేసు స్వయంగా

చదువుకుని, ఒక అభిప్రాయానికి వచ్చి, మాటిమాటికీ అడ్డుతగుల్తూ ఉండేవాడు. లాయరు తన ఎదట పెట్టిన విషయాలన్నీ తన బుద్ధి విశేషంచేత వంకరటింకరగా తిప్పుతూ ఉండేవాడు. ఒక కేసులో నా కిల్లాంటి తగాదా వచ్చింది. అప్పుడు నేను లా టైమ్సుకి సంపాదకుడుగా ఉండేవాణ్ణి. అప్పుడు ఆ పత్రికలో, "This judge is full of intellectual dishonesty," అని వ్రాశాను. దాని మీద జడ్జీలలో పెద్ద కలవరంపుట్టి, వీలైతే నా మీద జడ్జీల యెడల అగౌరవం చూపినందుకు కంటెంప్టుకేసు పెట్టాలని కూడా ఆలోచించారు. కాని, సందర్భాలను బట్టి Fair comment limit దాటకపోవడంవల్ల అది అంతటితో విరమించుకున్నారు. ఆ లా టైమ్సుని గురించి ముందు ప్రత్యేకంగా వ్రాస్తాను.

ఇంతవరకూ నేను బారిష్టర్ల విషయమూ, జడ్జీల సంగతీ వ్రాశాను. ఇక సివిలియన్ జడ్జీల సంగతి వ్రాస్తాను. ఈ జడ్జీలలో రెండు తరహాలవాళ్ళుండేవారు. ఈ జడ్జీలకి సమర్థత సామాన్యంగా ఉండేది. ఇందులో కొందరు జడ్జీలుగా కొంత అనుభవం సంపాదించి నిదానంగా ఉండేవారు. కొందరు, కాస్త చిరాకు తనం కలిగి, చెప్పినది సరిగా వినకుండా కిందకోర్టు తీర్పు ఖాయపరచే ధోరణిలో ఉండేవాళ్ళు; బెన్సన్ వగైరాలు ఈ తరహాకి చెందినవాళ్ళు. ఇందులోనూ కొందరు బెంచీ మీదనే చిరచిరలాడేవారు. కొందరు కేసవుతూంటే మాట్లాడకుండా కూర్చుని చివరికి కింది కోర్టులతో ఏకీభవిస్తూ ఉండేవారు.

మన్రో అని ఒక సివిల్ జడ్జీ ఉండేవాడు. నేనొక కేసు ఆర్గ్యుమెంటు చెబుతూంటే, ఆయన తలవంచుకుని జడ్జిమెంటు వ్రాసేస్తున్నాడు. నేను, "ఆర్గ్యుమెంటు చెప్పకుండానే మీరు తీర్పు వ్రాసేస్తున్నారు! నేను ఎంత గొంతు చించుకుంటే మాత్రం లాభ మేమిటి?" అన్నాను. ఆయన, "నేను తీర్పు వ్రాస్తున్నానని మీ కెల్లా తెలిసింది?" అన్నాడు. "మీరు వేసిన ప్రశ్నలు, మీరు కూచునే వాలకం, మీ వ్రాత ధోరణీ చూసి, అల్లాగ అనుకున్నాను," అన్నాను. నిజానికి ఆయన వ్రాసేది జడ్జిమెంటే!

బోడాం అనే జడ్జీ ఒకాయన ఉండేవాడు. అయన ఒరిజనల్ సైడు

బెంచీమీద ఉండేవాడు. విశేషమైన ప్రతిభ కలవాడు. ఆడవాళ్ళు—అందులోనూ కాస్త చక్కగా సింగారించుకున్నవాళ్ళు—బోనులోకి వస్తే ఆయన మనస్సు నిలకడగా ఉండేదికాదని ప్రతీతి. ఆకాలంలో కొందరు వకీళ్ళు ఆయనకోర్టులో కేసులు గెలవడానికి ఈ సూక్ష్మన్నే కనిపెట్టారు. అందుచేత టంకసాలవీథిలోఉన్న భోగంవాళ్ళు చాలామంది ఈ కోర్టులో సాక్షులైనారు! సి. పి. రామస్వామయ్యరుగారు ఆకాలంలో చురుకుగా ముందుకి వస్తూన్న వకీలు. ఆయనకి ఒరిజనల్‌సైడులో పని బాగా ఉండేది. బోడాంకి ఆయన అంటే చాలా ఇష్టం. ఆనాటి సి. పి. రామస్వామయ్యరుగారు తరవాత ఆ బోడాంకి ఒక శిలావిగ్రహం కూడా చేయించారు. నేటికి కూడా బోడాం అల్లాంటి గౌరవానికి ఎంత మాత్రం అర్హుడు కాడని నా విశ్వాసం. ఆరోజుల్లో అంతా కూడా అల్లాగే అనుకునేవాళ్ళు.

ఈరీతిగా పధ్నాలుగుసంవత్సరాలు జడ్జీలతో కిందామీదా పడుతూ నా ఆత్మగౌరవానికీ, వ్యక్తిస్వాతంత్ర్యానికీ భంగం రాకుండా బారిష్టరీ నడిపించాను. నేను పని ప్రారంభించిన కొద్దికాలానికి, ప్రముఖులైన లాయర్లతో ఆలోచించి, జడ్జీలని సరియైన పద్ధతిలో ఉంచడానికి పత్రిక ఒకటి అవసరమని తలచి, కె. రామచంద్రన్ దగ్గిర లాటైమ్సు అనే లాజర్నలు ఒకటి కొన్నాను. దానికి నేను ప్రధానసంపాదకుణ్ణి. బారిష్టరు దేవదాసు, మాధవన్నాయరు మొదలయినవాళ్ళు సహాయసంపాదకులు. ఆ పత్రికలో జడ్జీలనిగురించి నిర్భయంగా వ్రాస్తూ ఉండేవాళ్ళము.

పి. ఆర్. సుందరయ్యరుగారినిగురించి వ్రాసినసందర్భంలో నామీద కంటెంప్టుప్రొసీడింగ్సువిషయం ఆలోచించినప్పుడు, మాధవన్నాయరుగారు చాలా గడబిడపడ్డారు. ఆయన తన మామగారైన సర్ శంకరన్నాయరుగారి పలుకుబడితో గవర్నమెంటుప్లీడరై, హైకోర్టుజడ్జీ కావాలనే ఆశలో ఉండేవారు. కనక అసలేభయపడి మిక్కిలి ఆదుర్దాతో స్వార్థానికి అడ్డురాకుండా తమపేరు సంపాదకవర్గంలోనించి తప్పించమన్నారు. వి. ఆర్. కృష్ణస్వామయ్యరుగారు హైకోర్టుజడ్జీ పనిలోనించి ఎక్జిక్యూటివ్‌కౌన్సిలరయినప్పుడు కూడా పత్రికలో చాలా తీవ్రంగా

విమర్శించాను. న్యాయమూర్తులు కార్యనిర్వాహకవర్గంలోకి ప్రమోషన్ అయ్యే సిద్ధాంతం పరిపాలనకి లాయకు అయిన సంగతి కాదని నావాదన. సర్ అబ్దుల్ రహీముగారినిగురించి వ్రాసినప్పుడు కూడా నా వాదన అదే! ఆ వ్యాసం వ్రాశాక సర్ అబ్దుల్‌గారు తమ ఇంటికి నన్ను భోజనానికి పిలిచి, తమకి ఉన్న ఆదుర్దా అంతా నాతో చెప్పారు. నడచినన్నాళ్లు లా టైమ్సు మద్రాసులో జడ్జీలకీ, ప్లీడర్లకీ కొరడాలాగ ఉండేది.

నా ప్రాక్టీసు హైకోర్టులోనే కాకుండా మన రాజధాని అంతా వ్యాపించి ఉండేది. విశాఖపట్టణం మొదలు తిరుచునాపల్లివరకూ అన్ని జిల్లాకోర్టుల్లోనూ హాజరు అయ్యాను. ఒకసారి తిరుచునాపల్లిలో ఒక సివిల్ కేసులో మూడుమాసా లున్నాను. వేలకొద్దీ ఫీజు పుచ్చుకున్నాను. నేను డబ్బు సంపాదించిన రోజుల్లో ఫీజు చాలా హెచ్చుగానే పుచ్చుకునే వాణ్ణి. పాపం! పార్టీలు చాలామంది చాలా డబ్బు నా పేరుమీదుగా పోగొట్టుకున్నారు! చాలామంది పూర్తిగా నష్టపడి ఉంటారని కూడా అనుకుంటాను. కొన్ని కేసుల్లో రోజుకి అయిదువందలు, వెయ్యీ కూడా పుచ్చుకున్నాను. తిరుచునాపల్లిలో సంపాదించిన డబ్బుతోటి ఊటీలో కొన్న బంగాళాకి 'గోదావరి' అని పేరు పెట్టాను.

1919 లో రాజమహేంద్రవరంలో సత్యవోలు గున్నేశ్వరరావు ప్రభృతులపైన వచ్చిన ఫోర్జరీ కర్రెన్సీనోట్ల కేసులో మొదటినించీ—అంటే కమిటల్ కోర్టు దగ్గరనించీ—నేనే ఉండి నడిపించాను. ఆ కేసులో నాకు సాంబమూర్తిగారు సహకారిగా పనిచేశారు. నిడదవోలు పార్టిషన్ కేసు, కృష్ణాజిల్లా జమీందారీకేసులు మొదలయిన డబ్బు పుష్కలంగా లభ్యంఅయ్యే కేసులు అన్నీ వచ్చాయి. పానగల్లురాజాగారు చిత్తూరు కోర్టులో కాళహస్తిజమీందారుగారిమీద తెచ్చిన సివిల్ లిటిగేషన్‌లో నేను చాలాకాలం పనిచేశాను. అందులో నాకు పి. వి. రమణారావుగారు సహకారిగా పనిచేశారు. ఇల్లాగ మంచి ప్రాక్టీసు బాగా రావడంవల్లనే పదిసంవత్సరాల్లో రెండుమూడులక్షల రూపాయలూ, మద్రాసులో ఒక ఇల్లూ, ఊటీలో ఒక బంగళా, ఒంగోలులోనూ, రాజమహేంద్రవరంలోనూ ఒక్కొక్క ఇల్లూ, ఇంకా రెండులక్షల రూపాయల విలువగల

స్థిరాస్తీ కూడా సంపాదించగలిగాను. నాకు విశ్రాంతి తీసుకున్నతరవాత మూడేసి మాసాలు ఒక్కొక్కచోట ఉండా లని ఒక ఆశ ఉండేది.

ఈ కాలంలోనే రెండు కేసులలో ప్రీవీకౌన్సిలు ఎదట వాదించ డానికి రెండుసార్లు ఇంగ్లండు వెళ్ళి, అక్కడ ఒక్కొక్క సారిమూడు మాసాలకి తక్కువకాకుండా ఉన్నాను. యుద్ధానికి పూర్వం వెస్టుమినిష్టరు పాలెస్ హోటలులో ఉండగా దక్షిణాఫ్రికా పోరాటం సాగిస్తూ ఉన్న బారిష్టరు మోహన్‌దాస్ కరంచందు గాంధీగారిని మొదట చూశాను. లండన్ ఇండియన్ సొసైటీ తరఫున వెడ్డర్‌బర్న్ ప్రభృతులు ఈయన్ని ఆహ్వానించి, ఆ భవనంలోనే కింది అంతస్తులో ఒక పెద్ద విందు ఏర్పాటు చేశారు. చిరకాలంనించి ఆ సొసైటీతో నాకు సంబంధం ఉండడంచేత దానికి నేనూ హాజరు అయ్యాను. అపుడు గాంధీగారు పూర్తిగా పాశ్చాత్య దుస్తులు ధరించారు.

# 18

## కుటుంబ స్థితిగతులు

నేను 1907 లో ఇంగ్లండునించి తిరిగి వచ్చి మద్రాసు చేరే సరికి, అప్పటి నా కుటుంబం స్థితి గతులూ, అనంతర పరిస్థితులూ కొంచెం వ్రాస్తాను. నాకు అప్పటికి సంతానం లేదు. నా కోసం ఎంతో శ్రమించిన మా అమ్మగారికి అది ఒక పెద్ద ఆదుర్దాకి కారణం అయింది. అప్పట్లో స్త్రీ చాపల్యంవల్ల నా సంసార జీవితంలో నాకు సౌఖ్యం లేదనే చెప్పవలసి ఉంటుంది. తత్ఫలితంగా నా భార్యకి అనారోగ్యం కలిగింది. ఆ రోజుల్లోనే నాకు తొట్టి వైద్యం అంటే బాగా గురి కుదిరింది. అందుచేత అప్పటికి ఆ వైద్యాన్ని గురించి కృషిచేసిన ద్రోణంరాజు వెంకట రమణారావుగారి దగ్గిర ఆ విషయమైన భోగట్టాలన్నీ తెలుసుకుని, నేనూ నా భార్యాకూడా తొట్టి వైద్యం ప్రారంభించాము.

తరవాత ఇంగ్లండునించి తిరిగి వచ్చి మద్రాసులో కొండిచెట్టి వీధిలో ఉన్నప్పుడు కూడా ఆ వైద్యమే నమ్ముకున్నాను. నేను ఇంగ్లండు

నించి వచ్చిన కొద్ది కాలానికే నా భార్య గర్భవతి అయింది. అప్పటి వరకూ జీవించి ఉన్న మా అమ్మగారు ఆ వార్తకి చాలా సంతోషించింది. ఆవిడికి లోకంతోపాటే మనమల్ని ఎత్తుకోవాలని ఆశ. కాని ఆ సంతోషానికి ఆవిడ నోచుకోలేదు. కొండిచెట్టి వీధిలో ఉండగానే ఆమె పక్షవాతంవల్ల మరణించింది. అప్పటికి ఆమె వయస్సు 60.

చనిపోయేటప్పుడు ఆమె నన్ను పిలిచి తను చిరకాలం కిందట నించీ జాగ్రత్తగా దాచి ఉంచుకున్న 800 రూపాయలమూటా నాకు అప్పగించింది. ఆమె అతిప్రయాసం మీద నన్ను, నా తమ్ముల్ని వృద్ధిలోకి తీసుకురావడమే కాకుండా ఈ రీతిగా ధనం సేకరించి నాకు అప్పచెప్పడం చాలా ఆశ్చర్యకరమయిన విషయం! ఆమె పడ్డ శ్రమకి ఆమె ఋణం తీర్చుకుందాం అంటే ఆఖరికి అంత్యక్రియలలోనైనా ఆ అవకాశం లభించింది కాదు. ఆమె ధన్యాత్మురాలు.

తరవాత మేము కొండిచెట్టి వీధినించి శుంకురామచెట్టి వీధిలోని జి. ఏ. నటేశను ఇంటిలోకి మారాము. అప్పుడే నాకు ప్రథమ పురుష సంతానం కలిగింది. కాని ప్రసవ సమయంలో ఫోర్‌సెప్స్ ఉపయోగించవలసివచ్చింది. ఆ ఉపయోగించడంలో జరిగిన ప్రమాదంవల్ల ఆ కుర్రవాడు రెండు సంవత్సరాలు జీవించి చనిపోయాడు. మళ్ళీ రెండోసారి ప్రసవ సమయానికి నేను శాంతోమ్‌లోని సీవ్యూ అనే భవనం ఒకటి అద్దెకి తీసుకుని అందులోకి మారాను. మళ్ళీ నాకు మగపిల్లవాడు కలిగాడు. మరి ఒకటిన్నర సంవత్సరాలకి రెండో కుమారుడు జన్మించాడు. నేను అప్పటికే మదరాసులోని ఎల్లపదుమాడకోవెల వీధిలో ఉన్న ఇల్లు కొన్నాను. నెలకి నూరు రూపాయలు అద్దె యివ్వడంకన్న ఒక ఇల్లు ఉంటే మంచిదనే ఆలోచన కలిగింది. కాని నా దగ్గిర డబ్బు నిలవ ఉండే పద్ధతి లేదు. అప్పుడే నా మిత్రుడు కె. యస్. రామచంద్రరావు ఆరువేల రూపాయలు ఇచ్చి ఆ యిల్లు నాకోసం కొన్నాడు. అది సుమారు రెండున్నర ఎకరాల స్థలంలో ఉంది. ఆ ఇల్లు అంతా నేను తరవాత వృద్ధిచేసి కట్టినదే. ఆ తరవాత, చాలాకాలానికి నేను వడ్డీ

తోనూ, అద్దెతోనూ రామచంద్రరావుగారికి సుమారు ఇరవై వేలు తిరిగి ఇచ్చి ఆ ఇల్లు పూర్తిగా నాపేర స్వాధీన పరుచుకున్నాను.

నా పెద్ద తమ్ముడు శ్రీరాములు చిన్నప్పటినించీ కొంచెం నెమ్మదైనవాడు. అతను ఒంగోలులో హైస్కూలు చదువు చదివాడు. అప్పుడు కొంచెం పేకాట దృష్టిలో పడి మెట్రిక్యులేషన్ రెండుసార్లు తప్పాడు. నేను రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు పెట్టిన తరవాత రాజమహేంద్రవరం వచ్చాడు. అక్కడ యఫ్. ఏ. చదివి; మద్రాసులో క్రిస్టియన్ కాలేజీలో బి. ఏ. చదివాడు. యఫ్. ఏ. దగ్గరనించి చురుగ్గా చదివి డిగ్రీపొందిన తరవాత ఫస్టుగ్రేడు పాసయి రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు చేశాడు. అతని అభిమాన విద్య వేదాంతం. క్రిస్టియన్ కాలేజీలో స్కిన్నర్‌వద్ద ఫిలాసఫీ చదువుకున్న రోజుల్లో అతను క్రైస్తవ సిద్ధాంతంలోకి మారాడు. అతను చదువుకున్న వేదాంతం కేవలం పుస్తకాలతో అంతం కానియ్యకుండా ఆచరణలో కూడా పెట్టేవాడు. కొంతకాలం నా దగ్గరే ప్రాక్టీసు చేశాడు. తరవాత, కొంతకాలం అత్తవారి ఊరు అయిన కాకినాడలో ప్రాక్టీసుచేసి, మళ్ళీ రాజమహేంద్రవరం చేరుకున్నాడు. అతను రాజమహేంద్రవరంలో ప్రాక్టీసుచేసే రోజుల్లో మంచి బుద్ధి సూక్ష్మతా, వాదనా శక్తీ చూపించాడు. కాని, కేసుల్లో ఏమాత్రం న్యాయమూ, సత్యమూ లేకపోయినా వాటిని నిరాకరించడంవల్ల న్యాయవాదిగా అంతగా ప్రయోజకుడు కాలేకపోయాడు.

ఒకసారి నేను ఊళ్ళో లేనప్పుడు ఒక ప్రముఖుడైన క్లయింటు అతని దగ్గిరికి వచ్చి ఒక కేసులో సాక్షులు ఏమి చెప్పాలో కొంచెం ముందుగా చెప్పించమని అడిగాడు. వెంటనే అతను, "అది నా పనికాదు. నేను సాక్షుల్ని తయారుచేసే ప్లీడర్ని కాను," అన్నాడు. అదీ అతని తరహా! అతను సంఘ సంస్కారాందోళన రోజుల్లో వీరేశలింగంగారి శిష్యుడు అయ్యాడు. ఆ రోజుల్లో ఆయనకి ముఖ్యులైన వాళ్ళలో ఒకడుగా ఉండేవాడు. కాని తరవాత ఆయనతో తగాదాలు పడిన వాళ్ళలో అగ్రగణ్యుడు అయ్యాడు!

అతనికి పత్రికా రచన అంటే ఇష్టం. అప్పుడే 'కార్లీలియను' అనే పత్రిక ఒకటి నడిపించేవాడు. ఆ కార్లీలియను పత్రికలో భయం అనేది లేకుండా మంచి జోరుగా వ్రాసేవాడు. ఆ పత్రిక అప్పటి ప్రజా జీవితంలో ఉండే వాళ్ళకి గుండె బెదురుగా ఉండేది. అతను తెలుగులో వివేకవర్ధని, ఇంగ్లీషులో కార్లీలియను నడిపేవాడు. నేను మద్రాసులో ప్రాక్టీసు పెట్టిన 56 సంవత్సరాలకి కాబోలు, ఒక పెద్ద కేసులో ఇరుక్కున్నాడు.

# 19

## వీరేశలింగంపంతులు కేసు

వీరేశలింగంగారికి మంగమ్మ చేసే శుశ్రూష అనేకమైన అపార్థాలకి తావు ఇచ్చి, కొంత అపవాదుకి కారణం అయింది. ఆ విషయాన్ని గురించి తీవ్రంగా వ్రాయడంచేత వీరేశలింగంగారు శ్రీరాములుమీద జాయింటు మేజస్ట్రీటుకోర్టులో లైబెల్ కేసు వేశారు. అప్పుడు నేను ప్రీవీ కౌన్సిలు పనిమీద లండను వెళ్ళాను. నేను తిరిగి వచ్చేసరికి ఈ కేసు సగం పూర్తి అయింది. అందరూ కూడా శ్రీరాములు జైలుకి వెళ్ళడం తప్పదని అనుకున్నారు. ఈలాంటి స్థితిలో కీర్తిశేషులైన చిత్రపు వెంకటచలంగారు నాతో, "ప్రకాశం! నువ్వు సరియైన సమయంలో వచ్చావు. ఈ కేసు స్వయంగా చూడు. శ్రీరాముల్ని జైలుకి పంపడానికి అంతా సిద్ధమై ఉంది. ఈ ప్రాసిక్యూషనులో పెద్దవాళ్ళు తెర వెనక నాటకం చాలా ఉంది," అని చెప్పారు. అప్పుడే ఆ కేసు విచారిస్తూ ఉన్న జాయింటు మేజస్ట్రీటు ట్రాన్సుఫరు అయి యఫ్. డబ్లియు. స్టూ ఆర్టు జాయింటు మేజస్ట్రీటుగా వచ్చాడు. మేజస్ట్రీటు మారడంచేత విచారణ మొదటినించీ జరగాలని వాదించాను. నా వాదన నెగ్గింది. స్టూ ఆర్టు నాతోటే లండన్‌లో ఓడ ఎక్కి ఇండియా వచ్చాడు. ఓడలో

నేను ఫస్టు క్లాసులోనూ, ఆయన సెకండు క్లాసులోనూ ఉండడంచేత కలుసుకోవడానికి వీలు అయ్యేదికాదు. కాని, అప్పుడు క్రిష్టమస్‌పండుగ అవడంచేత ఆయన్ని ఓడలో కలుసుకున్నాను. విచారణ ఆయన ఎదటే జరిగింది.

నేను ఇంగ్లాండులో ఉన్నప్పుడు అలాంటిదే ఒక కేసు జరిగింది. ఒక యువతి డ్రస్సింగుగదిలో ఉండగా కాస్త వయస్సుముదిరిన ఫాదిరీ ఆ గదిలో కొన్నినిమిషాలు ఉన్నా డన్న కారణంచేత ఆయన మీద వ్యభిచారనేరం ఆరోపించారు. అది తండోపతండాలుగా ప్రేక్షకుల్ని ఆకర్షించిన కేసు! ఫాదిరీ తాను ఏవిధమైన అపచారమూ చెయ్యలేదనీ, ఆమెతో మాట్లాడడానికి మాత్రమే ఆ గదిలోపల ఉన్నాననీ వాదించాడు. కోర్టువారు ఆ డ్రస్సులో ఒంటరిగా ఉండేటప్పుడు ఆమెతో ఒక గదిలో ఉండడమే నేర మని నిర్ణయించి ఆ ఫాదిరీని శిక్షించారు.

వీరేశలింగంగారి కేసు కూడా ఇల్లాంటిదే. ఆయనమీద ఆమె ఏకాంతంగా ఉండగా పంతులుగారు ఆమె వీపు నిమురుతూ ఉండే వారనీ, బెంగుళూరు ప్రయాణంలో సెకండు క్లాసు కంపార్టుమెంటులో ఉభయులూ ప్రయాణం చేశారనీ, బెంగుళూరులో ఇద్దరూ మూడు మాసాలు ఒక గదిలోనే ఉన్నారనీ నిందారోపణ చేశారు. "మంగమ్మని నా అభిమాన పుత్రికగా చూసుకునేవాణ్ణి," అని వీరేశలింగంగారి వాదన. పాపం! వీరేశలింగం పంతులుగారిని సుమారు 5 రోజులు క్రాసుపరీక్ష చేసి ఈ పై సంగతులన్నీ ఒప్పించాను. ఆ ఇంగ్లీషు కేసు నాధారంగా చేసుకుని నా వాదన అంతా ఆ పద్ధతులమీద నడిపించాను.

ఒక పత్రికా రచయిత, తనకి న్యాయం అయినదని తోచే విమర్శన చెయ్యడానికి తగిన అవకాశం ఉందా? లేదా? అనే విషయంలో మేజస్ట్రీటుకి ఒక నిశ్చయం కుదిరింది. అందుచేత మేజస్ట్రీటు "ఈ కేసు ఎందుకు కొట్టివెయ్యకూడదో చెప్ప"మని అడిగాడు. పంతులు గారు "కేసులో వాదించడానికి మద్రాసునించి ఎవ్వరో వస్తారు. అందాకా వాయిదా ఇ"మ్మని అడిగారు; కాని ఇవ్వలేదు. చివరికి మేజస్ట్రీటు కేసు కొట్టివేశాడు. స్టూ ఆర్టుకి ముందు, ఈ కేసు విచారించిన బార్టుసవెల్

హైకోర్టు జడ్జీ అయ్యాక నేను ఒకసారి ఆయన్ని కలుసుకోవడం తటస్థించింది. అప్పుడు ఆయన ప్రస్తావన తీసుకువచ్చి, "తన ఎదట ముద్దాయి తరఫున కేసు సరిగా చెప్పని కారణంచేతనే చార్జీ చేశాను," అన్నాడు. ఎల్లాగ అయితేం శ్రీరాములు అందులోంచి నెమ్మదిగా బయటపడ్డాడు.

కార్నీలియన్ పత్రిక తరవాత అట్టేకాలం నడవలేదు. దాని పర్యవసానం ఏమయినా, పంతులుగారు చెప్పుడు మాటలు విని ఈ కేసు పెట్టినందుకు, ఆయన అంటే భక్తి గౌరవాలు ఉన్న నేను ఆయన్ని బోనులో నిలబెట్టి చాలా కష్టమైన ప్రశ్నలతో బాధించాను. అందుకు మాత్రం నా మనస్సు చాలా నొచ్చుకుంది. కాని, వృత్తి ధర్మంచేత అది తప్పనిసరి అయింది. శ్రీరాములు రాజమహేంద్రవరంలోనే న్యాయంగా వకీలు వృత్తి చేసుకుంటూ కాలక్షేపం చేస్తూవచ్చాడు.

# 20

## కుటుంబ పరిస్థితులు

నా రెండో తమ్ముడు జానకిరామయ్య మద్రాసులో నేను బారిష్టరు అయిన తరవాత యఫ్. ఏ. చదివి మెడికల్ కాలేజీలో జేరాడు. మెడికల్ కాలేజీలో రెండుసంవత్సరాలు చదివాక అతన్ని ఇంగ్లండు పంపాను. అక్కడ ఎడింబరోలో 5 సంవత్సరాలు యఫ్. ఆర్. సి. యస్. చదివి హౌస్ సర్జన్‌గా ఉంటూ ఉండేవాడు. ఆ తరవాత, మొదటి ఐరోపా మహాసంగ్రామంలో ఐ. యమ్. యస్. లో టెంపరరీ కమిషన్ పొంది యుద్ధంలోచేరాడు. కాని, మెసపొటేమియా మొదలైనచోట్ల పనిచేసి అక్కడి సైనికాధికార్లతో తగాదాలుపడి తిరిగి వచ్చి, మద్రాసు చేరుకుని అక్కడ ప్రాక్టీసు పెట్టాడు. మొత్తంమీద అక్కడ ప్రాక్టీసు బాగానే అందుకుంది. అల్లోపతీలో ఉత్తీర్ణుడు అయినా హోమోపతీ అంటే అతనికి ఎక్కువ నమ్మకము. అందులో అతను చాలా కృషిచేశాడు. ఇప్పటికీ అతనికి అది అంటేనే అభిమానము.

బారిష్టరుగా పేరుప్రతిష్ఠలు వచ్చి జీవితపు అంతస్తు పెరగడం తోనే ఇంట్లో ఎవరికి ఏ చిన్నజబ్బు వచ్చినా, నేను పెద్దపెద్ద ఎక్స్పర్టుల్ని పిలిచే స్థితిలో పడ్డాను. నాకు ఖూన్ తొట్టివైద్యంమీద నమ్మకం ఉండికాని ఈ హోమియోపతీ అంటే ఇష్టం వుండేది కాదు. ఇంత శ్రమపడి అల్లోపతీ చదువుకుని జానకిరామయ్య హోమోపతీ ప్రాక్టీసు చెయ్యడం నాకు యిష్టంగా ఉండేదికాదు. అందుచేతనే నా తమ్ముడు వైద్యుడైనా నా యింట్లో వైద్యం యితరుల చేతిమీదుగానే జరుగుతూ ఉండేది.

ఒకసారి బహుశః 1921 సంవత్సరంలో అనుకుంటాను—నా పెద్దకొడుకు నరసింహానికి టైఫాయిడ్ జ్వరం వచ్చింది. దానికి కేశవ పాయి వైద్యం చేస్తూవచ్చాడు. కాని వ్యాధి స్వాధీనం కాలేదు. ఆ కుర్రవాడి చెవిలోనించి చీము వచ్చేది. అందుచేత అప్పట్లో చెవి వైద్యంలో ఘటకుడైన శంకరనాదం పిళ్లైచేత వైద్యం చేయించాను. తాత్కాలికంగా చీము కట్టింది కాని, అసలు రోగం నివృత్తి కాలేదు. దాని తరవాతే టైఫాయిడ్ జ్వరం. వైద్యులు కడుపులో జబ్బుకి చికిత్స చేస్తూవచ్చారు. రోగి కాళ్లూ, చేతులూ కొట్టుకుంటూ నిస్పృహగా ఉండడంచేత జానకిరామయ్య అది మెదడుకి సంబంధించి ఉంటుందని చెప్పాడు. కాని అతనిమాట నేనుగాని, చికిత్సచేసే వైద్యుడుగాని విని పించుకోలేదు. చివరికి రోగి బ్రతకడని పరమేశ్వరుడిమీద భారం వేసే స్థితికి వచ్చాక, జానకిరామయ్య వైద్యం చేశాడు. ఆ జబ్బు సప్రెషన్ ఆఫ్ డిస్చార్జివల్ల సంభవించి ఉంటుందని ఊహించి, దానికి రస సంబంధమైన హోమియోపతి మందు ఒక్క మోతాదు యిచ్చాడు. దానికి సంబంధించిన పుస్తకాలలోని విషయాలు అన్నీ నాకు చదివి విని పించాడు. ఆ మందుతో రెండుచెవులనించీ రసి కారి, దానికి దారి చాలక ముక్కునించికూడా రసి వచ్చింది. అప్పుడు శంకరనాదంపిళ్లై సహాయంతో ముక్కూ చెవులూ శుభ్రపరిచాడు. రోగం మళ్ళింది. కాని బాలిక స్తంభించిపోయింది. చెవులు వినిపించడం మానేశాయి. ఆ స్థితిలో నేను కలకత్తా అలిండియా కాంగ్రెసు కమిటీకి పోవలసివచ్చి

కుర్రవాణ్ణి అతనికి అప్పజెప్పి వెళ్ళిపోయాను. జానకిరామయ్య సలహా మీద కలకత్తాలో ఉన్న కొందరు హోమియోపతీ వైద్యుల సలహాలు తీసుకున్నాను. కాని, ఈ లోగానే జానకిరామయ్య కృషివల్ల మాట వచ్చి చెవులుకూడా వినిపించడం మొదలుపెట్టాయి. అప్పటినించీ అతని వైద్యం అంటే నాకు నమ్మకం కుదిరింది. అనేకసార్లు అతను అలోపతీవల్ల కుదరని రోగాలు సాధించడం నేను ఎరుగుదును. ఈ వైద్యసాధనతో ప్రయోజకుడై జానకిరామయ్య సుఖంగా జీవయాత్ర సాగిస్తున్నాడు.

నేను రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు ప్రారంభించిన కొద్ది రోజులకే నా మేనల్లుళ్లు మైనంపాటి నరసింహం, సుబ్బారావు వగైరాలూ, వాళ్ళ చెల్లెళ్ళూ రాజమహేంద్రవరం చేరుకున్నారు. వాళ్ళందర చదువూకూడా అక్కడే జరిగింది. నా మేనగోడళ్ళ పెళ్ళిళ్ళుకూడా నేనే చేశాను. అందరూ చదువుకుని ప్రయోజకు లయ్యాక, ఎవళ్ళంతట వాళ్ళు గుట్టుగా జీవితయాత్ర చేస్తున్నారు.

కుటుంబవిషయమైన ఈ ప్రస్తావన ముగించడానికి ముందు నా జీవితానికి వెలుగు యిచ్చిన హనుమంతరావు నాయుడుగారిని గురించి వ్రాయవలసి ఉంటుంది. నేను రాజమహేంద్రవరం ఛైర్మన్‌గా ఉన్న కాలంలో ఆయన్ని కౌన్సిలు సెక్రటరీగా నియమించాను. నేను ఇంగ్లండు వెళ్ళి బారిష్టరు పరీక్షకి చదవడానికి నిశ్చయించుకోవడం విని, ఆయన ఎంతో సంతోషించారు. నేను బారిష్టరుని అయి తిరిగి వచ్చాక, మద్రాసులో ప్రాక్టీసు పెట్టిన కొద్దిరోజులకి ఆయన్ని మద్రాసు తీసుకువచ్చి కొంతకాలం మా యింట్లో ఉంచుకున్నాను. అప్పట్లో ఆయనకి వంట్లో ఖాయిలా ప్రవేశించింది. ఆ ఖాయిలాకి చికిత్సకూడా చేయించాను. తరవాత కొంతకాలానికి ఆయన కీర్తిశేషులైనారు. ఆయన కుటుంబానికి నేను శక్తివంచన లేకుండా తోడ్పడ్డాను అనే తృప్తి ఉన్నప్పటికీ, ఆయన నా జీవిత భాగానికి చేసిన సేవ ఎన్నటికీ మరవలేను.

# 21

## రాజకీయ జీవితం

నాకు అంతో యింతో వెలుగు యిచ్చింది రాజకీయ జీవితం. ఆ జీవితమే నేను ఆంధ్రదేశపు సద్భావం పొందడానికీ, ఈ చరిత్ర వ్రాయడానికీ కారణం అయింది. కనక ఈ విషయం కొంచెం విపులంగా వ్రాస్తాను. నేను ఆదిలో వృత్తి నిర్ణయం చేసుకునే కాలంలో నా దృష్టి ప్లీడరీమీదికి పోవడానికి కారణం వ్రాసే ఉన్నాను. ఆ కాలంలో ప్లీడర్లకి ఉండే ఆర్జన, హుందాతనమూ మాత్రమే కాకుండా ఆ వృత్తి స్వతంత్ర వృత్తి అనే నమ్మకంకూడా నన్ను అందులోకి ఈడ్చుకు వెళ్ళింది. హనుమంతరావు నాయుడుగారి శుశ్రూష, రాజమహేంద్రవరంలో వీరేశలింగంపంతులు సంస్కరణోద్యమమూ, కొంతవరకు నాలో రాజకీయాభిలాషలు రేకెత్తించాయి. అప్పటికి 1857 వ సంవత్సరంనాటి స్వాతంత్ర్య యుద్ధపు కథలు యింకా ప్రచారంలోనే ఉన్నాయి. ఏమైనా, ఈనాటి మహాదాశయాలు ఇదమిత్థ మని ఏర్పడకపోయినా, నాలో యితర లౌకికాభిలాషలతోపాటు దేశసేవ చెయ్యాలనే అభిలాషకూడా ఉండేది.

నేను రాజమహేంద్రవరంలో యఫ్. ఏ. క్లాసు చదువుకునే కాలానికి కాంగ్రెస్ అనే మాట కొంచెంగా వినబడేది. కాని, ఆ మాట వినిపించుకునేవాళ్ళ సంఖ్య చాలా స్వల్పంగా ఉండేది. నేను 1893 వ సంవత్సరంలో లా కాలేజీలో చదువుకునే రోజుల నాటికి కాంగ్రెస్ మరికొంత వేరు పాతుకుంది. అప్పుడే నేను మద్రాసులో బిల్లిగిరి అయ్యంగారి ఐస్‌హౌస్ భవనంలో శ్రీ వివేకానందస్వామిని దర్శించి ఆయనతో చాలాసేపు చర్చచేశాను. అప్పట్లో బిసెంటమ్మ వర్గంలోని ఓల్డు అనే ఆయన దివ్యదృష్టితో తెలిపతీవిషయాలు చెపుతూ ఉండేవాడు. ఆ విషయా లన్నిటినిగురించీ వివేకానందస్వామిని అడిగి తెలుసుకున్నాను. మానవుడికి జ్ఞానం పరిపక్వం అయితే అల్లాంటివి అసాధ్య విషయాలు కావని ఆయన చెప్పారు. ఆయన ఉపన్యాసాలు నాకు కొంత ఉత్తేజం కలిగించాయి.

రాజమహేంద్రవరంలో ప్రాక్టీసుచేసే కాలంలో—అంటే 1894-1900 సంవత్సరాల మధ్యలో—కాంగ్రెస్సునిగురించి, సంవత్సరానికోమారు ఉత్సాహంగా చెప్పుకోవడమే ఉండేది కాని, స్వాతంత్ర్య స్వరూపంగాని, దానికి అవసరమైన కార్యక్రమ స్వరూపం గాని అవగాహనే కాలేదు. సిపాయి విప్లవం పాలకులకీ, పాలితులకీ కూడా అనేకపాఠాలు నేర్పింది. పాలకులు కేవలం జబర్దస్తీ సాగదనీ, దేశంలో ద్విభాషులతోపాటు మచ్చుపిట్టల్ని మరిగించాలనీ కూడా తెలుసుకున్నారు. ప్రజలు 1857 నాటి విప్లవానంతరం కొంత నిరుత్సాహపడినా, సక్రమమైన ఆందోళన సాగుతూ ఉండాలనికూడా గ్రహించారు. దీని ఫలితమే కాంగ్రెసుసృష్టి అని నా అభిప్రాయము. కొంతమంది ఆంగ్లమిత్రులు, కేవలం ధర్మబుద్ధితో కాంగ్రెస్ స్థాపనకి ప్రోత్సహించిన మాట సత్యమే కాని, మొత్తంమీద ఆంగ్ల రాజనీతిజ్ఞులు ఈ సక్రమాందోళనాసంస్థని అప్పట్లో ప్రోత్సహించడంలో కొంత స్వార్థంకూడా లేకపోలేదని నా నమ్మకం.

అప్పటికే,—అంటే కాంగ్రెస్సు ప్రారంభించిన కాలానికే— ఇంగ్లీషువారు దేశంలో నాణాల చట్టం ప్రవేశపెట్టి కరెన్సీనోట్ల చలామణీ ప్రారంభించారు. అప్పుడు బొంబాయిలోనూ, కలకత్తాలోనూ, ఇంకా ముఖ్యమైన వర్తకస్థానాలలోనూ చాలా తీవ్రమైన అలజడి బయలుదేరింది. అది ఆ వర్తకుల డబ్బుతోనూ పలుకుబడితోనూ కలిసి, చివరికి చినికి చినికి గాలివాన అవుతుందేమో నని మనదేశంలో వున్న ఆంగ్లరాజనీతికోవిదులు కొంచెం భయపడి, ఈ ఆందోళనను సక్రమమైన కట్టు కాలవల్లో ప్రవహింప చెయ్యడానికి, ఈ కాంగ్రెసు సంస్థని పురిగొల్పారని నా అభిప్రాయము.

అమెరికన్ స్వాతంత్ర్య యుద్ధంనాటినించీ ఇంగ్లీషువారికి జయ పరంపరలే కాని, అపజయం అనేది లేదు. పరభూములు స్వాధీనం చేసుకున్నాక, గట్టి పద్ధతులమీద తీర్చిన సంస్థల సహాయంతో తమ ప్రయోజనాలు సాధించుకోవడంలో ఇంగ్లీషువాళ్ళు ఆరితేరినవాళ్ళు. అందుచేతనే వాళ్లు మొట్టమొదట మన రాజ్యాంగ సంస్థలని నిర్మాలింప

జేసి, తమ విద్యా పద్ధతీ, న్యాయ పద్ధతీ ప్రవేశింపచేశారు. క్రమంగా తమ భాష, నాగరకత, సంప్రదాయాలూ, సంస్థలూ, ఆర్థికపద్ధతులూ, గ్రామపాలనా సంస్థలూ మొదలైనవి మనకి అంటగట్టి, పూర్తిగా తమకి వశ్యుల్ని చేసుకున్నారు. కాంగ్రెస్ స్థాపింపబడే రోజులకే ఆంగ్లేయుల ప్రయత్నాలు చాలావరకు ముగిశాయి.

పల్లెలలో అనాదిసిద్ధంగా ఉండే విద్యాపద్ధతులు అంతమై, ఎలిమెంటరీ, ఎయిడెడుస్కూళ్ళు బయలుదేరాయి. క్రమంగా, అవిద్య అనేది లేని ఈ పుణ్యభూమిలో అక్షరాస్యులు అరుదైపోయిన కాలం వచ్చింది. పాశ్చాత్యవిద్యావిధానప్రవేశమే మనజాతి కంఠానికి తగిలించిన మొదటి గుదిబండ. దానికి తమ పరిపాలన సాగించడానికి ఏర్పరచిన లాకోర్టులు రెండో గుదిబండ. వీటిలోనించే లెజిస్లేటివ్‌కౌన్సిళ్ళు అనే బాధ్యతలేని బూటకపుసంఘాలు బయలుదేరాయి. సహజంగా ఇంగ్లీషు వారి విద్యావిధానంలోనించి తయారైన లాయర్లూ, సివిల్ నౌకరులూ ప్రజలకి నాయకులు అయ్యారు. అల్లాంటి నాయకుల యాజమాన్యంలో సృష్టించబడిన ఈ కాంగ్రెస్ మహాసంస్థ ఆ దాస్య చిహ్నాలన్నీ వదులుకుని నేటికి గాంధీజీ చలవవల్ల నిజమైన ఏకైక జాతీయ సంస్థగా పరిణమించడం మనకి శుభావహం. ఆ విషయమై ముందుముందు వ్రాస్తాను. ప్రస్తావన మధ్యలో ఆంగ్లవిద్యాపద్ధతి విమర్శకి వచ్చింది.

కనక బర్మాలో ఆంగ్లేయులు చేసిన పనికూడా వ్రాస్తాను. నేను 1920 లో బర్మా వెళ్ళినప్పుడు ఒక విషయం తెలిసింది. ఆంగ్లేయులు తీబారాజుని పదచ్యుతుణ్ణి చేసి, ఖైదులో వుంచేసరికి, బర్మాలో నూటికి 80 మందికి తక్కువ గాకుండా విద్యావంతులు వుండేవారట. ఆంగ్లేయులు బర్మాని పూర్తిగా వశపరుచుకున్న 50 ఏళ్ళ లోపుగా ఆంగ్ల పాఠశాలలు స్థాపించి, జాతీయవిద్యావిధానాన్ని నాశనం చేసి, దేశంలో విద్యాగంధం ఉన్నవారి సంఖ్య సగానికి పైగా తగ్గించగలిగారు. బర్మాలో విద్యావిధానం అంతా బౌద్ధసన్యాసులచేతుల్లో వుండేది. వారు స్థాపించిన మఠాల్లో ప్రజలకందరికీ ధర్మార్థకామాలు సిద్ధింపజేసే మహత్తరమైన విద్య లభించేది. ఆ మఠాలు ఇంగ్లీషు పాఠశాలలు వచ్చాక

పశువులకొట్టాలుగా మారిపోయాయి. అవి నేటికీ అక్కడక్కడ పొలాల్లో నిలిచే వున్నాయి. మాండలేలో 150 అడుగుల బౌద్ధ విగ్రహం ఉన్న కొండ బర్మా బౌద్ధుల ఆరాధనకోసం సంపాదించ గలిగిన ఉకాంతి అనే ఆయన ఈ విషాదగాథ అంతా నాకు చెప్పాడు. ఆంగ్లేయులు ప్రతిచోటా ఈ తంతే జరిపించారు. రౌండు టేబిల్ సంపాదకుడయిన కర్టిన్ చెప్పినట్లు, తమ పరిపాలన సాగించడానికి అవసరమైన గుమాస్తాలనీ, ద్విభాషుల్నీ, వకీళ్ళనీ, యింకా యితర నౌకర్లనీ తయారుచెయ్యడమే ఆంగ్లేయుల విద్యావిధానంలో వున్న పరమోద్దేశం. ఒకవిధంగా మన విద్యావంతుల్ని ఆంగ్ల మానస పుత్రుల్నిగా తయారుచెయ్యడమే వారి ఆదర్శము. అప్పట్లో మన ప్రజ లకి నాయకులుగా చలామణీ అయిన ప్లీడర్లు అంతా ఇల్లాంటి ఆదర్శం వల్ల ఉద్భవించినవాళ్ళే. దేశంలో ప్రజానీకాన్ని నిర్వీర్యం చేసి, శాశ్వత మైన బానిసలుగా తయారుచేసే బ్రిటిష్ సంస్థలకి అన్నింటికీ ఆంగ్ల విద్యాధికులే నిర్వాహకులు అయ్యారు. క్రమంగా ఈ నిర్వాహకులకి కూడా వాటి ఆంతర్యం గోచరం అవడంచేత కొంచెం ఆత్మగౌరవం రేకెత్తింది.

కాని, ఇంగ్లీషు పాలకులు అతి గడసరులు. కాంగ్రెసులో చేరి ప్రజానీకంకోసం ఎవరైనా పూనుకుంటే, వారికి ఏదోరీతిగా ఆశలు చూపించి, ఉన్నతోద్యోగాలు యిచ్చి, సంతృప్తిపరిచేవారు. కాంగ్రెస్సు ఉత్పత్తీ, వృద్ధీ యిప్పటికి బాగా లోకవిదితాలు అయ్యాయి కనక, యిక్కడ నేను వివరించదలచుకోలేదు. నేను ఇంగ్లండు వెళ్ళడానికి ముందుమాత్రం కాంగ్రెసు రాజకీయాలు నన్ను ఎక్కువగా ఆకర్షించ లేదు. ఒకసారి నేను బొంబాయిలో వర్తకం చేస్తూవున్న గొల్లపూడి నరసింహం అనే ఒక లక్షాధికారి కేసుమీద బొంబాయినగరం సంద ర్శించాను. అప్పట్లో తీవ్రవాదిగా ప్రసిద్ధిపొంది, ప్రభుత్వపు ఆగ్రహానికి కూడా గురి అయిన లోకమాన్య తిలక్‌ని పూనానగరంలో దర్శించాను.

అప్పుడు ఆయనతో అనేకవిషయాలు చర్చించాను. అప్పటికి ఆయన రాజకీయాల్లో తీవ్రవాది. కాని, సాంఘికవిషయాల్లో కొంచెం

పూర్వాపారపరాయణుడు. అందుచేత వీరేశలింగంపంతులుగారి ప్రకృతి లోనైన నాకు ఆయనతో విశేషంగా చర్చించవలసిన అవసరం కలిగింది. ఆయన నాకు హిందూమతం మూలసూత్రా లన్నీ చక్కగా వివరించి మన ఆచారవ్యవహారాల్లో వుండే అంతర్యాలన్నీ బోధించారు. కాని, నేను అప్పట్లో వాటిని అవగాహన చేసుకునే స్థితిలో లేను. ఇప్పటికి వాటి పరమార్థం గ్రహించాను.

అప్పుడే ఆయనకీ, గోఖలేకీ వివాదం జరుగుతూవుండేది. ఆయన తమకి యిద్దరికిన్నీ గల అభిప్రాయభేదాలు ఏమీ ఆగ్రహావేశాలు లేకుండా, గోఖలే అంటే అతిగౌరవంతో వ్యక్తపరిచారు. అప్పట్లో గోఖలే ఆయనమీద కక్ష సాధించడానికి చాలా కష్టపడినట్లుగా నాకు అర్థం అయింది. ఆనాటినించీ నాకు గోఖలే అన్నా, ఆయన రాజకీయాలు అన్నా ఒకవిధమైన అనిష్టం బయలుదేరింది. తిలక్‌మీద వచ్చిన ప్రాసిక్యూషన్‌లలోనూ, ఇతర కష్టాలలోనూ ఈ గోఖలే ప్రభుతులకికూడా కొంత బాధ్యతవుందని నేను అనుకున్నాను. కాంగ్రెసు రాజకీయాలు నన్ను అప్పట్లో ఆకర్షించకపోవడానికి ఇది ఒక కారణం. ఆనాటి కార్యక్రమంలోగాని, నాయకత్వంలోగాని నన్ను ఉత్తేజపరచినది ఏమీ లేదు. లాలా లజపతిరాయ్, తిలక్‌వంటివాళ్ళకి ఆ పోకడలు నచ్చినా, వాళ్ళకి కాంగ్రెస్ సంస్థలో పలుకుబడి వుండేదికాదు.

నేను ఇంగ్లండులో బారిష్టరు చదువుకునే రోజులలో దాదాభాయి, శ్యాంజీకృష్ణవర్మ, వెడ్డర్‌బర్న్, రమేశచంద్రదత్తు, డబ్లియు. సి. బోనర్జీవంటి ప్రముఖుల పరిచయభాగ్యం సంపాదించుకున్నాను. ఆ దేశంలో వుండే స్వాతంత్ర్య వాయువులకీ, మనదేశంలో వుండే నిర్బంధాలకీ గల తారతమ్యం కూడా కనుక్కున్నాను. స్వాతంత్ర్యం కోసం పెనగులాడిన ఇతరదేశాల చరిత్రలన్నీ జాగ్రత్తగా చదివాను. ఈ పై కారణాలవల్ల నా మనస్సు రాజకీయాలలో లగ్నమైన దని చెప్పవలసి వుంది. కాని, అప్పట్లో ప్రజానాయకు లనేవారి ఆదర్శమే చాలా చిన్నది. స్వరాజ్యమూ, స్వాతంత్ర్యమూ అనే ఆశ మాటే లేకుండా వుండేవి. అప్పట్లో లండనులో హిందూదేశాన్నిగురించి ప్రచారం

చెయ్యడానికి లండన్ ఇండియన్ సొసైటీవారు ఆహ్వానించిన మిత వాద ప్రముఖుడు, గోఖలేకూడా ముందు తను మాట్లాడదలచుకున్నవి వ్రాసి పంపవలసినస్థితిలో వుంటే యిక యితరుల సంగతి చెప్పాలా ? ఈ మితవాదం అంటే బ్రిటిష్‌ప్రభుత్వాన్ని ఆశ్రయించి, వాళ్ళ యాజ మాన్యంకింద దయాధర్మ భిక్షంగా, కొంచెం కొంచెం రాజకీయ స్వాతంత్ర్యం సంపాదించాలనే ఆశయం—అప్పటికి విద్యాధికుల మన స్సుల్లో బాగా జీర్ణించి వుంది. బ్రిటన్‌లోనూ, యితరదేశాల్లోనూ స్వాతంత్ర్యం అన్నా ప్రజాస్వామికం అన్నా అర్థమయినట్లు మన వాళ్ళకి అర్థం కాలేదు. ఏమంటే—స్వార్థపరులైన ఆంగ్లరాజనీతిజ్ఞులు మనదేశంలో అనేక మతాలూ, కులాలు వున్నాయనీ, ఒక ప్రజా స్వామికంకింద వీళ్ళందరూ ఒక తాటిమీద నడవడం అసంభవమనీ వ్రాశారు. ఇవి వాళ్ల మనస్సులకి బాగా పట్టుకున్నాయి. లండనులో డబ్లియు. సి. బోనర్జీ—(ప్రథమ కాంగ్రెసు అధ్యక్షుడు) పోయినప్పుడు శ్మశానంలో రమేశచంద్రుదత్తువంటి విద్యావేత్తా, బుద్ధిశాలీ కూడా తీవ్ర వాదుల చర్యల్ని విమర్శించాడంటే ఇంక వేరుగా చెప్పేది ఏమిఉంది?

కాంగ్రెసు నాయకత్వం స్వల్పసంస్కరణలకోసం అంటే నిర్బంధోచిత ప్రారంభవిద్య, న్యాయశాఖా కార్యనిర్వాహకశాఖల విభ జనం, దేశీయులకి ఉన్నతోద్యోగాలు యివ్వడం, శాసనసభల్లో సభ్యుల సంఖ్య పెంచడం, ఐ. సి. యస్. పరీక్షలు ఇండియాలో కూడా జరి పించడం మొదలైన విషయాలకోసం ఆందోళన జరిపిస్తూ వుండగా మహారాష్ట్రదేశంలో లోకమాన్యుడు, పంజాబ్‌లో లాలా లజపతిరాయ్, బంగాళాదేశంలో విప్లవ వీరులు స్వరాజ్యం అనే ఆదర్శాన్ని ధైర్యంతో ప్రతిపాదించి కష్టాలపాలు అయ్యారు. స్వాతంత్ర్య రథానికి వాళ్ళు మార్గదర్శకులు అయ్యారు. దేశంలో వుండే కోర్టులు ఇంగ్లండులోని స్టార్‌ఛేంబర్సు మాదిరివే అవడంచేత ఈ దేశభక్తులు స్వరాజ్యం కోర డమే అపరాధంగా పరిగణింపబడి, వాళ్ళకి కారాగృహప్రాప్తి కలుగుతూ వుండేది. వాళ్ళ పేర్లు ఉచ్చరించడం, వాళ్ళ పటాలు ఇంట్లో పెట్టు కోవడం ఆఖరికి 'వందేమాతరం' అని మాతృదేవికి నమస్కారం

చెయ్యడంకూడా అపరాధం అయిపోయిన రోజులు వచ్చాయి. 1905-6 సంవత్సరాల ప్రాంతంలో తిలక్‌పటంకోసం రాజమహేంద్రవరంలో ఎన్నో ఇళ్ళు సోదా చేశారు. రాజకీయాందోళన క్రమంగా చినికి చినికి గాలివాన అయి తమ సామ్రాజ్యపు పునాదులకికూడా హాని కలిగిస్తుంది అనే భయంతో ఆంగ్లపాలకులు దేశం అంతా — ముఖ్యంగా బెంగాల్లో—నిర్బంధవిధానం ప్రారంభించారు. ఇంత జరుగుతూ వున్నా నాయకత్వం వహించివున్న మితవాదనాయకులు తగిన రీతిని అసమ్మతులు తెలపలేకపోవడంచేత ప్రభుత్వం మరింత ధైర్యంతో నిర్బంధవిధానం సాగించింది.

స్వరాజ్యం అనే పదమే అపరాధంగా పరిగణింపబడుతూ వున్న ఆ రోజుల్లో నేను లండనులో దాదాభాయి నౌరోజీ సన్నిధిలో ఉండడం తటస్థించింది. ఈ వార్తలు చూసినప్పుడు ఒకసారి తేజశ్శాలి అయి యోగీశ్వరుడులా వున్న ఆయన ముఖం ఎర్రగా కందిపోయింది. అప్పుడే ఆయన భారతదేశం వెళ్ళి స్వరాజ్యం అనే ఆదర్శం బహిరంగంగా వెల్లడించాలని నిశ్చయించుకున్నారు.

ఆ నాటి మితవాదులు తరవాత కాలానికి చెందినవాళ్ళ మోస్తరుగా కాక, తమ సిద్ధాంతాలు అంటే చాలా పట్టుదల గలిగి వుండే వాళ్ళని నా అభిప్రాయం. ప్రభుత్వం వాళ్ళ మొరలూ, ప్రార్థనలూ, ఆశ్రయింపులూ, అనునయాలూ ఎంతగా పెడచెవిని పెట్టినా, వాళ్ళు మాత్రం మారడం అనేది వుండేదికాదు. మితవాదులు, వైస్రాయి తమ మాట వినకపోతే పోనీ ఇంగ్లీషు దొరగారిమాట అయినా వినకపోతాడా అని వైస్రాయిగావున్న లార్డు కర్జన్‌కాలంలో సర్ హెన్రీ కాటన్‌ని కాంగ్రెసు ప్రెసిడెంటుగా చేసి, ఆయనదగ్గిరికి పంపించాలని సంకల్పించారు. పాపం! వైస్రాయి ఆఖరికి కాటన్‌ని చూడడానికి కూడా అంగీకరించలేదు.

బెంగాలు విభజన తరవాత వచ్చిన ఆందోళన దేశంలోని మితవాద తీవ్రవాదశక్తుల్ని పూర్తిగా రెండు చీలికలుగా విభజించింది. నేను ఆ కాలంలోనే లండన్‌నించి తిరిగివచ్చి మద్రాసులో ప్రాక్టీసు ప్రారం

భించాను. క్రమంగా రాజకీయాల్లో జోక్యం కలిగించుకోవడం ప్రారంభించాను. అప్పట్లో మద్రాసులో రాజకీయంగా ప్రముఖులైనవారు, సర్ పి. యస్. శివస్వామి, వి. కృష్ణస్వామయ్యరు, న్యాపతి సుబ్బారావు పంతులు, జి. సుబ్రహ్మణ్య అయ్యరుగార్లూ, తదితరులూను.

నేను బారిష్టరుగా ప్రాక్టీసు ప్రారంభించిన కొద్దిరోజులకే బెంగాలు నాయకుడైన బిపిన్‌చంద్ర పాల్ మద్రాసులో ఉపన్యాసాలు యివ్వడానికి వచ్చాడు. ఆయన అప్పటికే 'గొప్ప వక్త' అని పేరు పొందాడు. అప్పుడు మద్రాసులో భాష్యంఅయ్యంగారు అడ్వకేటు జనరల్. శంకరన్‌నాయరుగారు గవర్నమెంటు ప్లీడరు. పాల్ మద్రాసు బీచిలో వరసగా ఉపన్యాసాలు యిచ్చాడు. మొదటి ఉపన్యాసం అయ్యాక ఆయన మీటింగుకి అధ్యక్షుడు ఎవ్వరూ దొరకలేదు. సభానిర్వాహకులు నన్ను అడిగితే నేను అంగీకరించాను. అప్పుడు పాల్ నిజంగా నిప్పులు కురిపించేటంత తీవ్రంగా ఉపన్యాసాలు యిచ్చాడు. ఆయన చెప్పిన దాంట్లో పేసబబు ఏమీ లేదు. ఎప్పటికప్పుడు ఆ ఉపన్యాసాలు గవర్నమెంటు అధికారులకి తెలుస్తూ వుండేవి. భాష్యం అయ్యంగారు సభలో కూర్చోడానికి ధైర్యం చాలక బీచి ఒడ్డున మామూలుగా షికారుగా నడుస్తూ వున్నట్టు మెల్లిగా పచారుచేస్తూ వింటూ వుండేవాడు. కాంగ్రెస్ అధ్యక్షుడై ప్రభుత్వ ప్రాపకం సంపాదించిన శంకరన్ నాయరుగారు పాల్‌తో, "మీరు ఉపన్యాసాలు మానివేసి, వెంటనే మద్రాసునించి వెళ్ళకపోతే, మిమ్మల్ని అరెస్టు చేయవలసి వస్తుం" దని చల్లగా సలహా యిచ్చాడు. వృద్ధిలోకి రాదలచుకున్న బారిష్టరువి, నీ కీ గొడవ ఎందుకని నాకుకూడా చాలామంది స్నేహితులు సలహా యిచ్చారు.

ఈ సందర్భంలో అడ్వకేటుజనరల్ భాష్యం అయ్యంగారిని గురించి ఒక విషయం చెప్పడం చాలా అవసరం. పాల్ ఉపన్యాసాల మీద భాష్యం అయ్యంగారి అభిప్రాయంకోసం గవర్నమెంటు అవి అన్నీ సేకరించి ఆయన దగ్గిరికి పంపించింది. దానిమీద ఆయన సాహసించి పాల్ చెప్పిన మాటలు ఉద్రేకపూరితంగానే వున్నాయి కాని, రాజద్రోహం లే దని వ్రాశాడు. జీవితంలో ఆయన రాజకీయాల్లో

పాల్గొనకపోయినా ఈ విషయంలో మాత్రం అతిధైర్యం చూపించాడు. రాజకీయాలల్లో కిందుమీదయిన సర్ శంకరన్‌నాయరుగారు కూడా సమయానికి ఇల్లాంటి అభిప్రాయమే వెలిబుచ్చాడు. బహుశః భాష్యం అయ్యంగారి అభిప్రాయం మీదనే మద్రాసుప్రభుత్వం పాల్ ఉపన్యాసాలకి ఆయనమీద చర్య ఏమీ తీసుకోలేదు అనుకుంటాను. కాని పాల్ మాత్రం కొంచెం జాగా ఎరిగి బైటాయించే మనిషి. నేను యిల్లాంటి సాహసమైన పనిచెయ్యడానికి వచ్చినవాడు ధైర్యంగానే వుంటాడనీ, ఎందుకైనా సిద్ధంగానే వుంటాడనీ అనుకున్నాను. కాని నాకు చాలా ఆశాభంగం కలిగించి, కొన్ని ఉపన్యాసాలు అయ్యాక శంకరన్ నాయరుగారి సలహా అంగీకరించి మెల్లిగా మద్రాసుకి స్వస్తిచెప్పాడు. ఆయన మీటింగులకి అధ్యక్షత వహించవలసి వచ్చినప్పుడు ఏమి వచ్చినా సిద్ధపడడానికి సంకల్పించుకునే నేను అంగీకరించాను. దానివల్ల గడబిడ మాత్రం ఏమీ జరగలేదు.

# 22

## సూరత్ కాంగ్రెస్

తరవాత కొద్దిరోజులకి సూరత్ కాంగ్రెసు అయింది. కాంగ్రెస్ చరిత్రలో సూరత్ సమావేశం చాలా చరిత్రాత్మకం అయింది. అప్పట్లో 'మితవాదులు', 'అతివాదులు' అని రాజకీయవేత్తల్లో ఏర్పడ్డ చీలికలు సూరత్‌లో తీవ్రమయిన సంఘర్షణకి వచ్చి నిర్దిష్టంగా వేరయిపోయాయి. అప్పటికి దేశంలోని 'అతివాదులకి' లాలా లజపతిరాయి, తిలక్, పాల్ ప్రభృతులు నాయకులు. మితవాదులకి సర్ ఫిరోజిషా మెహతా, గోఖలే, సురేంద్రనాధబెనర్జీ ప్రభృతులు నాయకులు. మన సుబ్బారావు పంతులుగారు తత్వంలో మితవాది అయినా కాస్త మధ్యస్థులు. ఆ కాలంలో కాంగ్రెస్‌కి ఫిరోజిషా మెహతా నియంత వంటివాడే. కాంగ్రెస్ సంఘాలు అనిగాని, ప్రతినిధుల్ని ఎన్నుకోవడంగాని,

ప్రతినిధులు ప్రెసిడెంటుని ఎన్నుకోవడంగాని ఏమీలేవు. మెహతా ఎవరి మీద కటాక్షవీక్షణం చేస్తే వాళ్ళే కాంగ్రెసు అధ్యక్షులు. తీవ్రవాదులైన తిలక్, లాలాజీలు ఆయన ఆగ్రహానికి గురి అయినవాళ్ళలో ముఖ్యులు. వాళ్ళకి దేశంలో ఎంత పలుకుబడివున్నా, ఎంత గౌరవంవున్నా కాంగ్రెసు అధ్యక్షులు కావడానికిగాని, తమ వాదన నెగ్గించుకోడానికిగాని ఎల్లాంటి అవకాశమూ వుండేదికాదు.

మితవాదులు 1907వ సంవత్సరంలో సూరత్ కాంగ్రెస్‌కి కలకత్తాలో ప్రసిద్ధన్యాయవాది అయిన రసవిహారీఘోషుని అధ్యక్షుణ్ణి చేశారు. ఈ ఎన్నిక ప్రతిఘటించాలని బాలగంగాధరతిలక్ ముందే నిశ్చయించుకున్నాడు. ఆ కాంగ్రెసుకి నాగపట్నంనించీ, మహారాష్ట్రం నించీ వచ్చిన ప్రతినిధులు సమస్తసన్నాహాలతోటీ దిగారు. మద్రాసు నించి వి. కృష్ణస్వామయ్యరుగారు, జి.ఎ. నటేశనుగారు, యస్. దొర స్వామయ్యరుగారు, వి. చక్రయ్యచెట్టిగారు, సుబ్బారావు పంతులుగారు, యింకా కొందరమూ ఈ కాంగ్రెస్సుకి హాజరు అయ్యాము. అందులో కృష్ణస్వామయ్యరు, సుబ్బారావు పంతులు, నటేశన్ ప్రభృతులు మితవాద పక్షీయులు. దొరస్వామయ్యరుగారు అప్పట్లో యస్. శ్రీనివాస య్యంగారి దగ్గర లా ఎప్రెంటిస్‌గా వుంటూవుండేవారు. ఆయనా, చక్రయ్యచెట్టిగారూ అతివాదులు. అతివాదుల ఆదర్శాలు అంటేనే నాకు యిష్టం.

సమావేశ ప్రారంభంలో మితవాదులు రాస్‌విహారీఘోష్‌ని అధ్య క్షుణ్ణిగా సూచించారు. వెంటనే లోకమాన్యుడు వేదికమీదనించి లేచి లాలాలజపతిరాయ్ పేరు సూచించాడు. అప్పటికి 22 సంవత్సరాల నించీ మానవమాత్రుడు ఎవ్వడూ అల్లాంటి సాహసం చేసి వుండ లేదు. కాంగ్రెస్ నియంత అయిన మెహతా అభిప్రాయానికి వ్యతిరే కంగా అధ్యక్షుడి విషయంలో మరి ఒక సూచన రావడమే అలజడి కలిగించింది!

నేనూ, వి.కృష్ణస్వామయ్యరుగారూ వేదికకి ముందుగా కూర్చుని వున్నాము. ఆ పక్కనే తిలక్ ముఖ్య స్నేహితుల్లో ఒకడైన కపర్ది

నిలబడ్డాడు. ఆయన పెద్ద తలపాగా నేటికీ నా కళ్ళకి కట్టినట్లే ఉంది. కపర్ది తరవాత స్టేటు కౌన్సిల్ మెంబర్‌కూడా అయ్యాడు. తిలక్ ఉపపాదనకి ఎవ్వరో అడ్డుచెప్పేసరికి సభలో పెద్ద అల్లకల్లోలం ప్రారంభం అయింది. నేనైతే చూడలేదుగాని కపర్దియే తన కాలిజోడు విసిరాడనీ, అది సంకేతంగా గ్రహించి నాగపుర ప్రతినిధులు గలాటా ప్రారంభించారనీ చెప్పుగున్నారు. నాగపురంనించి వచ్చిన ప్రతినిధులు లాఠీకర్రలు పుచ్చుకుని 'తిలక్ మహారాజుకీ జై!' అనుకుంటూ వేదిక మీదికి వురికారు. తరువాత గలాటా పెరిగి, ఉభయపక్షాల వాళ్ళూ కుర్చీలూ, బెంచీలు కూడా చేతబట్టి విజృంభించారు! అనేకమందికి గాయాలు తగిలి రక్తం స్రవించింది. అల్లరి ప్రారంభం అయిన ఒక్క క్షణంలో, పక్కనే కూర్చుని వున్న కృష్ణస్వామయ్యరుగారు లేచి పారిపోయారు. నటేశనుగారు, "కృష్ణసామయ్యేమ ఏమయ్యా?" దని కంగారు పడుతూ నా దగ్గిరికి వచ్చాడు. మనకి యీలాంటి అల్లరులు కొత్తగాదు! కనక నేను అక్కడే నిలబడ్డాను. వేదికమీద వుండే నాయకులంతా ఒక్కొక్కరే దొడ్డివారిని నిష్క్రమించారు. చివరికి ఆ కల్లోలం బాగా పెరిగి ఎవళ్ళమట్టుకి వాళ్ళు ఖాళీచేసి వెళ్ళి పోయారు.

తరవాత ఒకళ్ళమీద ఒకళ్ళు నిందారోపణలు చేసుకున్నారు. వాస్తవానికి ఉభయులు కొంత అల్లరికి సిద్ధపడే వచ్చారని నా అభిప్రాయము. గడబిడ జరిగేముందు తిలక్ పక్షీయుడు ఒకడు మాకు దగ్గిరగా వున్న ఒక అహ్వాన సంఘోద్యోగిని పిలిచి అతనికి ఒక రౌడీని చూపించి ఈ కాంగ్రెస్‌లో ఈ రౌడీకి ఎల్లాగ ప్రవేశం కలిగిందో చెప్పమన్నాడు. అహ్వాన సంఘంలో వున్న ఆ పెద్దమనిషి సరియైన సమాధానం చెప్పలేక నీళ్ళు నమిలాడు. అందుచేతనే ఉభయులూ కూడా దీనికి సంసిద్ధులై వచ్చారని నే ననుకున్నాను.

ఫిరోజిషా మెహతా రాజకీయంలో మితవాదే కాని గొప్ప దేశభక్తుడు. ఇంగ్లీషువాళ్ళు అంటే ఆయనకి చాలా ఆగ్రహం. ఆయన వాళ్ళని చూస్తేనే కటకట పడేవాడు. ఈ అల్లరి అయిన **కొంత**

సేపటికి ఆయన హాలు ఎదుట ఖాళీస్థలంలో కూర్చుని కొంచెం విచార గ్రస్తుడై మిత్రులతో భవిష్యత్తునిగురించి ఆలోచిస్తూ ఉండగా, శ్వేతముఖుడైన ఒక పోలీసు ఉద్యోగి సిబ్బందితో తయారై, ఆయన దగ్గిరికి వచ్చి "ఇక్కడ ఏదో అల్లరి అయిందిట! దాన్ని గురించి ఏమైనా రిపోర్టు ఇస్తారా?" అని అడిగాడు. మెహతా ఆయనకేసి చురచుర చూసి, "ముందు నిన్ను ఇక్కడికి ఎవరు రమ్మన్నారో చెప్పు! ఇది అంతా గృహ కల్లోలమే! ఇక్కడ నీ ప్రసక్తి ఏమీ లేదు," అని చెప్పాడు. దాంతో ఆఫీసరు మెల్లి మెల్లిగా తగ్గి అక్కడి నించి నిష్క్రమించాడు!

ఈ సందర్భంలో మన మద్రాసు నాయకుల సంగతి కొంచెం వ్రాస్తాను. సూరత్ సమావేశంలో అల్లరి జరగడానికి పూర్వం మన దొరస్వామయ్యరుగారూ, చక్రయ్యచెట్టిగారూ గోఖలేమీద ప్రశ్న పరం పరలు కురిపించి కొంత కలవరపరిచారు. అందుచేత వి. కృష్ణస్వామయ్యరు ప్రభృతులకి కష్టం కలిగింది. అందుచేతనే కృష్ణస్వామయ్యరు గారుయస్.శ్రీనివాసయ్యంగారిదగ్గిర అప్రెంటిస్‌గా ఉంటున్న దొరస్వామ య్యరుగారికి సర్టిఫికేటు యివ్వకుండా చేస్తానని బెదిరించడం జరిగింది. ఆ పని జరగలేదు కాని నాయకుల మనోవైఖరి ఎల్లా ఉండేదో చెప్ప డానికి మాత్రమే ఈ సంగతి వ్రాస్తున్నాను. దొరస్వామయ్యరుగారు మంచి ధైర్యశాలి. తను నమ్మిన సిద్ధాంతాలు అంటే మంచి పట్టుదల ఉన్నవాడు. గొప్ప ప్రతిభాశాలి. ఆయన ఈ బెదిరింపులు లక్ష్యపెట్ట లేదు. కాని ఆ కాలంలో మితవాదుల వాక్స్వాతంత్ర్యం అల్లాగే ఉండేది. రాజకీయకారణాలవల్ల జైలుకి వెళ్ళవలసివస్తే సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసైటీలో సభ్యుడుగా ఉండడానికికూడా వీలు లేదంటే, ఇక చెప్పేది ఏమిటి?

సూరత్తులో కాంగ్రెస్ రెండు చీలికలు అయింది. కాంగ్రెసుని చేతుల్లో పెట్టుకున్న మితవాదులు కొన్ని నియమాలు నిర్మించి, అతివా దుల బలం పెరగకుండా కట్టుదిట్టాలు చేశారు.

మరుసటి సంవత్సరం కాంగ్రెసు మద్రాసులో జరిగింది. మళ్ళీ రస్‌విహారీఘోషే అధ్యక్షుడు. అది కేవలం మితవాద మహాసభ. వారు ప్రభుత్వంమాట అల్లా ఉండనిచ్చి, జాతీయవాదులపైన తమ తీవ్ర వాగాటి అంతా వినియోగించారు. 1908 వ సంవత్సరం మొదలు మరి ఏడు, ఎనిమిది సంవత్సరాలు—అంటే లక్నో కాంగ్రెస్‌వరకూ—కాంగ్రెస్సు కేవలం మితవాదులకి రంగస్థలమై ప్రభుత్వాన్ని యాథా లాపంగా విమర్శిస్తూ తీర్మానాలు పాసుచెయ్యడమే కాని, కోట్లకొలదిగా ఉన్న జనసామాన్యాన్ని రాజకీయంగాను, ఆర్థికంగాను అభివృద్ధిలోకి తీసుకుని రావడానికి ఎటువంటి కార్యక్రమమూ ఇవ్వలేకపోయింది. ఇంక స్వరాజ్యకాంక్షమాట వేరే చెప్పవలసింది ఏమిఉంది? మితవాదుల దృష్టి ఎంతసేపూ ఉన్నతోద్యోగాలు, మింటో- మార్లీ సంస్కరణాల వల్ల శాసనసభ్యుల సంఖ్య కొద్దిగా వృద్ధిపొందడము, కొన్ని ప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యత్వాలు దేశీయుల అందుబాటులో ఉండడము మొదలయిన సంస్కరణాలమీదే ప్రసరించింది. అందుచేత కాంగ్రెస్ ఆదర్శం వృద్ధిపొందలేదు. హిందువులైన కాంగ్రెస్ నాయకులు ఈ సంస్థద్వారా ఉద్యోగాలు సంపాదించడం చూచేసరికి ముసల్మానులకి కూడా సహజంగా వాటి విషయమై అభిలాష బయలుదేరడమూ, తద్వారా హిందూ మహమ్మదీయ సమస్యకి పునాదులు పడడమూ జరిగాయి. లక్నో కాంగ్రెస్‌నాటికి మహమ్మదీయుల అంతరంగికాందోళన ఫలించి లక్నో ఒడంబడిక ప్రాప్తించినది. ఆ ఒడంబడికే నేటికీ మనకి అన్ని విధాలా అనర్థదాయకంగానూ, జాతీయాభివృద్ధికి నిరోధకంగానూ, అభేద్యంగానూ ఉన్న హిందూ ముసల్మాను సమస్యకి మూలం అని నా అభిప్రాయము. అందుచేత, అప్పటినించీ కాంగ్రెస్‌కి ఎప్పుడైనా కులాసాగా వెడుతూ ఉండేవాణ్ణి. అంతకంటె ఎక్కువగా కాంగ్రెస్ ఎప్పుడూ నన్ను ఆకర్షించలేకపోయింది. ఆ తరవాత సర్ విలియమ్ వెడ్డర్‌బర్న్ అధ్యక్షత కింద అలహాబాదులో జరిగిన కాంగ్రెస్‌కి హాజరు అయ్యాను. మద్రాసులో జరుగుతూ వచ్చిన కాంగ్రెస్సులకి హాజరైన విషయం వ్రాయనే అక్కర్లేదు.

# బిసెంటమ్మ హోంరూలు ఉద్యమం

**1909** వ సంవత్సరంలో బ్రిటిష్వారిచ్చిన మింటో-మార్లే సంస్కరణాలు 1919 లో తిరిగి సంస్కరింపబడవలసి ఉన్నాయి. అంతేకాక, దేశంలో విప్లవ సంస్థలు, విప్లవ భావాలు వ్యాప్తి చెందుతూ ఉన్నాయి. అందుచేత భారత సమస్య పరిష్కరించ డానికి బ్రిటిష్ మంత్రులు హిందూదేశానికి రావా లని ఉద్దేశించారు. ఈ కాలంలో దేశంలో స్వాతంత్ర్య భావాలు ప్రసరింప జేసిన కీర్తి ముఖ్యంగా బిసెంటమ్మకీ, లోకమాన్యుడికీ దక్కింది.

లోకమాన్యుడు 1914 సంవత్సర ప్రాంతంలోనే మాండలే జైలులో ఆరు సంవత్సరాల శిక్ష అనుభవించి తిరిగి పూనా చేరుకున్నాడు. పశ్చిమ భారత దేశంలో ఆయన, దక్షిణ దేశంలో బిసెంటమ్మ ఏకమై హోంరూలు (స్వపరిపాలన) అనే ఉద్యమం లేవదీశారు. బిసెంటమ్మ వెనకాల దేశంలో అంతటా దివ్యజ్ఞాన సంఘాలు ఉండేవి. ఆ సంఘాల్లో ఉండే వారందరూ సమర్థులు. ఆందోళన శాస్త్రీయ పద్ధతులమీద నడి పించడంలో అందెవేసిన చేతులు. లోకమాన్యుడికి మహారాష్ట్ర దేశం లోనూ, మధ్య రాష్ట్రాలలోనూ బ్రహ్మాండమైన పలుకుబడి ఉండేది. ముందుముందు బిసెంటమ్మ మనరాష్ట్రానికి ప్రత్యేకంగా చేసిన సేవని గురించి వివరిస్తాను.

దేశంలో రాబోయే సంస్కరణాలలో స్వపరిపాలన సిద్ధాంతం పూర్తిగా ప్రవేశ పెట్టడానికి ఆందోళన జరుగుతూ ఉండగా, ఈ జాతీయ ప్రవాహానికి అనేకమైన ఆనకట్టలు బయలుదేరాయి. అందులో ఒకటి హిందూ మహమ్మదీయ సమస్య. రెండవది మద్రాసు రాజధానిలోని బ్రాహ్మణ బ్రాహ్మణేతర సమస్య. పేర్లని బట్టే వాటివాటి ఆదర్శాలు తెలుస్తున్నాయి గదా!

# 24

## అతివాద సంచలనం

కాంగ్రెస్ మితవాదుల నాయకత్వానికి స్వాధీనం అయినప్పటినించీ అది చాలా సాధారణమైన లాంఛన వ్యవహారం అయిపోయింది. మరుసటి సంవత్సరం,—అంటే 1908 వ సంవత్సరంలో—మద్రాసులో సమావేశమైన కాంగ్రెసు కేవలమూ జాతీయవాదం మీదనే దాడి ప్రారంభించింది. ఆ సంవత్సరమే లోకమాన్యుడివంటి మహనీయుణ్ణి రాజద్రోహ నేరానికి కారాగారంలో నిర్బంధించారు. పంజాబులోనూ, వంగదేశంలోనూ కూడా నిర్బంధ చర్యలు జోరుగా సాగాయి. ఆనాటి అమృత బజార్ పత్రిక ప్రభుత్వాగ్రహానికి గురిఅయినా ఎప్పుడూ పక్కలో బల్లెంలా ఉండేది. ఏమైనా మద్రాసులో మాత్రం మితవాదానికే ఎక్కువ ప్రాబల్యమూ, పలుకుబడీ ఉండడంచేత నేను అంతగా రాజకీయాల్లో పాల్గొనలేదు. దేశంలో 1914 వరకూ కూడా మళ్ళీ జాతీయవాదుల బలం కనబడనేలేదు.

1915 లో భారత స్వాతంత్ర్య సమరంలో మళ్ళీ నూతన జాతీయ వికాసం కలిగిందని చెప్పాలి. యూరోపులో యుద్ధం అంటుకుంది. దేశాన్ని రాజభక్తి పరాయణత్వంతో ముంచి తేల్చిన మితవాద నాయకత్వం అంటే అందరికీ విసుగు పుట్టింది. ప్రభుత్వం నిరంకుశత్వమూ, అందులోనూ యుద్ధం రావడంతోటే సైనికులకోసమూ, ధనంకోసమూ అది అవలంబించిన పద్ధతులూ చూస్తే, దేశీయుల్లో బాగా సంక్షోభం కలిగింది. ఇది ఇల్లా ఉండగా ఆరు సంవత్సరాలపాటు కారాగారం అనుభవించిన లోకమాన్యుడు మళ్ళీ దేదీప్యమానమైన ప్రభతో రాజకీయ రంగంలో ప్రవేశించాడు. 1908 వ సంవత్సరంలో ఆయన్ని శిక్షించిననాడు జడ్జీ ఒక అప్రస్తుత ప్రసంగం చేశాడు. దానికి జవాబుగా ఆయన, "నా స్వాతంత్ర్యం కంటె నా నిర్బంధమే మా దేశానికి ఎక్కువగా శ్రేయస్కరం కాగల,"దని అన్నాడు. ఆయన అన్న

మాటలు అక్షరాలా నిజం అయ్యాయి. దేశం ప్రేమించిన మహా త్యాగికి విధించిన ఆరు సంవత్సరాల శిక్ష, ఎవరి హృదయాన్ని ఆందోళన పరచదు! ఇలాంటి స్థితిగతుల్లో అంతకు ముందు సాంఘిక మత విషయాల్లో మాత్రమే పనిచేస్తూ, దివ్యజ్ఞాన సమాజానికి అధ్యక్షురాలై ఉన్న బిసెంటమ్మకూడా రాజకీయ రంగంలోకి ఉరికింది. అంతవరకూ ఆమె మత సంబంధమైన గొడవల్లోనే మునిగి ఉండేది. ఆమెకు సహజంగా ఉండిన వాగ్ధోరణీ, నిర్మాణపు నైపుణ్యమూ, రాళ్ళని సహితం చలింపజేసి ఉత్తేజం కలగచేసే శక్తి రాజకీయ రంగంలో ప్రవేశించాయి. దాంతో మద్రాసులోనే కాకుండా దేశమంతటా కొంత సంచలనం ప్రారంభం అయింది. ఆమె 'న్యూ ఇండియా' అనే పేరుతో దైనిక, వారపత్రికలు నడిపిస్తూ వాటిల్లో చాలా ఉత్తేజకరా లయిన వ్యాసాలు వ్రాసేది.

లోకమాన్యుడు జైలునుంచి తిరిగి రాగానే భవిష్యత్కార్యక్రమాన్ని గురించి యోచించి దేశంలో తీవ్రమైన రాజకీయాందోళనం సాగించడానికి ఒక రాజకీయ సంస్థ నిర్మించాడు. అదే హోంరూలు లీగు. తరవాత కొంతకాలానికి మద్రాసులో బిసెంటమ్మ గోఖలే హాలులో ఒక సమావేశం ఏర్పాటుచేసి, అక్కడ అఖిల భారత హోంరూలు లీగు స్థాపించింది. బిసెంటమ్మకి శక్తి సామర్థ్యాలతోపాటు అధికారం చలాయించే అలవాటు కూడా ఎక్కువ. అందుచేత ఆమె ఒక పట్టున ఇతర నాయకుల వెనక ఉండిగాని, కలిసిగాని పని చెయ్యలేక పోయేద్ది. ఏమైనా, ఈ అఖిల భారత హోంరూలు లీగు స్థాపనవల్ల రాజకీయంగా ఒక గొప్ప చైతన్యం కలిగింది. హైకోర్టు జడ్జీపని చేసి పింఛన్ పుచ్చుకున్న సర్ సుబ్రహ్మణ్యయ్యరు ప్రభృతులు ఈ సంస్థలో చేరారు. దేశంలో ఉన్న దివ్యజ్ఞాన సమాజాలు అన్నీ రాజకీయాల్లో ప్రవేశించాయి. దాంతో తీవ్రమైన జాతీయవాదం విజృంభించింది. ఇంక మితవాదులకి పట్టుగొమ్మ అయిన గోఖలే మహాశయుడు ఆ సంవత్స

రంలోనే స్వర్గస్థుడు అయ్యాడు. క్రమంగా మితవాదుల పలుకుబడి జీర్ణించింది.

బిసెంటమ్మ ఆందోళన నన్ను బాగా ఆకర్షించింది. నేను అరండేలు, వాడియాల మోస్తరుగా ఆమె అంతరంగికుల్లోగాని, సి.పి. రామస్వామి అయ్యరుగారివంటి అభిమానుల వర్గంలో కాని ఎప్పుడూ చేర లేదు. అసలు అల్లాగ చేరడానికి సంకల్పించుకునే మన స్తత్వమే లేదు. అంతకు పూర్వం మితవాదుల కాంగ్రెస్ నడిచే రోజుల్లో హిందూ పత్రిక సంపాదకులుగా ఉండి అనేక కష్టనిష్ఠురాలకి లోనైన డి. సుబ్ర హ్మణ్యయ్యరుగారితో నేనప్పుడప్పుడు ఇష్టాగోష్ఠి జరుపుతూ ఉండే వాణ్ణి. ఆయనకి ఆఖరు రోజులలో ఆరోగ్యం పాడయింది. కాని, నిష్కళంకమైన జాతీయవాది అవడంచేత ఎప్పుడూ ఆ ఆలోచనలోనే ఉండేవాడు. ఆయనే తరుచు నాతో నాయకుల ఆదర్శాలూ, చిత్త వృత్తులూ ఒక విధంగానూ, ప్రజల అవసరాలూ, ఆశయాలూ మరి ఒక విధంగానూ నడుస్తూ ఉన్నాయి అని అంటూ వచ్చేవాడు. బిసెంటమ్మ ప్రవేశంతో నాయకుల చిత్తవృత్తి కొంచెం ప్రజల వైపుకి మారిం దని చెప్పాలి.

బొంబాయి రాష్ట్రంలో లోకమాన్యుడి ఆందోళనా, మద్రాసులో బిసెంటమ్మ కలిగించిన సంచలనమూ, యుద్ధ తీవ్రతా, ఆ సందర్భంలో బ్రిటిష్ పాలకులు చూపిన నిరంకుశత్వమూ కలిపి జాతీయోద్వేగానికి కారణాలయ్యాయి. మితవాదులకి పట్టుగొమ్మ అయిన గోఖలే మరణంతో వాళ్ల పలుకుబడి కూడా క్షీణించింది. ఇంతే కాకుండా, రాజకీయ సంస్కరణలు కొన్ని వస్తాయనీ, అందునిమిత్తమై మాంటేగ్ ఈదేశం వస్తాడనీ బాగా వార్తలు వ్యాపించి ఉండడంచేత కూడా రాజకీయ వాతా వరణంలో వేడి తీవ్రం అయింది.

లోకమాన్యుడు కారాగారంనించి రావడంతోనే దేశంలోని ప్రముఖులు కొందరు కాంగ్రెసు అతివాద, మితవాద కక్షలుగా చీలడం

దేశానికి క్షేమం కాదని రాజీ చెయ్యడానికి ప్రయత్నించారు. కాని, సాగలేదు. చివరికి గోఖలే అనంతరం ఈ ప్రయత్నం కొంతవరకు సాగి లోకమాన్యతిలక్ ప్రభృతులు కాంగ్రెస్‌లోకి రావడానికి అవకాశం ఏర్పడింది. 1919 వ సంవత్సరంలో లక్నోలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో ఈ పునస్సమ్మేళనం జరిగింది. కాంగ్రెస్ చరిత్రలో ఇది ఒక మహాఘట్టం. నేను మహమ్మదీయుల ఆందోళనను గురించి ఇదివరకే వ్రాశాను. మహమ్మదీయులు ఆనాటి కాంగ్రెస్ రాజకీయాలద్వారా ప్రభుత్వ ప్రాపకం పొందుతూ వచ్చిన హిందువులకి పోటీగా ప్రత్యేక ఎన్నికస్థానాలూ, ప్రత్యేకోద్యోగాలూ కావాలని ఆందోళన ప్రారంభించారు. 1919 లో ముస్లింలీగుకీ, కాంగ్రెస్సుకీ ఒక రాజీ జరిగింది. లోకమాన్యుడు మహమ్మదీయులకి ప్రత్యేక నియోజకవర్గాలు కావాలని అన్నాడు. తాత్కాలికంగా హిందూ ముసల్మానులకి ఈరాజీ జరిగినప్పటికీ దూరదృష్టితో చూస్తే యీ రాజీయే మన రాజకీయమైన అనైకమత్యానికీ, పతనానికీ మూలకారణం అయిందని నా అభిప్రాయము. మనల్ని నేటివరకూ హింస పెడుతూన్న ప్రత్యేక నియోజకవర్గాల సిద్ధాంతాన్ని ఆనాడు కాంగ్రెస్ అంగీకరించడంవల్లనే ఆ సిద్ధాంతం తాడుబారింది.

అప్పటికప్పుడే భారత ప్రభుత్వం దేశంలోని రాజకీయాందోళకుల పోకడలు గమనించి, కొన్ని సంస్కరణలు ఇవ్వడంకోసం ఒక ప్రణాళిక తయారుచేసింది. కాంగ్రెస్సూ, లీగూ ఏకం అయి దానికి బదులుగా ఒక సంస్కరణ ప్రణాళిక తయారుచేసి పంపించారు. రాజకీయాల్లో అదే కాంగ్రెస్ లీగు ప్రణాళికగా ప్రసిద్ధిపొందింది. నేడు ఆ ప్రణాళిక చదివితే యీ నాటి స్వాతంత్ర్యాశయాలకి అవి ఎంతగా కొరవడి ఉందో వేరుగా చెప్పక్కరలేదు. కాని, అక్కడికే ఆ సంస్కరణలు చాల తీవ్రమైనవీ, అసంభవమైనవీ అని చెప్పి తోసివేశారు.

జాతీయవాదుల పలుకుబడి హెచ్చుపడంతో దేశంలో కలిగిన సంచలనం నన్ను ఆకర్షించింది. నేనుకూడా బిసెంటమ్మ హోంరూలు

లీగులో చేరాను. ఆరోజుల్లో గోఖలేహాలులో జరిగే సభలకి హాజరై పాల్గొంటూ ఉండేవాణ్ణి.

1917 వ సంవత్సరంలో రాజకీయాందోళన మరింత తీవ్రం అయింది. ముఖ్యంగా బిసెంటు న్యూ ఇండియా పత్రిక ద్వారా మద్రాసురాష్ట్రంలో ఆందోళన మరింత తీవ్రరూపం ధరించింది. యీ ఆందోళన పర్యవసానంగా దేశంలో అంతటా నిర్బంధ విధానం తాండవించింది. చివరికి, బిసెంటమ్మ ముఖ్యశిష్యులైన అరండేలు, వాడియా గార్లని 1917 జూన్ 15 తేదీని ఉదకమండలంలోనూ, కోయంబత్తూరులోనూ నిర్బంధించారు. రాజకీయాందోళనకి ఎప్పుడూ నిర్బంధ విధానమే గొప్ప సహాయకారి, మహత్తరమైన దోహదం! అందుచేత ఈ నిర్బంధాలు మరింత ఆందోళనకీ, సంచలనాలకీ కారణం అయ్యాయి. మళ్ళీ రాజకీయరంగంలో కొత్త కొత్త తారలు కనిపించాయి. నా మిత్రుడు సి. పి. రామస్వామయ్యరు ఆ వర్గంలోవాడు. బిసెంటమ్మ రాకతో ఆయనకూడా కాంగ్రెస్‌లో ప్రముఖస్థానం ఆక్రమించాడు.

ఆమె ఆందోళనసందర్భంలోనే సాత్విక నిరోధం అనే సాధనంతో ప్రభుత్వ నిరంకుశత్వాన్ని ఎదుర్కొనాలి అనే భావం ప్రచారం అయింది. మద్రాసురాష్ట్ర కాంగ్రెసు సంఘంవారు సాత్వికనిరోధ కార్యక్రమం ఆమోదించి ఒక ప్రమాణంమీద దస్కత్తులు చేయించారు. ఆ ప్రమాణాలమీద దస్కత్తులు చేసినవాళ్ళలో సర్ యస్. సుబ్రహ్మణ్యయ్యరుగారు, సి. పి. రామస్వామయ్యరుగారు, కస్తూరి రంగయ్యంగారు మొదలైన ప్రముఖులు చాలామంది ఉన్నారు. కాని, నాకు మాత్రం ఎందుచేతనో ఆ కార్యక్రమం జరుగుతుందనే నమ్మకం కలగలేదు. ఆ ప్రమాణపత్రంమీద నేను దస్కతు చెయ్యలేదు. తరవాత 1916 లో గాంధీజీ సత్యాగ్రహ ప్రమాణాలు చేయించినప్పుడు దస్కతుపెట్టాను. నాకు బిసెంటు ఆధ్వర్యంకింద జరిగిన వ్యవహారంలో పని జరిగే ధోరణి కనిపించలేదు.

మొత్తంమీద దేశంలో ప్రస్ఫుటంగా పెరుగుతూ ఉన్న తీవ్రరాజకీయాందోళన ప్రభుత్వానికి కొంత కంగారు పుట్టించింది. లండన్ ఢిల్లీల మధ్య బోలెడు గ్రంథం నడిచింది. ఇండియామంత్రి మాంటేగ్ ఆగస్టు 20 తేదీని ప్రఖ్యాతమైన తన ప్రకటన వెల్లడించాడు. అందులో బ్రిటిషువారు ఇండియాకి క్రమంగా బాధ్యతాయుత ప్రభుత్వం ఇవ్వడానికే సంకల్పించారనీ, పార్లమెంటు ఎదట పెట్టబోయే సూచనలు చర్చించడానికి ప్రజలకి అవకాశం ఇస్తారనీ ప్రకటించాడు. అన్నింటికన్నా ముఖ్యం అయినది అతను ఈ దేశానికి వచ్చి ప్రముఖుల అభిప్రాయాలు తెలుసుకుంటానని కావించిన ప్రకటన. ఈ ప్రకటనతోపాటు సెప్టెంబరు 16 వ తేదీని బిసెంటు ప్రభృతుల్ని కూడా విడుదలచేశారు.

మాంటేగ్ రాక రాజకీయ సంస్థల్లో ఎక్కడాలేని సంచలనమూ కలిగించింది. కాంగ్రెస్ తాత్కాలికంగా సంకల్పించిన సాత్విక నిరోధ సంకల్పం ఉపసంహరించుకుంది. నిర్బంధంనించి వచ్చిన బిసెంటమ్మ దాని ప్రసక్తి విడిచిపెట్టింది. దేశంలోని ఇతర రాజకీయసంస్థలు రాజ్యాంగ ప్రణాళికలు తయారుచెయ్యడంలో మునిగిపోయాయి. అదివరకులేని అనేక కొత్త సంఘాలు కూడా బయలుదేరాయి. ఈ కొత్త సంఘాలలో మనరాష్ట్రానికి ముఖ్యమైనది బ్రాహ్మణేతర మహాసభ.

బ్రాహ్మణేతర పక్షానికి ప్రధాననాయకుడు డాక్టరు టి. యం. నాయరు. ఆయన చాలా సరసుడు. ట్రిప్లికేనుడివిజనుకి కార్పొరేషను సభ్యుడు. ఆయన ప్రజల ఆరోగ్యవిషయాల్లో ఎక్కువగా శ్రద్ధ వహిస్తూ ఉండేవాడు. తిరువళిక్కేణి డివిజన్‌లోని చెరువుల్లో బట్టలు ఉతికి అనారోగ్యం కలిగించడంచేత ఆయన పైపనులు నిషేధిస్తూ ఉత్తరువులు జారీ చేశాడు. దాంతో ట్రిప్లికేనులోని అయ్యర్లు, అయ్యంగార్లు ఆయనమీద కక్షకట్టి మరుసటి కార్పొరేషన్ ఎన్నికలలో ఆయన్ని ఓడించారు.

ఆ తరవాతే, ఆయన బ్రాహ్మణేతరపక్షానికి నాయకుడు

అయ్యాడు. ఇతర బ్రాహ్మణేతర నాయకుల్లో చాలామంది కాంగ్రెస్ అభిమానులే. అంతకుపూర్వం కాంగ్రెస్సు నాయకుల రాజకీయ జీవితానికి ఒక మెట్టుగా ఉండేది. ఇల్లా మెట్లెక్కినవారిలో ఎక్కువమంది అయ్యర్లు, అయ్యంగార్లే. అందుచేత ఈ బ్రాహ్మణేతరోద్యమం ప్రారంభం అయింది. దానికి బ్రాహ్మణులైన కొందరు రాజనీతిజ్ఞుల సంకుచితదృష్టికూడా సహాయపడింది. మాటవరసకి వ్రాస్తున్నాను. బ్రాహ్మణేతర నాయకులు ప్రత్యేక నియోజక వర్గాలు కోరారు. నూటికి 97 గురు ఉన్న బ్రాహ్మణేతరులు ప్రత్యేక నియోజకవర్గాలు కోరుకోవడమే ఒక అవ్యక్తపు పని! దాన్ని ప్రతిఘటించిన రామచంద్రరావు పంతులు, కస్తూరి రంగయ్యగార్లు ఆ పక్షపు ఆవశ్యకత సమర్థించిన వాళ్ళు అయ్యారు.

# 25

## కలకత్తా కాంగ్రెస్ (1917)

కలకత్తాలో 1917 లో బిసెంటమ్మ అధ్యక్షతకింద జరిగిన కాంగ్రెస్‌కి నేనూ హాజరు అయ్యాను. ఆ సంవత్సరంలో బిసెంటమ్మ చేసిన ఆందోళనా, తత్ఫలితంగా ఆమెకి ఇచ్చిన మన్నింపూ ఏకమై ప్రజలలో ఆమెకి ఉన్న పలుకుబడి బాగా వృద్ధి చేశాయి. తత్ఫలితంగా ప్రజల చేతిలో ఉన్న మహత్తర పదవి అయిన కాంగ్రెస్ అధ్యక్షత ఆమెకి లభించింది. బిసెంటమ్మ రాజకీయ తీవ్రత ఆమె విడుదలతోనే కొంచెం మార్పు చెందిందని అనేవారు. తరవాత విషయాలని బట్టి చూస్తే ఆ సంగతి నిర్ధారణ అయింది.

చిత్తరంజన్‌దాస్ కలకత్తా కాంగ్రెసునాటికి బాగా రాజకీయాల్లో ప్రవేశించాడు. యువకుల్లో ఆయనకి బాగా పలుకుబడి ఉండేది. అంత

వరకూ విఖ్యాతి వహించిన సురేంద్రనాథ్ బెనర్జీ మెల్లిగా వెనకబడ్డం ప్రారంభించాడు. కలకత్తాలో జాతీ యోద్వేగమే బాగా ప్రస్ఫుటం అయింది. ఆనాడు లోకమాన్యుడికి జరిగిన సమ్మానం కాంగ్రెస్ చరిత్రలో అపూర్వమైనది. జాతీయవాంఛ అయిన స్వరాజ్యంకోసం ప్రజలలో ఆవేశం ఎంత హెచ్చయిందంటే—ఆ సమయంలో మిత వాద ప్రముఖుడై, బెంగాలులో ఒకప్పుడు అడ్డులేని నాయకత్వం వహించిన సురేంద్రనాథ బెనర్జీ మాట వినేవాళ్ళు కూడా లేకపోయారు.

కలకత్తా మహాసభకి మోహన్‌దాస్ గాంధీ హాజరు అయ్యాడు. దక్షిణాఫ్రికా సత్యాగ్రహ విజయానంతరం గాంధీ స్మట్సు రాజీ అయిన తరవాత, గాంధీ విజేత అయి ఈ దేశానికి వచ్చాడు. ఆయన లక్నో కాంగ్రెస్‌లో ఏ ప్రముఖస్థానమూ ఆక్రమించలేదు. విషయనిర్ధారణ సభా సభ్యత్వానికి జరిగిన పోటీలో ఓడిపోయినా, లోకమాన్యుడు ఆయన్ని గెల్పించాడు. ఆయన కలకత్తాలో గుడ్డ బొందుల చొక్కా వేసుకుని, ఫక్తు గుజరాతీ తలపాగాతో వేదికమీద కూర్చున్నాడు. అంతకుపూర్వం వెస్టు మినిష్టరు పాలెస్ హోటల్లో ఆయన్ని చూసిన నాకు ఈ అవతారం ఆశ్చర్యం కలిగించింది. ఆయన కప్పటికి ఉపన్యాస ధోరణి కూడా బాగా లేదు. నెమ్మదిగా వినిపించీ వినిపించనట్లు మాట్లాడేవాడు. రాజ కీయాల్లో అహింసా సత్యాగ్రహ సిద్ధాంతాల్ని గురించి అపూర్వమైన ప్రచారం ప్రారంభించినా, వంగదేశంలోని విప్లవవాదులు మహత్తర మైన దేశభక్తులే అనీ, కాని వారి దేశభక్తి వక్రమార్గం పట్టిందనీ బహిరంగంగా చాటగలిగాడు.

అందుచేతనే బిసెంటు ప్రభృతులికి కొంత ఆగ్రహం కూడా వచ్చింది. ఆయన అప్పటినించే భారత రాజకీయాల్లో కాలు నిలవ దొక్కుకోడానికి ప్రారంభించాడు. కాని, ఆయన అచిరకాలంలోనే దేశంలో ఇంత ఆవేశం రేకెత్తిస్తాడనిగాని, వేలకివేల ప్రజల్ని ఈ మహా యజ్ఞంలో ఆహుతి చేయగలుగుతాడని ఎవరూ అనుకోలేదు. గుజరాతులోనూ, బీహారులోనూ ఆయన ధైర్యం వహించి నడిపించిన

సత్యాగ్రహపోరాటాలు సుప్రసిద్ధాలే! ఆ విజయాలు కూడా ఆయనకి తోడ్పడ్డాయి. ఎంతయినా ఆర్భాటంలేని మనిషి అవడంచేత, ఆయన వచ్చిందీ, పోయిందీ కూడా ఎవరూ కనిపెట్టలేక పోయేవారు.

నా మిత్రుడు దేశబంధుదాసు సంగతి కొద్దిగా ఇదివరకు వ్రాశాను. ఆయన లక్షలు ఆర్జించి, వెచ్చించి, బాగా పలుకుబడి సంపాదించాడు. ఆయన జీవితపద్ధతి అంతా పూర్తిగా ఆంగ్లానుకరణంగా ఉండేది. బిసెంటు తన అధ్యక్షోపన్యాసంలో, "మీరు నన్ను సైన్యాధిపతిగా ఎన్ను కున్నారు కనక, నా ఆజ్ఞలు శిరసావహించవలసిందే!" అని గర్జించింది. ఆ మాటలకి దాసు, బిపిన్‌చంద్రపాలూ కూడా కొంచెం కటకటపడ్డారు. దాసు నాతో "చూడండి! ఆమె అహంకారం! ప్రజాస్వామికసంఘంలో ఇదివరకు ఎవరు ఇల్లాగ అనగలిగారు!" అన్నాడు. నేను "ఆమె మన దగ్గరనించి అట్టి శిక్షణ ఆశించడంలో తప్పేమిటి?" అన్నాను. కాని, దాసు ఆ అధికారపు అభిప్రాయానికి హర్షించలేదు. దానికి కారణాలని గురించి తర్జనభర్జన చెయ్యడంకంటె, ఆయన మన స్తత్వం అల్లాంటిది అని అనుకోవడం మంచిది. అంతేకాదు; నాయకత్వం కోసం అంచనాలు వేసే నాయకుల మన స్తత్వాలు అల్లాగే ఉంటాయి. అందులో అంతగా వైపరీత్యం కూడా లేదు. ఏ వృత్తిలోనైనా పోటీ చెయ్యడంకోసం ఎత్తుపై ఎత్తులు వెయ్యడం చూస్తూనే ఉన్నాంగదా! అది రాజకీయాల్లో మరీ ఎక్కువ. మహా నాయకులైనవారు ఆ సుడిగుండంలో పడిపోయి నప్పుడు చూడడంలో మరీ విశేషం ఉంది!

# 26

## స్వరాజ్య పత్రిక

'స్వరాజ్య' పత్రిక 1921 వ సంవత్సరం అక్టోబరు 29 వ తారీఖుని ప్రారంభించబడింది. మొదటి సంచిక ఆ రోజుననే బయలు దేరింది.

నాగపూరు కాంగ్రెసులో సహాయ నిరాకరణోద్యమం అవలంబించి కోర్టులూ, స్కూళ్ళు, శాసనసభలూ బహిష్కరించవలసినదనీ, నిర్మాణకార్యక్రమం ఒక్క సంవత్సరం పూర్తిగా దేశంలో అంతటా సాగించి జయప్రదం చేయవలెననీ, తిలక్ స్వరాజ్యనిధి పేరుతో సంవత్సరంలోగా కోటిరూపాయలు వసూలు చెయ్యవలసిందనీ, దేశం అంతటా 20 లక్షల రాట్నాలు ప్రవేశపెట్టి నూలు వడికేటట్టు చెయ్యవలసిందనీ తీర్మానించబడింది. నిర్మాణకార్యక్రమంలో 1. జాతీయపాఠశాలలు, 2. ఎక్కడతగువులు అక్కడనే పంచాయతీకోర్టులద్వారా పరిష్కారం చెయ్యడం, 3. ప్రభుత్వంమాదిరిగా కాంగ్రెసు నడిపించడం, 4. నియమాల ప్రకారం రాష్ట్రీయ కాంగ్రెస్ కమిటీలు, జిల్లా కాంగ్రెస్ కమిటీలు, తాలూకా కాంగ్రెసు కమిటీలు, గ్రామ కాంగ్రెసు కమిటీలు స్థాపన చేసి కాంగ్రెసు ప్రభుత్వం నడిపించడం మొదలయినవి ఉన్నాయి. నాగపూరు కాంగ్రెసు తరవాత 1921 వ సంవత్సరంలో బెజవాడలో అఖిలభారత కాంగ్రెసు కమిటీ సమావేశమై పైన చెప్పిన నిర్మాణ కార్యక్రమం విషయమై త్రివిధ బహిష్కారాలమీద తీర్మానాలు చేసి, దేశంలోని ప్రజలకి కాంగ్రెసు నిర్ణయించిన ప్రకారం కార్యక్రమం జరపవలసినదని ఆజ్ఞాపించింది. ఇది చాలా గొప్ప కార్యక్రమం. అదివరకు 30 సంవత్సరాలనించి, కాంగ్రెసు మహాసభ పనిచేస్తూ ఉన్నప్పటికీ, ఇల్లాంటి కాంగ్రెసు నియమావళికింద 1921 వ సంవత్సరం వరకు పనిచెయ్యలేదు.

నిర్మాణ కార్యక్రమం ఇప్పుడు ఏర్పరచబడిన పద్ధతిమీద అదివరకు ఎప్పుడూ ఏర్పరచలేదు. ఆంధ్ర రాష్ట్రము, తమిళ రాష్ట్రము, మళయాళ రాష్ట్రము, కన్నడ రాష్ట్రము మొదలయిన భాషాప్రయుక్త రాష్ట్రాలుగా విభజనచెయ్యడం కూడా నాగపూరు కాంగ్రెసులోనేజరిగింది.

మద్రాసు నగరము తెలుగు నగరము. ఇది చంద్రగిరిరాజు పరిపాలనలో ఉండేది. ఈ చంద్రగిరిరాజే దీనిని బ్రిటిష్‌వారికి స్వాధీనం చేశాడు. బ్రిటిష్‌వారికి స్వాధీన మైనప్పుడు తెలుగు జిల్లాలలో ఉండే

వర్తకులు చాలామంది చెన్న నగరానికి వచ్చి, ఇక్కడనే వ్యాపారం చేసుకుంటూ ఉండేవారు. అందుచేత చెన్ననగరం ఆంధ్రనగరం అని చెప్పడానికి ఎల్లాంటి సందేహమూ లేదు. ఆ కారణం చేతనే చెన్న నగరంలో ఏర్పబడిన కాంగ్రెసు కూడా ఆంధ్ర రాష్ట్రంలో చేర్చబడింది. 1921 వ సంవత్సరంలో నాగపూరు కాంగ్రెసులో దేశమంతా 21 రాష్ట్రాలకింద విభజన కాక పూర్వం చెన్న నగరం ప్రత్యేకంగా తమిళు లది అని కాని, తెలుగువారిది అనికాని, మళయాళపువారిది అని కాని, కన్నడపువారిది అనికాని చెప్పడానికీ, అనుకోడానికీ కూడా అవకాశం లేకుండా ఉండేది. ఇది ఇంగ్లీషువారి చేతుల్లోకి రాకపూర్వం చెన్న నగరపు చరిత్ర. ఇది ఇల్లాంటిది అని ఎవరూ అనుకోకుండానే అరవలు, తెలుగువారు, మళయాళపువారు, గుజరాతీలు అందరూ కూడా ఇక్కడ ప్రవేశించి వర్తకం చేస్తూ ఉద్యోగాలు సంపాదించుకుని, ఇంకా ఇతర మైన వృత్తులుకూడా చేసుకుంటూ ఉండేవారు. మద్రాసులో హైకోర్టు ఉండడంవల్ల లాయర్లు అన్ని భాషా రాష్ట్రాలనించీ ఇక్కడికి వచ్చి, ప్రాక్టీసు చేసుకుంటూ ఉండేవారు. నా చిన్నతనంలోనే మద్రాసు లా కాలేజీలో చదవడమూ, ప్లీడరీ పరీక్ష పాసుకావడమూ, తరవాత రాజ మహేంద్రవరంలో ప్రాక్టీసు చెయ్యడమూ మొదలయిన వాటినిగురించి ఇదివరకే వ్రాశాను. 9, 10 సంవత్సరాలు రాజమహేంద్రవరంలో ప్రాక్టీసు చేసిన తరవాత 1903 వ సంవత్సరం అక్టోబరునెలలో ఇంగ్లండు వెళ్ళడమూ, అక్కడ బారిష్టరు పాసైన తరవాత 1909 వ సంవత్సరం ఆఖరులో మద్రాసు హైకోర్టులో ప్రాక్టీసు ప్రారంభించ డమూ, 14, 15 సంవత్సరాలు ప్రాక్టీసు చేసిన తరవాత 1921 వ సంవ త్సరంలో కాంగ్రెసు ఉత్తరువు ప్రకారం న్యాయవాదవృత్తి వదలి వేయడమూ కూడా ఇదివరకే వ్రాశాను. స్వరాజ్య పత్రిక ప్రారంభించక పూర్వం మద్రాసులో నేను ఎంతకాలంనించి ఉన్నాను అనే విషయాలు చెప్పడానికి ఇవి మళ్ళీ వ్రాశాను. 1917 వ సంవత్సరం మొదలుకుని 1921 వ సంవత్సరంలో బారిష్టరు వృత్తి విడిచిపెట్టేవరకూ, హైకోర్టు

లోను, రాజధానిలోను ఉండే జిల్లా కోర్టులలోను ఎక్కువ ప్రాక్టీసు సంపాదించి పనిచేస్తూ ఉండేసంగతి కూడా వ్రాశాను. నేను న్యాయవాదుల్లో ఎక్కువ డబ్బు సంపాదించి జయప్రదంగా న్యాయవాద వృత్తి నడిపిస్తూ ఉండే ప్రధాన న్యాయవాదుల్లో ఒకణ్ణిగా ఉండేవాణ్ణి. నెల ఒకటికి ఆరు, ఏడువేల రూపాయలు ఆర్జన చేస్తూ ఉన్న సంగతికూడా వ్రాశాను.

కలకత్తాలో న్యాయవాదిగా ఉన్న సి. ఆర్. దాసు, నేను చాలా సంవత్సరాలనించి స్నేహంగా ఉండేవాళ్ళం. ఆయన న్యాయవాదవృత్తి వదలివేసినప్పుడే పండిత మోతీలాలు నెహ్రూకూడా దేశంలోని న్యాయవాదుల్లో ముఖ్యుడుగా ఉండి, చాలా ధనం ఆర్జిస్తూ ఉండేవాడు. ఆయన్నికూడా నేను బాగా ఎరుగుదును. వీరిద్దరూ కాంగ్రెసు ఉత్తరువు ప్రకారం న్యాయవాద వృత్తులు ఒదిలివేశామని ప్రకటించిన తరవాత, నేను మద్రాసు నగరంలో ఉండే న్యాయవాదుల్లో మొట్టమొదట న్యాయవాదవృత్తి విడిచిపెట్టి వేశాను.

అప్పటికి మద్రాసు నగరంలో రాజకీయాలు కేవలం మితవాదుల నాయకత్వంకింద నడపబడుతూఉండేవి. నాకు లాకాలేజీలో ప్రొఫెసరుగా ఉన్న వి. కృష్ణస్వామయ్యరుగారు హైకోర్టున్యాయ వాదవృత్తిలో అగ్రగణ్యులుగా ఉంటూ మద్రాసులో కాంగ్రెసునాయకులుగా ఉండేవారు. 1907 వ సంవత్సరంలో జరిగిన సూరతుకాంగ్రెసులో మితవాదులకీ, అతివాదులకీ తగువులు వచ్చి కాంగ్రెసు విచ్ఛిన్నం కావడమూ, తలకాయలు బద్దలుకావడమూ, కాంగ్రెసుసభ చెల్లాచెదరు అవడమూ మొదలయిన వాటిని గురించి ఇదివరకు సవిస్తరంగా వ్రాశాను.

ఆ సూరత్‌కాంగ్రెసు సమయంలో కూడా కృష్ణస్వామయ్యరుగారే నాయకులుగా ఉండేవారు. వారి శిష్యులు, స్నేహితులు అందరూ మితవాదులే అయి, నాయకత్వం వహించి కాంగ్రెసు ప్రతినిధులుగా ఉంటూ పనిచేస్తూ ఉండేవారు. ఈ కారణంచేత మద్రాసు నగరం జాతీ

యత అంటే ఏమిటో, నిజం అయిన ప్రజాస్వాతంత్ర్యం అంటే ఏమిటో, త్యాగం అంటే ఏమిటో ఎరగనట్టి పరిస్థితుల్లో ఉండేది. మద్రాసు నగరంలో ఉన్న పత్రిక లన్నీ మితవాద పత్రికలే. అవి ప్రభుత్వాన్ని బలపరుస్తూ ఉండడమేగాని, ప్రజాస్వాతంత్ర్యమూ, జాతీయతా, త్యాగమూ మొదలైన వాటిని గురించి వ్రాయడానికి జడుస్తూఉండేవి.

మదరాసు బీచిలో జరిగిన పెద్ద బహిరంగ సభలో కాంగ్రెసు ఆదేశానుసారంగా నేను న్యాయవాదవృత్తి వదలివేశానని చెప్పినసంగతి మద్రాసు పత్రికల్లో ఎక్కడో మారుమూలగా చిన్న అక్షరాలలోవేశారు. ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వక పోవడానికి వాళ్ళ మనస్సుకి నూతన కార్యక్రమంలో నమ్మకం లేకపోవడం ఒక కారణము. అల్లాంటి సంగతులకి ప్రాముఖ్యం ఇస్తే ప్రభుత్వం ఏమి చేస్తుందో అనే భయం ఒకటి. అందుచేత, నాకు ఈ స్వల్ప వ్యవహారంలోనే ఈ పత్రికలకి ఇంత భయం ఉంటే, ముందు రాబోయే కార్యక్రమాన్ని గురించి ప్రకటించడానికి వాటికి ఏ మాత్రమూ సాహసం ఉండదనీ, పత్రిక సహాయం లేనిదే ఇంతటి మహోద్యమం ఈ రాజధాని అంతటిమీదా నడిపించడం చాలా కష్టమనీ తోచింది.

అదివరకు మద్రాసు రాజధాని మితవాత నాయకత్వంలో ఉన్నప్పటికీ నూతన కార్యక్రమానికి సంసిద్ధులు అయినవారు లేరని ఎంత మాత్రమూ అనుకోడానికి వీలులేదు. కాంగ్రెసు నూతన కార్యక్రమం వెల్లడికావడంతోనే లోపల అంత వరకూ దాగి ఉన్న దేశభక్తి, త్యాగబుద్ధి మొదలైనవి మనుష్యులలోనించి బయటికీ రావడం సహజము. అందుచేత, మద్రాసులో నూతన కార్యక్రమం జరపడానికి ఎవరు సంసిద్ధులు? అనే విషయం తెలుసుకోవడానికి కూడా వెంటనే అవకాశం కలిగింది. మొట్టమొదటి పిలుపులో మద్రాసు లాయర్లలో ఎక్కువమంది ఇవతలికి రాకపోయినా, నేను ప్రచురణ చేసిన తరవాత నగరంలో అనేకమంది వారి వృత్తులు ఒదులుకున్నారు.

నగరంలో న్యాయవాదవృత్తి వదిలినవారిలో టి. వి. వెంకట్రామయ్యరు అనే స్నేహితుడు కూడా ఒకడు. రాజగోపాలాచారిగారు కూడా అప్పుడే వారి న్యాయవాదవృత్తి వదులుకున్నారు. రాజగోపాలాచారిగారిని నేను మొట్టమొదట కలుసుకోవడమూ, ఆయనతో స్నేహం చెయ్యడమూ, కలిసి పనిచెయ్యడమూ, మొదలయినవి అన్నీ కూడా 1920, 21 సంవత్సరాలలోనే జరిగాయి. రాజగోపాలాచారిగారు గాంధీగారికి మొదటి శిష్యులుగా చేరిన కొద్దిమందిలో ఒకరు. ఆయన సేలంలో ప్రాక్టీసుచేస్తూ ఉండి, ఈ ఉద్యమం ప్రారంభించడానికి పూర్వం కొద్దికాలం కిందటే న్యాయవాదవృత్తికోసం మదరాసు వచ్చారు. రాజగోపాలచారిగారు, నేను, టి. వి. వెంకట్రామయ్యగారు, వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రిగారు కలిసి కాంగ్రెసు ఉద్యమం బలపరచడానికి ఒక దినపత్రిక స్థాపిస్తే తప్ప ముందు కార్యక్రమం నడపడం కష్టతరం అవుతుందని ఆలోచించాము.

అందుచేత ఇంగ్లీషులోనూ, క్రమంగా తెలుగులోనూ, అరవము మొదలయిన భాషల్లోను పత్రికలు ప్రచురించడం మంచి దని నిశ్చయించి ఒక లిమిటెడ్ కంపెనీ స్థాపించడానికి నిర్ణయించాము. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారుకూడా మాకు ఎక్కువగా ప్రోత్సాహం ఇచ్చారు. ముఖ్యులైన ప్రోత్సాహకుల్లో రాజగోపాలాచారిగారు ఒకరు. నేను హైకోర్టులో 15 సంవత్సరాలనించి ప్రాక్టీసు చెయ్యడంవల్లనూ, కావలసినంత ధన సహాయం ఉండడంచేతనూ, మద్రాసు పట్టణంలో హిందువుల్లోను, మహమ్మదీయుల్లోను కూడా పెద్దలైనవారు ఈ ప్రోత్సాహకులలో చేరి సహాయం చేశారు.

ఇంతమంది ప్రోత్సాహకులతో సంస్థ ప్రారంభించి, ఆర్టికల్స్

ఆఫ్ అసోసియేషన్, మెమొరాండమ్ ఆఫ్ అసోసియేషన్ మొదలైనవి తయారుచేయించి, స్థాపించబోయే పత్రికలు, ప్రత్యేకంగా కాంగ్రెసు కార్యక్రమాన్నీ, కాంగ్రెసు ఆశయాల్నీ అవలంబించి నడిపించడానికే ఉద్దేశింపబడ్డాయి అని వ్రాశాము.

ఆ రోజుల్లో ప్రజలకీ, నాయకుల్లో ముఖ్యులకీ కూడాకాంగ్రెసు ఆశయాలు, కాంగ్రెసు కార్యక్రమమూ కూడా బాగా తెలియడానికి అవకాశాలు ఉండేవికావు. త్రివిధ బహిష్కరణాల్ని గురించి అర్థం అయింది కాని, తరవాత రాబోయే శాసనోల్లంఘనమూ, అది అవలంబించడంవల్ల వచ్చే కష్టాలూ అవీ క్రమంగా గాంధీగారు, కాంగ్రెస్సూ వెల్లడిచేసి కార్యక్రమం నడిపించేవరకూ కూడా బోధపడలేదు. అందుచేత దేశంలోను, నగరంలోను, గ్రామాల్లోను ఉండే నాయకులు, ధనవంతులు అంతా కూడా ఈ ఉద్యమం జయప్రదంగా జరపడానికీ, తగినంత సాహాయం చెయ్యడానికీ కూడా పత్రిక అవసరం అని నిర్ణయించాము.

# 27

## పత్రికకు నామకరణం

ఈ పత్రికకి 'స్వరాజ్య' అని పేరు పెట్టినవారు సి. రాజగోపాలాచారిగారే. 'స్వరాజ్యము' అని నేను చెబితే చివరి 'ము' తీసివేసి 'స్వరాజ్య' అని ఉండా లని చెప్పినవారు కూడా వారే. రాజగోపాలాచారిగారు ప్రథమంలో ఎక్కువ ఉత్సాహంతోనూ, స్నేహభావంతోనూ ఈ ఉద్యమానికి ప్రోత్సాహం ఇచ్చారు. ఇంతేకాక ఒకప్పుడు డాక్టరు

పట్టాభి సీతారామయ్యగారు, ముట్నూరి కృష్ణారావుగారు, నేను ప్రాక్టీసు చేస్తూ ఎక్కువగా ధనం సంపాదించే కాలంలో మద్రాసు వచ్చి, నన్ను కలుసుకుని, "మద్రాసులో మీరు ఇంతకాలంనించీ న్యాయవాద వృత్తి సాగిస్తూ ధనం సంపాదిస్తున్నారు గదా! ఒక్క నాలుగు పేజీల పత్రిక ఇంగ్లీషులో అచ్చువేయించడానికి శక్తిలేదా?" అని అడిగారు.

వారు సహాయ నిరాకరణోద్యమ ప్రారంభ కాలంలోనే నాకు ఈ విధంగా సలహా ఇచ్చారు. అప్పటినించీ కూడా నా మనస్సులో అదే ఉండిపోయింది. న్యాయవాద వృత్తి వదలి పూర్తిగా ఉద్యమంలోకి దిగిన తరవాత నగర పరిస్థితులూ, నగరంలో ఉండే పత్రికల పరిస్థితులూ కనిపెట్టి వెంటనే ఇంగ్లీషులోనూ, దేశభాషల్లోనూ దినపత్రికలు స్థాపించడానికి నిశ్చయించుకున్నాను. పైన చెప్పిన స్నేహితులు అంతాకూడా అమితోత్సాహంతోనూ, త్యాగబుద్ధితోనూ ధనసహాయమూ, ఇంకా కావలిసిన ఇతర సహాయాలూ కూడా ఇచ్చి, పత్రిక నడిపించడానికి తోడ్పడ్డారు. అందుచేత ఎల్లాంటి కష్టమూ, లేకుండానే సంస్థ ప్రారంభించి, డబ్బు వసూలు చెయ్యడమూ, డబ్బు అంతా వసూలు కాకముందే కావలిసిన సామగ్రి సేకరించడమూ కూడా జరిగాయి. మూడు లక్షలు వసూలు చెయ్యడంలో ఏవిధమైన కష్టమూ ఉండదని నాకు పూర్తిగా నమ్మకం కలిగింది. నా దగ్గర బాంకులో ఉన్న సొమ్ము కరెంటు అక్కౌంటులో లేకపోయినా, గవర్నమెంటు ప్రావిన్షియల్ నోట్లు మొదలైనవాటి రూపకంగా ఉండడంచేత అప్పు పుట్టడానికి ఏమీ ఇబ్బంది లేకపోయింది.

ఆ కారణంచేత, కంపెనీ మూలధనం మూడు లక్షలు వసూలు అయ్యేవరకూ కనిపెట్టుకుని ఉండక, నేనూ, టి. వి. వెంకట్రామయ్యరు గారు కలిసి, ఇండియన్ బాంకులో ఒక ప్రామిసరీనోటువ్రాసి, 30 వేల

రూపాయలు బదులు పుచ్చుకుని, ముద్రణాలయ స్థాపనకి కావలిసిన సామగ్రి అంతా సమకూర్చుకున్నాము. ఆ సమయంలోనే కాశీనాథుని నాగేశ్వరరావుగారు ఇంగ్లండునించి 25 వేల రూపాయలుపెట్టి ఒక ముద్రాయంత్రం తెప్పించారు. అది ఇంకా ఓడలో ఉండగానే నాగేశ్వరరావుగారిని కలుసుకుని ఆ 25 వేల రూపాయల రొక్కమూ మా దగ్గిర పుచ్చుకుని ఆ మిషను మాకు ఇవ్వవలిసిందని కోరాము. మాకు మొదటి నించీ నాగేశ్వరరావుపంతులుగారు కూడా ముఖ్యమైన ప్రోత్సాహకులుగా ఉండడంచేత, వెంటనే ఆ మిషను మాకు అప్పజెప్పి త్వరలో పత్రిక ప్రారంభించడానికి కారణభూతులు అయ్యారు.

నేను 1921 వ సంవత్సరం ప్రారంభంలో న్యాయవాదవృత్తి వదలివేశాను. వెంటనే స్నేహితులూ, నేనూ ఈ పత్రిక స్థాపించడానికి పూనుకున్నాము. డబ్బు వసూలు చెయ్యడానికి కావలిసిన ఏర్పాట్లు అన్నీ చేశాము. అడిగినవారు అందరూ 'లేదు' అనకుండా వారివారికి తోచిన ప్రకారంగా వాటాలు కొని, మూలధనం సేకరించడానికి సహాయపడ్డారు.

ఆ సంవత్సరంలోనే డిసెంబరునెలలో అహమ్మదాబాదు కాంగ్రెసు జరుగబోతూ ఉంది. నాగపూరు కాంగ్రెసు తీర్మానం ప్రకారం 12 మాసాలలో తిలకు స్వరాజ్యనిధికి కోటి రూపాయలు, 20 లక్షల రాట్నాలు సిద్ధంగా ఉన్నాయి. అందుచేత శాసనోల్లంఘనాన్ని గురించిన కార్యక్రమం ఏర్పరచడానికి అహమ్మదాబాదు కాంగ్రెసు సమావేశం కాబోతూ ఉంది. నేను కాంగ్రెసు సమావేశం అయ్యేలోపుగా స్వరాజ్య పత్రిక స్థాపించి అహమ్మదాబాదు కాంగ్రెసుకి వెళ్ళాలని శపథం పట్టాను. ఆ దీక్షప్రకారం ముద్రణాలయం స్థాపించి, పత్రిక అక్టోబరు 26 వ తేదీని ప్రచురించాను.

దేశంలో ఉన్న ప్రజలూ, నాయకులూ అదివరకు ఎప్పుడూ ఇటువంటి కార్యక్రమం ఎరగరు. ఇంతపెద్ద కార్యక్రమం కాంగ్రెసు ఆశయాల ప్రకారం నడిపించడానికీ, ఆశయాల ప్రకారం పనిచెయ్య డానికీ, ప్రజలచేతకూడా పనిచేయించడానికి పూనుకున్న నాకూ, పత్రికకీ దేశంలో అంతటా మహత్తరమైన బలమూ, సాహాయ్యమూ లభిం చాయి. పత్రిక ప్రచురణ అయిన మొదటి మాసంలోనే ఐదువేల ప్రతులు అమ్ముడుపోయాయి. రెండోమాసంలో—అంటే మేము అహమ్మదా బాదు కాంగ్రెసుకి వెళ్ళడానికి ముందు—ఎనిమిదివేల పై చిల్లర అమ్ముడు పోయాయి.

అహమ్మదాబాదు వెళ్ళినప్పుడు రాజగోపాలచారిగారు గాంధీ గారికి నన్ను గురించి తెలియజేస్తూ, స్వరాజ్య పత్రిక స్థాపించడానికి ఆలోచించడమూ, స్థాపించడమూ, రెండు మాసాలలోగానే 8, 9 వేల ప్రతులు అమ్మడమూ కూడా చెప్పారు. గాంధీగారికి ఆ విషయం చాలా సంతోషం కలిగించింది. అదివరకు గాంధీగారికీ, నాకూ ప్రత్యేకంగా స్నేహం లేకపోయినా ఈ పత్రిక మూలంగా వారికి ఎక్కువ దగ్గిర స్నేహితుల్లో ఒకణ్ణి అయ్యాను.

అహమ్మదాబాదు కాంగ్రెస్సు సహాయ నిరాకరణోద్యమ కార్య క్రమం మొట్టమొదట తీర్మానించిన కాంగ్రెస్సు, భారతదేశం మొత్తం మీద సహాయ నిరాకరణోద్యమం నడిపించడంలోను, కాంగ్రెసు ఆశ యాలు ప్రబోధించడంలోనూ ఇంత దృఢంగా కంకణం కట్టుకున్న

పత్రిక మరొక్కటి ఏదీ కూడా ఉండేది కాదు. గాంధీగారి ఉద్యమానికి అప్పుడు వారపత్రికలు తప్ప దినపత్రికలు ఏవీ లేవు. అహమ్మదాబాదు కాంగ్రెసుకి వెళ్ళినప్పుడు ఒకరోజున నేనూ, గాంధీగారూ కారులో కూర్చుని వెడుతూ ఉన్నప్పుడు ఆయన దేవదాసు గాంధీకి వివాహము చేయదలచి ఉన్నాననీ, కొన్ని కారణాలచేత ఆ వివాహం జరగలేదనీ చెప్పారు. ఇంకా మాకు, ఆయన గృహ సంబంధమైన విషయాలు కూడా నాతో చర్చించేటంత అన్యోన్యభావం కలిగింది. ఆ దేవదాసు గాంధీకి అప్పటినించీ వివాహం కాకపోవడమూ, తరవాత రాజగోపాలాచారిగారి కుమార్తె లక్ష్మిని ఇచ్చి వివాహం చెయ్యడమూ జరిగాయి. దేవదాసుగాంధీకీ, రాజగోపాలాచారిగారి కుమార్తెకీ వివాహం జరిగిన కాలంలో రాజగోపాలాచారిగారూ, నేనూ ఒకరొకరికి కొంచెం దూరం అయ్యాము.

21, 22 సంవత్సరాల్లో మేమిద్దరమూ ఐకమత్యంగా ఉండి నిర్మాణ కార్యక్రమం మంచి ఉత్సాహంతో నడిపిస్తూ ఉండేవాళ్ళము. 23 వ సంవత్సరము ఫిబ్రవరి, మార్చినెలల్లో అభిప్రాయభేదాలు ఏర్పడి మేము విడిపోవడం తటస్థించింది. 21 వ సంవత్సరంలో కాంగ్రెసు విధానం పూర్తిగా నిర్వర్తించడానికి కంకణం కట్టుకుని బయలుదేరిన పత్రిక 'స్వరాజ్య' ఒక్కటే అని పైన వ్రాశాను. 'స్వరాజ్య' అహమ్మదాబాదు కాంగ్రెసులో చేసిన తీర్మానాల ప్రకారం కాంగ్రెసువారినీ, ప్రజలనీ బ్రహ్మాండంగా ఉద్బోధించింది. ఆ తరవాత కూడా అల్లాగే

ప్రబోధిస్తూ వచ్చింది. మొట్టమొదట ఇంగ్లీషులో 'స్వరాజ్య' పత్రిక ప్రారంభించబడిన తరవాత కొద్దికాలానికి రాజగోపాలాచారిగారి ప్రోత్సాహంచేత అరవంలో కూడా 'స్వరాజ్య' దైనిక పత్రిక ప్రారంభించి తమిళనాడు అంతటా గొప్ప ప్రచారం జరిపాము. అల్లాగే తెలుగులో కూడా పత్రిక ప్రారంభించి జేగీయ మానంగా కాంగ్రెసు ప్రబోధం చేశాము.

ప్రథమ ఖండం సమాప్తం.

# నా జీవిత యాత్ర

## ద్వితీయ ఖండము

టంగుటూరి ప్రకాశం




ఎమెస్కో ప్రచురణ - 206




యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్టణం . మద్రాసు . సికింద్రాబాద్

T 12

NAA JEEVITA YATRA—VOL. II
(Autobiography of Andhra Kesari
Prakasam Pantulu in four Volumes)
By
TANGUTURI PRAKASAM

Publishers :
M. SESHACHALAM & CO.

First Edition :
EMESCO POCKET BOOKS
July 1972

Cover Design :
BAPU

Printers :
KRANTI PRESS, Madras-1.

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
RASHTRAPATHI ROAD, SECUNDERABAD.

Price Rs. 2-50

Four Volumes bound in one hard Cover Edition Rs. 15/-




206

# నా జీవిత యాత్ర:

## ద్వితీయ ఖండం

# నా జీవిత యాత్ర

## ద్వితీయ ఖండం

### ప్రథమ ఖండ ప్రసక్తి

"నా జీవిత యాత్ర" ప్రథమ ఖండంలో, బాల్యం మొదలు పంచాశద్వర్షాల వరకూ నడచిన నా జీవితాన్ని గురించి చెపుతూ, 1921—22 సంవత్సరాలలో నేనూ, రాజగోపాలాచారిగారూ ఐకమత్యంతో నిర్మాణ కార్యక్రమం ఉత్సాహంగా నడపిస్తూ ఉండేవారమనీ, కాంగ్రెసు విధానానికి అంకితం అయిన నేను ఆ విధానాన్ని ప్రజలలో బాగా ప్రచారం చెయ్యడానికి "స్వరాజ్య" పత్రికను ఆంగ్లంలో స్థాపించాననీ, అనతికాలంలోనే రాజగోపాలాచారిగారి ప్రోత్సాహంతోనే అరవంలో కూడా దైనిక పత్రికగా "స్వరాజ్య" ని రూపొందింప జేశాననీ, అదే ప్రకారం తెలుగులో కూడా పత్రిక ప్రారంభించి జేగీయమానంగా కాంగ్రెసు ప్రబోధం సాగించామనీ వ్రాసి ఉన్నాను. అందు అహమ్మదాబాదు కాంగ్రెసు జరిగిన తొలి రోజులనాటి ముచ్చటలు కూడా కొద్దిగా వ్రాసి, ఆ ప్రథమ ఖండాన్ని ముగించి ఉన్నాను.

అటుపిమ్మట ఇంకొక ఇరవై సంవత్సరాలపాటు నడచిన నా జీవితాన్నీ, ఆ రోజులనాటి కాంగ్రెసు చరిత్రా, నా నిర్బంధాలూ, జైలు జీవిత విశేషాలూ, అనుభవాలూ వగైరా ద్వితీయ తృతీయఖండాలలో సింహావలోకనం చేశాను.

# 1

# కాంగ్రెసు అధిష్ఠానవర్గ సభ్యత్వం: నిర్మాణ కార్యక్రమ ప్రచారం

అహమ్మదాబాదులో కాంగ్రెసు జరిగిన కొద్దిరోజులలోనే దేశబంధు చిత్తరంజన్‌దాస్‌గారిని నిర్బంధించడమూ, ఆయనకి మూడుమాసాలు జైలుశిక్ష విధించడమూ జరిగింది. ఆకారణంగా నేను అఖిల భారత కాంగ్రెసు సంఘానికి సర్వసాధారణ సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాను. అప్పట్లో విఠల్‌భాయ్ పటేల్‌గారు జనరలు సెక్రటరీగా అన్ని కార్యకలాపాలు చూస్తూఉండేవారు. సహాయకార్యదర్శిగా నన్ను నియమించడం సబబుకాదని కే. సంతానంగారు ఒక చిన్న అభ్యంతరాన్ని వెలిబుచ్చారు. ఈ అభ్యంతరాన్ని త్రోసిపుచ్చుతూ, విఠల్‌భాయ్ పటేల్‌గారే, సమాధానంగా, నెలకు ఏ డెనిమిదివేల రూపాయలు ఆర్జించగల శక్తిమంతుడు సహాయకార్యదర్శి పదవికి పనికిరాడా అని ప్రశ్నించారు. గాంధీగారు కూడా ఆ కార్యనిర్వాహకసంఘ సభలో ఆసీనులయ్యే ఉన్నారు. సంతానంగారి అభ్యంతరాన్ని త్రోసిపుచ్చుతూ, నన్ను సహాయకార్యదర్శిగా ఎన్నుకోవడం జరిగింది.

అంతేకాదు. దరిమిలా, *దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారి నిర్బంధంతో, నేను కార్యనిర్వాహక సంఘ సభ్యుడనూ అయ్యాను. చిత్తరంజన్ దాస్‌గారి ముఖ్యస్నేహితునిగానూ, పత్రికా సంపాదకునిగానూ, కాంగ్రెస్ కమిటీ సహాయ కార్యదర్శిగానూ, కార్య నిర్వాహకవర్గ సభ్యునిగానూ, భారతదేశమందలి అన్ని రాష్ట్రాలకూ తరుచు వెడుతూ ఉండేవాడిని. అవసరాన్నిబట్టి కార్యనిర్వాహక సంఘ సభలూ, అఖిలభారత కాంగ్రెసుసంఘ సభలూ, దేశంలో నలుమూలలా జరిపేవారం. ఆ కారణంగా దేశం నలుమూలలా తిరక్క తప్పేది కాదు. అంతేకాదు. ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘ అధ్యక్షునిగా నిర్మాణకార్యక్రమం ఉత్సాహవంతంగా కొనసాగించడానికిగాను ఆంధ్ర ప్రాంతాలన్నీ జిల్లాలవారీగా అనేకసార్లు తిరగవలసిన అవసరమూఉండేది.

---

* 1922 మార్చిలో.

కార్యనిర్వాహకవర్గ సభ్యునిగాగాని, సహాయకార్యదర్శి హోదాలో గాని, ఏ ప్రాంతాలకు వెళ్ళవలసి వచ్చినా, ఆ ప్రయాణాలకు దారి ఖర్చు లయినా ఇచ్చే సంప్రదాయం అప్పటి కింకా ఆచరణలోనికి రాలేదు. దేశం నలుమూలలా తిరగడానికీ, ఆంధ్ర ప్రాంతం అంతా చుట్టడానికీ ధారాళంగానే ధనం వ్యయ మయ్యేది. కాంగ్రెసు ఆదేశానుసారంగానూ, గాంధీగారి ప్రోద్బలంతోనూ నేను ప్రాక్టీసు విరమించే నాటికి* చాలా బాగా సంపాదించి ఉన్నకారణంగా ఈ ప్రయాణాల కన్నింటికీ విచ్చల విడిగా నా సొంత డబ్బే ఖర్చు పెట్టేవాడిని.

దేశీయపాఠశాలలు - చరఖాకేంద్రాలు

ఆంధ్రదేశంలో అన్నిమూలలా నా స్వంతబాధ్యతపైనా, పర్య వేక్షణక్రిందా దేశీయపాఠశాలలు నెలకొల్పాను. ముఖ్యంగా ఒంగో లులో ఆరంభింపబడిన దేశీయ విద్యాలయానికి కాంగ్రెసు నిధులనుండి కాణీకూడా తీసుకోకుండా విరివిగా నేనే ఖర్చుపెట్టాను. అదేప్రకారంగా ఒంగోలుకు ఎనిమిదిమైళ్ళ దూరంలో ఉన్న గురవారెడ్డిపాలెంలో స్థాపించబడిన చరఖా కేంద్రానికీ నేనే విరివిగా ఖర్చుపెట్టాను. ఆ కేంద్రానికి పర్యవేక్షకునిగా (ధారా) గోపాలశాస్త్రిగారిని నియమించాను. ఈ నిర్మాణ కార్యక్రమానికి పదివేలరూపాయలు అఖిల భారత చరఖా సంఘంవారు మంజూరుచేసి ఉన్నప్పటికీ, గోపాలశాస్త్రిగారిని వారు సరిగా ఎరుగని కారణంగా ఆ పత్రంమీద జామీనుదారునిగా నేనూ సంతకం చేశాను. పదివేల రూపాయలూ గోపాలశాస్త్రిగారికి ముట్టాయి. ఆ సొమ్ము సద్వినియోగంచేసి శాస్త్రిగారు అవసరమయిన చరఖాలూ, మగ్గాలూ, ప త్తీ వగైరాలు కొని గురవారెడ్డిపాలెం కేంద్రాన్ని యావత్తు భారతదేశంలోనూ ఆదర్శప్రాయమైందిగా రూపొందింప జేశారు. అఖిల భారత చరఖాసంఘం వారుకూడా తమ నివేదికలో యీ విషయాన్ని గురించి ప్రస్తావనచేస్తూ భారతావనిలోకల్లా ముఖ్యమయిన కేంద్రంగా గురవారెడ్డిపాలెం కేంద్రాన్నీ, గోపాలశాస్త్రిగారి సేవనీ అభినందించారు.

ఒంగోలులో నా సొంత బంగాళాలో ప్రారంభింపబడిన దేశీయ

---

* 1921 జనవరిలో.

విద్యాలయంలో బాలురకు కేవలమూ వడకడమూ, నేయడమే గాక, ఇతరవిధములైన చేతిపనులనుకూడా నేర్పేవారు. అచ్చటి పారిశ్రామిక విభాగంలో ముఖ్యంగా చెంచాలూ, చాకులూ, మంగలికత్తులూ మున్నగు సామానులేగాక తాళాలూ, తాళంకప్పలూ వగైరాకూడా తయారు చేసే వారు. పై రెండు సంస్థలూ నా సొంత బాధ్యతమీదా, పర్యవేక్షణక్రిందా నడుపబడుతూ ఉన్నా, గోపాలశాస్త్రిగారి ఖాదీ ఉత్పత్తి కేంద్రం దేశ మొత్తానికే ముఖ్యకేంద్రం అయింది.

## పంచాయతీ కోర్టుల స్థాపన

పంచాయతీలు కోర్టులు అనేక గ్రామాలలో నెలకొల్పాము. అవన్నీ ప్రతిభావంతంగానే పనిచేశాయి. ఇట్లు ఆంధ్రప్రాంతంలో ప్రారంభింపబడిన నిర్మాణాత్మక వ్యాసంగాలన్నీ 'తిలకు స్వరాజ్యనిధి' పైనే ఆధారపడలేదు. భారతావని మొత్తంమీద అనేక ప్రాంతాలలో బయలుదేరిన నిర్మాణ కార్యక్రమ కేంద్రాల స్థాపనకే వసూలయిన కోటి రూపాయలూ సముద్రంలో కాకిరెట్ట అనిపించాయి. కూర ఖర్చు కయినా చాలలేదన్నమాట. ఆ ఒక్క సంవత్సరంలోనే యావత్తు భార తావనిలోని కాంగ్రెసు అభిమానుల, సేవకుల సొంతజేబులనుండి అటు వంటి కోట్లు ఎన్ని ఖర్చయ్యాయో! ఒక్క యేడాదిలోనే స్వరాజ్యం వచ్చి తీరుతుంది అనే నమ్మకంతో ప్రజలు ఎటువంటి త్యాగాలకయినా సంసిద్ధులయ్యారు. అనేక గ్రామాలలో పంచాయతీలు, దేశీయ విద్యా లయాలు, ఖాదీ ఉత్పత్తికేంద్రాలు స్థాపించాం. అంటరానితనాన్ని నిర్మూలించడానికీ, హిందూ మహమ్మదీయ సఖ్యం సాధించడానికీ వెల లేని కృషి జరిపాము.

ఈ నిర్మాణాత్మక కార్య సంరంభమూ, దేశం మొత్తంమీద సాధించిన విజయాలూ చూస్తూఉంటే ఎటువంటివారికయినా ఏడాది తిరిగే నాటికల్లా నూతన రాజ్యాంగ తంత్రాన్ని నెలకొల్పి, బ్రిటిషు పరిపాలనా యంత్రాన్ని త్రోసిపుచ్చి, వారికి పోటీగా ఇంకో ప్రభుత్వాన్ని సాధించి, నడిపించగలశక్తి మనకుంది అనే ధీమా, విశ్వాసమూ కుదిరాయి. త్రివిధ బహిష్కరణ విధానాన్నీ, నిర్మాణకార్యక్రమాన్నీ, నడిపిస్తూన్న

తీరుచూస్తే 1921 వ సంవత్సరంలో సాధించిన ఫలితాలు ఒక్క అయిదారు సంవత్సరాలపాటు నిలబెట్టుకో గలిగిననాడు, క్రిందనుంచి పైదాకా అన్నివిధాలా ఆంగ్ల రాజ్యాంగ యంత్రాన్ని త్రోసిపుచ్చి, ఫిర్కా గ్రామీణ ప్రాంతాలలోనే గాక, తాలూకాలలోనూ జిల్లాలలోనూ కూడా, ఇప్పుడు ఉన్న ప్రభుత్వాధికారుల సలహా సంప్రతింపులతో గాని, ఆర్థికాది సహకారాలతోగాని నిమిత్తం లేకుండా, మనమే పరిపాలించుకో గలము అనే ధైర్యమూ, దృఢవిశ్వాసమూ కాంగ్రెసువారిలో కుదిరాయి.

ఆంధ్ర, కన్నడ, ద్రవిడ, మహారాష్ట్ర, మలయాళాది దక్షిణ ప్రాంతాలూ, అంగ, వంగ, కళింగ, కాశ్మీర, అంటూ ఏకరువుపెట్టె రీతిగా, పంజాబు, సంయుక్త రాష్ట్రాలు, మధ్యరాష్ట్రాలు, గుజరాతు, బెంగాలు, ఉత్కళాది ప్రాంతాలన్నీ, ఒక్క బిగిని కాంగ్రెసు వారి నిర్మాణకార్యక్రమానికి అన్నివిధాలా దోహదాన్నిచ్చి, పోటా పోటీల మీద, మా రాష్ట్రంలో అంటే, మా రాష్ట్రంలో అంటూ, ముందు కురికాయి. నేను ఏ ప్రాంతానికి వెళ్ళినా ఇదే వరస.

అహమ్మదాబాదులో కాంగ్రెసు జరిగేనాటికి యీ నిర్మాణాత్మక కార్యక్రమం అన్నది అన్నివిధాలా, జయాన్నే సాధించింది. వేలూ, లక్షలూగా ఉన్న నిరక్షరాస్యులు కూడా ఉత్తేజపూరితులయి, నూత్న శక్తితోనూ, తేజస్సుతోనూ విరాజిల్లుతూ స్వరాజ్య సంపాదనకోసం ఎట్టి ఉత్కృష్టమయిన త్యాగాలకయినా సరే సర్వసన్నద్ధు లయ్యారు. నిర్ణీతమయిన కాలంలో కాంగ్రెసు విధానానికి తలయొగ్గి నిర్మాణాత్మక కార్యక్రమం దేశం మొత్తంమీద చాలా ఉద్ధృతంగా నెలకొల్పబడిన పరిస్థితిని గమనిస్తే, సాలాఖరునాటికి వ్యష్టి సత్యాగ్రహానికే గాదు, సమిష్టి సత్యాగ్రహాని కయినా దేశం సర్వసన్నద్ధంగా ఉన్నదని రుజువయింది.

## పన్నుల నిరాకరణ విషయమై సంశయాలు

కాని నాకు మాత్రం పన్నుల నిరాకరణ ఉద్యమానికి దేశం యింకా సిద్ధంగా లేదేమోననే ధర్మసందేహం పీకుతూనే ఉంది. గాంధీగారికి కూడా, వీలయితే యీ పన్నుల నిరాకరణ అన్నది ఒక్క బార్డోలీ ప్రాంతానికే పరిమితం జేయాలనే అభిప్రాయం స్థిరంగా యేర్పడింది.

నేను కార్యనిర్వాహక వర్గ సభ్యునిగా ఉంటూవున్న రోజుల లోనే బార్డోలీ (గుజరాతు)లో పన్నుల నిరాకరణ ఉద్యమం నడిపించా లనే ప్రతిపాదన కార్యనిర్వాహకవర్గ సభలో ప్రవేశపెట్టబడింది. మాలో బార్డోలీ ప్రాంతాన్ని చూడనివారి కందరికీ—అక్కడి పరిస్థితులు అవ గాహన కాకపోవడాన్నీ—మాలో శక్తి సంపన్నుడూ బలాఢ్యుడూ అనుకున్న వ్యక్తి సహితం పన్నుల నిరాకరణ ఉద్యమంలో పాల్గొని నిర్వహించుకు రాగలడా అనే సంశయం ఉత్పన్నమైంది. నిజంగా బార్డోలీ ప్రజలు కష్టనష్టాలకు తట్టుకోగలరా అనే అనుమానం మమ్మల్ని బాధించింది. దాన్తో ఆ కార్య నిర్వహకవర్గ సభలో మహాత్మాగాంధీ గారిని యీ పన్నుల నిరాకరణ ఉద్యమం అంటె వారికి వున్నభావమూ, అభిప్రాయమూ యేమిటనీ, బార్డోలీ ప్రాంతీయులచేత యీ పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభింపజేసి జయాన్ని చవిచూడగలరా అని ప్రశ్నించాము. అప్పుడు లాలా లజపతిరాయిగారూ కార్య నిర్వాహక సంఘ సభ్యులే. వారికీ ఈ బార్డోలీ సత్యాగ్రహ విషయంలో జయం సాధించగలం అనే నమ్మిక కుదరలేదు. ఆయన కూడా గాంధీగారిని, బార్డోవల్ ఉద్యమాన్ని ఈ విధంగా సాగించి ప్రభుత్వ విధానాన్ని మట్టుపెట్ట గలరని ప్రశ్నించారు.

అప్పట్లో గాంధీగరి హృదయంలో కూడా యీ విషయంలో ఒక నిర్ణీతమయిన అభిప్రాయం ఉన్నట్లు లేదు. లజపతిరాయిగారు, సమగ్రమయిన తమ విధానాన్ని తేటతెల్లం చెయ్యమని గాంధీగారిని అడిగినప్పుడు, గాంధీగారూ కొంచెం నీళ్ళు నములుతూ తమ అభి ప్రాయాన్ని వ్యక్తపరిచారు. ఆయన యేమన్నారో తెలుసా? దానికేముంది, మెజస్ట్రీటుగారికంటె ముందుగానే వెళ్ళి వారి కుర్చీలో కూర్చుని ఆ కేసు లన్నీ పరిష్కారం చేస్తానన్నారు. ఆ ముక్కలు నాకుగాని, లజపతి రాయిగారికిగాని ఎంతమాత్రమూ రుచించలేదు.

ఇది చాలా స్వల్ప విషయమే అయినా, ఈ సంభాషణ జరిగి అప్పుడే పాతిక సంవత్సరాలు దాటినా, నాకు మాత్రం యీ సన్నివేశం అంతా బాగా జ్ఞప్తిలో ఉండిపోయింది. అప్పట్లో గాంధీగారికి ఆంగ్ల రాజ్యాంగ విధానాన్ని కూలద్రోయడానికి సరియయిన పథకం అంటూ

ఏదీ లేదని నిశ్చయించుకున్నాం. పన్నుల నిరాకరణ ఉద్యమం పట్ల అప్పట్లో మాకువున్న అభిప్రాయా లలాంటివి.

# 2

## అహమ్మదాబాదు కాంగ్రెస్: వింతలు విశేషాలు

అహమ్మదాబాదు (గుజరాతు)లో కాంగ్రెసు * పేరిట మేము కలిసేముందు గాంధీగారు ఆ కాంగ్రెసు చాలా నిరాడంబరంగా జరుగుతుందనీ, గత సంవత్సరాలలో జరిగినట్లు దుబారా ఖర్చులుగాని, అధిక వ్యయాలుగాని ఉండవనీ, ఏటేటా ప్రతినిధులు కూర్చోడానికే బెంచీలకూ కుర్చీలకూ అయ్యే ఖర్చుల క్రిందే కొన్ని వేలు వ్యయం అయ్యేదనీ, అట్టి దుబారాలేవీ లేకుండా ప్రతినిధులందరూ నేలమీదే సుఖాసీనులయి కార్యకలాపాలలో పాల్గొంటారని వ్యక్తపరిచారు. అధిక వ్యయం తగ్గించి, ఆడంబరం విడిచిపెట్టి, నిరాడంబరంగా జీవించే విధానానికి అహమ్మదాబాదు కాంగ్రెసు నాంది అవుతుందని మేమంతా విశ్వసించాం.

కాని తీరా అక్కడికి వెళ్ళేసరికి మాకు కనబడ్డ దృశ్యం చాలా ఆశ్చర్యాన్ని కలుగజేసింది. కూర్చోడానికి కుర్చీలూ, బెంచీలూ లేని మాట వాస్తవమే అయినా, అలంకరణాది విధానంలోనూ, ఇతరత్రానూ ఆ పెండాలంతా అతి నూతనంగా కనిపించి వింతసోయగాన్ని వెదజల్లింది. కూర్చోవడం అన్నది నేలమీదనే అయినా, కూర్చోడానికిగాను నేలమీద విలువయిన ఖద్దరు తివాసీలు పరచబడ్డాయి. ఏ విధంగా పరిశీలించినా గత సంవత్సారలకంటె ఖర్చులు తగ్గాయని తలంచడానికి తావే లేదు. గాంధీగారు నిరాడంబరంగా కాంగ్రెసు సమావేశం జరిపించాలనే కోరిక వ్యక్తపరచి ఉండవచ్చు. కాని నిర్వాహకులు మాత్రం, ఏనాడూ ఏ కాంగ్రెసులోనూ జరగని విధంగా, అతి ఆడంబరంగా అలంకరణాదులు జరిపించి ఆ పెండాలును చూడ ముచ్చటగా రూపొందింపజేశారు. ఈ యేర్పాట్ల కన్నింటికీ సుమారు రెండు లక్షల రూపాయలకు పైగానే

* 27-12-1921

వ్యయం అయింది.

సర్దార్ వల్లభాయ్ పటేలూ, గాంధీగారూ, వచ్చిన ప్రతినిధుల సుఖసౌకర్యాలను స్వయంగా పరిశీలించారు. తరతమ భేదాలూ, వ్యత్యాసాలూ లేకుండా పరిశీలించారు. కుల మత తారతమ్యాలు తలయెత్తకుండాను, పారిశుద్ధ్యాది నియమాలు కూడా తర తమ భేదాలకు తావియ్యకుండానూ, అందరూ ఆనందంగా ఒకే కుండలో నీళ్ళు ఒకే గ్లాసుతో త్రాగారంటే అందులో అతిశయోక్తి ఎంత మాత్రమూ లేదని ఒప్పుకు తీరాలి.

ఆహ్వాన సంఘాధ్యక్షుని ఉపన్యాసమే కాదు, అందరి ఉపన్యాసాలూ చాలా క్లుప్తంగానూ, సూటిగానూ ఉన్నాయి. నిజమే, ప్రత్యక్ష చర్యలు, అవలంబించడానికి సిద్ధమవుతూ ఉన్న పరిస్థితులలో ఉపన్యాసాలతో కాలం విలంబనం చేయడం అన్యాయం కదూ? చేతలకు సిద్ధపడుతూన్న పరిస్థితులలో మాటలకు తావేది? అప్పటినుంచీ కాంగ్రెసు అన్నది ఉత్తమమయిన వ్యాపార కేంద్రంగా తయారయింది. ఉపన్యాసాలలో ఆడంబరమూ, ధీమా, ఉత్ప్రేక్షాది అలంకారాలూ, అనవసర సమాసాల దొర్లింపులూ లేవు. ఉన్నదంతా ఇల్లా ఇల్లా చెయ్యి, కార్యం సాధించుకురా అన్న ఆదేశమూ, ప్రోత్సాహమూ, మాత్రమే.

## నాయకుల నిర్బంధాలు

అప్పటికే, ఈ దేశాన్ని చూడడానికి రానున్న ప్రిన్స్ ఆఫ్ వేల్స్‌ను (Prince of wales) బహిష్కరించాలి, ఆయన పర్యటన సరిగా సాగనివ్వకూడదు అన్న ప్రతిపాదనలు ఆమోదింప బడడం చేత దేశంలో నలుమూలలా ఉన్న ముఖ్య కాంగ్రెసు నాయకుల నందరినీ నిర్బంధంలోకి తీసుకోవడం జరిగింది. నిర్మాణ కార్యక్రమం విషయంలో అవలంబించతగ్గ మార్గాలన్నీ నిర్ణీతమయ్యే ఉన్నాయి. నిర్ణీతమయి ఉండడం యేమిటి, అమల్లోకే వచ్చేశాయి.

చిత్తరంజన్‌దాస్‌గారిని * అప్పటికే ఖైదుచేసి ఉండడంచేత

* 'ప్రిన్స్ ఆఫ్ వేల్సు' బహిష్కారోద్యమం సందర్భంలో వంగరాష్ట్ర ప్రభుత్వం స్వచ్ఛంద సైనికుల్ని చేర్చడం క్రిమినల్ లా సవరణ చట్టానికి విరుద్ధమని ప్రకటించింది. సి. ఆర్. దాస్‌గారిని భార్యాపుత్రులతో సహా నిర్బంధించారు.

అధ్యక్షుడుగా ఆయన చదవవలసిన ఉపన్యాసాన్ని శ్రీమతి సరోజనీదేవి చదివింది. దాస్‌గారి స్థానంలో వారి ప్రతినిధిగా ఢిల్లీ నివాసి అయిన హకీం అజ్మల్ ఖాన్ అధ్యక్ష స్థానాన్ని అలంకరించారు.

## త్రివిధ బహిష్కారం

కాంగ్రెసు బ్రహ్మాండంగా జరిగింది. ప్లీడర్లను తమ వృత్తిని విరమించమన్నారు. శాసన సభా సభ్యులను రాజీనామా లిచ్చి బైటికి రమ్మన్నారు. విద్యార్థులను కళాశాలల నుంచీ, పాఠశాలలనుంచీ వెలుపలికి రమ్మన్నారు. ఈ పోరాటపు దినాలలో ఆర్జన లేక బాధపడే ప్లీడర్ల సహాయార్థం సేట్ జమన్‌లాల్ బజాజుగారు లక్షరూపాయలు విరాళంగా ఇచ్చారు. బ్రహ్మాండమయిన ఈ త్రివిధ బహిష్కరణ కార్యక్రమం సరిగా అమలు జరిగినట్టయితే సర్వాజ్యాన్ని సాధించడానికి పంద్రెండు మాసాలు చాలని నిర్ధరించినా, ఈ లోపునే వచ్చి తీరుతుందనే గట్టి నమ్మకం అందరి హృదయాలలోనూ సుస్థిరం అయింది. నిజానికి స్కూళ్ళూ, కాలేజీలూ ఇంకా కొన్ని సంవత్సరాలపాటు బహిష్కరింపబడివుంటే అనుకున్నదానికంటె ముందుగానే స్వరాజ్యం వచ్చి ఉండేది.

వృత్తిని మాని జైళ్ళకువెళ్ళినప్లీడర్ల దీక్షను, దేశవ్యాప్తంగా జనబాహుళ్యం కనబరచిన త్యాగశీలతను నిశితంగా పరిశీలిస్తే ఈ సంఘటనలన్నీ ప్రపంచ చరిత్రలోనే నిరుపమానమయినవని, ఒప్పుకోవలసి ఉంటుంది. పోరాటంలో పాల్గొన్న జనసమూహమే కాదు, పోరాటం జరుగుతున్న విధాన్ని గమనిస్తూ ఉన్న ప్రతి వ్యక్తీ తర తమ భేదాలూ, కుల మత తారతమ్యాలూ విస్మరించి తామంతా సంపూర్ణమయిన, సమగ్రమయిన స్వరాజ్యాన్నే సాధించి తీరుతామనే నిశ్చయంతో ఉన్నారు. లక్షలాది ప్రజలలో నాటుకుపోయిన ఈ భావానికీ, వారిలో కలిగిన రాజకీయ చైతన్యానికీ ఆనాటి వైస్రాయి 'లార్డ్ రీడింగ్' (Lord Reading) * విస్తుపోయాడు. విస్తుపోవడ మేమిటి, చైతన్య హీనుడే అయ్యాడని అనవలసి ఉంటుంది.

---

*రీడింగ్ ప్రభువు 1921 ఏప్రిల్‌లో వైస్రాయిగా వచ్చాడు.

## ప్రిన్స్ ఆఫ్ వేల్స్ 'బాయ్‌కాట్'

ప్రిన్స్ ఆఫ్ వేల్స్ పర్యటన విషయంలో ఏర్పాటయిన బహిష్కరణ ఉద్యమం చాలా ఘనంగా సాగింది. అఖరికి రైల్వేపోర్టర్లు కూడా వైస్రాయిగారి సామానులుగాని, ప్రిన్స్ అఫ్ వేల్స్ సామానులు గాని ముట్టనయినా ముట్టలేదు. వారు ఎక్కడికి వెళ్ళినా యీ ప్రకారం గానే చుక్క ఎదురయింది. ఇంతకంటే ఘనమయిన నిరసన ప్రపంచం మొత్తంమీద యే జాతీ చూపించి ఉండదు. ఇటువంటి పరిస్థితులను గమనించే లార్డ్ రీడింగ్ తాను నిజంగా విస్తుపోయాయనీ, చైతన్య హీనుణ్ణే అయ్యాననీ వెల్లడించాడు. అంతేకాదు, భారతదేశానికి నిజంగా కావలసినదేమిటో కూడా తాను నిర్ణయించలేని స్థితిలో ఉన్నానన్నాడు.

## లార్డ్ రీడింగ్

వైస్రాయ్ కాకపూర్వం లార్డ్ రీడింగ్ న్యాయవాదిగా మంచి నేర్పరితనాన్ని కనబరిచేవాడు. పంజాబుప్రాంతం తనదేననీ, దానిని తనకు ఒప్పగించి తీరాలనీ లండను హైకోర్టులో 'దిలీప్‌సింగ్' ప్రభుత్వం వారిమీద తీసుకువచ్చిన దావాలో నేను లార్డ్ రీడింగ్‌తో కలిసే దిలీప్‌సింగ్ తరఫున పని చేశాను. అప్పటి పరిస్థితులనుబట్టి ముమ్ముందు లార్డ్ రీడింగ్ హిందూదేశానికి వైస్రాయిగా వస్తాడనిగాని, చాలా చాకచక్యంగా రాజ్యాంగాన్ని నిర్వహిస్తాడనిగాని నేనెప్పుడూ కలలో కూడా తలచి వుండలేదు. జన్మతః ఆయన ''యూదు'' జాతికి చెందినవాడు అవడం చేతనే అట్టి క్లిష్ట పరిస్థితులలో సహజంగా ఆ జాతికి చెందిన జిత్తులమారి తనంతో, నేర్పుగా ఆ పరిస్థితులను ఎదుర్కొ-గలిగాడు.

బెంగాలులో క్రిమినల్ లా ఎమెండ్‌మెంట్ యాక్ట్ క్రింద అనేక మందిని నిర్బంధించ గలిగాడు. వారు ఇస్తూన్న ఉపన్యాసాలను గమనిస్తూ, మహమ్మదాలీ, షౌకత్ ఆలీ సోదరులనూ, డాక్టరు కిచులూనూ కూడా నిర్బంధించాడు. వీరినేగాక అనేక మంది 'ఫత్వా'లనూ నిర్బంధించాడు.

సత్యాగ్రహపు తొలిమెట్టుగా అమలు పరచిన ప్రిన్స్ అఫ్ వేల్స్ బహిష్కరణ ఉద్యమం, అనుకున్న దానికంటె ఎంతో ఘనంగా కొన

సాగడంచేత గాంధీగారి కీర్తి దశదిశలా మార్మోగింది. గాంధీగారు మినహాగా తక్కిన రాజకీయవేత్త లందరునూ క్రిమినల్ ప్రొసీజర్‌కోడ్ 144, 108 సెక్షన్ల కిందనో, క్రిమినల్ లా ఎమెండ్‌మెంట్ యాక్ట్ కిందనో అరెస్టు చెయ్యడం జరిగింది.

## రాజీ ప్రతిపాదనలు

ప్రముఖ రాజకీయవేత్తల మధ్య ఉన్న స్వల్ప భేదాభిప్రాయాలను గమనించిన రీడింగ్ ప్రభువు, ఆ అభిప్రాయభేదాలను ఆధారంగా తీసుకుంటూ, వాటికి అనుగుణంగా రూపొందించిన పథకాలతో యుక్తియుక్తంగా కార్యసాధనకు ఉపక్రమించాడు.

కలకత్తా సమీపంలోని అలీపూరు జైలులో నిర్బంధింపబడివున్న చిత్తరంజన్‌దాస్‌గారికి కొన్ని రాజీ ప్రతిపాదనలను సూచించి,[2] ఆ ప్రతిపాదనలనే వేరే ప్రాంతంలో ఇంకో జైలులో నిర్బంధింపబడిన పండిత మోతీలాల్ నెహ్రూగారికీ అందజేశాడు.

---

2. 1921 డిసెంబరులో.

* కరాచీలో జరిగిన అఖిలభారత ఖిలాఫత్ మహాసభ (1921 జూలై)లో పాల్గొన్నందుకు శిక్షింపబడిన వీరిని 'కరాచీ ఖైదీ' లన్నారు, మహాసభచేత వీరు, బ్రిటిషు ప్రభుత్వం క్రింద భారతీయ సైనికులు పనిచేయరాదనే తీర్మానం అంగీకరింప జేశారు. కొందరు ఉలేమాలు ఆ తీర్మానాన్ని 'ఫత్వా' (శ్రీముఖం)గా మహమ్మదీయులకు జారీ చేశారు. ఆ సందర్భంలో శిక్షితులైనవారిని 'ఫత్వా ఖైదీ' లన్నారు.

ఖలీఫా అయిన టర్కీ సుల్తానుకు యుద్ధ సమయంలో చేసిన వాగ్దానాలకు భంగకరంగా బ్రిటను, యుద్ధం ముగిశాక, ఇస్లాం మత పీఠ సామ్రాజ్య (ఖిలాఫత్) భాగాలను స్వాహా చేసింది. అది మహమ్మదీయులను కోపోద్రిక్తుల్ని చేసింది. భారతీయ మహమ్మదీయులతో హిందువులు చేతులు కలిపి, వాటిని తిరిగి టర్కీకి ఇప్పించడానికి, ఖిలాఫత్ ఉద్యమం నడిపించారు.

# 3

# గాంధీగారి విచారణ, నిర్బంధం

అహమ్మదాబాదు కాంగ్రెసు అనంతరం ఢిల్లీలో డాక్టర్ అన్సారీగారి ఇంటిలో అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం జరిగినప్పుడు సి. ఆర్. దాస్‌గారికి అందజేయబడిన 'రాజీ' ప్రతి పాదనలు చర్చించబడ్డాయి. ఆ రాజీ ప్రతి పాదనలలో లార్డ్, క్రిమినల్ లా ఎమెండ్‌మెంట్ చట్టం క్రింద నిర్బంధింపబడిన వారి నందరినీ విడుదల చేస్తామనీ, లండన్‌లో జరుపదలచిన రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌లో భారత దేశానికి అధినివేశ ప్రతిపత్తి (Dominion status) యిచ్చే విషయాన్ని గురించి చర్చించడానికి తాము సిద్ధంగా ఉన్నామనీ రీడింగ్ ప్రభువు తెలియజేశాడు. దాస్‌గారూ, మోతీలాల్ నెహ్రూగారూ కూడా ఈ ప్రతిపాదనలకు సుముఖంగానే ఉన్నారు. కాని కరాచీ ఖైదీలనూ, ఫత్వా ఖైదీలనూ కూడా విడుదల చేయడానికి ప్రభుత్వం వారు అంగీకరింపకపోతే, కొన్ని క్లిష్ట పరిస్థితులకు కాంగ్రెసు లోనవుతుందని మహాత్మా గాంధీగారు సూచించారు. ఈ సూచన చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూగార్లను ఆగ్రహావేశుల్ని చేసింది.

## నాయకులలో అభిప్రాయ భేదాలు

ఈ సమయంలోనే హింసాత్మకమైన ''చౌరీ చౌరా'' సంఘటన జరిగింది. దాన్తో గాంధీగారు తమ సత్యాగ్రహ కార్యక్రమాన్ని హఠాత్తుగా ఆపివేశారు. ఇది జరిగిన అనతికాలంలోనే తిరిగి ఢిల్లీలో డా॥ అన్సారీగారి గృహంలోనే అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం జరిగింది. దేశంలో ఎక్కడో మారుమూల జరిగిన యేదో సంఘటనను సాకుగా తీసుకుని గాంధీగారు తమ ఉద్యమాన్ని విరమించడం శుద్ధ తప్పని వివరిస్తూ కొన్ని తావుల సుదీర్ఘ నిరసన లేఖను దాసుగారు వ్రాశారు. ఈ తైపు చేయబడిన ఉత్తరాన్ని దాసుగారి అల్లుళ్లలో ఒకరయిన ''రాయ్''గారు స్వయంగా తీసుకువచ్చి గాంధీగారికి అందజేశారు. ఉద్యమ విరమణ విషయంలో గాంధీగారు గొప్ప తప్పిదాన్నే చేశా

రంటూ దాసుగారి స్వదస్తూరీతో వ్రాయబడిన నోటు బుక్కు కూడా ఈ సమయంలోనే గాంధీగారికి అందించబడింది. ఎన్నో పేజీలలో స్వయంగా మోతీలాల్‌గారే వ్రాసిన నిరసనపు టుత్తరం మోతీలాల్‌గారి ప్రయివేటు సెక్రటరీ ఒకాయన జైలునుంచి తీసుకువచ్చి స్వయంగా గాంధీగారికి అందజేశాడు.

## సి. ఐ. డీ. లు

ఈ అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో చాలామంది ప్రతినిధులు పాల్గొన్నారు. మఫ్టీలో ఉన్న సి. ఐ. డి వారు కూడా చాలా మంది వచ్చారు. మీటింగులో సి. ఐ. డీ. లున్నారన్న వార్త ఒక చిన్న హెచ్చరిక రూపంగా గాంధీగారికి అందజేయబడింది. గాంధీగారితత్వంలో భీతి, భయం, రహస్యం అన్నవి ఎప్పుడూ లేక పోవడంచేత సభలో ఉన్న సి. ఐ. డీ. లను వేటాడి తరిమి వేయడమన్నది జరుగలేదు. తనకు జేరిన హెచ్చరికకు గాంధీగారు ఒక చిన్న చిరునవ్వు నవ్వి, ఈ సభలో ప్రతినిధులు కాని వారు ఎవరయినా ఉంటే వారు మర్యాదగా తప్పుకోవడం న్యాయమనే సూచనను మాత్రంజేసి ఆయన తన పనిలో తాను నిమగ్నుడయ్యాడు. సంగతి సందర్భాలన్నీ ప్రతినిధులకు బాగా ఆకళింపు అవడానికిగాను దాస్, మోతీలాల్‌గారలు వ్రాసిన ఉత్తరాలు సభలో ఆమూలాగ్రంగా చదువబడ్డాయి. సభలో గాంధీగారి భావాలకు వ్యతిరేక అభిప్రాయాలుగల వ్యక్తులు కొందరున్నారనీ, అట్టివారు గాంధీగారి సన్నిహిత అనుచరులలోనే ఉన్నారనీ సభికుల కందరికీ సువ్యక్తం అయింది.

## కంటనీరు తెప్పించిన వాఙ్మాలం

గాంధీగారి ఒంటిమీద చెయ్యివేస్తే యేమవుతుందోనన్న భీతితో పరిస్థితులను గమనిస్తూ అవకాశం కొరకు వేచివున్న ప్రభుత్వంవారు ఈ సమావేశం అనంతరం గాంధీగారిని నిర్భయంగా నిర్బంధింపగలిగారు. కార్యనిర్వాహకవర్గ సభ్యునిగానూ, సహాయ కార్యదర్శిగానూ కూడా నేను యీ సమావేశాలన్నింటిలోనూ మొదటినుంచీ పాల్గొంటూనే

ఉన్నాను. కాగా గాంధీగారిని నిర్బంధించి విచారణ నిమిత్తం అహమ్మదాబాదు సెషన్సు కోర్టులో హాజరు పరచినప్పుడు నేను స్వయంగా హాజరయి ఆ విచారణ కాండనంతా పరిశీలించాను. ఆ విచారణ అన్నది ప్రపంచ చరిత్రనే తారుమారుచేసే విధంగా జరిగింది.

ఆ కోర్టులో గాంధీగారిచ్చిన వాఙ్మూలం వినేవరకూ వారి ఘనత వారి ఆత్మీయులకు కూడా అర్థం కాలేదనే అనుకోవలసివుంది. లిఖిత పూర్వకంగా దాఖలు చేయబడిన ఆ వాఙ్మూలంలో గాంధీగారు తమ్ము నిర్బంధించినతీరూ, కేసు విచారణచేసిన విధమూ అన్నీ పేర్కొంటూ నిరసనగా తాను చెప్పదలచిన సంగతుల నన్నింటినీ అందు పొందు పరిచారు. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిచే దరిమిలా రచియింపబడిన "కాంగ్రెసు చరిత్ర"లో ఆ వాఙ్మూలం ప్రముఖ స్థానాన్నే ఆక్రమించింది.

ఆ వాఙ్మూలాన్ని గాంధీగారు చదువుతూ వుంటే ఆయన నోటి నుంచి వచ్చిన ఆనాటి వాక్కులు యీనాడు కూడా నా చెవులలో మార్మోగుతూనే ఉన్నాయి. ఆ వాఙ్మూల సారాంశం ఇది: "ఈ భారత దేశపు నలుమూలల్లోనూ యీ మధ్య జరిగిన అల్లర్లకూ, చావులకూ, హత్యలకూ నేను స్వయంగా బాధ్యత వహిస్తున్నాను. ఈ సహకార నిరాకరణ ఉద్యమాన్నీ, శాసన ధిక్కార ప్రణాళికనూ నడుపుతున్నది నేనే. నా ఉద్యమాల కారణంగా జరిగిన, జరుగుతూన్న కర్మ కాండ కంతటికీ నేనే కర్తను, నేనే భర్తను. అందువల్ల నేను పూర్తిగా శిక్షార్హుణ్ణి. మరణ శిక్ష విధించినా ఆనందంగా స్వీకరిస్తాను. మీకు యథోచితమని తోచిన శిక్షను మీరు విధించవచ్చును."

ఈ పలుకులు గాంధీగారి నోటినుంచి వెలువడుతూంటే నాతో పాటు కోర్టుహాలులో కూర్చుని ఆ కర్మకాండను తిలకిస్తూన్న యావత్తు జనానికీ, స్త్రీ పురుష వివక్షత లేకుండా, కళ్ళంట నీళ్ళు కారాయి. ఆనాడు అక్కడ అల్లా కూర్చుని కన్నీరు కార్చిన జనంలో ఆంగ్లేయ స్త్రీ, పురుషులు కూడా ఉన్నారు. మానవాతీతులయిన దైవాంశ సంభూతులు తప్ప సామాన్యులెవ్వరూ అట్టి వాఙ్మూలం యివ్వలేరు.

## అనుయాయులకు ఆదేశం

రాజీ ప్రతి పాదనల రూపేణా అతిచాకచక్యంగా నాయకుల మధ్య భేదాభిప్రాయాలు కలుగజేసి కలతలు రేపాలని రీడింగ్ ప్రభువు వేసిన ఎత్తులకూ, గాంధీగారి వాఙ్మూల రూపేణా దేశవ్యాప్తంగా మానవ హృదయాంతరాళాలలో స్థిరపడిన భావాలకూ ఎంత వత్యాసం ఉంది! అయితేనేం ఒక విధంగా రీడింగ్ ఆశయాలు సిద్ధించాయనే అనుకోవచ్చు. ప్రతి పాదింపబడిన రాజీ సూచనలుచూసి, దాస్, మోతీలాల్‌గార్లు కూడా ఉల్టా సీదా అయ్యారనే అనవలసి ఉంటుంది. సెషన్స్ జడ్జి విధించిన ఆరు సంవత్సరాల కారాగార శిక్షానుసారంగా యరవాడ జైలులో గాంధీగారిని నిర్బంధించేవరకూ నేను గాంధీగారిని అనుసరిస్తూనే ఉన్నాను.

ఆఖరు సారిగా, జైలు ముఖ ద్వారాన్నిదాటి లోపల ప్రవేశిస్తూ, వారు నా ద్వారా దేశానికి అందజేసిన సందేశంలో కోరిన దేమిటో తెలుసా? దేశవ్యాప్తంగా ఖద్దరును వృద్ధిచేయమనీ, నిర్మాణ కార్యక్రమం బాగా కొనసాగించమనీని. అంతేకాదు. ఆ ఆదేశంలో తన్ను ఎవ్వరూ అనుసరించవద్దనీ ఉంది. అనగా వారి తర్వాత ఇంకొకరెవ్వరూ జైలుకు పోకుండా నిర్మాణాత్మక కార్యక్రమంలోనే నిమగ్నులవ్వాలన్నదే వారి ఆశయం అన్నమాట. దాన్తో ఆయన్ని అనుసరించి జైలుకు పోవాలి అన్న నా కోరిక విఫలం అయింది. అంతవరకూ అనేకసార్లు నేను ఆంగ్ల రాజ్యాంగ యంత్రాంగాన్ని ధిక్కరిస్తూ వచ్చినా, ఎందుచేతనో గాని పరిపాలకుల కబంధ హస్తం నాపై ప్రయోగింపబడలేదు. కాగా గాంధీగారి పరిస్థితి ఎల్లా పరిణమిస్తుందో గమనించాలనే ఉద్దేశంతో మాలో కొంతమందిమి బైటే ఉండి పోవాలనిన్నీ నిశ్చయించుకున్నాము.

గాంధీగారిని 1922, మార్చి 13వ తేదీనాడు నిర్బంధించారు. విచారణా, నేరారోపణా 18వ తేదీన జరిగాయి. శిక్షకూడా వెనువెంటనే ఆనాడే విధింపబడింది.

## ఆంధ్రలో ఖద్దరు ఉద్యమం

ప్రప్రథమంగా నిర్మాణ కార్యక్రమం జయప్రదంగా కొనసాగిన

కారణంగా పరిపాలకుల హృదయాలలో రేగిన కలకలమూ, త్రివిధ బహిష్కరణ ఉద్యమం సాధించిన జయ పరంపరలూ కాస్త గమనిద్దాం.

ఆంధ్రదేశం మొత్తంమీద అనేక ప్రాంతాలలో దేశీయ విద్యాలయాలూ, ఖాదీ ఉత్పత్తిస్థావరాలూ, పంచాయతీ కోర్టులూ స్థాపింపబడ్డాయన్న విషయం చదువరుల దృష్టికి యిదివరలోనే తీసుకువచ్చాను. భారతదేశం మొత్తంమీద ఖాదీఉద్యమం భారీఎత్తున సాగించిన రాష్ట్రాలలో ఆంధ్రరాష్ట్రానిదే అగ్రతాంబూలం. ఆంధ్రదేశంలో అన్ని ప్రాంతాలలోనూ వందలాది స్త్రీలు ఖద్దరు చీరెలలోనే కనబడేవారు. ఏ విధమయిన ప్రోద్బలమూ, చరఖాసంఘ సహకారమూ లేకుండానే, తమతమ స్వంత బాధ్యతలపైనే ఖాదీ కార్యక్రమాన్ని కొనసాగించిన నా అనుచరులే నాకు అనేకవిధాల గర్వకారణమయ్యారు. జిల్లాలవారీగా అనేక ప్రాంతాలలో ప్రాక్టీసు విరమించి ఉద్యమంలో జేరిన లాయర్లందరూ చాలావరకూ నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. ఇతర రాష్ట్రాలలోకంటె ఎంతో యెక్కువగా ఆంధ్ర వనితలు ఈ ఉద్యమంలో పాల్గొన్నారని వేరే చెప్పనక్కరలేదు. రాష్ట్రం మొత్తంమీద కాలేజీలనూ, ఇతర విద్యాలయాలనూ బహిష్కరించిన విద్యార్థులంతా కాంగ్రెసు కార్యక్రమాలలో పాల్గొన్నారు. కో అంటే కోటిమంది అన్న సామ్యంగా యువక వాలంటీర్లకు ఎప్పుడూ కొదవలేదు.

కాంగ్రెసుకున్న నిధులా అతి స్వల్పం. ఉన్న నిధులతో దేశవ్యాప్తంగా ఉద్యమం నడవడం వట్టిది, మహానడుస్తే మూన్నాళ్ళ పట్టపగలు; అని కాంగ్రెసేతరులూ, ప్రభుత్వంవారూ అనుకుంటూ వచ్చారు. అట్టి పరిస్థితులలో కాంగ్రెసు కమిటీవారినుంచి సహకారమూ, చరఖా సంఘంనుంచి ధనమూ లేకపోయినా దేశవ్యాప్తంగా యీ ఉద్యమం యిల్లా కొనసాగడం ప్రభుత్వంవారినీ, కాంగ్రెసు వ్యతిరిక్తులనూకూడా ఆశ్చర్యసాగరంలో ముంచేసింది.

### అవతారపురుషు డనిపించిన గాంధీ

గాంధీగారికీ, కాంగ్రెసుకూ ఏర్పడిన అవినాభావ సంబంధంతో

గాంధీ అంటే కాంగ్రెస్సు, కాంగ్రెస్సంటే గాంధీ అన్న భావం ప్రబలింది. పరాయిప్రభుత్వ పరిపాలనా విధానంతో బానిస జీవనం గడుపుతూన్న లక్షలాది జనానికి గాంధీగారి మాటన్నా, కాంగ్రెసువారి ఆదేశమన్నా వేదవాక్కే అయిపోయింది. సాక్షాత్తూ భగవంతుడే గాంధీ రూపంతో తమ్ము ఉద్ధరించడానికి అవతరించాడనే భావం ప్రజలలో నాటుకుంది. అంటే అప్పట్లో దేశం గాంధీగారిలాంటి ఉత్తమ నాయకునికోసం ఎదురుచూస్తోందన్నమాట! ఆటువంటి క్లిష్టసమయంలో గాంధీగారు ముందుకొచ్చి నాయకత్వం వహించేసరికి, పర్యవసానాలతో నిమిత్తం లేకుండా అగ్నిగుండంలోనికి దూకడానికిగూడా దేశవ్యాప్తంగా లక్షలాది జనం సంసిద్ధులయ్యారు.

దేశాన్ని ఉద్ధరించడానికి కంకణం కట్టుకున్న ఆనాటి నాయకులు, ఏరుదాటి ముందుకువేసిన అడుగు వెనక్కి తీసుకుని తిరోముఖం పట్టడానికి వీలులేని విధంగా, తమ్ము దాటించిన తెప్పల నన్నింటినీ తగులబెట్టారన్నమాట! కళాశాలలను విసర్జించి కాంగ్రెసులో జేరి జైళ్ళకు వెళ్ళిన విద్యార్థులు, ఉద్యమాన్ని విడిచిపెట్టి తిరిగి కాలేజీలలో జేరడానికి గాని, గవర్నమెంటు నౌకరీలను ఆశించడానికి గాని అణుమాత్రపు సావకాశంకూడా వుండేదికాదు. వారి జీవితాలు తప్పనిసరిగా ప్రజాసేవకి అంకితం అయిపోయాయన్నమాట!

కాంగ్రెసు సాధిస్తూన్న విజయాలు ప్రభుత్వంవారి కన్నుకుట్టాయి. దాన్తో నిర్మాణ కార్యక్రమ సాఫల్యాన్నికూడా వారు సహించలేకపోయారు. నిర్మాణ కార్యక్రమం కారణంగా దేశమంతా ఒకే త్రాటిమీదకు వచ్చేస్తోందని నకనకలాడారు. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాక సందర్భంలో దేశం కనబరచిన నిరసనా, బహిష్కరణా అన్నవి మరపురానివే కదా! అందువలన ఈ నిర్మాణ కార్యక్రమ విధానాన్ని ఒక పెద్ద వెన్నుపోటు పొడవాలని గాంధీగారిని కారాగారానికి పంపించక పూర్వం నుంచీ పరిపాలకులు ఎన్నో పదకాలు వేస్తూనేవున్నారు.

## ర్యాలి పంచాయతీ కోర్టు

తూర్పుగోదావరిజిల్లా సెంట్రలు డెల్టా రాజోలు తాలూకాకు

పెందిన 'ర్యాలి' గ్రామం యీ నిర్మాణ కార్యక్రమ సాధనలో బాగా ముందంజవేసి ఆదర్శప్రాయంగా తయారయింది. ఆ గ్రామంలో కాంగ్రెసువారు ఏర్పాటుజేసిన పంచాయతీ కోర్టు శక్తివంచన లేకుండా పనిచేస్తూ న్యాయ (సివిలు), రక్షణ (క్రిమినలు) లకు సంబంధించిన ఫిర్యాదుల నన్నింటినీ న్యాయంగానూ, నిష్పాక్షికంగానూ విచారించడం జరుగుతూన్న కారణంగా ఆ గ్రామంనుంచి ఒక్క కేసయినా యిటు మేజిస్ట్రేటు కోర్టుకుగాని, అటు మునసబు కోర్టుకుగాని పోలేదు. గ్రామంలోని పార్టీ విభేదాలూ, అంతఃకలహాలూ అంతరించాయి. కేవలం నాల్గణాలు కోర్టుఫీజు క్రింద చెల్లిస్తే ఎన్నివేల రూపాయల విలువగల లావాదేవీలయినా పంచాయితీవారు పరిష్కరించేవారు. క్రిమినలు కేసులూ అంతే. ఆ గ్రామంనుంచి ఒక్క పోలీసు కంప్లయింటయినా పైకిపోలేదు. అవసరాలకు కావలసిన ఖద్దరుబట్ట యావత్తూ గ్రామంలోనే ఉత్పత్తి అయ్యేది.

ఈ గ్రామాన్ని ఆదర్శంగా తీసుకుని చుట్టుపట్ల గ్రామాలెన్నో యీ విధానాన్ని అనుకరించడం ఆరంభించాయి. దాన్తో ఏదో ఒక విధంగా ఈ విధానాలకు స్వస్తి చెప్పించి తీరాలనే దృఢనిశ్చయం ప్రభుత్వంవారికి కలిగింది.

## పాలకుల దమననీతి

ఆ గ్రామ పెద్దలనూ, నాయకులనూ ఏదో ఒక సాకుతో ఒక సారేమిటి, రెండుసార్లేమిటి—అవసరమని వారు అనుకున్నన్ని సార్లు నిర్బంధించి జైళ్ళపాలుజేసి గ్రామంలో నాటుకుపోతూన్న ఆశయాలకు అంకుశపు పోటు పొడిచి మరీ వదిలారు. దీనినిబట్టి కాంగ్రెసువారి నిర్మాణ కార్యక్రమం గ్రామీణుల హృదయాంతరాళాలలో యెంత లోతుగా నాటుకుపోయిందో అర్థం అవుతుంది. అంతేకాదు. ఆ జిల్లాలోనూ, ఇతర ప్రాంతాలలోనూ, రాష్ట్రాలలోనూకూడా కాంగ్రెస్సును అణగద్రొక్కడానికి ప్రభుత్వంవారు అవలంబించిన బీభత్స విధానమూ అర్థం అవుతుంది. ఈ విధంగా కాంగ్రెసు నిర్మాణాత్మక విధానాన్ని అణగద్రొక్క గలిగిన ప్రభుత్వంవారు తమ దృష్టిని హిందూ-మహమ్మదీయ మైత్రిని ఛేదించడానికి మళ్ళించారు. హిందూ మహమ్మదీయ

సఖ్య సాధన కాంగ్రెసువారి ఆశయమూ, మూలసూత్రమూ, పునాదీ అన్న సంగతి మన విరోధులు ఎరగంది కాదు గదా!

# 4

## హిందూ-మహమ్మదీయ సాంఘిక సంబంధాలు

బెజవాడలో (విజయవాడలో) జరిగిన అఖిలభారత కాంగ్రెసు సమావేశమూ* మహమ్మదాలీ, షౌకత్‌అలీల కృషీ, మహమ్మదీయ స్వచ్ఛందసేవకుల సేవా, ఆంధ్రరాష్ట్రంలోనే గాక అనేక రాష్ట్రాలలో హిందూ-మహమ్మదీయ ఐకమత్య సౌధ నిర్మాణానికి శంకుస్థాపన చేశాయి. డాక్టరు కిచులీనీ, అలీద్వయాన్నీ, 'ఫత్వా' ఖైదీలనూ విడుదలజేసే పర్యంతమూ, రీడింగ్ ప్రభువు ప్రతిపాదించిన రాజీ సూచనలను పరిశీలించను అన్న గాంధీగారి తిరస్కృతితో స్వాతంత్ర్య సంపాదనార్థం దేశం యావత్తూ ఏ ప్రకారంగా ముందంజ వేస్తోందో ఆంగ్లేయులకు ఆకళింపయింది.

భారతదేశం స్వాతంత్ర్యం సాధించడంకోసం అవలంబించిన అహింసాత్మక విధానం తొలి ఘట్టాలలోనే సాధించిన విజయాలను ఏమాత్రం సౌమ్యదృష్టితో చూసివుండినా, కోట్లాది భారతప్రజ స్వాతంత్ర్యంకోసం ఎంతగా తహతహలాడుతూందో బ్రిటిషువారికి అవగాహన అయివుండేది. కాని మన దురదృష్టవశాత్తూ బ్రిటిషువారు హిందూదేశంపట్ల అవలంబించిన రాజ్యతంత్రానికి సౌమ్యదృష్టి అనేది పూర్తిగా లోపించింది. లార్డ్ రీడింగ్‌వంటి వ్యక్తికికూడా యీ దేశం పట్ల, దేశీయులపట్ల న్యాయమైన దృష్టి లోపించిందనీ, కుతంత్రాలతోనే రాజీ ప్రతిపాదనలు ప్రతిపాదింపబడ్డాయనీ మాకు ఆకళింపయింది. దాస్, మోతీలాల్‌గార్లు తాము గాంధీగారికంటె ఉన్నతస్థాయిలోనివారం

---

*1921 మార్చి-ఏప్రిల్ నిర్మాణ కార్యక్రమ విషయమై త్రివిధ బహిష్కారాల మీద తీర్మానాలుచేసి, దేశ ప్రజలతో కాంగ్రెసు కార్యక్రమం జరిపించాలని ఈ సమావేశం ఆదేశం.

అనే అహంభావంతో, ఆదిలోనే వారితో భేదాభిప్రాయం కలిగివున్నారు. నాగపూరు కాంగ్రెసు*లో ప్రతిపాదింపబడిన అహింసాత్మక సహకార నిరాకరణోద్యమ తీర్మానం అత్యధికమైన మెజారిటీతో ఆమోదింపబడి, గాంధీగారి కార్యక్రమానికి ప్రోత్సాహం లభించిన కారణంగా చిత్త రంజన్ దాసుగారు తప్పనిసరిగా దానికి తల ఒగ్గవలసి వచ్చింది. తన కుమారుడే గాంధీగారి ప్రథమ శిష్యుడయిన కారణంగా, మోతీలాల్ నెహ్రూగారుకూడా గాంధీగారి విధానాన్ని శిరసావహించవలసి వచ్చింది.

అందువలన దాస్, మోతీలాల్‌గార్లకు సహకార నిరాకరణోద్యమంపట్ల గాంధీగారికున్నంత విశ్వాసం లేదన్న విషయం విశదం అవుతూనేవుంది. గాంధీగారి 'పిలుపు' ను అనుసరించి, ప్రాక్టీసు విరమించి ఉద్యమంలో చేరేనాటికి దాస్, మోతీలాల్‌గారలు తమతమ రాష్ట్రాలలో చాలా ఉన్నతస్థాయిలో న్యాయవాదవృత్తి సాగించేవారు. అటువంటి ప్రముఖులే వృత్తులు విడిచి, ఉద్యమంలో చేరి జైళ్ళకు వెళ్ళడానికి సిద్ధమవడంచేత, పందలాది వారికి అనుచరులైనారు. గాంధీగారి పిలుపును అనుసరించే ఉద్యమంలో చేరినవారైనా, వారి హృదయాలలో గాంధీగారి విధానాలపట్ల ఏదో ధర్మసందేహంలాంటిది పీకుతూ వుండడంచేతనే వారిరువురూకూడా గాంధీగారి కార్యక్రమంలో పూర్తి విశ్వాసం ఉంచలేకపోయారు.

## లక్నో ఒప్పందం

స్వాతంత్ర్య సమరదీక్షనూ, సహకారనిరాకరణ విధానాన్నీ అవలంబించకపూర్వం కాంగ్రెసు నాయకులుగా ఉండేవారి కందరికీ గవర్నమెంటువారు మంచి మంచి ఉద్యోగాలు ఇవ్వడం అప్పుడు ఆచారంగా ఉండడంవల్ల, నూతనంగా కాంగ్రెసులో చేరినవారి దృష్టి, ఇటు ఆత్మార్పణతో కూడుకున్న అహింసాత్మక ఉద్యమవిధానం మీదనే కాక, అటు ఉద్యోగాన్వేషణమీద కూడా ఉండేదన్న విషయం మరువకూడదు. 1916 లో లక్నో కాంగ్రెసులో ఆమోదింపబడిన కాంగ్రెస్-ముస్లిం లీగ్ ఒప్పందమనే హిందూ మహమ్మదీయ సామరస్యపు బీజం దేశరాజకీయ

* 1920 లో జరిగినది.

వాతావరణంలో అనుకోకుండా నాటుకుంది. లక్నో ఒప్పందం మహాత్మా గాంధీ, తిలక్ మహాశయుల దీవనలు అందుకుని, 1921-22 సంవత్సరాలనాటికి సత్ఫలితాలను సాధించింది. ఈ హిందూ - మహమ్మదీయ సామరస్యబీజాలు 1917 లో హెచ్. ఇమాంగారి అధ్యక్షతను పుంజుకున్నాయి, 1918 లో బొంబాయిలో జరిగిన స్పెషల్ కాంగ్రెసు వారి ఆమోదాన్ని కూడ కట్టుకున్నాయి. ఆ తర్వాతకూడా ఏటేటా జరుగుతూ వచ్చిన వివిధకాంగ్రెసు సభలలో ఆమోదాలమీద ఆమోదాలు ఆ 'లక్నో పాక్టు'కు అందుతూనే వచ్చాయి.

లక్నోపాక్టు ఆధారంగా ఉద్యోగాది హోదాలలో మెట్టుపై మెట్టు ఎక్కగలిగిన ఆనాటి ముస్లిం నాయకులు అంతటితో ఆగక ఇంకా ఉన్నతస్థాయిలోకి రావాలనీ, ఇంకా ఎక్కువ ఫలితాలను సాధించాలనీ ఆందోళన సాగించారు. ఏటేటా తమ ప్రయత్నాలను ఉద్ధృతం చేస్తూ, లక్నోపాక్టులో తాము సాధించింది అత్యల్పమనీ, ఇంకా యింకా తమ హక్కులూ, హోదాలూ పెరగాలనీ వారు ఉత్తర హిందూస్థానంలో ఉర్దూ రచనలద్వారా ప్రచారంచేసి ముస్లింలను రెచ్చకొట్టారు.

ఈ రచనల పరిణామమూ ఫలితాలూ వగైరాలన్నీ 'హిందూ-మహమ్మదీయ సంఘర్షణలు' అన్న శీర్షికల క్రింద ముల్తాన్‌లో జరిగిన 1922 నాటి హిందూ మహమ్మదీయ సంఘర్షణలను గురించి వ్రాస్తూ వివరించాను. ప్రస్తుతం, యీ విషయాన్ని మనకూ, ప్రభుత్వం వారికీ మధ్య సాగుతున్న పోరాటంతో జతపరుస్తున్నాను. రక్తాన్ని చవిచూస్తూ, ఉద్యోగాది హోదాలకోసం ఉద్ధృతంగా ప్రచారం సాగించగలిగిన యోధులు, గాంధీగారి నిర్బంధంతో లక్నోపాక్టును పునఃపరిశీలన చేసి తీరాలని గట్టిగా పట్టుపట్టారు.

## ముల్తాన్ సంఘర్షణ: నా దర్యాప్తు

నిజానికి మొట్టమొదటిదైన ముల్తాన్ సంఘర్షణ* మతద్వేషం కారణంగా ఉత్పన్నం కాకపోయినా అప్పట్లో ఆ రూపం దానికి అంటగట్టారు.

* 1922 లో.

కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులుగా వ్యవహరిస్తూన్న మేము అప్పట్లో ఆ ముల్తాన్ తిరుగుబాటు సంభవించిన వెనువెంటనే ముల్తాన్ ప్రాంతం పర్యటించి, సంఘర్షణ కారణాలను పరిశీలింప సాగాము. ముఖ్యంగా నేను వర్కింగు కమిటీ మెంబరుగానేగాక 'స్వరాజ్య' పత్రికా సంపాదకునిగా కూడా, సంఘర్షణకు కారణాలను క్షుణ్ణంగా పరిశీలించదలచాను. నిజానికి ముల్తాన్ సంఘటనకూ, మతోద్రేకాలకూ సంబంధమే లేదు. ముల్తాన్‌లో పురపాలకసంఘం అన్నది యేర్పడ్డ నాటినుంచీ, అక్కడ పేరు ప్రఖ్యాతులూ, పలుకుబడీ ఉన్న 'పీరు' కుటుంబంవారు పురపాలక అధ్యక్షస్థానానికి ఒక వ్యక్తిని సూచించడమూ, ఆ వ్యక్తే యేకగ్రీవంగా ఎన్నిక అవడమూ జరుగుతూ వచ్చింది కాని, ఆ సంవత్సరం ఒక హిందూ కాంగ్రెసువాదికీ, పీరు కుటుంబీకులు నిర్ణయించిన మహమ్మదీయునికీ మధ్య పోటీ జరగడమూ, అందు హిందూ కాంగ్రెసువాది నెగ్గడమూ సంభవించడంతో 'పీరు' కుటుంబీకులకు చాలా అవమానం జరిగిపోయిందనే కారణంగా అక్కడ ఆ సంఘర్షణ జరిగింది.

చౌరీ చౌరా సంఘటన కారణంగా కాంగ్రెసువారు తమ ఉద్యమాన్ని విరమించడమూ, దొరికిందే సందుగా యుక్తియుక్తంగా వ్యవహరించిన లార్డ్ రీడింగ్ నేర్పరితనమూ కలిపి కాంగ్రెసులో చీలికలు తీసుకువచ్చాయి. దాస్, మోతీలాల్ ప్రభృతులు గాంధీగారినీ వారి సహకార నిరాకరణ విధానాన్నీ త్రోసిపుచ్చి అస్థానంలో 'కౌన్సిల్ ప్రవేశ పదకాన్ని' అమలుజరపాలనే నిశ్చయానికి వచ్చారు.

## చక్రవర్తులవారి వింత ప్రవృత్తి

నేనూ, చక్రవర్తుల రాజగోపాలాచారిగారూ కూడా వర్కింగు కమిటీ సభ్యులమే. అప్పుడే కలకత్తా జైలునుంచి విడుదల అయిన పండిత మదనమోహన మాలవ్యాగారూ, అబుల్ కలామ్ అజాద్‌గారూ కూడా మాతోబాటు ముల్తాన్‌లో సమావేశమయిన కార్యనిర్వాహక సభలో పాల్గొన్న వారే. ముల్తాన్ బాధితులకు వలయు సహాయం చేసి తీరాలనే నిశ్చయించుకున్నాం. పదివేల రూపాయలు బాధితులకు పంచి

పెట్టడానికిగాను మంజూరు చేశాం. అయితే రాజగోపాలాచారిగారు యేమయినా సరే సొమ్ము యివ్వనని బిగుసుకు కూర్చున్నారు. దాస్, మోతీలాల్ గార్లకు వ్యతిరేకంగా 'నో ఛేంజర్స్' (శాసన సభా బహిష్కార వాదులు) పార్టీకి నాయకునిగా రాజగోపాలాచారిగారిని నిలబెట్టి, వారికి యెంతో మద్దత్తు ఇచ్చాను. కాని నాకు రాజగోపాలాచారిగారితోనూ, వారి పద్ధతులతోనూ పరిచయం తక్కువ అవడాన్ని వారి వింత ప్రవృత్తి నాకు అర్థంకాలేదు. బాధితులకు పంచిపెట్టడానికి యివ్వవలసిన ఆ పదివేలరూపాయలూ వెంటనే మాలవ్యాగారికి యివ్వకపోతే, ఆయనా, అబుల్‌కలాం అజాద్‌గారూ 'నో ఛేంజి' దృక్పథానికి మార్తారని వారి అంచనా. నిర్బంధానికి పూర్వమూ, నిర్బంధానంతరమూ కూడా అజాద్ దాస్‌గారికి కావలసిన ముఖ్య స్నేహితుడే. అటువంటి పరిస్థితులలో బాధితులకు పంచిపెట్టుటకు యివ్వవలసిన పదివేలు యివ్వకపోతే, అజాద్ మా 'నో ఛేంజి' దృక్పథానికి ఎల్లా మారుతారని రాజగోపాలాచారిగారు వూహించారో నాకు అర్థం కాలేదు. కానీ నాటికీ నేటికీ కూడా బాధితులకు పంచిపెట్టాలనుకున్న డబ్బు, రాజగోపాలాచారిగారి చేతినుండి రానేలేదు. హిందూ-ముస్లిమ్ విచక్షణ లేకుండా 'బాధితుడు' అవునా కాదా అన్న దృష్టితోనే ఆ పదివేలూ పంచి పెట్ట దలచాం. కాని రాజగోపాలాచారిగారి కారణంగా యేమీ చెయ్యలేకపోయాం. ఏది ఏదయినా గాంధీగారిని నిర్బంధించిన కొద్ది రోజులలోనే జరిగిన ముల్తాన్ విప్లవం మా కందరికీ కనువిప్పు అయింది.

హిందూ మహమ్మదీయ మైత్రి మా ఆశయం అంటూ చాటుతూన్న కాంగ్రెసు అధినేత మహాత్మాగాంధీ నిర్బంధం జరిగిన తక్షణం మీరు నిలబెట్టిన అభ్యర్థిని కాంగ్రెసువారు ఎల్లా ఓడించారో చూచారా అంటూ 'పీరు' కుటుంబీకులను రెచ్చకొట్టాలని 'సానుభూతి' సాకుతో కొంత మంది స్వప్రయోజనపరులు ప్రయత్నాలు సాగించారు. కాని పీరు కుటుంబంవారు అప్పట్లో అట్టె పట్టించుకోకుండా ఆత్మనిగ్రహంతో శాంతం వహించారు. ఆర్నెల్ల తర్వాత జిల్లాబోర్డు ఉపాధ్యక్ష పదవికి ఎన్నిక విషయంలో తిరిగి అదే ప్రకారంగా 'పీరు' అభ్యర్థి కాంగ్రెసువారి

చేతిలో ఓడడం సంభవించే సరికి, కథ అడ్డం తిరిగింది. దాన్తో అను కోని విధంగా అగ్నిరాజుకుంది. కొద్ది రోజులలోనే కొంప లంటు కున్నాయి. తుగ్లక్ రోజులలో కూడా జరుగనట్టి ఘోరపరిణామాలు జరిగిపోయాయి. ముల్తాన్‌లో కొట్లాటలు విజృంభించాయి.

ఈ సందర్భంలో నేను సేకరించిన వివరాలన్నీ వేరే శీర్షిక క్రింద విపులంగా విశద పరుస్తాను. ఒక్క విషయం మాత్రం పరమ సత్యం. ముందుగా యోచించి వేసుకున్న ప్లాను ప్రకారంగా పట్నం నలుమూలలా ఒకేసారి అగ్నిజ్వాలలు లేచాయి. కుట్రదారులు ముందుగా ప్లాను వేసుకున్నారన్నది మాత్రం ఖాయం. ఏమయితేనేం 1922 లో గాంధీగారి నిర్బంధానంతరం వారి యోచనతో ప్రారంభింపబడ్డ హిందూ-మహమ్మదీయ ఐకమత్య సాధనికి మాత్రం గొడ్డలిపెట్టే అయింది.

లక్నోపాక్ట్ జరిగిన తేదీనుండీ జాతీయ దృక్పథం రాజబాటను వదలి గళ్ళిల ద్వారా ఉద్యోగాది అన్వేషణా విధానాలలో పడిపోయింది. గాంధీగారు నిర్బంధింపబడేవరకూ, లక్నోపాక్ట్ పునఃపరిశీలన చెయ్యాలి అనే ఆందోళన పుట్టడానికే అవకాశం కలుగలేదు. సందు దొరికే సరికి ప్రభుత్వాధికారంలోనూ, పదవులలోనూ ఉద్యోగాలలోనూ ఉన్న పెద్దలే అనేక విధాల ప్రోద్బలం యిచ్చి, లక్నోపాక్ట్‌లో మార్పులు వచ్చి తీరాలి, మనకు యింకా ఎన్నెన్నో హక్కులు భుక్తం కాగల అవ కాశాలు లభించాలి అనే నినాదాలూ, కోర్కెలూ వగైరా లేవనెత్తారు. అవి హద్దులుమీరి ఉద్ధృతంగా విజృంభించాయి.

గాంధీగారి నిర్బంధంతోనూ వారికి విధింపబడ్డ ఆరు సంవత్స రాల కారాగార శిక్షకారణంగానూ, దాస్, మోతీలాల్, గాంధీజీల మధ్య ఉత్పన్నం అయిన భేదాభిప్రాయాలతోనూ కాంగ్రెసుకు దుర్దినాలు ఆరంభం అయ్యాయని ఒప్పుకోక తప్పదు. అప్పట్లోనే మేము మేల్కాంచి ముందు జాగ్రత్తలు తీసుకోవలసింది. శాంక్షన్ అయిన పదివేలూ కూడా ఎల్లాగయినా బాధితులకు అందజేసి ఉండవలసింది. కాని రాజగోపాలాచారిగారు అజాద్‌ను తమ పక్షానికి త్రిప్పుకోడానికి యిదే అదను అని భావించి, చేసిన కాలయాపన కారణంగా నిమిషాల

మీద కొంపలు అంటుకుంటాయన్న సంగతే మాకు స్ఫురించక పోవడం దురదృష్టం. అప్పటికీ కొందరు మిత్రులు రాబోవు విపరీత పరిణామాల విషయం హెచ్చరికలు చేశారు.

మోతీలాల్ రాజాజీగార్లు కలసి సమిష్టిగా హిందూ-మహమ్మదీయ సఖ్యసాధనకు పాటు పడడానికి బదులు, వారిలో వారు 'నో ఛేంజ్' 'ప్రో ఛేంజ్' విధానాల పేరిట వివాదాలలోపడి, తమ తమ పార్టీల అభివృద్ధుల కోసమే పాటుపడ్డారుగాని సత్వర చర్యలు తీసుకోకుండా 'అత్తగారి మీదకోపం కొద్దీ కూతుర్ని కుంపట్లో కూచోపెట్టిం' దన్న సామెతగా, ముల్తాన్ బాధితులను సమయానికి ఆదుకోడానికి బదులు, మంజూరైన పదివేల విరాళాన్నీ త్రొక్కి-పెట్టి, ఉద్యమానికే తీరని అపకారం చేశారు. పార్టీల బలాబలాలు వృద్ధిచేసుకునే ఉద్దేశంతోనే దేశవ్యాప్తంగా ప్రచారంచేసి తమ తమ అభిప్రాయాల కనుగుణంగా లోకుల్ని మార్చాలనే తాపత్రయంతో భారతదేశపు టన్ని మూలలకూ వెళ్ళి దాస్, మోతీలాల్‌గార్లు ప్రచారాలు సాగించారు.

## షహజాన్‌పూర్ సంఘటన

ముల్తాన్ సంఘటనల అనంతరం, పంద్రెండుమాసాల తర్వాత షహజాన్ ఉదంతం జరిగింది. ఈ రెండు ఉదంతాల మధ్యకాలం అంతా, 'నో ఛేంజ్', 'ప్రో ఛేంజ్' పార్టీల స్వంత ప్రచారాలతోనే వృధా అయిపోయింది. గాంధీగారు జైలుకువెళ్ళిన కారణంగా, కార్య నిర్వాహక వర్గీయులలో ఉత్పన్నమయిన పరిస్థితులు ఇలా పరిణమించాయి. అనుకున్న ప్రకారం బాధితులకా సహాయం చేయలేక పోయాము. నిజానికి యీ కారణంగా కార్యనిర్వాహక వర్గంనుండి తప్పుకోవాలని తలచాను. కాని, రాజగోపాలాచారిగారు తాము చేస్తున్న తప్పును గ్రహించగలుగుతారనీ, ధనాన్ని యిచ్చి తీర్తారనీ, తిరిగి మన కాంగ్రెసు మర్యాద కాపాడగలుగుతామనీ తలుస్తూ కార్యనిర్వాహక వర్గంలో ఉండిపోయాను. వీలయినప్పుడల్లా రాజగోపాలాచారిగారిని హెచ్చరిస్తూ ఎన్ని తంటాలుపడ్డా రాజాజీగారి కుందేటికి మూడే

కాళ్ళవడాన్ని, వారి పట్టు భల్లూకపు పట్టయిపోయింది. ఆ సంగతి పూర్తిగా నిర్ధారణయ్యేనాటికి షహజాన్‌పూర్ సంఘటనకూడా జరిగే పోయింది.

వెంటనే నేను స్వయంగా బయల్దేరివెళ్ళి అక్కడ జరిగిన ఉదంతాన్ని గురించి వివరాలు సేకరించాను. ఇదీ ముల్తాన్ సంఘటనంత ఉద్రిక్తమయినదే, ముల్తాన్-షహజాన్‌పూర్ సంఘటనల మధ్య కాలం పండ్రెండు మాసాలున్నా, మా కాంగ్రెసు పెద్దలూ నాయకులూ ఏ విధంగానూ కలుగ జేసుకోకుండా చూపిన అలసత కారణంగానే షహజాన్‌పూర్ సంఘటన జరిగిందని ఆ ప్రాంతంలో వుంటూవున్న కాంగ్రెసువారేగాక, ఏ పార్టీకీ చెందని పెద్దలుకూడా అభిప్రాయం వ్యక్త పరిచారు. ఆ పండ్రెండు మాసాలలోనూ, హిందూ - మహమ్మదీయ స్పర్ధల విషయంలో కాంగ్రెసువారు పట్టించుకోని కారణంగా, లక్నో పాక్ట్‌లో మహమ్మదీయులకు తీరని అన్యాయమే జరిగిపోయిందనే ప్రచారం బాగా బలపడిపోయి, ఆ లక్నో ప్యాక్ట్‌ను తిరగదోసి ముస్లింలకు ఇంకా ఇతోధికంగా ఉపకరించే విధానంగా ఆ పాక్ట్‌ను మార్చాలనే నినాదం బలాన్ని చేకూర్చుకుంది. అంతేకాదు. వృత్తి వ్యాపారాలన్నీ హిందువుల చేతులలో ఉండడాన్నే, మహమ్మదీయులలో బీదరికం తాండవ మాడుతోందనే ప్రచారం సాగింది. నా విచారణ సారాంశంగా షహజాన్‌పూర్ సంఘటన ఆర్థికమైన ఇబ్బందులవల్లా, అధిక ధరలవల్లా జరిగిందని రుజువయింది. ఈ ఆర్థికపు టిబ్బందులకూ, ధరల పెరుగుదలకూ మూలకారణం హిందూ వ్యాపారస్థులదేనన్న నినాదం బలపడింది. ఇట్టి విధంగా హిందూ-మహమ్మదీయ సాంఘిక సంబంధాలు క్లిష్టపరిస్థితులకు లోనయ్యాయి.

గాంధీగారిని నిర్బంధించేవరకూ అహింసాత్మక విధానానుగుణంగానే వ్యవహరించిన ఖిలాఫత్ వాలంటీర్లూ, మహమ్మదీయ స్వఛ్ఛంద సేవకులూ షహజాన్‌పూరు సంఘటన నాటికి నూతన పంథా త్రొక్కి, క్రొత్త తీరున వ్యవహరించడానికి నిశ్చయించుకున్నారన్న

మాట! ప్రఖ్యాత హిందూ కాంగ్రెసు నాయకులవద్దా, గ్రామంలోని ఇతర పెద్దలవద్దా నేను స్వయంగా సేకరించిన సాక్ష్యంలో, మహమ్మదీయ స్వచ్ఛంద సేవక దళాలు పనిచేస్తూన్న తీరును గురించి విపులంగా సమాచారాన్ని సేకరించాను. కత్తిసామూ, కర్రసామూలాంటి హింసాత్మక పద్ధతులలో మహమ్మదీయ వాలంటీర్లకు శిక్షణ గరపబడుతోందనీ, పైకి కాంగ్రెసు శాంతి దళ చిహ్నాన్ని ధరించినా, అంతరంగికంగా హింసాత్మక విధానాలలో తర్ఫీదు పొందుతున్నారనీ తెలిసింది.

1941-42 సంవత్సరాలలో జిన్నాగారూ, ముస్లింలీగువారూ కనబరిచిన వింత ధోరణి అర్థం చేసుకోవాలంటె, మనం వెనుకటి చరిత్ర పుటలు తిరగవేసి, లక్నో పాక్ట్ దగ్గరనుంచీ జరిగిన సంఘటల నన్నింటినీ నెమరు వేసుకోవాలి. ఈ రోజులలో నా జీవితమంతా నేను కాంగ్రెసు సేవలోనే వినియోగించాను. అందువలననే వారికీ మనకీ ఉన్న అభిప్రాయ భేదాలు ఎల్లా దూరతీరాలకు జేరుకున్నాయో, ఏ విధంగా వారికీ మనకీ మధ్య ఉన్న ప్రవాహం విస్తరించిందో, త్రోపి రాజే అయినా ఆటకట్టని విధంగా పరిస్థితులు మార్పుచెంది బిగుసుకు పోయాయో అర్థం అవుతుంది. ఇట్టి క్లిష్ట పరిస్థితులు ఉత్పన్నం అవడానికి తోడుపడిన మూలకారణాలూ, పేరుకుని బైటపడ్డానికి వాడబడ్డ చికిత్సా విధానమూ ముందు తరాల వారికయినా సరిగా అవగాహన కావడానికి గాను, జరిగిన చారిత్రక సంఘటనలు వివరంగా వివరింపబడాలి గదా!

భావి భద్రతకోసమూ, దేశ సౌభాగ్యంకోసమూ, అవలంబింప తగ్గ రాజ్యాంగ విధానం విషయమై అనుసరించవలసిన పద్ధతులను గురించీ ఆఖరుసారిగా ఆ కాంగ్రెసు అధినేతలను అడిగే యత్నంలో ఆనాడు నేనున్నాను. మత సామరస్యం కొరవడిన కారణంగా ఉత్పన్నమయిన పరిస్థితులను గురించి విపులీకరించిన సందర్భంలో ఈ నా తుది నిర్ణయాన్ని గురించి విశద పరచాను.

ఎక్కడ యే ప్రాంతంలో సాంఘిక సంఘర్షణ జరిగినా, వెను వెంటనే ఆ ప్రాంతానికివెళ్ళి, దర్యాప్తు సాగించి, అక్కడ ఉన్న పరిస్థితులను అవగాహన చేసుకోవడమన్నది కేవలం కాంగ్రెసు కార్య

నిర్వాహక సంఘ సభ్యునిగా మాత్రమే కాదనీ, "స్వరాజ్య" పత్రికా సంపాదకునిగా కూడా నా విధిని నిర్వహించాలనే అభిలాషే నన్నల్లా లాక్కుపోయేవని లోగడ మనవిచేసి వున్నాను. 1922 ఆరంభంలో ముల్తాన్ సంఘర్షణ, తర్వాత షహజాన్‌పూర్ సంఘర్షణ చరిత్రాత్మకం అయ్యాయి.

## అఖిల పక్ష సమావేశం

అటువంటి విప్లవాత్మక దినాలలోనే, ఆ 1922 లోనే సర్ శంకరన్‌నాయరుగారి అధ్యక్షత క్రింద బొంబాయిలో అఖిల పక్ష రాజకీయ మహాసభ జరిగింది. ఒకప్పుడు సర్ శంకరన్‌నాయరు కాంగ్రెసు అధ్యక్ష స్థానాన్ని అలంకరించిన వ్యక్తే. ఆయన రాజకీయ విధానానికి ఆయనేసాటి. రీడింగ్ ప్రభువు ప్రతిపాదించిన రాజీ సూచనలను పరిశీలించగల వ్యక్తి సర్ శంకరన్‌నాయరేనని, శంకరన్‌నాయర్‌లాంటి రాజకీయ వేత్తే ఆ ప్రతిపాదనలకు సరియయిన నిర్వచనమూ, స్థానమూ ఇవ్వగలడనే తలంపుతో మాలవ్యాజీ వారిని అధ్యక్ష స్థానంలో నిలిపి ఆ బొంబాయి సమావేశానికి ప్రత్యేకత కలిగించారు.

నిజంగా ఆయన హృదయాంతరాళంలో శంకరన్‌నాయర్‌వల్ల కార్యసాధనం అవుతుందనే నమ్మిక ఉంది. కాని గాంధీ విధానాలకు శంకరన్‌నాయరు ప్రబల విరోధి అన్నమాట మాలవ్యాగారు విస్మరించి ఉండవచ్చును. గాంధీగారి విధానాలనీ, కాంగ్రెసు చర్యలనూ ఖండించి, బ్రిటిషువారియందు తనకున్న గౌరవాభిమానాలనూ, విశ్వాసాన్నీ రుజువు పరచుకోవచ్చుననే ఆలోచనతో శంకరన్‌నాయరు ఆ అధ్యక్ష స్థానానికి అంగీకరించాడు. ఆ సమావేశంలో గాంధీగారూ ఉపన్యసించారు.

## అధ్యక్షుని 'వాకౌట్'

సర్ శంకరన్‌నాయరు ఉపన్యసిస్తూ, ఉపన్యాసం మధ్యలో ఉద్రేకపూరితుడయి, తన అధ్యక్ష స్థానం విడిచి, నిరసన సూచకంగా సభామండపాన్ని వదలి, ఆచార విరుద్ధంగా బైటకు వెళ్ళిపోయాడు. ఆ ఆవేశంలో తన టోపీని అక్కడ వదలి, ఇంకొకరి టోపీని నెత్తిన పెట్టుకుని బైటకు నడిచాడు.

బొంబాయి పట్టణవాసీ, పేరున్న బారిష్టరూ అయిన జోసఫ్ బాప్టిస్టాగారు వారి వెనుకాలే గట్టిగా కేకవేస్తూ, "శంకరన్‌నాయరుగారూ! మీతలను ఇక్కడవదలి, నాతలను మీ భుజాలమీద ఎక్కించుకున్నా" రని అరిచారు. శంకరన్‌నాయరు గేటుదాటేలోపలే ఆయన్ని పట్టుకుని, 'నీ టోపీని వదలి నా టోపీ పట్టుకుపోతున్నావయ్యా' అంటూ హెచ్చరించి తన టోపీని తాను తెచ్చుకున్నారు.

ఈ ప్రకారంగా నడచిన యీ కాన్ఫరెన్స్‌లో చెప్పుకోదగ్గ విషయాలేవీ సాధింపబడలేదు. తర్వాత సర్ శంకరన్‌నాయరు "Gandhi and Anarchy" అన్న ఒక పుస్తకం వ్రాశాడు. ఈ దేశానికి కావలసిన రాజకీయ స్వాతంత్ర్యం విషయంలో ఆయన కున్న అభిప్రాయం అది.

ఈ సంఘటనలన్నీ 1922 మార్చి 13 వ తేదీనాడు జరిగిన గాంధీగారి నిర్బంధానికి ముందే సంభవించి వుండడాన్ని, వైస్రాయి గారికీ ఆయన కౌన్సిల్ వారికీ బలం చేకూరింది. ఆ రోజులలో యీ విషయాలపై వచ్చిన విమర్శనలూ, నిరసనలూ-అవి యేమూలనుంచి, ఎవరివద్దనుంచి వచ్చిన వయినా-గాంధీగారు పట్టించుకోలేదు. పైగా అహమ్మదాబాదు సెషన్సు కోర్టులో ఆయన ఇచ్చిన "Sermon on the Mount" వంటి వాఙ్మూలంతో ఆయన కీర్తి నలుదిశలా దేదీప్యమానంగా వ్యాపించింది.

# 5

## గుంటూరు జిల్లాలో పన్నుల నిరాకరణ

**1922** వ సంవత్సరం చరిత్రాత్మక మయినదని చెప్పక తప్పదు. అది మనవారి కందరికీ చాలా ముఖ్యమయిన సంవత్సరం. నాగపూరు కాంగ్రెసులో * ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీని ప్రత్యేకంగా గుర్తించారు. అప్పటికే చాలాకాలం క్రిందట ఆంధ్రరాష్ట్ర

* 1920 లో

ఉద్యమం దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారూ, గొల్లపూడి సీతారామశాస్త్రిగారూ స్థాపించారు. వారుభయులూ కలిసి 1922 లో గుంటూరులో పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభించడంతో కాంగ్రెసు ఉద్యమం నూతన స్థాయిని అందుకుంది. వెంకటప్పయ్య పంతులగారు మంచి కీర్తి కెక్కిన హైకోర్టు న్యాయవాదిగా గుంటూరులో ప్రాక్టీసు చేస్తూ ఉండేవారు. ప్రజాసేవ చేద్దామనే సదుద్దేశంతో, గాంధీగారి సత్యాగ్రహోద్యమానికి ఎంతో ముందుగానే ప్రాక్టీసు విరమించుకున్న పెద్దలు వారు. వెనుకటి రోజులలో ఆ పాతకాలపు లెజిస్లేటివు కౌన్సిల్‌లో సభ్యులుగా కూడా పనిచేశారు.

గాంధీగారి కాంగ్రెసు ఉద్యమ ప్రారంభ దినాలలో నేనూ, వెంకటప్పయ్య పంతులుగారూ బెజవాడనుంచి గుంటూరు వరకూ కలసి రైల్లో ప్రయాణం చేయడం సంభవించింది. ఆ అవకాశాన్ని పురస్కరించుకుని వారిని కౌన్సిల్ సభ్యత్వానికి రాజీ యివ్వవలసినదని కోరాను. వారు ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. నేను చాలా దూరం చెప్పాను. 1921 లోనూ, దరిమిలానూ కూడా వృత్తులను విరమించి ఉద్యమంలో జేరిన న్యాయవాదులను గురించీ ఉద్యమ ప్రాశస్త్యాన్ని గురించీ, ఎంతో వివరంగా చెప్పాను. నా ప్రోద్బలం వల్ల ఆయన మనస్సు మార్చుకుని గాంధీగారి ఉద్యమంలో జేరడమే గాకుండా ఆయనకు ఎంతో సన్నిహిత శిష్యులయ్యారు. అంతేకాదు. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా ఎన్నికయిన ప్రథమ ఆంధ్ర సభ్యుడు ఆయనే. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షస్థానంకూడా మొదటిసారి ఆయన్నేవరించింది.

## ఉద్యమ నాయకులు

గొల్లపూడి సీతారామశాస్త్రిగారు కూడా గుంటూరులో మంచి పలుకుబడీ, ప్రాక్టీసూ ఉన్న హైకోర్టు న్యాయవాదే. ఆయనా, నేనూ కలసి కొన్ని జమీందారీ లావాదేవీలలో ఆ జిల్లాలోని సబార్డినేట్ కోర్టులలో పని చేశాము. వృత్తిలో ఆయన చాలా ఘనుడు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పడిన నాటినుంచీ ఆయనే దానికి ప్రముఖ కార్యదర్శి. గాంధీగారి "పిలుపు"ను మన్నించి, ఆయనా న్యాయవాదవృత్తిని

విరమించినవారే. ఆయన వేలాది జనులముందు నిలబడి ఉపన్యసిస్తూన్న సమయంలో, వరుమానాలూ, ఖర్చులూ, ఆర్థిక అవసరాలు మున్నగు విషయాల ప్రసక్తి వస్తే, కాగితాలతోటీ, కలాలతోటీ నిమిత్తం లేకుం డానే పెద్ద పెద్ద ఆర్థిక వేత్తలను మించి మాట్లాడగలశక్తి ఆయన కుంది. వారూ, వెంకటప్పయ్య పంతులుగారూ కలసి దేశస్వాతంత్ర్యా నికి అవసరమయిన యే త్యాగానికయినా సంసిద్ధు లయ్యారు.

గాంధీగారూ, సర్దార్ వల్లభాయ్ పటేల్‌గారూ బార్డోలీలోనే పన్నుల నిరాకరణ ఉద్యమం ప్రారంభించాలని నిశ్చయించుకున్న సంద ర్భంలో సీతారామశాస్త్రిగారూ, వెంకటప్పయ్య పంతులుగారూ కలిసి అట్టి పన్నుల నిరాకరణ గుంటూరులోనే గాక, ఆంధ్రరాష్ట్రపు టన్ని జిల్లాల లోనూ ఆరంభించడానికి కుతూహలం చూపించారు. కాని వారి ఉత్సా హంలో, అటువంటి ఉద్యమాన్ని అణగద్రొక్కడానికి ప్రభుత్వం తీసు కునే తీవ్ర చర్యలకు కృషీవలు లందరూ తట్టుకుని నిలబడగలరా అన్న విషయాన్ని బాగుగా ఆలోచించి ఉండిఉండరు. పన్నుల నిరాకరణ ఉద్యమపు పర్యవసానాలన్నీ క్షుణ్ణంగా ఎరిగివున్న మహాత్ముడుమాత్రం, తమ శక్తినీ బలాన్నీ పూర్తిగా అవగాహన చేసుకోకుండా ఉద్యమం లోనికి దిగవద్దని హెచ్చరిస్తూ, ప్రజలలో ఉండే విశ్వాసాన్నీ శక్తినీకూడా గమనించవలసిందని ఆదేశించారు.

## పెదనందిపాడులో మిలిటరీ మార్చ్

అప్పట్లో నేనూ కార్యనిర్వాహక వర్గ సభ్యుడనే అయి ఉన్నా నాతోకూడా సంప్రతించకుండా, వా రుభయులూ ఉద్యమాన్ని ప్రారం భించారు. ఇట్టి పరిస్థితులలో ఆరంభమయిన ఉద్యమం విద్యుత్‌వేగంతో జిల్లా అంతటా ప్రాకిపోయింది. ఉన్నవ లక్ష్మీనారాయణగారు పల్నాడు ప్రాంతపు ఆటవికశాఖ పన్నుల నిరాకరణ ఉద్యమంగా తమ స్వంత పర్య వేక్షణ క్రింద ప్రారంభించారు. రైతులందరూ ఈ పన్నుల నిరాకరణ ఉద్యమానికి శతవిధాల స్వాగతం చెప్పారు. స్వరాజ్యం వచ్చేస్తోంది, పన్నులు చెల్లించకుండానే హాయిగా మనం జీవించగలం అనే వా రూహిం చారు. రివెన్యూ అధికారులు ప్రజల వద్దనుంచీ, రైతుల వద్దనుంచీ

ఏవిధమైన పన్నులూ వసూలు చేయలేని స్థితికి వచ్చేసరికి పరిస్థితులు విషమించాయి. గుంటూరు నాయకులంతా బాపట్ల తాలూకా పెదనంది పాడు ఫిర్కాకు చెందిన సుమారు నూరు గ్రామాలలో ఈ పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ముమ్మరంగా సాగించే కృషిలో నిమగ్ను లయ్యారు. గుంటూరు జిల్లాలోని అనేక గ్రామాలకు చెందిన గ్రామో ద్యోగులందరూ (మునసబు, కరణం, వెట్టివాళ్ళు వగైరా) రాజీనామా లిచ్చి ఈ ఉద్యమంతో సహకరించారు. ఉద్యమం ఘనవిజయం సాధిం చింది. రివెన్యూ డిపార్టుమెంటు ఉద్యోగుల జీతాలకు సరిపడినంత ధనం కూడా పన్నుల రూపంగా వసూలు కాలేదు. కలక్టరుగారి ప్రయత్నాలన్నీ వృథా అయ్యాయి.

ఇప్పుడు * ప్రభుత్వం వారికి సలహాదారుగా పనిచేస్తూన్న రూథర్ ఫర్డ్ అప్పుడు స్పెషల్ డ్యూటీమీద, పన్నుల వసూలు నిమిత్తం ఆ జిల్లాకు ప్రత్యేకంగా పోస్టు అయ్యాడు. ఆయన చాలా ప్రతిభావంతుడే. అయితేనేం. పన్నుల వసూళ్ళ విషయంలో ఆయన చాకచక్యం అంతా బూడిదలో పోసిన పన్నీరులా నిరుపయోగమయింది. ఆయన ఒక పెద్ద మెషన్‌గన్ తీసుకువచ్చి పెదనందిపాడు ఫిర్కా మధ్యగా స్థాపిం చాడు. పన్నులు యివ్వకపోతే ఆ ప్రాంతం అంతా భస్మీపటలం అవు తుందనే భీతికొద్దీ ప్రజలు పన్నులు యిస్తారని ఆయన భావించాడు. ప్రభుత్వం వారి శక్తి సామర్థ్యాలను ప్రజలు గ్రహించగలరనే దృష్టితో, మిలటరీని పిలిపించి ఆ గ్రామాలలో మార్చి చేయించాడు. ఎరెస్టు, లాఠీ ఛార్జీలూ విరివిగా జరిపించి, ఆ రీతిగా ప్రజాహింస సాగించాడు.

టామీలకి మిరప పళ్ళ విందు

రాబోవు విషమ పరిణామాలను ఊహించి, ప్రభుత్వంవారు పెట్టబొయ్యే బాధలను ప్రజలు తట్టుకోలేరేమోననే భావనతో, పరిస్థితు లను పరిశీలించి, రిపోర్టు చేయవలసినదిగా కోరుతూ ప్రదేశ కాంగ్రెసు కమిటీవారు ఒక ఉపసంఘాన్ని నియమించారు. ఆ ఉపసంఘ సభ్యునిగా నేను, కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, దాట్ల నారాయణరాజుగార్లతో

* 1940-41

కలసి జిల్లా అంతా పర్యటించి ఉద్యమం సాగించడం విషయమై మా అభిప్రాయాన్ని వెల్లడించాము.

ప్రభుత్వపు ఒత్తిడితో ప్రజలలో నైతిక పతనం ఆరంభం అయింది. మిలటరీవారు ప్రజలను పలువిధ హింసా కాండలకు లోను జేశారు అని వ్రాస్తూ మన ప్రాంతం గురించి, మన మిర్చి పంట గురించి, మా జీవితంలో మొట్టమొదటిసారిగా జూచిన 'టామీ'లో వింత ప్రవర్తన గురించికూడా వ్రాయకుండా ఉండలేకపోయాము. అధికారులుగా వచ్చిన ఆంగ్లేయులకు మిరప పండ్లన్నవి మామూలుగా తినే పండ్లు కావన్న సంగతి కూడా తెలియదు. ఒకసారి వారంతా ఒక పండిన మిరపచేలోపడి, మనోహరంగా ఎర్రగా పండిన ఆ మిరప పండ్లను తినాలనే ఆతురతకొద్దీ, ఒకచేలోపడి చేతుల నిండుగా మిరప పళ్ళను కోసుకుని గబగబా నోళ్ళల్లో క్రుక్కుకున్నారు. కొద్ది క్షణాల లోనే నాలుకలు పీక్కుంటూ బాధా నివారణార్థం మురికి గుంటల లోని నీళ్లని కూడా త్రాగడానికి సిద్ధపడ్డారు. ఇటువంటి ముక్కూ మొహమూ ఎరుగని బ్రిటిషు సోల్జర్ల చేతులలో మన దేశీయుల మంచీ, మర్యాదలు ఎల్లా నిలవగలుగుతాయి? ఈ సందర్భంలో మిలటరీవారు, పోలీసువారు చేసిన దుండగాలు వివరంగా వర్ణించడం అనవసరం. కర్షకుల స్థితి అధోగతి పాలయిందన్న ఒక్కముక్క చాలు. వారు యీ పరిస్థితిని తట్టుకోలేకపోయారు.

## విరమణకు మా సలహా

ఉద్యమం ఒక్క వంద గ్రామాలలోనే ప్రారంభింపబడ్డా జిల్లా మొత్తం అంతా సానుభూతితో పెద్ద యెత్తున హర్తాల్ ఆరంభం అయింది. నాలుగు మాసాలు దాటినా జిల్లా మొత్తంమీద నాలుగు పైసాలయినా పన్నుల రూపంగా వసూలు కాలేదు. ఉద్యమం ఇంకా సాగిస్తే ప్రజలు ఈ పరిస్థితులకు తట్టుకోవడం దుస్సహం అవుతుందనే భావనతో జిల్లా అంతా పర్యటించిన నేనూ, నాగేశ్వరరావు పంతులు గారూ కూడా ఉద్యమాన్ని విరమించడమే మంచిదని సూచించాము.

క్లిష్ట సమయంలో గుంటూరులో ప్రారంభింపబడిన యీ పన్నుల నిరాకరణ ఉద్యమం గాంధీగారి అభిప్రాయానికి భిన్నంగా ఆరంభింప బడ్డది అంటూ డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిచే వ్రాయ బడిన ఉత్తరం ఒకటి "జన్మభూమి" పత్రిక ప్రచురించింది. దరిమిలా 'సర్' కూడా అయిన థామస్ రూథర్ ఫర్డ్ యీ 'జన్మభూమి' ప్రతు లను విరివిగా కొని, జిల్లా కేంద్ర స్థానాలలో పెక్కుచోట్ల తానే స్వయంగా ఆ కాపీలను పంచిపెట్టడం ఆరంభించాడు.

ఈ పరిస్థితుల నన్నింటినీ గమనించే మేము ఉద్యమ విరమణకి సలహా యిచ్చాం. మా ఉపసంఘపు రిపోర్టు ఆధారంగా, ప్రదేశ కాంగ్రెసువారు ఉద్యమాన్ని విరమించి పన్నులను ఇచ్చివేయవలసిన దంటూ ఆదేశించారు. అంతే, వారం రోజులు తిరక్కుండానే కొన్ని లక్షల రూపాయలు పన్నుల రూపేణా పూర్తిగా ట్రెజరీలలో జమ కట్ట బడింది.

## ప్రభుత్వానికి కనువిప్పు

ఇటువంటి క్లిష్ట పరిస్థితులలో ఉద్యమం ద్రవించి స్రవించి పోయినా, పరిపాలకులకు మాత్రం అది ఒక కనువిప్పే అయింది. ఈ ఉద్యమం సాగింది నాలుగు మాసాలే అయినా, ఆ నాలుగుమాసాల లోనే, ఆనాటి గవర్నర్ విల్లింగ్డన్ గారికీ, వైస్రాయిగారికీ, బ్రిటిషు కాబినెట్ వారికీకూడా పన్నుల నిరాకరణ అన్నది ఎటువంటి పరిణామా లను కలుగజేస్తుందో అర్థం అయింది. ఉద్యోగ విరమణ అనంతరం లార్డ్ విల్లింగ్డన్ రెండుమూడు సందర్భాలలో, గుంటూరు పన్నుల నిరాకరణ ఉద్యమం యేవిధంగా బ్రిటిషు రాజ్యాంగ విధానాన్ని పునాదు లతో సహా కదలించి వేసిందో పబ్లిక్‌గా ఉద్ఘాటించారు.

ప్రభుత్వం వారి క్రూరాతి క్రూర విధానాలతో ప్రజానీకం నైతి కంగా పతనం కాకముందే మేము తీసుకున్న చర్య సాఫల్యాన్ని సాధిం చినా, తిరిగి ప్రజలలో శాంతి భద్రతలు నెలకొల్పబడే పర్యంతమూ మేము ఎంతో అప్రమత్తతతో సంచరించాము. ఉద్యమం అప్పట్లో విర

మింపజేయకుండా అల్లాగే సాగించిఉంటే, అధికారులు అవలంబించిన దమన విధానం ఫలితంగా ప్రజలలో నిరుత్సాహం బయలుదేరి, నైతిక పతనం జరిగిఉంటే, తిరిగి వారిని ఉత్తేజపరచి దారిలో పెట్టడానికి యుగాలే పట్టేది. సకాలంలో ఉద్యమ విరమణజేసి ప్రజలలో ఐక్యాన్నీ, జాతీయ భావాన్నీ మంచి స్థాయిలో నిలబెట్టి గలిగిన కారణాన్నే, 1923 వ సంవత్సరంలో శాసన ధిక్కార సంఘం (Civil Disobedience) వారి రాక సందర్భంలో జారీ చేయబడిన 144 వ సెక్షన్ ఉల్లంఘన జరగడమూ, సుమారు మూడువందలమంది వరకూ నిర్బంధింప బడడమూ జరిగింది.

## గుణపాఠం

ఈ పన్నుల నిరాకరణ ఉద్యమ విరమణ జరిగిన పెక్కు సంవత్సరాల అనంతరం లార్డ్ విల్లింగ్డన్ గుంటూరు సందర్శించడం జరిగింది. గుంటూరు వాస్తవ్యులు ఉత్సాహంగానే తనను ఆహ్వానిస్తారని అనుకున్నట్లున్నాడు, పాపం! మూయబడిన తలుపులూ, ఖాళీ వీధులూ మాత్రమే ఆయన్ని ఆహ్వానించాయి. విరమణ, లొంగుబాటు అన్నవి ఓటమికి చిహ్నాలు కావు. నిజానికి సకాలంలో తీసుకున్న చర్య లొంగుబాటుకే దారితీసినా, అది ప్రజలలో నూతన చైతన్యాన్నీ, బలాన్నీ, ఉద్రేకాన్నీ కలుగజెయ్యడానికి ఎంతయినా ఉపకరిస్తుంది. గుంటూరు పన్నుల నిరాకరణ ఉద్యమమూ, విరమణా పై సత్యాన్నే చాటాయి. నిర్మాణ కార్యక్రమ ఫలితంగా, ప్రత్యామ్నాయ పరిపాలనా విధానానికి ప్రజలు సిద్ధపడ గలిగిననాడు ఎటువంటి ఉద్యమం అయినా ఘనవిజయాన్ని సాధిస్తుంది. పన్నుల నిరాకరణ, ఆస్తుల జప్తులూ, వేలాలూ మున్నగు లావాదేవీలకు దారి తీస్తుంది. అందువలన శిక్షాస్మృతులను ఉల్లంఘించి జైళ్ళకు వెళ్ళడం సులభం. 1921 లో ప్రభుత్వం వారు తీసుకున్న విపరీత చర్యల ఫలితంగా నిర్మాణ కార్యక్రమం ఆగిపోయి ఉండకపోతే, దేశం ఎన్నో విధాల ముందడుగువేసి ఉత్పన్నం కాబోయే పరిస్థితులకు సిద్ధపడే ఉండేది.

# 6

## కేరళ రాష్ట్రీయ కాంగ్రెసు తొలి సమావేశానికి అధ్యక్షత

నాగపూరు కాంగ్రెసులో ఆమోదింపబడిన ప్రతిపాదనల కారణంగానే కేరళ రాష్ట్రీయ కాంగ్రెసు సంఘంకూడా ఉద్భవించింది. ఆ కాంగ్రెసుచే ఆమోదింపబడిన మొదటి కాంగ్రెసు సంఘం ఆంధ్ర రాష్ట్రానికి సంబంధించిన దన్న సంగతి చదువరులకు తెలిసినదే. కేరళ రాష్ట్రీయ ప్రథమ కాంగ్రెసు సమావేశం ఒట్టపాలియంలో జరిగింది. మలయాళ మిత్రులు నన్ను ఆ సమావేశానికి అధ్యక్షత వహించవలసినదని కోరారు. జార్జి జోసఫ్ ఇంకొకచోట అధ్యక్షత వహించవలసి వచ్చింది. అప్పటికి మలయాళదేశం కూడా చాలా ఉత్తేజపూరితంగానే తయారయింది. గాంధీగారి ముందడుగుతో కేరళ రాష్ట్రీయ నాయకుల, సేవకుల శక్తి బాగా పుంజుకుంది. ఖిలాఫత్ ఉద్యమానికీ, స్వరాజ్యోద్యమానికీ సన్నిహిత సంబంధం సమకూరడాన్ని, ఆ రోజులలో హిందూ-మహమ్మదీయ మైత్రి తారస్థాయి నందుకుంది. మలయాళ దేశపు అన్ని ప్రాంతాలనుండి ఆ సమావేశానికి ప్రతినిధులు వచ్చారు. ఈ రాజకీయ సమరంలో మలయాళ స్త్రీలు బాగా ముందంజ వేశారు. ఏ దృక్పథంనుంచి చూసినా యీ సమావేశం విజయవంతమయిందనే చెప్పాలి. హిందూ-మహమ్మదీయ సఖ్య సాధనకు సంబంధించిన ఫలితాలు మిన్నుముట్టాయి.

1921-22 సంవత్సరాలలో ఖాదీ ఉద్యమం బాగా సాగించగలిగిన జిల్లాలలో మలబారు ఒకటి. అప్పట్లో హిచ్‌కాక్ అనే ఆయన అక్కడ జిల్లా పోలీసు సూపరింటెండెంటుగా వుండేవాడు. తాను ఆ జిల్లాలో ఉన్నంత కాలమూ అక్కడ రాజకీయ చైతన్యం తల ఎత్త కూడదనేదే ఆయన వాంఛ. మాప్లాల పరిస్థితి కదిపితే రాజుకునేటట్లుగా ఉండడాన్నే ఎక్కడ ఏవిధంగా కొంపలంటుకుంటాయో అన్న భీతికూడా ఆయనకు

ఉండేది. మః యాళదేశంలో ముప్ఫయి సంవత్సరాల కొకసారి విప్లవ జ్వాలలు ప్రజ్వరిల్లడం పరిపాటి అయింది. ఏదెల్లా ఉన్నా మలబారు జిల్లాలో జరిగిన మొట్టమొదటి కాంగ్రెసు సమావేశం ఫలప్రదంకావడం ఆయన సహించలేకపోయాడు.

నేను ఒట్టపాలియం జేరేసరికి, ఏదో విధంగా పోలీసువారు ఆ సమావేశం జరక్కుండా అడ్డగిస్తారనే భావం నా మనస్సులో నాటుకుంది. కాని అటువంటిదేమీ జరుగలేదు. సమావేశం ముగిసే లోపల ఏదో విధంగా శాంతిని భగ్నం చెయ్యడానికి కొందరు వ్యక్తులు నియమింపబడ్డారు. 'స్వరాజ్య' పత్రికా సంపాదకీయవర్గానికి చెందిన అబ్దుల్ హమీద్‌ఖాన్ నాతోపాటు పై సమావేశంలో పాల్గొన్నాడు. హమీద్ ఖాన్ దరిమిలా చెన్నపట్నంలో ముస్లింలీగు నాయకుడు కూడా అయ్యాడు. ఆ సమావేశం సాంతం అయ్యే లోపల మేము తలచినట్లుగా ఏ సంఘటనా జరక్కపోవడం మా కందరికీ ఆనందం కలిగించింది.

## పోలీసువారి జులుం

కాని సాయంత్రపు సమావేశం ముగిసే లోపల కొన్ని చిన్న చిన్న సంఘటనలు జరిగాయి. ఆ గ్రామంలో సంచరిస్తూ ఉన్న హిందూ-మహమ్మదీయ కాంగ్రెసు పక్షీయుల్ని కొందరు దుండగులు అల్లరి పెట్టడమూ, కొట్టడమూ జరిగింది. గ్రాడ్యుయేటూ, లా కాలేజీ లెక్చెరరు పి. గోవిందమేనోన్ అల్లుడూ, పెద్ద మనిషీ అయిన శ్రీరామున్ని మేనోన్ అనే ఆయన ఆ సమయంలో మెయిన్ రోడ్డు గుండా హమీద్ ఖాన్‌తో కలిసి వెడుతున్నాడు. కాన్ఫరెన్సు కాలంలో శాంతిని కాపాడడం కోసం అంటూ మల్లపురం నుంచి కొందరు పోలీసువారు ఒట్టపాలియంకు రావింపబడ్డారు. కొందరు పోలీసువారు రామున్ని మేనోన్‌నీ, హమీద్‌ఖాన్‌నీ ఆపుజేసి, అడ్డదిడ్డపు అసభ్య ప్రశ్నలు వేశారు. అబ్దుల్ హమీద్‌ఖాన్ తాత్వికంగా చాలా గొప్పవాడు.రామున్ని మేనోన్ మూర్తీభవించిన సాధుసజ్జనుడు. పోలీసువారు కొన్ని ప్రశ్నలు వేశాక రామున్ని

మేనోన్· రెండు దవడలమీదా లెంపకాయలు వేశారు. ఎల్లాగో దెబ్బలు తినకుండా హమీద్ ఖాన్ తప్పించుకున్నాడు. రామున్నీ మేనోన్‌ని ఉద్రేక పరచడం కష్టం. ఆయనిది, ఒక చెంపమీద కొడితే రెండో చెంప చూపించే తత్వం. వారుభయులూ ఉద్రేకపడని కారణంగా అది అంతటితో ఆగింది. కాన్ఫరెన్స్ ముగిసే లోపలనే వారిద్దరూ తిరిగివచ్చి జరిగిన ఉదంతం అంతా సభలో నివేదించారు. జరిగిన ఉదంతాన్ని రామున్నీ మేనోన్ చెపుతూ ఉంటే, సభలోవారికి ఉద్రేకం జనించింది.

అదే సమయంలో కొన్ని వీథులలో పోలీసులు మాప్లాలమీద చెయ్యి చేసుకున్నారు. పోలీసుల చేతులలో దెబ్బలు తిన్న మంచి బలమూ, ఒడ్డూ పొడుగూ ఉన్న ఒక మాప్లాని కొందరు మిత్రులు సమావేశంలోనికి తీసుకు వచ్చారు. ఆయన నిజంగా మంచి బలశాలి. ఆర్గురు జనం మూక వుమ్మడిగా ఒకేసారి ఆయనమీద విరుచుకు పడ్డా నిగ్రహించుకోగల బలం ఆయనకుంది. పైగా ఆయన బెల్టులో కైజా రుంది. అదృష్ట వశాత్తూ ఆయన ఆ కైజారుని పోలీసువారిపై ప్రయోగించలేదు. ఆ గలాటాని అపుచేయగలిగిన కొందరు వ్యక్తులు ఆయన్ని కాన్ఫరెన్సులోనికి తీసుకువచ్చారు. అయన చాలా ఉద్రేకంగా ఉన్నాడు. ఒక్క ఉదుటున వెనక్కి వెళ్ళి కక్ష సాధిద్దాం అనే ప్రయత్నంలో ఆయన ఉన్నాడు. కాని కొందరు మిత్రులు ఆయన్ని బలవంతంగా నిరోధించారు. ఒక్క ఉదుటున బైటకు పోవాలని ఆయన తలచినప్పుడు వారంతా కలసి బలవంతంగా ఆయన్ని పడుకోబెట్టారు. కొన్ని సంవత్సరాలనుంచీ రాజ్యసభా సభ్యుడుగా ఉంటున్న సయ్యద్ మూర్తాజా సాహెబుగారు ఆనాటి సభలో మాతోపాటు ఉన్నారు. ఆయన తిరుచి నివాసి. బలవంతంగా పడుకోబెట్టబడిన ఆ ఆసామీ ఛాతీమీద మూర్తాజా కూర్చుని శాంతి వచనాలు పలకడం ఆరంభించాడు. నాగపూరు కాంగ్రెసు ఆమోదాన్ని పొందిన అహింసా విధానం గురించి బోధచేస్తూ మొత్తానికి ఎల్లాగయితేనేం ఆయన్ని శాంత పరచారు.

వీరేగాక ఆనాడు అనవసరంగా పోలీసుల చేతులలో దెబ్బలు తిన్నవారు యింకా ఉన్నారు. వారూ కాన్ఫరెన్సులోనికి పరుగుపరుగున

వచ్చి సంగతి సందర్భాలు విన్నవించుకున్నారు. కాన్ఫరెన్సు జరుగుతూండగా రిపోర్టయిన యీ సంఘటనలు సమావేశంలో పాల్గొంటూ వున్న చాలామంది స్త్రీ పురుషులను ఉద్రేకపరచాయి. ఆనాటి సాయంత్రం మా సమావేశం ముగిసే లోపల ఎల్లాగయినా అల్లరిపెట్టి, ఆఖరు నిమిషంలోనయినా సమావేశం గల్లంతు కలుగజేసి సాగకుండా చెయ్యాలన్న పోలీసువారి కుతంత్రమే ఈ సంఘటనల కన్నింటికీ కారణమన్నది అందరికీ అర్థమయిపోయింది.

## ఊరేగింపు నాయకత్వం

వేరే ఇంకో సభకు అధ్యక్షత వహించిన మిత్రుడు జార్జి జోసఫ్, ఆ సభ ముగించుకునివచ్చి, ఇక్కడ సమావేశమయిన స్త్రీ పురుషుల నందరినీ చిన్న చిన్న జట్లుగా దొడ్డి గుమ్మం ద్వారా బయటికి పంపడం మంచిదని నాతో అన్నాడు. నేనా అభిప్రాయాన్ని ఎగతాళి చేశాను. సమావేశం పూర్తిగా అయ్యేవరకూ సభ్యులను శాంతంగానూ, నిశ్చలంగానూ కూర్చోవలసినదిగా కోరుతూ కొంత తడవు నేను ఉపన్యసించాను. అంతేకాదు. సమావేశానంతరం ఆ యా సంఘటనలు జరిగిన ముఖ్యవీథులగుండా ఊరేగింపుగా సభలోని ప్రముఖ నాయకులంతా వెళ్ళాలనీ సూచించాను. సభను శాంతంగా తుదివరకూ సాగించమనీ, అంతవరకూ ఎవ్వరూ కదల రాదనీ కోరాను.

సభానంతరం, నేను స్వయంగా ముందుండి నాయకత్వం వహిస్తూ, సభలోని ముఖ్యుల నందరినీ ఊరేగింపుగా ఒట్ట పాలియం ముఖ్యవీథులన్నింటిలోనూ నడిపించాను. ప్రజలలో నాటుకున్న విశ్వాసాన్నీ, ఆత్మశక్తినీ అణగద్రొక్కలేమని పోలీసువారు గ్రహించారు.

సమావేశం పూర్తి అయ్యేలోపల పోలీసుల కారణంగా జరిగిన యీ అల్లరులను విచారించడానికిగాను ఒక ఉపసంఘాన్ని నియమించాము. ఆ ఉప సంఘానికి నేనే అధ్యక్షుణ్ణి. కొంతమంది ఇతర ప్రముఖులతోపాటు ఎల్. ఐ. సుబ్బరామయ్య అనే పాల్‌ఘాటు న్యాయవాది కూడా యీ ఉప సంఘ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాడు.

## మా మీద హిచ్‌కాక్ దావా

సమావేశం పూర్తి కాగానే విచారణ ప్రారంభించాం. ఒట్ట పాలియం వదిలే లోపల సేకరించగల సాక్ష్యాన్నంతా పూర్తిగా రికార్డు చేశాము. విచారణ అనంతరం రిపోర్టు వ్రాశాము. ఆ జిల్లాలో డి.యస్.పి.గా పనిచేస్తూ ఉన్న హిచ్‌కాక్కే, ఆ రోజున కాంగ్రెసు వారిపై జరుపబడిన చర్యల కన్నింటికీ పూర్తిగా బాధ్యుడనే నిర్ణయానికి వచ్చాము.

కమిటీ మెంబర్ల మందరమూ ఆ రిపోర్టుమీద సంతకాలు చేశాము. ప్రచురణార్థం దానిని చెన్నపట్న మందలి "హిందూ" పత్రిక వారికిచ్చాము. మా రిపోర్టూ, అందలి అంశాలూ దేశంలో బాగా అల జడిని కలుగజేశాయి. కాంగ్రెసువారిని కొట్టింది పోలీసులే. వారు అలా కొట్టడానికి పోలీసు డిస్ట్రిక్టు సూపరింటెండెంటు (D. S. P.) గారి ప్రోద్బలమే కారణమనీ, ఆయన పరోక్ష చర్యల మూలంగానే యీ సంఘటనలూ, పోలీసు చర్యలూ జరిగాయని మా రిపోర్టులో ఉంది.

తర్వాత కొంతకాలానికి హిచ్‌కాక్ నాకూ, తదితర కమిటీ సభ్యులకూ, మా రిపోర్టులో తనపై వ్రాసిన పరువు నష్టపు వాక్యాలు తొలగించవలసినదనీ, తొలగించని పక్షంలో పరువునష్టం దావా మా పై వేయబడుననీ ఇప్పించిన లాయరు నోటీసు మా కందింది. నోటీసు మా కందిన అనంతరమే మా రిపోర్టు కాపీ ఒక దానిని గాంధీగారికి పంపించడం జరిగింది. నోటీసు ప్రకారం మా పై తీసుకొనదలచిన చర్యకు ఎదురు చూస్తున్నామని నేను వారికి జవాబు వ్రాశాను. సత్యా గ్రహుల లాంటి కాంగ్రెసు వారిని తన ప్రోత్సాహంతో పోలీసువారు కొట్టారంటూ మా రిపోర్టులో వ్రాసి, తనపై అనవసరంగా నిందమోపి తనకు పరువు నష్టం కలుగజేసిన కారణంగా, మేము పరువు నష్టం క్రింద ముప్పదివేల రూపాయలు యివ్వవలసి ఉంటుందని, కాలికట్ సబ్ కోర్టులో హిచ్‌కాక్ మాపై దావా వేశాడు. చట్ట రీత్యా తన దావా చెల్లదంటూ నేను వ్రాసిన లిఖిత వాఙ్మూలాన్ని పరిశీలనార్థం గాంధీ గారికి పంపించాను.

## కోర్టుల విషయంలో గాంధీగారి సలహా

నేను వ్రాసిన స్టేట్ మెంట్ చాలా చిన్నదే. అందులో చట్టబద్ధ మయిన మెలికలున్నాయి (legal pleas). నేను వ్రాసిన డ్రాఫ్టుమీద గాంధీగారు రెండు అడ్డ గీతలుగీసి "ఇది చట్టాన్ని అనుసరించి తీసుకో దలచిన రక్షణ చర్య. ఇటువంటి రక్షణ చర్యలకు నేను అంగీకరించను. ఆ కోర్టువారికి యీ కేసు విచారణ చెయ్యడానికి హక్కు ఉందో లేదో మాత్రమే చూచుకోండి" అంటూ వ్రాపి నా కాగితాలు నాకు త్రిప్పి పంపించి వేశారు. నాగపూర్ కాంగ్రెసులో నిర్ణయించుకున్న త్రివిధ బహిష్కరణ కార్యక్రమానికి అనుగుణంగానే, గాంధీగారు నా కాగితం మీద వ్రాసిన సూచన ఉంది. ఈ విషయం మొదట్లో నాకు గుర్తుకు రాలేదు. నిజానికి గాంధీగారే కదా కాంగ్రెసుకు కర్త, భర్త అన్నీను. అందుకనే ఆయన అభిప్రాయాన్ని కోరుతూ నా కాగితాలు ఆయనకు పంపించాను. గాంధీగారి అభిప్రాయంతో నేనూ ఏకీభవించాను. "నాకు సంబంధించినంతవరకూ ఈ కేసు విచారణ చెయ్యడానికి మీకు అధి కారం లే"దంటూ వ్రాయబడిన స్టేట్ మెంట్ మాత్రమే నేను దాఖలు చేశాను. రెండవ ప్రతివాది అయిన ఎల్. ఐ. సుబ్బరామయ్య కాంగ్రెసు సభ్యుడు కాదు గదా! తాను కాంగ్రెసు నియమావళికి బద్ధుడను అంటూ ఎప్పుడూ యే విధంగానూ కాంగ్రెసులో జేరని వ్యక్తి ఆయన. అందు వలన లా పాయింట్లు ఆధారంగా, దావా చెల్లదంటూ ఆయన వాదన తీసుకువచ్చాడు. సుబ్బరామయ్యగారి వాదన కారణంగా ఆయనకు సంబం ధించి నంతవరకూ దావా విచారణ జరిగింది. హిచ్ కాక్ కు అను కూలంగా దావా డిక్రీ అయింది.

## ఇరుకున పెట్టిన సుబ్బరామయ్య అప్పీలు

క్రింది కోర్టువారి తీర్పు న్యాయమయినదీ, చట్టబద్ధమయినదీ కాదంటూ సుబ్బరామయ్యగారు హైకోర్టులో అప్పీలు చేశారు. నా ప్రాక్టీసు ముమ్మరంగా సాగే రోజులలో నా సహచరుడుగా ఉంటూ ఉండే కే. శే. టి. ఆర్. రామచంద్రయ్యరు, సుబ్బరామయ్యగారి ప్లీడరు.

క్రింది కోర్టులో సుబ్బరామయ్యగారు మా దర్యాప్తు, వ్రాసిన రిపోర్టూ అంగీకరించివున్న కారణంచేత, క్రింది కోర్టు తీర్పుమీద అపీలు చేయ డానికి సావకాశం లేనందువల్ల, రామచంద్రయ్యరు ఒక క్రొత్త ఎత్తు ఎత్తాడు. "విచారించాము, రిపోర్టు వ్రాశాము" అన్నంత మాత్రాన మా క్లయింటు దోషికాడు. ఆయన ఆ రిపోర్టు మీద సంతకం చేశాడా, లేదా అన్నదే ముఖ్యం అంటూ వాదన లేవతీశాడు. అంటే సుబ్బ రామయ్యగారు పెట్టకపోయినా, అనుమతించకపోయినా, వారికి తెలియ కుండా, వారి సంతకం నేను ఫోర్జరీ చేశానన్నమాట! ఆ వాదన సారాంశం అంతేగా? కేసు విచారణ జరిగిన క్రింది కోర్టులో యీ వాదన రాలేదు. మొట్టమొదటిసారిగా యీ వాదన అపీలు కోర్టులోనే వచ్చిన కారణంగా, ఈ పాయింటును మేము చర్చించము అని ఖండి తముగా హైకోర్టువారు చెప్పడం న్యాయం. ఈ అప్పీలు ఇరువురు జడ్జీల సమక్షంలో విచారణ కావాలని కోరివుండిన కారణంగా, ఇది ఇద్దరు జడ్జీల ముందుకు వచ్చింది. ఆ ఇద్దరు జడ్జీలలోనూ ఒకరు రామేశంగారు. ఆ రిపోర్టులో తన క్లయింటు ఎప్పుడూ సంతకం పెట్టి యుండ లేదంటూ వ్రాసిన అఫిడవిట్టును టి. ఆర్. రామచంద్ర య్యరు దాఖలు చేయడానికి ఇరువురు జడ్జీలూ అంగీకరించారు. ఈ అఫిడవిట్టు కోర్టులో చదివబడిన సందర్భంలో కోర్టులో విచారణకు గాను కూర్చున్న రామేశంగారు, తన జడ్జీ స్థానంనుంచే, అప్పటి వరకూ ఈ సహాయ నిరాకరణ ఉద్యమ నాయకులమీద తనకు మంచి విశ్వాసం ఉండేదనిన్నీ, ఈ అఫిడవిట్టు విన్నాక కాంగ్రెసు నాయకు లపై తనకు ఏర్పడిన సదభిప్రాయం మార్చుకోవలసి వస్తోందనీ అన్నాడు.

సాగుతూ ఉన్న కోర్టు విఛారణ ఎప్పటి కప్పుడు అన్ని పేపర్ల లోనూ రిపోర్టయ్యేది. దీన్తో నా పరిస్థితి చాలా ఇరుకున పడిపోయింది. బ్రిటిషువారి కోర్టులలో ఎంతమాత్రమూ నమ్మకము లేదని అంటూ, క్రిందికోర్టులో నేను హాజరుకాని కారణంగా, ఇప్పుడు నేను హైకోర్టులో

# 7

## మాప్లా తిరుగుబాటు : నా రిపోర్టు

మలబారుకు సంబంధించిన ఇంకో ముఖ్యమయిన ఉదంతం 1921 నాటి మాప్లా తిరుగుబాటు. ఒట్టపాలియం సమావేశ సందర్భంలో హిచ్‌కాక్‌ను గురించీ, ఆయన విధానాలను గురించీ ఉద్ఘాటించి ఉన్నాను. నిజానికి ఒట్టపాలియం సమావేశం జరిగిన రోజుల లోనే మాప్లా తిరుగుబాటు జరిగి ఉండవలసింది. కాని అప్పట్లో మేమందరమూ కలిసి కట్టుగా అవలంబించిన పద్ధతులూ, తీసుకున్న ఆవశ్యక చర్యలూ, జాగ్రత్తలూ మున్నగునవన్నీ ఆనాటి వాతావరణాన్ని ప్రశాంతంగా ఉంచడానికి సహాయపడ్డాయి. ఆ కారణంచేత అప్పట్లో ఏవిధమయిన అల్లర్లూ ఉత్పన్నం కాకుండా చూడగలిగాము.

కొంతకాలం తర్వాత కాంగ్రెస్, ఖిలాఫత్ ఉద్యమ ప్రచారాలు ముమ్మరమయి హిందువుల, మహమ్మదీయుల దృష్టిని ఆ కట్టే సమయంలో, ఎల్లాగయినా ఈ ఉద్యమాలను త్రోసి రాజనాలనే ఉద్దేశం హిచ్ కాక్ బుర్రలో ప్రవేశించింది. ఈ ఆలోచనలో హిచ్ కాక్ తీసుకున్న ప్రప్రథమ సత్వర చర్య 144 వ సెక్షను ప్రకారం ఆంక్షలు విధించడం. కీర్తిశేషులయిన మౌలానా యాకుబ్‌హుస్సేన్, కె. మాధవన్‌నాయర్లకూ, ఇంకొక ప్రఖ్యాత న్యాయవాది గోపాలన్ మేనోన్‌కూ, మొహిద్దీన్ కోయాకు ఆ 144 వ సెక్షన్ కింద విధించబడ్డ ఆంక్ష ప్రకారం, వారు మలయాళ దేశమందలి ఇతర ప్రాంతాలకు వెళ్ళరాదంటూ ఆర్డర్లు జారీచేశాడు. వారు నలుగురూ కూడా ఆ ఆంక్షను ఉల్లఘించి, తలో ఆరుమాసాల జైలు శిక్షకు లోనవడమూ జరిగింది. ఈ నిర్బంధాలూ, శిక్షలూ అన్నవి మలబారులోని కాంగ్రెస్ ఉద్యమానికి దోహదాన్ని ఇచ్చాయి.

నాకూ, మలబారుకూ ఉన్న సంబంధాలు కాలం గడచిన కొద్దీ ఇంకా ఇంకా సన్నిహితం అయ్యాయి. ఇన్ని సంవత్సరాల తర్వాత ఇప్పుడు ఆ 1921-22 సంవత్సరాలలో నేను మలబారులో ఏ ఏ తావులలో, ఏ యే సభలలో పాల్గొని ఉపన్యసించానో చెప్పడం దుర్లభమే,

డిక్షను లేదంటూ వాదించిన నా విధానమూ, తన్ను తాను డిఫెండ్ చేసుకుంటూ క్రింది కోర్టులో సుబ్బరామయ్య తీసుకువచ్చిన తికమకలూ, హైకోర్టులో తీసుకురాబడ్డ అబద్ధపు అడ్డంకులూ, మున్నగునవన్నీ హిచ్‌కాక్‌కు బాగా అవగాహన అయిఉండాలి. క్రిందికోర్టులోనూ, హైకోర్టులోనూ తన పక్షాన్నే ఇవ్వబడిన తీర్పూ, నా జ్యూరిస్‌డిక్షన్ అభ్యంతరమూ గమనించికూడా, నా పైన డిక్రీ అమలుపరచడానికి హిచ్‌కాక్ ఎప్పుడూ ప్రయత్నించలేదు. డిక్రీ హోల్డరు తన చేతులతోనే డిక్రీని చంపుకున్నాడన్నమాట. సుబ్బరామయ్యమీద డిక్రీ అమలు జరిగిందో లేదో, దాని గతి యేమయిందో తెలుసుకోవడానికి నేనెప్పుడూ ప్రయత్నించలేదు. ఏదో అయిఉంటుంది, ఏమయితే మనకెందుకు అనే భావమే ఆ డిక్రీ విషయంలో నాకు కలిగింది. ఏది ఏమయినా జీవితంలో ఇది ఒక మంచి అనుభవం.

సహాయనిరాకరణ ఉద్యమ ప్రారంభదశలో గాంధీగారిచ్చిన ఒక ఉపన్యాసంలో, పై ఉదంతాన్ని పేర్కొంటూ, ఆ సందర్భంలో ఆయన, నాకు, సలహారూపంగా సివిలు కోర్టులలో పెట్ట తగ్గ వాదనా విధానాన్ని సూచించానని చెప్పారు. అంటే ఈ కోర్టులలో నాకు నమ్మకం లేదు. ఈ కేసు విచారించడానికి ఈ కోర్టువారికి హక్కు లేదు మున్నగు నినాదాలన్నమాట! ఆ సందర్భంలో ఆయన త్రివిధ బహిష్కరణ అంటె యేమిటో చెబుతూ, సహాయ నిరాకరణ వాదులపై ఏవేని కేసులు కోర్టులలో మోపబడినప్పుడు, కాంగ్రెసువారు అవలంబించవలసిన విధానానికి ఉదాహరణగా, ఆనాటి కేసూ, తానిచ్చిన సలహా ఆ సందర్భంలో ఉటకించారన్నమాట! ఈ ఉదంతాన్ని గాంధీగారు తమ ఉపన్యాసంలో చెపుతూన్న సందర్భంలో నా ప్రక్కనే నిలిచిఉన్నవల్లభాయ్ పటేల్‌గారు, "ఏమిటి నిన్నుగురించి అంటున్నారు" అంటూ అతి మెల్లిగా, రహస్యంగా అడిగారు. ఇట్టి ఉదంతాల కారణంగానే గాంధీగారికి సన్నిహితుడ నవడమూ, 1922 లో ఆయన అరెస్టయి నిర్బంధింపబడే వరకూ ఆయన్ని వెన్నంటి ఉండడమూ సంభవించాయి.

# 7

## మాప్లా తిరుగుబాటు : నా రిపోర్టు

మలబారుకు సంబంధించిన ఇంకో ముఖ్యమయిన ఉదంతం 1921 నాటి మాప్లా తిరుగుబాటు. ఒట్టపాలియం సమావేశ సందర్భంలో హిచ్‌కాక్‌ను గురించీ, ఆయన విధానాలను గురించీ ఉద్ఘాటించి ఉన్నాను. నిజానికి ఒట్టపాలియం సమావేశం జరిగిన రోజుల లోనే మాప్లా తిరుగుబాటు జరిగి ఉండవలసింది. కాని అప్పట్లో మేమందరమూ కలిసి కట్టుగా అవలంబించిన పద్ధతులూ, తీసుకున్న ఆవశ్యక చర్యలూ, జాగ్రత్తలూ మున్నగునవన్నీ ఆనాటి వాతావరణాన్ని ప్రశాంతంగా ఉంచడానికి సహాయపడ్డాయి. ఆ కారణంచేత అప్పట్లో ఏవిధమయిన అల్లర్లూ ఉత్పన్నం కాకుండా చూడగలిగాము.

కొంతకాలం తర్వాత కాంగ్రెస్, ఖిలాఫత్ ఉద్యమ ప్రచారాలు ముమ్మరమయి హిందువుల, మహమ్మదీయుల దృష్టిని ఆ కట్టే సమయంలో, ఎల్లాగయినా ఈ ఉద్యమాలను త్రోసి రాజనాలనే ఉద్దేశం హిచ్ కాక్ బుర్రలో ప్రవేశించింది. ఈ ఆలోచనలో హిచ్ కాక్ తీసుకున్న ప్రప్రథమ సత్వర చర్య 144 వ సెక్షను ప్రకారం ఆంక్షలు విధించడం. కీర్తిశేషులయిన మౌలానా యాకుబ్‌హుస్సేన్, కె. మాధవన్‌నాయర్లకూ, ఇంకొక ప్రఖ్యాత న్యాయవాది గోపాలన్ మేనోన్‌కూ, మొహిద్దీన్ కోయాకు ఆ 144 వ సెక్షన్ కింద విధించబడ్డ ఆంక్ష ప్రకారం, వారు మలయాళ దేశమందలి ఇతర ప్రాంతాలకు వెళ్ళరాదంటూ ఆర్డర్లు జారీచేశాడు. వారు నలుగురూ కూడా ఆ ఆంక్షను ఉల్లఘించి, తలో ఆరుమాసాల జైలు శిక్షకు లోనవడమూ జరిగింది. ఈ నిర్బంధాలూ, శిక్షలూ అన్నవి మలబారులోని కాంగ్రెస్ ఉద్యమానికి దోహదాన్ని ఇచ్చాయి.

నాకూ, మలబారుకూ ఉన్న సంబంధాలు కాలం గడచిన కొద్దీ ఇంకా ఇంకా సన్నిహితం అయ్యాయి. ఇన్ని సంవత్సరాల తర్వాత ఇప్పుడు ఆ 1921-22 సంవత్సరాలలో నేను మలబారులో ఏ ఏ తావులలో, ఏ యే సభలలో పాల్గొని ఉపన్యసించానో చెప్పడం దుర్లభమే,

కాని ఆ సమావేశాలలో వందలూ వేలూగా మాప్లాలు పాల్గొనేవారని మాత్రం కచ్చితంగా చెప్పగలను. ఆ రోజులలో కాంగ్రెసు-ఖిలాఫత్ ఉద్యమాల మూలంగా, దినదినాభివృద్ధి గాంచుతూన్న హిందూ-మహమ్మదీయ సామరస్యం వలన అత్యల్పకాలంలోనే మనకు స్వరాజ్యం సిద్ధిస్తుందని మాత్రం మనస్ఫూర్తిగానూ, త్రికరణ శుద్ధిగానూ నమ్మాను.

దక్షిణ హిందూ దేశానికి సంబంధించి నంతవరకూ మలబారే ముఖ్యమయిన మహమ్మదీయ కేంద్రం. అక్కడ అతి విస్తారంగా మహమ్మదీయులున్నారు. హిందూ-మహమ్మదీయ సామరస్య సాధన కృషికి 1921-22 లో ఉత్తర హిందూస్థానంలో గట్టి దెబ్బ తగలకుండా ఉండి ఉంటేనూ, 1917 లో మాంటేగ్‌గారికి సమర్పించిన, కాంగ్రెస్-లీగ్ ప్రతిపాదనలతో మహమ్మదీయులు సంతుష్టి చెంది ఉంటేనూ, ఈ దేశం డొమినియన్ స్టేటస్‌గాని, పూర్ణస్వాతంత్ర్యాన్నిగాని యేనాడో పొంది ఉండేది. ఈ సందర్భంలో మలబారులో హిందూ - మహమ్మదీయ సామరస్య సాధన యత్నాలు ఏలా విచ్ఛిన్నం అయ్యాయో కాస్తంత విస్తరిస్తాను.

## ప్రాణాలకు తెగించిన పర్యటన

మలయాళ దేశంతోటీ, దేశీయులతోటీ నాకు మొదటినుంచీ సన్నిహిత సంబంధం ఉండడంచేత, ఈ మాప్లా తిరుగుబాటుకు సంబంధించిన కారణాలన్నీ సమగ్రంగా పరిశీలించాలనే ఉద్దేశంతో నేనా ప్రాంతం అంతా ఆ రోజులలో పర్యటించి ఉన్నాను. ఆ పర్యటించిన ప్రాంతాలలో మిలిటరీ హయాంలో ఉన్న ప్రాంతం కూడా ఉంది. మాప్లా తిరుగుబాటు ఇంకా అప్పటికి ఆరంభ దశలోనే ఉంది. ఆరంభం అయిందనే తొలివార్త అందగానే తిన్నగా కాలికట్ పట్టణానికి వెళ్ళాలనే ఉద్దేశం కలిగింది. "స్వరాజ్య" పత్రికా స్థాపనలో నాకు చాలా సన్నిహితుడుగా ఉన్న టి. వి. వెంకట్రామయ్యర్ నాతోపాటు యీ పర్యటనలో పాల్గొనడానికి నన్ను అనుసరించాడు. అప్పట్లో తంజావూరులో మౌలానా యాకుబ్ హుస్సేన్‌గారి ఆధిపత్యాన, తమిళనాడు ప్రాంతానికి చెందిన రాష్ట్రీయ కాంగ్రెసు సమావేశం జరుగుతోంది. వెంక

ట్రామయ్యరూ, నేనూ తిన్నగా తంజావూరు వెళ్ళి, యాకుబ్ హుస్సేన్ ని కలుసుకుని, మలబారులో ప్రారంభం అయిన మాప్లా తిరుగుబాటును గురించి చర్చించాము. వారూ మాతోబాటు ఉంటే మంచిదని సూచించాము. తాను యీ కాంగ్రెస్ సమావేశంలో ఇరుక్కున్న కారణంగా మాతో కలిసి ఆ ప్రాంతాలకు రాలేననీ, మమ్మల్నిద్దరినీ తప్పకుండా వెళ్ళి సంగతి సందర్భాలు గమనించమని ఆయన ప్రోత్సహించాడు.

సైనిక శాసనం

మా కెవ్వరికీ మలబారులో ఉన్న పరిస్థితులుగాని, మార్షల్ లా అమలు పరచబడిన ప్రాంతం ఎల్లా ఉంటుందనిగాని యే మాత్రమూ తెలియదు. సైనిక శాసనం అమలులో ఉన్న ప్రాంతం ఎల్లా వుంటుందో ఊహించడానికయినా నాకు పూర్వానుభవం ఏమీలేదు. తంజావూరు నుండి తిన్నగా కాలికట్టుకు టిక్కట్లు తీసుకున్నాము. షోరనూరు చేరే వరకూ మాకు ఏ విధమయిన అడ్డంకులూ లేకుండా ప్రయాణం చాలా సాఫీగానే సాగింది. మేము కాంగ్రెసుకు సంబంధించిన వ్యక్తులమన్న కారణంగా ఆ ప్రాంతాలలో అడుగు పెట్టడానికి వీలులేదనీ, వెంటనే వెనక్కు వెళ్ళమనీ మమ్మల్ని ఒక మిలిటరీ అధికారి ఆజ్ఞాపించాడు. మా కష్టాలకు ఆ ఆజ్ఞే నాంది అయిందన్నమాట.

షోరనూరు స్టేషనులోని మొదటి తరగతి విశ్రాంతి గదిలోకూడా మమ్మల్ని కూర్చోనివ్వలేదు. మిత్రులు కొందరు సహాయం చేయడానికి ముందుకొచ్చారు. మేము స్టేషన్ ఆవరణ దాటి ఊళ్ళో ఉన్న ఒక ధర్మశాలలో ప్రవేశించాము. ఆ రాత్రికి అక్కడ ఉండి, పరిస్థితులు గమనించి, అవలంబించ వలసిన విధానం నిర్ణయించుకోవాలని మాకోరిక. కాని మిలిటరీ అధికారులు మమ్మల్ని వెన్నంటే ఉన్నారు. మేమొక సత్రంలో మకాం చేశామన్న సంగతి గ్రహించి, వారు ఆ సత్రం అధికార్ల దగ్గరకు వెళ్ళి, ఆ సత్రపు పరిసరాలలో కూడా మేము ఉండడానికి వీలులేదనీ, వెంటనే ఖాళీచేసి బయటికి వెళ్ళిపోవాలనీ మాకు నోటీసు ఇవ్వవలసిందిగా వారికి ఆజ్ఞాపించారు. ఆ వూళ్ళో మాకు కావలసిన కాంగ్రెసు మిత్రులూ, అభిమానులూ ఉన్నా, మార్షల్‌లా పేరుమీద

మిలటరీవారు అమలు పరుస్తూ ఉన్న ఉద్ధత విధానాలకు జడిసి, వారు మాకు నిలవనీడకూడా యివ్వడానికి నిరాకరించారు.

షోరనూరులో కాంగ్రెసువారికి ప్రత్యేక స్థావర మనేది ఏదీ లేదు. కాస్త సమీపంలో ఉన్న ఒట్టపాలియంలో మాత్రం కాంగ్రెసు వారు తమ కార్యక్రమాలు సాగించడానికి వారి అధీనంలో ఒక యిల్లు ఉంది. మేము ఇరువురమూ ఎల్లాగో తంటాలుపడి పరిచయస్థుల సహాయంతో ఒట్టపాలియంజేరి, అక్కడవున్న "కాంగ్రెస్ హౌస్"లో విశ్రమించాము.

## ఆగంతకునితో గడిపిన రాత్రి

అదే సమయంలో పశ్చిమ గోదావరిజిల్లా నరసాపురం సివారు మత్స్యపురి నివాసి, గుడిమెట్ల ఆచారి అనే యువకుడు ఏలాగో తంటాలు పడి ఒట్టపాలియంలోని యీ ప్రాంతానికి రాగలిగాడు. మిలిటరీ ప్రాంతంగా నిర్ణయింపబడకపోయినా ఒట్టపాలియంలో కూడా కాంగ్రెసువారిని అనేక బాధలకు గురిజేశారు. పోలీసువారి చేతులలో బాగా దెబ్బలుతిని ఎల్లాగో తప్పించుకు వచ్చి అతడు ఆత్మరక్షణకోసం ఈ "కాంగ్రెస్ హౌస్"లో దూరాడు. మేము ఉభయులమూ, అచ్చటి కాంగ్రెసువారూ కూడా ఆ యువకుడు సి. ఐ. డి. పెద్దలలో ఒకడయి ఉండవచ్చుననీ పోలీసువారు చితగ్గొట్టారనే సాకుతో కాంగ్రెసు ఆఫీసులో దూరాడనీ అనుకున్నాము. నన్ను నమ్మించాలని అతడు ఎంతగా ప్రయత్నించినా, అతని పలుకులు విశ్వసించలేకపోయాను. కాని అదే రోజున మిలిటరీవారి చేతులలో మేము అనుభవించిన ఇక్కట్ల దృష్ట్యా అతణ్ణి వెళ్ళగొట్టలేకపోయాము.

ఆ రాత్రి అతను అక్కడే పడుకుంటానని కోరితే కాదనలేక పోయాము. అవలంబించ తగ్గ విధానానికి మేము ఆ రాత్రి ఒక పంథా వేసుకోవాలని అనుకున్నాము కాని అతడు సి. ఐ. డి. యేమోననే కాకణంగా, మా సంప్రతింపులూ, తర్జన భర్జనలూ మరునాటి ఉదయానికి వాయిదా వేసుకున్నాము. మేము ఒట్టపాలియం చేరేసరికి, వెంకట్రామయ్యర్ని వెంటనే పట్నం రావలసినదని కోరుతూ, అతని భార్య

దగ్గరనుంచీ, కుమారుని వద్దనుంచీ కూడా మూడు టెలిగ్రాములు వచ్చాయి. కాని ఇంకా కొంతకాలం నాతో ఉండి, పరస్పరం సహ కరించుకుందామనే అభిప్రాయం వెంకట్రామయ్యరు వెళ్ళడించాడు.

తిరుగుబాటు పరిస్థితినీ, మిలిటరీ చర్యలనూ బాగా ఆకళించుకుని ఉన్న ఆ ప్రాంతీయులు, మోటార్లు మున్నగునవి యేవీ రోడ్లమీద నడ వడానికి వీలుకాని పరిస్థితిని కలుగజేయడానికి అవలంబించిన విధానాన్ని గ్రహించి, మేము ఒట్టపాలియంనుంచి కాలికట్టుకు కాలినడకనే జేరా లని నిశ్చయించుకున్నాము. ఆ రోడ్డుదారిని కాలికట్టూ, ఒట్టపాలియం గ్రామాల మధ్య దూరం అరవై మైళ్లు.

మేము ఉభయులమూ మరునటి ఉదయాన్నే బయల్దేరాము. మాకు అచ్చటి విషమ పరిస్థితులు తెలియవు. కాలి నడకనే ఆ అరవది మైళ్ళు ప్రయాణం చెయ్యాలంటే కలిగే ఇబ్బందులూ, ఆటంకా లేవీ మాకు తెలియవు.

అల్లా బయల్దేరి ఒక అయిదు మైళ్ళు వెళ్ళేసరికి మాకు ఆ దారిని నడచి వెళ్ళడంలో ఎంత కష్టమున్నదో బోధపడింది. మాప్లాలలో చాలా మంది మిలిటరీలో పనిచేసి రిటైరయినవా రున్నారు. వారు లోగడ యుద్ధాలలో విదేశాలలో కూడా పనిచేసి ఉండడంవల్ల వారికి మిలిటరీ విధానాలు కొన్ని తెలుసు. అందువల్ల వారు ముమ్మందుగా రోడ్డు కిరు ప్రక్కలా వుండే బాగా ఎదిగిన చెట్లనన్నింటినీ నరికి, వాటిని దారికి అడ్డంగా, అడ్డదిడ్డంగా పడేశారు. ఆ అరవై మైళ్ళ పొడుగునా చెట్లన్నీ నరకబడి దారికి అల్లా అడ్డంగా పడవేయబడే ఉన్నాయి. ఆ దార్లన్నీ యే విధమయిన బళ్ళూ నడవడానికి వీలులేని పరిస్థితిలో ఉన్నాయి. అట్టి పరిస్థితులలో సాయంత్రం దాకా నడచినా ఇరవై మైళ్ళయినా వెళ్ళ లేకపోయాం.

## చెర్పల్ చేరీలో

మేము "చెర్పల్‌చేరీ" గ్రామం చేరేసరికి సూర్యాస్తమయం అయింది. ఉభయులమూ ఖద్దరు దుస్తులలోనే ఉన్నాము. దారిలో తటస్థ పడిన వారందరూ మమ్మల్ని ముందుకు వెళ్ళకుండా ఆ రాత్రికి అక్కడే

విశ్రాంతి తీసుకోమని సలహా యిచ్చారు. గస్తీలోవున్న మిలిటరీ వారికీ మాకూ సంఘర్షణ జరుగవచ్చునని కూడా మమ్మల్ని హెచ్చరించారు.

మెయిన్ రోడ్డువదలి, ప్రక్కగా, రెండు మూడు ఫర్లాంగుల దూరంలో ఉన్న "చెర్పల్‌చేరీ" గ్రామం, నిజంగా, మేము అదృష్ట వశాత్తే చేరామని భావించవలసి ఉంటుంది. మెయిన్‌రోడ్డువదలి ప్రక్కనున్న బండిబాటని మేము నడక ప్రారంభించిన కొద్ది సేపట్లోనే గుర్రాలమీద వచ్చిన మిలిటరీవారు ఆ ప్రాంతం అంతా గాలించారనీ, నిజంగా మేమే గనుక మా ఖద్దరు దుస్తులతో వారి కంటబడి ఉంటే తక్షణమే మమ్మల్ని కాల్చేసేవారనీ, మా వెనకాలే ఆ గ్రామానికి వచ్చిన వారు చెప్పారు. ఆ రాత్రికి మేము అక్కడే విశ్రమించాం.

తెల్లవారేసరికి వెంకట్రామయ్యరు తాను మద్రాసు వెళ్ళిపోవడానికే నిశ్చయించుకున్నాననీ, అందువలన నాతోబాటు యింక ముందుకు సాగలేననీ కచ్చితంగా చెప్పేశాడు. ఆయన నాకంటె వయస్సులో పెద్దవాడు. విద్రోహ చర్యలుగా దారిలో ఏర్పడిన అడ్డంకుల నన్నింటినీ అధిగమించి ఆ వయస్సులో ఆ యాత్ర ముగించలేనని ఆయన వ్యక్త పరిచాడు. ఆయన వెనక్కి వెళ్ళడానికి నేను అంగీకరించాను. ఇద్దరు మిత్రుల సాయంతో ఆ సాయంత్రానికి ఒట్ట పాలియం జేరుకుని, ఆయన రాత్రి బండికి పట్నం వెళ్ళిపోయాడు.

ఏమయినా సరే మేము మీతో వచ్చి తీర్తాము అంటూ బయల్దేరిన నలుగురు మిత్రులతో నేను చెర్పల్‌చేరీ గ్రామంనుండి కాలికట్టుకు బయల్దేరాను. దారి పొడుగునా రోడ్డంతా ఒకే మాదిరిగా ఉంది. రెండవ రోజు సాయంత్రానికి యింకో యిరవై మైళ్ళు నడవ గలిగాము. మూడవనాటి సాయంత్రానికిగాని నేను కాలికట్టు చేరలేకపోయాను.

## భయోత్పాత పరిస్థితులు

ఉద్రేక పూరిత పరిస్థితులలో ఉన్న కాంగ్రెసు మిత్రులు నన్ను ఆహ్వానించారు. విప్లవ ప్రాంతంలోని ముఖ్య కాంగ్రెసు నాయకులందరినీ పోలీసువారు అరెస్టు చేశారు. విప్లవ ప్రాంతంలో పర్యటించిన బార్‌యట్ లా కే. పి. కేశవమేనోన్ అప్పుడే తిరిగి వచ్చాడు. ఒక

ప్రక్క మాప్లాలూ, రెండవ ప్రక్క పోలీసు మిలిటరీ అధికారులు కలుగిస్తూన్న భయోత్పాతం గురించి వివరించాడు. అసలు విప్లవం అతి స్వల్పకారణం మీదనే ఆరంభం అయిందనీ, ఆరంభంలో అంత ఉద్ధృతంగా లేకపోయినా, వారం రోజులలోపలే మాప్లాలు అటు ఇంగ్లీషు వారినీ, ఇటు కాంగ్రెసు వారినీ కూడా తమ శత్రువులుగా భావించ డంతో విప్లవం తారస్థాయిని అందుకుందనీ తెలియవచ్చింది.

అప్పటివరకూ అతికష్టంమీద నిర్మాణమయిన హిందూ - మహమ్మదీయ సమైక్య సౌధం తునాతునకలయింది. మాప్లాలు ఇంగ్లీషు వారినీ, హిందువులనూ హింసించి తీరాలనే దృఢసంకల్పంతో ఉన్నారు. ఆ ప్రాంతం అంతటా మార్షల్ లా అమలు పరచబడింది. వెనువెంటనే విచారణ జరపడానికిగాను మిలిటరీ కోర్టులు తెరవబడ్డాయి. సాధారణంగా మరణ శిక్షే విధించేవారు.

అలీ ముసలియార్ అనే ఒక మాప్లానాయకుడు తన స్వతంత్ర పతాకం ఎగుర వేశాడు. ఒక వారం రోజులపాటు సివిలు, క్రిమినలు వ్యవహారులలో సర్వస్వతంత్రంగా వ్యవహరించాడు. ఆయన కూడా మరణ శిక్షలూ, ఆస్తి జప్తులూ విధించేవాడు.

మార్షల్ లా ప్రకటింపబడి నప్పటికీ, బ్రిటిషు ఆఫీసర్లూ, వారి కుటుంబాలూ ఏ క్షణాన ఎటువంటి ఇక్కట్లకు లోనవుతామోననే భీతి తోనే ప్రాణాలు బిగపట్టుకుని క్షణాలను యుగాలుగా గడిపే పరిస్థితిలో ఉన్నారు. ఇంగ్లీషువారు ఏ మాప్లా అయినా ఎదురయితే వెంటనే వాని కుత్తుక ఉత్తరించి చంపేసేవారు.

ఒకొక్కప్పుడు మాప్లా యువకులు జరిపిన చర్యలు చాలా ఘోరంగానూ, అమానుషంగానూ ఉండేవి. ఒక చిన్న మాప్లా కుర్ర వాడు చేతిలో కత్తిపట్టుకుని నడుస్తూ ఉన్న బస్సులోకి ఉరికి ఒక ప్రయాణీకుణ్ణి అప్పటి కప్పుడు చంపివేశాడు. డ్యూటీలో ఉన్న మిలిటరీ ఆఫీసరు జాక్సన్‌ని ముక్కలు ముక్కలుగా నరికి చంపారు. అడ్వకేట్ అయిన యం. పి. నారాయణమేనోన్, దెబ్బలాట ముమ్మరంగా సాగు తూన్న ఒక సందర్భంలో, అమాయిక ప్రజల్ని రక్షించాలని చేసిన

ప్రక్క మాప్లాలూ, రెండవ ప్రక్క పోలీసు మిలిటరీ అధికారులు కలుగిస్తూన్న భయోత్పాతం గురించి వివరించాడు. అసలు విప్లవం అతి స్వల్పకారణం మీదనే ఆరంభం అయిందనీ, ఆరంభంలో అంత ఉద్ధృతంగా లేకపోయినా, వారం రోజులలోపలే మాప్లాలు అటు ఇంగ్లీషు వారినీ, ఇటు కాంగ్రెసు వారినీ కూడా తమ శత్రువులుగా భావించడంతో విప్లవం తారస్థాయిని అందుకుందనీ తెలియవచ్చింది.

అప్పటివరకూ అతికష్టంమీద నిర్మాణమయిన హిందూ - మహమ్మదీయ సమైక్య సౌధం తునాతునకలయింది. మాప్లాలు ఇంగ్లీషు వారినీ, హిందువులనూ హింసించి తీరాలనే దృఢసంకల్పంతో ఉన్నారు. ఆ ప్రాంతం అంతటా మార్షల్ లా అమలు పరచబడింది. వెనువెంటనే విచారణ జరపడానికిగాను మిలిటరీ కోర్టులు తెరవబడ్డాయి. సాధారణంగా మరణ శిక్షే విధించేవారు.

అలీ ముసలియార్ అనే ఒక మాప్లానాయకుడు తన స్వతంత్ర పతాకం ఎగుర వేశాడు. ఒక వారం రోజులపాటు సివిలు, క్రిమినలు వ్యవహారులలో సర్వస్వతంత్రంగా వ్యవహరించాడు. ఆయన కూడా మరణ శిక్షలూ, ఆస్తి జప్తులూ విధించేవాడు.

మార్షల్ లా ప్రకటింపబడి నప్పటికీ, బ్రిటిషు ఆఫీసర్లూ, వారి కుటుంబాలూ ఏ క్షణాన ఎటువంటి ఇక్కట్లకు లోనవుతామోననే భీతి తోనే ప్రాణాలు బిగపట్టుకుని క్షణాలను యుగాలుగా గడిపే పరిస్థితిలో ఉన్నారు. ఇంగ్లీషువారు ఏ మాప్లా అయినా ఎదురయితే వెంటనే వాని కుత్తుక ఉత్తరించి చంపేసేవారు.

ఒకొక్కప్పుడు మాప్లా యువకులు జరిపిన చర్యలు చాలా ఘోరంగానూ, అమానుషంగానూ ఉండేవి. ఒక చిన్న మాప్లా కుర్రవాడు చేతిలో కత్తిపట్టుకుని నడుస్తూ ఉన్న బస్సులోకి ఉరికి ఒక ప్రయాణీకుణ్ణి అప్పటి కప్పుడు చంపివేశాడు. డ్యూటీలో ఉన్న మిలిటరీ ఆఫీసరు జాక్సన్‌ని ముక్కలు ముక్కలుగా నరికి చంపారు. అడ్వకేట్ అయిన యం. పి. నారాయణమేనోన్, దెబ్బలాట ముమ్మరంగా సాగుతూన్న ఒక సందర్భంలో, అమాయిక ప్రజల్ని రక్షించాలని చేసిన



ప్రయత్నానికి ప్రతి ఫలంగా మిలిటరీ కోర్టువారు ఆయన్ని అరెస్టుచేసి, ద్వీపాంతర వాస శిక్ష విధించారు.

హైకోర్టులో నా దగ్గిర జూనియర్‌గా పనిచేసిన శ్రీ కె. పి. కేశవమేనోన్ తన ప్రాణానికి తెగించి యెంతో సేవచేశాడు. అదృష్ట వశాత్తూ ఆయన్ని అరెస్టు చేయలేదు. నేను కాలికట్టు చేరిన మూడో నాటికి కేశవమేనోన్ అక్కడకు వచ్చాడు. జరుగుతూన్న సంఘటనలను గురించి ఆయన వ్రాసిన ఒక రిపోర్టు పైపు కాగితాలు నాకిచ్చాడు. నారాయణమేనోన్ అరెస్టయిన కారణంగా ఆయన్ని నేను కలుసుకోలేకపోయాను.

చాలామంది కాంగ్రెసువారు ఒక ప్రక్క మాప్లాల చేతులలోనూ, ఇంకొక ప్రక్క మిలిటరీవారి చేతులలోనూ ఎన్నో యిక్కట్లకు పాల్పడ్డారు. కాంగ్రెసుతో సంబంధం ఉన్నా లేకపోయినా అనేక హిందూ కుటుంబాలవారు, ఆ విప్లవ ప్రాంతంనుంచి ప్రాణాలకు తెగించి సకుటుంబంగా పలాయనం చిత్తగించారు.

## అపూర్వ సంఘటన

ఈ పరిస్థితులలో కొన్ని వింత సంఘటనలూ జరిగేవి. ఒక హిందువు మాప్లా వేషంతో ప్రాణాలని కాపాడుకో గలిగాడు. ఆయన ఒక లక్షాధికారి. ఒక మాప్లా గుంపు ఆయన ఇంటిమీద దాడిచేసింది. మాప్లా వేషంలో ఉన్న ఆ ఆసామీ, యజమాను లందరూ పారిపోయారనీ, తాను ఆ యింటి నౌకర్ననీ, దాడి చెయ్యడానికి వచ్చిన ఆ గుంపుతో విన్నవించుకుని ప్రాణాలు దక్కించు కున్నాడు. కాని ఆయన్ని మిలిటరీ కోర్టువారు పట్టుకుని అరెస్టుచేసి మరణ దండన విధించారు. ఆయన మిలిటరీ వారితో తన మాప్లా నామాన్నే చెప్పాడు. ఆయన్ని మాప్లాగానే అరెస్టు చేశారు. మాప్లాగానే విచారించారు. మాప్లాగానే ఆయనికి మరణ శిక్ష విధించారు. శిక్ష విధింపబడిన వెంటనే ఆయన ఈ కోర్టులలో న్యాయం జరగడం లేదనీ, తాను మాప్లాను కాదనీ, స్వప్రాణ రక్షణార్థం మాప్లా వేషం వేసుకోవలసి వచ్చిందనీ గట్టిగా అరిచాడు. జడ్జి ఆశ్చర్య చకితుడయ్యాడు. ఆచార ప్రకారం వెంటనే

అమలు జరుపబడే మరణ శిక్షను ఆపుచేశారు. ఆయన నిజంగా హిందువే అనే విషయం తేల్చుకోవడానికి విచారణ ఆరంభించారు. నిజం బయట పడ్డాక తాము విధించిన శిక్షను రద్దుపరచి ఆయన్ని విడుదల చేశారు.

ఇది ఒక అపూర్వ సంఘటనే అయినప్పటికీ, మార్షల్ లా ప్రాంతంలో, ధనానికీ, ప్రాణానికీ ఎటువంటి రక్షణ ఉంటుందో, వాటిని కాపాడుకోవడం ఎంత కష్టమో అర్థం అవుతుంది. అవి భయోత్పాతం స్వైర విహారం చేసిన గడ్డు దినాలు.

## మూలకారణం

నా విచారణ సందర్భంలో అసలు ఈ విప్లవానికి మూలకారణం ఏమయి ఉంటుందని పరిశీలించాను. డి. ఎస్. పి. హిచ్‌కాక్‌తో ఏకీభవించిన ప్రభుత్వోద్యోగులంతా ఈ తిరుగుబాటుకు కారణం కాంగ్రెస్ ఖిలాఫత్ సంఘాలవారి చర్యలేనని నిరూపించే ప్రయత్నంలో ఉన్నారు. లోగడ ఒట్టపాలియం సమావేశ సందర్భంలో, హిచ్ కాక్ అవలంబించిన విధానమూ, మా పై ఆయన వేసిన పరువు నష్టం దావా సంగతీ, యాకుబ్ హూస్సేన్ యం. కోయా, మాధవన్‌నాయరు, గోపాలన్ మేనోన్‌గార్ల పై ఆయన విధించిన ఆంక్ష, ఆ 144 వ సెక్షను ఉల్లంఘించిన కారణంగా వారికి విధింపబడిన శిక్ష మున్నగు అంశాలన్నీ లోగడ వివరించే ఉన్నాను.

ఇటువంటి పరిస్థితులలో ఆంగ్లేయాధికార్లు, కాంగ్రెస్, ఖిలాపత్ సంఘాలవారి కార్యక్రమాల కారణంగానే ఈ మాప్లా సంరంభం ఆరంభం అయిందని నమ్మడంలో ఆశ్చర్యం ఏమీలేదు. 1922 లో జరిగిన ముల్తాన్ విప్లవ సందర్భంలోనూ, ఇప్పుడూ కూడా సత్యానికీ, అధికార్లచే ప్రచారం చేయబడ్డ కారణాలకూ ఎక్కడా సంబంధం లేదు.

నా విచారణలో రికార్డయిన అంశాలనుబట్టి, హిందూ జమీందార్లకూ, మాప్లా రైతాంగానికీ మధ్య కొన్ని తగాయిదాలు ఉత్పన్నం అయ్యాయన్న సంగతి తేలింది. మాప్లాల జీవనోపాధి పొలాలమీదనే ఆధారపడి ఉంది. వారు రహితులుగానూ, పాలేర్లగానూ, బ్రతికేవారు. అప్పట్లో నేను సేకరించిన సమాచారాన్నిబట్టి తేలిన అంశం ఏమిటంటే,

నిలంబూరు ఎస్టేటు ప్రాంతంలో పాలేరుగా ఒక ఇంట పనిచేస్తున్న ఒక మాప్లా యువకుడు దొంగతనం చేశాడనే అనుమానంపై శిక్షింప బడ్డాడు. ఆ మారుమూల గ్రామంలో జరిగిన యీ చిన్న సంఘటనతో ఆరంభం అయిన గలాటా 1921 నాటి మాప్లా తిరుగుబాటుకు కారణం అని కొందరి ఊహ.

మాప్లాలకు సంబంధించి నంతవరకూ ఏ చిన్ని సంఘటన అయినా రాజుకుందంటే ఖాండవ దహనమే. వారి సంఘీభావమూ, కట్టుబాట్లు, మూర్ఖత, పట్టుదలా అల్లాంటివి. సాధారణంగా ఎవ్వరూ ఇటువంటి సంఘటనలనీ, తిరుగుబాట్లనీ పట్టించుకోరు. అందులో కాంగ్రెసు వారా కలుగజేసుకునేది? అయినా ఏదో ఒక చిన్న గృహ కలహం లాంటి పరిస్థితులలోనా? కాని, నేను లోగడ వివరించినట్లు, ఆ రాష్ట్రంలోని కాంగ్రెసువారి శక్తి సామర్థ్యాలు విదితమేకదా. అందు వల్ల రాష్ట్రీయ కాంగ్రెసు సంఘంవారు శాంతిని నెలకొల్పడానికి సత్వర చర్యలు తీసుకోకుండా ఎల్లా ఉండగలరు? కాంగ్రెసు కార్యనిర్వాహక సంఘ సభ్యుడనైన నేను, నా ప్రాణానికి తెగించయినా, ఆ ప్రాంతంలో ఉరికి చేయగలిగిన సేవకు సంసిద్ధుణ్ణి కావడం నా విధే గదా! నా విచారణ ముగిసిన తర్వాత క్లుప్తంగా రిపోర్టు వ్రాసి కలకత్తా క్యాంపులో ఉన్న మహాత్మా గాంధీగారికి పంపించాను. అదే ఆ 1921 నాటి మాప్లా తిరుగుబాటు చరిత్ర.

తర్వాత కాంగ్రెసువారు బాధితుల సహాయార్థం ఎనభయివేల రూపాయిలు మంజూరు చేయడమూ, అచ్చటి పరిస్థితులు సమగ్రంగా విచారించి నివేదించడానికిగాను ఒక సంఘాన్ని నియమించడమూ జరిగింది. హిందూ-మహమ్మదీయ సమైక్య సాధనకు ఎంతో ఉత్సాహంతోనూ, ఎన్నో ఆశలతోనూ ఆరంభింపబడిన కృషి మలబారులో జరిగిన యీ విప్లవం కారణంగా దక్షిణాదిని కూడా దెబ్బతింది.

## హిందూస్తాన్ సేవాదళం: సాంబమూర్తి నాయకత్వం

నాగపూరు కాంగ్రెసులో కాంగ్రెసు నియమావళితో పాటు జాతీయ స్వయం సేవక దళానికి కావలసిన నియమావళిని కూడా

రూపొందించాం. కాంగ్రెసులో ప్యాసయిన తీర్మానాను సారం నిర్ణీతమయిన 21 భాషా రాష్ట్రాలలోనూ, కాంగ్రెసు ఖిలాఫత్, స్వయం సేవక దళాలు ఏర్పడడమూ, జాతీయ స్వయం సేవక దళం ఆవిర్భవించడమూ జరిగింది. అల్లా ఆరంభింపబడ్డ జాతీయ స్వయం సేవక దళం హిందూస్తాన్ సేవా దళ నామాన్ని స్వీకరించి, కొద్ది దినాల లోనే బ్రహ్మాండమయిన సంస్థగా రూపొందింది.

ఈ హిందూస్తాన్ సేవా దళం వారిచే శిక్షణ గరపబడుతూన్న వేలాది స్వయం సేవకులను చూడడం చాలా ముచ్చట గొలిపేది. ఈ సేవా దళం దేశీయ శాంతి దళ స్థాపనకి ప్రాతిపదిక అయింది. ఇది దినదినాభివృద్ధి చెంది కాంగ్రెసు జరుగుతూన్న ప్రతి ప్రాంతంలోనూ ఎంతో సేవ జేసింది. కాని కొన్ని దుష్టగ్రహ కూటాలవల్ల ఈ సేవా దళం మూలపడి విచ్ఛిన్నం అయింది.

ఈ హిందూస్తాన్ సేవా దళానికి బులుసు సాంబమూర్తిగారు కొంతకాలం ఆధ్వర్యవం వహించారు.

ఏవో దుష్టఘడియలలో అనాలోచితంగా ఆ దళాన్ని విచ్ఛిన్నం చేసి ఉండకపోతే, 1922 లగాయితు నిత్య సంఘటనలుగా పరిణమించిన హిందూ-మహమ్మదీయ సంఘర్షణల సందర్భంలో ఆ దళంవారు ఆయా ప్రదేశాలలో ఉరికి, శాంతిస్థాపనాది కార్యక్రమాలలో ఎంతయినా ఉప యోగపడి ఉండేవారు.

కాగా, మిలిటరీలో చేరే సోల్జర్లూ, సిపాయీలూ, ఆఫీసర్లు వగైరా అందరూ ఏ ప్రకారంగా దేశ రక్షణాది విషయాలలో ఆత్మ త్యాగానికి సర్వత్రా సిద్ధం అనే ప్రమాణాన్ని తీసుకుంటారో అల్లాగే శాంతి భద్రతలను కాపాడడం కోసం శాంతియుతంగా, అహింసాత్మక పద్ధతుల ప్రకారం మానవసేవ, దేశసేవా చేస్తామనే ప్రమాణాన్ని తీసు కున్న యీ హిందూస్తాన్ సేవా దళం వారికి కూడా డ్రిల్లూ, డిసిప్లినూ ఉండేవి.

అహమ్మదాబాదు కాంగ్రెసు సందర్భంలో ఈ దళం వారికి

ప్రత్యేకమైన సూచనలు ఇవ్వబడ్డాయి. సత్యాహింసలకు సదాబద్ధులం అనే ప్రమాణాన్ని ప్రతి స్వయం సేవకుడూ విధిగా తీసుకునేవాడు.

1921 నాటి నిర్మాణాత్మక కార్యక్రమమూ, ప్రిన్స్ ఆఫ్ వేల్స్ పర్యటన సందర్భంలో చూపించిన నిరసనాత్మక బహిష్కరణా విజయవంతం అవడానికి, యీ స్వయం సేవకులూ, వారి నిస్స్వార్థ నిరాడంబర సేవా, ఎంతగానో ఉపకరించాయి.

అలాంటి ఉపయుక్త సంస్థని విచ్ఛిన్నం చెయ్యడం పొరపాటన్నది ఈనాడు మన కందరికీ అవగాహన అవుతోంది. మత సామరస్యం కొరవడిన కారణంగానూ, ప్రస్తుతం జరుగుతూన్న యుద్ధం * కారణంగానూ సంప్రాప్తమైన పరిస్థితులలో హిందూస్థాన్ సేవా దళంవారు ఎంతయినా సేవచేసి ఉండేవారు. బహుశః వారు ఆనాడు ప్రభుత్వం వారికీ, కాంగ్రెసు వారికీ మధ్య ఉత్పన్నమైన చిక్కుల మూలంగా ఏర్పడిన ఎన్నో విపరీత పరిస్థితులను సవ్యంగా ఎదుర్కొ గలిగేవారేమో కూడా.

# 8

# చీరాల పేరాల ఉదంతం: ఆంధ్రరత్న 'రామదండు'

ఆంధ్ర దేశానికి సంబంధించి నంతవరకూ 1921 లో జరిగిన బ్రహ్మాండమయిన చరిత్రాత్మక సంఘటన ఇంకొకటి ఉంది. ఇది చాలా ముఖ్యమయినదీ, మరపురానిదీ. ఇది చీరాల పేరాల ఉదంతంగా బాగా ప్రసిద్ధి కెక్కింది.

చీరాల గ్రామం గుంటూరుజిల్లా కోస్తా ప్రాంతంలోనిది. అక్కడ జననమంది పేరుగాంచిన యోధానుయోధుడు ఆంధ్రరత్న దుగ్గిరాల

---

* ద్వితీయ ప్రపంచ మహాయుద్ధం.

గోపాలకృష్ణయ్య. ఆయన మాంచి స్ఫురద్రూపి, సత్యసంధుడూ, విద్వాంసుడూ కూడాను. ఆయన ఎడింబరో విశ్వావిద్యాలయంలో విద్యాభ్యాసం ముగించుకుని వచ్చిన తర్వాత కొంతకాలం రాజమహేంద్రవరంలోని గవర్నమెంట్ ట్రెయినింగ్ కాలేజీలో ఆచార్యుడుగా ఉండేవాడు.

ఈయన చాలా స్వతంత్ర భావాలు గల వ్యక్తి. అప్పటి ప్రిన్సిపాల్ ఆర్. డబ్ల్యు. రాస్ దొరగారు చూపించిన నిరంకుశత్వానికి నిరసనగా తమ ఆచార్య పదవికి స్వస్తిచెప్పి, బందరు జాతీయ కళాశాలలో కొంతకాలం అధ్యాపకులుగా పనిచేశారు. తర్వాత పదవీ పరిత్యాగం చేసి దేశమాత పిలుపును ఆకర్ణించి, ఆమె సేవలో నిమగ్నుడయ్యాడు. చీరాల దూరతీరాలలోని ఇసుక పర్రలలో రామనగర గ్రామ నిర్మాణానికి పూనుకున్నాడు.

## విచిత్ర యుద్ధం

అసలు విషయం యేమిటంటే ఆ 1921 వ సంవత్సరంలో పానగలు రాజాగారి జస్టిస్‌పార్టీ వర్గానికీ, చీరాల ప్రజలకూ మధ్య పెద్ద యుద్ధమే ప్రారంభం అయింది. చీరాల-పేరాల పంచాయితీ యూనియన్‌ని పురపాలక సంఘంగా మార్చాలని మంత్రివర్గంవారి పట్టుదల. గోపాల కృష్ణయ్యగారి ఆధ్వర్య వాన దానిని పురపాలక సంఘంగా రూపొందించకుండా, ఎప్పటిలా యూనియన్‌గానే ఉండనియ్యమని ప్రజలకోరిక. ప్రజల కోరికను మంత్రి మండలివారు మన్నించక పోవడంతో, ప్రజలకూ మంత్రివర్గం వారికీ మధ్య ఒక రకమయిన యుద్ధమే ఆరంభం అయింది.

ఇది చాలా విచిత్రమయిన యుద్ధం. ఆంధ్రరత్న ప్రజలందరినీ కూడ గట్టుకొని, చీరాల ప్రాంతాన్ని మునిసిపాలిటీగా రూపొందిస్తే, ఆ గ్రామాన్ని పూర్తిగా విసర్జించి, వేరే తావులకు వలసగా వెడలి పోతామని తెలియజేశాడు. ఇది నిజంగా చాలా బ్రహ్మాండమయిన ప్రయత్నం. చీరాల-పేరాల ప్రజలు పదిహేడువేల మందికి పైగా ఉన్నారు. వారందరినీ ఒకే త్రాటిమీద నిలబెట్టి, వారిచేత తరతరాలుగా వారు వుంటూ

వున్న ఇళ్ళనీ, వాకిళ్ళనీ విడిచి పెట్టించి, వారిని రామనగరు పరిసర ప్రాంతాలకు తీసుకుని పోవడం అంటే మాటలా?

చీరాల వాసులతోటీ, ఆంధ్రరత్నతోటీ నాకు మంచి ఐక్యతా భావం ఉంది. వారి కోరిక న్యాయమైనదేనన్న భావమూ నాకు ఏర్పడింది. ఆ ప్రాంతమంతా పురపాలక ప్రాంతంగా మార్చబడే పక్షంలో గ్రామీణులకు గోరంత లాభం చేకూరకపోయినా, కొండంత భారం, పన్నుల రూపేణా, నెత్తిన పడడం అన్నది ఖాయం. అటువంటి క్లిష్ట సమయం అది. అప్పట్లో చీరాల-పేరాల వాసులకూ, ఆంధ్రరత్నకూ ఇవ్వగలిగినంత చేయూత ఇచ్చాను. నేను లక్షలమీద సంపాదిస్తూన్న కారణంగానూ, బ్యాంకులలో నా ధనం మూలుగుతూన్న కారణంగానూ, నేను ఆ ఉదంత విజయానికి చాలా విరివిగా విరాళం ఇచ్చాను.

## ఎర్ర చొక్కాల సేన

ఆంధ్రరత్న "రామ దండు" అన్న పేరుమీద ఎర్ర చొక్కాల సేనని ప్రోగుచేశాడు. గాంధీ మహాత్ముడు యావత్తు భారత దేశాన్నీ ఉద్ధరించాలని ప్రయత్నిస్తూ ఉన్న ఆ కాలంలో, ఆంధ్రరత్న చీరాల-పేరాల ప్రజల కోసం "రామ దండు" స్థాపనతో ఒక విశ్వామిత్ర సృష్టి చేశాడు.

1921 లో గాంధీగారి అఖిల భారత సంచార కార్యక్రమం సందర్భంలో నేనూ వారితోపాటు చీరాల వెళ్ళాను. గాంధీగారు సహాయ నిరాకరణ ఉద్యమ ప్రథమ దినాలలో "కాంగ్రెస్ నోట్స్" అన్న పేరుమీద భారత దేశంలో కాంగ్రెసు కారణంగా జరిగిన సంఘటన లన్నింటినీ వివరించేవారు. ఆ పద్ధతులమీదే ఆంధ్రరత్న "చీరాల-పేరాల నోట్స్"ను ప్రారంభించాడు.

## బ్రాహ్మణత్వ ప్రదానం

ఆయన క్షుణ్ణంగా సంస్కృతం నేర్చినవాడూ, విద్యావేత్తా, పండితుడూ అవడంచేత హిందూమత సద్ధర్మాలనూ, మూలసూత్రా

లనూ బాగా ఎరిగి ఉన్నవాడు. బ్రాహ్మణ, బ్రాహ్మణేతర సామరస్యం చెడి, వారి మధ్య రాజుకుని ప్రజ్వరిల్లుతున్న భేద భావాభావాలనీ, వారి మధ్యనున్న అగాధాన్నీ అంతమొందించడానికి సులభోపాయంగా, బ్రాహ్మణేతరు లందరిచేత యజ్ఞోపవీతధారణ చేయించి, వారినీ బ్రాహ్మణులగానూ, వారితో సమానస్థాయిని అనుభవించే వారినిగానూ మారుస్తాననీ, వారి కందరికీ వలసిన జ్ఞానబోధచేసి బ్రాహ్మణత్వం ఇస్తాననీ ఒక క్రొత్త పథకాన్ని ప్రచారంలోనికి తీసుకువచ్చాడు. ఆయన కొంతకాలం కాంగ్రెస్ జనరల్ సెక్రటరీగా కూడా పనిచేసాడు. ఆ హోదాలో భారత దేశమంతటా తిరిగే రోజులలో క్షయ రోగానికి గురి అయి, చాలా చిన్న వయస్సులోనే పరమపదించాడు.

## అపూర్వ దృశ్యం

చీరాల-పేరాల ఉదంతం ఆ ప్రాంతానికే చెందిన సమస్యే అయినా, దాని చండ ప్రభావంవల్ల అది ముఖ్యమయిన రాష్ట్ర సమస్యగానూ, తర్వాత సాటిలేని మేటి ఉదంతంగానూ రూపొందడంచేత, అది యావత్తు భారతావని దృష్టినీ ఆకర్షించింది.

ఆ పోరాటం ముమ్మరంగా సాగుతూన్న రోజులలో నేను చీరాల ప్రాంతానికి వెళ్ళాను. అచ్చట ఒక అపూర్వ దృశ్యాన్ని చూశాను. ఆ గ్రామాలకు చెందిన యావత్తు జనమూ బీదాసాదా, ముసలీ ముక్కీ, బ్రాహ్మణ అబ్రాహ్మణాది విభేదాలు యీషణ్మాత్రమూ లేకుండా ఏకగ్రీవంగా, ఆ గ్రామాన్ని వదలి ఇతర ప్రాంతాలలో స్థావరాలు ఏర్పాటు చేసుకోవడానికి, ఆనందంగా బయల్దేరారు. బీదవారు తమకు చెందిన తట్టాబుట్టా తమ నెత్తిమీద పెట్టుకుని స్వయంగా మోస్తున్నారు. ఇంతకంటె ఆశ్చర్యకరమైన సంఘటన ఉంటుందా?

## జస్టిస్ పార్టీ వారి 'జస్టిస్'

పదిహేడువేల ప్రజ, ఒక్కుమ్మడిగా, ఒక మాటగా కోరిన కోరికను న్యాయానికి పానుగలు మంత్రివర్గంవారు మన్నించి, వారిని ఇటువంటి ఇక్కట్ల పాలుగాకుండా చూచి ఉండవలసింది. కాని జస్టిస్

మంత్రివర్గంవారు చూపించిన జస్టిస్ అటువంటిది. వారు తమ పద్ధతి ప్రకారం చాలా క్రూరాతిక్రూరంగా ప్రవర్తించారు.

అశ్రుత పూర్వ పరిస్థితులలో, ప్రజలకూ పరిపాలకులకూ మధ్య, ఈ సంఘర్షణ ఇల్లా ఒకటి రెండు సంవత్సరాలపాటు సాగింది. ఆ తర్వాత పాలకుల పట్టుదలకే ప్రజలు తల ఒగ్గవలసి వచ్చింది. ఇది అనుశ్రుతంగా వస్తూవున్న హైందవ దుర్బలతా పరిణామం. ఇంకా కొంత కాలం యీ పోరాటం ప్రజలు సాగించగలిగి ఉంటే, ప్రభుత్వంవారు కాళ్ళబేరానికి దిగకుండా ఉండగలిగేవారు కారు. ప్రజలలో రవ్వంత ఆత్మశక్తి లోపించిన కారణంగా విజయం సాధించలేకపోయారు.

## పాలకుల మొండిపట్టు

కాని చీరాల-పేరాల ఉదంతం మాత్రం, గుంటూరు పన్నుల నిరాకరణ ఉద్యమంలాగే, హైందవ ఆత్మశక్తికి తార్కాణంగా నిలిచి పోయింది. జయం కనుచూపుమేర దూరంలో ఉంటూన్న సమయం లోనే, ప్రభుత్వంవారి బాధ్యతా రహితమైన మూర్ఖపు పట్టుదలలవల్ల ప్రజలు ఇక్కట్లు పాలవడం తప్పలేదు. చీరాల-పేరాల యూనియన్ పరిపాలనను, స్వల్ప వ్యయంతో, ప్రజోపయోగకరంగా రూపొందిస్తా మనీ, మునిసిపాలిటీగా మార్చని కారణంగా, ప్రజలకు ఏ విధమయిన కష్టనష్టములూ రానీయమనీ ఎన్ని విధాల హామీలు ఇచ్చి ఉన్నా, పరిపాలకులు వారి కోర్కెలను త్రోసిపుచ్చారన్నది పాలకుల పట్టుదలనీ, మూర్ఖతనే తెలియజేసింది.

తమకు ఉపయోగకరమైన విధంగా తమ పురపాలక విధానాన్ని సవరించుకుని, పాలన సాగిస్తామని అంటే, ఆ ఉత్తమమైన కోర్కెను మన్నించడం తమ ప్రాథమిక కర్తవ్యమైనా పాలకులు ప్రభుత్వంవారు పట్టుదలే ప్రధానంగా పెట్టుకుని, ప్రజలను ఇక్కట్ల పాలుచేయడమన్నది మరవడానికి వీలులేని విపరీత సంఘటన. ఈ విషయంలో ప్రభుత్వంవారి మూర్ఖతే బయటపడింది.

# 9

## శాసన సభా ప్రవేశ సమస్య: గాంధీ వాదులు, స్వరాజ్య వాదులు

గాంధీగారికి జైలు ప్రాప్తించిన తరవాత, కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం * లో కాంగ్రెసు పేరిట రాజ్యాంగ చట్టాన్ని చేపట్టి ఎందుకు పరిపాలన సాగించకూడదు అన్న ప్రశ్న వచ్చింది. ఆ విషయమై తర్జన భర్జనలు చేసి, నిర్ణయం తరవాత జరుగనున్న గయా కాంగ్రెసుకి వదిలివేశారు. గాంధీగారు నాయకత్వం వహిస్తున్నంతకాలం రాజ్యాంగ చట్టాన్ని చేపట్టడం అన్న ప్రసక్తే రాలేదు.

ఉద్యమనాయకుణ్ణి నిర్బంధించిన కొద్ది దినాలలోనే, సి.ఆర్.దాస్, మోతీలాల్ నెహ్రూగార్లను జైలునుంచి విడుదల చేశారు. వారిరువురికీ గాంధీగారి పద్ధతులపట్ల విముఖత ఏర్పడింది. లార్డ్ రీడింగ్ అందజేసిన రాజీ ప్రతిపాదనలకు గాంధీగారు ఒప్పుకోకపోవడమూ, చౌరీచౌరా ఉదంతం జరిగిన వెనువెంటనే గాంధీగారు ఉద్యమాన్ని విరమించడమూ అన్నవి ఈ విముఖతకు కారణాలు. సాధ్యమయినంత త్వరలో ఈ సహ కార నిరాకరణ పద్ధతికి స్వస్తి చెప్పాలని వారి తహతహ.

మన నాయకుడు అరెస్టయిన వెంటనే కార్యక్రమంలో మార్పు తేవడమన్నది నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. ఎల్లాగయినా దాస్ గారిని ఒప్పించి, రాజ్యాంగాన్ని చేపట్టడం అనే పద్ధతికి వారిని విము ఖులుగా చేసితీరాలనే దృఢసంకల్పంతో, వారిని కలుసుకోడానికని నేను కలకత్తా వెళ్ళాను. ఆయన దాపరికం లేకుండా తమ మనస్సులో ఉన్న దంతా నాతో చెప్పారు. "నీవు సహకార నిరాకరణ పద్ధతికే అంటిపెట్టు కుని ఉంటా ననడం శుద్ధ మూర్ఖత. ఆయనకేమో ఆరేళ్ళు శిక్ష విధించారు. ఈ ఆరు సంవత్సరాలలోనూ ఏమి జరుగనుందో ఆ భగవంతునికే తెలి

---

* 1922 నవంబరులో

యాలి. ఈ ఆరు సంవత్సరాలు నేను బ్రతికి ఉంటాననే నమ్మకం యేమిటి?" అన్నారు. నన్ను తమ పద్ధతికి త్రిప్పుకోవాలని చాలా తంటాలు పడ్డారు. కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగులో కూడా ఎన్ని విధాలో ప్రయత్నించారు.

గాంధీగారికి శిక్ష విధింపబడడమూ, దాస్, మోతీలాల్ గారలు కౌన్సిల్ ఎంట్రీకి అనుకూలంగా ప్రచారం ఆరంభం చేయడమూ గమనించిన లేటు ఎస్. శ్రీనివాసయ్యంగారు కాంగ్రెసులో చేరారు. గాంధీగారి సహాయ నిరాకరణ పద్ధతి నచ్చక ఆయన అంతవరకూ కాంగ్రెసులో చేరలేదు. అప్పట్లో ఆయన చెన్న రాజధానికి అడ్వకేటు జనరలు. కాగా సి.ఐ.యి. బిరుదు పొందినవారు. ఆయన తన బిరుదును విసర్జించి, పదవికి రాజీనామా చేసి, దాస్, మోతీలాల్ ప్రభృతుల కౌన్సిల్ ఎంట్రీ పదకానికి కావలసిన చేయూతనిచ్చి తీరాలనే ఉద్దేశంతోనే కాంగ్రెసులో చేరాడు.

కాని దాస్, మోతీలాల్ గార్లకు మనస్సులో ఒక చిన్న బెదురు ఉండిపోయింది. సత్యాగ్రహం, సహకార నిరాకరణం అన్న వాటిని ఆరంభమయిన కొద్ది రోజులలోనే విరమించినట్లయితే, దేశంలోనూ, ప్రజలలోనూ తమపట్ల ఏం దురభిప్రాయం యేర్పడుతుందో నన్న భయంతో, సహకార నిరాకరణ అంటూనే తమ పదకాన్ని కొంత మార్పుతోనూ, మెలికతోనూ అమలు జరపాలని తలచారు. ఆ ఇరువురూ మేధావులు, లాయర్లు. అట్టి వారికి పదకాలకూ, మెలికలకూ, మార్గమే దొరకదా? కౌన్సిల్ ప్రవేశ మన్నది మంత్రిపదవుల కోసమూ, వారు ప్రవేశపెడతా మన్న సంస్కరణలు అమలు జరపడానికీ కాదు అనీ, మేము లోపల ప్రవేశించి వారి కార్యక్రమాలు స్తంభింప జేస్తామనీ, దాన్తో వారి పరిపాలనా విధానాన్ని సాగకుండా చేస్తామనీ చెప్పసాగారు. నిర్బంధానికి ముందు గాంధీగారు వారి పదకానికి ఒప్పుకోలేదు. ఆయన జైలులో ఉన్న కారణాన్ని కాంగ్రెసులో తమ పదకం అంగీకరింప

బడుతుందని వారు భావించారు.

వీరు వేసిన పదకానికి శ్రీనివాసయ్యంగారు కొద్ది మార్పులను సూచించారు. లోగడ ఐర్లెండులో ఐరిషు రిపబ్లికన్ పార్టీవారు అవలంబించిన విధంగా కౌన్సిల్‌లో ప్రవేశించి, దాని కార్యక్రమాలకు హాజరు కాకుండా ఉంటే ప్రభుత్వ విధానాలు స్తంభిస్తాయన్నారు. కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశం ఈ విషయాలన్నీ రాబోవు గయా కాంగ్రెసు నిర్ణయానికి వదిలెయ్యడానికి నిశ్చయించారు.

1923 లో కార్యనిర్వాహక వర్గ సభ్యత్వానికి రాజీనామా ఇచ్చే వరకూ నేను రాజగోపాలాచారిగారితో బాటుగా 'నో-ఛేంజరు' గానే ఉండేవాడిని. 1922 లో జరిగిన ముఖ్య కార్యక్రమం యేమిటని యీనాడు విలియా వేసుకుంటే, కాంగ్రెసులోని ఉభయపక్షాల వారమూ (నోఛేంజ్, ప్రోఛేంజ్) మా మా పక్షాలకు బలం చేకూర్చుకోవడానికి జరిపిన ప్రచారమేనని ఒప్పుకోక తప్పదు.

దాస్-మోతీలాల్‌గార్లకు తమ విధానంపట్ల ప్రజలలో ఆదరణ అధికమవుతుందనే విశ్వాసం ఉంది. ఎందుకంటే—తమ విధాన ప్రకారం, చేయవలసిన త్యాగాలు అట్టే ఉండవు గనుక. నేనూ, రాజగోపాలాచారిగారూ మాత్రం వారి పదకానికి అంగీకరించలేకపోయాము. అందువల్ల గయా కాంగ్రెసు నాటికి ఉభయపక్షాలవారమూ రెడీ అంటే రెడీ, ఢీ అంటే ఢీ అనేటట్లుగానే ఉన్నాము.

## గయా కాంగ్రెసులో మా విజయం

గయా కాంగ్రెసులో మాకే విజయం లభించింది. దాస్-మోతీలాల్‌గార్ల ప్రతిపాదనలు వీగిపోయాయి. వారుభయులూ బహిరంగ సమావేశంలోనే ఆగ్రహావేశులయ్యారు. కార్యనిర్వాహక వర్గంనుండి వెంటనే వైదొలగుతామనీ, మొత్తం దేశం అంతా తిరిగి విశేష ప్రచారంజేసి, రాబోవు కాంగ్రెసునాటికి తమ భావాలే ప్రజలంతా బల

పరచే లాగున ప్రబోధం చేస్తామనీ వ్యక్తం చేశారు.*

గయా కాంగ్రెసు ముగిశాక 1-1-1923 న జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో ఏప్రిల్ 30 వ తేదీనాటికి 25 లక్షల రూపాయలు విరాళాలుగా ప్రోగుజేసి, గాంధీగారు జైలులో ఉన్నంత కాలం, యాభై వేల స్వచ్ఛంద సేవకులద్వారా, ఆయన విధానానుసారం సహకార నిరాకరణ ఉద్యమ ప్రచారం ముమ్మరంగా సాగించడానికి నిశ్చయించుకున్నాము. ఈ సహకార నిరాకరణ ఉద్యమం సవ్యంగా సాగించడానికి కార్యనిర్వాహకవర్గం వారికి అధికారం కూడా ఇవ్వ బడింది. † గయా కాంగ్రెసువారి తీర్మానాలకు అనుగుణంగా ముమ్మ రంగా ప్రచారం చేయడానికి నిశ్చయించుకుని, రంగంలోకి దిగడానికి సిద్ధం అవుతున్నాం.

## తిరిగిపోయిన ఆచారిగారు

ఆ సమయంలో రాజగోపాలాచారిగారు తమ మనోదౌర్బల్యం కారణంగా మారిపోతారని నేనెప్పుడూ అనుకోలేదు. ఆ మరుసటి నెల లోనే ఆయన పదకంలో మార్పు వస్తుందని అనుకోలేదు. ఎప్పుడు, ఏ విధంగా రాజగోపాలాచారిగారికి, దాస్-మోతీలాల్‌గార్లు రాజీ ప్రతి పాదనలు అందజేశారో నాకెంత మాత్రమూ తెలియదు. నేనూ, దాసూ ఎప్పుడూ చాలా సన్నిహితంగానే ఉండేవారము. రాజకీయ విధానాలలో మాకు భేదాభిప్రాయాలున్నా, మాలో మేము ఎప్పుడూ హృదయాలు విప్పి మాట్లాడుకునేవారం. తాము రాజగోపాలాచారిగారికి అందించిన రాజీ ప్రతిపాదనలను గురించి దాస్‌గారు నాతో ఎప్పుడూ చెప్పలేదు.

---

* సి. ఆర్. దాస్ తన అధ్యక్షోపన్యాసంతో పాటు స్వరాజ్యపార్టీ నిబంధనావళిని, తన రాజీనామానూ కూడా తయారు చేసుకునే మహాసభకు వచ్చారుట. ఈ విధంగా కాంగ్రెసులో 'స్వరాజ్య' కక్షి ఏర్పడింది.

† అధ్యక్షులు సి. ఆర్. దాస్ తన రాజీనామా పత్రం సమావేశం ముందు పెట్టారు. ఆ విషయం ఫిబ్రవరి సమావేశానికి వాయిదా వెయ్యడం జరిగింది.

నిజానికి దాస్-మోతీలాల్‌గార్లు చాలా ప్రజ్ఞావంతులు గనుకనే, మరుసటి నెల తిరక్కుండానే రాజగోపాలాచారిగారిని తమ ప్రక్కకు త్రిప్పి వేసుకుని, రెండు మాసాలపాటు త్రివిధ బహిష్కార ప్రచార విరమణకు, రెండవ కంటివానికి తెలియకుండా, సుముఖుణ్ణి చేసుకోగలిగారు. ఈ లోపున తాము దేశాన్నిచుట్టి, తమ ప్రచారాన్ని సాగించి దేశీయులను తమ ఉద్దేశాల కనుగుణంగా త్రిప్పుకోవడానికి అవకాశం ఉంటుందని వారు ఆశించారు. రెండు మాసముల వ్యవధిలో తమ ప్రచార బలంతో ప్రజలను తమ పక్షానికి త్రిప్పుకుని తమ వాదనలో ఉండే శక్తినీ, సత్యాన్నీ ప్రజల ముందు పెట్టలేకపోతే, తాము మనస్ఫూర్తిగా సహకార నిరాకరణ ఉద్యమానికే తమ శక్తిని ధారపోసి, గయా కాంగ్రెసువారు పునఃపరిశీలనానంతరం అమలుపరచ నిశ్చయించుకున్న త్రివిధ బహిష్కార కార్యక్రమంతోటీ, గాంధీగారి రాజకీయ విధానం తోటీ సహకరించగలమని వారు ఒప్పందానికి రాగా, ఆచారిగారు 1-1-'23 నాటి తమ సుముఖ భావాన్ని 27-2-'23 నాటికి సులభంగా మార్చుకో గలిగారు. ఈ పెద్దమనిషి రెండు మాసాలలో మునిగిపోయేదేముందనే ధీమాతో, ఆ నాయకులకు ఆ అవకాశం కలిగించారు. ఫిబ్రవరి 27 వ తేదీని అలహాబాదులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగు జరిగే ముందు, కార్యనిర్వాహకవర్గం సమావేశమైంది. ఆ మీటింగుకు రాజగోపాలాచారిగారు ఆలస్యంగా వచ్చారు. ప్రవేశపెట్టబోయే తీర్మానం విషయంలో అభిప్రాయభేదాలు లేకుండా ఉండడానికి, పునఃపరిశీలనార్థం దాస్-మోతీలాల్‌గార్లతో రాజగోపాలాచారిగారిని జతపరచడాన్ని పురస్కరించుకుని దాస్‌గారు, మోతీలాల్ గారు తమ పొగడ్తల ద్వారా త్రివిధ బహిష్కార కార్యక్రమాన్ని తాత్కాలికంగా విరమించాలనే తీర్మానాన్ని రాజగోపాలాచారిగారే ప్రతిపాదించేటట్లుగా చేయగలిగారు. ఈ తెర వెనుక భాగవతం నా కేమాత్రము తెలియనివ్వలేదు. రాజగోపాలాచారి గారు వచ్చి సభలో పాల్గొంటూ, తమకూ ప్రత్యర్థులకూ ఒక విధంగా రాజీ కుదిరిందనీ, దానిమీదట రెండు మాసాలపాటు త్రివిధ బహిష్కార కార్యక్రమాన్ని వాయిదా వేయాలనే ప్రతిపాదన తానే మహాసభలో

తీర్మాన రూపంగా ప్రవేశపెట్టనున్నాననీ చెప్పేవరకూ తెరవెనుక ఎంత గ్రంథం నడిచిందో అవగాహన చేసుకోలేకపోయాను.

నా రాజీనామా

కార్యనిర్వాహకవర్గ సభ్యులను ఎవ్వరినీ ముందుగా కలుసుకోకుండా, రాజగోపాలాచారిగారు అటువంటి ప్రతిపాదన ప్రవేశపెట్టడానికి అంగీకరించడం నాకు చాలా విచార హేతువే అయింది. త్రివిధ బహిష్కార కార్యక్రమం వాయిదా వెయ్యాలన్న ప్రతిపాదనలో గర్భితమై ఉన్న అపాయాన్ని సూచించాను. కీడు మేళ్ళు బేరీజు లేస్తూ విషయాన్ని వివరించిన నా శ్రమ అంతా రాజగోపాలాచారిగారి విషయంలో బూడిదలో పోసిన పన్నీరే అయింది. దాస్-మోతీలాల్‌గార్లు పన్నిన వలలో ఇరుక్కున్నారన్నాను. ఎంతో తెలివిగా వారు త్రవ్విన గోతిలోకి అనుకోకుండా నవ్వుతూ వెడుతున్నారన్నాను. దిగగొట్టడానికి వీలుగా మలచబడిన సీలయొక్క మొన- వారి వాదన, అన్నాను. రెండు మాసాల విరమణ అన్నది శాశ్వత విరమణకే ప్రాతిపదికా, నాందీ అన్నాను. నా వాదన అంతా కంఠశోషే అయింది. ఆయన చాలా మొండిగా తయారయాడు. జరిగే ప్రతి సమావేశ సారాంశం, తీర్మానాలు వ్రాసే రికార్డు పుస్తకం(మినిట్స్ బుక్)లో ఈ మాటే వ్రాసి, నా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాను.

తరవాత, అ. భా. కాం. సం. సమావేశంలో ప్రత్యర్థుల ప్రతిపాదనను ప్రవేశపెట్టే గౌరవం రాజగోపాలచారిగారు దక్కించుకున్నారు. దాస్-మోతీలాల్‌గారలు ఆ ప్రతిపాదనను బలపరిచారు. కొన్ని నిమిషాలలో అది సభవారి ఆమోదాన్ని పొంది, తీర్మానమే అయిపోయింది. నిజానికి అది గాంధీగారి కార్యక్రమ నాశనానికి నాందే అయింది.*

* ఈ సమావేశంలో ఏప్రిల్ 30 వ తేదీవరకు ఉభయ పక్షాలవారు శాసన సభా ప్రవేశాన్ని గురించి ప్రచారం నిలిపివేసే టట్టుగా 'తాత్కాలిక సంధి' కుదిరింది. ఈ రాజీ కుదిర్చినవారు మౌలానా అబుల్ కలామ్ అజాద్, పండిత జవహర్ లాల్ నెహ్రూ. ఈ సభనాటికి వారు జైలునుంచి విడుదలయ్యారు.

దాస్-మోతీలాల్‌గార్లు అంతకు పూర్వం దేశం నలుమూలలా పర్యటించి, తమ భావాలను ప్రజలలో చాటి చెప్పారు. దాన్తో దేశంలో చీలికలు ఏర్పడ్డాయి.

## శాసనోల్లంఘన ఉద్యమ విచారణ

అంతేకాదు- అదే కాలంలో శాసనోల్లంఘన ఉద్యమ విచారణ సంఘం* అంటూ ఒక ఉపసంఘాన్ని వారు నియోగింపజేశారు. దేశంలో గాంధీగారి సహకార నిరాకరణ ఉద్యమం విజయవంత మయిందా లేదా అన్న సంగతి పరిశీలించి, దేశక్షేమం దృష్ట్యా ఆ ఉద్యమాన్ని సాగించడం మంచిదా లేక దానికి స్వస్తి చెప్పడం అవసరమా అన్న విషయాన్ని సమగ్రంగా తేల్చుకోవడానికి కావలసిన సమాచారాన్ని సేకరించవలసిందిగా ఆ సంఘానికి ఆదేశించారు.

అప్పటికే దేశీయు లందరికీ దాస్-మోతీలాల్ ప్రభృతులు గాంధీగారి విధానానికి విముఖులనీ, గాంధీగారు విడుదల అయ్యేలోపల, ఎల్లాగయినా ఆ విధానానికి స్వస్తిచెప్పడానికే నిశ్చయించుకున్నారనీ, విశదం అయింది. శాసనోల్లంఘన ఉద్యమ విచారణ సంఘాన్ని నియోగింపజెయ్యడం, గయా కాంగ్రెసు తీర్మానాన్ని వెనక్కి నెట్టించడం, అఖిల భారత కాంగ్రెసు సంఘంవారు 1-1-'23 న ప్యాసుచేసిన తీర్మానాన్ని రద్దు చేయించడం—ఒక దాని కొకటి తోడయి దేశీయుల హృదయాలలో కల్లోలాన్ని రేపాయి.

రాజగోపాలాచారిగారి బలహీనతవల్లనే ఇలాంటి పరిస్థితి ఉత్పన్నమయిందని అందరూ గ్రహించారు. గాంధీగారు బైటలేని కారణంగా, దేశానికి నో ఛేంజి, ప్రో ఛేంజి విధానాలలో ఏది ఉపయోగకరమయిన విధానమో తేలదని కాంగ్రెసు సేవకులు భావించారు. దాస్-మోతీలాల్ గార్లు తమ పార్టీ గురించి ప్రచారం చేస్తూ ఊరూరా తిరిగి ఉపన్యాసా

* గాంధీగారు నిర్బంధితు లయాక లక్నోలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం (1922 జూన్)లో.

లిస్తూ ఉంటే, చాలాచోట్ల ప్రజలు, ఏ పార్టీకి విరాళాలి స్తే దేశానికి క్షేమం కలుగుతుందో నిర్ణయించుకోలేక, తాము యివ్వదలచిన విరాళాన్ని ఆ రెండు పార్టీలవారికీ సమంగా పంచి యిచ్చేవారు.

సహకార నిరాకరణ విధానం దేశానికి ఎంతవరకూ ఉపకరించింది అన్న విషయాన్ని తేల్చడానికి నియోగింపబడిన "శాసనోల్లంఘన ఉద్యమ విచారణ సంఘం" సత్యాగ్రహ విధానాన్ని విరమింపజేయడానికే ప్రాతిపదికగా ఏర్పాటయిందన్న నమ్మకం జనంలో బాగా నాటుకు పోయింది. ఆ సంఘ సభ్యుడుగా తనను కూడా ఎన్నుకున్నారని, రాజగోపాలాచారిగారు చాలా సంతోషించారు. సహాయ నిరాకరణ విధానానికి స్వస్తిచెప్పాలనే ఉద్దేశాన్ని కడుపులో పెట్టుకునే, రాష్ట్రాలవారీగా, ప్రజాభిప్రాయ సేకరణ కంటూ, ప్రయాణాలు సాగించారు. దాస్-మోతీలాల్ గారలు తమ పన్నుగడ మనస్సులో పెట్టుకునే, కార్యక్రమం సాగిస్తున్నారన్న సంగతి నేను గ్రహించాను. ఈ విషయంలో ప్రజాభిప్రాయం అవిచ్ఛిన్నంగానూ, ఏకగ్రీవంగానే ఉంది; వచ్చిన చిక్కల్లా నాయకుల మధ్య ఏర్పడిన స్వల్పమైన తగాదాలేనన్న విషయాన్ని రుజువు చెయ్యాలనే తలంపు నాకు గట్టిగా కలిగింది.

## గుంటూరులో దర్యాప్తు

ఆ సంఘంవారు, విచారణ నిమిత్తం ఆంధ్ర రాష్ట్రానికి విచ్చేసిన సందర్భంలో, నాకు ఒక అవకాశాన్ని కల్పించారు.* గత సంవత్సరమే పన్నుల నిరాకరణ ఉద్యమాన్ని ముమ్మరంగా సాగించ గలిగిన ఆ గుంటూరు గ్రామాన్నే ఆంధ్రదేశ కేంద్రంగా భావించి విచారణ జరిపిస్తాం అన్నారు. నిజానికి, గాంధీగారు బైట ఉన్నప్పటి కంటే, నిర్బంధింపబడిన తర్వాతనే దేశంలో అలజడీ, ఉత్సాహమూ, ఎక్కువయ్యాయన్న సంగతి అక్కడ రుజువయింది.

గుంటూరుజిల్లా పోలీసు సూపరింటెండెంటు ప్రదేశ కాంగ్రెసు

---

* అప్పుడు పంతులుగారే ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు సంఘానికి అధ్యక్షులు.

కమిటీ ప్రెసిడెంటుగారికీ, జిల్లా కాంగ్రెసు అధ్యక్షులయిన ఉన్నవ లక్ష్మీ నారాయణగారికీ, విచారణ సంఘం వచ్చిన సందర్భంలో, (వాలంటీర్ల చేత) ఊరేగింపులూ, సభలూ జరిపించరాదని ఆదేశిస్తూ నోటీసులు జారీ చేశాడు. మీ నోటీసును పాటించమనీ, మా వాలంటీర్లు కార్యక్రమాలలో పాల్గొంటారనీ ఆ జిల్లా పోలీసు సూపరింటెండెంటుగారికి నేను సమాధానం ఇచ్చాను.

విచారణ సంఘంవారు వస్తూన్న రైలు రెండు గంటలాలస్యం అయింది. చాలామంది వాలంటీర్లు అరెస్టుకు సిద్ధంగా డ్యూటీమీదే ఉన్నారు. పోలీసు స్టేషను సమీపంలో వాలంటీరుగా ఉన్న డి. వి. రాజు తలమీద ఉన్న గాంధీ టోపీని పోలీసువారు బలవంతంగా ఊడలాగి, అతనిని అవమానించారు. పోలీసువారు, తాము జారీ చేసిన ఆర్డరును వాలంటీర్లు వ్యతిరేకించే లోపలే, ఏదో ఒకరకంగా గిల్లికజ్జా తెచ్చి అశాంతిని కలుగ జేయాలని దృఢంగా సంకల్పించుకున్నారన్న సంగతి నిశ్చయం అయింది. నేను పోలీసు సూపరింటెండెంటుకు ఇచ్చిన సమాధానాన్ని పురస్కరించుకుని, ముందుగా నన్నూ, లక్ష్మీనారాయణగారినీ పోలీసువారు అరెస్టు చేయవలసి ఉంది. కాని మమ్మల్ని ఇద్దరినీ వదిలి, బాచీల వారీగా వాలంటీర్లని అరెస్టు చేయడం ఆరంభించారు. ఆ ప్రకారంగా ఆ రైలు వచ్చే లోపల మూడువందల మంది వాలంటీర్లు అరెస్టయ్యారు.

ఈ వాలంటీర్లను అరెస్టుచేసి తీసుకు వెడుతూన్న సందర్భంలో నేను అక్కడే ఉన్నాను. ఉన్నవ లక్ష్మీనారాయణగారు, తాను అరెస్టు అవ్వాలనే తహతహ కనబరుస్తున్నా, పోలీసువారు ఆయన జోలికి పోవడము లేదు. అరెస్టు చేయబడిన ఒక వాలంటీర్ల బాచిని ఒక గుండ్రని గుంపుగా నిలబెట్టి, కొందరు పోలీసులను ఆ గుంపుకు కాపలాగా నియమించారు. లక్ష్మీనారాయణగారు, ఆ గుంపు చుట్టూరా రెండు మూడు సార్లు తిరిగి, తనను నిర్బంధించడానికి పోలీసులు విముఖంగా ఉన్నారని గ్రహించి, బలవంతంగా ఆ వాలంటీర్ల గుంపులోనికి ప్రవేశించి, అరెస్టయిన వారిలో తాను కలిసిపోయాడు. ఏ విధమయిన అలజడీ లేకుం

డానే ఆయన అరెస్టవడానికి చూపించిన ఉత్సాహాన్ని చూసి పోలీసువారు ఆశ్చర్యపోయారు.

"గార్డ్ ఆఫ్ ఆనర్"

కమిటీవారు వచ్చేసరికి మేము వారిని పూలతోటీ, మాలలతోటీ కాదు ఆహ్వానించింది. వారి రాక సందర్భంలో గౌరవ పురస్సరంగా అరెస్టయిన మూడు వందలమంది వాలంటీర్ల గుంపే వారికి "గార్డ్ ఆఫ్ ఆనర్" అయింది. సహాయ నిరాకరణ ఉద్యమాన్ని విరమింప జేయాలనే ఉద్దేశంతో వచ్చిన "సివిల్ డిసొబిడియన్స్ ఇంక్వయిరీ కమిటీ" వారికి, గాంధీగారి ఉద్యమాన్ని ప్రోత్సహించి, అనుసరించాలని దేశీయులు ఎంతగా తహతహ లాడుతున్నారో వేరే సాక్ష్యం అవసరం లేకుండానే రుజువయింది.

నాటి సాయంత్రం విచారణ సంఘ నాయకులు ఒక బహిరంగ సభలో ఉపన్యసించారు. ఆ సభకు పూర్తిగా ఖద్దరు ధారులయిన జనం సుమారు లక్షమందికి పైగా హాజరయ్యారు. సభానంతరం వారి వారి మకాములకు వారు చేరుకున్నాక, ఆ సంఘ సభ్యులే అయిన రాజగోపాలాచారిగారు, ఆ స్వచ్ఛంద సేవకులను ఎందుకు నిర్బంధించారో, సబ్-డివిజినల్ మాజిస్ట్రేటుగారిని అడగమని అన్నారు. మాజిస్ట్రేటుగారు జారీచేసిన ఆర్డరును వ్యతిరేకించిన కారణంగా వారిని అరెస్టు చేసినప్పుడు, ఆ విషయమై ప్రశ్నించడం అనవసరమూ, అర్థంలేనిదీ అని నేను చెప్పాను. ఇంకేవిధమయిన సంజాయిషీనీ సేకరించకుండానే ఆ సంఘంవారు ఇతర ప్రాంతాలకు వెళ్ళిపోయారు. చివరకు వారి రిపోర్టులో దృక్పథాలలో తేడా లున్నాయని సూచించారు. రాజగోపాలాచారిగారూ, కస్తూరి రంగయ్యంగారూ, అందులో ఏ విధమయిన మార్పులూ చేయడానికి అంగీకరించలేదు.*

---

* ఈ విచారణ సంఘం తమ నివేదికను అఖిల భారత కాంగ్రెసు సంఘానికి సమర్పించింది. కలకత్తాలో ఆగస్టు(1922)లో జరగవలసిన అ. భా. కాం. సం. సభ నవంబరులో జరిగింది. శాసన సభా ప్రవేశ సమస్య గయా కాంగ్రెసుకు విడిచి వేసింది_ఈ సమావేశమే.

## నా జోస్యం నిజమైంది

1923 వ సంవత్సరం మే 26-27 తేదీలలో బొంబాయిలో అఖిల భారత కాంగ్రెసు సంఘంవారు సమావేశమయ్యారు.

ఈ సభవారు గయా కాంగ్రెసులో శాసన సభా బహిష్కారానికి అనుకూలంగా ఆమోదింపబడిన తీర్మానాన్ని రద్దుచేశాం అన్నారు. ఆ విధంగా లోగడ నేను చెప్పిన జోస్యం, తు. చ. తప్పకుండా నిజమయింది. రెండు మాసాల విరమణ శాశ్వత విరమణకు దారితీస్తుందనీ, అలాంటి అవకాశం కలుగజేస్తూన్న కారణంగానే నేను నా కార్య నిర్వాహకవర్గ సభ్యత్వానికి రాజీనామా యిస్తున్నానని చెప్పిమరీ రాజీనామా యిచ్చాను గదా! ఆ తాత్కాలిక విరమణ, నేను అన్నట్లుగానే, శాశ్వత విరమణ అయిపూరుకుంది. ఈ శాశ్వత విరమణ అంగీకారం పొందిన కారణంగా, వర్కింగ్ కమిటీనుంచి ఆర్గురు సభ్యులు తప్పుకున్నారు.* పైదొలగిన వారందరూ నో ఛేంజి దృక్పథంవారే. వీరి రాజీనామాలతోపాటు చిత్తరంజన్ దాస్‌గారి రాజీనామా కూడా అంగీకరించబడింది.

## మధ్యమ వర్గావతరణ

దాన్తో డాక్టరు అన్సారీ నాయకత్వాన ఒక నూతన కార్యనిర్వాహకవర్గం అవతరించింది. దాస్-మోతీలాల్‌నెహ్రూగార్ల పార్టీలో చేరని నేనూ, డా॥ అన్సారీ, సరోజనీదేవీ కలపి, యింకా ఇద్దరు ముగ్గుర్ని కూడదీసుకుని, ఇంకో క్రొత్త కక్షి లేవదీశాము. మే నెలలో 'తాత్కా-

* కారణం: గయా కాంగ్రెస్ ఆమోదించిన శాసన సభా బహిష్కారం గురించి ప్రచారం నిలుపుజేస్తూ ఈ సమావేశం తీర్మానించింది. కాంగ్రెసును సమైక్యంగా ఉంచాలని మధ్యమ కక్షి వారు ఈ తీర్మానానికి మద్దతు ఇచ్చారు. దానిమీద రాజీనామా ఇచ్చినవారు: సి. రాజగోపాలాచారి, రాజేంద్రప్రసాద్, జమ్నలాల్ బజాజ్, వల్లభ్‌భాయ్ పటేల్, బ్రిజకిశోర్ ప్రసాద్, జి. బి. దేశ్‌పాండే.

లిక విరమణ'కి ఒప్పందం అయ్యాక, దాస్-మోతీలాల్‌గారలు, తాము ఇంకా 'నో ఛేంజర్స్'మేనని దబాయించలేరు గదా! 'నో ఛేంజర్స్', 'ప్రోఛేంజర్స్' మధ్య సామరస్యం తీసుకువచ్చి, వారి మధ్యనున్న విభేదాలు విస్తరించకుండా చూడడమే మా క్రొత్త కక్షి ఆశయం. దానికి "సెంటర్-పార్టీ" అని నామకరణం జేశాము.

పై ఉదంతాల అనంతరం, జండా సత్యాగ్రహం సాగుతూన్న నాగపూరులో, అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశం (1923 జూలై) జరిగింది. ఆ మీటింగులో 'సెంటర్-పార్టీ' స్థాపకులమయిన మా అందరిపైనా, నో ఛేంజ్ పక్షంవారు విరుచుకు పడ్డారు. సరోజనీ దేవి డా॥ అన్సారీ విమర్శించిన వారిని భావగర్భితమూ, సునిశితమూ అయిన తన ఉపన్యాసంతో చెరిగి విడిచి పెట్టింది. డా॥ అన్సారీ అంత గుండె నిబ్బరం ఉన్న మనిషి కాకపోవడంచేత తనపై వచ్చిన విమర్శలకు తట్టుకోలేక నిజంగా మూర్ఛపోయాడు; ఆయన్ని మేమందరమూ కలిసి బయటికి మోసుకునిపోయి ముఖంమీద నీళ్ళు చల్లి, తెలివి వచ్చే దాకా తంటాలు పడ్డాము. ఈ దెబ్బతో ఆయన భయపడిపోయి, తాను కొత్త పార్టీకి అధ్యక్షుడుగా ఉండ నిరాకరించాడు.

అనుకున్న ప్రకారం ముందు కార్యక్రమం జరిపించడానికి, అఖిల భారత కాంగ్రెసు సంఘ అధ్యక్షుడుగా కొండ వెంకటప్పయ్య పంతులుగారిని ఎన్నుకోవడం జరిగింది. ఈ సంఘంవారు శాసన సభలను బహిష్కరించడం విషయమై అభిప్రాయ సేకరణకుగాను ఒక ఉప సంఘాన్ని నియమించారు. దాస్-మోతీలాల్‌గార్ల ప్రభకు తట్టుకోలేక, రాజగోపాచారిగారి నోఛేంజ్‌పార్టీ శోభగోల్పోయిన పండుటాకులా ఎండి రాలిపోయింది. ఆచారిగారికి, ఏ విధంగా తమ శక్తుల్ని మళ్ళిస్తే, గాంధీగారి కార్యక్రమం పునరుజ్జీవిత మవుతుందో తెలుసు. ఆ రాజకీయ ధురంధరు లందువల్ల, గాంధీగారికి కుడి భుజం అనతగ్గ రాజగోపాలాచారిగారి మీద మొదటి బాణం విసిరారు. త్రివిధ బహిష్కార కార్యక్రమానికి రెండు మాసాలపాటు విరామం నీవల్లనే కలిగిందన్నారు. తర్వాత, సత్యాగ్రహోద్యమాన్ని ఉద్ధ్రితం చెయ్యడానికి సహకార

నిరాకరణోద్యమ సంఘం అంటూ ఒక దాన్ని లేవదీశారు. తర్వాత, శాసన సభలను బహిష్కరించడం విషయమై అభిప్రాయ సేకరణ కంటూ ఇంకో ఉప సంఘాన్ని నియమింపజేశారు. ఆ తర్వాత, అఖిల భారత కాంగ్రెసు సంఘం వారిచేత శాసన సభా బహిష్కార విధానానికే తిలోదకా లిప్పించారు.

ఈ త్రివిధ పద్ధతుల మీద వారి బలగాన్ని నడిపించి, తాము పన్నిన వలలో రాజగోపాలాచారిగారు ఇరుక్కునేటట్లుగా చేశారు. ఈ దెబ్బతో గాంధీగారి సహకార నిరాకరణ విధానానికే స్వస్తి చెప్పించి, ఆ స్థానంలో శాసన సభా ప్రవేశ కార్యక్రమాన్ని ప్రవేశపెట్టారు.

ఈ కథను పొడిగించే ముందు నాగపూరు జెండా సత్యాగ్రహ విషయం కాస్త చర్చించడం న్యాయం.

# 10

## నాగపూరు జెండా సత్యాగ్రహం: ఆంధ్రదేశం నుంచి వాలంటీర్లు

లోగడ అలవాటయిన విధానంగా నాగపూరు వీథులలో తిరుగుతూన్న స్వచ్ఛంద సేవకుల్ని, కొన్ని కొన్ని వీథులగుండా యికముందు తిరుగ రాదంటూ 1923 మే మాసంలో 144 సెక్షను క్రింద ఆంక్ష విధించారు. జమన్‌లాల్ బజాజ్ మున్నగు నాయకులు ఈ ఆంక్షను ఉల్లంఘించాలనే నిశ్చయంతో సత్యాగ్రహం ప్రారంభించారు. ఈ ఉద్యమానికి నాగపూరు జెండా సత్యాగ్రహం అన్న పేరు సార్థకం అయింది.

### నిరుత్సాహ పరిస్థితులు

గాంధీగారి జైలు శిక్ష, దేశంలో స్వాతంత్ర్య సమరాన్ని అణగ ద్రొక్కడానికి ప్రభుత్వంవారు అవలంబిస్తూన్న పద్ధతులూ గమనించిన మధ్య పరగణా వాసులలో ఉత్సాహం నశించిన కారణంగా, కాంగ్రెసు

వారు విచారగ్రస్తు లయ్యారు. దేశనాయకులలో చీలికలు బయలుదేరి, గాంధీగారి సహకార నిరాకరణ విధానం సాగించాలా వద్దా అన్న మీమాంసతోవారు తగవులాడుకుంటూ ఉంటే గమనించిన కాంగ్రెసు వారెవరయినా నిజంగా మానసిక వేదనకు లోనయారంటే ఆశ్చర్యంలేదు.

జమన్‌లాల్ బజాజ్‌లాంటి ఉత్తమ నాయకుల నాయకత్వంలో నడుస్తూన్న మధ్య పరగణాలలో ఉత్సాహం చచ్చిపోయిందంటె, నాకు నిజంగా చాలా బాధనిపించింది.

నాగపురంలో జెండా సత్యాగ్రహ విషయం గమనిద్దామని మేము నాగపూరు వెళ్ళేసరికే 81 మంది అరెస్టయ్యారు. బజాజ్‌లాంటి ఉత్తమ నాయకుడు అరెస్టయి శిక్షింపబడిన సందర్భంలో, అరెస్టుకు సిద్ధమయిన 82వ వ్యక్తి లభింపలేదనే విషయం మమ్మల్ని ఆశ్చర్యచకితుల్ని చేసింది.

ఇలా అన్నానని మధ్య పరగణా మనుష్యులు ఇతర ప్రాంతీయులకంటె దేశభక్తిలోనూ, ఉత్సాహంలోనూ, తీసికట్టనిగాదు నా ఉద్దేశం. గత 20 సంవత్సరాలుగా నడుస్తూన్న స్వాతంత్ర్య సమరం సందర్భంలో వెనుకంజ వేసిన వారెవరూ లేరు. అన్నిప్రాంతాల భారతీయుల లోనూ వున్నవి ఒకేరకపు రక్తమాంసాలే. వారి ఉత్సాహాతిశయాల లోనూ తేడాపాడాలు లేవు.

కాని దేశీయులలో ఆ ఉత్సాహం సన్నగిల్లినప్పుడు, క్లిష్ట పరిస్థితులలోనూ ప్రజలలో ఉత్సాహోద్రేకాలను రేకెత్తించగలవి నాయకుల ధైర్య స్థైర్యాలూ, వారి ఉద్బోధనా పద్ధతులూ మాత్రమే. సరిఅయిన నాయకులు ముందడుగువేసి జనులలో ఉత్సాహాన్ని రేకెత్తించవలసి ఉంది. నాగపూరులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగులకు హాజరయి, పరిస్థితులను గమనించిన మా కందరికీ ఒకటే అనిపించింది. ఈ నిరుత్సాహానికి కారణం నాయకులమధ్య ఏర్పడిన అభిప్రాయ భేదాలూ, కుమ్ములాటివే అని.

## ఆందోళన ప్రాముఖ్యం

నాగపూరు జెండా సత్యాగ్రహ ఉద్యమం ఘనవిజయానికై జనులను ఉత్తేజపరచి, వారిలో నవచైతన్యం కలుగజేయాలనే ఉద్దేశంతో నేనూ, విఠల్‌భాయ్ పటేలూ, సరోజినీదేవి కలిసి నాగపురంలో బహిరంగ సభలలో ఉపన్యసించాము. మన జాతీయ పతాక గౌరవం కాపాడడానికి ఆరంభం అయిన ఈ ఆందోళన అన్నది, సరిగా ఆలోచించి చూస్తే, మానవుడు మానుషంగల మనిషిగా బ్రతకడానికి అవసరమైన జీవన్మరణ సమరమే అవుతుంది. అప్పట్లో నాగపూరులో జాతీయ పతాకం అణగద్రొక్కబడిఉంటే, అది కాంగ్రెసు జీవితానికే గొడ్డలి పెట్టయి స్వతంత్రోద్యమం అధఃపాతాళానికి దిగిపోయి ఉండేది.

ఆ రాష్ట్రంలో జమన్‌లాల్ బజాజ్ లాంటి ఉత్తమనాయకుని వెంట 80 మంది కంటె ఎక్కువగా జైళ్ళకు వెళ్ళలేకపోయిన పరిస్థితులు ఉత్పన్నమయినప్పుడు, అట్టి జనాన్ని ఉద్రేకపరచి, జాతి గౌరవ మర్యాదలు నిలుపుకోవడానికి ఏ పద్ధతుల మీద,ఏ యే విషయాలు చర్చిస్తూ, ఎలాంటి ఉపన్యాసాలు, ఎవరెవరిచేత ఇప్పించడ మన్నది సమస్యే అయింది.

## మే మిచ్చిన హామీ

ఆ విషమ పరిస్థితులను గ్రహించి, నేనూ, ఇతర మిత్రులమూ కలసి ఆ రాష్ట్ర ప్రజలతో యేమన్నామో తెలుసా? "ఇటువంటి జాతీయ సమరంలో ఇలాంటి విషమ ఘట్టాలలో మీ రాష్ట్రంలో 81 వ వాడిని అనుసరించడానికి మనుష్యులు దొరక్కపోతే, ఇతర రాష్ట్రాల మంచి తండోప తండాలుగా జనాన్ని ఇక్కడికి పంపించి, మీ మా గౌరవాలు కాపాడుతాము" అన్నాము. "నా మట్టుకు నేను మా ఆంధ్ర రాష్ట్రంనుంచి జెండాలతో సహా వేలాది వాలంటీర్లను పంపించగలనని హామీ ఇస్తున్నాను. ఈ హామీ నేను వ్యక్తిగతంగానే గాక, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షునిగా కూడా ఇస్తున్నాను," అని నమ్మబలికాను.

నాగపూరు నివాసి అయిన ఒక పెద్దమనిషి మేమంతా మధ్య రాష్ట్రాల సెంట్రల్ (ప్రావిన్సెస్) లోని ముఖ్య నగరాల నన్నింటినీ చుట్టి ప్రచారం చేయడానికి వలసిన యేర్పాట్లన్నీ చేయించాడు. అనుకున్న ప్రచారం అన్ని కేంద్రాలనూ చుట్టిన ముఖ్యులలో నేనూ ఉన్నాను. వెళ్ళిన చోటల్లా మనుష్యులు కరువయిన కారణంగా ఉద్యమం కుంటువడిందంటే అది మీ రాష్ట్రీయుల కందరికీ సిగ్గుచేటని నొక్కి వక్కాణించాను. చాలాదూరంలో ఉన్న మా ఆంధ్రదేశంనుంచి మీ గౌరవం కాపాడడానికి మా మనుష్యులు రానై ఉన్నారనీ చెప్పాను. మా దేశంనుంచి వచ్చేవారు రాకుండా రైళ్ళలో ఇబ్బందులు కలుగజేస్తే మా వాళ్ళు కష్ట నష్టాలకు ఓర్చి అంతదూరంనుంచీ నడిచి అయినా సరే వచ్చి మీ మా గౌరవాలు కాపాడుతారని చెప్పాను. మా నాగపూరు యాత్ర ప్రబోధాత్మకంగా విజయాన్ని సాధించిందనే చెప్పాలి.

కాని ప్రజలలో నిజమయిన ఉత్సాహాన్ని అనేక కారణాలవల్ల కలుగజేయలేకపోయాము. ఈ జెండా సత్యాగ్రహాన్ని అఖిల భారత సమస్యగా పరిగణించాలని 19-7-'23 న ప్రతిపాదించడమూ, దాన్తో దేశం నలుమూలలనుండీ జనం తండోపతండాలుగా రావడమూ జరిగే సరికి దేశంలో నూతనోత్సాహం, చైతన్యం, వగైరాలన్నీ కలిగాయి.

## ఆంధ్రుల ముందంజ

చెప్పిన పద్ధతిగా చేయడానికి మున్ముందుగా తయారయింది మేమే. మన ప్రాంతానికి మేము తిరిగి వచ్చిన వెనువెంటనే రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ సమావేశాన్ని జరూరుగా ఏర్పాటుచేసి, అందులో ఈ నాగపూరు జెండా సత్యాగ్రహ పరిస్థితులను తర్జన భర్జన చేశాము. సభలో ఉద్రేక పూరితమయిన ఉపన్యాసాలు ఇవ్వబడ్డాయి. ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు, మన వాలంటీర్లని నాగపూరు పంపించడానికి వీలులేదని ఘంటాపథంగా వక్కాణించాడు. కాని కమిటీవారు మన వాలంటీర్లను నాగపూరు పంపించాలనే నిర్ణయానికి వచ్చి, అత్యధికమైన మెజారిటీతో తీర్మానాన్ని నెగ్గించారు.

రైలు ప్రయాణాలకు ఆటంకాలు కల్పించబడే పరిస్థితులలో నడిచే వెళ్ళి తీరాలనే విషయం సుస్పష్టం చేయబడింది. మన రాష్ట్రం నుండి చాలామందే వెళ్లారు. రైలు ప్రయాణానికి చాలామందికి అడ్డంకులు కలుగజేయబడ్డాయి. అడ్డంకులు కలిగిన ప్రాంతంనుంచి కాలి నడకనే మనవాళ్ళందరూ ప్రయాణాలుచేసి ఆ జెండా సత్యాగ్రహంలో పాల్గొన్నారు.

## ఒక ఉదాహరణ

నాకు భమిడిపాటి సత్యన్నారాయణగారి అవస్థ ఇంకా జ్ఞాపకం ఉండిపోయింది. పెక్కు ఉద్యమాల అనంతరం ఆయన కొంతకాలంగా* నరసాపురంలో ప్లీడరుగా ఉంటున్నారు. ఆయన ఆ రోజులలో నాగపూరు సత్యాగ్రహంలో పాల్గొనడానికి గాను, తనకు తప్పని సరిగా కావలసిన బట్టలు వగైరాలన్నీ ఒక గంపలో నెత్తిన పెట్టుకుని, మొత్తం దూరం అంతా కాలినడకనే నడచి వెళ్ళారు.

ఇతర రాష్ట్రాలుకూడా ఈ సత్యాగ్రహ సమరానికి ఇతోధికంగానే వాలంటీర్లను పంపించాయి.

అప్పట్లో అలముకొనిఉన్న నిరుత్సాహ పరిస్థితులలో కూడా నాగపూరు జెండా సత్యాగ్రహ సమరం బ్రహ్మాండంగానే సాగింది-ప్రభుత్వం వారు తమ ఓటమిని ఒప్పుకుని, దేశీయులు తమ జెండాను నిరభ్యంతరంగా ఏ అడ్డంకులూ లేకుండా ఎగురవేసుకో వచ్చునని అనుజ్ఞ యిచ్చే పర్యంతమూ, ఈ యుద్ధకాండంతా జోరుగానే నడిచింది.

నాయకులకు, ప్రజలకూ పరస్పరం విశ్వాసం కుదిరి, నాయకులు తమ కీచులాటలను తగ్గించుకుని నడిపించగలిగిననాడు సహకార నిరాకరణ ఉద్యమంకూడా విజయవంతం అవుతుందని 1923 నాటి నాగపూరు జెండా సత్యాగ్రహ సమరం రుజువు చేసింది.

---

* తరవాత (1967) వకీలుగా తూర్పుగోదావరిజిల్లా రాజోలు కాపురస్థులు.

# 11

## చరిత్రాత్మకమైన కాకినాడ కాంగ్రెస్

**1923** డిసెంబరులో కాకినాడలో కాంగ్రెసు జరుపదలచాము. దురదృష్టవశాత్తూ ఆ సంవత్సరం గోదావరినదిలో ముమ్మరంగా వరదలు రావడమూ, అక్కడి ప్రాంతాలన్నీ చాలా వరకూ తుఫాను దెబ్బతినడమూ సంభవించింది. తిరిగి 1937-38లలో కూడా ఆంధ్రదేశపు పలు ప్రాంతాలు అలాంటి ఇక్కట్లే ఎదుర్కోవలసి వచ్చింది. కాని అప్పటి పరిస్థితులు వేరు. ఆ సంవత్సరాలలో మేము రాజ్యాంగాన్ని కాంగ్రెసు పేరిట నిర్వహిస్తూన్న కారణంగా నేను రివిన్యూ మంత్రిగా ఉంటూ కరువులూ, వరదలూ మొదలైన అరిష్టాల వలన కలిగిన పరిస్థితులను కూడా సరిదిద్దవలసిన బాధ్యతను వహించాను.

### వరద బాధితులకు సహాయ్యం

నిజానికి 1923 లో కాంగ్రెసు కమిటీవారు ఇవ్వగలిగిన సహాయం అత్యల్పం అయింది. కాని నేను ఆ ప్రాంతనికి వెళ్ళి ప్రజలచేయూతతో ఎంతో సహాయం చేయగలిగాను. జిల్లా అధికార్లూ డివిజన్ అధికార్లూ కూడా మాతో చేతులు కలిపి చేయగలిగినంత సహాయం చేయడానికి సంసిద్ధు లయ్యారు. నేరుగా గవర్నమెంటు బొక్కసంలోంచి కాక పోయినా, అక్కడ ధనాన్ని విరివిగానే ఖర్చుపెట్టగలిగాము. జమీందార్లూ, భూస్వాములూ, సామాన్య ప్రజలూ కూడా తమ శక్తివంచన లేకుండా ఇచ్చిన ధన కనక వస్తు వాహన సంపత్తితో, నిలువనీడలేని వేలాది జనానికి లక్షలాది వెదుళ్ళూ, కోట్లాదిగా తాటాకులూ సప్లయి చేయగలిగాము.

ఆనాడు మేము ఎంత సేవ చేయగలిగినా, 1937-38 సంవత్సరాలలో తుఫాను బాధితులకు యివ్వగలిగిన సహాయంతో పోల్చిచూస్తే 1923 లో మేము చేసిన సహాయం అత్యల్పం అని ఒప్పుకోకతప్పదు.

ఒక్కటిమాత్రం నిజం. 1923 లో జనం అంతగా బాధపడడానికి కారణం, ఆనాటి ప్రభుత్వం, జాతీయమైన ప్రజాప్రభుత్వం కాక పోవడమేనని నొక్కి వక్కాణించగలను. అందువల్లనే, అవకాశం చిక్కి రాజ్యాంగాన్ని కాంగ్రెసు పేరిట 1937-38లో స్వీకరించ గలిగిన సందర్భంలో, కరువులూ, వరదలూ, తుపానులూ లాంటివి నా పోర్టుఫోలియోలోకి తీసుకుని, అవసరం అయినప్పుడల్లా బాధితులకు కావలసిన సహాయం అవిచ్ఛిన్నంగా చేయగలిగాను. అంతేకాదు- అవసరాలకు ఆర్థిక శాఖవారు ధనాన్ని మంజూరుచేసి యిచ్చేలోపలే నేను ఆ యా ప్రాంతాలకు వెళ్ళి ప్రజల సహాయ్య సహకారాలతో, శక్తివంచన లేకుండా చేయగలిగిన సేవ చేస్తూండేవాడిని.

## కాంగ్రెసుకు ఖాదీ డేరా

నాటి వరదలూ, తుపానులూ కూడా కాకినాడ కాంగ్రెసుకు కావలసిన యేర్పాట్లు సవ్యంగా చేయడానికి వీలులేకుండా చికాకులూ, ఇబ్బందులూ కలుగ జేశాయి. కాంగ్రెసుకు అవసరం అయ్యే ఖర్చుల కోసం, కాంగ్రెసువారు ధనాన్ని సేకరించడంలో నిమగ్నులయ్యారు. ఈ కారణం వల్ల కూడా వరద బాధితుల సాహాయ్యానికి కావలసినంత జోరుగా ధనాదులను సంపాదించలేకపోయాము. కాని ఆంధ్ర ప్రజానీకంలో వెనకాడే గుణం లేకపోవడాన్ని, వారికున్న ఆర్థికపు టిబ్బందులను విస్మరించి, వలసిన ఆర్థిక సహాయాన్ని ఆనందంగా జేశారు.

ఇటు 'రిలీఫ్' పనులూ, అటు కాంగ్రెసు కార్యకలాపాలూ చాలా విజయవంతమే అయ్యాయి. అంతేకాదు- కాంగ్రెసు అనంతరం కాంగ్రెసు ఎక్కడ జరిగినా వేసుకోవడానికి సువిశాలమయిన పెద్ద డేరా, ఆ డేరాకు కావలసిన హంగులూ శాశ్వతంగా సమకూర్చి సమర్పించ గలిగింది ఆంధ్ర దేశమే. ఆ రోజులలో ఆ ఖాదీ డేరా ఖరీదు లక్షా యాభై వేలపై చిలుకు ఉంటుందని అంచనా వేశారు. దురదృష్టవశాత్తూ, ఈ డేరా వగైరాలు, అయిదారు సంవత్సరాలు వాడుకున్నాక, అనుకోకుండా పరశురామ ప్రీతి అయ్యాయన్నది వేరే విషయం.

## శాసన సభా ప్రవేశ వివాదం

సత్యాగ్రహ సమర ప్రారంభ కాలంనుంచీ దాస్‌గారూ, నేనూ సన్నిహితులంగానూ, ముఖ్య స్నేహితులంగానూ ఉంటూ ఉన్నా, ఇంతవరకూ ఆ యా సందర్భాలలో చెప్పినట్లు, గాంధీగారి పద్ధతులకు భిన్నంగా ఆయనా, మోతీలాల్ నెహ్రూగారు కలసి పన్నిన కుట్రలో నేను యిరుక్కోలేదు. కాగా వారు ప్రారంభించిన స్వరాజ్యపార్టీ అన్న దాంట్లోనూ నేను కలుగ చేసుకోలేదు. ఆ స్వరాజ్యపార్టీయే కాలక్రమేణా కాంగ్రెసు కౌన్సిల్ పార్టీగా మార్పు చెందింది.

గాంధీగారు ఈ సత్యాగ్రహ ఉద్యమాన్ని దాస్-మోతీలాల్‌గార్ల సలహా సంప్రతింపులతో ప్రారంభించి ఉండడంచేత వారికి తన విధానాలపట్ల విముఖత గలుగుతూన్నట్లు విశదం అవుతూ ఉన్నా, వారి మానాన్ని వారిని వదిలి, తన మానాన్ని తాను, తను నమ్మిన పద్ధతిలో, ప్రజల సహాయంతో, ఉద్యమాన్ని నడుపుకుంటూ ముందుకు పోలేక పోయారు. రాజగోపాలాచారి మొదలైన కార్యనిర్వాహకవర్గ సభ్యులందరూ కలిసి, త్రివిధ బహిష్కార విధానానికి రెండు మాసాలపాటు విరామం ఇవ్వడమూ, శాసన సభల విషయంలో ఉన్నటువంటి బహిష్కరణను పూర్తిగా ఎత్తివేయడమూ,తరవాత శాసన సభా ప్రవేశ కౌన్సిల్ ఎంట్రీ విధానానికి అంగీకరించడమూ ఇత్యాదులన్నీ, ఏదో విధంగా జైలులో ఉన్న గాంధీగారితో సంప్రతించే చేస్తున్నారని చాలా మంది నమ్ముతున్నా, నిజానికి రెండు సంవత్సరాలకు పైగా నిర్బంధంలో ఉన్న మహాత్మునికి బైట ఏం జరుగుతూందో ఈషణ్మాత్రమూ తెలియదు.

గాంధీగారినీ, వారి తత్వాన్నీ ఎరిగి ఉన్న నేను, ఈ పనులన్నీ వారి ఎరుకతోటీ, అనుమతితోటీ (కాగితంమీద లేకపోయినా) జరుగుతున్నాయని ఎప్పుడూ నమ్మలేదు. 1923 ఫిబ్రవరి మాసంలో వర్కింగు కమిటీతో నాకున్న సంబంధాన్ని తెంచుకున్నాను. అప్పటికి గాంధీగారు నిర్బంధింపబడి ఏడాది అయి ఉంటుంది. వర్కింగు కమిటీనుండి వైదొలగిన తర్వాత నాకు దాస్‌గారి ప్రోగ్రాంతోగాని, రాజగోపాలా

చారిగారి ప్రోగాంతోగాని సామరస్యం కుదరలేదు. లోగడ విన్నవించినట్లు, నేనున్నూ కొంతమంది మిత్రులమున్నూ కలసి, నో ఛేంజ్ ప్రో ఛేంజ్ పార్టీల మధ్య ఏర్పడిన అగాధం విస్తరించకుండా చూడాలనే ఉద్దేశంతో 'సెంటర్-పార్టీ'ని నెలకొల్పాం.

## రా. కాం. అధ్యక్ష పదవికి రాజీనామా

ఢిల్లీలో మహమ్మదాలీగారి అధ్యక్షతను జరిగిన స్పెషల్ కాంగ్రెస్* ఆవరణలోకి కూడా నేను ఇన్‌ఫ్లూయంజా కారణంగా వెళ్ళలేక పోయాను. నేను ఢిల్లీ చేరిన వెంటనే పట్టుకున్న ఈ ఇన్‌ఫ్లూయంజా, కాంగ్రెసు పూర్తి అయిన వారం పది రోజులదాకా నన్ను వదలనే లేదు. అందువల్ల ఈ స్పెషల్ కాంగ్రెస్‌లో దాస్‌పార్టీ వారికి 1924 లో జరుగబోయే ఎన్నికలలో అభ్యర్థులుగా నిలిచి పోటీ చేయడానికి ఇవ్వబడిన అనుమతి విషయంలో నోరు విప్పి మాటలాడే సావకాశం కూడా నాకు లభించలేదు.

కాకినాడ కాంగ్రెస్‌లో ఈ విషయం చర్చకు వచ్చినప్పుడు నేను దాస్‌పార్టీ వారికి వ్యతిరేకంగా వ్యవహరించి, ఢిల్లీలో స్పెషల్ కాంగ్రెస్ వారు దాస్‌గారికి అనుకూలంగా చేసిన తీర్మానాన్ని కాకినాడ కాంగ్రెసు వారిచే తిరగ తోడించాలో, దాస్‌పార్టీవారితో చేతులు కలపాలో నిర్ణయించుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఢిల్లీ 'స్పెషల్ కాంగ్రెస్'వారు

* మేలో బొంబాయిలో అ. భా. కాం. సం. చేసిన తీర్మానాన్ని కొన్ని రాష్ట్రీయ సంఘాలు ధిక్కరించిన మీదట, జూలైలో నాగపూరులో మళ్ళీ అ. భా. కాం. సం. సమావేశం జరిగింది. శాసన సభా బహిష్కార విధానాన్ని పునర్విచారణ చెయ్యడానికి ఒక ప్రత్యేక కాంగ్రెసును సమావేశ పరచాలనే తీర్మానాన్ని మధ్యమ కక్షీవారు అంగీకరింపజేశారు. సెప్టెంబరులో ఢిల్లీలో సమావేశమైన ఆ ప్రత్యేక కాంగ్రెసు శాసన సభా ప్రవేశాన్ని అనుమతిస్తూ తీర్మానం చేసింది. ఆ విధంగా శాసన సభా ప్రవేశ వాదులు తమ పట్టు సాధించారు.

దాస్ పార్టీవారికి 'కౌన్సిల్ ఎంట్రీ'కి అనుమతి నిచ్చి, రెండు మాసాలయినా కాకుండానే, దాన్ని తిరగ తోడించడం అన్నది అవివేకం అనే కారణాన్ని, ఆంధ్ర మిత్రుల నందరినీ ఢిల్లీ తీర్మానాన్ని బలపరచవలసిందని కోరాను. కాని యువక బృందం గయా తీర్మానాన్నే పట్టుకు కూర్చున్నారు. ఈ విషయంలో మేము చీలిపోయాము. ఈ విషయం చర్చకి వచ్చినప్పుడు నేను ఒక్క వోటు మెజారిటీతో ఓడిపోయిన కారణంగా, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ అధ్యక్ష స్థానానికి రాజీనామా ఇచ్చాను.

## వాలంటీరు పని

ఈ వ్యతిరిక్త భావాలతో వాలంటీర్లలో ఉండవలసిన క్రమశిక్షణ కుంటువడింది. కాంగ్రెస్ సెషన్స్‌లో బాడ్జి వేసుకుని పనిచేయడానికి వాలంటీర్లు నిరాకరించారు. అప్పుడు నేను ఒక వాలంటీరు బాడ్జి తగిలించుకుని పనిచేయడం ప్రారంభించాను. దాన్తో ఇతరులు కూడా నన్ను అనుసరించారు.

ఆరోగ్యం పూర్తిగా చెడుటవలన విడుదలయిన* గాంధీగారు ఆస్పత్రిలో చికిత్స పొందుతూండగా నేను సకుటుంబంగా. చూడడానికి వెళ్ళినప్పుడు, గాంధీగారు యీ ఉదంతాన్ని గురించి కూడా మాట్లాడారు.

నా సహచరులయిన నాయక బృందం ఒక్క ఓటు మెజారిటీతో నన్ను ఓడించినంత మాత్రం చేత, ఇతర డెలిగేట్లపైనా, ప్రజలపైనా ఉన్న నా విశ్వాసం సడలలేదు. నేను చాలాసేపు కాంగ్రెసు సమావేశంలో మాటలాడవలసి వచ్చింది. చివరికి నాతో అభిప్రాయభేదం ఉన్న డాక్టరు సుబ్రహ్మణ్యంగారు కూడా మాటలాడవలసి వచ్చింది.

## చివరికి జయం

చివరికి నా దృక్పథమే అధిక సంఖ్యాకుల ఆమోదాన్ని పొందింది. ఢిల్లీలో 'స్పెషల్ కాంగ్రెస్' వారిచ్చిన అనుమతి దృఢతరం అయింది. ఈ విషయంలో ఎంతో ఆతురతతో ఉన్న దాస్‌గారూ సంతసించారు.

* 1924 ఫిబ్రవరిలో.

దాస్‌గారు తమకు లభించిన ఢిల్లీ అనుమతి కాకినాడలో తిరగ తోడబడుతుందేమోననే భయంతో, అంతవరకూ చాలా ఆదుర్దాగా ఉన్నారు. నిన్న మొన్నటి వరకూ బెంగాలు శాసన సభలో కాంగ్రెసు పార్టీకి నాయకుడుగా ఉంటూ ఉండిన కిరణ శంకర్‌రాయ్‌గారు, నన్ను కలుసుకుని మాటలాడి ఎల్లాగయినా ఢిల్లీ ప్రతిపాదన నిలబడేటట్లు చూడమని కోరారు. ఈయన్ని ప్రత్యేకంగా ఈ పనికోసం నియోగించి దాస్‌గారు పంపించారు. ఆయన వందలాది మైళ్ళు ప్రయాణం చేసి ఈ పనిమీదే బెజవాడ వచ్చారు.

మా వ్యక్తిగత స్నేహ బాంధవ్యాలు, వ్యక్తిగత అభిప్రాయాలతో ఎప్పుడూ ముడిపడి ఉండలేదు. మా రాజకీయాలన్నీ రాజకీయాలుగానూ, స్నేహాలు స్నేహాలుగానే ఉండేవి. అయినప్పటికీ ఆయనతో సహకరిస్తానని వాగ్దానం చేశాను. గాంధీగారు నిర్బంధంలో ఉండగా, నాయకులలో విభేదాలు కారణంగా దేశంలో పరిస్థితులు క్లిష్టతరం కావడం వాంఛనీయం కాదనే నా ఊహ.

వరదలతోనూ, తుపానులతోనూ ఆ సంవత్సరం ప్రజలను ఎటువంటి బాధలకు గురిచేసినా, 1923 రాజకీయంగా మాత్రం ఉపకరించింది. ఏ దృక్పథంతో చూసినా కాకినాడ కాంగ్రెసు బ్రహ్మాండమయిన విజయాలు సాధించిందనే చెప్పాలి. ఆంధ్రులమయిన మనకు ఆ కాంగ్రెసు నిజంగా గర్వకారణమే. ఆహ్వాన సంఘ అధ్యక్షులుగా దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు, తమ అధ్యక్షోపన్యాసాన్ని హిందీలో ఇచ్చారు. ఆంధ్ర యువతీ యువకులు శక్తివంచన లేకుండా సహాయపడ్డారు. ఆంధ్ర దేశానికి జెందిన అన్ని జిల్లాలలోని వ్యాపారస్థులూ, వర్తకులూ, కృషీవలులూ లేదనకుండా వారికి తోచిన సహాయం, 'ఆర్థికంగానే గాక అనేక విధాల సహాయపడ్డారు.

## మహర్షి ఆతిథ్యం

కాకినాడ కాంగ్రెసు చరిత్ర (మహర్షి) బులుసు సాంబమూర్తిగారిని తలపెట్టకుండా ముగించకూడదు. కాంగ్రెసు ఏర్పాట్లన్నీ ఆయన

భుజస్కంధాలపైనే మోపబడ్డాయి. సాంబమూర్తిగారు కూడా నాకు మల్లేనే ప్లీడరీలో బాగా ఆర్జించిన వారే అయినా, ఉద్యమంలో చేరాక మా యిద్దరి స్థితీ ఒక్కలాగే నడిచింది. ఇద్దరమూ పకీర్లమే. ఇద్దరమూ దేశ ద్రిమ్మర్లమే. అయితేనేం, లేమితో ఎప్పుడూ మేము బాధపడ లేదు. అడగడం తడవుగా డబ్బు అల్లా పుట్టేది. వారి ప్రయత్నం సఫలం అయింది.

ఆంధ్ర దేశపుటన్ని మూలలనుంచీ ధారాపాతంగా వచ్చిన సరుకులతో, గాదెలూ, కందా కొట్లూ కూడా నిండాయి. కాంగ్రెసు అయిపోయినా అవి పూటుగానే ఉన్నాయి. అందువలన కాంగ్రెసుకు వచ్చిన ప్రతినిధులూ, ప్రేక్షకులూ కూడా జరిగిన, జరుగుతూన్న ఏర్పాట్లకు విస్తుపోయారు. వచ్చిన వారి కందరికీ అనుకున్న దానికంటె ఎన్నోరెట్లు అధికంగానే ఆదరణ లభించింది. ఆయన చేసిన ప్రతి కార్యం అమోఘంగానే నిర్వహింపబడింది. సాంబమూర్తిగారు తమ నేర్పుతో ఆంధ్ర దేశీయుల నందరినీ ఒక "కామధేనువు"గా మార్చగలిగారు.

ఆయన ఇట్టి ఏర్పాట్లన్నీ పుట్టెడు దుఃఖంతో ఉండి కూడా చేయగలిగాడు. ఆయన ఏకైక పుత్రుడు, కాంగ్రెసు కొద్ది రోజులలో ఆరంభం అయ్యే ముందర, కన్నుమూశాడు. ఆయన ఆశలన్నీ ఆ యిరవై సంవత్సరాల యువకుని పైనే కేంద్రీకరింపబడి ఉన్నా, ఆ విచారాన్నంతటినీ దిగమ్రింగి, ఉత్సాహం తెచ్చుకుని అన్ని ప్రాంతాలూ తిరిగి, కాంగ్రెసుకు అవసరమైన రంగాలన్నింటికీ కావలసిన సహాయం పుట్టించ గలిగాడు. సాంబమూర్తిగారి తండ్రి సుబ్బావధానిగారు. ఆయన ఆంధ్రావనిలో పేరుపడ్డ మహాపండితుడు, మంచి జ్ఞాని, వేదాంతి. ఆయన, వృద్ధాప్యంలో మరణ శయ్యమీద ఉండగా, కాకినాడలో వారి స్వగృహంలో దర్శించుకోగల భాగ్యం నాకు లభించింది. సాంబమూర్తి ఆ తండ్రికి తగిన బిడ్డే. అందువల్లనే ఏకైక పుత్రుని మరణంతో కృంగి పోకుండా, శోక భారాన్ని హృదయంలోనే ఇముడ్చుకుని, కార్యరంగంలో ప్రవేశించి సాధించుకు రాగలిగారు. "జాతస్య మరణం ధ్రువం" అన్న నుడే ఆయనికి శాంతినీ, శక్తినీ ఇచ్చియుంటుంది.

# 12

## గాంధీగారి విడుదల: జూహూ సంప్రతింపులు

**ఆ రోజులలోనే** గాంధీగార్ని అపరేషన్ నిమిత్తం యరవాడ జైలునుంచి "సెసూన్" హాస్పిటలుకు మార్చారు. దరిమిలా విడుదల చేశారు. ఆయన విడుదలై జైలునుంచి బయటికివచ్చి పరిస్థితులను విలియా వేసుకునే దాకా అవి ఎల్లాంటి పరిణామాలను పొంది ఎల్లా ఎల్లా మారాయో అన్న సంగతి అర్థం కాలేదు. తన సన్నిహిత అనుచరులూ, దేశ సేవకులూ ఎల్లా వ్యవహరించి ఆయన తలపెట్టిన విధానాలకు ఎటువంటి విఘాతాలు తీసుకు వచ్చారో అప్పటికిగాని ఆయనకు అర్థం కాలేదు. విడుదల అయ్యాక విశ్రాంతి కోసం, బొంబాయికి సమీపాన ఉన్న జూహూ సముద్ర తీరాన కొంతకాలం ఉండమని ఆయనకు డాక్టర్లు సలహా యిచ్చారు.

గాంధీగారు జూహూ మకాంలో ఉండగానే, ఆ విశ్రాంతి రోజులలోనే అనేకులతో సంప్రతింపులు జరిపారు. ఆ సంప్రతింపులన్నీ "జూహూ సంప్రతింపు"లనే పేరుతో ఒక అధ్యాయాన్నే రూపొందించాయి. గాంధీగారు తన కార్యక్రమానికి అనుగుణంగా తనచే ప్రతిపాదింపబడిన బహిష్కరణ విధానాల నన్నింటినీ పునరుద్ధరించమన్నారు. కాని, దాస్-మోతీలాల్‌గారలు దానికి వ్యతిరేకించారు. ఆ ఇరుపక్షాల మధ్యా నడచిన ఉత్తర ప్రత్యుత్తరాలన్నీ "జూహూ విభేదా"లన్న పేరున ప్రచురింపబడ్డాయి.

### బెల్గాం కాంగ్రెసు అధ్యక్షత

ఆ తర్వాత అహమ్మదాబాదులో అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగు జరిగింది.* ఆ మీటింగులో గాంధీగారి స్థానం తిరిగి ప్రతిష్ఠ చేయబడింది. ఆ సంవత్సరంలో బెల్గాంలో జరుపదలచిన కాంగ్రెసుకు

* 1924 జూన్‌లో.

గాంధీగారిని అధ్యక్షత వహించ వలసినదని అనుచరులందరూ కోరి ఒప్పించారు. కాని ఆయన ఆ కాంగ్రెసు అధ్యక్ష పదవి అంగీకరించ కుండా ఉండవలసింది. ఆయన శక్తి సామర్థ్యాలు కాంగ్రెసు ప్రెసిడెంటు పదవి నలంకరించనంత మాత్రము చేత తరిగిపోయేవి కాదు. ఆయన్ని కాంగ్రెసు అధ్యక్ష పదవికి అంగీకరించమని, ఎవరెవరు ప్రోత్సహించారో, ఏ ఉద్దేశంతో ప్రోత్సహించారో నాకు తెలియదు. గాంధీగారితో ఆనాడుగాని, ఈనాడుగాని త్రివిధ బహిష్కార విధాన తాత్కాలిక విరమణకు కారకులు ఆనాడు వర్కింగు కమిటీలోనున్న ఆయన ముఖ్య అనుచరులయిన నమ్మినబంట్లే నన్న సంగతి ఎవరయినా చెప్పారో లేదో నాకు తెలియదు. 'కౌన్సిల్ యెంట్రీ' విధానంలో దరిమిలా జరిగిన అల్లకల్లోలాలన్నీ ఆయన చెవిని పడ్డాయో లేదో నాకు తెలియదు. బహుశః ఆయన ఆ క్షణంలో మనో దౌర్బల్యంవల్ల అనాలోచితంగా కాంగ్రెసు అధ్యక్ష పదవిని అంగీకరించి ఉంటారు. దరిమిలా 1931 లో కూడా ఆయన అటువంటి అనాలోచిత కార్యానికే అంగీకరించారు. రెండవ రౌండ్ టేబిల్ సమావేశానికి వెళ్ళడానికి ఒప్పుకోవడమే ఆ '31 నాటి అవివేక కార్యం అని నా ఊహ.

## స్వరాజ్యవాదులకు కాంగ్రెసు అప్పగింత

గాంధీగారికి వ్యతిరేకంగా పనిచేసే శక్తులు ఎంత మాత్రంగా ఉన్నాయో గ్రహించి, వాటిని ప్రోత్సహించి తమ వైపు త్రిప్పుకోవాలనే ఉద్దేశంతో దాస్-మోతీలాల్‌గారలు బెల్గాం కాంగ్రెసుకు హాజరవుతూన్న ప్రతినిధుల నందరినీ పలకరించి చూశారు. నిజమే. గాంధీగారు నిర్బంధంలో ఉన్న ఆ రెండు సంవత్సరాలలోనూ దేశంలో ఏర్పడిన చీలికలు, కలిగిన పరిణామాలూ, నాయకుల మధ్య నడచిన వాదోపవాదాలూ, పరిస్థితుల మార్పులూ మొదలయినవన్నీ దేశీయులలో మానసిక ఆందోళన కలిగించాయన్న సంగతి నిశ్చయమే. అనుమానం యెంత మాత్రం లేదు. కాని గాంధీగారు స్వయంగా హాజరయిన ఏ సభలోనూ, ఎటువంటి క్లిష్ట పరిస్థితులలోనూ కూడా, ఆయనకు అపజయమన్నది లేనేలేదు.

బెల్గాం కాంగ్రెస్‌లో పోటీ తీవ్రరూపం దాల్చింది. ఓటింగు చాలా ముమ్మరంగానే సాగింది. దాస్-మోతీలాల్‌గార్లపై గాంధీగారికే విజయం లభించింది. అయినప్పటికీ కూడా, తనకు లభించిన విజయం అత్యల్పమైన మెజారిటీతో లభించినదన్న కారణంగా, కాంగ్రెసును దాస్-మోతీలాల్‌గారల పరం చేయడానికి తాను సంసిద్ధుడననీ, వారు తమ 'కౌన్సిల్ యెంట్రీ' పదకాన్ని నిశ్చింతగా అమలు జరుపుకోవచ్చుననీ చెప్పి ఆయన తప్పుకున్నారు.

## కాన్పూరు కాంగ్రెస్

అఖిల భారత చరఖా సంఘ స్థాపన కర్త మహాత్ముడే. ఆ చరఖా సంఘాన్ని స్థాపించి ఆయన ఖాదీ విభాగాన్ని కాంగ్రెసునుండి విడదీసి, దానికి ప్రత్యేక స్థాయిని సంపాదించారు. తాను అఖిల భారత చరఖా సంఘ అధ్యక్ష పదవిని స్వీకరించి, కాంగ్రెసును స్వరాజ్య వాదులకు అప్పగించారు. ఈ విధంగా గాంధీగారు నిర్మాణ కార్యక్రమ విభాగానికి ఒక విధంగా అంకితమే అయ్యారు.

దాస్-మోతీలాల్‌గారలు, ధైర్యంగా ముందుకు వచ్చి, వెంటనే 'కౌన్సిల్ ఎంట్రీ' విధానాన్ని కాంగ్రెసు అంగీకరించేటట్లు చేయలేకపోయారు. వారు మరుసటి సంవత్సరం సరోజనీదేవి అధ్యక్షతను జరిగిన కాన్పూరు కాంగ్రెస్* వరకూ ఆగవలసి వచ్చింది. ఆ కాన్పూరు కాంగ్రెస్‌లో తాము 'కౌన్సిల్ ఎంట్రీ' విధానాన్ని అవలంబించి, కాంగ్రెసు టిక్కెట్టుమీద ఎన్నికలలో పాల్గొనడానికి నిశ్చయించారు.

## ఎన్నికల సంరంభం

1926 లో జరిగిన జనరలు ఎన్నికలలో దేశం మొత్తంమీద ఎన్నో ప్రాంతాలనుంచి కాంగ్రెసు టిక్కట్టుమీద రాజ్యసభకి యెన్నిక

---

* కాన్పూరు కాంగ్రెసు (1925) లో కాంగ్రెసువారు స్వరాజ్య పార్టీవారి శాసన సభా ప్రవేశ కార్యక్రమాన్ని చేపట్టి, ఎన్నికలలో పాల్గొనడానికి నిశ్చయించారు.

అయ్యారు. నేను గుంటూరు, కృష్ణా, తూర్పు-పశ్చిమ గోదావరి జిల్లాలకు ప్రతినిధిగా రాజ్యసభకి ఎన్నిక అయ్యాను. రాజ్యసభకే అన్నమాటేమిటి, శాసన సభలకు కూడా చాలా రాష్ట్రాలలో అనేక అభ్యర్థులు కాంగ్రెసు టిక్కెట్టుమీదనే ఎన్నిక అయ్యారు. నిజంగా కాంగ్రెసువారే తలుచుకుని ఉంటే, మంత్రులయి పరిపాలనా యంత్రాన్ని చేబట్టి, 1921 నుంచీ అవిచ్ఛిన్నంగా సాగుతూన్న జస్టిస్‌పార్టీ వారికీ, వారి పరిపాలనా విధానానికీ స్వస్తి చెప్పేవారు. కాని కాంగ్రెస్ వారికి మంత్రులమవుదాం అనే ఉద్దేశం లేదు.

చెన్నరాజధానిలో మాత్రం, అధిక సంఖ్యాకులుగా కాంగ్రెస్ వారు శాసన సభకు ఎన్నిక అయిన కారణంగా, మంత్రి పదవులు సంపాదించి, రాజ్యాంగాన్ని చేపట్టి, చేపట్టిన రాజ్యాంగ చక్రాన్ని నడవకుండా, బినామీగా ఉండాలనే అభిలాష జనించింది. జనించిన అభిలాషకు తల ఒగ్గారు. ఈ విషయాన్ని ముమ్ముందు బాగా విస్తరిస్తాను.

బెల్గాంలో కాంగ్రెసు జరిగిన తర్వాత మొదటిసారిగా అఖిల భారత కాంగ్రెసు కమిటీవారి మీటింగు పాట్నాలో జరిగింది. గాంధీగారు ఒక్క సంవత్సరం పాటు అన్నిరంగాలనుండి రిటయిరవుతానన్నారు. ఆ ప్రకారం, పాట్నా కాంగ్రెసులో, తమకూ కాంగ్రెసుకూ మధ్యనున్న వ్యవహారాలన్నిటినీ చక్కపెట్టుకుని, స్వరాజ్యవాదుల అంగీకారాన్ని కూడా లాంఛన ప్రాయంగా తీసుకున్నారు.

# 13

## గాంధీగారు, స్వరాజ్య పత్రిక

నేను కాంగ్రెసు మీటింగులన్నిటికీ హాజరయి, చేయగలిగిన యథోచిత సేవ చేస్తూ ఉండేవాణ్ణి. కాగా 'స్వరాజ్య' పత్రికలో విషయాలన్నీ వివరిస్తూ, కాంగ్రెసు అభివృద్ధికీ, దేశక్షేమానికి పాటుపడేవాణ్ణి. అంతే కాదు-మోతీలాల్ నెహ్రూలాంటి నాయకుణ్ణి కూడా, తప్పు దారిని

పట్టారని తోచినప్పుడు, చాలా తీవ్రంగా విమర్శించేవాణ్ణి. నేను బర్మా దేశంనుంచి తిరిగి వచ్చిన తర్వాత, మోతీలాల్ నెహ్రూగారు స్వయంగా యీ సంగతే చెప్పుకున్నారు. "స్వరాజ్య" చాలా తీవ్రంగా విమర్శిస్తోందని వాపోయారు.

మోతీలాల్ మంచి వ్యవహర్త, లోకజ్ఞాని అవడాన్ని స్వరాజ్య పేపరుకు విరాళం యిస్తానని కూడా అన్నారు. అంతే కాదు, ఆయన తన సెక్రటరీ రామస్వామి అయ్యంగారిని పిలిచి, నాకు రు 5,000/-లకు ఒక చెక్కు ఇవ్వవలసిందని చెప్పారు. ఆయన ఇచ్చిన డబ్బు పేపరు కాతాకు జమ కట్టకపోతే లంచం క్రింద జమ అవుతుంది గనుక, ఆయన్ని ఆ అయిదువేల రూపాయల విలువగల వాటాలు తీసికోవలసిందని కోరాను. వాటాలు కొన్నట్లు ఆయనకు సర్టిఫికేటు ఇచ్చాను. ఆమరణాంతం ఆయన వాటాదారుగానే ఉన్నారు.

## మూసివెయ్యమని సలహా

గాంధీగారి విడుదల అనంతరం, ఆయన్ని నేను హాస్పిటల్‌లో కలుసుకున్నప్పుడు, ఆయనా నేనూ చాలాసేపు కబుర్లు చెప్పుకున్నాం. ఆ సందర్భంలో "స్వరాజ్య" పేపరు ప్రస్తావన వచ్చింది. తాను జైలులో ఉన్న రోజులలో, "స్వరాజ్య" చేసిన సేవను గురించి అడిగారు. తాను జైలుకు వెళ్ళిన తర్వాత దేశం పరిస్థితుల గురించి నన్ను ఏమీ అడుగలేదు. 'పాలసీ'లో ఏమయినా మార్పు వచ్చిందా, వచ్చి ఉంటే యెందువల్ల వచ్చిందని కూడా నన్ను అడుగలేదు. ఎటువంటి ప్రశ్నలు వేయకుండానే, "స్వరాజ్య పత్రిక మూసేస్తే మంచి"వని సూచించారు. ఆ పలుకు నిజంగా నాలో సంచలనాన్ని కలిగించింది.

దేశం మొత్తంమీద కాంగ్రెసు 'పాలసీ'కి కట్టుపడి కాంగ్రెసు కార్యకలాపాలను ఎప్పటికప్పుడు ప్రచురిస్తూన్న పత్రిక అది ఒక్కటే. గాంధీగారి కార్యక్రమ విజయానికి కూడా ఆ పత్రిక, ప్రారంభింపబడినది లగాయితు, ఎంతగానో సేవ చేసింది. పైగా ఆయన కార్యక్రమాదులనూ, విధానాలనూ ఖండించడంగాని, అ. భా. కాంగ్రెసు కమిటీ

వారిచే అంగీకరింపబడక పూర్వమే ప్రచురించడానికిగాని మా పత్రిక యెప్పుడూ పూనుకోలేదు.

ఆయన 'పాలసీ' లను బైటపెట్టీ, ఆయన కార్యక్రమాదులకు అడ్డంకులు కలుగజేసీ, ఆయన్ని చికాకు పెట్టింది "స్వరాజ్య" కాదు; ఇవన్నీ ఆయన ముఖ్య స్నేహితుడూ, నమ్మిన బంటూ, సన్నిహిత శిష్యుడూ అయిన రాజగోపాలాచారిగారూ, ఆయనచే ఏర్పరుపబడిన వర్కింగు కమిటీని. వారే అటువంటి పనులను చేసినవారు. నిజానికి సహాయ నిరాకరణ ఉద్యమాన్ని రెండు మాసాలపాటు విరమిస్తామన్న తీర్మానాన్ని నిరసించిన వాడిని నేను ఒక్కడినే. ఆ భేదాభిప్రాయాల మూలకంగా, 'సెంట్రలు పార్టీ' అంటూ లేవతీసి, ఆ రెండు పార్టీలవారి మధ్యా సామరస్యం తీసుకు రావాలని తంటాలు పడింది నేను. కాకినాడ కాంగ్రెస్‌లో దాస్‌గారిని 'సపోర్టు' చేయడం కూడా, లోగడ ఢిల్లీ కాంగ్రెసువారు అవలంబించిన విధానం సమర్థించడమే.

ఇటువంటి పరిస్థితులలో నాచే ప్రారంభింపబడి, నడుపబడుతూన్న పత్రికను వెంటనే ఆపివేయవలసిందని గాంధీగారు అనడానికి కారణం, బహుశః నాపైనా, నా పత్రికపైనా ఎవరో స్వార్థపరులు నిందలు మోపి, నా పత్రిక మూలంగానే వారి కార్యక్రమం భంగమయిందనీ, నా పత్రికే అందుకు కావలసిన దోహదం చేసిందనీ, చెప్పి ఉంటారని నేను విశ్వసించాను.

నిజానికి యీ పరిస్థితుల కన్నింటికీ మూలకారణం వారి అనుచరులలో యేర్పడిన అలసతా, దుర్బలత్వమేననీ, ఆ దుర్బలత్వ కారణంగానే వారు దాస్-మోతీలాల్‌గార్లతో వివాదపడి రచ్చకెక్కకుండా, వారికి అనుగుణంగా ప్రవర్తించి ఉన్నారనీ ఆయనకు తెలియకపోవచ్చుననే నేను భావించాను. అప్పట్లో ఆయన అనారోగ్య పరిస్థితినీ, శరీర దౌర్బల్యాన్నీ గమనించి నేను ఆయనతో వాదనకు దిగలేదు.

## నా స మా ధా న ం

కాని, పూర్తిగా స్థిరపడిన పత్రికను మూసివేయడమన్నది అంత చులాగ్గా జరిగే పని కాదనీ, గత మూడు సంవత్సరాలనుంచీ

అవిచ్ఛిన్న సేవచేస్తూ, నిర్దేశింపబడిన మూడు లక్షల మూలధనాన్ని సేకరించి, దారిలో పడిన పత్రికను మూసివేయడం మాటలతో పని కాదనిన్నీ మాత్రం చెప్పాను. అది నా ఒక్కడికీ చెందిన స్వంత వ్యవహారమే అయి ఉంటే, నిమిషాలమీద ఆయన ఆజ్ఞను పాలించే వాడిననీ వ్యక్తం చేశాను. ఈ పత్రిక ప్రజలచే స్థాపింపబడినదనిన్నీ, నేను ప్రజలపట్ల విశ్వాసంతో దీనిని నడుపుతున్నాననీ చెప్పాను.

ఇన్ని సవ్యమయిన సంగతులు చెప్పినా, ఆయనకు సంతుష్టి కలిగినట్లు లేదు. ఈ విషయంలో మిత్రులతో సంప్రతించి వారి పేర వ్రాస్తానని చెప్పి, సెలవు తీసుకుని వచ్చేశాను.

ఆయన ఇచ్చిన ఆదేశం విషయం సుదీర్ఘంగానే ఆలోచించాను. ఆ రోజున ఆయన సలహా పాటించి ఉండి యుంటే, ఈ రోజున చాలా లాభాలు పొంది ఉండేవాణ్ణి. నా సొంత పూచీ పైన బ్యాంకులలో అప్పులు తెచ్చి, పేపరులో పెట్టవలసిన అవసరం ఉండేది కాదు. ఆనాడు ఆయన నా కిచ్చింది, ఆత్మీయులైన అన్నదమ్ముల సలహా లాంటిది. సుమారు అయిదు లక్షలవరకూ ఉన్న బ్యాంకి నిలవలూ, రాజమండ్రి నుంచి నీలగిరులవరకూ ఉన్న స్థిరాస్తులూ చెక్కు చెదర కుండా ఉండేవి. 1924 తర్వాత నేనూ, నా కుటుంబీకులూ ఇక్కట్ల పాలయేవారమే కాదు.

గాంధీగారి సూచనను గురించి, చాలామంది స్నేహితులతో సంప్రతించాను. కొంతమంది వారి సలహా పాటించమనీ, ఇతరులు ఆ సలహా పాటించినట్లయితే చెన్న రాజధానిలో కాంగ్రెసు మనుగడకే మోసం వస్తుందనీ సూచించారు. ఒకప్పుడు గాంధీగారు దక్షిణ ఆఫ్రికాలో వారు నడుపుతూన్న వారపత్రిక మూసివేయవలసిన సందర్భంలో, మూయడం మంచిది కాదు అంటూ, వెలువరించిన కారణాలన్నీ నాకు స్ఫురణకు వచ్చాయి. వారపత్రిక మూయడం విషయంలో వారు సూచించిన కారణాలన్నీ, ఇప్పుడు స్వరాజ్య పత్రిక మూసివేయడం విషయంలో నా హృదయంలో భారంగా నాటుకున్నాయి.

## నేను పడ్డ మథన

చెన్నపట్నంనుంచి వారి పేర సుదీర్ఘమైన లేఖ వ్రాస్తూ అందులో, పెద్ద యెత్తున నడుస్తూన్న ఒక సంస్థను అకస్మాత్తుగా మూయడంలో ఉండే కష్టనష్టాలను గురించి సూచించాను. ఏ విధంగా, ఎన్ని తంటాలుపడి, యీ దేశీయుల నుంచే గాక, విదేశీయుల నుంచి కూడా ధనం ఎల్లా సేకరించబడిందో వివరించాను. అంతేగాక, ఆ రోజు వరకూ ఆయన ఆరంభించిన కాంగ్రెసు ఉద్యమం చెన్నరాష్ట్రంలో బాగా నాటుకు పోవడానికి నా పత్రిక ఎల్లా ఉపకరించిందో కూడా వివరించాను.

అది ఒక 'ట్రస్టు ప్రాపర్టీ'లాంటిదనీ, దానినే గనుక యిప్పట్లో మూసివేస్తే, తన చర స్థిర ఆస్తుల నన్నింటినీ జాగ్రత్తగా కాపాడు కుంటూ, స్వలాభం కోసం ఈ సంస్థను మూసేశాడనే చెడ్డ పేరు కూడా నాకు వస్తుందని తెలియబరిచాను. నన్ను బాగా బాధపెట్టిన విషయం నిజంగా అదే. ఆ ప్రజాభిప్రాయమే. అదాటుగా పత్రికను ఆపుచేస్తే ప్రజలలో నా కీర్తి ప్రతిష్ఠలు ఎల్లా భగ్నమయి పోతాయోననే చింతే నన్ను బాధించింది. ప్రాక్టీసు విరమించడమూ, ప్రపంచ చరిత్రకే వినూత్నమయిన విధంగా ఈ దేశంలో ప్రజా రాజ్యం సంపాదించాలనే వాంఛతో కాంగ్రెసులో చేరి నేను చేసిన సేవా, అన్నీ యీ పత్రిక మూసివేసిన కారణంగా మట్టమవుతాయనే బాధే నన్ను బాగా పీడించ సాగింది.

## ఆ నా టి సం క ల్పం

ప్రజాక్షేమంకోసం దక్షిణ ఆఫ్రికాలో ప్రారంభింపబడిన వార పత్రికను మూసివేయడం విషయంలో సరిగా ఇటువంటి ఆలోచనలే వచ్చి, గాంధీగారిని చికాకు పరిచాయి. ఆనాడు ప్రాక్టీసు విరమించి నేను ఉద్యమంలో దిగినప్పుడు, నా జీవితంలో వెనక్కి అడుగు వేయ కూడదన్నదే, నా సర్వస్వం, నేను సంపాదించిన ఆస్తిపాస్తులన్నీ సమూలంగా నాశనం అయినా, చేపట్టిన దేశసేవ విరమించరాదన్నదే

నా సంకల్పం. నేను సంపాదించినదంతా ప్రజల డబ్బే. ఆ ప్రజల కొరకే ఆ ధనాన్ని వ్యయపరచ గలగడం అన్నది ఒక ఘన కార్యమే ననే ఊహ నన్ను బాగా ఊపింది. అవసరాలనుబట్టి, అనుకున్న విధంగా, ప్రజాసేవలోనే ఉన్నదంతా వ్యయపరచ గలిగాననే సంతుష్టి నాకుంది.

ఉద్యమంలో చేరే రోజున, సత్యాహింసల పునాదితో ప్రారంభింపబడిన సహకార నిరాకరణ ఉద్యమాన్ని గురించి గాంధీగారు చెప్పినప్పుడు, ఆ ఉద్యమంలో ఉండే సావకాశాలూ, దాని విస్తీర్ణాది ఘన పరిణామాలూ నాకు నిజంగా తెలియవు. అప్పటికి నేను భగద్గీతగాని, హైందవ వేదాంతాది గ్రంథాలుగాని చదివి ఉండలేదు. ఆ ఉపనిషత్తులూ, భగవద్గీతా మున్నగునవి చదివి ఉండి ఉంటే, మన మతమునకూ, సాంఘిక జీవనానికీ ఉన్న లంకె, పుట్టిన ప్రతి వ్యక్తీ తన పొట్టనింపుకోవడానికి మాత్రమే పుట్టలేదనీ, సంఘసేవా, మానవసేవా, దేశసేవా అన్నవి ప్రతి వ్యక్తీ అవలంబింపవలసిన విధులనీ గ్రహించగలిగి ఉండేవాణ్ణి.

గాంధీగారు ఈ కాంగ్రెసు ఉద్యమ స్థాపన, కేవలమూ ఆర్థిక రాజకీయ స్వాతంత్ర్య సంపాదన కోసమే కాదనీ, మతానికి బానిసలమై, మరచిన మానవత్వం ఉద్ధరింపబడాలన్నది కూడా గాంధీగారి ముఖ్య సూత్రమేననీ అర్థమయి ఉండేది. భగవద్గీతలోనూ, పురాణ ఇతిహాసాది ఉత్తమ మత గ్రంథాలలోనూ, అంతర్గతంగానూ, సూత్రప్రాయంగానూ నిర్దేశింపబడిన కర్తవ్యాదులూ, అనాసక్తాది యోగాలూ గ్రహించ గలిగిన రాజాధి రాజులు కూడా, ఎలా మానవ సేవ, దేశ సేవ, సంఘ సేవా చేస్తూ, సత్యాహింసల కోసం పాకులాడుతూ, తమ యావత్తు ధన, కనక, వస్తు, వాహనాదులనే గాక, ప్రాణాలను కూడా తృణప్రాయంగా భావించి కీర్తి గాంచారో అర్థమయి ఉండేది.

గాంధీగారి సూత్రాల ప్రకారం నడుపబడిన కాంగ్రెసు ఉద్యమం కారణంగా మన ఉత్తమ గ్రంథాల ఆశయాలన్నీ ఈ 20 ఏళ్ళ కాంగ్రెసు

జీవితంలోనూ అర్థమయ్యాయి. కాని, దురదృష్టవశాత్తూ ఇంకా మత సాంఘిక రాజకీయ స్వాతంత్ర్యాలు మనకు లభించలేదు. దానికి కారణం మనకు సరి అయిన పద్ధతులమీద శిక్షణ లేకపోవడమే. మన వాంఛలూ, కోరికలూ, మనల్ని ఇంకా పీడిస్తున్నాయి. పోటా పోటీలమీద, లాభ సాటి వ్యాపారాల మీదా, ధనార్జన మీదా వ్యామోహాలు తగ్గలేదు. రాజ కీయాలతో సహా, ఏ రంగంలో ప్రవేశించినా, ఏ పని చేద్దాం అన్నా, లాభాలమీద లాభాలు గణించాలనే వాంఛ చావలేదు.

## ముంచుకు వచ్చిన పరిస్థితులు

"స్వరాజ్య" పత్రిను గురించి వివరించబోయే ప్రకరణమున్నూ చాలా మనోరంజకంగానే ఉంటుంది. దురదృష్ట వశాత్తూ, హైకోర్టు జడ్జీగారి తీర్పు ప్రకారం ఆ సంస్థను మూసివేసే వరకూ వ్రాసిన విష యాలు చదువరుల హృదయాలకు బాగా హత్తుకుంటాయి. హైకోర్టులో నా పైన తేబడిన ఒక 'సమ్మరీ పిటీషన్' మీద ఇవ్వబడిన తీర్పు కార ణంగా పత్రిక విరమించవలసి వచ్చింది. ఆ గాథంతా వేరే ప్రకరణంలో వివరంగా తెలియజేశాను. నా శత్రువులు దుర్బుద్ధితో పన్నిన కుట్ర కారణంగా పత్రిక మట్టుపెట్టబడిన వైనం పూర్తిగా ఆ ప్రకరణంలో వివరించాను. ఆ వివరణ అంతా సరిగానూ, సవ్యంగానూ చేశాననే నా భావన.

ఒక ప్రఖ్యాత నాయకునిగా, ఒక సన్నిహిత మిత్రునిగా గాంధీ గారు 1922 లోనూ, 1924 లోనూ కూడా పత్రికను విరమించమని సలహా ఇచ్చి ఉన్నారు. నేను పత్రికను ఆపుచేయడానికి అంగీకరించని కారణంగా, వారికీ నాకూ మధ్య స్వల్పమయిన అభిప్రాయభేదా లేర్పడి, మాకు ఉన్న పూర్వపు సన్నిహిత్యానికి అవరోధాలు కన్పించాయి. ఈ సందర్భంలో గాంధీగారికీ, నాకూ మధ్య నడచిన ఒక ఉపాఖ్యానం చెప్పడం న్యాయము.

## బాపట్ల కోర్టులో దావా కథ

ఒంగోలు తాలూకాలో ఖాదీ ఉద్యమాన్ని సక్రమంగా నడుపు టకు అఖిల భారత చరఖా సంఘం వారిచ్చిన పెట్టుబడి పదివేలూ వారికి

తిరిగి యిచ్చి వేస్తామని, నేనూ గోపాలశాస్త్రిగారూ ఉమ్మడిగా రాసి యిచ్చామనే అంశం పాఠక లోకానికి తెలుసు. మా ఉభయుల అభిప్రాయం ఆ పుచ్చుకున్న డబ్బు మా స్వంత ఉపయోగాలకు ఇవ్వబడింది కాదనీ, ఆ ధనాన్ని వాపసు యిచ్చే సందర్భంలో దానిని ధన రూపంగానే గాక వస్తు రూపంలో కూడా చెల్లించవచ్చుననీ. ఈ వ్యవహారమంతా, త్రివిధ బహిష్కార విధానం అమలులో నున్న రోజులలో జరిగింది. ఒక సాదా కాగితంమీద, పైన ఉదహరించిన షరతుల ప్రకారం, మేము ఒప్పందం రాసుకోడం జరిగింది.

ఆ అఖిల భారత చరఖా సంఘ అధినేత శంకర్‌లాల్ బ్యాంకర్ గారికి ఒంగోలులోనూ, ఇంకా యితర రాష్ట్రాలలోని కొన్ని ప్రాంతాలలోనూ ఈ ఖాదీ ఉద్యమం విరమించాలనే అభిప్రాయం కలిగింది. ఆయన మాకు ఇచ్చిన పదివేలూ రొక్కం రూపంగా జమ కట్టవలసిందని తాఖీదు పంపించాడు. మేము ఆ ధనమంతా, చరఖాలమీదా, మగ్గాలమీదా, ప్రత్తి, నూలు వగైరాలమీదనే గాక తయారయిన బట్టమీద కూడా మదుపుపెట్టి ఉన్న కారణంచేత, అప్పు తీసుకున్న రొక్కాన్ని, రొక్కంగానే జమ కట్టమనడం భావ్యం కాదు గనుక, ఈ సంస్థని యావత్తూ ఒక నడుస్తూన్న సంస్థగా స్వాధీనం చేసుకుని, వారిచ్చిన డబ్బు క్రమేణా రాబట్టుకోవడం న్యాయమనీ, వారిచ్చిన పెట్టుబడి మేరకు సరుకు ఉన్నదో లేదో విలియా వేసుకోవచ్చుననీ, నష్టం అనేది ఏదయినా ఉంటే మేము భరించడానికి సంసిద్ధులమేననీ విన్నవించాము.

## చరఖా సంఘంవారి షైలాక్ వ్యవహారం

శంకర్‌లాల్ బ్యాంకర్‌గారు "షైలాక్"లాగ "అదేం కుదరదు, అనుకున్న ప్రకారం ఇవ్వవలసిన సేరు మాంసం ఇచ్చి తీరవలసిందే" అన్నారు. నేను కుదరదన్నాను.

ఈ విషయమంతా గాంధీగారి వద్దకు వెళ్ళింది. నేను అ.భా.చ. సంఘంవారిని ఎందుకు చికాకుల పాలుచేస్తున్నానో అర్థం కావడం

లేదంటూ గాంధీగారు నా పేర ఒక ఉత్తరం వ్రాశారు. నేను ఉన్న పరిస్థితులన్నీ వారికి వివరించాను. ఈ విషయంలో వారికీ, మాకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు నడిచాయి. దక్షిణ ఆఫ్రికాలోని ఒక లక్షాధికారి, ఒక తగాయిదా పరిష్కారానికిగాను, తాను సూచించిన ప్రకారం, కోర్టు ప్రమేయం లేకుండా, ఏలా వందలూ, వేలూ కుమ్మరించాడో ఆ సంగతి ఉదహరిస్తూ, ఈ విషయంలో ఆఖరి ఉత్తరం గాంధీగారు వ్రాశారు.

ఆ ఉదంతానికీ, ఈ ఉదంతానికీ సంబంధం లేదనీ, పుచ్చుకున్న డబ్బుతో పెట్టవలసిన పెట్టుబడులన్నీ సవ్యంగానే పెట్టబడిన కారణంగా, ఆ వస్తువులన్నీ వారు స్వాధీనం చేసుకుని, ధన రూపంలోకి మార్చుకోమని కోరడములో, మేము న్యాయంగానే ప్రవర్తిస్తున్నామనీ, నష్టం యేమయినా ఉంటే ఇవ్వడానికి సిద్ధంగానే ఉన్నామనీ, తిరిగి ఇంకోసారి తెలియజేశాను. అంతేకాదు-మా అధీనంలో ఉన్న సమస్త వస్తు వాహనాదులన్నీ అ. భా. చ. సంఘంవారు ఆ పదివేల మింజుమలె జప్తు చేసి ఉన్న కారణంగా, వాటిని ఏ విధంగానూ అన్యాక్రాంతం చేయగల శక్తి మాకు ఉండదనీ సూచించాను.

## గాంధీగారి సలహామీద దావా

గాంధీగారు ఈ విషయాలు నాతో ముఖస్థంగా చర్చించి ఉంటే, బహుశః వారు కాదన లేకపోయే వారేమో! ఈ ఉత్తర ప్రత్యుత్తరాల వల్ల నేను చికాకులు పెడుతున్నాననీ, సవ్యమయిన వ్యక్తిని కాదనీ భావించారో యేమో తెలియదుగాని, మా ఉభయుల మీదా దావా వేయవలసిందిగా బ్యాంకర్‌గారికి సలహా ఇచ్చారు.

దాన్తో తీసుకున్న డబ్బు వాపసు యివ్వవలసిందంటూ, మా ఉభయులమీద బాపట్ల సబ్ కోర్టులో దావా వెయ్యబడింది. నేను మా స్టేట్‌మెంట్‌లో, న్యాయబద్ధమైన అన్ని సూచనలూ చేస్తూ, కాంగ్రెసువారు, త్రివిధ బహిష్కార విధానం అమలు పరుస్తూన్న రోజులలో ఈ వ్యవహార కాండ అంతా నడచిన కారణంగా, ఆ కోర్టువారికి ఇట్టి దావాలను

విచారించడానికి 'హక్కు' (Jurisdiction) లేదనిన్నీ వాదించాను.

ఈ విషయం మా ఇరువురి మధ్యా చాలా రగడే రేకొల్పింది. శంకర్‌లాల్ బ్యాంకర్ కూడా చింతాక్రాంతుడయ్యాడు. మధ్యవర్తి పరిష్కారానికి ఒప్పుకోవలసిందని ఆయన నన్ను కోరాడు. మధ్యవర్తి పేరడిగాను. గాంధీగారన్నాడు. లోగడ జరిగిన ఇంకొక ఉదంతం కారణంగా గాంధీగారి మధ్యవర్తిత్వానికి నేను ఒప్పుకోలేదు. అప్పట్లో రాజగోపాలాచారిగారికీ, నాకూ వచ్చిన ఒక లావాదేవీలో గాంధీగారు, నా వాదన వినకుండానే, రాజగోపాలాచారిగారికి పదివేలు ఇవ్వమని చెప్పిన చొప్పంతా వివరించాను. ఆయన చేతిలో ఒకప్పుడు నష్టపడిన కారణంగా ఇప్పుడు తిరిగీ ఆయన మధ్యవర్తిత్వానికి అంగీకరింపజాలనని తెలియబరచాను.

ఆ కేసు నడుస్తూన్న రోజులలో నేను బర్మా, మలయా మున్నగు ప్రాంతాలలో సకుటుంబంగా పర్యటిస్తూ, జరుగనున్న కాంగ్రెసు సమావేశాలకు ముందుగా పట్నం చేరుకున్నాను.

## నేను జామీనుదారునే

నేను స్వయంగా అ. భా. చ. సంఘం వారితోటీ, గాంధీగారి తోటి తగాయిదాలోనికి దిగి, వ్యవహార కాండంతా నడిపిస్తూ ఉన్నా, గోపాలశాస్త్రిగారికి బాధగానే ఉంది. అ. భా. చ సంఘం నుంచి స్వయంగా డబ్బు పుచ్చుకున్నది ఆయన. నేను కేవలం జామీను దారునే. అందువల్ల ఒక ప్రక్క గాంధీగారూ, అ. భా. చ. సంఘం వారూ ఉండడమూ, రెండవ ప్రక్క మేము ఇరువురమూ ఇరుక్కోవడమూ గమనించి, ఈ కీచులాటను తప్పించాలని ఆయన తలిచారు.

దావాపడే ముందు మేము సవ్యంగా వ్యవహరించాలనే భావనతో, గోపాలశాస్త్రిగారితో ఉన్న సామానులన్నీ - రాట్నాలూ, మగ్గాలూ, దూదీ, నూలూ, వస్త్రాలు, ఏ రూపంలో ఉన్నా సరే- ఉన్నవి ఉన్నట్లుగా, పరిగా, మాటలు గట్టి, అ. భా. చ. సంఘంవారి ప్రాంతీయ ప్రతినిధి కొండ వెంకటప్పయ్య పంతులుగారికి స్వాధీనం చేయమన్నాను. ఆ

ప్రకారం చేస్తే అ. భా. చ. సంఘం వారికి సంబంధించిన పూచికపుల్ల కూడా మావద్ద ఉండదన్నమాట.

మా వాదన సరి అయినదనీ, అ. భా. చ. సంఘంవారి క్లెయిము లా ప్రకారం చెల్ల నేరదనీ నాకు బాగా తెలుసు. అందుచేతనే వేసిన దావాను ప్రతిఘటించమని సలహా ఇచ్చాను.

ఏది యెల్లా ఉన్నా దావా కోర్టులో నడుస్తూన్నంత కాలమూ ఇది ఒక అవాంఛనీయమైన చికాకు పంచాంగంగానే మేము భావించాము. గాంధీగారి పద్ధతులు ఒకొక్కప్పుడు బ్రిటిషువారు అవాంతర పరిస్థితులలో అవలంబించే పద్ధతుల లాంటివే. కేంద్రంలోగాని, రాష్ట్రాలలోగాని కొన్ని కొన్ని అవాంతర పరిస్థితు లేర్పడినప్పుడు, వారొక పద్ధతిని అవలంబించేవారు. ఏదయినా అవాంతరాలు వచ్చినప్పుడు లాయరు సలహా తీసుకోవడమూ, వెంటనే ఆ సలహాను పాటించి అవసర చర్యలు తీసికోవడము మామూలు. అంతేగాని, వారు చేస్తూన్న పని న్యాయమయిన దవునా కాదా అన్న విచారణ ఉండేది కాదు. వారట్టి పద్ధతి అవలంబించడానికి కారణం వారికి లాయర్లయందుండే విశ్వాసమే. ఏదయినా గడ్డు పరిస్థితి యేర్పడినప్పుడు, తాము ఒక నిశ్చయానికివచ్చి కార్యక్రమం సాగించడమూ, అనుమానం వస్తే వెంటనే లాయరు సలహా తీసుకుని వ్యవహరించడమూ వారికి మామూలు. వారంతట వారు ఆలోచించరు. ప్లీడరు చెప్పిందే వేదవాక్కు. గాంధీగారి పద్ధతి కూడా ఒకొక్కప్పుడు అల్లాగే ఉండేది. తానే స్వయంగా లాయరయి, సంగతులు సవ్యంగా అవగాహన చేసుకుని, ఒక మార్గాన్ని త్రొక్కితే మంచిదనే ఊహ పుట్టినప్పుడు, బాధ్యతలను విస్మరించకుండా, దర్జాగా కోర్టుకు వెళ్ళాలి. అవును. దర్జాగానే వెళ్ళాలి. కోర్టు ఖర్చులు సామాన్యమా మరి!

ఎవరయినా దగా చేసినా తప్పించుకోడానికి దారి చూపించాలని కాదు నా ఉద్దేశం. న్యాయం తమదన్న నిశ్చయం ఉన్నప్పుడు ధీమాగానే కోర్టుకు వెళ్లాలిగాని, అన్యాయాలను న్యాయాలుగా నిరూపించడానికి కాదు.

## గోపాలశాస్త్రి తరహా

అనవసరమైన చికాకులకు లోనుగాకుండా ఉండాలనే ఉద్దేశంతో గోపాలశాస్త్రిగారు, తమ స్వంత ఆస్తి విక్రయించి నాలుగువేల రూపాయలు పోగుచేసి, ఆ సొమ్ము కూడా లోగడ జమ కట్టిన సొమ్ముగు లకు తోడుగా జమ కట్టడంతో, లావాదేవీ లన్నీ సక్రమంగా, ఏ విధమయిన చికాకులూ లేకుండా అంతమయ్యాయి.

నేను ఆంధ్ర దేశానికి తిరిగివచ్చి, కాంగ్రెసుకు వెళ్ళడానికి సిద్ధపడేలోపల గోపాలశాస్త్రిగారు ఈ డబ్బును సమకూర్చుకుని, గాంధీ గారితో మాటలాడి తగాయిదా పరిష్కరించవలసిందని నన్ను కోరారు. నేను ఈ నాలుగువేల రూపాయలు కాంగ్రెసు పెండాలులో గాంధీగారి చేతులలోనే స్వయంగా పోశాను. దాన్తో, అంతా ఒకప్పుడు తలచినట్లు, నేను దుష్టుణ్ణీ, దొంగనీ కానని ఆయన తలచి ఉండాలి.

అప్పటికే నా సర్వస్వం దేశానికి అర్పణ అయిపోయింది. నాదీ అనుకోతగ్గ సెంటు భూమి కూడా మిగులలేదు. నాకు కాణీ వరుమానం వచ్చే ఆస్తిపాస్తు లేవీ మిగల్లేదు. ఏ మాత్రం ఆస్తి మిగిలి ఉన్నా ఆ నాలుగువేలూ నేనే నా సొంత డబ్బునుంచే యిచ్చేవాడిని. ఈ నాలుగు వేలు రూపాయిలూ గాంధీగారి చేతిలో పెట్టిన తర్వాత, దావా ఉపసంహరించబడింది. ఆ లావా దేవీలన్నీ ఆ ప్రకారం అంతమయ్యాయి.

ఇటువంటి విషమ పరిస్థితులలో నేను ఉన్నా, ఎవరో స్వలాభపరులు 'స్వరాజ్య' పత్రిక తన ఉద్యమానికి వ్యతిరేకంగా పనిచేస్తోందని చెప్పిన కల్పిత కథలు విని గాంధీగారు నాపై దండెత్తినా, నేనెప్పుడూ బహిరంగంగాగాని, ఆంతరంగికంగాగాని బాధపడలేదు. నిజం నిలకడ మీద తెలియకపోదనే నమ్మిక నా కుంది. నన్ను అనేక విధాల చికాకుల పాలుచేసి, అల్లరి పెడదామని గట్టిగా తలపెట్టిన ప్రత్యర్థులు ఉన్నా, నేను కాంగ్రెసును వదలకుండా అంటిపెట్టుకుని ఉండగలగడం నిజంగా ఒక గొప్ప విశేషమే.

## సి. ఆర్. దాస్ అతిథి మర్యాద

చిత్తరంజన్ దాస్‌గారు తన స్వంత రాష్ట్రంలోనే, రాజకీయ ప్రత్యర్థుల చేతిలో ఎల్లా యిరుక్కుని, ఎన్ని రకాలుగా బాధలు పడ్డారో, ఆర్థికంగా ఎలాంటి చిక్కులకు లోనయ్యారో కాస్త విచారిద్దాం. న్యాయవాదిగా సంపాదించడంలోగాని, సంపాదించినదంతా చాలక అప్పులు చేసి కూడా ఖర్చు పెట్టడంలోగాని, ఆయనకు ఆయనే సాటి. ఆయనా నాకుమల్లే చాలా దుందుడుకు మనిషి. నేను "స్వరాజ్య" పత్రిక స్థాపించిన కొత్తలోనే, అయన దక్షిణ దేశంలో పర్యటించడానికి వచ్చాడు. నా పత్రిక విజయవంతంగా ప్రజాదరణ పొందుతూన్న సంగతి గమనించి, ఆయన కలకత్తాలో 'లిబర్టీ' అనే దైనిక పత్రిక స్థాపించారు. అదే దరిమిలా 'ఫార్వర్డ్' పత్రిక అయింది. ఆయన చికాకులలో ఇరుక్కున్న రాజకీయ వాదులకు ఇతోధికంగానూ, ఉచితంగానూ సహాయాలు చేసేవాడు.

గాంధిగారు నన్ను 'స్వరాజ్య'ను మూసివేయమని సలహా యిచ్చినప్పుడు, ఆయన నాతో దాస్‌గారనుభవిస్తూన్న బాధలను గురించి కూడా వక్కాణించారు. ఏమయితేనేం, దాస్‌గారు మాంచి ఠీవితో, బ్రతికి ఉన్నంతకాలమూ రాజాలాగే బ్రతికాడు. పోయిననాడూ * అంత ఠీవితోనే పోయాడు. ఆయన భోజనశాలలోని బల్ల (Dining table) పెద్ద పెద్ద హోటేల్సు ఉండే బల్లలకంటే పెద్దది. డ్రెస్సులో ఉండే వెయిటర్సు కూడా ఒక పెద్ద హోటలులో ఉన్నంతమందీ ఉండేవారు.

ఆయన ప్రాక్టీసు విరమించక ముందు తరుచుగానూ, సహాయ నిరాకరణ ఉద్యమంలో చేరాక మరీ యెక్కువగానూ ఆయనకు అతిథిగా ఉండేవాణ్ణి. ఉద్యమంలో చేరాక ఆయన తన ఖర్చులు తగ్గించుకుని, ఆ వెయిటర్లనీ వాళ్లనీ తీసేసి, సాధారణంగా హిందువులు భుజించే పద్ధతిగా నేలమీద పీటలు వేసుకునే కూర్చునేవారు. ఆ ప్రకారంగా కూర్చో

* 16-6-1925.

పెట్టి నాకు యెన్నోసార్లు వారింట భోజనం పెట్టారు. ఆయన కుమార్తె, మేనకోడలూ నాకు ఎదురుగా కూర్చుని, వండిన రకరకాల వంటకాలన్నీ నాచేత బలవంతంగా మొహమాటపెట్టి మరీ తినిపించేవారు.

## మహానాయకుడు

ఆయన జీవించి ఉన్న రోజులలో ఆయనతో తుల్యమయిన నాయకుడు లేడు. ఆయన తర్వాతకూడా అంతటి నాయకుడు ఉండ డనే ఘంటాపథంగా చెప్పవలసి ఉంటుంది. ఆయన పోయింది లగా యితు ఈ రోజువరకూ బెంగాలు రాష్ట్రం, ఏ శనిగ్రహచ్ఛాయలలోనో ఇరుక్కుని తబ్బిబ్బవుతోందని అనక తప్పదు.

నేను వర్కింగు కమిటీలో ఉంటూన్న రోజులలో, అనగా-దాసుగారు మంచి ఉచ్ఛస్థితిలో ఉన్న రోజులలో, ఆయనకు రాజకీయంగా చాలామంది పోటీదార్లూ, విరోధులూ ఉండేవారు. వారెప్పుడూ వర్కింగు కమిటీముందు దాస్‌గారి మీద తీవ్రమయిన ఆరోపణలూ, ఫిర్యాదులూ చేసేవారు.

ఆయన కాంగ్రెసు మెంబర్ల లిస్టును ఇష్టంవచ్చిన చేర్పులూ, మార్పులూ, కొట్టివేతలతో నింపి చాలా అయోమయంగా ఉంచేవాడని, పిర్యాదు ఉండేది. ఈ విషయంలో వర్కింగు కమిటీవారు విచారణ చేయక తప్పలేదు. ఆయనా వర్కింగు కమిటీ మెంబరే అయినా, ఆయన విషయంలో విచారణ జరుగనున్నదని తెలిస్తే వెంటనే బయటికి వెళ్ళి, ఆ విచారణ పూర్తయ్యాకే తిరిగివచ్చి కమిటీతో కలిసేవాడు. ఆ విచారణ కాలాన్ని బాగా సాగదీశారు. అనేక ప్రాంతాలలో జరిగిన వర్కింగ్ కమిటీ మీటింగులలో దాసుగారుపై మోపబడిన ఫిర్యాదులు విచారణకు రావడమూ, అట్టి విచారణ సమయాలలో ఆయన మీటింగు నుంచి నిష్క్రమించడమూ, మామూలే అయింది. ఏదయిదేనేం, చివరికి ఆయనపట్ల ఆరోపించబడిన లోట్లేవీ ఆయనవద్ద లేవనీ, మోపబడిన నేరాలన్నీ గాలిమూటలే నని గౌరవ పురస్సరంగా తెలియజేశారు.

ఆయన మరణానంతరం బెంగాలు పూర్తిగా తేరుకోలేకపోవడానికి కారణం అక్కడ ఉన్న పార్టీ విభేదాలూ, చీలికలూను. మేము కొన్ని కొన్ని విషయాలలో భేదాభిప్రాయంతో ఉంటూ ఉన్నా, మా ఉభయుల మధ్యా వ్యక్తిగత గౌరవాలూ, ఆదరాభిమానాలూ కించిత్తు కూడా తగ్గలేదు.

# 14

# గురుకాబాగ్ సత్యాగ్రహ సందర్శనం

ఈ సత్యాగ్రహం * అకాలీలచే ప్రారంభింపబడింది. వారిని ఒక సిక్కుల ఆలయంలోకి రానివ్వని కారణంగా, తమ హక్కులను సుస్థిర పరచుకొనడంకోసం అకాలీలు ఈ సత్యాగ్రహ సమరం ఆరంభించారు. ఆ ఆలయాధికార్లు ఈ అకాలీలకు అందులో ప్రవేశించే అర్హత లేదని నిర్ణయించారు. అకాలీలు ఆ తీర్పు సవ్యమయినదీ, న్యాయమయినదీ కాదనిన్నీ, అందువలన తాము ఆలయంలో ప్రవేశించి తీరుతామనీ చెప్పి ఆలయ ప్రవేశానికి సిద్ధపడ్డారు.

## అకాలీల మీద ఆంక్ష

ఆ ఆలయ పాలకులు ప్రభుత్వంవారి సహాయం కోరారు. అకాలీల ఆలయ ప్రవేశాన్ని నిషేధిస్తూ ప్రభుత్వంవారు సి.ఆర్. పి. సి., 144 వ సెక్షను క్రింద ఆర్డరు వేశారు. ఆ ఆంక్షను పాటించకుండా ఆలయ ప్రవేశం చేసితీరాలని అకాలీలు నిశ్చయించుకున్నారు. కాగా వారు గాంధీగారి అహింసాత్మక సత్యాగ్రహ పద్ధతులను అనుసరించారు. కేవలం అనుసరించడమే కాదు, ఆ పద్ధతులకు మెరుగు దిద్ది, వాటిని ఎంతో పకడ్బందీగా తయారుచేశారు. సత్యాగ్రహ విధానాలకూ, మిలిటరీ పద్ధతులకూ జత కలిపారు.

* 1923 లో.

చాలామంది అకాలీలు పింఛను పుచ్చుకున్న సిపాయిలు, మిలిటరీ వారు. తీవ్రమైన పోరాటాలలో ప్రాణాలు తృణప్రాయంగా అర్పించడానికి వెనుకాడిన బాపతు కానేకారు. అనేక యుద్ధాలలో ఆంగ్లేయుల తరపున పాల్గొన్నవారే వారు. కాని వారికి ఆంగ్ల పరిపాలకులతోనూ, వారి ఉద్యోగస్థులతోనూ తగాయిదా ప్రారంభం అయిన కారణంగా, వారు తీవ్ర యుద్ధ విధానాలకంటె గాంధీగారి అహింసాత్మక సత్యాగ్రహ విధానమే ఉత్తమమయినదని భావించారు.

## వైద్యశాల - వంటసాల

వారిపై ఆంక్ష విధింపబడిన వెంటనే వారు దానిని ఉల్లంఘించి తీరుతామని తెలియజేశారు. తమపై ఆంగ్లేయులు హింసాకాండ సాగిస్తారని, దానిని ఒక యుద్ధంగాగే భావించాలనీ వారికి తెలుసు. ఆ పరిస్థితులలో తీవ్రంగా గాయపడడానికి బాగా అవకాశం ఉన్నదని తెలుసు. అందువలన వారు ఆ పోరాటం జరుగుతున్న స్థానానికి సమీపంగా పెద్ద ఆస్పత్రిని ఏర్పరచుకున్నారు. అవసరమైన వైద్యం చేయడానికి నర్సులూ, డాక్టర్లూ కూడా కాణీ ఇవ్వనవసరం లేకుండానే తయారయ్యారు. ఆస్పత్రికి సమీపంగానే ఒక "లంగర్ ఖానా" (వంటసాల) ఏర్పాటు చేసుకున్నారు. ఆ లంగర్ ఖానాలోని యేర్పాట్లు చాలా బ్రహ్మాండంగా ఉన్నాయి.

దాస్‌గారూ, నేనూ, బాబూ రాజేంద్ర ప్రసాదూ, మరికొంత మంది కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గ సభ్యులు వెంటరాగా, ఆ లంగర్ ఖానా, ఆస్పత్రి, వగైరా యేర్పాట్లన్నీ చూశాము.

ప్రభుత్వంవారు చేసిన యేర్పాట్ల ప్రకారం అకాలీలు ఆలయ ప్రాంగణంలోకి అడుగుపెట్టడానికి ఆస్కారం లేదు. ఆలయం చుట్టూ పోలీసు నిఘా వేశారు. పోలీసుల చేతులలో దిట్టమయిన లాఠీలున్నాయి. అకాలీలు ఎవరయినా ఆలయ సమీపానికి వచ్చినా, ఆలయ ప్రవేశానికి ప్రయత్నించినా, వారి యెముకలు చితగ్గొట్టడానికి ప్రభుత్వంవారు సర్వసన్నద్ధు లయ్యారన్నమాట. అక్కడ అకాలీలు సత్యాగ్రహ పద్ధతులమీద చేసుకున్న యేర్పాట్లన్నీ మమ్మల్ని ముగ్ధుల్ని చేశాయి.

## సత్యాగ్రహ క్రమం

ముందుగా వారు ఆలయ ప్రాంతానికి వెళ్ళే తీరు గమనిద్దాం. భజన కీర్తనలతో, పాటలతో ఉత్సాహంగా ఆలయ ద్వారం దగ్గరకు బయల్దేరేవారు. ప్రతిసారీ, నలుగు రైదుగురు వ్యక్తులు మాత్రమే ఒక చిన్న బాచ్‌గా వెళ్ళేవారు. వారి మెడలో పూలమాల ఉండేవి. 'దెబ్బలు తగలనీ, ప్రాణాలు పోనీ- భగవదాలయంలోకి వెళ్ళి తీరుతాం' అన్న భావం వ్యక్తంచేసే కీర్తనలు అందరూ ఏకగ్రీవంగా పాడుకుంటూ వెళ్లేవారు. "మీరు ఈ భౌతిక దేహాన్ని కించపెట్టగలరు. హింసింప గలరు. చంపగలరు. కాని మా ఆత్మలు మాత్రం ఏవిధమయిన అడ్డం కులూ లేకుండా ఆ భగవత్సాన్నిధ్యాన్ని చేరుకుంటాయి. ఆ ఆత్మలు భగవంతుని జేరకుండా మీరు ఆపలేరు," అని ఆ పాటల ఆఖరు చర ణాల అర్థం.

మేము పైన ఉండి చూస్తున్నాం. బాచ్ తర్వాత బాచ్‌గా వస్తూన్న ఆ అకాలీలను నిర్దాక్షిణ్యంగా బాదేవారు. శరీరమంతా కుళ్ళ బొడిచేవారు. చివరికి స్మృతి తప్పి పడిపోయే వరకూ వారికి దెబ్బమీద దెబ్బ తగులుతూనే ఉండేది. దెబ్బలు తగిలిన వారిని తమ ఆస్పత్రికి తీసుకు వెళ్ళడానికి వారి సొంత యాంబ్యులెన్సుకారు సిద్ధంగానే ఉండేది. పోలీసువారి యాంబ్యులెన్సు కార్లూ ఉండేవి. ఆ ప్రభుత్వపు యాంబ్యులెన్సు కారులో ఎక్కించడానికి మోసుకునివచ్చే లోపల, ఏ సత్యాగ్రహికైనా కిర్మించాలక అనండి, అదృష్టవశాత్తూ అనండి. తెలివిగనుక వస్తే, ఆతను ఆ ప్రభుత్వపు కార్లలో ఎక్కడానికి నిరా కరించేవాడు. 'మమ్మల్ని మా కారులోనే పడేయవయ్యా!' అని అరిచే వారు ఆ క్షతగ్రాతులు. ఆ ప్రకారమే జరిగేది.

## అహింసా వ్రతం

అక్కడనుంచి వారి ఆస్పత్రి చూడ్డానికి వెళ్ళాం. మేము లోపలికి వెళ్ళేసరికి దెబ్బలు తిన్న ప్రతి వ్యక్తి మంచంమీద వెల్ల

కిత్తులా, మిలిటరీ పద్ధతిగా పడుకుని ఉండేవాడు. ఆ దెబ్బలు తిన్న వ్యక్తులలో ముగ్గురు వయోవృద్ధుల్ని, "మీ పటకాలలో కృపాణ్ ఉండగా మీకు ఇన్ని దెబ్బ లెల్లా తగిలాయి?" అని అడుగుతే. ఆ ముగ్గురూ కూడా ఒకే విధంగా సమాధానమిచ్చారు. "మేము శాంతంగా ఉండడానికి కారణం మమ్మల్ని అహింసాత్మకంగా మెలగ వలసిందని మాకు ఇవ్వబడ్డ ఆజ్ఞే" అని. అడిగిన దాస్‌గారికీ, సమాధానాలు విన్న మాకూ విస్మయమే కలిగింది. సుశిక్షితమైన ఈ పద్ధతిలో ఆ అహింసాత్మక సమరం చాలా రోజులే నడిచింది.

అక్కడనుండి మేము లంగర్‌ఖానా చూడ్డానికి వెళ్ళాము. నేను అంతవరకూ అంత భారీఎత్తున ఏర్పాటయిన వంటసాలలను చూడలేదు. ప్రతీ పావుగంటకీ గుర్రాలమీదనో, గాడిదల మీదనో కావలసిన వస్తు సముదాయం సప్లయి అయ్యే యేర్పాట్లు చేయబడ్డాయి. వంటసాల లోనూ, సామగ్రిని శుభ్రపరిచే జాగాలోనూ కూడా ఘరానా కుటుంబా లకు చెందిన స్త్రీలు ఆహ్లాదంతో సేవ చేయడం గమనించాము. నిజంగా అది ఒక ఆదర్శప్రాయమైన యేర్పాటు. లంగర్‌ఖానాలో తయారైన ఆహారము మాకు వడ్డించి భోజనం పెట్టారు.

## ఉద్యమ విజయం

అకాలీలకు తమ ఉద్యమాన్ని విరమించి దేవాలయాధికార్ల తోనూ, ప్రభుత్వంవారితోనూ రాజీ పడవలసిందని చాలామంది సూచించారు. కాని వారు విరమించడానికి ఎంతమాత్రమూ అంగీకరించ లేదు. ఉద్యమం చాలా తీవ్రతరం అయింది. అక్కడ పోలీసులు సాగిస్తూన్న హింసాకాండని పెద్దలు సహించలేకపోయారు. చూసిన పెద్దలూ, రాజకీయ వేత్తలూ కూడా ఆ హింసా కాండ సహించలేక భారత ప్రభుత్వంవారికీ, పంజాబు ప్రభుత్వంవారికీ కూడా దానిని వెంటనే ఆపవలసిందని టెలిగ్రాము లిచ్చారు. పెద్దలయొక్క, ప్రజల యొక్క ఒత్తిడి అంతకంత కధికమయింది. దాన్తో ప్రభుత్వం వారూ,

దేవాలయాధికారులూ కూడా లొంగక తప్పలేదు. అకాలీలకు దేవాలయ ప్రవేశానికి అర్హత లున్నాయని ఒప్పుకున్నారు.

సిక్కులలో అకాలీలది ఒక శాఖ. వారు నల్లటి తలపాగాలు ధరిస్తారు. సిక్కుమతస్థులకు మత సాంఘికాది విషయాలలో బోధ చేయడమే వారి విధి. అట్లు బోధలు చేస్తూ జీవితాలు సాగిస్తామని వారు ప్రమాణ స్వీకారం చేస్తారు.

మేము అమృతసర్ వెళ్ళినప్పుడు బంగారు దేవాలయం చూశాం. అది సిక్కుల ప్రఖ్యాత దేవాలయం. ఆ రోజులలో కొందరు సిక్కు నాయకులకూ, నాకూ మంచి పరిచయమూ, స్నేహము ఉండేది.

ప్రభుత్వంవారు వారిపై తీసుకుంటూండే చర్యలు చాలా తీవ్రంగా ఉండేవి. పంజాబులోని ఏ అచ్చాఫీసులోనయినా సరే వారి గ్రంథాలు అచ్చువేయకుండా నిషేధాజ్ఞ జారీచేశారు. కాని, వారు ఎట్టి పరిస్థితులలోనైనా సరే, ఎట్టి అడ్డంకులు వచ్చినా సరే పట్టినపట్టు విడువని ధీరులు.

## 'స్వరాజ్య' పలుకుబడి

పంజాబులోని అచ్చాఫీసులో తమ గ్రంథాలు అచ్చువేయుటకు వీలులేని కారణంగా, కొంతమంది అకాలీలు దూరాభారాన్ని లెక్కచెయ్యకుండా, చెన్నపట్నం వచ్చి వారి పుస్తకాల నన్నింటినీ "స్వరాజ్య" ప్రెస్‌లో అచ్చువేయించుకునేవారు. ఒకమాటు, వచ్చినవారు అరడజను మంది అకాలీలే అయినా, వారు చెన్నపట్నం జార్జి టవున్‌లో, ముకరు నల్లముత్తు వీధిలో ఒక యిల్లు అద్దెకి తీసుకుని, వారికి కావలసిన రీతిగా డాబా కూడా వేసుకుని, అచ్చు పనులన్నీ పూర్తయ్యేవరకూ, కొన్ని నెలలపాటు అక్కడే ఉండిపోయారు. పట్నంనుంచి అచ్చయిన పుస్తకాలను వేలకొద్దీ ఇంగ్లాండు, అమెరికా మొదలైన దేశాలకూ, పార్లమెంటు మెంబర్లకూ, బ్రిటిషు కాబినెట్ వారికీ పంపించారు. ఆ రోజులలో స్వరాజ్య ప్రెస్ ఎంత పలుకుబడి సంపాదించిందో, ఎలాంటి స్వాతంత్ర్యాభిలాష కనబరచిందో ఈ ఉదంతంవల్ల తెలుస్తుంది కదా!

ఆ అకాలీ పద్ధతులు బాగా ఆకర్షించడాన్ని తర్వాత కొంత

కాలానికి చెన్నపట్నంలో ఉప్పు సత్యాగ్రహం ఆరంభించిన సందర్భంలో నేను గురుకాబాగ్ పద్ధతులను, భారీ యెత్తున కాకపోయినా, అమలు పరచడానికి పూనుకున్నాను.

ఆ ఉప్పు సత్యాగ్రహపు రోజులలో, చెన్నపట్నంలో ఆ అకాలీల పద్ధతులమీద ఆరంభింపబడిన 'ఉదయవనం' కాంప్ కొన్ని నెలల పాటు మద్రాసు వాస్తవ్యులు ఉచితంగా ఇచ్చిన విరాళాలతో మేమందరం అరెస్టు అయ్యేదాకా చాలా బాగా నడిచింది. దీనిని గురించి ముందు ముందు చెపుతాను.

# 15

## కొన్ని ముఖ్య ఘట్టాలు

నేను 23-2-1923 వ తేదీని వర్కింగు కమిటీ సభ్యత్వానికి అలహాబాదులో రాజీనామా ఇచ్చిన సందర్భంలో, వర్కింగు కమిటీవారి మినిట్సు బుక్కులో, ఇల్లా వ్రాశాను: "చిత్తరంజన్‌దాస్, పండిత మోతీలాల్ నెహ్రూగార్ల ప్రోద్బలంతో, త్రివిధ బహిష్కార సూత్రాన్ని రెండు మాసాలపాటు విరమించ దలుచుకున్నారు. మంచిదే. కాని వారు కట్టెను చీల్చడానికి నాటిన గొడ్డలి మొన ఆ కట్టెను చీల్చడానికే ఉపయోగపడేటట్లు ఈ విరమణ అన్నది నిర్విరామంగా సాగుతుంది." సరిగా ఆ ప్రకారమే జరిగింది. దాస్-మోతీలాల్‌గారలు రెండు మాసాల పాటూ ప్రజల్నీ, ప్రజాహృదయాన్నీ 'కౌన్సిల్ ఎంట్రీ' విధానానికి అనుకూలంగా ఉండేటట్లు, త్రిప్పుకోవడానికిగాను, దేశమంతటా పర్యటించారు. త్రివిధ బహిష్కార విధానానికి విరమణ అన్నది జరగడంతోనే, ప్రజల్లో ఆ విధానంపట్ల ఉన్న గౌరవ భావం సన్నగిల్లింది. ఎప్పుడయితే దాస్-మోతీలాల్‌గార్లు ఆ విషయంలో ప్రజాభిప్రాయాన్ని తమ వైపు త్రిప్పుకోగలమనే ఆశతో యాత్రకు బయల్దేరారో, అప్పుడే మిగిలిన కాస్త గౌరవమూ పూర్తిగా దెబ్బతింది. "సర్వెంట్ ఆఫ్

కాలానికి చెన్నపట్నంలో ఉప్పు సత్యాగ్రహం ఆరంభించిన సందర్భంలో నేను గురుకాబాగ్ పద్ధతులను, భారీ యెత్తున కాకపోయినా, అమలు పరచడానికి పూనుకున్నాను.

ఆ ఉప్పు సత్యాగ్రహపు రోజులలో, చెన్నపట్నంలో ఆ అకాలీల పద్ధతులమీద ఆరంభింపబడిన 'ఉదయవనం' కాంప్ కొన్ని నెలల పాటు మద్రాసు వాస్తవ్యులు ఉచితంగా ఇచ్చిన విరాళాలతో మేమందరం అరెస్టు అయ్యేదాకా చాలా బాగా నడిచింది. దీనిని గురించి ముందు ముందు చెపుతాను.

# 15

## కొన్ని ముఖ్య ఘట్టాలు

నేను 23-2-1923 వ తేదీని వర్కింగు కమిటీ సభ్యత్వానికి అలహాబాదులో రాజీనామా ఇచ్చిన సందర్భంలో, వర్కింగు కమిటీవారి మినిట్సు బుక్కులో, ఇల్లా వ్రాశాను: "చిత్తరంజన్‌దాస్, పండిత మోతీలాల్ నెహ్రూగార్ల ప్రోద్బలంతో, త్రివిధ బహిష్కార సూత్రాన్ని రెండు మాసాలపాటు విరమించ దలుచుకున్నారు. మంచిదే. కాని వారు కట్టెను చీల్చడానికి నాటిన గొడ్డలి మొన ఆ కట్టెను చీల్చడానికే ఉపయోగపడేటట్లు ఈ విరమణ అన్నది నిర్వీరామంగా సాగుతుంది." సరిగా ఆ ప్రకారమే జరిగింది. దాస్-మోతీలాల్‌గారలు రెండు మాసాల పాటూ ప్రజల్నీ, ప్రజాహృదయాన్నీ 'కౌన్సిల్ ఎంట్రీ' విధానానికి అనుకూలంగా ఉండేటట్లు, త్రిప్పుకోవడానికిగాను, దేశమంతటా పర్యటించారు. త్రివిధ బహిష్కార విధానానికి విరమణ అన్నది జరగడంతోనే, ప్రజల్లో ఆ విధానంపట్ల ఉన్న గౌరవ భావం సన్నగిల్లింది. ఎప్పుడయితే దాస్-మోతీలాల్‌గార్లు ఆ విషయంలో ప్రజాభిప్రాయాన్ని తమ వైపు త్రిప్పుకోగలమనే ఆశతో యాత్రకు బయల్దేరారో, అప్పుడే మిగిలిన కాస్త గౌరవమూ పూర్తిగా దెబ్బతింది. "సర్వెంట్ ఆఫ్



కలకత్తా" పత్రికా సంపాదకులు శ్యామసుందర చక్రవర్తిగారు ఈ విషయాలన్నీ చక్కగా వివరిస్తూ తమ పత్రికా ముఖంగా ప్రచురించేవారు.

ఆయన అన్నారు: "దాస్, నెహ్రూగార్లు బహిరంగ సభలో విరాళాల కోసం విజ్ఞప్తి చేసినప్పుడు, దాతలు తాము ఇచ్చే విరాళంలో సగం వారు తీసుకుని, మిగతా సగం గాంధీగారి నో ఛేంజ్ పార్టీవారికి అందచేయాలంటూ వచ్చారు." తర్వాత కొంత కాలానికి నేను బొంబాయిలో ఎస్. పి. బొమ్మంజీ ఇంటిలో దాస్-మోతీలాల్‌గార్లను కలుసుకున్నప్పటి ఉదంతం వినండి. వారు తాము తమ పార్టీకి విరాళాల కోసం వచ్చామని చెప్పారు. "నేను మీ పార్టీవారికి రు. 500/-లు నిరభ్యంతరంగా ఇస్తాను. కాని కాంగ్రెసు పార్టీవారికికూడా, వారు అడక్కపోయినా, అదే ప్రకారం రు. 500/-లు ఇవ్వ నిశ్చయించుకున్నా" నన్నారు బొమ్మంజీ.

కాకినాడలో 1923 డిసెంబరు మాసంలో, కాంగ్రెసు సమావేశం అయ్యేలోపల, గయా కాంగ్రెసు తీర్మానం దాస్-మోతీలాల్‌గార్లు ఛిన్నాభిన్నం చేయగలిగారు. గయా కాంగ్రెసు తీర్మానానికి ఢిల్లీ స్పెషల్ కాంగ్రెసువారు తిరుక్షవరం చేశారన్న సంగతి మరువరానిదే. స్వరాజ్య పార్టీవారికి నవంబరు 23 న జరుగనున్న ఎన్నికలలో పాల్గొనడానికి అనుమతి ఇవ్వడం, గయా తీర్మానానికి తిరుక్షవరమే కదా!

### స్వరాజ్యవాదుల విధానంలో మార్పు

కాకినాడలో డిసెంబరు మాసంలో జరిగిన కాంగ్రెసులో ఢిల్లీ తీర్మానాన్ని ఒక షరతుమీద బలపరిచారు. స్వరాజ్య పార్టీవారు కౌన్సిల్ ఎంట్రీ ప్రోగ్రాంను అన్ని విధాలా అమలు పరచుకోవచ్చు. ఎన్నికలలో నెగ్గి, కౌన్సిల్‌లో ప్రవేశించ వచ్చును. కాని, వారు ఒక్క విషయాన్ని మాత్రం విస్మరించరాదు. ఎన్నోవిధాల అడ్డంకులమీద అడ్డంకులు కల్పిస్తూ, పరిపాలన సాగకుండా, కౌన్సిల్లో కూర్చునికూడా సహకార నిరాకరణ అస్త్రాన్ని ప్రయోగించాలి.

తమ రాష్ట్రంలో ప్రభుత్వ విధానం కొనసాగకుండా కొంత

వరకూ దాస్‌గారు మాత్రమే తంటాలు పడగలిగారు. ఒకమాటు దాస్ గారు సుస్తీగా ఉండి అసెంబ్లీకి వెళ్ళలేని పరిస్థితి ఏర్పడినప్పుడు, ఆయన పార్టీవారు సందిగ్ధంలో పడి, కింకర్తవ్యతా మూఢులయి ఊగిసలాడారు. సంగతులు ఇలా పరిణమిస్తాయనో, పరిణమించాయనో కనిపెట్టిన దాస్‌గార్ని స్ట్రెచ్చర్‌మీద అసెంబ్లీకి తీసుకురావడంతో పరిస్థితి చక్కబడి, సహకార నిరాకరణం చక్కగా సాగింది. ఆ రోజులలోకూడా సహకారాభిలాష ఉండేది.

ఈ విధంగా, లోపల ఉండి అడ్డంకులు తీసుకురావాలనే స్వరాజ్యవాదుల అభిలాష, క్రమేపీ 1924-25 సంవత్సరాల నాటికి, తమ ఉద్దేశాలకు, ఆదర్శాలకూ అనుగుణంగా, దేశసౌభాగ్యానికి దోహదం చేసే తీర్మానాల విషయంలో సహకరించాలనే పద్ధతికి మారిపోయింది.

లార్డ్ బర్కెన్ హెడ్ అప్పట్లో సెక్రటరీ ఆఫ్ స్టేట్‌గా ఉండేవాడు. తియ్యటి మాటలతో స్వరాజ్య పార్టీవారిని మెల్లి మెల్లిగా తనవైపు త్రిప్పుకోగలిగాడు. "భారతీయులు మాకు హృదయపూర్వక సహకారం ఇచ్చిననాడు, మేము పిసినిగొట్లలా బేరాలాడం" అన్నాడాయన. ఇల్లాంటి కబుర్లతో మానవ హృదయాలను ఆకట్టుకోగల శక్తి ఆయనకుంది. 1926 ప్రారంభ దినాలలో, దక్షిణ ఆఫ్రికా భారతీయుల తరపున వైస్రాయితో ప్రసంగించడానికి, పండిత మోతీలాల్ నెహ్రూగారూ, లాలా లజపతిరాయిగారూ కలిసి వైస్రాయి మందిరానికి వెళ్ళినప్పుడు ఆ మాటలు మళ్ళీ విన్నారు. అప్పటికి సహకార నిరాకరణ ఉద్యమం ఆరంభమయి అయిదు సంవత్సరాలయింది.

1922 లో గాంధీగారి నిర్బంధంతో పాలకులు కాంగ్రెసులో విభేదాలు తీసుకు రాగలిగారు. గాంధీగారికి దేశంలో పలుకుబడి తగ్గిందనీ వారికి గ్రాహ్యం అయింది. దాస్-మోతీలాల్‌గార్లు ఎప్పుడయితే తాము నిర్బంధంలో ఉంటూ కూడా, గాంధీగారిని విమర్శింప సాగారో, అప్పుడే గాంధీగారి పలుకుబడి దేశంలో సన్నగిల్లుతోందని నిర్ధారణ అయింది. కాగా ఆ పరిస్థితుల్ని గమనించే, జైళ్ళల్లో ఉన్న దాస్-మోతీలాల్‌గార్లకు, గాంధీగారిని కాదని, రాజీ ప్రతిపాదనలు సూచిం

చారు. అప్పుడే, ఆ రాజీ సూచనల కారణంగానే, దాస్-మోతీలాల్ గార్లకూ, గాంధీగారికీ మధ్య విభేదాలకి అంకుర్పారణ అయింది. స్వరాజ్యవాద నాయకులకు నిరవధికంగా ఆశలు కల్పిస్తూ, వైస్రాయి తన బుద్ధి చాతుర్యం ఉపయోగించి దేశ నాయకులలో చీలికలు తీసుకు రాగలిగా డన్నమాట. ఈ ప్రకారంగా దేశీయుల ఐకమత్యాన్నీ, కాంగ్రెసు బలాన్నీ క్షీణింపజేయడం పాలకుల విధానం అయింది. బర్కెన్ హెడ్ సెంట్రల్ అసెంబ్లీ ప్రాంగణంలో చేసిన (7-7-1925) ప్రసంగంలోని ఆశాజనక వాక్యాలు 20-1-1926న భారత శాసన సభను ప్రారంభిస్తూ రీడింగ్ ప్రభువు పునశ్చరణ చేశాడు.

ప్రిన్స్ ఆఫ్ వేల్స్ పర్యటన సందర్భంలో 1921 లో దేశీయులు అవలంబించి, నడిపించ గలిగిన బహిష్కరణ విధానం, లార్డ్ రీడింగ్‌నీ, ఆయన పరిపాలనా యంత్రాంగాన్నీ ఊపి పారేసింది. అప్పటి నుంచీ ఆలోచనా సాగరంలో మునిగిన ఆ రాజకీయ వేత్తలు, మెల్లి మెల్లిగా స్వరాజ్యపార్టీ నాయకుల హృదయాలలో దౌర్బల్య బీజాలు నాటి, వారికి లేనిపోని ఆశలు కల్పించి, మొత్తంమీద మూడు సంవత్సరాలలో, వారిని మెత్త పడేటట్లు చేశారు. వారి ఉద్యమాన్ని త్రొక్కి పారేశారు. వారి ఆటలు 13-3-1922 లో గాంధీగారి నిర్బంధంతో ఆరంభమయి, ఆయన్ని 5-4-1924 న విడుదల చేసిందాకా, అవిచ్ఛిన్నంగా సాగాయి.

## మోతీలాల్ నెహ్రూ నాయకత్వం

1926 వ సంవత్సరం మార్చి 6, 7 తేదీలలో అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగు ఢిల్లీలో జరిగింది. నేనా మీటింగుకు హాజరయ్యాను. అంతక్రితం సరోజనీదేవి అధ్యక్షతను కాన్పూరులో జరిగిన కాంగ్రెస్‌లో తీర్మానించబడిన ప్రతిపాదనలన్నీ ఈ మీటింగులో బలపరుప బడ్డాయి. అంతేకాదు, స్వరాజ్య సంపానకై తాము చేస్తున్న కృషికి అవరోధంగా, పాలకులు అవలంబిస్తున్న విధానాల నన్నింటినీ ఖండించి, వాటిని శాంతియుతంగా ఎదుర్కోవాలని నిశ్చయించబడింది. ఇంకొక స్పెషల్ తీర్మానంలో కాంగ్రెసు కార్యక్రమానికి నిరోధకమైన

ఉద్యోగాలను వేటినయినా ప్రభుత్వంవారు ఇస్తామని సూచించి నప్పుడు, వాటిని స్వీకరించడానికి ఏ కాంగ్రెసువాదీ ముందుకు రాకూడదనే ప్రత్యేక తీర్మానమున్నూ ఆమోదించబడింది. పైగా, ఆ కాంగ్రెసు జరుగుతూన్న రోజులలోనే హిందూస్థాన్ సేవాదళ నిర్మాణానికి అంకురార్పణ జరిగింది. సేవా దళాన్ని గురించి వివరంగా తర్వాత తర్వాత విస్తరిస్తాను.

స్వరాజ్యపార్టీ లీడరుగా రాజకీయ రంగంలో పేరుగన్న మోతీలాల్ నెహ్రూగారి దుర్బలత్వం, ఆయన స్కీన్ (skein) కమిటీ[1] మెంబరుగా ఉండడానికి అంగీకరించడంతో బయల్పడింది. వారి పార్టీ సభ్యులు పార్టీ మూలసూత్రాలనే ఉల్లంఘించే సందర్భంలో, మోతీలాల్‌గారే స్కీన్ కమిటీ సభ్యత్వం అంగీకరించగా లేనిది, మేము చేసింది ఏ విధంగా తప్పవుతుందో చెప్పమనడానికి అది వీలిచ్చింది. నిజంగా స్వరాజ్య పార్టీవారే గనుక సంపూర్ణ సహకార విధానాన్ని చేపట్టి ఉంటే వారు ఇతోధికంగా జయాన్ని సాధించి ఉండేవారు.

కొన్ని కొత్త స్కీములను ప్రవేశ పెట్టాలనే సదభిప్రాయంతో, సెంట్రల్ అసెంబ్లీ స్వరాజ్య పార్టీవారు చేసిన ప్రతిపాదనానుసారంగా ఏర్పడిన మడ్డిమన్ (Muddiman)[2] కమిటీ సభ్యత్వం కూడా వారిని వరించి ఉండేది.

పూర్తి సహకార విధానానికే గనుక, దాస్-మోతీలాల్‌గారలు అనుమతించి ఉండి ఉంటే, వారినీ, వారి విధానాన్నీ, సహకార నిరాకరణ ఉద్యమ మూలసూత్రాలకే మోసం కలుగుతుందనే మిషమీద, కాంగ్రెసువారు త్రోసిపుచ్చేవారు. వారుభయులూ బాగా తెలివి గల

---

1. మాంట్‌ఫర్డ్ సంస్కరణలు పనిచేస్తూన్న విధానం గురించి విచారించడానికి 1924లో ఈ కమిటీ నియమించబడింది.

2. శాండర్స్ట్ (Sandhurst) కళాశాలతో సమానమైన ఒక సైనిక కళాశాల మన దేశంలో కూడా స్థాపించాలన్న ప్రతిపాదన సాధక బాధకాలు విచారించడానికి ఈ కమిటీ నియమించబడింది.

లాయర్లు. పైన ఉండి సహకార నిరాకరణ చెయ్యవలసిందని చెప్పిన గాంధీగారూ, లోన జొరబడి సత్యాగ్రహం సాగించమని ప్రబోధించిన దాస్-మోతీలాల్‌గార్లూ ఉద్యమాలు సాగించి ఉండి ఉంటే, కౌన్సిల్ లోపల ఉండిన వారి సహకారం కాంగ్రెసును ఛిన్నాభిన్నం చేయడానికి మాత్రమే ఉపకరించి, బైటనుంచి గాంధీగారు నడిపించే సహకార నిరాకరణ విధానానికి పెద్ద దెబ్బగా ఉండేది.

## పగటికలల పరిసమాప్తి

స్వరాజ్యవాదులు లోన ప్రవేశించి పరిపాలనా యంత్రాన్ని బల హీనం చేయదమన్న విషయంలో అపజయాన్ని పొందినా, కాంగ్రెసునూ, గాంధీగారినీ బలహీనంచేసి, కాంగ్రెసు వ్యవస్థను ఛిన్నాభిన్నం చేయడంలో మాత్రం జయాన్ని సాధించారు. వాదోపవాదాలు సాగించే సందర్భంలో వారు, తాము అవలంబించే విధానానికి లక్షలాది జనుల అనుమతిని పొందలేరనే విషయాన్ని గ్రహించ లేకపోయారు. పైగా అసెంబ్లీలోని తోటి వారంతా కలసినా, వారికంటె బలవంతులు కాలేరన్న సంగతి కూడా వారు గ్రహించి ఉండరు. అంతేకాదు, వారికున్న దుర్బలత్వంచేత క్రమేపీ వారి పార్టీ శక్తిహీనమయి, క్షీణించి క్షీణించి నశించేది. లార్డ్ రీడింగ్ స్వరాజ్యపార్టీ నాయకులతో ఇంకా బేరాలు పెడుతూన్న నాటికి వారి పరిస్థితి అల్లా ఉండేది.

1926 ప్రారంభ దినాలలో, సెంట్రల్ అసెంబ్లీలో జరుగుతూన్న బడ్జెట్ మీటింగులకు మోతీలాల్ నెహ్రూగారు, తమ పార్టీతో సహా వెళ్ళినప్పుడు వారి కళ్ళు పూర్తిగా తెరువబడి, అంతవరకూ వారు కంటూ ఉన్నవి పగటి కలలేనని తెలిసికో గలిగారు. ప్రభుత్వం వారు సకాలంలో సవ్యంగా సహకరించి సంచరించకపోతే దేశం అంతటా 'రకరకాల సంఘాలు' ఏర్పాటవుతాయి, జాగ్రత! అని హెచ్చరిస్తూ, వారూ వారి పార్టీవారూ అసెంబ్లీ చర్చలలో పాల్గొనకుండా బైటకు వచ్చేశారు.

మోతీలాల్ నెహ్రూగారు, తానూ తన పార్టీవారూ తిరిగి

సహకార నిరాకరణ కార్యక్రమానికి దిగుతాం అని చెప్పడానికి బదులు, రహస్య సంఘాల స్థాపన ప్రస్తావన తీసుకు వచ్చారు. ఆయన ఆవేశ పూరితు లయినప్పుడు, తాను ఉచ్చరిస్తూన్న పదాలు ఎటువంటి పరిణామాలకు తీసుకు వెడతాయోనన్న ఆలోచనలేకుండా, తొందరపాటుతో ఇల్లా కాస్త తబ్బిబ్బు అవడం మామూలే. అప్పట్లో బెంగాలులో విప్లవ వాతావరణం తల ఎత్తడమూ, దానిని ప్రభుత్వం దయాదాక్షిణ్యాలు లేకుండా ఛిన్నాభిన్నం చెయ్యడమూ జరిగాయి. చైనా, జపాను మొదలైన దేశాలలో ఉన్నట్లుగా మన దేశంలో అలాంటి రహస్య సంఘాల స్థాపనకు అనువైన వాతావరణం లేకపోయినా అలజడి మాత్రం కలిగింది. అంతేకాదు, అటువంటి విప్లవ వాద సంఘాలను గురించి మోతీలాల్ వంటివారు ప్రస్తావించారంటే వారికి అహింసా తత్వంమీద అపనమ్మకం ఉందా అనే అనుమానం కలుగుతుంది.

ఆ రోజులలో నేను విస్తారంగా విదేశాలలో పర్యటిస్తూ ఉన్నప్పుడు, ఇలాంటి రహస్య సంఘాల, సంచలనాల వార్తలు చెవిని బడుతూనే వుండేవి. నేను సింగపూరులో 1920 లో పర్యటిస్తూండగా పరిచయం ఉన్న ఒక డాక్టరుగారి కారులో, ఆయనతో కలిసి ఆ పరిసరాలలో ఉన్న ఒక గ్రామానికి వెళ్లాను. ఆ కారు స్వయంగా డాక్టరుగారే నడుపుతున్నాడు. ఆ రాత్రి తిరుగు ప్రయాణంలో రోడ్డుమీద మాకు ఒక శవం కనబడింది. ఆయన కారు ఆపుజేశారు. ఉభయులమూ దిగి ఆ శరీరాన్ని పరీక్ష జేశాము. శరీరంనిండా తుపాకీ తూట్లు కనబడ్డాయి. డాక్టరుగారు ఆ విషయాలన్నీ తమ నోటు బుక్కులో నోటు చేసుకున్నాకనే ముందుకు సాగాము. కొంతదూరం వెళ్ళాక మాకు దారిలో ఇద్దరు ముగ్గురు వ్యక్తులు తారసపడ్డారు. డాక్టరుగారు కారు ఆపుజేసి, భోగట్టా చేశారు. అంతక్రితమే రోడ్డుమీద రెండు రహస్య సంఘాలమధ్య ఘర్షణ జరిగిందనీ, ఇరుపక్షాలకు మధ్యా బాహాటంగా కాల్పులు జరిగాయనీ వారు చెప్పారు. సాధారణంగా సంఘర్షణ జరిగిన వెంటనే చనిపోయినవారి శవాలను అంతు చిక్కకుండా తొలగించేస్తారని వారు అన్నారు. ఆ దేశం మొత్తంమీద

చాలా రహస్య సంఘాలు ఉన్నాయనికూడా వారు చెప్పారు. బెంగాలులో తల యెత్తిన విప్లవ సంఘాలను ఆంగ్లేయ ప్రభుత్వంవారు భారతీయ ఉద్యోగులచేతనే వెనువెంటనే అణగద్రొక్కించారు.

ఆ విప్లవోద్యమం అంతం అవుతూన్న రోజులలోనే, నెహ్రూగారి పూర్తి సలహా సంప్రతింపులతోనే, గాంధీగారు అక్కడ ఈ అహింసాత్మక సహకార నిరాకరణ ఉద్యమం స్థాపించడం జరిగింది. కాని, కొద్ది రోజులలోనే పుంజుకున్న గాంధీగారి సత్యాగ్రహ విధానం మోతీలాల్‌గారికి అంతగా నచ్చలేదు. నిజానికి గాంధీగారి విధానపు బలిమి ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాక సందర్భంలో రుజువైనా, తాము చెప్పినా గాంధీగారు వైస్రాయి రాజీ ప్రతిపాదనలకు ఒప్పుకోక పోవడంచేత, మోతీలాల్‌గారికి గాంధీగారి విధానంపట్ల విముఖత్వం ఏర్పడింది. గయా కాంగ్రెసు తరువాత గాంధీగారి కార్యక్రమం క్రమంగా మూలబడింది; ఆయన జైలుకు వెళ్ళిన ఏడాదిలోపలే త్రివిధ బహిష్కారోద్యమం రెండు మాసాలపాటు నిలుపు చేయబడిన సంగతి 1924 ఫిబ్రవరిలో విడుదలై వచ్చిన గాంధిగారు తెలుసుకుని తన ముఖ్య అనుచరులే తన విధానానికి అనుకూలంగా లేరనే విషయాన్ని, అప్పటి పరిస్థితిని గ్రహించి, ఆయన శాసన సభా ప్రవేశానికి ఒప్పుకున్నారు. అయినప్పటికీ మోతీలాల్‌గారికి పూర్తిగా సంతుష్టి కలుగలేదు.

గాంధిగారిని 1924 లో హాస్పిటల్‌నుంచి విడుదల చేశాక అహమ్మదాబాదులో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ సమావేశ సందర్భంలో ఆయన్ని కలిసికొని, ఆయన జైలుకు వెళ్ళినదాదిగా జరిగిన సంఘటనల నన్నింటినీ నేను ఎరుక పరిచాను. ఆయన సన్నిహితులే ఆయన మార్గానికి నిరోధకులవుతున్నారన్న విషయాన్ని సూచిస్తూ, మహమ్మదాలీ మున్నగు వారందరూ ఆయన్ని ద్రోహం చేశారని చెప్పాను. కాని నా మాటలయందు వారికి అంతగా విశ్వాసం కలిగినట్లు లేదు. సింధు దేశీయుడైన చొత్రాంగారు ఈ సంగతే తిరిగి చెప్పిన తర్వాత సభలోనే గాంధిగారి కళ్ళనుండి నీళ్ళు కారాయి.

సన్నిహితులయిన అనుచరుల సంగతి సందర్భాలు ఎల్లా ఉన్నా,

దేశం మట్టుకు ఎప్పుడూ గాంధిగారి పక్షంగానే ఉన్నదన్న సంగతి బెల్గాం కాంగ్రెసులో రుజువయింది. బెల్గాం కాంగ్రెసులో దాస్-మోతీలాల్ నెహ్రూగార్లని కాదని, వారి పార్టీని వోడించి, గాంధి గారి విధానాన్ని పునఃప్రతిష్ఠజేశారు. అయితేనేం, తాను తక్కువ మెజారిటీతో గెలవడంచేత గాంధిగారు, తమ పార్టీవారికి ఏదో భీతి ఉన్నదనే నిర్ధారణకు రాక తప్పదంటూ, కాంగ్రెసును దాస్-మోతీలాలుల పరం చేశారు.

## పార్టీలో విభేదాలు

స్వరాజ్య పార్టీవారు శాసన సభా ప్రవేశంచేసి రెండు సంవత్సరాలు (1924-25) వ్యవహరించిన సందర్భంలో వారిలో వారికి అభిప్రాయభేదాలు వచ్చి, పేచీలు, కీచులాటలు, పిల్ల సమ్మెరీలు ఆరంభం అవడం మూలంగా ఆ పార్టీ తన పలుకుబడిని కోల్పోయింది. కౌన్సిల్ లోపల ఉంటూనే దానిని తిరగతోడుదాం, దాని కార్యక్రమం, రాజ్యాంగ విధానం సాగకుండా వ్యవహరిద్దాం అంటూ వచ్చినవారే క్రమేపీ నీళ్ళు కారిపోయి పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రం అనడంలో అర్థంలేదు.

తమ ఉద్దేశాలకు ఆదర్శాలకూ అనుగుణంగా-దేశక్షేమానికి ఉపకరించే వ్యవహారాలలో ప్రభుత్వంతో సహకరిస్తూ, అనుమానాస్పదమైన విషయాలలో ప్రాతికూల్యం వహిస్తూ "ప్రతిస్పందన సహకారిత్వం" (responsive co-operation) అనే నూతన విధానాన్ని స్వరాజ్యవాదులు చెన్నరాష్ట్రంలోనే గాక, ఇతర రాష్ట్రాలలో కూడా చేపట్టడం జరిగింది. కాగా, కొంతమంది కాంగ్రెసు సేవకులకు ప్రభుత్వోద్యోగాలమీద మోజు కలిగింది. మొత్తానికి, ఏదో విధంగా స్వరాజ్య పార్టీవారు రాజకీయంగా దిగజారిపోయారు. లోపల ఉండి దెబ్బతీస్తాం, రాజ్యాంగ విధానాన్ని సాగనివ్వం, తిరగతోడుతాం అంటూ బీరాలు పలికిన స్వరాజ్య పార్టీవారే, వారి మధ్య ఉత్పన్నమైన భేదాభిప్రాయాలకు తట్టుకోలేక, దెబ్బతిని, పార్లమెంటరీ పద్ధతికి దిగజారి, రాజ్యాంగాన్ని తామే చేపట్టి తంటాలు పడేవరకూ వచ్చారు.

## సబర్మతిలో కుదిరిన రాజీ

ప్రజాభిప్రాయంతో నిమిత్తం లేకుండా ద్వంద్వ ప్రభుత్వ పద్ధతిని రాజ్యాంగ విధానాన్ని నడపడానికి ముగ్గురు మంత్రులు ఏర్పడడం అంటూ జరిగాక, ఈ పెద్ద నాయకు లంతా తమలో ఏర్పడిన అభిప్రాయ భేదాలనీ, చీలికలనీ సరిదిద్దుకుని తిరిగి ఒకే తాటిమీదకు రావడానికని, గాంధిగారి సబర్మతీ ఆశ్రమంలో సమావేశం అయ్యారు.

స్వరాజ్యపార్టీ మొత్తంమీద మూడు విభాగాలయింది: కొందరు అసలు అనుకున్న ప్రకారం ప్రభుత్వం సాగకుండా అడ్డంకులు తేవాలనేవారు, అవసరం అని తోచినప్పుడల్లా దేశానికి క్షేమకరమయిన ప్రతిపాదనల విషయంలో సహకరించాలనే "ప్రతిస్పంద సహకార" పద్ధతివారూ, పూర్తిగా ప్రభుత్వానికి అన్నిరంగాలలోనూ సహకారాన్ని ఇవ్వాలనేవారు.

అందులో అవసరాన్నిబట్టి సహకరిద్దాం, పూర్తిగా సహకరిద్దాం అనే వర్గాలవారు తమ ప్రణాళికనుండి సహకార నిరాకరణం, సత్యాగ్రహం, శాసన ధిక్కారం అనే పదాలను ఎత్తివేద్దాం అనే నిశ్చయించుకున్నారు.

దరిమిలా 21-4-1926 తేదీన సబర్మతీలోనే జరిగిన సభలో పై రెండు వర్గాల వారూ ఒక విధంగా ఒప్పందానికి వచ్చి, మంత్రులకు ప్రజాభిప్రాయాన్ని మన్నించగల శక్తి కలిగిననాడు ద్వంద్వ ప్రభుత్వ విధానంగా సహకరించి పరిపాలన సాగిద్దాం అనే నిశ్చయానికి వచ్చారు. కాని అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు ఈ విధానానికి ఒప్పుకుంటేనేగాని నిర్ణయం అమలు పరచరాదని భావించారు. బ్రిటీషు గవర్నమెంటువారు మంత్రులు ప్రజలకే జవాబుదారీ అనే సూత్రాన్ని అంగీకరించి నట్లయితే, వారు 1924 ఫిబ్రవరిలో తాము వెలిబుచ్చిన కోరిక * ఒప్పుకున్నట్లుగా, భావిస్తామన్నారు. వారిలో రాజ్యాంగాన్ని

---

* భారత దేశంలో సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వ ప్రణాళికను సిఫార్సు చేసే నిమిత్తం రౌండు టేబిలు సభను సమావేశ పరచాలని కోరారు.

చేపట్టాలనే కోరిక అంత ముమ్మరంగా ఉందన్నమాట.

ఈ విధానానికి లోబడిపోతూన్న స్వరాజ్యవాద నాయకులను, 1925 లో కాన్పూరు కాంగ్రెసు తీసుకున్న నిర్ణయాన్ని పునరుద్ఘాటించి, పతనం ఎంతవరకూ వచ్చిందో గ్రహించి మరీ వ్యవహరించమని హెచ్చరించకుండా, ఉండలేకపోయాను నేను.

కాన్పూరు కాంగ్రెసువారి మొదటి తీర్మానానికి పండిత మాలవ్యాగారు సవరణ సూచించారు. ఆ సవరణను జయకర్‌గా రంగీకరించి బలపరిచారు. దాని ప్రకారం, దేశానికి అనువయిన పరిపాలనా విధానాన్ని అమలు పరిచే నిమిత్తం శాసన సభా కార్యకలాపాలు ఉత్తేజ పరచాలనీ, అప్పుడే ప్రతినిధులు ప్రభుత్వం వారితో సహకరించడమో, రాజ్యాంగాన్ని నిరసించడమో త్వరగా తేలుతుందన్నారు. ఈ సవరణ ఆమోదించబడింది.

జయకర్, హోల్కార్, మూంజీగారలు స్వరాజ్య పక్షీయులలో వచ్చిన విభేదాలవల్ల రాజ్యాంగ సభా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. దీనికి ముందుగా అఖిల భారత స్వరాజ్యపార్టీ కమిటీవారి మీటింగులో స్వరాజ్యవాదుల మధ్య రాజీ ప్రతిపాదన ప్రసక్తి వచ్చింది. మోతీలాల్ నెహ్రూగారు మంత్రి పదవిని చేపట్టడం విషయంలో తానున్న పరిస్థితినీ, తన సాధక బాధకాలనీ వ్యక్తపరిచారు.

## పదవీ స్వీకరణ సమస్య

ఆ తరవాత మోతీలాల్‌గారు పదవీ స్వీకరణం గురించి, స్వరాజ్యవాదుల పద్ధతి ప్రకారం ఈ దిగువ షరతులు అంగీకరింపబడా లన్నారు.

1. ప్రభుత్వం వారికి మంత్రులపై ఎలాంటి ఆధిపత్యమూ ఉండకూడదు. మంత్రులు శాసన సభా మర్యాదలను పాటిస్తూ, వాటికి అనుగుణంగా నడవాలి.

2. జాతీయ ప్రణాళికావసరాలకు కావలసిన ధనం ప్రత్యేకింపబడాలి.

3. తమ అధీనం చేయబడిన అంశాల నిర్వహణ సవ్యంగా

సాగించుకొనడానికి మంత్రులకు వాటికి సంబంధించిన ప్రభుత్వోద్యోగులపై అధికారం ఉండాలి.

సబర్మతీలో అంగీకారం పొందిన విధానాలకు ఈ విషయం అనుగుణంగా లేదంటూ జయకర్‌గారు ఈ ప్రతిపాదనను వ్యతిరేకించారు. ఇలాంటి పరిస్థితులలోనే నేను కాన్పూరు తీర్మానాలకన్నా సబర్మతీ నిర్ణయాలు హీనంగా ఉన్నాయని అనవలసి వచ్చింది.

1926 మే 5 వ తేదీన అహమ్మదాబాదులో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో ఈ తేడా పాడాల వల్లనే స్వరాజ్య పార్టీలోని రెండు ముఖ్య విభాగాల వారికీ పొత్తు కుదరలేదని మోతీలాల్ నెహ్రూగారే బహిరంగపరిచారు. ఈ పరిస్థితులలో మద్రాసువారు సబర్మతీ నిర్ణయాలకు వ్యతిరేకు లయ్యారు. అప్పుడు మోతీలాల్‌గారు అనిబిసెంట్‌గారి కామన్‌వెల్త్ ఆఫ్ ఇండియా బిల్లును ఆమోదంకోసం అఖిల భారత కాంగ్రెసు సంఘం వారిముందు ప్రతిపాదించారు. దానికి మేము వ్యతిరేకించాము.

1925 లో చిత్తరంజన్‌దాస్‌గారు ఫరీద్‌పూరులో స్వరాజ్య పార్టీ పేరుమీద కొన్ని షరతులు ప్రతిపాదించి, వాటిని ప్రభుత్వం వారు అంగీకరించాలని హుంకరించే ఉన్నారు. పైగా తన ప్రతిపాదనలు అంగీకారం కాకపోతే ప్రభుత్వంవారికి తాము ఇస్తున్న సహకారం ఆపివేయబడుతుం దన్నారు. ఆంగ్లేయ పరిపాలకులు తమ శక్తి సామర్థ్యాలను గ్రహించి గౌరవిస్తారనే యోచనతో ఆ స్వరాజ్య పార్టీనాయకులు ఇలాంటి ద్వంద్వ విరుద్ధ ప్రతిపాదనలతో చాలా తికమకలు కలుగజేశారు. ఈ ప్రకారంగా అన్ని విధాలా స్వరాజ్య పార్టీ వారు దెబ్బ తిన్నారు. సహకార నిరాకరణానికి వ్యతిరిక్తత ప్రకటించినంతమాత్రాన గాని, దానిని గురించి ప్రబోధం చేసినంత మాత్రానగాని ఆంగ్లేయులు లొంగిపోరన్న విషయం ఆదిలో దాస్-మోతీలాల్ నెహ్రూగార్లకు అవగాహన కాలేదు.

1924 ఫిబ్రవరిలో స్వరాజ్య పార్టీవారు కేంద్ర శాసన సభలో అధికారరీత్యా తమ కోరికలు వెలిబుచ్చారు. 1925 లో జరిగిన

కాన్పూరు కాంగ్రెసులో కూడా వాటిని వ్యక్తపరిచారు. కాగా, వారిలో ఉన్న రెండు విభాగాల వారికీ పొత్తు కుదిరిన కారణంగా, మూడు-నాలుగు మాసాలలో తిరిగి హెచ్చరిక జేశారు.

మంత్రులు శాసనసభాసభ్యులకుపూచీదారులయితే, తాము 1924లో వ్యక్తపరిచిన కోరిక ప్రభుత్వం వారికి సమ్మతమైనట్టే భావిస్తామన్నారు. తిరిగి ఫరీదుపూర్‌లో దాస్‌గారు తమ కోర్కెలను సవ్యంగా తీర్చకపోతే సహకారం అన్నది మృగ్యం అయిపోతుందనీ బెదిరించారు. ఈ ప్రకారంగా స్వరాజ్య పార్టీవారు అనేక విధాల తబ్బిబ్బులయ్యారు.

గాంధీగారి ఆధ్వర్యవంలో ప్రారంభమైన సత్యాగ్రహోద్యమపు ఉద్రిక్త పరిస్థితులలో స్వరాజ్యవాదులు చాలా త్యాగాలు చేశారన్నది నిజమే అయినా, వీరికీ, పాతకాలపు మితవాదులకూ దృఢసంకల్పం తక్కువ. దేశావసరాలను గుర్తించీ, ప్రజాక్షేమం లక్షించీ కాంగ్రెసు వారు వెల్లడిస్తూ వచ్చిన కోర్కెలను మన్నించడానికి స్థిరసంకల్పంగాని ధైర్యంగాని వీరిలో లేవనే అనవలసి వస్తుంది. పాతకాలపు స్వేచ్ఛావాదుల విషయంలోలాగే ఈ స్వరాజ్య పార్టీవారి ప్రతిపాదనలకూ, ప్రజాభిప్రాయాలకూ సంబంధం తక్కువే. వాటికి పొంతన లేదనే చెప్పాలి. కాగా, అటు ఆంగ్లేయ అధికారుల వరస చూస్తే - లార్డ్ రీడింగూ, బర్కెన్‌హెడ్డూ కూడా అఖండులు. ఈ ఆంగ్ల రాజకీయ వేత్తల కుత్సితపు వాగ్దానాలు పయోముఖ విషకుంభాలే అయినా, మన వారికి తంత్రజ్ఞత తక్కువ అవడంచేతనో యేమోగాని, లేనిపోని ఆశలు వారి హృదయాలలో రేకెత్తాయి. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాక సందర్భంలో దేశీయులలో కనిపించిన ఐకమత్యానికి కలవరపడి, క్రిందు మీదయిన రీడింగ్ ప్రభువు తన జిత్తులమారితనంతో ఎత్తుపై ఎత్తులు వేస్తూ, తాను రిటైరయ్యేనాటికి కాంగ్రెసు పార్టీలో చీలికలు కల్పించి కృతకృత్యుడయ్యాడు.

ఈ ప్రకారంగా కాంగ్రెసులో బయల్దేరిన అభిప్రాయ భేదాలూ, చీలికలూ ఒక ప్రక్కనుంచీ, హిందూ మహమ్మదీయ కలహాలూ, కల్లో

లాలూ ఇంకో ప్రక్క నుంచీ జాతీయోద్యమాన్ని దిగలాగాయి. లార్డ్ రీడింగ్ వైస్రాయిగా రిటయిరై ఇర్విన్ ప్రభువునకు రాజ్యాంగాన్ని ఒప్పగించిన రోజు ఎటువంటిదోగాని, ఆనాడే, ఆ 1926 ఏప్రియల్ 6 వ తేదీనాడే, అదే ఘడియలలో హిందూ మహమ్మదీయ సంఘర్షణలు చెలరేగి, ఉద్రిక్త పరిస్థితికి దారితీశాయి.

# 16

## మతవర్గాల మధ్య మళ్ళీమళ్ళీ కలహాలు

ముల్తాన్‌లో 1922 లో హిందూ మహమ్మదీయ సంఘర్షణలు సంభవించింది మొదలు, ఏటేటా వివిధ ప్రాంతాలలో హిందూ మహమ్మదీయ కలహాలు జరుగుతూనే వచ్చాయి. నేను కేంద్ర సభలో సభ్యుడుగా ఉంటూ కూడా, 'స్వరాజ్య' పత్రికా నిర్వహణ చూసేవాడిని. ముల్తాన్ కొట్లాటలు లగాయితు దేశంలో ఎక్కడ ఏ మారుమూల కొట్లాటలు జరిగినా అక్కడికి హుటాహుటీ వెళ్ళేవాడిని. ముల్తాన్ సంఘటనలు జరిగి సంవత్సరం తిరగకుండానే షహజాన్‌పూరులో కొట్లాటలు చెలరేగి, తర్వాత మీరట్‌లోనూ, బెరిల్లీలోనూ జరిగిన కొట్లాటలు ఇతర ప్రాంతాలకు ప్రాకి, నాగపూరు, లాహోరు, కలకత్తాలలో కూడా సంఘర్షణలు జరిగాయి.

ముల్తాన్ కొట్లాటల నాటికి నేనింకా వర్కింగు కమిటీ మెంబరుగా ఉంటూ ఉండడాన్ని, ఇతర మెంబర్లతో కలసి ముల్తాను వెళ్ళానని లోగడ తెలిపి ఉన్నాను. మదనమోహన మాలవ్యా, హకీం అజ్మల్‌ఖాన్, అబ్దుల్ కలాం అజాద్, రాజేంద్రప్రసాద్, జమన్‌లాల్ బజాజ్, వల్లభ్‌భాయి పటేల్, సి. రాజగోపాలాచారిగార్లు, నేను కలిసే ముల్తాన్ వెళ్ళాము. అక్కడి సంగతులన్నీ స్వయంగా విచారించి సంగతి సందర్భాలు సవ్యంగా గ్రహించాలనేదే మా ఉద్దేశం. స్వరాజ్య పత్రికా సంపాదకునిగా కూడా నాకు ఈ విషయాలు ఆమూలాగ్రంగా గ్రహించాలనే ఆదుర్దా ఉండేది.

మాకు కనబడిన దృశ్యం చాలా బీభత్సంగానూ, భయోత్పాతంగానూ ఉంది. తగల బెట్టబడిన షాపులూ, హత్యలు జరిగిన తావులూ, కొల్లగొట్టబడిన ఆలయాలూ, విరగ్గొట్టబడిన విగ్రహాలూను. ఎక్కడ చూచినా ఇదే దృశ్యం. ముఖ్యంగా ఆరు అడుగుల ఎత్తూ, మూడడుగుల వెడల్పూ గలిగిన సుందర విగ్రహం ఒకటి రెండు ముక్కలుగా పడి ఉండడం ఇంకా, ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా, నా కళ్ళకు కట్టినట్లే ఉంది. అందమయిన ఆడవారు తమకు జరిగిన అన్యాయాలను గురించి విన్నవించుకోడానికి మమ్మల్ని చుట్టుముట్టారు. వారు స్త్రీ జన సహజమయిన సిగ్గూ, లజ్జా వదలి బాహాటంగా కమిటీవారి ఎదుట తమకు జరిగిన అవమానాలూ, మానాపహరణాలూ చెప్పలేకపోయారు. పాపం, వారు ఆ పద్మాషుల చేతులలో ఎంతెంత బాధలు అనుభవించారో కదా! ఆ హృదయ విదారక విషయాలన్నీ స్వయంగా విన్నవారిలో ఒక్క మాలవ్యాగారు మాత్రమే నిగ్రహించుకో గలిగారు.

### హిందూ వనితను కాపాడిన మహమ్మదీయ స్త్రీ

ఒక మహమ్మదీయ స్త్రీ సాక్ష్యాన్ని తీసుకోవడానికి మమ్మల్ని ఒక మహమ్మదీయుని ఇంటికి తీసుకు వెళ్ళారు. ఆమె పరదా వెనుక నుంచే సాక్ష్యం ఇచ్చింది. ఒక హిందూ యువతిని రౌడీలు ఎల్లా తరిమారో, ఆమె ఎల్లా ఎల్లా తప్పించుకుని తన యిల్లు జొచ్చి రక్షణ కోరిందో అన్నీ వివరించింది. ధైర్యం వహించి ఎల్లా తను ఆ అమ్మాయి లోపలికి ప్రవేశించిన వెంటనే గఖాల్నా తలుపులు బిగించి, గూండాల రాకను అరికట్ట గలిగిందీ వర్ణించింది. ఆ అమ్మాయిని బైటకు పంపించకపోతే వారు ఇల్లెక్కి పెంకులు ఊడదీసి అల్లరి పెడతాం అని యెంత బెదిరించినా లొంగక ధైర్యంగా ఆ పిల్లకు రక్షణ యిచ్చింది. ఆమె చెపుతూన్న యీ గాథ విన్న మా కమిటీ మెంబర్ల కందరకూ కళ్ళవెంబడి నీళ్ళు కారాయి. మేము ముల్తాను వదిలే లోపల మాకు విడిదిగా ఇవ్వబడిన ధర్మశాల ఆవ

రణలోనే ఒక సభ యేర్పాటు జేశాం. స్త్రీల గోడంతా విన్న మాలవ్యా గారు సుదీర్ఘ ఉపన్యాసం చేశారు. ఆ ఉపన్యాస మధ్యలో ఆయన కళ్ళవెంబడి ధారాపాతంగా నీళ్ళుకారాయి. హిందువులకు ప్రభుత్వం వారి చేతులలో రక్షణ కలగడం దుర్లభమనీ, ముమ్ముందు ప్రజలే జట్లు జట్లుగా ఏర్పడి ఆత్మరక్షణ చేసుకోవాలనీ సూచిస్తూ, హింసను హింస తోనే ఎదుర్కొని అయినా ఆత్మరక్షణ చేసుకోవాలనీ, బలవంతంగా మతం మార్చుకోవలసిన కుటుంబాలవారు "శుద్ధి" క్రియతో తిరిగి హిందూ మతంలో పూర్వస్థానాలు పొంది, ఆయా కులాలకే చెందే లాగున చేయాలనీ ఉద్ఘాటించారు. అటువంటి పరిస్థితులలో ఆ ప్రకా రంగా శుద్ధి అన్నది కాంగ్రెసువారి ప్రాపకంలో బలం చేకూర్చుకుంది.

### స హ జీ వ న సౌ భా గ్యం

వార్తాపత్రికలలో ప్రచురించబడిన వార్తలనుబట్టి 'రంజాం' పండుగ సందర్భంగా ఏర్పాటయిన ఉత్సవాలమీద రాళ్ళు పడడంతో యీ రగడంతా ఆరంభం అయినట్లు కనబడుతుంది. వార్తలలోని నిజా నిజాలు గ్రహించాలనే తలంపుతో ముమ్ముందుగా యీ గలాటాకు పూర్వం హిందూ మహమ్మదీయ ప్రజల మధ్య సామరస్యం ఏ తీరున ఉండి అనే విషయం గ్రహించాలని తలచాము. పరిస్థితులు అనుకూ లించినప్పుడు సేకరించిన సమాచారమంతా సమగ్రంగా నా 'స్వరాజ్య' పత్రికలో ప్రచురిద్దాం అనే ఉద్దేశంతో వివరంగా తెలియవచ్చిన వార్తలూ, గ్రహించగలిగిన సత్యాలూ వ్రాసుకున్నాను. అచ్చట హిందూ మహమ్మదీయుల మధ్య మైత్రి చాలా మంచి స్థాయిలోనే ఉండేది అన్న గట్టి నమ్మకం మా కందరికీ కలిగింది.

ఒక మసీదుకూ, ప్రఖ్యాత ప్రహ్లాద దేవాలయానికీ మధ్య సరి హద్దుగా ఒక మామూలు గోడ మాత్రమే ఉందనీ, మసీదులోని ప్రార్థ నలూ, ఆలయంలోని అర్చనలూ అంతరాయాలు లేకుండా యుగయుగా లుగా సాగుతూ వచ్చాయనీ గ్రహించాం. ప్రహ్లాదుని జన్మస్థానం ముల్తాన్. అచ్చటి ప్రహ్లాద ఆలయం చాలా పురాతన మయినదే. ఆ

ఆలయం సరిహద్దులలోనే మసీదు నిర్మాణం కాకతాళీయంగా జరిగింది. ఆలయపు అర్చనలూ, మసీదు ప్రార్థనలూ ఎన్ని సంవత్సరాలనుంచో అవిచ్ఛిన్నంగా సాగుతున్నాయన్న విషయమై ద్వంద్వాభిప్రాయం లేదు. హిందూ మహమ్మదీయ సామరస్యం సవ్యంగానూ, ఆదర్శవంతంగానూ ఉండేదన్న విషయానికి ఇంతకన్నా ప్రబలమయిన సాక్ష్యం ఏముంటుంది?

## ఎన్నికలు తెచ్చిన ముప్పు

ఈ సంగతి తెలుసుకున్నాక ఈ అల్లరులకు అసలు కారణాలు ఏమయి ఉంటాయో అని సుదీర్ఘంగా విచారణలు జరిపాం. సేకరించిన సమాచారంవల్ల పురపాలక సంఘపు ఎన్నికల కోలాహలమే ఈ తగాయిదాలకు మూలకారణమని తేలింది. అంతకు ఆరుమాసాల్రకితం జిల్లాబోర్డు ఉపాధ్యక్ష పదవికి కూడా ఎన్నికలు జరిగాయి. అక్కడి పురపాలక సంఘం చాలా పురాతన మయింది. అనేక సంవత్సరాలుగా అక్కడి 'పీరు' కుటుంబంవారు పురపాలక సభ్యుల పేర్లు సూచించడమూ, ప్రజలు వారినే ఎన్నుకోవడమూ ఆచారంగా ఉండేది. ఈ ఆచారానికి విరుద్ధంగా ముల్తాన్ కాంగ్రెసువారు 'పీరు' అభ్యర్థికి ప్రత్యర్థిగా ఇంకొకరిని నిలబెట్టారు. అల్లా నిలబెట్టబడిన కాంగ్రెసు అభ్యర్థికి జయం చేకూరింది.

అంతకుముందు బోర్డు వైస్‌ప్రెసిడెంటు ఎన్నిక విషయంలోనూ అలాగే జరిగింది. ఆ రోజులలో సహకార నిరాకరణ ఉద్యమం ముమ్మరంగా సాగుతోంది. అప్పటికి ఇంకా గాంధీగార్ని నిర్బంధం లోకి తీసుకోలేదు. వీలు చిక్కితే దానిని అణగద్రొక్కుదామని కాంగ్రెసు వ్యతిరేకులు తలచేవారు.

వారు ఈ సంఘటనను సాకుగా తీసుకుని పీరు కుటుంబంవారికి పురెక్కించారు. గాంధీగారి హిందూ మహమ్మదీయ మైత్రి అన్న ప్రబోధం బూటకపు ప్రచారమనీ, అది మహమ్మదీయులను ఓడించి అణగద్రొక్కడానికే పుట్టినదనీ నమ్మబలికారు. అదే మొట్టమొదటి సంఘటన అవడంచేత కాంగ్రెసు వ్యతిరేకులు ఎంతగా క్షోభించినా పీరు

కుటుంబంవారు పట్టించుకోలేదు. వారు వ్యాకులత చెందినమాట సత్యమే అయినా, ఆ ఓటమి తమ కుటుంబ గౌరవాన్ని మట్టుపెట్టడానికి ఉద్దేశింప బడిందని మాత్రం విశ్వసించలేదు. కాగా తమ హోదా చెడిందనీ నమ్మలేదు.

ఆరుమాసాల అనంతరం వచ్చిన పురపాలక సంఘపు ఎన్నికలలో కూడా అదేరీతిని 'పీరు' కుటుంబీకులు నిర్ణయించిన అభ్యర్థికి పోటీగా కాంగ్రెసువారు ఇంకొకర్ని నిలబెట్టడమూ, 'పీరు' అభ్యర్థి ఓడిపోవడమూ జరిగేసరికి, 'పీరు' కుటుంబీకులకు అది తలవంపనే అభిప్రాయం బాగా నాటుకుంది. కాంగ్రెస్సును కూలద్రోయాలని వాంఛించే అధికార వర్గంవారు కూడా ఇదే మంచి అదను అని తలచి, ఆ 'పీరు' కుటుంబపు పెద్దలను కలసి, హిందూ మహమ్మదీయ మైత్రి అన్నది ఒక బురఖా అనీ, ఆ బురఖా క్రింద కాంగ్రెసువారు తమ పరువు తీస్తున్నారనీ, మహమ్మదీయులను శక్తిహీనుల్ని చేస్తున్నారనీ, నిజానికి కాంగ్రెసువారికి హిందూ మహమ్మదీయ మైత్రిపై విశ్వాసం లేదనీ బోధించారు.

ఈ ప్రకారంగా ఆ మహానగరంలో హిందూ మహమ్మదీయ కలహాలు తలఎత్తడమూ, ఐకమత్య ప్రయత్నాలు అడుగంటడమూ సంభవించాయి. రంజాం ఊరేగింపు మీద రాళ్ళు రువ్వబడ్డాయన్న ఫిర్యాదులోని నిజానిజాలు ఎల్లా ఉన్నా, ఈ ముల్తాన్ కొట్లాటలు లోకలు బోర్డు మ్యునిసిపల్ ఎన్నికలలో తలయెత్తా యన్నది మాత్రం నిర్వివాదాంశం.

నిజంగా రాళ్ళు రువ్వడమే ఖాయం అయితే, ఆ గలాటా ఆ ప్రాంతంలోనే అంతమయ్యేదిగాని, ఒకేసారిగా వూరులోని అన్ని మూలలా అంటుకునేదికాదు. హిందువులను అవమానించడానికీ, ఆలయాలు కొల్లగొట్టి, విగ్రహాలు ధ్వంసం చేయడానికి వివిధప్రాంతాలలో ఏకకాలమందే చేరిన గుంపులూ, ఆ పనికోసం సేకరించి జాగ్రత్త చేసిన గునపాలూ, పలుగులూ వగైరాలు ఊరేగింపుమీద రాళ్ళు పడడం అన్నది వట్టిదని రుజువు చేస్తున్నాయి. ఈ కొట్లాటలు జరిగిన

కొలది దినాలలోనే వెళ్ళి విచారణ సాగించిన మాకు మాత్రం, పట్నం మొత్తంమీద ఏకకాలంలో జరిగిన విధ్వంసకపు చేర్పాట్లన్నింటికీ మూల కారణం మ్యునిసిపల్ ఎన్నికలే అన్న దృఢవిశ్వాసం కలిగింది.

## కాంగ్రెసు పరపతికి దెబ్బ

ఈ విచారణ ముగిశాక అక్కడే ఒక మీటింగు పెట్టుకుని, కుల మతాలతో నిమిత్తం లేకుండా, బాధితుల తక్షణ సహాయార్థం పదివేల రూపాయలు మంజూరు చేశాం. అంతేకాదు, ఆ ధనాన్ని మౌలానా అబుల్‌కలాం అజాదుగారికీ, పండిత మదనమోహనమాలవ్యా గారికీ అందజేయాలనిన్నీ తీర్మానించాం. మేము ముల్తాన్‌లో కొద్ది రోజులు ఉన్నా ఆ ధనం పైవారికి అందజెయ్య బడలేదు. అంతేకాదు, అప్పటికీ యిప్పటికీ కూడా ఆ డబ్బు బాధితులకొరకు లవలేశమూ విని యోగపడలేదు. జమన్‌లాల్ బజాజ్ కోశాధిపతి అయినా, కీలకం రాజగోపాలాచారిగారి చేతులలో ఇరుక్కుంది. 1923 లో నేను వర్కింగు కమిటీ సభ్యత్వం వదులుకునే పర్యంతం నాకూ, రాజగోపా లాచారి గారికీ ఉంటూ వచ్చిన సాన్నిహిత్యం పురస్కరించుకుని, నేను ఆ ధనాన్ని వెంటనే విడుదల చేయవలసిందని స్వయంగా కోరినప్పటికీ, దానిని ఆయన మంజూరు చేయలేదు. దాస్-మోతీలాల్ గార్లకూ, గాంధీ గారికీ మధ్య 1921 నాటి ఒప్పందాల విషయంలో ఏర్పడిన భేదాభి ప్రాయాలను గురించి ఇదివరలోనే చెప్పిఉన్నాను. చిత్తరంజన్‌దాస్ గారితోపాటు మౌలానా అబుల్‌కలాం అజాదుగారున్నూ జైలులో ఉన్నారు. మిత్రులు రాజగోపాలాచారిగారు ఎల్లాగయినా అజాదుగారిని నో ఛేంజర్ వర్గానికి త్రిప్పుకోవాలనే పట్టుదలతో, ఆ యత్నం కొన సాగేదాకా అజాదుగారి చేతికి ఆ డబ్బు యివ్వకూడదని బిగించుకు కూర్చున్నారు. ఆ ప్రయత్నం విఫలమయిన తర్వాతనయినా ఆ ధనం వినియోగపడుతుందని నేను వాంఛించాను. కాని నా ఆశ నిరాశే అయింది. ఆ ప్రకారంగా బాధితుల కివ్వదలచిన ధనరూపక సహాయం పంపకందార్ల చేతులలో కయినా రాకుండానే ఆగిపోయింది. వర్కింగు కమిటీవారి తీర్మానం వమ్మయిపోయి మూలపడింది.

నిజానికి మేము ఇవ్వగలిగిందీ, ఇవ్వదలచిందీ అతి స్వల్పమే అయినా, అదనుకి ఆ సొమ్ము పంపకంచేసి ఉండిఉంటే కాంగ్రెసు సదుద్దేశాన్ని రుజువుచేసి, కాంగ్రెసు గౌరవాన్ని కాపాడగలిగేవారం. ప్రజలలో కాంగ్రెసుపట్ల విశ్వాస గౌరవాలు వర్ధిల్లేవి. అవసరమయినప్పుడు ఆర్తులకు సేవచేయ గలగడం నిజంగా ఎన్నివిధాలో కాంగ్రెసు భావికి తోడ్పడేది. హిందూ మహమ్మదీయ మైత్రి దృఢతరం అవడానికి ఉపన్యాసాల ద్వారానే గాక క్రియాత్మకంగా కూడా దోహదం చేసినట్టు అయేది. బహుశః పండ్రెండు మాసాల అనంతరం షహజాన్‌పూరులో కొట్లాటలు జరగకుండా ఉండేవి. ఎప్పుడయితే ఇస్తామన్న ధనాన్ని పంచిపెట్టలేకపోయామో, అప్పుడే నాయకుల గౌరవం మంటకలసింది.

## పార్టీ విభేదాలు తెచ్చిపెట్టిన ముప్పు

ఇలాంటి పరిస్థితులలో నో ఛేంజ్, ప్రోఛేంజ్ పార్టీలవారు తమ హక్కుల గురించీ ఆదర్శాల విషయమై ఆర్భాటాలు చేస్తూ, కక్షలు పెంచుకుంటూ ఉండేవారన్నమాట!

ఈ రకమయిన అలజడులూ, ఎత్తు పైఎత్తులూ లక్నో ఒడంబడిక జరిగిన నాటినుంచీ, అనగా 1916 నుంచీ, 1922 లో ముల్తాన్ కొట్లాటలు జరిగే పర్యంతమూ తలఎత్తుతూనే ఉన్నాయి. ముల్తాన్ ఉదంతం యీ పై కారణాల వల్లనే అంత ఉద్రిక్తంగా సాగిందని అనడానికి వీలులేకపోయినా, ఆ అలజడికి ఈ ఒడంబడికలు కారణాలు కావనిమాత్రం అనలేము.

ముల్తాన్ కొట్లాటలు జరిగిన తర్వాత, లక్నో ఒడంబడికలో మార్పులు చెయ్యాలనే వాదం ప్రబలమైంది. కాంగ్రెసు నాయకులలో పెచ్చుపెరిగిన అలసత, ముల్తాన్ ఉదంతమూ మహమ్మదీయులలో అసంతృప్తిని రేకెత్తించడానికీ, అవకాశవాదులు ఆందోళన చెయ్యడానికి తోడ్పడ్డాయి. ఆ రోజులలో అచ్చయి పంచిపెట్టబడిన సారస్వతం అంతా అవకాశవాదుల ఎత్తుగడలను రుజువు చేస్తుంది. ఒకవంక కాంగ్రెసును మట్టుబెట్టాలని ప్రభుత్వంవారు, ఇంకొకవంక హిందూ

మహమ్మదీయ మైత్రి ప్రాతిపదికగా ప్రారంభింపబడిన సహకార నిరాకరణ ఉద్యమాన్ని తుదముట్టించాలని ఎదిరి పార్టీవారు యత్నాలు ముమ్మరంగా సాగిస్తూఉంటే, ఈ నోఛేంజ్-ప్రోఛేంజ్ కక్షలవారి కలహాలు అలనాటి 'నీరో' ఉదంతాన్ని స్ఫురణకు తెచ్చేవిగా ఉన్నాయి. రోమునగరం తగులబడిపోతూంటే, చీకూ చింతా లేకుండా నీరో ఫిడేలు వాయించుకుంటూ కూచున్నాడట!

పంద్రెండు మాసాల అనంతరం మళ్ళీ షహజాన్‌పూర్‌లో హిందూ-మహమ్మదీయ కలహాలు సంభవించాయని చెప్పిఉన్నాను. ఈ ఉదంతం వివరించేముందు, 'సింధు' ప్రాంతంలో మా పర్యటన విశేషాలు ఎరుక పరచడం అవసరం అనుకుంటాను. అవి ఆ సంఘటనలను సరిగా గ్రాహ్యం చేసుకోవడానికి తోడ్పడతాయని నా తలంపు.

### సింధు పర్యటన ముచ్చటలు

నేనూ, శ్రీ విఠల్‌భాయ్ పటేల్‌గారూ, డా. చేత్రాం మున్నగు ప్రముఖులతో కలసి యేఒక్క ముఖ్యప్రాంతాన్నీ వదలకుండా యావత్తు సింధు రాష్ట్రాన్నీ చుట్టివచ్చాం. లోలోపల చిల్లర తగాయిదాలుంటూ ఉన్నా, ఖాదీ మాత్రం సింధు పంజాబు ప్రాంతాలలో బాగా నాటుకుంది. దక్షిణ పంజాబు ప్రాంతాలలోనూ, సింధు రాష్ట్రంలోనూ ఉన్న ప్రతి 'ఖాదీ' భాండారాన్ని పరిశీలించాం. ఖాదీ ఉద్యమం 1921-22 సంవత్సరాలలో దేశం మొత్తం మీద చాలా ఉన్నత స్థాయినే అందుకుంది. పంజాబు ఖద్దరు సున్నితానికీ, మన్నికకూ మాత్రమేగాక పలు రంగులలో చూడ ముచ్చటగా తయారుచేయబడుతోంది. యావత్తు సింధు రాష్ట్రంలోనూ ఖాదీ మంచి ఉన్నత స్థాయిలోనే ఉంది.

మేము పర్యటించిన కరాచీ, సక్కరు, హైదరాబాదు (సింధు) మున్నగు ముఖ్య నగరాలలో హైందవ నారీమణుల జీవితాలు ఎంత దుర్భరంగా ఉన్నాయో ముమ్మొందుగా బైటపడింది. రాష్ట్రం మొత్తం మీద మహమ్మదీయులే జాస్తి. హిందువులు అత్యల్ప సంఖ్యాకులుగా దుర్భర జీవితం సాగిస్తున్నారు. హిందూ యువతులను అపహరించడ

మన్నది మహమ్మదీయులకు వెన్నతోబెట్టిన విద్య అయింది. బ్రిటిషు రాజ్యాంగం వారు ఆ స్వల్ప విస్తీర్ణంగల సింధు ప్రాంతాన్ని ప్రత్యేక రాష్ట్రంగా రూపొందించడం అన్నది నిజానికి అనుచితకార్యం. అది బొంబాయి రాష్ట్రంలో కలసి ఉన్నంతకాలమూ, హిందువులు ఆ ప్రాంతంలో అల్పసంఖ్యాకులే అయినా, వారికి అసంతృప్తులూ, బాధలూ అన్నవి అట్టే ఉండేవికావు.

మేము సింధులో ఉండగా అబ్దుల్లా హరూన్‌గారిని కలుసుకున్నాము. ఇప్పటిలా అప్పట్లో వారికి మతోన్మాదం లేదనే అనాలి. పరస్పరం అభిప్రాయాలు వెలిబుచ్చుకోడానికి మా సన్నివేశాలు ఎంతగానో ఉపకరించేవి. రాష్ట్రం మొత్తంమీద ఎక్కడకు మేము వెళ్ళినా మాకు హృదయపూర్వక స్వాగతాలే లభించేవి.

చేపలతో చెలికారం

మాకు ఒక నది ఒడ్డున నీటిని ఒరుసుకుని ఉన్న బంగాళాలో మకాం యిచ్చారు. ఆ నదీ తీరంలో ఒక అపురూప దృశ్యం మా కంట బడింది. నదిలోని చిన్న పెద్ద చేపలన్నీ మా చేతులలో ఉండే ఆహారాన్ని గ్రహించాయి. ఆ చేపలకి చాలా కాలంగా ఈ అలవా టుందిట! నదీ తీరానికేమిటి, ఒడ్డుమీదకు కూడా కొంతదూరం వచ్చి గబుక్కుని ఆహారాన్ని అందుకుని నీటిలోకి పోయేవి. కంటితో చూచిందాకా నమ్మడానికి వీలులేని దృశ్యం అది. ఆ ప్రాంతీయులు అంత అహింసాత్మకంగా ఆ చేపలతో సహజీవనం సాగించేవారని అన్నా అందులో ఈషణ్మాత్రమూ అసత్యం ఉండదు.

ప్రభుత్వంవారు అణగ ద్రొక్కాలనుకున్నా, నాయకులను జైళ్ళపాలు జేసినా కాంగ్రెసు గౌరవం మకుటాయమానంగా ఉంటూన్న రోజులవి. అందువలన మేము రాష్ట్రం అంతా తిరిగి హిందూ మహమ్మదీయ మైత్రి వలని లాభాలను గురించి ఉపన్యాసాలిచ్చాం. హృదయ విదారకమయిన ముల్తాన్ ఉదంతాలు రేపిన హృదయ తాపం చల్లారకుండానే మాకు ఆ ప్రాంతాలన్నీ తిరగ గలిగిన అవకాశం చిక్కింది.

ఆ ప్రాంతాలన్నీ అధిక సంఖ్యాకులయిన మహమ్మదీయుల ఆధిపత్యం లోవే. అలాంటి విషమ పరిస్థితులలో ఆ ప్రాంతాలలో హిందూ మహమ్మదీయ మైత్రిని గురించి ఉపన్యాసా లివ్వగలిగాం అంటే, అవకాశవాదులు రెచ్చకొట్టకుండా ఉండి ఉంటే హిందూ మహమ్మదీయ విభేదాలకీ, కొట్లాటలకూ తావు లేదనే అనవలసి వస్తుంది. చేజిక్కిన అవకాశాన్ని చిక్కబట్టుకుని, కాంగ్రెసు నాయకులే గనుక,ధనాన్ని పోగు జేసి బీదసాదలకూ బాధితులకూ పంచి పెట్టడానికి-ఒక్క పంజాబులోనే అన్నమాటేమిటి, ఇటు బెంగాలులోనూ, మహమ్మదీయులు ఉద్ధతంగా ఉన్న యు. పి. మున్నగు రాష్ట్రాలలోనూ కూడా- అవసరమయిన ఏర్పాట్లుచేసి ఉద్యమాన్ని సక్రమంగా నడపగలిగి ఉంటే, హిందూ మహమ్మదీయ విభేదాల్ని మొగ్గ తొడక్కుండానే తుంచేసేవారం. ముల్తాన్ దుస్సంఘటనల కారణంగా, ఎన్నో ప్రాంతాలు పర్యటించి, అక్కడి పరిస్థితులు పరిశీలించి, సాధక బాధకాలను గ్రహించి ఒక బరువైన హృదయంతో మేము ఇండ్లకు చేరాం. గయా కాంగ్రెసు సమీపిస్తూన్న కొద్దీ, తమ తమ పక్షాలకే ప్రాముఖ్యం రావాలనే ఆత్రుతతో, నో-ఛేంజ్, ప్రో-ఛేంజ్ పార్టీలవారు తంటాలు పడుతూన్న రోజులవి. వీటిని గురించీ, గయా కాంగ్రెసు అంతర్నాటకాలను గురించీ లోగడ సుదీర్ఘంగా తెలియపరచే ఉన్నాను.

## అవకాశవాదులు రేపిన అల్లర్లు

షహజాన్‌పూర్ కొట్లాటలను గురించి కాస్త విపులంగా యోచిద్దాం. వీనికి ముఖ్యకారణం లక్నో ఒడంబడికలకు మించిన, సదుపాయాలు తమకు కావాలంటూ కొందరు మహమ్మదీయ నాయకులు లేవదీసిన ప్రచారమే. హిందువులు స్వతస్సిద్ధంగా పిరికివారనీ, తాము గనుక అల్లర్లు లేవదీస్తే ఇతోధికంగా తమ కోర్కెల్ని మన్నించి తీరక యేం జేయగలరన్నదే ఆ మహమ్మదీయ నాయకుల విశ్వాసం. ముల్తాన్ ఉదంతం జరిగిన తర్వాత పంజాబులో సుహృద్భావం వృద్ధిగావడానికి కాంగ్రెసు వారు తగు చర్యలు తీసుకోలేదు గదా! అందువలన ఆ రెండు మతాలవారి మధ్యా పొగ రాజెయ్యడానికీ, దుష్టశక్తుల్ని రేపడానికీ ఇదే

అదనని అవకాశవాదులు తలచారు. ముల్తాన్ సంఘటనల తరవాత, కాంగ్రెసువారి స్తబ్ధతవల్లనే, మళ్లీ షహజాన్‌పూర్ అల్లర్లూ, కలతలూ తలయెత్తాయని చెప్పాలి.

షహజాన్‌పూరు సంఘటనలకు ఆర్థిక కారణాలే మిక్కుటం. ఆహార వస్తువుల ధరలు అధికారులు అదుపులో పెట్టకపోవడమే యీ చికాకులకు ముఖ్య కారణం అనక తప్పదు. అంతేకాదు, అల్పసంఖ్యాకులయిన హిందువుల చేతులలోనే విస్తారంగా ఈ వ్యాపారాలు ఉండడమూ, ధరల కంట్రోళ్ళన్నీ ఆ హిందువుల చేతులలోనే ఉండడమూ బలవత్తర కారణాలయ్యాయి. ధరలు తగ్గించడానికి హిందూ వర్తకులు ఎంత మాత్రం ఒప్పుకోలేదు. దాన్తో అక్కడా అక్కడా లూటీలు, దోపిడీలు ఆరంభం అయ్యాయి. కొంపలు కూడా కొన్ని కొన్ని ప్రాంతాలలో తగల పెట్టబడ్డాయి. ఇటుక, సిమెంటు, రాతి గోడల మధ్య భద్రపరచబడిన పెద్ద పెద్ద ఇనుప పెట్టెలే వూరివెలపలకు, మూడు నాలుగు మైళ్ళ దూరాన వున్న మారు మూలలకు తరలింపబడి పగల గొట్టబడ్డాయి.

ఒక విధంగా, లక్నో ఒప్పందాలు పునఃపరిశీలన చెయ్యాలి. మహమ్మదీయులకు ఇతోధికంగా హక్కులూ, అధికారాలూ, ఆర్థిక సౌకర్యాలూ కలుగ జెయ్యాలి అన్న ప్రచారమే యీ కలతలకు మూల కారణం అన్నది నిర్వివాదాంశం. లక్నో ఒడంబడిక లోప భూయిష్ఠమనే మాట ప్రతి మహమ్మదీయుని నోట ఉండే దన్నమాట! నిజానికి 1916 లో జరిగిన యీ ఒడంబడిక తర్వాత రేగిన దుమారాన్ని కాంగ్రెసువారూ, సహకార నిరోధక వర్గాలవారూ, స్వరాజ్య పార్టీవారూ గమనించి అవసర చర్యలు తీసుకుని ఉండి ఉంటే, ఇంత అసహనం, గందరగోళం, రక్తపాతం వగైరా ఉండేవి కావు. ఇది యేదో ఒక రోజున, ఒక నెలలో, ఒక సంవత్సరంలో తలయెత్తిన తగవులాట కాదు. ఆ లక్నో ఒడంబడిక మూలంగా లాభాలు పొంది, ఉద్యోగాదులలో పై మెట్లు ఎక్క గలిగిన ఆ జనానికి ఆశ యెక్కువయి, ఇంకా సంక్షోభాలు తీసుకు రాగలిగితే తమకు ఇంకా లాభాలూ, క్షేమాలూ

దక్కుతాయనే ఉద్దేశంతో ఈ గలాటాల వెనుక ఉండి ఉద్రేకాలు రెచ్చ గొట్టి నాటక మాడారని తెలియ వచ్చింది.

## బ్రిటిషువారు చేసిన తీరని ద్రోహం

ఈ లక్నో ఒడంబడిక ఆధారంగా కాంగ్రెసూ, ముస్లిం లీగూ కలిపి తయారు చేసిన స్వపరిపాలన ప్రణాళికే 1918 లో మాంటేగ్- ఛెల్మ్స్ఫర్డ్‌గార్లకు అందజేయబడ్డాయి. కాని అప్పట్లో ఆ సూచనలు తిరస్కరించబడ్డాయి. ఈ ఉమ్మడి ప్రతిపాదనలలో జిన్నాగారి చెయ్యి కూడా ఉంది. ఈ ప్రతిపాదనలను మాంటేగ్ త్రోసిపుచ్చిన కారణంగా లక్నో ఒప్పందాలు రద్దయి పోయాయనే సాకుతో, ఆ ఒడంబడిక సవ్య మయింది కాదు, అందులో మహమ్మదీయులకు ఉపకరించే షరతులు లేవనే ఆందోళన లేవతీయబడింది. సరళమైన సూటి మార్గాన్నే అవ లంబించాలనే కొత్త నాయకుల విధానం పై విషయాన్ని అంతగా పట్టించుకోలేదు. పైగా వారికి ఈ మితవాదుల ప్రాధేయ పూర్వక యాచనా విధానమూ నచ్చలేదు. ఇలాంటి పరిస్థితిలో, 1918 లో, కాంగ్రెసు మితవాదుల చేతులనుండి అతివాదుల చేతులలోకి మారింది.

నిజంగా మాంటేగ్- ఛెల్మ్స్‌స్ఫర్డ్‌గారలు 1918 లో ఆ ప్రతి పాదనలను అంగీకరించి, ఒక నూతన ప్రణాళికను రూపొందించి ఉంటే, ఈ దేశంలో ద్వంద్వ పరిపాలనకి స్థానం ఉండేది కాదు. హిందూ మహమ్మదీయ కలహాలూ చెలరేగేవి కావు. అంతేకాదు, అటు పిమ్మట సుమారు పాతిక సంవత్సరాలపాటు నడచిన హిందూ మహమ్మ దీయ సంఘర్షణలలో ఏ పాపమూ ఎరగని నిరపరాధుల రక్తం ప్రవ హించి ఉండేదికాదు. ఉభయవర్గాల వారూ సమర్పించిన ఆ ప్రతిపాదన లను 1917 నవంబరు మాసంలో మాంటేగ్ బృందం త్రోసిపుచ్చారు.

అవి భారతీయ రాజకీయాలలో గాంధీగారు తలదూరుస్తూన్న రోజులు. ఆయన కూడా ఎలాగయినా మాంటేగ్ ప్రభృతులచేతా, బ్రిటిషుగవర్నమెంటు వారిచేతా ఈ ప్రతిపాదనలను అంగీకరింప జేయాలని చాలా తంటాలుపడ్డాడు. ఆయన ఈ కాంగ్రెస్-లీగ్ ప్రతి

పాదనలను దేశభాషలలోకి తర్జుమా చేయించి, ఆ విన్నపంమీద లక్షకు పైగా సంతకాలు సేకరించి, 1917 లో జరిగిన కలకత్తా కాంగ్రెసు నాటికే ప్రభుత్వం వారికి అందజేశాడు.

నాటినుంచి నేటివరకూ హిందువులకూ మహమ్మదీయులకూ సామరస్యం కుదరలేదంటూనే కాలయాపనచేస్తూ వస్తున్న యీ బ్రిటిషు వారు ఆనాడు ఆ ప్రణాళికను త్రోసిపుచ్చి, మనకూ మనదేశానికీ తీరని ద్రోహాన్ని చేశారు. పైగా వారు ఏ నోటితో భారతీయులు సంపూర్ణ స్వరాజ్యానికి అనర్హులని చెపుతున్నారో అర్థంకాదు. నిజానికి ఆ ప్రణాళికను అంగీకరించని కారణంగా ఈనాటివరకూ దేశంలో చెల రేగిన హిందూ మహమ్మదీయ కలహాలకు బాధ్యులు వారే. వారి మూలం గానే యీ చికాకులన్నీ దేశంలో ప్రబలుతున్నాయని వారిపై నేరా రోపణ చేయడం సమంజసం. కాంగ్రెసును చేపట్టిన నూతన వర్గీయులు కూడా ఈ పరిస్థితులకు కొంతవరకూ బాధ్యులు. వారు సత్వర చర్యలు తీసుకుని, అవసరమయిన ప్రబోధాలూ, ప్రచారం చేస్తూ బాధితులకు ఆర్థికాది సహాయాలు చేసి వుండివుంటే పరిస్థితులు చక్కబడే ఉండేవి. అటు ప్రభుత్వంవారూ, ఇటు కాంగ్రెసువారూ కూడా స్వలాభాపేక్ష తోనూ, అలసతవల్లనూ అవసర చర్యలను తీసుకోకపోడంచేత దేశంలో దుష్టశక్తులు వీరవిహారం చేశాయి. కలహాలు రెచ్చకొట్టగల పుణ్యాత్ములు ముందుకు రాగలిగారు.

## మాలవ్యాజీ మనస్తాపం

1922 ముల్తాన్ కొట్లాటలనాటి హిందూ మహమ్మదీయ మత వర్గాల వారి మనోభావాలకీ, షహజాన్‌పూరులో 1923లో జరిగిన కలహాల నాటి వారి మనోభావాలకీ వున్న తేడాపాడాలు విలియా వేసుకోవడం ఇప్పట్టున న్యాయం. ముల్తాన్ కొట్లాటల నాటి నిరాశా, షహజాన్ పూర్ కలహాల నాటి నిస్సహాయతా గ్రహించిన మాలవ్యా మహా శయుడు ఆత్మరక్షణ కోసమూ, దేశభద్రతకోసమూ ప్రాయచ్ఛిత్తాలూ, శుద్ధులూ, పుణ్యాహవచనాలూ, హోమాలూలాంటివి జరిపించి, ఆత్మ

రక్షణకోసం బలవంతంగా మతాలు మారవలసివచ్చిన హిందువులు తిరిగి తమ మతంలో, సంఘంలో, పూర్వకులంలో ప్రవేశించడానికి సావకాశం కల్పించాలన్నాడు. మాలవ్యాలాంటి సదాచార సంపన్నుడూ, సనాతనుడూ కూడా హఠాత్తుగా హిందూమతంలోకి పునః ప్రవేశానికి అవకాశం కల్పించాలని అన్నాడంటే, ఆనాటి అమానుష పరిస్థితులకి ఆయన ఎంతగా పరితపించాడో అర్థం అవుతుంది. అంతే కాదు- ఆయన నిగూఢంగా అహింసా సిద్ధాంతాల మతలబును విస్తరించి విశదపరచాడంటే, అందులో ఆ సిద్ధాంతాలను ప్రబోధించిన గాంధీగారు జైలులో ఉన్న రోజులలో తాను వాటిని పరిస్థితుల కనుగుణంగా వ్యాఖ్యానించబూని, అహింస అంటే హింసను సహించడం మాత్రమేకాదనీ, ఎదుర్కోవడంవల్ల సిద్ధాంతభంగం కాదనీ హితవు చెప్పాడంటే, ఆ నాటి కల్లోలాలు ఆయన పవిత్ర హృదయాన్ని ఎంత కల్లోలపరచాయో అర్థం అవుతుంది. ఆ నాడు మాలవ్యా మహాశయుడు ఇచ్చిన సలహా యావత్తు భారతదేశంలోని హిందువులకూ ఎంతో మనోధైర్యాన్ని ఇచ్చింది.

నిజానికి 'శుద్ధి', 'సంగతం', అన్నవి మాత్రమే ఉంటే సంఘ సుఖజీవనానికి చాలదు. తిండీ, గుడ్డా అన్నవి కూడా, మతంతో నిమిత్తం లేకుండా, హిందూ మహమ్మదీయాదుల కందరికీ సమంగా కావలసిన అత్యవసర వస్తుసముదాయమే కదా! వీటిని లభింపజెయ్యడానికి నిర్మాణాత్మక కృషి, ప్రచారమూ అత్యవసరం. సహనం, పరస్పర సహకారం మొదలైన వాటితో కూడిన నిర్మాణాత్మక కృషి జరగక పోవడంచేత సంఘజీవనం కుంటుపడిందన్నది సత్యదూరం కాదు. అసలు ముల్తాన్ కలతలు ప్రజల సుఖజీవనాన్నీ మనోభావాలనీ చికాకు పరచి వారిని నికృష్టజీవనానికి దిగజార్చిన స్థితి గమనార్హమే కదా!

### మేకవన్నె పులులు

మతసామరస్యానికి కావలసిన సత్వర చర్యలను విస్మరించి మాలవ్యా మహాశయుడు 'శుద్ధి' 'సంగతం' అంటూ వాపోతూఉంటే, వీలు చిక్కినప్పుడల్లా దెబ్బతీయాలనీ, కల్లోలాలు లేవదీసి హింసా

కొండ సాగించాలనీ మహమ్మదీయుల బుర్రలకి బాగా పట్టిపోయింది. ఇంకా తమాషా యేమిటంటే, అలాంటి హింసాభావాల్ని పెంపొం దించుకున్న వారిలో కొందరి భుజాలమీద అహింసా చిహ్నం కొట్టొచ్చి నట్లు కనబడుతూ వచ్చింది. కాగా అటువంటి వారంతా కాంగ్రెసు యూనిఫారంలో తిరుగుతూన్న ప్రబుద్ధులే! ఈ విషయం, షహజాన్ పూర్ ఉదంతాల అనంతరం అక్కడి పరిస్థితులను పరిశీలించి కారణా లను గ్రహిద్దాం అని మేము ఆ ప్రాంతంలో పర్యటిస్తూన్న సంద ర్భంలో బయల్పడింది. కాంగ్రెసు స్వయంసేవక సంఘం తాలూకు వాలంటీర్లూ, కాంగ్రెసు యూనిఫారంలో నడయాడుతూన్న మహమ్మ దీయ స్వయంసేవకులూ, కత్తిసామూ, కర్రసామూ వగైరాలలో తర్ఫీదు పొందుతున్నారన్న విషయం అప్పుడు రుజువయింది. ఈ విషయం మనస్సులో ఉంచుకుంటే పాఠకలోకానికి ఆనాటి హిందూ, మహమ్మదీయ మస్తిష్కాలలో ఎటువంటి ఊహలు కలిగేవో, 1923 నాటి షహజాన్‌పూర్ సంఘటనలు ఎలా సంభవించాయో అన్నీ బాగా అర్థం అవుతాయి.

## మీరట్ సంక్షోభం

మూడవ దఫా సంభవించిన హిందూ మహమ్మదీయ సంక్షోభం మీరట్‌లో. అప్పట్లో అక్కడ పేరూ, పలుకుబడీ ఉన్న రాజకీయనాయ కులలో నా మిత్రులయిన బారిష్టర్లు కొందరున్నారు. అక్కడ ఆ కొట్లాట జరిగిన మరుక్షణమే నేను అక్కడికి వెళ్ళాను. కాని ఉభయ పక్షాల నాయకుల ఆవేశాలు బాగా పెరిగిపోయి ఉండడం చేత అప్పటి కప్పుడే నిష్కపటంగానూ, ధారాళంగానూ, స్వేచ్ఛగానూ, మా మనోభావా లను మరుగుపరచకుండా వారితో చర్చించగల అవకాశం మృగ్యమ యిందనే అనవలసి ఉంది. చర్చించాం, బాగా లోతుగానే తర్జనభర్జనలు సాగించాం. కాని ఎంతసేపూ అవతలివారిదే దోషము అనే ధోరణి లోనే నడిచింది వారితో చర్చ. మీ వల్లనే కొంప లంటుకున్నా యని హిందువులంటే, మీ వల్ల నే సర్వనాశన పరిస్థితి ఏర్పడిందని మహమ్మ దీయులన్నారన్నమాట!

లోగడ నేను మొదటి రెండు కొట్లాటలకూ ప్రధానమయిన కారణాలను వివరించే ఉన్నాను. నేను కార్యనిర్వాహక సంఘ సభ్యుడ నయ్యేండీ కూడా, మంజూరయిన ధనాన్ని ఏ కారణాలవల్ల ఆత్మార్పణ జేసిన ఆ బాధితులకు అందచేయలేకపోయానో కూడా వివరించే ఉన్నాను. ఏటేటా ప్రో ఛేంజ్-నో ఛేంజ్ తెగల మధ్య రగులుతున్న మంటలు రాజుకుంటూనే ఉన్నాయనీ చెప్పే ఉన్నాను. ఈ నో ఛేంజ్, ప్రో ఛేంజ్ పార్టీలతో విసిగిపోయిన డాక్టర్ అన్సారీ, సరోజనీదేవీ, నేనూ కొంతమంది ఇతర మిత్రులతో కలసి "సెంటర్‌పార్టీ" అనే మధ్యమ వర్గ సంఘాన్ని స్థాపించాం. మా ఉద్దేశం పై రెండు కక్షల వారినీ సన్నిహితులను జేసి, వారి మధ్య సామరస్యం కుదర్చాలనే. ఈ మధ్యే మార్గపు మనిషిగా నేను ఎక్కడయినా హిందూ మహమ్మ దీయ కలహం జరిగిందని తెలసిన తక్షణం ఆ తావుకు వెళ్ళి సంగతి సందర్భాలు విచారించే వాడిని.

### కొట్లాటలపై కొట్లాటలు

సొంత జేబులోంచి ఖర్చుపెట్టుకుంటూ ఏటేటా ఈ అల్లరు జరిగిన తావులన్నీ సందర్శిస్తూ వచ్చాను. ఇక్కడ 1924-27 సంవత్స రాల మధ్య జరిగిన అల్లరులను గురించి ప్రస్తావిస్తాను. 1925 మే మాసంలో కలకత్తాలోను, 1925-27 సంవత్సరాలలో బొంబాయిలోను అల్లరు జరిగాయి.

బహుశః 1927 ఈ సంక్షోభాలకు చాలా చెడ్డ సంవత్సరం అని అనవలసి ఉంటుంది. 1927 ఆగష్టు 29 వ తేదీన లార్డ్ ఇర్విన్ కేంద్ర శాసన సభలో సభ్యుల కందించిన సమాచారాన్నిబట్టి, ఉత్తర ప్రదేశ్, బొంబాయి, పంజాబు, మధ్యప్రదేశ్, బీహారు, బెంగాలు రాష్ట్రాల లోనూ, ఢిల్లీ లోనూ జరిగిన కొట్లాటలు మొత్తం 26 అనీ, అవి ఆగష్టు 25 నాటికి గత 18 మాసాల లోపలనే జరిగినవనీ తెలియవచ్చింది. పంజాబులో రెండు, ఢిల్లీలో రెండు, బెంగాలులో రెండు, ఉత్తర ప్రదేశ్‌లో పది, మధ్యప్రదేశ్‌లో రెండు, బీహారులో రెండు, బొంబా

యిలో ఆరు కొట్లాటలు జరిగాయి. ఈ కొట్లాటలలో నిహతులయిన వారి సంఖ్య 250; క్షతగాత్రులు 2,500 మంది.

ఇంచు మించుగా కలతలు రేగి, అల్లర్లు జరిగిన అన్నిప్రాంతాలకూ నేను వెళ్ళాను. ఎటొచ్చీ ఆ వూరి అల్లరికీ, ఈ వూరి అల్లరికీ మధ్య వ్యవధిలేని సందర్భాలలో ఒకొక్క ఊరు వదలి వెయ్యవలసి వచ్చింది. నేను అల్లర్లు జరిగిన వెనువెంటనే వెళ్ళి, సంగతి సందర్భాలు విచారించి, ఇరుపక్షాలవారివద్దా సంజాయిషీ సేకరించి, జరిగిన సంగతులన్నీ సకారణంగా నోటు చేసుకునేవాణ్ణి. చాలా ఘోరంగా జరిగిన నాగపూరు కొట్లాటల సంగతి విని అక్కడికి వెళ్ళాను. నాగపూరులోనూ, లాహోరు కొట్లాటల్లోనూ కూడా చాలామంది చంపబడ్డారు. పెక్కుమందికి గాయాలు తగిలాయి. ప్రతీ ప్రాంతంలోనూ శాంతిని నెలకొల్పి, మత సామరస్యాన్ని పునరుద్ధరించడానికై శాంతి సంఘాలు స్థాపింపబడ్డాయి.

## ఐ క మ త్యా సూ చ న లు

అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు కలకత్తాలో 1927 అక్టోబరు 28, 29, 30 తేదీలలో కలుసుకున్నప్పుడు, కాంగ్రెసు ప్రెసిడెంటు శ్రీనివాసయ్యంగారి ప్రోద్బలంవల్ల జరిగిన ఐకమత్య మహాసభవారు హిందూ మహమ్మదీయ సంఘీభావానికి చేసిన సూచనలు ఆమోదించబడ్డాయి. మసీదుల ముందు బాజా భజంత్రీల వాయిద్యం విషయంలోనూ, గోహత్యా విషయంలోనూ కొన్ని నియమాలు పాటించి, వాటిని క్రమబద్ధం చేయించాలని శ్రీనివాసయ్యంగారు చాలా శ్రమపడ్డారు. నిజానికి ఆనాడు కావలసింది మసీదుల ముందు మేళతాళాలు వాయిస్తున్నారా, హిందువుల ముందు గోహత్య సాగిస్తున్నారా అన్న మీమాంసకంటే, అందరికీ కడుపు నిండా అన్నం ఉన్నదా అన్న యోచనేనని నా నమ్మిక. ఈ అభిప్రాయమే నాకు ముఖ్య మిత్రులయిన శ్రీనివాసయ్యంగారి ముందు వెలిబుచ్చాను. కాని వారు తాము సూచించిన మసీదు ముందు వాయిద్యాలు, గోవధ క్రమబద్ధం అయితే చాలనే తలచారు.

కలకత్తా ఘోరాలు

అంతవరకూ జరిగిన కొట్లాటల కంటే కలకత్తా సంక్షోభమే చాలా ఘోరంగా పరిణమించింది. తాము దానిని అణచగలమనే విశ్వాసంతో మహాత్మా గాంధీగారు, సేన్ గుప్తాగారితో కలిసి ఆ ప్రాంతానికి హడావిడిగా వెళ్లారు. కాని అక్కడి పరిస్థితులు ఏనాడో చెయ్యి దాటిపోయి అదుపులో ఉంచడానికి వీలులేని పరిస్థితికి దిగజారిపోయాయనీ, ఈ పరిస్థితులు ఇల్లాగే ఇంకా కొంతకాలం సాగితే ఇరువైపులా వేలాది జనం నిహతు లవుతారనీ, బహుశః అప్పటికిగాని వారు కళ్ళు తెరవరనీ వాపోతూ, తన నిస్సహాయ స్థితిని గాంధీగారు ఒప్పుకున్నారు. ఆ తర్వాత వారు- ఒక పనికి మాలిన హింసాకాండలో ఇరుక్కుని, అనవసర రక్తపాతానికి కారకుల మయ్యామన్న సంగతి గ్రహించారు. ఇది 1924 లో గాంధీగారి విడుదల అయిన తర్వాత రెండేళ్ళకు జరిగిన సంఘటన.

# 17

## కాంగ్రెసువారి తొలి ఎన్నికలు: ఆంధ్రదేశం

ద్వంద్వ ప్రభుత్వం ఎలా పరిణమిస్తుందో కూడా స్వరాజ్యపార్టీ వారికి అనుభవం అయింది. గాంధీగారి విడుదల అనంతరం రెండు సంవత్సరాల కాలంలోనూ కాంగ్రెసు కార్యక్రమ సాఫల్యానికి ఎంత మాత్రమూ కృషి చేయలేక పోయారు. అయినప్పటికీ 1924 లో బెల్గాంలో తమకు గాంధీగారి ద్వారా హస్తగతమయిన కాంగ్రెసు నాయకత్వాన్ని వదులుకుని, దానిని తిరిగి గాంధీగారి హస్తగతం చేయడానికి వారికి మనస్సు రాలేదు.

శాసనసభా ప్రవేశ కార్యక్రమం

'మా కోర్కెలను మన్నించకపోతే మంత్రి పదవులను కూడా చేపట్టి తీరుతాం, సఫలీకృతుల మవుతాం' అనే స్వరాజ్య పార్టీ వారి

విశ్వాసాన్ని అనుసరించి 21-9-1925 న పాట్నాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగులో స్వరాజ్య పార్టీవారి శాసనసభా ప్రవేశ కార్యక్రమం అంగీకరించబడింది. *కాని దురదృష్టవశాత్తూ వారు తీసుకున్న నిర్ణయం అఖిల భారత కాంగ్రెసు కమిటీవారి పూర్తి అనుమతిలేనిదే అమలుపరచడానికి అవకాశం లేకుండా పోయింది.†

నిజానికి అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు మెత్తబడి ఉంటే మంత్రిపదవులు చేపట్టడానికి అనుమతి చిక్కి ఉండేది. ఈ మంత్రులు శాసన సభా నియమావళిని మన్నించాలా, ధిక్కరించాలా అన్నది తేలనే లేదు.

1926 లో గాంధీగారు కాంగ్రెసునుండి తాత్కాలికంగా విరమించిన సందర్భంలో ఈ స్వరాజ్య పార్టీవారు తమ యిష్టం వచ్చినట్లు కాంగ్రెసును మలచగలిగేవారే. కాని శ్రీనివాసయ్యంగారూ, మద్రాసు శాసన సభా సభ్యులయిన స్వరాజ్యపార్టీ వారు సబర్మతిలో కుదిరిన సమాధానమునకు ఎప్పుడూ విముఖులే కదా! మోతీలాల్ నెహ్రూగారు వారిలో వారికి ఉన్న కలహాలను విస్మరించి కొంతకాలమయినా శాంతంగా విశ్రాంతి తీసుకోవడం కోసమని ఇంగ్లాండు వెళ్ళిన సందర్భంలో శ్రీనివాసయ్యంగారు వారి అడుగు జాడలలోనే నడవాలని నిశ్చయించుకున్నారన్న విషయం గమనార్హం.

అట్టి పరిస్థితులలోనే 1926 లో గౌహతీ కాంగ్రెస్ అధ్యక్ష పీఠాన్ని శ్రీనివాసయ్యంగారు అలంకరించారు.

## కాంగ్రెసు పార్టీ అయిన స్వరాజ్య పార్టీ

స్వరాజ్య పార్టీ నాయకులు తమ ఆశయం విఫలం అవడానికి కారణం కాంగ్రెసేననీ, కాంగ్రెసే కనుక తమతో ఏకీభవించి తమ ఆశయమే తనదిగా, తన ఆశయమే తమదిగా ఎంచి అవసరమైన సహకారం ఇచ్చి ఉంటే తాము తమ ఆశయ సిద్ధిని సాధించేవారమని

* ఈ తీర్మానం కాన్పూరు కాంగ్రెసు ఆమోదించింది.

† సబర్మతిలో కుదిరిన సమాధానం ప్రకారం.

అనడం ఆరంభించారు. కాగా, వారు కాంగ్రెసులో విలీనమపడానికి అవకాశం లభ్యమయి, వారి పార్టీ పేరును 'కాంగ్రెసుపార్టీ'గా మార్చుటకు అంగీకరిస్తే, తాము అద్భుత ఫలితాలు చూపించగలమన్నారు.

గాంధిగారు విశ్రాంతిగా ఉండడమూ, కాంగ్రెసు స్వరాజ్యపార్టీ వారి అధీనంలో నడవడమూ జరుగుతున్నప్పుడు, 'స్వరాజ్యపార్టీ'పేరు కాంగ్రెసు పార్టీగా మారడం సులభమే కదా! అందువలన గౌహతీ కాంగ్రెసుకు పూర్వమే స్వరాజ్యపార్టీ కాంగ్రెసుపార్టీ అయిపోయింది. ఈ మార్పు, 1926 నవంబరులో జరుగనున్న ఎన్నికలకు ముందుగానే, (పాట్నాలో జరిగిన) అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగులో అంగీకరించబడింది.

1885లో కాంగ్రెసు సంస్థ ఏర్పడ్డాక అది ఎన్నికలలో పాల్గొనడం అన్నది అంతవరకు జరగని కారణంగా, ఈ 1926 నాటి ఎన్నికల సంరంభమే కాంగ్రెసు జీవితంలో మొట్టమొదటి దయింది. ఈ ఎన్నికలు దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలలోనూ జరగడమూ, వాటిలో మొదటిసారిగా కాంగ్రెసు పాల్గొనడమూ అన్నది భారత చరిత్రలో ఒక అపూర్వ ఘట్టం అయింది.

## ఆంధ్రుల రాజకీయ చైతన్యం

ఆంధ్రులూ, ఆంధ్రదేశమూ కూడా 1920 నుంచీ, ఎటువంటి పరిస్థితికయినా తట్టుకుని నిలబడి, సరిఅయిన సూటి మార్గంలో నడవడానికి కావలసిన క్రమశిక్షణకు అలవాటుపడే ఉన్నారు. ఆంధ్రరాష్ట్రంలో జిల్లాలవారీగానూ, రాష్ట్రం మొత్తంమీదా కూడా పేరుపడ్డ సుప్రసిద్ధ నాయకు లున్నారు. నాయకుల మాటకేం - ఉంటూనే ఉంటారు. ఏ దేశంలోనయినా రాజకీయంగా వచ్చిన విప్లవం జయప్రదం కావాలంటే ప్రజలలోనూ చైతన్యం రావాలి. ఉన్నత రాజకీయ చైతన్యం ప్రజలలోనూ, ప్రజాసేవకులలోనూ కూడా బాగా పాదుకోవాలి. అప్పుడే నాయకుల నాయకత్వం బాగా రాణిస్తుంది. అదృష్టవశాత్తూ అటువంటి చైతన్యం ఆంధ్ర ప్రజా హృదయాలలో బాగా నాటుకుంది.

ఆంధ్రదేశం అంటే నేనే, నేనంటే ఆంధ్రదేశమే అన్నంత ఇదిగా దేశానికీ నాకూ అవినాభావ సంబంధం ఏర్పడి ఉంది. అంతేకాదు- ఆంధ్రులు 1907 నుంచీ దేశంకోసం త్యాగాలు చెయ్యడానికి ఎప్పుడూ సంసిద్ధులే. అందువల్లనే ఆంధ్రులకు ఏనాడో భారతరాజకీయ చరిత్రలో సుస్థిర స్థానం లభించింది.

1921-22 సంవత్సరాలలో ప్రప్రథమంగా ప్రారంభించబడిన సహకార నిరాకరణ ఉద్యమంలో అనేక ప్రాంతాలవారు జైలుకు పోవ డానికి సంసిద్ధులయ్యారు. 1922 లో గుంటూరులో ప్రారంభించబడిన పన్నుల నిరాకరణ ఉద్యమం పట్టుదలతో సాగింది. వందలాది గ్రామాధి కారులు తమ ఉద్యోగాలకు రాజీనామా లిచ్చారు. ప్రభుత్వం సాగించిన హింసాకాండను, కాంగ్రెసునూ-దాని విధానాలనూ అణగద్రొక్కడానికి ప్రభుత్వం తీసుకున్న చర్యలనూ ఎదుర్కొనడంలో ఆంధ్రులు కన బరచిన ఐకమత్యం, పట్టుదల, త్యాగశీలం మెచ్చి భారతీయులందరూ ఐక్యకంఠంతో "సెహబాస్ ఆంధ్ర!" అన్నారు.

అదే ఉత్సాహంతో 1926 నాటి ఎన్నికల సంరంభంలోకూడా ఆంధ్రులు ఎల్లా పాల్గొన్నారో ఇక్కడ చెప్పాలి. మామూలు ఎన్నికల ప్రచారం కంటె, మన పది పదిహేను తెలుగు జిల్లాలోనూ త్యాగం, సహనం, వ్యక్తి సత్యాగ్రహం అంటూ ఉపన్యాసాలనిచ్చి ప్రజలను ఉత్తేజితుల్ని చేయడం ఎంతో తేలిక.

దేశం మొత్తంమీద తమ తమ ప్రాంతాలకు ప్రతినిధులను ఎన్నుకోవాలి కదా! అలా ప్రతినిధులను ఎన్నుకోవలసిన నియోజక వర్గాలు బహు విస్తీర్ణం కలవై వేలాది ఓటర్లను కలిగి ఉండేవి. ఎన్ని కల విషయంలో కాంగ్రెసు వారికి అనుభవం లేదు. దేశవ్యాప్తమైన ఈ ఎన్నికల సంరంభంలో ఏ విధంగా పాల్గొనాలో, వోట్లంటే ఏమిటో, వాటిని వేసే విధానాలేమిటో, అవలంబించ వలసిన పద్ధతు లేమిటో ప్రజలకు తెలియదు.

ఇంగ్లండు మొదలైన ప్రజాప్రభుత్వ దేశాలలో వలెనే అభ్యర్థు లందరూ ప్రచారం నిమిత్తం, ఏజంట్లకనీ, పనివారికనీ అపరిమితంగా

తమ జేబుల్లోనుంచి వందలూ, వేలూ ఖర్చుపెట్టవలసి ఉంటుందని ఆఫీసర్ల భావన. ప్రభుత్వంవారూ, కాంగ్రెసు వారికి వ్యతిరేకంగా నిల బడ దలచిన అభ్యర్థులు కూడా కాంగ్రెసువారు చాలా బీదవారనీ, తమ కున్న ఆర్థిక స్తోమతా, పలుకుబడీ, ఎప్పటికీ వారికి కలుగజాలవనీ తల చారు. నిజానికి వారిలో పెద్ద పెద్ద భూస్వాములూ, లక్షాధికారులూ కూడా ఉన్నారు. అంతేకాదు- ఈ ఎన్నికల విషయంలో వారికి కావ లసినంత పూర్వానుభవం ఉంది.

## కేంద్రసభకు నా అభ్యర్థిత్వం

నన్ను కృష్ణా గోదావరీ మండలాల నుంచి కేంద్ర శాసన సభకు అభ్యర్థిగా నిర్ణయించారు. నాకు ప్రత్యర్థి దివాన్ బహదూర్ మోచెర్ల రామచంద్రరావు పంతులుగారు. ఆయనకు మంచిపేరూ, పలుకుబడీ ఉన్నాయి. అప్పటికి చాలా సంవత్సరాలుగా ఆయన కేంద్ర శాసన సభాసభ్యులుగా ఉంటున్నారు. ఆయన అజేయులనే కీర్తి వుంది. నా బాల్యమిత్రుడు, శ్రేయోభిలాషి అయిన లేట్ పి. వి. ఎస్. నరసింహరాజుగారు అటు మోచర్ల వారికీ ముఖ్య స్నేహితుడే. "రామచంద్రరావు పంతులుగారికున్న స్తోమతూ, పలుకు బడీ నీకు తెలియదు. ఆయనతో పోటీ యేమిటి నీవు? కట్టిన ధరావతు సొమ్ముకూడా నీవు కంటచూడజాల"వని నన్ను హెచ్చరించారు. నరసింహరాజూ, రామచంద్రరావుగారూ మితవాద కక్షకు చెందిన రాజ కీయవేత్తలు. వారు ప్రజలలో ఈ సహకార నిరాకరణ ఉద్యమం ఎటువంటి చైతన్యాన్ని కలిగించిందో, దేశంలో ప్రజాహృదయాన్ని కాంగ్రెసు ఏ విధంగా చూరగొందో గ్రహించలేదు. దేశీయులలో ఇటు వంటి మహత్తరమైన మార్పు రావడానికి మొదటినుంచీ కాంగ్రెసు వారు (నాయకులూ, సేవకులూ, అభిమానులూ) ఎటువంటి ప్రబోధం చేసి ప్రజాహృదయాన్ని ఆకర్షించి ఆకట్టుకో గలిగారో కదా! అక్ష రాస్యులూ, నిరక్షరకుక్షులూ - ప్రజలందరూ విచక్షణ జ్ఞానంతో వ్యవ హరించారు. దీర్ఘకాలం పట్టినా, న్యాయమైన, సుస్థిరమయిన క్షేమాన్నే

వారు కాంక్షించారు గాని, రోజులమీద లభ్యమయ్యే అశాశ్వత లాభాల మీదికి వారి దృష్టి మళ్ళలేదు.

నేను, ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడనైన కారణంగా, నా నియోజకవర్గంలోనేగాక, ఆంధ్ర దేశం మొత్తంమీద ఉన్న నియోజకవర్గాలన్నింటిలోనూ, తిరిగి ఎన్నికల ప్రచారం ముమ్మరంగా సాగించవలసిన విధి యేర్పడింది. చేయవలసిన పని బ్రహ్మాండమంత ఉంది.

## ప్రజల ఉత్సాహం

ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు సంఘంవారు ఆయా నియోజకవర్గాలకు ఎన్నిక చేసిన అభ్యర్థులందరూ సామాన్య కుటుంబాలవారే. వారికి సొంతడబ్బు ఖర్చుచేసుకోగల స్తోమతు లేదు. మేము ఎన్నికచేసిన అభ్యర్థులలో చాలామంది ముందుగానే ఒక షరతుపెట్టి మరీ నిలుచున్నారు. ఎన్నికలు సాంతం అయ్యేలోగా ఏ సందర్భంలోనూ, ఎప్పుడూ వారిని కించిత్తు కూడా స్వంత ధనాన్ని వినియోగించుకోమని కోరకూడదన్నదే వారి షరతు. కాంగ్రెసు వారికీ ఖర్చుపెట్టడానికి కావలసిన ఆర్థిక స్తోమతు లేదు.

నేనా- 'స్వరాజ్య' పత్రికా ప్రచురణాది బాధ్యతలలో చిక్కుకునే ఉన్నాను గదా! ప్రజలే తగు సహాయం చేసి, ప్రోత్సాహం ఇచ్చి కాంగ్రెసువారి విజయానికి తోడ్పడాలని నేనూ, ఇతర నాయకులూ, కాంగ్రెసు సేవకులూ అన్ని ప్రాంతాలలోనూ మేము ఇచ్చే ఉపన్యాసాలలో విన్నపాలమీద విన్నపాలు చేసుకుంటూ వచ్చాం. మేమంతా ఎంతో ఉత్సాహంగా, వాయువేగ మనోవేగాలతో అన్ని ప్రాంతాలూ చుట్టబెట్టాం. రోజూ సాధారణంగా ఇరవై ప్రాంతాలలోనైనా ఉపన్యాసా లిచ్చేవారం. ప్రజలు ఈ ఉద్యమాన్ని వారి 'స్వంతం'గానే భావించి, కాంగ్రెసు విజయమే తమ విజయం అని తలచి, కావలసిన ఆర్థికాది సహాయాలు చేస్తారన్న దృఢవిశ్వాసం నాకు ఉంది. ఎన్నికలలో కలిగే జయాపజయాల పైన దేశపు భావి అంతా ఆధారపడి

ఉన్నదన్న విషయం వారికి ఎప్పటి కప్పుడు మా ఉపన్యాసాలలో తెలియ చెప్పుతూ, అవసరమైన ప్రోత్సాహాన్నీ, ఉత్తేజాన్నీ కలుగజేస్తూనే వచ్చాం. ఈ సంరంభం అంతా తమ కోసమేననీ, దీని జయాపజయా లన్నీ వారివేననీ స్పష్టీకరించాము. ఏ మాత్రమైనా స్తోమత ఉన్నవారు తమ స్వంత ఖర్చుమీద, తమకు అందుబాటులో ఉన్న కార్లూ, బస్సులూ మొదలైన వాహనాలలో వెళ్ళి, ఆయా జిల్లాలకు చెందిన వివిధ నియోజక వర్గాలలో ఉత్సాహంగా పనిచేశారు. ఈ ప్రకారంగా ప్రజలే నడుములు బిగించుకుని, ముందుకొచ్చి, తమ ఖర్చులు తామే పెట్టుకుంటూ ఎన్నికల తతంగం అంతా నడిపించు కొచ్చారు.

## కాంగ్రెసు ఘన విజయం

సుమారు అన్నిస్థానాలలోనూ కాంగ్రెసు పేరిట జయం సాధించ గలిగాం. మా గెలుపు ఆంధ్ర రాష్ట్రానికే ఎంతో కీర్తినీ, ఘనతనీ చేకూర్చింది. నా నియోజకవర్గంలో సుమారు ఉన్న ఓటర్లందరూ ఓటు చేశారు. మోచర్ల వారు పదివేల వోట్ల తేడాతో ఓడిపోయారు. ఆయన అనుచరులకుగాని, ఆయనకుగాని, ఇతర నియోజక వర్గాలలో కాంగ్రెసు వారికి ప్రత్యర్థులుగా నిలచిన అభ్యర్థులకుగాని,అంతవరకూ దేశంలోనూ, ప్రజలలోనూ కాంగ్రెసు ఎంత పరివర్తన తీసుకు రాగలిగిందో, కాంగ్రెసువారు ఎంత గౌరవమూ, పలుకుబడీ సంపాదించ గలిగారో అర్థం కాలేదు.

సహకార నిరాకరణం పేరిట గత ఆరు సంవత్సరాలుగా జరిగిన ప్రచారం ఫలితంగా, ఆంధ్ర రాష్ట్రంలో వలెనే, మద్రాసు, దక్షిణ కన్నడ, మలయాళ ప్రాంతాలలో కూడా కాంగ్రెసు అఖండ విజయం సాధించింది. ఫలితాలు ప్రచురిస్తూన్న కొద్దీ, పరిపాలకులకూ, బ్రిటీషు వారికీ, ప్రపంచం అంతటికీ కూడా కాంగ్రెసుకు భారత దేశంలో ఉన్న స్థానం, బలిమి, కలిమి మొదలైనవన్నీ తెలియవచ్చాయి.

1926 లోనే ఇంత ఘన విజయం సాధించిన కాంగ్రెసు, తన నాయకులలో భేదాభిప్రాయాలు లేకుండా అంతా ఒకే త్రాటిమీద నడవ

గలిగి ఉంటె తన ఆశయం ఏనాడో సిద్ధింప చేసుకోగలిగేది. 1921 నుంచి 1927 వరకూ ఆరుసంవత్సరాలపాటు మా కార్యక్రమం ఏమిటో ప్రచారం చేస్తూ ప్రజలను కూడగట్టుకుని రాగలిగిన మేము-మా మోజు సహకార నిరాకరణం మీదనా, సహకారం మీదనా, అంటే సరిగా చెప్పలేని 'త్రిశంకు స్వర్గం'లోనే ఉన్నామేమో అనిపించ సాగింది.

## కేంద్ర సభలో 42 గాంధీ టోపీలు

ఎన్నికల అనంతరం క్రొత్తగా ఏర్పడిన కేంద్ర శాసన సభలో మా సంఖ్య 42. మద్రాసు మొదలైన వివిధ రాష్ట్రాలలో కాంగ్రెసువారు అత్యధిక సంఖ్యాకులుగానే ఎన్నికయ్యారు. కేంద్ర శాసన సభలో ఒక్క-సారిగా నలభై రెండు గాంధీ టోపీలు కనబడ్డం ఆశ్చర్యకరమైన విషయం. కాంగ్రెసుపార్టీవారి ధాటికి తట్టుకోలేక, అప్పటివరకూ నిరంకుశంగా పరిపాలించిన పెద్దల కందరికీ కాళ్ళల్లో వణుకు పుట్టింది.

ఈ దిగువ అంశాలమీద చరిత్రాత్మకమైన వాదోపవాదాలు జరిగాయి: ప్రజాక్షేమం - రిజర్వు బ్యాంకి స్థాపన - మారకపు విలువ 1 షి 4 పెన్నీల నుండి, 1 షి 6 పెన్నీలకు హెచ్చించే విషయం.

మా పార్టీ వారికి నాయకుడు మోతీలాల్ నెహ్రూగారు. ఆయన మంచి నేర్పరి. విద్యాపారంగతుడు, సమర్థుడు. ఏ విషయం మీద చర్చ వచ్చినా, ఎట్టి క్లిష్టపరిస్థితి ఉత్పన్నమయినా నిలబడగల శక్తి ఆయనకుంది. ఆనాటి భారతావనిలో సాటిలేని మేటి ప్రతిభ వారిది. తల పెట్టిన కార్యం ఘనంగానూ, గౌరవ ప్రదంగానూ నిర్వహించగల శక్తి వారిది.

కాని ఆయన చాలా ఆత్మాభిమానమూ, పట్టుదలా గల మనిషి. తన పార్టీ సభ్యుల నందరనూ కూడగట్టుకుని తనవైపు ఆకర్షించుకో గల సహనమూ, ఓరిమి, నేర్పు ఆయనకి ఉన్నట్లు కనిపించలేదు. ఆయనకీ శ్రీనివాసయ్యంగారికీ మధ్య స్పర్థ ఉండేది. వ్యక్తిగతమయిన అభిప్రాయ భేదాలవల్ల మోతీలాల్‌గారికీ, సి. ఎస్. రంగయ్యరుగారికీ పడుతూండేది కాదు. ఈ విషయాలు 1927-29 నాటి సంఘటనలలో రుజువయాయి.

## గౌ హ తీ కాం గ్రె స్ వి శే షా లు

1926 లో జరిగిన ఎన్నికల వేడి తగ్గకుండానే అస్సాం కాంగ్రెసు ఆరంభం అయింది. ఎన్నికల సంరంభంతో శరీరం పులిసి పోయినా నేను కొందరి మిత్రులతో కలసి గౌహతికి వెళ్ళాను. అస్సాం దేశపు పేరుపడిన లోయలలో ఈ గౌహతి అన్నది ఒక చిన్న గ్రామం.

పులులూ మొదలైన అడవి మృగాలకు ఆటపట్టని చెప్పబడే అడవి ప్రాంతానికి అనుకునే, కాంగ్రెసు పెండాలు నిర్మించబడింది. ఆ ప్రాంతం పులులకే గాక అడవి యేనుగులకు కూడా ఆటపట్టనీ, అవి తరుచుగా వచ్చి ఆ చుట్టుపట్ల వారికి తీరని నష్టాలు కలుగజేస్తూండడం పరిపాటనీ తెలియ వచ్చింది. ఆ పెండాలు నిర్మాణానంతరం, అనుదినమూ వాటిలో భీతి కలిగించి వాటిని దూరంగా పారద్రోలాలనే ఉద్దేశంతో ప్రతీ రాత్రి, ప్రతీ ఉదయమూ డప్పులూ, దండోరాలూ వాయించేవారు.

ఆ ప్రాంతం ఎంతో ప్రఖ్యాతి వహించిన హిమాలయాలపాదాల దగ్గర ఉండడాన్ని చాలా మనోహరంగా ఉంది. ఎక్కడో దక్షిణాపథం నుంచి వచ్చిన ఆ కాంగ్రెసు అధ్యక్షుణ్ణి 52 ఏనుగులు లాగే బండిమీద ఎంతో ఘనంగా ఊరేగిస్తారనీ, ఆ ఊరేగింపులో పాల్గొంటూ ఆనంద పారవశ్యంలో ఓలలాడాలనీ ఉవ్విళ్ళూరాం.

ఆ తరుణంలో అక్కడ ఢిల్లీలో శ్రద్ధానందుని కాల్చి చంపుతారని మేమెవ్వరమూ కలలో కూడా ఊహించలేదు. దాన్తో కాంగ్రెసంతా అంధకార బంధురమైన దుఃఖ సముద్రంలో మునిగి పోయింది. అధ్యక్షుని ఊరేగింపు ఆగిపోయింది. హృదయాలు బరువెక్కినా ఆ కార్యక్రమమంతా నిశ్చల దీక్షతో, సంకల్పించిన ప్రకారం నడుపబడింది.

## ఆప్తమిత్రుడు శ్రద్ధానంద

శ్రద్ధానందస్వామిది చాలా నిండయిన గంభీర విగ్రహం. నిష్కపట సరళ హృదయుడు. ధైర్య స్థైర్యాలు గల వ్యక్తి. అంతేకాదు దేశంకోసం ఏ క్షణాన్నయినా ప్రాణాలు సమర్పించడానికి వెనుదీయని

## గౌహతీ కాంగ్రెస్ విశేషాలు

1926 లో జరిగిన ఎన్నికల వేడి తగ్గకుండానే అస్సాం కాంగ్రెసు ఆరంభం అయింది. ఎన్నికల సంరంభంతో శరీరం పులిసిపోయినా నేను కొందరి మిత్రులతో కలసి గౌహతికి వెళ్ళాను. అస్సాం దేశపు పేరుపడిన లోయలలో ఈ గౌహతి అన్నది ఒక చిన్న గ్రామం.

పులులూ మొదలైన అడవి మృగాలకు ఆటపట్టని చెప్పబడే అడవి ప్రాంతానికి అనుకునే, కాంగ్రెసు పెండాలు నిర్మించబడింది. ఆ ప్రాంతం పులులకే గాక అడవి యేనుగులకు కూడా ఆటపట్టనీ, అవి తరుచుగా వచ్చి ఆ చుట్టుపట్ల వారికి తీరని నష్టాలు కలుగజేస్తూండం పరిపాటనీ తెలియ వచ్చింది. ఆ పెండాలు నిర్మాణానంతరం, అనుదినమూ వాటిలో భీతి కలిగించి వాటిని దూరంగా పారద్రోలాలనే ఉద్దేశంతో ప్రతీ రాత్రి, ప్రతీ ఉదయమూ డప్పులూ, దండోరాలూ వాయించేవారు.

ఆ ప్రాంతం ఎంతో ప్రఖ్యాతి వహించిన హిమాలయాలపాదాల దగ్గర ఉండడాన్ని చాలా మనోహరంగా ఉంది. ఎక్కడో దక్షిణాపథం నుంచి వచ్చిన ఆ కాంగ్రెసు అధ్యక్షుణ్ణి 52 ఏనుగులు లాగే బండిమీద ఎంతో ఘనంగా ఊరేగిస్తారనీ, ఆ ఊరేగింపులో పాల్గొంటూ ఆనంద పారవశ్యంలో ఓలలాడాలనీ ఉవ్విళ్ళూరాం.

ఆ తరుణంలో అక్కడ ఢిల్లీలో శ్రద్ధానందుని కాల్చి చంపుతారని మేమెవ్వరమూ కలలో కూడా ఊహించలేదు. దాన్తో కాంగ్రెసంతా అంధకార బంధురమైన దుఃఖ సముద్రంలో మునిగి పోయింది. అధ్యక్షుని ఊరేగింపు ఆగిపోయింది. హృదయాలు బరువెక్కినా ఆ కార్యక్రమమంతా నిశ్చల దీక్షతో, సంకల్పించిన ప్రకారం నడుపబడింది.

## ఆప్తమిత్రుడు శ్రద్ధానంద

శ్రద్ధానందస్వామిది చాలా నిండయిన గంభీర విగ్రహం. నిష్కపట సరళ హృదయుడు. ధైర్య స్థైర్యాలు గల వ్యక్తి. అంతేకాదు దేశంకోసం ఏ క్షణాన్నయినా ప్రాణాలు సమర్పించడానికి వెనుదీయని



వ్యక్తి. సుప్రసిద్ధ దేశభక్తుడు. నాకు ఆప్తమిత్రుడు. మేము సన్నిహితులం. ఎప్పుడు కలుసుకున్నా హృదయాలను విప్పి మాట్లాడుకునే వాళ్ళం. హిందూ-మహమ్మదీయ సఖ్యం విషయంలోనూ అభిప్రాయాలు ఒకరి కొకరం చెప్పుకునేవారం. కాంగ్రెస్సులలోనూ, హిందూ మహాసభా కాన్ఫరెన్సులలోనూ తరుచు కలుసుకునే వారం.

1922 లో జరిగిన ముల్తాన్ గొడవల్ని పురస్కరించుకుని మదనమోహన మాలవ్యాగారూ లజపతిరాయిగారూ, స్వామీ శ్రద్ధానందా కలిపి స్థాపించిన హిందూ మహాసభ దినదిన ప్రవర్ధమానమై, క్రమేపీ దేశంలో ప్రముఖ స్థానాన్నే ఆక్రమించింది. కలకత్తాలో హిందూ-మహమ్మదీయ కలహాలు జరిగిన దరిమిలా మేము ఉభయలమూ ఒక ఉపన్యాస వేదికపై అనుకోకుండా కలుసుకున్నాము. ఈ హిందూ మహమ్మదీయ సంక్షోభాన్ని గురించి తర్కించాం.

ఆయన బెంగాలులో ఉన్న హిందువుల మహమ్మదీయుల జనాభా లెక్కలతో సమన్వయం చేస్తూ బెంగాలు చరిత్రంతా నాకు తెలియజేశాడు. ఏ పుస్తకమూ తిరగవేయవలసిన అవసరం లేకుండానే కావలసిన సమాచారమంతా ఆయన నాలిక చివరే ఉండేది. ఆదిలో అత్యధికమైన హిందూ జనాభా కలిగిఉండే ఆ బెంగాలు రాష్ట్రంలో మహమ్మదీయ ప్రాబల్యం వృద్ధి అయిన కొద్దీ, ఏటేటా ఎల్లా హిందువులు మహమ్మదీయ మతాన్ని స్వీకరించిందీ, ఇప్పుడు ఏ ప్రకారంగా ఆ హిందూ జనాభా అంతా క్షీణించిన అల్పసంఖ్యాక వర్గంగా రూపొందిందీ వివరిస్తూంటే నాకు నిజంగా ఆశ్చర్యం వేసింది. ఆయన గత 70, 75 సంవత్సరాలలోనూ జరిగిన యీ మతాల మార్పిడుల చరిత్ర సమగ్రంగా వివరించి చెప్పాడు.

స్వామీ శ్రద్ధానంద తాను ఆర్యసమాజ సంఘ సభ్యుడననీ, తానూ తన అనుచరులూ కలసి హిందూ సంఘ సముద్ధరణకోసం ఎల్లా పాట్లు పడుతున్నదీ వివరించాడు. మహమ్మదీయుల బారినుంచి హిందువులు తప్పించుకునే శక్తికూడా లేక, ఆత్మరక్షణకూడా సరిగా చేసుకోలేని స్థితిలో ఉన్నారనీ, ఇస్లాంనుంచి. తిరిగి హిందూమతంలోకి మారా

లన్నా మార్గాంతరం లేక అవస్థలు పాలవుతున్నారనీ వివరించాడు' సదాచార సంపన్నులైన హిందువులు మహమ్మదీయ మతంనుంచి హిందూమతంలోకి పునఃప్రవేశానికి ఒప్పుకోని కారణంగా హిందూ మతం క్షీణిస్తోందనీ, దీని కంతటికీ హిందూ నాయకుల ఉదాసీనతే కారణమనీ అన్నాడు.

లాలా లజపతిరాయి, స్వామీ శ్రద్ధానందుల ఆధిపత్యంలో పని చేస్తూ ఉన్న ఆర్యసమాజంవారు నిర్భయంగానూ, దృఢ చిత్తంతోనూ అవసరమైన సేవ చేస్తున్నారు. ఆహితాగ్నులలో ఆహితాగ్నిగా పేరు పొందిన మదన మోహన మాలవ్యాగారు తక్కిన కార్యనిర్వాహక వర్గీయులతో కలసి ముల్తాన్‌లో జరిగిన దురంతాలూ ప్రత్యక్షంగా చూసి, అక్కడ కూల్చబడిన ఆలయాలూ, విరగగొట్టబడిన విగ్రహాలూ కలిగించిన మానసిక క్లేశంతో, మొట్టమొదటిసారిగా తన నోటమ్మట తానే హిందూ సంఘ సంరక్షణకోసం "శుద్ధి సంగతం" అవసర మన్నాడు. అప్పటి వరకూ ఆర్యసమాజీకులు చేస్తూ వచ్చిన ప్రచారం తాను అందు కున్నాడు. యావత్తు భారత దేశాన్నీ ఆవరించి ఉన్న ఆర్యసమాజం తాలూకు మతాచార్యులకు స్వామీ శ్రద్ధానంద ప్రారంభించిన "గురు కులమే" దీక్ష నిచ్చి తరిఫీదు నిచ్చింది.

రాజకీయ ప్రపంచంలో కూడా స్వామీ శ్రద్ధానంద పేరుపడ్డ నాయకుడే. కాంగ్రెసు అధ్యక్షులకూ, వీరికీ ఎప్పుడైనా అభిప్రాయ భేదాలు వస్తే, అంటే-కాంగ్రెసు అధ్యక్షులకు స్వామీ శ్రద్ధానందుని దృక్పథం సరిగా అర్థంకాని పరిస్థితులలో, ఆ సంగతి గ్రహించి స్వామీజీ, స్పర్థలూ వాగ్వివాదాలూ పెరక్కుండా, చల్లగా బైటకువెళ్ళి పోయేవాడు. ఆయన అటువంటి పరిస్థితులలో చల్లగా జారుకోవడం కలకత్తా కాంగ్రెసులోనూ జరిగింది. ఆ ఉదంతం మాత్రం నాకు బాగా జ్ఞాపకం ఉంది. స్వామీ శ్రద్ధానంద లేని లోటుకు నేను ఎన్నోసార్లు బాధపడ్డాను. అది ఎప్పటికీ తీరేలోటు కాదు.

లన్నా మార్గాంతరం లేక అవస్థలు పాలవుతున్నారనీ వివరించాడు. సదాచార సంపన్నులైన హిందువులు మహమ్మదీయ మతంనుంచి హిందూమతంలోకి పునఃప్రవేశానికి ఒప్పుకోని కారణంగా హిందూ మతం క్షీణిస్తోందనీ, దీని కంతటికీ హిందూ నాయకుల ఉదాసీనతే కారణమనీ అన్నాడు.

లాలా లజపతిరాయి, స్వామీ శ్రద్ధానందుల ఆధిపత్యంలో పని చేస్తూ ఉన్న ఆర్యసమాజంవారు నిర్భయంగానూ, దృఢ చిత్తంతోనూ అవసరమైన సేవ చేస్తున్నారు. ఆహితాగ్నులలో ఆహితాగ్నిగా పేరు పొందిన మదన మోహన మాలవ్యాగారు తక్కిన కార్యనిర్వాహక వర్గీయులతో కలసి ముల్తాన్‌లో జరిగిన దురంతాలూ ప్రత్యక్షంగా చూసి, అక్కడ కూల్చబడిన ఆలయాలూ, విరగగొట్టబడిన విగ్రహాలూ కలిగించిన మానసిక క్లేశంతో, మొట్టమొదటిసారిగా తన నోటమ్మట తానే హిందూ సంఘ సంరక్షణకోసం "శుద్ధి సంగతం" అవసర మన్నాడు. అప్పటి వరకూ ఆర్యసమాజీకులు చేస్తూ వచ్చిన ప్రచారం తాను అందుకున్నాడు. యావత్తు భారత దేశాన్నీ ఆవరించి ఉన్న ఆర్యసమాజం తాలూకు మతాచార్యులకు స్వామీ శ్రద్ధానంద ప్రారంభించిన "గురుకులమే" దీక్ష నిచ్చి తరిఫీదు నిచ్చింది.

రాజకీయ ప్రపంచంలో కూడా స్వామీ శ్రద్ధానంద పేరుపడ్డ నాయకుడే. కాంగ్రెసు అధ్యక్షులకూ, వీరికీ ఎప్పుడైనా అభిప్రాయ భేదాలు వస్తే, అంటే-కాంగ్రెసు అధ్యక్షులకు స్వామీ శ్రద్ధానందుని దృక్పథం సరిగా అర్థంకాని పరిస్థితులలో, ఆ సంగతి గ్రహించి స్వామీజీ, స్పర్థలూ వాగ్వివాదాలూ పెరక్కుండా, చల్లగా బైటకువెళ్ళిపోయేవాడు. ఆయన అటువంటి పరిస్థితులలో చల్లగా జారుకోవడం కలకత్తా కాంగ్రెసులోనూ జరిగింది. ఆ ఉదంతం మాత్రం నాకు బాగా జ్ఞాపకం ఉంది. స్వామీ శ్రద్ధానంద లేని లోటుకు నేను ఎన్నోసార్లు బాధపడ్డాను. అది ఎప్పటికీ తీరేలోటు కాదు.



## సాంబమూర్తి స్వాతంత్ర్య తీర్మానం

కాన్పూర్ కాంగ్రెసులో 1925 వ సంవత్సరంలో తీర్మానించబడిన కౌన్సిల్ ప్రోగ్రాం తిరిగి గౌహతీలో చర్చించబడి, ఆమోదం పొందింది. ఆ తీర్మానం ప్రకారం- ఎన్నికలలో నెగ్గి శాసన సభలలో సభ్యత్వం సంపాదించినా, హోదాలేవీ చేపట్టకుండా వర్తిస్తూ, కాంగ్రెసు వారి కోర్కెలు సఫలం చెయ్యబడేవరకూ ప్రభుత్వంవారి కార్యక్రమానికి అడ్డు తగులుతూండడమే అనుసరించవలసిన విధానం. అంతేకాదు, బడ్జెట్ ప్యాసుకాకుండా చూడాలనీ, మంత్రులు జీతాలు పుచ్చుకోకుండా ఉండాలనీ దేశవ్యాప్తంగా గ్రామ పునరుద్ధరణ జరగాలనీ కొన్ని తీర్మానాలు చేయబడ్డాయి.

ఈ దరిమిలాను మద్రాసు శాసనసభా స్పీకరు పదవి నధిష్ఠించిన బులుసు సాంబమూర్తిగారు, ఆనాడు దేశానికి స్వేచ్ఛాస్వాతంత్ర్యాల విషయంలో ప్రప్రథమంగా అలజడి తీసుకువచ్చారు. ఆయన 1926కు పూర్వమే, ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు సంఘ సమావేశాలలో ఈ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను గురించిన ఉద్బోధ ఆరంభించారు. ఈ ప్రసక్తి ఎత్తుకుంటూ కాకినాడలో జరిగిన 1921 నాటి తూర్పుగోదావరిజిల్లా కాంగ్రెసు సమావేశంలో ఒక తీర్మానాన్ని ప్రవేశ పెట్టారు. అప్పుడు ఆయన్ని నేను అడ్డుకున్నాను. కాని ఆయన ఈ అంశాన్ని అఖిల భారత కాంగ్రెసు కమిటీవారి ముందు ఉంచారు. గౌహతీలో ఈ విషయం మీద గాంధీగారికీ, సాంబమూర్తిగారికీ తీవ్రమయిన వాదోపవాదాలు జరిగాయి. గాంధీగారు ఈయన్ని లొంగతీసుకోవాలని ప్రయత్నించారు గాని, ఈయన లొంగలేదు. దేశాన్ని త్యాగాలమీదా త్యాగాలు చెయ్యడానికి సంసిద్ధం చేయాలన్నదే ఆయన వాంఛ. నిజానికి సాంబమూర్తి మూర్తీభవించిన త్యాగం. గాంధీగారు ఈయన్ని ఎగతాళి చేస్తూ, ఈ బ్రహ్మపుత్రానదిలో మనమంతా కట్ట కట్టుకుని దిగినా దేశానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లభించవన్నారు. దాన్తో సాంబమూర్తిగారి స్వాతంత్ర్య తీర్మానం త్రోసివేయబడింది. గాంధీగారికి దేశస్వాతంత్ర్యం విషయంలో

వచ్చిన తీర్మానాలని త్రోసివెయ్యడ మన్నది ఇదే మొదటిసారి కాదు. అనేకసార్లు అట్టి త్రోసివేతలు జరిగాయి.

కాన్పూరు కాంగ్రెసు అనంతరం ఒక సంవత్సరం విశ్రాంతి తీసుకుంటానన్న గాంధీగారు గౌహతీ కాంగ్రెసుకు హాజరయ్యారు. కాంగ్రెస్సును తిరిగి చేపట్టాలనే ఆతురత ఆయన ఎంతమాత్రమూ చూపించలేదు. మోతీలాల్ నెహ్రూ-శ్రీనివాసయ్యంగార్లకు కాంగ్రెసును తిరిగి గాంధీగారి పరం చెయ్యాలన్న అభిలాష లేదు. కాగా ఎన్నికలలో కాంగ్రెసు తరఫున అభ్యర్థులను నిలబెట్టి, ఎన్నికల తతంగమంతా నడిపించడానికి వారికి అధికారం కూడా ఇచ్చారు.

## యు. పి. లో అపజయం

దేశవ్యాప్తంగా జరిగిన యీ ఎన్నికలలో మద్రాసు రాష్ట్రం లోనే కాదు-ఇంకా ఎన్నో రాష్ట్రాలలో కాంగ్రెసు అభ్యర్థులకే విజయం పరంపరలు లభించాయి. కాని యు. పి. లో మోతీలాల్ నెహ్రూగారి నియోజకవర్గంలో తీవ్రమయిన ఆశాభంగం కలిగింది. ఆ రాష్ట్రంలో ప్రజలను ప్రబోధించి, ఒకే త్రాటి మీదికి వచ్చేలా చేయడానికి ప్రచారం సరిగా జరగలేదు. అసలు అక్కడి ప్రచారశాఖే సరిగా యేర్పాటు చేయ- చేయబడలేదు. నిజానికి ఆ నియోజకవర్గం జమీందారీ ప్రాంతం. ఆ ప్రాంతీయులకు జమీందార్లను ఎదిరించి నిలబడగల శక్తి లేదు. దానికి సరిపడ్డ ప్రచారమూ లేదు.

మోతీలాల్‌గారు ఈ ఓటమికి కారణం ప్రత్యర్థులు వ్యక్తిగతంగా తన్ను గురించి చేసిన దుష్ప్రచారమే నన్నారు. తాను గ్రామాలమ్మట తిరిగి, తనపై జరుగుతూన్న దుష్ప్రచారాన్ని ఎదుర్కొనడానికి ప్రయత్నించలేదని ఒప్పుకున్నారు. అందువల్లనే ఓటమి సంభవించింది. ప్రత్యర్థుల తాలూకు ప్రచారకులు ఆయనపై మోపిన నేరాలను గురించి ఆయనే చెప్పారు. తాను గోమాంసం తింటున్నాడని, తనకు కావలసిన గోమాంసం లభ్యం కాదనే కారణంగా తాను గోవధను నిషేధించడనీ, మసీదులముందు ఊరేగింపులలోని బాజాభజంత్రీలను

మోగింపనీయడనీ, ఆయన హిందూ ధర్మ వినాశనకారి అనీ, ఇంగ్లీషు తిండితింటూ, ఇంగ్లీషు వారిలాగే తాను బ్రతుకుతున్నాడనీ ప్రత్యర్థులు ఆయనపై నేరారోపణ జేశారన్నారు. ఇవన్నీ తనపై తీసుకరాబడిన అబద్ధపు ఛార్జీలని తనకు తెలుసు. కాని వాటిని ఖండించడానికి తాను గ్రామాలమ్మట తిరగలేకపోయానన్నారు.

## తప్పుడు అంచనా

తాను స్వయంగా ఏ గ్రామానికీ వెళ్ళకపోయినా, గ్రామీణు లందరూ ఓటు చేసి తనను గెలిపిస్తారనే తప్పుడు అంచనా వేసుకున్నా రాయన. బ్రిటిష్ క్యాబినెట్, సెక్రటరీ ఆఫ్ స్టేట్, రీడింగ్ ప్రభువూ మన ప్రత్యేక ఘనతలనూ, అంతస్తులనూ గ్రహించి దఫ దఫాలుగా కోరుతూ ఉన్న మన కోర్కెలను మన్నించి తీరుతారని తలచడం ఎంత పొరపాటో, నియోజక వర్గంలో తిరక్కుండానే, ఓటర్లను కలుసుకోకుండానే, మన పేరు ప్రతిష్ఠలను గ్రహించి వారి ఓట్లు మన కిస్తారని తలంచడమూ అంత పొరపాటే. గాంధీగారితో వ్యతిరేకించి కాంగ్రెసును చేత పట్టగలిగిన ఈ మేధావులు 'పాపం, వారిది బీదదేశం, అక్కడ ఉన్నవారు బలహీనులూ, అర్భకులూ' అని ఆలోచించి, వారి యందు దయాదాక్షిణ్యాలు కలిగి బ్రిటిషువారు ఏవేవో సదుపాయాలూ వగైరాలు చేస్తారనీ ఎల్లా తలచారో అర్థం కాదు. ప్రజాబాహుళ్యం నాయకులకు అండగా నిలవందే, నాయకులు కోరిన కోర్కెలు మన్నించబడడం జరగదని, 1885-1921 సంవత్సరాల మధ్య జరిగిన అనేక సంఘటనలను విలియా వేసుకుని సంగతి సందర్భాలు మన మితవాద నాయకులు గ్రహించి ఉంటే, కథ అడ్డం తిరిగి, ఆంగ్లేయుల ఆట కట్టయ్యేది. గాంధీగారిని ఓడించి, కాంగ్రెసును తమ వశం చేయమని అడగగలిగిన ధీశాలురు, వారి కార్యక్రమ వివరాలను, శాసన సభా ప్రవేశ ఉద్దేశాలను సవ్యంగా ప్రజల ముందు పెట్టి ప్రజా హృదయాన్ని ఆకట్టుకోవలసి ఉంది.

1921 నాటి కాంగ్రెసు పటుత్వం, నిర్మాణ కార్యక్రమం, హిందూ మహమ్మదీయ మైత్రి అనే సూత్రాలమీద నెలకొల్పబడింది.

మనకు ప్రతికూలమైన పరాయి ప్రభుత్వం మన ఆశయాలను సర్వనాశనం చేస్తూఉంటే, మనవాళ్ళు శాసన సభా ప్రవేశం అనే నిరపాయకరమైన మార్గమును పట్టుకుని, నవ జీవన విధానంగా నూతన నిర్మాణం సాగించి తమ స్థాయిని నిలుపుకోవడానికయినా జనులను ప్రబోధించి, ఆర్థిక, రాజకీయ స్వాతంత్ర్య సంపాదనకు పాటుపడివుండవలసింది. ఇలా ఎత్తు పై యెత్తులు వేసుకుంటూ ప్రజలలో ప్రచారం, ప్రబోధం చేసిఉంటే, సంయుక్త రాష్ట్రాలలో పండిత మోతీలాల్ నెహూర్గారు ఆ ఎన్నికలలో ఓడిపోయేవారేకాదు. ఈ సంగతి వారి కుటుంబీకులు నిర్మొగమాటంగా ఒప్పుకున్నారు.

గాంధీగారి అనుచరులుగా ఖాదీ ఉద్యమంలో తల దూర్చినవారు, తమకున్న చిక్కులతో కొట్టు మిట్టాడుతూ, తిరిగీ కాంగ్రెసు గాంధీగారి చేతులలోకి వస్తేనే బాగుండును - ఆ శుభముహూర్తం ఎప్పుడో కదా అని ఎదురు చూస్తూ ఉండేవారు. ప్రజలలో ఓటింగు విధానాన్ని గురించి కాని, తద్వారా కలుగగల కీడు మేళ్ళను గురించి గాని, పరిపాలనా విధానాలను గురించిగాని ప్రజలకు బోధించడంలో వారికి ఆసక్తే లేదు. నిర్మాణ కార్యక్రమవాదులు తదితరములైన రాజకీయాది కాంగ్రెసు విధానాలలో పాల్గొనడం తమకు అనవసరం అని తలచేవారన్నమాట! వారికి తెలిసినదల్లా ఒక్కటే-గాంధీగారి శక్తిసామర్థ్యాలు బహుళం అనీ, వారి సహకార నిరాకరణమూ, శాసన ధిక్కారము మొదలైన విధానాలన్నీ విజయవంతం అవుతాయనీ. ముందు ముందు ఎప్పుడో ఒకనాడు ప్రజలే రాజ్యాంగాన్ని చేపట్టి, పరిపాలనా యంత్రాన్ని నడిపించగలరనే దూరదృష్టి వారికి ఉన్నట్లు కనిపించలేదు.

## పేలిన టపాకాయలు

ఈ రెండు రకాల కాంగ్రెసు కార్యక్రమాల మధ్య పడి నలిగి, నాయకులలో నెలకొన్న అలసతాభావం కారణంగా ప్రజలు చిక్కుల పాలయ్యారు. తమ నాయకులు ఎన్నికలలో నెగ్గారు నిజమే. కాని అవసరమైన రాజకీయ చైతన్యం వారు కలిగించక పోవడాన్ని ప్రజలకు

తమకు ఏకం కావాలో, తమచే ఎన్నుకోబడ్డ వారిద్వారా దేశానికీ, తమకూ సమకూరవలసిన లాభా లేమిటో తెలియకపోయింది. శాసన సభ్యులు కాంగ్రెసు విధానాన్ని విస్మరించరాదనీ, తమకు కష్టనష్టాలు కలుగచేసే ఏవిధమైన కార్యక్రమాలలోనూ తల దూర్చరాదనీ చెప్ప గల స్తోమతు వారిలో లేకపోయింది. ప్రజల దృక్పథంలో అటువంటి పరిణామమూ, వారిలో ఆ శక్తి కలిగించవలసింది నాయకులే అయినా, శాసన సభ్యులను శాసించగల శక్తి ప్రజలలో లేని కారణంగా, వారు పేలిపోయిన టపాకాయల్లా నిశ్శబ్దంగానూ, నిర్జీవంగానూ తయా రయ్యారు. ద్వంద్వ పరిపాలనపు రాపిడిలో ఇరుక్కున్న మంత్రులు కేవలం దిష్టిబొమ్మల్లా తయారయ్యారు.

ద్వంద్వ ప్రభుత్వ విధానంలోని శాసన సభ్యుల పరిస్థితికీ, 1937 లో ఏర్పడిన కాంగ్రెసు మంత్రివర్గాల పరిస్థితికీ తేడా లేదనే అనాలేమో! నాయకవర్గం నిర్మాణ కార్యక్రమపు టవసరాలనూ, లాభ నష్టాలనూ గురించి, 1922 నుంచి ఈ రోజు వరకూ, ఏదో అలసత్వం తోనే వర్తించిందని అనక తప్పదు.

## గాంధీగారికి నా ప్రశ్న

వార్ధాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగునకు అధ్యక్షులవారు అందజేసిన ప్రత్యేక ఆహ్వానంపై నేను వెళ్ళి, ఆనాటి కార్యనిర్వాహకవర్గ సభలో పాల్గొన్న సందర్భంలో, సభ్యులందరి సమక్షమందూ, మహాత్మా గాంధీగారికి ఈ దిగువ విషయాలు స్పష్ట పరిచాను.

"మీరు ఈ దేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికి పాటు పడుతున్నారు. కాని మీరు సఫలత పొందలేకపోవడానికి కారణం, మీరు మీ కార్యక్రమంలోనూ, మీ యోచనా కౌశలాదులందూ నమ్మకం లేనటువంటి, మీ నిర్మాణాత్మక విధానమందు విశ్వాసం లేనటువంటి వారితో కలసి పాటుపడడమే కదా?'' అని ప్రశ్నించాను.

ఎన్నికలలో అధిక సంఖ్యాకులుగా కాంగ్రెసువారు గెలిచి, శాసన సభాస్థానాలను ఆక్రమించుకొనడం అన్నది కేవలమూ ఒక బూటకమే

కదా? నాయకులలో ధీమా లేదు. అనుచరులలో శక్తి లేదు. వీలయితే ఏదో ఒక ఉద్యోగం దొరికితే చాలదే గదా ప్రతివారి తాపత్రయం? కాంగ్రెసు ఉద్యోగస్వీకారం చేయరాదనీ, బడ్జెట్ ప్రతిపాదనలను తిరస్కరించాలనీ, దేశానికి నిరుపయోగమని భావించిన విషయాలలో సహకరించకూడదనీ ఆదేశిస్తే, శాసన సభా ప్రవేశం చేసిన కాంగ్రెసు వారు సర్వసాధారణంగా క్లిష్టపరిస్థితులలో నిర్వీర్యుల్లా బలహీనతనే వ్యక్తపరచి ఉన్నారు కదా? 1927, 28, 29 సంవత్సరాలలో శాసన సభలో జరిగిన అనేక సంఘటనలు, పై విషయాలను రుజువు చేస్తున్నాయి కదా?

ఇటువంటి పరిస్థితులకు కారణం వారిని ఆదేశించిన విధానమే కదా? వారు ఆయా సంవత్సరాలలో ఏమీ సాధించలేని స్థితిలో ఉంటే, వారిని నిందించడానికి వీలులేని విధంగా, కేంద్ర శాసన సభలలో బాధ్యత అన్నది లేకుండా వ్యవహరించడమూ, రాష్ట్ర శాసన సభలలో ప్రభుత్వాన్ని ఎదిరించమని ఆదేశించడమే కదా కారణం? మంత్రులు ప్రజాభిప్రాయానికి భిన్నంగానూ, నిష్పూచీగానూ వ్యవహరించడమూ జరిగింది కదా? పండిత మోతీలాల్ నెహ్రూగారూ, వారి పార్టీ వారూ కలిసి, వారికి ఒప్పగించబడిన ప్రతి స్వల్పవిషయంలోనూ ప్రజాహృదయానికీ, అభిప్రాయానికీ బాధ్యత వహించి వ్యవహరింపవలసిన పరిస్థితులలో, శాసన సభలో వాగ్వివాదాలతో విలువైన కాలాన్ని పై కారణాలవల్ల వృథా చేయడం అవివేకమే కదా?

నిజానికి 1927-1930 సంవత్సరాల మధ్య ఈ శాసన సభలలో ఉన్న మన కాంగ్రెసు సభ్యులు ధీశాలురూ, శక్తిమంతులూ, రాజ్యతంత్రజ్ఞులూ, పార్లమెంటరీ పద్ధతిని పరిపాలన సాగించగల నేర్పరులూ, అధికారం హస్తగతం అయితే తమ శక్తి సామర్థ్యాలను నిరూపించగల యోధులు అని పేరుగాంచారు. రిజర్వు బ్యాంకి బిల్లును గురించీ, కరెన్సీని గురించీ, మారకపు విలువలను గురించీ కేంద్ర శాసన సభలో జరిగిన చర్చలు గమనార్హమయి, మనవారి శక్తిసామ

ర్థ్యాలను ధ్రువపరచాయి. అదే ప్రకారం, రాష్ట్ర శాసన సభలలో కూడా మనవారు తమ విజ్ఞానాన్ని ప్రదర్శించారు.

ఈ కౌన్సిల్ ప్రోగ్రాం రోజులలో (1927-30) నిర్మాణ కార్యక్రమం దెబ్బతింది. కాంగ్రెసులో వెనుకటివలెనే కేంద్రంలోనూ, రాష్ట్రాలలోను చీలికలు ఏర్పడ్డాయి. మనం 1927 నాటి ముచ్చటలు తెలుసుకునే లోపల, గాంధీగారివద్దకు తిరిగీ వచ్చే సందర్భంలో జరిగిన కొన్ని సంఘటనలను గురించి తెలుసుకుందాం.

## ఢిల్లీ సందర్శనం

గౌహతీనుంచి తిరిగీ వచ్చేటప్పుడు, స్వామీ శ్రద్ధానంద హత్య విషయంలో సమాచార సంగ్రహణ కోసమని, అచ్చటి సంఘటనలను గురించి స్వయంగా విచారిద్దామనే వాంఛ గలిగి ఢిల్లీ చేరుకున్నాను. నేను స్వామీజీ గృహానికి వెళ్ళాను. ఆయన కుమారుడు నాతో వచ్చి, హత్యకు సంబంధించిన సంగతులు చెపుతూ, ఆయా తావులన్నీ చూపించాడు. నిజానికి వారి గృహం ఒక పవిత్రమైన యాత్రాస్థలం. అలా దానిని రూపొందించడం న్యాయమే. లాలా లజపతిరాయిగారూ, స్వామీజీ కలిసే ఆర్యసమాజ కార్యక్రమాలు నిర్వహించేవారు. లజపతిరాయిగారు గౌహతీ కాంగ్రెసులో పాల్గొనడానికి వస్తూ, దారిలో స్వామీజీ హత్యా విషయం వినడంతోనే విషాద భరిత హృదయంతో, ఆగని కన్నీటి కాల్వతో వెనక్కి మళ్ళారు. స్వామీజీని దొంగపోటు పొడిచి చంపారు.

## నాభా సమాచారం

బ్రిటిష్ గవర్నమెంట్ వారితో నాభా మహారాజుగారికి వచ్చిన భేటీలో ఆయన, మోతీలాలు నెహ్రూగారిని తమ న్యాయవాదిగా నిర్ణయించుకుని, వారికి వకాలతు ఇచ్చారు. అప్పట్లో కేంద్ర శాసన సభా సభ్యుడుగా ఉంటూ ఉన్న సి. ఎస్. రంగయ్యరు మహారాజావారి ఆప్త మిత్రుడు, సలహాదారుడూను. మహారాజావారికి మోతీలాల్‌గారి కిచ్చిన

వకాలతు రద్దుచేయాలనే ఊహ జనించింది. కాంగ్రెసు వేదికమీద ఈ నాభా విషయం చర్చకువచ్చి ఉంటె అది ఒక చికాకు పంచాంగంగా తయారయ్యేది. కాని ఈ విషయాన్ని కాంగ్రెసు వేదికపై చర్చనీయాంశంగా ప్రవేశపెట్ట కూడదని పట్టుపట్టిన గాంధీగారివల్ల, ఇది కాంగ్రెసులో చర్చకు రాలేదు.

ఆఖరి రోజులలో నాభా మహారాజు, తనకు ఎవరివల్లనైనా ఉపకారం జరుగుతుందేమోనన్న భ్రమతో, తోచిన వారి నందరినీ సలహా అడిగేవాడు. శాసన సభలో ఈ విషయంలో నేను కొన్ని ప్రశ్నలు వేశాను. తర్వాత యీ కేసుకు సంబంధించిన పత్రాల నన్నింటినీ తిరిగేశాను. మహారాజు చిన్నతనంలో చాలా స్వతంత్రంగా వ్యవహరించి, బ్రిటిషు వారితో తగాయిదాలు కొని తెచ్చుకున్నట్లున్నూ, ఆ స్వతంత్ర వర్తనమే ఈ తగాయిదాలకు మూలమనిన్నీ నాకు దృఢ విశ్వాసం కలిగింది. వీరి ప్రత్యర్థి వీరికంటె శక్తి, పలుకుబడీ కలిగిన ఇంకొక మహారాజు.

నేను శాసన సభలో ఈ ప్రస్తావన తీసుకువచ్చి చర్చసాగిస్తూన్న రోజులలోనే, మద్రాసుకు రావలసి వచ్చింది. అప్పుడు నాభా మహారాజు కొడైకానలు కొండలలో విశ్రాంతి తీసుకుంటున్నారు. మహారాజును నేను స్వయంగా కలుసుకుని సమాచారం అంతా గ్రహించాను. ముఖ్యంగా నేను కేంద్ర శాసన సభలో పృచ్ఛచేసిన అంశాలన్నీ క్షుణ్ణంగా పరిశీలించాను. ఆయన వాదన సరి అయినదీ, న్యాయమయినదీ అయినప్పటికీ ప్రభుత్వంవారు తమ పట్టు విడువలేదు.

మహారాజావారి వైపు న్యాయం ఉన్నా, ఆయన వ్యాజ్యం వేయడానికి ఇష్టపడలేదు. పక్కమార్గాల గుండా ఒత్తిడులు తీసుకువస్తే చాలని తలచాడు. మంచి హోదా, పలుకుబడీగల పెద్దలను కలుసుకుని, వారి ద్వారా ప్రభుత్వం వారికి నచ్చచెప్పించి నట్లయితే తనకు ఉపకారం జరుగుతుందని గట్టిగా నమ్మాడు. నిజానికి పలుకుబడీ, శక్తి తమకున్నదనుకునే వారంతా రాజావారి చుట్టూ చేరారు. ఆ పెద్దల ప్రయత్నాలన్నీ విఫలం అయ్యాయి. ఆయన నమ్మిన వారెవరూ లేశమాత్రి

మైన ఉపకారమైనా చేయలేకపోయారు. భార్య, బిడ్డలూ కూడా ఆయ నకు దూరమయ్యారు. ఆయన ఎన్ని తంటాలు పడినా, ఎంత ఒత్తిడిని తీసుకురాగలిగినా, చివరకు వారి అంతస్తుకు, హుందాతనానికి తగిన "శిక్షణ" కోసం వారిని ప్రభుత్వంవారు ఇంగ్లాండు పంపించేశారు. మహా రాజావారు కొడైకానలు దాటి బయటికి రాకూడదన్న ఆంక్ష జారీచేశారు.

# 18

## మదరాసులో ఏర్పడిన 'బినామీ' మంత్రివర్గం

**1927** వ సంవత్సరారంభంలో 1926 నవంబరులో జరిగిన ఎన్నికలలో నెగ్గిన శాసన సభా సభ్యుల ప్రథమ సమావేశం జరిగింది. సభ్యులా సంవత్సరం ప్రజాహితార్థం కౌన్సిల్లో ప్రవేశ పెట్టదలచిన ముఖ్య విషయాలను గురించి చర్చించి —

1. కాంగ్రెసు వివిధ కక్షుల క్రింద ఏర్పడి, కేంద్ర, రాష్ట్రీయ శాసన సభా సమావేశాలకు హాజరయి తీరాలనీ;

2 మద్రాసులో కాంగ్రెసు పార్టీ పెద్దగా డాక్టర్ పి. సుబ్బ రాయన్ ముఖ్యమంత్రి పదవి స్వీకరించి, ఒక "బినామి" మంత్రివర్గం ఏర్పడాలనీ;

3. పార్లమెంట్ మెంబర్‌గా షౌకతాలీగారి రాక సందర్భంలో వారి ప్రాతఃకాల ఫలహారం, శాసన సభా భవనంలోనే ఏర్పాటు చేయాలనీ;

4. శాసన సభ్యుడైన ఎస్. పి. మిశ్రాగారిని అరెస్టుచేసిన సంద ర్భంలో, మిశ్రాగారిని వెంటనే సభా మందిరంలో హాజరు పరచాలని మోతీలాల్‌గారు శాసన సభలో ప్రతిపాదించారనీ, దానిపైన తీవ్రమైన వాగ్వివాదం దుమారంగా లేచిందనీ, అంత హడావిడికి కారణం మోతీ లాల్‌గారు ప్రవేశపెట్టిన ప్రతిపాదన చరిత్రాత్మకమయినదనీ, అది

అమలునందున్న రాజనీతి స్వభావానికి విరుద్ధమై ఒక నూతన సంప్రదాయ స్థాపనకు నాంది అనే కారణం వల్లనే వివాదం రేగిందనీ—

అందువలన, అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు, రాజ్యతంత్ర విధానంలో అవసరమైన మార్పులూ, చేర్పులు చేస్తూ, మన దేశానికి అనువైన పద్ధతిని, ఒక నూతన రాజ్యతంత్ర విధానాన్ని రూపొందించాలనీ తీర్మానించారు.

1927 అక్టోబరు 27 వ తేదీని అఖిల భారత కాంగ్రెసు కమిటీ వారు సమావేశ పరచిన ఐకమత్య మహాసభవారు సాంఘిక సమస్యను గురించి చేసిన తీర్మానం మదరాసు కాంగ్రెసు (26-12-1927) మహాసభలో ప్రవేశ పెట్టబడి ఆమోదించబడింది. కాగా, ఈ దిగువ ఉదహరించిన అంశాలకు సంబంధించిన తీర్మానాలూ అంగీకరించబడ్డాయి:

1. సైమన్ కమిషన్ 'బాయికాట్'కి నిర్ణయం;
2. పండిత జవహర్‌లాల్‌గారి స్వాతంత్ర్య లక్ష్యప్రతిపాదన;
3. స్కీన్ కమిటీనుంచి మోతీలాల్ నెహూగారు తప్పుకొనుట;
4. మద్రాసు శాసన సభలో కొందరి సభ్యుల అసభ్య ప్రవర్తన.

## మదరాసు శాసన సభలో కాంగ్రెసుబలం

ఆంధ్ర, తమిళనాడు, మళయాళ, కన్నడ కాంగ్రెసు శాసన సభ్యులు శాసనసభలో 'కాంగ్రెసుపార్టీ'ని స్థాపించడము, అందులో ఆంధ్ర, తమిళనాడు సభ్యులనే ఎక్కువగా కాంగ్రెసు పార్టీ సభ్యులుగా ఎన్నుకోవడమూ జరిగింది. అప్పటి ఎన్నికలలో మదరాసు రాష్ట్ర శాసన సభకు కాంగ్రెసు తరపున 45 గురు ఎన్నిక అయారు. మొత్తం 104 గురు సభ్యులు మాత్రమే కల మద్రాసు అసెంబ్లీలో పెద్దపార్టీ కాంగ్రెసువారిదే. ద్వంద్వ ప్రభుత్వ విధానంలో మంత్రులు ప్రజలకు పూచీదారులన్న విషయం ఒప్పుగోకపోయినా, బాహ్యాడంబరాలూ, ఆనమాయితీలు మాత్రం అమలు పరచారు. గవర్నరుగారు కాంగ్రెసు పార్టీనాయకుణ్ణి పిలిచి, మంత్రివర్గాన్ని ఏర్పరచవలసిందని కోరవలసి ఉంది.

అయితే కాంగ్రెసువారు పదవులు స్వీకరింపరన్నది బాహాటంగా అందరూ ఎరిగిన విషయమే. కాంగ్రెసు మెజారిటీ వచ్చిన అన్ని రాష్ట్రాలలోనూ (మద్రాసుతో సహా) సహకార నిరాకరణమే వారి ఆశయం అయినా మంత్రిపదవులను స్వీకరిస్తే ప్రజలకు ఉపకరించే సందర్భాలలో సహకరిస్తూ, గోడమీద పిల్లివాటంగా సహకారమో, సహకార నిరాకరణమో సందర్భానుసారంగా అవలంబిస్తూ ఆ నాలుగు రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీల ఆజ్ఞలు పాటించవలసి ఉంది.

మామూలు పరిస్థితులలో దక్షిణ హిందూదేశానికి సంబంధించినంతవరకూ, ఆ నాలుగు రాష్ట్రాలవారికీ, కాంగ్రెసు మెజారిటీ వచ్చిన ఇతర రాష్ట్రాల వారితోపాటు పదవీ స్వీకార విషయంలో చికాకులూ, చిక్కులూ లేనేలేవు. అస్సాం (గౌహతీ) కాంగ్రెసు 'మంత్రి పదవులు స్వీకరింపరాదు' అని ఆదేశం ఇచ్చే ఉంది. కాంగ్రెసుపార్టీ లీడరును పిలిచి, మంత్రులను ఎన్నుకుని, రాజ్యాంగాన్ని చేపట్టమని గవర్నరు ఆహ్వానిస్తాడన్న సంగతి అందరూ ఎరిగి ఉన్నదే. విశాఖపట్నవాసి, కీర్తిశేషులైన పి. వి ఎస్. నరసింహరాజుగారు ఆనాడు కాంగ్రెసు పార్టీ లీడరయిన కారణంగా, ఆయన్ని గవర్నరుగారు పిలిచి మంత్రులను ఎన్నుకుని, రాజ్యాంగాన్ని చేపట్టమని కోరినప్పుడు, తాను గవర్నరుగారి కోరికను మన్నించరాదని అప్పటికే ఆయనకు కాంగ్రెసు వారిచే హుకుం జారీ చేయబడింది.

## తెరవెనుక నాయకులు

తమిళరాష్ట్ర నాయకులైన శ్రీనివాసయ్యంగారు, రాజగోపాలాచారిగారు పైకేమీ తేలలేదు. మంత్రిపదవులు స్వీకరించి, రాజ్యాంగాన్ని చేపట్టాలనే ఆశ తమకు లేదని ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ చెప్పవలసిన విధి వారిపై ఉంది. కాంగ్రెసుపార్టీ పేరుమీద మంత్రి పదవులను స్వీకరించడానికి వీలులేకపోయినా, తమ సొంతపేరుమీద కాని పక్షంలో, ఏదో ఒక పేరుమీద, ఏదో ఒకవిధంగా 'బినామీ' మంత్రిపదవులనైనా స్వీకరించి తమ వాంఛలను తీర్చుకోవాలనే కోరిక ఆ యిరువురి నాయకులకూ మిక్కుటంగా ఉంది.

చక్రవర్తుల రాజగోపాలాచారిగారికీ, ఎస్. శ్రీనివాసయ్యంగారికీ వారి హృదయాలలో మంత్రిపదవులను చేపట్టాలనే వాంఛ ఉన్నా, ఆంధ్రరాష్ట్ర శాసన సభ్యులను సంప్రదించకుండా వారంతట వారే తుది నిర్ణయం తీసుకోలేక పోయారు. అందువలన ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ అధ్యక్షునిగా నాతో వారు సంప్రతించవలసి ఉంది. 1927 జనవరిలో శ్రీనివాసయ్యంగారు నన్ను వారి ఇంటికి ఆహ్వానించారు. వారింటి వద్దనే రెండుమూడు రోజులపాటు ఈ సంప్రతింపులు జరిగాయి. ఆఖరి రోజున జరిగిన తర్జన భర్జనలు తెల్లవారగట్ల 2, 3 గంటల వరకూ నడిచాయి. నిజానికి అంతగా తర్జన భర్జనలు చేయవలసిన అవసరం ఉందని నేననుకోను. కాని నన్ను వారి ఉద్దేశానికి అనుకూలంగా త్రిప్పుకోవాలనే తాపత్రయంతోటే వారికి కాలం అంతా గడచిపోయింది. ప్రతీ సారీ, 'కాంగ్రెసువారి ఆశయం అదికాదు-'అన్న వక్కాముక్కాతోనే నా అభిప్రాయం తెలిపేవాడిని. లాయరుగా ఆయనకి ఉన్న ప్రతిభా, చాకచక్యమూ వగైరాలన్నీ, పాపం, ఆయన నాపై ప్రయోగించారు. వారిపట్ల నేను కొరకరాని కొయ్యనే అయి ఆఖరు సారిగా మంత్రి పదవులు స్వీకరించడానికి నా సహకారం ఎంత మాత్రం ఉండదని స్పష్టపరిచాను.

వారికి మాత్రం ఎలాగయినా 'బినామీ' మంత్రివర్గం యేర్పరచాలనీ, ముఖ్యమంత్రిగా ఒక వ్యక్తిని ఎన్నుకోవాలనీ చాలా ఉబలాటంగా ఉంది. కాంగ్రెసు వారికి గర్భ విరోధి అనీ, ఆ ఎన్నికలలో కాంగ్రెసువారిని గెలవనీయరాదని ఎన్నో రకాలుగా ప్రయత్నాలు చేశాడనీ ఎరిగిఉన్న వారికి ఆ డాక్టర్ సుబ్బరాయన్ వారికెల్లా నచ్చాడో నాకర్థం కాలేదు. డా. సుబ్బరాయన్ కాంగ్రెసుకు ఎంతగానో ఉపకరిస్తాడు. అందువల్లనే స్వతంత్రపార్టీ అని ఒకదానిని సృష్టించి, దానికి ఆయన్ని నాయకునిగా స్థిరపరచామని శ్రీనివాసయ్యంగారు నాతో చెప్పారు.

నేను తీవ్రంగా ప్రతిఘటించి, నా అసమ్మతిని స్పష్టంచెయ్యడం చేత, అలాంటి చర్య కాంగ్రెసుకు విద్రోహచర్యే అవుతుందని హెచ్చ

రించడంచేత వారు తమ ప్రయత్నంనుంచి విరమించుకుంటారనే నేను భావించాను.

## డా॥ సుబ్బరాయన్ "స్వతంత్ర పార్టీ"

డాక్టర్ సుబ్బరాయన్‌కు "స్వతంత్రపార్టీ" అనే సొంతపార్టీ యేదీ లేదు. ఆయన వెనకాల ఉన్న ఆ నలుగురూ, అధికారంలో ఎవరు ఉంటే వారి పార్టీవారిగానే చెలామణీ అవుతూ, వారి వెనుకనే చేతులు నలుపుకుంటూ తిరిగేరకం. కాని రాజగోపాలాచారిగారూ, శ్రీనివాసయ్యంగారూ కూడా కాంగ్రెసుపార్టీ యావత్తు సహకారమూ ఉంటుం దని హామీ ఇచ్చారు. ఆ మద్దతు చూసుకుని, ఈ వార్త ఆయన మెల్లిగా గవర్నర్ గారి చెవినివేసి, తనకు కాంగ్రెసు వారి సహకారం ఉంటుందనీ, తన సహచరులను తాను ఎంచుకుంటాననీ విశదపరచాడు. 'స్వతంత్రపార్టీ మంత్రివర్గం' అన్న పేరుమీద ఆయన, మంత్రులను ఎంచుకుని, రాజ్యాంగాన్ని చేపట్టారు.

ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు కమిటీవారూ, మలబారువారూ, ఈ ఏర్పాట్లకు మొదటినుంచీ వ్యతిరిక్తులే. బ్రిటిషు గవర్న్‌మెంట్ వారి దృష్టిలోనూ, వారి ప్రత్యర్థుల దృష్టిలోనూ, దేశీయులలోను కూడా కాంగ్రెసు ఎంత చులకనై పోతుందోనన్న విచారంగాని, ఆలోచనగాని ఆ అరవ నాయకుల కిరువురకూ లేకపోయింది. సూక్ష్మబుద్ధి, దూర దృష్టి గలవారని పేరున్న ఆ నాయకులు ప్రజలదృష్టిలో కాంగ్రెసు ఎంత హీనమై పోతుందో తెలుసుకోలేక పోయారనలేము. పర్యవసా నాల ప్రసక్తే వారికి పట్టలేదని మాత్రం అనవలసివస్తుంది. వారి హృద యాంతరాళాలలో పదవీవ్యామోహం బాగా నాటుకుపోయిన కారణంగా గత్యంతరంలేక వారు పైనాటకం అంతా ఆడవలసి వచ్చింది.

## కాంగ్రెసు బురఖారాయుళ్ళు

రాజగోపాలాచారి ప్రభృతులు ఆడిన ఈ నాటకంవల్ల వారికి గాంధీగారియందుగాని, వారి కార్యక్రమమందుగాని, వారి సహకార

నిరాకరణాది ఉద్యమాలయందుగాని ఏ విధమయిన విశ్వాసమూ ఉండి ఉండదనీ, విరోధ భావమే ఉండి ఉండాలనీ అనుకోక తప్పదు. స్వరాజ్య పార్టీ పేరుతో వ్యవహరించిన సి. ఆర్. దాస్-మోతీలాల్ నెహ్రూ, శ్రీనివాసయ్యంగారు మొదలైన వారు గాంధీగారి ఉద్యమానికీ, వారి కార్యక్రమానికీ, మొత్తానికి వారి విధానానికే గొడ్డలిపెట్టుగా తమ 'కౌన్సిల్ ఎంట్రీ' ప్రోగ్రాం రూపొందగలదన్న విషయం విస్మరించినట్లు గ్రాహ్యం అయింది. కాగా, రాజగోపాలాచారిగారు శాసన సభా బహిష్కార ప్రచారం రెండుమాసాలపాటు విరమించాలంటూ 1923 ఫిబ్రవరిలో తెచ్చిన ప్రతిపాదన, స్వరాజ్యపార్టీ వారివిధానానికే సహకరించింది. న్యాయానికి, అత్యధిక సంఖ్యాకులయిన కాంగ్రెసువారు అనుసరించ దలచిన విధానానికి వ్యతిరేకభావాలు ఉండిఉంటే, వీరు కాంగ్రెసు నుంచి తప్పుకుని తమకు ఇష్టమయిన ఏదో ఒక పేరుతో తమ కార్యక్రమాలు కొనసాగించుకుని ఉండవలసింది. కాని రెండుసంవత్సరాలపాటు వారు పడిన తంటాలలో కాంగ్రెసు సహకరించందే ముందడుగు వేయజాలమనే సంగతి వారికి విశదమైంది. అంతే కాదు, కాంగ్రెసులోనే గనుక వారు ఉండదలిస్తే, వారికి కలిగిన పదవీ వ్యామోహం వారు వదులుకుని ఉండవలసింది. ఇటూ అటూ గాకుండా, హృదయాంతరాళంలో కాంగ్రెసు విధానాలయందు నమ్మికలేకపోయినా, అవసరానికి తప్పని సరిగా కాంగ్రెసు బురఖా తగిలించుకుని నాటకమాడడమే స్వరాజ్యపార్టీ వారి మనోభావం అని తేలిపోయింది.

సర్వసాధారణంగా, ప్రపంచం మొత్తంమీద, 'అధికారం' మీద లంచగొండితనపు ఛాయాప్రభావం పడక మానదని ఒప్పుకోక తప్పదు కదా! అందులో మాన్‌ఫర్డ్ రాజ్యాంగ సంస్కరణలను అనుసరించి పదవులు చేపట్టిన నిరంకుశ మంత్రుల చేతులలో లాభాలు పొందాలనీ, హోదాలు సంపాదించాలనీ వాంఛించే కాంగ్రెసే తరులందరూ కాంగ్రెసులో జేరడం సంభవించింది. పాపం, అలా బురఖాలు తగిలించుకున్నవారిలో ఇద్దరో, ముగ్గురో మాత్రమే మంత్రులవడానికి అవకాశం ఉంటుందని వారు తలవారో లేదో గదా! ఎప్పుడయితే స్వరాజ్యపార్టీ

వారు తమ పార్టీ పేరును 'కాంగ్రెసు'పార్టీగా మార్చుకుని ఎన్నికలలోకి దిగారో, ఆనాడే చాలామంది కాంగ్రెసేతరులకు తాము కాంగ్రెసు పార్టీలో చేరినట్లయితే సులాగ్గా జయాన్ని సాధించవచ్చుననే నమ్మకం కుదిరింది. కాంగ్రెసు సిద్ధాంతాలలో విశ్వాసంలేని ఎందరో మహాను భావులు సభ్యులుగా ఎన్నికయి, కాంగ్రెసు ఆదేశానుసారం శాసన సభలలో అవలంబించవలసిన విధానాలయందూ కార్యక్రమాలయందూ ఎంతమాత్రమూ నమ్మకం లేకుండానే, కాంగ్రెసుపార్టీ సభ్యత్వాన్ని స్వీకరించారు. ఈ కారణాలవల్ల పార్టీలో సభ్యులు పెరిగారుగాని వారి గుణగణాదులు, విధానాలూ ఎంతమాత్రమూ మారలేదు.

కాంగ్రెసువారి పిలుపును మన్నించి వృత్తులను విసర్జించి, సహకార నిరాకరణ ఉద్యమంలో చేరి, అనేక కష్టనష్టాలకు గురి అయి, త్యాగాలుచేసి, నాయకులైన పెద్దలే స్వరాజ్యపార్టీ స్థాపించి, ఆ పార్టీలో ఉత్తమనాయకులుగా పరిగణింపబడిన ఆ పెద్దలే అధికార వ్యామోహంతో ఏడాదితిరక్కుండానే కాంగ్రెసుకార్యక్రమాదులలోమార్పులు తీసుకువచ్చి బురఖారాయళ్ళ పొత్తుతో ఎలా దిగజారిపోయి, తమ పార్టీకి ఇంకా బలం చేకూర్చుకోవాలనే వాంఛతో అడ్డమయినవారినీ పార్టీలో చేర్చుకుని ఎలా పతనం అయ్యారో గ్రహించడం న్యాయం. నా సలహాను పాటించకుండా, వివిధ కాంగ్రెసు కమిటీల వారికి సకాలంలో సమాచారం అందజేయకుండా, ఆఖరికి నవ్యంగా ఏర్పడిన కాంగ్రెసుపార్టీవారికైనా తెలియజేయకుండా ఒక 'బినామీ' మంత్రివర్గాన్ని చెన్నపట్నంలో నిలబెట్టారు.

## శాసన సభలో కాంగ్రెసు పక్షం

1927లో ఇంకా కాంగ్రెసు ప్రెసిడెంటుగానే చెలామణీ అవుతూన్న శ్రీనివాసయ్యంగారి ఇంటిలో, ఎన్నికలలో విజయాన్ని చేపట్టగలిగిన కాంగ్రెసు సభ్యులందరూ హాజరయ్యారు. వారు విశాఖపట్నవాసి పి. వి. ఎస్. నరసింహరాజుగారిని పార్టీనాయకునిగా, ఎస్. సత్యమూర్తిగారిని ఉపనాయకునిగా ఎన్నుకున్నారు. ఆ తర్వాత శాసనసభా

ధ్యక్షుడుగా ఎవరుంటే బాగుంటుందని మీమాంస వచ్చింది. కాంగ్రెసే గనుక రాజ్యాంగాన్ని చేపట్టడానికి అంగీకరించి ఉండిఉంటే, ఎన్నుకో బడిన నాయకుడే ఏకబిగిని ముఖ్యమంత్రి అయ్యేవాడు. కాని ఇటువంటి పద్ధతులకు కాంగ్రెసు కార్యనిర్వాహణ విధానంలో తావే లేదుకదా! అందు వలననే తాను అధ్యక్షస్థానం వహిస్తానని నరసింహరాజుగారు ముందు కొచ్చారు.

కాంగ్రెసు కార్యక్రమాన్ని సవ్యంగా నడప శక్తిలేని పరిస్థితు లలో వారు ఒక 'బినామీ' మంత్రివర్గాన్ని యేర్పరచారు. కాంగ్రెసు ఆదేశాలకు విరుద్ధంగా, దానికి అవసర సహకారం అందిస్తామన్నారు. మంత్రుల జీతాల విషయమూ, బడ్జెటూ చర్చకు వచ్చిన సందర్భంలో సందిగ్ధ స్థితిలో పడ్డారు. చేయగలిగింది లేక, కొంతమంది శాసనసభా ప్రాంగణం నుంచి వెలుపలకు వెళ్ళిపోయారు. ఈ ప్రకారంగా బడ్జెటు చర్చ ఆరంభదశలోనే మద్రాసు శాసనసభ కాంగ్రెసుపార్టీవారు కాంగ్రె సుకూ, దేశానికీకూడా ద్రోహం చేశారు.

## మూలపడిన విశ్వాసరాహిత్య తీర్మానం

ఇలాంటి పరిస్థితులలో కాంగ్రెసువారికి పార్టీని రద్దుచేసే అధి కారం ఉందిగాని అల్లా జరుగలేదు. బొంబాయిలో జరిగిన (మే 15-16) అఖిల భారత కాంగ్రెసు సంఘ సమావేశంలో మద్రాసు శాసన సభా సభ్యులుగా ఉంటూన్న కాంగ్రెసు వారిమీద ఉ. గోపాలమేనోన్ విశ్వాస రాహిత్య తీర్మానం తీసుకువచ్చాడు. ఇల్లా కాంగ్రెసువారు పతనం అవడానికి మోతీలాల్‌నెహ్రూగారిదే బాధ్యత అన్నాడు. ఆయన పార్టీ నాయకుడు. పైగా 'స్కీన్' కమిటీలోనూ, ఇంపీరియల్ కౌన్సిలులోనూ సభ్యత్వం స్వీకరించడానికి ఒప్పుకున్నారు. గోపాలమేనోన్ తీసుకు వచ్చిన తీర్మానానికి, శ్రీనివాసయ్యంగారు సవరణ ప్రతిపాదించారు. ఒక ఉపసంఘం మదరాసు శాసన సభలోని కాంగ్రెసు పక్ష సభ్యుల కార్యకలాపాల విషయమై విచారణ జరిపి, నివేదిక సమర్పించాలని ఆ సవరణ. ఏదోరకంగా కాలయాపన చేసి, విశ్వాసరాహిత్య తీర్మా

నాన్ని ప్రక్కకు నెట్టాలనే అభిలాషతో యుక్తియుక్తంగా చేయబడిన సవరణ తీర్మానం అది.

ఈ పరిస్థితులలో మెంబర్ల ఆలోచనలన్నీ 'సర్ జాన్ సైమన్' ఆధిపత్యాన్ని రానున్న రాయల్ కమీషన్‌మీద కేంద్రీకరింప బడ్డాయి. నిజానికి హిందూదేశానికి 'సైమన్ కమిషన్' రావడానికి ఇంకా ఏడాది గడువుంది. అయితేనేం, ప్రజాభిప్రాయాన్ని అన్యమార్గాలు పట్టించడానికి, తర్జన భర్జన చేయవలసిన విశ్వాసరాహిత్యతీర్మానాన్ని మూలకు త్రోయడానికి ఈ సైమన్ కమీషన్ ప్రస్తావనకి ప్రాముఖ్యం ఇస్తూ, మద్రాసు శాసన సభలోని కాంగ్రెసువారిపై రానున్న అభియోగాన్ని చల్లచల్లగా జారవిడిచారు.

ఎల్లాగయితేనేం, మొత్తానికి డాక్టరు సుబ్బరాయన్‌గారి మంత్రివర్గం, కాంగ్రెసువారి సహకారంతో, పూరా మూడు సంవత్సరాలపాటు ఈడ్చుకుంటూ కొనసాగింది. 1929 ఆఖరి రోజులలో, ఉప్పు సత్యాగ్రహం పేరుమీద కాంగ్రెసువారి కందరికీ వచ్చిన 'పిలుపు' కారణంగా అంతమయింది.

# 19

# శాసన సభ్యుని నిర్బంధంపై కేంద్రసభలో సవాలు

**1928-29** బడ్జెటు మీటింగులో కాంగ్రెసువారు మంత్రుల జీతాలకు వ్యతిరిక్తంగా ఓటు చేయలేదు. అల్లా అల్లా కాంగ్రెసుపార్టీవారి సహకారంతో సాగిన ఆ మంత్రివర్గం యావత్తు భారతదేశంలోనూ అసంతృప్తి కలిగించింది.

## కేంద్ర శాసన సభ సంగతులు

కేంద్ర శాసన సభా సమాచారాలు కూడా కొంతవరకూ తెలుసుకోడం న్యాయం కదా! యు. పి. లో. జరిగిన ఎన్నికలలో పూర్తి

అపజయం కలిగినా, మేము ఆ కేంద్ర శాసన సభలో మొత్తం నలభై యిద్దరం ఉన్నాము. కేంద్రప్రభుత్వం ఛాయామాత్రంగానైనా మంత్రులను ఏర్పరచడం వగైరా కార్యకలాపాలలోకి దిగకుండా విధి నిర్వహణను విస్మరించింది. దేశ సౌభాగ్యానికి భిన్నమయిన ప్రతిపాదనలు ఏవి వచ్చినా వాటిని చిత్తు చెయ్యాలన్నదే మా ఆశయం.

## కపటపు పార్లమెంటు

మాదొక కపటపు పార్లమెంట్ కదా! ముందుముందు నిజంగా రాజ్యాంగం చేపట్టవలసిన పరిస్థితులలో నడచుకోవలసిన తీరులకు ఈ రోజులలో నడుస్తూన్న పార్లమెంటు విధానం కొంత అనుభవాన్ని సమకూర్చింది. సభ్యులూ, నాయకులూ కూడా వాదోపవాదాలలోనూ, పార్లమెంటరీ విధానంలోనూ నేర్పరులయిన కలహప్రియులుగా రూపొందారు. ఆంగ్లదేశపు ప్రైమినిష్టర్లకంటే మోతీలాల్ నెహ్రూగారు వాక్చక్యంగా వ్యవహరింపగల నేర్పరులని పేరుపడ్డారు. ఆంగ్లదేశపు పార్లమెంటు మెంబర్లకంటె మన సభ్యులకు సమస్త సమాచారములూ అందజేయబడడాన్ని మనవారి హోదా ఎంతో మెరుగ్గా ఉండేది. ఏ విషయాన్నయినా క్షుణ్ణంగా తర్జన భర్జన చేయగలశక్తి మనవారికుంది.

మనవారి తెలివితేటలూ వగైరా ఎంత అఖండంగా ఉన్నా ప్రజల బాధ్యత ప్రభుత్వం వారిది కానప్పుడు లాభమేమిటి? కేంద్రంలో ఉన్న కాంగ్రెసువారు ఇదివరకటికంటె ఎంతో ఎక్కువగా ప్రభుత్వంవారి 'నటనలను' బైటపెట్టగలిగారు. వాదోపవాదాలు చాలా పటుత్వంతోనూ, ప్రజాహృదయాన్ని చూరగొనేవిగానూ, రాజ్యతంత్రాన్ని నడపగలిగేవిగానూ ఉండేవి. కేంద్ర శాసన సభలోని కాంగ్రెసు పార్టీవారు ప్రభుత్వం వారి 'నటనా' విధానాన్ని వెనకటికంటె ఎంతో శక్తియుక్తులతో బైట పెట్టగలిగారు. వాదోపవాదాలు చాలా ఉన్నతస్థాయిలో నడిచేవి. ఎల్లప్పుడూ గవర్నమెంటు విధానాన్ని కించపరిచేవిగానే ఉండేవి. ప్రభుత్వం వారికి ఎప్పుడో ఒకప్పుడు పరిపాలన ప్రజల హస్తగతం చెయ్యక తప్పదని అర్థమయింది.

## ప్రతికూల కక్షల దుష్ఫలితాలు

నిజానికి కాంగ్రెసుపార్టీవారే గనుక తమ విధానంలో నిబ్బరమూ నేర్పూ కనబరుస్తూ, గ్రామాలలో నిర్మాణ కార్యక్రమం సరిగా కొన సాగించి ఉండిఉంటే, కొద్ది సంవత్సరాలలోనే అది బాగా బలాన్ని పుంజుకుని ప్రభుత్వంవారి ముక్కు నలిపి మరీ, అధికారం చేపట్టగలిగి ఉండేది. కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ, అధిక సంఖ్యాకులుగా ఎన్నిక అయిన కాంగ్రెసువారు, గట్టిగా తలపెడితే దేశంలో ఉన్న జన బాహుళ్యాన్ని సరిఅయిన త్రోవను నడపి, వారికి మంచి చెడ్డలు తెలిపి, గ్రామాలను పునర్నిర్మించడానికి వారు శాసన సభ్యులుగా చేస్తూన్న సేవకు భంగం రాకుండానే, ఎన్నో విధాల దేశాన్ని పునరుద్ధరించగలిగి ఉండేవారు.

కాని గాంధీగారి నాయకత్వాన నడుస్తూన్న నోఛేంజర్లూ, మోతీలాల్ నెహ్రూగారిని అంటిపెట్టుకుని ఉన్న ప్రోఛేంజర్లూ భిన్నాభిప్రాయులై ఉండడాన్ని, ఒకరి దృష్టికి ఆనింది రెండవవారికి ఆనకుండాపోయింది. నో ఛేంజర్లు శాసన సభల మూలంగా నూలు వడకడమూ, నేయించడములాంటి నిర్మాణ కార్యకలాపాలుగాని, హిందూ మహమ్మదీయ ఐకమత్య సాధనకు కృషిగాని చేయలేని స్థితిలోకి దిగజారారు. ప్రోఛేంజర్లెప్పుడూ నో ఛేంజర్లను అనుమాన దృష్టితోనే చూసేవారు. కాగా ఖాదీ కార్యక్రమం అంటే వారికి ఒకవిధమయిన అలసభావం ఉండేది. ఈ రెండు రకాల కాంగ్రెసు వారి మధ్యా నలుగుతూన్న జనం తాము ఏం చెయ్యాలో అర్థంకాని స్థితిలో ఉన్నారంటే ఆశ్చర్యపడనవసరం లేదు. శాసన సభ్యులు ప్రజలతో సంబంధ బాంధవ్యాలు లేనివారిలా, తటస్థ విధానంగా బ్రతకజొచ్చారు. ఈ పరిస్థితులలో నో ఛేంజర్లు కౌన్సిల్ కార్యక్రమం ఎప్పుడు ఛిన్నాభిన్నం అవుతుందా, ఎప్పుడు సహకార నిరాకరణోద్యమం సాగిద్దామా అన్న ఆలోచనలో పడ్డారు. ఉప్పు సత్యాగ్రహం కారణంగా శాసన సభ్యులను బైటకు వచ్చివెయ్యండని ఆదేశం ఇచ్చే పర్యంతమూ ఇలాగే నడిచింది.

## రాజ్యాంగ సంస్కరణల వాయిదా

బ్రిటిషువారు బహు నేర్పరులు. మామూలుగా అవసరాన్నిబట్టి రాజ్యాంగంలో తీసుకు రావలసిన చిన్న చిన్న మార్పులను కూడా వాయిదాలు వేయడమూ, ప్రజలలో లేనిపోని ఆశలు కల్పించడమూ, హిందూ మహమ్మదీయ స్పర్ధలూ, బ్రాహ్మణ బ్రాహ్మణేతర వివాదాలూ తలెత్తకుండా సహకరించి వాటిని రూపు మాపుతాం అంటూ, వాటికి ద్రోహం చెయ్యడమూ జరిగేవి. చురుక్కుమనిపించే మింటో - మార్లే సంస్కరణలు 1909 లో అమలు పరచి, మతావేశాలనూ, మత కలహాలనూ తీవ్రతరం చేశారు. ఈ మత కలహాలు మాన్‌ఫర్డ్ సంస్కరణల కాలం (1916-17) లో మరీ ఉద్ధృతంగా జరిగాయి. అవి 1935 దాకా అల్లా అల్లా వేళ్ళు నాటుకుంటూనే ఉన్నాయి. అప్పుడు కళ్ళ తుడుపుగా "గవర్న్‌మెంట్ ఆఫ్ ఇండియా యాక్ట్" అని ఒక చట్టాన్ని అమలు పరచి, దాని క్రింద "ప్రొవిన్షియల్ అటానమీ" అనే విధానాన్ని అమలు పరిచారు.

1926-30 ల మధ్య హిందూ మహమ్మదీయ కలహాలు ఏటేటా జరుగుతూ ఉండడమూ, పట్టపగలే వందలాది అమాయిక ప్రజలు హత్యలకు గురి అవుతూండడమూ జరిగేది. అందు 1927 లో అట్టి హత్యకాండ మరీ ముమ్మరంగా సాగింది. లాహోరులో మే మాసంలో తీవ్రమయిన హిందూ మహమ్మదీయ సంఘర్షణలు జరిగాయి. 1926-30 ల మధ్య ఏటేటా ఉత్తర హిందూస్థానంలో అఖిల పక్ష సమావేశాలు జరగడమూ, అందు మత కలహాలు అంతం అవడానికి సూచనలు చేయబడడమూ, భారత దేశానికి అనువయిన కట్టుబాట్లతో 'కాన్స్టిట్యూషన్' నొకటి తయారు చెయ్యడానికి ప్రయత్నాలు జరగడమూ మామూలయింది.

## బ్రిటిషు వారి పన్నాగం

1926-27 లో భారత దేశపు రాజకీయ అవసరాలను గుర్తించి, వలసిన సలహా లివ్వడానికి, సూచనలు చెయ్యడానికి "సైమన్ కమి

షన్'' ఇండియాకు రాగలదనే నాన్నుడు మాటలతో భారతీయులను సంతుష్టి పరచాలని ఆంగ్లేయులు ఒక పన్నాగం పన్నారు. మాంట్ ఫర్డు సంస్కరణలను నిరాకరించి త్రోసివేసిన కాంగ్రెసువారు, రాజకీయంగా ముందడుగు వేయడానికి సన్నాహాలు చేయజొచ్చారు. బ్రిటిషు వారికి కాంగ్రెసువారి సూచనలు ఎప్పుడూ ఏకోశానా కూడా నచ్చలేదు. స్వరాజ్య పార్టీ నాయకులు సూచించిన ద్వంద్వ ప్రభుత్వ విధాన ప్రతిపాదనలనయినా పరిశీలించాలనే వివేకం కూడా వారికున్నట్లు కనిపించి లేదు. ఈ పరిస్థితులను గ్రహించి కాంగ్రెసువారు 1926 లో గౌహతీ కాంగ్రెసులో పదవీ స్వీకారం చేయరాదనీ, మదరాసు కాంగ్రెసులో సైమన్ కమిషనును బహిష్కరించాలనీ నిశ్చయించుకోవలసివచ్చింది. 1921లో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ బహిష్కరణ ఉద్యమం తర్వాత 1928-29 లలో సైమన్ కమిషన్ బహిష్కరణ అన్నదే బ్రహ్మాండమయిన ఉద్యమంగా రూపొందింది. మదరాసు కాంగ్రెసు, సైమన్ కమిషన్ భారత దేశంలో అడుగుపెట్టింది మొదలు బ్రహ్మాండయిన బహిష్కరణ ఉద్యమం సాగించాలని ఆదేశం ఇచ్చింది. వారు భారత దేశంలో అడుగుపెట్టిన నాడు దేశవ్యాప్తంగా హర్తాలు జరపాలనీ, వారు ఏ రాష్ట్రంలో, ఏ ప్రదేశానికి వెళ్ళినా వారిని బహిష్కరించవలసిందే అని కాంగ్రెసు మహాసభ నిశ్చయించింది.

## అద్భుతమైన ఆరంభ విజయం

మద్రాసు శాసన సభా కాంగ్రెసు పక్షం ఏర్పడిన అనంతరం, అనగా ఫిబ్రవరిలో, నేనూ శ్రీనివాసయ్యంగారూ కలిసి ఢిల్లీకి వెళ్ళాము. విఠల్‌బాయ్ పటేల్ అధ్యక్షతను ఆరంభం అయిన కేంద్ర శాసన సభ సమావేశం తొలి ఘట్టాలలోనే ఏర్పడిన ఉద్రేక పూరిత వాతావరణం భారతీయ దృష్టిని పూర్తిగా ఆకర్షించింది. సమావేశం నడచిన విధానం, సభ్యులు కనబరచిన నేర్పరితనం, కాంగ్రెసు పార్టీలో కుదిరిన ఏకత్వం ప్రజాహృదయంలో బాగా నాటుకు పోయాయి.

బెంగాల్ నివాసి సత్యేంద్ర చంద్ర మిత్రాగారిని, ఆయన జైలులో ఉండగానే, కేంద్ర శాసన సభా సభ్యునిగా ఎన్నుకున్నారు. మిత్రాగారు

జైలులో ఉన్నప్పటికీ, ఆయనకు సభా కార్యకలాపాలలో పాల్గొనే హక్కు ఉన్నదని కాంగ్రెసు పార్టీవారి వాదం. ప్రభుత్వంవారు నిర్ణయించే విధానానికి అనుగుణంగా మిత్రాగారు శాసన సభా కార్యక్రమాలలో పాల్గొన గలిగే పర్యంతం సభ వాయిదా పడాలని పార్టీనాయకుడు స్వయంగా ఒక ప్రతిపాదన తీసుకువచ్చాడు. అసెంబ్లీ కార్యక్రమ నాయకుడయిన సర్ అలెగ్జాండర్ మడ్డిమన్ ఆ తీర్మానాన్ని తీవ్రంగా ప్రతిఘటించాడు. మోతీలాల్ నెహ్రూగారి వాదం చక్కగా, మాంచి పూందాగా, తిరుగులేనిదిగా ఉండి, అలెగ్జాండర్‌గారికి సమాధానం చెప్పడానికి మాటలు కరువయాయి. ఆయన తాను లేవదీసిన వాదానికి సిగ్గు చెందడానికి బదులు, ఆంగ్ల దేశంలో హౌస్ ఆఫ్ కామన్స్‌వారు శాసన సభవారికి ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసే హక్కు లేదనే ఆచారాన్ని పాటిస్తారు గనుక, ఆ పద్ధతినే ఇక్కడ కూడా పాటించాలని వాదించారు. తర్వాత ఆ ప్రతిపాదన ఓటుకు పెట్టబడింది. అన్నివర్గాల నాయకులూ, ఈ విషయ నిరూపణలో ఉన్న గాంభీర్యానికీ, ఆకర్షణకీ ముగ్ధులయి, అనుశ్రుతంగా వస్తూన్న ఆంగ్లేయ ఆచారానికి విరుద్ధంగానూ, తీర్మానానికి అనుకూలంగానూ ఓటు చేశారు. పద్దెనిమిది ఓట్ల ఆధిక్యంతో ఆ ప్రతిపాదన నెగ్గింది. కాని తమకు సభవారి సూచనలను అమలు పరచి తీరాలనే అనుశాసనం లేదు. కనుక, ఆ తీర్మానాన్ని అమలు పరచడం తమ విధి కాదంటూ ప్రభుత్వం వారు త్రోసివేశారు.

ఏదో సాకుతో నెగ్గిన తీర్మానాన్ని ప్రభుత్వంవారు త్రోసిపుచ్చినా, కాంగ్రెసువారి కది ఘనమైన విజయమే కదా! అందువల్ల దేశం అంతా ఉల్లాస పూరితం అయింది. ఆరంభంలోనే, ప్రథమ ప్రయత్నంలోనే కాంగ్రెసు వారికి లభించిన ఆ ఘన విజయానికి ఆనంద సాగరంలో ఓలలాడింది. కాంగ్రెసుపార్టీవారు కనబరచిన సంఘీభావానికీ, చూపించిన క్రమశిక్షణకీ ప్రతివారూ ఆశ్చర్య చకితులయ్యారు. నిష్పూచీగానూ, నిరంకుశంగానూ వ్యవహరిస్తూన్న ప్రభుత్వంవారూ, సెక్రటరీ ఆఫ్ స్టేట్ కూడా, ఈ కాంగ్రెసు పార్టీ అన్నది మంచి క్రమ

శిక్షణతోనూ, పకడ్ బందీగానూ ఏర్పడిందనీ, భారత దేశంలో ఇంత బ్రహ్మాండమయిన పార్టీ ఇంకొకటేదీ లేదనీ గ్రహించారు.

## అవబోధంతక్కువైన ప్రజ

శాసన సభతో సంబంధం ఉన్న రాజకీయ కాంగ్రెసు నాయకులంతా నిర్మాణ కార్యక్రమంపట్ల చిన్నచూపు చూసి ఉండకపోతే, దేశమూ, దేశంలోని గ్రామాలూ ఆ 1926-1930 మధ్య కాలంలో, పరిస్థితులను సరిగా గ్రహించి, సక్రమమయిన మార్గంలో పొందికగా ముందడుగు వేయగలిగి ఉండేవి. నాయకత్వం నో ఛేంజర్ల చేతిలో ఉన్నా, కౌన్సిల్‌వారి చేతిలో ఉన్నా, ప్రజలకు రాజకీయ విజ్ఞానం కలిగించ గలిగి ఉన్ననాడు, ప్రజలు తమ చేతులలోనే పూర్ణమైన హక్కులున్నాయనీ, కౌన్సిల్స్‌వారూ, మంత్రులూ వారి క్షేమాన్ని కాంక్షించే పరిపాలన నిర్వహించవలసి ఉన్నదనీ, వైస్రాయిగారితో సహా యావత్తు పరిపాలనా యంత్రాంగమూ వారి చెప్పు చేతులలోనే నడవవలసి ఉంటుందనీ గ్రహింప గలిగేవారు.

కాని ఓటర్ల దురదృష్టం కొద్దీ, కాంగ్రెసులోని ఇరుపక్షాల వారూ, ఎవరికి తోచిన విధంగా వారు ఏ దూర తీరాలకో కొట్టుకుని పోతూ వచ్చారు. 1924 లో బెల్గాం కాంగ్రెసులో స్వరాజ్య పార్టీవారి చేతులలోకి కాంగ్రెసు వచ్చింది లగాయితు, ఏటేటా దిగజారడమే కనబడింది. ఎటొచ్చీ 1926, 1930 సంవత్సరాల మధ్యకాలంలోనూ, దరిమిలానూ కూడా, ఎన్నికలు వచ్చినప్పుడల్లా ఓటర్లకు ఏమేమో నూరిపోసేవారు. ఆ చెప్పిందైనా ఓట్లు ఎల్లా వెయ్యాలి అన్న విషయం మీదే కేంద్రీ కృతమై ఉండేది. కాని నిజానికి అది ఒక జాతి నిర్మాణానికి చాలని ప్రబోధం. సహకార నిరాకరణ ఉద్యమం ఎప్పుడు ఆరంభమయినా అరెస్టులూ, జైళ్ళూ తప్పవు గనుక, అక్కడే ఆ జైళ్ళలోనే ఆ రెండు పార్టీలవారికీ ఒకరి నొకరు

ప్రేమించుకోవడానికైనా, ద్వేషించుకోవడానికైనా వీలుగా ఉండేది. ఇల్లాంటి అవకాశాలూ, సందర్భాలూ ఆ 1926-1930 సంవత్సరాల మధ్య వస్తూ ఉండేవి గనుక, పై విషయాలు ఆ నాలుగైదు సంవత్స రాలకు సంబంధించినవే అనుకోవచ్చును.

# 20

## మారకపురేటు పెంచరాదని హెూరాహెూరీ పోరాటం

**1927** నాటి శాసన సభా కార్యకలాపాలవైపు మళ్ళీ ఒకసారి దృష్టి సారిద్దాం. ఆ రోజులలో మాకు కరెన్సీమీదా, రూపాయి మారకపు విలువలమీదా, రిజర్వుబ్యాంకి బిల్లుమీదా ప్రభుత్వం వారు ప్రవేశపెట్టిన ప్రతిపాదనలమీద తర్జనభర్జన చెయ్యడం తప్పనిసరి అయింది. తర్జనభర్జన తప్పనిసరి అయిందనడంకంటె, మంచి హుషారుగా సాగిందనడమే న్యాయమేమో:

రూపాయి మారకపు విలువలను గురించీ, ఎక్స్చేంజిని గురించీ, ఇండియా ప్రభుత్వంవారిచ్చే ఆదేశాలను ఆ నాటి శాసన సభవారుగాని, రాజకీయ నాయకులుగాని అంతగా పట్టించుకోవలసిన అవసరం ఉండేది కాదు. ఆ విషయాలను కఠినమయిన చిక్కు సమస్యలుగా, కొరకరాని కొయ్యలుగా ఎంచి విస్మరించేవారు. ఎంతో అనుభవమూ, లోకజ్ఞానమూ ఉన్నవారికేగాని అర్థంగాని సమస్యలవి. ఆ జటిలమైన ఆర్థిక విష యాలను గురించి ఎంత చదివినా, ఇంకా ఎంతో ఉంటుంది తెలుసుకో వలసింది. లేకుంటే తబ్బిబ్బే. ఆ సమస్యలు సరిగా అర్థంచేసుకుని వాటిమీద తర్జనభర్జనలు వస్తే నిలిచి మాట్లాడగలిగేవారు ఆ రోజుల్లో చాలా కొద్దిమందే ఉండేవారు. ఆ అల్ప సంఖ్యాకులలో ఘనులు, ప్రముఖులు అనదగినవారు సర్ పురుషోత్తమదాస్ ఠాకూర్‌దాస్‌గారు. వారి తర్వాత అనండి, వారికి ముందే అనండి—జమ్నదాస్ మెహతా

గారొకరున్నారు. ఆ యిరువురూ పెద్ద వ్యాపార సంస్థల కధిపతులు. వాణిజ్యం వారి చేతులలో ఉండేది. అందువల్ల, తమకు సంబంధించి నంతవరకు, అంటే ఆ మారకపు విలువల మార్పులవల్ల తమ వ్యాపారానికి ఏవయినా కష్టనష్టాలు వస్తాయని అనుకున్నప్పుడు ఆ సమస్యల మీద వారు తర్జనభర్జనలు చేసేవారు. అంటేవారి లాభనష్టాలమేరకే నన్నమాట! ఈ ఇండియన్ కరెన్సీని చట్టబద్ధం చేయడం, ఆ చట్టం లోని విషయాలపైన, దానినుంచి ఉత్పన్నమయ్యే విషయాలపైన తర్జనభర్జనలు రావడం అన్నది 1908 నుంచీ ఉంది. దాని చరిత్ర అంత వెనక్కి వెళ్ళాలన్నమాట. నేను వ్రాసిన "హిందూదేశపు ఆర్థిక విధానము" (Indian Monetary System), "ప్రపంచ ఆర్థిక విధానము" (World Monetary System) అన్న పుస్తకాలలో ఈ విషయాలు బాగా లోతుగా చర్చించి ఉన్నాను.

## ఆర్థిక ప్రతిపాదనల ఆంతర్యం

ఇక్కడ ఆ 1927-28 నాటి ఆర్థిక ప్రతిపాదనలను గురించి కొంచెం విపులంగా వివరిస్తాను. దేశీయులకు నష్టదాయకంగానూ, తమకు లాభకరంగాను మారకపు విలువలు మార్చాలని ప్రభుత్వం వారికి బుద్ధిపుట్టినప్పుడల్లా, వారొక జిత్తులమారి నాటకం ఆడేవారు. ఆర్థిక విధానాన్ని చర్చించి, అవసరమైన సూచనలు చేయడానికంటూ "కరెన్సీ కమిషన్" అనేపేరున ఒక సంఘాన్ని నియమించి, వారి సూచనలను పాటిస్తున్నామనే వంకని, తమకు లాభదాయకమైన రీతిని (మనకు నష్టంవచ్చినా సరే) మారకపు విలువలు మారుస్తూ ఉండేవారు.

ఆ నాడు మారకపు రేటు 1 షి. 4 పెన్నీలు. "హిల్టన్ యంగ్ కమిటీ" వారు ఆగస్టు 26 న విడుదల చేసిన రిపోర్టులో సూచించిన మారకపు రేటును 1 షి. 6 పె.లకు మార్చబోతున్నామని ప్రభుత్వంవారు శాసన సభలో వెల్లడించారు. ఆ మార్పు ఆంగ్లేయులకెంతో లాభదాయకమైందిగానూ, హైందవ వాణిజ్య ప్రముఖులకూ, కర్షకులకూ ఎంతో నష్టాన్ని కలిగించేదిగానూ ఉంది.

ఆ 1926 లో స్వరాజ్య పార్టీవారు తమ కార్యక్రమం ప్రకారం అసెంబ్లీ వ్యవహారం నడవకుండా "వాకౌట్" ప్రదర్శనలు చేస్తున్నారు. ఆ అదనులో కరెన్సీ, రిజర్వుబ్యాంకి బిల్లులు ప్రవేశపెట్టి సులువుగా ప్యాసు చేయించుకుందా మనుకున్నారు ప్రభుత్వంవారు. ఒక్క ఉదుటున వాటిని ప్రవేశపెట్టడమూ, చట్టంగా రూపొందించడమూ జరిగిపోతుందని భావించారు. స్వరాజ్య పార్టీవారు అసెంబ్లీనుంచి బైటకు వచ్చేసినప్పుడు ఈ పని జరుగుతుందని ఊహించలేదు. కాని ఎప్పుడయితే ప్రభుత్వంవారి పన్నాగం వారు పసికట్టారో ఆ క్షణాన్నే బిలబిల్లాడుతూ లోపలికి చక్కావచ్చారు. వీరు బిల్లును ప్రతిఘటిస్తారని వారికి గ్రాహ్యం అవడాన్ని, తెలివిగా, క్రొత్త కౌన్సిల్ ఏర్పడే పర్యంతం దీనిని చర్చించరాదంటూ, ప్రభుత్వంవారే దానిని వాయిదా వెయ్యడానికి సిద్ధపడ్డారు.

## ఊహాతీతమైన కారణాలు

1926 జనరల్ ఎన్నికల అనంతరం స్వరాజ్యపార్టీ మరింత ప్రభుత్వంతోనూ, జాగరూకతతోనూ వ్యవహరించసాగింది. ఈ మారకపు రేటును పెంచడానికి ప్రభుత్వంవారు ఉటంకించిన కారణాలు చాలా వింతయినవీ, ఊహాతీతమయినవీను. ఈ బిల్లు ప్రవేశపెట్టక పూర్వం కొన్ని సంవత్సరాలుగా ఉంటూన్న మారకపురేటు రూపాయికి 1 షి. 4 పెన్నీలు. సర్ బేసిల్ బాకెట్ (Sir Basil Backet) అప్పట్లో ఆర్థిక సభ్యుడు. ఆయన చాలా గట్టివాడు. మంచి వాగ్ధాటి గలవాడు. శాసనసభలో అన్న స్వరాజ్యపార్టీవారు ఎంతలే, మనం చులాగ్గా దాటుకుపోతాం అనుకున్నాడాయన. పాపం, ఆయన మాలో ఒక డజను మందిమి, అన్ని కోణాలనుంచీ ఆ విషయాన్ని తర్జనభర్జన జేసి, ఆట కటిస్తామని కలలోకూడా అనుకోలేదు.

ఈ దేశపు ప్రజల గతి ఏమయినా, తన దేశీయుల క్షేమలాభాలే చూసుకునే రకం సర్ బేసిల్. ఫైనాన్సు మెంబర్‌గా కొత్తగా నిర్మాణమైన కౌన్సిల్‌లో రిజర్వు బ్యాంకి బిల్లూ, ఎక్ఛేంజి బిల్లూ ఆయన ప్రతిపా

దించాడు. మారకపు విలువలు పెంచాలి అన్న కరెన్సీ కమిటీ సిఫార్సు సవ్యమయినదేనని రుజువు చెయ్యగల స్థితిలో ఆయన ఉన్నట్లు తోచలేదు. అలాంటప్పుడు ఆ బిల్లు ప్రవేశ పెట్టకుండా ఉండవలసింది. కాని ప్రతిఘటన వస్తుందని తలచలేదుగా! కాగా, వారికి కావలసిన దల్లా డబ్బు! దానిని న్యాయంగా సంపాదిస్తున్నట్లు కనబడేటట్లు చేయడమేగా ప్రధానం! కాస్సేపు మెంబర్లు నిద్రపోవడమో, బైటకు వెళ్ళడమో, పట్టించుకోకుండా కూచోవడమో జరగాలి. అంతే. అది చట్టం అయి ఊరుకుంటుంది. దాన్తో అంతా న్యాయం అవుతుంది అన్నదే ఆయన తలంపు దానికోసమే ఆ తాపత్రయం. కాని కథ కాస్త అడ్డం తిరిగింది, అంతే!

అప్పటికి అమలునందున్న మారకపు రేటు, ఏవయినా కొన్ని కారణాలచేత, కొంతకాలం పాటు 1 షి. 4 పె. లకు-1 షి. 6 పె. లకు మధ్య ఊగిసలాడి ఉంటే, వారు చేయదలచిన పని ఛాయా మాత్రంగానైనా సవ్యం అయి ఉండేది. నిజానికి ఎంత కాలంగానో ఆ మారకపు విలువ 1 షి. 4 పె. ల దగ్గర అలాగే నిలిచిపోయింది. ఆ స్వతస్సిద్ధపు విలువ మారడానికీ, రేష్యో పెరగడానికీ మార్గాలేవీ కనబడని కారణంగా, ఆర్థిక సభ్యునికి స్వాభావికంగానో, అస్వాభావికంగానో-ఏదో ఒక పద్ధతిని విలువ పెంచాలని బుద్ధి పుట్టింది. నేను సర్ బేసిల్ని అడిగాను:"తమరు గత 12 మాసాలలోనూ అస్వాభావికంగా ఆ విలువని 1 షి. 6 పె. ల దగ్గర ఉంచడానికి నిజంగా ఎంత ఖర్చు పెట్టారని?" "ముప్ఫయికోట్ల రూపాయలు మాత్రమే"నని చెప్పాడు. అస్వాభావికంగా పన్రెండు మాసాలపాటు ఆ విలువను అలా ఉంచడానికి ముప్ఫయికోట్లు ఖర్చయి ఉంటే, ఇంతకాలంగా ఆ విలువను అల్లా నిలబెట్టడానికి ఎన్నికోట్లయిందో గదా!....తిరిగి నేను, ఆ మారకపు రేటు మార్పువల్ల దెబ్బతినే మన ఆస్తులన్నింటి మీదా, ఆ మార్పు అమలు జరిగిననాడు వచ్చే నష్టం ఏ మాత్రం ఉంటుందని అడిగినప్పుడు, సుమారు 48 కోట్ల రూపాయ లుండవచ్చునని సమాధానం ఇచ్చాడు.

## కలిగే పరిణామాలు

స్థూలంగా ఆ కరెన్సీ ప్రతిపాదనల పరిణామాలు ఎంతవరకూ ఉంటాయో చదువరులకు కాస్త అర్థం అవడానికగాను ఈ విషయం ఇంత వివరంగా చెప్పాను. కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ పన్నుల రూపకంగా కొంత డబ్బు వసూలు పరచి, కేవలం తమ బలగానికి జీత భత్యాల క్రింద ఖర్చు పెట్టడానికి మాత్రమే కాదు ఇంగ్లీషువారు ఇండియాని తమ చేతులలో పెట్టుకున్నది. వారికి ఈ పన్నుల వసూళ్ళ కోసం కొన్నివేలమంది జీతగాళ్ళు బ్రతకడం కంటే ఎంతో విలువయిందీ, ముఖ్యమయిందీ ఇంకొకటి ఉంది. ఎంతసేపూ వారికి కావలసింది ఇండియాతో వర్తక వాణిజ్యాల పెరుగుదల మాత్రమే. అదే అన్ని విధాలా తమకి వాంఛనీయమైన విషయం. ఆ వాణిజ్యాదుల రక్షణ కోసమే మిగతా తతంగమంతా. నిజంగా వారు మనతో సమాన ఫాయాలో వర్తక వాణిజ్యాలు సాగించి ఉంటే, మన పరిస్థితి ఎంతో మెరుగ్గా ఉండేది. ఈ నీచమయిన బీదరికంతో దేశమూ, ప్రజలూ ఇలా ఇక్కట్ల పాలయ్యేవారు కాదు.

ఈ విషయాన్ని బాగా అర్థం చేసుకోవాలంటే దానిని కొంచెం లోతుగా పరిశీలించాలి. మారకపు విలువ 1 షి॥ 4 పె॥ ల చొప్పున మన రైతు ఒక బస్తా సరుక్కి 15 రూపాయలు సంపాదిస్తూ ఉంటే, అదే సరుక్కి మారకపు రేటు 1 షి॥ 6 పె॥లకు పెరిగిన కారణంగా మన రైతుకి ముట్టేది. రూ 13-5-4 లు మాత్రమే. ఈ ఒక్క చిన్న కారణంగా 1928 నుంచీ ఏటా 40 కోట్ల మేరకు మనకు నష్టం అన్న మాట! అంటే, ఇప్పటివరకూ (1941 వరకూ) మన రైతుకి వచ్చిన నష్టం ఎంతో తెలుసా! 40 × 13, అంటె 520 కోట్లన్నమాట! ఈ మదింపు 1925 లో మన దేశంనుంచి ఇంగ్లండుకు ఎగుమతి అయిన సరుకు రు 316 కోట్ల విలువగలదని తేల్చిన అంకెపై ఆధార పడింది.

మనకి ఈ నష్టాల సంగతి ఇల్లా ఉండగా, వారి దేశం నుంచి మన దేశానికి వచ్చే సరుకు (దిగుమతులు) సంగతి గమనిద్దాం. వారి

దేశానికి, వారి సరుక్కి 'చవక బజారు'గా, వారి సరుకు అమ్మకానికి మన దేశం అమరాలి. ముఖ్యంగా, మనం సహకార నిరాకరణం కారణంగానూ, స్వదేశాభిమానంతోనూ పై దేశాలనుంచి దిగుమతులు తగ్గించేస్తూ ఉంటే, పై రీతిని ధరల తగ్గింపు బేరంతో మన నెత్తిన ఎక్కువ సరుకు రుద్దడానికి వారు తంటాలు పడుతున్నారన్నమాట. మారకపు రేటు విలువ హెచ్చింపుతో అల్లా వారు "బజార్ని" చేబడుతూ ఉంటే, మన గ్రామీణ పరిశ్రమలూ, మన ఖాదీ ఉత్పత్తీ, దాని అమ్మకమూ దెబ్బమీద దెబ్బ తింటాయన్నమాట.

## తీవ్ర వాదోపవాదాలు

ఇన్ని విధాలుగా మనం నష్టపోతూ ఉంటే, రూపాయలలో జీతాలు పుచ్చుకునే ఆంగ్లేయులూ, రూపాయలలోనే లాభాలార్జిస్తూన్న ఆంగ్లేయ వర్తకులూ మునుపటివలె ఖర్చుపెట్టకుండా రూ 13-5-4 లకు రూ 15/-ల విలువగల పౌనును కొని, వారి వరుమానంతో మునుపటి కంటె ఎక్కువ పౌనులు కొనగలిగి, వారి బ్యాంకి నిలువలు పౌన్లలో అభివృద్ధి చేసుకోజొచ్చారు. అంతే కదా అంటూ ఈ వాదన అంతా కేంద్ర శాసన సభా వేదికపై చేసేసరికి, అది ఒక చరిత్రాత్మక వాదన అయింది. మా మిత్రులు అన్ని వైపులనుంచీ తర్జన భర్జన చేసి చూపించారు. సర్ పురుషోత్తమ దాస్, ఘన శ్యాందాస్ బిర్లా, జమ్నదాస్ మెహతా మొదలైన వారంతా ఈ విషయాన్ని గురించి క్షుణ్ణంగా చదివారు. నేనూ, నా పరిశోధనను క్షుణ్ణంగా సాగించాను. 1908 నుంచీ వీలు చిక్కినప్పుడల్లా, స్వాభావికంగా ఉంటూ ఉన్న రేటును పెంచుతూ, ఆంగ్ల దేశవాసులు అక్రమ లాభాలు సంపాదించాలన్నప్పుడల్లా, వారు అవలంబిస్తూ వచ్చిన పద్ధతులన్నింటినీ ఎత్తి చూపించగలిగాను.

ఆ తూర్పు ఇండియా కంపెనీ పరిపాలన దినాలలో వారి అక్కౌంటు పద్ధతి అంతా బంగారు నక్షత్రం మార్కు పగోడాలన్నీ

వెండి రూపాయల క్రిందకు మార్చుకోవడంతో సరిపోయేది. పగోడా విలువ $2\frac{1}{2}$ రూపాయిలు ఉండేది.

ఉభయపక్షాల వాదనలూ తీవ్రరూపం దాల్చి, తారస్థాయినందుకున్నాయి. సర్ బేసిల్ వాదనలన్నీ వాగ్ధాటి ప్రదర్శనలేగాని సరుకున్నవి కాదని తేలిపోయింది. ఎప్పటి కప్పుడు ఆయన వాదనలలోని లోట్లు ఎత్తి చూపించి, 'వాటిలో బలంలేదు, అవి నిలువవు' అని నిరూపించేశాం. ప్రజాభిప్రాయం అంతా కాంగ్రెసుపార్టీ వైపూ, ఆ పార్టీతో చేతులు కలిపిన వారివైపూ మొగ్గిపోయింది. వాదనల మధ్య సర్ బేసిల్ రాజీ సూచనలు చెయ్యడం మంచిదనుకున్నారు. రెండు ఉత్తరాలు వ్రాశాడు: ఒకటి నాకు, రెండవది మొదటినుంచీ వాదన బాగా నడిపిస్తూన్న ఇంకొక మిత్రునికీను. ఆయన రాజీ ప్రతిపాదనలు మాకు నచ్చని కారణంగా చర్చలు సాగాయి.

## ఓట్లకోసం డాన్స్ పార్టీలు

ప్రతిపాదనలు ఓటుకు పెట్టాలి కదా! తమ పక్షాన ఓట్లు కోసమని ప్రభుత్వం ఎన్నో ఎత్తులూ, జిత్తులూ ఉపయోగించవలసివచ్చింది. మా పక్షాన ఓటు వేస్తారనుకునే వారిలో గుండె దిటవులేనివారు ఉండవచ్చు కదా! ప్రభుత్వంవారు అటువంటి వారినల్లా ఆశ్రయించారు. గవర్నమెంటు పార్టీవారు మా పార్టీ బలాన్ని తగ్గించడానికి ఓటింగు ముందు రాత్రిళ్ళు డిన్నర్లు, విందులూ ఏర్పాటు చేశారు. పాట కచేరీలు, డాన్స్ పార్టీలూ, భోగం మేళాలూ కూడా ఏర్పాటు చేశారు. చదువరులకు హుషార్! ఆశ్చర్యపోకుండా సంగతులు గ్రహించమని వారికి నా మనవి.

ఆంగ్లేయులలో వృద్ధులు. తామవలంబిస్తూన్న విధానాలన్నీ శాస్త్ర సమ్మతమేననీ, అటువంటి క్లిష్ట పరిస్థితులలో, వారి దేశంలో ఇరు పక్షాలవారూ ఓట్ల సంపాదనకు అవలంబించే సామాన్య పద్ధతులనే

తాము అమలు జరుపుతున్నామనీ, ఇందులో అసాధారణ పద్ధతులేవీ లేవనీ చెప్పారు. ఓటింగు జరిగే ముందు, మెంబర్లు లోపలికి వెళ్ళే ముఖద్వారం దగ్గిర వేచి ఉండి, ప్రభుత్వ సభ్యులు ఇతర సభ్యులను తమ పక్షానికి రావలసిందని ఎంతో ఒత్తిడి చేశారు. కొంతమంది ఒంటి మీద చేతులు వేసికూడా తమ బూత్‌లోకి దారి జూపారు. రాజకీయ సమాచారాధికారి (Public Information Director) గా మెంబర్లకు సలహా చెప్పి దారి చూపించవలసిన ఆసామీ (Whip గా) తనకున్న హోదాను దుర్వినియోగం చేస్తూన్న సందర్భాల నన్నింటినీ, సభాధ్యక్షుని దృష్టికి నేను తీసుకు రావలసి వచ్చింది.

## తటస్థుల దగా

ఈ విధంగా ప్రభుత్వవారి కాన్వాసింగ్ తీవ్రరూపం దాల్చ డంతో, మా గ్రూపునుంచి ఒకరిద్దరు మెంబర్లు జారిపోతారేమోననే భయం వేసింది. మేము భయపడినంతా జరిగింది. చివరికి గవర్న మెంటువారికి 68 ఓట్లూ, మాకు 65 ఓట్లూ వచ్చాయి. తటస్థంగా ఉంటామన్న వారు గవర్నమెంటువారి ఒత్తిడికి లోనయి, మమ్మల్ని దగా జేశారు. అది ఒక తీవ్రాతి తీవ్రమయిన పోటాపోటీ. మా కింకొక రెండు ఓట్లు వచ్చి ఉన్నా, వైస్రాయ్‌గారు తన ఓట్లు వేసి గెలి పించేవారు.

అంత బలవత్తరమయిన ప్రభుత్వంకూడా, ఏ విధంగానైనా, ఒక్క ఓటు మెజారిటీతోనైనా, నెగ్గాం అనిపించుకుని, ముఖం ఎత్తు కుని తిరగడానికి ఎంత తాపత్రయ పడిందో! గవర్నమెంట్ నామ మాత్రంగా తన పరువు నిలబెట్టుకో గలిగిందంతే. దేశంలో అందరికీ గవర్నమెంటు పద్ధతులూ, విధానాలూ బాగా అవగతమయాయి. ప్రభుత్వ విధానాలు ప్రజాహృదయాన్ని గాయపరచాయి. ప్రభుత్వం రాజకీయంగా గెలిచినా, నైతికంగా దెబ్బతిందన్నమాట!

C

# 21

# సైమన్ కమిషన్ నియామకం సద్బుద్ధితో కానేకాదు

**1927** లో వచ్చిన రెండవ పెద్ద సమస్య సైమన్ కమిషన్ నియామకం. భారత దేశానికి అనువైన రాజ్యాంగ చట్ట సవరణలూ, సంస్కరణలూ సూచించడానికని బ్రిటిష్ ప్రభుత్వం వారు సైమన్ కమిష నొకటి వెయ్యడమూ, ఈ నాటకం సాగకుండా చూడాలని కాంగ్రెసు వారు తలచడంతో సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమం ఆరంభం కావడమూ జరిగాయి. అది ఈ రోజులలోనే ఎందు కొచ్చింది? అసలు కమిషన్ని వెయ్యమని ఎవరు కోరారు? ఇలాంటి ప్రశ్నలు ఈ సందర్భంలో చాలామంది వెయ్యడమూ, వారికి తోచిన సమాధానం చెప్పడమూ జరిగింది.

గత యాభై - అరవై సంవత్సరాల కాలంలో అనేక దేశాలు సాధించిన విజయాలూ, సంపాదించిన సంస్కరణాదులతో పోల్చి చూస్తే- మన స్వాతంత్ర్య సమరం అనవసరంగా ఏండ్లూ పూండ్లూ పట్టి ఏమీ సాధించకుండా నడుస్తోందేమో ననిపిస్తుంది. మన జ్ఞాపక శక్తులు కుశలమే అవడాన్ని సైమన్ కమిషన్ విషయంలో ఉత్పన్న మయిన రెండు ప్రశ్నలకూ రకరకాల సమాధానాలు వచ్చాయి.

కొంతమంది ఈ సైమన్ కమిషన్ అన్నది మనకి అనవసర మయినదీ, నిరుపయుక్తమయినదీ అన్నారు. 1929 లో ఇంగ్లండులో జనరల్ ఎన్నికలు జరుగనై ఉన్న సందర్భాన్ని పురస్కరించుకుని విరమిస్తూన్న ప్రభుత్వం తాము భారత దేశాన్ని గురించి ఎంతగానో శ్రద్ధ వహించి, దాని పురోభివృద్ధికి ఎంతో చేశామని అనిపించుకోవ డానికే ఈ కమిషన్ని వేశారని మరి కొంద రన్నారు.

## కన్సర్ వేటివ్‌ల ఎత్తు

దేశంలో అప్పట్లో నడుస్తూన్న కన్సర్వేటివ్ * ప్రభుత్వం జన రంజకంగా లేకపోవడాన్ని ఎన్నికలలో లేబర్‌పార్టీ వారిదే పై చెయ్యి అయి, వారే రాజ్యపాలనలోకివచ్చి, ఆ వెంటనే హిందూ దేశానికి నేరుగా పూర్తి స్వాతంత్ర్యం ఇచ్చేస్తారేమోననే భీతి కన్సర్వేటివ్‌లకి కలిగింది. లోగడ ఉపన్యాసాలలో రామ్సే మేక్డనాల్డ్‌లాంటి లేబర్‌పార్టీ నాయకులు తమ అభిప్రాయాలను ఆ ప్రకారంగా వ్యక్తపరిచారు కూడాను. కన్సర్వేటివ్‌లకు భారత దేశానికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చేసి చేతులు దులుపుకుని కూచోవడం ఇష్టంలేదు. అటువంటి పరిస్థితులు రాకుండా ఉండడానికి కన్సర్వేటివ్ ప్రభుత్వంవారు ఈ కమిషనును ఏర్పరిచారు. ఈ కమిషనువారు తొందర తొందరగా తమ విచారణ ముగించి, చేసే సిఫార్సుల ప్రకారం ఇండియాకి పూర్తిగా డొమినియన్ స్టేటస్ ఇవ్వకుండా తంటాలు పడవచ్చు కదా అన్నదే వారి ఊహ. కన్సర్వేటివ్ గవర్న్‌మెంట్ వారికి కూడా "భావి"మీద దృష్టి లేకపోలేదు. కాని ఇండియా లేకపోతే ఇంగ్లండే లేదనే నమ్మకంతో ఉన్నవారు వారు.

ఇండియాలో కూడా, వివిధ రాజకీయ సంఘాలవారు, రకరకాలుగా ఆశాభంగాలు పొంది, ఏదో ఒక రకంగా మనకు ఉపకరించే ఏ కొద్దిపాటి సూచనలనయినా ఇంగ్లీషువారి నుంచి పిండి రాబట్టుకోవాలనీ, వారేమి ఇచ్చినా మహాభాగేననీ అనుకుంటూన్న స్థితిలో ఉన్నారు.

## పూర్వ రంగం

గత పది సంవత్సరాలలోనూ రాజకీయ సమరంలో సంక్షోభాన్ని కలుగజేసే ఎన్నో నూతన విషయాలూ, పోకడలూ తలయెత్తాయి. వెనక 1917లో రాష్ట్రాలలో ద్వంద ప్రభుత్వపు ఏర్పాట్లంటూ బ్రిటిషు

---

* కన్సర్వేటివ్‌లంటే మార్పులు ఇష్టం లేనివారనీ, లేబర్ పార్టీ అంటే శ్రామిక సంఘీయులు కనుక సానుభూతి కలిగి ఉంటారనీ లోకంలో అభిప్రాయం.

వారు తయారు చేసిన పదకాలు చాలా అసంతృప్తికరంగా ఉన్నా, వాటిని 1921 లో ప్రవేశపెట్ట నారంభించారు. అదే రోజులలో సహకార నిరాకరణ, శాసన ధిక్కారాది ఉద్యమాలు ఆరంభించబడ్డాయి.

1921 కి పూర్వం, జనరల్ డయ్యర్ కారణంగా జలియన్ వాలాబాగ్ దురంతంలో వేలాది జనం క్రూరంగా హింసింప బడ్డారు. కాని ఆ ఉదంతం ఆంగ్లేయుల దృష్టిలో న్యాయ సమ్మతమే అయింది. ఆ దుష్కృత్యాన్ని "సాహసోపేతంగా" చేశాడని గౌరవ సూచకంగా ఆంగ్లేయులు జనరల్ డయ్యర్‌కు ఖడ్గ ప్రదానం కూడా చేశారు. దేశంలో ఎంత తీవ్రమైన అసమ్మతి ప్రకటించబడ్డా 'రౌలట్' చట్టం ప్యాసయింది. ఆ చట్టం అంతం అయ్యేదాకా ధిక్కారాలూ, సవాళ్ళూ జరుగుతూనే వచ్చాయి.

1918-20 సంవత్సరాలలో కాంగ్రెసు నాయకత్వం క్రమేణా గాంధీగారి హస్తగతం అయింది. కాంగ్రెసు, భాషను ప్రాతిపదికగా తీసుకుని, 21 భాషా రాష్ట్రాలుగా దేశాన్ని విభాగించింది. కాంగ్రెసు కమిటీవారు అతి సులభమైన, అతి విస్తీర్ణమైన పదకంతో, నాలుగు అణాల చందాతో తమ సభ్యుల సంఖ్యను వృద్ధి పొందించు కున్నారు. నిర్మాణ కార్యక్రమం దేశవ్యాప్తంగా అమలు జరిగింది. పన్నెండు మాసాలలోనే ఉద్ధృతంగానూ, నిర్దుష్టంగానూ అమలు జరిగిపోయింది. ఆ నిర్మాణ కార్యక్రమం, సహకార నిరాకరణ ఉద్యమం హిందూ మహమ్మదీయ సంఘీభావంమీద ఆధారపడి అభివృద్ధి గాంచాయి.

స్వాతంత్ర్యం కోసం నోరు తెరుచుకుని కూచున్న జన బాహుళ్యాన్ని సక్రమ మార్గాన్ని నడపించడం కోసం, నిర్మాణ కార్యక్రమం సవ్యంగా అమలు పరచడం కోసం ఒక కోటి రూపాయలు నిమిషాల మీద వసూలయ్యాయి. 'ఒక్క సంవత్సరంపాటు శ్రమపడితే దేశంలో స్వాతంత్ర్యం స్థాపించ గలుగుతాం. స్వాతంత్ర్యం ఒక్క ఏడాది లోపల్నే వచ్చేస్తుంది' అని అందరం నమ్మాం. ఈ ఆశతోనే, ఎన్నో కుల మతాలకు చెందిన జనం అంతా, కాంగ్రెసు పిలుపును మన్నించి,

ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాకపట్ల దేశవ్యాప్తంగా నిరసన చూపిస్తూ, ప్రజలు ఆయన రాకను అనుకున్న దానికంటె ఎంతో విజయవంతంగా బహిష్కరించారు.

"చౌరీ చౌరా" దురాగతం కారణంగా గాంధీగారు ఉద్యమాన్ని నిలుపు చెయ్యకుండా ఉండి ఉంటేనూ, లోలోపల స్వయంపాకాల వల్ల కాంగ్రెసులో చీలికలు రాకుండా ఉండి ఉంటేనూ, డొమినియన్ స్టేటస్ అన్నమాటేమిటి- ఆ 1921 లో సంపూర్ణ స్వరాజ్యమే మనకు లభించి ఉండేది. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాక సందర్భంలో దేశవ్యాప్తంగా జరిగిన హర్తాలూ, ఆయన రాకను నిరసిస్తూ మనం చేసిన బహిష్కారమూ, వైస్రాయ్ అంతటి వానికే రైలునుంచి బయటికి సామాను మోయడానికి రైల్వే పోర్టర్లు దొరక్కపోయిన తీరూ గమనించిన ఆంగ్లేయులకు - ఇక్కడి వారికి, ఇంగ్లండ్‌లో వారికి కూడా- కను విప్పయింది. భారత దేశానికి, జాతికీ విమోచనకాలం సమీపించింది, వారు స్వాతంత్ర్యానికి అర్హులు అనే నమ్మిక పుట్టుకొచ్చింది. ఆనాటి భారతీయ సమైక్య శక్తి యావత్తు ప్రపంచాన్నీ ఊచి 'భేష్ - సెహబాస్', అనిపించింది.

## భేదోపాయం

జైలునుంచే దాస్-మోతీలాల్‌గారలు గాంధీగారిపై తిరుగుబాటు చేసి ఉండకపోతే, మనం కొద్దికాలమైనా ఐకమత్యం ప్రదర్శించగలిగి ఉంటే- పూర్ణ స్వరాజ్య గమ్యం కాకపోయినా, దాని దరిదాపుల్లోకి ఆ 1921-22 సంవత్సరాలలోనే చేరి ఉండేవారం. ఆనాటి వైస్రాయ్ రీడింగ్ ప్రభువు దేశీయులలోని సంఘీభావానికి విస్తుపోయి, విభ్రాంతుడయి, రాజీ సూచనలనే రొట్టి ముక్కని మాటువేసి, జైలు గోడల మీదుగా విసిరాడు. నిజానికి గాంధీగారి ప్రమేయం లేకుండా ఆ ఇరువురూ ఏమీ చెయ్యరేమో, అసలు చెయ్యలేరేమో అనుకుంటూనే ఆ పన్నుగడ పన్నాడు. అలా అనుకోకుండా విసిరిన ఊహా చాతుర్యపు

ఉప్పుతో, కాంగ్రెసులో చీలికలు తేవడానికీ, గాంధీగారిని అరెస్టు చెయ్యడానికీ ఆంగ్లేయులకు వీలిచ్చింది.

పైన చెప్పిన ప్రకారం వైస్రాయి, సెక్రటరీ ఆఫ్ స్టేట్ జాపిన చేతినుంచి ఆశామృతపు చుక్కలు రాల్చకుండానే కాంగ్రెసులోని స్వరాజ్యపార్టీ నాయకులను ఆశాపాశబద్ధుల్ని చేయగలిగారు. ఈ ప్రకారంగా ఆ రెండు కాంగ్రెసు విభాగాల మధ్య పొత్తు అన్నది కుదరకుండా 1924 నుంచి 1926 వరకూ అన్న మాటేమిటి, సుమారు 1930 వరకూ కూడా, ఆపు చేయగలిగారు. ఈ తంత్రం అంతా, ఇంగ్లండులో ఉన్న కన్సర్వేటివ్ గవర్నమెంట్ వారు చాకచక్యంతో, 1921 నుంచి 1927 వరకూ, వెనకనుంచీ చక్కగా నడిపించగలిగారు.

అంతేకాదు- 1926 లో దేశవ్యాప్తంగా జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు సాధించిన విజయాలనూ గమనించారు. ఎనిమిది సంవత్సరాలపాటు కాంగ్రెసులోని స్వరాజ్యపార్టీవారిని ఆశాపాశబద్ధుల్ని చేసి విడిగా ఆడించినా ఉభయపక్షాలవారూ సన్నిహితంగా వచ్చి జాయింటుగా ఆంగ్ల పరిపాలనా విధానంమీద విరుచుకుపడబోతున్నారన్న సంగతి గ్రహించారు. రాష్ట్ర కేంద్ర శాసన సభలలో కాంగ్రెసువారు చేస్తూన్న గడబిడలూ, చూపిస్తూన్న రాజకీయ తంత్రజ్ఞతా, అవలంబిస్తూన్న విధానమూ గమనించి, మనం సందిగ్ధస్థితిలో వస్తున్నాం, ఒక పెద్ద గండాన్ని ఎదుర్కోక తప్పదు అని గుర్తించారు. ఒకవేళ ఏ కారణంచేతనైనా 1929 తర్వాత ఇంగ్లండులో జరగబోయే ఎన్నికలలో లేబర్‌పార్టీ వారే అధికారాన్ని చేపట్టగలిగి, భారతదేశానికి ఏదయినా ఇచ్చిపోతారేమో నన్న బాధ పట్టుకుంది వారికి. తద్బాధా నివారణార్థం, ఇల్లాగయినా, ఒక అడ్డుపుల్ల వెయ్యలేకపోతామా అనే ధీమాతో వారు సైమన్ కమిషన్ని ఏర్పరచి మన నెత్తిని రుద్దడం సంభవించింది. ఇటువంటి కమిషన్ని వేసి, వారి అభిప్రాయాన్ని ఆంగ్లప్రభుత్వం మన్నించక తప్పనిసరి అయ్యే ఏర్పాట్లు చేసి, తద్వారా, హిందూదేశానికి ఎవరైనా

ఉచ్చుతో, కాంగ్రెసులో చీలికలు తేవడానికీ, గాంధీగారిని అరెస్టు చెయ్యడానికీ ఆంగ్లేయులకు వీలిచ్చింది.

పైన చెప్పిన ప్రకారం వైస్రాయి, సెక్రటరీ ఆఫ్ స్టేట్ జాపిన చేతినుంచి ఆశామృతపు చుక్కలు రాల్చకుండానే కాంగ్రెసులోని స్వరాజ్యపార్టీ నాయకులను ఆశాపాశ బద్ధుల్ని చేయగలిగారు. ఈ ప్రకారంగా ఆ రెండు కాంగ్రెసు విభాగాల మధ్య పొత్తు అన్నది కుదరకుండా 1924 నుంచి 1926 వరకూ అన్న మాటేమిటి, సుమారు 1930 వరకూ కూడా, ఆపు చేయగలిగారు. ఈ తంత్రం అంతా, ఇంగ్లండులో ఉన్న కన్సర్వేటివ్ గవర్నమెంట్ వారు చాకచక్యంతో, 1921 నుంచి 1927 వరకూ, వెనకనుంచీ చక్కగా నడిపించగలిగారు.

అంతేకాదు- 1926 లో దేశవ్యాప్తంగా జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు సాధించిన విజయాలనూ గమనించారు. ఎనిమిది సంవత్సరాలపాటు కాంగ్రెసులోని స్వరాజ్యపార్టీ వారిని ఆశాపాశబద్ధుల్ని చేసి విడిగా ఆడించినా ఉభయపక్షాలవారూ సన్నిహితంగా వచ్చి జాయింటుగా ఆంగ్ల పరిపాలనా విధానంమీద విరుచుకుపడబోతున్నారన్న సంగతీ గ్రహించారు. రాష్ట్ర కేంద్ర శాసన సభలలో కాంగ్రెసువారు చేస్తూన్న గడబిడలూ, చూపిస్తూన్న రాజకీయ తంత్రజ్ఞతా, అవలంబిస్తూన్న విధానమూ గమనించి, మనం సందిగ్ధస్థితిలో వస్తున్నాం, ఒక పెద్ద గండాన్ని ఎదుర్కోక తప్పదు అని గుర్తించారు. ఒకవేళ ఏ కారణంచేతనైనా 1929 తర్వాత ఇంగ్లండులో జరగబోయే ఎన్నికలలో లేబర్‌పార్టీ వారే అధికారాన్ని చేపట్టగలిగి, భారతదేశానికి ఏదయినా ఇచ్చిపోతారేమో నన్న బాధ పట్టుకుంది వారికి. తద్బాధా నివారణార్థం, ఇల్లాగయినా, ఒక అడ్డుపుల్ల వెయ్యలేకపోతామా అనే ధీమాతో వారు సైమన్ కమిషన్ని ఏర్పరచి మన నెత్తిని రుద్దడం సంభవించింది. ఇటువంటి కమిషన్ని వేసి, వారి అభిప్రాయాన్ని ఆంగ్లప్రభుత్వం మన్నించక తప్పనిసరి అయ్యే ఏర్పాట్లు చేసి, తద్వారా, హిందూదేశానికి ఎవరైనా



ఏదైనా ఇవ్వడానికి పూనుకునే రోజును ఎంత ఎక్కువ వెనక్కి నెట్టగలిగితే అంత మంచిదని వారి ఆలోచన.

'చావు తెలివి' సమాచారం

ఈ మాదిరి కమిషన్ని ఏర్పాటు చేద్దాం అన్న ఊహ, 'చావు తెలివి'లా, హఠాత్తుగా పుట్టిన కారణంచేత మన దేశానికి న్యాయంగా ఇవ్వవలసిన గడువు ఇవ్వకుండానే ఆ కమిషన్ని మన నెత్తిని రుద్దారు. భారతీయులు తమని ఏ విధంగా అర్థం చేసుకుని, ఎటువంటి విమర్శలకు గురి చేస్తారో అని కూడా యోచించినట్లు లేదు. దేశంలో కలిగిన ఉద్రిక్త పరిస్థితులను శాంతపరచాలనే ఉద్దేశంతో ఏర్పరచే ఏ రాయల్ కమిషన్నయినా, ఆ కమిషన్ ఆశయమూ, దాని కిచ్చే అవకాశమూ, అది అవలంబించబోయే పద్ధతి మొదలైనవేగానీ, ఆ కమిషన్‌లో ఫలానా ఫలానా వారుంటారన్న విషయం కూడా ముందుగా తెలియచెయ్యందే ఏర్పరచడం సాధారణంగా జరగదు. ఉభయదేశాలలోనూ లభ్యమైన సాక్ష్యాలవలన, ఈ కమిషన్ని ఏర్పరచిన యోధులు (Constitution Commission) పై విషయా లన్నింటిలోనూ తప్పటడుగులు వేస్తూనే దీనిని నియమించినట్లు కనబడుతుంది. వేసే కమిషన్లకు ప్రాతిపదికగా పాటించవలసిన ప్రధాన సూత్రంగా ఆ కమిషన్‌లో భారతీయులపేర్లు కూడా కొన్ని ఉండాలి అన్న దృష్టే వారికి లేకపోయింది. ఈ దేశీయుల నామాలు కొన్ని ఆ కమిషన్‌లో ఉండి ఉంటే, ద్వంద ప్రభుత్వపు ఏర్పాట్లు ఏ విధంగా పరిణమించాయో సరిగా అంచనా వేసుకోవడానికైనా వారికి వీలుండేది. ఈ చిన్న పొరపాటే దేశంలోని అన్ని వర్గాలవారూ ఒక్క తాటిమీదకు వచ్చి, కమిషన్‌వారి రాకను బహిష్కరించాలనే నిర్ణయానికి రావడానికి సహాయం చేసింది.

ఇర్విన్ ప్రకటన

ఈ కమిషనుకు సంబంధించిన ఉద్దేశాలూ, ఆదేశాలూ, స్థాయీ లాంటివి కాస్త విచారిద్దాం. ఇర్విన్ ప్రభువు విడుదల చేసిన ఒక ప్రకట

నలో సైమన్ కమిషన్ వారవలంబింపవలసిన విధానమూ, పద్ధతీ, మొదలైనవి ఏవీ రాయల్ కమిషన్‌వారు నిర్ణయించలేదని ఒప్పుకున్నారు. అంతేకాదు, ఎలక్టయిన కేంద్ర శాసన సభ్యులూ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్ వారూ కలసి ఒక జాయంట్ కమిటీగా ఏర్పడి, ఆ రాయల్ కమిషన్ వారితోపాటు ప్రయాణం చేసి సాక్ష్యాన్ని సేకరించి, సైమన్ కమిషన్ వారి పరిశీలన నిమిత్తమో, సూచన ప్రాయమైన సలహాగానో, వారు యే దృష్టితో స్వీకరించినా తమ అభిప్రాయాన్ని మాత్రం అందజేయ డానికి తావుందని వైస్రాయిగారు ఒప్పుకున్నారు.

లార్డ్ ఇర్విన్నూ, ఆంగ్ల రాజ్య తంత్రజ్ఞులూ కూడా తాము తప్పే చేశామని ఒప్పుకున్నారు. కాని ఇవి యేవీ కూడా భారత నాయకులకు సంతృప్తిని కలుగచేయలేదు. వేయబోయే ఇండియన్ సబ్ కమిటీ వారు కేవలం ఎసెస్సర్లయి, బొమ్మలలాగ జరుగుతూన్న కర్మకాండను వీక్షిస్తూ ఉంటారన్న మాట. వీరి అభిప్రాయంతో వారికి ఎటువంటి సంబంధమూ ఉండకపోవచ్చునంటే పరిస్థితి ఎల్లా ఉంటుందో ఆలో చించండి. విషమించకుండా ఏలా ఉంటుంది?

భారతదేశంలో అడుగు పెట్టిన మూడవనాడు సర్ జాన్ సైమన్ (దరిమిలా లార్డ్ అయ్యాడు) వైస్రాయ్ ఇర్విన్ పేర వ్రాసిన ఒక లేఖ ఆధారంగా, ఇర్విన్ ప్రభువు ఈ సూచన చేశాడు. ఆ ఉత్తరంలో సైమన్‌గారు ఏమని వ్రాశారంటే- సెంట్రల్ అసెంబ్లీలోనూ, కౌన్సిల్ లోనూ ఉండే సభ్యులనుంచి, ఏడ్గురు సభ్యులు ఒక ఉప సంఘంగా ఏర్పడవచ్చుననీ, తమ సంఖ్య ఆరు నొక్కటవడాన్ని వారూ ఏడ్గురు ఉండడం న్యాయమనీ, వారు తమతో సమానస్థాయిలోనే పర్యటిస్తూ సాక్ష్యసేకరణ చెయ్యవచ్చుననీ, రాష్ట్రాలలో ఉండే శాసన సభ్యులు కూడా అదే ప్రకారం ఉప సంఘాలను ఏర్పరచుకుని రాయల్ కమిషన్ వారికి సహకారులుగా ఉండవచ్చుననీ.

## దేశీయుల నిరసన భావం

ఈ ఉత్తరమూ, వైస్రాయిగారి ప్రకటనా పరిస్థితిని మెరుగు పరచడానికి బదులు దేశంలో నాటుకున్న అనుమాన బీజానికి మరింత దోహదం చేశాయి. ఎన్ని విధాలుగా ఆశ చూపించి పురికొల్పాలను కున్నా, అసెంబ్లీలో ఉన్న కాంగ్రెసు పార్టీవారు ఎంతమాత్రం చలించలేదు. సహకరించడానికి ముందడుగు వెయ్యలేదు. ఇంత అను భవం ఉన్న వైస్రాయిగారూ, ఆంగ్ల కాబినెట్ మంత్రులూ కూడా ఏదో ఇంత 'ఎర' చూపి భారతీయుల నోరు కట్టుపడుతుందని ఎల్లా తల చారో అర్థం కాలేదు.

చెన్నపట్నంలోని జస్టిస్ పార్టీవారు మినహా, భారతదేశంలోని వివిధ రాష్ట్రాలకు చెందిన పార్టీల వారందరూ, పేరు బడ్డ యావన్మంది నాయకులూ బ్రిటిషు ప్రభుత్వంవారి భావాన్నీ, హృదయాన్నీ కూడా శంకించారు. అందులో జనరల్ ఎన్నికలు ముందు పెట్టుకుని, ఇలాంటి కమిషన్ని ఆంగ్లేయులు ఏర్పరచడాన్ని ప్రతివారూ గర్హించారు. పెద్దలు చాలామంది కమిషన్‌పట్ల నిరసన తెలిపారు.

దేశం యావత్తూ ఒకే విధంగా వ్యతిరేకంగా ఉన్నా, ఎలాగో ఒకలాగు ఆ (చేదు) మాత్రని భారతదేశీయులచేత మింగించి తీరతాం అన్న పట్టుదలమీదనే ఆంగ్లేయులున్నారు. వైస్రాయికి దేశం ఎంత బిగిమీద ఉన్నదీ పూర్తిగా తెలుసు. 1927 డిసెంబర్‌లో ఈ కమిషన్ బాయ్‌కాట్ ప్రధాన ఉద్దేశంగా, చెన్నపట్నంలో కాంగ్రెస్ జరుగనున్న దన్న సంగతి తెలుసును. వెనుకటి వైస్రాయ్ రీడింగ్ కాలంలో ఎంత బిర్రుమీద, ఏకగ్రీవంగా యావత్తు దేశమూ ప్రిన్స్ ఆఫ్ వేల్స్ రాకను బహిష్కరించిందో ఇర్విన్ ఎరగనిది కాదు. తన ఏలుబడి కాలంలో ఈ సైమన్ కమిషన్ బహిష్కరణ అన్నది ఎంత తీవ్రంగా ఉంటుందో కూడా ఇర్వీను ప్రభువు ఊహించుకునే ఉన్నాడు.

## వైస్రాయిగారి విన్నపాలు

కాని ఆయనా, సెక్రటరీ ఆఫ్ స్టేట్ లార్డ్ బర్కెన్ హెడ్డూ సైమన్ కమిషన్ వారి యాత్ర సుగమం చేసి తీరాలనే పట్టుదలమీద ఉన్నారు. డిసెంబరు 27 న కాంగ్రెస్‌వారు సైమన్ కమిషన్ 'బాయ్ కాట్' తీర్మానం ప్యాసు చేయడం కోసమే మద్రాసులో కలుస్తున్నారన్న సంగతి ఎరిగిఉన్న ఇర్విన్ ప్రభువు నవంబర్ మొదటి వారంలో కొన్ని ముఖ్యమైన విషయాలమీద భారతీయ నాయకులందరితోటీ సంప్రదించడానికి తాను సిద్ధంగా ఉన్నాననీ తెలియపరిచారు. అప్పట్లో సెంట్రల్ అసెంబ్లీలో కార్యకలాపాలు సాగుతున్నాయి. అసెంబ్లీ నడుస్తోందన్నమాట! ఈ పిలుపు సెంట్రల్ అసెంబ్లీలో ఉన్న సభ్యులందరికీ అందజేయబడింది. సైమన్ కమిషన్ విషయంలో సహకారం అర్థించడం కోసమే ఈ పిలుపు వచ్చిందన్న సంగతి అందరూ ఎరిగినదే. కాంగ్రెస్‌వారు వైస్రాయ్‌గారి పిలుపును మన్నించి, వారితో సంప్రతించడానికి ఎప్పుడూ సన్నద్ధులుగా లేరు. కాని గాంధీగారు ఆయన్ని కలుసుకుని తన మనోగత అభిప్రాయాన్ని సువ్యక్తం చేశారు.

ఇది జరిగాక కూడా వైస్రాయ్‌గారు నాయకులనీ, ప్రజలను కూడా రాయల్ కమిషన్ వారి సంచార కార్యక్రమంతో సహకరించమని కోరుతూ ఒక విన్నపాన్ని ప్రకటించాడు. ఒక్క దేశీయుడికి కూడా అందులో సాధనం లేని ఆ కమిషన్ దేశవ్యాప్తంగా బహిష్కరించబడింది.

వైస్రాయ్‌గారు ఇంకో విన్నపాన్ని ప్రకటించాడు. ప్రజలచేత ఎన్నుకొనబడి సెంట్రల్ అసెంబ్లీలోనూ, రాష్ట్ర అసెంబ్లీలలోనూ రాష్ట్ర అసెంబ్లీలలోనూ ఉంటున్న నాయకులు చెప్పింది ప్రజాభిప్రాయంగా స్వీకరించి, దానిని పరిశీలించి, వారి సదభిప్రాయాలను మన్నించి, ఉభయ దేశాల మధ్యా సుహృద్భావం పెంపొందిస్తూ దేశీ

యుల కోర్కెలను మన్నించే సదుద్దేశంతోనే బ్రిటీషువారు కమిషన్ని నిర్ణయించారు గావున, ఆ కమిషను వారిని కలుసుకుని సంప్రతించడం దేశీయుల క్షేమ లాభాలకేననీ సూచించారు. వైస్రాయిగారి విన్నపాలన్నీ బుట్టదాఖలయ్యాయి.

## 'వి భీ ష ణా యి లు'

కాని ప్రతి దేశంలోనూ కొంతమంది విభీషణాయి లుంటూ ఉంటారుకదా! ఆ విభీషణాయిలు తమ దేశాన్ని మట్టుపెట్టడానికి ఎప్పుడూ రెడీయే. అలాంటి వారు కొందరు కమిషన్ వారిని కలిశారు. తదితరు లెవ్వరూ వారి ముఖం చూడలేదు.

డా॥ అన్సారీగారి అధ్యక్షతను 1927 డిసెంబర్ ఆఖరి రోజులలో మదరాసులో కాంగ్రెసు మహాసభ జరిగినప్పుడు, సైమన్ కమిషన్ని బాయ్‌కాట్ చేయవలసిందన్న తీర్మానం ఆమోదించబడింది. కమిషన్ వారికి ఎలాంటి సహకారమూ ఇవ్వరాదనీ, వారి విచారణ సందర్భంలో వారికెలాంటి సమాచారమూ అందజేయరాదనే దేశవ్యాప్తంగానూ, విశదంగానూ కాంగ్రెసు సంస్థ లన్నిటికీ, ప్రజానీకానికీ కాంగ్రెసువారు విజ్ఞప్తులు చేశారు. కమిషన్‌వారు బొంబాయిరేవులో దిగిననాడే దేశ వ్యాప్తంగా హర్తాల్ జరపాలనీ, వారు ఏ ప్రాంతానికి వెళ్ళినా వారిరాక పట్ల అసమ్మతి సూచకంగా ఆ ప్రాంతీయులు తగు ప్రదర్శనలు జరపాలనీ, దేశవ్యాప్తంగా సూచనలు ఇవ్వబడ్డాయి. అసెంబ్లీ మెంబర్ల కందరికీ, కమిషన్‌వారికి ఏ విధమైన సహకారాన్నీ అందజేయరాదంటూ ఆదేశాలు వెళ్ళాయి. వీలయినప్పుడల్లా, వీలయిన విధంగా, వారి రాక పట్ల అసమ్మతి ప్రకటించాలని కూడా సూచనలు ఇవ్వబడ్డాయి.

## బ్రిటిషువారి ఆశ

సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కూ, బ్రిటిషు క్యాబినెట్ వారికీ, గవర్నర్లకూ కూడా ప్రజాహృదయం పూర్తిగా తెలిసే ఉంది. వారందరూ 1921లో ప్రిన్స్ ఆఫ్ వేల్స్ ఏవిధంగా బహిష్కరించబడ్డాడో ఎరిగే ఉన్నా,

ఎంత అణిచిపెట్టినా, కాంగ్రెసులో చీలికలు తీసుకొని వచ్చేందుకు యత్నించడంతో ఎన్ని చేయగలిగినా, కాంగ్రెస్‌నించి పిలుపు వచ్చేసరికి ప్రజలూ, నాయకులూ కలిసి ఎటువంటి త్యాగాల నయినా చేయడానికీ సన్నద్ధులవుతారన్నది వారు ఎరగందికాదు. అయినా కాంగ్రెసులో చీలికలు తేగలం అనే ధీమా వారికుంది. కాగా, ప్రజలకు కావలసిన 'బోధ' జరగలేదనీ, వారి ఐకమత్యానికి చేయవలసిన కృషి మృగ్యమేననీ, నిర్మాణ కార్యక్రమం అసలు పనే చెయ్యడం లేదనీ, ఈ పరిస్థితులలో సైమన్ కమిషన్ బాయికాట్ అన్నది నిస్సంశయంగా విఫలం అయ్యి తీరుతుందనీ వారు భావించారు.

ప్రజలు అక్షరాస్యులు కారనీ, తాము జరిపించిన దారుణకాండ లన్నీ వారి మనస్సుల్లో భయోత్పాతాన్ని ఇంకా పచ్చగానే ఉంచి ఉంటా యని బ్రిటిషువారి నమ్మిక. నిజమే. నిర్మాణ కార్యక్రమాలేవీ కొనసాగని పరిస్థితులలో ప్రభుత్వంవారు అల్లా తలచడంలో ఆశ్చర్యం లేదు. కాని వారికి భారత పౌరులయొక్క అఖండ శక్తీ, నరనరాల లోనూ నాటుకుపోయిన వారి అహింసాతత్వం, అహింసామార్గాన్నే దేనినయినా సాధించగలమనే వారి అచంచల విశ్వాసం అర్థం అయి ఉండవు. అక్షరాస్యులూ, నిరక్షర కుక్షులూ అన్న పదాలకు చెప్పబడే అర్థాలు ఏవయినా, ప్రజాబాహుళ్యం మాత్రం, కమిషన్‌వారు దేశంలో అడుగుపెట్టిన ఆ మొదటిరోజునుంచీ అవసరమయిన త్యాగాల కన్నింటికీ సంసిద్ధులయ్యే ఉన్నారు. అందుకు నిరక్షరాస్యతగాని, శిక్షణ లోపంగాని అడ్డురాలేదు.

ద్వితీయ ఖండం సమాప్తము

# నా జీవిత యాత్ర

## తృతీయ ఖండము




టంగుటూరి ప్రకాశం




ఎమెస్కో ప్రచురణ - 207




యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్టణం . మద్రాసు . సికింద్రాబాదు

T 24

NAA JEEVITA YATRA—Vol. III
(Autobiography of Andhra Kesari
Prakasam pantulu in four volumes)
By
TANGUTURI PRAKASAM

Publishers :
M. SESHACHALAM & CO.

First Edition :
EMESCO POCKET BOOKS
July 1972

Cover Design :
BAPU

Printers :
KRANTI PRESS, Madras-1.

Distributors :
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
RASHTRAPATHI ROAD, SECUNDERABAD.

Price Rs. 2-50

Four volumes bound in one hard cover edition Rs. 15/-




207

# నా జీవిత యాత్ర:

## తృతీయ ఖండం

# 1

# తిరిగి పో, సైమన్!

సైమన్ కమిషన్ బహిష్కరణ సంఘటనల గురించి చదువరులకు పరిపూర్ణమయిన అభిప్రాయం కలగడం కోసమూ, జరిగింది యథాతథంగా తెలియడం కోసమూ, దక్షిణా పథానికి చెందిన ఆంధ్రులూ, తమిళులూ, మలయాళీలూ, కన్నడిగులూ ఆ ఉద్యమంలో ఎల్లా ఎల్లా తమ తమ పాత్రలు నిర్వహించారో వివరంగా చెప్పి మరీ యీ కమిషన్ కథను పొంతం చెయ్యాలని ఉంది.

దక్షిణ దేశానికి సంబంధించి నంతవరకూ ఈ ఉద్యమాన్ని ఆంధ్ర ప్రాంతంలో నేనూ, చెన్నపట్నంలోనూ- దక్షిణాదిన నా మిత్రుడు సర్గీయ శ్రీనివాసయ్యంగారూ నాయకత్వం వహించి నడిపించాము. నా నాయకత్వాన నడుస్తూన్న ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ వారికీ, శ్రీనివాసయ్యంగారి నాయకత్వాన నడుస్తూన్న తమిళనాడు కాంగ్రెసు కమిటీ వారికీ మధ్యని ఎటువంటి స్పర్థలూ లేవు కొన్ని ప్రత్యేక పరిస్థితులలో తప్ప, పరస్పరం సంప్రతించుకునే, పరస్పర సహకారంతోనే, ఉద్యమం సాగించాలన్నదే మా వాంఛ. ఆ ప్రత్యేక పరిస్థితులన్నవి ఉభయ భాషల వారికీ ఉండుకున్న ప్రత్యేక గుణగణాలకు సంబంధించిన సున్నితమయిన సమస్యలన్నమాట.

## నల్ల జెండాలు

సైమన్ కమీషన్‌వారు మొదటిసారిగా * పట్నం వచ్చిన సందర్భంలో వారికి నల్ల జెండాలతో స్వాగతం ఇవ్వబడింది. ఇటువైపు తిరిగినా, ఏ మూల చూసినా నల్ల జెండాలే ఎదురయ్యాయి. ఆనాటి కార్యక్రమంలో ఇతర నాయకులతో కలిపి పాల్గొని ఉద్యమాన్ని జయ

* 1928 ఫిబ్రవరి ఆఖరి వారంలో.

ప్రదంగా నడిపించాలనే ఉత్సాహంతో దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు గుంటూరునుంచి వచ్చి, 'బాయ్‌కాట్' పూర్తిగా విజయవంతం చేయడానికి ఎంతో తోడ్పడ్డారు.

## అపురూప దృశ్యం

సైమన్ కమిషన్‌వారు బొంబాయిలో 1928 ఫిబ్రవరి 3 వ తేదీని ఓడ దిగారు. ఆ రోజున, శ్రీనివాసయ్యంగారూ, నేనూ ఇతర ప్రముఖులతో కలిసి ఊరేగింపులు సాగించాం.* చెన్నపట్న వాసులు ఎప్పుడూ చూడని అపురూప దృశ్యం అది. శ్రీనివాసయ్యంగారూ, ఆయన అనుచరులయిన స్వచ్ఛంద సేవకులూ మొదటి శ్రేణిలో ముందు నడుస్తూ ఉంటే, నేనూ - నా అనుచరులూ ద్వితీయ శ్రేణిలో నడుస్తున్నాం. ఊరేగింపు జార్జిటౌన్‌లో ఆరంభించబడింది. అక్కడనుంచి మౌంట్ రోడ్డు గుండా, మెరీనా బీచికి చేరే పర్యంతం అంతదూరమూ నడిచే వచ్చాం.

అక్కడ పోలీస్ కమిషనర్ సి. జె. కన్నింగుహామ్ మమ్మల్ని అటకాయించాడు. పెద్ద పోలీసు బలగంతో మమ్మల్ని చుట్టుముట్టి, రోడ్డంతా ఆక్రమించాడు. నిజానికి మేము చులాగ్గా ఆ పోలీసు కార్డన్‌ని కాదని తప్పించుకుని ముందడుగు వేయవలసిన పరిస్థితే అయినప్పటికీ అటువంటి ఉద్రిక్త పరిస్థితులలో కార్డన్‌ని లెక్కచెయ్యకుండా ముందడుగు వేయవలసిందనే ఆదేశం కాంగ్రెసు ఇచ్చి ఉండలేదు. అందుకని కాస్త తటపటాయించాం.

శ్రీనివాసయ్యంగారు అటువంటి పరిస్థితులకు అలవాటు పడి ఉండలేదు. కన్నింగహామ్ వెనక్కి తిరగమని చేతితో సంజ్ఞ చేసిన

* 1929 లో సైమన్ కమిషన్ రెండవతూరి మదరాసు వచ్చినప్పుడు ఈ సంఘటనలు జరిగినట్టుగా కీ. శే. వావిళ్ల వేంకటేశ్వరులుగారి "ప్రకాశము పంతులుగారి జీవితము" (పే-99)లో చెప్పబడింది.

తక్షణం శ్రీనివాసయ్యంగారు నిశ్శబ్దంగా ఆ ఆజ్ఞను పాటిస్తూ వెనక్కి తిరిగారు.

చెప్పానుగా- మొదటి శ్రేణిలో శ్రీనివాసయ్యంగారూ, వారి వాలంటీర్లూ నడవగా, ద్వితీయ శ్రేణిలో నేనూ, నా అనుచరులూ ఉన్నాం అని. అటకాయింపులూ, వెనుదిరగడాలూ అయ్యాక, ఆ సముద్ర తీరానికి వెళ్ళి, అక్కడ సావకాశంగా ఇసుకలో మీటింగు పెట్టుకున్నాం. ఆ సభలో, పోలీసువారు ఊరేగింపును ఆ ప్రకారం నడి రోడ్డుమీద నిలుపు చెయ్యడం అన్యాయమనీ, ఇంకోసా రెప్పుడయినా ఊరేగింపులను అటకాయించడం జరిగితే, పోలీసు కార్డన్ని కాదని ముందుకు నడుస్తాం అనీ నేను ప్రకటించాను. మాలో ఒక వెయ్యిమందికి పైగా అరెస్టుకు సిద్ధంగానే ఉన్నాం. అటువంటి అరెస్టులే జరిగి ఉంటే- ఆ వచ్చినవారికి ఎంతో కనువిప్పయ్యేది. కాని అలా జరగడానికి వీలులేని పరిస్థితి అయింది.

## పూర్తి హర్తాలు

ఏమయితేనేం, కమిషన్‌వారు పట్నంలో మొదటిసారిగా అడుగు పెట్టిననాడు జరిగిన బహిష్కరణ జయప్రదంగా జరిగిందని ఒప్పుకోక తప్పదు. పట్నంలో హర్తాలు సంపూర్ణంగానూ, సమగ్రంగానూ, బ్రహ్మాండంగానూ సాగింది. కమిషన్‌వారు ఎక్కడకి వెళ్ళినా నల్ల జెండాలే ఎదురయ్యాయి. ఒక్కొక్కచోట అమిత ఉత్సాహం గల యువకులు నల్ల జెండాలను నడుస్తూన్న సర్ జాన్ సైమన్‌గారి కారులోకే విసిరి వేశారు.

సైమన్ కమిషన్ మదరాసుకు రావాలై ఉంది. ఫలానా రోజుకు వారు వస్తున్నారు అని తేదీ కూడా నిర్ణయం అయింది. సెంట్రల్ అసెంబ్లీలో బడ్జెట్ సెషన్స్ నడుస్తోంది. అప్పట్లో నేనూ, శ్రీనివాసయ్యంగారూ కూడా అసెంబ్లీ పనిలోనే నిమగ్నులమై ఉన్నాం. ఎప్పుడయితే తారీఖు నిశ్చయమై, ప్రకటింపబడిందో ఆ తక్షణం మోతీలాల్ నెహ్రూగారి ఆధిపత్యాన అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు ఢిల్లీలో

కలుసుకుని, సైమన్ కమిషన్‌వారు మద్రాసు చేరే రోజున పూర్తి హర్తాలు జరపాలని నిశ్చయించారు.

తర్వాత మద్రాసు ప్రభుత్వంవారు (సియార్. పి. సి.) 144 సెక్షన్ కింద మీటింగులూ, ఊరేగింపులూ మొదలైన ఏ విధమయిన కార్యక్రమాలలోనూ కాంగ్రెసువారు పాల్గొన రాదంటూ ఆంక్ష విధించారు. ఈ వార్త తెలిసిన వెంటనే తిరిగి కాంగ్రెసు పెద్దలు కలుసుకొని శ్రీనివాసయ్యంగారూ, నేనూ సకాలంలో మదరాసు చేరుకుని, 144 సెక్షన్ ధిక్కరించి, 'బాయ్‌కాట్' విజయవంతంగా సాగించాలని తీర్మానించారు.

## అయ్యంగారి వెనుకంజ

నేను, మదరాసు వెళ్ళడానికి అవసరమైన సన్నాహాలన్నీ చేసుకుని, శ్రీనివాసయ్యంగారితో కలిసి బయలు దేరడానికి సిద్ధమయాను. శ్రీనివాసయ్యంగారూ, నేనూ అనుదినమూ కలుసుకుంటూనే ఉన్నాం. ఉభయులమూ కలిసి వెళ్దామని అనుదినమూ అనుకుంటూనే ఉన్నాం. కాని, ఆఖరు క్షణం వరకూ, ఆయన, తాను రావడం లేదనీ, తన భార్య అనుదినమూ పట్నం రావద్దనీ, బాయ్‌కాట్ సందర్భంగా అక్కడ చాలా ఉద్రిక్త పరిస్థితులు ఏర్పడుతున్నాయనీ టెలిగ్రాములు ఇస్తున్నదనీ, నాతో చెప్పలేదు. ఆ రోజున మేము ఉభయులమూ కలిసి బయల్దేరవలసిందే. టెలిగ్రాముల కారణంగా తాను రావడం లేదని ఆయన అనడంచేత, ఆ సంగతి మోతీలాల్‌గారితో చెప్పి, నేను ఒంటరిగానే బయల్దేరాను.

## అపూర్వ తీర్మానం

నేను కలకత్తా చేరేసరికి, కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంవారు, తిరిగి అర్జంటుగా కలుసుకుని, చెన్నపట్నంలో చేద్దామనుకున్న హర్తాలు, వగైరా జరుపకూడదని తీర్మానించారు. అఖిల భారత కాంగ్రెసు కమిటీ కార్యనిర్వాహకవర్గంవారు చేసిన అపూర్వ తీర్మానం అది. మదరాసు కాంగ్రెస్ ఆదేశానుసారంగా హర్తాలు జరిపించడానికి నేను సగం

దూరం వెళ్ళాక, హర్తాలు జరుపవద్దని ఆ కార్యనిర్వాహకవర్గం వారే, తాము చేసిన మొదటి తీర్మానానికి భిన్నంగా, ఇంకో తీర్మానం చేశారంటే- అది కాంగ్రెసు చరిత్రలోనే అపూర్వం. శ్రీనివాసయ్యంగారూ కార్యనిర్వాహకవర్గ సభ్యులే!

కార్యనిర్వాహకవర్గం తాము ప్యాసుచేసిన తీర్మానాన్ని తిరగ తోడవలసిన అగత్యం ఏమీ కనబడదు. అందులోనూ నేను ఢిల్లీ వదలిన 24 గంటలలో ఇంత మార్పా? దీనినిబట్టి కార్యనిర్వాహకవర్గం ఎంతటి బలహీనుల చేతులలో పడిపోయిందో తెలుస్తూనే ఉంది.

## నా నిర్ణయం

నేను వెనక్కి ఢిల్లీ వెళ్ళాలో, మొదట్లో నిశ్చయించుకున్న ప్రకారం ముందుకు వెళ్ళి పట్నమే చేరాలో నిర్ణయించుకోలేని పరిస్థితిలో పడిపోయాను. చివరికి వెనక్కి తిరిగి ఢిల్లీ వెళ్ళడం తలవంపుగా భావించి, ముందుకు చెన్నపట్నం వెళ్ళడానికే నిశ్చయించుకున్నాను. హర్తాలు ఆపుజేయబడడంతో ప్రభుత్వం వారి ఆంక్షకూడా రద్దయినట్లే గదా! అయినా పరిస్థితి ఎలా ఉందో చూద్దాం. అని నా ప్రయాణం ముందుకే సాగించాను.

నిజానికి, ఎటువంటి ఉద్రిక్త పరిస్థితులలో నయినా, వెనుకంజ వెయ్యడమన్నది ఈ జన్మలోనే లేదు మనకి! చాలా లోతుగానూ, దీర్ఘంగానూ ఆలోచించాను. దారి పొడుగునా ఆలోచిస్తూనే ఉన్నాను. కార్యనిర్వాహకవర్గంవారి ద్వితీయ తీర్మానం చాలా పొరపాటుగా చెయ్యబడిందనీ, అటువంటి తీర్మానం న్యాయసమ్మతమైంది కాదనీ, అందువల్ల కార్యనిర్వాహకవర్గంవారి ప్రథమ తీర్మానం ప్రకారం హర్తాలు జరపడమే న్యాయమనీ నిశ్చయించి, మద్రాసు పౌరులకు హర్తాలు జరుపవలసిందిగా ఆదేశిస్తూ సందేశం ఇచ్చాను.*

---

* మదరాసులో 144 వ సెక్షన్ ఉల్లంఘించరాదని ఆంధ్ర, తమిళ కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గాల సంయుక్త సమావేశం నిర్ణయించిన సంగతి కీ. శే. వావిళ్ల వేంకటేశ్వరులుగారి "ప్రకాశము పంతులుగారి జీవితము" (పే. 98, 99)లో వివరించబడింది.

అసలు కాంగ్రెస్ మహాసభ సైమన్ కమిషన్ రాకను బహిష్కరించవలసిందనీ, దేశవ్యాప్తంగా అన్ని రాష్ట్రాలవారూ వారి రాక విషయమై హర్తాలు మొదలైనవి చేయవలసిందనీ, ఆజ్ఞాపించి ఉండగా, కార్యనిర్వాహకవర్గంవారు కాంగ్రెస్ ఆదేశానికే విరుద్ధంగా సైమన్ కమిషన్ రాకను బహిష్కరించవద్దని అనడం చాలా విచిత్రమైన విషయమనీ, ఈ విషయంలో కార్యనిర్వాహకవర్గంవారు కేవలం పొరపాటే చేశారనీ, అందువల్ల కాంగ్రెస్ ఆదేశమే ముఖ్యమూ, అనుసరణీయమూ గనుక ఆ ఆదేశానుసారం హర్తాలు జరుపవలసిందనీ మద్రాసు పౌరులకు విన్నవిస్తూ నేను ఒక ప్రకటన జారీ చేశాను.*

## మదరాసు పౌరుల పొంగు

నా విన్నపాన్ని మన్నించిన మద్రాసు పౌరులు బ్రహ్మాండమయిన హర్తాలు జరిపారు. అది ఎంతో విజయవంతంగా జరిగింది. పూర్తి విజయాన్నే సాధించింది. ఇంత ఘనంగా, భారతదేశం మొత్తం మీద, మరే రాష్ట్రంలోనూ హర్తాలు జరుగలేదు. అన్ని కులాలకూ, మతాలకూ చెందిన మద్రాసు పౌరులందరూ తమ తమ వ్యాపారాలను పూర్తిగా బందుజేసి, సముద్రం కెరటాలలాగ, కెరటంమీద కెరటంలా, భూమి ఈనిన విధంగా, చెన్నపట్నపు పురవీథుల్లోకి వచ్చేశారు. సుమారు పదిమైళ్ళ పొడుగూ, పదిమైళ్ళ వెడల్పూ గల పట్నం వీథులన్నీ జనప్రవాహంతోనూ, కోలాహలంతోనూ నిండిపోయాయి. చెన్నపట్టణానికి దూరతీరాలు వ్యాపించిన పట్నం అని పేరు.

ఆ నాడు చెన్నపట్నంలో చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్ కె కె.

---

* ప్రకాశంగారు కాంగ్రెసు కార్యనిర్వాహకుల పునర్నిర్ణయం నిరసించి, ప్రకటన జారీచేశారు గాని, వారి తీర్మానాన్ని ఉల్లంఘించలేదని, మొదటిసారి కమిషన్ వారు మదరాసు వచ్చినప్పుడు ఒక లాఠీఛార్జీ కూడా జరగలేదనీ డా॥ జి. రుద్రయ్యచౌదరి తమ "ప్రకాశం: ఎ పొలిటికల్ స్టడీ" అన్న పుస్తకం (పే. 56-ఫుట్ నోట్ 21)లో వ్రాశారు.

పండాలే గారని ఒక బారిస్టరు. ఆయన స్మాల్ కాజ్ కోర్టు జడ్జిగా నియామకం గాకపూర్వం, ఆ వెనుకటి రోజులలో, నా వద్ద జూనియర్‌గా పని చేశాడు. నేను వద్దని ఎన్ని విధాల చెప్పినా పండాలేగారు ప్రభుత్వం ఉద్యోగాన్ని స్వీకరించారు. మొదట్లో నెలకు వెయ్యిరూపాయల జీతం మీద స్మాల్ కాజ్ కోర్టు జడ్జిగా ఆయన ప్రభుత్వపు కొలువులో ప్రవేశించారు. ఆయన మంచి తెలివితేటలు గలిగి, బారిస్టరుగా బాగా రాణిస్తూన్న వ్యక్తే. కాలేజీ చదువులు మంచి ధీమాగానే పూర్తిచేశాడు. అయితేనేం, ఎందుచేతనో అడ్వకేట్‌గా రాణించనేమోననే భయం పట్టుకుని, ఆయన ప్రభుత్వ ఉద్యోగాలపై మోజు పడ్డాడు. ఆయన స్మాల్ కాజ్ కోర్టు చీఫ్ జడ్జీ అయిఉంటే, అది ఆయన శారీరక మానసిక ప్రవృత్తులకు అనుగుణంగా ఉండేది. కాని ఆయన చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్ మాత్రమే. చెన్నపట్నంలాంటి మహానగరాలకు చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్ అంటే సామాన్యంకాదు. అవసరం అయితే, ఎటువంటి ఉద్రిక్త పరిస్థితులలో నయినా, శాంతంగా మంచి చెడ్డలు గ్రహిస్తూ, ప్రశాంత వదనంతో గుంపులను కంట్రోలు చెయ్యగలగాలి. పౌర రక్షణ, శాంతి భద్రతల రక్షణ సరిగా నిర్వహింప గలగాలి. ఎంతో నిదానం మీదగాని కాల్పులకు అనుజ్ఞ ఇవ్వకూడదు. కూర్చుని కేసులు విచారించి తీర్పులు వ్రాయడానికైతే పండాలే దిట్టమయినవాడే.

## పోలీసు కాల్పులు

శాంతి భద్రతలు కాపాడడంకోసం పోలీసు బందోబస్తూ, మిలిటరీ సహకారపు ఏర్పాట్లు చాలా ముమ్మరంగా జరిగాయి. సుమారు 11 గంటల వేళ, హర్తాలు పరిస్థితి ఎలా ఉంది, ప్రజల సహకారం ఎలా ఉంది అనే విషయాలు స్వయంగా పరిశీలిద్దాం అనే ఉద్దేశంతో నేను నా కారులో బయల్దేరాను. నేను బీచికి వెళ్ళేసరికి సెనేట్ హౌస్ వద్ద ఉంచబడిన పోలీసువారు దారిని అడ్డగించారు. అప్పుడు వెనక్కి తిరిగి, మౌంట్‌రోడ్డు దారిని వెడదామని తలిస్తే, ఆ రస్తాకూడా మూసేశారు. నేను అప్పుడు ఎగ్మూరు మీదుగా కలప అడితీలవరకూ వెళ్ళి

అక్కడనుంచి జార్జిటౌనుకు వెడదామని తలచాను. నేను ఫ్లవర్‌బజారు వీధికి వచ్చేసరికి, నా కారు ఆపుజేశారు. అక్కడ కారు వదలి కాలినడకన హైకోర్టువైపు బయల్దేరాను.

హైకోర్టు దగ్గర యేవో కొన్ని గడబిడలు జరుగుతున్నాయని విన్నాను. ఈ రస్తాలన్నీ యిల్లా మూసివేయడానికి కారణం, చేరుతూన్న గుంపులలోని కొందరు దుండగీండ్లు బ్రాడ్వేలో కొన్ని దుకాణాల కిటికీ అద్దాలు పగలగొట్టడం. హైకోర్టు ఆవరణలో ఉన్న ఒక సొలిసిటరుగారి కారుకు నిప్పటించడంతో పరిస్థితులు కాస్త విషమించాయి. చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్ పండాలేగారు అక్కడకు వచ్చి, ఆయనకున్న శక్తినంతా కూడదీసుకుని, శాంతిని నెలకొల్పడానికి ప్రయత్నించాడు. నేను నడచి వెడుతూంటే యీ సంగతులన్నీ నాకు వివరించబడ్డాయి. కేవలం పోలీసు రిపోర్టు ఆధారంగా ఆ యా ప్రదేశాలను చూడకుండానే కాల్పులు జరగడానికి అనుమతులు ఇవ్వబడడమూ, మంచి చెడుగులు విచారించకుండా కాల్పులు జరపడమూ కూడా జరిగింది.

ఈ గడబిడలు జరిగిన కొన్ని గంటల తర్వాత, బ్రాడ్వేలోనూ, హైకోర్టు ఎదుట ఎస్ప్లనేడులోనూ గుంపులు గుంపులుగా జనం వెడుతూంటే, ఆ చివర- మిల్లరు విగ్రహం దరిదాపులలో, కాల్పులు జరపడానికి చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్ ఆర్డరు జారీ చేశాడు. ఆయన కూడా తనంతట తానుగా గాక, ఒక యూరోపియన్ హైకోర్టు జడ్జిగారి సలహా ననుసరించి కాల్పులకు అనుజ్ఞ యిచ్చాడు. ఆయన ఆ కాంపౌండ్ చివరకు వచ్చి గుంపులను చెదరగొట్టే నిమిత్తం కాల్పులు సాగించవలసినదని పండాలేగారికి సలహా యిచ్చాడట! అదృష్టవశాత్తూ అక్కడికక్కడే ఎవ్వరూ మరణించలేదు.

## గుండెకు బారుచేసిన తుపాకి

పారీస్ కార్నర్ దగ్గిర మాత్రం రోడ్డుకు మధ్యగా ఒక స్థూలకాయుడు చచ్చిపడిపోయాడు. అప్పుడు గుంపులన్నీ చెదిరిపోయాయి. ఆ కూడలి దగ్గిరి బీచికి వెళ్లే రస్తా, కష్టమ్ హౌసుకు వెళ్ళేదారీ, ఆర్మీనియన్ వీధినుంచి హైకోర్టుకు వెళ్ళేదారి- అన్నీ పోలీస్ కార్డన్‌తో

బందయిపోయాయి. నేను ఒక కార్డన్ దగ్గరకు వెళ్ళి, అక్కడ ఉన్న సిపాయిని ఆ చనిపోయిన వ్యక్తిని చూడడానికి దారి యివ్వవలసిందని కోరాను. దారి ఇవ్వడానికి వీలులే దన్నాడు.

ఒక సిపాయి నా గుండెకు బారుచేసి తుపాకి పట్టుకున్నాడు. నాకు దారి ఇవ్వవలసిందని వానిని నేను కోరాను. "మీరు బలవంతంగా వెళ్ళదలిస్తే మేము కాల్చవలసి వస్తుం"దన్నాడు వాడు. నా ప్రక్కన గుంపులో ఉన్న ఒక మహమ్మదీయ యువకుడు, "ధైర్యం ఉంటే కాల్చు, మేమంతా సిద్ధంగానే ఉన్నాం! ఆయన ఎవరో నీకు తెలియ దల్లే ఉంది" అని అరిచాడు.

కొద్ది క్షణాల తర్వాత వాడు తప్పుకుని దారి ఇస్తూ, దయ యుంచి ఏ గడబిడా చెయ్యవద్దని గుంపును కోరవలసిందని ప్రాధేయ పడ్డాడు. నేను వచ్చేవరకూ శాంతంగా ఉండవలసిందని గుంపును కోరి ముందుకు సాగి, గుండుదెబ్బలతో పడిఉన్న ఆ మృతదేహాన్ని చూసి, ఆ రోడ్డుకి ఎదుటి రోడ్డున, హైకోర్టులో వెనుకభాగాన ఉన్న ఒక భవనంలో ఆసీనుడయి ఉన్న చీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేట్‌ను చూడ గోరాను.

## లారీఛార్జీ

ఆ రోజంతా * పట్నం అట్టుడికిపోయి ఉద్రిక్త పరిస్థితిలోనే ఉంది. సైమన్ కమిషన్ వారికి ఎదుర్కోలు కేవలం నల్లజెండాలతోనే

* ఈ పోలీసు కాల్పులు, ఇతర సంఘటనలు జరిగింది 1928 ఫిబ్రవరి 3 వ తేదీనని కీ. శే. పట్టాభిగారి "కాంగ్రెసు చరిత్ర" (పే. 466)ను బట్టి, డా॥ జి. ఆర్. చౌదరి "ప్రకాశం: ఎ పొలిటికల్ స్టడీ" (పే. 56–ఫుట్‌నోట్ 21) అన్న గ్రంథంవల్ల తెలుస్తోంది. ఆనాడే సైమన్ కమిషన్ బొంబాయి రేవులో దిగింది— యావద్భారతంలోను హర్తాల్ జరిగింది. ఆనాడు మదరాసు సంఘటనలలో మరి యిద్దరు మరణించారని కాంగ్రెసు చరిత్రకారుల కథనం. కమిషన్‌వారు మొదటిసారి మదరాసు వచ్చింది ఫిబ్రవరి

ఆగలేదు. నినాదాలతోటీ, కాల్పులతోటీ, ఒక చావుతోటీ జరిగిందన్న మాట! నడుస్తూన్న గుంపులమీద అనవసరంగా లాఠీఛార్జీలు అవీ జరిపి, గుంపులను ఉద్రిక్త పరిచారని విన్నాను.

జనం మాత్రం పూర్తి హర్తాలు జరిపి, శాంతి భద్రతలు బాగా పాటించారని ఒప్పుగోక తప్పదు. హర్తాలు నడచిన తీరూ, ప్రజలు చూపించిన సహనం, వారు శాంతి భద్రతలు కాపాడిన విధం, అన్నీ కూడా కాంగ్రెసులోనూ, కాంగ్రెసుయొక్క అహింసా తత్వంలోనూ ప్రజలు ఎంత విశ్వాసంతో వ్యవహరిస్తున్నారో, కాంగ్రెసు ఆదేశాలు ఎంత బాగా ప్రజలలో నాటుకునిపోయాయో బాగా విశదం చేశాయి.

1927 డిసెంబరులో మదరాసు కాంగ్రెసే, సైమన్ బాయ్‌కాట్ ప్రతిపాదనని ఆమోదించింది. ఆ మదరాసులోనే, మాకు అవసరం లేదు మొర్రో అంటూన్న ఆ సైమన్ కమిషన్ కారణంగా, ఆస్తి నష్టం, ప్రాణ నష్టం కూడా సంభవించాయి. ఎప్పుడయితే కాంగ్రెస్ బహిష్కరణ తీర్మానాన్ని ప్యాసు చేసిందో, ఆ తీర్మానం సక్రమంగా అమలు జరిగిందీ-లేందీ చూడవలసిన పూచీ కాంగ్రెసు నాయకుల మీద ఉంది.

## మోతీలాల్ సవరణ

సెంట్రల్ అసెంబ్లీలో 1928 ఫిబ్రవరి 16 వ తేదీని లాలా లజపతిరాయ్‌గారు సైమన్ కమిషన్ని పూర్తిగా బహిష్కరించవలసిందంటూ కేంద్ర శాసన సభలో ఒక తీర్మానాన్ని ప్రతిపాదించాడు. మోతీలాల్‌నెహ్రూగారు దాని కోసవరణ ప్రతిపాదించారు. సైమన్

---

ఆఖరి వారంలో. మార్చి 31 వ తేదీని తిరిగి బొంబాయిరేవు విడిచారు. మళ్ళీ 1929లో ఇదే రోజులలో ఇండియాకు వచ్చారు. ఏప్రిల్ 14 నాటికి వారి విచారణ ముగిసింది. మదరాసులో హర్తాలు జరిగింది మూడుసార్లని తెలియవస్తూంది: కమిషన్ ఇండియాలో దిగిననాడు, మదరాసుకు వచ్చిన రెండు దఫాలు.

కమిషన్‌ని రాయల్ కమిషన్‌వారు ఏర్పాటు చేయలేదనీ, అలా భావించ బడుతున్న ఆ ఇండియన్ కమిటీని రాజుగారే ఏర్పాటు చేశారనీ, ఆ సవరణ తీర్మానంలో చెప్పబడింది.

రాయల్ కమిషన్ వారి ప్రకటన రాజుగారు చేసినట్లే నన్న భాష్యం నిజంగా ఏ యిరువురి వ్యక్తుల మధ్యనయినా వివాదం వచ్చిన సందర్భంలో బాగా వర్తిస్తుంది గాని, రాయల్ కమిషన్ వారి పదాలకు అటువంటి భాష్యం చెప్పడం అంటే, ఈపట్టున సెక్రటరీ ఆఫ్ స్టేట్ పలికిన పలుకులకు భాష్యం చెప్పినట్లే.

మోతీలాల్ నెహ్రూగారికి రాయల్ కమిషన్ అన్నది రాజుగారు స్వయంగా ఎన్నుకున్నది కాదనీ, రాజుగారి స్థానే మాట్లాడే సెక్రటరీ ఆఫ్ స్టేట్ దానిని రాజుగారి తరఫున నియమించాడనీ, రాజుగారు ఇప్పట్టున రాజ్యతంత్ర ప్రధానమయిన ఒక 'రాజు' కాని, నిజంగా రాజు కాదనీ బాగా తెలుసు. కాని ఇది ఒక రాజనీతికీ, రాజ్యతంత్రానికీ సంబంధించిన 'లా' పాయింటుగా తోచడాన్ని, ఆ సవరణ ఆయన ప్రతిపాదించారు.

అసెంబ్లీలో కొంత తర్జన భర్జన జరిగాక ఓటుకు పెట్టగా, మోతీలాల్‌గారి సవరణ ప్రతిపాదనే 68 ఓట్లు అనుకూలంగా, 62 ఓట్లు ప్రతికూలంగా నెగ్గింది. తాను తీసుకువచ్చిన ఈ సవరణ తీర్మానంతో అసలు లజపతి రాయ్‌గారి ప్రతిపాదన వెనక్కి నెట్టబడుతోందన్న సంగతి మోతీలాల్ గారికి స్ఫురించలేదు.

### అసలుకు మోసం

ఆ ప్రకారం కాంగ్రెసువారు, తమ వేలితో తమ కన్నే పొడుచు కున్నట్లు, తమ్ముతామే దగా చేసుకున్నట్లయింది. సెక్రటరీ ఆఫ్ స్టేట్‌చే నామినేట్ చేయబడిన ఇండియన్ లెజస్లేచర్‌కి సంబంధించిన ఇండియన్ మెంబర్లు, వైస్రాయ్‌తో సలహా సంప్రతింపులతోనే నియమింపబడ్డా, వైస్రాయ్‌చే నియమింపబడ లేదన్నట్లు, అంటే "తిట్టుకాదురా కూసు కొడుకా" అన్నట్లు అయి, అసలుకు మోసం చేసుకున్నా రన్నమాట!

బాయ్‌కాట్ తీర్మానానికి ప్రతిపాదించబడిన ఈ సవరణ తీర్మానం నెగ్గడంతో, కాంగ్రెసువారు, తమ పార్టీకి బలాన్ని చేకూర్చుకో లేదు సరికదా, వారి స్థాయిని మాత్రం కించపరచుకున్నట్లయింది.

ఈ పరిస్థితులు ఇల్లా ఉండగా, లాయలిస్టులు మాత్రం సైమన్ కమిషన్ విషయంలో ఆ కమిషన్‌తో ఎంత మాత్రమూ సహకరింప జాలం అనే ఒక్క ముక్కతో ఎక్కువ శక్తిసామర్థ్యాలు ప్రకటించారు.

సెంట్రల్ అసెంబ్లీలో లీడరూ, సభ్యులూ కలిసి, సెక్రటరీ ఆఫ్ స్టేట్‌నీ, వైస్రాయ్‌నీ కలుసుకొని, ఇండియన్ కమిటీని నామినేట్ చేయించమని కోరుతూ ఉంటే, మద్రాసు శాసన సభ్యులుగాని, ఇతర రాష్ట్ర శాసన సభ్యులుగాని మరో రకంగా ఎల్లా వ్యవహరింప గలుగుతారు? మెంబర్లు ఎప్పుడూ నాయకుణ్ణి అనుసరించాలి. నాయకుణ్ణి వ్యతిరేకింప దలచిననాడు, మెజారిటీ ఉండక, చెరువులో చేపలలాగ బయటపడిపోతారు.

ఆ ప్రకారంగా అవలంబించ దలచిన పద్ధతిని నిర్ధారణచేసికోలేని స్థితిలో ఉన్న ఆ కాంగ్రెసు పార్టీ అనబడే స్వరాజ్యపార్టీవారు (పేరు మార్చుకున్నారుగా!), బలాన్ని చేకూర్చుకుని పుంజుకోవడానికి కావల సింది పాలో, నీళ్ళో కూడా తేల్చుకోలేని పరిస్థితిలో పడిపోవడంచేత, బ్రిటిషువారు- వీరు ఎన్నికలలో బలం చేకూర్చుకోవడానికి కాంగ్రె సయ్యారుగాని, వీరి కందరికీ హృదయాంతరాళాలలో తమపట్ల పూర్తి విశ్వాసమే ఉన్నదనీ, ఈ నాటకం అంతా బేరాలు ఆడే విధానంలోని భాగమేననీ, ఇస్తామన్న వాటి కంటె మరికొన్ని సదుపాయాలకోసం పీకులాట తప్ప మరేమీ కాదనీ తలచడానికి కారణం అయింది.

స్వరాజ్యపార్టీ పుట్టింది లగాయితూ, 1923 నుంచి అయిదు సంవత్సరాల కాలంలోనూ వ్యవహరించిన తీరునుబట్టి, సెక్రటరీ ఆఫ్ స్టేట్ గౌరవాన్ని ఎంత మాత్రం పొందలేకపోయారు. కాగా ఆయన మరింత బిర్రబిగియడమే జరిగింది. "మే మేది స్తే దానినే తీసికోవాలిగాని, ఏమి టిదంతా? ఈ అట్టహాసం అంతా ఏమిటి?" అనే స్థితికి ఆయన వెళ్ళి పోయాడన్నమాట!

తత్తరపాట్లూ, గాబరాలూ

ఉభయత్రా తత్తరపాట్లూ, గాబరాలూ, అల్లకల్లోల పరిస్థితే సంభవించింది ఈ కమిషన్ నియామకంవల్ల. దానిని ఏర్పరచిన బ్రిటిషు వారు ఇండియా పరిస్థితి, కాంగ్రెసు నాయకుల స్థితిగతులూ గ్రహించ కుండా ఎల్లా తొందర తొందరగా వ్యవహరించారో, అదే విధంగా కాంగ్రెసు నాయకులూ చిందర వందర పరిస్థితిలోనే ఉన్నారు. కాంగ్రెసు బహిరంగ సమావేశాలలో ప్రజల తరపునా, అఖిల పక్ష రాజకీయ పక్షాల తరపునా 1928 ఫిబ్రవరి - మార్చి రోజులలో రూపొందించిన కోరికను చెల్లించవలసిందిగా గట్టిగా అడగ గల శక్తి, ధైర్యమూ కాంగ్రెసు వారికి లేకపోయింది. ఎక్కడకు వెళ్ళినా ఆ సైమన్ కమిషన్ వారికి చుక్క ఎదురవుతూ వచ్చిన ఆ రోజులలో, కాంగ్రెసువారికి ఆ విషయమై ఆసక్తి లోపించింది.

అఖిల పక్ష నాయకుల కోరిక, నిజానికి, అతి ముఖ్యమయిందీ, వాంఛింప తగ్గదీని. అన్ని విధాలా పూర్తిగా పూచీ వహించగల ప్రభుత్వాన్నే (Full responsible government) భారతదేశంలో వెంటనే స్థాపించి తీరాలని ఏకగ్రీవంగానూ, స్పష్టంగానూ, ఆ అఖిల పక్ష రాజకీయ సభవారు (All parties' Conference) కోరిన కోర్కెకంటే, మిన్న అయింది ఇంకొకటి ఉండబోదు కదా! 1927 డిసెంబరులో కాంగ్రెసువారు ఆమోదించిన స్వాతంత్ర్య తీర్మానానికీ, 1928 ఫిబ్రవరి - మార్చి రోజులలో ఈ అఖిల పక్ష నాయకులు కోరిన కోరికకీ భేదం లేదనే అనాలి.

1928 లో అర్ధ సంవత్సరంపాటు మాకు ఉత్తర హిందూస్థానంలోనే గడిచి పోయింది. ఆల్‌పార్టీ కాన్ఫరెన్సులూ, అఖిల భారత కాంగ్రెసు కమిటీవారి మీటింగులూ అన్నీ ఒక దాని తర్వాత ఒకటిగా ఆ ఉత్తర హిందూస్థానంలో జరుగుతూనే ఉన్నాయి. ఈ అఖిల పక్ష సభవారే 1928 ఫిబ్రవరి - మార్చి మాసాలలో 25 సార్లు కలుసుకున్నట్లు రికార్డుంది.

అందులో డా॥ అన్సారీ అధ్యక్షతను నడచిన ఒక మీటిం గులో, ఒక క్రమమయిన, యుక్తి యుక్తమయిన రాజ్యాంగ పథ కాన్ని (Constitutional scheme) తయారు చెయ్యడానికి "నెహ్రూ కమిటీ" అన్న పేరుతో ఒక ఉప సంఘాన్ని ఏర్పరచడం జరి గింది. ఈ నెహ్రూ కమిటీవారు తమ నివేదిక జూన్ 1928 నాటికి తయారుచేసి సమర్పించాలని నిర్ణయించారు. ఈ లోపుగా సైమన్ కమిషన్‌వారు రావడమూ, పర్యటించడమూ, తిరిగి వెళ్ళడమూ, తిరిగీ 1929 లో వస్తామని చెప్పడమూ జరిగాయి. నెహ్రూ కమిటీవారి రిపోర్టు ఏమయిందీ మున్ముందు చెపుతాను.

## ఇండియన్ కమిటీ

1927 నాటి ఇతర విషయాలను గురించి చెప్పేలోపల, సైమన్ కమిషన్‌ని గురించి విశదీకరించడం న్యాయం.

మోతీలాల్‌నెహ్రూగారి సవరణతో వెనక్కి నెట్టబడిన లాలా లజపతిరాయ్‌గారి 'బహిష్కరణ' తీర్మానము, కాంగ్రెసుపార్టీ నాయ కుడు రాయల్ కమిషన్ ఏర్పాట్లలో తికమకలున్నాయంటూ చేసిన నిర్వ చనమూ మొత్తానికి నేల విడచి సాముయిన కారణంగా, వైస్రాయ్, తాను ఎన్నుకోమంటే కాంగ్రెసు పార్టీవారు ఎన్నుకోలేదని నెపంవేస్తూ, తన చెప్పు చేతలలో ఉండే నలుగురు అసెంబ్లీ మెంబర్లను ఎంచి, వారికి ఇంకో ముగ్గుర్ని జతగూర్చి, భారతీయ సహకార సంఘం (Indian Committee of Assessors) అంటూ ఏర్పరచి, ఆ సంఘం రాయల్ కమిషన్‌తో సహకరిస్తుందన్నాడు.

## వైస్రాయ్ సవాలు

బొంబాయిలో కమిషన్‌వారు అడుగుపెట్టే లోపల ఎల్లాగయినా వారికి సహకారం సంపాదించి తీరాలని వైస్రాయ్ చాలా తాపత్రయ పడ్డారు. ఫిబ్రవరి 2 వ తేదీని, అంటే తెల్లవారితే కమిషన్‌వారు కాలు పెడతారనగా, తాను ఎన్ని విధాల ప్రయత్నించినా సహకారం రాని కారణంగా, సహకారం ఉన్నా లేకపోయినా కమిషన్‌వారు తమ

పనిని తాము చేసుకుపోతారనీ, దేశంయొక్కా, దేశీయులయొక్కా సహకారంతోగాని, సహాయ నిరాకరణంతోగాని, వారికెట్టి సంబంధమూ ఉండబోదని తెలియజేశాడు. అంటే- మీ ఇష్టం వచ్చినట్లుగా మీరు వ్యవహరించండోయి, మా పని మాత్రం మానకుండా మేము చేసుకుపోతాం అనే సవాల్ని విసిరాడన్నమాట!

వైస్రాయ్ చేసిన ఈ సవాలు కాంగ్రెసు నాయకుల వెన్నుమీద చరచి, ముందడుగు వెయ్యండోయి అనే హెచ్చరికగా పనిచేసి, సర్వత్రా బ్రహ్మాండమయిన విజయాన్ని సాధించిన ఆ బహిష్కరణ ఉద్యమానికి దోహదం చేసింది. మార్చి ఆఖరువరకూ దేశంలో పర్యటించిన ఆ సైమన్ కమిషన్‌వారు, మార్చి మాసం పూర్తిగా వెళ్ళకుండానే, బొంబాయిలో ఓడ యెక్కారు.

1929 లో, సుమారు అదే రోజులలో, ఆ కమిషన్‌వారు తిరిగి వచ్చినప్పుడు, గత సంవత్సరంలో లాగే, ఎక్కడకు వెళ్ళినా వారికి చుక్కెదురయింది. ఆ నల్ల జెండాలే ఎదురయ్యాయి.

కాని, లోగడ చెప్పాను చూడండి - ప్రతి దేశంలోనూ ఎల్లప్పుడూ కొందరు విభీషణాయిలు ఉంటారని! అట్టి వారినే, ఆ 'లాయలిస్టు'లనబడే ఆ విభీషణాయిలనే కొంతమందిని కలుసుకుని, 1929 ఏప్రిల్ 14 నాటికి తమ విచారణ ముగింపు జేసుకున్నారు. ఏదయితేనేం, విరమించనున్న కన్సర్వేటివ్ ప్రభుత్వంవారు విరమించే లోపలనే, వారు కోరుకున్న ప్రకారమే, సైమను కమిషన్‌వారు తమ రిపోర్టు తయారు చేసి సమర్పించ గలిగారన్నమాట!

## కృతకృత్యులైన కన్సర్వేటివ్‌లు

కన్సర్వేటివ్‌లు అనుకున్నట్టుగానే, ఎన్నికలలో వారు వోడిపోవడమూ, లేబరు పార్టీవారు రాజరికాన్ని చేపట్టడమూ జరిగింది. చేయబడిన సూచనలూ, ఇవ్వబడిన సలహాలూ ఎంత అసభ్యంగా, అవకతవకగా ఉన్నా, అవి భారతదేశంలోని కేంద్ర, రాష్ట్రీయ దృక్పథాలతోనే చేయబడ్డవన్న కారణంగా, అధికారంలోకి వచ్చిన లేబర్‌పార్టీవారికి

ప్రతిబంధకాలై, వారి కాళ్ళూ చేతులూ అనుకోని విధంగా బిగించేశాయి. భారతదేశ విషయంలో వారు ఏమీ చేయలేని స్థితిలోనికి వచ్చారన్న మాట! ఎలాగో ఒకలాగ లేబర్‌పార్టీవారు భారతదేశానికి ఏదయినా సహాయం చేసిపోతారేమోననే దుగ్ధతోనే కదా, కన్సర్వేటివ్‌లు ప్రజాభిప్రాయానికి భిన్నంగా, ప్రజలు కనబరచిన నిరసన లన్నింటినీ సహించి తంటాలుపడింది!

భారత నాయకత్వం బహునాయకత్వమూ, బాల నాయకత్వము అయి పప్పులో కాలువేసింది. వచ్చేవారు లేబర్‌పార్టీ వారయినా, లిబరల్ పార్టీవారయినా, కన్సర్వేటివ్‌లే అయినా, ఇచ్చేవారు మాత్రం ఇంగ్లీషు వారేననీ; ఇండియాకు సంబంధించినంతవరకూ, ఏ పార్టీ వారయినా చూపించేది తొంటిచెయ్యేననీ; ఇంగ్లీషువారెప్పుడూ, తమ ప్రత్యర్థి బలా బలాల విలువలు విలియా వేసుకుని, వాడు బలవంతుడయితేనే తప్ప కాళ్ళబేరానికి రారనీ, పాపం, భారత నాయకులు గ్రహించలేదు. భారతీయ నాయకు లరచిన ఆ అరపులలోని బీదతనాన్నీ, అర్భకత్వాన్నీ, అది కావా లిదికావా లనే యాచక మనస్తత్వాన్నీ ఆంగ్లేయు లెప్పుడూ మన్నించి గౌరవించలేదు. భారతీయ మనస్తత్వం ఆంగ్లేయులకు బాగా అర్థమయిన కారణంగానే, చాకచక్యంగా వాయిదాలమీద వాయిదాలు వేసుకుంటూ దాటుకు రాగలిగారు.

## గాంధీజీ నమ్మినబంట్ల వరస

భారతీయులందరూ, గాంధీగారియందు సంపూర్ణ విశ్వాసం గల వారై, ఆయన తెలిసిగాని తెలియకగాని పొరపాటునగాని గ్రహపాటున గాని, మరో ఉద్దేశంతోగాని యీ దేశానికి ఏ విధమయిన చెడుగూ ఎప్పుడూ చేయలేదని, ఆనాడేగాదు- ఈ నాడూకూడా నిస్సంకోచంగా నమ్ముతారు. గాంధీగారు, ఎప్పుడయినా ఏదయినా పొరపాటు చేసి ఉంటే, తాను చేసిన పొరపాటును గ్రహించిన తక్షణం, బహిరంగం గానూ, నిస్సంకోచంగానూ ఒప్పుకుని, ప్రజాభిప్రాయమే తన అభిప్రాయంగా మార్చుకుని, దేశక్షేమాన్నే సర్వత్రా కాంక్షించిన మహా

త్మడు. కాని నిజానికి ఆయనకి ఎప్పుడయినా చిక్కులు వస్తే అవి తానే స్వయంకృతాపరాధంగా ఎంచుకున్న ఆ పెద్ద నాయకుల ద్వారానే వచ్చేవి. చిత్తరంజన్‌దాస్, మోతీలాల్ నెహ్రూ, మహమ్మదాలీ, షౌకతాలీలాంటి అగ్రనాయకులయిన నమ్మినబంట్లే ఆయన్ని చికాకుల్లో ముంచారు.

ఆయనకున్న బలం ఆయన సరిగా వినియోగించుకోలేక పోయారు. భారతదేశంలో ఉన్న కోటానుకోట్లజనం, స్వాతంత్ర్యం కోసం తహతహలాడుతూ, ఆయన అడుగుజాడల్లో నడుస్తూ, ఆయన సూచించిన అహింసాతత్వాన్ని జీర్ణించుకుని, ఎటువంటి త్యాగాలకయినా సిద్ధంగా ఉండగా, ఆయనమాత్రం తన అనుంగు అనుచరులని, తాను నమ్మినవారిని అంటిపెట్టుకుని ఉన్నాడు. వారిలో కేంద్రంవారూ, రాష్ట్రాలవారూ ఉన్నారు. దురదృష్టవశాత్తూ వారిలో చాలామంది గాంధీగారిలోనూ ఆయన కార్యక్రమాలలోనూ, తుదకు ఆయన విధానంలోనూ కూడా విశ్వాసం లేనివారే అయ్యారు.

అటువంటి వారిని నమ్మి, వారిపై ఆధారపడడమే ఆయన చేసిన పెద్ద తప్పిదం అనవలసివస్తుంది. పాపం, వారివల్లనే కదా ఆయన ఇక్కట్ల పాలయింది? తన మనుష్యులని తాను నమ్మిన పదిహేను మందిలో పదిమంది మంచి క్లిష్టపరిస్థితులలో, ఆయన విధానాలన్నింటికీ మూలకందమూ, ముఖ్యాతిముఖ్యమూ అయిన అహింసావిధానం విషయంలోనే, ఆయన్ని జారవిడచి ద్రోహం చేశారు. ఈ విషయం ప్రత్యేకంగా పూర్తి వివరాలతో, "శ్రీ గాంధీగారి నాయకత్వమూ, జాతీయోద్యమమూ-ఇటీవల జరిగిన సంఘటనలూ" అన్న శీర్షిక క్రింద ఆ కథంతా సావకాశంగా ఏకరువు పెడతా.

## విశ్వనాథంగారి ప్రతిపాదన

కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనుకూడా సహకార నిరాకరణే ప్రాతిపదికగా ఎన్నికయిన కాంగ్రెసువారు స్వరాజ్యపార్టీ సభ్యులుగా చెలామణీ అవుతూ, దరిమిలా కాంగ్రెసును కోరి, కాంగ్రెసు అనుమ

తితో, కాంగ్రెసు నామాన్నే స్వీకరించి కౌన్సిల్‌లో కాంగ్రెసు పార్టీగా ఏర్పడిన పెద్దలు, వాదనలో దిట్టలనీ, నేర్పరులయిన ప్రజాప్రతినిధులనీ, పై దేశాలలోని శాసన సభ్యులతో తులతూగగలవారనీ ఎంత పేరు సంపాదించినా, ఏ సహకార నిరాకరణ సూత్రాన్ని మనస్సులో ఉంచుకుని వ్యవహరిస్తామని హామీఇస్తూ శాసన సభా ప్రవేశం చేశారో- ఆ సూత్రాన్నే క్రమేపీ జారవిడుస్తూ వస్తున్నారా అనే అనుమానానికి గురయ్యారు.

అందువల్లనే అఖిల భారత కాంగ్రెసు సంఘ సభ్యుడయిన తెన్నేటి విశ్వనాథంగారు కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగులో శాసన సభాసభ్యుడయిన ఏ కాంగ్రెసువాదీ ప్రభుత్వం వారు సూచించే ఏ హోదానీ చేపట్టరాదనీ, ఈ ద్వంద్వ ప్రభుత్వంలో మంత్రిపదవి లభించినా తిరస్కరించాలనీ ఒక తీర్మానాన్ని ప్రతిపాదించవలసి వచ్చింది. ఈ ప్రతిపాదనతో నాయకులు ఇరకాటంలో పడ్డారు. అందుచేత విశ్వనాథంగారి ప్రతిపాదనను కాంగ్రెసు అధ్యక్షులవారే స్వయంగా వాయిదా వేయవలసిన పరిస్థితి ఏర్పడింది.

కాని అప్పటికే కాంగ్రెస్ ప్రారంభ దినం దగ్గిరయింది. శ్రీనివాసయ్యంగారు అప్పుడు కాంగ్రెసు అధ్యక్షుడు. దాస్, నెహ్రూగారలు స్వరాజ్యపార్టీని ఏర్పరచిన దరిమిలానే ఆయన కాంగ్రెసులో చేరాడు.

కాంగ్రెసువారు తా మవలంబించిన కౌన్సిల్ ప్రోగ్రాం ఎప్పుడయినా వదిలేస్తారనిగాని, నేరుగా సహకారనిరాకరణం, శాసనధిక్కారం లాంటివి చేపట్టి ప్రత్యక్ష చర్యకు దిగుతారనిగాని ఆయన ఎప్పుడూ ఊహించలేదు.

శాంతియుతంగా శాసన సభా కార్యక్రమం నడపడమే ఆయన వాంఛితార్థం. ఆయన ఒక సమగ్రమయిన పదకాన్ని వేసి, తద్వారా కౌన్సిల్లో ఐకమత్యం నెలకొల్పి తంటాలుపడదాం అని ఎంతో శ్రమ పడ్డాడు. తానే కాంగ్రెసు అధ్యక్షుడున్నూ, తానే ఆ పదకపు నాయకుడూ అవడాన్ని తన పదకం చులాగ్గా అంగీకరించబడుతుందని తలచాడు. ఆ పదకం అఖిల భారత కాంగ్రెసు కమిటీవారు ఒప్పుకున్నారు. కాని

అప్పటికే ఆయన తలప్రాణం తోకకి వచ్చినంత పనయింది. ముందు కార్యక్రమం నడపగల ఓపిక ఆయనలో సన్నగిల్లింది. అందులో విశ్వనాథంగారి ప్రతిపాదన కొరకరాని కొయ్యే. అప్రతుత కలిగించేదే. పైగా తాను కాంగ్రెసు అధ్యక్షుడుగా ఉండగానే, స్వరాజ్యపార్టీని శంకించే పరిస్థితి!

# 2

# మదరాసు కాంగ్రెస్ - స్వాతంత్ర్య తీర్మానం

గౌహతి కాంగ్రెస్ (1926) అధ్యక్షుడుగా శ్రీనివాసయ్యంగారు మరుసటి సంవత్సరపు కాంగ్రెస్‌ను మదరాసుకు ఆహ్వానించడమూ, ఆ ఆహ్వానాన్ని మన్నించి 1927లో డా॥ అన్సారీ అధ్యక్షతను చెన్నపట్నంలో కాంగ్రెస్‌ను జరపడమూ సంభవించింది. ఆ మదరాసు కాంగ్రెసువారు రెండు ముఖ్యమయిన తీర్మానాలని ప్యాసు చేశారు: మొదటిది స్వాతంత్ర్యానికి సంబంధించింది; రెండవది సైమన్ కమిషన్‌ను బహిష్కరింప వలసింది అన్నది

## హజరత్ మొహానీ అభిలాష

దేశానికి స్వాతంత్ర్యం అనే అభిప్రాయం 1921 లో అహమ్మదాబాదు కాంగ్రెస్‌లో ఆవిర్భవించింది. అదే రోజులలో అహమ్మదాబాదులో జరిగిన ముస్లిమ్ కాన్ఫరెన్స్ అధ్యక్షుడయిన హజరత్ మొహానీ (Hazrath Mohani) దేశస్వాతంత్ర్యం పట్ల తాను సుముఖుడనేనని వ్యక్తపరిచాడు. స్వభావసిద్ధంగా మహాత్మాగాంధీ, తాను స్వయంగా ప్రత్యక్ష చర్యలకు సిద్ధమయ్యే పరిస్థితి ఉత్పన్నమయ్యేదాకా, మితవాదిగానే ఉండాలని కోరుకునే బాపతు వారు. అందుచేత హజరత్ మొహానీ, స్వాతంత్ర్య ప్రస్తావన వచ్చినప్పుడు, తాను స్వాతంత్ర్యాన్నే కాంక్షిస్తున్నానని చెప్పేసరికి, ఆ కబురు విని గాంధీగారు విస్తుపోయారు.

తాను శాసనధిక్కారం ప్రవేశపెట్టేలోపల,నిర్మాణం కార్యక్రమ

బాగా అమలు జరగాలనీ, ప్రజలు కాంగ్రెసు పక్షాన నిలవడానికి కావలసిన ప్రబోధం చేసి, వారికి అవసరమైన విజ్ఞానాన్ని కలుగజేయాలనీ, గాంధీగారు వాంఛించేవారు. దేశం రాజకీయంగా ఇంకా మొదటిమెట్టుమీదనే ఉన్న ఆ రోజులలో, మొహానీ తాను దేశ స్వాతంత్ర్యాన్ని కాంక్షిస్తున్నానని చెప్పడం, గాంధీగారిలాంటి వారికైనా విస్మయ కారణం గదా!

ఆ పరిస్థితులలో, తాను హజరత్ మొహానీ అభిలాషతో ఏకీభవించి తానూ స్వాతంత్ర్యం కావాలనే వాడనే అని అనకపోతే ఏవయినా విపరీత పరిణామా లుత్పన్న మవవచ్చునని తలచి, హజరత్ మొహానీకి ఆయన ఒక హెచ్చరిక మాత్రం చేశాడు. "లోతుపాతులు గ్రహించి మరీ స్వాతంత్ర్యం అన్నమాట ఉచ్చరించు."

అహమ్మదాబాదు కాంగ్రెస్ జరిగిన కొద్దిరోజులలోనే హజరత్ మొహానీని నిర్బంధించడమూ, ఆయనపై మోపబడిన కేసు విచారణ అయి, ఆయనకు రెండు సంవత్సరాలు కారాగార శిక్ష విధించడమూ జరిగింది.

## 'స్వరాజ్య' పదం వెనక చరిత్ర

స్వాతంత్ర్యం ప్రతి భారతీయునికీ జన్మ హక్కు. న్యాయతః ఈ స్వాతంత్ర్య వాంఛ కాంగ్రెసుతోపాటే 1885 లో ఉత్పన్నమై, కాంగ్రెసు ఆశయమై నిర్విరామకృషికి ఆలవాలమై యుండవలసిందే, కాని, మితవాదుల చేతులలో కాంగ్రెసు ఉన్నంతకాలమూ వారికి స్వతంత్రాన్ని గురించి తలపెట్టడానికి తావే లేకపోయింది. 'స్వరాజ్యం' అన్న ముక్కే వారికి చుక్కెదురుగా కనబడేది. లోకమాన్య బాల గంగాధర తిలక్ మొట్టమొదటిసారిగా "స్వరాజ్యం నా జన్మహక్కు" అన్న నివాదాన్ని ఉచ్చరించినప్పుడు, ఆ మితవాదులకా ముక్కలు శరీరంలో వణుకు పుట్టించాయి.

'స్వరాజ్యం' అన్న పదం ఉపయోగించిన కారణంగా తిలక్ మహాశయుడు చిక్కులలో పడే పరిస్థితి ఉత్పన్నమయినప్పుడు,

దాదాభాయి నౌరోజీగారు 1906 లో కాంగ్రెస్ అధ్యక్షుడుగా లండన్ నుంచి భారతదేశానికి వచ్చి 'స్వరాజ్య' అన్న పదాన్ని విపులీకరించి, 'స్వరాజ్' అనగా పూర్తి స్వాతంత్ర్యమనీ, ఆ రోజులలో ఎన్నో దేశాల వారు బ్రిటిషువారికి బద్ధులయి అనుభవిస్తూన్న స్వాతంత్ర్యంలాంటిదనీ నిర్వచనం ఇవ్వవలసివచ్చింది.

అధమం అప్పటినుంచీ అయినా ఆ మితవాదులు ఏటేటా ఆ 'స్వరాజ్యాన్ని' వాంఛిస్తూ ఉండి ఉండవలసింది. అల్లా 1917 వరకూ జరిగి ఉంటే ఎంతో బాగుండేది. 1917 లోనే కాంగ్రెసు మితవాదుల చేతులలోంచి మారి, కొద్దికాలం తిలక్ మహాశయుని అడుగుజాడలలో నడుస్తూ, గాంధీగారి కైవసం అయింది.

మితవాదులా 'స్వరాజ్యాన్ని' కోరలేకపోయారు. 'స్వరాజ్య' అన్న పదానికి వెనుక ఇంత చరిత్ర ఉన్నా, హజరత్ మొహానీ 'స్వరాజ్య' అన్న పదం వాడి ఉంటే,ఆ కోర్కెలో తప్పేమీ లేదని గాంధీజీ గుర్తించి ఉండవలసింది. కాని వెనువెంటనే జరిగిన హజరత్ మొహానీ నిర్బంధమూ, కేసూ, విచారణా గమనించిన నాకూ, ఇతర మిత్రులకూ కూడా గాంధీగారు అన్న 'లోతుపాతులు గ్రహించి మరీ స్వాతంత్ర్యాన్ని గురించి మాట్లాడు' అన్న హెచ్చరికలోని 'లోతుపాతు' అన్న పదాన్నే అడ్డం పెట్టుకుని హజరత్ మొహానీ పైన ప్రభుత్వంవారు విరుచుకు పడ్డారా అనిపించింది. అదే "స్వాతంత్ర్యం" అన్న ఆశయానికి ప్రాతిపదికా, జన్మ కారణమూ అయింది.

## సాంబమూర్తి ఉబలాటం

తర్వాతి పరిస్థితులుకూడా గమనిద్దాం. లోగడ కొంత కాలంగా మద్రాసు శాసన సభ స్పీకర్‌గా పనిచేసిన బులుసు సాంబమూర్తిగారు, కలగబోయే పరిణామాలను విలియా వేసుకోకుండా, "స్వాతంత్ర్యం" కోసం ప్రాకులాడ నారంభించాడు. సాంబమూర్తిగారూ, నేనూ ముప్ఫయి యేండ్లకుపైగా కలిసి పనిచేస్తూ ఉన్నవారమే. ఆరంభ దినాలలో లాయర్లంగా పనిచేశాం. తర్వాత ఇరువురమూకూడా ప్రాక్టీసు

విరమించుకుని, స్వాతంత్ర్య సమరంలోకి కలిసేదూకి పనిచేస్తున్నాం. 1921 లో జరిగిన ఆ మొట్టమొదటి గోదావరి జిల్లా రాజకీయ సభా కార్యక్రమాలు నా అధ్యక్షతనే జరిగాయి. అప్పుడు నేనే సాంబమూర్తి గారి 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని ఎదుర్కొన్నాను. అప్పట్లో గాంధీగారికి లాగే కావలసిన తయారీలేందే 'స్వాతంత్ర్యం' అన్న పదం వాడితే ప్రభుత్వంవారి చేతులలో ఎటువంటి ఫలితాలకు లోనుగావలసివస్తుందో అన్న భయం నన్నూ ఆవరించే ఉందన్నమాట!

స్వరాజ్య సమరంలో సాంబమూర్తిగారి పాత్రను గురించి ఇదివరకే చెప్పి ఉన్నాను.

## జవహర్‌లాల్ చొరవ

చెన్నపట్నం కాంగ్రెసులో, అప్పుడే జినీవా నుంచి వచ్చిన జవహర్‌లాల్ నెహ్రూగారి ముఖతః ప్రతిపాదించబడింది సాంబమూర్తి గారి 'స్వాతంత్ర్య' తీర్మానమే. మదరాసు కాంగ్రెస్ రోజులలోకూడా మహాత్మా గాంధీగారు 'స్వాతంత్ర్య' తీర్మానానికి ప్రతికూలురే. జవహర్‌లాల్‌గారు తీర్మానాన్ని ప్రతిపాదించే సమయంలో గాంధీగారు ఆ కాంగ్రెసు పెండాలు గేటు దాకావచ్చి, లోపల ఏం జరుగుతోందని అడిగి, జవహర్‌లాల్‌నెహ్రూ స్వాతంత్ర్య తీర్మానంపై మాట్లాడుతున్నారని విని, వెనక్కి తిరిగి వెళ్ళిపోతూ, 'ఏదో బడి పిల్లల బెడదలే' అన్నారు.

ఆ రోజులలో దేశంలోని స్వాతంత్ర్యవాదుల నందరినీ అరెస్టు చేసి, కేసులుపెట్టి జెయిళ్ళకు పంపిస్తారనే వదంతి బాగా నాటుకుపోయి ఉంది. తన్ను కాదని జవహర్‌లాల్ ఆ తీర్మానాన్ని ప్రతిపాదించాడనే అభిప్రాయం గాంధీగారికి కలిగి నట్లుంది. ఈ విషయంగా తన కుమారుడు జైలుకు వెళ్ళడము మోతీలాల్‌నెహ్రూగారి కెంత మాత్రం ఇష్టం లేదు. అసలు ఆయన స్వతంత్ర్యాన్ని వాంఛించే బాపతు కాదు. ఆఖరికి 'డొమినియన్ స్టేటస్' (అధినివేశ ప్రతిపత్తి) అన్న పదజాలంమీద

కూడా నిలబడే బాపతుకాదు. ఆయన ఎప్పుడూ రాజీ ప్రతిపాదనలకు సుముఖుడు.

ఎప్పుడూ కలహానికి కాలు దువ్వి, తిరుగుబాటును వాంఛించే బెంగాల్ రాష్ట్రం కూడా, ఆ 1925 లో చిత్తరంజన్‌దాస్‌గారి మరణం కారణంగా, వెనక్కి ఉంకింది. దాస్‌గారి మరణం ఒక పెద్ద కథ. దానిని గురించి ప్రత్యేకంగా చెపుతాను.బెంగాల్, అనేక కారణాలవల్ల, మదరాసు కాంగ్రెస్‌వారు 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని ప్యాసుచేసిన సమయంలో, ఒక రకమయిన నిరుత్సాహ స్థితిలో పడిపోయి ముందుకు రాలేక పోయింది.

బెంగాల్‌వారు 1928 కాంగ్రెస్‌ను కలకత్తాకు ఆహ్వానించారు. ఎల్లాగయినా కాంగ్రెసు అధ్యక్షునిగా పండిత మోతీలాల్ నెహ్రూగారినే ఎన్నుకుని, చెన్నపట్నంలో ఆయన కుమారునిచేతనే ప్రతిపాదించబడి ప్యాసయిన 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని బుట్ట దాఖలు చేయించాలని 'బెంగాల్' వాంఛించింది.

## కమిషన్ బహిష్కరణ తీర్మానం

సైమన్ కమిషన్ బహిష్కరణ తీర్మానాన్ని గురించి మళ్ళీ కాస్త చర్చిద్దాం. మొట్టమొదటి కాంగ్రెసు దినాలనుంచీ బ్రిటిష్‌వారు భారతీయులపట్ల ప్రదర్శిస్తూ ఉన్న వైఖరీ, అవలంబిస్తూ ఉన్న దగా పద్ధతీ, మోసకారి విధానమూ గమనించి గ్రహిస్తూన్న భారతీయులు ఆంగ్లేయ విధానాలతో విసుకుజెంది ఉన్నారు. నాయకులూ, దేశంలోని చిన్న పెద్దలూ- అందరికీ బ్రిటిష్ విధానంపట్ల విముఖతే కలిగింది. ఆ కారణంచేత బహిష్కరణ తీర్మానం విస్తారం తర్జన భర్జనలు అవసరం లేకుండానే అంగీకరించబడింది.

తీర్మానం ఆమోదించబడిన వెంటనే దేశవ్యాప్తంగా ఉన్న కాంగ్రెసు కమిటీలకీ, ప్రజానీకానికీ కూడా సైమన్ కమిషన్ బహిష్కరించవలసిందనీ, పూర్తిగా హర్తాలు చేయవలసిందనీ ఆదేశాలు ఇవ్వ

బడ్డాయి. కొంతమంది నాయకులకు శాసన ధిక్కారమూ, 'బాయ్‌కాట్' తీర్మానాదులలో అంతగా ఆసక్తి లేకపోయినా, ఇది కేవలం బహిష్కరణే గదా, ఇందులో శాసన ధిక్కారాది కార్యక్రమాలు ఏమీలేవు గనుక కమిషన్‌ని 'బాయ్‌కాట్' చేసి, హర్తాలు అమలు పరుద్దాం అని, తమలో తాము తర్జన భర్జనలు చేసుకుని, ఒక నిర్ణయానికి వచ్చారు.

దేశం ఈ తీర్మానాన్ని ఆసక్తితో అమలు పరచింది. కమిషన్ ఎక్కడకు వెళ్ళినా నల్ల జెండా లెదురయ్యాయి. అందువల్లనే ఈ బహిష్కరణ అంత ఘనంగా సాగింది. ఆ కాంగ్రెస్ అధ్యక్ష పదవి, శ్రీనివాసయ్యంగారి భుజస్కంధాల మీదనుంచి, ఆ 1927 డిసెంబరులో డా॥ అన్సారీగారి భుజాలమీదికి వాలి ఊరుకుంది.

## సక్లత్‌వాలాకి విందు

బ్రిటిష్ పార్లమెంట్‌లో భారతీయ సభ్యుడుగా ఉంటూ ఉన్న సక్లత్‌వాలా 1927 లో హిందూ దేశానికి వచ్చాడు. ఆయన కేంద్ర శాసన సభా కార్యక్రమాన్ని వీక్షించి, ఆ శాసన సభా సభ్యులలో ముఖ్యులు అనుకున్నవారందరితోనూ, దేశంలో ఉన్న రాజకీయ పరిస్థితిని గురించి తర్కవితర్కాలు చేశాడు.

ఆయన చాలా ఉత్సాహవంతుడూ, మంచి తెలివయినవాడూను. కాని తన దేశభవిష్యత్తు ఏమిగానున్నదో అనే వ్యాకులంతో చాలా మనఃక్లేశంలో ఉన్నాడు.

ఆయన రాకను పురస్కరించుకుని కేంద్ర శాసన సభలోని కాంగ్రెసు మెంబర్లంతా కలసి ఆయన గౌరవార్థం ఒక పెద్ద ప్రాతఃకాల విందును ఏర్పరచారు. నాతో ఆయన సంప్రతించిన సందర్భంలో దేశం యావత్తూ ఒక్క త్రాటిమీద, ఒక్కమాట మీద ఉండి, సంఘీభావంతో వ్యవహరించా లన్నారు. తాను జన సమూహంతో కలిసిమెలిసి ఏ విధమయిన కార్యక్రమమూ ఎప్పుడూ జరుపలేక పోయానని వాపోయాడు. ఇదంతా 1927 మార్చిలో కేంద్ర శాసన సభలో జరిగిన విషయం.

3

## విఠల్‌భాయ్ పటేల్ విజ్ఞత

కేంద్ర శాసన సభలో ఉన్న కాంగ్రెసు సభ్యులందరమూ కలిసి, మాకు సంబంధించినంతవరకూ ఒక కార్యనిర్వాహక సంఘాన్ని పండిత మోతీలాల్ నెహ్రూగారి అధ్యక్షతను ఏర్పరచుకున్నాము. క్రొత్తగా ఎన్నికయిన కేంద్ర శాసన సభ్యులుగా మా జీవితం 1927 లో ప్రారంభం అయింది.

నిజానికి మా పార్టీ మంచి పకడ్‌బందీగానే ఏర్పడింది. మంచి క్రమశిక్షణ కలదే. కాని పెద్దలలో కొద్దిగా మనస్పర్థలుండేవి. మోతీలాల్ నెహ్రూగారికీ, శ్రీనివాసయ్యంగారికీ ఒక పక్కా, నెహ్రూగారికీ లాలా లజపతిరాయ్‌గారికీ ఇంకొక పక్కా కొ స్త స్పర్థలుండేవి. ఈ స్పర్థలకు రాజకీయకారణాలే ఉండేవి.

### డిన్నర్ పార్టీలు - రంగయ్యార్ సవాలు

కాని కేవలం వ్యక్తిగతమయిన స్పర్థ నెహ్రూగారికీ, సి. ఎస్. రంగయ్యారుగారికీ మధ్య ఉండేది. వీరిద్దరూ ఒకప్పుడు మంచి స్నేహితులుగానే ఉండేవారు. అప్పట్లో రంగయ్యారు నాభా మహారాజు కార్యదర్శిగానూ, హితుడుగానూ ఉండేవాడు. గవర్నమెంట్ వారినుంచి తన రాజ్యాన్ని రాబట్టుకోడానికి మహారాజు నెహ్రూగారిని న్యాయవాదిగా పెట్టుకున్నాడు. ఈ కేసు వ్యక్తిగతంగా తేబడిన బాపతే. ఈ సందర్భంలో నాన్పుడు, అభిప్రాయభేదాలూ ఉండేవి. అల్లా వారిరువురి మధ్యా ఏర్పడిన స్పర్థ శాసన సభలోకీ, రాజకీయాలలోకీ ప్రవేశించింది.

ఒకప్పుడు మేము, మా కార్యనిర్వాహక వర్గంలో - వైస్రాయ్‌తోను, ఇతర ప్రభుత్వ ఉద్యోగులతోను సంబంధించిన సాంఘిక కార్యక్రమాలలో పాల్గొనకూడదు, వాటిని పూర్తిగా బహిష్కరించాలని నిర్ణయించుకున్నాం. మోతీలాల్ నెహ్రూగారికి మాత్రం, మొదటి నుంచీ అలవాటయిన కారణంగా, అటువంటి డిన్నర్లకీ, పార్టీలకూ వెళ్ళకుండా ఉండడమంటే అదోలా ఉండేది. వెళ్ళాలనే కోరికే పీకుతూండేదన్నమాట!

నేను గ్రామాంతరంలో ఉన్న సందర్భాలలో ఒకసారి ఆ బహిష్కరణ తీర్మానం రద్దవడమూ, వెళ్ళదలచినవారు పార్టీలకు వెళ్ళవచ్చును అన్న తీర్మానం ఆమోదించబడ్డమూ జరిగింది. తర్వాత ఆ ప్రశ్న తిరిగీ చర్చనీయాంశం అయింది. ఆ విషయాన్ని తర్కించడంలో, పార్టీ లీడరుగా ఆయన ఒక్కరికీ ఆయా పార్టీలకు వెళ్ళడానికి అనుమతి ఇస్తే సరిపోతుందన్నాను. వెంటనే సి. ఎస్. రంగయ్యరు— "నిన్నే ఎందుకు వెళ్ళనివ్వాలి ఆ పార్టీలకు? నాకంటే నీవు ఎక్కువగా త్రాగగలవా?" అని సవాలు చేశాడు.

రంగయ్యరుగారి మాట తీరూ, వారి హాస్యం, అంత అపహాస్యంగానూ, మోటుగానూ ఉండేది. మోతీలాల్ గారయినా తిప్పికొట్టాలంటే గట్టిదెబ్బే కొట్టగలరు. ఇతరులమీద తాను విసిరే విసుర్లలాంటివి తన మీదనే కేంద్రీకరించబడినప్పుడు, వాటికి నవ్వుతూ ఆనందంగా తట్టుకోనూ గలడు. అదీ ఆయన తత్వం.

## చరిత్ర సృష్టించిన చతురుడు

మా మిత్రుడు విఠల్‌భాయ్ పటేల్ శాసన సభాధ్యక్షుడుగా ఉండేవాడు. ఆయన మాంచి నేర్పరి. ప్రపంచకంలో ఏ దేశపు పార్లమెంటరీ స్పీకర్‌గానయినా ఆయన బాగా రాణించగలడు. అటువంటివ్యక్తి కేంద్ర శాసన సభలో, అప్పటికి అమలులోనున్న ఆచార ప్రకారం, జీతంగాని, పూచీగాని ఎంతమాత్రమూ లేని ఒక అపహాస్యపు, అవకతవక పార్లమెంట్‌కు నిష్కపటమయిన నాయకుడుగా ఉండవలసి వచ్చింది. కాని ఆయన నేర్పుతో నిర్జీవమయిన ఆ పార్లమెంట్‌కు జీవంపోసి, పూచీ అన్నదిలేని సందర్భాలలోకూడా దానికి ఎంతో ప్రాముఖ్యం ఉన్నట్లు కల్పనజేసి, అందరికీ ఉత్తేజాన్ని కలిగించేవాడు. ఈ సందర్భంలో ఆ మేధావిని గురించి కాస్త విపులీకరించకుండా ఉండలేకపోతున్నాను.

అసెంబ్లీ అధ్యక్షుడుగా విఠల్‌భాయ్‌గారు సభ్యుల ప్రవర్తనాదుల విషయంలో చాలా నిక్కచ్చిగానూ, స్వతంత్రంగానూ వ్యవహరిస్తూ, ఆ జీవంలేని కేంద్ర సభలో చిన్న చరిత్రనే సృష్టించగలిగాడు. దేశ

దేశాల ఆనవాయితీలను పాటిస్తూ, ప్రెసిడెంట్‌గా తనకున్న హక్కులను సవ్యంగా చెలాయిస్తూ, చాకచక్యంగా వ్యవహరిస్తూ, వైస్రాయ్‌గారూ, కౌన్సిల్‌వారూ జారీచేసిన ఆర్డర్లనుకూడా అవసరమయితే ధిక్కరించి సభా గౌరవాన్ని కాపాడేవాడు.

శాసన సభలో పోలీసుగార్డ్ ప్రవేశించకుండా అటకాయించిన ధీరుడాయన. దేశంలో అమలులో ఉన్న రాజకీయసూత్రాల ప్రకారం అధ్యక్షుడికి ఎట్టి హక్కులూ ఉన్నట్లులేదు. ఒక నిష్పూచీ ప్రభుత్వమూ, ఏ పూచీలేని సభ్యులూ కలసి వారికి తోచిన విధంగా అధ్యక్షుని ఆడించ గల స్థితిలో ఉన్నారన్నమాట! జెయిలులో ఉండగానే అసెంబ్లీకి ఎన్నికయిన ఎస్. ఎన్. మిత్రాగారికి శాసన సభా కార్యక్రమాల్లో పాల్గొనేటందుకు సౌకర్యాలు కలిగించాలని కోరినప్పుడు, సర్ అలెగ్జాండర్ మడ్డిమన్ పార్లమెంట్ నాయకుడుగా ఉంటూ, సభ్యుల హక్కులపై నడిచిన తీవ్రమయిన వాగ్వివాదంలో కల్పించుకుని, సభవారికిగాని సభ్యులకుగాని ఎట్టి హక్కులూ లేవన్నాడు. విఠల్‌భాయ్ పటేల్‌గాక మరొకరెవరయినా అయితే, పోలీసువారు కౌన్సిల్‌లోకి రాకుండా అరికట్టగలిగి ఉండేవాడుకాడు. ఆ ప్రశ్నపైన ఆయన ఒక నూతన పద్ధతికి దారి చూపాడు.

## ప్రెసిడెంట్ కార్యాలయ వివాదం

తర్వాత, లెజిస్లేటివ్ డిపార్ట్‌మెంట్‌నుంచి తన ఆఫీసును ప్రత్యేకించి వేరుగా ఉంచి తీరా లన్నాడు. అవి కలిసి ఉండడాన్ని కొన్ని చిక్కు లున్నా యనీ, వాటిని విడిగానే ఉంచాలనీ, ఆయన వాదించాడు. దర్మిలా సర్ బిరుదాంకితుడయిన లాంసెట్‌గ్రాహం అప్పట్లో లెజిస్లేటివ్ డిపార్టుమెంట్‌కు కార్యదర్శిగా ఉండేవారు (ఆయన సింధురాష్ట్రానికి గవర్నర్‌గా పనిచేసి పి:చను పుచ్చుకున్నారు). పబ్లిక్ ఇన్ఫర్మేషన్ డైరెక్టర్ హోదాతో అపరాధ పరిశోధక డిపార్టు మెంట్‌కు ముఖ్యుడుగా కోట్‌మాన్ వ్యవహరించేవాడు. కాగా ఆయన గవర్నమెంట్‌వారి చీఫ్ విప్‌కూడాను. ఓటింగుకాలంలో తన విధిని అతి జాగర్తగా నిర్వహిస్తూ, ప్రభుత్వ పక్షానికి కాన్వాస్ చేయడం

లోనూ, ఆ పోలింగు బూత్ గుమ్మంవద్ద నిలిచి గవర్నమెంట్‌కు అనుకూలు రయినవారికి లోపలికి దారిచూపడంలోనూ బహు సమర్థుడు.

విఠల్‌భాయ్ పటేల్, వ్యక్తిగతంగా తన స్వభావాన్నిబట్టి, తన హోదాను కాపాడుకుంటూ, తనకి ఉత్తమమని తోచిన రీతిగా న్యాయంగాను వ్యవహరిస్తూ, తన ఆఫీసుకు ప్రత్యేకస్థానం ఉండి తీరాలనీ, లెజిస్లేటివ్ డిపార్టుమెంట్‌కూ, తనకూ సంబంధం ఉండకూడదనీ కోరడం సబబే అయినా, ప్రభుత్వరంగంలో మాత్రం ఆ కోరిక బాగా అలజడిని కలుగజేసింది.

## హోం మెంబర్ క్షమాపణ

నిందాపూర్వకమయిన పోసుకోలు కబుర్లు లాబీ వర్గాలలోని అఫిషియల్ సభ్యులే ఆరంభించి, విఠల్‌భాయ్ పటేల్‌కు ఒక నిందను ఆపాదింపజేశారు. ఇల్లా చేసినందువల్ల తమ్ముతామే కించపరచుకుంటూ, సభ్యుల కోపతాపాలకు గురయారు. వారిమీద అవిశ్వాస తీర్మానం తీసుకురావడానికికూడా సావకాశం ఉందన్న సంగతి పాపం, వారు తలచలేదు.

అసెంబ్లీ అధ్యక్షుడంటే సభ్యుల హక్కులను, అధికారాలను రక్షించే దాత అన్నమాట. విఠల్‌భాయ్, కాంగ్రెసువారు- కాంగ్రెసేతరులు, వారు-వీరు అన్న విభేదంలేకుండా అన్ని వర్గాలవారికీ అవసరమైన రక్షణ ఎప్పుడూ ఇచ్చేవాడు. ప్రభుత్వంవారి ట్రెజరీబెంచెస్ వారికికూడా రక్షణ ఇచ్చేవా డాయన. కాంగ్రెసువారు అసెంబ్లీలో సుస్థిర స్థానం యేర్పాటు చేసుకున్నప్పటికీ, వారు ఎంతో ధీమాగానూ, యుక్తియుక్తంగానూ పోట్లు పొడుస్తూన్నా ట్రెజరీబెంచి సభ్యులకు మాత్రం గర్వమూ, అహంభావమూ తగ్గలేదు.

ఈ అప్రతిష్ఠ పరిస్థితికి మార్గాంతరం మాకు కనబడక, ఆ ప్రకారం అధ్యక్షుని కించపరుస్తూన్న వారివద్దనుంచి క్షమార్పణ పుచ్చుకుతీరాలనే భావం మాకు ఏర్పడి, మా అధ్యక్షుని గౌరవ మర్యాదలు కాపాడవలసిన అవసరం మాదే గనుక, ఆ పార్టీ లీడర్ని తగు చర్య తీసుకోవలసిందని కోరాం. ఈ సమాచారం విషమ

పరిస్థితులకు దారితియ్యకుండానే వైస్రాయ్‌గారికి జేరింది. వెంటనే ఆయన కలుగజేసుకుని, హోం మెంబర్ని జరిగిన పొరపాట్లను సరిదిద్దుకోవలసిందని బలవంతం చేశాడు. హోం మెంబరు వెంటనే తగు రీతిని అవసరమయిన పదజాలంతో క్షమార్పణ కోరడమూ, పార్లమెంట్ సభ్యులందరి తరఫున మోతీలాల్ నెహ్రూగారు ఆ క్షమార్పణను అంగీకరించడమూ జరిగింది. ఆ తర్వాత ఉద్రిక్తత తగ్గి, శాంతి నెలకొంది. అది మా అధ్యక్షునకు ఒక విజయమైంది. ఆ విధంగా పార్లమెంట్‌లో ఒక నూతన మర్యాద (Convention) ఏర్పడ్డం జరిగింది.

## పబ్లిక్ సేఫ్టీ బిల్లు

1928, 1929 సంవత్సల పారిపాలనా విధానంలో భయాందోళన లదే పైచెయ్యి అయింది. వైస్రాయ్‌గారు తమ పరిపాలనంతా ఆర్డినెన్సులమీదనే నడిపించారు.

సెప్టెంబరు 17న శాంఢ్‌హర్స్ట్ (Sandhurst) అనే ఒక పోలీసు ఆఫీసర్ని ఖూనీ జేశారు. దాన్తో ఆర్డినెన్సులూ, కుట్ర కేసులూ బనాయింపబడ్డాయి. పైగా పబ్లిక్‌సేఫ్టీ (ప్రజారక్షణ) బిల్లు అంటూ ఒకటి మన నెత్తిని రుద్దడానికి ప్రయత్నాలు జరిగాయి. అందుమీదట కుట్రకేసు ప్రాముఖ్యాన్ని వహించింది. ఈ ప్రజారక్షణ కంటూ ప్రవేశబెట్టబడిన బిల్లు, ఆ మీరట్ కుట్రకేసును తారుమారుచేసి, అధ్వాన్న పరిస్థితులలో పడుతుందేమో ననిపించింది.

పరిస్థితులను గమనించిన శాసన సభాధ్యక్షుడు విఠల్‌భాయ్, ఒక ప్రకటన చేశాడు. అందులో అతి జాగ్రతగా పరిశీలించిన అనంతరం తాను ఒక నిశ్చయానికి వచ్చాననీ, ఆ నిశ్చయం ప్రకారం అటు మీరట్ కుట్రకేసు నడుస్తూండగా ఇటు ఈ పబ్లిక్ సేఫ్టీ బిల్లు ప్రతిపాదించడం చాలా ఆక్షేపణీయం, అందువల్ల ప్రభుత్వంవారు ఈ రెంటిలో ఒక దానిని వదులుకోక తప్పదని సూచించబడింది.

ప్రభుత్వంవారు అదేం కుదర దన్నారు. దాన్తో 1928

ఏప్రియల్ 11 వ తేదీని అధ్యక్షుడు, తాను సూచించిన ఆ ప్రాథమిక సూత్రాలమీదే, ఆ బిల్లును త్రోసివేశాడు. అప్పుడు వైస్రాయ్‌గారు శాసన సభనీ, స్టేటు కౌన్సిల్నీ ఉమ్మడి సమావేశానికి పిలిచి, ఆ సమావేశంలో ఆ ప్రజారక్షణ బిల్లును ఆమోదింపజేశాడు. ప్రభుత్వంవారి నిరంకుశ పరిపాలనకీ, వైస్రాయ్‌గారి నికృష్టవిధానానికీ ఇంతకంటె ప్రబలమయిన నిదర్శనం ఇంకోటి కావాలా?

ప్రజాభిప్రాయాన్ని కాదని తమకు ఇష్టం వచ్చినట్లు నిరంకుశంగా ప్రవర్తించడానికే వైస్రాయ్‌గారు సర్టిఫికేషన్ పవర్ని తమ చేతిలో పెట్టుకుంట. అటువంటి బిల్లు విషయంలో జరిగే సర్టిఫికేషన్ తతంగాల్ని ఆపు చెయ్యడానికి శాసన సభవారికి అధికారం లేక పోయినా, ఉన్నత స్థాయిలో జరుగుతూన్న తర్కవితర్కాలు ప్రజా హృదయంలో ఉత్తేజాన్ని కలిగించడానికీ, ముఖ్యంగా అమాయికపు బాధితుల హృదయాలు తేలిక అవడానికి ఉపకరించేవి. సహకార నిరాకరణ ఉద్యమం, 1921 లోనే ప్రారంభించబడి, ప్రత్యక్ష చర్య, నిర్మాణ కార్యక్రమాలద్వారా, ప్రజాహృదయంలో నూతన ఉత్సాహాన్నీ, శక్తినీ, కలిగించ గలిగినా, 1923-29 సంవత్సరాలలోకూడా శాసన సభాసభ్యులకు ఇటువంటి అన్యాయ పరిస్థితులలో కాంగ్రెసువారితో కలిపి ఓటు చేయడానికి 'కలేజా' లోటుగానే ఉండేది.

## వైస్రాయికే మందలింపు

వైస్రాయిగారు శాసనసభా, రాజ్యసభా సభ్యులను ఉమ్మడిగా సమావేశపరచి, ఆ ఉమ్మడిసభలోని స్టేట్ కౌన్సిల్ సభ్యుల ధర్మమా అని వారి ఓట్లతో బయట బయటపడేవారు. అప్పుడుకూడా రాజ్యాంగపు కట్టుబాట్లకు లోబడి, ఉభయ సభల ఆమోదం పొందిన ఆ బిల్లుల్ని కూడా చట్టంగా ప్రకటించడానికి ఒక ఆర్డినెన్స్ కావలసి వచ్చేది.

ఇటువంటి పరిస్థితులలో లేని 'పూచీ'ని సృష్టించి, తాను సృష్టించిన ఆ 'పూచీ' ఆధారంగా, వైస్రాయినికూడా, "నీవు అనవసరంగా మా కార్యకలాపాలలో కలుగజేసుకుంటున్నా" వని మందలించగలశక్తి ఒక్క విఠల్‌భాయ్ పటేల్‌కే ఉంది. అట్టి ధీశాలి ఆయన.

ఉమ్మడి సభలో వైస్రాయ్‌గారి ఉపన్యాసానికి విఠల్‌భాయ్‌గారు ఆక్షేపణ తెలిపారు. వైస్రాయ్ లార్డ్ ఇర్విన్, ప్రెసిడెంట్‌గారి పేర ఉత్తరం వ్రాస్తూ, అందులో ప్రెసిడెంట్‌గారి నిర్ణయాన్ని ఖండించడం గాని, దానికి ఆయనపై దోషం ఆరోపించడంగాని తన ఉద్దేశం కాదని స్పష్టం చేశాడు.

ప్రెసిడెంట్‌మాత్రం, తాను రాజ్యాంగరీత్యా తనకున్న హక్కులను పురస్కరించుకునే ఆ నిర్ణయాన్ని తీసుకున్నానని తిరిగి చెప్పాడు. ఈ సందర్భంలో మనం గమనించవలసిన ముఖ్య విషయాన్ని ఒక్క ముక్కలో చెప్పాలంటే-ఇప్పటికి సుమారు ఇరవై సంవత్సరాలనుంచీ మనం పడుతూన్న తంటాలన్నీ వైస్రాయ్ చేతిలోంచి ఇటువంటి 'అధికారాన్ని' తప్పించాలనే.

## మూడు రోజుల ఉపన్యాసం

ఆయన స్పీకరు కాకపోయినా, బిల్లులమీద నడిచే తర్క వితర్కాలలో విఠల్‌భాయ్ పటేల్ అంతరాయాలు కలిగించేవాడు. ఆయన ఎంత కోపదారయినా, చికాకు తత్వం గలవాడయినా, మాటాడుతూన్న వారి నెవ్వర్నీ బలవంతంగా ఆపుజేసి కూర్చోబెట్టలేదు. పూచీ గల పార్లమెంటులో నయినా ప్రతి సభ్యుడికీ తనకి తోచినంతకాలం, స్పీకరునుంచి అంతరాయం లేకుండా, మాటలాడగల హక్కు ఉంది. ఇతర సందర్భాలలో క్రమశిక్షణ అమలుపరచి, అవతలి వ్యక్తి ఎవరయినదీ లెక్కచేయకుండా, తన పరిస్థితినిగూడా గమనించకుండా, అవసరమయిన చర్య తీసుకునేవాడు. ఇంత ఇదిగా ఉన్నా, ఆయనవల్ల జరిగిన పొరపాటు ఏదయినా ఉంటే దానిని సూచించిన తక్షణం సరిదిద్దుకునేవాడు.

ఒక రోజున ఒక బిల్లుమీద చర్చ జరుగుతూ ఉండగా, పి. ఎస్. రంగయ్యగారు, మధ్యలో లేచినిలబడి, ఉపన్యసించడం ఆరంభించాడు. రంగయ్యరు తన ఉపన్యాసాన్ని అనవసరంగా సాగదీస్తున్నట్లు కనబడడంచేత, విఠల్‌భాయ్‌గారు "మీ ఉపన్యాసం ఇంకా ఎంత సేపుంటుం"దని అడిగాడు. ఆ రంగయ్యరు తడుముకోకుండా "మూడు

రోజు?" లన్నాడు. దాన్తో సభలోని ప్రతివ్యక్తికీ ప్రాణంపోయినంత పనయింది.

నిజానికి, సరుకుండి, అంకెలతోటీ, రుజువులతోటీ నిరూపిస్తూ మాటలాడగల యే వ్యక్తి అయినా తన ఉపన్యాసానికి మూడు రోజులు కాదు-వారంరోజులు తీసుకున్నా బాధలేదు కాని, ఏసభ్యుడయినా, తనకు తోచినంతసేపు మాటలాడవచ్చును కాబట్టి, తన దగ్గిర సరుకున్నా లేకపోయినా, చెప్పిందే చర్విత చరణంగా చెపుతూన్నా, సందర్భాన్నీ ప్రస్తావన అంశాన్నీ తప్పించి మాట్లాడినా, అది అన్యాయమే కదా?

రంగయ్యరుకు మంచి వాగ్ధాటీ, భాషా పరిజ్ఞానమూ, వాదించ గల నేర్పూ ఉండడంచేత ఎవ్వరికీ కూడా, ఎవ్వరి కేమిటి- ప్రెసిడెంటుగారికికూడా, 'నీవు అనవసరపు ప్రస్తావన చేస్తున్నావు' అనడానికి సందు దొరకదన్నమాట! అందుచేత రంగయ్యరుకు కావలసినంత సావ కాశం యిచ్చాడు. ఆంగ్లో ఇండియన్ గ్రూప్ లీడరయిన సర్ డార్సీ లిండ్సే (Sir Darsy Lindsay) "ప్రెసిడెంటుగారు గమనించాలి! ఉపన్యాసం పరిధి దాటి దీర్ఘం, సుదీర్ఘం అయిపోతోంది" అని హెచ్చ రిక చేసినా, రంగయ్యరు ఉపన్యాసాన్ని సాగనిచ్చాడు.

రంగయ్యరు అన్నంతపనీ చేశాడు. తన ఉపన్యాసం వినడానికి మనుష్యులు ఉన్నా, లేకపోయినా, ధోరణిలో తబ్బిబ్బు లేకుండా, ఆ మూడు రోజులపాటూ ఆ ఉపన్యాసాన్ని సాగించా డా ధీశాలి.

మేము కేంద్ర శాసన సభా సభ్యులంగా జీవితాన్ని గడపిన ఆ మూడు సంవత్సరాలలోనూ, ఈ మూడు రోజుల ఉపన్యాసకాలం చాలా సరదాగానూ, ఉత్సాహంగానూ, మరపురానిదిగానూ తయారయింది. ఆ తర్వాత ఆంగ్లో ఇండియన్ గ్రూప్ నాయకుడు ఆ చర్చ సంబంధంగా మాటలాడుతూ, రంగయ్యరు గారు తన సుదీర్ఘ- కాదుకాదు-దీర్ఘ, అతి దీర్ఘ, మహాదీర్ఘ ఉపన్యాసంతో అనవసర కాలయాపన చేశాడని వాపో యాడు.

## మోతీలాల్‌గారి పరిహాసం

అప్పటివరకూ అంతా సవ్యంగానే నడిచింది. కాంగ్రెసుపార్టీ నాయకుడుగా, మోతీలాల్ నెహ్రూగారు సమాధానం ఇవ్వడానికి లేచే

సరికి మాత్రం అలజడి ఆరంభం అయింది. ఆయన లిండ్సే మాటలకి ప్రాధాన్యం ఇవ్వకుండా ఉండి ఉండవలసింది. ప్రెసిడెంటుగారే రంగయ్యరు ఉపన్యాసాన్ని అదుపులో పెట్టనప్పుడు, విండ్సేగారి మార్కులకు ప్రెసిడెంటుగారు అభ్యంతరం తెలపనప్పుడు తన ఉపన్యాసాన్ని తాను చెప్పదలచిన పాయింట్లు ఆధారంగా, కొనసాగించుకుపోయి ఉండవలసింది. ముఖ్యంగా తనకూ, రంగయ్యరుకూ మధ్య ఉన్న ఆజన్మ వైరాన్ని తలుచుకుని అయినా తన ధోరణి మార్చుకోవలసింది. కాని ఆయన రంగయ్యరులాంటి ప్రత్యర్థిని క్షమించి వదిలేరకం కాదుగా! తాను కాంగ్రెసుపార్టీ నాయకుడననీ, పార్టీ మెంబర్ల హక్కులను కాపాడవలసిన బాధ్యత తనమీద ఉన్నదనయినా గ్రహించకుండా, లిండ్సే రిమార్కులకు జవాబు చెప్పే అవకాశాన్ని పురస్కరించుకుని, రంగయ్యర్ని ఆ సభామధ్యంలో అపహాస్యం చేయడానికి పూనుకున్నాడు.

''అయ్యా, ఆంగ్లో ఇండియన్ పార్టీ నాయకు లయిన లిండ్సే గారు సి. ఎస్. రంగయ్యరుగారి దీర్ఘ ఉపన్యాసాన్ని గురించి ఫిర్యాదు చేశారు. నిజమే. అ యినా, అసలు రంగయ్యరుగారి ఉపన్యాసంలో 'సరుకు' యేమయినా ఉందా?'' అంటూ ఆరంభించిన ఆ ఉపన్యాసాన్ని విని, మా ప్రత్యర్థులయిన శాసన సభ్యు లంతా పకపకలతోటీ, ఇకిలింతలతోటీ బాగా ఆనందించారు. తనకి జూనియర్ అయిన ఒక వ్యక్తిని పార్టీనాయకుడి హోదాలో ప్రత్యర్థులనుంచి కాపాడడం పోయి, పార్టీలీడర్‌గారే అదోలా మాటలాడితే అవతలి వారికి లోకువ కాదూ?

## నా అభ్యంతర తీర్మానం

వెంటనే నేను మా పార్టీ సెక్రటరీ అయిన రంగస్వామయ్యంగారికి ఒక చీటీ పంపించాను. ఆయన లీడర్‌గారి పక్కనే కూర్చున్నాడు. ఆ చీటిలో లీడర్‌గా నెహ్రూగారు చేసిన పొరపాటును ఆయన దృష్టికి తీసుకువచ్చి, ఆయన ఉపన్యాసం ముగించే లోపల, చేసిన పొరపాటు దిద్దుకొనుట కవసరమయిన నాలుగు మాటలు చెప్పవలసిందని కోరాను. రంగస్వామయ్యంగారికున్న భయం కారణంగా ఈ చీటీ

లీడర్‌కి చూపడంగాని, తనకు తానుగానే ఒక చిన్న సర్దుబాటు చేయడం గాని జరుగుతుందని ఆశించాం.

అల్లా జరగని కారణంగా పార్టీ మీటింగ్‌లో "సభలో లీడర్‌గా తదితర సభ్యుల తప్పొప్పులను కాపాడవలసిన లీడరే చేసిన పొరపాటుకు చింతిస్తున్నాము" అని ఒక తీర్మానం ప్రతిపాదించాను. దాన్తో మా పార్టీ మీటింగ్‌లో అలజడి బయల్దేరింది. ప్రతి సభ్యుని హృదయమూ తహతహ లాడింది. ఒకటి రెండుసార్లు ఈ విషయం కార్య నిర్వాహక వర్గం వారి ముందుకు వచ్చింది. కాని దానిని నిరవధికంగా నెట్టివేశారు. డెప్యూటీ లీడర్ శ్రీనివాసయ్యంగారు మూగనోము పట్టడంచేతా, లీడర్ తాము చేసిన పనిని సరిదిద్దుకోడానికి ఒప్పుకోని కారణాన్నీ, దాని గతి ఇలా పట్టింది. ఈ విషయాన్ని జనరల్ బాడీ ఎదుట పెట్టవల సిందని కార్యదర్శినీ, అధ్యక్షుణ్ణీ కోరినప్పుడు అల్లాగే అంటూనే ఏడాది దాటించారు.

ఈ ఏడాదిలోనూ సభ్యులంతా విడివిడిగానూ, నలుగురూ కలిసీ నా వద్దకు వచ్చి, నాయకునిమీద అటువంటి తీర్మానం తగదు, దానిని ఉపసంహరించుకోవలసిందని కోరారు. నేను ఒప్పుకోలేదు. నాకు ఆయనపై వ్యక్తిగతంగా ఎటువంటి ద్వేషమూ, దురభిప్రాయమూ లేవనీ, సభ్యులకు కావలసిన రక్షణ ఉండాలనే కాంక్షే ఆ ప్రతిపాదన తీసుకు రావడానికి కారణమనీ సూచించాను. అయినాగానీ, మెంబ ర్లందరూ అవసరమయిననాడు తామంతా నాయకుడ్నే సమర్థిస్తాం అని కూడా అంటూ, నన్ను ఆ ప్రతిపాదన తగ్గించుకోమని కోరారు. పి. ఎస్. రంగయ్యరు కూడా నన్ను భయపెట్టాడు. "ఇప్పటి వరకూ నాయకు డొక్కడే, చేసిన పొరపాటుతో అపహాస్యాల పాలయ్యాడు. మీరంతా ఆయన్ని సమర్థించే పక్షంలో మిమ్మల్నందర్నీ చూసి ప్రపం చకం అపహాస్యం చేస్తుం"దని విశదీకరించాను.

## రాజీ ప్రతిపాదన

సంవత్సరాంతంలో ఒక రాజీ ప్రతిపాదన సూచించబడింది. ఆ కారణంగా మా ఇద్దర్నీ సంఘటన పరిచారు. వారు, మా కలయికకు

కాలం నిర్ణయించుకుని, నేను అసెంబ్లీ బిల్డింగ్‌లో ఆనాటి కార్య క్రమాన్ని ముగించుకుని కూర్చున్న సమయంలో మోతీలాల్ నెహ్రూగార్ని నావద్దకు తీసుకువచ్చారు. వస్తూనే మోతీలాల్‌గారు పశ్చాత్తాపాన్ని కనబరిచారు. ఈ విషయంలో తన సానుభూతిని వెలిబుచ్చుతూ గాంధీ మహాత్ముడు తన పేర ఉత్తరం వ్రాశారని చెప్పారు. ఇటువంటి విషయాలలో ఆయన కా మూర్ఖపు పట్టూ, మొండితనమూ లేకపోతే ఆయన్ని సదా నా భుజస్కంధాలపైన మోస్తాను, ఆయన యందు నాకంత అభిమానమూ, గౌరవమూ ఉన్నా యన్నాను.

ఆ సమాచారం అంతటితో అల్లా చల్లారి పోయింది. ఈ విషయంలో ఓటమి నాదీ, గెలుపు మోతీలాల్‌గారిదీ అని ఒప్పుకోవడం న్యాయమేమో! ఆయన పార్లమెంట్‌లో అందరి సభ్యుల సమక్షంలో తన తప్పును ఒప్పుకోవలసిన పరిస్థితి తప్పిందిగా మరి! నాయకుడు తన తప్పును గ్రహించ గలిగాడు. నన్నూ ఎవ్వరూ ఎంత బలవంతం చేసినా ప్రతిపాదనకు వెనక్కు తీసుకునేలా చేయలేకపోయారని నేనూ సంతోషించాను.

# 4

# పెద్దల మధ్య రగడలు

మోతీలాల్ నెహ్రూగారికీ, శ్రీనివాసయ్యంగారికీ మధ్యను ఉన్న అభిప్రాయ భేదాలను గురించి కొద్దిగా ప్రస్తావిస్తాను. నెహ్రూగారితోగాని, శ్రీనివాసయ్యంగారితోగాని నా కెప్పుడూ ఎటువంటి వ్యక్తిగత అభిప్రాయభేదాలూ లేవు. ఆ ఉభయులయందూ నాకు సమాన గౌరవ ప్రతిపత్తు లుండేవి. వారిరువురూ కూడా హృదయం విప్పి వారి కష్ట సుఖాలు నాతో చెప్పుకునేవారు. అసలు వారిరువురి మధ్యా అభిప్రాయ భేదాలకుగాని, పరస్పర విరోధానికి అవకాశమే లేదు.

మహాత్మా గాంధీగారిలాగే మోతీలాల్‌గారూ మితవాదే. అవసరం అయితే కజ్జాకు కాలు దువ్వే రకమే. రాజీ ప్రతిపాదనలకూ

అంత సుముఖులే. మోతీలాల్‌గారు 1921 లో ఆ శాసన ధిక్కార ఉద్యమపు ఆరంభ దినాలలో స్వయంగా జెయిలుకువెళ్ళి ఆ ఉద్యమానికి ఖ్యాతి సంపాదించాడు. ఆయనలో ఉన్న బలహీనతల్లా, లార్డ్ రీడింగ్ సూచించిన రాజీ ప్రతిపాదనలను పట్టుకుని గాంధీగారితో తగవులాటకు దిగడమూ, కాంగ్రెసును రెండుగా చీల్చి, గాంధీగారు జెయిలులో ఉన్న రోజులలో స్వరాజ్యపార్టీని స్థాపించడము. ఆయన గాంధీ తర్వాత గాంధీ అంతటివాడు. గాంధీ తర్వాత నాయకుడుగా ఆయనే దేశాన్ని నడిపించవలసి ఉంది.

శాసన ధిక్కారం అంటే ఇష్టంలేని శ్రీనివాసయ్యంగారికి మోతీలాల్‌గారు స్థాపించిన స్వరాజ్యపార్టీ నచ్చిన కారణంగానే ఆయన కాంగ్రెసులో జేరాడు. మితవాదిగానే చెలామణీ అవుతూన్న శ్రీనివాస య్యంగారు, ఆ అసెంబ్లీ పార్టీలో మోతీలాల్‌గారితో సాన్నిహిత్యం సంపాదించి హాయిగా వారితో సాయిలా పాయిలాగా ఉండవలసింది. అటువంటి పరిస్థితులలో వారి మధ్య అభిప్రాయభేదా లుండేవంటే, ఆ తేడా పాడాలకు కారణం భగవంతుని సృష్టిలోనే ఉన్నటువంటి 'తమాషా' అని అనవలసి ఉంటుంది. పుష్పంలా వికసిస్తూన్న ఆయన తెలివి తేటలతో ఆయన, ఆచరణలో గాకపోయినా, ఊహాలో మాత్రం అందర్నీ అతిక్రమించగల నేర్పరి. అంటే, కత్తిపోటుకంటే కలం పోటులో మొంచి దిట్ట అవడాన్ని, అందర్నీ తన విజ్ఞానంతో మించి రాణించవలసిన వ్యక్తి.

## స్వాతంత్ర్యం కోసం పార్టీ

"స్వాతంత్ర్యం" విషయంలో మోతీలాల్‌గారితో అభిప్రాయ భేదం ఆరంభం అయింది. ఇదివరలోనే చెప్పాను - రణ రంగంలో తప్ప మోతీలాల్ మితవాదులలోకల్లా మితవాది అని. కాని, ఆయన కుమారుడే అయిన జవహర్ మాత్రం, దేశానికి స్వాతంత్ర్యం కోరడంలో, తండ్రిని మించిన కొడుకయ్యాడు. శ్రీనివాసయ్యంగారు జవహర్‌లాల్‌తో చేతులు కలిపి, సాంబమూర్తి సహకారంతో కేంద్ర శాసన

సభలోని కాంగ్రెసుపార్టీలో అంతర్గతంగా ఒక చిన్న 'స్వతంత్రపార్టీ'ని సృష్టించాడు.

ఆ పార్టీలో నన్నూ సభ్యత్వం స్వీకరించమని ఆహ్వానించాడు. శ్రీనివాసయ్యంగారి కోరిక నేను అంతగా పట్టించుకోలేదు. "స్వాతంత్ర్యం అంటే మీ అభిప్రాయం ఏమిటి? అవసరమయిన ఏర్పాట్లుచేసి, మీరు స్వాతంత్ర్యం కోసం యుద్ధంచేసి, దానిని సాధించడానికి సన్నిద్ధులవు తున్నారా?" అని అడిగాను. ఆయన తన "స్వాతంత్ర్యం" అన్న పదం జాతీయత అన్న పదానికి సన్నిహితమనీ (Independence was National), దానిని ఆదర్శంగా పెట్టుకొని వ్యవహరిస్తామనీ అన్నాడు. వారు కోరే "స్వాతంత్ర్యం"లో కొత్తదనం ఏమీలేదనీ, పశుపక్ష్యాదులు కూడా స్వతంత్రంగా హాయిగా ఏ నిర్బంధమూ లేనివిధంగా బ్రతకాలని వాంఛిస్తాయనీ, అటువంటప్పుడు మానవుడు స్వతంత్రంగా బ్రతకాలని వాంఛించడంలో తప్పులేదనీ చెప్పి, నేను మాత్రం మీ పార్టీ సభ్యత్వాన్ని వాంఛించడం లేదన్నాను.

పార్టీలో ఇంకో చిన్నపార్టీ ఉత్పన్నమయిందని విని, మోతీలాల్ నెహ్రూగారు బాధపడ్డారు. పార్టీ నాయకునిగా శ్రీనివాసయ్యంగారినీ, వారి 'స్వాతంత్ర్యాన్నీ' పట్టించుకోకుండా ఉండవలసిందే. కాని ఆ పార్టీలో ఉన్నది ఒక్క శ్రీనివాసయ్యంగారు మాత్రమే కాదుగా! ఆయన తన కుమారుడు జవహర్‌లాల్‌తో కలిపి, మా ఉభయుల వాంఛితార్థమూ ఒకటే నంటున్నాడు. శ్రీనివాసయ్యంగారు ఒక్కడే అయి వుంటే, తాను నిరంకుశంగా వ్యవహరించి ఆయన్ని త్రోసి రాజనేవాడే. కాని అందులో తన కొడుకు జవహర్‌లాల్ ఇరుక్కున్నాడు.

ఈ ప్రకారంగా, ఆ ఇరువురి మధ్యా ఆరంభం అయిన ఆ విభేదం, ఆ మూడు సంవత్సరాల సభా కార్యక్రమంలో మిళితమై, నిత్యమూ ఏదో ఉపద్రవానికీ, కోపతాపాలకీ కారణ భూతం అవుతూ వచ్చింది. సుభాష్ చంద్రబోసూ, జవహర్‌లాల్‌నెహ్రూ 'ఎవరు నాయకులుగా ఉండాలి?' అని తమలో తాము కీచులాడుకున్నా, ఉభయులూ స్వాతంత్ర్య ప్రియులే. ఇరువురూ అతివాద నాయకులే.

గాంధీగారి దన్ను చూసుకుని మోతీలాల్‌గారు తన్ను తాను సంబాళించు కోవలసిన స్థితిలోనే ఉన్నారు. కాని శ్రీనివాసయ్యంగారు తాను 1926 లో గౌహతి కాంగ్రెస్ అధ్యక్షుడు కావడంతో, జవహర్ లాల్ నెహ్రూగారినీ, సుభాస్ చంద్ర బోసుగారినీ ఆసరాగా తీసుకుని ముందడుగు వెయ్యసాగాడు. పరిస్థితులు ఇల్లా ఉంటూండగా, 1927 నాటికి కాంగ్రెస్ మదరాసులో సమావేశం కావడానికి పిలుపు వచ్చింది. ఆ పిలుపును మన్నించి అంగీకరించడమూ జరిగింది. కాగా 'స్వాతంత్ర్య' తీర్మానం ఆమోదించబడింది. ఈ తీర్మానం అటు గాంధీగారికి, ఇటు మోతీలాల్‌గారికి కూడా అయిష్టమయిందే. దాన్తో మోతీలాల్, శ్రీనివాసయ్యంగార్ల మధ్య రేగుతూన్న అభిప్రాయభేదాలు కాస్త తీవ్రరూపం దాల్చాయి.

## కాంగ్రెస్-లీగ్ స్కీము

సుభాస్ చంద్రబోసు 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని కాంక్షించిన వాడైనా, బెంగాల్ రాష్ట్రంవారు మాత్రం ఆ మదరాసు తీర్మానంతో అనుకోని విధంగా తబ్బిబ్బయారు. అందుచేత ఆ తీర్మానాన్ని కలకత్తా కాంగ్రెస్‌లో, అంటే 1928 లో, తిరగతోడాలని పదకం వేసుకున్నారు. వారివి తెలివయిన ఘటాలు. ఆ తీర్మానాన్ని తిరగ తోడడానికిగాని, నిర్వీర్యం చేయడానికిగాని మోతీలాల్‌నెహ్రూకి తప్ప ఇంకెవ్వరికీ సాధ్యం కాదని వారుగ్రహించారు. కలకత్తా కాంగ్రెస్ అధ్యక్షుడు మోతీలాలే గనుక, ఆయనే ఆ పని చెయ్యడానికి అర్హుడని వారు తలచారు. గాంధీగారు ఒప్పుకోడంతో మోతీలాల్ అధ్యక్షుడయ్యాడు.

గాంధీగారూ, మోతీలాల్ కలిసి మధ్యే మార్గంగా 'కాంగ్రెస్-లీగ్ స్కీమ్' అంటూ ఒక దానిని లేవతీశారు. అదే అప్పట్లో కాంగ్రెసు వారి ధ్యేయం అన్నారు. "స్వాతంత్ర్య సముపార్జన విషయమై మాకేటి అభ్యంతరమూ లేదు. దానిని గురించి అప్రమత్తతతో ప్రచారం చేసుకోండి" అన్నారు. సబ్జెక్ట్స్ కమిటీలో సుభాస్, జవహర్‌లాల్ కూడా ఈ రాజీ సూచనకి ఒప్పుకున్నారు. కాని తరవాత ఆ ఒప్పందాన్ని త్రోసి

రాజని, బహిరంగ సమావేశంలో దాని కొక సవరణ ప్రతిపాదించారు. దానికి శ్రీనివాసయ్యంగారి మద్దత్తు లభించింది. ఇది గాంధీ-నెహ్రూ గార్లకు విషాద విస్మయ కారణం అయింది.

ఆ ప్రకారంగా అసెంబ్లీ పార్టీలోని నాయకునికీ, ఉప నాయకునికీ మధ్య ఒక రగడ బయల్దేరి, 1928 డిసెంబరు ఆఖరు దాకా అది సాగింది. మోతీలాల్‌నెహ్రూగారికీ, శ్రీనివాసయ్యంగారికీ మధ్య ఇల్లా కాంగ్రెసు కార్యక్రమం నడిపే విషయంలో రగడ సాగుతూన్న రోజులలోనే, తన నిత్య విమర్శనలతో సి. ఎస్. రంగయ్యరు, మోతీలాల్‌నెహ్రూ గారిని విసిగిస్తూ ఉండేవాడు. ఇది ఇలా ఉండగా మోతీలాల్‌గారికీ, లజపతిరాయిగారికీ మధ్యను కూడా రగడ బయల్దేరింది.

కాకలు తేరిన లజపతిరాయ్

అసెంబ్లీ మెంబర్లుగా ఉంటూ, విధానాలలో స్వల్ప భేదాలతో, ఏవో కారణాలవల్ల మోతీలాల్‌గారికీ, అయ్యంగారికీ మధ్య అభిప్రాయ భేదాలొచ్చా యనుకోవచ్చుగాని, మోతీలాల్‌గారికీ లజపతిరాయ్ గారికీ మధ్య ఉత్పన్నమయిన విభేదాలకి కారణాలు దురూహం అనవలసి ఉంటుంది. లజపతిరాయ్‌గారు మోతీలాల్‌గారికి వ్యతిరేకంగా ఏ "స్వతంత్ర" పార్టీనీ స్థాపించలేదు సరికదా, అధమం శ్రీనివాసయ్యంగారి 'స్వతంత్రపార్టీ'లో సభ్యత్వమయినా లేదు వారికి. మోతీలాల్ గారితోగాని, మహాత్మా గాంధీగారితోగాని కలిసి పనిచెయ్యడానికి అనువయిందే లజపతిరాయ్‌గారి తత్వం. దేశస్వాతంత్ర్య సమరంలో పాల్గొనడంలోనూ, దానివల్ల బాధలకు గురి కావడంలోనూ ఆయన మోతీలాల్‌గారికన్నా, గాంధీగారికన్నా కూడా ఎక్కువ అనుభవం గడించినవాడు. ఆయన దేశ సేవా కార్యక్రమంలో జెయిలు శిక్షా, దేశ బహిష్కరణా కూడా అనుభవించిన దిట్ట. ఆ తర్వాతే గాంధీగారు 1921 లో శాసన ధిక్కారం వగైరాలు ప్రబోధించారు.

కాంగ్రెసు నూతన విధానాన్ని అవలంబించిన తర్వాతనే ఆయన కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గంలో మొదటి సభ్యుడయ్యాడు. ఆయన

తర్వాతనే నేనూ, చిత్తరంజన్‌దాస్‌గారూ కార్యనిర్వాహక సభ్యుల మయ్యాము. దాస్‌గారిలాగే లజపతిరాయ్ కూడ స్వాతంత్ర్య వాయువులను పీల్చి, స్వాతంత్ర్యాన్ని కాంక్షించి, తన అభిప్రాయాలను నిర్భయంగా వెల్లడించ కోరినవాడు. ఆ మొట్ట మొదటి కార్యనిర్వాహక వర్గంలోని సభ్యులందరూ మేధావులే. మేధావులే కాదు - ధీశాలురూ, విజ్ఞానవంతులూ కూడా.

## దీర్ఘ దర్శిత్వం

లజపతిరాయ్ నాకు ముఖ్య స్నేహితుడు. మేము ఉభయులమూ లండను నగరంలో 1903 లోనే ఎల్లా సన్నిహితులమయ్యామో చెప్పి ఉన్నాను. అప్పటికి ఆయన దేశం నుంచి బహిష్కరించబడి ఇంగ్లాడులో ఉంటున్నాడన్నమాట! ఆయన మంచి తెగువ గలిగిన రాజకీయ వేత్త. త్యాగానికి ఎప్పుడూ సిద్ధమే. సాంఘిక రాజకీయ పరిజ్ఞానం కలిగీ, ఎప్పుడూ లోకజ్ఞానాన్ని ఆధారం చేసుకునే ఏ ముఖ్య సమస్యనయినా పరిష్కరించేవాడు.

కేవలం ప్రజాదరణతోనే ప్రారంభించిన దేశీయ విద్యాలయాలూ, పారిశ్రామిక సంస్థలూ ప్రభుత్వ ఆదరణ లేకుండా నిలవ లేవని నాకూ, మా మిత్రులకూ విశద పరచిన దీర్ఘదర్శి ఆయన. మేము అతి ఉత్సాహంతో, నిర్మాణ కార్యక్రమం పేరిట, 1921 లో శాసన ధిక్కారానికి ప్రాతిపదికగా ప్రారంభించిన దేశీయ విద్యాలయాలూ, పరిశ్రమలూ లాంటివన్నీ రెండేళ్ళు తిరక్కుండానే నాటి ప్రభుత్వంవారు అంత మొందించగలిగారు. ప్రభుత్వం వారికీ మాకూ చుక్కెదురు కూడాను. అటువంటప్పుడు ప్రభుత్వ చర్యలను ఎదుర్కొని విద్యాలయాలనూ, గ్రామీణ పరిశ్రమలనూ నడపడం దుస్సాధం కదా! ఆయన తన ఉపన్యాసాలలో ఎప్పుడూ నన్నూ, జవహర్‌లాల్‌నెహ్రూను కలిపే మాటాడుతూ, మా దేశసేవాకృషిని ఉదహరిస్తుండేవాడు. కేంద్ర శాసన సభా సభ్యులుగా మేము మరీ సన్నిహితుల మయ్యాము.

## మోతీలాల్‌తో పడని కారణం

మోతీలాల్-లజపతిరాయ్‌గార్ల మధ్య ఆ అభిప్రాయ భేదాలకు కారణాలు తెలుసుకోడానికి నా కంటె మిన్నగా ఎవ్వరికీ సావకాశంలేదు. ఎంత ప్రయత్నించినా నాకు వారి అభిప్రాయ భేదాలకి కారణాల అంతూ పొంతూ దొరకలేదు. ఒక్కటి మాత్రం నిజం - ఇరువురూ మేధా సంపత్తిలో ఉద్దండ పిండాలే. మోతీలాల్ నెహ్రూగారి నిరంకుశ విధానమూ, ఆయనకున్న అహంకారమూ లజపతిరాయ్‌గారికి కిట్టకపోయి ఉండవచ్చు. ఆయన నాయకుడి చేతిమీదుగా తాను పొందుతూన్న గౌరవ మర్యాదల కంటె అధికంగా వాంఛించి ఉండవచ్చు. ఇంకాస్త ఇదిగా ఆయన చూసి ఉండి ఉంటే, వారిరువురిమధ్యా యేతగాదా ఉండేదికాదు. అసెంబ్లీ పార్టీలో ఉన్న ఇతర వ్యక్తులిచ్చిన అభిప్రాయాల కంటే, సలహాల కంటే, తానిచ్చిన సలహాలూ, వగైరా ఇంకా ఎక్కువ ఆదరణ పొంది ఉండవలసిదని ఆయన ఉద్దేశం అయి ఉండవచ్చు. ఆయన గాంధీగారి శిష్యుడు కాదుగా! ఎంత విభేదాలున్నా, మాలో మేము కీచులాడుకుంటూన్నా, నాయకుడితో అభిప్రాయ భేదా లొచ్చినా "బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామీ"గా తయారయి, మా పార్టీనే మేము అంటిపెట్టుకుని ఉండేవారం.

ఒకనాడు నేను అసెంబ్లీలో ప్రవేశిస్తూ ఉండగా లజపతిరాయ్ గారు కాంగ్రెసుపార్టీని వదలి, మదన మోహన మాలవ్యాగారి లిబరల్ పార్టీలోకి మారడం చూశాను. నాకు నిజంగా విస్మయమూ, దిగులూ కూడా జనించడంచేత, "ఏమిటిది, ఇల్లా చేశా"రని అడిగాను. ఆయన ఇచ్చిన క్లుప్తమయిన సమాధానం: "ప్రకాశంగారూ, నేనే గనుక ఆయనతో నెగ్గుకు రాగలిగితే ఇల్లాంటి పనిచేస్తానా?" అన్నాడు. ఏదయితేనేం, మోతీలాల్ నెహ్రూ మహా మేధావీ, గౌరవ మర్యాదలకోసం ప్రాకులాడే వ్యక్తే అయినా, ఆయనకి శ్రీనివాసయ్యంగారూ, లజపతిరాయ్, రంగయ్యర్‌లాంటి వ్యక్తులను కూడగట్టుకుని ముందుకు సాగడం చేతకాదనే అనవలసి ఉంటుంది.

## తండ్రిపై జవహర్ ప్రభావం

అన్నింటికంటె, ఆయన తన కుమారుడు జవహర్‌లాల్ చర్యలతో ఎప్పుడూ సతమతమవుతూ వచ్చాడు. ఆయన గాంధీగారి సహకార నిరాకరణ ఉద్యమంలో చేరేలాగ, ఆయన్ని ఇంకాఇంకా ముందుకు లాక్కుపోతూ, కొత్త కోరికలతోనూ, కొత్త పదకాలతోనూ, మెల్లి మెల్లిగా ప్రత్యక్ష చర్యలకే దిగేలా చేశాడు జవహర్. ఆయన, క్రమేణా శాసన సభలోని కాంగ్రెసుపార్టీనుంచి తప్పుకుని, దేశాన్ని స్వాతంత్ర్య సమరానికి సిద్ధం చెయ్యాలనే అభిలాషతో కుస్తీ పట్టసాగా డన్నమాట!

నిజానికి యుద్ధభూమిలో ఆయన ప్రతిభాశాలనే ఒప్పుకోవాలి. ఒక్కసారి ముందడుగువేసి దేనినయినా చేపడితే, ఆయన ముందుకు చొచ్చుకుని పోవడమే కాని, వెనుకంజవేసే బాపతు కాదు. పర్యసానాలతో నిమిత్తం లేకుండా అల్లా ముందుకుపోతూ, దేశాన్నీ, ప్రజల్నీ కూడా ఇంకా ముందుకు లాక్కుపోయే రకం. దేశం అధైర్యంతో క్రుంగిపోతూన్న పరిస్థితిలో కూడా, దేశాన్ని ఉత్తేజపరచి ముందుకు లాక్కుపోయే రకం ఆయన్ది. అదే ధైర్యమూ, అదే ఉత్సాహమూ ఆయన ఏకైక పుత్రుడయిన జవహర్‌లాల్‌కూ, జవహర్‌లాల్ ప్రేమాతిశయాలను చూరగొన్న ఇల్లాలు స్వర్గీయ కమలానెహ్రూకూ, జవహర్‌లాల్ సహోదరి విజయలక్ష్మి పండిట్‌కూ అలవడ్డాయి.

ఈ కథనాన్ని కాస్త కట్టిపెట్టి, ఆ 1928-29 లలో మేము శాసన సలో చేసిన, సాధించిన పనులను గురించి చర్చించడం న్యాయం. తిరిగి సత్యాగ్రహం ఆరంభించేవరకూ మేము శాసన సభలో చేసిన పనులను గురించి చెప్పనివ్వండి.

## హోదాలమీద పెద్ద నెహ్రూ మోజు

జనరల్ ఎన్నికలలో కాంగ్రెసువారు అఖండ విజయం సంపాదించి, శాసన సభలలో ప్రవేశిస్తూ, ఉత్సాహాన్ని చూపిస్తున్న ఆ రోజులలో- అంటే 1927 మార్చిలో- కాంగ్రెసు పార్టీ ప్రతినిధిగా మోతీలాల్‌గారిని ప్రభుత్వ ప్రజాప్రతినిధి సభ ఉపసంఘం (Empire Parliamentary Sub-committee)లో సభ్యునిగా ఎన్ను

కున్నారు. కాగా ఆయన స్కీన్ (Skein) కమిటీ సభ్యత్వం కూడా స్వీకరించాడు. ఈ స్కీన్ కమిటీవారు సైన్యాన్ని పటిష్ఠంగా పునర్నిర్మాణంచేసే పద్ధతుల విషయమై సలహాలు చెప్పా లన్నమాట. ఆయన కాంగ్రెసు ఆశయాలకి అనుగుణంగానే ఆ పదవులను స్వీకరిస్తూన్నట్లు నటించారేగాని, నిజానికి కాంగ్రెసువారు ఇటు ఉద్యోగ స్వీకారానికిగాని, అటు ప్రభుత్వం వారితో సహకరించడానికి గాని వ్యతిరేకులే.

చెన్నరాష్ట్ర శాసన సభ్యులూ, ఇతర రాష్ట్రాలలోని శాసన సభ్యులు కొందరూ, కాంగ్రెసు ఆశయాలనుంచి దిగజారిన కారణంగా, వారిపై అవిశ్వాస తీర్మానం ఒకటి అఖిల భారత కాంగ్రెసు కమిటీలో ప్రవేశపెట్టబడింది. మహారాష్ట్రానికి చెందిన ఎన్. పి. కేల్కార్‌గారినీ, డా॥ మూంజీగారినీ సమర్థించే సందర్భంలో, మోతీలాల్‌నెహ్రూగారు స్కీన్ కమిటీలోనూ, ప్రభుత్వ ప్రజాప్రతినిధి సభలోనూ ఉద్యోగ స్వీకారం చేయలేదా అనే ప్రశ్న వచ్చింది. 1928 లో మోతీలాల్‌గారు ఆ రెండు కమిటీలలోని సభ్యత్వానికి రాజీనామా ఇచ్చేలోపల, కాంగ్రెసు పార్టీ చాలా దిగజారిపోయింది.

## మా శాసన సభానుభవం

మూడు సంవత్సరాలపాటు కాంగ్రెసువారు శాసన సభలలో అధిక సంఖ్యాకులుగా ఉంటూ, ఎన్నో విషయాలలో ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఓటు చేసినా, ప్రభుత్వంవారు ఏ ఒక్క విషయంలోనూ కూడా తమ పరాజయాన్ని అంగీకరించడమన్నది జరగలేదు. వారు ఇతర మార్గాల ద్వారా తాము తలచినదాన్నీ, తమ పంతాన్నీ నెగ్గించుకుంటూ వచ్చారు. శాసన సభలో అనుభవాలు మాలో చాలా మందికి కనువిప్పు కలిగించి, ప్రజల్లో నిజమయిన పరిస్థితులను గురించి ప్రచారం చేయడానికి బాగా ఉపకరించాయి. మా ఆశయాభివృద్ధికి మేము తగు ప్రచారం చెయ్యడానికి మాకు శాసన సభాస్థలి బాగా ఉపయోగపడింది.

మాకే గనక దేశీయ భాషా పత్రికల ద్వారానూ, కాంగ్రెసు నిర్మాణ కార్యక్రమం ద్వారాను శాసన సభలలో జరుగుతున్న భాగవతం పల్లెలలో నివసించే ప్రజానీకం దృష్టికి తేగల అవకాశం ఉంటే, నిజంగా

మేము అసంతృప్తి చెందడానికి, చికాకు పడడానికీ కారణం ఉండేది కాదు. మా కపజయం కలుగుతుందేమోనన్న భీతే ఉండేదికాదు. మేము శాసన సభా ప్రవేశంచేసిన కొద్ది దినాలలోనే, బ్రిటిష్‌వారికే గాక, బాహ్య ప్రపంచంలో ఉన్న ఇతర దేశాలన్నిటికీ మాది పకడ్‌బంద్‌గా ఏర్పడిన, మాంచి క్రమశిక్షణగల పక్షమని విశదమయింది.

ఇటువంటి మంచి పేరు సంపాదించుకోడానికి కారణం, మేమంతా కాంగ్రెసు అధినేతలలో అధిపతి అయిన వారి మాటప్రకారం ఒక్క త్రాటిమీద నడవడమే. మాకు శాసన సభలలో ప్రవేశింపమని అనుమతి-కాదు, ఆజ్ఞ యివ్వగానే ఆ సభాప్రవేశం చేశాం. ప్రపంచంలో ఏ ఇతర దేశాలలోనూ, పకడ్‌బంద్‌లోను, క్రమశిక్షణలోనూ మాతో పోటీ పడగల పార్టీ లేకపోయింది. ఇది నిజంగా గర్వింపదగిన విషయమే గదా?

## దిగజారిపోయిన సందర్భాలు

ఇంత పకడ్‌బంద్‌గా వ్యవహరించ గలిగినా, మేము దిగజారిపోయి, నీరు గారిపోయిన సందర్భాలూ ఉన్నాయి. మోతీలాలు నెహ్రూగారు ఎంత మేధావి అయినా, ఎంత బలవంతుడయినా, సాధారణంగా నాయకులూ, గురువులూ అనుకోకుండా చూపించే విధంగా, కొంతమంది వ్యక్తుల మీద ఆయనకు అభిమానం జాస్తీగా ఉండేది. సామాన్యంగా అటువంటి దుర్బలత్వాన్ని మనం పట్టించుకోకూడదు. కాని, ఆ అభిమానాలు ప్రజాక్షేమానికీ, ప్రజోపయోకర కార్యాలకీ ప్రతిబంధకాలుగా పరిణమించి నప్పుడు మాత్రం విపరీత ఫలితాల నిస్తాయి.

ఉదాహరణకి, ఆర్. ఎన్. షణ్ముగం చెట్టిగారి సంగతే విచారిద్దాం (ఆయన దర్మిలా సర్ బిరుదాంకితు డయ్యాడు). ఆయన భారత ప్రభుత్వ అవసరాలనూ, కావలసిన ఇతర వస్తు సముదాయాన్నీ అమెరికానుంచి కొని, సప్లయిచేసే విభాగానికి పెద్దగా ఉండేవాడు. కాగా, ఆయన మోతీలాల్‌నెహ్రూగారికి సన్నిహితుడుగానూ, వారి అభిమానానికీ, విశ్వాసానికీ పాత్రుడుగానూ ఉండేవాడు; మా పార్టీకి చీఫ్ విప్.

ఆయన చాలా నేర్పరి. ఆంగ్లేయ భాషా పరిజ్ఞానం బాగా కల వాడు. మంచి మాటకారి. ఆయన ట్రెజరీ బెంచెస్‌వారికి సన్నిహితుడు కూడాను. ఆయన్ని గురించి చెడుగా అనడానికి మాకు గాని, ఇంకొక రికిగాని కారణం కనబడదు. ఆయన మా పార్టీ తరఫునే మాటలాడు తూన్నా, ఆ మాటల తీరూ, అందలి విషయాలూ ఇటు మాకూ, అటు ప్రభుత్వ బెంచీలవారికీ కూడా ఉపయోగపడేలాగున గుంభనంగా ఉండేవి. ఆయన మా పక్కనుంచి మాటాడుతూన్నా, ఆ మాటాడే తీరు "అచ్చా, సెహబాస్! వినుడు వినుడు" లాంటి ఉత్సాహపూరిత వచనాలను, అందరిచేతా పలికించేదిగా ఉండేది. ఆయన తెలివితేటలు అటువంటివి. కాని అది అంతటితో ఆగుతుందా? దుష్ఫలితాలు రావూ?

## తలవంపులైన సంఘటన

ఈ సందర్భంలో బొత్తిగా దిగజారిన పోయిన సందర్భం ఒకటి చెప్పడం న్యాయం. ఒకసారి, ఆర్థిక సంబంధమయిన ఒక బిల్లును గురించి వచ్చిన చర్చలో, ఒక అనుకోని సంఘటన జరిగిపోయింది. ఆ సంఘటన జరిగిన వెనువెంటనే నాకు తెలుపబడింది. వీలయితే, కాంగ్రెసుపార్టీవారి అభిమానాన్ని సంపాదించి, ఒక బిల్లు అంగీకరింప జేద్దామని ప్రభుత్వంవారు ఉవ్విళ్ళూరుతూన్న సందర్భం అది. మా పార్టీ మీటింగులో ఆ బిల్లును ప్రతిఘటిద్దామనే తీర్మానించుకున్నాము. ఆ బిల్లు మంచి చెడ్డలూ, దానివల్ల లాభనష్టాలూ బాగా తర్జన భర్జన చేశాకే ఆ నిర్ణయం తీసుకున్నాం. కొంత మందికి ఆ బిల్లును ప్రతిఘటించక పోయినా వచ్చే నష్టం ఏమీ లే దనే అభిప్రాయం బాగా ఉంది. అందు వల్లనే బాగా తర్జన భర్జన చేశాకే దానిని ప్రతిఘటిద్దామనే నిశ్చయానికి వచ్చాం.

కాని ఆఖరు నిమిషంలో, ఓటింగు జరిగే ముందు, మేమంతా ఆ బిల్లుకు అనుకూలంగా ఓటు చేయాలనే ఆజ్ఞ చీఫ్ విహ్వప్పు దగ్గరనుంచి వచ్చింది. మాకు చాలా ఆశ్చర్యం అయింది. నేను కార్య దర్శిగారినీ, చీఫ్ విహ్వప్పునూ ప్రశ్నించాను. పార్టీ మీటింగ్ పెట్టి

సంగతి సందర్భాలు చర్చించడానికిగాను వ్యవధి లేదు. జరిగిపోయిన కీడునూ, చెడుగునూ ఇంకే విధంగానూ సరిదిద్దుకోవడానికి మార్గం కనబడలేదు. అందుచేత కాంగ్రెసు పార్టీవారు ఛీఫ్ విహ్వప్పు ఆజ్ఞను పాలించకుండా ఉండవలసి వచ్చింది. దానివల్ల కాంగ్రెసు పార్టీవారు అటు అనుకూలంగా గాని, ఇటు ప్రతికూలంగా గాని ఓటు చేయలేని స్థితిలో తటస్థంగా ఉండడం తప్పని సరయింది. ప్రభుత్వంవారి బిల్లు ఆమోదించబడి, చట్టమయిపోయింది.

దర్మిలా మా నాయకుడూ, ఆయన కార్యదర్శీ కూడా ఆ ఆజ్ఞ కాలవ్యవధి లేకుండా అతి త్వరితంగా ఇచ్చామనీ, అల్లా ఇవ్వడానికి ప్రత్యేక కారణం ఏమీ లేదనీ, ఆ బిల్లును వ్యతిరేకించడం అనవసరం అనే అభిప్రాయంతో అల్లా తుది నిర్ణయంగా ఆ ఆజ్ఞ యిచ్చామనీ అన్నారు. ఆ బిల్లు ఆమోదించబడి, 'చట్టంగా ప్రకటితమయిన ఆనాటి సాయంత్రం జరిగిన సంఘటన చాలా కలవరపాటునూ, చికాకునీ, ఆశ్చర్యాన్నీ కలుగజేసింది.

నా మిత్రుడూ, చిత్తూరు నివాసీ అయిన కీ॥ శే॥ శ్రీ సి. దొర స్వామయ్యంగారు ఒక డిప్యూటీ సెక్రటరీగారికి ప్రత్యేకించబడిన గది లోకి వెళ్ళారు. వెళ్ళి, అక్కడ ఆ గదిలో అడ్డంగా ఉంచబడిన తెర వెనుక ఆసీనుడయ్యాడు. దొరస్వామయ్యంగారు లోపలికి వెళ్ళిన కొద్ది సేపటిలో ఆ గదిలోకి మా పార్టీ విహ్వప్పు ఒకాయన వెళ్ళాడు. ఆయన ఆ గదిలో ప్రవేశిస్తూనే, ఆ స్క్రీన్ వెనుకనున్న దొరస్వామయ్యం గారిని గమనించకుండా, ఆయనతో కబుర్లలో పడ్డాడు. "హల్లో, చూశారా! నేను మా పార్టీవారి నెవ్వరినీ ఆ బిల్లుకు ప్రతికూలంగా వోటు వెయ్యవద్దని అజ్ఞాపించాను. ఆ ప్రకారంగానే ఎవ్వరూ ఓటు వెయ్యలేదు" అన్నాడు.

ఇది ఆ బిల్లుకు సంబంధించిన విషయం. మేము ఇంటికి వెళ్లాక దొరస్వామయ్యంగారు ఈ సంగతి నాతో చెప్పారు. ఆ సంఘటన మాలో తత్తరపాటునీ, చికాకునీ, అసహ్యాన్నీ కలిగించింది. మేము సిగ్గుతో తలవంచుకునే పరిస్థితి ఏర్పడింది.ఆవిషయాన్ని అల్లా వదిలివేయ

వలసివచ్చింది. దాని విషయంలో ఇంకేమయినా విచారణ, వగైరాలు జరిపించి ఉంటే, 'అవును', 'కాదు' లాంటి పదాలతో మా స్థితి ఇంకా బాగా పలచనై పోయేది. "సహకరించవద్దు, దానిని వ్యతిరేకించండి" అనే పార్టీ ఆజ్ఞకు భిన్నంగా జరిగిన ఈ సంఘటన సహించరానిదే గదా! నిజానికి ఆ విప్‌కీ, అండర్ సెక్రటరీకి మధ్య నడచిన కథ మాత్రం చాలా దారుణమయింది. ఆ మూడు సంవత్సరాల శాసన సభా అనుభవంలో చాలా వింత వింత సంఘటనలే జరిగాయి. కాని దీనిముందు మాత్రం అవన్నీ పగటి దివ్వెలే. మామూలు చిన్న ఉద్యోగి కూడా కొన్ని సందర్భాలలో మా పార్టీ అధికారుల మీద తన శక్తినీ, ప్రతిభనూ చూపగలిగాడు. ఆనాటి దొరస్వామయ్యంగారూ, రంగస్వామయ్యంగారు, ఆ కార్యదర్శీ, ఆ విప్పూ, ఆ పార్టీ లీడరూ అంతా గతించిన తర్వాత చాలా కాలానికి నేను ఈ కథను ప్రస్తావించడం అన్యాయమే. కాని ఈ సంఘటన చాలా ముఖ్యమయిందీ, మా పార్టీకి సంబంధించిన ఎన్నో లోటుపాట్లకు నిదర్శన ప్రాయమైందీ అవడంచేత మీ ముందు పెట్టవలసి వచ్చింది.

# 5

## బ్రిటిష్ పథకానికి ప్రతి పథకం

సైమన్ కమిషన్‌వారు ఈ దేశంలో మొట్టమొదటిసారిగా పర్యటించిన ఆ 1928లోనే, మార్టిన్‌జోన్స్, పి. ష్రాప్ అనే బ్రిటిష్ పార్లమెంట్ సభ్యులు మన దేశాన్ని చూడ్డానికి వచ్చారు. వారు మమ్మల్ని కేంద్ర శాసన సభలో కలిసినప్పుడు, మేము శాసన సభా సభ్యులుగానూ, శాసన సభలోనూ చేస్తూన్న పనిని గురించి అడిగారు. వారికి మేము ఎల్లా నిరంకుశంగా శాసన సభా వ్యవహారాలు నడిపించబడుతున్నదీ, భారతీయుల ధనం ఏ విధంగా నిరంకుశంగా దుర్వినియోగం అవుతూ ఉన్నదీ వివరించి చెప్పాము. వారు మాకు సన్నిహితులయిన మిత్రులుగానే వ్యవహరించారు. మా పరిస్థితికి విచారాన్ని వెలిబుచ్చారు. జబర్దస్తీగా

వారి పెద్దలు, మా కోరికలకు విరుద్ధంగా, ఎల్లా ఆ సైమన్ కమిషన్ వారిని మా నెత్తి కెక్కించారో చెప్పి వాపోయారు.

ఇండియాకి సెక్రటరీ అఫ్ స్టేట్‌గా ఉంటూన్న సర్ శామ్యూల్ హోర్ ఇంగ్లాండునుంచి ఢిల్లీకి విమానంలో వచ్చిన సందర్భంలో ఆయన శాసన సభని చూడడానికి వచ్చాడు. ఆయన "మూర్తి" గాని, "శక్తి" గాని మమ్మల్ని యే విధంగానూ ఆకర్షించలేదు. ఆయనది తీవ్రమయిన క్రూరదృష్టి. ఆయన మాటాడిన ఆ రెండు ముక్కలూ, ఆయన ఈ దేశానికి ఉపకారికాడు అన్న విషయం మాకు స్పష్టం చేశాయి.

## నూతన పథకాన్వేషణ

సైమన్ కమిషన్‌ని బహిష్కరించవలసిందని ప్రబోధం చేస్తూ, మేమందరమూ కలిసి యోచించి బ్రిటిషువారికి, వారి రాజ్యాంగ పథకానికి ప్రతిగా, మా పథకాన్ని అందచెయ్యదలచాం. బహిష్కరణ కార్యక్రమం నడుస్తూ ఉండగానే, బ్రిటన్‌కీ, ప్రపంచానికీ కూడా విస్మయం గొలిపేదిగా ఉండే పథకాన్ని అఖిల పక్షాల వారికీ ఆమోద యోగ్యంగా తయారుచేసి అందచేద్దా మనుకున్నాం.

అసలు కాంగ్రెసు నాయకులు యావత్తు భారతజాతికి అంగీకార యోగ్యంగా ఉండే విధంగా అడపా తడపా ఒక రాజ్యాంగ పథకాన్నో, పద్ధతినో రూపొందిస్తూ ఉండవలసింది. నేను కేంద్ర శాసన సభలో పని లేనప్పుడల్లా హిందూ మహమ్మదీయ కలహాలు జరిగిన తావులకు వెళ్ళివస్తూ, అఖిలపక్ష సమావేశాలకీ, అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగులకీ హాజరవుతూ, ఆంధ్రరాష్ట్రానికి సంబంధించిన వ్యవహారాలు చూస్తూ నా కాలాన్నీ, ధనాన్ని వినియోగపరచే వాడిని. ఆ అఖిల పక్ష సమావేశాలలోనూ, కాంగ్రెసు కమిటీ మీటింగులలోనూ సుదీర్ఘమయిన చర్చలు జరుగుతూ ఉండేవి.

మహాసభలు 1885 నుంచీ జరుగుతూనే ఉన్నాయి. సహకార నిరాకరణ ఉద్యమం ధర్మమా అని దేశం అంతా క్రమశిక్షణతో కూడిన విధానానికి అలవాటుపడుతూ ఉంది. గాంధీగారి కాంగ్రెసూ, స్వరాజ్య

పార్టీ, రాష్ట్ర శాసన సభలలోని కాంగ్రెసు పార్టీలూ సరిఅయిన క్రమ శిక్షణకు అలవాటు పడ్డవి. ఈ విషయాలన్నీ అసెంబ్లీలో ఉన్న కాంగ్రెసేతర పార్టీలన్నీ గుర్తించే ఉన్నవి. ఆంగ్లేయ రాజ్యతంత్ర జ్ఞులూ, ప్రపంచ రాజకీయవేత్తలూ ఈ దేశంలో జరుగుతూన్న మార్పులూ, కాంగ్రెసు సాధిస్తూన్న ఘనవిజయాలు గమనిస్తూ ఉన్నారు. కాంగ్రెసువారినీ, వారి శక్తి సామర్థ్యాలనూ, భారతీయుల రాజకీయ చైతన్యాన్నీ యావత్తు ప్రపంచమూ గుర్తించి ఉంది. అయినప్పటికీ, కాంగ్రెసు నాయకులూ, తక్కిన పెద్దలూ కూడా - కాలాన్ని అనవసర తర్క వితర్కాలతో వృథా పుచ్చుతూ కార్యసాధనకు పూనుకోకుండా, దేశంలో ఏ పథకమూ ఆమోదింప జేయలేని స్థితిలో ఉన్నారు. నాయకులలో పరస్పర సహకారం లోపించే ఉంది. బ్రిటిషు పార్లమెంటరీ విధానమూ, వారిలో వారికి (పార్టీ విభేదా లుంటూ ఉన్నా) గల సహన భావమూ మనకింకా అవగాహన కాలేదు.

## అఖిల పక్ష సమావేశాలు

కొన్ని కొన్ని అఖిల పక్ష సమావేశాలు ఆరంభమయిన వెంటనే అవతరించే హంసపాదులతోనే అంతమయ్యేవి. ఒకసారి ఆ సమావేశం అధ్యక్షుడుగా ఎవరు ఎన్నుకోబడాలి అన్న విషయం తేలక అది ఆగే పోయింది. ఏది ఎల్లా ఉన్నా, ఆ ఒక్క సంగతి మాత్రం ఒప్పుకు తీరాలి. కాంగ్రెసు నాయకులూ, కార్య నిర్వాహకులూ, ఎట్టి విభేదాలు వచ్చినా, చివరికి ఒక నిర్ణయానికి రావడమూ, ఆ నిర్ణయానికి కట్టుబడి ఉండడమూ జరిగేది.

1928 ఫిబ్రవరి-మార్చి నెలల్లో జరిగిన అఖిల పక్ష సమావేశాలన్నీ ముక్కాలు మువ్వీసం ఢిల్లీలోనే జరిగాయి. అప్పట్లో అసెంబ్లీ నడుస్తూన్న కారణంగా ఈ సమావేశాలు చులాగ్గా జరగడానికి ఢిల్లీలోనే అనుకూల వాతావరణం ఉండేది. అందువల్ల కౌన్సిల్ ఆఫ్ స్టేట్ వారికీ, కేంద్ర శాసన సభ్యులకూ ఏ విధమయిన చిక్కులూ, చికాకులూ ఉండేవికావు. దినాలకొద్దీ సమావేశాలూ సాగినా, అందరూ అక్కడే ఉంటూ ఉండడాన్ని ఆర్థికంగా కూడా అధిక వ్యయాలు అయ్యేవికాదు.

ఒక్క సమావేశం వరసగా ముప్పయిసార్లు జరిగిందంటే, అందులో ఎవరికీ విపరీతం ఏమీ కనిపించలేదు; అధిక వ్యయ ప్రయాసలనీ అనిపించలేదు

## మితవాద పథకం

అల్లా జరిగిన ఒక అఖిల పక్ష సమావేశానికి (1928, మే 19) డా॥ అన్సారీ అధ్యక్షత వహించాడు. అప్పుడు అఖిల పక్షాలవారికీ అంగీకార యోగ్యమయిన రాజ్యాంగ పథకాన్ని రచించడానికి (పండిత మోతీలాల్ అధ్యక్షతను) ఒక ఉప సంఘం యేర్పరచబడింది.ఆ కాన్ఫరెన్సులో ఈ దిగువ అంశాలు అంగీకరించబడ్డాయి: 1. బాధ్యతాయుత ప్రభుత్వం స్థాపించబడాలి; 2. హిందూ మహమ్మదీయ ఐక్యం సుస్థిరం కావాలి; 3. జాతి మతాల రీత్యా ఎవరెవరికి ఎన్నెన్ని స్థానాలు ఉండాలో నిర్ణయం జరగాలి.

పై విషయాలను గమనిస్తూ వాటికి అనుగుణంగా రాజ్య తంత్రం రచించడానికి కేంద్రీకరించబడిన నాయకుల శక్తులన్నీ ఫలోన్ముఖం కాకుండా ఉంటాయా? ఈ ఉప సంఘంవారు తయారుచేసిన ఆ మోతీలాల్ నెహ్రూ రిపోర్టు అన్నది అన్ని కమిటీలవారూ దాని మంచిచెడ్డలు విచారించి అంగీకరించాలనే నిబంధనే గనుక లేకుండా ఉంటే చాలా దివ్యంగా ఉండేది.

ఈ రోజులలో శ్రీనివాసయ్యంగారు యూరపులో పర్యటిస్తున్నారు. ఆయన దేశ పర్యటన ఒక దుర్ముహూర్తాన ఆరంభించారనవలసి ఉంటుంది. ఆ ఫిబ్రవరి, మార్చి రోజులలోనే సైమన్ కమిషన్ వారు బహిష్కరణ భాగ్యాలనందుకుంటూ దేశంలో పర్యటిస్తున్నారు. అదే సమయంలోనే మేము నూతన రాజ్యాంగ పథకాన్ని రచించాలని పూనుకున్నాము.

అలా తయారయిన ఆ పథకం, హిందూ మహమ్మదీయు లుభయుల చేతనూ ఆమోదించబడిన కారణంగా, ఆంగ్లేయులచేత తిరస్కరించబడడానికి అవకాశం లేనిదిగా రూపొందించబడింది. ఇది మా ఆశయం అంటూ మదరాసు కాంగ్రెస్ బహిరంగ సమావేశం (1927

డిసెంబరు) లో ఆమోదించబడిన ''స్వాతంత్ర్య'' తీర్మానం మాట ఎత్తుకోకుండా, ఆంగ్లేయులను ఒప్పించగలమనే ఆశతో ఒక నూతన పథకాన్ని మితవాద రాజకీయ పద్ధతిగా రూపొందించారు.

## చేవ చెడిన కలకత్తా తీర్మానం

మదరాసు కాంగ్రెస్, భారతీయుల పేరుమీద-భారతదేశ ప్రజల కోసం ఆ 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని అంగీకరించి ఉంది. న్యాయానికి మన నాయకులు ఆ తీర్మానానికి భిన్నంగా, దాని శక్తిని సన్నగిల్ల చేస్తూ, దానిని కొంతవరకూ నిర్వీర్యంచేస్తూ, 1928 డిసెంబరులో కలకత్తా కాంగ్రెస్‌లో చేసిన మార్పే చాలా నికృష్టమయింది.

ఇటువంటి క్లిష్ట సమయంలో నాయకుల మనః ప్రవృత్తిని అర్థంచేసుకోవడం కష్టమే. ఇదివరలోనే చెప్పానుగా, ఆంగ్లేయులకు వియ్యానికీ కయ్యానికీ కూడా ఒకే ఫాయ వారు కావాలనీ, వారికి బల హీనులయిన మనుష్యులను చూస్తే చికాకనీను?

చెన్నపట్నపు 'స్వాతంత్ర్య' తీర్మానాన్నే కలకత్తాలో మన నాయకులు బలబరిచి ఉండిఉంటే, సైమన్ కమిషన్‌వారు వారి రిపోర్టులో విధిగా 'ప్రొవిన్షియల్ ఆటోనమీ'ని గురించీ, కేంద్రంలో కూడా ఇంకా ఎక్కువ బాధ్యతాయుతంగా పరిపాలనా యంత్రాన్ని నడిపించే విధానాన్ని గురించీ తప్పక ప్రస్తావించి, దేశీయుల కోర్కెను మన్నించే వారు. ఎప్పుడయితే మనలో స్థిరత్వం లేకపోయిందో, అప్పుడే వారు, ప్రపంచ చరిత్రకే విరుద్ధంగా, సంకరపు సంధి సూత్రాలతో దేశాన్ని అల్లా నగుబాటు పాలుచేశారు. వారు ఎప్పుడయితే మన నాయకుల బల హీనతను గ్రహించారో, అప్పుడే బిర్రబిగుసుకుపోయి, 1928 లో కలకత్తాలో కాంగ్రెసువారు సూచించిన ఆ మధ్యే మార్గపు సూచనను నలిపి పారేశారు.

ఈ బలహీనతే మోతీలాల్ నెహ్రూగారి కాంగ్రెస్ అధ్యక్షోపన్యాసంలో కూడ వ్యక్తం అయింది. ఆ ఉపన్యాసంలో ''మా పరమావధి స్వాతంత్ర్యమే కాని, దాని రూప రేఖలు కాలాను గుణంగానూ, పరి

స్థితులనుబట్టీ మారవచ్చు''నన్నారు. అంతేకాదు- అఖిల పక్ష సమావేశం వారి ప్రతిపాదనలను వ్యక్తంచేస్తూ, ''ఇవి మా కోరికలు. ప్రభుత్వం వారు మా కోరికలను మన్నించి, దేశానికి రాజ్యాంగరీత్యా యివ్వగలిగి నంత సహకారమూ ఇవ్వా''లని కోరారు.

## జిన్నా కప్పదాటు

ఇది కేవలం 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని పూర్తిగా తిరగ దోడు కుని క్షమార్పణ చెప్పుకున్నట్లే అయింది. అప్పట్లో ఆయనకున్న వ్యాకుల చిత్తంతో, అంతకంటే ఎక్కువగా దేశానికి ఆయన యేమీ కోరలేకపోయాడు. ఆఖరి ఘట్టాలలో తీసుకురాబడిన అభ్యంతరాలతో అధ్యక్షుడుగా ఆయన తయారుచేసిన ఆ నెహ్రూ కమిటీ రిపోర్టు గాలికి కొట్టుకుపోయింది.

అప్పటివరకూ అన్యదేశాలలో పర్యటిస్తూన్న జిన్నా సాహెబు గారు ఆ సమయానికి పర్యటన పూర్తి చేసుకుని రావడాన్ని, ఆ నెహ్రూ కమిటీ ప్రతిపాదనలకు అడ్డుపడ్డాడు. కీ॥ శే॥ మహమ్మదాలీ గారు ఆ రిపోర్టులో ఎన్నో సవరణలూ, మార్పులూ, కూర్పులూ, చేర్పులూ చేశారు. కాని జిన్నాగారు మాత్రం సభలో అది నడవడానికి నిర్ణీత అవసరమైన సంఖ్యగా సభ్యులు సరిపడ్డంతమంది లేరంటూ దాటేశాడు.

ఆరంభంలో ఎంతో ధీమాగానూ, శక్తిమంతంగానూ పనిచేసిన ఆ అఖిల పక్ష సమావేశం క్రమేణ దిగజారిపోయి, భిన్నాభిప్రాయాలతో చీలికలయిపోయింది. ఆ ఆఖరు ఘడియలలో అచ్చట ఉన్న మాలో చాలా మందికి వారి వారి భావాలు, ఆ నెహ్రూ రిపోర్టును సొంతంగా 'సీట' ముంచుదామనే ఆతురతతో వున్నట్లు కనిపించాయి. ఒక్క సంవత్సరం పాటు ఆ రిపోర్టును ఇట్టి సందిగ్ధస్థితిలో ఉంచడానికి, మౌలానా మహమ్మదాలీ, జిన్నా, ఆగాఖాను కూడా బాధ్యులేనని అనక తప్పదు.

## కాంగ్రెసు పార్టీలకు తాకీదు

ఆ ఏడాదిలో మాకు కలిగిన అపజయాలకు ముఖ్య కారణం కేంద్రంలోనూ, రాష్ట్రాలలోనూ కాంగ్రెసువారిలో, తమ లోటుపాట్లు వల్ల ఏకీభావం సన్నగిల్లి పోవడం. కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలలో కూడా ఒకే మాట మీదా, ఒకే త్రాటిమీదా ఉందామన్న భావం సన్నగిల్లి పోయింది. అలా వారిలో వారికి భేదాభిప్రాయాలు ఉత్పన్నం అవడానికి కారణం నోఛేంజర్లుగానూ, ప్రోఛేంజర్లగానూ కాంగ్రెసు వారు రెండు పార్టీలుగా చీలిపోవడమే.

వారు నిజంగా కలిసేవుండి సహనభావంతో వ్యవహరించి ఉండి ఉంటే దేశంయొక్క శక్తి బాగా వృద్ధయి, పల్లె పల్లెలలోను కాంగ్రెసు వారి ప్రభావం పెరిగి, ఊరూరా వారికి ఉండే నిర్మాణాత్మక శక్తి వేళ్లు బారి చక్కగా నాటుకు పోయియుండేది. వారు కోరిన కోర్కెలు కాదవడాని కెవ్వరికీ తరంగాకుండా ఉండేది.

1928 అక్టోబరు మాసం నాటికి పండిత మోతీలాల్ నెహ్రూగారి అంతరంగిక స్థితి దిగజారి పోయింది. మనస్సులో మాట పైకి చెప్పక పోయినా, అంతరంగంలో మాత్రం ఆయన ఒక నిశ్చయానికి వచ్చాడు. కౌన్సిల్ కార్యక్రమాన్ని విస్మరించి గాంధీగారినే తిరిగి ఆశ్రయించాలని నిశ్చయించుకున్నాడు. అఖిల పక్ష సమావేశం వారి ప్రతిపాదన ప్రభుత్వంవారు ముందుగా పరిశీలించి, 1929 డిసెంబరు 31 లోపల అంగీకరింపకపోతే, శాసన ధిక్కారం అమలు జరుపుతామని విశదీకరించాము.

కౌన్సిల్ ప్రోగాం విస్మరించడానికి ప్రాతిపదికగా, మదరాసు కాంగ్రెస్ వా రామోదించిన బహిష్కరణ తీర్మానాన్ని సరిగా అమలు పరచనందుకు మీపై ఎందుకు చర్య తీసుకోకూడదని వివిధ రాష్ట్రాల కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీలవారి నడిగాము. 1928 లో ఢిల్లీలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు సంఘ సభలో ఈ ప్రసక్తి తీసుకు రాబడింది. అంటే- కలకత్తా కాంగ్రెస్ ఇంకా రెండు మాసాలకు జరుగుతుందనగా ఈ ప్రశ్న వచ్చిందన్నమాట!

## కలకత్తాలో కార్మిక ప్రదర్శనం

1928 లో కలకత్తాలో కాంగ్రెస్ జరుగుతూండగా కార్మికులచే బ్రహ్మాండమయిన ప్రదర్శనం జరిగింది. ఆ ప్రదర్శనం కలకత్తా నగరంలోనూ, కాంగ్రెస్ పెండాల్‌లోనూ కూడా జరిగింది. సుభాస్‌చంద్ర బోసూ, జవహర్‌లాల్ నెహ్రూగారలు ముందు నడువగా, కార్మిక వర్గ నాయకులూ, కార్మికులూ, కలకత్తా పురవీధులగుండా ఊరేగుతూ కాంగ్రెస్ పెండాల్‌కు చేరుకున్నారు. ఆ బ్రహ్మాండమైన ఊరేగింపు మనస్సును కదిలించి, కరిగించేదిగా ఉంది. నేను కొంచెం జోరుగా నడిచి ముందుకు చొచ్చుకుని వెళ్ళేసరికి- జవహర్‌లాల్‌నెహ్రూ ఒక బస్సు ఇంజన్‌మీదా, సుభాస్‌బోసు ఇంకో బస్సు ఇంజన్‌మీదా కాళ్ళు ఇటూ అటూ వేసుకుని గుర్రాలమీద స్వారీ చేస్తున్న పద్ధతిగా ఆసీనులయి ఉన్నారు. ఆ ప్రకారంగా ఆసీనులయ్యే వారు ఊరేగారు. అల్లా వారు ఊరేగడాన్ని, ఆ ఊరేగింపుకే ఒక వికాసమూ, ఘనతా ఏర్పడ్డాయి.

కాంగ్రెస్ పెండాల్ నుంచి ప్రతినిధులనూ, ప్రేక్షకులనూ కూడా బయటకు పంపించవలసివచ్చింది. ఆ కార్మికులు సుమారు రెండు ఘంటలసేపు ఆ ప్రదేశాన్ని ఆక్రమించుకొని ఉండి, వారికున్న కష్టాలు సుదీర్ఘంగా విన్నవించుకున్నారు. కాంగ్రెసు నాయకులు వారిని శాంత పరచడానికి ప్రయత్నిస్తూ ఇచ్చిన ఉపన్యాసాలలో-కాంగ్రెసు వారిసహకారం వారి కెప్పుడూ ఉంటుందని వాగ్దానం చేశారు. భారతదేశంలో అప్పటికప్పుడే కార్మికోద్యమం బ్రహ్మాండంగా ప్రాంతీయ, కేంద్ర రాష్ట్రీయ స్థాయిలలో ఎన్నుకోబడ్డ నాయకుల మార్గదర్శకత్వంతోచాలా ముమ్మరంగానే సాగుతోంది. కాంగ్రెసువారే గనుక 1921 నుంచీ గాని, అధమం 1930 నుంచీగాని ఈ కార్మికుల సంఘాలనీ, వారి కష్ట సుఖాలనూ గమనిస్తూ, వారితో పొత్తు కలిగి ఉండి ఉంటే, బహుశః మనకి రాజకీయ స్వాతంత్ర్యం ఎప్పుడో చులాగ్గానే వచ్చేసి ఉండేది.

## కార్మిక సంఘాల చరిత్ర

పోయిన యుద్ధంలో కార్మిక నాయకుల సహకారంతో కార్మిక సంఘాలద్వారా ప్రభుత్వంవారు ఎల్లా లాభం పొందిందీ మనకి విశదమే. ఈ నాటి కార్మిక సంఘాలు కాంగ్రెసుతో సమైక్యమయాయనీ, కార్మిక మంత్రిగా వి. వి. గిరిగారు ఈ కార్మిక విషయాలలో మాకు 'నిధి'గా ఉంటూ, 1937 లోని కాంగ్రెసు మంత్రివర్గంలోనూ, దర్మిలా స్వాతంత్ర్యం వచ్చిన 1947 తర్వాతా ఆయన అఖండమయిన సేవ చేశాడని ఇప్పట్టున చెప్పడం న్యాయం.

1928-30 సంవత్సరాలలో కార్మిక సంఘాలే గనుక మా కాంగ్రెసులో చేరి ఉంటే, మా విజయం ఎంతో ఘనంగానూ, ఇంకా ఎక్కువ సమగ్రంగానూ ఉండి ఉండేది. పరిపాలకులకు భారత దేశంలోని కార్మిక సంఘాలు పెట్టని కోటలై, వారి చిత్తానికి లోబడి, వారనేక విధాల లాభాలు పొందడానికి వీలుగా సహకరిస్తూ వచ్చాయి. భారత జాతీయ కాంగ్రెసువారు కార్మిక సంఘాలకి నిన్న మొన్నటి వరకూ ఎటువంటి సహకారమూ ఇవ్వలేకపోయారు.

1935 లో రాజ్యాంగ విధానంలో వచ్చిన మార్పులకు పూర్వం, ఈ కార్మిక విషయాలన్నీ కేంద్ర ప్రభుత్వ ఆధిపత్యం క్రిందనే ఉండేవి. 1935 కు పూర్వం రాష్ట్రాలలోని కార్మిక సంఘాలద్వారా ఏదో సహాయానికి అవకాశం ఉండేదట. కాని ఈ 1935 దాకా ఏ రాష్ట్రంలోనూకూడా, ఏ విధమయిన సహకారమూ కార్మికులకు ఇవ్వలేకపోయాము. కేంద్రంలో ఉన్నటువంటి నిరంకుశ ప్రభుత్వ విధానం మూలంగా కార్మికులకి ఏ విధంగానూ అవసరమయిన సహాయం చేయలేకపోయాం. కార్మిక నాయకు లెంతటి దిట్టలయినా, ప్రభుత్వ విధానం కారణంగా, ఏ విధంగానూ ముందడుగు వేయలేక పోయారు. మేము ఈ విషయంలో తీసుకువచ్చిన ప్రతిపాదనలూ, నడపిన చర్చలూ వృథాయే అయిపోయేవి.

దేశంలో ఉన్న కార్మికుల విషయమే ఇలా ఉంటూంటే, సముద్రాలకు అవతల ఆయా ఖండాలలో నివశిస్తూ అనేక బాధలకు

లోనవుతూన్న భారతీయకార్మికుల విషయంలో అసలే యేమీచేయలేక పోయాం. పశ్చిమ దేశవాసుల పద్ధతులమీద ఏర్పడిన కార్మిక సంఘాల ద్వారా ఏమయినా సహాయం చేయగలమేమోనని తలిస్తే, ఆ సంఘాల ఆశయాలలో, మన దేశీయులకూ- వారి పరిస్థితులకూ అవసరమైన మార్గాలలో, వారి అవసరాలను తీర్చే విధానంగా ఏ సేవా చెయ్యడానికి సావకాశం ఉండేదికాదు.

## వ్యవసాయ శ్రామికుల స్థితిగతులు

మాటవరసకి చూడండి- మనకి ఉన్న కార్మిక సంఘాలు వ్యవసాయ శ్రామికుల విషయంలో ఏమీ చెయ్యలేవు: మరి మన దేశంలో ఉన్న కష్టజీవులలో నూటికి 90 పాళ్ళు వ్యవసాయ శ్రామికులే కదా? ఈ వ్యవసాయ శ్రామికుడుకి చెప్పుకోతగ్గ సంఘాలు, అవసరాల విషయమై విన్నపాలూ, వేడికోళ్లూ లేని కారణంగా, కాంగ్రెసు పరిపాలనలోనే ఉన్న లేబర్ కమిషనర్‌గాని, కార్మిక మంత్రిగాని ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయారు.

అయినప్పటికీ, ఇప్పటివరకూ, ఈ శ్రమజీవుల కష్టసుఖాల విషయమై ఏ విధమయిన విచారణా జరుగలేదు. వ్యవసాయ శ్రామికుల కిచ్చే కూలీ ఎంత? అసలు వ్యవసాయపు ఖర్చులు ఏ విధంగా ఉంటాయి? ఆ ఖర్చులో శ్రామికుల కిచ్చేది ఎంత? ఇల్లాంటి ప్రశ్నలు పుట్టినా, వాటికి సరి అయిన సమాధానాలు చెప్పడానికి అంకెలు ఎవరి వద్దా లేవు.

మేము రాజ్యాంగం చేపట్టిన తరుణంలో నేను మద్రాసు రాష్ట్రంలో రెవిన్యూ మంత్రిగా వ్యవహరిస్తూన్న రోజులలో ఈ వ్యవసాయ శ్రామికుల విషయం గమనించడానికి వీలు చిక్కింది. ప్రభుత్వ ప్రాంతాలలోనూ, జమీందారీ ప్రాంతాలలోనూ భూమిపై యజమానికి ఉన్న హక్కు- భుక్తాలూ: యజమానులకూ, రైతులకూ, శ్రామికులకూ మధ్య ఉన్న ఒడంబడికలూ వగైరాలన్నీ విచారించవలసిన అవసరమూ కలిగింది. నిజంగా దేశంలో పూర్తి స్వాతంత్ర్యాన్ని నెలకొల్పి, దానిని సరిగా నిలబెట్టుకోవడానికి అన్నిరకాల కష్టజీవుల సహకారమూ

లభించకుండా సాధ్యం కాదుగదా? ఇప్పట్టున నేను ఒక పత్రికా సంపాదకునిగానూ, కేంద్ర శాసన సభా సభ్యునిగానూ, భారత కష్టజీవికి సహాయపడడానికి చేసిన ప్రయత్నాన్ని గురించి చెప్పడం న్యాయం.

## కేంద్ర సభలో కష్టజీవుల ప్రసక్తి

కేంద్ర శాసన సభా సభ్యుణ్ణిగా 1927-28 లోనూ, 1930 లోనూ నేను భారత కష్టజీవుల పరిస్థితులను గురించీ, ఇతర దేశాలలో ఉండే కష్టజీవుల పరిస్థితిగురించీ, కష్టజీవుల సంఘాల నాయకులద్వారా సేకరించగలిగాను. ఈ సమాచారం అసెంబ్లీలో కార్మిక వ్యవహారాలను గురించి ప్రశ్నించి సమాధానాలు సంపాదించడానికి ఉపయోగపడింది. నేను ఈ వ్యవహారాలు ఆమూలాగ్రంగా గ్రహించడానికి ప్రత్యేక శ్రద్ధ వహించాను.

ఆఫ్రికా ఖండాన్ని ఆ దేశవాసుల సుఖ సౌఖ్యాలకోసం సరిగా రూపొందించడానికి మన కష్టజీవులను గవర్నర్ జనరల్ ఆఫ్రికా పంపించడానికి చేసిన తొలి ప్రయత్నాల దగ్గరనుంచీ ఆ కష్టజీవుల పరిస్థితి ఎల్లా ఉండేదో సమగ్రంగా గ్రహించగలిగాను. వారు కష్టపడి చెమటోడ్చి, నివాస యోగ్యంగానూ, సకల ఫల సంపన్నంగానూ రూపొందించిన ఆ ప్రాంతాలలో వారికి ఈ నాటికీ పౌరహక్కులయినా లేవు.

నేను ఈ రాష్ట్రంలోని మలబారు, కోయంబత్తూరు, నీలగిరి తాలూకాలలోనూ, అస్సాంలోనూ కూడా మన కష్టజీవుల సహకారంతో కాఫీ, టీ, రబ్బరు వగైరా తోటలు పెంచి, వాటి ఫలసాయాన్ని అనుభవిస్తూన్న ఆంగ్లేయుల హయాంలో ఆ కష్టజీవుల పరిస్థితి ఎల్లా వుందో గ్రహించాలనే ఉద్దేశంతో ఆయా ప్రాంతాలు పర్యటించాను.

దేశదేశాలలో కార్మికుల పరిస్థితులు ఎల్లా ఉన్నాయో స్వయంగా గ్రహించాలనే ఉద్దేశంతో నేను బర్మా, సిలోన్, మలయా, సయాం, ఇండో చైనా మొదలైన దేశాలన్నీ పర్యటించి, ఆ ప్రాంతాలలో ఉన్న ప్లాంటేషను లన్నింటినీ పూర్తిగా పరిశీలించాను. ఆయా ప్రాంతాలలో

సంపాదించిన స్వానుభవంతో కేంద్ర శాసన సభలో కష్టజీవుల కుప యుక్తమైన నిబంధనావళిని ఏర్పరచాలన్నదే నా తహ తహ.

1929 లో మొదటి అర్ధ సంవత్సరంలోనూ, కేంద్ర శాసన సభా కార్యక్రమం సాంతం కాగానే, మలయా రాష్ట్రాలు, సయాం, ఇండో చైనా పర్యటించాను. ఏడు మాసాలపాటు సమగ్రమయిన పర్యటనే చేశాను. ఈ పర్యటనల అనుభవాలను గురించి ముందు ముందు సమగ్రంగా చెప్పుతాను. ఇప్పుడు 1928-29 సంవత్సరాలలో జరిగిన ఇతర ముఖ్య సంఘటనలను గురించి చెపుతాను.

# 6

## బ్రిటిష్ వారికి పెట్టిన గడువు

మహాత్మా గాంధీగారి సహకారంతో మోతీలాల్ నెహ్రూగారు కలకత్తా కాంగ్రెస్ అధ్యక్షుడుగా మదరాసు కాంగ్రెస్‌లో ఆమోదింపబడిన 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని బుట్ట దాఖలు చేయడానికి చేసిన ప్రయత్నంపట్ల జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్‌చంద్రబోస్, శ్రీనివాసయ్యంగారు ప్రభృతులకు ప్రతికూల భావం ఉంది.

మదరాసు కాంగ్రెస్ ఆమోదించిన ఆ 'స్వాతంత్ర్య' తీర్మానాన్నే ఆశయంగా పెట్టుకుని, కలకత్తా కాంగ్రెస్ విషయ నిర్ధారణ సంఘంలో, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాస్‌చంద్రబోసూ కూడా, గాంధీగారి సహకారంతో పండిత మోతీలాల్‌నెహ్రూ ప్రతిపాదించిన 'తగు మాత్రపు' కోర్కెలకే తమ ఆమోదాన్ని వెలిబుచ్చారు. కాని బాగా ఆలోచించిన మీదట వారికి 'స్వాతంత్ర్య' తీర్మానం బలహీనమయి పోతోందేమోననే అనుమానం కలిగి, మోతీలాల్‌నెహ్రూగారి ప్రతిపాదనకు ఒక సవరణ సూచించారు.

### సుభాస్ - జవహర్ల సవరణ

ముమ్మొందుగా కలకత్తా కాంగ్రెస్ మదరాసు కాంగ్రెస్ ఆమోదించిన 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని బలపరుస్తూ, పూర్తిగా బ్రిటిషువారు

భారతదేశం నుంచి వైతొలగితేగాని భారత దేశానికి సిసలయిన స్వాతంత్ర్యం లభించదనీ; 2. (మోతీలాల్) నెహ్రూ కమిటీవారి ప్రతిపాదనలు ఆంగ్లేయ ప్రభుత్వం వారికి అంగీకార యోగ్యం అయ్యే ఎడల ఆ ప్రతిపాదనలను మా అవసరాలుగా భావించి అంగీకరించి తీరాలనీ; 3. నెహ్రూ కమిటీవారి సూచనలు కాంగ్రెసు వారికి మాత్రమే నచ్చినవిగా ఉండి, మదరాసు కాంగ్రెస్ అసలు కోరికకి విరుద్ధంగా ఉన్న కారణాన్ని, ఆ సూచనలు అంగీకరించడమన్నది ఆంగ్లేయుల హృదయ పరివర్తనకు మొట్టమొదటి మెట్టుగానే భావించబడుతుందనీ ఆ సవరణలో సూచించబడింది.

సరిగా యోచిస్తే ఈ సవరణ తీర్మానానికీ, 'స్వాతంత్ర్యమే మా ఆశయం' అంటూ విషయ నిర్ధారణ సంఘం ప్రతిపాదించిన రాజీ తీర్మానానికీ, మొదటి మెట్టుగా ప్రతిపాదించిన అఖిల పక్ష సమావేశం వారి యోచనకీ తేడా ఉన్నట్లు లేదు. కాని జవహర్‌లాలూ, సుభాస్‌బోసూ తమ సవరణ అసలు దానికి భిన్నమని నమ్మడాన్ని ఆ తీర్మానం ప్రతిపాదించినట్లు కనబడుతుంది. అసలు ఆ రాజీ తీర్మానం వీరి జోక్యం లేకుండా ప్రతిపాదించడం జరిగింది. అందువల్ల వీరికి అనుమానం కలిగి, దానినే తమ భాషలో సవరణ తీర్మాన రూపేణా తిరిగి ప్రతిపాదించారనుకోవలసి ఉంటుంది.

ఏదయితేనేం, నేను లోగడ మనవి చేసినట్లు, ఆ 'స్వాతంత్ర్య' తీర్మానాన్నే కలకత్తాలో బలపరచి ఆంగ్లేయులకు అందజేసి ఉంటే, కాంగ్రెసుకున్న బలమూ, పట్టుదలా సైమన్ కమీషన్ వారికి పూర్తిగా గ్రాహ్యం అయి, వారి సలహా ఇతోధికంగా ఉపకారిగా ఉండేది. మన నాయకులలో ఉండే బలహీనత కారణంగానే, సైమన్ కమిషన్ వారు, ఏ విధమయిన పూచీగాని, బాధ్యతగాని లేని విధంగా, 'ప్రొవిన్షియల్ ఆటోనమీ' అనే దుష్టగ్రహ కూటంలోకి లాక్కు వెళ్ళగల విరుద్ధ భావాలతో కూడుకున్న ఒక ఫెడరేషన్ని (పరస్పర సహాయక రాజకీయ సంఘాన్ని) మన నెత్తిని రుద్దడానికి తయారయ్యేవారు.

మన నాయకులు 1928-29 లో చేసిన పొరపాట్లకీ, 1917-18లో మాంటేగ్ - ఛల్మ్స్‌ఫర్డు కమిషన్‌వారు వచ్చే ముందు చేసిన పొర పాట్లకీ తేడాలేదు. ఆనాటి పొరపాట్లే ఈనాడూ జరిగాయి. ఎటొచ్చీ ఒక్కటే తేడా-మాంటేగ్ కమిషన్ని ఆహ్వానించి వందనా లర్పించాం; సైమన్ కమిషన్ని బహిష్కరించి, గో బాక్, అన్నాం. ఆ మాంటేగ్ కూడా అంతే చేశా డనుకోండి. కాంగ్రెసు ఆశయాలకూ, కోర్కె లకూ భిన్నంగా ఏదో వాగి, ఏదో వ్రాసిపోయాడు. ఆ స్టేట్‌మెంట్లకు తన డయిరీలో భాష్యాలు వ్రాసుకుని, తమ రిపోర్ట్‌లో అల్లా వ్రాయ డానికి కారణాలుగా ఆ భాష్యాలను ధర్మిలా ప్రకటించాడు.

## శాసన ధిక్కారానికి ఉద్యుక్తత

1928 లో కాంగ్రెసువారి కోరిక బలీయంగా ఉన్నప్పుడు మోతీ లాల్ నెహ్రూ తన అధ్యక్షోపన్యాసంలో ప్రభుత్వంవారు దయదలచి యేమిచ్చినా సరేనని; రౌండు టేబిల్ కాన్ఫరెన్స్‌కు పిలుపువచ్చే రోజు లలో, ఆ సమావేశంలో ఏం జరిగినా, బ్రిటీషువారు తాము భారత దేశానికి ఇవ్వాలని అనుకుంటూన్న దేమిటో ఆ క్షణంలోనే విశదపరచ వలసిందనీ కోరారు. ఏదయితేనేం, కలకత్తా తీర్మానం కాంగ్రెసువారి ప్రతిభనూ, ప్రతిష్ఠనూ అధికం చెయ్యలేకపోయింది.

కాని కలకత్తా కాంగ్రెస్‌లో తేలినదల్లా ఒక్కటే: మోతీలాల్ నెహ్రూగారికి, తాము 1921-22 నుంచీ సి. ఆర్. దాస్‌గారితోపాటు ఎన్నో ఆశలు పెట్టుకున్న పార్లమెంటరీ విధానంపట్ల విముఖత కలి గిందన్నది—

కాంగ్రెసువారు, శాసన సభల నుంచి బయటికి వచ్చి శాసన ధిక్కారం ఆరంభించే ముందు బ్రిటన్‌కి ఒక్క యేడాది గడువివ్వాలనీ, ఆ గడువులోపల ఇండియాకి స్వాతంత్ర్యం ఇవ్వడానికి ఆంగ్లేయుల కంగీకారం కాకపోతే, ఆ గడువు దాటగానే శాసన ధిక్కార కార్య క్రమం అమలు పరచాలనీ నిర్ణయించుకున్నారు.

## బ్రిటన్‌కిచ్చిన అల్టిమేటం

బ్రిటీషువారికి ఆఖరి సంధి షరతుగా ఇచ్చిన ఈ అల్టిమేటం తీర్మాన రూపం దాల్చేముందు గాంధీగారికీ, సుభాస్‌చంద్రబోస్, శ్రీనివాసయ్యంగార్లకీ మధ్య ఒక ఆశాజనకమైన, ముచ్చట గొలిపే వాదన జరిగింది. గవర్నమెంట్‌వారు భారత దేశానికి రాజ్యవిధానంలో ఏవో మార్పులు చూపిస్తామని అంటున్నారు గనుక, వారికి 24 మాసాల గడువు ఇవ్వాలని గాంధీగారు సూచించారు. ఆ వాయిదా అతి దీర్ఘం అయిపోతుందని బోస్, శ్రీనివాసయ్యంగార్లు అన్నారు. అప్పుడు గాంధీగారు ఏడాది గడువుకు ఒప్పుకున్నారు.

ఒప్పుకుంటూ ఒప్పుకుంటూ, "మీరు యీ ఏడాది నాటికి దేశాన్ని శాసన ధిక్కారాదులకు తయారు చేయవలసిన బాధ్యత వహించవలసి ఉంటుం" దన్నారు. గాంధీగారు ఏడాది నాటికి దేశాన్ని సిద్ధం చెయ్యవలసి ఉంటుందన్న మాటలలోని అంతరార్థం శ్రీనివాసయ్యంగారికి గ్రాహ్యం అయినట్లు లేదు.

కలకత్తాలో అంగీకరించబడిన కాంగ్రెస్ తీర్మాన ప్రకారంగా తెలియవచ్చే దేమిటంటే, కాంగ్రెసువారు కోరిన ఆ కనీసపు కోరిక నయినా 1929 డిసెంబరు 31 వ తేదీ అర్ధరాత్రికి ఆంగ్లేయులు అంగీకరించకపోయినట్లయితే దేశాన్ని శాసన ధిక్కారం చేయవలసిందని కోరవలసి ఉంటుందనీ, శాసనోల్లంఘనం అంటే పన్నుల నిరాకరణ సాగిస్తామనీ, ప్రభుత్వం వారినుంచి యే విధమయిన సహకారమూ కోరకుండా (తమ్ము తామే కాపాడుకుంటూ, ప్రత్యామ్నాయ ప్రభుత్వం నడపబడడం వరకూ) తమ్ము తామే చూచుకుంటామనీ ఆ తీర్మానంలో సూచించబడింది.

## గాంధీగారికి తిరిగి కాంగ్రెసు అప్పగింత

దీన్తో కాంగ్రెసులోని రెండు విభాగాలవారూ ఐక్యమయి ప్రత్యక్ష చర్యలకు పూనుకుంటారని తేలింది. అంతేకాదు- 1924 లో బెల్గాంలో దాస్ - మోతీలాల్‌గార్ల పరమయిన కాంగ్రెసు నేడు తిరిగి

గాంధీగారి చేతులలో ఉంచబడిందన్నమాట! మోతీలాల్ నెహ్రూగారు సత్యాగ్రహ సమర మూలసూత్రంతో వెంటనేగాని, సులభంగా గాని, మనస్ఫూర్తిగా గాని సమాధాన పడలేక పోయారు. అందువల్లనే, నిర్వీర్యమయిన జాతిని ఉత్తేజపరచి, దానికి కావలసిన అవసరాలను సరిగా గుర్తించి, ప్రత్యక్ష చర్యకు దిగందే దేశానికి ముక్తిలేదని గ్రహించడానికి ఆయనకి సుదీర్ఘమయిన అయిదు సంవత్సరాలు పట్టింది. ఈ అయిదేండ్లలో పార్లమెంటరీ విధానంతోనూ, రాజీ ప్రతిపాదనల తోనూ, కాళ్ళ బేరాలతోనూ జయాన్ని సాధించాలని తంటాలు పడ్డాడు, పాపం! రాజీ ప్రతిపాదనలకి కూడా వెనుక అనుమతి రూపేణా దమ్ము ఉండాలన్న విషయం ఆయన గ్రహించలేదో, మరచిపోయారో మరి!

## 1929 లో దేశ పరిస్థితి

ఉడుకురక్తపు యువలోకానికి ప్రాతినిధ్యం వహించే జవహర్ లాల్ నెహ్రూ, సుభాస్ చంద్రబోసులకు కలకత్తా కాంగ్రెస్‌లో స్వాతంత్ర్య తీర్మానం ఉద్రిక్తత తగ్గి నీరసపడడం ఎంత మాత్రమూ సహింపరాని దయింది. మోతీలాల్ గారికీ, గాంధీగారికీ ఈ యువక నాయకుల తీరులు రుచించలేదని లోగడ చెప్పివున్నాను.

కలకత్తా కాంగ్రెస్, సాంతం అయ్యేనాటికి, 1929లో లాహోర్ కాంగ్రెస్ అనగానే శాసన ధిక్కారాది ప్రత్యక్ష చర్యలకు సిద్ధమవ్వాలి అన్నమాట అట్టే పట్టించుకున్నట్లు లేదు. అందుకు సాక్ష్యం ఆగస్టు 1929 లో నడచిన శాసన సభా సంరంభాలే. నాయకుల హృదయాలలో అస్థిరత్వం అలాగే ఉంది. కాంగ్రెసు వర్కర్లూ, కాంగ్రెసు కమిటీలూ అసందిగ్ధంగానే పనిచెయ్యటం జరిగింది.

1921 లో శాసన ధిక్కారాన్ని చవిచూసినా, అది యేనాటిమాటో అయిపోయింది. అప్పుడు ఆరంభించబడిన నిర్మాణ కార్యక్రమం నీళ్లు గారిపోయి యేళ్లూ-పూళ్లూ అయిపోయింది. దేశం యావత్తూ ఆ సంవత్సరం అంతా అధైర్యంతో అణగారిపోయి ఉంది. కాంగ్రెసువారి

దృష్టిలో ఉన్న ఆ యుద్ధకాండ అప్పట్లో అవాంఛనీయమనీ, దానికి యుక్తకాలం రాలేదనీ కేంద్ర శాసన సభా కార్యక్రమ విమర్శకులు అన్నారంటే, వారు అల్లా అనడంలో పొరపాటు లేదనే అనవలసి ఉంటుంది.

కాని నిజానికి వారికిగాని, ప్రభుత్వానికి గాని ప్రజలు యుద్ధానికి ఏనాడో సిద్ధమయ్యేఉన్నారనీ, ఇన్నాళ్ళుబట్టి వారి ఉద్రేకాలు నొక్కి పెట్టబడి ఉన్నాయనీ తెలియదు. గాంధీగారికి మాత్రం దేశం ఎప్పుడూ తనకు దన్నుగా ఉంటూ, తనతోపాటు రంగంలో ఉరకడానికి సిద్ధంగానే ఉందని బాగా తెలుసు. ప్రజలు సిద్ధంగా లేకపోయినా, ఆయన మార్గదర్శిగా ఉంటే, జనం ఆయన వెనకే ఉంటారనీ ఆయన తిరుగులేని విశ్వాసంతో ఉన్నారు.

పరిస్థితుల యాథార్థ్యాన్ని గ్రహించి, ఆయన, కాంగ్రెసు నాయకులతో గాక, తన ఆశ్రమంలోని అనుచరులతో 1930 లో ఉప్పు సత్యాగ్రహానికి తలపడ్డారు. నాయకులచేత సరిగా ప్రబోధితులుగాని ప్రజలను ఎల్లా నడపాలో గాంధీగారికి బాగా తెలుసు.

అప్పట్లో నాయకులు తమకు కాంగ్రెసులో ఎటువంటి పలుకుబడి ఉందో, తమకు ఎంతెంత బలం ఉందో అని తమలో తాము తర్జనభర్జనలు పడుతున్నారన్నా, ఆ మాట అసత్యం కాదు. అందుచేతనే గాంధీగారికి తన కార్యక్రమం యావత్తూ ముందుగా విప్పిచెప్పడం మామూలు లేదు. ఆయన ఇప్పుడూ అంతే చేశాడు.

## దండీ యాత్ర

ఆయన ఉప్పుచట్టాన్ని తునాతునకలు చెయ్యాలని అంటే, ఆ మాట కాంగ్రెసు నాయకులకూ, కాంగ్రెసు సేవకులకూ దిగ్భ్రమ కలిగించింది. మామూలు జనానికి అంతూ పొంతూ చిక్కలేదు. ఉప్పేమిటి - చట్టాలేమిటి - వాటిని ఉల్లంఘించడమేమిటి అనుకున్నారు. మామూలు జనానికి ఏం అర్థమవుతుంది గనక! అసలు, ఆ చట్టాన్ని ఛిన్నాభిన్నం చెయ్యడం అంటే ఏమిటి? అది ఎలా సాధ్యం అవుతుందో అర్థమే కాలేదు.

ఈ విషయాలన్నీ ప్రజలు గ్రహించడానికి వీలుగా ఆయన సబర్మతి నుంచి కాలినడకని, 'దండీ' చేరడానికి ఇరవయ్యొక్క రోజుల కార్యక్రమం వేశాడు. రోజు తర్వాత రోజు ఆయన తన ఆశ్రమవాసులైన స్త్రీ పురుషులతో కలిసి యాత్ర సాగిస్తూ, దారిలో అక్కడక్కడ ఇస్తూ వచ్చిన చిన్న చిన్న ఉపన్యాసాలు దేశానికి నిద్రమత్తు వదలగొట్టాయి. ఉప్పును ఏరుకోడానికి దండీకి ఆశ్రమవాసులతో దండయాత్రగా గాంధీగారు వెళ్ళడం అన్నది చరిత్రాత్మకమై, దేశీయులకందరికీ ప్రత్యక్షపాఠం అయింది.

ఈ పరిస్థితులే నాకు ఉత్సాహాన్నిచ్చి కేంద్ర శాసనసభలో నాచేత జోస్యం చెప్పించి, జయం తథ్య మని పలికించాయి. దారి ఎప్పుడయితే చూపబడిందో, మూలసూత్రం చెడకుండా నూతన మార్గాన్వేషణలు చేయగలిగిన మన నాయకులు కొద్ది రోజులలోనే రకరకాల కార్యక్రమాలు నిర్ణయించుకో గలిగారు. ప్రభుత్వంవారు ఆయన్ని నిర్బంధిస్తే చేయవలసిందేమిటో కూడా స్పష్టం చేయడంచేత కాంగ్రెసు కమిటీలూ, ప్రజాసమూహాలూ కలిసి, ప్రపంచం కనీ వినీ ఎరుగని రీతిగా, ఒక బ్రహ్మాండమయిన 'శాంతి' యుద్ధంలో ఊహించడానికి సాధ్యంకానంత ఘనంగా విజయాన్ని సాధించడం జరిగింది.

దక్షిణ హిందూ దేశంలో ఈ ఉప్పు సత్యాగ్రహం నడచిన తీరును గురించి చెప్పేలోపల, 1929 నాటి లాహోరు కాంగ్రెసు చరిత్ర, అచ్చట ఎగరవేసిన స్వతంత్ర పతాకాలను గురించీ టూకీగా చెపుతాను.

## లాహోరు కాంగ్రెస్ అధ్యక్షత

1921 నుంచి జరిగిన ప్రతి కాంగ్రెస్సూ ఏదోవకరకంగా ఉత్సాహోద్రేకాలను కలిగించి చరిత్రాత్మకమే అయింది. ప్రతీకాంగ్రెస్‌కూ తండోపతండాలుగా జనం రావడమూ, ఉత్సాహపూరిత హృదయాలతో దానికి జీవం పొయ్యడమూ మామూలయింది. కాని ప్రత్యక్ష చర్యలతో విజయాన్ని సాధించడానికీ, విజయవంతంగా కాంగ్రెస్‌ను నడపడానికీ చాలా తేడా ఉంది. అధ్యక్షుణ్ణి ఎన్నుకోవడం అన్నది ఒక పెద్ద ప్రాథమిక సమస్య. కలకత్తా కాంగ్రెస్‌లో మహాత్మా గాంధీగారి దర్శకత్వాన

ప్రభుత్వాన్ని సవాలు చేయడం జరిగాక, రాబోవు కాంగ్రెస్ కెవర్ని అధ్యక్షుడుగా ఎన్నుకోవాలి అన్న సమస్య ఉత్పన్నం అయింది.

ఆరేడు మాసాలపాటు మలయా, సయాం, ఇండోచైనా దేశాల లోని కష్టజీవుల స్థితిగతులెల్లా ఉన్నాయో స్వయంగా తెలుసుకోవాలని ఆ ప్రాంతాలన్నీ కలయ తిరిగి, నేను భార్యా సమేతంగా చరిత్రాత్మకమూ, చిరస్మరణీయమూ అయిన ఆ లాహోరు కాంగ్రెస్‌కు అందుకోగలిగాను. ఆ మూడు దేశాలలోనూ జరిపిన పర్యటన విశేషాలు "స్వరాజ్య పేపరు" అన్న శీర్షిక క్రింద విడిగా వివరిస్తాను.

## గాంధీగారి నిర్ణయం

ఓటింగ్ సమయంలో అందరి కళ్లూ గాంధీగారిమీదే ఉన్నాయి. గాంధీగారికి అత్యధికంగా ఓట్లు వచ్చాయి. ఆయనకి వచ్చిన ఓట్లు పది; విఠల్‌భాయ్ పటేల్‌కి అయిదూ, జవహర్‌లాల్‌కి రెండో మూడో ఓట్లు వచ్చాయి. అయితేనేం, గాంధీగారు తగ్గిపోయారు. విఠల్‌భాయ్ తప్పుకున్నాడు. దాన్తో యువకుడయిన జవహర్‌లాల్ నెహ్రూ లాహోరు కాంగ్రెస్ అధ్యక్ష స్థానాన్ని అలంకరించవలసి వచ్చింది.

అదే గాంధీగారి విచిత్ర పద్ధతి. మదరాసు కాంగ్రెస్‌లో జవహర్‌లాల్ 'స్వాతంత్ర్య' తీర్మానాన్ని ప్రతిపాదిస్తే, "ఏదో స్కూలు పిల్లల తమాషా" అన్నాడు గాంధీ. కలకత్తాలో మోతీలాల్ నెహ్రూగారితో కలిసి, ఆ స్వాతంత్ర్య తీర్మానాన్ని వెనక్కి నెట్టి, అన్ని పార్టీలవారికీ అంగీకార యోగ్యమయిన విధంగా ఆ తీర్మానాన్ని మితవాదంలోకి దింపి, బాగా తేలికపరచి ఆమోదింపజేశాడు. ఆ తర్వాత ఎంతో జాగ్రత్తగా పరిశీలించి, చాలావరకూ నిర్వీర్యం చేయబడిన ఆ తీర్మానాన్నయినా బ్రిటిష్ ప్రభుత్వం అంగీకరించకపోతే ఏడాది నాటికి ప్రత్యక్ష చర్యలకు పూని, మా జాతీయ పతాకం ఎగరవేస్తాం అన్నాడు.

లాహోరు కాంగ్రెస్‌కి పెద్ద మెజారిటీతో ఆయన్ని అధ్యక్షుడుగా ఎన్నుకుంటే, తాను మొదటినుంచీ మితవాదిననీ, మితవాదిగానే తాను ఉంటూవున్న కారణాన్ని ప్రస్తుత పరిస్థితులలో కాంగ్రెస్ అధ్యక్ష స్థానానికి తాను తగననీ, ఉడుకు రక్తంతో ఉన్న జవహర్‌లాంటి యువకుడే

ఈ ఉద్రిక్త పరిస్థితులలో అధ్యక్ష స్థానాన్ని అధిష్టించి, దేశాన్ని ప్రత్యక్ష చర్యలకీ, సిసలయిన స్వాతంత్ర్యానికీ లాక్కుని వెళ్ళగలడని భావించే అల్లా చేశాననీ అన్నాడు.

స్వాతంత్ర్య మన్నది కోప తాపాలతోనూ, ఉద్రిక్త రక్తపు పటిమతోనూ సాధించేదికాదనీ, అల్లాంటి తొందరపాటులతోనూ, ఉద్రిక్త పరిస్థితులలోనూ సంపాదించిన స్వాతంత్ర్యం చిరకాలం నిలవదనీ, చిన్నవాళ్ళ కాపురం చితుకుల మంటలా గప్పున చల్లారు తుందనీ ఆయనకు తెలుసు. ప్రత్యక్ష చర్యకు పూనుకునేముందు నిర్మాణ కార్యక్రమమన్నదే ప్రాతిపదికగా ఉండాలనీ, ఆ పద్ధతే సరయినదనీ ఆయనకి తెలుసు.

కాని పరిస్థితులు విషమించి ప్రత్యక్ష చర్య తప్పని సరి అయినప్పుడు స్వయంగా ఆయనే నాయకత్వం వహించి ఉద్యమాన్ని నడిపే వాడు. కాని ఈ మాటు జవహర్‌లాల్ నెహ్రూను నాయకునిగా నిశ్చయించి, కాంగ్రెస్ అధ్యక్షుణ్ణి చేసి, తాను వెనక్కి తగ్గాడు. లాహోరులో "స్వాతంత్ర్య" పతాకం ఎగురవేయించి ఎటువంటి పరిస్థితులలోనయినా ఆ జెండాని కాపాడి తీరతాం అని ప్రమాణం చేయించి శాసన ధిక్కారానికి దారి చూపించింది లాహోరు కాంగ్రెస్. ఆంగ్లేయులకిచ్చిన గడువు వాయిదా 1929 డిసెంబరు 31 అర్ధ రాత్రితో ముగిసింది. అర్ధరాత్రి దాటడంతోనే దేశీయమైన స్వాతంత్ర్య పతాకాన్ని ఎగుర వేయడమూ, సంపాదించిన స్వాతంత్ర్యాన్ని నిలుపుకు తీరతామనే 'స్వాతంత్ర్య' ప్రమాణాన్ని తీసుకోవడమూ జరిగాయి.

## ఇండిపెండెంట్ పార్టీ

సుభాస్ చంద్రబోస్- శ్రీనివాసయ్యంగార్ల అభిప్రాయాలకూ, కాంగ్రెసువా రవలంబిస్తూన్న విధానానికీ పొంతనం కుదరలేదు. 1922 గయా కాంగ్రెస్‌లో అపజయం సంభవించిన తరవాత దాస్-నెహ్రూ గారలు కలిపి స్వరాజ్యపార్టీని స్థాపించడం, వారి మనోపథంలో మెదిలి, అటువంటి చర్యకే వారు దారి తీశారు.

కాంగ్రెసులో వ్యక్తంచేసిన వారి అభిప్రాయం యెప్పుడయితే

అంగీకరించబడలేదో, ఆ తక్షణం 'ఇండిపెండెంట్' పార్టీ అన్న పేరుతో ఒక పార్టీని స్థాపించారు. దేశంలో వున్న ఇతర పార్టీలన్నింటితోనూ కలిసి, పరస్పర సహాయ సహకారాలతో ముందుకు నడవా లనుకున్నారు.

ప్రత్యక్ష చర్యకు విరుద్ధంగా ఏర్పడిన ఈ 'ఇండిపెండెంట్' పార్టీలో నేను చేరలేదు. కాంగ్రెసు తీర్మానంతో అసంతృప్తి కలిగిన నాకు, ప్రత్యక్ష చర్యలో పాల్గొని జైలు శిక్షను వాంఛించే ముందు, కేంద్ర శాసన సభనుంచి వైదొలగడం న్యాయమని తోచింది. వేరే సందర్భంలో, కాంగ్రెసుపార్టీ సభ్యునిగా విరమించుకుని, స్వంత శక్తి మీద ఆధారపడి, తిరిగి కేంద్ర శాసన సభలో ప్రవేశించి, వెంటనే ఎల్లా సమర రంగంలోకి దూకిందీ వివరించే ఉన్నాను.

### శ్రీనివాసయ్యంగారి తత్వం

ప్రత్యక్ష చర్య, యుద్ధం, జెయిలు లాటి ప్రశ్నలు ఉత్పన్న మయినప్పు డెప్పుడూ కూడా శ్రీనివాసయ్యంగారి ప్రవృత్తిలో గమనించ తగ్గ మార్పులు కనబడుతూనే ఉన్నాయి. ఇదివరలో సైమన్ కమిషన్ రాక సందర్భంలో, ఆయన నన్ను ఒక ఇరకాటంలో పెట్టి, తాను మదరాసు ప్రయాణం విరమించుకుని, నన్ను చికాకులపాలు చేసిన ఉదంతం వివరించే ఉన్నాను.

ఇప్పుడు మళ్ళీ ఈ "ఉప్పు" గొడవ ఒకటి ఆయన పీకలమీదికి అనుకోని విధంగా వచ్చి పడింది. ఆయన సుభాస్‌చంద్రునితో కలిసి, సూాలు వాయిదా కాలం రెండు సంవత్సరాలంటే చాలా దీర్ఘం అవుతుంధి, దానిని ఒక్క సంవత్సరానికి తగ్గించమని కోరిన సందర్భంలో, గాంధీగారు ఆ సవరణ నంగీకరిస్తూ, సంవత్సరం ఆఖరు నాటికి మీరు సిద్ధంగా ఉండాలి అని అన్నప్పుడు, పాపం, శ్రీనివాసయ్యంగారికి ఆ పలుకులలోని అంతరార్థం అర్థమయి ఉండదు.

ఏడాది గడువు కాలంలోనూ, దేశాన్ని ఏ విధంగానూ ప్రత్యక్ష చర్యకు సిద్ధపరచకుండా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చుని, చివరికి ప్రత్యక్ష

చర్యలో పాల్గొనవలసిన పరిస్థితి ఏర్పడినప్పుడు, ప్రత్యక్ష చర్య అంటే అసహ్యించుకునే ఇతర పార్టీలతో కలిసి పనిచేస్తామంటూ ఒక క్రొత్త పార్టీ స్థాపించాడు. ఇవి ఆయన ఘనకార్యాలు.

# 7

## కాంగ్రెసుపై నా తిరుగుబాటు

శాసన సభ నుంచి వైదొలగి, శాసన ధిక్కారానికి దిగిన ఉదంతాన్ని గురించి కాస్త ప్రస్తావించాలని ఉంది. సైమన్ కమిషన్ బహిష్కరణ ఉద్యమం అత్యంత విజయవంతంగా, శాసన సభలో సభ్యులంగా ఉంటూనే నడిపించాము. చాలాకాలం తర్వాత 1940 లో ఏడు రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలను నడుపుతూ, శాసన సభ్యత్వాలకూ, మంత్రిత్వాది హోదాలకూ రాజీనామాలు ఇవ్వకుండానే జెయిళ్ళకి సిద్ధమయి పాల్గొనిన శాసన ధిక్కారపు టలజడిలో తిరిగీ ఒక ఘన విజయాన్నే సాధించాం.

### మోతీలాల్‌గారితో భేదాభిప్రాయం

ఆ 1921 నాటి మొదటి శాసన ధిక్కారపు రోజులలో శాసన సభా సభ్యత్వాలకు రాజీనామా లిచ్చి ప్రత్యక్ష చర్యకు దిగి విజయాన్ని సాధించి ఉన్నా, 1930 లో బ్రిటిషువారికి సవాలుగా ఇచ్చిన సంవత్సరం గడువూ తీరి, 1930 లో ప్రత్యక్ష చర్యకు పూనుకునే ముందు మా శాసన సభా సభ్యత్వాలకు రాజీనామాలు ఇవ్వనవసరం లేదని నేను ఎంత వాదించినా, మోతీలాల్‌గారు ఒప్పుకోలేదు. ఆయన తనకు గలిగిన పార్లమెంటరీ అనుభవాలతో విసుగు చెంది ఉన్నాడు. అందువల్ల ఆయన రాజీనామా లిచ్చి తీరాలని పట్టుపట్టాడు.

మోతీలాల్‌గారిని లాహోరు కాంగ్రెసు రోజులలో త్రివిధ బహిష్కరణ విధానాన్ని తిరిగీ అమలు జరుప వలసిందని కోరినప్పుడు, ఆయన ఈ విషయంలో తాను, గాంధీగారి అనుమతితోనే, పాల్గొన

బోవటం లేదని చెప్పాడు. అటువంటి చికాకు పరిస్థితులలో ఆయన ఇచ్చే జవాబులు ఎప్పుడూ, మోటుగానూ, ఘాటుగానూ, అహంకార పూరితంగానూ ఉండేవి. హక్కునుబట్టి జవహర్‌లాల్ నెహ్రూ కాంగ్రెసు అధ్యక్షుడే అయినా, పండిత మోతీలాల్ నెహ్రూ మాత్రం నిజంగా ప్రెసిడెంటే! జవహర్‌లాల్ నెహ్రూతో ఏ విషయం గురించీ విడిగా తర్కించవలసిన అవసరమే ఉండేది కాదు.

గాంధీగారు రాజీనామా లివ్వాలా, అక్కర లేదా అనే విషయం మీద ఆసక్తే చూపలేదు. నాకేమో మోతీలాల్ నెహ్రూగారితో ఏకీభవించాలని లేదు. రాజీనామా లివ్వకుండానే, శాసన సభా సభ్యత్వంతోనే జెయిళ్ళకు వెళ్ళడమనేదే మా ఉద్యమానికి బలం అని నా భావన. వారు నా ప్రతిపాదనకు అంగీకరించకపోయే సరికి నేను రాజీనామా ప్రతిపాదనకు వ్యతిరేక అభిప్రాయాన్ని వ్యక్తపరచి, ఆ కాంగ్రెస్ బహిరంగ సమావేశాలలో వారి విధానం సవాలు చేసి, నేను ఏ సంఘం తరఫునా కాకుండా స్వశక్తి మీదనే ఎన్నికయి తిరిగి కౌన్సిల్‌లోకి రాగలనని ధీమాగా చెప్పాను.

## రాష్ట్ర కాంగ్రెసు సంఘంలో చర్చ

ఆ ప్రకారం కొద్దికాలం నేను కాంగ్రెసుపై తిరుగుబాటు చేశాను. నా చర్యకు మా రాష్ట్ర కాంగ్రెసు సంఘంమాత్రం బాధపడింది. 1930 ప్రారంభ దినాలలో నేను రాజీనామా ఇస్తాను, మళ్ళీ ఎన్నికలలో పాల్గొంటాను అని కాకినాడలో జరిగిన రాష్ట్ర కాంగ్రెసు కమిటీ మీటింగ్‌లో అన్నప్పుడు, నా సన్నిహిత మిత్రులు చాలా బాధ పడ్డారు. ఆ మీటింగులో నాకు బాగా సన్నిహితుడైన యువక మిత్రుడు, కీ॥ శే॥ డా. సుబ్రహ్మణ్యం, నిజంగా చాలా బాధపడ్డాడు. ఆయన చాలాకాలం నుంచీ నో-ఛేంజ్ వర్గానికి చెంది, గాంధీగారి అడుగు జాడలలో నడుస్తున్నాడు.

ఈ కాంగ్రెసు ఉద్యమం ఆరంభమయిన నాటినుంచీ, నా యందుండే గౌరవాభిమానాలతో, నాకు సన్నిహితుడుగా, నన్ను అంటిపెట్టుకునే ఉండేవాడు. పాపం, అతడు నిజంగా మనఃక్లేశంతో, "మీరు

కాంగ్రెసుతో కయ్యం పెట్టుకుని, రాజీనామా ఇచ్చి, తిరిగి ఎన్నికలకు నిలిస్తే, మీకు ఓటు ఎవ రిస్తా''రని అడిగాడు. ''ఏం జరుగుతుందో కాస్త తమాయించుకుని చూడవోయి'' అన్నాను నేను. ''మీరూ, మీ కాంగ్రెసు మెంబర్లూ నాకు ఓటు చేయకపోయినా, నాకు వ్యతిరేకంగా ప్రచారంచేసి నన్ను పడగొట్టాలని చూసినా, ప్రజలు ఎప్పుడూ నావైపే ఉండి నన్ను గెలిపించి తీర్తా'' రన్నాను.

ఆవెంటనే మిత్రులు ముళ్ళపూడి పళ్ళంరాజూ, మారిన నరసన్నా లేచి, ''కాంగ్రెసు సభ్యులం అయిన మనం ఓటు చేసినా చెయ్యకపోయినా, ప్రజలలో నూటికి 95 మంది ఆయనకే నిస్సంశయంగా ఓటు చేస్తా'' రన్నారు. ''అంతేకాదు. ఈమధ్య ఆయన ప్రజలకోసం చేసిన కార్యాలు ఎన్నో ఉన్నాయి. ముఖ్యంగా, ఆయన రీసెటిల్మెంట్ రేట్లు హెచ్చించా లన్న ఒక్క ప్రతిపాదన చాలు. దీనికి తోడు, ఆయనకున్న పలుకుబడీ అవీ అల్లాగే ఉన్నాయి. అందువల్ల ఎలాంటి పరిస్థితులలో నయినా ఆయన్ని ఎవ్వరూ వదులుకోరు. అంతా ఆయనకే మద్దతు ఇస్తా'' రని కూడా వారన్నారు.

ఆ ఇరువురూ ముఖ్యమయిన కమిటీ మెంబర్లు. వారే ఇలాంటి బహిరంగ ప్రకటన చేసే సరికి, డా॥ సుబ్రహ్మణ్యం లాంటి మిత్రులకు చాలా ఆశ్చర్యంవేసింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ అధ్యక్ష పదవికి, శాసనసభా సభ్యత్వానికీ నేను ఇచ్చిన రాజీనామాలు అంగీకరించబడ్డాయి. నేనొక స్వతంత్ర్య వ్యక్తినయ్యాను. ఎన్నికలకి నన్ను నా సొంత టికెట్ మీదే నామినేట్ చేశారు.

### సొంత టికెట్ మీద పోటీ లేకుండా ఎన్నిక

నా నామినేషన్ బందరులో దాఖలు చేయవలసి ఉంది. నా నియోజక వర్గం కృష్ణాజిల్లా, తూర్పు పశ్చిమ గోదావరి మండలాలూను. నామినేషన్ల దాఖలుకు ఆఖరు తేదీవరకూ దేశంలో రకరకాల పుకార్లు లేచి. నాకు పోటీ ఉంటుందనీ, మొదటినుంచీ కాంగ్రెసుపార్టీ వారికి పోటీ దారులే అయిన జస్టిస్ పార్టీవారూ, తదితర పార్టీలవారూ, నేను కాంగ్రెసును కాదని దెబ్బలాడి బయటికి వచ్చిన కారణంగా కాంగ్రెసు వారూ

పోటీగా అభ్యర్థులను నిలబెడతారనీ ఎన్నోరకాల పుకార్లుండేవి. నేను స్థిరమయిన కాంగ్రెసువాదిగా జస్టిస్ పార్టీవారినీ, లిబరల్ పార్టీవారినీ, తదితర పార్టీలవారినీ విమర్శిస్తూ, వారిని చులకన చేస్తూ శాసన సభలో కూడా మాటాడుతూన్నా, నిజంగా ఆ పార్టీలలో నాకు విరోధు లెవ్వరూ లేరు. ఏ పార్టీ వారూ నాకు ప్రత్యర్థిగా ఏ వ్యక్తినీ నిలబెట్టలేదు. దాన్తో ఇంకో పుకారు లేవదీశారు. నా సన్నిహితులయిన కాంగ్రెసువారే, నా విధానంవల్ల వచ్చిన చికాకులవల్ల, నాకు ఇబ్బంది కలుగజేయడంకోసం ఎవరినైనా ప్రత్యర్థిగా నిలబెట్టి తీరతారనీ, వారూ వీరూ అనడం ఆరంభించారు. కాని కాంగ్రెసువారూ బాగా ఆలోచించుకుని నాకు ప్రత్యర్థిగా ఇంకొకరిని నిలబెట్టాలనే అభిప్రాయం విడిచిపెట్టారు. దాన్తో, నా సొంత టికెట్ మీదనే నేను ఏవిధమయిన పోటీ లేకుండా, ఏకగ్రీవంగా కేంద్ర శాసన సభకి ఎన్నికయినట్లు నిర్ధారణయిపోయింది.

## సభాప్రవేశం పట్ల నిరుత్సాహం

కాంగ్రెసు నాయకత్వంతో నాకు వచ్చిన అభిప్రాయ భేదాలవల్ల రాజీనామా ఇచ్చి, నా సొంత టికెట్ మీద ఎన్నికయ్యానేగాని నాకు నిజంగా శాసన సభాకార్యక్రమాలలో పాల్గొనాలనే అభిలాష లేకపోయింది. నా ఉత్సాహము నీళ్ళుగారిపోయిందా? ఏమోమరి. నేను 1930 ఆరంభంలో జరిగిన శాసన సభా సమావేశాలకు హాజరు కాలేదు.

కాంగ్రెసు వారందరూ శాసన సభనుంచి వైదొలగినా, సభాధ్యక్షుడుగా విఠల్‌భాయ్ పటేల్ మాత్రం శాసన సభని అంటిపెట్టుకుని వుండక తప్పలేదు. ఏ పరిస్థితి కయినా తట్టుకుని నిర్వహించుకు రాగల ప్రజ్ఞాశాలి ఆయన.

కాంగ్రెసు ఆదేశాన్ని వ్యతిరేకించి, కాంగ్రెసు సభ్యులతోపాటు రాజీనామా ఇవ్వకుండా, శాసన సభనే అంటిపెట్టుకుని ఉండి, కొందరు పెద్దలు శాసన సభలో ఇంకో కొత్త పార్టీని లేవదీసి, దానికి "కాంగ్రెసు నేషనలిస్ట్ పార్టీ" అని నామకరణం చేశారు.

## పోలీస్ గార్డ్ ఉదంతం

నేను విదేశాలలో పర్యటిస్తూన్న ఆ 1929 ఉత్తరార్ధంలో కేంద్ర శాసన సభలో బాంబులు విసరబడ్డాయి. ఆ కారణంగానూ, ఇతర కారణాల వల్లా, 1930 ఆరంభంలో అధ్యక్షుడు విఠల్‌భాయ్ పోలీసుగార్డ్ అసెంబ్లీ లోపలకి రాకుండా తలుపులు మూయించాడు. ప్రభుత్వంవారు సభ్యుల రక్షణార్థం పోలీసుగార్డ్ లోపల ఉండితీరాలని పట్టుబట్టినా, విఠల్‌భాయ్ దానికి అభ్యంతరం చెప్పాడు.

ఈ పాయింటుమీద ప్రభుత్వంవారికీ, ప్రెసిడెంట్‌గారికీ మధ్య ఒక కలహం తలయెత్తింది. పోలీసు సహాయంతో తాను కార్యక్రమం నడిపించడ మన్నది తన ప్రతిష్ఠకు భంగకరం గనుక, ఎలాంటి పరిస్థితులలోనూ పోలీసుగార్డ్ లోపలికి రాకూడదన్నాడు. వారిని రానివ్వడమో, రానివ్వకపోవడమో అన్నది తన ఇష్టానిష్టాలతో కూడుకున్నదనీ, ఆ విషయం నిర్ధారణ చేయగల హక్కు తనకున్నదనీ ఆయన అన్నాడు.

పోలీసులు తన ఇష్టానికి వ్యతిరేకంగా లోపలకి రాకుండా ఉండడానికిగాను, ఆ శాసన సభా భవన ద్వారాలు బందు చేయించాడు. ప్రేక్షకులను రానీయడం విషయంలో కట్టుబాట్లు బిగించాడు. మూసిన తలుపుల వెనక కార్యక్రమాలన్నీ కొనసాగింప జేశాడు.

## విఠల్‌భాయ్ పంపిన కబురు

కాంగ్రెసువారు సభనుంచి నిష్క్రమించడం విఠల్‌భాయ్‌కి కష్టంగానే ఉంది. నేను కాంగ్రెసు నుంచి వైదొలగడమూ, తిరిగీ నా సొంత టిక్కెట్టుమీద ఎన్నిక అవడమూ మొదలయిన కథంతా విని ఉండడాన్ని, ఆ సమావేశాల ఆఖరిరోజులలో, నన్ను ఢిల్లీవచ్చి ఆయనకు సహకారిగా ఉండమని ఆయన కోరాడు. నాకు టెలిగ్రాం ద్వారా కాంగ్రెసు నేషనలిస్ట్ పార్టీవారివద్ద నుంచి ఆహ్వానం వచ్చింది. నాకు పార్టీ నాయకత్వం ఇస్తామనీ, వెంటనే వచ్చి వారి పార్టీలో చేరమనీ ఆ ఆహ్వానం. ఇది నేను ఎన్నిక అయిన వెంటనే జరిగిన సంగతి.

ఆ ఆహ్వానానికి సమాధానమిస్తూ, నేను కాంగ్రెసువారి చిన్నచూపుకు సహించలేక రాజీనామా ఇచ్చి, మళ్ళీ నా సొంత టికెట్‌మీద, నా

శక్తిని నిరూపించే ఉద్దేశంతో ఎన్నికయ్యానుగాని, నాకు శాసన సభా సభ్యత్వంమీద మోజుఉండి కాదనీ, అందువల్ల అసెంబ్లీ సభలకు హాజరవ్వాలనే ఉద్దేశం లేదనీ తెలియ జేశాను.

విఠల్‌భాయ్ వద్దనుంచి నా కా 'పిలుపు' వచ్చేవరకూ, నాకు ఆ అభిప్రాయమే (అసెంబ్లీకి వెళ్ళకూడదని) గట్టిగా ఉండేది. విఠల్‌భాయ్ గారు చెప్పి పంపించిన ఈ సమాచారం ఇంకొక అసెంబ్లీ సభ్యుడు మోసుకొచ్చాడు. ఆయన నాకు సన్నిహిత మిత్రుడు. పోలీసుకు శాసన సభలో ప్రవేశం లేకుండా ఆయన తీసుకున్న చర్యలగురించి, వాటి పర్యవసానాల గురించీ కూడా విన్నాను. నిజంగా ఆయనతప్ప ఏ ఇతర అధ్యక్షుడూ సాహసించి అల్లా వ్యవహరించి ఉండలేడన్న విషయం గ్రహించాను.

## ఢిల్లీ ప్రయాణం

ఢిల్లీకి ప్రయాణమై వెళ్ళి, వారిని వారి ఇంటివద్ద కలుసుకుని, సంగతి సందర్భాలన్నీ దీర్ఘంగా చర్చించాను. ఆ తరవాతే అసెంబ్లీకి వెళ్లాను. నేను అసెంబ్లీ హాలులో ప్రవేశించిన తక్షణం, తమ తమ పార్టీలకు సన్నిహితుడను కావచ్చుననే ఆశతో కాంగ్రెసేతర పార్టీల వారందరూ నాకు అభినందనాలు చెప్పి నన్ను ఆహ్వానించారు. ఆ కాంగ్రెసు నేషనలిస్ట్ పార్టీవారు మళ్ళీ నన్ను స్వయంగా ఆహ్వానించి, తమ పార్టీనాయకత్వం వహించి, వారి బెంచీలమీద ఆసీనుణ్ణి కావలసిందని కోరారు. నమస్కార పురస్సరంగా వారి వారి ఆహ్వానాలను తిరస్కరించాను.

"నీవు ఒక్కడవూ విడిగా ఒక స్వతంత్ర అభ్యర్థిగా కూర్చున్నా సంతోషిస్తాను గాని, నీవు ఏ పార్టీ వారితోనూ కలవవ"ద్దని విఠల్‌భాయ్ కోరాడు.

అసెంబ్లీ హాలూ, పరిసరాలూ పర్యవేక్షించి, పండిత మదన మోహన మాలవ్యాగారితో ఆయన బ్లాకులో కూర్చోవాలనీ, ఆయన పార్టీలో సభ్యత్వంకూడా స్వీకరిద్దామనీ తలచాను. మాలవ్యా పండితుడు మితవాది అని కొందరూ, లిబరల్ అని కొందరూ అంటూఉన్నా నాకు

మాత్రం ఆయనయందు అంత గౌరవం ఉంది. నా ఉద్దేశంలో దాదా బాయ్ నౌరోజీగారి స్వభావమూ, మాలవ్యా పండితుని స్వభావమూ ఒకటే. వారు లిబరల్స్ అయినా, మితవాదులయినా, మరేదయినా- పిరికివారు మాత్రం కారు.

## మాలవ్యాగారి పార్టీలో చేరడంలో ఉద్దేశం

నేను మాలవ్యాగారికి సన్నిహితుడనయి, వారి పార్టీలో చేరాలని అనుకున్నా, ఎల్లాగయినా వారిని మార్చి ప్రత్యక్ష చర్యకు పూనుకునేలా చెయ్యాలన్నది నా ఆశయం. నేను మాలవ్యాగారితోటి, వారి పార్టీవారితోటీ కొద్ది వారాలు మాత్రమే కలిసి కూర్చున్నాను. మేము ఒకర్ని ఒకరం బాగా ఎరిగిఉన్న కారణాన్నీ, మూడు సంవత్సరాలపాటు ఒకే సభలో కలిసి ఉన్న కారణాన్నీ, రెండు మూడు రోజులలోనే వారి పార్టీలో నాకు స్థానం దొరికింది. ఎం. ఆర్. జయకర్‌గారూ, ఎమ్. ఎస్. ఆనే, ఘనశ్యాందాస్ బిర్లా మొదలైనవారు మాలవ్యా పండితుని పార్టీ సభ్యులు.

విఠల్‌భాయ్ నన్ను అసెంబ్లీకి వస్తూ, తనకి సహకారిగా ఉండమని కోరాడు. నేను మాలవ్యాగారి పార్టీలో చేరి, ఆ పార్టీ ముఖ్యులలో కొందరిచేతనయినా, గాంధీగారు దండీ చేరుకునేనాటికి, ఆ 21 రోజుల లోపల; రాజీనామా ఇప్పించడమే విఠల్‌భాయ్‌కి చేయగల సహాయం అని తలచాను. ఎల్లాగయినా విఠల్‌భాయ్‌గారిచేత కూడా రాజీనామా ఇప్పించి జైలుకి తీసుకుపోవాలని నా వాంఛ. కొన్నాళ్ళపాటు విఠల్‌భాయ్‌గారిని వారి ఇంటివద్ద నిత్యమూ కలుస్తూ వచ్చాను. మాలవ్యాగారి పార్టీ డిప్యూటీ లీడర్ జయకర్‌గారితో నాకు భేటీ వచ్చి, మేము తీవ్రంగా వాదించుకున్నా, తుదకు ఆయన్ని నా వైపు త్రిప్పుకుని, ఉప్పు సత్యాగ్రహ సంరంభంలో పాల్గొనడానికి వారి పార్టీ సభ్యులం పధ్నాలుదురం అసెంబ్లీ సభ్యత్వానికి రాజీనామా ఇస్తామనీ, ఆ పధ్నాగురిలోనూ మాలవ్యా పండితుడు, ఆనే, బిర్లా మొదలైనవారు ఉంటారనీ విఠల్‌భాయ్ గారితో చెప్పాను. బిర్లామాత్రం సూక్ష్మబుద్ధీ, వివే

కముా గల వర్తక వ్యాపారి అవడాన్ని, ఆయన తన రాజీనామా, మా అందరితోనూ కలిపి కాక, విడిగా ఇస్తానని చెప్పాడు.

జయకర్ మాత్రం ప్రతి మీటింగులోనూ మాలవ్యాగారు రాజీనామా ఇవ్వకుండా చూడాలని అనేక విధాల తంటాలు పడ్డాడు. రాజకీయంగా మా దృక్పథాలు వేరయినా, నాకూ జయకర్ గారికీ మధ్య సన్నిహితమైన మైత్రి ఉండేది. ఆయన తమ పార్టీని విచ్ఛిన్నం చేశానంటూ నన్ను ఆడిపోసుకునేవాడు. ఈ మా చర్యలను కనిపెడుతూన్న "టైమ్స్ ఆఫ్ ఇండియా" పత్రిక, ఒక మదరాసు సభ్యుడు వచ్చి, మాలవ్యాగారి పార్టీలో ఈ మధ్య చేరినట్లే చేరి వారి పార్టీని ఛిన్నాభిన్నం చేశాడని బొంబాయినుండి చాలాసార్లు వ్రాసింది. ఘనశ్యాందాసు బిర్లాకి శాసన ధిక్కార ఉద్యమంలో చేరాలని లేదు. అందుచేతనే ఆయన తన రాజీనామా విడిగా సమర్పించాడు.

## మాలవ్యా ప్రభృతులతో కలిసి రాజీనామా

మాలవ్యాగారితో కలసి పదముగ్గురం, జాయింటుగా ఒకే రాజీనామా పత్రం సమర్పించాము. మాలవ్యాగారూ, అనే మొదలైన వారు గొప్ప దేశభక్తులు. దేశానికి సేవ చెయ్యడానికి వా రెప్పుడూ సంసిద్ధులే. అందువల్ల వారి విషయంలో ప్రోద్బలం అంతగా అవసరం లేకపోయింది. కారణాంతరాలవల్ల తాము వేరే పార్టీ సభ్యులుగా చెలామణీ అవుతూన్నా, నిజానికి వారు మంచి శక్తిమంతులు. మాలవ్యాగారు కాంగ్రెసు వారిని కూడా ఎటువంటి ప్రత్యక్ష చర్యా కార్యక్రమంలో నయినా నాయకత్వం వహించి, నడపగల యోధుడు.

ఇదంతా ఎందుకు చెబుతున్నానంటే, వారికి నేను ఈ ప్రత్యక్ష చర్య మొదలైన విషయాలను గురించి చెప్పినప్పుడు, ఏ విధమయిన ప్రోద్బలమూ లేకుండానే, వారంతట వారే ముందుకు వచ్చి, అగ్నిగుండంలోనికి దూకడానికి సిద్ధమయ్యారు. వారి పార్టీ చిహ్నం ఏదయినా, సహకార నిరాకరణ ఉద్యమం ఆరంభం అయినప్పటినుంచీ వారిని గమనిస్తూన్న కారణంగా, వారంటే నాకు అభిమానమూ, గౌరవమూ కూడా ఏర్పడ్డాయి.

వారి ఘనతను గురించి, వారి దేశాభిమానం గురించి నాకున్న అభిప్రాయం సరి అయిందేనని, నేను కాంగ్రెసును వ్యతిరేకించి, తిరిగి కౌన్సిల్ ప్రవేశం చేసి, వారి పార్టీలో జేరిన కొద్ది దినాలలోనే, వారి అభిమానాన్ని సంపాదించి, ప్రత్యక్షంగా వారి సంగతి సందర్భాలు గ్రహించి, నిర్ధారణ చేసుకున్నాను. 1930 సత్యాగ్రహ ప్రారంభ దినాలలో కేంద్ర శాసన సభనుంచి మాలవ్యా ప్రభృతులచేత ఇప్పించగలిగిన రాజీనామా విషయం చాలించి, విఠల్‌భాయ్‌గారి రాజీనామా సంగతి ప్రస్తావిస్తాను.

## విఠల్‌భాయ్‌గారి రాజీనామా

నిజంగా విఠల్‌భాయ్ చాలా బలిష్ఠమయిన కాంగ్రెసు నాయకుడు. ఆయన ఎటువంటి త్యాగాన్ని చెయ్యడానికయినా ఎప్పుడూ సిద్ధమే. ఆయన చాలా స్వతంత్రంగా ఆలోచించగల దిట్ట. వాగ్ధాటి, చాతుర్యమూ కలవాడు. మహాత్మా గాంధీగారితో సంప్రతింపు లప్పుడు వారి శక్తి సువ్యక్తం అయింది. ఆయన తాను నమ్మిన విషయాన్ని నిస్సంకోచంగా గాంధీగారికి వ్యక్తంచేసే సందర్భంలో ఆయనకి కార్యదర్శిగా వ్యవహస్తున్నాడా అనిపించేదేగాని, వారికి అడుగడుక్కీ అడ్డం తగిలి తర్కవితర్కాలు చేసే బాపతుగా ఎప్పుడూ కనిపించలేదు.

విఠల్‌భాయీ, నేనూ కాంగ్రెసు సంరంభం ఆరంభం అయిన నాటినుంచీ ఒకరికి ఒకరం బాగా సన్నిహితుల మవుతూ వచ్చాము. అధ్యక్ష పదవిని వదలి కాంగ్రెసు సంరంభంలో చేరమని సూచిస్తూ ఆయనతో వాదప్రతివాదాలకు దిగినప్పుడు ఆయన ఏమన్నాడంటే: "ప్రకాశంగారూ! మీరు రోజూ నాకేదో ప్రబోధం చేస్తున్నారు. ఇటువంటి విషయాలలో నాకు ఒకరి ప్రబోధం అవసరమా? నా శరీర స్థితి మీకు తెలియదు. ఇంతవరకూ నా శరీర పరిస్థితిని మీకు చెప్పవలసిన అవసరం కలుగలేదు. రోజూ ఎనీమా చేసుకుంటేనేగాని నాకు విరోచనం కాదు. ఈ విషయంలో మీరేమంటారు?"

ఈ విషయం నిజంగా నాకు విస్మయం కలిగించింది. ఆయనతో కలిసి బొంబాయిలో ఆయన 'బంద్రా' హౌస్‌లో చాలా రోజులపాటు

ఉన్నా, ఈ విషయం ఆయన ఎప్పుడూ నాతో చెప్పలేదు. ఆయన చాలా మితభాషి. తన గొడవలతో ఇంకొకరు బాధపడకుండా దాచి పెట్టుకునే రకం. ఆయన సన్నిహిత మిత్రులతో, సహచరులతో, ఆఖరికి ఆయనకు బాగా సన్నిహితుడయిన లాట్‌వాలాగారితోకూడా అదే పద్ధతిగా వ్యవహరించే బాపతు వ్యక్తి ఆయన. నిజానికి చాలా గొప్ప వ్యక్తి. ఉత్తమ దేశభక్తుడు. ఆయన అధ్యక్ష స్థానాన్ని నిమిషాలమీద విడిచి, తన శారీరక పరిస్థితిని గూడా విస్మరించి అరెస్టవడానికి కూడా సిద్ధమయిన మహాపురుషుడు.

## విషాద మరణం

ఆ రోజులలో రాజకీయ ఖైదీల అంతస్తులు కూడా గమనించకుండా, విఠల్‌భాయ్‌లాంటి ఉత్తమ దేశభక్తుల శారీరక స్థితిని కూడా గమనించకుండా, అందరినీ ఒకే తీరున చూచేవారు. ఆయన్ని ఖైదీగా చెన్నరాష్ట్రానికి బదిలీ చేయడం మా కందరికీ విస్మయం కలిగించింది. ఆయన శారీరక స్థితీ, జైయిలులో అమలు జరిపే శిక్షా విధానమూ ఆయనకు బాధా కారణాలయ్యాయి. ఆయన కోయంబత్తూరు జెయిల్లో ఉండే రోజులలో, నేను కన్ననూరు జెయిల్లో ఉండేవాడిని. కోయంబత్తూరుకూ, కన్ననూరుకూ అట్టే దూరం లేదుగా? అందువలన వార్త అందుతూ ఉండేవి.

జెయిలులో ఒక భాగంనుంచి ఇంకొక భాగానికి స్ట్రెచ్చరు మీద తీసుకువెళ్ళే సందర్భాలలో ఆయన్ని జారవిడిచేవారుట. ఈ సంగతి విని నేను చాలా బాధపడ్డాను. నేను నిజంగా చాలా తప్పుజేశానేమో! ఇప్పుడు ఎంత అనుకున్నా ఏం లాభం? నిజానికి ఆయన అరెస్టుకీ, ఈ జెయిలు పరిస్థితికీ, అన్నింటికీ మూలకారణం నేనే గదా! నేను అంతగా ఆయన్ని ప్రోద్బలంచేసి ఉండకపోతే, ఆయన అసెంబ్లీ అధ్యక్ష స్థానానికి రాజీనామా ఇవ్వకుండా, అలాగే సుఖంగా ఉండిపోయేవాడేమో! రాజీనామా ఇచ్చినా స్వాతంత్ర్య సమరంలో పాల్గొనకుండానయినా ఉండేవాడు.

కోయంబత్తూరు జెయిల్లో ఆయనకు దెబ్బతగిలిన కారణంగా ఆయన్ని విడుదల చేశారనీ, దర్మిలా ఆయన చనిపోయారనీ విని మరీ యెక్కువగా బాధపడ్డాను. ఆయన్ని నేను బలవంతంచేసి ఉండకపోతే ఆయన అలా బ్రతికి ఉండేవారేమో! ఈ సంఘటన జరిగి ఇన్నాళ్ళయినా ఈ విషయాన్ని మాత్రం ఇంకా మరవలేకుండా ఉన్నాను. ఈ ప్రకారంగా మా పార్లమెంటరీ విధానం సొంతం అవడమూ, విఠల్‌భాయ్ పటేలూ, మాలవ్యా పండితుడూ, నేనూ 1930 లో జెయిళ్ళలో మ్రగ్గడమూ సంభవించింది.

# 8

# నా సత్యాగ్రహ సమర శంఖారావం

రాజీనామా ఇచ్చి కేంద్ర శాసన సభనుంచి బయటికి వచ్చే సందర్భంలో నేనిచ్చిన ఉపన్యాస విషయం కాస్త వివరించాలని ఉంది. ఉప్పు సత్యాగ్రహసంరంభం ఆరంభం అయ్యే ఆ పవిత్ర ఘడియల్లో కాంగ్రెసేతరవర్గానికి చెందవలసి వచ్చిన నేను, శాసనసభ ద్వారా సభ్యులకూ, దేశానికీ సందేశం ఇవ్వగలిగినందుకు గర్విస్తూ, ఆ ఉపన్యాసం ఇచ్చాను. అలాంటి అవకాశం నాకు కలగడం నిజంగా గర్వకారణంగానే భావించాను.

నేను ఆ ఉపన్యాసం ఇచ్చేనాటికి గాంధీగారు 'దండీ'కి వెళ్ళే మార్గంలో ఉన్నారు. ఆయన తన ఆశ్రమవాసు లయిన స్త్రీ పురుషులతో కలిసి సత్యాగ్రహ సమరం ఆరంభించడానికి సబర్మతీనుంచి దండీ ప్రాంతానికి కాలినడకని వెడుతున్నారన్నమాట. సబర్మతీ ఆశ్రమానికీ డండీకి మధ్య ప్రయాణం 21 రోజులు. అక్కడికి జేరి ఆ సముద్రపు టొడ్డున లభ్యమయ్యే ఉప్పుకల్లులను ఏరుకోవాలన్నమాట!

దారిలో చాలా చిత్రమయిన సంఘటనలే జరిగాయి. ఈ విషయాలన్నీ అనుదినమూ వార్తాపత్రికలద్వారా వస్తూనే ఉండేవి. అంతే కాదు, మన "మిత్రులు" పత్రికలలో పడ్డ వార్తలతో పాటు రకరకాల

విమర్శలూ, చిత్ర విచిత్రమయిన అభిప్రాయాలూ వెల్లడించేవారు. అందులో కొన్ని పత్రికలు ఆంగ్లేయులచేతా, ఆంగ్లో ఇండియన్లచేతా నిర్వహింపబడేవి. వాటిలో మా ఉప్పు సత్యాగ్రహ సమరాన్ని ఇష్ట మొచ్చినట్లుగా వేళాకోళం చేసేవారు. 'భారతదేశంలాంటి ఒక పెద్ద దేశానికి స్వాతంత్ర్య సంపాదనకోసం సముద్రపు టొడ్డున ఉప్పుకల్లులు ఏరుతారట!' అంటూ రకరకాలుగా వేళాకోళాలు చేసేవారు. కార్టూనులు వేసేవారు. గాంధీగారనే చిట్టెలుక తనకున్న ఆ కొద్దిపాటి మీసాలతో తోక ఆడించుకుంటూ, ఉప్పుకల్లులు ఏరడానికీ, తద్వారా దేశానికి స్వాతంత్ర్యం సంపాదించడానికీ ప్రయత్నిస్తున్నదని వేళాకోళంగా కార్టూన్లు వేసేవారు.

### శాసన సభా వాతావరణం

కేంద్ర శాసన సభా వాతావరణమంతా అటువంటి ఉద్దేశాలతోనే నిండి, అటువంటి ఆశ్చర్యాలకీ ఆలవాలమై ఉండేది. పిసలయిన కాంగ్రెసు వారంతా శాసన సభని వదలి 'ఉప్పు' కోసం బయటకు నడి చారుగా! వారి కిదంతా ఆశ్చర్యాన్ని, అనుమానాన్ని కలిగించేది. అసలు ఆ సభలో ఉప్పు సత్యాగ్రహ సమరంమీద పూర్తి విశ్వాసంతో ఉన్నవాణ్ణి నేను ఒక్కడినే. శాసనసభలో ఉన్న యావన్మందికీ నా అభి ప్రాయాలూ, ఆశయాలూ పూర్తిగా తెలిసి ఉండడాన్ని నన్ను చూస్తే అందరికీ జాలిగా ఉండేది. వారి దృష్టికి బలిపీఠానికి తీసుకుని పోబడు తూన్న మేకలా కనబడ్డానేమో! ట్రెజరీ బెంచీల వారికీ, తదితర శాసన సభ్యులకీ ఈ మూడు సంవత్సరాలలోనూ నన్నుగురించి బాగా తెలిసికోవ డానికి సావకాశం ఉందిగదా! వారికి ఆ అసెంబ్లీలోనే, శాసనధిక్కారం చేసి, స్వరాజ్యం సంపాదించడానికిగాను పద్నాలుగుమందితో ఒక కంపెనీ ఏర్పడ్డదని తెలియదు.

మేము టీ తీసుకుంటూ ఉండగా ట్రెజరీబెంచీలకు సంబంధించిన ఒక ఆంగ్లేయ మిత్రుడు నన్నుగురించి కాస్త బాధపడి, ఆ లాబీలో ఒక చిన్న ప్రసక్తి లేవదీశాడు. "ఎంత తెలివి తక్కువ వాడవయ్యా! సము ద్రపు ఒడ్డున ఏరిన ఉప్పుగల్లులతో 'స్వరాజ్యం' వస్తుందని ఎల్లా

తలుస్తున్నారయ్యా? ప్రపంచకంలో ఎప్పుడయినా ఇటువంటి వింత విన్నామా?'' అన్నాడాయన. "కాస్సేపు ఓపిక పట్టవయ్యా, మిత్రమా! ఈ విషయమై కొద్దిసేపట్లో శాసన సభలో మాటాడదలిచాను. అప్పుడు మీ ప్రశ్నకు సమాధానం సువిదితమవుతుం'' దన్నాను.

ఆయనే అన్నమాటేమిటి, సభలో అధికార అనాధికార భారతీయ సభ్యులుకూడా కాంగ్రెసు కార్యక్రమం పట్ల విచారాన్ని సూచిస్తూ, 'దేశంలో ఉన్న కాంగ్రెసువారంతా రాజీనామాలిచ్చి, అన్ని విధాలా చేతులు నలుపుకుంటూన్న ఈ సమయంలో, ఈ సత్యాగ్రహం ఏమిటని అడగడం ఆరంభించారు. వారికీపై విధంగానే సమాధానం ఇచ్చాను.

## సంశయాళువులకు సమాధానం

లోగడ చెప్పినట్లు 1930 లో నాకు ఏ విధంగానూ శాసన సభా కార్యక్రమాలలో పాల్గొనాలనే అభిప్రాయంలేదు. నా ఢిల్లీ ప్రయాణ కారణం విఠల్‌భాయ్‌గారి సందేశం. వారికి నా రాకవల్ల ఉపయోగం కలిగినా, కలగకపోయినా, నాకు మాత్రం ఆ ఢిల్లీప్రయాణం గర్వ కారణమే అయింది. మాలవ్యా పండితునితో సహా (నేనుగాక) 13 మంది శాసన సభ్యులచేత రాజీనామా ఇప్పించి, వారిలో 12 మందిని ప్రత్యక్ష చర్యగా ప్రవేశపెట్టబడిన ఆ ఉప్పు సత్యాగ్రహ సమరంలోకి లాక్కెళ్ళగలిగాను. విఠల్‌భాయ్‌ని ఒప్పించి, ఆయనచేత రాజీనామా ఇప్పించి, జెయిలుకి వెళ్ళడానికి ఏర్పాట్లు చేసే సమయానికి గాంధీగారు 'దండీ' సమీపిస్తున్నారు.

అసెంబ్లీ కాంగ్రెసేతర సభ్యుడుగా నాకు ఉన్న హక్కుని పురస్కరించుకుని, నేను చేసిన ఉపన్యాసం అసెంబ్లీలోనూ, దేశంలోనూ ఉన్న డౌటింగ్ థామస్*లకు సమాధానంగానూ, గాంధీగారి

---

* యేసుక్రీస్తు వారికి ముఖ్యమయిన శిష్యులు పదిమందిలోనూ థామస్ ఒకడు. ఆయనకి, మన పరమానందయ్య శిష్యులకు వచ్చినట్లు, ఎప్పుడూ అనుమానాలు వస్తూండేవి. అందుచేత ఆయన్ని అందరూ 'డౌటింగ్ థామస్' (Doubting Thomas) అనేవారు.

ఉప్పు సత్యాగ్రహ సమరంలో పాల్గొనడానికి పిలుపుగానూ చాలా బాగా ఉపయోగపడింది. అసెంబ్లీ మెంబరుగా పనిచేసిన ఆ మూడు సంవత్సరాలపాటూ నా శక్తివంచన లేకుండా, ఏ ఉడుతా భక్తిగానో, సేవ చేశాను. ఆంధ్ర రాష్ట్రీయులకే గాక, ఎన్నో ఇతర రాష్ట్రాలవారికీ, ఖండాంతర వాసులకీ కూడా కాంగ్రెసు కార్యక్రమం విషయమై కాంగ్రెసుద్వారా జరుగుతూన్న, జరుగగల దేశోపకారాల విషయమై నేను కలిగించ గలిగిన పరిజ్ఞానం కలిగించాను.

ఆ కారణం చేతనే ఉప్పు సత్యాగ్రహమే కాదు, మరే యితర శాసనోల్లంఘన కార్యక్రమమయినా అసెంబ్లీ స్థానాలను వదలకుండా సాగిస్తే ఎక్కువ శక్తివంతంగా శీఘ్రతరంగా విజయం సాధించగలమని నా నమ్మిక. పరిస్థితుల ప్రాబల్యంవల్ల కాంగ్రెసుతో దెబ్బలాడి, రాజీనామా యిచ్చి, మళ్ళీ శాసన సభా ప్రవేశం చేయగలిగాను. అంతే కాదు, ఆ ఆఖరు ఘడియలలో కాంగ్రెసు మెంబర్ని కాకపోయినా కాంగ్రెసుకు జీవంపోసే విధంగా ప్రవర్తించగలిగాను.

అందువల్లనే అసెంబ్లీ హాలులో కాంగ్రెసు కార్యక్రమాలమీద విమర్శలు ముమ్మరంగా వస్తూన్న ఆ సమయంలో, ఆ విమర్శల కన్నింటికీ జవాబుగా ఒక స్టేటుమెంటు ఇవ్వగలిగాను. ఆ విమర్శల కన్నింటికీ జవాబు యిస్తూ, కాంగ్రెసుకు సహకారం అందివ్వవలసిందని దేశానికి కూడా విజ్ఞప్తి చేయగల సావకాశం నాకు లభించడం ఎంతటి అదృష్టమో గదా!

## 'ఆత్మ ప్రబోధం'

కాగా ఈ నా ఉపన్యాసానికి ఏ విధమయిన ముందుప్రయత్నమూ జరగలేదు. ఆ క్షణంలో మాట్లాడింది నేను కాదు- "నా ఆత్మ." అది నిజంగా ఆత్మ ప్రబోధమనే నా పూర్తి విశ్వాసం.* ఉపన్యాసంలో అహింసాత్మక శాంతి సమర విధానానికీ, రక్తపాతంతో కూడుకున్న

* ఈ ఉపన్యాసం సంపూర్ణంగా గ్రంథం చివర 'ఎపెండిక్స్' గా ఇద్దామని ఉద్దేశపడ్డారు.

యుద్ధకౌశలంతో జరిగే హింసాకాండకీ మధ్యగల తేడా పాడా లన్నీ వివరించాను. అంతేకాదు, కాంగ్రెసు విధానాలు ప్రయోగాత్మకంగా రుజువు పరచడానికి వీలులే నటువంటివే అయినా, విమర్శకులకు ఆ విధానాలలో జీవం కనబడకపోయినా, దేశం ఉత్తేజపూరితమై, సజీవం గానే ఉన్నదనీ, దేశీయులలో 'స్వాతంత్ర్య' వాంఛ రోజురోజుకూ అధికమై, ప్రజలు ఎటువంటి త్యాగానికయినా సంసిద్ధులై ఉన్నారనీ అన్నాను. ఇంతవరకూ వారి మనోభావాలన్నీ భయోత్పాతం కలిగించే ప్రస్తుత రాజ్యవిధానంలో అణగద్రొక్కబడి ఉన్నాయనీ, స్వాతంత్ర్యం కోసం సాగనున్న అహింసాత్మక శాంతి సమరంలో కూడా హింసా కాండ ప్రయోగించడానికి వెనుదీయని మన స్తత్వంతో పాలకులున్నా రనీ గుర్తు చేశాను. నా దేశీయుల పరిస్థితి నాకు ఆమూలాగ్రం తెలుసు ననీ, వారు ఆత్మసాక్షిగా ఒక నిశ్చయానికి వచ్చినప్పుడు పర్య వసానాలను లెక్కచెయ్యకుండా ఎటువంటి త్యాగాలకయినా సిద్ధబడగల రనీ విశదం చేశాను. దేశీయులందరూ ఈ సమరంలో దుర్మరణాల పాలయినా కోట్లాదిగా ఉన్నవారి ఆత్మలు ఆ 'బక్కవాని' పక్కనే ఉండి, ఆయన ఆజ్ఞల ప్రకారం వర్తిస్తాయని స్పష్టం చేశాను. ఇదే ధోరణిలో ఆనాటి నా ఉపన్యాసం ముగించాను.

ఆ అసెంబ్లీ ప్రాంగణం, నిజంగా, స్త్రీ పురుషులకూ, చిన్నలకూ పెద్దలకూ, యావన్మందికీ ప్రబోధం కలుగజేయడానికి నాకెంతో ఉప కరించింది. దేశీయులంతా ఒక్కుమ్మడిగి క్రమశిక్షణతో ఒక్క త్రాటి మీద నడుస్తూ, దేశంలో ఆంగ్లేయ ప్రభుత్వాన్ని సాగనియ్యకుండా ముందడుగు వేయవలసి ఉన్నదని ప్రబోధం చేశాను. ఈ అసెంబ్లీ హాలునుంచి నేను నేరుగా ఉప్పు సత్యాగ్రహ సమరంలో పాల్గొనడానికి ఇల్లాగే వెళ్ళిపోయినా ఆశ్చర్యపడవలసింది ఏమీ ఉండదని నొక్కివక్కా ణిస్తూ ఆనాటి నా ఉపన్యాసాన్ని సాంతం చేశాను.

## రాష్ట్రీయ కాంగ్రెసు ఆహ్వానం

నేను ఈ ఉపన్యాసం ఇచ్చిన తర్వాతనే మాలవ్యా పండితుడూ, ఇతర మెంబర్లమూ రాజీనామాలిచ్చి, సత్యాగ్రహ సమర రంగంలో

అడుగుపెట్టాం. నా ఆత్మమిత్రుడూ, నాయకాగ్రేసరుడూ అయిన మాలవ్యా పండితుడు ఆ క్షణంనుంచీ సమరం సాగించారు. ఢిల్లీలోనే ఎన్నో సభలలో విదేశవస్త్ర బహిష్కరణను గురించి చాలాధీమాగానూ, శక్తిమంతంగానూ ఉపన్యాసాలిచ్చారు. రాజీనామా యిచ్చిన ఇతర మిత్రులు వారివారి నియోజక వర్గాలకు తరలి వెళ్ళారు.

గుంటూరులో జరుగనున్న ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ మీటింగులో పాల్గొనవలసిందని నాకు పిలుపు వచ్చింది. ఢిల్లీ వదలి మదరాసు వెడుతూ దారిలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ మీటింగుకు హాజరయ్యాను. ఆ గుంటూరు సభకు మెంబర్లందరూ వచ్చారనే అనాలి. వారు సత్యాగ్రహ సమరానికి ఒక జాబితా తయారు చేశారు. మిత్రుడు దేశభక్త కొండ వెంకటప్పయ్య, ఇతర ప్రముఖులు ఆ సభకు హాజరయ్యారు. ఆ కాగితంమీద మొదటి అంకెని విడిచి తక్కిన అన్ని అంకెలకూ ఎదుట సంతకాలు చేయబడ్డాయి. ఆ మొదటిస్థానం మాత్రం అల్లా ఖాళీగా ఉంచబడింది. వందన పురస్సరంగా నాకు వదలిన ఆ వదలిన ఆ ప్రథమ స్థానంలో నేను సంతకం పెట్టాను.

## మా సత్యాగ్రహ పథకం

ఆంధ్రనాయకు లంతా ఈ ఉప్పుసత్యాగ్రహాన్ని విజయవంతంగా సాగించడం ఎల్లాగని ప్రశ్నించారు. అక్కడ జేరిన వారిలో చాలా మంది, సముద్రపు నీటిని ఒకరి తర్వాత ఒకరు మరగబెట్టి ఉప్పు చేయడానికి ప్రయత్నించినంత మాత్రాన జయం సాధ్యంకాదన్న అభిప్రాయం వెల్లడించారు. మేము కొంత తర్జనభర్జన చేసి ఒక పథకం వేశాం.

ఆ పథకం ప్రకారం ఉద్యమం, ఆరంభంలో కాకపోయినా, కొంతవరకూ సాగేసరికి మాంచి రసకందాయపు పట్టులో పడుతుందని నిశ్చయించాం. సముద్రపుటొడ్డున ఉన్న మా సొంత పొలాలలోమళ్ళు గట్టి సముద్ర జలాన్ని ఆ మళ్ళలోకి మళ్ళించి ఉప్పు పండించాలని నిశ్చయించాం. ప్రభుత్వంవారి ఉప్పు గిడ్డంగులపై దాడి చేద్దాం అనీ,

వీలునుబట్టి ఎవరికి వారే నీటిని మరగబెట్టి ఉప్పును తయారు చేయాలనీ నిశ్చయించాం.

అలాయిదాగా ఈ కార్యక్రమాన్ని నిశ్చయించుకున్నాక నేను చెన్నపట్నం వెళ్ళాను. ఈ ఉప్పుసత్యాగ్రహాన్ని గురించి కలాన్నింకా సాగించేలోపల, 1928-29 లలో జరిగిన ఇతర సంఘటనలను గురించి కూడా కాస్త చర్చిద్దాం.

## ఆంధ్రుల కాంగ్రెసు ఆశయ సాధన

కలకత్తా కాంగ్రెసులో కల్లు, సారా అమ్మకాలను నిషేధించాలనీ; విదేశ వస్త్ర బహిష్కరణ చెయ్యాలనీ; కేంద్రంలోనూ, రాష్ట్రాల లోనూ ఉన్న శాసన సభ్యులందరూ నిర్మాణాత్మక కార్యక్రమ విధానాల పట్ల ఆసక్తి చూపాలనీ; కాంగ్రెసు మెంబర్లను విరివిగా జేర్చుకోవాలనీ; అంటరానితనం మంట గలపాలనీ; స్వచ్ఛంద సేవకులకు 'పిలుపు' పంపి, వారిని సరి అయిన పద్ధతులమీద తయ్యారు చెయ్యాలనీ; గ్రామ పునర్నిర్మాణానికీ, కష్టజీవుల సంఘాల స్థాపనకీ గట్టిగా కృషి చెయ్యాలనీ - తీర్మానించాము.

ఈ ఆశయాలను అమల్లో పెట్టడం విషయంలో ఎంతో ఉత్సాహం చూపబడింది. ఆంధ్ర దేశంలో ఒక్కొక్క ఆశయ సాధనకీ ఒక్కొక్క సంఘం ఏర్పరచబడింది. ప్రజలు కాంగ్రెసులో చేరినా చేరకపోయినా, నిర్మాణాత్మక కృషిలో వారు ఎప్పుడూ కాంగ్రెసుకు దన్నుగానే ఉండే వారు. మత సామరస్యం సాధించడానికి కొందరు వ్యక్తులు తంటాలు పడ్డా, వారి ప్రయత్నాలు అట్టే ఫలవంతం కాలేదు. ప్రజలలో చాలా మంది స్వాతంత్ర్య ఫలసిద్ధికోసం కాంగ్రెసుకు ఎప్పుడూ అండగా నిలుస్తూ, పిలుపు వచ్చిన వెంటనే రంగంలో ఉరకడానికి సిద్ధంగా ఉంటూండేవారు.

ఆంధ్ర దేశంలోని అన్ని జిల్లాలూ, తాలూకాలూ పదేపదే తిరగడంలో, నేను ఒకే ఒక సంగతి గ్రహించాను. ఈ రాష్ట్రంలోని ప్రతి మండలం, ప్రతి గ్రామం నాదేననీ, ప్రతి వ్యక్తీ నా వాడేననీ, నేను ఎప్పుడూ వాళ్ళవాడనే ననే భావం నాకు కలిగింది. ఆంధ్ర అంటే ప్రకాశం,

ప్రకాశం అంటే ఆంధ్ర అన్న స్థాయికి నా రాష్ట్రీయులూ, నేనూ వచ్చేశాం అన్నమాట! సుమారు ఇరవై సంవత్సరాలపాటు రాష్ట్రీయ కాంగ్రెసు సంఘ అధ్యక్ష స్థానం వహించి ఉండడాన్ని, రాష్ట్రీయులందరి ఆదరాభిమానాలను పూర్తిగా సంపాదింపగలిగా నన్నమాట! నేరుగా వారందరితోనూ కలిసి పోవడమనేది నా హృదయంలోనేగాదు, నా రక్తంలో నే ఉందన్నమాట.

## రైతుల ఆందోళనకి నాయకత్వం

1927-30 ల మధ్య మూడు సంవత్సరాలలోనూ రీసెటిల్మెంట్ అన్న ప్రాతిపదికమీద ప్రభుత్వంవారు భూమి శిస్తు విధానపు త్రాళ్ళను బిగించడం తథ్యంగా కనిపించింది. ముఖ్యంగా నా నియోజకవర్గంలో, ఆ కృష్ణా గోదావరీ మండలాలలో అటువంటి పని జరిగే సూచన కనిపించింది. అప్పట్లో పి. జి హోల్డ్స్వర్త్ (P.G. Holdsworth) స్పెషల్ సెటిలుమెంట్ ఆఫీసరుగా ఉండేవాడు. దర్మిలా 1939 లో నేను, కాంగ్రెసు పాలనలో, రెవెన్యూ మంత్రిగా వ్యవహరించినప్పుడు, ఈ హోల్డ్స్వర్త్ నా క్రింద కార్యదర్శిగా పనిచేశాడు.

కాంగ్రెస్సూ, నాబోటి కార్యోత్సాహులం ప్రజాక్షేమానికి సంబంధించిన వివిధ కార్యాలలో నిమగ్నుల మయ్యాం. కాంగ్రెసు కార్యక్రమానికీ, మా పనికీ అంత సంబంధం లేకపోయినా, ప్రజా క్షేమానికి సంబంధించిన ఎన్నో కార్యాలు మేం చేపట్టవలసి వచ్చింది. రీసెటిల్మెంటు పేరున భూమి శిస్తు పెంచితే రైతులు ఇబ్బందుల పాలవుతారు కనుక, ప్రజలకు రక్షణ ఇవ్వడం కాంగ్రెసువారి కర్తవ్యంగా భావించి, రాష్ట్రీయ కాంగ్రెసు అధ్యక్షుడుగా నేను ఈ విషయంలో పూనుకోవలసి వచ్చింది.

మదరాసు శాసన సభవారు అప్పటి ద్వంద్వ ప్రభుత్వ విధానానికి అనుగుణంగా, ఒక మంత్రిగారి ఆధిపత్యాన, ఈ విషయాలు పరిశీలించడానికిగాను, ఒక ఉప సంఘాన్ని ఏర్పరచారు. అప్పుడు అధికారంలో ఉన్న జస్టిస్ పార్టీవారికీ, కాంగ్రెసు వారికీ ఎప్పుడూ చుక్కెదురేగా! అందుచేత, వారి విచారణ సంఘంతోపాటు, మా రాష్ట్రీయ

కాంగ్రెసు సంఘంవారు కూడా, తమకొక ప్రత్యేక నివేదిక కోసం, ఒక ఉప సంఘాన్ని నియమించారు.

ఆ శాసన సభ కమిటీవారి తుది అభిప్రాయాలు ఎల్లా ఉంటాయో, వారు ఏ దృక్పథంతో ఈ విషయాలు పరిశీలిస్తారో అంతు చిక్కలేదు. ఆ మంత్రులు ఏ విధంగానూ ప్రజలకు బాధ్యులు కారు. వారి ఆలోచనలు ప్రజా సహకారం కాంక్షించేవిగా ఉంటా యనుకోవడానికి వీలులేదు. రెవెన్యూ శాఖ, కార్యనిర్వాహకవర్గపు సలహాదారుగా ఉన్న కాంప్‌బెల్ (Compbell)గారి చేతిలో, ఒక ప్రత్యేక విషయంగా ఉండేది. ఆ కమిటీ చైర్మన్ అభిప్రాయంతోగాని, ఆ ముగ్గురు మంత్రుల అభిప్రాయంతోగాని (వారి అభిప్రాయం అనుకూలంగా ఉన్నా), రెవెన్యూ మెంబరుగాని, ప్రభుత్వం తాలూకు రిజర్వుడు సెక్షన్ వారుగాని ఏకీభవించ నవసరంలేదు. అసలు, వారి అభిప్రాయాలను వీరు ఏ విధంగానూ పట్టించుకో నవసరంలేదు.

## కాంగ్రెసు సంఘ నివేదిక

రైతుల పరిస్థితి చాలా అగమ్యగోచరంగా ఉంది, అప్పటికే వారు భరించరాని పన్నులు చెల్లించవలసిన స్థితిలో ఉంటూ, అప్పులలో మునిగి ఉన్నారు. ఎప్పటి కయినా ఆ ఋణాలనుంచి బయటపడి, భూమికి నిజమైన హక్కుదార్లయ్యే అవకాశం ఏ మాత్రం ఉన్నట్లు లేదు. ఆ కమిటీవారి విచారణ సమగ్రంగా లేదు. అంతకంటె మా కాంగ్రెసు సంఘంవారి నివేదిక ఎంతో సమగ్రంగానూ,విమర్శనాత్మకంగానూ ఉంది.

నేను నా నియోజకవర్గంలోని మూడు జిల్లాలలోనూ గ్రామ గ్రామానికీ వెళ్ళి పరిస్థితులు సమగ్రంగా గ్రహించాను. వ్యవసాయపు పెట్టుబడులూ, వ్యవసాయానికయ్యే ఇతర ఖర్చులూ, ఫలసాయంవల్ల వచ్చే ఆదాయమూ పరిశీలిస్తే, రైతులకి ఖర్చులు పోగా వారి కుటుంబ పోషణకి సరిపోయేపాటి ధనం కూడా మిగలడం లేదని తేలింది.

ఆ సెటిల్మెంట్ ఆఫీసరుగారు వ్యవసాయపు ఖర్చులు నిర్ధారణ చేయడానికి అవలంబించిన పద్ధతి గమనిస్తే, ఆ లెక్కలు సక్రమ మయినవి కావని, తేలింది. అక్రమ పద్ధతిగా వేసిన ఆ లెక్కలు చూస్తే,

రైతుకు వ్యవసాయాది ఖర్చులుపోను మంచి ఆదాయం లభిస్తోందనీ ఇంకా ఏవయినా పన్నులు వెయ్యవలసివస్తే, అతనికి కష్టంగాని నష్టం గాని ఉండదనీ తేలుతూంది.

అందువల్ల మా తంటాలన్నీ ఆ సెటిల్మెంట్ ఆఫీసరుగారి రిపోర్టు ప్రభుత్వంవారు త్రోసిపుచ్చేటట్టు చెయ్యాలని.

ఘనంగా సాగిన మా అలజడి సత్ఫలితాలనే యిచ్చింది. అధికంగా విధించబడిన పన్నులు ఏ పరిస్థితిలోనూ, ఎంత మాత్రం చెల్లించమని రైతులు నొక్కి వక్కాణించారు. పించను పుచ్చుకుని వెళ్ళిపోయిన తర్వాతకూడా గవర్నర్‌గా పనిచేసి విరమించిన విల్లింగ్‌డన్ ప్రభువు బోటివారికి మరపురాని విధంగా సాగిన మా గుంటూరు పన్నుల నిరాకరణ ఉద్యమం మదరాసు గవర్నమెంట్‌వారు లోగడ రుచిచూసే ఉన్నారు.

## పెంచిన పన్నుల వాయిదా

పరిసర జిల్లాలవారు కూడా ఆనాడు చూపించిన అభిమానం, వగైరాలన్నీ గ్రహించిన మద్రాసు ప్రభుత్వంవారు ఈ రీసెటిల్మెంట్ విషయంలో మిగిలిన కార్యక్రమం యావత్తూ విరమించుకున్నారు. ఆ సెటిల్‌మెంట్ ఆఫీసరు సూచన ప్రకారం, ఏటా 17 లక్షల రూపాయల అదనపు ఆదాయం వస్తుంది. కాని దాని వసూలు మా ఆందోళన ఫలితంగా నాలుగు సంవత్సరాలపాటు వాయిదా పడింది.

నేను కేంద్ర శాసన సభా సభ్యుడుగా ఉంటూన్న రోజులలో సేకరించిన ఈ సమాచారమంతా ప్రజల్ని ప్రత్యక్ష చర్యకి తయారు చెయ్యడానికి ఉపకరించింది. మదరాసు ప్రభుత్వంవారు వేసిన అదనపు పన్నులు ఆపు చెయ్యడానికీ ఉపకరించింది.

ఈ విషయంలో నేను చాలాసార్లు కాంప్‌బెల్‌ను కలుసుకున్నాను. గవర్నమెంట్ ఒత్తిడి చేస్తే, ప్రజలు పన్నుల నిరాకరణకి సిద్ధం అవడానికి సావకాశం ఉన్నదని కాంప్‌బెల్‌ను నమ్మించగలిగాను. ఈ విషయం నేను కేవలం కాంగ్రెసు నాయకుడిగా మాత్రమేగాక, కేంద్ర శాసన సభా సభ్యుడిగా కూడా నమ్మకంగా చెప్పగలనని హెచ్చరిక

జేశాను. రైతు లందరూ కట్టుగా ఒకే మాటమీద నిలబడి ఉండడం గమనించిన ప్రభుత్వంవారు, 1932 వరకూ అమలు పరచమని అదనపు పన్నులు వాయిదా వేయవలసివచ్చింది.

ఆ రోజులలోనే గాంధీగారు రౌండు టేబిల్ కాన్ఫరెన్సునుంచి తిరిగి రావడమూ, ఆ సందర్భాన్ని పురస్కరించుకుని, ఒక అపసవ్యపు సాకుతో, నన్నూ, ఇంకా కొంతమంది మిత్రులనూ ప్రభుత్వంవారు అరెస్టు చేయడం జరిగింది. పెంచిన పన్నుల రద్దు చేయకపోయినా, ప్రభుత్వానికి వాటిని వసూలు చేయగల దమ్ము లేకపోయింది.

ఈ ప్రకారంగా తమ నాయకులయందు భక్తి ప్రపత్తులుగల ఆంధ్ర ప్రజానీకం, ఆ నాయకులపట్ల విశ్వాసంతో ప్రవర్తించి, తమ మీద ప్రభుత్వం విధించిన హెచ్చు పన్నుల బాధనుంచి, తమకు తాము గానే విముక్తులయ్యారు. ఈ సందర్భంలో వారు కాంగ్రెసు అధిష్ఠాన వర్గంవారి సహాయంగాని, దేశంలోని ఇతర ప్రఖ్యాత నాయకుల సహకారంగాని వాంఛించలేదు.

లాహోరు కాంగ్రెస్ తీర్మానానుసారంగా కేంద్ర, రాష్ట్రీయ శాసన సభలలోని కాంగ్రెసు సభ్యులందరూ ఏకగ్రీవంగా వారి వారి సభ్యత్వాలకు రాజీనామాలిచ్చి యుద్ధానికి సిద్ధమయ్యారు. యావత్తు భారత దేశంలోనూ నడచిన ఆ ఉప్పు సత్యాగ్రహపు చరిత్ర ప్రపంచ చరిత్రకే తలమానిక మయింది. ప్రతి రాష్ట్రంలోనూ జరిగిన సంఘటన లన్నీ రాబోవు తరాలవారి ప్రయోజనం కోసం సరిగా రికార్డుచేసి ఉంచ వలసిన బాధ్యత చరిత్రకారుల భుజస్కంధాలమీద ఉంది.

# 9

## దక్షిణాదిని ఉప్పు సత్యాగ్రహం

నేను పట్నంచేరేసరికి మదరాసు పరిస్థితి చాలా నిర్జీవంగా కనబడింది. శవం వెళ్ళిన కొంపలా కళా విహీనంగా ఉంది ఆ మహాపట్నం. ఆ పరిస్థితిలో నాకు రెండే రెండు గొంతుకలు వినబడ్డాయి: ఒక గొంతుక

గద్దె రంగయ్యనాయుడిది, రెండవది పి. ఎస్. భాష్యం చెట్టిది. వారు ఉభయులూ ఉప్పు సత్యాగ్రహాన్ని గురించి ప్రబోధం చేస్తున్నారు. ఆ ప్రబోధాలను గురించి చిన్న చిన్న రిపోర్టులు పేపర్లలో అక్కడక్కడ ఏ మారుమూలో కనబడేవి.

తంజావూరు జిల్లాలో వేదారణ్యం గ్రామంనుంచి రాజగోపాలాచారిగారు ఉద్యమం నడపనున్నారని విన్నాను. మదరాసు వాతావరణాన్ని పరిశీలించిన ఆచారిగారికి అక్కడి పరిస్థితులు సత్యాగ్రహ సమరానికి అనుకూలంగా లేవని తోచినట్లుంది. అదే అభిప్రాయం ఆ పురవాసులలో చాలా మందికి ఉన్నట్లు గ్రహించాను. మదరాసు మేయరు సత్యాగ్రహంపట్ల వ్యతిరేకంగా ఉన్నాడు.

"హిందూ" పత్రిక అనుకూలంగా లేదు. నా సంపాదకత్వాన నడుస్తూన్న 'స్వరాజ్య' పత్రిక, కృపానిధీ, ఖాసా సుబ్బారావు మాత్రం ఎలాగయితేనేం కాంగ్రెసు తత్వం, కాంగ్రెసు కార్యక్రమ విధానాలపట్ల సహనం చూపగలిగారు. ఆ పట్నంలో ఉన్న ఆ కొద్దిపాటి కాంగ్రెసు నాయకుల పరిస్థితి అల్లా ఉన్నా, నాకు మాత్రం ప్రజా హృదయం కాంగ్రెసు వైపే మొగ్గి ఉందనీ, ఉద్యమానికి మంచి ప్రోత్సాహం లభించి అది విజయవంతం అవుతుందని గట్టి నమ్మకమే.

1921 లో స్థాపించబడింది లగాయితు నాచే నడపబడుతూన్న 'స్వరాజ్య' పత్రిక యీ పది సంవత్సరాలలోనూ నిరాటంకంగా, కాంగ్రెసుకు అనుకూలంగా, నిర్భీతితో ప్రచారం చేస్తూ, చిన్నలకీ - పెద్దలకీ, అజ్ఞానులకీ - విజ్ఞానులకీ కూడా కావలసిన ప్రబోధాన్ని సమకూరుస్తూనే ఉంది. మా పత్రికని అతివాద పత్రికగానే జమకట్టి త్రోసిపారేసేవారు. సైమన్ కమిషన్‌వారు పట్నానికి వచ్చిన ఆ రెండు సందర్భాలలోనూ (1928, 29) మద్రాసు పౌరులు యావన్మందీ ఒకే త్రాటిమీదా, ఒకే మాటమీదా ఉంటూ, కాంగ్రెసు ఆదేశాన్ని ఎల్లా పాటించారో అందరూ ఎరిగినదే.

మదరాసు ప్రజానీకాన్నీ, వారి హృదయాన్నీ నేను 1921 నుంచీ కేవలం ఒక రాజకీయ వేత్తగా మాత్రమే గ్రహించలేదు; 1907 నుంచీ

ఒక ప్రఖ్యాత న్యాయవాదిగా కూడా వారి హృదయం నాకు సువిదితమే. అందువల్లనే నాకు మద్రాసు పౌరులయందు అఖండ విశ్వాసం ఉంది. దానికి తోడుగా, నాకు చాలా సన్నిహితులయిన మిత్రులతోనూ, హృదయాంతరాలలో కాంగ్రెసుపై అభిమానం గల ఇతర నాయకాగ్రగణ్యులతోనూ సంప్రతించి మరీ కార్యరంగంలో ప్రవేశించాను. ముందుగా వాలంటీర్ల మకాములకు, వారికి శిక్షణ ఇవ్వడానికీ వీలుగా ఉండే తావు కోసం అన్వేషణ ఆరంభించాము.

### ఉ ద య వ న ం  క్యా ం పు

లోగడ పంజాబులో గురుకాబాగ్ క్యాంపును గురించీ, ఆనాటి నా అనుభవాలను గురించీ, అప్పుడు కలిగిన అభిప్రాయాలను గురించీ విశదంగా తెలియజేసే ఉన్నాను. ఆ అనుభవాలను పురస్కరించుకుని సమగ్రమయిన, పరిపూర్ణమయిన క్యాంపును నడపడానికి వలసిన ఒక సువిశాలమయిన బంగళా కోసం మద్రాసులోని పేటలన్నీ గాలించాం. ఇటువంటి ప్రభుత్వ వ్యతిరేక చర్యకు స్థావరంగా జాగా యివ్వడానికి చాలామంది భయపడ్డారు.

మైలాపూరులో ఉన్న 'ఉదయవనం బిల్డింగ్స్' అనే ఒక విశాల భవనం ఖాళీగా ఉన్న సంగతి తెలుసుకుని, ఆ భవనం యజమానిని కలుసుకోవడానికి స్వయంగా నేనే బయల్దేరాను. ఆయనకీ ఏవేవో భయాలు, సంకోచాలూ ఉన్నా, నెలకి రెండు వందలు అద్దె క్రింద యిస్తానని అనడాన్ని, కొంచెం మెత్తబడ్డాడు. వ్రాతమూలకమయిన అగ్రిమెంట్లయిన తర్వాత, అడ్వాన్సు ఇచ్చి, ఆ బిల్డింగును మా ఆధీనంలోనికి తీసుకున్నాం. అది బాగా విశాలమయిన భవంతి కాకపోయినా, దానికి మూడంతస్తు లున్నాయి. ఇంటి ఆవరణలో ఉన్న ఖాళీ జాగా వాలంటీర్లకి ట్రెయినింగ్ ఇవ్వడానికి సుమారుగా సరిపోతుంది.

వాలంటీర్ల కోసం నేనొక విజ్ఞప్తి జేశాను. శ్రీమతి దుర్గాబాయి ఆధీనంలో ఆ సంస్థ నడప దలచాము. పట్నంలో పబ్లిక్ మీటింగ్ పెట్టే లోపల, జిల్లాలవారీగా జరుగుతూన్న ఏర్పాట్లను చూడడానికి బయల్దేరాను.

ఆంధ్ర రాష్ట్రంలో ప్రతిజిల్లాలోనూ లీడర్లకూ, వర్కర్లకూ ఎప్పుడూ లోటులేదు. సహకార నిరాకరణ ఉద్యమం ఆరంభించిన నాటినుంచీ ఆంధ్ర రాష్ట్రంలో నాయకులకి ఎప్పుడూ కొరత రాలేదు. అప్పటి కప్పుడే గడచిన, ఏడు సంవత్సరాలుగా మేమంతా నీళ్లల్లో కయినా, నిప్పులలో కయినా సరే, దూకడానికి సిద్ధమయ్యే ఉన్నాం. కాంగ్రెసు కమిటీలుగాని, కాంగ్రెసు వర్కర్లుగాని సవ్యంగా పనిచేస్తు న్నారా-లేదా అన్న విచారం నా కెప్పుడూ లేదు.

మన రాష్ట్రంలో ప్రజలు అవసరం వచ్చినప్పుడు ముందుకు వస్తారన్నది ఎప్పుడూ అబద్ధం కాలేదు. మనవాళ్లు ఆరితేరిన చిచ్చర పిడుగులే అయినా, శాంతి సమర విధానంపట్ల కాగి చల్లారిన పాలు. 1921 నాటి శాసన ధిక్కార సంరంభంలోనూ, 1922 లో గుంటూరు పన్నుల నిరాకరణ ఉద్యమంలోనూ, సైమన్ కమిషన్ బహిష్కరణ విషయంలోనూ, శాసన ధిక్కార సంరంభాలలోనూ మనవాళ్ళు విజ యాలు సాధించిన యోధులే.

కాల వ్యవధిలేని కారణంగా, జిల్లాలకు ఉరుకులమీద వెడుతూ, ప్రజలలోని ఉత్సాహాన్నీ, వారికి ఉన్న పట్టుదలనీ గ్రహించగలిగాను. నిమిషాలమీద అన్ని జిల్లాలవారూ, ఎల్లా ఎల్లా పదకాలమీద పదకాలు వేసుకుని, ఈ ఉప్పు సత్యాగ్రహానికి సన్నద్ధులవుతూ ఉన్నదీ గ్రహించాను

ఆంధ్ర పత్రికా సంపాదకులూ యజమానులూ అయిన దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు నేను ఢిల్లీనుంచి వచ్చే నాటికి పట్నంలో తాము ఏ విధంగా కార్యభారం వహించాలో, ఏం చెయ్యాలో కూడా అంతు చిక్కని పరిస్థితిలో ఉన్నారు. పట్నంలో అనువయిన వాతావరణం లేదనే ఆయనా తలచారు. ఆయన బందరుకో, గుంటూరుకో వెళ్ళి, డా॥ పట్టాభి సీతారామయ్యగారితోటో, దేశభక్త కొండ వెంకటప్పయ్యగారితోటో కలిసి యేమయినా చేద్దాం అని అను కున్నారు. ఆయన బందరూ, గుంటూరూ కూడా వెళ్ళి, ఈ సంరంభా

నికి వారు ఏ విధానాలు అవలంబించ నున్నారో తెలుసుకున్నారు. నేను పట్నం చేరేసరికి వారు ఆ జిల్లాలలో పర్యటిస్తున్నారు.

నేను కృష్ణా, గుంటూరు జిల్లాలలో పర్యటించాను. బందరులో కృష్ణాజిల్లా అన్ని తాలూకాలనుంచి వచ్చి పాల్గొనే వాలంటీర్ల విడుదల కోసమూ, వారికి చేయవలసిన భోజనాది సదుపాయాల కోసమూ బ్రహ్మాండమయిన ఏర్పాట్లు జరిగాయి. మా విజయాన్ని గురించి నాకు నమ్మకం మరింత దృఢమయింది.

## బందరులో ఉప్పు పొట్లాల అమ్మకం

బందరులో ఉన్న పరిస్థితులు గమనిస్తూన్న సందర్భంలో అప్పుడే అక్కడ సత్యాగ్రహ సమరం ఆరంభం అయిందని గ్రహించాను. వాలంటీర్లు తయారుచేసిన చిన్నచిన్న ఉప్పుపొట్లాలు బహిరంగ సభలలో అమ్మడం జరిగింది. జరుగుతూన్న సమర విధానంలో పోలీసులు ఏమీ కలుగజేసుకోవడం లేదు. అక్కడ సముద్రతీరంలో కొన్ని పల్లపు ప్రాంతాలలో సముద్రపునీరు కెరటాలుగా వచ్చి ఎండ వేడిమికి ఎండి ఉప్పు బిళ్ళలు బిళ్ళలుగా ఆ నీటిపై అచ్చు కడుతోందని, అదే ప్రకారం ఎండ తాపానికి తయారయ్యే ఉప్పుగల్లులు ఏరడానికే గాంధీగారు 'దండీ'కి బయల్దేరారనీ గ్రహించాను.

పోలీసులు ఏవిధమయిన చర్య తీసుకోని కారణంగా నేను కొంతమంది మిత్రులతో కలిసి, కారులో ఆ ప్రాంతాలకు వెళ్ళి, అచ్చట స్వభావ సిద్ధంగా తయారవుతూన్న ఉప్పు గల్లులను పెద్ద ఎత్తున పోగు జేశాను. నేను నాలుగైదు వేలు జేసే నాయుడిగారి సొంతకారులో బయల్దేరాను. నాతో కొంతమంది వర్కర్లున్నారు. వారిలో బోంబే క్రానికల్ పత్రికలో పనిచేస్తూన్న కీ॥ శే॥ సుబ్బారావుకూడా ఉన్నాడు. ఆ భూములు ఊరికి నాలుగైదు మైళ్ల దూరంలో ఉన్నాయి. దారి పొడుగునా వాలంటీర్ల క్యాంప్‌లు ఉన్నాయి. కొంతమంది వాలంటీర్లు మా కారును వెంబడించారు. అక్కడ సుమారు వెయ్యిమంది వాలంటీర్లు ఈ ఉప్పుగల్లులను ఏరుతున్నారు.

వీరందరితో కలసి ఆ ప్రాంతానికి నేను వెళ్ళడ మన్నది ఒక అలజడిని లేవతీసింది. మేము ఆ నీటిలో దిగి సుమారు రెండు బస్తాల ఉప్పును సేకరించాము. ఆ రెండు బస్తాల ఉప్పూ కారులో వేసుకుని వెనక్కి బందరు వెళ్ళాము. పోలీసువారు ఆ కారునీ, ఆ రెండు బస్తాల ఉప్పునే గాక మాలో కొందరినయినా నిర్బంధిస్తారని తలచాను. కాని నా ప్రయాణమూ, ఉప్పును ప్రోగుజేసుకు రావడమూ అన్నవి ముందుగా అనుకోని పను లవడాన్ని వారికి ఆశ్చర్యం కలుగజేసినా, అవసర చర్యలు తీసుకోవడానికి అవకాశం లేకపోయింది.

## గుంటూరులో ఉప్పు తయారీ

తిరిగి వచ్చి, తెచ్చిన ఉప్పు పెద్ద పెద్ద మొత్తాలుగానే ఊళ్లో పంచి పెట్టించి, నేను బెజవాడ మీదుగా గుంటూరు వెళ్ళడానికి రైలెక్కాను. నేను రైలులో ఉండగానే ఏ స్టేషన్‌లో నయినా అరెస్టు కావచ్చునని వారంతా భావించారు. అటువంటిదేమీ జరక్కుండానే నేను గుంటూరు వెళ్ళి, అక్కడ కాంగ్రెసు వర్కర్లు సముద్రపు నీరు మరగబెట్టి ఉప్పు చెయ్యడం గమనించాను. అప్పటికీ గుంటూరు పోలీసులుకూడా ఏవిధమయిన చర్యా తీసుకోలేదు. అక్కడి మిత్రులతో నేను బందరులో చేసిన చేతలను వివరించి చెప్పి, ఆ జిల్లావారు ఎలా పోరాటానికి ఉద్రిక్తులయి తయ్యారుగా ఉన్నారో వివరించాను. పోలీసులు ఈ వేళ యేమీ చేయకపోయినా, వారు అలా చూస్తూ కూర్చోడానికి తావు లేదనీ, ఈవేళగాకుంటె రేపయినా వారు అరెస్టు చెయ్యక తప్పదని వివరించాను.

దేవరాంపాడు గ్రామంలో సముద్రతీరాన ఉన్న స్వంతభూములలో ఉప్పు పండించమనీ, అక్కడికి 2 మైళ్ళ దూరంలో ఉన్న కనపర్తి గ్రామంలో ఉన్న ప్రభుత్వపు ఉప్పు గిడ్డంగిపై దాడి సలపమనీ సలహా యిచ్చి, దేవరాంపాడులో నా కున్న ఆ కాస్త భూమిని వాలంటీరు క్యాంపు నడుపుకోవడానికి ఇచ్చాను. మా ఉద్యమానికి బలం చేకూరిన కొద్దీ, ఆ గ్రామంలో నెలకొల్పబడిన ఉప్పు సెంటరు చాలా

పెద్దదయింది. గుంటూరులోని మిత్రులతో సంభాషించిన తర్వాత నేను చెన్నపట్నం వెళ్ళిపోయాను.

## మదరాసు పౌరుల ఉత్సాహం

చెన్నపట్నంలో జరిగిన మొట్టమొదటి సత్యాగ్రహ సభ కోటకు ఎదురుగా ఉన్న విశాల మైదానంలో జరిగింది. ఆ మీటింగు నాటికే ఉదయవనం క్యాంపు పూర్తిగా నిండిపోయింది. పట్నంనుంచీ, పరిసర ప్రాంతాలనుంచేగాక, ఆంధ్ర, తమిళ, మలయాళదేశాలనుంచి వచ్చిన వారందరితోటీ ఆ క్యాంపు నిండిపోయింది. వాలంటీర్లు వచ్చింది ఆ రాష్ట్రం నుంచా, ఈ రాష్ట్రంనుంచా అన్న ప్రసక్తే మాకు కలుగలేదు. ఆ పట్నం రాష్ట్ర మొత్తానికి ముఖ్యపట్టణం అవడాన్ని, రాష్ట్రమందలి అన్ని ప్రాంతాలవారికి మార్గం చూపడమే మా పని అని మేము భావించాం. వాలంటీర్లను పది పదిహేను మందిగల బాచిలుగా విభాగించి, రోజూ ఒక బాచ్‌వారు, ఆ పురవీధులగుండా తిరగవలసి ఉంటుందని నిర్ధారణ జేశాం. అందు మొదటి బాచ్ పదిహేనుమంది ఏ యే రస్తాలద్వారా ఊరేగాలో కూడా నిర్ణయించాము.

మొదటి బాచ్ యింకా రెండు రోజులలో బయల్దేరుతుందనగా, మొట్టమొదటి బహిరంగ సభ ఏర్పాటయింది. ఇంకా నేను కాంగ్రెసు వారి ఆశయమూ, వారు చేయదలచిన పని వివరంగా చెప్పకుండానే కె. భాష్యమూ, బషీర్ అహమ్మద్ అనే ఇరువురు అడ్వకేట్లు నా కంటె ముందుగా ప్రజాసమూహానికి తమ ఉపన్యాసం వినిపించాలని ఉన్నదని, ముందుగా వారిని మాటాడనియ్యవలసిందనీ కోరారు. వారు ఉభయులూ కూడా నన్ను బాగా ఎరిగినవారే. కాని నన్నూ, అక్కడ జేరిన ప్రజానీకాన్నీ పట్నంలో కావలసిన వాతావరణం లేదని ఒప్పించాలని వారి ఉపన్యాసంలో వివరించారు. అంతేకాదు, అక్కడ మేము శాసన ధిక్కారం చేయబూనడమూ, ఉప్పు చట్టాన్ని వ్యతిరేకించాలని తలచడమూ వృథా శ్రమ అనీ, అందువలన ఆ పట్నంలో అటువంటి ప్రయత్నాలేవీ చేయవద్దనీ నన్ను కోరారు.

వారి ఉపన్యాసం పొంతం అయ్యాక, ఉన్న పరిస్థితి యావత్తూ విశదపరస్తూ, కాంగ్రెసు పిలుపును ప్రజలు మన్నించి తీరాలని హెచ్చరించాను. ఆ యిరువురి మిత్రులతోనూ మద్రాసు నగరం సజీవంగానే ఉన్నదనీ, అచ్చటి ప్రజలు ఎటువంటి త్యాగానికయినా సరే సిద్ధపడి, భారతీయ స్వాతంత్ర్య సమరంలో వారి స్థానాన్ని చరిత్రాత్మకం చేసుకుంటారనీ మనవి చేశాను.

ఆ సభలో జనం కనబరచిన ఉత్సాహం అవధులు దాటింది. మదరాసు వాతావరణాన్ని గురించి మాటలాడిన ఆ ఇరువురి పెద్దలకూ కూడా 'మదరాసు' చాలా ఉత్సాహవంతంగానూ, సజీవంగానూ ఉన్నదనీ, పట్నం గనుక ఈ పోరాటంలో పాల్గొనకపోతే, భారతదేశ రాజకీయ చరిత్రాత్మక పటంనుంచి మదరాసువారే తమ గ్రామ నామాన్ని తుడిచి పారేసినవా రవుతారనీ తేలిపోయింది.

తరవాత నేను ఉదయవనం క్యాంపును గురించి వివరించి, మనం మన ఉద్యమాన్ని ప్రతిభావంతంగా నడపిస్తూ జయాన్ని సాధించే పర్యంతమూ ఆ క్యాంపును నడపవలసి ఉన్నదనీ, అది సవ్యంగా నడిచే బాధ్యత యావత్తూ ప్రజానీకంపైనే ఉన్నదనీ, దానికి కావలసింది కేవలం ధనం మాత్రమే కాదనీ, తినడానికి కావలసిన వస్తుసముదాయం కూడా ఎంతో అవసరమనీ చెప్పాను.

గురుకాబాగ్‌లో అకాలీ సత్యాగ్రహ సమరం నడచిన తీరూ దానికి కావలసిన వస్తుసముదాయం వారెల్లా సమకూర్చుకున్నదీ వారి వాలంటీరు దళాలలో పెద్ద పెద్ద కుటుంబాలకు చెందిన స్త్రీలూ, పురుషులూ, వైద్యులూ, నర్సులూ మున్నగు వారంతా చేరి ఎటువంటి సేవలు చేసినదీ విశదపరచాను. తుదకు ప్రభుత్వంవారే దారిలోకి వచ్చి, అకాలీల హక్కుగా వారి ఆలయ ప్రవేశానికి ఎల్లా తప్పని సరిగా ఒప్పుకోవలసి వచ్చిందీకూడా వివరించాను.

అటువంటి సహకారం మద్రాసు పౌరులనుంచి ఉదయవనం క్యాంపుకు ఆశిస్తున్నాననీ చెప్పాను. నేను మాటాడిన తరవాత గద్దె

రంగయ్య నాయుడూ, భాష్యం చెట్టి గార్లేగాక, శ్రీమతి దుర్గాబాయి కూడా ఆ సభలో ఉపన్యసించి ప్రజల సహకారాన్ని కోరారు.

ఈ ప్రథమ బహిరంగ సభలో చేసిన విన్నపాలే ప్రజల్ని ఊపి వేసి, వారి హృదయాలలో సుస్థిరంగా నాటుకున్నాయి. ఉప్పుమీద పన్ను వేసే ప్రభుత్వ విధానమూ, విరివిగా లభ్యమయ్యే సముద్రజలాల నుంచీ, దేశంలో పలుచోట్ల ఉన్న ఉప్పు గుంటలనుంచీ నిత్యావసర వస్తువయిన ఉప్పును సంపాదించడానికి కూడా ఎటువంటి అభ్యంతరాలను ప్రభుత్వం కలుగజేస్తున్నదీ ప్రజలకి స్పష్టం చెయ్యడం జరిగింది. అందువల్లనే, ప్రజల హక్కుల రక్షణకే మహాత్మా గాంధీ ఈ ఉప్పు సత్యాగ్రహాన్ని లేవదీశారనీ విశద పరుపబడింది.

## మొదటి జట్టులో దేశోద్ధారకుడు

ప్రబోధ ఫలితాలు వెంటనే కనబడ్డాయి. కనబడ్డ ఫలితాలు పరిధులు దాటాయి. ఆ మరుసటి రోజునుంచీ భోజన పదార్థాలు విరివిగా ఉదయవనం క్యాంపుకి జేరనారంభించాయి. అలా వచ్చే సప్లయిలు రోజుల తోటీ, వారాలతోటీ ఆగలేదు; నెలల తరబడి అలా వస్తూనే ఉన్నాయి. మేమంతా జెయిళ్ళకు వెళ్ళినా ఆ సప్లయిలు వస్తూనే ఉన్నాయి! 1931 లో గాంధీ-ఇర్విన్ ఒడంబడికలు సంతకాలయిన దాకా ఆ సప్లయిలు ఆగలేదు. ఆ మీటింగు అయిన తరవాత, నా నాయకత్వం క్రింద సత్యాగ్రహంచేసే మొదటి జట్టులో ఎవరెవరు ఉంటారో వారిపేర్లు వివరంగా పత్రికల వారికి అందజేశాం. పట్నంలో ప్రబోధం, ప్రచారమే గాక, అప్పుడే సంరంభం కూడా ఆరంభం అవుతోందన్న సంగతి విన్న నాగేశ్వరరావు పంతులుగారు పట్నం జేరుకున్నారు. ఆయన తనపేరు కూడా మొదటి జట్టులో చేర్చవలసిందని కోరుతూ టెలిఫోన్ జేశారు. ఆ ప్రకారం వారిపేరు జేర్చాం. ఆయన వచ్చి మాతో కలిశారు.

## సముద్రపు టొడ్డున ఉప్పు పంట

ప్రతి దినమూ అవలంబించ దలచిన కార్యక్రమం ముందుగానే పత్రికా ముఖానా, ఇతర విధాలా కూడా ప్రకటించే వారము. ఆనాటి

సత్యాగ్రహంలో ఎవరెవరు పాల్గొంటున్నారో ముందుగా ప్రభుత్వం వారికి తెలిపే వారం. ఊరేగింపుగా బయల్దేరి ముఖ్యమయిన వీథుల గుండా సాగి వివిధ ప్రాంతాలనుంచి సముద్రపు టొడ్డుకు జేరి, ఆ సముద్రపు నీటితో ఉప్పు జేసేవారు. ఇది ఒక అద్వితీయమైన సంరంభం. ఇదియే ఏ విధంగా పరిణమిస్తుందో, ఏ అంతస్తులను అందుకుంటుందో ప్రభుత్వం వారికి అవగాహన కాని కారణంగా, పదిహేను దినాలపాటు ఏ విధమయిన ఉపద్రవమూ లేకుండా వాలంటీర్లు పురవీథుల గుండా ఊరేగడమూ వగైరా కార్యక్రమాలన్నీ యథాతథంగా అల్లా అల్లా సాగిపోయాయి.

ఈ పదిహేను రోజులపాటూ నేనూ, నాగేశ్వరరావుగారూ ప్రతి దినమూ ఆనాటి జట్టుతో ఊరేగుతూనే ఉన్నాము. క్రమ శిక్షణతో కూడిన కవాతు, డ్రిల్లు వగైరాలకు అలవాటుపడిన సిపాయిల జట్టువలెనే ఉండేది మా జట్టు నడిచే క్రమమూ అదీను. మా వాళ్ళు మార్చింగ్ సాంగ్స్ పాడేవారు. ఆ పాటలలో ప్రభుత్వం వారిని సవాలు జేసేవారు. ఉప్పు చట్టాన్ని ఊడ బెరుక దలచాం కాబట్టి, మీరు చేయగలిగింది ఏమయినా ఉంటే చూసుకోండి అనే హెచ్చరికగా ఆ పాటలుండేవి.

ఉదయవనం క్యాంపులో జేరిన వాలంటీర్లలో ప్రజ్ఞావంతులయిన యువకులుండేవారు. వారు తమ కార్యక్రమం పరిసర ప్రాంతాలకీ, గ్రామగ్రామాలకీ కూడా విస్తరింపజేశారు. కొంతమంది సముద్ర జలాలను పల్లపు ప్రాంతాలకు మళ్ళించడానికి వీలుగా భూమిని దున్ని, కాలువ లేర్పాటుజేసి, నీళ్ళు మళ్ళించి, ఉప్పు మళ్ళు ఏర్పరచేవారు. మార్చిల వలనా, అనుదినం ఉండే బహిరంగ సభల వలనా ఈ ఉద్యమం ఆ 15 రోజులలోనూ శుక్లపక్ష చంద్రబింబంగా దినదినాభివృద్ధి జెందింది. పూర్ణత్వాన్ని పొంద గలిగింది. ఒక వారం పది రోజులయ్యే సరికి ప్రభుత్వం వారికి కాస్త వేడెక్కిందిగాని, ఈ ఉద్యమాన్ని అణచడానికి ఏం చెయ్యాలి, ఎక్కడ ఏ తీరున ఆరంభించాలి అన్న ఆలోచన తెగలేదు.

## దుర్గాబాయి సన్నద్ధత

రెండవ బహిరంగ సభ కూడా ఆ కోట పరిసరాలలోనే, కోటకు ఎదుట ఉన్న బీచీలోనే ఏర్పరుపబడింది. దానిలోనూ నేనే మాట్లాడాను.

తరవాత ట్రిప్లికేన్ బీచ్‌లోనూ, ఇతర ప్రాంతాలలోనూ కూడా సభలు జరగడమూ, వాటిలో ఇతర నాయకులూ, వర్కర్లూ కూడా మాటలాడ డమూ, స్త్రీలు కూడా ప్రముఖ పాత్ర వహించడమూ జరిగింది.

మా తరవాత అరెస్టుకు సిద్ధంగావలసినదని దుర్గాబాయిని నేను కోరకపోయినా, ఆమె అందుకు సంసిద్ధమయి, మాతోపాటు అను దినమూ ఊరేగింపులలో పాల్గొంటూ, మా తరవాత ఉద్యమాన్ని నడప డానికి కావలసిన సాధన సంపత్తి యావత్తూ ఆకళింపుజేసికో నారం భించింది.

రెండవ బహిరంగ సభకి సుమారు లక్షమంది జనం హాజ రయ్యారు. మేము ఆ స్థలానికి జేరే లోపల పోలీసువారూ, మిలిటరీ వారూ కూడా బహు సంఖ్యాకులుగా రోడ్డు పొడుగునా ఉండడమేగాక, కోట ప్రాంతంలో మాకు ఎదురు వరసలో వారు అసంఖ్యాకంగా కన బడ్డారు. గుర్రాలమీద సవారీ చేస్తూన్న రౌతులు (mounted sowars) కొంత మందున్నారు. వీరందరూ ప్రజా రక్షణకోసమే పిలిపించబడి ఉంటారనీ, ఏదయినా గలాటా వస్తే ప్రజా రక్షణచర్య లలో వారు పాల్గొంటారనీ తలచాను. మీటింగు మధ్యలో చెదరగొట్టే ఉద్దేశంతో వారక్కడ చేరారని మేము భావించలేదు.

## మీటింగు మధ్యనుంచి రౌతుల స్వారీ

నేను ఉపన్యాసమిస్తున్నాను. ప్రజలు చెప్పినదంతా నిశ్శబ్దంగా జాగ్రత్తగా వింటున్నారు. హఠాత్తుగా ఆ గుర్రపు రౌతులు ఇసుకలోకి జోరుగా వచ్చి, గుర్రాలను అదిలిస్తూ, ప్రజా సమూహం మధ్యనుంచి, ఆ ఓవరనుంచి ఇటు కోట గుమ్మంవరకూ జోరుగా స్వారీ చేసుకుంటూ రాజొచ్చారు. కొంతమంది జనం మీదుగా గుర్రాలు వెళ్ళినప్పుడు ప్రజ లలో చెప్పరాని భీతి, దిగులూ పుట్టుకొచ్చాయి. ఒక శాంతియుత మయిన బహిరంగ సభను చెదరగొట్టడానికే అధికార్లు ఇటువంటి చర్యలు తీసుకుంటున్నారని తాము గ్రహించే లోపలే ప్రజలు గుర్రాల త్రొక్కు-

ళ్ళాటకి గురియై భీతిల్లి పోవడమూ, చిందర వందరగా అన్ని దిక్కు-లకూ పారిపో ప్రయత్నించడమూ సహజమే కదా?

నా దృష్టి ఆ గుర్రపు రౌతుల చర్యలపైకి మరలించబడింది. ఆ గుర్రపు దాట్ల మధ్య ఇరుక్కుని దెబ్బలు తిన్న ఒక వ్యక్తిని ఉపన్యాస వేదిక వద్దకు మోసుకుని వచ్చారు. ఆ మనిషిని జనానికి చూపుతూ, "ఆగండి! పరుగులెత్తకండి. ఉన్న తావులలోనే కూర్చోండి. భీతి చెంది పరుగులు పెడితే, పారిపోయే గుంపులమీదకి మళ్ళించబడిన గుర్రాలవల్ల ఇంకా ఎక్కువగా దెబ్బలు తగిలే ప్రమాదం ఉంది సుమా!" అని హెచ్చరించాను. ప్రజలు నిశ్చలంగానూ, శాంతియుతంగానూ కూర్చుంటే, వారిమీదకి రావడానికి ఆ అశ్విక దళాల వారికి దమ్ము ఉండదనీ చెప్పాను.

తరవాత ఆ 'సావర్సు'ను హెచ్చరిస్తూ, "నిజంగా మీకు అలజడి కల్గించి అల్లరి చెయ్యాలి, సభను చెదర గొట్టాలి అనే అభిప్రాయం ఉంటే, దూర దూరంగా అక్కడక్కడ చెదురు మదురుగా కూర్చున్న ప్రజల మీదికి గుర్రాలను పోనివ్వడం కంటె, నిశ్చింతగా కూర్చుని ఉన్న ఆ ప్రజానీకం మధ్యనుంచి తిన్నగా, గుర్రాలను అదలించు కుంటూ, మా అందరిపైనుంచీ పోనీయడం సబ"బని చెప్పాను.

కొన్ని నిమిషాలపాటు అలా అలజడి కలిగించి, జనంలో ఇద్దరు ముగ్గురికి దెబ్బలు తగిలిన తర్వాత, వాళ్లంతా ఇంకే విధమయిన అల్లరి లేవదీయకుండా రోడ్డుమీదకి వెళ్ళిపోయారు. ఆ తరవాత సభ సాంతం అయింది.

ఆ ఉపన్యాస వేదికమీద ఉన్న స్త్రీలు, కొంత భీతిపుట్టి, సభా స్థలిని విడిచి వెళ్ళిపోవాలని తలచారు. కాని కొద్ది నిమిషాలలోనే వారు తేరుకుని, వారి స్థానాలను వదలకుండా అంటిపెట్టుకునే ఉండిపోయారు.

ఆ సభకి హాజరయిన జనం పారిపోడానికి ప్రయత్నించకుండా కూర్చుని ఉండడమే మన బలాన్నీ, ఆత్మవిశ్వాసాన్నీ ప్రభుత్వం వారికి ప్రదర్శించిందనీ, ఆనాటి వారి ధైర్యసాహసాలే అంతిమ విజ యానికి దోహద మిస్తాయనీ ఉద్ఘాటించాను. సభలో నిలద్రొక్కుకుని

నిలిచిన స్త్రీలను అభినందించాను. దెబ్బలతో నా వద్దకు తీసుకురాబడిన వ్యక్తి, గుర్రం ముందుగా తన చుట్టూ తిరిగి మీదనుంచి గెంతిన తీరంతా పూర్తిగా వర్ణించి, అదృష్టవశాత్తూ తనకు అట్టే దెబ్బలు తగుల లేదని వివరించాడు ఆ సంఘటన ప్రభుత్వం వారి నిరంకుశ కిరాత చర్యలకు వాచవి అయింది.

## అబద్ధ మయిన మరణవార్త

ఆ పదిహేను రోజులలోనూ అనుదినమూ ఊరేగింపులు జరుగుతూనే ఉన్నాయి. మూడవసారికూడా నేను ఆ కోట ఎదుటఉన్న ఇసుక మైదానంలో సభ యేర్పాటుచేసి మాటాడాలని తలపెట్టాను. ఆ సభకి చాలామంది జనమే వచ్చారు. అదిన్నీ సరిగా వెనుకటి సభ జరిగిన తావులోనే జరుపబడింది. వాలంటీర్లూ మొదలైన వారు చాలామంది తాము చేస్తున్న కృషిని వివరిస్తూ, సముద్రం పొడుగునా అనేక ప్రాంతాలలో వారు ఏ విధంగా ఉప్పును తయారుచేస్తున్నది, ఆ సముద్ర తీరంలో పది పదిహేనుమైళ్ళ ప్రాంతం అంతా వారు ఏ ప్రకారంగా ఆక్రమించినదీ, వారు క్రమేపీ ఆ పట్నానికి చుట్టుపట్ల ఉన్న సముద్ర తీర ప్రాంతాలలోని కుగ్రామాలలోకూడా ఎలా ఉప్పు చట్టాన్ని ఎదిరిస్తూన్నదీ వివరంగా చెప్పారు.

ఈ మీటింగులో నేను నిలబడి ఉపన్యాసం ఆరంభంచేసే సమయంలో, మశూచితో బాధపడుతూన్న నా రెండవ కుమారుడు మరణించాడన్న వార్త ఎవరో మోసుకొచ్చారు. వాడే గనుక చనిపోయి ఉంటే ఈ సమరంలో ముమ్మందుగా ప్రాణాలు గోల్పోయింది వాడే అవుతాడని అన్నాను. మామూలుగానే నేను సభను నడిపాను.

సభానంతరం ఇంటికి వెళ్ళేసరికి ఆ కుర్రవాడు చనిపోలేదని తెలిసింది. వాడు చాలా తీవ్రంగా బాధపడుతూ మృత్యువువాత పడనున్న సమయంలో నా తమ్ముడు డా॥ జానకిరామయ్య వాన్ని రక్షించగలిగాడని విన్నాను. మా తమ్ముడు ఆంగ్లేయ వైద్యంలో అఖండ ఖ్యాతి గణించినా, దాని పట్ల కలిగిన విముఖతతో హోమియోపతీ వైద్యాన్ని చేపట్టి, దానిని క్షుణ్ణంగా చదివి, గడ్డుకేసు లెన్నో సాధించి చాలా

మందికి ప్రాణదానం చేయగలిగాడన్న సంగతి లోగడ వివరించే ఉన్నాను.

పరిపాలకులు మాత్రం నన్నూ, నాగేశ్వరరావు పంతులుగారినీ అరెస్టు చేసిందాకా ఇతరుల జోలికి పోలేదు. నన్ను జైలులోకి నెట్టే వరకూ కాల్పులూ జరపలేదు.

## క్రమంగా ఇళ్లల్లోనే ఉప్పు పంట

అల్లా అనుదినమూ సత్యాగ్రహులు ఎన్నో వీథులమ్మట ఊరేగుతూ ఉంటే, వింత చూడడానికి వచ్చిన వేలాది జనులతో వీథులన్నీ కిట కిటలాడిపోయేవి. ఆ ప్రకారం క్రొత్తదారులు పట్టిపోతూ అన్ని ముఖ్య మయిన పురవీథులనూ కాలినడకన గాలించేశాం. హిందూదేశం మొత్తం మీద మదరాసు సువిశాలమూ,సుదీర్ఘమూ అయిన పట్నం. ఆ పదిహేను రోజులలోనూ మేము చూడని వీథిగాని, త్రొక్కని సందుగాని లేదు. ఆ ప్రకారంగా సముద్రతీరాన్ని చేరుకుంటూ, పదిమైళ్ళ పొడుగున్న ఆ తీరపు అన్ని ప్రాంతాలలోనూ ఉప్పు తయారుచేశాం. వేలాది జనం తమ సొంత కుండలతోనూ, వంటచెరుకుతోనూ వచ్చి, మాతోపాటు ఆ యా ప్రాంతాలలో ఉప్పును తయారుచేసేవారు.

ఎందరో మిల్లు పనివారు కూడా మాతోపాటు ఉప్పు తయారీలో పాల్గొన్నారు. ఒక రోజున చూళై మిల్లు ప్రాంతంలో, మేము ఉప్పు వండడానికి బయల్దేరిన తరుణంలో, మా వెనుకనే వేలాది మిల్లు పనివారు వారి వారి కుండలతో ఉప్పు తయారుచేయడానికి సిద్ధ మయ్యారు. వారిని పారీస్ కార్నర్ ప్రాంతంలో, పోలీసువారు అటకా యించడమూ, కొంత చికాకు గలుగచేయడమూ సంభవించింది. ఆ రోజున కొంత హింసాకాండ జరుగుతుందేమోననీ, ఆ హింసాకాండ కారణంగా మా కార్యక్రమం దెబ్బతినవచ్చుననీ తలిచాం. కాని ఆ నాడు ఏమీ జరుగలేదు.

నా భార్యకూడా అప్పుడప్పుడు నాతోపాటు ఈ ఊరేగింపులలో పాల్గొనేది.

పదిహేనురోజుల పాటు వరసగా సవాలుచేస్తూ తిరిగినా ఏమీ జరగని కారణంగా, నాగేశ్వరరావు పంతులుగారికీ, నాకూ మా మా ఇళ్ళల్లోనే ఉప్పు చేద్దాం అనే బుద్ధి పుట్టింది. వందలాది జనానికి సంతర్పణ చెయ్యడానికి పనికివచ్చేటంత పెద్దవిగా ఉండే గుండిగల్నికొన్నాం. మా మా ఇళ్లల్లో ఉండే పాత్రలలో కల్లా పెద్ద వాటిని బయటకు తీశాం. మా ప్రయత్నాలన్నీ పెద్ద యాగానికో, యజ్ఞానికో అన్నంత జోరుగా ఉన్నాయి.

ఇది యిలా జరుగుతూ ఉండగా ఎస్. వెంకట్రామయ్యరు అనే ఒక న్యాయవాద మిత్రుడు మా ఇంటికి వచ్చాడు. ఆయన మా గురువుగారయిన ఒక ప్రొఫెసరుగారి కుమారుడు. నేను ఆ సమయంలో మా ఇంట్లో ఒక చాపపై ఒళ్ళు విరుచుకుంటూ పడుకుని ఉన్నాను. ఆయన వచ్చి, పోలీసువారు నన్ను త్వరలోనే అరెస్టు చేయనున్నారని తెలియజేశాడు.

## నా అరెస్టు - తంగచ్చి సవాలు

ఇంతలోనే డిప్యూటీ కమిషనర్ ఆఫ్ పోలీస్, కొంతమంది పోలీసులతో, మా ఇంటికివచ్చి, మండుతూ ఉన్న ఆ మంటలను ఆర్పి, ఆ పాత్రలను స్వాధీనం చేసుకుని నన్ను అరెస్టు చేశాడు.

ఆ సమయంలో అక్కడ తంగచ్చియమ్మ అనే ఒక ముసలి వాలంటీరు ఉంది. అక్కడ తయారయిన ఉప్పంతా పోసిన ఒక పెద్ద పళ్ళెం ఆమె చేతిలో వుంది. డిప్యూటీ కమిషనర్ ఆ పళ్లాన్ని తనకిమ్మని అడిగారు. ఆమె వెంటనే, "ఇది నీ సొమ్ముకాదు. సముద్ర జలంతో కష్టపడి మేము దీనిని తయారు జేసుకున్నాం. ఆయనతోపాటు నన్నుకూడా ఎందుకు అరెస్టు చెయ్యవు?" అని అడిగింది. ఆమె చేతి నుంచి ఆయన ఆ పళ్ళాన్ని బలవంతంగా లాక్కున్నాడు.

నాగేశ్వరరావు పంతులుగారిని కూడా వారి ఇంటివద్ద నిర్బంధంలోకి తీసుకున్నారు. డిప్యూటీ కమిషనర్ నన్ను ఆయన కారులోనే తీసుకుని వెళ్ళి, మేజస్ట్రేట్‌గారి ముందు హాజరు పరచాడు. నాకు ఒక సంవత్సరం జెయిలు, నాలుగు వందల రూపాయలు జుల్మానా విధించ

బడ్డాయి. శిక్ష విధించబడిన వెంటనే నాలుగు వేల రూపాయలు ఖరీదు చేసే సరిక్రొత్త కారు జప్తుచేసి తీసుకుపోయారు. నన్ను మదరాసు పెనిటెంషరీలో కొంతకాలం ఉంచారు.

నాగేశ్వరరావుగారికీ నాకు వేసినట్లే శిక్ష వేశారు. ఆ తర్వాత ఉప్పు చట్టాన్ని ఉల్లంఘించిన పలువుర్ని నిర్బధించి శిక్షించారు. జిల్లాలలో అరెస్టయి శిక్షపొందిన మిత్రులెందరినో వెల్లూరు జెయిలుకు తీసుకువెడుతూ, దారిలో పెనిటంషరీకి తీసుకువచ్చేవారు.

## లాఠీఛార్జీలు, కాల్పులూ మొదలు

నా అరెస్టు జరిగిన మర్నాడు ఒక బ్రహ్మాండమయిన సభ తిరువళిక్కేనీ సముద్రతీరాన స్వామీ వెంకటాచల చెట్టిగారి అధ్యక్షతను జరిగింది. నా అరెస్టుకు పూర్వం, నేను ఉద్యమం నడుపుతూన్న రోజులలో జరిగిన హింసాకాండ, ఆ గుర్రపు రౌతుల ద్వారా కోట ఎదుట ఇసుక మైదానంలో జరిగిన చిల్లర అల్లరే. అంతకుమించి, కాల్పులుగాని, లాఠీఛార్జీలుగాని జరుగలేదు.

మొదటిసారిగా, స్వామీ వెంకటాచలంచెట్టిగారి ఆధ్వర్యాన జరిగిన, ఆ మీటింగులో కాల్పులు జరిగాయి. ఆ జరగకూడదని ముందుగా నోటీసుగాని, మీటింగులనూ, ఊరేగింపులనూ నిషేధిస్తూ ఆర్డరుగాని లేకుండానే ఆ ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీసు తిన్నగా, కొంతమంది పోలీసులతో ఆ సభలో జొరబడి, మీటింగును చెదరగొట్టి, వెంట వెంటనే లాఠీఛార్జీ, కాల్పులూ వగైరా జరిపించాడు.

ఆ కాల్పులు చాలా వివేక హీనంగానూ, ఇష్టంవచ్చినట్లు జరుపబడిన కారణంగా, ఒక గుండు వెళ్ళి, ఏ పాపమూ ఎరుగనటువంటి, ఈ సభతో ఎట్టి సంబంధమూ లేనటువంటి ఒక ప్లీడరుగారిని పొట్టబెట్టుకుంది.

దర్మిలా సత్యాగ్రహుల నందరినీ అన్ని వైపులనుంచీ, అన్ని ప్రాంతాలనుంచీ పట్టుకుని శిక్షించే సందర్భంలో, ఒక కుగ్రామంలో ఉప్పు సత్యాగ్రహ విషయంగా, ఒక దేవాలయంలో జరుగుతూన్న

చిన్న మీటింగులోకూడా కాల్పులు జరిపారు. ఈ చర్యలన్నీ ప్రజలలో భీతిని ఉత్పత్తిల్ల జేసి, ఉద్యమాన్ని అణగద్రొక్కాలనే ప్రయత్నంతోనే చేయబడ్డాయి.

అదే ప్రకారంగా చెన్నరాష్ట్రంలోని పలు జిల్లాలలోనూ, తాలూకాలలోనూ కాల్పులూ, లాఠీ ఛార్జీలూ విరివిగా జరుపబడ్డాయి.

ఈ ఉప్పు సత్యాగ్రహ కారణంగా, చెన్నరాష్ట్రంలో మొత్తం పదహారుసార్లు కాల్పులు జరిగాయి. ఎన్నో జాగాలలో, అన్యాయంగా, ఏ పాపమూ ఎరుగని సాధారణ జనసమూహాలపై గూడా లాఠీఛార్జీలు జరిగాయి. అంతేగాదు, ఆ లాఠీచార్జీ చేసేవారు కూడా చాలాసార్లు తాము చేస్తూన్న పనికి సిగ్గు చెందిన సందర్భాలూ ఉన్నాయి.

## జెయిళ్ల పాలైన స్త్రీలు

ఇలా చాలా నెలలపాటు ఈ సత్యాగ్రహ సమరం సాగింది. చాలామంది సత్యాగ్రహుల్ని నేను ఉన్న జైలుకే పంపించారు. అల్లా అరెస్టయి, శిక్షించబడిన వారిలో ఎందరో అమానుషమయిన లాఠీ ఛార్జీలకు గురైనవా రున్నారు.

పురుషులనే కాదు, ఎంతోమంది స్త్రీలనుకూడా అమానుషంగా హింసించి జెయిళ్లపాలు జేశారు.

ఎన్ని వందలమంది సత్యాగ్రహులను ఈ విధంగా అరెస్టు చేశారో వివరంగా చెప్పడం ఎవరితరమూ కాదు.

మదరాసు నగరవాసులు మాత్రం ఆ కష్టకాలంలో తట్టుకుని ఉద్యమాన్ని సాగిస్తూనే వచ్చారు. అంతేకాదు, ఉద్యమం సాంతం అయ్యేవరకూ ఆ ఉదయవనం క్యాంపునకు కావలసిన ధన ధాన్యాలన్నీ సమృద్ధిగా సప్లయి చేశారు. అప్పట్లో వారిని అభినందించాను. ఇప్పుడు కూడా వారిని అభినందిస్తున్నాను. దేశానికి దాస్య విముక్తి కలిగించే ఈ ఉద్యమంలో పాల్గొని, దేశమంటే వారికి ఉన్న అభిమానం, గౌరవం, భక్తి కనబరచిన వేలాది ప్రజల్ని అప్పుడూ, ఇప్పుడూ కొనియాడడం మన విధే గదా!

## ఖైదులో అనారోగ్యం

అరెస్టయి జెయిలుకి వెళ్ళేముందు ఆ పదిహేను రోజులలోనూ నేను రాత్రింబవళ్ళు కాలినడకని పట్నం మూలమూలలా తిరుగుతూ వచ్చాను. ఆ రోజులలో ఉన్న ఉత్సాహం కారణంగా ఏవిధమయిన నీరసమూ, శోషా ఎరగను. అప్పట్లో నాకు శరీరంలో తాపం అధికం అవుతూన్న అనుమానమే కనబడలేదు. నన్ను పెనిటెంషరీలో పెట్టిన కొద్ది రోజులలోనే తలమీదా, ఒంటిమీదా కురుపులూ, సెగ్గడలూ బయల్దేరాయి. అక్కడ ఉన్న ఒక ఆస్పత్రి గదిలోకి వైద్యంకోసం నన్ను మార్చారు.

అంతవరకూ, నిజంగా, నాకు ఏవిధమయిన వైద్యవిధానం తోటీ అంతగా అవసరం కలుగలేదు. ఎప్పుడయినా అవసరం అని తోస్తే లూయీ ఖూనే గారి తొట్టి వైద్యం అనుసరిస్తూ ఉండేవాణ్ణి. ఆ ప్రకారం అప్పటికి ఇరవై అయిదు సంవత్సరాలుగా నా ఆరోగ్యాన్ని కాపాడుకుంటూ, కాలక్షేపం జేశాను. ఖైదీగా నాకు తొట్టిగాని, కావలసిన నీళ్ళుగాని లభ్యం కాలేదు. అక్కడి ఆ పెనిటెంషరీలో నన్ను కొద్ది కాలమే ఉంచుతారనికూడా తెలుపబడింది.

నిజానికి పెనిటెంషరీలో మమ్మల్ని కొద్ది వారాలపాటే ఉంచారు. ఈ రోజులలో పత్రికా ముఖంగా జరుగుతూన్న చరిత్ర నాకు తెలుస్తూనే ఉంది. కాల్పులను గురించీ, లాఠీఛార్జీలను గురించీ వివరంగా వార్తలు గ్రహిస్తూనే ఉన్నాను. ఉద్యమం సఫల మవుతోందని గ్రహించి చాలా గర్వం చెందాను. ప్రజలలోని ఉత్సాహమూ, కార్యదీక్ష, అఖండ దేశభక్తి ఉద్యమానికి బలం చేకూర్చాయి. స్త్రీలూ, పురుషులూ కూడా తమకు తాముగానే నాయకత్వాలు వహించి ఉద్యమానికి చేయగలిగిన సేవచేయడం ఆరంభించారు.

నన్ను పెనిటెంషరీనుంచి తిరుచిరాపల్లి జెయిలుకు మారుస్తున్నారన్న వార్త ఎల్లా పొక్కిందో తెలియదుగాని, ఆనాడుమాత్రం రైల్వే స్టేషన్ అంతా ప్రజాసమూహంతో నిండిపోయింది. ఆ ప్రజా కోలాహలంనుంచి నన్ను తప్పించి, తేలికగా రైలు ఎక్కించడానికిగాను,

కారులో కోడంబాకం స్టేషనుకు తీసుకువెళ్లి అక్కడ ఒక మొదటి తరగతి పెట్టిలో ఎక్కించారు. డిప్యూటీ కమిషనర్ స్వయంగా నాతో ఆ గుంపులనుంచీ, గలటానుంచీ తప్పించడానికిగాను కోడంబాకం తీసుకువెడుతున్నానని చెప్పాడు.

## సత్యాగ్రహిగా మారిన భాష్యం

చెన్నపట్నపు వాతావరణం ఉప్పు సత్యాగ్రహానికి సరిపడదని వారూ వీరూ అన్న దానితో సరిపోలిస్తే, పట్నంలో ఉద్యమానికి లభించిన చేయూత, దాని సఫలతా నా కెంతో గర్వకారణ మయాయి. దేశంలో ఉన్న అనేక పట్నాలలో చెన్నపట్నం రాజకీయంగా సుస్థిర మయిన స్థానాన్ని సంపాదించుకుంది.

అన్నిటికంటె విచిత్రమేమిటంటే, ఆనాడు ఆ మొట్ట మొదటి సభలో చెన్నపట్నపు వాతావరణం ఉప్పు సత్యాగ్రహానికి పనికిరాదని బల్లగుద్ది వాదించిన ఆ లాయరు మిత్రుడు కె. భాష్యంగారు స్వయంగా ఈ సత్యాగ్రహ సమరంలో పాల్గొని, దెబ్బలుకూడా తిని, అరెస్టయి శిక్ష అనుభవిస్తూ మా వెల్లూరు జైలుకే వచ్చాడు. ఆయన్ని జైలలో ఆహ్వానించగలగడం నాకు గర్వకారణమే అయింది

చెన్నపట్నపు లాయర్లలో ఆయన ఒక ప్రముఖుడు. అటువంటి వాడు ఉద్యమ ప్రారంభంలో చేసిన తన తప్పును తాను గ్రహించి, ఎంతో ఘనంగా ఆసేతుశీతాచలం సాగుతూన్న ఆ అహింసాత్మక సమరం సంగతి బాగా తెలుసుకుని, అందులో స్వయంగా పాల్గొని, తాను చేయగలిగిన దేశసేవ చేశాడు.

వివిధ జెయిళ్ళలో నాకు గలిగిన అనుభవాలను తెలిపే ముందు ఈ ఉప్పు సత్యాగ్రహ సమరంలో చెన్నరాష్ట్రంలో జరిగిన సంఘటనలను గురించి టూకీగా చెప్పాలని ఉంది.

గాంధీగారు ఉప్పు సత్యాగ్రహ సంరంభానికి ప్రాతిపదికగా సబర్మతీ ఆశ్రమంనుంచి దండీవరకూ కాలినడకని యాత్ర సాగించి, తన ఉద్యమానికి బలం చేకూర్చుకున్న పద్ధతిని ఈ రాష్ట్రంలో పలు

జిల్లాలలోని నాయకులు అనుసరించారు. దక్షిణాన రాజగోపాలాచారి గారూ, ఉత్తరాన పశ్చిమగోదావరిజిల్లాలో దండు నారాయణరాజూ, గోవిందరాజులు మొదలైనవారు గాంధీగారి మార్గాన్నే అవలంబించారు.

## ఆంధ్రదేశంలో ఉప్పు సత్యాగ్రహం

ఆంధ్రదేశానికి సంబంధించినంతవరకూ, తూర్పు-పశ్చిమగోదావరిజిల్లాలలోనూ, కృష్ణా-గుంటూరు-నెల్లూరు జిల్లాలలోనూ, విశాఖ, గంజాం జిల్లాలలోనూ అక్కడి నాయకులు, గాంధీగారి మార్గాన్ని అనుసరిస్తూ,ఉప్పు సత్యాగ్రహాన్ని ఎంతో చాకచక్యంగా నడిపించి, ఆయా ప్రాంతాలను చరిత్ర ప్రసిద్ధం చేశారు. కేవలం కాలినడకను వెళ్ళడమే కాదు; ఎన్నో క్యాంపులు నడపి, వాలంటీర్లను తయారు చేయడానికి స్థావరాలు ఏర్పరిచారు.

## దేవరాంపాడు శిబిర సమరం

గుంటూరు జిల్లాలో 'దేవరాంపాడు' గ్రామంలోనూ, విశాఖ జిల్లాలో వడలి గ్రామంలోనూ నడిపిన క్యాంపులను గురించి కాస్త వివరిస్తాను. దేవరాంపాడులో నాకున్న చిన్న బంగాళానీ, దానిని అంటిఉన్న పొలాన్నీ అక్కడి నాయకులు తీసుకుని, దానిని ఒక శాశ్వతమయిన శిబిరంగా మార్చి, అక్కడికి రెండుమైళ్ళ దూరంలో ఉన్న 'కనపర్తి' గ్రామంలో ఉన్న ఉప్పు కొఠార్ల మీదికి దాడి ప్రారంభించారు.

దేవరాంపాడు గ్రామ శిబిరాన్ని ఆధారం చేసుకుని, 'గంగాకలం' అన్న చిన్న నదిని దాటి (నది ఒడ్డునే ఆ శిబిరం ఉంది.) వాలంటీర్లు రంగంలోకి దిగేవారు. ఇది చాలా అనువయిన స్థానంగా ఉండేది. నది సముద్రంలో కలిసే సంగమప్రాంతం అక్కడికి మైలులోపుగానే ఉంది. వాలంటీర్లకు ఆ నది దక్షిణపు గట్టున ఉండడానికి వీలుగా ఉండడాన్ని వారు ఒక బ్రహ్మాండమయిన పథకం వేసుకున్నారు.

తరవాత కార్యరంగంలోకి దిగారు. జట్లు జట్లుగా ఉప్పుకొఠార్ల

మీదికి దాడివెళ్లే వాలంటీర్లను పోలీసువారు అరెస్టుజేసి తీసుకుపోతూ, ఆ నదిని దాటి శిబిరాన్ని ఆక్రమించుకుని వాలంటీర్లకు తావులేకుండా చేశారు. నది ఆవలిగట్టునుంచి వాలంటీర్లు ఆకొంతార్ల మీదికి దండెత్తారు. అక్కడ సమీపంలో ఉన్న ఒక చిన్న గుడిసెను వారు శిబిరంగా మార్చుకున్నారు. పోలీసువారు తాము ఆక్రమించుకున్న శిబిరాన్ని వదలి, ఒక్కఉదుటున ఈ వాలంటీర్ల నూతన శిబిరం మీదికి దండెత్తారు. ఈ అదునులో నదికి అవతలి గట్టునుంచి వచ్చే వాలంటీర్లు ఆ శిబిరాన్ని తిరిగి స్వాధీనం చేసుకున్నారు.

ఆ ఉద్యమం అక్కడ జరుగుతూన్న రోజులలో అల్లా ఆ శిబిరం వాలంటీర్ల చేతులలోంచి పోలీసువారి చేతులలోకీ, పోలీసువారి చేతులలోంచి కాంగ్రెసువారి చేతులలోకీ చాలాసార్లే మారింది. నాయకులు ఆ జిల్లా ఇతర ప్రాంతాలలోని పనులకు ఆటంకం కాని రీతిని, ఈ క్యాంపుపైనే ఎక్కువ దృష్టిపెట్టి, అక్కడ జరుగుతూన్న పోరుకి సలహాలూ, సహకారమూ అందించేవారు.

సాధారణంగా ఇటువంటి వింత సంఘటనలు చూడడానికి జనం గుంపులు గుంపులుగా వస్తారుగదా! వారు చాలా శాంతియుతంగానూ, క్రమశిక్షణతోనూ మెలిగారు. ఆ ప్రాంతంలో నివసించే పల్లెవాళ్ళకి కూడా ఉప్పు సత్యాగ్రహం ఆవశ్యకత, ప్రభుత్వంవారు ఉప్పులాంటి అత్యవసర వస్తువులపై కూడా పన్ను విధించి, ఎల్లా బీదవారి పొట్ట మీద దెబ్బ కొడుతున్నారో అర్థం అయింది. నిజానికి ప్రజలే గుంపులు గుంపులుగా ఉద్యమంలో చేరి, దానిని మంచి ధీమాతో నడిపించి జయం సాధించారు.

## కమలాదేవి చాకచక్యం

కాకినాడ కాపురస్థురాలు కీ॥ శే॥ వేదాంతం కమలాదేవి, వందలూ వేలూ జనం గుంపులు గుంపులుగా తనవెంటరా, ఉద్యమాన్ని మాంచి పకడ్‌బంద్‌గా నడిపించింది. ఆమె చాలా ధైర్యసాహసాలు గల ఇల్లాలు. ఆరుగురు బిడ్డల తల్లి. ఆమె ఆంధ్రదేశంలో పలు

తావులలో ఉద్యమాన్ని చాలా చాకచక్యంగా నడపించింది. పురుషులు జంకి వెనక్కి తగ్గే పరిస్థితులలో కూడా ఆమె మంచి నేర్పుతో వ్యవహరించింది. ఆమె అకాల మరణం దేశానికి తీరని లోటే.

ప్రక్కని దాడి చెయ్యడానికి ఉప్పు కొఠారులున్నాయా లేదా అని కాదు ప్రశ్న. సమీపాన సముద్రం ఉందా లేదా అన్న ఒక్క విషయం మీదనే ఆధారపడి, ఆంధ్రదేశంలోని కోస్తా జిల్లాలవా రందరూ శక్తి వంచన లేకుండా ఈ సత్యాగ్రహ సమరంలో పాల్గొని కీర్తిని గడించారు.

1930 నాటి ఉప్పు సత్యాగ్రహ చరిత్ర యిది. ఆ చరిత్రలో మద్రాసు నగరంతో సహా ఆంధ్రరాష్ట్రం ఎల్లా ముందుకు ఉరికిందో సంగ్రహంగా మనవి చేశాను. సహకార నిరాకరణ మారంభమయింది లగాయితు, శాసన ధిక్కారం, ఉప్పు సత్యాగ్రహం, పన్నుల నిరాకరణ లాంటి అనేక జాతీయ ఉద్యమాలలో ఆంధ్రులు చరిత్రాత్మకమైన పాత్ర వహించారు. ఇది నిజంగా వారికి గర్వకారణమే. నిర్మాణ కార్యక్రమంలో కూడా వారి దెప్పుడూ పై చెయ్యే. 'ర్యాలి'లో పంచాయతీ ఏర్పరచి, వారు రాజ్య తంత్రాన్ని నడిపిన తీరు అద్వితీయం. అడిగిన తక్షణం, ఆడవారే స్వయంగా వారి చేతులతోనే, వారివారి ఆభరణా లన్నింటినీ ఒలిచి, గాంధీగారి ఒడిలో పోసి స్వాతంత్ర్యోద్యమాని కిచ్చిన చేయూత స్త్రీ లోకానికే గర్వకారణం.

# 10

## జెయిలు అనుభవాలు

ఆ 1930-31 లో ఎందువల్లనో గాని నన్ను ఆ జెయిలు నుంచి ఈ జెయిలుకీ, ఈ జెయిలునుంచి ఇంకో జెయిలుకీ, ఇల్లా పలు తావులలోని జెయిళ్ళకి మార్చారు. అందువల్ల ఎన్నో జెయిళ్ళను చూడగల విశేషాధికారాన్నీ, హక్కునూ నాకే ఇచ్చా రనుకుంటాను. నాటి జైళ్ళ పరిస్థితి చాలా అధ్వాన్నంగా ఉంది. రాజ

కీయ ఖైదీలుగా మా కిచ్చే ఆహారానికి, మామూలు 'సి' క్లాసు ఖైదీల ఆహారానికీ తేడాయే లేదు. అదే, ఆ మామూలు 'సి' క్లాసు నేరస్థుల కిచ్చే ఆహారమే, అక్కడ వంటశాలలోనే తయారుచేసి, మాకు వడ్డింపించేవారు. ఈ పరిస్థితి చాలాకాలమే సాగిందిగాని, తరవాత తరవాత 'ఏ', 'బి' తరగతి ఖైదీలకు వేరే వంటశాలలు ఏర్పరచి, వాటిని నడుపుకునే అధికారంకూడా వారికే హస్తగతం జేశారు. ఈ పద్ధతి ముందుగా 'ఏ', 'బి' క్లాసు ఖైదీలకు మాత్రమే లభింపజేసి ఉన్నా, ఆ వెల్లూరు జెయిలు అధికారులు క్రమేపీ అటువంటి పరిశుభ్ర మయిన భోజనం 'సి' క్లాసు రాజకీయ ఖైదీలకి కూడా లభింపజేశారు. ఆ వంటశాల జెయిలు ఆవరణలో లోపలి ముఖద్వారానికి చేరి రోడ్డుమీదకే ఉన్న ఒక ఇంటిలో ఉండేది.

## పెనిటెంషరీలో - 'మిష్టర్ హో'తో

మొట్టమొదటి సారిగా నన్ను మదరాసు పెనిటెంషరీలో నిర్బంధించారు. నాకు వేడివలన పుట్టిన ఆ కురుపులు తగ్గేవరకూ ఆ పెనిటెంషరీలోని ఆస్పత్రి బ్లాకులోనే ఉంచారు. ఎండా కాలంలో ఇంటి పట్టున నీడలోనే నివసించే వారికి వేసే మామూలు ఎండతాపపు కురుపులు కాదు నాకు లేచినవి. పదిహేను రోజులపాటు విధీ విరామం లేకుండా కాలినడకను నగర వీధులన్నింటినీ చుట్టితిరిగే సందర్భంలో కలిగిన శరీర తాపంవల్ల వచ్చిన కురుపులవి. ఆ ఉత్సాహంలో నాకు నా శరీరంలో ఏదోలా ఉంటూందన్న సంగతి జెయిలుకు వెళ్ళిందాకా తెలియనే తెలియదు. అనుదినమూ ఎండలో ఎన్నో మైళ్ళు నడవందే సముద్రతీరానికి జేరుకోలేక పోయేవాళ్ళం. అల్లా రోజు కొక్కతావుగా, అడయారు, మైలాపూరులో ఇన్‌స్పెక్టర్ జనరల్ గారి ఆఫీసు ఎదుట ఇసుకలో, తిరువళిక్కేని బీచిని, హైకోర్టు బీచిని, రాయపురంలో రోజూ ఒక కొత్త తావుకుజేరి ఉప్పు తయారుచేస్తూ, అనుదినమూ ఒక కొత్త అనుభవాన్ని సంపాదించాం. కాని నాకు ఈ తిరుగుళ్ళ అనంతరం జెయిల్లో కాస్త విశ్రాంతి శరీరానికి లభించేసరికి వేడి పైకి తన్ని

కొత్తరకం కురుపులు, సెగ్గెడలూ తలలోనే గాక, శరీరంమీద కూడా లేచాయి. వీటివల్ల కలిగిన బాధ మహావికపు బాధతో సమానంగా ఉండేది. గడచిన 35 ఏళ్ళుగా నేను అనుసరిస్తూన్న తొట్టి స్నానపు వైద్యం ఈ కురుపులు తగ్గడానికి ఎంతయినా సహాయకారిగా ఉండేది కాని, ఉన్నది జెయిలు;దాని అధికారా- మిస్టర్ హో (Mr. Howe)!

మిస్టర్ హో అక్కడ జెయిలు అధికారి. ఖైదీలను అమానుషంగా చూడడమూ, వారిని రకరకాల బాధలకు లోనుచేయడమూ ఆయనకు సరదా. ఖైదీ మామూలు ఖైదీయేనా, లేక 'ఎ', 'బి', 'సి' వర్గాలలో దేనికైనా చెందుతాడు అన్న ప్రశ్నలేకుండా, పాపం, ఆయన అందర్నీ ఒకేరకంగా, మామూలు దృష్టితోనే చూసి హింసించడంతో, ఉద్యోగం స్వీకరించిన మొదటి దినాలలోనే ఖ్యాతి గడించాడు. నా మామూలు అలవాటు ప్రకారం ఒంటిమీద ఏ విధమయిన ఆచ్ఛాదనా లేకుండా, హాయిగా కాళ్ళు జాపుకుని, ఇంటివద్ద పడుకునే రీతిగానే, ఆ అస్వస్థపు దినాలలో జెయిలులో పడుకుని ఉండేవాడిని.

ఒక రోజున నేను అల్లా పడుకుని ఉండగా, ముందు హెచ్చరిక లేకుండా నా గదిలోకి వచ్చి నా మంచం పక్కన నిలబడి ఒకటి రెండు నిమిషాలపాటు నావైపు చూశాడు. ఆయన్నిచూసి జెయిలు సూపరెంటెండెంటుగా గ్రహించుకుని,వెంటనే లేచి, ఆయనకు లాంఛన ప్రకారంగా చేయవలసిన సలామో, గుడ్‌మార్నింగ్ చెప్పడమో చెయ్యకపోవడాన్ని ఆయన శాంతిని గోల్పోయి, చాలా మెల్లిగా "నేను సూపరెంటెండెంట్ నన్న సంగతి తెలియదా? ఇక్కడ కొన్ని నిమిషాలుగా ఉన్నా మంచంమీద పడుకున్నవాడివి లేవనయినా లేవలే" దన్నాడాయన. నేను చిన్ననవ్వు నవ్వి "జెయిలు సూపరెంటెండెంట్ అన్నవాడికి ఖైదీలపట్ల,అందులో రోగంతో తీసుకుంటూన్న ఖైదీలపట్ల, ఒక బాధ్యత ఉన్నది కదా? సూపరెంటెండెంట్ అయినా, రోగంతో తీసుకుంటూన్న ఒక ఖైదీ గదిలోకి, ఒంటిమీద సరిగా బట్టయినా లేని స్థితిలో ఆ రోగి ఉంటూన్న సమయంలో, హెచ్చరికయినా లేకుండా చొచ్చుకుని రావడం న్యాయం కా"దన్నాను. "ఖైదీగా సూపరెంటెండెంట్‌కు

చేయవలసిన మర్యాద చేయ జాలనందుకు చింతిస్తున్నా''నని చెప్పాను. ''ముందు ముందు కాస్త హెచ్చరిక జేసి మరీ దయచేయం''దని కోరాను.

ఆయన ఏ మనుకున్నాడో యేమోగాని, కాస్త తమాయించుకుని క్షమార్పణ చెప్పకుని, మెల్లిగా గదినుంచి బయటకు నడిచాడు. నాకు ఇవ్వబడిన గది ఆస్పత్రి మెయిన్ వార్డులోని జాగా కాదు. అది నా కోసం, నేను నా మానాన- ఒక నర్సుయొక్క-గాని, ఏ యితర నౌఖరుయొక్క-గాని సహాయం లేకుండా- ఉండడానికిగాను ప్రత్యేకించబడిన గది.

పైకి ఎంత గంభీరంగానూ, క్రూరంగానూ కనబడ్డా మిస్టర్ హో మాత్రం సరళహృదయం కలవాడనే నా నమ్మిక. నాకు స్వస్థత చేకూరాక, నన్ను జెయిలులోకి మార్చారు. దుమ్ము, ధూళితో నిండి, ఏదో మూలగానున్న ఒక గదిని నా కిచ్చారు. నా గదిని చేరి బాత్‌రూం లేదు సరికదా, ఆఖరికి ఒక 'కరోడ్' అయినా లేదు. ఇచ్చే ఆహారం చాలా పాడుగా ఉంది. మాకు కావలసిన ఆహారం మేము కొనుక్కో-డానికి, ఇతర విధంగానూ ఆహార అవసరాలు తీర్చుకోవడానికి గాని అవకాశం లభించలేదు. అల్లా ఆ గుహలో రెండు, మూడు వారాలపాటు ఉన్నాను. మమ్మల్ని సాయంత్రం 6 గంటలకు లాకప్పులో పెట్టి, ఉదయం 6 గంటలకు బయటకు రానిచ్చేవారు. అల్లా జెయిల్లో అయిదారు వారా లున్నాక, నన్ను తిరుచిరాపల్లి జెయిలుకు మార్చారు.

### తిరుచీ జెయిలుకి సత్యాగ్రహుల వెల్లి

తిరుచిరాపల్లి జెయిలుకు నేను వెళ్ళేసరికి అక్క-డి పెద్ద జెయిలుకు అంటి ఉన్న 'క్వారెంటైన్' (Quarantine)లో, చెన్న రాష్ట్రీయులే గాక, హిందూదేశపు పలుతావులనుంచి అక్క-డికి పంపబడిన అనేక సత్యాగ్రహులు నాకు తారసపడ్డారు. ఐర్లెండ్ దేశానికి చెందిన మిస్టర్ కార్‌నిష్ (Mr. Cornish) అప్పట్లో అక్క-డి జెయిలు సూపరెంటెండెంట్‌గా ఉండేవాడు.

అక్క-డ వార్డర్లు మామూలు ఖైదీలను వారి ఇష్టం వచ్చినట్లు

బాదేవారు. తప్పిదమన్నది ఉన్నా లేకపోయినా ఖైదీలను బాదడం అన్నది అక్కడి వార్డర్లకు అలవాటయిపోయింది. ఒకనాడు ఆ ఇనుప ఫెన్సింగ్‌కు సమీపంగా ఉన్న ఒక ఖైదీని తన తోలు బెల్టుతో అదే పనిగా ఒక వార్డరు బాదడం నా కంట బడింది. నేను అప్పుడు ఇతరులతో కలసి ఒక వరుసలో నిల్చుని ఉన్నాను. పాపం, ఆ ఖైదీ నోరు మూసుకుని ఆ దెబ్బలను సహిస్తున్నాడు. బాధతో ఏడుస్తున్నాడు. ఆ వార్డరు మాత్రం బాదడం మానలేదు. అట్టి పరిస్థితిలో నా మిత్రు డొకాయన గబగబా నా గదిలోకివచ్చి నన్ను పిల్చాడు. నేను బయటికి వచ్చి 'ఆపు' అని కేక వేసేసరికి, ఆ వార్డరు ఆ బెల్టు అక్కడ పారేసి పారిపోయాడు. ఈ విషయం కార్‌నిష్‌కు తెలుపబడింది. ఆయన వచ్చి నన్నూ, ఇతరులనూ అడిగి, జరిగిన సంగతి తెలుసుకుని తానే స్వయంగా ఆకేసు ఫయిసలు చేశాడు.

ఆ తర్వాత మమ్మల్నందర్నీ 'క్వారెంటైన్' నుంచి లోపలికి, అసలు జెయిలులోకి మార్చారు. అంతకంతకు సత్యాగ్రహ ఖైదీలు ఎక్కువయిపోయారు. జెయిలు అధికారులకు వారిని అదుపులో పెట్టడం ఎల్లాగో అర్థంకాలేదు. అందులో 'సి' క్లాసు యువక ఖైదీలను అసలే హద్దులో పెట్టలేకపోయేవారు. వారికి స్నానానికి ఇతరత్రా ఏ ఏర్పాట్లు లేకపోవడాన్ని ఒక పెద్ద దిగుడు బావిలో స్నానం చెయ్యమని అనుమతి ఇచ్చారు. జెయిలు అధికారులకు వారిని సరిదిద్ది శాంతి నెలకొల్పడానికి సాధ్యంకాని పరిస్థితిలో మాలో ఎవరినయినా తీసుకుని వెళ్ళి, మా సహాయంతో, శాంతి, క్రమపద్ధతి నెలకొల్పుకునేవారు. పరిస్థితి వారి చెయ్యిదాటినప్పుడల్లా వారు మా సహాయంతోనే ఆ యువక రాజకీయ ఖైదీలలో శాంతి నెలకొల్ప కలిగేవారు.

మా 'ఎ' క్లాసు ఖైదీలను ఉంచిన గదులకు సరిగా వెనుక వరుసలో ఖైదీలందరికోసం ఏర్పాటయిన మామూలు వంటశాల ఉండేది. దానిలో వంట తెలిసిన ఖైదీలే వంటపనులు నిర్వహిస్తూ ఉండేవారు. అక్కడ తెల్లవారగట్ల 3 గంటలనుంచీ ఏవేవో పనులుంటూనే ఉండేవి.

ఒకరోజు తెల్లవారగట్ల 4 గంటలకు వార్డర్లు ఆ వంటశాలలో పనిచేస్తున్న ఖైదీలమీద లాఠీఛార్జి చేశారు.

ఆ ఖైదీల అరుపులు, ఏడ్పులు, లాఠీల చప్పుళ్లు మాకు బాగా విన బడ్డాయి. కంటితో చూడకపోయినా ఆ సంఘటన హృదయ విదారకంగా ఉంది. మేము ఏమీ చెయ్యలేని స్థితిలో ఉన్నాం. మేమూ ఖైదీలమే అయిన కారణంగా అక్కడికి వెళ్ళడానికి కూడా మాకు అవకాశం లేదు. మర్నాడు ఆ విషయం సూపరింటెండెంట్ గారితో చెప్పాం. ఆ తరవాత అటువంటి సంఘటనలు మేము ఆ జెయిల్లో ఉన్నంత కాలమూ జరుగ లేదు.

## యువక ఖైదీకి అంత్యక్రియలు

జెయిల్లో వైద్యసహాయమూ అంతమాత్రంగానే ఉండేది. ఒక రోజున ఒక సత్యాగ్రహ యువక ఖైదీ మరణించాడు. డాక్టరు సరిగా చూడని కారణంగానే ఆ కుర్రవాడు మరణించాడనే వార్త పొక్కింది. అల్లరి యేదో జరుగనుంది- యువకుల హృదయాలలో ఏదో అశాంతి బయల్దేరిందనే వార్తా పొక్కింది. దాన్తో కాస్త కలుగజేసుకుని హృద యాలను శాంతపరచి, సక్రమంగా వైద్యం జరగడానికి వలసిన అవసర చర్యలు తీసుకున్నాము. చనిపోయిన కుర్రవాడాంధ్రుడు. వాని జననీ జనకులు ఎక్కడో దూరతీరాలలో ఉన్నారు. అంత దూరంనుంచి వాని బంధువులు వచ్చేవాకా దహనాది క్రియలు ఆపడానికి అవకాశం లేదు. అందువల్ల నేనూ, ఇతర సత్యాగ్రహ మిత్రులమూ కలిసి ఆ దహన కాండ దేశ స్వాతంత్ర్యం పేరుమీదుగా జరిపించాం. అప్పట్టున ఇచ్చిన ఒక చిన్న ఉపన్యాసంలో వాని త్యాగాన్ని పొగడి, భారతమాత దుఃఖోప శమనానికి వాని అసువులు అర్పించబడ్డాయనీ, అది మనకు గర్వకారణ మనీ, దేశంకోసం ఆత్మార్పణకు, ఆ యువకునివలె, అంతా సర్వ సన్నద్ధులమయి ఉండాలనీ, ఏవేవో చెప్పి యువక హృదయాలలో శాంతి నెలకొల్పాం.

'పిండా కూడు'

'క్వారంటైన్' కాలంలో మాకు అన్నపు ముద్దలు - పిండాలు, రసమూ-కొళంబూ అని పిలువబడే ఏదో చిక్కని ద్రవమూ ఆహారంగా లభించేవి. నిజానికి ఆ ఆహారం ఎటువంటి మానవునకయినా ఆరోగ్య దాయకం అని చెప్పడానికి వీలులేని స్థితిలోనే ఉండేది. కొళంబులో నిజంగా వాడవలసిన కూరలూ, పప్పులూ విచిత్రంగా మాయమయి, వాటి స్థానంలో యేదో ఇంత తుక్కూ, గడ్డీ ఉపయోగింపబడేవి. ఇట్టి కారణాల వల్లనే ఖైదీలలో చాలామందికి ఆరోగ్యం దెబ్బతింది. ఆ అన్నపు ముద్దలలో రాళ్ళు రప్పలే కాదు, పురుగులుకూడా ఉండేవి. అటువంటివి కంటబడినప్పుడు నిరాహారంగా రామభజన చేసేవారం. క్రమేణా మాలో ఇరువురు వ్యక్తులకు వంట ఏర్పాట్లు చూడడానికి అనుమతి లభించడమూ, కాస్త మంచి ఆహారం లభ్యం చేయబడడమూ జరిగింది. కార్నిష్‌గారూ, వారి పై అధికారులూ ఒప్పుకున్న కారణంగా మా ఆహార స్థితి మెరుగున పడింది.

మామూలుగా నేరస్తులకోసం జెయిళ్ళు అన్నవి సృష్టించబడిన నాటినుంచీ చల్ల (మజ్జిగ) ఖైదీల కివ్వడ మన్నది ఆచారంలో లేని విషయమే. 1921 లో మొదటి సత్యాగ్రహం, శాసన ధిక్కారాదులు జరిగిన నాటినుంచీ రాజకీయ ఖైదీలకుకూడా ఈ మజ్జిగ అన్నది ఎప్పుడూ సప్లయి చేయబడలేదు. కాంగ్రెసు మిత్రులు, అధమం రాజకీయ ఖైదీలకైనా మజ్జిగ సప్లయి చేయించాలని, ఆనాటినుంచీ తంటాలు పడ్డారు.

జస్టిస్ పార్టీ 'మహాశయులు'

కాని జస్టిస్ పార్టీవారు చెప్పేశారు-కాంగ్రెసు సత్యాగ్రహులకూ, మామూలు ఖైదీలకూ తేడా అనేది పాటించడం సబబు కాదని. అందువల్ల వారికి ఏవిధమయిన అదనపు సౌకర్యాలూ ఇవ్వబడవని ఖచ్చితంగా చెప్పేశారు. ఇంకో జస్టిస్ పార్టీ మహాశయుడు భారతీయ ఆహార విధానంలో మజ్జిగ అన్నది అవసరమైన ఆదరవు కాదన్నాడు. ఆ

రోజులలో అధికారంలో ఉన్న మహాశయుల పద్ధతులవి! అందులో కాంగ్రెసు నాయకుల కోర్కెల విషయంలో వారి వక్రబుద్ధే బలిష్ఠమయ్యేది. కాంగ్రెసువారు ఇటువంటి కష్టాలన్నింటినీ భరించారు.

తరవాత రాజ్యాంగయంత్రం వారి హస్తగతమై రెండున్నర సంవత్సరాలు వారి చేతులలోనే నిలిచింది. "కాంగ్రెసు గవర్నమెం" టనే శీర్షిక కింద, కాంగ్రెసు మంత్రులు రాజకీయ ఖైదీల విషయంలో ఎల్లా ప్రవర్తించారన్న విషయం వివరంగా చర్చిస్తాను.

ఒక్క విషయం మాత్రం నిజం. రాజకీయ ఖైదీల అగచాట్ల విషయంలో కాంగ్రెసు మంత్రులు ఏవిధంగానూ కలుగజేసుకోలేదు. వారి బాధలు గుర్తించలేదు. ఒక్క మజ్జిగమాత్రం సప్లయి చెయ్యడానికి అనుమతి ఇచ్చారు. అంతే!

కాంగ్రెసు గవర్నమెంట్‌లో మంత్రులుగా ఉన్న మహాశయులు ఇతర కాంగ్రెసు వారితో సహా తిరిగి 1941లో జెయిళ్ళకు వెళ్ళారు. వారు తిరిగి జెయిళ్ళకు వెళ్ళినప్పుడు వారి స్థితి స్వయంకృతాపరాధంగానే తయారైంది. ఏదో సామెత చెప్పిన తరువాయిగా, నీరు చాలా ఉండే ఆనపకాయ బీరకాయలాంటి కూరలు నీళ్ళు పొయ్యనవసరం లేకుండానే వాటి రసంలోనే అవి ఉడికినట్లు, ఆంగ్లంలో 'Stew in their own juice' అని చెప్పబడే స్థితి వారికి సంప్రాప్తమైందన్నమాట! అత్తగారి స్థానంనుంచి కోడలు స్థానానికి దిగజారిపోయినట్లేగదా! ఆ కాంగ్రెసు మంత్రులే తిరిగి జెయిళ్ళకు వెళ్ళినప్పుడు వారికి అనుభవమైంది. మంత్రులుగా తాము రాజకీయ ఖైదీలకు తమ హృదయాలలో ఏవిధమయిన స్థానమూ ఇవ్వకపోవడం బాగా తెలిసివచ్చింది. ఈ పరిస్థితులను గురించి ముందు ముందు వివరిస్తాను.

## వెల్లూరు జెయిల్లో నీటి ఎద్దడి

తిరుచ్చీ జెయిలులో రాజకీయ ఖైదీలను గురించి కొన్ని మాసాలుగా ఆందోళన జరుగుతూన్న కారణంగా, మమ్మల్ని వెల్లూరు జెయిలుకు మార్చారు. వెల్లూరులో మాకు మంచి ఆహారం లభిస్తుందనీ,

మమ్మల్ని ఎక్కువ ఇదిగా చూస్తారనీ భావించాం. అనేక విషయాలలో వెల్లూరు జెయిలు బాగానే ఉందిగాని, నీటి ఎద్దడి విషయంలో తిరుచిరాపల్లి జెయిలుకు ఏమీ తీసిపోదు. 'ఎ' 'బి' తరగతి ఖైదీలకు విడిగా ఒక కాంపౌండ్‌లో ఉన్న ఒక హాలు ప్రత్యేకించబడింది. మేజర్ ఖాన్ అప్పు డక్కడ సూపరెంటెండెంటుగా ఉండేవాడు. రూల్స్‌కు భిన్నంగాని పరిస్థితు లన్నింటిలోనూ ఆయన సత్యాగ్రహ ఖైదీల గోడు వినేవాడు.

మాకు నిర్దేశించబడిన బ్లాకులలో నీటికొరత బాగా ఏర్పడింది. అప్పటికి నాకు తొట్టి స్నానానికి వీలుగా ఒక తొట్టి యివ్వబడింది. కాని స్నానాలగది ఆవరణలో నీటి సప్లయికి ఏర్పాటు లేదు. అది మా కంద రికీ కలిపి ఇవ్వబడిన బ్లాక్. సాధారణంగా, 'ఎ' క్లాసు ఖైదీలు మా జెయిలుకు ఎక్కువగా తరలించబడిన పరిస్థితులలో, కాంపౌండ్ వెలు పల ఉన్న చిన్న చిన్న 'ఔట్ హౌస్' లో వారికి జాగా చూపించేవారు. ఆ బహిర్గృహాలలో మలయాళ దేశీయులూ, నా మిత్రులూ అయిన కీ॥ శే॥ రాముణ్ని మేనోన్ (ఆయన మంత్రిగా కూడా కొంతకాలం వ్యవహరించాడు), కె. మాధవ మేనోన్, ఆర్. రాఘవ మేనోన్ ప్రముఖు లుండేవారు.

## తలవంపు పద్ధతి

ఫైల్ పద్ధతన్నది 'జెయిల్ రూల్స్'లో అనాదినుంచీ ఉన్న ఆచారమే. ఆ పద్ధతి సాధారణ ఖైదీలకోసం పుట్టింది. జెయిలు పరి పాలనా విధానంలో "రాజకీయ ఖైదీలకు" అంటూ ప్రత్యేకించబడిన నిబంధనావళులు ఏవీ లేవు. ఆ దురదృష్టపు దినాలలో, లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్ వంటి మహనీయులను అరెస్టుజేసి శిక్షించడం జరిగినా, వారిని ఇతరులతో కలవకుండా ప్రత్యే కించి వేరువేరు జాగాలలో ఉంచేవారు.

ఈ సహకార నిరాకరణ ఉద్యమం అంటూ ఆరంభం అయ్యాక, జీవితాన్నే దేశసేవ కర్పించిన నూతన వర్గపు రాజకీయ ఖైదీలు ఆవి ర్భవించారు. అటువంటి రాజకీయ ఖైదీలు 1921 నుంచీ జెయిళ్లలో

నిండిపోతూన్న సందర్భాన్ని పురస్కరించుకుని, జెయిలు నిబంధనా వళిలో అటువంటి రాజకీయ ఖైదీల ఆహారమూ, ఖైదీలుగా ధరించ వలసిన ఉడుపుల తీరూ, ఫైల్ పద్ధతీ మొదలైన ఎన్నో విషయాలలో జెయిలు నిబంధనలు న్యాయంగా మార్చవలసి ఉన్నాయి. కాని ఆ రోజులలో అధికారంలో ఉన్న పెద్దల కెవ్వరికీ, రాజకీయ ఖైదీల విషయంలో కొన్ని మార్పులు చేయడం న్యాయమన్న ఆలోచన తట్ట లేదు. అందువల్ల వారికీ, ఇతర ఖైదీలకు ఏ విధమయిన భేదాలూ చూపబడలేదు.

ఇప్పటికీ చాలా జెయిళ్ళలో ఈ ఫైల్ పద్ధతి అమల్లోనే ఉంది. తిరుచిరాపల్లిలోనూ, మదరాసు పెనిటెంషరీలోనూ జరిగిన పద్ధతిగానే వెల్లూరు జెయిలులోకూడా ఆ ఫైల్ పద్ధతి అమలు పరచబడింది. మే మంతా ఒక వరసలో నిలవక తప్పేదికాదు. ఈ రకమయిన 'తలవంపు పద్ధతి' మాకు ఎంతో చికాకుగా ఉండేది. కాని సత్యాగ్రహుల మవడం వల్ల సరిపెట్టుకోక తప్పేదికాదు. మేము ఈ విషయంలో సూపరెం టెండెంట్‌గారితో మాట్లాడాము. అయన ఆ పద్ధతి అమలు పరచక పోతే వారి పీకలమీదికి వస్తుందని సమాధాన మిచ్చాడు.

అసలు ఈ ఫైల్ పద్ధతి ప్రకారం వారానికి ఒకటి రెండుసార్లు ఖైదీలందరూ ఒక వరసలో నిలబడాలి. అట్లా నిలబడిఉన్న ఖైదీల నందరినీ జెయిలరూ, సూపరెంటెండెంటూ సరిగా ఉన్నారో లేదో చెక్ చేసుకోవాలి. ఖైదీలందరూ నిటారుగా నిలబడి, వారివారి బరువును చూపించే, తూకపు ఛార్టులను సరిగా పట్టుకుని నిలబడాలి. అధికార్లకు, ఎవరయినా బరువు తగ్గిందీ లేందీ, ఆ పద్ధతివల్ల వెంటనే గ్రాహ్యం అవ్వాలన్నమాట. అటువంటి సమయంలో ఏమయినా చెప్పుకోవడానికి ఖైదీలకు సావకాశం ఉండేది. ఈ పద్ధతి రాజకీయ ఖైదీలకు వర్తించ రాదని వాదించే వారిలో నేను ఒకణ్ణి.

## మేజర్ ఖాన్ చతురజ్ఞత

'సి' క్లాసు వారితోసహా మా సంఖ్య పెరిగినకొద్దీ, మాకు కొన్ని కొన్ని సదుపాయాలు కలుగజేశారు. కొంత కాలంపాటు మాలో 'ఎ'

క్లాసు ఖైదీల ఉపయోగానికి మాత్రమే ఒక 'ఔట్‌హౌస్' ఇచ్చేవారు. తరవాత అందరి ఉపయోగంకోసం ప్రత్యేకంగా వంటశాల ఏర్పడింది. ఏవో నిర్ణీత దినాలలో నిర్ణయించబడిన కాలంలో 'బి' క్లాసు వారికి మాత్రం మమ్మల్ని కలుసుకుని కాలక్షేపం చెయ్యడానికి అవకాశం కల్పించబడింది. ఇతర సమయాలలో ఆ కాంపౌండ్ ద్వారాలు బంధించబడి ఉండేవి. వారికి తోచినప్పుడల్లా వీలునుబట్టి 'బి'క్లాసువారు గోడలు దాటి, కాలక్షేపానికిగాను మా 'ఎ'క్లాసు ఆవరణలోకి వచ్చేవారు.

తన అధీనంలో అప్పగించబడిన ఈ రాజకీయ ఖైదీల విషయంలో మేజర్ ఖాన్ చాల చాకచక్యంగా వ్యవహరించేవాడు. ఒకటి రెండుసార్లు మా 'ఎ'క్లాసు ఖైదీలు ప్రక్కనున్న ఆడవాళ్ళ జెయిలుకు వెళ్ళి పరిస్థితులు గమనించగల అవకాశం కలిగించాడు. తమని ప్రత్యేకించి ఎక్కడో ఎవరిముఖాలూ చూడడానికి వీలులేకుండా బంధించారన్న బాధలేకుండా వారికి జీవితం గడచిపోయేది. ఎన్ని చేసినా ఒక్కొక్కప్పుడు యువక ఖైదీలతో ఏదో ఛేటీ వచ్చేది. అలాంటి పరిస్థితులను మేజర్ ఖాన్ మా సహాయంతో ఎదుర్కొనేవాడు.

అప్పట్లో నాతోపాటు వెల్లూరు జెయిలులో దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు, బులుసు సాంబమూర్తి (మదరాసు శాసన సభ మాజీ స్పీకరు), విశ్వనాథదాసు (ఒరిస్సా రాష్ట్రానికి కొంత కాలం ముఖ్యమంత్రి), డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్య (దర్మిలా నాగపూరులో గవర్నరుగా కూడా ఉండేవారు. కాంగ్రెసు చరిత్ర వ్రాశారు), చక్రవర్తుల రాజగోపాలాచారిగారు (కొంతకాలం మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి) ఎస్. సత్యమూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు మొదలైన వా రుండేవారు. ఎండాకాలంలో ఆ ఆవరణ లోపలే ఆరు బయట పడుకోవడానికి మాకు అవకాశం కలుగ జేయబడింది. ఆరోగ్య విషయకంగా ఈ సహాయం మా కెంతగానో సహాయపడింది.

## జెయిలులో వ్రాసిన పుస్తకాలు

ఈ ఆరు బయట పడక అమరడంతో నేను తలపెట్టిన రెండు పుస్తకాలూ వ్రాయడానికి నాకు అవకాశం లభించింది. అందులో

మొదటిది "ప్రపంచ ఆర్థిక విధానము" (Monetary system of the world), రెండవది "భారతీయ ఆర్థిక విధానము" (Indian Monetary system). ఈ పుస్తకాలు రెండూ ఆంగ్లంలో వ్రాయకలిగాను.

కేంద్ర శాసన సభలో సభ్యునిగా ఉంటూ ఉండిన ఆ మూడు సంవత్సరాలలో, నాకు అభిమాన విషయమైన ఈ ఆర్థిక విధానాన్ని గురించి ప్రత్యేక శ్రద్ధతో గమనిస్తూ, ఆ విషయమైన ప్రసక్తి వచ్చినప్పుడల్లా వాదోపవాదాలలో పాల్గొంటూ ఉండేవాణ్ణి. ఆ కారణంగానే రిజర్వు బ్యాంక్ బిల్లూ, మారకపురేటు ప్రసక్తి వచ్చినప్పుడు క్షుణ్ణంగా ఆ విషయంలో వాదించగలిగాను. అదృష్టవశాత్తూ జెయిలులో ఉండగా ప్రపంచ ఆర్థిక విధానానికి తగిలిన దెబ్బను గురించీ, ప్రపంచ ఆర్థిక విధానాలూ- అవి భారత ఆర్థిక విధానంపై తెచ్చిన ఒత్తిడిని గురించీ క్షుణ్ణంగా చదవడానికి అవకాశం చిక్కడాన్ని, "భారత ఆర్థిక విధానమూ," "ప్రాపంచిక ఆర్థిక విధానమూ" అన్న మకుటాలతో ఆ రెండు పుస్తకాలూ వ్రాయాలని బుద్ధి పుట్టింది.

అప్పట్లో ప్రపంచ ఆర్థిక విధానానికి తగిలిన దెబ్బ, లోగడ ఎప్పుడూ తగలనంత గట్టిగా తగలడాన్ని, ఆ విషయాన్ని గురించి శ్రద్ధగానూ, పరిశీలనగానూ, క్షుణ్ణంగానూ చదివి సంగతి సందర్భాలు సరిగా గ్రహించగలిగాను. ఆ తెల్లజాతులవారు ప్రపంచంలోని అన్ని ప్రాంతాల వారితోనూ వర్తక వ్యాపారాది సంబంధాలు కలిగిఉండడాన్ని ఆయా దేశాలలో ఉండే మార్కులో, షిల్లింగులో, డాలర్లో, రూబిల్సో, రూపాయలో- అవి యేవయినా, వాటిమధ్య మారకపు విధానమూ, తద్వారా అనేక నిత్య అవసర వస్తువుల ధరలూ అన్నీ ఆ తెల్లజాతుల వారు తమ చేతులలో పెట్టుకున్నారు. నిజానికి ఏదేశపు ఆర్థిక విధానమైనా ఆ రెండింటి మీదే కదా ఆధారపడి ఉండేది?

ఈ సందిగ్ధ పరిస్థితులలో ఆంగ్లేయులు 7 షి. అమ్మవలసి ఉండగా, జర్మనీ దేశపు 'మార్కు' 200 పాయింట్లు పెరగడాన్ని జర్మనీవారు తమ స్టేట్ బ్యాంక్‌ని మూసి వేయవలసి వచ్చింది. వారి

దేశంలో వారి స్టేట్ బ్యాంక్ బ్రాంచీలు సుమారుగా దేశం అన్ని ప్రాంతాలలోనూ కలిపి 1700 ఉండేవి. అవన్నీ మూత పడినట్టే గదా! అంటే గవర్నమెంటు దివాలా తీసిందన్నమాట! అందువల్ల వారు తమ బ్యాంకులముందు బ్యాంకులో డబ్బు దాచుకున్న వారికిగాని, తమతో వ్యాపార సంబంధాలున్న వారికిగాని డబ్బు వాపసు ఇవ్వబడదు అని వ్రాసిన ప్రకటన కాగితాలు అతికించ వలసివచ్చింది.

ఇటువంటి పరిస్థితులెల్లా ఉత్పన్నం అవుతాయో గ్రహించ గలగడాన్ని, ఆ ఆర్థిక విధానాలను గురించి క్షుణ్ణంగా చదవాలనీ, వాటిని గురించి జెయిలులో ఉన్న ఆ రోజులలో వ్రాయాలనీ బుద్ధి పుట్టింది. ఆ ప్రకారంగా, అటు కేంద్ర శాసన సభలోనూ, ఇటు జెయిలులోనూ గ్రహించిన విజ్ఞానంతో ఆర్థిక విధానాదులను క్షుణ్ణంగా చర్చించి ఆ పుస్తకాలు వ్రాయగలిగాను.

ఆ పుస్తకాలను చదివిన మన నాయకులకూ, ప్రజానీకానికీ కూడా అనువైన సందర్భాలలో ప్రత్యక్ష చర్యలకు పూనుకున్నట్లయితే పూర్ణ స్వాతంత్ర్య సముపార్జన సులభ సాధ్యమవుతుందన్న విషయం కరతలామలకం అవుతుంది. ఏ యే సందర్భాలలో ఆ ఆర్థిక విధానాలు ఎల్లాంటి దారులు తీస్తాయో, ఆ యా సమయాలలో ఎక్కడ నొక్కితే అవి చక్కపడతాయో వివరించడాన్ని, సందర్భ శుద్ధిగా సాగించే సత్యాగ్రహాలూ, సహకార నిరాకరణాలూ, శాసన ధిక్కారాలూ ఉపయోగ పడే తీరులన్నీ మన నాయకులు గ్రహించడానికి ఆ పుస్తకాలు బాగా ఉపయోగపడతాయి.

గాంధీగారు చెయ్యమన్నప్పుడల్లా సత్యాగ్రహం చేసి జెయిళ్ళు నింపడం కంటె, కీలెరిగి వాత పెట్టడం మంచిది కాదా? నా పుస్తకంలో పశ్చిమ జాతులవారు ప్రాపంచిక ఆర్థిక విధానాన్ని ఎల్లా పెంపొందించారు, వారు ఏ ప్రకారంగా అమెరికా యునైటెడ్ స్టేట్స్ వారితో కలిపి ఆ ఆర్థిక విధానాన్ని ఎల్లా ఎల్లా రూపొందించ పూనుకున్నారు అన్న విషయాలను గురించి పూర్తిగా చర్చించడానికి సావకాశం లేక పోయినా, నా పుస్తకం చదివిన ఒక్కొక్కరికీ ఆంగ్లేయులు ఏ యే

కారణాలవల్ల భారతదేశాన్ని వదులుకోవడానికి అనిష్టత చూపుతున్నారో మాత్రం క్షుణ్ణంగా అర్థమయి తీరుతుంది.

## కన్ననూరు జెయిలుకు బదిలీ

హఠాత్తుగా ఒకనాటి ఉదయాన్ని, నన్ను కన్ననూరు జైలుకు మార్చనున్నారనీ, ఆ సాయంత్రమే నేను బయల్దేరవలసి ఉంటుందని చెప్పారు. ఏ కారణం వల్ల ఈ మార్పు చేస్తున్నారో నాకు వారు చెప్ప లేదు. నాకూ తెలియదు. ఎంత ఆలోచించినా, క్రమశిక్షణాది విషయా లకు నేను ఎప్పుడూ భంగం కలిగించలేదనీ, ఎటొచ్చీ 'సి' క్లాసు ఖైదీలను గురించి మాత్రం తరుచు సూపరింటెండెంట్‌తో వాదించే వాడిననీ, ఆ వాదన తీరూ, ధోరణీ నేను అనుకోని విధంగా సూపరిం టెండెంట్‌ను చికాకు పరచాయేమోననీ భావించాను. నేను నిశ్చయం గానూ, నమ్మకంగానూ భావిస్తూన్న విధానాల ప్రకారం, రాజకీయ ఖైదీలు సామాన్య ఖైదీలవలె చూడబడకూడదన్నదే నా వాదం. రాజ కీయ ఖైదీలుగా 'ఏ' 'బి' 'సి' క్లాసులలో ఏ క్లాసుకు చెంది ఉన్నా, మేమంతా అహింసాత్మక విధానంగా దేశ స్వాతంత్ర్యంకోసం పెనగు లాడుతూన్న రాజకీయ ఖైదీలమే అవడాన్ని మా విషయంలో తగు విచక్షణతో ఆ జెయిలు అధికార్లు మెలగవలసి ఉంటుందన్నదే నా పట్టు. ఎంత ప్రయత్నించినా నాకు నమ్రత, అణకువ అన్నవి అలవాటు కాలేదు సరికదా-తలవంపు, చిన్నతనమూ అన్నవి పీడిస్తూనే ఉండేవి. బహుశః అందువల్ల నా మామూలు నడతా, నా ప్రవర్తనా ఆ సూప రింటెండెంట్ గారికి నాపై విరుద్ధ భావ మేర్పడడానికి కారణమయి ఉండవచ్చును.

కాగా ఇప్పటికీ మరపురాని ఇంకో చిన్న సంఘటన ఒకటుంది. ఒకనాడు నాకు సూపరింటెండెంటుగారి వద్దనుంచి కబురు వచ్చింది. నేను వెళ్ళేసరికి ఆయన ఒక బురుజులో ఆసీనులయి ఉన్నారు. నేను వెళ్ళి, ఆచార ప్రకారం ఆయనకు నమస్కరించాను. నన్ను కూర్చోమని అనకుండా ఆయన అలా నిలబెట్టేసే ఉంచాడు. న్యాయానికి ఖైదీలుగా మా కలాంటి మర్యాదలు (బహుశః) చేయరు. చేయకూడదు. కాని

నాలో ఇంకా ఆ అహంభావం అల్లాగే ఉండిపోవడాన్ని, నాకు జెయిలకు రాకపూర్వం ఉండిన హోదా, గౌరవమూ, అంతస్థూ లాంటివి నేను మరవక పోవడాన్ని, సూపరింటెండెంటు నాకు ఆసనం చూపించక పోవడం అమర్యాదగా భావించాను. నేను చుట్టూ కలయజూచి, ఆ ఆఫీసులో ఒక మూలను ఒక కుర్చీ ఉండడం గమనించాను. ఆ కుర్చీ తెచ్చుకుని ఆయన బల్లకు సమీపంగా వేసుకుని కూర్చున్న తర్వాతనే ఆయనతో మాటలాడ నారంభించాను. ఆ చర్య ఆయన్నే అన్నమాటే మిటి, ఏ సూపరింటెండెంట్ నయినా చికాకుపెట్టి తీరుతుంది. ఇది జరిగిన కొద్ది రోజులలోనే నా బదిలీ సంగతి తెలుపబడింది బహుశః నా బదిలీకి పైని ఉదహరించిన రెండు ఉదంతాలూ కారణమయి ఉండ వచ్చును.

ఏది ఏమయినా ఆ బదిలీవార్త నాకు విచార కారణం కాలేదు సరి గదా, ఒక్క యేడాదిలోనే నాల్గవ జెయిలు కూడా చూడబోతున్నాననే ఒక చిన్న ఆనందమే అంకురించింది. కన్ననూరు నాకు కొత్త జాగా కాదు. అప్పటికి 15 సంవత్సరాలుగా, మలయాళ దేశంతో నాకు పరిచయం ఉంది. జెయిలుకు రాకపూర్వమే నేను మలయాళ దేశమంతా పర్య టించాను. నేను అంత క్రితం కన్ననూరు జెయిలులో ఖైదీగా ఉండక పోయినా, అక్కడకు వెళ్ళి, ఆ జెయిలులో రెండు సంవత్సరాల శిక్ష ననుభవిస్తూన్న యాకుబ్ హుసేను గారిని ఆ జెయిలులో కలుసుకున్నాను. ఆ జెయిలు ఉన్న తావును బట్టీ, అక్కడ ఉన్న వాతావరణ పరిస్థితిని బట్టీ నాకా జెయిలు నచ్చింది. ఆ జెయిలు మంచి ఎత్తుమీద ఉంది. మలయాళ దేశపు శీతోష్ణస్థితిగతులు అంత యెక్కువ ఆరోగ్యకరమయి నవి కాకపోయినా, అక్కడ ఉష్ణోగ్రత తక్కువ. రాష్ట్రంలోని ఏ ఇతర సెంట్రల్ జెయిలూ అటువంటి మంచి వాతావరణంలో లేదనే నా తలంపు. అన్నిటికంటె ముఖ్యం, ఉప్పు సత్యాగ్రహ విషయంలో ఆ జెయిలు ఎక్కువ ప్రసక్తిలోకి వచ్చింది. అందువల్ల ఆ జెయిలుకు ఆనందంగానే వెళ్ళాను. అక్కడ ఉన్న వేలాది తోటి ఖైదీలు నన్ను

ఆహ్వానించి, నాకు ఏమి కావలసినా, ఏ సదుపాయం కావలసినా, అన్ని వేళలలోనూ, అన్నీ సమకూరుస్తూ ఉండేవారు.

## చిన్న చిన్న దొంగతనాలు

జెయిలు ఆవరణ లోపల మంచి కూరగాయ తోటలుండేవి. వాటిని జాగ్రత్తగా పెంచుతూ ఉండేవారు. కొంతమంది యువక ఖైదీలు ఉదయం 6 గంటలకు జెయిలు తెరవబడడంతోనే ఆ తోటపైపునకు పరుగెత్తి, ముళ్ళతీగెలతో ఏర్పరచబడిన కంచెను గెంతి అక్కడ పెరుగుతూన్న లేత బెండకాయలు మొదలైన వాటిని తెగ తినేవారు. వార్డర్లు వాళ్ళను పట్టుకుని జెయిలరు దగ్గరకో, సూపరింటెండెంట్ దగ్గరికో తీసుకు వెళ్ళేవారు. అందువల్ల ఆ సూపరింటెండెంట్ నన్నూ, వెంకటప్పయ్యగారినీ, ఇంకొక రిద్దరినీ పిలిపించి, ఆ కుర్రవాళ్ళు అల్లరి చేయకుండా చూడవలసిన పూచీ మాదనీ, వాళ్ళని అదుపులో పెట్టి సరిగా ప్రవర్తించేటట్లు చూడమనీ మాకు చెప్పారు.

స్వాతంత్ర్యదినంనాడు, తెలతెలవారుతూండగా, మేము మా సెల్స్‌లోంచి బయటకు వచ్చేసరికి ఆఫీసర్లలో ఉత్పన్నమైన పెద్ద కలవరం వినబడింది. కాంగ్రెసు జెండాలు టవర్‌మీదా, ఖైదీలుంటూన్న బ్లాకు బ్లాకుమీదా ఎగుర వేయబడుతున్నాయన్న గందరగోళం ఎక్కువయింది. ఆఫీసర్లు చిక్కులలో పడడం న్యాయమే కదా! ఈ చర్యకు నాయకు లెవరో తేల్చుకోవా లన్న విషయంలో, ఎంతో తర్జన భర్జన జరిగింది. పరిశోధన పెద్ద ఎత్తునే జరిగింది. కాని, ఈ కార్యానికి కర్త ఎవరో తేలలేదు.

నన్ను కన్ననూరు బదిలీచేసిన కొద్ది రోజులలోనే బొంబాయి నివాసి బాట్లివాలా అన్న అతడు బదిలీ అయి, అక్కడకు సూపరింటెండెంట్‌గా వచ్చాడు. ఆయన వచ్చిన కొద్దిరోజులలోనే యువకులు చాలా మంది అతన్ని చుట్టుముట్టి, తమకు కొన్ని ప్రత్యేక సదుపాయాలు కావాలని కోరారు. జెయిలు అధికారులు ఆ కోర్కెలు మన్నించలేదు. యువకులు నిరాహార దీక్షకు ఉపక్రమించారు. ఈ సంగతి నాకు నాలుగైదు రోజుల వరకూ తెలియలేదు. ఆ యువకులంతా జెయిల్లో మాకు

చాలా దూరంగా ఉన్న వేరే జాగాలో ఉండేవారు. పరిస్థితి విషమించిన కారణంగా, సూపరింటెండెంట్ నన్ను కలుగజేసుకోమని కోరాడు. అతి కష్టంమీద పరిస్థితిని చక్కబరచగలిగాను. కాని, దానికి కొంత కాలం పట్టింది.

## లాఠీఛార్జీ

కొంతమంది ఖైదీల నడత జెయిలు అధికారులకు చికాకుగా ఉండేది. ఆ పరిస్థితి ఆరంభ దినాలలో మాకు తెలియదు. ఒక రోజు రాత్రి లాకప్పయ్యాక, సూపరింటెండెంట్ వెళ్ళిపోయాక, క్రింది తరగతి ఉద్యోగస్తులకు, తలుపులు తెరచి, అనుమానితులపై లాఠీఛార్జి చెయ్యాలని బుద్ధి పుట్టింది. మాకు ఏడ్పులూ, పెడబొబ్బలూ వినబడుతూన్నా, మమ్మల్ని లాకప్పులో ఉంచిన కారణంగా, తెల్లవారిందాకా అసలు ఏం జరిగిందో మాకు తెలియరాలేదు. సూపరింటెండెంట్ తనకు ఏమీ తెలియదనీ, లాఠీఛార్జి విషయంలో తాను ఎట్టి ఉత్తరువూ ఇవ్వలేదనీ అన్నాడు. పరిస్థితి విషమించి ఉంటే, తన తరవాత ఒక్క జెయిలరుకు మాత్రమే లాఠీఛార్జీ జరిపించగల అధికారం ఉందన్నాడు.

## ఉడ్సు రాక

అప్పట్లో మలబారు జిల్లాకు ఇ. సి. ఉడ్సు జిల్లా కలెక్టరు. ఆయన జెయిలును పరిశీలిస్తూ నా గదిలోకి వచ్చాడు. నా గదిలో ఒకదాని నిండా పుస్తకాలూ, తెల్ల కాగితాలూ, వ్రాత సామగ్రీ ఉన్నాయి. ఆ గదిలో నేను వ్రాసుకుంటూ కూర్చొని ఉన్నాను. నా గదిలోకి వచ్చి, ఆ పుస్తకా లన్నీ ఏమిటని అడిగాడు. వాటిని ఉపయోగించుకోడానికి ఎవరు అనుమతి ఇచ్చారని అడిగాడు. ఆయనకు ఒక ఖైదీ బండెడు పుస్తకాలు ముందువేసుకుని వ్రాసుకుంటూ కూర్చోవడ మన్నది కిట్ట లేదు. "నీవు యే విషయంమీద వ్రాస్తున్నా"వని నన్ను అడిగాడు. నేను ప్రపంచ ఆర్థికవిధానాన్ని గురించీ, బర్మా, సిలోన్‌లాంటి దేశాలలో నా పర్యటన అనుభవాలూ వ్రాస్తూన్నా నన్నాను. ఆయన చికాకు చెందాడు కాని, ఎవరితో మాట్లాడుతున్నాడో గ్రహించుకొని తక్షాంతి

పొందాడు. నవ్వుముఖంతో, తాను గంజాం జిల్లాలో ఉంటూండగా నేను ఆయన ఎదుట ఒక కేసులో హాజరయిన ఉదంతాన్ని గురించి చెప్పాడు. ఆయన చెప్పిందాకా నాకా ఉదంతం గుర్తుకు రాలేదు. తరవాత జెయిలు అధికారులను ఎందువల్ల నాకు అటువంటి సదుపాయం కలుగ జేశారని అడిగాడు. నేను ప్రభుత్వం వారి అనుమతిని సంపాదించానని సూపరింటెండెంట్ చెప్పాడు. నేను కాంగ్రెసు పరిపాలనా దినాలలో రెవిన్యూ మంత్రిగా ఉంటూన్న కాలంలో ఆ ఉడ్స్‌దొర నా చేతికింద ఒక జిల్లా కలెక్టరుగా పనిచేశాడు. ఆయన విషయంలో ఒక విచిత్రమయిన సంఘటన జరిగింది. అది చాలా ముచ్చటయిన కధ. దానిని 'కాంగ్రెసు పరిపాలన' అన్న శీర్షికలో పొందుపరుస్తాను.

# 11

## గాంధీ-ఇర్విన్ ఒడంబడిక, మా విడుదల

కాంగ్రెసు వారు నడిపిన ఉప్పు సత్యాగ్రహ సమరం పూర్తి విజయాన్ని సాధించిన కారణంగా, ఆంగ్లేయులకూ మనకూ మధ్య రాజీ షరతులు ప్రతిపాదించబడుతున్నాయనీ, రాజీ కుదరవచ్చుననీ పత్రికాముఖంగా తెలియరావడంతోనే, సత్యాగ్రహ ఖైదీల కందరికీ నూతనోత్సాహం బయల్దేరింది. తాము ఎప్పట్లో బయటపడగలమా అన్న ఆతురతా బయల్దేరింది. వారిలో చాలామందికి బ్రిటిష్‌వారి తత్వం తెలియదు. నాయకులకు కూడా ఏవేవో తీరని కోర్కెలు ఉత్పన్నమయినాయి. కాంగ్రెస్ వాలంటీర్లూ, వర్కర్లూ మొదలైన చిన్న పెద్ద లందరూ, నాయకులను నిశ్చింతగానూ, గ్రుడ్డిగానూ అనుకరిస్తున్నారన్న విషయం మాత్రం అందరూ ఎరిగి ఉన్నదే.

నేను కాంగ్రెసు 'కాబినెట్'లో ఉన్నది స్వల్పకాలమే అయినా, ఆ 1921-22 మధ్య దినాలలో ఉండిన ఆ కాబినెట్ వారి 'లోగుట్లు' నాకు బాగా అర్థమయ్యాయి. దర్మిలా నేను రాజీనామా ఇచ్చిన తరవాత

కాంగ్రెసులో ఉన్న ఇతర సభ్యులకు వలెనే, నాకూ ఆ కాంగ్రెసు కాబినెట్ వారి లోట్లన్నీ తెలియరాలేదు. ఆచార ప్రకారం కార్యనిర్వాహక వర్గంలో ఒక ఆంధ్రు డుండడం మామూలు. అలాంటి సభ్యులలో మొట్టమొదటివాడు దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులుగారు. దర్మిలా నేనూ, నా తరవాత బులుసు సాంబమూర్తిగారూ ఆంధ్ర సభ్యులంగా ఉండేవారము. సాంబమూర్తిగారి తరవాత డా॥ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు ఆ స్థానాన్ని ఆక్రమించారు. అంతేగాని, మాలో ఎవ్వరికీ స్థిరమయిన శాశ్వత సభ్యత్వం లేదు. ఈ సభ్యులు, అధ్యక్షునితోపాటు సాధారణంగా ఏటేటా మారేవారు.

## రాజీ వదంతులు

కన్ననూరు జెయిలులో ఉన్న మేమంతా కాంగ్రెస్సుకూ, ప్రభుత్వానికీ మధ్య కుదరబోయే రాజీని గురించి కలలుగంటూ, ఆ రాజీ ఎప్పుడు, ఎంత త్వరగా కుదురుతుందా అని ఆశగా ఎదురు చూసే వారం. మాలో కార్యనిర్వాహక సభ్యు లెవ్వరూ లేని కారణాన్ని, మాలో ఎవరూ ముందుగా విడుదల కావడానికిగాని, అట్టివారి ద్వారా వారికొచ్చే ప్రత్యేక వార్తలద్వారా నిజానిజాలు గ్రహించడానికిగాని అవకాశం ఎంతమాత్రమూ లేకుండా పోయింది.

రాజీ ప్రతిపాదనలు జరుగుతాయి, జరుగుతున్నాయి అన్న పుకార్లు 1930 ప్రారంభ దినాలలోనే ఆరంభమయ్యాయి. జయకర్ గారూ, సర్ తేజ్‌బహదూర్ సప్రూ ప్రభుత్వంవారి సూచనలు ఏమీ లేకుండా, తమంతట తాముగానే ఏదో రాజీ కుదిరితే బాగుండును అనుకుని, ప్రయత్నించడానికి బయల్దేరితే, వారివలన ఏదో జరిగిపోతుందని తలచడం అవివేకమే గదా! కాని, పాపం, ఆశపడిన యువక బృందం నోరు తెరుచుకుని కూర్చుంది. పేపర్లలో మాత్రం ఈ మధ్యవర్తులు, ప్రభుత్వంవారి అనుమతితో గాంధీగారినీ, మోతీలాల్, జవహర్‌లాల్ నెహ్రూలను జెయిళ్ళలో కలుసుకుంటారని వార్తలు పడ్డాయి. కాని వీరు అలా చేయడానికి ప్రభుత్వం అనుమతి ఇచ్చినట్లుగాని, రాజీ ప్రతిపాదనలు చేసినట్లుగాని ఎక్కడా కనబడలేదు.

## మా ఊహాగానాలు

ఇల్లా ఏదో పుకారుగా ఒక వార్త పేపర్లో వచ్చేసరికి, ఆ వార్త అధికార పూర్వక వార్తగానే నమ్మి, ఊహాగానాలు చేశాం. ఆ రాజీ విషయాలన్నీ ముందు ముందు వ్రాస్తాను. ఏ ప్రకారంగా నాయకులను తప్పుదారి త్రొక్కించారో, ఏ కారణంగా ఆ రాజీ ప్రయత్నాలు విఫలం అయ్యాయో, సప్రూ- జయకరుగార్లూ, కాంగ్రెసు నాయకులు కూడా ఏ విధంగా పప్పులో కాలేశారో అన్నీ వివరిస్తాను. ఈ లోపల కన్ననూరు జెయిలులో ఉన్న మేము రాజీ ప్రతిపాదనలు జరుగుతున్నాయి, రాజీ కూడా కనుచూపుమేర దూరంలోకి వచ్చింది అని అనుకుంటూ, ఆ జూలై - ఆగస్టు మాసాలు ఉత్సాహంగా గడిపాం.

ఆ నాటి పరిస్థితి అత్యంత ఆశాజనకంగా ఉండడానికి కారణం, తండ్రీ కొడుకులయిన ఆ నెహ్రూ ద్వయమూ, డా॥ సయ్యద్ మహమ్మదూ, కార్యనిర్వాహక సభ్యులు ఒకరిద్దరూ, ఉత్తర ప్రదేశంలో ఉన్న నైనిటాల్ జెయిలునుంచి గాంధీగారిని కలుసుకోడానికిగాను ఎరవాడా జెయిలుకు తీసుకురాబడ్డారన్న వార్త. ఇదంతా ఒకపక్క నుంచే వస్తూన్న సమాచారం అని మాకు తెలియదు. కాంగ్రెసు నాయకుల నోటంట వారి కోర్కెలు రాబట్టాలని చేసిన తంత్రమేమో గాని, వారందరూ కలిసికట్టుగా ఆలోచించిన మీదట, ఒకే అభిప్రాయానికి రావడానికి వారికి ఏ విధమయిన సావకాశమూ కల్పించబడలేదు. కాని వారి వారి అభిప్రాయాలు యిలా యిలా ఉన్నాయనిమాత్రం వైస్రాయి గారికి వార్తలు చేరేశారు.

## బెల్లంకొట్టిన వైస్రాయి

అంతవరకూ వైస్రాయ్‌గారు బెల్లంకొట్టిన రాయిలా, శబ్దరహితంగా, ఉలుకూ పలుకూ లేకుండా కూర్చున్నాడు. అంతేకాదు, తాను ఏవయినా సూచనలు చేసి ఉంటే, వాటిని వెనక్కు లాక్కుని కాంగ్రెస్ వారిని చికాకులపాలు చెయ్యడానికి సిద్ధం అవడానికి కావలసిన పన్నుగడలూ, సన్నాహాలూ చేస్తూ వచ్చాడు. నిజానిజాలు తెలుసుకుని,

అవసరమయిన సలహాలూ, సూచనలూ ఇవ్వడానికి మా కెవ్వరికీ ఖైదు కారణంగా హక్కు లేకుండా పోయింది. అందువల్ల సాధారణకాంగ్రెస్ సభ్యునిగా గాని, అఖిల భారత కాంగ్రెస్ కమిటీ మెంబరుగా గాని నే నేమీ సలహా ఇవ్వగల స్థితిలో లేను.

ముందుగా ఏ లీడర్నీ వదలని కారణంగా రాజీ జరగడానికి ఎల్లా సాధ్యం అవుతుందనే అనుమానం నన్ను పీడిస్తూనే ఉంది. కాని చాలామంది యువకులూ, కొంతమంది పెద్దలూ కూడా అన్యథా తలచి, నేను అనుమానం సూచిస్తూంటే నా మీద విరుచుకు పడేవారు. అల్లా ఆ జూలై - ఆగస్టు మాసాలు రెండూ ఆశాపూరితంగానే వెళ్ళిపోయాయి. అనుకోనివిధంగా, ఎంతో ముందుగా ఈ యుద్ధ కాండంతా ఎంతో విజయవంతంగా ముగుస్తోందని మా వాళ్ళంతా కేరింతాలు కొడుతూ చాలా ఉల్లాసంగా తయారయ్యారు. వార్తాపత్రికలలోని గడబిడ తప్ప, మధ్యవర్తి ప్రయత్నాలను గురించీ, జెయిళ్ళల్లో ఉన్న నాయకులు ఖైదీలుగానే ఉంటూ ఉన్నా వారిలో వారు కలుసుకుని సంప్రతించుకోవడానికి అవకాశాలు కలుగజేయబడ్డాయని కానీ, స్పష్టంగానూ, సవ్యంగానూ, ఆ జూలై-ఆగస్టు మాసాలలోగాని, దర్మిలాగాని ఎలాంటి సమాచారమూ, సరిగా గ్రాహ్యం అయ్యేరీతిని, ఏ మూలనుంచీ అందలేదు. రాజీ ప్రయత్నాలు విఫలం అన్న వార్తయినా ఎక్కడా పొక్కలేదు.

## వట్టి పేపరు వార్తలు

గవర్నమెంటువారు రాజీ ప్రయత్నాలు విఫలమయ్యాయని చెప్పకపోవడానికి అనేక కారణా లున్నాయి. మీరు కలుగజేసుకుని రాజీ ప్రయత్నాలు జరపడంగాని, ఫలాని విధంగా ఫలానా ఫలానా సూచనలు గాంధీగారితోనో, నెహ్రూ ద్వయంతోనో చేయవలసిందనిగాని ప్రభుత్వంవారు ఎప్పుడూ ఏ మధ్యవర్తికీ సూచించి ఉండలేదు. ప్రభుత్వంవారికి సంబంధించి నంతవరకూ అసలు ప్రతిపాదనలూ జరగలేదు, ప్రయత్నాలు విఫలమూ కాలేదు. అందువల్ల ఎలాంటి ప్రకటనా చేయవలసిన బాధ్యతా ప్రభుత్వం వారిమీద లేదు. భారతదేశమందలి కాంగ్రెసు నాయకులూ, దేశం అన్నిమూలలా ఉన్న జెయిళ్ళలో మగ్గు

తూన్న కాంగ్రెస్ ఖైదీలూ, ప్రజానీకమూ పేపరు వార్తలు చూసి, వాటిని నమ్మి ఎల్లా తెలివి తక్కువగా ప్రవర్తించారో గ్రహించిన వైస్రాయి మాత్రం జరిగిన సంఘటనల కన్నింటికీ తనలో తాను కులుకుతూ ఆనందించి ఉండి ఉండవచ్చును.

జూలై - ఆగస్టు మాసాల దర్మిలా ఎలాంటి సమాచారమూ అందని కారణంగా ఏ విధమయిన తాజావార్తలూ ప్రకటించడానికి పత్రికలవారికి అవకాశమే చిక్కలేదు. మేమంతా గాంధీగారికీ, వైస్రాయిగారికీ మధ్యను నడుస్తూన్న సుదీర్ఘ చర్చల కారణంగా రాజీ కుదరడం ఆలస్యం అయిఉండవచ్చునని భావించాం. అందువల్ల చర్చలలో పాల్గొన్న ఆ ఇరువురు ముగ్గురు నాయకులకూ తప్ప తదితరుల కెవ్వరికీ ఏ విధమయిన వార్తలూ అందక పోవడాన్ని, కాస్త ఆలస్యం అయినా ప్రతిపాదనలు మాత్రం ఫలవంతంగానే ముగుస్తాయి అనే ఆశతోనే ఉన్నాం. అదృష్టవశాత్తూ, ఆ ప్రయత్నాలు ఏనాడో విఫలమయ్యాయన్న ముక్క వినపడలేదు. విఫలమయాయన్న వార్త విని ఉంటే ఎంతో నిరుత్సాహ పడిపోయి, ఎలాంటి అలజడులు రేకెత్తించే వారిమో! "As dead as Queen Anne" అన్న ఈ ఆంగ్ల జాతీయం ఈ ప్రతిపాదనలకు బాగా వర్తిస్తుంది.

## రాజకీయ ఖైదీల విడుదల

1930 జూలైలో ఆరంభం అయిన రాజీ ప్రతిపాదనలు విజయవంతంగా జరిగాయని నమ్మడం నిజంగా చాలా దుఃఖకరమైన విషయం. నిజానికి, నాయకులను సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఇచ్చిన ఒక ఆర్డరు ప్రకారంగా విడుదల చేయడమన్నది మొదటి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ అయిన తరవాత జరిగింది. కాంగ్రెసు తరఫున తమ ప్రతిపాదనలు చెయ్యడానికి నాయకులను, వారిలో వారు సంప్రతించుకోడానికి వీలుగా, విడుదల చెయ్యడమే సవ్యమయిన మార్గం. జూలై-ఆగస్టుమాసాలలో రాజకీయ ఖైదీలు పడిన ఆశ క్రమేపీ వృద్ధయి, పరిష్కారం ఆలస్యం అయ్యే సరికి నిరాశ మరీ ఎక్కువయి పోయింది. ఆ ప్రకారంగా ఆనాడు

జెయిళ్ళలో ఉన్న ఖైదీల మనోభావాలు అల్లా ఆశా నిరాశల మధ్య ఊగులాడాయి. ఆ పరిస్థితిని అపసవ్యంగానూ, అస్తవ్యస్తంగానూ చక్కబెట్టిన దానికి ప్రతిఫలం అది. వారు చేసిన ఎన్నో త్యాగాలకు ప్రతిఫలంగా, గౌరవ ప్రదమయిన పరిష్కారం జరుగనున్నదని ఖైదీ లెంతగానో ఆశించారు.

## విడుదలకి అసలు కారణం

కాని అసలు జరిగిందేమిటంటే, సెక్రటరీ ఆఫ్ స్టేటూ, బ్రిటిష్ క్యాబినెట్టూ నవంబరు 30 వ తేదీని జరిగిన ఆ మొదటి రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సులో కాంగ్రెసువా రెవ్వరూ లేని కారణంగా అది వట్టి బూటకపు నాటకమే అయిపోయిందని గ్రహించి, ఆ రౌండ్ టేబిల్ కార్య క్రమాన్ని ముందు సంవత్సరానికి వాయిదా వేసి, దానిలో పాల్గొనడానికి కొంతమంది కాంగ్రెసువారికి అవకాశం కలుగజేయడానికి మాత్రమే, ఒక్క యేడాది పూర్తి జెయిలు అనుభవాలతో ఉన్న అన్నివర్గాల కాంగ్రెసు నాయకులనూ విడుదల చేశారు.

గాంధీగారిని యావత్తు భారతదేశానికీ ఏకైక నాయకునిగా గుర్తించి, వైస్రాయ్‌గారు ఆయనతో సంప్రతింపులు ఆరంభించారు. ఆ సంప్రతింపుల పర్యవసానంగానే, గాంధీ- ఇర్విన్ ప్యాక్టు అనే ఒక ఒప్పందానికి ఆ ఇరువురూ రావడమూ, ఆ ఒప్పందాన్ని అనుసరించి దేశంలో అన్నిప్రాంతాలలోనూ జెయిళ్ళలోఉన్న కాంగ్రెసు వారినందరినీ ఏకంగా జెయిళ్ళనుంచి విడుదల చెయ్యడమూ, దాని మూలంగా మేము కన్ననూరు జెయిలునుంచి బయట పడగలగడమూ సంభవించింది.

## కాంగ్రెసువారి కాళ్ళబేరం

ఊహించ శక్యంగానంత ఘనంగా సైమన్ కమీషన్ బహిష్కరణ జరుపగలిగిన కాంగ్రెసు పార్టీవారు, అనగా ఆ పాతకాలపు స్వరాజ్య పార్టీ నాయక వర్గం ఎంతో ఓరిమి వ్యక్తం చేసే తమ మితమైన వాంఛలతో బ్రిటిష్‌వారినీ, బాహ్య ప్రపంచాన్నీకూడా తాము కోరిన కోర్కెలు చాలా పరిమితంగానూ, సబబైనవిగానూ ఉన్నాయని

నమ్మించాలని చూశారు. వారు నిజంగా స్వాతంత్ర్య ప్రతిపాదనే గనుక పట్టుకు కూర్చుంటే వారి కోర్కెలు చాలా అతిగా ఉన్నట్లు భావింపబడతాయని తలచారు.

అంతేకాదు, తమ స్వాతంత్ర్యవాంఛను విస్మరించి, అఖిల పక్ష సమావేశం వా రంగీకరించిన విధంగానే నడవాలని, అఖిల భారత కాంగ్రెసు కమిటీవారూ, పండిత మోతీలాల్ నెహ్రూగారూ కూడా, బాగా ఆలోచించి, అన్ని పార్టీలవారినీ 1928 నాటి కలకత్తా కాంగ్రెస్‌కు ఆహ్వానించారు. సెక్రటరీ ఆఫ్ స్టేటూ, బ్రిటిష్ కాబినెట్టూకూడా తాము ఎంతో వినయంగా కోరిన అ తగుమాత్రపు కోరికలను చాలా నిదానంగా పరిశీలించి అంగీకరిస్తారనే ఆశతోనే అఖిల పక్ష నాయకులూ ఆ కాంగ్రెస్‌కు హాజరయ్యారు.

గత సంవత్సరం మదరాసు కాంగ్రెస్‌లో ఆమోదించిన స్వాతంత్ర్య తీర్మానానికి భంగంరాని రీతిగా, అఖిల పక్ష సమావేశం వారు అంగీకరించిన ఆ పథకాన్నే మోతీలాల్ నెహ్రూ కమిటీవారు తమ రిపోర్టులో మూర్తీభవింపజేశారు. కాంగ్రెసు నాయకుల ఆలోచనా, వారి విధానమూ బ్రిటిష్‌వారి హృదయంలో పూర్తిగా వ్యతిరేక భావాన్నే కలిగించాయి. సైమన్ కమిషన్ బహిష్కారం వైస్రాయి హృదయంలోనూ, బ్రిటిష్ కాబినెట్‌లోనూ ఆగ్రహావేశాలు కలిగించింది. బాధ్యతా యుత ప్రభుత్వం, స్వాతంత్ర్యం అన్న కోరికలు వారిని ఇంకా కలవరపెట్టాయి. సైమన్ కమీషన్ బహిష్కరణ విజయమూ, అఖిల పక్ష సమావేశంవారి రాజ్యాంగ పథకమూ, వైస్రాయ్ ఇర్విన్‌ని కోపోద్రిక్తుణ్ణి చేశాయి. అటువంటి ఆవేశాలనూ, వాంఛలనూ అణగ ద్రొక్కి రూపుమాపడం తమ అందరి విధియని ఆయన తలచాడు.

ఆంగ్లో-ఇండియన్ పత్రికాధిపతులు ఉచితానుచితాలను మరచారు. భారత దేశాన్ని తుపాకి చేతబట్టి నడిపించవలసి ఉంటుందనీ, దానికి సంస్కరణలు ప్రసాదించడం కొన్నిసంవత్సరాలపాటు వాయిదా వేయవచ్చుననీ వారి పత్రికలు వ్రాశాయి. దీని కంతటికీ కారణం ఆ

పాతకాలపు స్వరాజ్య పార్టీవారు కాళ్ళ బేరానికి దిగి, స్వాతంత్ర్యాది వాంఛలను దిగమింగడమే. కలకత్తా కాంగ్రెస్‌లో మన ఆశయం స్వాతంత్ర్యమేనని నిరూపించడం జరిగిన మాట వాస్తవమే. ఒక ప్రక్క తీవ్ర నిరసనతో కూడిన బహిష్కరణ, ఇంకోపక్క ఏదో ఒకటి ఇప్పించండి బాబూ అంటూ కాళ్ళ బేరమూ, ఇవే ఆంగ్లో-ఇండియనులు బిర్రబిగిసి పోవడానికి కారణ భూతాలయ్యాయి.

## పా త పా టే

స్వరాజ్య పార్టీవారికి ఈ పద్ధతి నూతనం కాదు. వారి తత్వం మొదటినుంచీ ఒక్కలాగే ఉంది. 1917-18 మాటే యేమిటి, అంతకు ముందునుంచీకూడా వారి పద్ధతులు అల్లాగే ఉన్నాయి. మాంటెగ్, ఛెమ్స్‌ఫర్డ్ గారల పరిశోధనలు ఎల్లా నడిచాయి? డా॥ అనిబిసెంట్ మొదలైన నాయకులందరూ 1917కు పూర్వం ఏ దారి తొక్కారో ఆ బాటలోనే 1928-29లో కూడా మన స్వరాజ్యపార్టీ నాయకులు నడిచారు. ఆ 1917-18 సంవత్సరాలలోనూ, 1928-29లలోనూ జరుపబడిన అలజడులతో నాకు సంబంధం ఉన్నకారణంగా, ఆ రెండు సందర్భాలలో నడచిన చరిత్ర ఇక్కడ టూకీగా తెలియజేయడం నా కర్తవ్యంగా భావిస్తాను. 1917లో జరిగిన కలకత్తా కాంగ్రెస్ అధ్యక్షురాలిగా అనిబెసెంటమ్మ 1918లో భారత దేశానికి డొమినియన్ స్టేటస్ ఇవ్వక తప్పదనీ, అలా ఇవ్వబడిన అధినివేశ ప్రతిపత్తి పద్ధతులనూ, విధానాలనూ భారతదేశం బాగా ఆకళించుకున్న తరవాత, అనగా సుమారు ఐదు మొదలు పది సంవత్సరాల లోపల ఆ డొమినియన్‌ను స్టేటస్‌ను పూర్తిగా భారతదేశంలో అమలు పరచాలనీ ఆమె కోరారు.

## 1918 లో నడచిన చరిత్ర

అదే సంవత్సరంలో జరుపబడిన రెండవ కాంగ్రెస్‌లో, బ్రిటిష్ ప్రభుత్వంవారు భారతదేశానికి స్వయంపరిపాలనావకాశం తప్పక కలుగజేస్తామనీ, ఎప్పటినుంచి అలాంటి అవకాశాన్ని భారతదేశానికి ఇవ్వవచ్చునన్నది నిర్ధారణ చేస్తూ, రాజ్యతంత్ర పద్ధతిని, కట్టుబాట్లను

రూపొందిస్తూ త్వరలోనే ప్రకటన చేస్తామనీ చెప్పిన కారణంగా, వారికి కృతజ్ఞతలు తెలుపుడు చేయాలనీ, డొమినియన్ స్టేటస్ రూపొందించే లోపల, కాంగ్రెస్- లీగ్ పథకం భారతదేశానికి స్వయంపరిపాలన కలుగజేస్తామన్న ఈ శుభ సమయంలో వెంటనే అమలు పరచాలనీ కోరారు. ఇంతా జరిగాక, తీరా మాంటేగ్ వచ్చి స్వయంగా సంగతి సందర్భాలు విచారిస్తూన్న సమయంలో, డా॥ అనిబిసెంట్ దేశం కోరుతూన్న కోర్కెలను వివరిస్తూ, సర్ శంకరన్ నాయరు అభిప్రాయమే తన అభిప్రాయం అంది.

సర్ శంకరన్ నాయర్ కాలానుగుణంగా నడవగల మనిషి కాదన్న విషయం లోక విదితమే. ఆయన 1897 లో కాంగ్రెస్ అధ్యక్షుడు. ఆ తరవాత మైలాపూరు మిత్రులతో కలిపి ఉద్యోగాది హోదాల మీదికి దృష్టి మళ్ళించుకున్నాడు. అక్కడ ఆ మైలాపూరు యోధులు ఈయన్ని దిగద్రొక్కి పైకి వెళ్ళిపోయారు. 1907 లో ఆయన మదరాసు హైకోర్టులో ప్రభుత్వ న్యాయవాదిగానూ, పబ్లిక్ ప్రాసిక్యూటరుగానూ ఉండేవాడు. నాతోబాటు ఆయన లండన్ నగరంలోని గ్రేస్ ఇన్ (Gray's Inn) ద్వారా బారిష్టరు పరీక్షకు హాజరయ్యాడన్న సంగతి ఇదివరలోనే చెప్పి ఉన్నాను. ఆయన 1917-18 లో గాని జడ్జీ కాలేదు.

ఆయన స్వాభావికంగా మితవాది. 1918 లో కాంగ్రెసును బలపరచడానికి సర్ శంకరన్ నాయర్‌కి ఏమే కారణాలున్నాయో మనకు తెలియదుగాని, డా॥ అనిబిసెంట్ మాత్రం శంకరన్ నాయర్‌ని గురించి మాంటేగ్‌తో చెప్పడమూ, ఆ శంకరన్ నాయర్ అభిప్రాయమే తన అభిప్రాయమని సూచించడమూ మాత్రం క్షమార్హం కాదు.

ఆ ముక్కలలో కాంగ్రెస్ అధ్యక్షురాలిగా ఆమె తన వాంఛితార్థమూ, కాంగ్రెస్ తీర్మాన రూపకంగా కోరిన కోరికా, మాంటేగ్‌తో నొక్కి వక్కాణించి ఉండవలసింది. అంతేకాదు, కీ. శే. ఎస్. శ్రీనివాసయ్యంగారు మాంటేగ్‌తో చెప్పిన విషయాలూ మనం గ్రహించాలి.

ఆయన ధర్మమా అని, మాంటేగ్ తనతో శ్రీనివాసయ్యంగారు చెప్పిన విషయాలన్నీ తు. చ. తప్పకుండా, తన డైరీలో వ్రాసుకున్నాడు.

మాంటేగ్ కథనం ప్రకారం శ్రీనివాసయ్యంగారు భారత దేశంలో ఏ ఒక్కరూ కూడా కాంగ్రెస్- లీగ్ పథకం పట్ల సుముఖంగా లేరనీ, అందువల్ల ఆయన దానిని మన్నించవలసిన అవసరం ఉండదనీ, ఆశాజనకంగా ఏదో అనుగ్రహిస్తాం అని అంటే, చిత్తం అలాగే తమ దయ అని ప్రజలంటారనీ నమ్మబలికినట్లు తెలియ వస్తోంది. అప్పట్లో శ్రీనివాసయ్యంగారు చెన్నరాష్ట్రానికి అడ్వకేట్ జనరల్.

ఇటువంటి పరిస్థితులలో, కాంగ్రెసు 'డిమాండ్'ను కాదని, ఏదో ద్వంద్వప్రభుత్వ పద్ధతిని ఆ మాంటేగ్- ఛెమ్స్‌ఫర్డ్‌గారలు దేనినో ఇస్తామని ఊరుకున్నారు. మాంటేగ్ రాకముందు, ఆయన చాలా సరళ హృదయంతోనూ, సదభిప్రాయంతోనూ వస్తున్నాడనే అందరూ భావించారు. ఆయన వచ్చినప్పుడు దేశీయులు గట్టిగా తమ అభిప్రాయాన్ని నొక్కి వక్కాణించ గలిగిఉంటే 'ప్రొవిన్షియల్ ఆటోనమీ' లాంటి దేదయినా భారతీయుల కివ్వడానికి ఆయన ఆయత్త పడేవాడు.

డా॥ అనిబిసెంట్ 1917 కు పూర్వం భారతదేశానికి ఎంతో సేవ చేసి, భారతదేశానికి 'హోం రూల్' ఇవ్వాలి, ఇచ్చి తీరాలి అని స్వాతంత్ర్య సమరం సందర్భంగా జెయిలుకు కూడా వెళ్ళిన ఇల్లాలు. పైగా మాంటేగ్ వచ్చేముందు, కాంగ్రెస్ అధ్యక్షురాలిగా, భారతదేశానికి స్వపరిపాలనావకాశం కలుగజేసితీరాలని గట్టిగా చెప్పింది. కొద్ది నెలలలో ఆమె తత్వం పిరాయింపవడమేగాక, తన అభిప్రాయమూ, సర్ శంకరన్ నాయర్ అభిప్రాయమూ ఒకటేనని చెప్పడాన్ని, అనుకోకుండా, పప్పులో కాలేసింది.

శ్రీనివాసయ్యంగారు అడ్వకేట్ జనరల్‌గా ప్రజాహృదయాన్ని గుర్తెరిగినవాడే. తనకు తానే మాంటేగ్‌ను కలిసి మాటాడగోరి, తన

వ్యక్తిగతమైన అభిప్రాయంతో ఆయన్ని ముంచెత్తకుండా ఉండి ఉండవలసింది. ప్రజాభిప్రాయానికి భిన్నంగా, ఆయన సొంత డబ్బా వాయించి, దేశానికి తీరని అన్యాయం చేశాడు. శ్రీనివాసయ్యంగారు తనకు తానుగానే వచ్చి కలుసుకున్నాడనీ, తనముందు సాక్ష్యం ఇవ్వ డానికని ఆయన్ని ఎవ్వరూ ఆహ్వానించలేదనీ మాంటేగ్ తన డైరీలో వ్రాసుకున్నాడు. ఆయనకి తనకి అప్పట్లో రాజకీయాలతో సంబంధం లేకపోయినా, అడ్వకేట్ జనరల్‌గా మాటాడిన కారణాన్ని మాంటేగ్ ఆయన అభిప్రాయం మీద విలువ ఉంచవలసి వచ్చింది.

అప్పటికి పండిత మోతీలాల్ నెహ్రూకీ రాజకీయాలతో సంబంధం లేదు. అయినా ఆయన, తన స్వంత అభిప్రాయంగా, మాంటేగ్‌తో ఇప్పటినుంచి ఇరవై యేళ్ళ లోపుగా భారతదేశానికి బాధ్యతాయుత ప్రభుత్వం (Responsible Government) ఇస్తే జనం సంతోషిస్తారని చెప్పాడు. ఇలాంటి సాక్ష్యాలు ఆధారంగానే, మాంటేగ్ 'రౌండ్ టేబిల్' పత్రికాధిపతి లయొనెల్ కర్టిస్ (Lionel Curtis) సలహా ప్రకారం, ద్వంద్వ ప్రభుత్వ సూచనలు చేసి ఊరకున్నాడు.

కొంతమంది నాయకులే గనుక ద్రోహంచేసి ఉండకపోతే, వెంటనే 'ప్రావిన్షియల్ ఆటోనమీ' (Provincial autonomy) స్థాపన అయిఉండేది. దానిని అనుభవిస్తూ, పూర్తి బాధ్యతలకోసం ఆందోళన చేస్తూ ఉండిఉంటే, అటువంటి పూరాపూచీగల ప్రభుత్వాన్ని కూడా ఇప్పటికి ఏ పది సంవత్సరాలలోపుగానో, సాధించి ఉండేవారం. భారతదేశ చరిత్ర వేరు విధంగా రచియింపబడి ఉండేది.

ఈ పట్టున ఆ 1918-19 నాటి స్థితికీ, సైమన్ కమీషన్ బాయ్ కాట్‌నాటి స్థితికీ (1928-29) విలియా వేయడం న్యాయం.

## 1928 లో జరిగిన కథ

మదరాసులో 1927 లో జరిగిన కాంగ్రెస్‌లో పండిత జవహర్ లాల్ నెహ్రూచే ప్రతిపాదించబడిన 'స్వాతంత్ర్య' తీర్మానం ఆమో

డించబడింది. మహాత్మా గాంధీగారికిగాని, మోతీలాల్ నెహ్రూగారికిగాని ఈ తీర్మానం పట్ల ఎలాంటి అభిలాషా లేదు. 1885 నాటి ప్రథమ కాంగ్రెస్ లగాయితు బెంగాల్, కాంగ్రెసుపట్ల ఆదరాభిమానాలతోనే ఉంటూ వచ్చింది. కాని దర్మిలా తిరుగుబాటుదారీ విధానాలకు ఆలవాలం అయింది. చాలాకాలం ఆ తిరుగుబాటుదారీ విధానం బెంగాల్‌లో నాటుకుపోయింది. బెంగాల్ యువకులు ఎందరో అహింసా పద్ధతిని దేశాన్ని సేవించగోరి ఎన్నో సాహసకార్యాలుచేసి మృతజీవులయ్యారు. గాంధీగారి అహింసాత్మక విధానం క్రమేపీ బెంగాల్ యువకుల మనో తత్వాలమీద పనిచేసి, 1923 నాటికి వారిని శాంతపరచి, మితవాదు లనుగా తయారుచేసింది. అటువంటి పరిస్థితులలో, 1928 లో కాంగ్రెస్ తిరిగీ కలకత్తాకు ఆహ్వానించబడింది. నాటి కాంగ్రెస్‌కు అధ్యక్షునిగా ఎవరిని నిర్ణయించాలి అన్న ఆలోచనలో బెంగాల్ వారిదృష్టి మోతీలాల్ నెహ్రూ మీద పడింది. నిజానికి ఆయనే తన కుమారునిచే ప్రతిపా దించబడిన స్వాతంత్ర్య తీర్మానాన్ని తిరగతోడగలడని వారు భావిం చారు. ఈ కథ అంతా లోగడ మనవిచేసే ఉన్నాను.

1918 లో డా॥ అనిబిసెంట్‌లా, కలకత్తాలో పండిత మోతీ లాల్ నెహ్రూ తన అధ్యక్ష ఉపన్యాసంలోనే స్వాతంత్ర్య తీర్మానాన్ని వెను కకు నెట్టి అఖిల పక్ష సమావేశం అంగీకరించిన పథకాన్ని ముందుకు పెట్టి, కాంగ్రెస్ దానినే ఆమోదించవలసిందని సూచించాడు. కాంగ్రెసు ఆశయం మాత్రం పూర్తి స్వాతంత్ర్యమే అంటూ కూడా, బ్రిటిష్ వారు, ఈ దేశ పరిస్థితులను బాగా గమనించి, ఏమిచ్చినా సంతోషమే అన్నాడు.

గాంధీగారు చూపించిన మార్గాన్ని అనుసరించి సైమన్ కమిషన్ బహిష్కరణ విషయంలో అంతటి మహోన్నత శిఖరాన్ని అధిష్ఠించిన కాంగ్రెసువారే, ఆంగ్లేయుల వద్దనుంచి తమ వాంఛితార్థమైన స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను పిండాలని తలుస్తూనే, దేశం తరపున, దేశీయుల తరపున స్వాతంత్ర్యమే తమ ఆదర్శం అని చెపుతూనే, ఏక్ దమ్ దిగజారిపోయి, సైమన్ కమిషన్ వారినుంచి, అధమం పరిపూర్ణమైన

'ప్రావిన్షియల్ ఆటోనమీ' సూచనకై నా నోచుకోని పరిస్థితికి పడిపోయిన ఉదంతమూ, అందుకు కారణాలూ ఎన్నిసార్లు చెప్పినా, నాకు చెప్పా లనిపిస్తుంది. ఈ విషయం గుర్తుకొచ్చినప్పుడల్లా నాకు బాధ వచ్చి, "ఆంగ్లేయులు శక్తిహీనులయిన శత్రువులను చూసి జాలిపొందరు. కాదా అంటే నెత్తికెక్కుతారు" అన్నది మళ్ళీ మళ్ళీ మనవి చెయ్యకుండా ఉండలేను. వారు మనలను అధఃపాతాళానికి అణగద్రొక్కాలనే ఉద్దేశంతోనే, కత్తి చేతబట్టి సంపాదించిన రాజ్యాన్ని కత్తి చేతబట్టే పరిపాలిస్తాం అని అన్నారనీ, వారు అలాఅనగలగడానికి కారణం మన నాయకులూ, వారి చేతలూ, వ్రాతలూ, పలుకులూ కల్పించిన మన దుస్థితే ననీ మళ్ళీ ఒకసారి మనవి చేసి, నా మనఃక్లేశాన్ని మరి కాస్త తగ్గించుకో డానికి ప్రయత్నిస్తాను. కాగా, దున్నపోతునీ దూడనీ ఒకే కాడికి కట్టిన విధంగా, మన దేశంలో ఉన్న రాజుల ప్రసక్తికీ, రాష్ట్రాలలో ఉన్న ప్రభుత్వ విధానాలకీ కూడా పనిలో పనిగా ముడిపెట్టగలిగిందా కమిషన్. దీని కంతటికీ కారణం మన పిరికితనమేనని తిరిగి వక్కాణించి నా ఆవేదన తీర్చుకోనివ్వండి.

ఆ యువక ద్వయం - సుభాష్‌బాబూ, జవహర్‌లాలూ, ఇటు వంటి పతనం ఏదో రాబోతోందని గ్రహించే, కలకత్తా కాంగ్రెస్‌లో విషయ నిర్ధారణ సభ వారు అంగీకరించిన ప్రతిపాదనకు బహిరంగ సమావేశంలో అడ్డు తగిలి, తమ సవరణ ప్రతిపాదించారు. అనుకున్న దానిని కాదంటున్నారని గాంధీగారు అడ్డు తగలడం చేతనే, ఆ సవరణ వీగిపోయింది. ఈ సందర్భంలో కూడా భారతీయ నాయకులు తమ బలహీనతనే తిరిగి ప్రదర్శించుకున్నారు. దేశశ్రేయాన్ని విస్మరించారు. మోతీలాల్ నిరంకుశులలో నిరంకుశుడు. ఆయనకు తిరిగీ మహాత్ముని అండ దొరకగానే, శాంతంగా మంచి చెడ్డలు విచారించడం న్యాయ మేమో నన్న దృష్టే సన్నగిల్లింది. ఆ అత్యవసర పరిస్థితులలో ఆయన ధీశక్తిని ఉత్తేజపరచి, ఆ రాజీ ప్రతిపాదనలకు వ్యతిరిక్తత ఆయనలో **కలిగించలేకపోయాము.**

1918-19 సంవత్సరాలలో అనిబెసెంటమ్మ పరిస్థితీ అల్లాగే

ఉండేది. మేము ఆమెతో కలిసి ఆ 'హోంరూలు' సంరంభంలో పని చేసిన సందర్భాన్ని పురస్కరించుకుని, ఉపన్యాసాల ద్వారానూ, వార్తా పత్రికల ద్వారానూ ఎంతగా ప్రయత్నించి తంటాలుపడ్డా, ఆమెను మాంఛేగ్ ముందర దిగజారిపోతూన్న పరిస్థితినుంచి ఆనాడు తప్పించ లేకపోయాం. ఆమె మొదటిసారిగా మాంఛేగ్‌ను దర్శించినప్పుడు, ఆయన నిశ్చల, నిర్మల, శాంతియుత వాతావరణంలో తన విచారణ జరపగల అవకాశం కలుగజేయమని కోరిన కోర్కెను మన్నించిన కారణంగానే, ఆమె అంత హఠాత్తుగా దిగజారిపోయిందని మాలో కొందరికి అనుమానం కలిగింది.

## సప్రూ-జయకర్ రాయబారాలు

1930 నాటి రాజీ ప్రయత్నాలు మహాత్మాగాంధీతో సహా అన్ని వర్గాల కాంగ్రెసు నాయకులూ జెయిళ్లలో ఉన్న సమయంలో ఆరంభించబడ్డాయి. ఆ ఉద్యమ సమయంలో చాలాకాలం మోతీలాల్ నెహ్రూ గారు బయటే ఉన్నారు. ఆ నాడు ఆ రాజీప్రతిపాదనలు సర్ తేజ్ బహదూర్ సప్రూ, జయకర్‌గార్ల నాయకత్వాన నడిచాయి. ఆనాటి ఉద్యమం మాంచి రసకందాయ పట్టుగానే నడిచింది. బ్రిటీష్ రాజకీయ వేత్తలూ, ప్రభుత్వం వారూ కూడా ఆ పరిస్థితిని ఎదుర్కోవడం అంత సులభం కాదని మెల్లి మెల్లిగా గ్రహిస్తున్నారు.

ఆంగ్ల రాజకీయవేత్తలు సందర్భానుసారంగా మార్గాన్వేషణ చేసి జాగ్రత్తపడగల నేర్పరులు. వారు భారత నాయకుల మనోభావాలు గత 20 సంవత్సరాలుగా పూర్తిగా శోధించి గ్రహించి ఉన్నారు. ఈ సారి భారతీయుల దృష్టి ప్రక్కత్రోవల పట్టించాలనే కోరికతో, రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్సు అనే నూతన పంథాను చేబట్టారు.

మొదటి రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్సు 1930 నవంబరులో జరుగ వలసి ఉంది. ఆ కాన్ఫరెన్సు జరిగేలోపల సప్రూ-జయకర్ గార్లు ఎల్లాగయినా గాంధీగారినీ, నెహ్రూ ద్వయాన్నీ ప్రభుత్వం వారి అనుమతితో కలుసుకుని సంప్రతించాలని ప్రయత్నించారు. కాన్ఫరెన్సుకి

ముందుగా మన నాయకులు ప్రభుత్వంవారితో సంప్రతించడానికి వీలుగా వారిని ముమ్మందుగా విడుదల చేయమని కోరడానికి బదులుగా, మాకు వారిని కలవడానికి అవకాశం ఇవ్వండి అని సప్రూ-జయకర్లు అడగడం ఒక అసాధారణ విధానం.

పైగా, ఈ మధ్యవర్తిత్వం వహించిన పెద్దలకు కాంగ్రెసన్నా, కాంగ్రెసు వారి విధానాలన్నా మొదటినుంచీ వ్యతిరేక భావమే. కాగా, వారు బహిరంగంగా ఈ శాసన ధిక్కారాన్ని ఈసడించిన పెద్ద మనుషులు. అటువంటి పరిస్థితులలో ఈ పెద్దలు కాంగ్రెసు వారికీ, ప్రభుత్వం వారికీ మధ్య సంప్రతింపులు సాగిస్తాం అంటే, వారియందు విశ్వాసం ఉంచడం ఎల్లా సాధ్యం అవుతుంది? వారు కాంగ్రెసువారి మనోభావాలను గ్రహించి, ఆ నాయకులను విడుదల చెయ్యకుండా, సంప్రతింపులు జరపడం న్యాయం కాదుగనుక, వారిని ముందుగా విడుదల చెయ్యవలసిందని ప్రభుత్వానికి సలహా ఇచ్చి ఉండవలసింది. అదే న్యాయమయిన పద్ధతి గదా! లేదా, వారు ప్రభుత్వంవారి మనోభావాలను గ్రహించి, వారు ఇవ్వదలచిన దేమిటో తెలుసుకుని, ఆ వివరాలు కాంగ్రెసు వారికి తెలియజేసి ఉండవలసినది. ఈ రెండు పద్ధతులలో యేదీ వారు అనుసరించలేదు.

వారు ముమ్మందుగా పండిత మోతీలాల్ నెహ్రూగారితో సంప్రతించి, వారి మనోభావాలను గ్రహించి, వాటిని పిడికిల్లో ఇముడ్చుకున్నారు. ఎప్పుడూ ఏదో ఒకరకంగా రాజీపడితేనే మంచిదని వాంఛించే ఆ మోతీలాల్‌గారు, అడిగినదే తడవుగా తమ మనోభావాలన్నీ వారితో విప్పి చెప్పేశారు. అల్లా చెప్పేముందర, ఆయన మంచి చెడ్డలు యోచించలేదు. ఆయనకు తాను పలుకుతూన్న పలుకులు కాంగ్రెసుకూ, తనకూ కూడా చిక్కులు కలుగజేస్తాయేమోనన్న ఆలోచన లేకుండా పోయింది. మోతీలాల్‌గారిని 1930 జూన్ వరకూ అరెస్టు చేయలేదు.

లండన్‌లో ప్రచురించబడే డెయిలీ హెరాల్డ్ స్లోకోంబ్ సూచనలు విలేఖరులలో స్లోకోంబ్ (Slocombe) ఒక ప్రముఖ విలేఖరి. ఆయన ఆంగ్లేయుడు. ఆయన తన పత్రికలో 1930 నవంబరులో కలువ

న్నున్న రౌండ్ టేబిల్ సమావేశంలో కాంగ్రెసువారు కలిసివస్తే మంచిది అంటూ కాంగ్రెసు వారికి కొన్ని సూచనలు ఇచ్చాడు. మోతీలాల్ నెహ్రూగారి అభిప్రాయాలు స్లోకోంబ్‌కి అందచేస్తూ, సప్రూ-జయకర్లు మధ్యవర్తిత్వం వహించడానికి పూనుకున్నారు. స్లోకోంబ్ యందు కలిగిన విశ్వాసం వల్లనో, లేక స్లోకోంబ్ ఆంగ్లేయుడయిన కారణంగా-తమ వాంఛలను సరిగా నివేదించగలడనో, మోతీలాల్‌గారు తాను తన దేశానికి బ్రిటిష్ వారి వద్దనుంచి వాంఛించే దేమిటో ఆ విలేఖరి కెరుక పరచాడు.

"కాంగ్రెసువారు రౌండుటేబిల్ కాన్ఫరెన్స్‌లో పాల్గొనడానికి ముందు, భారతదేశానికి డొమినియన్ స్టేటస్ ఇవ్వడం ఖాయమని ఆంగ్లేయులు రహస్యంగా వాగ్దానం యివ్వాలి. ఈ వాగ్దానానికీ, రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌వారి సలహాలకీ, పార్లమెంట్‌వారు చేయదలచుకున్న దానికీ లంకె ఉండరాదు. కాంగ్రెసు వారికి బ్రిటీష్‌వారూ, వైస్రాయి గారూ రహస్యంగా ఇచ్చిన ఈ వాగ్దానం, కాన్ఫరెన్స్‌వారూ పార్లమెంట్ వారూ ఏవయినా ప్రత్యామ్నాయ సూచనలు చేస్తే, వారు చేసిన ఆ చిట్ట చివరి సూచనలకు లోబడే తాము ఇచ్చిన వాగ్దానాన్ని చెల్లించుకోవచ్చు" నని మోతీలాల్‌గారు స్లోకోంబ్‌కి తెలియజేశారు. మోతీలాల్‌గారి సూచనలను గాంధీగారి ఎదుటా, ఇంకా కొందరి నాయకుల ఎదుటా ఉంచడానికి సప్రూ-జయకరుగారలు వైస్రాయ్‌గారి అనుమతి కోరారు. భారత ప్రభుత్వంవారు ఆనందంగా అనుమతిని ప్రసాదించారు. యెరవాడ జెయిలులో ఉన్న గాంధీగారిని చూడడానికి సప్రూ-జయకర్ గారలు వెళ్ళారు.

## గాంధీగారి ప్రతిపాదనలు

ఎట్టి పరిస్థితిలోనయినా, ఏ విషయం మీదనయినా, ఇంకొకరి ప్రోత్సాహం, ప్రోద్బలం లేనంతవరకూ గాంధీగారికి ఎప్పుడూ నిశ్చిత అభిప్రాయా లుంటాయి. పూర్తిగా బాధ్యతాయుత ప్రభుత్వం భారత దేశానికి ఇస్తామని బ్రిటిష్ గవర్నమెంట్‌వారి తరఫున భారతప్రభుత్వం వారు హామీ ఇవ్వాలనీ, ఈ హామీని రౌండు టేబిల్ కాన్ఫరెన్స్‌వా రంగీ

కరించి తీరాలనీ, రక్షణల విషయంలో తీసుకోతగ్గ మార్గాలను వారే నిర్ణయించవచ్చుననీ గాంధీగారు సూచించారు. సరిఅయిన రాజ్యాంగ విధానం రూపొందించి తీరాలనీ చెప్పారు. కాగా, ఈ మధ్య కాలంలో కల్లు దుకాణాల దగ్గర, విదేశీ బట్టల దుకాణాల దగ్గరా పికెటింగ్ కొనసాగించే హక్కు కాంగ్రెసువారికి ఉండా లన్నారు.

ఇద్దరు మధ్యవర్తులు గాంధీగారి సూచనలనుకూడా గ్రహించినవారై, నాయకుల అభిప్రాయాలనూ పరిశీలన చేయవలసి ఉంటుందంటూ, వాటిని వైస్రాయ్‌గారి ముందు ఉంచారు. ప్రభుత్వంవారి మనస్సులో ఏముందో ముందుగా గ్రహించకుండానే రాయబారాలకి ఆ ఇరువురూ పూనుకోవడం శుద్ధ తప్పు. అంతేకాదు- మోతీలాల్ నెహ్రూగారిని అరెస్టు చేసేముందు, ఆయన స్లోకోంబ్‌కు తెలియజేసిన అభిప్రాయాలను నిర్బంధంలో ఉన్న గాంధీగారి అభిప్రాయాలతో గుదిగుచ్చడం ఇంకొక తప్పు.

ముమ్ముందుగా అప్పటి కప్పుడు భారతదేశానికి పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని ఇస్తామని వాగ్దత్తం చేసితీరాలని గాంధీజీ తన అభిప్రాయాన్ని స్పష్టంగానూ, స్ఫుటంగానూ చేప్పేశాడు. పైగా ఆ వాగ్దత్తం రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌వారి ఎదుట బహిరంగ పరచాలనీ, అధమం పార్లమెంటు వారి ఎదుటనయినా దాని ప్రసక్తి ఎత్తాలనీ ఆయన సూచించాడు. వారు చేసే ప్రత్యామ్నాయ సూచనలకు అది కొంత వరకూ అనుగుణంగా ఉండవచ్చునని అన్నా డాయన.

## వైస్రాయ్ వెనకడుగు

కాని పూర్తి బాధ్యతాయుత ప్రభుత్వాన్ని భారతదేశానికి ఇవ్వడానికి ఒప్పుకున్నా డనుకున్న ఆ వైస్రాయ్‌గారు, అప్పుడే తన పుట్టె మునిగినటు అడుగులు వెనక్కి వెయ్యడం ఆరంభించాడు. అల్లా వెనకడుగు వేస్తూనే నాయకులను సందర్శించడానికి సప్రూ- జయకర్లగారికి అనుమతి ప్రసాదించాడు. వైస్రాయ్ వెనకడుగు వేయడానికి కారణం మోతీలాల్ నెహ్రూగారు, ఆయన అరెస్టుకు పూర్వం, స్లోకోంబ్‌ను

నమ్మి తన హృదయంలో ఉన్న ఏ భావాలనయితే ఆయన ఎదుట పెట్టాడో, అవన్నీ అప్పుడే స్లోకోంబ్ వైస్రాయ్‌గారికి అందజేయడమే.

ఎప్పుడయితే మోతీలాల్ నెహ్రూ సంపూర్ణ బాధ్యతాయుత ప్రభుత్వం ఇచ్చే విషయమై రహస్యపుటొప్పందానికి దిగజారిపోయాడో, పైగా రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌వారి ప్రత్యామ్నాయ సూచనలకు ఆ ఒప్పందం లోబడవచ్చునని అంగీకరించాడో, ఆ తక్షణం వైస్రాయ్ గారు తాను ఏ విధమయిన రహస్యపు టొప్పందాలకూ అంగీకరించ కూడదనే నిశ్చయానికి వచ్చేశాడు.

న్యాయంగా, స్లోకోంబ్ ద్వారా నెహ్రూగారి సూచనలను గ్రహించిన తక్షణం, సప్రూ - జయకర్ గార్లకు గాంధీగారిని కలుసు కోవడానికి అనుమతి నిరాకరించి ఉండవలసింది. దానికి బదులుగా, దెబ్బతో బాధపడేవాడి నెత్తిన మొట్టికాయ కూడా మొట్టినట్లుగా, తాను కాంగ్రెసువారి కోరిక ప్రకారం, ఏవో కొన్ని సంస్కరణలను మాత్రమే సూచించగలననీ, వాటిని పట్టుకునే ప్రజలు వారి వ్యవహారాలను వారు చక్కదిద్దుకోవాలని చెప్పేశాడు. మధ్యవర్తులుగా వ్యవహరిస్తామని బయల్దేరిన పెద్దలు తప్పటడుగు వేస్తే ఇంతకంటె అధికంగా ఏం జరుగుతుంది?

## జెయిలునుంచి గాంధీగారి స్టేట్‌మెంటు

గాంధీగారు, తాను ఖైదీగా ఉంటూ తన తరఫునా, దేశం తర ఫునా ఏ విధమయిన సూచనలనూ చెయ్యజాలనని అనడం న్యాయం గానూ, ధర్మంగానూ ఉంది. ఈ రూలు ఎల్లప్పుడూ, అందరికీ, అన్ని దేశాలవారికీ వర్తిస్తుంది. అంత తీవ్రంగా జవాబు ఇస్తూ గాంధీగారు, మళ్ళీ ఇవి నా స్వంత అభిప్రాయాలంటూ కొన్ని సూచనలు చెయ్య కుండా ఉండి ఉంటే బాగుండేది. స్వంత అభిప్రాయాలంటూ గాంధి గారు కొన్ని సూచనలు చేసిన కారణంగానే, నెహ్రూద్వయం వారితో ఏకీభవించ జాలమని అనడంలో దోషం ఏమీ లేదు.

ఎంతో ఘనంగా అహింసాత్మకంగా పోరాటాన్ని సాగించిన అనంతరం, ఒక దేశ స్వాతంత్ర్య విషయమైన ప్రస్తావనలో, తమ

తమ స్వంత అభిప్రాయాలను బహిరంగ పరచడం ఎప్పుడూ న్యాయం కాదు. దేశం తరపున తాము తమ నిశ్చితాభిప్రాయాలు తెలియ చెయ్యవలసి ఉన్నందున తమకు మున్ముందుగా స్వాతంత్ర్యం లభింప జేయవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉన్నదన్న విషయం మన నాయకులు స్పష్టంచేసి ఉండవలసింది.

కాని అచార విరుద్ధంగా, 1930 ఆగస్టు 15వ తేదీని మహాత్మా గాంధీ జెయిలునుంచే ఒక స్టేట్‌మెంట్ చేశారు. తానున్నూ, తన మిత్రులున్నూ, సప్రూ- జయకర్లు నడపిన రాజీ ప్రయత్నాలకు కృతజ్ఞులమనీ, ప్రభుత్వంవారు శాంతి నెలకొల్పే సదుద్దేశంతో కాంగ్రె వారితో సంప్రతించ తలచి ఉంటే, జెయిళ్ళలో ఉన్న అ నాయకులతో నిరాక్షేపణీయంగా సంప్రతింపులు జరపవచ్చుననీ ఆ స్టేట్‌మెంట్‌లో ఉంది. రాజీ ప్రతిపాదనల విషయంలో వైస్రాయ్‌గారి అనుమతికూడా ఉండి ఉంటే, గాంధీగారు అటువంటి స్టేట్‌మెంట్ ఇవ్వవలసిన అవసరం ఉండేదికాదు.

## రాయబారాల వైఫల్యం

మధ్యవర్తులు రెండు నెలలపాటు పడిన తంటాలుకు ప్రతిఫలంగా జెయిళ్ళలో ఉన్న నాయకుల వద్దనుంచి ఇటువంటి స్టేట్‌మెంట్ తీసుకు రాగలగడం వారి ప్రతిభే యేమో! గాంధీగా రిచ్చిన ఈ స్టేట్‌మెంట్‌తో వైస్రాయ్‌గారి బుర్ర తిరిగిపోయిందనీ, తాను ఏవిధమయిన రాజీ ప్రతిపాదనలూ చెయ్యకుండా నిమ్మకు నీరెత్తినట్లు చల్లగా ఊరుకుంటానేమో అనుకునే గాంధీగారు ఈ స్టేట్‌మెంట్ ఇచ్చి ఉంటాడని వైస్రాయ్ తలచి ఉండాలనీ, ఈ పరిస్థితికి గాంధీగారి స్టేట్‌మెంట్ కారణ భూతమయిందనీ, నైనిటాల్ జెయిలునుంచి అ నెహ్రూగారు ఎరవాడ జెయిల్లో ఉన్న గాంధీగారికి తెలియజేశారు.

ఆగస్టు 31వ తేదీని మధ్యవర్తిత్వ ప్రయత్నమనే ఆ తతంగమంతా నిష్ఫలం అయినట్లు తేలిపోయింది. స్వరాజ్య సాధనకై చరిత్రాత్మకంగా సాగించిన బ్రహ్మాండమయిన అహింసాత్మక సమరంతో ప్రపంచ దృష్టినే ఆకట్టుకోగలిగిన కాంగ్రెసువారు, అనుకోని విధంగా

మళ్ళీ దిగజారిపోయారు. ఎన్ని వేలమంది జెయిళ్ళకు వెడితేనేం, పోరాటం ఎంత ముమ్మరంగా సాగిపోతేనేం - తుదకు మిగిలినదంతా దిగజారుడే. ఈ పరిస్థితికి కారణం ఆ 1917-18 నాటి అనిబిసెంటమ్మ విధానమే తిరిగీ ఈ 1930లో కూడా, బ్రహ్మాండమయిన యుద్ధం మధ్య ఉండీకూడా, అవలంబించడమే.

## అగ్రనాయకులు విడుదల, ఇర్విన్‌తో ఒడంబడిక

ఎంతగా తమ్ముతాము బయటపెట్టుకున్నా తమ్ముతాము సంబాళించుకోగల నేర్పరితనం కాంగ్రెసువారిలో ఉండబట్టే, ఆ 1930 ఆఖరు నాటికి తిరిగీ ఈ కయ్యం ముమ్మరం అవడమూ, దాన్తో 1931 మొదటి రోజులలోనే బ్రిటిష్‌వారు కాంగ్రెసు కార్యనిర్వాహక సభ్యులుగా పని చేసిన ఆ పాతవారినీ, కొత్త వారినీకూడా వదలిపెట్టడానికి నిశ్చయించుకోవడమూ, అప్పుడే వారికి వైస్రాయ్ గారితో నిర్మల వాతావరణంలో తర్జన భర్జనలు చేయడానికి సదవకాశం ఉంటుందని గ్రహించగలగడమూ జరిగింది.

అసలు న్యాయానికి ఇదే సవ్యమయిన మార్గ మవడాన్ని 1930 జూలై-ఆగస్టులలోనే ఇలాంటి విడుదల ప్రయత్నాలు జరిగి ఉండవలసినది. ఈ ప్రకారం నాయకులు విడుదల అయిన వెంటనే, గాంధీగారూ ఇర్విన్ కలిసి సక్రమంగా సంప్రతించడానికి సావకాశం కలగడమూ, సంప్రతింపులు సఫలమై, సంతకాల దాకా రావడమూ, దానిని గాంధీ-ఇర్విన్ ఒడంబడికగా రూపొందించగలగడమూ జరిగింది. ద్వంద్వ నాయకత్వమూ, వారిలో వారికి కలిగిన అభిప్రాయ భేదాలూ, కాంగ్రెసు వారి కోరికలు 1917-18, 1928-29, 1930 లలో విఫలం అవడానికి కారణా లయ్యాయి.

ఈ గాంధీ ఇర్విన్ సంప్రతింపులు సఫలం అవడానికి కూడా కారణాలు గాంధీగారు వెనుకటి అపజయ కారణాలను గ్రహించ గలగడం, తానే యావత్తు భారత దేశానికీ కాంగ్రెసు తరపున ఏకైక నాయకునిగా నిలిచి, సంప్రతింపుల విషయంలోనూ, సవరణలూ, దిద్దు

బాట్ల విషయంలోనూ పైవారి ప్రమేయం లవలేశమూ లేకుండా చూసు కుని, మాంచి రసకందాయ పట్టుతో నిగ్రహించుకు రాగలగడం. ఈ కారణాలవల్ల అపజయం అన్నది దరికి రాకుండా పోయింది.

# 12

# 1932 లో నా అరెస్టు

**1932** లో నన్నూ, నాతోడి వర్కర్లనూ నిర్బధించడానికి కారణంగా, మేము పన్నుల నిరాకరణ ఉద్యమం సాగింపబోతున్నామని చెప్పబడింది. నిజానికి అలాంటి ప్రయత్నం ఏదీ మేము చేయదలచి ఉండలేదు. అయినా రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ నుంచి తిరిగి వచ్చి గాంధీగారు భారతదేశంలో అడుగు పెట్టేనాటికి అన్ని రాష్ట్రాల లోని అగ్రనాయకులనూ నిర్బంధించి తీరాలనే ప్రభుత్వపు పెత్తే రకరకాల కారణాలను సృష్టించి, దేశవ్యాప్తంగా అగ్రనాయకు లన్నవారి కందరినీ అరెస్టుచేసి, కటకటాలు వెనక్కి పంపించింది

అప్పట్లో లండన్‌లోని పత్రికలలోనూ, భారత దేశమందలి ముఖ్య పత్రికలలోనూ కొన్ని వార్తలు పడ్డాయి. రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌లో సర్ శామ్యూల్ హోర్ (Sir Samuel Hoare) ప్రతి పాదనలను గాంధీగారు అంగీకరించని కారణంగా, ఆయన్ని అవమాన పరచడమూ, చిన్నబుచ్చడమూ సాగించిన పెద్దలు "వెళ్ళవయ్యా వెళ్ళు. ఎల్లా వచ్చావో అల్లాగే వెళ్ళు. ఆ వెళ్ళడం వెళ్ళడం తిన్నగా జెయిలు కేలే" అని భయపెట్టినట్లు తెలియవచ్చింది.

దర్మిలా, ఆయనతోపాటే అన్ని రాష్ట్రాలలోని ముఖ్య నాయకులనూ కూడా అరెస్టు చెయ్యమని వచ్చిన హుకుంతోనే పై విధంగా సృష్టించబడిన రకరకాల కారణాలతో, వారిని నిర్బంధించి జెయిళ్ళలో పెట్టారు. బ్రిటీష్ తీరాన్ని వదిలేముందు గాంధీగారిని హెచ్చరించీ, చిన్నబుచ్చీ, అవమానపరచీ పలికిన పలుకుల ఫలితంగానే గాంధీగారు

ఓడ దిగకుండానే అరెస్టు కావడం జరిగింది. అన్ని ప్రాంతాల నాయకులూ నిర్బంధించబడడం జరిగింది.

ఆ పరిస్థితులలో 1932 లో నేనూ తిరిగి అరెస్టు అయ్యాను. సర్ శామ్యూల్ హోర్ భారత దేశంలో మళ్ళీ ఏ విధమయిన ఆరాటాలూ, కలతలూ రేగకుండా తగు చర్య తీసుకోవలసిందని ఇచ్చిన సలహా ప్రకారమే ఈ అరెస్టులన్నీ సాగిస్తున్నామని ప్రభుత్వం వారు బాహాటంగా ఒప్పుకోలేకపోయారు. అలాంటి సూచనలూ, సలహాలూ అందిన కారణంగానే నిజానిజాలతో నిమిత్తంలేకుండా, ఒక్కొక్కరి అరెస్టుకూ కారణం చూపాలి గనుక, ఏదో ఒకటి చూపించారు. నా అరెస్టుకు కూడా అటువంటి విపరీత కారణమే చూపబడింది.

## అరెస్టుకు కారణాలు

నేను అప్పుడు రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షునిగానే ఉంటూ ఉండేవాడిని. ఏలూరులో మేము రాష్ట్ర కాంగ్రెసు కమిటీ మీటింగు పెట్టుకున్నాము. ఆ మీటింగు కొన్నాళ్ళపాటు నడిచింది. పెంచబడిన రీసెటిల్మెంట్ రేట్ల విషయంలో కొన్ని ముఖ్య విషయాలు తర్జన భర్జన చేస్తున్నాము. 1930 లో మేము నడపిన శాసన ధిక్కారాన్నీ, నన్నూ నాతోటి వర్కర్లని ఆ సంవత్సరం ఉప్పు సత్యాగ్రహ సంబంధంగా అరెస్టుచేసిన సందర్భాన్ని పురస్కరించుకునీ, ప్రభుత్వంవారు ఎక్కువ చేయబడిన ఆ రీసెటిల్మెంట్ పన్నులను వసూలు చేయడానికి పూనుకున్నారు.

మేము జెయిళ్ళనుంచి తిరిగివచ్చాక, 1931 లో ఆ విషయమై ఏం జేస్తే బాగుంటుందని ఆలోచిస్తున్నాం. ఒకప్రక్క రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు నడుస్తూండడంచేత దాని పర్యవసానం ఎల్లా ఉంటుందో తెలియదు కనుక, ప్రభుత్వం ఆ పన్నుల వసూలు సందర్భంలో నిర్బంధ విధానాలను ప్రవేశపెట్టలేదు. ఆ కాన్ఫరెన్సు విఫలం అయిన కారణంగా అరెస్టు వారెంట్ మాత్రం పంపించారు.

ప్రభుత్వంవారు జారీచేసిన ఆర్డరు పురస్కరించుకుని నేను చెన్నపట్నం వెళ్ళకుండా నా ప్రయాణాన్ని ఆపుజెయ్యాలనే ఉద్దేశం

తోనే వారెంట్ పుట్టిందని తలుస్తాను. నేను పట్నంలో ఉండగా నన్ను పట్టుకుంటే అనుకోని అలజడులు కలగవచ్చుననీ, అందులో మేము ప్రభుత్వ విరోధ చర్యలు ఏమీ నడపని సందర్భంలో అరెస్టు జరిగితే అలజడులూ, గడబిడలూ అధికమవుతాయనీ, ఏదో ఒక అబద్ధపు ఛార్జీతో ఏ జిల్లాలోనయినా అరెస్టు చేస్తే కొంత గందరగోళం తగ్గుతుందనీ ప్రభుత్వంవారు తలచారు.

## తప్పుడు కేసు

మర్నాటి ఉదయం నన్ను మేజస్ట్రేటుగారి ఎదుట హాజరుపెట్టే వరకూ, నా అరెస్టు కారణం నాకు తెలియదు. నా కేసు విచారణ జరగడానికి సాక్షులు కూడా హాజరులాగే ఉన్నారు. ఏలూరు నేషనల్ స్కూలు ఎదుట నేను నా కారులోనే నుంచుని ఒక బహిరంగ సభలో ఉపన్యసించానని ఆ సాక్ష్యంవల్ల నాకు తెలియ వచ్చింది. బహిరంగ సభ జరిగింది అన్నది దబ్బర. దానికి జనం హాజరయ్యా రన్నది అబద్ధం. సభ జరుగుతుం దని ప్రకటన అయినా జరిగి ఉండలేదు. నేను కారులో బెజవాడ వెడుతూ అక్కడ ఆగిన సందర్భాన్ని పురస్కరించుకుని ఒక కథ అల్లారు.

నా కాలాన్నీ, కోర్టువారి కాలాన్నీ వృథాపరచడం ఇష్టంలేక నేను ఏ విధమయిన క్రాసు పరీక్ష చెయ్యదలచుకోలేదు. నా తరపున డిఫెన్స్ సాక్ష్యాన్ని పెట్టి కేసు సాగించడమూ అనవసరం అనిపించింది. వారికి తోచిన రాజకీయ కారణాలతో నన్ను అరెస్టుచేసి జెయిలుకు పంపించాలని వారికి బుద్ధి పుట్టింది. "ప్రభుత్వంవారు కోరినప్పుడల్లా జెయిళ్ళకు వెళ్ళడానికి మేము సర్వదా సిద్ధంగానే ఉంటున్నాము గదా! అలాంటప్పుడు ఈ తప్పుడు కేసు మాత్రం ఎందుకు?" అని మాత్రం కోర్టులో అంటూ, "ఎందుకింకా ఆలస్యం? మీరు తలచినంత కాలం త్వరగా శిక్ష విధించండి" అన్నాను. ఆయన నాకు ఎనిమిది మాసాలు విధించాడు.

లండన్‌లో రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ విఫలం అవడంతోనే

జవహర్‌లాల్ నెహ్రూగారినీ, ఇతర ముఖ్య నాయకులనూ, గాంధీగారి అరెస్టుతో పాటే, ఏవేవో కారణాలు చెప్పి, అరెస్టుచేసి జెయిళ్ళకు పంపించారు.

## రౌండ్ టేబిల్ నాటకం

భారత రాజ్యాంగ కార్యదర్శి (సెక్రటరీ ఆఫ్ స్టేట్), బ్రిటిష్ ప్రభుత్వంవారూ నిన్న మొన్ననే గాంధీ ఇర్విన్ ప్యాక్ట్ ధర్మమా అని ఒక మంట చల్లారిందనీ, అల్లా చల్లారిన మంట ధర్మమా అనే గాంధీ గారిని దేశానికి ఏకైక నాయకుడుగా రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌కు పంపగలిగాం అని గ్రహించగలిగిన కారణంగానే, మళ్ళీ ఇంతట్లోనే ఇంకో పెద్ద మంట అంటుకుని, అది గబగబా అన్ని ప్రాంతాలకూ ప్రాకుతుందేమో అన్న భీతివల్ల పుట్టిన దడతో ఒకేసారిగా అన్ని ప్రాంతాలలోని అగ్రనాయకుల్ని ఏదో ఒక సాకుతో గబగబా అరెస్టు చేసేసి నిర్బంధంలోకి తీసుకుని, కటకటాల వెనక్కి పంపించి హాయిగా ఊపిరి పీల్చుకున్నారు.

ఒక మహోన్నతమయిన అహింసాత్మక సమరం గాంధీ-ఇర్విన్ ఒప్పందం ధర్మమా అని ఆగిన సంగతి గ్రహించిన ఆంగ్లేయులు భారతదేశంపట్ల ప్రవర్తించిన తీరు ఇది! లార్డ్ ఇర్విన్ బ్రిటిష్ వారి ప్రతినిధిగానూ, గాంధీగారు భారతదేశపు ఏకైక నాయకుడుగానూ ఆ ఒప్పందంపై సంతకాలు చేసినా, బ్రిటిష్ కాబినెట్‌వారికిగాని, సెక్రటరీ ఆఫ్ స్టేట్‌కిగాని ఆ సంధి షరతులను మన్నించాలనీ, వాటిని అమలు పరచాలనీ ఏ కోశానా అభిప్రాయం ఉన్నట్లు కనబడలేదు. అమలుపరచకుండా ఉండడానికి కారణం చూపాలిగా! అలాంటి కారణంగానే ఈ రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్ పుట్టింది.

దేశాన్నీ, దేశీయుల్నీ నాయకుల్నీ, కాంగ్రెసువారినీ అందర్నీ చల్లచల్లగా నేర్పుతో ఒక వల పన్ని లాగారు. ఆ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌లో గాంధీగారిని సరిగా చూడలేదు సరికదా, ఆయన్ని అవమాన పరచడానికీ, చిన్నబుచ్చడానికీ ప్రయత్నించారు.

## విభీషణాయిలు

మన దేశ స్వాతంత్ర్యానికి విరోధులయిన ఆ విభీషణాయిలు ఏదో ఒక కులం పేరిటో, మతం పేరిటో, మరో రూపంతోనో తమకు రక్షణ కావాలంటూ, తమరిని ప్రత్యేక దృష్టితోనూ, అభిమానంతోనూ చూడవలసి ఉంటుందంటూ ఆ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్‌కు హాజరయ్యారు. భారతీయులచే ఆంగ్లేయుల గడ్డపై ఆడించిన విషాదకరమయిన వింత నాటక మది. గాంధీగారికి దేశీయులూ, విదేశీయులూ కూడా ద్రోహం చేశారు.

భారతదేశం తరఫున 'స్వాతంత్ర్య' తీర్మానం తీసుకువచ్చినందుకు గాంధీగారిని ఎగతాళి చేశారు. గుంభితంగా, గంభీరంగాను ఎగతాళి చేశాక, సర్ శామ్యూల్ హోర్ భారతదేశానికి గాంధీగారి అరెస్టుతో ఒక పాఠం చెప్పి తీరతానని భయపెట్టసాగాడు. అయనేకాదు, యావత్తు భారతదేశంలోని నాయకులంతా జెయిళ్ళకు పోతా రన్నాడు. అన్న మాట ప్రకారం చెయ్యానూ చేశాడు. రెండవ రౌండ్ టేబిల్ కాన్ఫరెన్స్ అనంతరం వెనువెంటనే దేశాన్ని అణగద్రొక్కడానికి జరిపిన చర్య ఇది. ఆ దేశవిస్తృతమైన చర్య సందర్భంగానే నేనూ అరెస్టయ్యాను.

## తిరిగి వెల్లూరు జెయిలుకి

వెనుక పుటలలో నా అరెస్టూ, విచారణా, జెయిలు శిక్ష అన్న విషయాలను గురించి చెప్పే ఉన్నాను. శిక్ష విధించిన తరువాత నన్ను మదరాసు తీసుకు వెళ్ళారు. అక్కడనుంచి, రెండవసారిగా నన్ను వెల్లూరు జెయిలుకు మార్చారు. ఆజెయిలు సూపరింటెండెంట్‌గా మేజర్ ఖాన్ పనిచేస్తూనే ఉన్నాడు. ఈ సారి ఒకరినొకరం అర్థం చేసుకున్న కారణంగా, శిక్షాకాలం పూర్తి అయ్యేదాకా అక్కడే నన్ను ఉంచారు. వెనకటిలాగే ఈసారి కూడా చాలామంది హితులూ, స్నేహితులూ, సన్నిహితులు తోడి ఖైదీలుగా అక్కడికి వచ్చి చేరారు.

మామూలు జెయిలు పరిస్థితులు తప్ప చెప్పుకోతగ్గ క్రొత్త విశేషాలు ఏమీలేవు. మామూలు ధోరణిలోనే జెయిలు పరిస్థితులు నడిచా

యనీ, పైల్ పద్ధతిలోనూ, 'సి' క్లాసు వారిని చూసే విధంలోనూ మార్పులేదనీ, 'సి' క్లాసు వారిలో కొందరికి 'క్వారంటైన్' రాళ్ళు కొట్టే పనికూడా ఒప్పగించబడిందనీ చెపితే చాలనుకుంటాను. నన్ను కొన్ని దినాలపాటు ఆనవాయితీ ప్రకారంగా 'క్వారంటైన్'లో ఉంచి నప్పుడు ఈ విషయాలన్నీ నా కళ్ళతో చూసి గ్రహించ గలిగాను. ఈ సంగతులన్నీ సూపరింటెండెంట్ గారి దృష్టికి తీసుకువచ్చిన కారణంగా నేను అక్కడ ఉన్నంతకాలం కొద్దిగా మార్పు కనబరిచారు. కాని నన్ను లోపలకి మార్చగానే, మామూలు కథే నడిచిం దని విశ్వసనీయ వర్గాల ద్వారా తెలియవచ్చింది.

ఈ అరెస్టును గురించీ, జెయిలు శిక్షను గురించీ మేము ఏ విధంగానూ ఎప్పుడూ అనుకుని ఉండలేదు. ఆ కారణంగా ఈ సంగతులన్నీ చాలా తొందర తొందరగా జరిగిపోయాయని అనుకోక తప్పదు. మేమూ — ఏ విధమయిన ప్రచారాలుగాని, సత్యాగ్రహ సమరాలు గాని జరపడంలేదు. గాంధీగారా — రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సునుంచి తిరిగి రానైై ఉన్నారు. గాంధీగారు బొంబాయి రేవులో దిగిన తక్షణం అయన్నీ, ఆయనతోపాటే ఆసేతుశీతాచల పర్యంతం ఉన్న కాంగ్రెసు నాయకులనీ ఒక్కుమ్మడిని అరెస్టు చేస్తారని కలలోకూడా అనుకోలేదు.

# 13

## 'స్వరాజ్య' పత్రిక: చరమాధ్యాయం

'స్వరాజ్య' పత్రిక విషయంలో వచ్చిన చికాకులు ఋణదాతలతో చేసుకున్న ఒప్పందాలవల్ల, ప్రజలనుంచి నా కెప్పుడూ లభిస్తూ వచ్చిన సహకారాదులవల్ల చాలావరకు సద్దుకోగలిగాను. కాని మా సంస్థను చికాకుల పాలుచెయ్యాలన్న పట్టుదలతో ఒక పెద్ద మనిషి కొన్ని పనులు చేశాడు. ఆయన అవకాశంకోసం కాసుకు కూర్చున్నాడు.

ఆయన 'స్వరాజ్య' పత్రిక ఆఫీసు ఇంటి యజమాని. పేరు కె. సూర్య నారాయణరావు.

ఏదో ఒక దుష్ట నక్షత్రాన మేనేజింగ్ డైరెక్టర్‌గా ఆయన ఇల్లు, నెలకు రూ 300 ల అద్దెమీద, మూడు సంవత్సరాలకు తీసుకున్నాను. ఆయన మా కంపెనీపై ఏదో కుట్ర చెయ్యాలన్న దురద్దేశంతో ఉన్నాడన్న సంగతి నాకు తెలియదు. బహుశః ఆయనకు ఆరంభంనుంచీ అటువంటి ఉద్దేశం ఉండిఉండదు. దర్మిలా, అనగా మొదటి మూడు సంవత్సరాల అగ్రిమెంటు కాలమూ ముగిసిన తరవాత ఆర్థికమైన మా ఇబ్బందులు ఆయన గ్రహించగలిగిన కారణంగా ఎల్లాగయినా మా అచ్చాఫీసు కైంకర్యం చెయ్యాలన్న దుర్బుద్ధి ఆయనకు పుట్టిఉంటుంది. ఎల్లాగయినా ఆయనకు రావలసిన అద్దె బాకీ క్రింద ఆ అచ్చాఫీసును స్వాహా చేయవచ్చునని ఆయన భావించి ఉంటాడు.

నేను 1932 లో అరెస్టయిన నాటికి ఏవో కొన్ని చిల్లర అప్పులూ, లినోటైపు కంపెనీకి ఇవ్వవలపిన బాకీలూ ఉండిపోయాయి. ఇంటి యజమానికి కూడా కొంత అద్దె బాకీ పడి ఉన్నాను. ఆయనకివ్వవలపిన బాకీతో సహా, ఇరవై వేల కంటె ఎక్కువగా ఉండి ఉండదు. మహా అయితే ఆ ఇరవై వేల అప్పు ఒకటి రెండు లినో మిషన్ల ఖరీదుకంటె ఎక్కువ ఉండదు.

నాకు శిక్ష పడిన తరవాత, నా వ్యాపారమంతా చూస్తూన్న కృపానిధి అన్న మా మేనేజరు ఏదో కొద్దిగ ఋణం కావలసి, ఆ ఇంటి యజమానిని కలుసుకున్నాడు. ఆ ఋణం పుట్టినట్లయితే, కొన్ని ఆర్థికమైన ఇబ్బందులు తీరతాయనీ, మళ్ళీ తిరిగి నేను వచ్చేవరకూ నిర్విఘ్నంగా పేపరు నడపవచ్చుననీ ఆయన తలచి ఉండవచ్చును.

## సూ. నా. రావు తంత్రం

ఆ ఇంటి యజమానికి, తాను వాంఛించిన ప్రకారం, తనకు రావలపిన అద్దె బకాయికింద ఆ అచ్చాఫీసంతా కైంకర్యం చేసేయ్యాలన్న ఆశ ఎక్కువయి ఉంటుంది. అందుచేత, ఆయన తన సలహాదారులయిన పార్థసారథి, తిరువెంకటాచారిగార్ల సలహాకోసం వెళ్ళాడు.

ఏదో ప్రకారంగా కొంత ధనాన్ని 'స్వరాజ్య' కంపెనీవారికిచ్చి, మొత్తం తనకు రావలసి ఉంటుందనుకున్న డబ్బుకు హామీగా ఆ అచ్చాఫీసు నంతటినీ వ్రాయించుకోవాలని ఆయనకు ఆశ పుట్టింది.

నా భార్య, ఆ 'స్వరాజ్య' కంపెనీకి ఆమె స్వంతం ఒక లక్ష పదమూడు వేల రూపాయలు అప్పు ఇచ్చి, ఆ కంపెనీ ఆస్తులపై ఫ్లోటింగ్ హక్కు పత్రం వ్రాయించుకుంది. ఇంటి యజమాని, తాను పొందిన సలహా ప్రకారం, ఆమెకున్న యావత్తు హక్కూ ఆయన పరంగా ఆమె వదులుకుంటే తప్ప ఒక్క కాణీకూడా అప్పు ఇవ్వనని స్పష్టంగా చెప్పేశాడు.

అప్పటికి నా భార్య హనుమాయమ్మ, ఇచ్చిన అప్పు వడ్డీతో సహా రెండులక్షల వరకూ పెరిగింది. ఆ ఇంటి యజమాని, తాను కోరిన ప్రకారం హనుమాయమ్మ ఆమెకున్న యావత్తు హక్కూ తన పరం గావించిన తరవాత 'స్వరాజ్య' కంపెనీవారు ఆ కంపెనీకున్న యావత్తు ఆస్తీ తన పేర తనఖా వ్రాయాలనికూడా షరతు పెట్టాడు.

కృపానిధి అప్పు కావాలని వ్రాసిన ఉత్తరానికి జవాబుగా సూర్యనారాయణరావు, ముందుగా హనుమాయమ్మగారికున్న హక్కులన్నీ తన పేర ట్రాన్సఫర్ అయితే తప్ప, అప్పు ఇవ్వబడదని స్పష్టంచేశాడు. హనుమాయమ్మ పట్నంలోనే ఉంటూఉన్నా, స్వత స్సిద్ధంగా ఏమీ చదువుకున్న ఇల్లాలు కాదు. ఆమె నేను ఏది చెపితే అది తు. చ. తప్పకుండా చేసే బాపతు మనిషి.

అందువల్ల కృపానిధీ, సూర్యనారాయణరావు కలిసి వెల్లూరు జెయిల్లో నన్ను కలుసుకోడానికి వచ్చారు. నా భార్యకున్న హక్కులన్నీ సూర్యనారాయణగారి పేర ట్రాన్స్ఫర్ కావడానికి కావలసిన సన్నాహమంతా ఆమె చేసేలాగున నాచేత ఉత్తరం వ్రాయించుకోవాలని నా వద్దకు వచ్చారు. వారు వెల్లూరు ఒక శనివారంనాటికి జేరుకున్నారు. ఆ రావడంకూడా సాధారణంగా జెయిలు రూల్సు ప్రకారం ఇవ్వబడే ఇంటర్వ్యూకాలం పూర్తి అయ్యాక వచ్చారు.

వారిరువురూ మేజరు ఖాన్ ఇంటికి వెళ్ళి, తాము అనాడు సకా

లంలో రాలేకపోయామనీ, ఒక అతి ముఖ్యమయిన విషయం గురించి మాటలాడడానికి పట్నంనుంచి వచ్చామనీ, అందువల్ల ఆదివారం అయినా ఆ మర్నాడు ఒక్క అయిదు నిమిషాలపాటు సూర్యనారాయణరావు నాతో సంప్రతించడానికి సావకాశం ఇప్పించవలసిందనీ మేజర్ ఖాన్‌ను కోరారు.

ముందర అవకాశం ఇవ్వ నిరాకరించినా, తరవాత, అల్లాగే అయిదు నిమిషాలసేపు మాట్లాడవచ్చునని, సూర్యనారాయణరావుకు అనుమతి ఇచ్చాడు. వా రుభయులూ, వెల్లూరు వచ్చేముందర, తమకు నాతో సంప్రతించడానికి అనుమతి కావాలన్న దరఖాస్తు కూడా పెట్టుకోలేదు. నేను ఆ వారంలో ఎవరినయినా కలుసుకుంటాననిగాని, అందులో ఆదివారం ఉదయం ఆరుగంటలకే అది తటస్థపడుతుందనికాని ఊహించలేదు.

ఆ రోజు ఉదయం ఆరుగంటలకు మేజర్ ఖాన్ నా గదికి వచ్చి, నాతో చాలా అర్జంటు విషయాలమీద మాటలాడడానికి పట్నంనుంచి ఎవరో మిత్రులు వచ్చారనీ, వారితో నేను అయిదు నిమిషాలసేపు సంప్రతించడానికి తాను అనుమతి నిచ్చాననీ చెప్పి, నన్ను తన వెంట రమ్మన్నాడు. నన్ను చూడడానికి వచ్చిన వారి పేరు మేజర్ ఖాన్ చెప్పలేకపోయాడు.

ఎవ్వరితో మాటలాడడానికి నాకు అనుమతి ఇవ్వబడిందో, వారి పేరయినా ఎరగనే అని, ఆ అనుమతిని నిరాకరించాలని అనుకున్నా సాధ్యంకాలేదు. నేను ఖాన్ గారి వెంట వెళ్ళాను. ఆ ఆసామీ లోపలకు తీసుకురాబడ్డాడు. వచ్చింది ఇంటి యజమాని సూర్యనారాయణరావు గారు. ఆయన నాతో ఆ ఇనుప కటకటాల లోపల అయిదు నిమిషాల సేపు మాటలాడడానికి అనుమతింపబడి ఉన్నాడు.

## ముందు ట్రాన్స్‌ఫర్ దస్తావేజు

మేజరు ఖాన్ కొంచెం అవతలగా బయటనే నుంచుని, నిమిషాలు లెక్కపెడుతూ, నిమిషం అయిన వెంటనే గట్టిగా అరవడం మొదలు

పెట్టాడు. ఆయన ఆ కటకటాల ద్వారా మమ్మల్ని చూడగలడు. సూర్యనారాయణరావు, తాను నాకున్న అప్పుల తీర్మానంకోసం రు 300 లు కూడా పుట్టించలేకుండా ఉన్నాననీ, అయినా నా భార్య గనుక ఆమెకున్న హక్కులన్నీ తనకు విలియా వేస్తే, కంపెనీకున్న అప్పు యావత్తూ తనకు రావలసిన అద్దెతో సహా, తాను తీర్చడానికి సిద్ధంగా ఉన్నాననీ చెప్పాడు.

సూర్యనారాయణరావు చెప్పిందంతా నాకు చాలా ఆశ్చర్యాన్ని కలుగజేసింది. కృపానిధీ, ఖాసా సుబ్బారావుగారలు ఎక్కడ ఉన్నారని అడిగాను. వారు బయట ఉన్నారనీ, స్వయంగా మాటలాడిఉన్న చిక్కులన్నీ నాతో చెప్పడానికి భయపడుతున్నారనీ చెప్పాడు. ఆయన తన లాయర్లు, నా భార్యకున్న హక్కులన్నీ తన పేర వ్రాసి ఇచ్చే పక్షంలో, సహాయం చెయ్యవచ్చు నన్నారని అన్నాడు.

ఆమె హక్కులన్నీ విలియా వెయ్య నవసరంలే దనీ, తనపేర సబ్ మార్ట్‌గేజ్‌గా తన హక్కులను ఇస్తే చాలునని నేను చెప్పాను. ఆయన తన ప్లీడర్లు తనకు ఇచ్చిన సలహా ప్రకారంగా గాక ఇంకే విధంగానూ సహాయం చేయజాలనని చెప్పేశారు. నేను నా వద్ద కలం కాగితం కూడా లేవనీ, సంగతులు పరిశీలించి నా భార్యపేర ఉత్తరం వ్రాస్తాననీ చెప్పాను. ఆయన తనవద్ద కాగితం వగైరా లున్నాయని చెపుతూ, ఒక జేబులోనుంచి కాగితం తీసి ఇచ్చాడు.

ఆయన చెప్పిన విషయంలో నాకు పూర్తిగా నమ్మకం కుదరక పోయినా, ఆయన చెప్పిన పరిస్థితులన్నీ విషమ పరిస్థితులుగానే ఉన్నాయనీ, తొందరగా వాటి విషయం తేల్చుకోకపోతే పరిస్థితులు చెయ్యి దాటిపోతాయేమోనని తలచి, నేను నా భార్యపేర ఉత్తరం వ్రాయడానికి అంగీకరించాను. తీర్చవలసిన బాకీల విషయం ఆలోచించి ఇరవై వేల కంటె బాకీ లుండవని చెప్పాను.

ఆమెకున్న హక్కులన్నీ తనపేర ఆమె నామకహా విలియా వేస్తే, దానిని ఒక బినామీ వ్యవహారంగానే భావిస్తూ, తాను ఆ కాగితం

ఆధారంగా ఎట్టి చర్య తీసుకోదలచలేదనీ, తన పేర ఆమె వ్రాసే ట్రాన్సఫర్ దస్తావేజులో ఇంత సొమ్మని కూడా వ్రాయనవసరం లేదనీ ఆయన అంటే, అల్లాకాదు- అంకె దానిలో వెయ్యాలని నే నన్నాను.

ఏది ఏమయినా, ఆమె హక్కులన్నీ సూర్యనారాయణరావుగారి పేర విలియా వేస్తే, తతిమ్మా వన్నీ తాము సరిచూసుకుంటామని ఆయన చెప్పడం చేతనూ, జరుగవలసిన కాండంతా అయిదు నిమిషాలలో జరగవలసి ఉన్న కారణంచేతనూ, ఆ కాగితంమీద, నా భార్యపేర, వారు కోరిన ప్రకారం ఎటువంటి ట్రాన్స్ఫర్ దస్తావేజయినా సరే ఇరవై వేలకు వ్రాసి ఇవ్వమని, ఒక ఉత్తరం గబగబా వ్రాసేశాను.

ప్రపంచకంలో ఎంతటి మూర్ఖుడయినా, ఇటువంటి తెలివి తక్కువ పని, అనాలోచితంగా, ఆ అయిదు నిమిషాలలోనూ చేసి ఉండడని నా తలంపు. ఏదయితేనేం- చేయకూడని పని చేసేశాను, చెయ్యి జారిపోయింది.

సూర్యనారాయణరావు నన్ను పూర్తిగా బోల్తా కొట్టించాడు. నా భార్యచేత ఆమెకున్న సర్వహక్కులూ తన పేర ట్రాన్స్ఫర్ వ్రాయించుకున్నాడు. ఇంత జేసినవాడు అప్పులయినా తీర్చాడా అంటే అదీ లేదు. పైగా, నా భార్య వ్రాసి ఇచ్చిన ట్రాన్స్ఫర్‌వల్ల తనకు రావలసిన అద్దె మాత్రమే తనకు లభిస్తుందనీ, అందువల్ల నా తాలూకు ఇతర బాకీలేవీ తాను తీర్చననీ స్పష్టంచేశాడు. కావా అంటే,'స్వరాజ్య' కంపెనీ బాపతు చర, స్థిర ఆస్తులన్నీ- దానికోసం కొన్నస్థలం, ఉన్న బిల్డింగూ అన్నీ సాఫ్‌సీదాగా తనపేర పదివేల రూపాయలకు తనఖా పెడితే, నా తక్కిన బాకీలు తీరుస్తానన్నాడు.

## తరవాత తనఖా దస్తావేజు

కృపానిధి మంచి చిక్కుల్లో పడ్డాడు. అతడే జెయిలులో నన్ను కలుసుకుని ఆ తనఖా దస్తావేజు ముసాయిదా నాచేత అంగీకరింప జెయ్యాలని నిర్ణయించ బడింది. ఆ మొదటి వ్యవహారంలో కృపానిధి చాలా తెలివి తక్కువగా వ్యవహరించి నన్ను ఒక ఖుంతని జేశాడు.

తాను బయట ఉండి సూర్యనారాయణ రావుని ఒక్కణ్ణే నాతో మాట లాడడానికి జెయిలులోకి పంపించిన కారణంగా, అటువంటి పరిస్థితి ఉత్పన్నమయింది. తానూ, సుబ్బారావూ వచ్చి అల్లా బయటే ఉండి పోక పోతే, అధమం తాను ఒక్కడయినా సూర్యనారాయణ రావుతోపాటు లోపలికివచ్చి, సంగతి సందర్భాలు క్షుణ్ణంగా చెప్పిఉంటే, ఈ చిక్కు లలో మేము పడేవాళ్ళము కాము.

నాచేత ఆ రెండవదస్తావేజు సరిగా ఉందని అనిపించుకోవడానికి తానువచ్చి నన్ను కలవవలసి వచ్చేసరికి కృపానిధి మానసికంగా చాలా బాధపడ్డాడు. కాని వెనకటికీ ఇప్పటికీ అతని పరిస్థితి అల్లాగే ఉండి పోయింది. అందుచేత, ఆ మొదటి ట్రాన్స్ఫర్ దస్తావేజు వ్రాయ బడిన 15 రోజులు తిరక్కుండా, తప్పనిసరిగా నన్ను కలుసుకోక తప్పిందికాదు. ఈ ముసాయిదాలన్నీ ఆ ఇంటి యజమాని లాయర్లే తయారు చేశారు.

కృపానిధి నన్ను కలుసుకుని సూర్యనారాయణ రావు ఎల్లా మమ్మల్ని దగా చేసిందీ వివరించాడు. కంపెనీ తాలూకు ఇతర ఆస్తు లన్నీ తనఖా పెడితేనే గాని ఒక్కకాణీకూడా ఇవ్వనంటున్నాడని చెప్పాడు. నేను, ఆ ఆదివారంనాడు సూర్యనారాయణరావు ఒక్కడే లోపలికివచ్చి నాతో మాట్లాడిన సందర్భంలో ఏం జరిగిందో, కృపా నిధితో వివరంగా చెప్పాను. మనల్ని బాగా దగాచేశాడనీ, ఆనాడు సూర్యనారాయణరావుతో తానూ లోపలికి రాకపోవడాన్నే అతనికి అలాంటి అవకాశం కలిగిందనీ, అదే పెద్ద తప్పయిపోయిందనీ వివ రించాను. నేను కృపానిధిని చివాట్లు పెట్టి, ఈ పరిస్థితులలో తనఖా దస్తావేజు వ్రాయడానికి సుతరామూ ఒప్పుకోనని చెప్పాను.

నా జీవితంలో ఎప్పుడూ ప్లీడరుగా, అడ్వకేటుగా, రాజకీయ వేత్తగా పనిచేసి - ఇటువంటి చికాకు పరిస్థితులలో నేను చిక్కుకో లేదు. ఆ సమయంలో నా సహజ వివేకంకూడా నన్ను విడిచిపెట్టి పారిపోయిందనుకుంటాను. ఆఖరికి, తప్పనిసరిగా, కంపెనీకి మిగి

లింది కాస్తాకూడా తనఖా పెట్టడానికి పరిస్థితులనుబట్టి ఒప్పుకోవలసి వచ్చింది.

నన్ను పూర్తిగా దగా చేయగలిగిన ఆ సూర్యనారాయణ రావు, ఈసారి నన్ను తిరిగి కలుసుకుని తనఖా దస్తావేజు ముసాయిదా అంగీకరింపజేయడానికి తంటాలు పడకుండా, తెలివిగా తప్పుకున్నాడు. అతడు లోపలికివచ్చి ఉంటే, ఆ ట్రాన్స్ఫర్ దస్తావేజు విషయంలో నాకు చేసిన దగా గురించి అడిగి ఉందును. అతడు ఈ రెండు సందర్భాలలోనూ, జాగ్రత్తగా ప్లానువేసుకుని, మిమ్మల్ని నిర్బంధించి, మా చేత ఆ రెండు దస్తావేజులూ వ్రాయించుకో గలిగాడు.

మొదటిది- నా భార్య హనుమాయమ్మకు 'స్వరాజ్య' కంపెనీపై రెండు లక్షల పైచిలుకు రొక్కానికి ఉన్న హక్కులన్నీ ఆయన పేర ట్రాన్స్ఫరుకు సంబంధించిందీ. రెండవది- మిగిలిన చర, స్థిర ఆస్తులన్నీ సీదాగా అతని పరం చేసేదీ. అంతేకాదు- నాచేతా, నా భార్యచేతా కూడా ఉత్తరాలు వ్రాయించుకున్నాడు. ఆ ట్రాన్స్ఫర్ దస్తావేజువల్ల కాని, తీరని ఆర్థికమైన లోటుపాట్లు ఏవయిన ఉంటే వాటి విషయంలో మేము ఇరువురమూ స్వయంగా బాధ్యులమనీ ఆ ఉత్తరాలలో వ్రాసి ఇచ్చాము.

ఈ విధంగా నేను వెల్లూరులో ఖైదీగా ఉంటూన్న ఆ రోజులలో సూర్యనారాయణ రావు తంత్రంలో పడిపోయి, బలవంతంగా ఆ దస్తావేజులు వ్రాసి ఇచ్చాను.

## ఆపైని హైకోర్టు

స్వరాజ్య కంపెనీ తరువాతి చరిత్ర సుదీర్ఘమై అనేక సంఘటనలతో కూడుకుని ఉంది. అలా దగాగా సంపాదించిన ఆ రెండు దస్తావేజులు ఆధారంగా ఆ సూర్యనారాయణ రావు, హైకోర్టుకి వెళ్ళి 'స్వరాజ్య' కంపెనీని ఎల్లాగయినా మూయించేసి, ఆ కంపెనీ తాలూకు యావదాస్తినీ-అనగా అచ్చాఫీసు, లినో మిషన్లు, బిల్డింగులు, ఖాళీజాగా వగైరా - తనకు బాకీగా ఉన్నామని చెప్పబడే అద్దెబకాయి కింద, ఆ

కొద్దిపాటి రొక్కానికే, చేత బట్టాలని చూశాడు. నేను జాగ్రత్తగా, ఆ వ్యవహారం నడిపిస్తూ, నా ప్లీడర్లు నన్ను జారవిడిచిన సందర్భాలలో నేనే స్వయంగా వాదించుకుంటూ, కంపెనీ మూసివేయాలని హైకోర్టులో ఆయన దాఖలు చేసిన ప్రతి పిటీషనూ నెగ్గుకుంటూ వచ్చాను.

మిస్టర్ జస్టిస్ జెంటిల్ (Mr. Justice Gentle) వద్ద ఆఖరు సారిగా దాఖలు చేయబడిన పిటీషన్ విచారణకు వచ్చినప్పుడు, ఆ ఇంటి యజమాని కివ్వవలసిన అద్దె బకాయి ఎంతో నిర్ణయించ వలసిందనీ, ఆ పద్దులన్నీ సరిచూసి నికరం బాకీలు తేల్చవలసిందనీ ఆ జడ్జీగారు ఆర్డరు జారీ చేశారు.

అప్పీలు కోర్టులోకి ఆ వ్యవహారం వచ్చిన సందర్భంలో, ఆ సూర్యనారాయణ రావు తనకు రావాలని చూపించిన అంకెలు తప్పని వాదించాను. అప్పటికి, పరిస్థితుల ప్రభావం వల్లనే మదరాసు ప్రభుత్వంలో రెవిన్యూమంత్రిగా ఉండటం తటస్థించింది. అందువల్ల నేను స్వయంగా జడ్జీల ఎదుట నిలబడి వాదించడానికి సావకాశం (మంత్రులు కోర్టులలో జడ్జీల ఎదుట లాయర్లుగా నిలిచి వాదించడం న్యాయ విరుద్ధమూ, మంత్రి హోదాకు భంగమూను) లేకుండాపోయింది.

ఆ అప్పీలు కోర్టులో జడ్జీలలో ఒకరయిన జస్టిస్ వరదాచారి గారికి కంపెనీ మూసివేయడమే న్యాయమని తోచింది. నా అభ్యంతరం కేవలం జమా ఖర్చులకు సంబంధించిందే అయిన కారణాన్ని ఇవ్వ తేలే మొత్తం చిన్నదయినా పెద్దదయినా, ఈ పరిస్థితులలో కంపెనీని మూసి వేయడమే న్యాయమని ఆయనకు తోచింది.

ఈ లావాదేవీలన్నీ సుదీర్ఘంగా నడిచాయి.* కంపెనీ మూసి వేయవలసిందేను అన్న ఆ జడ్జీగారి తీర్పు న్యాయమైంది, సవ్యమైంది కాదంటూ, హైకోర్టు ఒరిజనల్ సైడున ఒక దావా వేశాను. దగాచేసే ఉద్దేశంతో వ్రాయించుకున్న ఆ ట్రాన్స్‌ఫర్ దస్తావేజూ, తనఖా దస్తావేజూ

* వీటిని గురించి ''స్వరాజ్య పత్రిక - కంపెనీ'' అన్న ప్రకరణంలో వివరంగా వ్రాద్దామనుకున్నారు.

చెల్లవనీ, నేను నా కుమారులూ అప్పటికి చనిపోయిన హనుమాయమ్మ గారి సన్నిహితవారసులుగా ఆమె హక్కులను రక్షించవలసిన బాధ్యత మా పైన ఉన్నదనీ, కంపెనీ తాలూకు ఆస్తులన్నీ మాకు చెందాలనీ, ఎటొచ్చీ సూర్యనారాయణ రావుకు అద్దెబాపతుగా ముట్టవలసిన సొమ్ముకు మాత్రమే అతడు అర్హుడనీ మా దావాలో పేర్కొన్నాము.

ఈ దావాలో జస్టిస్ సోమయ్యగారు మా పక్షంగానే తీర్పు ఇచ్చారు.

కాని ఇది ఇల్లా నడుస్తూ ఉండగానే, కంపెనీ వైండింగ్ ఆర్డరును పురస్కరించుకుని కంపెనీ తాలూకు ఆస్తులన్నీ విక్రయించబడ్డాయి. వేరే దావా వేసిన కారణంగా, ఆ కంపెనీ తాలూకు ఆస్తులు అన్యాక్రాంతం కాకుండా ఇన్‌జక్షన్ ఇప్పించవలసిందని మేము కోరిన ఆర్డరు నిరాకరించబడింది. అందువల్ల ఆ ఆస్తులన్నీ అల్లా అల్లా అమ్మకం అయిపోయాయి. వేలూ, లక్షలూ ఖరీదుచేసే ఆస్తులు టూకీగా వందలూ, వేలూ మీద ఎగిరిపోయాయి. ఆ ఆస్తులేవీ తిరిగి స్వాధీనపరచుకునే అవకాశం లేకుండా పోయింది.

## ఫలితం దక్కని విజయం

అందువల్ల మాకు కలిగిన జయం కేవలం కాగితంమీదనే అని అనుకోక తప్పదు. ఈ డిక్రీమీద సూర్యనారాయణ రావు అప్పీలు పడేశాడు. తుదకు ఆస్తుల అమ్మకంవల్ల కోర్టులో జమఅయిన రొక్కాన్ని దృష్టిలో పెట్టుకుని రాజీపడ్డాం.

ఒక కోర్టులో దోషంలేదని నిరూపించబడ్డా, కోర్టువారు నా వాదన న్యాయమయిందేనని కేసు నా పక్షంగా తీర్పు ఇచ్చినా, అంతిమ విజయం నాదేఅయినా, ఆస్తులు స్వాధీనంఅయ్యే పరిస్థితి చేయిజారిపోవడాన్ని-మీరు రాజీపడితే బాగుంటుందేమోననే కోర్టువారి సలహాను పురస్కరించుకుని, రాజీకి ఒప్పుకున్నాను.

నిజానికి ఆ సంస్థను మూసివేయడానికి నాకు ఎంతమాత్రమూ ఇష్టంలేదు. పూర్తిగా నన్ను నమ్మి, నా యందుఉన్న అఖండిత విశ్వాసంతో,ఈ దేశీయులేగాక పైదేశాలవారు కూడా,ఏ విధమయిన ఆపేక్షలూ

లేకుండా, విరివిగా ధనసహాయం చేసిఉన్న కారణంగా, ఆ కంపెనీ మూసివేయడమంటే నా కదోలా అనిపించింది. చేతులుకాలిన తరవాత ఆకులు పట్టుకున్నట్లు ఇప్పుడనిపిస్తోంది. ఆనాడు 1924 లో, గాంధీగారి సలహా ప్రకారం, ఈ సంస్థను మూసిఉంటే, మా ఆస్తులు చిన్నం ఎత్తయినా పోయిఉండేవి కావు. మాకు ఈ చిక్కులూ, ఈ క్షోభా, ఏవీ ఉండేవికావు.

నా విషయంలో నాకే బెంగా లేదు. నేను పుట్టింది ఒక బీదల ఇంటిలో, పెరిగిందీ బీదవారి కొంపలలోనే. ప్లీడరుగానూ, బారిష్టరుగానూ మాత్రం లక్షలు సంపాదించాను. దీర్ఘకాలంగా నడచిన, ఒక పెద్ద దేశంయొక్క స్వాతంత్ర్యంకోసం జరిగిన శాంతియుత సమరంలో ప్రజలవద్ద నుంచి సంపాదించిన లక్షలు, ఆ ప్రజల స్వాతంత్ర్యంకోసం ఆనందంగా ఖర్చుపెట్టగలిగాననే భావన నామట్టుకు నాకు ఆనంద దాయకంగానే ఉంది. నాతో, నా దృక్పథంతో ఆలోచించి చూడగల శక్తి నా భార్యకూ, పిల్లలకూ లేకపోయినా, జీవితమన్నది కేవలం వ్యక్తిగతంగా ఒక్కొకరమే బ్రతకడానికి కాదనీ, ఇతరులకోసంకూడా మనం బ్రతకవలసి ఉంటుందనీ గ్రహించడాన్ని చాలా ఘనమయిన త్యాగాలు చేయగలిగాం ఏ విధమయిన అనిష్టతా చూపించకుండా, మనస్సులో నయినా సణుక్కోకుండా, ఆ స్తిపై వారికున్న అన్ని హక్కులూ, నా భార్యా, పిల్లలూ ఆనందంగా వదులుకున్నారు.

నిజానికివి మా కుటుంబానికి చాలా కష్టపు దినాలు. 'స్వరాజ్య' కంపెనీకి అప్పిచ్చినవారిలో ఒకే ఒక ఋణదాత, నేను జైలులో ఉన్న సందర్భంలో, మా కుటుంబానికి విపరీతమయిన నష్టాన్ని కలుగజేయగలిగాడు.

'స్వరాజ్య' కంపెనీని ఎల్లా అయితే రక్షించుకోలేకపోయానో, అదే ప్రకారంగా నా భార్య జీవితాన్నికూడా కాపాడుకోలేకపోయాను. 1932 జూలైలో నేను విడుదల అయ్యాను. అదే సంవత్సరం నవంబరు మాసంలో ఆమె దివంగతురాలయింది. ఇవీ 1932 నాటి నా వెల్లూరు జెయిలు ముచ్చట్లు.

# 14

# వ్యక్తిసత్యాగ్రహోదంతం

**1940-46** లో నేను తిరిగి జెయిలుకు వెళ్ళక పూర్వమూ, ఆ తర్వాతా జరిగిన సంఘటనలన్నీ చరిత్రాత్మకమైనవి. జెయిలు అనుభవాలను గురించి వ్రాస్తూన్న ఈ సందర్భంలో ఆ చరిత్రాత్మక ఘటనలకు తావులేదు.* నేను ఇక్కడ జెయిలు అనుభవాలను గురించి మాత్రమే వ్రాయదలచాను. దానివల్ల చదువరులు వివిధ సందర్భాలలో నేను జెయిలుకు వెళ్ళినప్పుడు పొందుతూవచ్చిన అనుభవాలను ఒకదాని తర్వాత ఒకటిగా చదివి, సంగతి సందర్భాలు సరిగా గ్రహించగలుగుతారు. ఈ పట్టున పూర్వచరిత్రంతా పూర్తిగా విశదపరచకపోయినా, అవసరమయినంతవరకూ సూచనప్రాయంగా చెపుతూ, మదరాసురాష్ట్ర పరిపాలనాయంత్రాన్ని రెండున్నర సంవత్సరాలు చేతపట్టిన తర్వాత, మళ్ళీ ఎల్లా తిరిగి జెయిళ్ళల్లో ప్రవేశించామో, తెలపాలని ఉంది. నన్నూ, నాతో సహజీవనంచేస్తూ వచ్చిన మంత్రుల్నీ, శాసనసభ్యుల్నీ, ఇతర కాంగ్రెసువాదుల్నీ పదే పదే జెయిళ్ళపాలుజేసిన ఆ వింత సన్నివేశాలను గురించి మనవి చేస్తాను.

## రెండవ ప్రపంచయుద్ధం

రెండవ ప్రపంచయుద్ధం 1939 సెప్టెంబర్‌మాసంలో రగుల్కొంది. యుద్ధ ప్రారంభ సమయానికి మేమంతా మంత్రులంగానే ఉన్నాం. మన దేశపు ప్రత్యేకమైన అనుమతి వగైరాలతో నిమిత్తం లేకుండా, మనం ఆంగ్లేయులచే పరిపాలించబడుతూన్న కారణంగా, మన దేశీయులు ఆంగ్లేయుల తరపున ఆ యుద్ధ జ్వాలలలో తప్పని సరిగా ఇరుక్కున్నారు.

---

* వారు ప్లాను చేసి, వ్రాయడం పడని తరువాతి ఖండంలో "కాంగ్రెసు గవర్న్‌మెంట్ - అటుపిమ్మట" అన్న ప్రకరణంలో ఆ విషయాలన్నీ గుదిగుచ్చ దలచారు.

ఆ సమయంలో బ్రిటనునుంచి మాకు కొన్ని వార్తలందాయి. బ్రిటిష్ కాబినెట్‌వారు భారత రాజ్యాంగ చట్టాన్ని సవరించే హక్కును సంపాదించి, ఆ యుద్ధపు రోజులలోనే మన భారతదేశానికి బ్రిటిష్‌వారు చేయగలిగిన మంచి సంతటినీ చేయదలచుకున్నారనీ ఆ వార్తల సారాంశం. మేము, ప్రజల బాధ్యతలు నిర్వహించవలసిన మంత్రులుగా ఆ ప్రతిపాదనలకు మా సమ్మతిని ఇవ్వజాలమని చెప్పాము.

ఈ విషయంలో కాంగ్రెసునుగాని, కేంద్రశాసనసభవారినిగాని ఆంగ్లేయులు సంప్రదించలేదు. బ్రిటిష్ క్యాబినెట్, సెక్రటరీ ఆఫ్ స్టేట్ తీసుకున్న ఈ నిర్ణయానికీ, దేశాభిప్రాయానికీ విరుద్ధంగా వైస్రాయి ధనాన్నీ, జనాన్నీ పోగుచేస్తూన్న విధానానికీ నిరసనగా, కాంగ్రెసు అధిష్ఠానవర్గం పరిపాలనాయంత్రాన్ని చేబట్టిన వివిధ రాష్ట్రీయ కాంగ్రెసు మంత్రులతో నయినా సంప్రతించకుండా, రాజీనామాలు ఇవ్వడానికి సమయాసమయాలయినా ఆలోచించకుండా, ఒక్కమాటుగా- రాజ్యాంగాలను సాగిస్తూన్న ఏడు రాష్ట్రాల కాంగ్రెసు మంత్రులనూ, తదితరులనూ రాజీనామా లివ్వవలసిందని ఆదేశించింది.

## కాంగ్రెసు మంత్రివర్గాల రాజీనామా

మేమందరం, మారుమాటాడకుండా, ఆ కాంగ్రెసు హైకమాండువారి ఆజ్ఞానుసారం, 1939 అక్టోబరు నెలాఖరుకు, రాజీనామా లిచ్చేశాం. దేశంలో ఉన్న పదకొండు రాష్ట్రాలలోను ఏడింట పరిపాలనా యంత్రాన్ని చేపట్టిఉన్న కాంగ్రెసు వాదులందరూ ఒక్కసారిగా బయటకు వచ్చిన కారణంగా, బ్రిటిష్‌వారు వెంటనే కాళ్ళ బేరానికివచ్చి, భారతదేశంతో ఏదో ఒక విధంగా రాజీపడతారని తలచాం. కాంగ్రెసు హైకమాండు వారూ అటువంటి అభిప్రాయంతోనే మమ్మల్నందర్నీ ఒక్కుమ్మడిగా బయటకు రమ్మన్నారు. కాని నాకుమాత్రం ఏవో అనుమానా లుండిపోయాయి.

రాజీనామాలు జరిగిన వెంటనే వైస్రాయ్‌గారికీ, కాంగ్రెసువారికీ మధ్య సంప్రదింపు లారంభ మయ్యాయి. బ్రిటిష్‌వారుకూడా ఏదో కొంత వరకూ వంగి, లొంగి ఏదయినా అంగీకారానికి వద్దామనే యోచనలో

ఉండడాన్ని, ఈ సారి రాజీ ఏదో జరుగుతుందనే అందరమూ ఆశ పడ్డాము. వైస్రాయ్ ఇచ్చిన ఘనమైన 1940 ఆగస్ట్ 'ఆఫర్' ప్రకారం, ప్రభుత్వ నిర్వాహక సంఘం (Executive Council) సభ్యులను విస్తరింపజేయడం విషయంలో బ్రిటిష్‌వారూ కాస్తంత దారిలోకి వచ్చారు.

కాని అది కాంగ్రెసువారి వాంఛల దృష్టిలో బహుస్వల్పం. కాంగ్రెసువారు ఆ ఆగస్టు ప్రతిపాదనలకు ఎంతమాత్రమూ ఒప్పుకో లేదు. 1940 లో పూనాలో ఆమోదించబడిన కాంగ్రెసు తీర్మానాన్ని అనుసరించి ఉన్న కోర్కెలకు ఆంగ్లేయులు వెంటనే అంగీకరించాలని కాంగ్రెసువారు తమ సూచనలను అందజేశారు. ఆ ప్రకారం జాతీయ, రాష్ట్రప్రభుత్వాలు ఏర్పడాలని (National and Provincial Governments) తమ వాంఛితార్థంగా కాంగ్రెసువారు తెలియ బరచారు.

అహింసాత్మక విధానానికి స్వస్తి చెప్పి, కాంగ్రెసువారు జనాన్నీ, ధనాన్నీ సేకరించి, బ్రిటన్‌పై కాలుదువ్విన నియంతల తలదన్నడానికి ఒప్పుకున్న కారణంగా ఆంగ్లేయులూ కొంతవరకూ మెత్తబడ్డారు. మహాత్మాగాంధీగారికి ఈ విధానం అంగీకారయోగ్యంగా కనిపించలేదు. కాని, పదిహేనుగురు కార్యనిర్వాహక సభ్యులలోనూ పదిమంది అటు వైపే మొగ్గి, తన పక్షాన అయిదుగురు మాత్రమే ఉన్న పరిస్థితిని గమ నించి, తన పట్టువిడిచి, రాజగోపాలాచారి మున్నగు తన పక్షీయులకు ఆశీర్వచనాలను అందజేస్తూ ప్రక్కకు తప్పుకున్నాడు.

## పూనాసభలో నా జోస్యం

కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గసభ్యులు చాలామంది, వైస్రాయి గారూ, సెక్రటరీ ఆఫ్ స్టేటూ, లొంగి తీరతారనే నమ్మారు. కాని ఈ విషయంలో నా అనుమానాలు నాకు ఉన్నాయి. పూనా తీర్మానం ఆమో దించబడిన మర్నాడు, పూనా లా కాలేజి స్టూడెంట్స్ సభలో నన్ను ఉపన్యసించవలసిందని కోరిన పిలుపును పురస్కరించుకుని ఆ సభలో ఉపన్యసించాను. నా ఉపన్యాసంలో పూనా తీర్మానం ఒక పెద్ద పొర

పాటనీ, బ్రిటిషువారు ఆ తీర్మానంలో ఇమిడివున్న ప్రతిపాదనలకు ఒప్పుకోరనీ, కొద్దివారాలలో కాంగ్రెసువారు ముఖాలు వేల వేసుకుని గాంధీగారి కాళ్ళమీద పడి, "నీవే మాకు శరణ్యం, నీవే దారి చూపాలి" అని వేడుకుంటారనీ, మళ్ళీ ఏ ప్రత్యక్ష్యచర్యకో పూనుకుంటేనే గాని బ్రిటిషువారు లొంగరనీ నేను అన్నాను.

నేను అనుకున్న ప్రకారమే వైస్రాయ్ పూనా తీర్మానాన్ని తిరస్కరించడమూ, కాంగ్రెసు హైకమాండ్‌వారు, "మీరే మాకు శరణ్యం, మీరే మాకు ఏకైక నాయకులు, మీరు కలుగజేసుకుని బాధ్యత వహించి దేశరక్షణమార్గం ఆలోచించాలి" అని కోరారు. నెల తిర క్కుండా పూనా తీర్మానం రద్దయి, బొంబాయి తీర్మానం అంగీక రించబడింది, అహింసాత్మక విధానమే శరణ్యం, మహాత్మా గాంధీయే మాకు ఏకైక నాయకుడు, ఆయనే తిరిగి దారి చూపించాలి అనే భావన అందులో ఉంది.

గాంధీజీ తాను చేయదలచిన పని నిర్దుష్టంగా అఖిల భారత కాంగ్రెసు కమిటీవారితో చెప్పేశాడు. యుద్ధం దినాలలో తాను శాసన ధిక్కార మనేది పెద్ద ఎత్తున ప్రజ లందరూ ఒక్కుమ్మడిని చేయ డానికి ఒప్పుకోననీ, వ్యక్తి సత్యాగ్రహాన్ని మాత్రమే ప్రోత్సా హిస్తాననీ, యుద్ధ సమయంలో అనుచితంగా జారీ చేయబడిన ఆర్డి నెన్సుద్వారా స్వేచ్ఛగా మాటలాడే హక్కు కూడా మానవులకు లేకుండా చేయబడిన కారణంగా ఈ ఆర్డినెన్సును ధిక్కరిస్తూ వ్యక్తి సత్యాగ్రహం చేయవచ్చుననీ ఆయన సూచించాడు.

ఆరంభంలో ఎవ్వరూ ఈ వ్యక్తి సత్యాగ్రహ మన్నది అంత బ్రహ్మాండంగా విజయవంతం అవుతుందని తలచలేదు. నేను అఖిల భారత కాంగ్రెసు కమిటీవారికీ, మహాత్మునికీ కూడా, ప్రజానీకం మీ ఆజ్ఞకు ఎప్పుడూ బద్ధులేనని చెప్పఉన్నాను. ఆ బొంబాయి తీర్మానాన్ని పురస్కరించుకుని వ్యక్తి సత్యాగ్రహం 1940 నవంబరులో ఆరంభ మయింది. ఈ దెబ్బతో మంత్రులుగానూ, శాసన సభా సభ్యులుగానూ,

నాయకులుగానూ, వినాయకులుగానూ ఉండే పెద్దలు, చిన్నలు అందరూ జెయిలు గోడల వెనకాలకు దారి చూసుకున్నారు.

## మళ్ళీ జెయిలుకి

నేను మొదట్లో డిసెంబరు ఆఖరుకి జైలుకు వెళ్ళాలని నిశ్చయించుకున్నా, తప్పని సరిగా నా అభిప్రాయాన్ని మార్చుకుని ఉద్యమాన్ని నడపడానికే ఉద్యుక్తుడ నయ్యాను. అందువల్ల మా రాష్ట్ర కాంగ్రెసువారి ఆదేశానుసారంగా మొదటి జట్టులోనే 1940 నవంబరు 26 న జెయిలుకు సిద్ధమయ్యాను.

లోగడ నేను ఆంధ్ర రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీ అధ్యక్ష పదవికి రాజీనామా ఇచ్చిఉన్నా రాబోయే సంఘటనల దృష్టితో, నన్నే తిరిగి రాష్ట్రీయ కాంగ్రెసు కమిటీకి అధ్యక్షుడుగా ఎన్నుకున్నారు. ఆ స్థానంలో 1937 జూలైలో రాజ్యతంత్రాన్ని చేపట్టే పర్యంతమూ ఉన్నాను. తిరిగీ జెయిలుకు వెళ్ళేలోపల, సుమారు తొమ్మిదిమాసాల పాటు, యావత్తు రాష్ట్రాన్ని పర్యటించి దానిని సరిఐనదారిలో పెట్టమని నన్ను కోరారు.

నేను రాష్ట్రం అంతా పలుసార్లు పర్యటించాను. ఆయా జిల్లాలలో స్వయంసమృద్ధి ప్రాతిపదికగా అనేక గ్రామాలలో నిర్మాణ కార్యక్రమం సాగించాను. పశ్చిమ గోదావరిజిల్లాలోని జోగన్న పాలెం లోనూ, ఆముదాల దిమ్మె అనబడే అనంతపురం జిల్లా గ్రామంలోనూ అలాంటి కార్యక్రమాలు ఆరంభించాను.

తతిమ్మా పది జిల్లాలలోనూ కూడా స్వయంసమృద్ధి పథకాలకు అనుగుణంగా ఉంటాయనుకున్న పల్లె లన్నింటినీ విమర్శనాత్మక దృష్టితో పరిశీలించాము. ఆయా గ్రామాల ఆర్థికాది పరిస్థితులనూ గమనించాము. నాతోడి వర్కర్లను అప్రమత్తతో ఉండమనీ, ఉద్యమం ఏ క్షణాన్నయినా ప్రారంభించబడవచ్చుననీ హెచ్చరిక చేశాను.

దక్షిణభారతంలో ఆంధ్రావనేగాక, తమిళ, కన్నడ, మలయాళ రాష్ట్రాలు కూడా ఇటువంటి స్వాతంత్ర్య సమరాలలో ఎప్పుడూ వెనకాడవన్న సంగతి నాకు తెలుసు.

వచ్చిన పిలుపును మన్నించి ఒకటి రెండుసార్లు కార్యనిర్వాహక సభకు హాజరయ్యాను. ఏ గ్రామంలో జరిగినా అఖిల భారత కాంగ్రెసు కమిటీ మీటింగుల కన్నింటికీ హాజ రయ్యాను. కాని మంత్రిగా నున్న రోజులలో ఏ మీటింగ్‌లోనూ నోరు విప్పి ఏ విధ మయిన ఉపన్యాసమూ ఇవ్వలేదు. పూనా మీటింగులో కూడా నేను మాటలాడలేదు.

కాని బొంబాయిలో నోరు విప్పక తప్పలేదు. గాంధీగారి పక్షాన నిలిచిన అయిదుగురికీ, వారికి వ్యతిరేకంగా అహింసాత్మక విధానానికి స్వస్తి చెప్పాలని తలచిన ఆ పదిమందికీ మధ్య ఉన్న అభిప్రాయ భేదాలు అసలెల్లా ఉత్పన్నమయ్యాయో గ్రహించాలని నిర్ణయించు కున్నాను. అందువల్లనే ఆ బొంబాయి మీటింగులో నోరు విప్పవలసి వచ్చింది.

## అహింసా విధానానికి రాజాజీ వ్యతిరిక్తత

పూనా మీటింగులోనూ అంతకు పూర్వమూ కూడా గాంధీగారు తమంతట తామే విరమించుకున్నారని తలచాను. కాని తరవాత నాకు గ్రాహ్యమైందేమిటంటే- ఆయన తన శక్తివంచనలేకుండా రాజగోపాలా చారి ప్రభృతులను కాంగ్రెసుకు గడచిన ఇరవై సంవత్సరాలుగా పట్టు గొమ్మగా ఉంటూన్న అహింసావిధానాన్ని ఆహూతి చేయవద్దని కోరా రనీ, అలాంటి క్లిష్టపరిస్థితులలో ఉద్యోగాది హోదాలమీద మమకారాలు పెట్టుకోవడం న్యాయం కాదనీ, బ్రిటిషువారు తమకు హోదా లిచ్చినా చేతులు కట్టీ, మూతులు బిగించి మరీ ఇస్తారనీ, ఎటొచ్చీ వారు జారీ చేసే ఆర్డరును కంటితో చూసి చేతితో సంతకం చెయ్యగల హక్కే- తమకు మిగులుతుందని వివరంగా చెప్పారనీ, ఇంత స్పష్టంగా పరి స్థితులు లెలా ఉండగలవో ఆలోచించి చెప్పినా, ఆ పదిమంది కార్య నిర్వాహకవర్గీయులు తాము గాంధీగారి కంటె తెలివయినవారమనే తలచారని. పూనాలో గాంధీగారు తనకు తానుగా విరమించుకోలేదనీ, తనపై తన అహింసాత్మక విధానానికి వ్యతిరేకంగా విశ్వాసరాహిత్య

తీర్మానంలాంటిదే ఆమోదించబడిందన్న భావనే ఆయన్ని బాధ పెట్టిం దని గ్రహించాను.

నా కీ విషయాలన్నీ బొంబాయి మీటింగుకు వెళ్ళిందాకా తెలియవు. గాంధీగారిని పూనా మీటింగులో కాదన్న ఆ పదిమంది పెద్దలే ఈ బొంబాయి మీటింగుకు ఆహ్వానకర్త లయ్యారు. అందువల్ల తర్జనభర్జన చెయ్యవలసిన అంశాలు అంతగా కనబడలేదు. బొంబాయి మీటింగులో గాంధీగారిని తిరిగి నాయకత్వం వహించమని కోరి, వారి అడుగుజాడలలోనే నడవాలి అన్న తీర్మానంపై మామూలు తర్జన భర్జనలూ, అవును కాదు అనే తర్క-వితర్కాలూ ఆ పదిమంది మధ్యనే జరిగాయి. ఈ తర్జనభర్జనలు జరుగుతూ ఉండగా, ఒకరు ఇటువంటి పరిస్థితి ఉత్పన్నం అవడానికి రాజగోపాలాచారిగారే కారకులని ఆయన్ని దుయ్యబట్టుకున్నారు. ఆ కారణంగా రాజగోపాలాచారిగారు జవాబు ఇస్తూ, తాను తన స్వంత అభిప్రాయాన్ని వ్యక్తపరిచాననీ, ఈ రోజున కూడా అహింసావిధానంపై తనకు నిజంగా సదభిప్రాయం లేదనీ, కాంగ్రెసు ఆ అహింసాత్మక విధానానికి స్వస్తి చెప్పడమే తన వాంఛ అనీ అన్నాడు.

## గాంధీగారికి నా హామీ

రాజగోపాలాచారిలాంటి వ్యక్తి అహింసావిధానంపై అట్టి అభిప్రాయం వెల్లడించినందుకు విచారిస్తూ, జనం హింసాత్మక విధానంవైపు మొగ్గుతున్నారని గ్రహించడాన్ని, నా మనోభావాన్ని వ్యక్తం చెయ్యడం న్యాయమని తలచాను. ముందుగా నేను మాటలాడు తానని గాని, మాటలాడవలసి వస్తుందనిగాని నేను భావించలేదు.అయినా, నాటి సభాధ్యక్షుడు నన్ను ఆఖరి ఉపన్యాసకునిగా నిర్ణయించాడు. అందరి సభ్యుల అభిప్రాయాలను గ్రహించిన తరవాత మాటలాడగలగడం ఒక సదవకాశంగానే భావించాను.

దక్షిణ భారతదేశంలో ఉన్న పరిస్థితుల నన్నింటినీ ఆ బహి రంగోపన్యాసంలో వివరించాను. మనలోనే ఉన్న పంచమాంగ దళం వారి చర్యలు కూడా వివరించాను. గాంధీగారిని ఎప్పుడూ దక్షిణ

హిందూదేశం విస్మరించలేదనీ, వారి అహింసాత్మక విధానంపట్ల ఎప్పుడూ సుముఖమేననీ, వారి అడుగుజాడలలో నడుస్తూ వారు ప్రారంభించిన, ప్రారంభించబోయే ఏ విధమయిన శాసన ధిక్కార కార్యక్రమానికయినా జోహారు లర్పిస్తూ, దక్షిణ దేశవాసులు సర్వదా సన్నద్ధులేననీ చెప్పాను. భాషాప్రయుక్త రాష్ట్రాల నన్నింటినీ సహకార నిరాకరణ ఉద్యమ ప్రారంభాలనుంచీ క్షుణ్ణంగా ఎరిగి ఉన్నవాడననీ, నేను మంత్రిత్వహోదాలో పర్యటించిన రోజులలో ఆ రాష్ట్ర ప్రజల హృదయాలను పూర్తిగా అవగాహన చేసుకున్నానని, గాంధీగారి అడుగుజాడలలో నడుస్తూ, ఆయన ఆరంభించే అన్ని ఉద్యమాలలోనూ, ఆయన వెంట ఉండడానికి వా రెప్పుడూ తయ్యారనీ నొక్కి వక్కాణించాను.

ఇల్లా చెప్పినప్పుడు నా దృష్టిలో కేవలం ఆంధ్రదేశ మొక్కటే లేదు. ఈ రాష్ట్రంలోని భాషావిభాగాలన్నీ నా ఎదుట నిలచాయి. మాలో మాకు ఉత్పన్నమయిన అంతఃకలహంలాంటి భేదాభిప్రాయ పరిస్థితులలో ఇచ్చిన ఈ నా ఉపన్యాసం దేదీప్యమానంగా వెలిగింది.... *

ఈ సందర్భంలో ఇంత మాత్రమే దీనిని గురించి చెప్తాను. అది అయినా గాంధీగారికీ, ఆయన విశ్వాస పాత్రులయిన ఆ అయిదుగురు అనుచరులకూ రాజగోపాలాచారిగారు తన స్వకీయమైన అభిప్రాయభేదాన్ని ఎల్లా వ్యక్త పరిచారో గ్రహించడానికే. ఆ అభిప్రాయాన్ని అనుసరించి, ఆయన కార్యనిర్వాహక సంఘ సభలోనూ, ఒక ఉద్యమం ఆరంభించడానికి సన్నాహ మవుతూన్న కాలంలోనూ, మేము జెయిళ్ళకు వెళ్ళాకా కూడా ఎల్లా మమ్మల్నీ, దేశాన్నీ చికాకుల్లో ముంచెత్తాడో గ్రహించడంకూడా న్యాయం.

## భావే ఎన్నికకు నాయకుల అభ్యంతరాలు

బొంబాయి తీర్మానంపట్ల రాజగోపాలాచారిగారి మనస్సులో ఉన్న అనిష్టత ఆ విధంగా వ్యక్తం అయింది. గాంధీగారి ప్లానుప్రకారం

---

* ఈ ఉపన్యాసం ఆఖరుపేజీలో 'ఎపెండిక్స్' కింద ముద్రింపించ దలచారు.

ఆరంభంకానున్న వ్యక్తి సత్యాగ్రహం, ఆ వ్యక్తి సత్యాగ్రహం వినోబా భావే గారి నాయకత్వాన ఆరంభించడం రాజగోపాలాచారికి ఎంత మాత్రమూ ఇష్టంలేదు. వార్ధాలో జరిగిన కార్యనిర్వాహక వర్గ సభకు నేను ప్రత్యేక ఆహ్వానంపై వెళ్ళాను. ఆ సభలో గాంధీగారు తాను అవలంబించ దలచిన కార్యక్రమ పద్ధతినంతా వివరించారు. ఈ యుద్ధ సమయంలో వ్యక్తి సత్యాగ్రహాన్నేగాని, సమష్టిసత్యాగ్రహాన్ని వాంఛించను అని ఆయన అన్నప్పుడు, ఆయన అభిప్రాయాన్ని అంగీకరించ డానికి వెనుకాడిన వారు కేవలం ఇరువురు మాత్రమే కనబడ్డారు.

వినోబా భావే నాయకత్వాన ఈ వ్యక్తి సత్యాగ్రహాన్ని ఆరంభించ నున్నానని గాంధీగా రనేటప్పటికి పెద్ద కలకలమే బయల్దేరింది. కొంతమందికి ఆయన ఎవరో తెలియదు. ఆయనకూ ఈ రాజకీయా లకూ ఉన్న సంబంధం ఏమిటో అసలు ఎవ్వరికీ తెలియదు. అందువల్ల ఆయన చేతిమీదుగా ఈ ఉద్యమం ఆరంభంకావడం అన్యాయమన్నారు. ఎన్నో త్యాగాలుచేసి జెయిళ్ళకు వెళ్ళిన హేమాహేమీ లనేకులుండగా ఈయన మీ కెక్కడ దొరికా డన్నారు. కాంగ్రెసు అధ్యక్షులుగానూ, కార్యనిర్వాహకవర్గ సభ్యులుగానూ సేవ చేసిన వారెవరూ పనికి రాలేదా అని అడిగారు. వినోబా భావేను మొదటి సత్యాగ్రహిగా నిశ్చయించే టప్పటికి, గాంధీగారి అనుంగు శిష్యులూ, సదా ఆయన్ని అంటిపెట్టు కుని ఉండేవారూ, ఆ అయిదుగురూ కూడా అదేం పనండీ అని అడిగారు.

గాంధీగారు, ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటని రాజ గోపాలాచారిగారిని అడిగితే, అసలీ కార్యక్రమమే అదోలా ఉందనీ, దేశీయు లెవ్వరూ దానిని ఆమోదించరనీ, ఈ ఉద్యమం పూర్తిగా నేల మట్టం అవుతుందనీ ఆయన అన్నాడు. నేను మాత్రం, మరేం ఫరవా లేదన్నాను. కార్యనిర్వాహకవర్గ సభ్యునిగా వారందరితోనూ కలిసి మెలిసి పనిచేసి ఉన్నందువల్ల, ఆ సభ్యులందరి ముందూ గాంధీగారితో అల్లా అనడానికి సాహసించాను. "ఇప్పటికి ఇరవై సంవత్సరాలుగా ఈ దేశానికి స్వాతంత్ర్యం సంపాదించాలని తమరు అన్నివిధాలా పాటుబడుతున్నారు. మీ యందూ, మీ పద్ధతియందూ అభిప్రాయ

భేదమున్నవారితో గూడా మీరు నెట్టుకొస్తూనే ఉన్నారు. అందువల్ల ఏ సందర్భంలో ఏ ఉద్యమం ఎల్లా ఆరంభించాలో తమకు బాగా తెలుసు. మీ ఉద్యమాలన్నీ ఎప్పుడూ ఉన్నత స్థాయిని అందుకుంటూనే ఉన్నా" యన్నాను.

"నా ఉద్దేశంలో ఈ ప్రస్తుత ఉద్యమం ఈ యుద్ధసమయంలో స్వరాజ్య సంపాదనకోసం లేవదీసింది కాదనీ, భారతదేశానికి స్వాతంత్ర్య మివ్వ నిరాకరించిన కారణంగా, వారికి- ఆ బ్రిటీషువారికి- వారి చర్యలకూ కేవలం సవాలుగానే ఈ ఉద్యమం ప్రారంభించ బడింది గనుక భారతదేశం తన మార్గం తాను చూసుకోగల శక్తికి ఆంగ్లేయుల అడ్డును నామమాత్రంగా సడలించడానికీ, భారతీయుల అనుమతీ, అంగీకారమూ అన్నవి లేకుండా ఈ యుద్ధాన్ని తీసుకువచ్చి వారి నెత్తిన రుద్దడంచేత కేవలం సవాలుగా నడుపబడే ఈ ఉద్యమం పట్ల, ఎవరికి ఎలాంటి అనుమానమున్నా, నాకేమీ లే"దన్నాను.

## అభ్యంతరాలకు గాంధీజీ జవాబు

వినోబా భావేను ప్రప్రథమ వ్యక్తి సత్యాగ్రహిగా తాను నిర్ణయించిన సందర్భంలో వచ్చిన అభ్యంతరా లన్నింటినీ గాంధీగారీవిధంగా సమాధానమిచ్చారు: "నేను వినోబా భావేను ఎన్నుకొనడానికి ముఖ్య కారణం ఆయన స్వయంగా అహింసావాది. నా తర్వాత నా స్థానాన్ని ఆక్రమించగల సమర్థుడు ఆయనే. ఈ ఇరవై సంవత్సరాలూ ఆయన నిర్మాణాత్మక కార్యక్రమంలో మునిగి తేలుతున్నాడు."

కార్యదర్శి కృపాలనీ అన్నాడు: "వినోబా భావే మనలో ఎవరితోనయినా సమానంగా కీర్తి ప్రతిష్ఠలు సంపాదించి ఘనతకు ఎక్కి ఉండును. ఆయన విషయం ఎందువల్లనో ఇంతవరకూ గాంధీగారు పట్టించుకోని కారణంగా ఆయన అల్లాగే తనకు నిర్దేశింపబడిన కార్యాన్ని సక్రమంగా నిర్వహిస్తూ కాలక్షేపం చేస్తూన్నాడు. ఈపట్టున గాంధీగారు ఆయన విషయం పట్టించుకున్నారు కాబట్టి, ఆయన కీర్తి ప్రతిష్ఠలు దేశీయులు గ్రహించ గలుగుతారు."

గాంధీగారు వినోబా భావే తరవాత జవహర్‌లాల్ నెహ్రూ గజ్జ కడతా డన్నారు. అక్కడ చేరినవారి కెవ్వరికీ గాంధీగారి మనస్సులో ఉన్నదేమిటో తెలియదు. ఆయన కార్యక్రమం ఆయనకే తెలియాలి. ఎవరి తరవాత ఎవ్వరో, ఎప్పుడు ఎవ్వరికి పిలుపు వస్తుందో ఏమీ అర్థంగాని అయోమయ స్థితిలోనే సభ్యు లందరూ అలా ఉండి పోయారు.

## గాంధీ అనుయాయుల అనుమానాలు

కొన్నాళ్ళపాటు ఈ ఉద్యమ విజయాన్ని గురించి అనేక అనుమానాలు వ్యక్తపరుపబడ్డాయి. ప్రభుత్వంవారు ముందు జాగ్రత్త కోసమని, సత్యాగ్రహం చెయ్యబోతున్నాడు గనుక జవహర్‌లాల్ నెహ్రూను అరెస్టు చేస్తున్నామని చెప్పి, ఆయన్ని నిర్బంధంలోకి తీసుకున్నారు. నాలుగు సంవత్సరాల శిక్ష విధించ బడింది.

ఆ మర్నాడు పత్రికలలో ఒక స్టేట్‌మెంట్ వెలువడింది. అందులో నెహ్రూ తరవాత గాంధీగారి ఆశ్రమవాసులు ఇరవై నలుగురు సత్యాగ్రహం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారని తెలుపబడింది. ఈ ప్రకటన ఇంకా అనుమాస్పదమై, బహుశః "ఈ ఉద్యమం ఇంతటితోనే" అనికూడా కొంద రనుకున్నారు.

గాంధీగారికి అతి సన్నిహితులూ, ముఖ్యులూ, ఆత్మీయులూ అనుకున్నవా రెవ్వరికీ గాంధీగారి హృదయం అర్థం కాలేదు. చిత్తరంజన్‌దాస్, లాలా లజపతిరాయ్‌వంటి ప్రముఖులు కూడా గాంధీగారి హృదయం చాలా లోతయినదనీ, దానిని ఎప్పుడూ ఆయన విప్పిచెప్ప రనీ, కార్య నిర్వాహక సభ్యులకుగూడా ఆయన హృదయం అర్థం కాదనీ, వారితోకూడా మనస్సు విప్పి తన అభిప్రాయం ఎప్పుడూ చెప్ప లేదనీ వివరించారు. ఈ పట్టునకూడా గాంధీగారి అనుచరులకూ, ఆయనతో కలసి మెలసి పనిచేసే వారి కెవ్వరికీ కూడా ఆయన హృదయం అర్థం కాలేదు.

బయల్దేరిన పుకార్లలో, ఈ తడవ ఆయన నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్న వారిని తప్ప, రాజకీయ రంగంలో నిమగ్న

లయిన కాంగ్రెసువారి నెవ్వరినీ ఈ రంగంలోకి రానివ్వడని చెప్పుకో సాగారు. కొందరు సన్నిహితులూ, కార్య నిర్వహణ దక్షులూ అయిన వారి నోట విన్న వార్తలు ప్రజా హృదయాన్ని ఇంకా కుంగదీశాయి. ఈ ఉద్యమం యావత్తూ ఒక చిన్న టపాకాయిలా టప్పుమని ఎగిరి పోతుందన్నారు. ఆ అఖిల భారత చరఖా సంఘంతో సంబంధంవున్న వాళ్ళు - ఆ వడికేవాళ్ళూ, నేసేవాళ్ళూ, ఉద్యమాన్ని తుస్సుమనిపించక పోతే వేరే ఏం చెయ్యగల రన్నారు. ఎప్పుడూ గాంధీగారి విధానం అట్లాగే ఉంటుంది. కాంగ్రెసు శాసన సభ్యులనూ, మంత్రులుగా పని చేసిన పెద్దలనూ జెయిళ్ళకు పంపించే లోపల ఆయన ఇటువంటి తమాషాలే చేస్తాడన్నారు. ఆశ్రమవాసులతోపాటు అఖిల భారత కాంగ్రెసు కమిటీ మెంబర్లను కూడా జత చెయ్యడం ఆరంభించారు

# 15

## వివాదం గురించి వివాదం

**ఎ. ఐ. సి. సి.** అంటే భారతదేశపు ఉద్యోగేతర కాంగ్రెసు ప్రజాప్రతినిధి సభ (Un official congress parliament) అన్నమాట!

వివిధ రాష్ట్ర కాంగ్రెసు కమిటీలవారు పంపించిన జాబితాలను జాగ్రత్తగా పరిశీలించి, ఆ జాబితాలనుండి సరిఅయిన, తనకు కావలసిన వ్యక్తులను ఎన్నుకుని గాంధీగారు ఉద్యమం సాగించాడు.

మేము 1941 నవంబరు 24 న బందరులో రాష్ట్ర కాంగ్రెసు కమిటీ మీటింగు జరిపాము. ఆ మీటింగులో మన ఆంధ్రరాష్ట్రానికి సంబంధించినంతవరకూ, దినానికి నలుగురయిదుగురికంటె ఎక్కువగాని పద్ధతిగా ఈ సత్యాగ్రహం సాగించడానికి పదకం వేసుకున్నాము. ఆ అయిదుగురూ తలో జిల్లా, తలో తాలూకాకీ చెందేవారుగా ఉండేవారు. మేము బందరులో కలిసే లోపల, అయ్యదేవర కాళేశ్వరరావు గాంధీ

గారిని కలుసుకుని, మేము నడపబోయే ఉద్యమ విషయాలు ఆయనతో సంప్రదించి అవసరమగు సలహాలు తీసుకున్నారు.

అప్పటికే గాంధీగారు జాగ్రత్తగా ఆలోచించి, ఈ ఉద్యమంలో పాల్గొని జెయిళ్ళకు వెళ్ళదలచే సత్యాగ్రహులు ఉచ్చరించవలసిన నినాదాలు నిర్ణయించి, సర్వ సన్నద్ధంగా తన పథకాన్ని రూపొందించి ఉంచాడు. గాంధీగారు ఎంచిన నినాదాలు చిన్నవిగానూ, బోధనాత్మకంగానూ, సార్థకమై పనికివచ్చేవిగానూ ఉన్నాయి. గాంధీగారి వినూత్నాభిప్రాయం ప్రకారం, ఏ వ్యక్తీ తనకు ఇచ్చవచ్చిన రీతిని ఏవేవో వాగుతూ ఆషామాషీగా వ్యవహరించకూడదనీ, అందరూ అచ్చున పోసినట్లు ఒకే విధమయిన మాటలూ, పాటలూ, నినాదాలూ చేస్తూ ముందుకు నడవాలనీ, ఐడియాలకు వ్యక్తినీ, వ్యక్తికి ఐడియాలనూ పిన్నుచేసి పారేశాడు. ఈ దెబ్బతో ఆయన ఆంగ్లేయులకే కాదు, ప్రపంచవాసులందరికీ తనకు కాంగ్రెసులో ఉన్న పలుకుబడిని, తనయందు ప్రజలకున్న అఖండిత విశ్వాసాన్నీ, ప్రజలలో ఉండే కట్టుబాట్లనీ, క్రమశిక్షణనూ చవి చూపించాడు.

అంత పెద్ద ఉద్యమంలో అంత చిన్న చిన్న నినాదాలా ఉచ్చరించడం అని కూడా ఎందరెందరో తలచారు. కాని గడచిన ఇరవై సంవత్సరాలుగా దేశీయులూ, కాంగ్రెసువారుకూడా తమ ఏకైక నాయకుని ఆజ్ఞలను తు. చ. తప్పకుండా నడుచుకునే విధానాన్ని బాగా అలవరచుకున్నారు. అటువంటి పరిస్థితులలో గాంధీగారు తప్ప అన్యులెవ్వరూ దేశాన్ని ఒక్క మాటమీదా, ఒకే త్రాటిమీదా నడపలేరనీ, గాంధీగారిని కాదని ఏ వ్యక్తీ కూడా, ఇంకోరకంగా కార్యక్రమం నిశ్చయించగలిగినా, ముందుకు ఒక్క అడుగు కూడా వేయలేడనీ దేశీయులందరూ మనస్ఫూర్తిగా నమ్మేవారు.

## రాజాజీ అపహస్యం, పోటీ నినాదాలు

దక్షిణ భారతదేశం ఎప్పుడూ సందిగ్ధ పరిస్థితిలో పడిపోవడం మామూలయింది. ఏ కారణాలవల్ల నయితేనేం, అది ఒక సందిగ్ధ పరిస్థితికి లోనయ్యింది. రాజగోపాలాచారిగారి కారణంగానే ఎప్పుడూ

ఆంధ్రదేశం అల్లా సందిగ్ధ పరిస్థితులలోకి జారిపోయేది. రాజగోపాలా చారిగారు గాంధీగారి అహింసా విధానంమీద పూనా సభలో చేసిన స్వారీ విషయం చెప్పేఉన్నాను. దర్మిలా గాంధీగారి నినాదాలను అపహాస్యం చేశారు. రాజగోపాలాచారిగారి దృష్టిలో గాంధీగారు నిర్దేశించిన నినాదాలు అర్థరహితమయినవి.

అందువల్ల వాటికి బదులుగా ప్రతిప్రాంతంలోనూ ఉన్న యుద్ధ కమిటీ సభ్యులకు, ఉత్తరాల పూర్వకంగా, యుద్ధ నిధులను సేకరించవలదనీ, యుద్ధానికి జనాన్ని ప్రోత్సహించి జవాన్లను ఎంచుకోవద్దనీ, తాము ఆ కమిటీనుంచి విరమించడం ఉత్తమమనీ సలహా సూచకంగా ఉత్తరాలు వ్రాయమన్నాడు. గాంధీగారి నినాదాలకు బదులుగా వ్రాయవలసిన ఉత్తరాలు ఎల్లా ఉండాలో ముసాయిదా తయారు చేశాడు.

మా కార్యదర్శి అయ్యదేవర కాళేశ్వరరావు వార్ధానుంచి తిరిగివచ్చి సంగతి సందర్భాలు చెప్పేదాకా, నవంబరు 23 న వార్ధాలో ఏం జరిగిందీ మాకు తెలియదు. గాంధీగారి నినాదాలకు బదులు, రాజగోపాలాచారిగారు తయారుచేసిన ముసాయిదా ఉత్తరమూ, అందులో వ్రాయబడిన విషయాలన్నీ మాగంటి బాపినీడుగారు సంపాదించిన నకలువల్ల మాకు తెలియవచ్చాయి. ఆ ఉత్తరం చాలా పెద్దది. హేతువాదాత్మకంగా ఉంది. విసుగు పుట్టించేదిగా కూడా ఉంది. జరిగిన గ్రంథమంతా తెలియకపూర్వం బాపినీడుగారు తీసుకువచ్చిన ఉత్తరాన్ని చూసి, రాజగోపాలాచారిగారు గాంధీగారికి వ్యతిరేకంగా, ఆయన్ని కాదని ఈ ఉత్తరాన్ని వ్రాసి ఉండడనే తలుస్తూ ఉండడాన్ని, సత్యాగ్రహం చేసే వారందరూ ఆ ఉత్తరానికి నకళ్లు వ్రాసుకోవడంలో నిమగ్నులయి పోయారు. మర్నాడు నేను గాంధీగారి నినాదాల నకళ్ళు చూశాను.

## గాంధీగారి మందలింపు

కళా వెంకట్రావు వార్ధాలో గాంధీగారిని, రాజగోపాలాచారిగారి ముసాయిదా ఉత్తరాన్ని గురించి అడిగాడట. ఆ ఉత్తరానికీ, గాంధీ

గారి నినాదాలకీ పొంతనం కుదరక పోవడాన్ని, ఆయనకు అల్లా అడ్డ గాలని బుద్ధి పుట్టిందట. రాజగోపాలాచారి తెలివయిన వాడయితే అయి ఉండవచ్చుగాని, నా సూచనలను ఇల్లా తయ్యారు చెయ్యడం మాత్రం తగని పనేనని గాంధిగా రన్నారట! ఈ విషయంలో రాజగోపాలాచారి గారికి తాను వ్రాసిన ఉత్తరం గాంధీగారు వెంకట్రావుకు చూపించారట. కాగా, గాంధీగారు తన నినాదాలనే ప్రతి సత్యాగ్రహి ఉచ్చరించాలనీ, అల్లా జరిగేటట్లుగా చూడమనీ వెంకట్రావుతో చెప్పారట. ఈ సంగతులన్నీ బందరులో వెంకట్రావు నవంబరు 24 న చెప్పినప్పుడు, నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. మేము నిజంగా రాజగోపాలాచారిగారి ఉత్తరాన్నే పట్టుకుని కూర్చుంటే చాలా పెద్ద తప్పే చేసినవారమై ఉండేవారం. వెంకట్రావే గనుక గాంధీగారి దగ్గరకు వెళ్ళి సంగతి సందర్భాలు గ్రహించి ఉండకపోతే, కథ అడ్డంతిరిగి, ఆచారిగారు మా చేత ఆడకూడని నాటకం ఆడించి ఉండేవాడు. వెంకట్రావు నిజంగా చాలా శక్తిసామర్థ్యాలు గల వ్యక్తి. ఆయన మొదటినుంచీ మేము చేస్తూన్న పనులనన్నింటినీ క్షుణ్ణంగా గ్రహించిన వ్యక్తి.

ఏ విధమయిన మార్పు లేకుండా ప్రతి సత్యాగ్రహీ గాంధీగారి నినాదాల్నే వాడాలని మా కార్యనిర్వాహకవర్గంలో నిశ్చయించు కున్నాము. అప్పుడే, ఆ సభలోనే నేనూ మొదటి జట్టుతోనే నవంబరు 26 న సత్యాగ్రహంలో పాల్గొనాలని నిశ్చయించాను. నేను డిసెంబరు ఆఖరువరకూ బయటే ఉండాలను కుంటున్నానని వెంకట్రావు గాంధీ గారితో చెప్పినప్పుడు, ఎంత త్వరగా సత్యాగ్రహంలో పాల్గొంటే అంత మంచిదని ఆయన సూచించినట్లు వెంకట్రావుద్వారా వినడాన్ని, వెంటనే ఆ మొట్టమొదటి జట్టుతోనే సత్యాగ్రహం చేద్దామని నిశ్చయించు కున్నాను.

నేనూ, వెంకట్రావూ కలసి ఆ రాత్రే బందరునుంచి బయల్దేరి నవంబరు 25 ఉదయానికి పట్నం చేరుకున్నాము. నేను ప్రభుత్వ కార్యదర్శికి వ్రాసిన ఉత్తరం వెంకట్రావే సహాయంగా తీసుకువెళ్ళి ఆయనకు అందజేశారు. అందు నేను ఆ మర్నాడు, అనగా నవంబరు

26 న తంబుచెట్టి వీధిలో సత్యాగ్రహం ప్రారంభించ నున్నానని తెలియ జేశాను. తంబుచెట్టివీధి హైకోర్టుకు ఎదురుగా ఉన్న వీధులలో ఒకటి.

### గిరిగారికి రాజాజీ అభ్యర్థన

గాంధీగారి వద్దనుంచి ఉత్తరం రాగానే రాజగోపాలాచారిగారు వార్ధా పరుగెత్తాడు. అక్కడ గాంధీగారి నినాదాల్నిగురించి, దానికి ప్రత్యామ్నాయంగా తాను వ్రాసిన ఉత్తరం గురించీ తర్జన భర్జన జరిగింది. రాజగోపాలాచారిగారు తన ఉత్తరం ఆయన నినాదాలకంటె మంచిదని, అది యావత్తు భారతదేశానికి వర్తించే విధంగా వ్రాయ బడిందనీ వాదించారు గాని, గాంధీగారిని తన అభిప్రాయాన్ని అంగీ కరించేలా చేయలేకపోయాడు.

రాజగోపాలాచారిగారు వెనక్కి బయల్దేరాడు. అదే రైలులో ఢిల్లీ నుంచి పట్నం వస్తూన్న గిరిగారు ఉండడం తటస్థించింది. అల్లా కలిసి ప్రయాణం చేస్తూన్న సందర్భంలో గిరిగారూ, రాజగోపాలాచారి గారూ మాట్లాడుకోవడానికి అవకాశం కలిగింది. ఆ మాటలలో ఆయన గిరిగారితో తనకూ గాంధీగారికీ మధ్య నడచిన గ్రంథమంతా చెప్పాడు. తన పద్ధతికి గాంధీగారు ఎల్లా ఒప్పుకోలేదో వివరించాడు. తాను గాంధీ గారితో గట్టిగా వాదిస్తే ఆయన రక్తపుపోటు ఎక్కడ అధికం అవుతుందోనన్న భీతితో ఎక్కువగా వాదించలేదని చెప్పాడు. గాంధీగారి నినాదాలకంటె తన ఉత్తరమే మేలుగా వ్రాయబడిన కారణాన్ని, తన పద్ధతినే గిరిగారంగీకరించడం న్యాయమని అభ్యర్థించాడు.

### గిరిగారి సమాధానం

గిరిగారప్పుడు, గాంధీగారి కార్యక్రమానికి వ్యతిరేకంగా తానెప్పుడూ నడవననీ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీవారి సూచనలూ, దానికి అధ్యక్షుడయిన టంగుటూరి ప్రకాశం పంతులుగారి సూచనలూ తానెప్పుడూ వ్యతిరేకించననీ స్పష్టం చేశారు.

గిరిగారు నవంబరు 25 ఉదయానికి పట్నం వచ్చారన్న సంగతి ఆ రాత్రి చాలా పొద్దుపోయిందాకా నాకు తెలియదు. నవంబరు 26 ఉదయాన్నే నేను గిరిగారిని వారి ఇంటివద్దనే కలుసుకుని, ఆయన

సత్యాగ్రహం చేసే పద్ధతిలో గాంధీగారిని నినాదాల్నే వాడవలసిందనీ, నేను ఆ నినాదాల్నే ఉచ్చరిస్తూ ఆనాడే ఉదయం 11 గంటలకు తంబు చెట్టి వీధిలో సత్యాగ్రహం చేయనున్నాననీ చెప్పాను. అప్పుడు గిరిగారు తానూ, రాజగోపాలాచారిగారూ కలిసి ప్రయాణం చేసిన సంగతీ, దారిలో ఆయనగారికీ, తనకూ మధ్య నడచిన సంభాషణంతా నాతో చెప్పారు.

గిరిగారు నేను సత్యాగ్రహం చేస్తూన్న సమయంలో అక్కడే, నా పక్కనే ఉన్నారు. తరవాత ఆయన ఇతర మిత్రులతో కలిసి మేజస్ట్రేట్ కోర్టుకూ వచ్చారు. ఆ తరవాత వెంటనే ఉన్న జైలులో నన్ను వెల్లూరు జెయిలుకు పంపడంకూడా గిరిగారూ, ఆయన మిత్రులూ పూర్తిగా గమనించారు.

## ఆఖరి మాటగా ఉత్తరం

రాజగోపాలాచారిగారు గాని, డా॥ సుబ్బరాయన్ గాని—ఉభయులూ పట్నంలోనే ఉన్నా—నన్ను కలిసికోలేదు. నేను జెయిలుకు వెళ్ళాక, తిరిగీ రాజగోపాలాచారిగారు గిరిగారిని కలిసి, ఆంధ్రులు ఎంత మాత్రమూ మంచివారు కాదనీ, గిరిగారయినా తనమాట విని, గాంధీగారి నినాదంకంటె తన ఉత్తరమే శ్రేష్ఠమని గ్రహించి, తాను సూచించిన ప్రకారం నడవడం ఉత్తమమనీ మళ్ళీ ఒకసారి చెప్పడం జరిగిందని తెలిపింది. రాజగోపాలాచారి గారెంత జెప్పినా గిరిగారు మాత్రం ఒప్పుకోలేదు. అప్పుడు, గాంధీగారి నినాదంలోని ఆఖరి రెండు పంక్తులయినా విడిచిపెట్టడం న్యాయమని రాజగోపాలాచారిగారు చెప్పారట. ఆఖరి వాక్యాలలో, హింసాత్మకమయిన అన్ని యుద్ధాలనూ అహింసాత్మకంగానే ఎదుర్కోవాలని ఉంది. రాజగోపాలాచారిగారి వాదన గిరిగారు ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. ఇంకా కాదూ కూడదూ అంటూ ఆయన వదలిపెట్టకుండా ఉంటే, "సరే, మీరు చెప్పిన విషయం జాగ్రత్తగా ఆలోచించి సాయంత్రం మీకే సంగతీ వ్రాస్తా"నని చెప్పి గిరిగారు అప్పటికి ఆ గొడవ తప్పించుకుని, ఆ సాయంత్రం ఆయన పేర ఉత్తరం వ్రాశారు.

గిరిగారు ఆ ఉత్తరంలో తాను ఎన్నో రకాల వ్యాపార సంబంధ మయిన తగాయిదాలను అహింసాత్మకంగా ఎల్లా సర్దుబాటు చేయగలి గిందీ వివరిస్తూ, గాంధీగారి నినాదాన్ని ఎందువల్ల విస్మరించాలో తనకు అర్థంగావడం లేదనీ, అందులో ముఖ్యంగా ఆ ఆఖరివాక్యాలు అహింసా ప్రబోధకంగా ఉండగా వాటిని వదలివేయడంలో అర్థం లేదనీ స్పష్టంగా వ్రాసేశారు.

ఆ మర్నాడే గిరిగారు సత్యాగ్రహం చేసి, శిక్షను పొంది, వెల్లూరు జెయిలుకు వచ్చి నన్ను కలుసుకున్నారు. ఆ సందర్భంలో గిరి గారు తనకూ, రాజగోపాలాచారిగారికీ మధ్య మళ్ళీ జరిగిన గ్రంథం అంతా చెప్పారు. గిరిగారు నాతో చెప్పిన విషయాల సారాంశమే పైన వ్రాశాను. చదువరులకు ఇలాంటి విషయాలన్నీ చెప్పడంలో నాకో ఉద్దేశం వుంది. ఈ విషయాలన్నీ గ్రహించందే తిరుచురాపల్లి జెయిలులో జరిగిన ఉదంతం చదువరుల కర్థం కాదు. అందువల్లనే ఇవన్నీ చెప్పాను. మా శిక్షాకాలమంతా తిరుచీ జెయిలులోనే గడచింది. ఒక్క మొట్టమొదటి మాసంలోనే నేను వెల్లూరు జెయిలులో వున్నాను.

# 16

# జెయిల్లో గ్రూపు రాజకీయాలు

**1940** నవంబరు 26 న నేను వెల్లూరు జెయిల్లో ప్రవేశించేసరికి, అక్కడ 'ఏ' క్లాసులో, మంత్రిగా పనిచేసిన డా॥ టి. ఎస్. ఎస్. రాజన్, తిరుచీ మ్యునిసిపల్ చెయిర్మనూ- ఎం. ఎల్. ఏ. అయిన పి. టి. తేవరూ వున్నారు. వారు ఉభయులూ తిరుచీ ప్రాంతానికి చెందిన వారే. ఇరువురూ అక్కడే సత్యాగ్రహం చేశారు. ఆ ఇరువురిలో శ్రీ తేవరు మొదటివాడు. డా॥ రాజన్ మాత్రం గాంధీగారి సూచనలకు వ్యతిరేకంగా రాజగోపాలాచారిగారి పదకం ప్రకారం వ్రాయబడిన ఉత్తరాలను "వార్ కమిటీ" మెంబర్లకు అందచేయడంద్వారా సత్యాగ్రహులయ్యారు.

1930 ఉప్పుసత్యాగ్రహ దినాలలోలాగే ఇప్పుడూ డా॥ రాజన్ రాజగోపాలాచారిగారి ఆజ్ఞలనే పాటించారు. 1930 లో రాజగోపాలా చారిగారు తంజావూరు జిల్లా వేదారణ్యంలో ఉప్పుసత్యాగ్రహ సమరం ప్రారంభించారన్న సంగతి చదువరు లెరిగివున్నదే. శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతికూడా అదే ప్రకారంగా రాజాజీగారి సూచనలను అనుసరించి, యుద్ధ సంఘ సభ్యులకు ఉత్తరాలు అందజేసి జెయిలుకు వచ్చింది. అదేప్రకారం రాజాజీగారి ఉత్తరువులనే పాటిస్తూ జెయిలుకు వచ్చిన తమిళులు చాలామంది వున్నారు. వారు, గాంధీగారి నినాదాల సంగతి ఎరిగో ఎరగకో తెలియదు గాని, రాజాజీగారి ఆజ్ఞలను పాలించారు.

## రాజాజీ పట్టు

లోగడ చెప్పినట్లు, బాపినీడుగారు నవంబరు 23, 24 తేదీలలో బందరుకు తీసుకువచ్చిన ఉత్తరాలకు నకళ్ల ద్వారా రాజగోపాలాచారి గారి లేఖలు ఆంధ్రుల చేతులలోకి రహస్యంగా వెళ్ళాయి. డా॥ రాజన్, శ్రీమతి రుక్మిణీలక్ష్మీపతి గాక ఇంకా చాలామంది తమిళులు రాజాజీ ఆజ్ఞలనే పాలించడమూ, గిరిగారిని ఎల్లాగయినా తనవైపు తిప్పుకోవాలని రాజాజీ చేసిన ప్రయత్నమూ మున్నగునవి చూస్తే, గాంధీగారు తన కార్యక్రమాన్ని అంగీకరించక పోయినా, గాంధీగారి సూచనలకు వ్యతిరేకంగా రాజాజీగారు ఏ విధంగానయినా తన పద్ధతి ప్రజలలో ప్రచారం కావాలనీ, తన పద్ధతే అందరూ అంగీకరించాలనీ అనేక విధాల ప్రయత్నం చేస్తూన్నట్లు కనబడింది.

ఆ సంగతి రాజాజీ స్వయంగా 1940 డిసెంబరులో సత్యాగ్రహం చేసినప్పుడు పూర్తిగా తేలిపోయింది. ఆయన తన ఉత్తరాలనే యుద్ధ సంఘ సభ్యులకు స్వయంగా యిచ్చి, తన్మూలకంగానే సత్యాగ్రహి అయ్యారు. రాజాజీ గిరిగారిని అధమం గాంధీగారి నినాదంలోని ఆఖరు పంక్తినయినా వదలమని మరీ మరీ బలవంతం చేయడం గమనిస్తే, వారికి అహింసాత్మక విధానంలో విశ్వాసం లేదనీ అర్థం అవుతోంది. అహింసాత్మక విధానంలో రాజాజీకి ఎంత నమ్మిక లేదో, గాంధీగారికి అంత ఎక్కువగా నమ్మకం వుంది. రాజాజీ, గాంధీగారి

అహింసా విధానానికి అనుగుణంగా నడుచుకోలేకే, గాంధీగారి నినా దాన్ని ఉచ్చరించ నిరాకరించడమూ, దానిని ఉచ్చరించవలదని ఇత రులను బలవంతం చెయ్యడమూ జరిగింది.

## ఒకరివెంట ఒకరు

ఇటువంటి మనఃప్రవృత్తితోనే రాజగోపాలాచారిగారు సత్యా గ్రహ కాండ జరిపి, 1940 డిసెంబరులో వెల్లూరు జెయిలుకు వచ్చారు. మేము వెల్లూరు జెయిలులో ఒక నెల మాత్రమే కలసివున్నాము. ఉభయ శాసన సభల తాలూకు కాంగ్రెసు సభ్యులు అనుదినం ఒకరివెంట ఇంకొకరు అల్లా జెయిలుకు వస్తూన్న పరిస్థితిని గ్రహించిన రాజాజీ, గాంధిగారి శాసన ధిక్కార పదక ప్రభావాన్ని గ్రహించి ఆశ్చర్య పోయాడు.

ఒకరోజు నాతో ఆయన, ఎం.ఎల్.ఏ. లు కొందరు జెయిలుకు రావడం గమనించిన కారణంగా, "నీవు అన్ని రకాలవాళ్లనీ తీసుకు వస్తున్నా" వన్నారు. హరిజన ఎం.ఎల్.ఏ. లు ఏ ఒక్కరూ మినహా యింపు లేకుండా అంతా జెయిలుకు వచ్చారు. ఇది కేవలం ఆంధ్రుల విషయంలోనే గాదు నేను అంటున్నది- తమిళులు, మలయాళీలు, కన్నడిగులు ఎందరెందరో జెయిళ్ళకు వచ్చారు. వారూ అధిక సంఖ్యా కులుగానే వచ్చారు.

తమ శారీరక, ఆర్థిక, మానసిక స్థితులను గమనించకుండా, తమ తమ ఇక్కట్లను లెక్కచేయకుండా ఎం.ఎల్.ఏ. లూ, అఖిల భారత కాంగ్రెసు కమిటీ మెంబర్లూ, ఏ ఒకరిద్దరో మినహాగా అంతా, సత్యాగ్రహ సమరంలో పాల్గొని, జెయిళ్లకు రావడం చూపిన నాకు, వారి అఖండిత దేశభక్తినీ, వారి రకరకాల త్యాగాలనూ తలచి, మనస్సు ఉప్పొంగి పోయింది. శ్రీ వెంకటప్ప నాయుడు, శ్రీ పి. వీరభద్రస్వామి, కందుల వీర రాఘవస్వామి (బారెట్ లా), అనంతపురం హరిజన ఎం.ఎల్.ఏ. వేదారప్ప, మలబారుకు చెందిన చందూ, ఇంకా వందలూ వేలూను. ఎన్ని పేర్లని వ్రాయగలను?

అందులో చందూ చెయ్యి గూడుతప్పి వుంది. తనకి లభించిన సేవతో, మేము ఇప్పించగల వైద్యసహాయంతో, తాను తీసుకున్న వ్యాయామాది నియమాలతో అతడు తన శిక్షాకాలం కులాసాగానే గడిపాడు.

## మేజస్ట్రేట్ల చిత్తం, మా భాగ్యం

ఈ సమర సందర్భంలో శిక్షాధికారం పూర్తిగా మేజస్ట్రేట్ల వశం అవడాన్ని, వారి చిత్తం వచ్చినట్లు వ్యవహరించారు. శాసన సభా సభ్యుల విషయంలో, మేజస్ట్రేట్ల చిత్తమే వారి భాగ్యమయింది. ఒక తీరూ, ఒక తెన్నూ లేకుండా కొందరికి 'ఏ' క్లాసు, కొందరికి 'బి', మరికొందరికి 'సి' మేజస్ట్రేట్లు తమ ఇష్టానుసారం ఇవ్వడం జరిగింది. అనంతపురం ఎం.ఎల్.ఏ. కల్లూరు సుబ్బారావు, తంజావూరు హరిజన ఎం. ఎల్. ఏ. నాయనారు, తూర్పుగోదావరి జిల్లావాసి లక్ష్మణస్వామి, విశాఖపట్నం హరిజన ఎం. ఎల్. ఏ. సాకేటి గురువులు మున్నగు వారంతా 'బి' క్లాసుకు మార్చబడేదాకా 'సి' క్లాసులో ఉండేవారు. దర్మిలా, వారిని 'బి' నుంచి 'ఎ' కి గూడా మార్చడం జరిగింది.

ఏ క్లాసు ఆయనకు ఇచ్చారో తెలియని కారణంగా, మంత్రిగా ఉండిన బెజవాడ గోపాలరెడ్డిని మూడవ తరగతి రైలు పెట్టెలో ఎక్కించారు. సేలం జిల్లా బోర్డు అధ్యక్షుడుగా ఉంటూన్న ఎం. ఎల్. ఏ. మాచియప్ప గౌండరు కూడా వెల్లూరు జయిలుకు 'క్లాసు' నిర్ణయం లేకుండానే వచ్చాడు. కల్లూరు సుబ్బారావుని 'బి' క్లాసుకు మార్చినా, ఆయన్ని మళ్ళీ ఎందుకో 'సి' కి మార్చడముతో, 'సి' క్లాసు ఖైదీగా రెండు వారాలు గడచిన తర్వాతగాని తిరిగి ఆయన్ని 'బి' క్లాసుకు మార్చకపోవడమూ జరిగింది. శ్రీ నాయనారూ, లక్ష్మణస్వామీ మూడు వారాలపాటు 'సి' క్లాసులో ఉన్నా, 'బి' క్లాసుకు మార్చబడ్డారు.

చాలా మంది రాష్ట్ర శాసన సభ్యులనూ, అనంతశయనం అయ్యంగారూ, తిరుమలరావూ వంటి కేంద్ర శాసన సభ్యులనూ 'బి' క్లాసులో ఉంచారు. గ్రంథి వెంకటరెడ్డి నాయుడూ, ఎమ్. సుబ్బారావూ,

కందుల వీర రాఘవస్వామి, కె. వెంకటస్వామినాయుడు (మాజీ మదరాసు మేయరు), రాఘవమేనోన్ వగైరాలకు ప్రారంభంలో 'ఎ' క్లాసు ఇచ్చినా, వారిని 'బి' క్లాసులోకి మార్చారు. ఆ రోజులలో వెల్లూరు జెయిలుకు సంబంధించినంతవరకూ మిగిలిన 'ఎ' క్లాసు ఖైదీలను 'సి' క్లాసులోకి ఎప్పుడయినా వెళ్ళమంటారేమోననే అనుమానం మాకందరికీ ఉండేది.

మామూలు ప్రపంచక జ్ఞానం ఉన్న ఏ వ్యక్తి అయినా, ప్రభుత్వపు తీరు తెన్నులనూ, పద్ధతులనూ గ్రహించి ఉంటే, చట్టనిర్మాణం చేయగల వ్యక్తులను ఏ ప్రకారంగా చూడాలో అర్థమయి ఉండేది. కాని కాంగ్రెసు ప్రభుత్వంలో పనిచేసి ఉన్నా, మేజిస్ట్రేట్లలో కొంతమందికి ఆ మాత్రపు ప్రపంచ జ్ఞానం కూడా లేకుండాపోయింది. గవర్నరుగారికి గాని, వారి సలహాదారులకుగాని ఖైదీలకు ఎ, బి, సి, క్లాసులు నిర్ణయించబడుతూన్న విధానంపట్లగాని, శాసన సభ్యులనేకాదు- మాజీ మంత్రులను కూడా జెయిలు అధికారులు చూస్తూన్న విధం పట్లగాని ఏ విధమయిన శ్రద్ధా, పట్టింపూ లేకుండా పోయాయి. మాజీ మంత్రులూ, శాసన సభ్యులూ, అఖిల భారత కాంగ్రెసు కమిటీ మెంబర్లూ మున్నగు సత్యాగ్రహుల గతి ఏమయినా ఈ గవర్నర్లకూ, వారి అడ్వయిజర్లకూ చీమ కుట్టదు. అవును, ఎందుకు కుట్టాలి? జెయిల్లో మళ్ళీ జెయిలు అన్నట్లు మాజీ మంత్రులను కూడా రాత్రి ఆరు గంటలూ, ఉదయం ఆరు గంటలా మధ్య లాకపులో ఉంచినా వారికి పోయిందేమీ లేదు. అటువంటప్పుడు మామూలు ఎం. ఎల్. ఎ.లు, ఎ.ఐ.సి.సి. మెంబర్లూ అల్లా రాత్రి తెల్లవార్లూ, సాయంత్రం ఆరునుంచి ఉదయం ఆరువరకూ లాకప్పులోని లాకప్పుతో సతమత మవుతేనేం? ఇది వారి రాజ్యాంగ విధానమేగా!

## తలకి చుమురు ప్రశ్న

మొదట్లో మేము జెయిళ్ళకు వెళ్ళగానే, మా సంఖ్య చాలా తక్కువగా ఉంటూన్నంత కాలమూ, మమ్మల్ని మా గదులలో మూసి పెట్టేవారు. జెయిలులో మావి ఒకే వరుసలో ఉన్న గుహలలాంటి

గదులు. మెదలడానికి జాగాగాని, పీల్చుకోవడానికి పరిశుభ్రమయిన గాలి గాని మాకు లభ్యం అయ్యేదికాదు. మేము అల్లా ఆ మూసిపెట్టే సెల్సులో ఉంటూన్న రోజులలోనే, ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ కాంట్రాక్టర్ (Mr. Contractor) జెయిలు పరిశీలించడానికి వచ్చాడు. కొంతమంది 'బి' క్లాసు ఖైదీలు తలకు రాసుకోవడానికి నూనె సప్లయి చేయించవలసిందని కోరారు. ఆయన, ఫెడీలన "నేను మీ కాంగ్రెసు ప్రభుత్వపు ఉత్తరువులనే అనుసరిస్తున్నా" నన్నారు. ఆ దెబ్బ వచ్చి తిన్నగా మా ముఖాలకే తగిలింది. రాయికంటె కూడా ఘనంగా దెబ్బ తీసే వేళాకోళం లాంటి వెక్కిరింత అది. డా॥ రాజన్ మాజీ జెయిళ్ళ మంత్రి. ఈ సత్యాగ్రహం సందర్భంగా జెయిలుకు వచ్చినప్పుడు, మన కంటిని మన వేలుతోనే పొడుస్తున్నాడు చూశావా అన్నాను. మేమక్కడికి స్వయంకృతాపరాధఫలం అనుభవించడానికి వెళ్ళాం (we have gone there to stew in our own juice).

మా కాంగ్రెసు గవర్నమెంటు కూడా కొన్నికొన్ని సందర్భాలలో జస్టిస్ పార్టీ వారి విధానాలకంటె అధమంగా వర్తించిన సందర్భాలున్నాయి. జెయిళ్ళ పరిపాలనా విధానాలలో మా పద్ధతి చాలా అనుచితంగానే ఉండేది. కొంతకాలం జెయిలు అనుభవాలను పొందిన మీదటనే మేము రాజ్యాంగాన్ని చేపట్టాం. అందువల్ల జెయిళ్ళల్లో రాజకీయ ఖైదీలుగా మేము అనుభవించిన కష్టసుఖాలన్నీ మాకు తెలుసు. నిజానికి ఖైదీలు కూడా జీవించవలసిందే గనుక, మేము కొన్ని క్రొత్త నిబంధనావళులనూ, మార్పులనూ ఖైదీల విషయంలో న్యాయంగా తీసుకురావలసి ఉంది.

## మాజీ మంత్రిపై విసురు

రాజకీయ ఖైదీలకు తలకు చమురు ఇవ్వడం విషయంలో కాంగ్రెసు ప్రభుత్వంవారు ఏమని ఆర్డరు వేశారో నాకు తెలియదు. కాని ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ ప్రిజన్స్ కాంట్రాక్టర్ చమురు సప్లయికి కాంగ్రెసు ప్రభుత్వం వారిని కోరినప్పుడు, 'మానవుడు బ్రతకడానికి

చమురు అక్కరలేదు' అనే మిషతో వారి కోరిక తిరస్కరించబడిందని తెలిసింది.

మా కంటె ముందుగానే జెయిలుకు వచ్చిన శ్రీనివాసరావనే ఒక వ్యక్తి, వెల్లూరు జెయిలులో ఉన్న ఆ మొదటి వారం పదిరోజుల లోనే, కాంట్రాక్టర్‌గారి విసురును డా॥ రాజన్‌గారి ముఖంమీదికి విసర గల అవకాశం లభించింది. శ్రీనివాసరావేమన్నాడంటే, "తమరు ఇన్‌స్పెక్టర్-జనరల్ ఆఫ్ ప్రిజన్స్‌గా కాంట్రాక్టర్‌గారు చేసిన సూచ నను జెయిళ్ళ మంత్రిగా తిరగతోడారు. బహుశః మీరు, మీ జీవిత పర్యంతమూ, ఒక పాతిక సంవత్సరాలపాటు, మంత్రిగానే ఉంటా మని తలచి ఉంటారు. పాపం, ఇప్పుడు తమరు ఏర్పరచిన రూల్స్ ప్రకారమే రాజకీవితో బ్రతకడానికి వచ్చారు" అన్నాడు.

నేనూ కాంగ్రెసు గవర్నమెంటులో మంత్రినే అయినా ఈ విషయాలతో జరుగుతున్న దేమిటో నాకు తెలియదు. ఈ ప్రశ్న అందరి మంత్రుల అభిప్రాయాలూ సేకరించిన తరవాతనే తేల్చవలసి ఉంటుం దని తలచబడి ఉండలేదు. అయినా, కాంగ్రెసు ప్రభుత్వం వారి ప్రతి చర్యకు మంత్రుల మందరమూ సమానంగా బాధ్యత వహించవలసి ఉందిగదా! ఈ తడవ లభించిన వెల్లూరు జెయిలు జీవితంలో మొదటి పదిరోజులలో మాకు కలిగిన అనుభవం ఇది. దర్మిలా, మమ్మల్ని మాకు అలవాటయిన ఆ పాతకొట్లలోకే మార్చారు.

## బధిర శంఖ న్యాయం

తిరుచురాపల్లిలో గత పది మాసాలలోనూ మాకు కలిగిన అను భవాలను గురించి చెప్పే ఉన్నాను. ఆరంభంలోనే డా॥ రాజన్, శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి, రాజగోపాలాచారి మున్నగువారు గాంధీ గారి నినాదాలను గాక రాజాజీగారి పద్ధతిని ఉత్తరాలు ఆయా యుద్ధ సంఘ సభ్యుల కందజేసి జెయిళ్లకు వచ్చారని మనవిచేసే ఉన్నాను. అనగా ఒకరి ఆజ్ఞ ప్రకారంగా గాక, వారి ఇష్టానుసారంగా, వారు కోరుకున్న విధంగా వారు జెయిళ్ళకు వచ్చారన్న మాట! వారి ప్రచారం జెయిళ్ళలో కూడా సాగింప నారంభించారు. ఈ ఉద్యమం

విఫలమయిందనీ, జనులు నిష్కారణంగా, ఏ ఒక్క క్రియాసాధనకూ పూనుకోకుండా, ఊసుబోక జెయిళ్ళకు వెళ్లారనీ అన్నారు.

జెయిళ్ళలో ఎటువంటి ప్రచారం జరిగినా, బయటకు వెళ్లేవారికి, రాజాజీ గ్రూపు వారెట్టి ప్రబోధం చేసిఉన్నా, ఆ ప్రబోధమంతా చెవిటి వాడిముందు శంఖమే అయింది. బయటకు వెళ్ళిన వారంతా వారు ఇచ్చే స్టేట్ మెంట్లు ద్వారానూ, ఉపన్యాసాల ద్వారాను- గాంధీగారినే మనస్ఫూర్తిగా అనుసరించాలి, వారి విధానాలే మనకు శరణ్యాలు అని చెప్పే వారు.

ఇది రాజాజీకి చాలా చికాకునీ, తలవంపునూ కలుగజేసింది. ఆయన బాధపడసాగాడు. ఆయన నాతో అన్నాడు కూడా. "ఏమిటి, బయటకు వెళ్ళినవాళ్ళకి బుద్ధీ, జ్ఞానం ఉన్నాయా లేదా? అదేమిటి, వాళ్ళంతా ఎవరికి తోచినట్లుగా వారు మాట్లాడుతున్నా"రని, పాపం, వాపోయాడు. వల్లభ్‌భాయ్ పటేల్‌గారి ఉపన్యాసాన్ని చదివిన రాజాజీ, "ఏమిటిది? వల్లభ్‌భాయ్ పటేల్ కూడా ఇల్లా కలవరపడుతున్నాడేమి" టన్నాడు.

## డా॥ రాజన్ స్టేట్ మెంట్

జెయిళ్ళనుంచి బయటకు వెళ్ళిన వారంతా అనుసరిస్తూన్న పద్ధతులను గ్రహించయినా, వారంతా గాంధీగారినే ఆదర్శంగా పెట్టుకున్న పరిస్థితిని గ్రహించయినా, రాజాజీ, డా॥ రాజన్ వగైరాలు తమ అభిప్రాయాలను మార్చుకుంటా రనుకున్నాను. కాని విడుదల అయిన వెంటనే డా॥ రాజన్ ఇచ్చిన స్టేట్ మెంట్ చూస్తే ఆశ్చర్యం వేసింది. ఈ పెద్దమనిషి జెయిలు బయటకూడా, రాజాజీకి అనుగుణంగా, కలతలూ, కలవరపాట్లు తీసుకు రాదలచాడా అని తలచాను.

డా॥ రాజన్ స్టేట్ మెంట్‌లో మేము తిరిగి రాజ్యాంగాన్ని చేపట్టమని లేదు. పైగా ఆయన ఏదో సందిగ్ధంగానూ, అషామాషీగానూ అన్నదేమిటో తెలుసా? "ఏది ఎల్లా జరిగినా, మనం గాంధీగారిని వ్యతిరేకించ కూడదేమో!" అన్నాడు. ఆ స్టేట్ మెంట్‌ను పూర్తి చేస్తూ చిట్టచివరి వాక్యంగా ఆయన, "అయినా ఈ ఉద్యమం కొత్త

మార్గం తొక్కితే బాగుంటుంది'' అన్నాడు. అంటే, ఆ వాక్యానికి ఏవిధంగా నయినా అర్థం చెప్పుకోవచ్చు నన్నమాట' అంతేగాని, తిరిగి రాజ్యాంగాన్ని చేపట్టమని మాత్రం ఆ వాక్యానికి అర్థం కాజాలదు.

వ్యక్తి సత్యాగ్రహం చాలదు. సమష్టి సత్యాగ్రహాన్ని చేబట్టాలనీ అర్థం చెప్పుకోవచ్చు. కాని ఆయన అంతరంగంలో, తిరిగి అందరమూ, "మేము, మీ యుద్ధం విధానాలతో సహకరిస్తాం" అని ఆంగ్లేయులకు హామీ ఇచ్చి, మళ్ళీ రాజ్యాంగాన్ని చేపట్టి, మంత్రిత్వం మొదలైన హోదాలలోకి పోవాలని ఉన్నట్టు స్పష్టం అవుతోంది.

డా॥ రాజన్ స్టేట్‌మెంట్‌ను బాగా పరిశీలిస్తే, రాజాజీకి- గాంధీగారి దగ్గరకు వెళ్ళి, వారిని ఒప్పించడానికి శాయశక్తులా తంటాలు పడి, ప్రస్తుతం నడుస్తూన్న ఉద్యమం ఎంత "నిరర్థకంగా" తయారయిందీ తెలియపరచి, ఆయన్ని ఇంకా బలమయిన పద్ధతిని. తీవ్రమయిన శాసన ధిక్కార విధానానికి, అంటే సమష్టి సత్యాగ్రహానికి, పూనుకునేటట్లు చేయాలని ఉన్నట్టు కనబడుతుంది. అందువల్ల, తిరిగి రాజ్యాంగాన్ని చేపట్టాలని ఉన్నట్టు అది అర్థాన్ని ఇవ్వకపోయినా, మనమంతా సర్దార్ శార్దూలసింగును అనుకరిస్తూ, గాంధీగారిని సవాల్ చేయాలన్న భావం ఆ స్టేటుమెంట్‌లో పూర్తిగా ఉన్నట్టు ప్రపంచ ప్రజలకు అనిపించగలదని అనక తప్పదు.

# 17

## ఆకాంక్ష

ఇల్లో నడిచింది నా చరిత్ర. ఈ 'నా జీవిత యాత్ర' ద్వితీయ, తృతీయ ఖండాలలో నేను దేశంలో రాజకీయంగా జరిగిన పోరాటాలలో ఎల్లా ఎల్లా పాల్గొని ఏయే మార్గాల దేశసేవ చేయడానికి మనోవాక్కాయాల ప్రయత్నించానో, పుట్టింది బీదల ఇళ్ళల్లోనూ- పెరిగిందీ అక్కడే అయినా, ప్రజల నుంచి లాయరుగా సంపాదించిన

లక్షలాది ధనం, తిరిగి ఆ ప్రజల సుఖసంతోషాలే వాంఛిస్తూ, దేశమాత దాస్యశృంఖలాలను ఛేదించి ఆమెను సంపూర్ణ స్వాతంత్ర్య వాయువులలో ఉయ్యాల లూగించాలనే తలంపుతో రాజకీయ సమరంలో నిస్వార్థంగా ఖర్చుపెట్టి, మళ్ళా ఎల్లా ఏమిలేనివాడనే అయ్యానో చదువరులు గ్రహించే ఉన్నారు.

నా జీవితమంతా దేశం కోసమూ, దేశీయుల కోసమూ విని యోగపడడమేగాక, 'ఆంధ్ర అంటే ప్రకాశం, ప్రకాశం అంటే ఆంధ్ర' అన్న నా నమ్మిక ముందు ముందు నా జీవితంలో ఎల్లా నిర్ధారణ అయ్యిందో, గాంధీగారికే నామాలు పెట్టాలని ప్రయత్నించిన రాజగోపాలాచారి ప్రభృతులు, స్వాతంత్ర్య సంపాదన అనంతరం, నేను ప్రధాన మంత్రిగా ఉండే సందర్భంలో ఎల్లా అందరూ కలిపి నన్ను పదచ్యుతుణ్ణి చెయ్యాలని ప్రయత్నించారో, ఎందువల్ల నేను కర్నూలును రాజధానిగా నిర్ణయించానో, వగైరా విషయాలన్నీ టూకీగా పాయింట్లలాగే వ్రాయగలననీ, వాటిని గూడా చాలావరకూ ఈ పుస్తకంలోనే అచ్చయ్యేలా చూస్తాననీ, వాటి నన్నిటినీ, అల్లా జరుగుతూన్న సందర్భాలను జరుగుతూన్న చరిత్రగా రూపొందించడం నాకు సాధ్యంగాకపోయినా ఆ లోటు, దరిమిలాని, మిత్రులూ, అభిమానులూ, అనుచరులూ అయినవారు తీర్చి, ఈ 'నా జీవిత యాత్ర'కు అనుబంధంగా ప్రచురించి తీరతారనీ నా నమ్మిక. ఈ విధంగా ఈ ఖండాన్ని ముగిస్తూ, తరువాయి గ్రంథానికి వస్తాను.*

**తృతీయ ఖండం సమాప్తము**

---

* పంతులుగారి స్వీయకథనం ఇంతటితో ముగిసింది. వారు పాయింట్లుగా ఉటంకిద్దామనుకున్న విషయాలు గాని, ఆ 'తరువాయి గ్రంథం' గాని వ్రాయడం జరగలేదు. పంతులుగారు రాశించినట్టుగానే, ఆ లోటును భర్తీచేసే భాగ్యం శ్రీ తెన్నేటి విశ్వనాథముగారికి కలిగింది. వారి రచనను ప్రకాశం పంతులుగారి 'నా జీవిత యాత్ర'కు అనుబంధ సంపుటిగా సంతరించడమైంది.—సం॥

# నా జీవిత యాత్ర

టంగుటూరి ప్రకాశం

చతుర్థ ఖండము

(అనుబంధ సంపుటి)

తెన్నేటి విశ్వనాథం




ఎమెస్కో ప్రచురణ - 208




యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్టణం . మద్రాసు . సికింద్రాబాద్

NAA JEEVITA YATRA—Vol. IV
—Anubhandha Samputi
(Supplementary Volume to the
Autobiography of Andhra Kesari
Prakasam pantulu)
By
TENNETI VISWANATHAM

Publishers :
M. SESHACHALAM & CO.

First Edition :
August 1972

Cover Design :
BAPU

Printers :
KRANTI PRESS, Madras-1.

Distributors
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
RASHTRAPATHI ROAD, SECUNDERABAD

Price Rs. 2-50

Four volumes bound in one hard cover edition Rs. 15/-




208

# నా జీవిత యాత్ర

## (అనుబంధ సంపుటి)

———

# పాఠకులకు విజ్ఞప్తి

—: o :—

**1937, 1946, 1953** సంవత్సరములలో - ప్రకాశంగారి మంత్రివర్గ సమయంలో జరిగిన కార్యములు చెపుతున్నప్పుడు, కొన్నిచోట్ల 'నేను ఇది చేశాను,' 'అది చేశాను' అని వ్రాయడం జరిగింది. ప్రకాశంగారి పరిపాలనా సమయంలో జరిగిన దానికి నేను నిమిత్తమాత్రుణ్ణి. మూలకారణం ప్రకాశంగారే. అందు చేత ఆ విషయాలు ప్రకాశంగారి జీవిత చరిత్రలో వ్రాయవలసి వచ్చింది. అంతేకాని- నా ఉపజ్ఞను, కార్యజ్ఞతనుగూర్చి వ్రాసి కొనేందుకు మాత్రం కాదు.

మరొక్క విషయం — నేను వ్రాసింది అనుబంధ గ్రంథము. ప్రకాశంగారు - రెవిన్యూ శాఖామాత్యులుగా, చెన్న రాష్ట్ర ప్రధానామాత్యులుగా, ఆంధ్రరాష్ట్రపు ప్రథమ ముఖ్య మంత్రిగా ఉన్నప్పుడు జరిగిన పరిపాలనా సంబంధ మయిన విషయాలు మాత్రం ఇందులో కలవు. రెవిన్యూ మంత్రిగాను, తర్వాత ముఖ్యమంత్రిగాను ఆయన ఉన్న కాలంనాటి కాగి తాలు చాలమటుకు చెన్నపట్నంలోనే మిగిలి పోయాయి. హైదరాబాదు నేషనల్ ఆర్కైవ్జ్‌లో కొన్ని మాత్రమే కలవు. **1953-54** సంవత్సరముల కాగితాలు అంధ్రప్రదేశ్ ప్రభుత్వ వశంలోనే ఉన్నాయి. అయినా - వాటికి ఇండెక్సు, రిజిష్టరులు లేకపోవుటచేత, ఆ రికార్డులు అసలు చూడలేక పోయాను. చాలామటుకు జ్ఞాపకం మీదనే ఆధారపడి వ్రాశాను. రికార్డులు దొరికినప్పుడు మరొక ముద్రణావసరమున పొరబాటులు సవరించడానికి యత్నిస్తాను.

లోటుపాట్లు చదువరులు మన్నించెదరు గాక!

23-6-1972

తెన్నేటి విశ్వనాథం.



'నవ్యాంధ్ర జనకుడు"

# 1

# 1937 లో శాసన సభ ఎన్నికలు

మొందటి కాంగ్రెసు మంత్రివర్గం గురించి, అనగా—1937 జూలై పధ్నాలుగవ తేదీ లగాయితూ 1939 సెప్టెంబరు వరకూ రాజాజీ ఆధ్వర్యాన నడచిన ఉమ్మడి చెన్నరాష్ట్రి రాజకీయాలను గురించి సరిగా అవగాహన చేసికొనేటందుకు 1937 ఫిబ్రవరిలో జరిగిన జనరల్ ఎన్నికల విషయమై కొంత చెప్పవలసి ఉంది.

1921 లో కాంగ్రెసువారు ప్రకటించిన శాసన సభా బహిష్కార సూత్రంలో 1923 ఫిబ్రవరినుంచి క్రమంగా మార్పు వచ్చిన విషయం పాఠకులకు విదితమే. 1934 లో గాంధీజీ కాంగ్రెసు మూలసభ్యత్వం నుంచి విరమించుకోవడం, ఆ సంవత్సరం కేంద్ర శాసన సభ ఎన్నికలలో కాంగ్రెసు పార్టీని ఎన్నో రాష్ట్రాలలో అఖండ విజయం సాధించి కేంద్ర శాసన సభలో ప్రధానమైన ప్రతిపక్షంగా ఏర్పాటు కావడంకూడా పాఠకులకు తెలిసినవే. ఈ కారణంచేత కాంగ్రెసువారి దృష్టి శాసన సభలపైన గట్టిగా పడింది. ఇంతేకాక, 1927 మొదలు 1930 వరకు, తర్వాత 1934 నుండి అప్పటివరకు శాసన సభా కార్యక్రమంలో ప్రతిపక్షంగా కాంగ్రెసు నాయకులు చూపిస్తూ వచ్చిన చురుకుదనాన్ని బట్టికూడా స్వరాజ్య సంపాదనకు శాసన సభలు ప్రధాన ద్వారా లన్న అభిప్రాయం అందరికీ కలిగింది.

ఇలా ఉండగా, 2-8-1935 వ తేదీన ఇంగ్లీషు పార్లమెంటులో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా బిల్లు, ఆక్టుక్రింద పాస్ అయి ఉండెను. ఈ ఆక్టుక్రింద, కేంద్ర ప్రభుత్వంలో, ప్రజలకు ఏవిధమైన అధికారమూ సంక్రమించక పోయినా, రాష్ట్రాలకు ఏర్పాటు చేసిన విషయాలలో మాత్రం కొంత స్వాతంత్ర్యం ఇవ్వబడింది. (దీనికే ఆ రోజులలో

రాష్ట్రీయ స్వపరిపాలన [ప్రొవిన్షియల్ అటానమీ] అనే నిర్వచనం ఉండేది.) ఈ కారణాలవల్ల ఆ ఆక్టుక్రింద జరగబోయే ఎన్నికలలో కాంగ్రెసువారు పాల్గొని జయం సాధించవలెనన్న నిశ్చయం ఒకటి అందరి పెద్దలకూ ఏర్పడింది. ఎటువచ్చీ ఎన్నికలలో గెల్చిన తర్వాత మంత్రి పదవులను స్వీకరించాలా, వద్దా అన్న విషయంపై మాత్రం కొంత సందేహం కలిగింది. ప్రకాశంగారు, సాంబమూర్తిగారు, నేను మొదలైనవారం మంత్రి పదవులను అవకాశమున్నచోట తప్పక కాంగ్రెసువారు ఏర్పాటు చేయాలన్న అభిప్రాయంలో ఉండేవాళ్ళము. పై స్థాయిలో జవహర్‌లాల్ నెహ్రూ, మన ఆంధ్రస్థాయిలో డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు మొదలైనవారు ఎన్నికలలో పాల్గొనవచ్చు గాని, మంత్రి పదవులను స్వీకరింపరాదన్న అభిప్రాయంలో ఉండేవారు. దీనికి కారణం—పూర్వ కాలంలో మోస్తరుగా మంత్రి పదవి, బ్రిటిష్ గవర్నమెంటువారు ఇచ్చేదనీ, అది మనం స్వీకరిస్తే ధర్మంక్రింద స్వీకరించి నట్టవుతుందనీ వారు భావించడమే.

నేను లక్నోలో 1936 లో జరిగిన ఏ.ఐ.సి.సి. సమావేశంలో ఉత్తరార్ధమందు, మంత్రిపదవి స్వీకరించక కేవలం ప్రతిపక్షంగా కూర్చుని ఉన్నట్లయితే, - ఏ సమయంలో ప్రభుత్వం ఏర్పాటుచేసే మంత్రివర్గంతో సహకరించాలో, ఎప్పుడు సిద్ధాంతానికి వ్యతిరేకంగా తప్పటడుగు వేయవలసివస్తుందో తెలియక కాంగ్రెసు పార్టీవారు కలవరపడే స్థితిలో ఉండడమేకాక, వారి దృష్టి చెడిపోయే అవకాశం ఉంటుందనీ; బలం ఉండి ప్రతిపక్షంలో కూర్చున్నట్లయితే సముద్రం ఒడ్డున ఇసుకపైన పంట పండించడానికి ప్రయత్నించే విధంగా వృథా ప్రయాస అవుతుందనీ; అందుకు తార్కాణంగా 1927 మొదలు 1930 వరకు చెన్నరాష్ట్ర శాసన సభలో కాంగ్రెసువారు చేసిన అపక తవక లన్నిటినీ ఉదహరించి ఏ.ఐ.సి.సి. సభ్యుల మనస్సులను పదవీ స్వీకరణమే మంచిదనేటట్లు మార్చడం జరిగింది. అయినా, అది రాబోయే డిసెంబరులో కాంగ్రెసు సాంవత్సరిక సభలో అంగీకారం పొందవలసి ఉండినది. ఈ లాగుననే, ఆంధ్రరాష్ట్రంలో జరిగిన ఆంధ్ర

మహాసభలలో కూడా ఒక నిర్ణయానికి రాగలిగితిమి. ఆ కారణంచేత ఆంధ్రప్రాంతంలో ఎన్నికల వాతావరణం జయసూచకంగానే ఉండినది.

ప్రకాశంగారు లోగడవలెనే రాష్ట్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షులుగా ఉండేవారు. చెన్నరాష్ట్రం ఉమ్మడిరాష్ట్రం కావడంచేత ఆంధ్ర, తమిళ, కేరళ, కర్నాటక భాగాలన్నిటిపైనా యాజమాన్యంగల ఒక ప్రత్యేక ఎన్నికల సంఘాన్ని నాలుగు రాష్ట్రాల కాంగ్రెసు అధ్యక్షులతో ఏర్పాటు చేయడమైనది. ఈ ప్రత్యేక సంఘానికి ఒక్క చెన్నపట్టణ నియోజక వర్గాల విషయంలోనే బాధ్యత ఉండినది. రాష్ట్రంలోగల ఇతర ప్రాంతాలలో రాష్ట్రసంఘంవారి ఏర్పాట్ల ప్రకారమే అభ్యర్థులను నిర్ణయించుకోవడం జరిగింది.

## ప్రకాశంగారి అభ్యర్థిత్వము

1907 లో బారిష్టరు వృత్తి నారంభించినది మొదలు అప్పటి వరకు - అంటే ముప్ఫై సంవత్సరాలుగా ప్రకాశంగారు చెన్ననగర నివాసి కావడంచేత, ఆయన చెన్నపట్టణానికి ఏర్పడైన నియోజక వర్గంలో అభ్యర్థిగా ఉండగలరని మా అందరి ఊహ. అలాగే నియోజక వర్గంలోని నగరవాసులూ ఊహించారు. అయితే ప్రత్యేక సంఘంలో తమిళ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులైన సత్యమూర్తి అనే ఆయన మొదటినుండీ తెలుగువారికి చెన్నపట్నంలో ఏవిధమైన పలుకుబడీ ఉండకూడదని ఒక గట్టి అభిప్రాయం గలవారు. అందుచేత, ప్రకాశంగారు గోదావరి జిల్లా నియోజక వర్గంలోంచి వస్తే బాగుంటుందని ఆయన ప్రకాశంగారి పేరు చెన్నపట్నం నియోజక వర్గం అభ్యర్థుల జాబితానుంచి తప్పించారు. ప్రకాశంగారు ఇది తెలిసి "ఇలా ఎందుకు జరిగిం"దని అడిగితే, బాబు రాజేంద్రప్రసాద్‌గారి కోరికపై ఇలా చేయడమైందని సత్యమూర్తిగా రన్నారు. అది కేవలం అభూత కల్పనగా ఉందని ప్రకాశంగారికీ, మాకూ కూడా తోచి, రాజన్‌బాబు గారిని ఈ విషయమై అడిగాము. వారు దాంతో తమకు ఏ విధమైన ప్రసక్తి లేనట్టు చెప్పారు.

అయినప్పటికీ, ప్రకాశంగారి అభ్యర్థిత్వం విషయమై నియోజక వర్గంలో అభ్యంతరాలు ఉన్నాయనీ, దాని తుది నిర్ణయం కేంద్ర కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డువారికి వదిలి వేయాలని ఆ ప్రత్యేక కమిటీవారు తీర్మానించుకొన్నారు. రాష్ట్రం అంతా అభ్యర్థుల్ని నిలబెట్టే అధికారం, పలుకుబడీ కలిగిన ప్రకాశంగారి అభ్యర్థిత్వం విషయం లోనే అనుమానం ఏర్పడిన పరిస్థితి కలిగింది. రాజకీయాలలో ఇటువంటి వైపరీత్యాలు జరుగుతూ ఉంటాయి.

అప్పటికి కొన్ని సంవత్సరాల ముందునుంచి రాజాజీ రాజకీయాలలో అట్టే జోక్యం కలుగచేసుకోకుండా, దూరంగా ఉండేవారు. 1936 లో జరిగిన లక్నో ఏ ఐ.సి.సి. సమావేశంలో ఎలక్షన్‌లో కాంగ్రెసువారు పాల్గొని మంత్రివర్గాలు ఏర్పాటు చేయాలని నేను వాదించి ఉపన్యసించినపుడు ఆయన సభానంతరం నన్ను చాలా ప్రశంసించారు. అది దూరంగా ఉన్న పెద్దలు చేసిన ఆశీర్వాదపూర్వక ప్రశంసగా భావించాను. ఆయనకు రాష్ట్ర రాజకీయాలలోకి తిరిగివచ్చే అభిప్రాయం ఉన్నట్టు ఆ నాడు ఎవ్వరమూ గ్రహించలేకపోయాము. ఇప్పుడు అభ్యర్థులను నిర్ణయించే సమయంలో ఆయన ఇతరులకు తెలియకుండానే హెచ్చు జోక్యం కలిగించుకోవడం జరిగింది. వల్లభభాయి పటేలుగారు కేంద్ర పార్లమెంటరీ బోర్డు తరఫున ఆంధ్ర, తమిళ, కేరళ, కర్నాటక అభ్యర్థుల జాబితాలను పరిశీలించి, చెన్నపట్నం విషయం మాత్రం- అంటే ప్రకాశంగారి అభ్యర్థిత్వం విషయం అంతా బొంబాయిలో నిర్ణయిస్తానని, అక్కడికి రావలసిందని ప్రకాశంగారిని కోరారు. వల్లభభాయి పటేలగారు బయలుదేరిన బండిలోనే రాజాజీ కూడా కూచుని వెళ్ళడం తటస్థించింది. ఆ బండిలోనే ప్రకాశంగారు వేరుగా మరోపెట్టెలో కూచున్నారు. ఆ రైలు చెన్నపట్నం స్టేషను నుండి బయలుదేరడానికి కొన్ని క్షణాల ముందు, దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు—రాజాజీ, పటేలు కూచున్న బండి ఎక్కడానికి తొందరగా వెతుక్కుంటూ వచ్చారు. ఆ కంపార్టుమెంటులోకి ఎక్కగానే రాజాజీ దేశభక్తుని అతి గౌరవంగా లోపలికి పిల్చి, పటేలుగారి

పక్కన కూచోమన్నారు. ఇతర ప్రసంగాలు చేయటానికి వ్యవధి లేకపోవడంచేత పటేలుగారు ప్రకాశంగారి అభ్యర్థిత్వ విషయమై ప్రశ్నించారు. వెంకటప్పయ్యగారు "ప్రకాశంగారు లేకుండా శాసన సభ ఎలా ఉండగలదు?" అని తిరిగి ప్రశ్నించగా, రాజాజీ అసంతుష్టితో కొంచెం దూరంగా జరిగారు.

వెంకటప్పయ్యగారికి ప్రకాశంగారంటే పడనందున, అయన ప్రకాశంగారిని అభ్యర్థిగా నిర్ణయించ కూడదని తప్పక చెప్పగలరన్న అభిప్రాయంతో వెంకటప్పయ్యగారికి ప్రత్యేకంగా కబురంపి రాజాజీ రైల్వేస్టేషన్‌కి రప్పించారు. కాని, ఆయనకు ఆశాభంగం కలిగింది. వెంకటప్పయ్యగారు పెద్దవారు గనుక ఆ విధంగా తమ అభిప్రాయం తెలిపారు. ఆయనను ఏమనడానికీ తోచక, "సరే, మీరు వచ్చిన పని అయింది. రైలు బయలుదేరుతూంది. మీరు వెళ్ళండి," అని వారిని పంపివేశారు.

ట్రెయిన్ రేణిగుంటకు వెళ్ళేసరికి శ్రీ మాడభూషి అనంత శయనం అయ్యంగారు రాజాజీ, పటేలు కూచున్న బండి ఎక్కడని అడుగుతూ ప్లాట్‌ఫారంలో అటూ ఇటూ తిరుగుతూ వెతుక్కుంటూ వచ్చారు. మొదట్లో ప్రకాశంగారి ముఖం ఆయనకు కనిపించింది. "ఏమయ్యా, అంత తొందరగా అటు ఇటు చూస్తున్నా?"వని ప్రకాశం గారు అయ్యంగార్ని అడిగారు. పటేలుగారిని కల్సుకోవాలని రాజాజీ తంతి యిచ్చినట్లూ, అందువల్ల ఆయనకోసం వచ్చినట్టూ అయ్యంగారు చెప్పారు. అప్పటికి అయ్యంగారు కేంద్ర శాసన సభలో సభ్యుడు. పటేలు కూచున్న కంపార్టుమెంటు ఎటున్నదో అయ్యంగారికి ప్రకాశం గారు చేత్తో చూపించారు. అయ్యంగారు అక్కడికి వెళ్ళేసరికి పటేలు అయ్యంగారికి ప్రత్యుద్ధానం చేసి ప్రక్కన కూచోమన్నాడు.

ఇక్కడ కూడా ఇతర ప్రసంగాలకు వ్యవధి లేనందువల్ల పటేలుగారు తటాలున అయ్యంగరిని "ప్రకాశంగారి అభ్యర్థిత్వం విషయమై ఏమిటి మీ అభిప్రాయం?" అని అడిగారు. అయ్యంగారు

దానికి జవాబుగా, "ఇటువంటి ప్రశ్న మీ మనసులో ఎలా ఉద్భవించింది? ఆయన లేకున్నట్టయితే శాసనసభ ఎలా ఉండగలదు?" అన్నారు.

ఆ మాటలు వినేసరికి రాజాజీకి బ్రహ్మాండమైన ఆగ్రహం వేసి, "సరే లేవయ్యా! ఆ దివాలా కోరుతో నువ్వు కాపురం చేయవయ్యా!" అని మందలించి కూచున్న స్థలంనుంచి లేచిపోయారు. రైలు టైము కూడా అయిపోయింది. అయ్యంగారు దిగిపోయారు. రైలు కదిలింది.

బొంబాయి వెళ్ళాక పటేలుగారున్నూ, వర్కింగు కమిటీ వారున్నూ మొదట అనుకున్నట్లే ప్రకాశంగారిని చెన్నపట్టణానికి ఏర్పాటయిన నియోజక వర్గంలోనే స్థిరపరిచారు. ఇది ఆ ఎన్నికలో మొదటి ఘట్టం.

## జమీందారులతో పోరాటాలు

దేశంలో కాంగ్రెసువారియెడల అభిమానం పెల్లుబికి పోయింది. విశాఖపట్నం జిల్లా బొబ్బిలి నియోజక వర్గంలో ఇప్పుడు రాష్ట్రపతిగా రయిన గిరిగారిని కాంగ్రెసు అభ్యర్థిగా నిర్ణయించడమైంది. అప్పటికి గిరిగారు కేంద్ర శాసన సభలో సభ్యులుగా ఉండేవారు. బొబ్బిలిలో ఈయన ప్రత్యర్థి బొబ్బిలి రాజావారే. ఆయన అపుడు చెన్నరాష్ట్రంలో ముఖ్యమంత్రిగా ఉండేవారు. ఎన్నికల సందర్భంగా నెహ్రూగారు మన రాష్ట్రానికి రావడం సంభవించింది. ప్రకాశంగారూ, ఆయనా కలసి బొబ్బిలికి ఎన్నికల ప్రచారంకోసం వెళ్ళారు. తీరా వెళ్ళేసరికి బొబ్బిలి రాజావారు బొబ్బిలిలో లేరు. నెహ్రూగారు స్థానిక కాంగ్రెసువారు ఏర్పాటుచేసిన సభాస్థలానికి చేరేసరికి, డప్పులు వాయించుకుంటూ కొంతమంది, కేకలువేస్తూ కొందరూ నాలుగువైపుల తిరగడం ఆరంభించారు. ఆయన మాట్లాడడానికి ప్రారంభించేసరికి డప్పులు చేసే గోల చాలదని ఒక ఏనుగునుకూడా నడిపించుకుంటూ ఒక మావటి వాడు ప్రేక్షకుల గుంపులోకి వచ్చాడు. సభలో గగ్గోలు బయలుదేరింది. ఇదేమిటని నెహ్రూగారు అడగగా, స్థానిక కాంగ్రెసు నాయకులు, "ఈ ఊళ్ళో కాంగ్రెసు మీటింగులు జరగకూడదని రాజావారి మను

షులు ఇలా అల్లర్లు చేయిస్తూండడం మామూలే," అని చెప్పారు. ఎదురుగుండా దూరంగా ఉన్నవారంతా రాజావారి మనుషులు అని కొందరిని చూపించారు. ఈ లోపున డప్పుల చప్పుళ్ళు, ఏనుగు తమ మధ్యలో నడవడంచేత ప్రేక్షకులు చేసే గోల, కేకలు హెచ్చయినాయి. ఏనుగు నెహ్రూగారికి కొంచెం దగ్గరపడింది. ఆవేశంతో నెహ్రూగారు దాని తొండంపైకి ఎగరబోయారు. అప్పుడు, అంతవరకూ నిర్లిప్తంగా దూరంగావున్న పోలీస్‌వారు కొంతమందీ, రాజుగారి మనుషులు కొంత మందీ వచ్చి ఆ ఏనుగును ప్రక్కకు మళ్ళించగా, వారూ వారి అను యాయులూ గోల చేసుకుంటూ, డప్పులతో వెళ్ళిపోయారు. తర్వాత సభలో వేరే అల్లరి ఏమీ జరగలేదు.

ఈలాగే మరికొన్ని రోజులయినాక, అదే స్థలానికి ప్రకాశం గారు, శ్రీమతి సరోజినీ నాయుడుగారు ఎన్నికల ప్రచారంకొరకు వెళ్ళటం తటస్థించింది. అప్పుడుకూడా ఏనుగు తప్ప, మిగిలిన అల్ల రంతా రాజావారి మనుషులు చేశారు. అయినప్పటికీ, ప్రజాబాహుళ్యం హెచ్చు అవడంవల్ల, కాంగ్రెసు నాయకులపట్ల వారి అనురాగప్రేమలు హెచ్చవడంవల్ల సభకు అంతరాయం కలగలేదు. ప్రత్యర్థి అయినవారు కూపస్థ మండూకంలా తామే గొప్పవారమని, తాము తప్ప వేరే లోకం లేదని అనుకోవడం చాలా పొరబాటని సరోజినీ నాయుడుగారు మంద లించారు. ఆ ఎన్నికలో గిరిగారు గెలిచారు అన్న విషయం అందరికీ తెలిసిందే.

ప్రకాశంగారు ఆంధ్రప్రాంతంలో అన్ని జిల్లాలలోనూ నిర్విరా మంగా ప్రచారం చేశారు. దీనికి ఫలితంగా కాంగ్రెసుకి అఖండ విజయం కలిగింది. రెండు స్థానాలుమాత్రం పోయినవి. ఒకటి చల్లపల్లి జమీందారు జస్టిస్‌పార్టీ అభ్యర్థిగా గెలుచుకున్నది; రెండవది నరసా పురంలో జస్టిస్‌పార్టీ నాయుడుగారు గెలుచుకున్నది. ఈ రెండుచోట్ల కాంగ్రెసు అభ్యర్థులు నిర్దుష్టమయిన దేశసేవా పరాయణులే అయి నప్పటికీ ఓటమి కలిగింది.*

---

*గెలిచిన జస్టిస్‌పార్టీ వారిద్దరూకూడా వారి ఎత్తుగడలు

## ఎన్నికలలో విజయం : అనంతరము

పైన చెప్పిన రెండు స్థానాలు తప్ప మిగిలిన స్థానాలన్నీ కాంగ్రెసు వశమయినాయి. ముస్లింలీగ్‌వారి ప్రత్యేకస్థానాలు మాత్రం కాంగ్రెసువారికి వశం కాలేదు. ఆ సభలోని మొత్తం 215 స్థానాలలో 160 కాంగ్రెసువారికి లభించినాయి.

ఆంధ్రప్రాంతంలోనుంచి ఎన్నికయిన సభ్యులు యావన్మంది చెన్నపట్నంలో 'దేశోద్ధారక' కాశీనాథుని నాగేశ్వరరావుగారి యింట్లో సమావేశమయారు. అందరూ కూడా ప్రకాశంగారు తప్పకుండా ముఖ్యమంత్రి కాగలరన్న దృఢమయిన అభిప్రాయంలో ఉన్నారు. అయితే ఆ అభిప్రాయం వారి అభిమానాన్ని పురస్కరించుకొని తెచ్చుకొన్నట్టిదే గాని వాస్తవానికి కొంచెం దూరమయినట్టు తర్వాత జరిగిన ఉదంతాలు తేల్చినవి. రాష్ట్రకాంగ్రెసులో కొంతమంది పెద్దలకు ప్రకాశంగారంటే పడదన్న విషయం అందరికీ తెలుసు. అయినప్పటికీ, ఒక తెలుగు నాయకుడు రాష్ట్రానికి ముఖ్యమంత్రి అయ్యే సందర్భంలో భేదాభిప్రాయాల ప్రభావం వ్యతిరేకంగా వుండదని ఒక వెర్రి ఊహ అందరి మనసుల్లోనూ వుండేది. "ఇంతకు, పోటీకి ఎదురుగా వున్న వారెవరు? ఏడు సంవత్సరాల క్రితం చెన్నపట్నంలో ఉప్పు సత్యాగ్రహం చేసి, బ్రిటిషు తుపాకీలకు ఎదురుగా నిలబడ్డవారెవరు? చెన్నపట్నంలో ఉప్పు సత్యాగ్రహానికి తగిన వాతావరణం లేదని బ్రిటిషు తుపాకీలకు భయపడి తమిళ నాయకులందరూ దక్షిణప్రాంతంలో వున్న వేదారణ్యానికి పోలేదా? జనరల్ ఎన్నికలలో నిలబడి కష్టపడేందుకు ఇష్టంలేక యూనివర్శిటీకి ప్రత్యేకంగా ఇచ్చిన స్థానంలో వచ్చినవారా ఇప్పుడు తగుదుమని ముఖ్యమంత్రి పదవి తమకు కావాలని అనుకునేవారు?"—అని ఈ విధంగా మనవాళ్లలో వాదోపవాదాలు బయలుదేరాయి. "అసలు గాంధీగారి కిష్టంలేని ప్రకాశంగారు ముఖ్యమంత్రి కావాలని మనమంటే తమిళులు ఎందుకు ఒప్పుకుంటారయ్యా?" అని వాళ్లతోబాటు ఆలో

---

మార్చుకొని, తరువాత కాంగ్రెసులో చేరి, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటయినాక కాంగ్రెసుపార్టీ పక్షాన మంత్రులైనారు.

చిస్తున్న తెలుగు నాయకులుకూడా ఒకరిద్దరు లేకపోలేదు. అందుచేత, ప్రకాశంగారు తప్పక ముఖ్యమంత్రి కాగలరు అన్న మొదటిభావం ఓ రెండు సూర్యాస్తమయాలు గడచేసరికి మెత్తబడి, పలుచబడి, నీరయి పోయింది.

నాయకుని ఎన్నుకోవలసిన దినం వచ్చింది. దానికి క్రితం రాత్రి తెలుగు సభ్యులు యావన్మంది మరొకమారు నాగేశ్వరరావుగారి మేడ పైన సమావేశమై—ప్రకాశంగారు తప్పక పోటీచేయాలని కొందరూ, పోటీ చేసినట్లయితే గెలుపు అనుమానమని కొందరూ, అసలు తగాదాలు లేకుండా సామరస్యంగా ఏదో ఏర్పాటయితే బాగుంటుందని మరి కొంతమంది (వీరంతా పెద్దలే) వివిధములయిన అభిప్రాయాలు వ్యక్త పరచి, తుది నిర్ణయం ప్రకాశంగారికి వదలివేశారు.

ప్రకాశంగారు తమ మనస్సులోని ఊహ ఎవరికీ చెప్పలేదు. ఏమి చెప్పగలరు? ఆంధ్రరాష్ట్రంలో వున్న ఇద్దరు పెద్దనాయకులే వైమనస్యం చూపించినట్టు తోచిన వేళ, ఏం మాట్లాడడానికీ వీలులేదు కదా! ఏది మాట్లాడినా కార్యం మరింత చెడిపోతుంది. మొత్తంమీద ఆ విధంగా ఆంధ్రులు ఆ రాత్రి ఒక అభిప్రాయానికి రాలేకపోవటం విచారకరమయిన విషయము. తెలుగువారి త్యాగధనమూ, పలుకుబడీ —భారతీయ రాజకీయాలలో అవరోహణ చేయడానికి ఆ రాత్రి కల్గిన సందిగ్ధావస్థే మొదటి మెట్టు.

మరునాడు ప్రకాశంగారే నాయకుని ఎన్నుకునే సభలో స్వయంగా రాజాజీ చెన్నరాష్ట్ర కాంగ్రెస్‌పార్టీ నాయకుడుగా ఉండాలనే ప్రతిపాదన అనుమానంలేని గొంతుకతో చేశారు. సభలో ఉన్నవారు యావన్మందీ సంతోషించారు. కొన్ని సంవత్సరాల తరువాత తెలిసిన విషయం ఏమంటే- అది ప్రకాశంగారు, సాంబమూర్తిగారు మొదలైన ఒకరిద్దరు కలసి చేసుకున్న నిర్ణయమని, అది పరిస్థితుల వాస్తవికతపై ఆధారపడినదనీ తెలిసింది. అప్పుడు ప్రకాశంగారిని ఉపనాయకునిగా (డిప్యూటి లీడర్‌గా) రాజాజీ ప్రతిపాదిస్తారని ప్రకాశం, సాంబమూర్తి

గారలు రాజాజీతో అదివరలో అనుకున్న సంగతి. అయితే, రాజాజీ మాత్రం, లేచి యిద్దరు డిప్యూటీ లీడర్లు వుండాలనీ, వారు—ప్రకాశం గారున్ను, వేదరత్నం పిళ్లైగారున్ను అని ఆ ఇద్దరిపేర్లు ప్రతిపాదించారు. సహజంగానే యీ రెండుపేర్లూ ఆమోదింపబడినాయి. అప్పటి నుంచి సభ్యులలో ఆవేశం కొంత చల్లబడింది.

# 2

## మంత్రివర్గంలో ప్రకాశంగారి స్థానము

మంత్రివర్గంలో ప్రకాశంగారు ఒకరయి ఉండాలా అన్న సందేహం కూడా కాంగ్రెస్ పెద్దలకు తోచినట్లు కనిపించింది. అందుచేత రాజాజీ మొదట ప్రకాశంగారిని అసెంబ్లీ స్పీకరుగా ఉండాలని కోరారు. ప్రకాశంగారు ఒప్పుకోలేదు. సాంబమూర్తిగారు కూడా మెత్తని వాడు కాదు. ప్రకాశంగారు మంత్రి అయితే, వారికి తోడు సాంబమూర్తిగారు కూడా ఉన్నట్లయితే అసలు ముఖ్యమంత్రిగారి మాట మంత్రివర్గంలో చెల్లుతుందో, లేదో అన్న పరిస్థితులు ఏర్పడడానికి అవకాశం ఉంది. అందుచేత, సాంబమూర్తిగారిని స్పీకరుగా ఉంచినట్లయితే తగువు తీరుతుందని ఆయనను స్పీకరుగా ఉండాలని కోరారు. మహర్షి సాంబమూర్తిగారు అంగీకరించారు. తరువాత తెలుగు మంత్రులను ఎవరిని వేయాలి అని ఒక ప్రశ్న. నాకు తెలిసిన విషయం ఇది: గిరిగారి పేరు, కోటిరెడ్డిగారి పేరు ప్రకాశంగారు సూచించారు. గిరిగారి పేరు రాజాజీ వెంటనే అంగీకరించారు. కాని, కోటిరెడ్డిగారి పేరు అంగీకరించలేదు. కోటిరెడ్డిగారు రాయలసీమ కంతకూ పేరు ప్రఖ్యాతులు పొందిన సాత్విక నాయకులు. ఆయన సతీమణి అప్పటికే కడప జిల్లా బోర్డు అధ్యక్షురాలై, స్త్రీ అయినా మగతనం చూపిస్తున్న నాయకురాలు. అందుకే కాబోలు రాజాజీ రెడ్డిగారిని ఒప్పుకోలేదు. దానిపైని ప్రకాశంగారు కాంగ్రెసులో అనుభవంగల నాయకులను కాకుండా

గారలు రాజాజీతో అదివరలో అనుకున్న సంగతి. అయితే, రాజాజీ మాత్రం, లేచి యిద్దరు డిప్యూటీ లీడర్లు వుండాలనీ, వారు—ప్రకాశం గారున్ను, వేదరత్నం పిళ్లైగారున్ను అని ఆ ఇద్దరిపేర్లు ప్రతిపాదించారు. సహజంగానే యీ రెండుపేర్లూ ఆమోదింపబడినాయి. అప్పటి నుంచి సభ్యులలో ఆవేశం కొంత చల్లబడింది.

# 2

## మంత్రివర్గంలో ప్రకాశంగారి స్థానము

మంత్రివర్గంలో ప్రకాశంగారు ఒకరయి ఉండాలా అన్న సందేహం కూడా కాంగ్రెస్ పెద్దలకు తోచినట్లు కనిపించింది. అందుచేత రాజాజీ మొదట ప్రకాశంగారిని అసెంబ్లీ స్పీకరుగా ఉండాలని కోరారు. ప్రకాశంగారు ఒప్పుకోలేదు. సాంబమూర్తిగారు కూడా మెత్తని వాడు కాడు. ప్రకాశంగారు మంత్రి అయితే, వారికి తోడు సాంబమూర్తిగారు కూడా ఉన్నట్లయితే అసలు ముఖ్యమంత్రిగారి మాట మంత్రివర్గంలో చెల్లుతుందో, లేదో అన్న పరిస్థితులు ఏర్పడడానికి అవకాశం ఉంది. అందుచేత, సాంబమూర్తిగారిని స్పీకరుగా ఉంచినట్లయితే తగువు తీరుతుందని ఆయనను స్పీకరుగా ఉండాలని కోరారు. మహర్షి సాంబమూర్తిగారు అంగీకరించారు. తరువాత తెలుగు మంత్రులను ఎవరిని వేయాలి అని ఒక ప్రశ్న. నాకు తెలిసిన విషయం ఇది: గిరిగారి పేరు, కోటిరెడ్డిగారి పేరు ప్రకాశంగారు సూచించారు. గిరిగారి పేరు రాజాజీ వెంటనే అంగీకరించారు. కాని, కోటిరెడ్డిగారి పేరు అంగీకరించలేదు. కోటిరెడ్డిగారు రాయలసీమ కంతకూ పేరు ప్రఖ్యాతులు పొందిన సాత్త్విక నాయకులు. ఆయన సతీమణి అప్పటికే కడప జిల్లా బోర్డు అధ్యక్షురాలై, స్త్రీ అయినా మగతనం చూపిస్తున్న నాయకురాలు. అందుకే కాబోలు రాజాజీ రెడ్డిగారిని ఒప్పుకోలేదు. దానిపైని ప్రకాశంగారు కాంగ్రెసులో అనుభవంగల నాయకులను కాకుండా

నిబంధనల ననుసరించి ఈయన సాధించగలిగింది కూడా ఏమీ లేదనీ లెవిన్యూశాఖ అప్పచెప్పిన వారి అభిప్రాయం కాబోలు!

## కా బి నె ట్ మీ టిం గు

రాజాజీ చాల నిపుణుడు. దానికి తోడు మహాత్మాగాంధీగారికి సంబంధి. గాంధీగారు మొదటిసారి జైలులో ఉన్న రోజులలో ఆయన నడిపించే "యంగ్ ఇండియా" పత్రికను జాగ్రత్తగా నడిపించిన వాడు. గాంధీ తత్వం ఆయనకు తప్ప మరొకరికి అంత సంపూర్ణంగా ఒంట బట్టలేదని పేరుపడిన ఆయన.

1937 లో ఎన్నికలలో గెలిచిన వెంటనే కాంగ్రెసువారు మంత్రి మండలులు ఏర్పాటు చేయడానికి అంగీకరించలేదు. దీనికి కారణం- అనేక విషయాలలో గవర్నరుకు మంత్రివర్గం చేసే తీర్మానాల్ని త్రోసి పుచ్చడానికి కొన్ని అధికారాలు కూర్పబడి ఉండడము. అట్టి సందర్భంలో కాంగ్రెసువారు మంత్రులుగా కార్యనిర్వహణ ఏలాగున జరుపగలరు? అలాగని చెప్పి మంత్రివర్గాలు తాము ఏర్పాటు చేయకపోతే రాష్ట్రాల పరిపాలన బాధ్యతా రహితులైన గవర్నర్ల చేతులలోనికి పోతుంది. అంటే, వారు దేశస్వాతంత్ర్యానికి విముఖులైన వారి సలహాలపైన పరిపాలన సాగిస్తారు. ఈ రెండు ఇబ్బందులు లేకుండా గాంధీగారు ఒక సూత్రం పన్నారు. మంత్రివర్గం చేసే తీర్మానాలనే పాటిస్తామనీ, తమకు సంవిధానం ద్వారా వచ్చిన హక్కును వినియోగించము అనీ గవర్నర్లు మాట యిచ్చే లాగున ఇంగ్లండులో ఉండే ఇండియా కార్యదర్శి ప్రకటించినట్లయితే,-ఆ ప్రకటనను అనుసరించి కాంగ్రెసువారు మంత్రివర్గాలు ఏర్పాటు చేస్తారని గాంధీగారు అద్భుతమైన, ఒక అహింసాత్మక సూచనను చేశారు. మూడు నెలలు ఆలోచించి బ్రిటిషు గవర్నమెంటువారు ఈ సూచనను అంగీకరించారు. దానిపైన, ఎనిమిది, తొమ్మిది రాష్ట్రాలలో కాంగ్రెసు ప్రభుత్వాలు ఏర్పాటు అయాయి. ఆ ప్రకారంగానే, చెన్నరాష్ట్రంలో కూడా గవర్నర్ కాన్‌స్టిట్యూషనల్ (Constitutional) గవర్నర్‌గా

ఉంటాడని మాట ఇచ్చిన మీదటనే రాజాజీ నాయకత్వాన ప్రభుత్వం ఏర్పాటయింది.

అయినప్పటికీ, మొదటి కాబినెట్ మీటింగులోనే, గవర్నర్ కాబినెట్ మీటింగులకు అధ్యక్షత వహించేటట్లు ఒక నిర్ణయం తీసుకోవడం జరిగింది. ఇది పొరబాటని ప్రకాశంగారికి తోచింది. అలా తోచడం న్యాయమే. కాని, రాజాజీ మాత్రం ప్రకాశంగారి మాట వినలేదు. నూటికి నూరుపాళ్ళు గాంధీ తత్వవాది అన్న పేరు తనకు కలిగినప్పుడు ఇతరుల మాట తానెందుకు వినాలి? పాత భేదాభిప్రాయాలతో బాటు ప్రకాశం, - రాజాజీల మధ్య వైమనస్యం ప్రబలడానికి ఇదికూడా ఒక గట్టి కారణం అయింది. విప్లవ వాదివలె కనిపించే మితవాది శ్రీమాన్ రాజాజీ. మితవాదివలె కనిపించే విప్లవకారుడు ప్రకాశం. అందుచేత, ఎంత సర్దుకుపోదామని ప్రకాశంగారు యత్నిస్తూ వచ్చినా దృష్టి భేదం వల్ల ఏదో ఒక చిన్న తగాదా రావడమూ, మబ్బులు కమ్మడమూ- ఎలాగో తిరిగి క్షేమంగా ఆ మబ్బులు చెదరిపోవడమూ మంత్రివర్గం ప్రారంభమైన దగ్గరినుంచీ కొంత అలవాటయి పోయింది.

ఈ కార్య నిబంధనలో మరొక సూత్ర ముండేది. దాని ప్రకారం కార్యదర్శికి, మంత్రులవరకు కాగితం రాకుండానే, ఒక విషయంలో తుది నిర్ణయం తీసుకొనే హక్కుండేది. ఇదివరకే ఇటువంటి విషయంలో ఒక విధమైన తీర్పును బట్టి, మంత్రివర్గంగాని, ప్రభుత్వంగాని ఒక అభిప్రాయం తీసుకోవడంచేత ఆ అభిప్రాయం ప్రకారం కార్యదర్శియే తుది నిర్ణయంచేసి కాగితం తిరుగగొట్టవచ్చు. మంత్రిగారు తిరిగి పునరాలోచన చేయుదురా అన్న విషయం కార్యదర్శే ఊహించి, ఆ కాగితం మంత్రిగారికి పంపించాలా, అక్కరలేదా అన్న నిర్ణయం తానే తీసుకోవచ్చు. అది రెండు, మూడు శాఖలతో సంబంధించినప్పటికీ ఆయా శాఖల కార్యదర్శులు ఏకాభిప్రాయానికి వచ్చిన సందర్భాలలో అలాగే చేయవచ్చు. మంత్రులకు తెలియకుండానే ఈ విధంగా దాదాపు నూటికి డెబ్భై ఐదు ఫైళ్ళలో ప్రభుత్వం పేరున అటో ఇటో ఆర్డర్లు పడుతూంటాయి.

ఒక్కొక్కప్పుడు మంత్రులు కాంగ్రెసు సూత్రాల ప్రకారంగా ముఖ్య మనుకొనే విషయాలలో కూడా ఇదే విధంగా జరుగుతుండేవి.

కార్యదర్శులు ప్రజల వోట్లు పుచ్చుకొని వచ్చినవారు కాక, కేవలం ఉద్యోగస్థులు కావడం చేతను, ఏ శాసనాల ప్రకారంగానూ వారికి ఈ విధాన సభలు హక్కు లివ్వకపోవడం చేతను, ప్రభుత్వం నడిపించడానికి అవసరమైన అధికారాలను కార్యదర్శులకు సంక్రమింప చేసే శాసనం లేకపోవటంవల్లను—కార్యదర్శులు తుది నిర్ణయాలు చేసి, మంత్రులకు తెలియనక్కర లేకుండా పరిపాలించే విధానం మంచిది కాదని ప్రకాశంగారు గట్టిగా దెబ్బలాట ఆరంభించారు. మంత్రుల సంఖ్య చాలకపోయినట్లయితే మంత్రి మండలిని విస్తృతపరచాలి. దానికి తోడు పార్లమెంటరీ కార్యదర్శులకు అధికారాలు సంక్రమింప చేయవచ్చుని వారి ఊహ.

సచివాలయం సంపూర్ణంగా దీనికి వ్యతిరేకంగా ఉండేది. అందు చేత, రాజాజీ కూడా సంపూర్ణంగా వ్యతిరేకులైరి. అనగా మంత్రి మండలిలో మరో ఇద్దరో, ముగ్గురో మంత్రులు తప్ప, మిగిలినవారు ప్రకాశంగారి వాదానికి వ్యతిరేకులైరి. రానురాను, ప్రకాశంగారు కూడా ఈ ప్రసక్తి మెల్లమెల్లగా వదలిపెట్టారు. కాని, కొంతకాలం రాజాజీకి, ఈయనకూ మధ్య చాలా వాదులాటలు సాగినాయి.

## విజయనగరము మహారాజా కేసు

జబ్బుతో ఉన్న విజయనగరం రాజా, తన ఎస్టేటు కోర్టు ఆఫ్ వార్డ్సు చేతిలో ఉన్న కారణంచేత, తనకు మూడువేల రూపాయలు మెడికల్ ఎలవెన్స్ ఇవ్వవలసిందని కోరితే, మంత్రికి తెలియకుండానే లేదు పొమ్మన్నారు. తర్వాత, మంత్రి కీ విషయం తెలిసిన మీదట కాగితం తనవరకు ఎందుకు రాలేదని ప్రశ్నిస్తే, కార్యనిబంధనల క్రింద త్రోసివేయడానికి హక్కు తమకుందని ఆ కార్యనిబంధన ఒకటి ప్రకాశంగారికి చూపించడం మొదలుపెట్టారు. విజయనగరం రాజా శాసన సభ సభ్యుడు కూడా. ఇటువంటి సందర్భాలలో, ఈ ఉద్యోగులు

చేసే అపచారాలు తగ్గించాడానికి వీలుగా కార్యనిబంధనలు మార్చడానికి కూడా రాజాజీకి మనస్కరించకపోవడం వల్ల వీరిద్దరి మధ్యను ఎప్పుడూ ఏదో రగులుకొంటూనే ఉండేది. ఇటువంటి యిబ్బందుల విషయం పైవారికి తెలియకుండా ఉండడానికి, కలిసికట్టుగా మంత్రివర్గం నడుస్తున్నదని చెప్పేందుకు వీలుగా ప్రకాశంగారు సర్దుకొనిపోతూ ఉండే వారు. మంత్రివర్గం పని ఆరంభించిన వెంటనే ప్రకాశంగారిని ఎదుర్కొన్న సమస్యలలో ఒకటి - విజయనగరం రాజాకూ, కోర్టు ఆఫ్ వార్డ్సుకూ మధ్య ఉన్న విపరీతమైన తగాదా.

విజయనగరం రాజా చెన్న రాష్ట్రంలోని జమీందార్లందరిలోనూ పెద్ద జమీందారు. అకలంకమైన జాతీయవాది. బ్రిటిషు గవర్నమెంటు వారు మన దేశంలో చేస్తుండే అన్యాయాలను విమర్శిస్తూ, మన స్వరాజ్యం మనకు అప్పజెప్పవలసిన బాధ్యత వారియందున్నదంటూ ఆయన పత్రికలలో అనేక వ్యాసాలు వ్రాశారు. ఏ పెద్ద జమీందారూ సాహసించి అటువంటి పనికి పూనుకోలేదు. అందుచేత గవర్నమెంటు వారికి ఈయన పైన నిఘా ఉండేది. ఏదో గృహ సంబంధమైన వివాదాన్ని పురస్కరించుకొని, ఈయన తన విషయం కూడా తాను ఆలోచించుకోలేడనీ, సంరక్షణ చేసుకోలేడనీ ఏవో సాకులు చూపుతూ— ఆయన ఎస్టేటునేగాక, వ్యక్తిగా ఆయనను కూడా తమ సంరక్షణలోనికి తీసుకుంటూ ఒక ప్రకటన చేశారు. అంటే, ఆ ప్రకటన తర్వాత ఆయన ఒక మైనరుతో సమానమైనాడన్న మాట. ఇది చాలా అమానుషమైనది. ఈ ఆర్డరు 1935 లో జారీ అయింది. 1937 లో కాంగ్రెసు పక్షాన ఆయనను అభ్యర్థిగా నిలబెట్టేందుకు కాంగ్రెసువారము నిశ్చయించాము. అయితే, ఆయన కాంగ్రెసు పేరునగాక, స్వతంత్రమైన అభ్యర్థిగా ఉండునట్లు ఏర్పాటు జరిగింది. మిగిలిన వ్యవహారాలకు ఆయన కాంగ్రెసు సభ్యునితో సమానము.

ఎన్నికల తర్వాత వెంటనే మంత్రివర్గం ఏర్పాటు చేయలేదని ఇదివరలో చెప్పడమైనది. ఆ మధ్యకాలంలో ఇంటెరిమ్ మినిస్ట్రీ అనే పేరున ప్రభుత్వంవారు మంత్రివర్గాన్ని ఏర్పాటు చేశారు. దానికి ఓడి

పోయిన జస్టిస్ పార్టీకి చెందిన ప్రముఖుడు సర్ కె. వి. రెడ్డినాయుడు ముఖ్యమంత్రి. విజయగరం రాజా ఆయనకు తన ఎస్టేటు విడుదల చేయాలని, తనను వ్యక్తి సంరక్షణనుంచి విడుదల చేయాలని విజ్ఞప్తి పంపారు. అలా విడుదల చేస్తే వెంటనే గవర్నమెంటు పైన విజయనగరం రాజా దావా వేయడానికి అవకాశముందనీ, అందుచేత ఎంత మాత్రమూ విడుదల చేయడం దుస్సాధం (impossible) అనీ తేల్చారు. రెడ్డినాయుడుగారు ఆ సలహా ప్రకారంగానే తమ అభిప్రాయాన్నీ వ్రాశారు. దాన్ని అనుసరించి గవర్నరుగారు ఆ ఫైలు మీద "Impossible" అని వ్రాశారు. ఇలా ఉండగా కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పడడం, ప్రకాశంగారు రెవిన్యూ మంత్రి కావడం సంభవించాయి. వెంటనే విజయనగరం రాజా ప్రకాశంగారికి మరో విజ్ఞప్తిని, లోగడ ఇంపెరిమ్ మినిస్ట్రీకి పంపించిన రీతిగానే పంపించారు. అదే పద్ధతిలో కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌వారు ఇప్పుడు కూడా అభ్యంతరాలు పెడదా మనుకున్నారు. అయితే, ప్రకాశంగారు చోటివ్వలేదు. ఈ విజ్ఞప్తి వచ్చిన వెంటనే బోర్డ్ ఆఫ్ రెవిన్యూ ప్రథమ మెంబరుకు రావలసిందని కబురంపారు. ప్రథమ మెంబరైన హాల్స్ దొరవచ్చి, పాతకథ మొదలుపెట్టబోగా, ప్రకాశంగారు సూటిగా ఒక ప్రశ్న వేశారు. "విజయనగరం రాజా చనిపోయే లోపున మీ ఆలోచన పూర్తవుతుందా? లీగల్ అభ్యంతరాలు (విధి సంబంధ అభ్యంతరాలు) తేలుతాయా? ఒక మనిషికి ప్రాణ రక్షణచేయడానికి ఏ శాసనం మిమ్మల్ని అడ్డుతున్నది?" అని అడిగారు. ప్రాణ రక్షణ అనే మాట వినేసరికి హాల్‌కి ఒక నూతన దృక్పథం గోచరించింది. ఆయన ఆయన అన్నారు కదా - "ప్రాణ విషయమంటూ మీరు చెప్పింది ఒక క్రొత్త దృక్పథము. ఆయనకు ఏదైనా ప్రమాదం జరిగిన యెడల ఆ బాధ్యత భరించడం కష్టం అనేది ఇప్పుడు గ్రహించగలిగాను. వెంటనే కోర్టు సంరక్షణనుంచి రాజాను విడుదల చేస్తూ ఆర్డరు ఇప్పుడే మీరు చెప్పినట్లు పంపుతాను."

ప్రకాశంగారు రాజాను కోర్టు సంరక్షణనుంచి విడుదల

చేయాలని తమ సూచన వ్రాసి వెంటనే రాజాజీ గదిలోకి స్వయంగా ఫైలు తీసుకువెళ్ళి ఆయన సంతకం కూడా పెట్టించి, తక్షణమే కార్య దర్శిచేత కోర్ట్ ఆఫ్ వార్డ్స్‌కు ఆజ్ఞాపత్రం పంపించారు. జమీందారు ఈ ఆర్డరు చూసిన తర్వాత కొంతవరకు తేరుకొన్నాడు. కాని, దురదృష్ట వశాత్తు అనారోగ్యంచేత ఆ తర్వాత త్వరలో ఆయన స్వర్గస్థు డైనాడు.

ఉద్యోగాలు పోయిన గ్రామోద్యోగులకు మళ్ళీ ఉద్యోగాలు

బ్రిటిష్ గవర్నమెంటుకు రెవిన్యూ డిపార్టుమెంటు వెన్నెముక వంటిదని లోగడ వ్రాయడమైంది. రెవిన్యూ శాఖకు గ్రామోద్యోగివర్గం వెన్నెముక వంటిది. సహాయ నిరాకరణోద్యమ సమయాన అనేకమంది గ్రామోద్యోగులు నిస్వార్థమైన దేశభక్తితో తమ శక్త్యానుసారం ఉద్య మానికి సహాయంచేయడమే గాక, వారిలో అనేకులు తమ ఉద్యోగాలకు రాజీనామాలు కూడా ఇచ్చారు. ఇది 1921-1939 మధ్య జరిగిన ఉదంతము. వీరిలో కొంతమంది బ్రతికి ఉన్నారు. ఉద్యోగంపైని మరల ఆశ కలవారు తమ ఉద్యోగాలు తిరిగి తమకు ఇప్పించవలసిందని, రెవిన్యూమంత్రి అయిన ప్రకాశంగారికి అర్జీలుపెట్టడం మొదలుపెట్టారు. ఇది సర్వజనామోదకరం కావడంచేత కష్టమేమీ కాలేదు. రమారమి నూటఇరవైతొమ్మిదిమందికి, వారి ఉద్యోగాలు వారికి తిరిగి లభింప జేయడమైనది.

గ్రామోద్యోగులే కాక ఇతరులుకూడా 1930 లో ఉప్పు సత్యా గ్రహ సందర్భంలో ఉద్యోగాలనుండి విరమించుకొన్నారు. వారిలో ఒకరు శ్రీపాద వెంకటనారాయణ గారు. ఆయన సబ్‌రిజిస్ట్రారుగా వుండి, ఉద్యోగానికి రాజీనామా చేసి ఉప్పు సత్యాగ్రహంలో నా నాయ కత్వాన నడచిన దళంలో చేరారు. ఈయన ఉద్యోగంలో తిరిగి చేర డానికి వయఃపరిమితి దాటిపోయింది. అందుచేత ఆయన తనకు పెన్షన్ ఇప్పించాలని కోరారు. సచివాలయంవారు గట్టిగా అడ్డారు. అందులో రాజాజీ ఆర్థికమంత్రి కావడంచేత, వారు ధనం కావాలన్న అర్జీ ఏది వచ్చినా నిరాకరించవలెననే సూత్రం ఏర్పాటు చేసికోవడంచేత, పెన్షన్

ఇచ్చేందుకు వీలులేదని గట్టిగా చెప్పేశారు. కాని, పునరుద్యోగ లాభం ఆయనకు లేకపోవడంచేత ప్రపోర్షనేట్ పెన్షన్ ఇవ్వడం జరిగింది. కార్యసాధన అయిందని అనుకున్నాను. అయితే, వెంకటనారాయణ గారు దాంతో వదలిపెట్టలేదు. పూర్తి పెన్షన్‌కు తాను అర్హుడని వాదించాడు. రాజకీయ కారణాలు లేకపోతే, వయఃపరిమితివరకూ తాను తప్పక ఉద్యోగం చేసేవాడిననీ, రాజకీయంగా మనం జయం పొందినపుడు తాను పూర్తిగా వయఃపరిమితి వచ్చేవరకు తప్పక ఉద్యోగం నిర్వర్తించినట్లే ప్రభుత్వం భావించవలెనని ఆయన వాదము. అటువంటి వాదం ఆనాటి అర్థికమంత్రి కనుచూపుమేరలో ఉండే రోజులు కావు. ప్రకాశంగారుకూడా చాలా ప్రయత్నం చేశారు కాని, మా వాదం ఫలించలేదు.

## దండి సత్యాగ్రహ ఫిల్ములపై గల ఆంక్షల తొలగింపు

సత్యాగ్రహ సమరంలో ఉప్పు సత్యాగ్రహ ఘట్టం చాలా చరిత్రాత్మకమైనది. మార్చినెల ఆఖరిభాగంలో గాంధీమహాత్ముడు సబర్మతి నుంచి పాదయాత్రపై దండీకి పోయి, సముద్రపు టొడ్డున నున్న ఉప్పు అధికారుల అనుమతి లేకుండ తీసి, ఆ విధంగా శాసనోల్లంఘనం ఆరంభించి దేశవ్యాప్తంగా సత్యాగ్రహం నడిపించిన ఘట్టమది. కాలినడకను ఆయన సబర్మతినుంచి బయలుదేరి జంబూసరు చేరేసరికి నేను, దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు మొదలైనవారము— ఆయనను, ఆయన నడిపిస్తూన్న సత్యాగ్రహదళాన్ని సందర్శించినాము. ఆ దళంతోపాటు మేమూ ఒకరోజు నడిచాము. గాంధీగారు నడిచినంత మేరకు బ్రిటిషు గవర్నమెంటువారి అధికారం అమలులో ఉన్నట్టు ఎవరికీ తోచలేదు. బ్రిటిషు గవర్నమెంటు ఆ క్షణంతోనే పోయిందని ప్రజలు అనుకుంటూన్న తరుణం. గాంధీగారి రామరాజ్యం ఏర్పాటైందన్న మహాసమయం అది.

అప్పట్లో, అనేకమంది భారతీయులే కాక, విదేశీయులుకూడా వచ్చి చలనచిత్రాలను తీసేవారు. ఆ సందర్భంలో తీసిన చలనచిత్రా

లను ప్రదర్శింపరాదని బొంబాయి, చెన్నరాష్ట్ర ప్రభుత్వాలు ఆంక్షలు విధించినవి.

చెన్నరాష్ట్రంలో కాంగ్రెసు మంత్రివర్గం ఏర్పాటైన రెండు నెలలలో ఆ ఆంక్షలు తొలగించారు. ఆ విధంగా ఆంక్షలు తొలగింప బడిన చిత్రాల పేర్లు ఇవి:

శారదా ఫిల్మ్ కంపెనీవారు నిర్మించిన, "మహాత్మా గాంధీగారి స్వాతంత్ర్యయాత్ర"; కృష్ణా ఫిల్మ్ కంపెనీవారి "మహాత్మా గాంధీజీ చారిత్రకయాత్ర"; రంజిత్ ఫిల్మ్ కంపెనీవారి "మహాత్మా గాంధీ యాత్ర"; పై కంపెనీవారే నిర్మించిన "దేశభక్తుడు"; పయొనీర్ ఫిల్మ్ కంపెనీవారి "పటేలు యాత్ర"; అమెరికన్ ఫిల్మ్ కంపెనీవారి "దేశభక్తుడు"; "మహాత్మా గాంధీకి బొంబే స్వాగతము"; కృష్ణా ఫిల్మ్ కంపెనీవారి "మహాత్మా గాంధీజీ పునర్జన్మము"; "మహాత్మా గాంధీ ఇంగ్లండునుంచి పునరాగమనము" (నిర్మాత: బిల్లిమోరియా); సిని మాటోగ్రాఫ్ సౌండ్ న్యూస్ ఫిల్మ్ "గాంధీజీ చక్రవర్తిని సందర్శించుట"; శ్రీకృష్ణా ఫిల్మ్ కంపెనీవారి "అమర ప్రభ" (ఇమ్మోర్టల్ గ్లోరీ); "జితేంద్రదాసు యాత్ర"; "వసంత బంగాళీ."

ఈ పై ఫిల్ములమీద ఉన్న ఆంక్ష జి. ఓ. నంబరు 3672 (హోమ్ 29-1937) మూలంగా రద్దు చేయడమైనది.

## లెఫ్టినెంట్ కర్నల్ శాస్త్రి విషయము

ప్రకాశంగారు మంత్రిగా ఉన్న సమయంలో కష్టంలో ఉన్న వారందరూ ఆయనను తమ ఆపద్బాంధవునిగా చూచుకొనేవారు. తన శాఖకు చెందినా, చెందకపోయినా, ఆయన వచ్చినవారి ఆర్తిని హరించడానికి వీలయితే తగిన సహాయం చేసేవారు.

మంత్రుల క్రోధానికి గురి అయిన ఉద్యోగస్థులలో ఒకరు లెఫ్టినెంట్ కర్నల్ శాస్త్రి, ఐ.ఎం.ఎస్.

డాక్టర్ టి. ఎస్. ఎస్. రాజన్ వైద్యశాఖా మంత్రి అని ఇది వరలో చెప్పడమైనది. ఆయన తిరుచినాపల్లి వాస్తవ్యుడు. ఆయనకు,

వైద్యునిగా చెప్పుకోదగ్గ ప్రాక్టీసు ఉండేది. ఒకప్పుడు లెఫ్టినెంట్ కర్నల్ శాస్త్రి, డిస్ట్రిక్టు మెడికల్ ఆఫీసరుగా పనిచేయడం తటస్థించింది. ఆయన గవర్నమెంటు ఉద్యోగి. రాజన్ ప్రైవేట్ ప్రాక్టీషనరు. వారిద్దరిమధ్య ఏవైనా తగాదాలు రగుల్కొనేందుకు కారణాలు ఉండి ఉండ వచ్చును. కాలం కలిసివచ్చి రాజన్ మంత్రి అయ్యాడు. లెఫ్టినెంట్ కర్నల్ శాస్త్రి మెడికల్ ఉద్యోగి కావడంచేత, ఆయన రాజన్ ఆధిపత్యంలో ఉండడం జరిగింది. శాస్త్రికి, అకస్మాత్తుగా ఒకరోజున, ఉద్యోగంలోనుంచి తనను ఎందుకు తీసివేయకూడదో తెలుపవలసినదంటూ నోటీసు ఒకటి అందింది. అందులో ఉన్న ఛార్జి ఇది: ఆయన ఒక రోజున ఆస్పత్రిలో ఒక నర్సును బలవంతంగా ఒక ప్రక్కకు లాక్కొని వెళ్ళాడని.

అంతకుముందు జరిగినది ఇది: ఎవరైనా ఉద్యోగి ప్రమోషన్ పొందడానికి సిద్ధంగా ఉన్నాడన్న సమయంలో ఇటువంటి అర్జీలో, లేక లంచం పుచ్చుకొన్నాడని పిటీషనులో రావడం మామూలు. లెఫ్టినెంట్ కర్నల్ శాస్త్రి ఏదో పెద్ద ఉద్యోగంలోకి వెళ్ళే సమయమది. ఆయన కాన్ఫిడెన్షియల్ ఫైలులో ఈ చార్జి ఎంక్వయిరీ తేలేవరకు, ఆయన ప్రమోషను ఆపుదల చేయడమైనదన్నమాటకూడా మొదట వ్రాసి ఉంది. తరువాత ఎంక్వయిరీ సంపూర్ణంగా జరిగింది. ఆపైన, ఆయన మీద మోపిన నేరం అభూతకల్పన అని తేలింది. ఆయన ప్రమోషన్‌మీద ఈజిప్టు వెళ్ళడానికి అభ్యంతరం లేదనీ తేలిపోయింది. ఇదికూడా కాన్ఫిడెన్షియల్ ఫైలులో వ్రాయబడటంతో ఆయన ఆ ఛార్జినుంచి గౌరవంగా విముక్తుడయ్యాడని పేర్కొనబడింది.

ఇలా ఉండగా, రాజన్‌గారు అదే ఛార్జిని వివరిస్తూ, తనను ఎందుకు డిస్మిస్ చేయరాదో చెప్పుకోమని శాస్త్రికి నోటీస్ ఇప్పించారు. మీద చెప్పిన సంగతులన్నీ నేను స్వయంగా ఫైలు చూసిన తర్వాత తెలిసినవి. ప్రకాశంగారు, మేము 1938 లో వేలూరు జెయిలులో ఉన్నపుడు శాస్త్రిగారు మూడుమారులు జెయిలుకు వచ్చి మమ్మల్ని చూసి ఉన్నారు. ఆయన ప్రకాశంగారితో తనకు వచ్చిన నోటీస్

విషయం చెప్పగా, ప్రకాశంగారు వెంటనే ఆ ఫైలు తెప్పించారు. మీదచెప్పిన విషయాలను నేను ఫైలులో చదివి, ప్రకాశంగారికి విషయ మంతా బోధపరిచాను. ఇపుడా నోటీస్ ఇవ్వడానికి కారణం లెఫ్టినెంట్ కర్నల్ శాస్త్రి, డెపుటేషన్‌పైన ఏదో పెద్ద ఉద్యోగానికి విదేశం వెళ్ల డానికి యత్నించడమే. ప్రకాశంగారు ఫైలులో వున్న విషయాలు గట్టిగా వ్రాసి—గవర్నమెంటు నోటీస్ ఉపసంహరించుకోవాలని, లేకపోతే ఈ విషయం కాబినెట్‌లో చర్చకు తేవాలనీ వ్రాశారు.

ఈ ఫైలు మామూలు పద్ధతిగా గవర్నర్‌గారికి వెళ్ళింది. గవ ర్నర్‌గారు - ఒకసారి నేరారోపణ జరుగగా, పూర్తిగా విమర్శించి ఒక ఉద్యోగిని నిర్దోషి అని తీర్మానించిన తర్వాత, రెండవ మారు అది నేరారోపణ చేయడం ఎలా సంభవమవుతుందనీ, కాన్ఫిడెన్షియల్ ఫైలు పరిశుభ్రంగా ఉన్నందున శాస్త్రిగారిమీద చర్య తీసికొనే వీలులేదనీ ప్రకాశంగారితో ఏకీభవిస్తూ వ్రాయగానే దానిపై రేగిన గాలి దుమారం ఆగిపోయింది.

## జి. వి. రావుగారు - ఆయన పని

ఆ రోజులలో లేకలేక ఒక తెలుగు వ్యక్తి రాజధాని నగరంలో పెద్ద ఉద్యోగిగా ఉండడం తటస్థించింది. ఆయన పేరు జి. వి. రావు. ఆయన చెన్నరాష్ట్రం అంతటికీ శానిటరీ ఇంజనీరుగా ఉండేవారు. మొదట విశాఖపట్నం నీటి సప్లై స్కీములో నీటి సూపర్ వైజరుగా పనిచేయ నారంబించిన ఆయన, మెల్లమెల్లగా ఈ పెద్ద పదవికి చేరు కొన్నాడు. ఆ మధ్యలోనే ఎప్పుడో ఇంగ్లండు వెళ్ళి, డిప్లమో ఒకటి సంపాదించి, దాంతోబాటు ఒక పాశ్చాత్య స్త్రీని వివాహమాడి, పెద్ద ఉద్యోగిగా పరిణమించాడు. జస్టిస్ పార్టీ పాలన కాలంలో ఈయన ఇలా పైకి వచ్చాడు. 1932-33 ప్రాంతాలలో నేను విశాఖపట్నంలో మునిసి పల్ కౌన్సిలర్‌గా ఉన్నపుడు ఈయనతో నాకు నీటి సప్లై స్కీము విషయంలో తగాదా వచ్చింది. ఇనుప గొట్టాలద్వారా నీరు తీసుకురావా లని నేను వాదించగా, సిమెంటు పైపుల ద్వారా తెస్తే చవక అవుతుంది గనుక వాటితో స్కీము నడిపించాలని ఆయన అన్నాడు. ఈ సిమెంటు

గొట్టాలు (ప్రెషర్ మెయిన్స్)-అంటే, నీటి ప్రవాహం జోరుకు ఆగవని అనుభవం వల్ల తెలిసిన విషయము. పుస్తకాలలో చెప్పిన ప్రకారం తయారయితే వాటికి తగిన బలం ఉండవచ్చుకాని, ఆ విధంగా పని జరగదు. ఖార్యపేర ఒక సిమెంటు పైపుల కంపెనీలో ఆయనకు కొన్ని షేర్లు ఉండేవి. ఇదికాక, మేఘాద్రి గడ్డనుంచి మంచినీరు తీసుకు రావాలని ఆయన స్కీము. ఆ నీరు వర్షాకాలంలో తప్ప, తక్కి నప్పుడు ఉప్పగాను, చప్పగాను ఉంటుంది గనుక, ఆ స్కీము పనికి రాదనీ, గోస్తనీ నీరు తీసుకురావాలని నా వాదము. చైర్మన్ ఆయన స్నేహితుడు కావడంచేత, మేఘాద్రి గడ్డ స్కీమే అప్పటికే ఖాయ మయింది. ఆ నూతిలోంచి వచ్చిన నీరు ఇప్పటికీ చప్పగాను, వేసవిలో ఉప్పగానూ ఉంటుంది. తర్వాత నేను చైర్మన్ అయిన తర్వాత గోస్తనీ స్కీము, తత్పూర్వం యుద్ధకాలంలో మిలటరీవారు చేసిన యత్న పూర్వకంగా విశాఖపట్నానికి ప్రాప్తించింది. ఆ నీరు బాగా రుచి గాను, ఆరోగ్యకరంగాను, మృదుత్వం కలిగిఉన్నదన్నది అందరికీ అనుభవ వేద్యమైన విషయము.

సరే. అది అలా ఉంచండి. రాష్ట్రంలో అనేకచోట్ల ఇటువంటి సంబంధాలు కల్పించుకోవడంవల్ల, ఆయనకు అంత మంచి పేరుండేది కాదు. అప్పట్లో పబ్లికు హెల్తు మంత్రి అయిన టి. ఎస్. ఎస్. రాజన్ ఈయనను ఎలాగైనా తప్పించివేయాలని పట్టుపట్టాడు. దీనికితోడు, జి. వి. రావు క్రింద పనిచేసే ఒక డిప్యూటీ చీఫ్ ఇంజనీరు చాలా తెలివైనవాడు. శానిటరీ ఇంజనీరింగులో పెద్ద విదేశ డిగ్రీలు పొందిన వాడు. పైగా, ఆయన మంత్రులతో స్నేహంగల వ్యక్తి. చీఫ్ శాని టరీ ఇంజనీరు పైన చాడీలు చెప్పడం కూడా ఆయనకు మామూలు. ఇటువంటి పరిస్థితులలో జి. వి. రావు పైన ముప్పైరెండు, ముప్పై మూడు నేరముల ఆరోపణలుగల ఛార్జి షీటు ఒకటి ఆయనకు ఇవ్వడం జరిగింది. జి. వి. రావు ఇతర స్నేహితుల ద్వారా ప్రకాశంగారి దగ్గర మొర పెట్టుకొన్నాడు. ప్రకాశంగారు ఫైలు తెప్పించారు. "చాలా గ్రంథం పెరిగిపోయింది," అని నన్ను చూడ మన్నారు. అపుడు నేను

నాకు ఆయన పైన ఉన్న అనుమానం చెప్పి, "నేను ఫైలు చదవకపోతేనే ఆయనకు శ్రేయస్కర" మని చెప్పాను. ప్రకాశంగారు "అయితే సరే! నేనే చదువుకుంటాను కాని, ఆ ఛార్జిషీటు ఏమిటో చూడు" అన్నారు. ఆ పొడుగైన ఛార్జిషీట్లో లంచగొండితనం విషయమై ఒక్క ఛార్జికూడా లేదు. ఆ సంగతే ప్రకాశంగారికి చెప్పాను. "సరే. అయితే అతనిని బయట పడేద్దా" మని ఆయన అన్నారు. ఈ వ్యవహారం కాబినెట్‌లోకి వెళ్ళింది. దాదాపు మంత్రులందరూ ఈయన పేరు వినేసరికి మంత్రిచెప్పిన ప్రకారం ఉద్యోగంనుంచి బర్తరఫు చేయాలనే ఉద్దేశాన్ని వెల్లడించారు. గిరిగారు మాత్రం ప్రకాశంగారికి ఎప్పటివలె అనుకూలురుగా ఉండిరి. ప్రకాశంగారు ఛార్జి లన్నింటిని క్రిమినల్ అప్పీళ్ళు వాదించినట్లు వాదించి, సాంకేతికమైన విషయాలలో మంత్రికీ, ఉద్యోగికీ భేదం వచ్చినంత మాత్రాన ఉద్యోగిని బర్తరఫు చేయడం మహా అన్యాయం అని వాదించి - కాబినెట్ అధ్యక్షుడుగా కూచున్న గవర్నర్ మనసు మార్చగలిగారు. దాంతో, చల్లగా మిగిలిన మంత్రులుకూడా మారారు. కాని, అందరి మనసుల్లోను ఆ ఉద్యోగి డబ్బు వ్యవహారంలో మంచివాడు కాడని ఒక అభిప్రాయం గట్టిగా ఉండడంవల్ల ఎలాగైనా అతనిని ఉద్యోగంనుంచి తీసివేయాలని పట్టు పట్టారు. ప్రకాశంగారే ఒక రాజీమార్గం, పైకి శిక్షలా కనిపించేటట్లుగా రూపొందించారు. ఆ ఉద్యోగి తన ఉద్యోగకాల పరిమితి వరకు ఉద్యోగంచేస్తే అతనికి అందే వేతనం, మిగిలిన ఉద్యోగ విరమణ సంబంధమైన అన్ని లాభాలు కలిగిస్తూ అతనిని ఉద్యోగంనుంచి అప్పుడే విరమించుకొనేటట్లు చేయటమే అది. అంటే- ఆ ఉద్యోగి మరొక నాల్గు, ఐదు సంవత్సరాలు పనిచేయకుండానే ఆ జీతం మొత్తం, ఆ తర్వాత వచ్చే ఉద్యోగ విరమణ లాభాలు పొందగలిగాడు. ఆ రోజు కాబినెట్ మీటింగ్ కాగానే ప్రకాశంగారి గదిలోకి వచ్చి గిరిగారు నాతో అన్నారు: "విశ్వనాథంగారూ! ప్రకాశంగారీ రోజున కాబినెట్‌ను క్రిమినల్ కోర్ట్ ఆఫ్ అప్పీల్ క్రింద మార్చివేశారు. మరొక పర్యాయం ఆయన క్రిమినల్ న్యాయవాది నైపుణ్యాన్ని విజృంభింపజేశారు. ఆ

ఉద్యోగికి ఉరిశిక్షలాంటిది (ఈ సమయంలో డిస్మిసల్) తప్పించేశారు. గవర్నరు ప్రకాశంగారి వాదానికి ముగ్ధుడయినాడు. ఉద్యోగికి శిక్ష అంటూ పైకి కనిపించేటట్లూ పనిచేయకుండానే, పనిచేస్తే వచ్చే లాభా లన్నీ క్షణంలో కల్పించేశారు.''

ఈ విధంగా అనేక శాఖలలో మంత్రుల క్రోధాలకు గురిఅయిన ఉద్యోగులు ప్రకాశంగారివల్ల రక్షణ పొందేవారు.

## డిప్యూటీ కలెక్టరుపై పాళీలచోరీ కేసు

ఒక సందర్భంలో నెల్లూరులో ఒక డిప్యూటీ కలెక్టరుకు ట్రెజరీ డ్యూటీలు కూడా ఉండేవి. ఒకసారి అతడు ఒక కష్టదశలోకి వచ్చాడు. అతని చేష్టలు కొంత వికృతంగా కనబడేవన్న మాట మాత్రం వాస్త వమే. అతనిపై కలెక్టరుగా ఉన్నది ఒక ముస్లిమ్. నెల్లూరు చెన్న పట్నానికి దగ్గర గనుక ఆ ముస్లిమ్ కలెక్టరు పనిఉన్నా లేకున్నా చెన్న పట్నం వెళ్ళి అక్కడ కాలక్షేపం చేస్తూండేవాడు. ఎందుకు వెళ్ళినదీ కారణం తెలపని ట్రావెలింగ్ ఎలవెన్స్ బిల్లులు మాత్రం వస్తూండేవి. ఈ ట్రెజరీ డిప్యూటీ కలెక్టరు తన తాహతు తెలీక వాటిని పాస్ చేయ డానికి వీలులేదని అడ్డుపడ్డాడు. అందుచేత ఇద్దరికీ పైకి చెప్పుకోలేని తగాదా ఒకటి ఏర్పడింది. వెంటనే కలెక్టరు, డిప్యూటీ కలెక్టరు నిబంధనలు ఒప్పుకొన్న దానికన్న హెచ్చుగా కలంపాళీలు, ఒకటో రెండో పెన్సిళ్ళు మొదలైనవి న్యాయవిరుద్ధంగా తన ఇంటికి తీసుకు పోయి వాడుకొన్నాడనీ, అందుచేత అతనిని ఎందుకు శిక్షించ గూడదో సంజాయిషీ ఇవ్వాలనీ నోటీసు జారీ చేయించాడు. డిప్యూటీ కలెక్టరు, కలెక్టరు ఆఫీసుకు తెలియకుండా రాత్రికి రాత్రే బయలుదేరి చెన్నపట్నం వచ్చి, మేము ఆఫీసుకు వెళ్ళేసరికి, సరిగా వచ్చి ప్రకాశం గారి ఆఫీసుగదిలో సిద్ధమయినాడు. ఇదీ అతడు చెప్పుకున్న సంజా యిషీ: కొన్ని ఏండ్ల క్రిందట ప్రకాశంగారి కాంగ్రెసు పర్యటనలో అతడు ఆయనకు ఎలాగో పరిచయమైనవాడు. ఆ చనువుచేత బంట్రో తుకు నచ్చజెప్పి లోపలికి వచ్చి మఠం వేశాడు. ప్రకాశంగారు నేను

లోపలికి వెళ్ళేసరికి దండంపెట్టి "గురువుగారూ!" అంటూ కోటు జేబులు రెండింటిలోంచి రెండు మామిడి పళ్ళుతీసి ఆఫీసుబల్లపై పెట్టాడు. "ఏమిటండీ?" అని ప్రకాశంగారు అడిగేలోపున పంట్లాం జేబులు రెంటిలోంచి మరి రెండు మామిడిపండ్లు తీసి బల్లపై పెట్టాడు. అతని వైఖరిలో కొంత వెర్రితనం కనిపిస్తున్నది. "ఏమిటయ్యా విషయం?" అనేసరికి, తన బ్రీఫ్‌బేగ్‌లో ఉన్న మరో రెండు మామిడి పండ్లు తీసి బల్లపై పెట్టాడు.

"ఇదంతా ఏమి?"టని గట్టిగా ప్రశ్నిస్తే, "గురువుగారూ! ఆ తురకవాడు నన్ను బతకనివ్వడండి," అన్నాడు. అది వినగానే అతడు నెల్లూరు ట్రెజరీ డిప్యూటీ కలెక్టరు అయివుంటాడని గ్రహించగలిగాను. అతడు జిల్లాకలెక్టరు ట్రావెలింగు ఎలవెన్సు విషయమై పెట్టిన అభ్యంతరాలు, వాటికి కలెక్టరు ఇచ్చిన సంజాయిషీ, డిప్యూటీ కలెక్టరు అవకతవక మనిషి అన్న బోర్డు రిపోర్టు మొదలైన కాగితాలున్న ఫైలు, మేము అంతకు రెండు మూడు రోజులక్రితం చూడడం తటస్థించింది. నేను వెంటనే "నాయుడుగారూ! మీరు ఇలా మంత్రిగారిని నేరుగా చూడడానికి వస్తే, మీ నిబంధనలు ప్రకారం మీపైన ఇంకోనేరం రాదుగదా!" అంటే, వెంటనే అతడు "నే నిక్కడికి వచ్చినట్టు అక్కడ ఏం రికార్డుంటుందండీ?" అని ప్రశ్నించాడు. ప్రకాశంగారు, నేను అనుకోకుండా పెద్దగా నవ్వుకున్నాము. మే మిలా మాట్లాడుతుండగానే, అతడు ప్రభుత్వం తాలూకు కలాలు, పాళీలు దుర్వినియోగం చేస్తున్నాడని కలెక్టరు అతనిపై పెట్టిన ఛార్జి ఫైలు బంట్రోతు తెచ్చి, అక్కడున్న ఫైళ్ళకట్టలపై పెట్టడం జరిగింది. ఫైలురాగానే దాని ముఖపత్రం చూడడం ఏ ఉద్యోగికైనా, మంత్రికైనా అలవాటు. తీసి చూసేసరికి అది ఈ డిప్యూటీ కలెక్టరు పాళీలఫైలు.

"ఏమిటి నాయుడుగారూ, ఈ పాళీల వ్యవహారం?" అని ప్రకాశంగారు నవ్వుతూ అడిగారు.

"అదేనండీ గురువుగారూ! ఆ తురకవాడు నన్ను బతకనివ్వడు. అది చెప్పటానికే వచ్చాను," అని మరోమారు అన్నాడతడు.

అపుడు ప్రకాశంగారు "ఏమయ్యా! నిన్ను ట్రెజరీ డిప్యూటీ కలెక్టరు అనుకోమన్నావా? పిచ్చివాడనుకో మన్నావా?" అని కొంచెం గట్టిగా అడిగారు.

దానికతడు మెల్లగా తలవంచుకొని "మీరేమయినా అనుకోండి. నన్నుమాత్రం వాడినుంచి రక్షించండి," అని ప్రాధేయపడ్డాడు.

ప్రకాశంగారు "సరే వెళ్ళు. మేము చూసుకొంటాము," అని అతనిని మెల్లగా పంపించివేశారు. పాశీల కేసు వట్టి పనికిమాలినదని డిఫెన్సుకోసమని నే నేదో ఒక కథనం అల్లబోతూంటే, మరో రెండు రోజులకల్లా మరొక ఫైలు ఇదే ట్రెజరీ డిప్యూటీ కలెక్టరుపైన ఛార్జి షీటుతో వచ్చింది—కలెక్టరు అనుమతి లేకుండా చెన్నపట్నం వెళ్ళాడని, అలా చేయలేదని అతని జవాబూ, దానిపైన తానూ డిప్యూటీ కలెక్టరూకూడా ఒకే ట్రైనులో చెన్నపట్నం ప్లాట్ ఫారంమీద దిగామనీ, దిగినపుడు అతడు దొరికాడని కలెక్టరు రిపోర్టు అందులో ఉన్నవి. ప్రకాశంగారిని చూసివెళ్ళిన అతనిని కాగితాలమీద రక్షించడం దుస్సాధ్యమని ప్రకాశంగారు గ్రహించారు. ఆయన బోర్డుమెంబరును గదిలోనికి పిలిపించి,కలెక్టరు టి. ఏ. బిల్లుల విషయంపై డిప్యూటి కలెక్టరు పెట్టిన అభ్యంతరాలు సరైనవికావని నిర్ణయించడానికీ, డిప్యూటీ కలెక్టరుపై పాశీలకేసు చాలా చిన్న వ్యవహారం గనుక దాన్ని వదలిపెట్టడానికీ ఏర్పాటు చేయించారు.

అంతటితో అ విషయం సమసిపోయింది. కలెక్టరు, డిప్యూటీ కలెక్టరు ఇద్దరూ తప్పుచేసినవాళ్లే. ఇలాంటి విషయాలు చాలా ఆఫీసుల్లో జరుగుతుంటాయనీ, ఇవి మంత్రులవరకూ రావనీ, వీటి మూలకారణాలు తరచుగా ఉద్యోగానికి సంబంధం లేనివై ఉంటాయనీ వేరుగా చెప్పనక్కరలేదు.

## జ మీం దా రీ ల స మ స్య

మంత్రివర్గం ఏర్పాటైన రెండు నెలలలో జమీందారీల విషయమై దర్యాప్తు సమస్య ఉద్భవించింది. ఒక రోజున, రాజమహేంద్రవరం కాంపులో ప్రకాశంగారూ, నేనూ ఉండగా, కాండ్రేగుల జమీందారు గారు ప్రకాశంగారిని చూడడానికి వచ్చారు. ఆయన చాలా చిన్న జమీం దారు. స్వాతంత్ర్యోద్యమంలో రహస్యంగానో, బహిరంగంగానో కాంగ్రెసు నాయకులకు సాయం చేస్తూండేవాడు. ఆయన కున్నది నీటి తగవు. ఆయన వెళ్ళిన తరువాత ఆయన తాలూకా రైతులు గుంపుగా వచ్చి ప్రకాశంగారిని చూశారు. వారూ ఆ నీటి తగవుకోసమే వచ్చారు వారు ఫిర్యాదు చేసింది జమీందారుపై. జమీందారుగారు ఫిర్యాదు చేసింది ప్రభుత్వం పైన. ఇవి రెండూ ఒకే నీటి వనరును గూర్చినవి. సాయం కాలం ప్రకాశంగారూ, నేనూ చల్లగాలికోసం నడుస్తూన్న సమయంలో ఈ జమీందారు ప్రసంగం వచ్చింది. అప్పుడు నేను ప్రకాశంగారితో ఇలా అన్నాను: "మన రాష్ట్రంలో జమీందారీ రైతులకు ఆక్యుపెన్సీ రైటు (సాగు హక్కు), ఆ హక్కును వారసత్వం క్రింద పొంద గలిగే హక్కు, విక్రయించగలిగే హక్కు ఉండడంచేత 1908 నుంచి కొంత స్థిమితం కలిగింది. అయితే, ముఖ్యమైన ఇబ్బంది నీటి విషయమైనదే.

"నీటి వనరులు—నదులు మొదలైనవి—జమీందారీ, ప్రభుత్వా నివి, ఇనాముదారీ అనే మూడు రకాలైన భూముల గుండా ప్రవ హిస్తాయి. ఈ భూముల వి స్తీర్ణాన్నిబట్టి తగాదాలు హెచ్చినవి. అంతకు పదిహేను పదహారు సంవత్సరాల క్రితం ఉర్లాము జమీందారీలో గల నీటి హక్కుల విషయమై వచ్చిన ప్రివీ కౌన్సిల్ తీర్పువల్ల లేనిపోని చిక్కులు కలిగి, రైతులు బాధపడుతున్నారు. ఆ తీర్పులో, నదికి రెండు ప్రక్కల జమీందారీ భూములున్నట్లయితే అంతమటుకు జమీందారే నదికి స్వామి అన్నారు. అదే విధంగా ఇనాము భూము లున్నట్లయితే ఇనాముదారే నదీస్వామి అన్నారు. రెండు ప్రక్కల ప్రభుత్వపు భూములు—అంటే రైత్వారీ భూములు-ఉంటే అంత

మటుకు ప్రభుత్వాన్ని నదీస్వామి అన్నారు. ఒక ప్రక్క ఒకరు, రెండవ ప్రక్క ఇంకొకరు భూస్వాములైతే నదీ గర్భంలో వారిరువురికి చెరి సగం స్వామిత్వం కలుగుతుందన్నారు.

మాట వరసకేమో-సేద్యపు హక్కులకు భంగం రాకుండా పైన చెప్పిన నదీస్వాములు నదులపైన వారికి కావలసిన కట్టడాలు కట్టుకో వచ్చున్నారు. అయితే, న్యాయశాస్త్ర ప్రకారం ఈ కట్టడాలు కట్టే ముందు క్రిందా మీదా ఉన్న నదీస్వాముల అనుమతి పొందాలి. ఆ పొందడంలోనే కష్టాలన్నీ ఉండేవి. ఒకరికొకరు అనుమతించడానికి సంవత్సరాలు పట్టేది. ఒక్కొక్కప్పుడు ఎన్ని ఏళ్ళయినా అట్టి అనుమతి వచ్చేది కాదు.

"ఈ విషయంలో ప్రభుత్వంవారు, జమీందారు, ఇనాముదారు-ఒకరి కొకరు తీసిపోకుండా ఉండేవారు. ఈ అనుభవం నాకు స్వయంగా కలిగింది. అందుచేత, నీటి సరఫరాపై గల హక్కులు సంపూర్ణంగా శాసనం ద్వారా ప్రభుత్వం తీసుకొంటేనే భూములకు, రైతులకు మేలు జరుగుతుంది. పెర్మనెంటు సెటిల్‌మెంటు శాసనాలలో నీటి హక్కు జమీందారులకు సంక్రమింపజేయలేదు. సంక్రమింపచేసిన ఆ హక్కులు ప్రభుత్వం న్యాయరీత్యా తీసికొనే హక్కు సర్వదా ఉన్నది."

ఈ విషయాలన్నీ నేను ప్రకాశంగారికి చెప్పగా, ఆయన దానికొక బిల్లు తయారు చేయవలసిందని చెప్పారు. బిల్లు డ్రాఫ్ట్ తయారీ మొదలు పెట్టేసరికి అనేక న్యాయ సందేహాలను (లా పాయింట్లు) లేవదీశారు. ఇవన్నీ మొత్తం పైన చర్చ చేయాలన్నారు. దీని కొక కమిటీ వేసి, దాని సిఫార్సుపై నడిస్తే బాగుంటుందన్నారు. రెవిన్యూ శాఖకు అప్పుడు సెక్రటరీ రామున్ని మేనోన్ అనే ఐ. సి. యస్. ఉద్యోగి. కమిటీ అనగానే ఆలస్యం తప్పదు.

అయితేనేమిగాని, ఒక కమిటీ వేయడానికి ప్రకాశంగారు ఒప్పుకొన్నారు. ఆ కమిటీకి ప్రశ్నావళి ఏర్పాటుచేసే విషయమై అనేక న్యాయ సమస్యలు సముద్ర తరంగాలవలె ఉద్భవించినవి. దానికి కారణం దృష్టి భేదము. నేను చదువుకొన్నది హిందూ జ్యూరిస్

స్ప్రుడెన్స్. దాని ప్రకారంగా, భూమి హక్కు రైతుది. ఉపరిభాగంలో దాని గర్భంలో అతని భూమి పరిమితి మధ్యగలదాని సర్వ సంపూర్ణమైన హక్కు రైతుది రైతు రాబడిలో ఒక నిర్ణీత భాగంపైనే ప్రభుత్వానికి హక్కుంది. కాని, ఐ. సి. యస్. ఉద్యోగులు చదువుకొన్నది ఇంగ్లీషు జ్యూరిస్ ప్రుడెన్స్. దాని ప్రకారం భూమి హక్కు ప్రభుత్వానిది. రైతుకు పన్ను చెల్లించి, దున్నుకొనేందుకు మాత్రమే హక్కు కలదని దాని తాత్పర్యము. అందుచేత, ప్రశ్నలలో చాలా భాగం ఈ హక్కుల నిర్ణయం పైనే ఆధారపడి ఉండడంచేత మొదటి ప్రశ్నగా, "ఈ భూమి హక్కు జమీందారుదా? రైతుదా? మీ అభిప్రాయం చెప్పవలసిన"దని నేను వ్రాశాను. ఎందుకైనా మంచిదని ప్రకాశంగారికి ఈ ప్రశ్నను గురించి చెప్పాను. అసలు ఉర్లాము కేసు ఈ హక్కుపైన ఆధారపడిందే కాబట్టి, "అలాగే కాని"మ్మన్నారు. దాని పైన మిగిలిన అనుబంధ ప్రశ్నలు, నీటి వనరుల సౌకర్యాలు, శిస్తులు హెచ్చింపు తగ్గింపుల విషయాలు, జమీందారీలోగల కొండలు, అడవులు నీటి సరఫరా విషయాలు, జమీందారులకు రైతులకూ ఉన్న సామరస్య వైషమ్య సంబంధాలన్నీ పరిశీలించేందుకు శాసన సభ్యులు గల ఒక ఉప సంఘాన్ని నియమించడానికీ, వారి రిపోర్టు శాసన సభకు అందజేయవలసినదిగానూ శాసన సభలోను, శాసన మండలిలోను ప్రకాశంగారు తీర్మానాన్ని ప్రతిపాదించారు. నిబంధనల ప్రకారం ఆ కమిటీ సభ్యుల పేర్లు, వారు పరిశీలించవలసిన విషయాల స్థూలమైన వివరాలు ఆ తీర్మానంలోనే ఉన్నవి.

ఈ ఉప సంఘం కొన్ని ప్రశ్నావళులను పత్రికల మూలంగా ప్రకటించి, రాష్ట్రంలో కొన్ని ముఖ్యమైన కేంద్రాలలో సాక్ష్యములు తీసికొని చర్చలు జరిపి, రిపోర్టు తయారుచేసి, దానిపై సంతకము చేయడానికి సహజంగానే కొంతకాలం పట్టినది. 1938 నవంబరులో ఈ రిపోర్టు శాసన సభకు అందజేయడమైనది. 1939 జనవరి, ఫిబ్రవరి నెలలలో ఉభయ శాసన సభలు నివేదికను, అందుతో పొందుపరచిన బిల్లులను ఆమోదించడం జరిగింది. అయితే, దురదృష్టం కొద్దీ అవి

శాసన రూపంగా శాసన సభ ముందుకు రావడానికి నోచుకోలేదు. ఆ విషయం క్లుప్తంగా చెప్తాను.

# 3

## జమీందారీ ఎంక్వైరీ కమిటీ నివేదిక

ప్రప్రథమంగా, జమీందారీలకు సంబంధించిన తీర్మానాలు శాసన సభలో ప్రతిపాదించి నపుడు కొంతమంది సభ్యులు అడ్డుపెట్టిన మాట వాస్తవము. అయితే, అవి సంప్రదాయ రీత్యా పెట్టిన అభ్యంత రాలని భావించాము. కాని, రానురాను పరిశీలన సాక్ష్యసేకరణ జరుగు తున్న సమయంలో ప్రీవీకౌన్సిల్ తీర్పులు ఏ పరిస్థితులను స్థిరపరిచాయో ఆ పరిస్థితులకు భిన్నంగా కమిటీవారు సేకరిస్తున్న సాక్ష్యం ఉన్నదని, అలా చేయడం న్యాయవిరుద్ధమని మొదలుగాగల వాదాలు పత్రికల మూలంగా బయలుపడి ఒక నూతన, వైషమ్యాత్మకమైన వాతావరణాన్ని కలిగించాయి. ప్రీవీ కౌన్సిల్ తీర్పుకు వ్యతిరేకంగా మనం శాసనం చేయవచ్చునా-చేయరాదా అన్న ప్రశ్న, శాసన సభలకు గల హక్కు లేమిటన్న ఒక ఉప ప్రశ్న, దాని పైన శాసన సభ్యులకు గల విజ్ఞాన పరిమితులు మొదలుగాగల విషయాలన్నీ చదువుకొన్న పెద్దలు రచ్చ బండపైకి తీసుకు రావడం తటస్థించింది. గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు ముఖ్యమా? లేక ప్రజల హక్కు, అధికారం, సుఖ దుఃఖాలు అన్నవి - అనగా "ప్రజాస్వామ్యం" ముఖ్యమా? అన్న మౌలిక సమస్య పరిష్కారం చేయవలసిన సమయం వచ్చింది. దీనితో, ప్రకాశంగారికి ముఖ్యమంత్రిగారు విముఖులయ్యారనే కింవదంతి శాసన సభలోను, వార పత్రికలలోను, క్లబ్బులలోను ప్రబలింది. కమిటీ ఆరంభించిన నాలుగైదు నెలలకు ప్రకాశంగారు, ముఖ్యమంత్రిగారు పరస్పర సంభా షణలు మానుకున్నారనే మాటకూడా ఎక్కడబడితే అక్కడ చెప్పు కొంటూ వచ్చారు. మంత్రివర్గంలో కూడా మంత్రులు రెండు పక్షాలై

ఈ మాట వచ్చినప్పుడెల్లా ఎడముఖం పెడముఖంగా ఉంటూ వచ్చారు. కమిటీలో ఒక జమీందారు సభ్యుడుగా ఉండేవారు. ఆయనకు సహాయంగా ఒక శాసన సభ సభ్యుడు (ముస్లిం లీగు) ఉండేవారు. చర్చలు ఎంత రహస్యంగా ఉంచినా అవి ఇంతో అంతో బయటకు వచ్చేవి. అలా వచ్చే వాటిలో సగమే సత్యముండేది. ఈ అర్ధ సత్యం పూర్తి అసత్యం కన్న ప్రమాదకరమన్న విషయం రుజువైంది.

ఒకరోజు డ్రాఫ్టులో జమీందార్లందరు దేశ ద్రోహులు (Traitors) అని వ్రాశారు. దానిపైన నేను, 'అంతమందీ దేశ ద్రోహులు ఎలా అవుతారు? మనమే కోరి విజయనగరం రాజాను మెంబరుగా చేర్చుకున్నాం కదా' అని, ఆ వాక్యం సవరిస్తే బాగుంటుం దనే ఉద్దేశంతో, ప్రక్కన పెన్సిలుతో వ్రాశాను. ప్రకాశంగారికి దాని వల్ల నా మీద చాలా ఆగ్రహం కలిగింది. అప్పట్నుంచి డ్రాఫ్టులు పూర్తి అయ్యేవరకు నాకు పంపించడం మానివేశారు. ఆ కోపం తగ్గాక, ఆ విషయం ఆయనా, నేనూ కూడా పట్టించుకోలేదు.

ఈ లోపున కమిటీ కార్యదర్శిగా, 1786 దగ్గరనుంచి రెవిన్యూ శాఖ పెర్మనెంటు సెటిల్మెంటుకు సంబంధించిన పాత రికార్డులు, బోర్డ్ ఆఫ్ రెవిన్యూ తీర్పులు, ప్రభుత్వపు ఆర్డర్లు, తీర్మానాలు, అంతకు పూర్వం జమీందారీకి సంబంధించిన శాసనాలు, పెర్మనెంటు సెటిల్మెంటుకు మూలమైన అన్ని కాగితాలు – సేకరిస్తూ ఉంచే ఆ చర్య అంతా ఒక ఆధునిక మహాభారతమై, చూసేవారికీ వినేవారికీ మహాశ్చర్యం కలిగించింది. ఈ సంఘానికి ప్రకాశంగారు అధ్యక్షులు కావడం చేత, తమకు లాభం తప్పక కలుగుతుందని, కరాచీకాంగ్రెసు తీర్మానం ప్రకారం మధ్యవర్తులైన జమీందారులు పోతారనీ, జమీందారీ విధానం అంతం కాగలదనీ రైతులు ఆశపడ్డారు. ప్రకాశంగారు ఒకప్పుడు జమీందారుల తరఫున న్యాయవాదిగా ఉండడంచేత, న్యాయవాది గనుక ప్రీవీకౌన్సిలువంటి ఉన్నత న్యాయస్థానపు తీర్పులను గౌరవించే తీరుతా రని, సంఘంలో జస్టిసు పార్టీకి చెందిన ఒక జమీందారు, వారికి బలంగా ముస్లింలీగువారు కూడా ఉండడంచేత పరిస్థితులు అంతగా విష

మించవనీ; అలా కాకపోయినా ముఖ్యమంత్రిగారు ప్రకాశంగారికి విము ఖులు గనుక ప్రకాశంగారిని అడ్డవలసిన విధంగా అడ్డగలరనీ- జమీం దారులూ, వారి న్యాయవాదులూ, వారి మిత్రులూ, వారికి మిత్రులైన శాసన సభ సభ్యులూ చెప్పుకుంటూ ఉండేవారు. ఈ అభిప్రాయ భేద కల్లోలాలలో ప్రకాశంగారు మాత్రం తాను వ్రాయవలసింది వ్రాసు కొంటూ, మౌనదీక్ష వహించి, దూషణ భూషణలకు అతీతులై ఉండే వారు.

అయితే, జమీందారులంతా కలసి పెద్ద ప్రయత్నం చేయడానికి తలపెట్టి, తమలో తాము చందాలుకూడా వేసికొని, శ్రీ కె. ఎమ్. మున్షీ గారిని ఒక లక్షరూపాయల ఫీజుమీద తమ సలహాదారుగా నియమించి, వల్లభాయ్ పటేలుగారి దగ్గరకు తమ తరఫున విజ్ఞప్తిచేయడానికి పంపిం చారు. శ్రీ మున్షీ కాంగ్రెసు నీతిప్రకారం జమీందారీ పద్ధతి రద్దు చేయ డానికి వ్యతిరేకంగా వెళ్ళడం సమంజసం కాదని మేమంతా అభిప్రాయ పడ్డాము. ఎందుచేతనంటే - ఆ రోజులలో ఆయన అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీలో సభ్యుడుగానూ కాంగ్రెసుకు సన్ని హితుడుగాను ఉండేవాడు.

ఈ లోపున రిపోర్టు పూర్తిచేయడం జరిగింది. కాని, మెంబర్లు అందరి సంతకాలు కావడానికి, ప్రకాశంగారు వ్రాసిన అభిప్రాయాలతో ఏకీభవించేటట్లు చేయడానికి రెండు మూడుమార్లు అంతా సమావేశం కావలసి వచ్చింది. ఇందులో ముఖ్యంగా అభ్యంతరకరం అనిపించిన విషయం- జమీందారీల రద్దుమాట అట్టేపెట్టి, ప్రప్రథమంలో 1802 లో, అనగా పెర్మనెంటు సెటిల్మెంటు జరిగిన నాటి సిస్తులకు సిస్తురేట్లు అన్నీ తగ్గించవలసినదని ఉత్తర పూర్వపక్షాలు విమర్శచేసిన ప్రకాశంగారి సిద్ధాంతము. సిస్తులు హెచ్చు చేయవచ్చునా కూడదా అనే విషయం గురించి పెర్మనెంటు సెటిల్మెంటు అయిన తర్వాత రెండు మూడు పర్యాయాలు గవర్నమెంట్ బోర్డు అఫ్ రెవిన్యూవారు ఆలోచించారు. అయితే, కొన్ని భిన్నాభిప్రాయాలు కూడా ఏర్పడినవి. పేష్కష్ అనగా- జమీందారు ఏటేటా ప్రభుత్వానికి చెల్లించవలసిన మొత్తం నిర్ణయించే

సందర్భంలోను, రైతుల దగ్గిర సిస్తులు పెంచి వసూలు చేయవచ్చునా కూడదా అన్న విషయంలోను జమీందారులు మొదట్లో సవ్యమైన పద్ధతిలో వెళ్ళినట్లు కనిపించదు. ధనాశ చూపించి పెద్ద ఉద్యోగులను గవర్నరుతో సహా- తమకు అట్టి హక్కులు సంక్రమించినవన్న వాదం బలపరచుకొనేలాగున వారు చేసికొన్నారు. రైతులలో ఆందోళన బయలుదేరింది. ఇది ఈస్టిండియా కంపెనీ డైరక్టర్లకు తెలిసి, ఈ విషయంగా రహస్యంగా పరిశీలించడానికి ఒక సంఘాన్ని వేయడం జరిగింది. ఆ పరిశీలన ఫలితంగా ఆనాటి చెన్నరాష్ట్ర గవర్నరును ఉద్యోగంనుంచి తప్పించడంకూడా జరిగింది.

ఇంతేకాక, మొదట్లోఉన్న రెగ్యులేషన్స్ (శాసనాల) ప్రకారం సిస్తులు హెచ్చించడానికి జమీందార్లకు హక్కులేదు అనే విధి ఉండెను. దీనికి సంధించిన కాగితాలను ప్రకాశంగారి ముందు సేకరించి పెట్టగా, ఆయన జమీందారీలను తక్షణం రద్దు చేయాలన్న ప్రతిపాదనపై ఉన్న దృష్టి మరల్చుకొని, అన్ని జమీందారీలలో ఉన్న సిస్తురేట్లు 1802 నాటి రేట్లకు దించివేయాలనే అభిప్రాయం గట్టిగా ఆయనకు కలిగినది. అయితే, 1858-1908 లలో చేసిన శాసనం ప్రకారంగా ఆనాటి రేట్లు స్థిరపరుపబడి, ఇరవై సంవత్సరాలకొకసారి దినుసుల ఖరీదులు జాస్తి అయినట్లయితే రూపాయకు రెండు అణాలు రెవిన్యూ కోర్టులో పిటీషనులువేసి హెచ్చు చేయించుకొనే హక్కు ఇవ్వబడింది. ఇలాంటి పరిస్థితులలో 1802రేట్లు పునరుద్ధరించడం ఎలాగన్న శంక మెంబర్లకు కమిటీ సభ్యులకు, వృత్తిచేస్తూన్న లాయర్లకు కలిగింది. 1908 శాసనాలు తప్పయినట్లయితే వాటిని ఎందుకు సవరించకూడదు? రైతులకు మేలు ఎందుకు చేయకూడదు? అని ప్రకాశంగారి వాదన.

ఎలాగైతే నేమి, కమిటీ సభ్యులలో కాంగ్రెసు వారందరు - ప్రకాశంగారు కాక, మిగతా అయిదుగురు, రిపోర్టును ఆమోదించి సంతకాలు పెట్టారు. జమీందారు మెంబరు, జస్టిస్‌పార్టీ మెంబరు, ముస్లిం లీగు మెంబరు ఇది కాదని వారి వ్యతిరేకతను ప్రత్యేకంగా వ్రాసుకొన్నారు.

దీని తరువాత ఘట్టం ఇంకా విచిత్రంగా జరిగింది. కమిటీ మెంబర్ల సంతకాలయిన వెంటనే, రిపోర్టు పూర్తిగా అచ్చుకావడానికి సైము చూచుకొని ఏదో తేదీని నిర్ణయించి, ఆ తేదీన శాసన సభలో నివేదిక అంద జేయడానికి నోటీసులను ఇవ్వడం జరిగింది. ఎజెండాలో ఈ విషయంకూడా అచ్చయింది. ఆ ఉదయం స్పీకరు సాంబమూర్తి గారు నాకు టెలిఫోనుచేసి, తమను అర్జంటుగా వచ్చి చూడమని చెప్పారు. నేను వెళ్ళగానే తమకు, గవర్నరుకు జరిగిన సంభాషణ సారాంశం చెప్పారు. గవర్నరుగారు ఫోనుచేసి స్పీకరును ఒకమారు కలుసుకోవాలన్నారు. స్పీకరు నాటి సెషను కాగానే కలుసుకుంటాననగా గవర్నరు అంతకుముందే కలుసుకోవలె నన్నారట. విషయమేమని స్పీకరు అడగగా, గవర్నరుగారు కమిటీ రిపోర్టు శాసన సభకు ఆ రోజుకు అందజేయకుండా ఆ విషయం వాయిదా వేయరాదా అన్నారుట. కాన్స్టిట్యూషనల్ గవర్నరు అయిన ఎర్స్కిన్ ప్రభువు ఆ విధంగా స్పీకరును కోరడం అన్నది చాలా అసందర్భము. ఆ మాట అలా ఉంచండి. ఆయన ఎందుకలా కోరారు? గవర్నమెంటువారు ముందుగా ఆలోచించకుండా, ఒక నిర్ణయానికి రాకుండా సభకు నివేదికను అంద జేయడం మంచిది కాదుకదా అన్నది గవర్నరు అభిప్రాయము. దాని మీద సాంబమూర్తిగారు మాట తప్పించి, గవర్నరు ముఖ్యమంత్రితో ఈ విషయం మాట్లాడారా అని ప్రశ్నించారట. గవర్నరు ఫోనులోనే నవ్వి, "అది మీరు ఎలా కనిపెట్టా"రని అడిగారట. దానిపైన సాంబ మూర్తిగారు గవర్నరు కోరినట్లే ముఖ్యమంత్రికూడా కోరి, తనతో అవే మాటలను అన్నట్టు గవర్నరుకు చెప్పారట. దానిపై తెలివైన న్యాయవాదులైన సాంబమూర్తిగారు ముఖ్యమంత్రి చెప్పినట్లు చేయ కూడదా అని గవర్నరు అంటే, సాంబమూర్తిగారు—అది ఎంత మాత్రం వీలుపడదనీ, శాసన సభ నియమించిన సంఘం నివేదికను శాసన సభకే అందజేయాలి కాని, గవర్నమెంటు కిచ్చే వీలులేదనీ, ఎజెండా పత్రికలలో వచ్చిన తరువాత దావాయి వేస్తే కొంపలు అంటు

కుంటాయనీ, అసలది ముఖ్యమంత్రికే మంచిది కాదన్నారుట. గవర్నరు సాంబమూర్తిగారు చెప్పినది బాగుందని అలాగే కానిమ్మన్నారుట.

సాంబమూర్తిగారు ఈ విషయా లన్నీ నాతో చెప్పి, "నేను ప్రకాశంగారి కింకా ఈ విషయాలు చెప్పలేదు. నీవు వెంటనే వెళ్ళి చెప్పిరా. నేను తర్వాత మాట్లాడుతాను" అని చెప్పారు. ముఖ్యమంత్రికి అంతకాలంగా ప్రకాశంగారితో మాటలు లేకపోయినా, ఆనాడు స్వయంగా ప్రకాశంగారి దగ్గరకు వెళ్ళి, నివేదికను ఆపుచేయ కూడదా అని అడిగినట్టూ, ఆయన దానిని సహజంగానే నిరాకరించి నట్టూ నాకు తర్వాత తెలిసింది. వారు నిరాకరించిన తర్వాత స్పీకరును ఉపయోగించి నివేదికను ఆపడానికి యత్నించడం పార్లమెంటరీ విధానానికి అపకృతి. అంతకన్నా కూడా ప్రజాస్వామ్యానికి హెచ్చు అపకృతి- ఈ విషయంలో గవర్నరుగారిని కూడా రంగంలోకి దింపటం

నేను ప్రకాశంగారి వద్దకు వెంటనే వెళ్ళి, సాంబమూర్తిగారు చెప్పినదంతా యథాతథంగా చెప్పగా, ఆయన "అవునులే! ఈ దేశంలో అన్ని వ్యవహారాలూ తలక్రిందులుగానే జరుగుతాయి!" అన్నారు.

ఆ రోజున నివేదిక ఇచ్చినపుడే రాబోయే జనవరి 20 వ తేదీన శాసన సభలో దానిని చర్చించే సమయమని నిర్ణయం జరిగింది. ఇలా ఉంటూండగా, కొద్ది రోజులలో ప్రశ్నోత్తర సమయంలో ఈ కమిటీ విషయం వచ్చింది. ప్రశ్నోత్తర సమయాలలో ప్రకాశంగారి తరపున నేనే- రెండు మూడు సమయాల్లో తప్ప, ఎప్పుడూ జవాబులు చెప్పడం జరిగేది. ఆ ప్రశ్న వచ్చినపుడు, నేను దానికి జవాబుగా, రిపోర్టు శాసన సభకు అందించడమైనదని, జనవరి 20 వ నాడు జరిగే చర్చపై శాసన సభవారు చేసే తీర్మానాన్ని బట్టి శాసనం ఎప్పుడు ఎలా చేసేది తెలుస్తుంది అనీ అన్నాను.

ముఖ్యమంత్రిగారు వెంటనే నా చేయి తట్టి, "అలా జవాబు చెప్పవద్దు. గవర్నమెంటువారు నిర్ణయిస్తారని చెప్పు," అన్నారు.

ఇంతట్లో సప్లిమెంటరీగా అనుబంధ ప్రశ్న వచ్చింది. నేను

తిరిగి మొదట చెప్పిందే మరింత విపులంగా, గట్టిగా చెప్పాను. ముఖ్య మంత్రిగారికి కోపం, అసంతృప్తి కలిగినట్లు నాకు కన్పించింది.

తిరిగి ఆయన నాతో, ఈ మారు సప్లిమెంటరీ ప్రశ్నకు జవాబులో మాట మార్చి తాను చెప్పినట్లు చెప్పవలసిందన్నారు. దానిపై నేను "మీరు మామూలుగా చేసే పద్ధతిలో నిల్చొని, ఆ జవాబు మీకు ఉచితమని తోస్తే మార్చివేయండి," అన్నాను.

నేను నిలిచింది ప్రకాశంగారి తరపున గనుక, ముఖ్యమంత్రి గారు చొరవచేసి జవాబు మార్చరని నాకు లోపల ఒక విశ్వాసం ఉండే అలా చెప్పాను. ఆయన మరి మాట్లాడలేదు. అది అప్పటికి ఆగి పోలేదు. మరికొంతసేపయిన తర్వాత ముఖ్యమంత్రిగారు చటుక్కున నా వైపు తిరిగి, జవాబులు ప్రొసీడింగ్స్‌లో (అంటే - శాసన సభలో జరిగే ఉత్తర ప్రత్యుత్తర, సంభాషణ, ఉపన్యాసముల యథాతథమైన రిపోర్టు) సరిదిద్దవలసిందని చెప్పారు. నేను అలా కుదిరే వ్యవహారం కాదని నిష్కర్షగా, మర్యాదగా, మెల్లగా ఆయనకు చెప్పేసరికి, ఆయన ఇంగ్లీషులో "యూ అర్ ఇన్‌కారిజిబుల్" (you are incorrigible) అన్నారు. ఈ విషయాలు నేను ప్రకాశంగారికి చెప్పలేదు. అప్పటికే ఇద్దరి మధ్య వైషమ్యాలు హెచ్చుగా ఉన్నపుడు అగ్గిమీద గుగ్గిలం వేసినట్టు, ఈ విషయం చెప్పడం ఎందుకని నేను ఊరుకొన్నాను.

శాసన సభలో చర్చ వచ్చేనాటికి నివేదిక అంతా సభ్యులు చదివి ఉండడంవల్ల, జన బాహుళ్యానికి కూడా నివేదిక యథాతథంగా తెలియడంవల్ల వాతావరణంలో ఒక బ్రహ్మాండమైన నవ్యత్వం ఆవిర్భవించింది. ప్రకాశంగారు కేవలం తాను పట్టిందే పట్టు అనే మనిషి అన్న అపప్రథకూడా తగ్గింది. పాత రికార్డులు, పెర్మనెంటు సెటిల్మెంటు నాటి గవర్నమెంటు వాగ్దానాలు, వివాదాలు పరిష్కారం చేసే సమయంలో లోగడ రెవిన్యూ మెంబర్లు ఇచ్చిన ఉపన్యాసభాగాలు అందరికీ తెలిసేసరికి, ఇదివరకు అభ్యంతరం పెడుతున్నవారి సానుభూతి చాల మటుకు ప్రకాశంగారియెడల దినదినాభివృద్ధిగా పెరిగింది. శాసన సభలో ఈ నివేదిక చర్చ జరిగే జనవరి 20 వ తేదీ ఒక పర్వదినంవలె కన్పిం

చింది. అన్ని జిల్లాల్లోంచి జమీందారీ రైతులు గుంపులు గుంపులుగా చెన్నపట్నం చేరుకున్నారు. చర్చ ఆరంభించడానికి రెండుగంటల ముందే సభామందిరపు ఆవరణమంతా వారితో నిండిపోయింది.

# 4

## శాసన సభా విశేషాలు

మంత్రివర్గం ఏర్పాటయిన తర్వాత మొదటి శాసన సభా కార్య క్రమపు ఉదంతాలు ఇక్కడ కొంచెం వ్రాస్తాను. 1935 గవర్న మెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు ననుసరించి శాసన సభ విస్తృతమైంది. ఫోర్టు సెంటు జార్జిలో అప్పటి వరకూ ఉన్న శాసన సభా భవనం విస్తృత మైన శాసన సభకు సరిపోదు గనుక, కొత్తగా పెద్ద భవనం ఒకటి కోటకు దక్షిణంగా ఉన్న ఐలెండుగ్రౌండు అనే పెద్ద మైదానంలో తూర్పు భాగాన నిర్మించడానికి అప్పుడు ప్రభుత్వంవారు ఏర్పాటు చేశారు. ఆ భవనానికి ప్లానులు, డిజైనులు తయారుచేయడానికి కొన్ని లక్షల రూపాయలు ఫీజుగా ఎవరో ఆర్కిటెక్టులకు ఇవ్వడం కూడా జరిగింది. కాని, కాంగ్రెసు ప్రభుత్వం ఏర్పాటయిన తర్వాత, ఐలెండ్ గ్రౌండును రాయి, సున్నం కట్టడాలతో నింపివేయడం ఇష్టంలేక, ఈ శాసన సభను తాత్కాలికంగా సెనేట్ హాలు అనే భవనంలో నడప డానికి ఏర్పాటు జరిగింది. ఫోర్టుసెంటుజార్జికి దక్షిణంగా కూవమ్ నది ఉంది. అప్పట్లో కూవం ఒడ్డున క్లైవ్ హవుస్ అనే భవనం ఉండేది. అది ఇప్పుడు మద్రాసు యూనివర్శిటీ లైబ్రరీగా పునర్నిర్మింపబడింది. దానికి దక్షిణంగా పెద్ద మైదానంలో (ఇప్పటి యూనివర్శిటీకి సంబంధిం చిన నిర్మాణాలు అప్పట్లో లేవు.) పెద్ద పెద్ద గుమ్మాలతో సెనేట్ హాలుంది. యూనివర్శిటీలో పాసయిన వారికి డిగ్రీలు ఇవ్వడానికి ఆ హాలు నిర్మింపబడి ఉండెను. ఆ హాలు మేడపైభాగంలో శాసన సభ ఆఫీసులు, దాని భూగర్భ భాగంలో శాసన సభ గ్రంథాలయం

పెట్టుకొనేందుకు కూడా అవకాశం ఉండేది. శాసన సభకు కావలసిన ఏర్పాటు చేశారు.

గవర్నరులు కేవలం కాన్స్టిట్యూషనల్ గవర్నర్లుగానే ఉంటామని మాట ఇచ్చిన తరువాత కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడినట్లు లోగడ వ్రాసియున్నాను.

## శాసన సభ ప్రథమ సమావేశము

14-7-37 న సెనేటు హవుసులో శాసన సభా సమావేశం జరిగింది. ఆ మరునాడు శ్రీ బులుసు సాంబమూర్తిగారిని స్పీకరుగా ఎన్నుకొనడం జరిగింది. ఇదివరకు వ్రాసిన గవర్నమెంటు తీర్మానాలతో బాటు మరొక ముఖ్యవిషయం చెప్పవలసి ఉంది. 31-8-37 న, అంటే ఉద్యోగ స్వీకరణ అయిన నెలా పదిహేను రోజులలో శాసన సభలో భారతదేశానికి స్వాతంత్ర్య ప్రాతిపదికపైన సంవిధానము (Constitution) తయారు చేయడానికి కాన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ (సంవిధాన సభ) ఏర్పాటు చేయవలసిందని బ్రిటిషు గవర్నమెంటును కోరడం ఆ తీర్మానపు సారాంశము. 1946 వరకు ఈ అసెంబ్లీ రాలేదు. అది వేరే విషయము.

## వందేమాతరం ప్రార్థనతో సభారంభం

15 వ తేదీన స్పీకరుగా ఎన్నికయిన వెంటనే సాంబమూర్తిగారు సభ్యులకు తన కృతజ్ఞతను రెండే రెండు చిన్న వాక్యములలో చెప్పి, సభ్యులలో ఒకరైన శ్రీమతి లక్ష్మీశంకరయ్యర్‌గారిని "వందేమాతరం" పాడమని ఆదేశించారు. సభ్యులందరు లేచి నిల్చున్నారు. జస్టిస్‌పార్టీ వారు, ముస్లిం లీగ్‌వారు కూడా ఆ రోజున సందేహాభ్యంతర భావాలు చూపకుండా లేచి నిలుచున్నారు. అయితే, రానురాను కాంగ్రెస్‌వారు తమ జాతీయ గీతం క్రింద పాడుతూ ఉన్న గీతం పాడినప్పుడు తాము నిలిచినట్లయితే తమ పార్టీ గౌరవానికి లోటు కలుగుతుందనే భావం ఒకటి వారిలో వారే అంకురింపజేసికొని, దానిని కాంగ్రెసు విద్వేషం అనే విషంతో తడిపి, వ్యతిరేకత అనే ఒక చిన్న మొక్కను తమ

హృదయాలలో పెంచుకొన్నారు. ఒక రోజు సభలో ధైర్యం తెచ్చు కొని ఈ ప్రార్థనకు అభ్యంతరం చెప్పారు. కాంగ్రెసుకు వ్యతిరేక మైన పత్రికల వారా ఉప్పు అందుకొని, వారికి తోచినట్టు వారు వ్రాయడం మొదలు పెట్టారు. చివరకు సాంబమూర్తిగారు శాసన సభ ఆరంభం కావడానికి ఐదు నిముషాల ముందువచ్చి, "ఇష్ట మున్న వారు పాల్గొనవచ్చు; లేనివారు వద్దు," అనే ఒక ఏర్పాటు కూడా చేశారు. ఇది అక్కడితో ఆగిపోయిందని మేము అనుకొన్నాము. కొంచెం లొంగుబాటు కనిపిస్తే ఎదురు పక్షంవారు ఊరుకోరు గద! ఆ గీతం శాసన సభా మందిరంలోనే పాడకూడదని అభ్యంతర పెట్టారు. దానిపైన సాంబమూర్తిగారు సర్వమత సామరస్యంగా ఉండే ఒక ప్రార్థన తామే వ్రాసి, ఒక రోజున సభా ప్రారంభంలో చదివారు. అది ఇది:

"అనంతమై సర్వశక్తిమంతమైన ఓ దేవా! చెన్నరాష్ట్ర ప్రజాప్రతినిధులమైన మేము శాసన సభయందు సమావేశమై, నిండు మనములతో ప్రార్థించు చున్నాము. మా హృదయముల నుండి రాగద్వేషములు అంతరించు గాక! మా మనస్సులు సర్వ జనోపయోగకరమైన సిద్ధాంతములను చేయుటయందు నిమగ్నమై ఉండుగాక! తద్వ్యతిరిక్త భావములు మాకు రాకుండా ఉండుగాక! మేము నిర్మించు శాసనములు, మేము ఆమోదించు తీర్మానములు జ్ఞాన యుక్తములై, హేతు సమర్థములై యుండుగాక! సత్యమును, న్యాయమును వాటికి ఆధారములగు గాక! అవి ప్రజల ఆరోగ్య సౌభాగ్యములను వృద్ధిపరచుగాక! మాతృదేశ సేవయందు మా బుద్ధి స్థిరమై యుండి, శాంతి, స్వాతంత్ర్య సంపాదనకు మా సర్వశక్తులు వినియోగమగు గాక! ఓం శాంతిః శాంతి, శాంతిః."

సభ్యులంతా విధిగా నిల్చుచున్నారే కాని, ఎదురు పక్షంవారు అదికూడా కాంగ్రెసువారికి లొంగిపోయినట్లు అయిందని తిరిగి కొంత

ఆవేశం తెచ్చుకొన్నారు. వారు తర్వాత ముఖ్యమంత్రిగారిని కలుసుకొని ఏమైనా, ఈ ప్రార్థనను శాసన సభలో ఆపివేయాలని ఆయనను ఎలాగో మెత్తబరిచారు. ఒక రోజున ఆయన ముందుగా సాంబమూర్తిగారి గదిలోకి పోయి, ఆయనకు నచ్చజెప్పి - శాసన సభలో లేచి, ప్రార్థన చేయడ మన్నది సర్వమత సమ్మతమయిన దయినా, చారిత్రకమైన పరిస్థితులవల్ల ఆ విషయమై అపోహలు వచ్చినవి గనుక దానిని విరమింపజేయవలసినదని స్పీకరుగారిని తాము కోరినట్లు, ఆయన అంగీకరించినట్లు ఒక స్టేట్‌మెంటు చేశారు. ఆ స్టేట్‌మెంటు పైన కూడా ఏదో కొంత చర్చ చేద్దామని, ఒకప్పుడు కాంగ్రెసులో ఉండి, తర్వాత ముస్లిం లీగులో చేరిన అమీత్‌ఖాన్ లేచేసరికి స్పీకరుగారు, "ఈ విషయం ఇంతటితోసరి; మరి ఎవరికీ ఏమీ మాట్లాడడానికిలేదు!" అని నిస్సందేహంగా చెప్పడంతో ఈ ప్రార్థన సమస్య తీరిపోయింది.

ఇంగ్లీషు పార్లమెంటులో మాత్రం కామన్సుసభ ఆరంభ సమయానికి ఆరు నిముషాలు ముందు అంతా చేరి ప్రార్థన జరిపిన తరువాతనే, మిగిలిన కార్యక్రమం ప్రారంభిస్తారు. ఇది వారికి ఏడువందల ఏండ్లనుంచి ఏ అవాంతరం లేకుండా సాగుతూన్న సంప్రదాయము. మన దేశంలో స్వాతంత్ర్యం పొందే ముందు సాంబమూర్తిగారు ఒక్కరే ఈ సంప్రదాయం నెలకొల్పడానికి యత్నించారు. అయితే, అది పైన చెప్పిన విధంగా ముగిసి పోయింది. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఈ ప్రసక్తి ఎప్పుడూ ఏ శాసన సభలో కాని, పార్లమెంటులో కానీ ఎవరూ తేలేదు. తెచ్చినా, సాగుతుందని నాకు తోచదు.

## సాంబమూర్తిగారి కొత్త పద్ధతులు

జమీందారీ బిల్లు తరువాతి చరిత్ర కొంచెం సూచిస్తాను. ఈ బిల్లు విషయమై దేశంలో ప్రబలిన వాతావరణం విషయమై లోగడ కొంత సూచించాను. బిల్లు చర్చకువచ్చే రోజున సెనేట్ హావుస్ ఆవరణమంతా ప్రజలతో కిటకిట లాడుతూంది. ఇంతేకాక, సభా కార్యక్రమం చూడడానికి పాసులు అడిగేవారి సంఖ్యకూడా చాలా హెచ్చు

అయిపోయింది. ప్రేక్షకులు కూర్చునేందుకున్న స్థలం పరిమితమైంది. ఇదంతా చూచి, సాంబమూర్తిగారు కొన్ని లౌడ్‌స్పీకర్లు తెప్పించి ఆవరణలో ఏర్పాటుచేశారు. ఇది పార్లమెంటరీ కార్యక్రమానికి చాల వింత అయిన విధానము. ప్రేక్షకులు లోపలకు రావడానికి పాసులు కావాలనే నిబంధన లున్నాయి కాని, బయట ఉండి వినడానికిగాని, అలా వినేటందుకు ఏర్పాటు చేయడానికిగాని వ్యతిరేకమైన నిబంధన లేమీ కనిపించలేదు. ఇంతేకాక, సాంబమూర్తిగారు ప్రజల కీ మాత్రం సౌకర్యం కలుగజేస్తుండగా ఎవరైనా అడ్డువస్తే ప్రజలంతా ఊరు కుంటారా? ఇంతేకాక, అట్టి అవకాశాలు లేని రెవిన్యూ శాఖకు మంత్రియై ప్రకాశంగారు ఒక విప్లవాత్మకమైన నినాదంగల నివేదిక ప్రజల పరంగా శాసన సభకు అందజేసే సమయంలో వారు చెప్పే మాటలు వినడానికి కయినా వీలులేకుండా చేస్తే, ఇదేం శాసన సభ అని ప్రజలు వచ్చి మీద పడిపోతారేమో అన్నంతగా వాతావరణం ఉండడంవల్ల ఎవరికి తోచిన అభిప్రాయాలు వారు తమ మనసుల్లోనే అణచుకుని, మాట్లాడక ఊరుకున్నారు.

ప్రకాశంగారు చర్చ ఆరంభించడానికి లేచి నిలబడేసరికి శాసన సభలో గట్టిగా, నిర్విరామంగా చప్పట్లు ఆరంభమయ్యాయి. స్పీకరు గారు చప్పట్లు కొట్టడం కూడదని చెప్పారు. దాంతో సభ నిశ్శబ్ద మయింది. ప్రకాశంగారు మాట్లాడడం ఆరంభించినప్పు డెప్పుడూ మంద్రమైన కంఠంతో మాటకు, మాటకు మధ్య కొంచెం ఎక్కువ విరామంతో మాట్లాడడం అలవాటు. అది ఉపన్యాస ప్రారంభదశ అన్న మాట. ఆయన రోజుకు వెయ్యి రూపాయల చొప్పున దినవారీ ఫీజు పుచ్చుకుని హైకోర్టులో ప్రాక్టీసు చేస్తున్న రోజుల్లోకూడా ఆయన వాగ్వైఖరి అదే. రానురాను ఉపన్యాసం వేగం అందుకొనేది. ఆ రోజున ఆయన ఉపన్యాసం ఇలా ప్రారంభించారు :

“అధ్యక్షా! ఈ విధాన సభవారు నియమించిన ఉపసంఘం పక్షాన రెండు నెలల క్రిందట నేను ఆ సంఘం నివేదికను మీకు

సమర్పించాను. ఈ కమిటీ చర్చించిన విషయం - భూస్వాములకూ, రైతులకూ మధ్య ఉన్న, ఉండవలసిన సంబంధాలను గురించినది. మా నివేదికను ఈ సభవారికి కొంత ఆలస్యంగా అందజేసినందుకు నేను సంజాయిషీ చెప్పవలసిఉంది. ఈ నివేదిక తయారుకావడానికి దాదాపు 15 మాసములు పట్టింది. మేము ఈ రాజధానిలో ఉత్తరభాగంలో రెండు కేంద్రాలలోను, దక్షిణభాగంలో రెండు కేంద్రాలలోను, రాజధాని నగరమయిన చెన్నపట్నమందునూ, సాక్ష్యాలు సేకరించితిమి. సాక్ష్య మిచ్చుటకు వచ్చిన సాక్షులందరి సాక్ష్యములను వ్రాసుకొన్నాము. వారు దాఖలు చేసిన కాగితములను అందుకున్నాము. ఇది జరిగిన తర్వాత ఉపసంఘం సభ్యుల వీలునుబట్టి మా సమావేశాలు జరిపేందుకు కొంతకాలం పట్టింది. మేము ఒక్క రోజుకూడా వృథా చేయలేదు. ఇతర కార్యాలకు భంగం లేకుండా ఈ ఉపసంఘం పని శ్రద్ధగా నడిపినాము పరిశీలనా సమయంలో అనేక వ్యాఖ్యలు—ముఖ్యంగా మేము ఆలస్యం చేసితిమన్న వ్యాఖ్యలు కూడా—వచ్చినవన్న విషయం నాకు గుర్తున్నది. అయితే, అటువంటివాటిని పట్టించుకోక మేము మా కార్యక్రమాన్ని పూర్తిచేసుకున్నాము. అధ్యక్షా! మరొక విషయం చెప్పాలి. మా నివేదికను శాసనసభకు అందజేసేముందు, కొందరు తమకూ తమ హక్కులకూ భంగం వాటిల్లుననే భయంతో దీనిని రహస్యంగా ఉంచివలసిఉందంటూ, అలా ఉంచేటందుకు ప్రయత్నాలు చేసినారు. వారి ఆ యత్నాలు ఫలించలేదు. నిబంధనల ప్రకారం శాసన సభా కార్యదర్శిగారికి సూచించిన ఒక తేదీనాడు నివేదికను శాసనసభ కందజేస్తామని నోటీసులు ఇచ్చాము. ఆ ప్రకారంగానే వాటిని అందజేశాము."

అని మెల్లిగా ప్రారంభించి, మూడు రోజులపాటు నివేదికలోని అంశాలను సహేతుకంగా, ఉద్రేకంలేని మాటలతో, వినేవారికి ఉద్రేకం కల్గించేటట్లు మాట్లాడగా, సభలో శాసన సభ్యుల అందరి

ముఖాలలో పోయే జమీందారీలకోసం మనకెందుకీబాధ అన్నభావం కల్గి నట్లు నాకు కనిపించింది. కాగా, ఈ ఉపన్యాసపు ప్రభావం ముఖ్యమంత్రి గారిమీద ఎలా పడిందో మనం ముఖ్యంగా చూడాలి. శాసన సభా కార్య క్రమంవరకు ఆయన అవునంటే అవును, కాదంటే కాదు అన్న విషయం మనం జ్ఞాపకం ఉంచుకోవాలి.

రెండురోజులు చర్చ జరిగిన తర్వాత ఎవరూ అనుకోకుండా ముఖ్యమంత్రి రాజాజీ లేచి, మాట్లాడనారంభించేసరికి యావన్మంది సభ్యులు ముగ్ధులైపోయారు. అందరూ ప్రకాశంగారి అభిప్రాయానికి ఆయన ఎంతవ్యతిరేకంగా ఉంటాడని అనుకున్నారో, అంత సుముఖంగా మాట్లాడారు. ప్రకాశంగారు మితవాది అనీ, తానే విప్లవవాది అనీ నలుగురూ అనుకొనే విధంగా మాట్లాడి- భూమిపై హక్కు రైతుదే నని, పిస్తులు హెచ్చించడానికి జమీందార్లకు హక్కు లేదని మొదలు గాగల ప్రకాశం కమిటీ శిఫార్సులను, అందులో ఉన్న భాషకన్న పటుత్వమైన భాషతో మాట్లాడి బలపరిచారు. దీనివల్ల శాసన సభలో ఒక సామరస్య సూచకమైన వాతావరణం ఏర్పడింది. నివేదిక, నివే దికతోబాటు పొందుపరచిన బిల్లులు శాసన సభ ఆమోదించి, వాటి ప్రకారం శాసనం ప్రవేశపెట్టాలని తీర్మానం అంగీకరింపబడింది.

# 5

# జమీందారీల రద్దు బిల్లు : శాసన సభలో చర్చలు

**అయితే,** ఈ బిల్లుకు వచ్చిన అడ్డంకులు అప్పటితో ఆగిపోలేదు.

ప్రభుత్వం కార్యనిబంధనల ప్రకారం బిల్లులో ఉన్న ప్రతి క్లాజు (ఖండము) యొక్క భాష, ఉద్దేశము, పొందిక సంబంధించి సచివా లయంలో ఆ బిల్లుకు సంబంధించిన శాఖవారు తమ వ్యాఖ్య వ్రాయాలి. ఆ విషయానికి సంబంధించిన ఇతర ప్రభుత్వ శాఖలు, ఈ ఫైలు

వెళ్ళిన పిదప వారి వ్యాఖ్యకూడా పొందుపర్చాలి. వాటిపైన న్యాయ శాఖ, సచివాలయంవారు తమ వ్యాఖ్యానం ఖండ ఖండానికి ప్రత్యేకంగా వ్రాయాలి. ఇటువంటి వ్యాఖ్యానాలు అయిన పిదప మంత్రిమండలిలో గల మంత్రులలో జూనియర్ అయిన మంత్రి మొదట తన వ్యాఖ్య వ్రాయాలి.

అలాగు ఉత్తరోత్తరా సీనియారిటీని బట్టి మంత్రులు తమ వ్యాఖ్యానాన్ని వ్రాయాలి. ఆ పిమ్మట ముఖ్యమంత్రిగారికి ఫైలు చేరు తుంది. వారి వ్యాఖ్యలు వ్రాసిన పిమ్మట సంపూర్ణమైన ఆ వ్యాఖ్యాన గ్రంథమంతా బిల్లుకు సంబంధించిన మంత్రిగారికి వస్తుంది. వ్యాఖ్యలు అనగానే ప్రతి ఖండంపైన ప్రతి వ్యక్తి ఏవో వ్రాస్తారని భావించ నక్కరలేదు. అలాగున వ్రాయరు. తమకు ముఖ్యమనిపించిన అంశం ఏదైనా ఉంటే- చేర్పో, మార్పో వ్రాస్తారు. లేకపోతే, పొడి అక్ష రాలతో అంగీకార సూచకంగా సంతకం చేస్తారు. ప్రకాశంగారి నివేది కలో మూడు బిల్లులున్నవి. అందుచేత ఈ వ్యాఖ్యాన క్రమం మరీ ఆలస్యమైంది. మంత్రిమండలిలో ఒకరిద్దరు జూనియరు మంత్రుల చేతులలోనే ఫైలు నడవక వారి ఆఫీసు బల్లలపైనే యోగ నిద్రలో ఉండేది.

గిరిగారు మినహాయిస్తే, తక్కినవారు వ్యతిరేక వ్యాఖ్యలే వ్రాసి నట్లు నాకు జ్ఞాపకము. ఈ సంబంధమైన రికార్డులు, పాత జి. ఓ. లు మన ఆంధ్ర ప్రభుత్వానికి నేటిదాకా అందకపోవడం చేత ఈ విషయం ఇంతకన్న వివరంగా వ్రాసే వీలులేకపోయింది.

చివరకు 1939 సెప్టెంబరులో యుద్ధ ప్రకటనకు విరుద్ధంగా మంత్రివర్గం రాజీనామా చేసే నాటిదాకా, ముఖ్యమంత్రిగారి వ్యాఖ్యతో ఆ ఫైలు ప్రకాశంగారికి చేరలేదు. ప్రకాశంగారికి ఈ ఆలస్యంతో శాసన సభలో తనను బలపరిచిన నాడు ముఖ్యమంత్రిపై కలిగిన కృత జ్ఞతా సంతోషములు సంపూర్ణంగా నాశనం కావడమేగాక, ముఖ్య మంత్రితో యథాలాపముగా ఇష్టాగోష్ఠి ఎవరు చేసినా వారందరూ ఆల స్యానికి కారకులే నన్న చికాకు కలిగింది. అయితే ప్రకాశంగారు సహ

జంగా గాంభీర్యంగల వ్యక్తిగనుక, కొందరే ఆ విషయం కనిపెట్టగలిగినారు. దీనికి తోడు ఆ ఫైలుమీద ఆమోద సంతకం తాను పెట్టేముందు వల్లభభాయి పటేలుగారితో సంప్రతింపుచేయాలని ఆయన అనుకున్నట్లూ, ఒకమారు ఆ ఫైలుతనతోబాటుగ బొంబాయి పట్టుకువెళ్ళినట్లు ఒక వదంతి బయలుదేరేసరికి ప్రకాశంగారి కోపతాపాలు మరింత హెచ్చినవి.

ఇదిగాక, ఇంకా మరొకటి కూడా సచివాలయంలో జరిగింది. ప్రకాశంగారి నివేదికలో గల శిఫార్సులకు ఉండగల అభ్యంతరాలను గూర్చి రెవిన్యూశాఖ ఉద్యోగి ఒకరు ఒక వ్యాఖ్య వ్రాయడం జరిగింది. బిల్లులోని ఖండ ఖండముల మీద శాఖవారు వ్రాసిన వ్యాఖ్య సంపుటివలె ఆ వ్యాఖ్యలు కనిపించినాయి. శాసన సభ నివేదిక భాగంగా ఆమోదించిన బిల్లుపైని ఎటువంటి వ్యాఖ్యానాలు చేయగూడదని, అట్లా చేయవలసిందని ఎవరైనా తనకు తెలియకుండా ఆదేశిస్తే, అది ద్రోహవాంఛయగల కార్యమని ప్రకాశంగారి అభిప్రాయము. మంత్రి మండలి బిల్లును అంగీకరిస్తే ఈ వ్యాఖ్యలు నిర్వీర్యమైపోతాయి. బిల్లును మంత్రిమండలి అంగీకరించకపోతే ఈ వ్యాఖ్యలకు అర్థం లేకుండా పోతుంది. అయినా, మొత్తం మీద శాసన సభలో ఆమోదింపబడిన తరువాత ఈ సందిగ్ధ పరిస్థితులలోనే ప్రకాశంగారి నివేదికకు సంబంధించిన కాగితాలు ఎనిమిది నెలలు అలాగే పడి ఉండడం జరిగింది.

1946 లో ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయినప్పుడు, మిగిలిన ప్రజోపకార యోగ్యమైన కార్యక్రమం చాలా జరిగింది. కాని యీ బిల్లులు శాసన సభ ముందుకు తెచ్చుకొనే అవకాశం లేకపోయినది.

1947 లో స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఫర్ ఇండియా అడ్డంకికూడా పోవడంవల్ల అప్పటి గవర్నమెంటులో మంత్రి అయిన కళా వెంకటరావు ద్వారా, జమీందారీలో శిస్తుల తగ్గింపు బిల్లు, జమీందారీ రద్దు బిల్లు పాసు చేయించడం జరిగింది. అయితే, వారు ప్రకాశంగారి అభిప్రాయాలు పూర్తిగా ఒప్పుకోకపోవడంవల్ల ఒక ముఖ్యమైన భేదం కలిగింది. జమీందారీలలో 1802 నాడు అమలులో ఉన్న సిస్తులు అమలు పరచవలెనని ప్రకాశంగారి

నివేదిక. వెంకటరావుగారి బిల్లులో, ప్రక్కనున్న ఇప్పటి రైత్వారీ భూమిరేటు ఏదో ఆ రేటు ప్రకారం సిస్తులు ఏర్పాటు కావాలని ప్రతిపాదింప బడింది. చెన్నరాష్ట్రపు దక్షిణ భాగంలోని కొందరు జమీందారులు శాస్త్రీయముగా నడచుకొన్న కారణంచేత పెర్మనెంట్ సెటిల్మెంటునాటి రేట్లే ఆ నాడు అమలులో ఉండడముచేత ప్రక్క భూముల రైత్వారీ రేట్ల సూత్రం వారు ఇవ్వవలసిన సిస్తులను పెంచింది. ఈ రైత్వారీ సెటిల్మెంట్ అన్నది 1823 నాటికి పూర్తి అయింది. జమీందారీ సిస్తుల కన్న ఆ కాలంలో రైత్వారీ సిస్తులు కొంచెం ఎక్కువగా ఉండేవి. తర్వాత క్రమేణా రెండు మూడు పర్యాయాలు సిస్తులు హెచ్చింప బడినవి. ఆ కారణంచేత పైన చెప్పిన వ్యత్యాసం కొన్ని చోట్ల కలిగింది. అందుచేతే ప్రకాశంగారు శాసన సభలో, కళా వెంకటరావుగారు పెట్టిన బిల్లు చర్చింపబడే ముందు "ఇది సిస్తుల హెచ్చింపు బిల్లు; తగ్గింపు బిల్లుకాదు" అని వ్యాఖ్యానించారు.

# 6

## పరిపాలనా విధానము-
## ముఖ్యమంత్రితో తలపట్లు

ప్రకాశంగారి దృక్పథం రాజాజీ దృక్పథంకన్న భిన్నం కావడం చేత చిల్లరమల్లరగా ఏవో సుడిగాలు లెప్పటికప్పుడు వీస్తూండేవి. రాజాజీ, ప్రకాశంగారల దృక్పదాలలోని భేదాలను పోలీసుశాఖ విషయంలో వారి అభిప్రాయాలబట్టి నిర్ణయించవచ్చు.

రాజాజీకి పోలీసుశాఖపై అమితమైన నమ్మకము. దాన్ని నమ్మకపోతే రాజ్యం నడవదని వారి దృక్పథము. కాని, ఆ దృక్పథం తప్పు చేసినప్పటికీ పోలీసు ఉద్యోగులను ఏమీ అనరాదన్నంతదూరం వెళ్ళేది. 1932 సత్యాగ్రహంలో, ఒక బహిరంగ సభలో వేదికపైనున్న మహర్షి బులుసు సాంబమూర్తిగారిని, ఆయన స్మృతి తప్పి

రక్తం మడుగులో పడిపోయేంత వరకు లాటీలతో కొట్టించిన "డప్పుల సుబ్బారావు" అనే పోలీస్ ఉద్యోగికి, ఆంధ్ర కాంగ్రెసువా రందరూ అడ్డుతున్నా వినక- ఒక గౌరవస్థానం, ఇంగ్లండు ప్రయాణం రాజాజీ కల్పించారు రాజాజీ మంత్రివర్గంలోని డాక్టర్ సుబ్బరాయన్ అనే మంత్రి - కోయంబత్తూరులో ఉపన్యసిస్తున్న సమయంలో, ప్రేక్షక బాహుళ్యం హెచ్చయి, ఒకచోట అల్లరిగా ఉండగా పోలీసు జవానులు లాటీలతో ప్రజలను త్రోయడాన్ని వేదికనుంచి చూచిన ఆ మంత్రి కాంగ్రెస్ మంత్రివర్గం ఏర్పాటైన కాలంలోకూడా పోలీసు లా విధంగా ప్రవర్తించరాదని వారిని గట్టిగా మందలించారు. పోలీసు శాఖ ఆ రోజులలో రాజాజీ చేతులలో ఉండేది. తెల్లవారేసరికి సుబ్బరాయన్ గారు చెన్నపట్నం తిరిగి వచ్చారు. పత్రికలలో ఆయన ఉపన్యాసం అంతా వేయలేదుగాని, పోలీసువారిని ఖండించిన భాగం మాత్రం పెద్ద అక్షరాలతో వేయడం జరిగింది. 8 గంటలవేళ సుబ్బరాయన్‌గారు ముఖక్షవరం చేసుకుంటుండగా రాజాజీనుంచి, ఆయనకు ఫోన్ వచ్చింది. రాజాజీ సుబ్బరాయన్ గారికి పరమ గురువు వంటివారు. రాజాజీ సుబ్బరాయన్‌గారితో ఫోనులో, "ఏమయ్యా! సుబ్బరాయన్! కోయంబత్తూరు మీటింగులో నిన్న సాయంత్రం పోలీసుల విషయమై నువ్వేదో చెప్పినట్లు పేపర్లో పడింది. ఏమిటది?" అని అడగ్గా, సుబ్బరాయన్‌గారు, "అవునండి! బ్రిటిషు హయాంలో మాదిరిగానే పోలీసులు ప్రేక్షకులను లాటీలతో కొట్టడంచూచి మందలించాను. అది పేపర్లో పడవలసినంత పెద్ద విషయ మేమీ కాదు!" అన్నారు.

అది విని రాజాజీ, "సుబ్బరాయన్! నీవు ఎవరిని మందలించావో తెలుసా? పోలీసు జవానులను కాదు- పోలీసు శాఖామంత్రి అయిన రాజగోపాలాచారిని. విన్నావా?" అన్నారు.

"ఎంతమాట! ఎంతమాట!" అన్నారు సుబ్బరాయన్‌గారు. తర్వాత రాజాజీ, "పత్రికల రిపోర్టు సరి అయింది కా" దని స్టేట్‌మెంటు ఇమ్మంటే, తాను కళ్ళతో చూసిందే చెప్పినట్లు సుబ్బరాయన్ అన్నారు. దానిపైన రాజాజీ, తానొక పత్రికావిలేఖరిని పంపు

మీద ప్రతిబింబిస్తున్న సూర్యబింబం, ఆ క్రిందటి ఏడు ఎండిపోయి ఉన్న పొలాలే ఈ ఏడు సస్య సంపూర్ణమై వచ్చగా హృదయానంద కరంగా కనిపించాయి. రైతులను "మీ కెంత ఖర్చయిం"దని అడిగితే, ఏడెనిమిది వేలయిం దన్నారు. ప్రక్కనున్న ఇంజనీరును, "మీరు పని చేయిస్తే ఎంతవుతుందయ్యా?" అని ప్రశ్నిస్తే, తమ ఎస్టిమేటు ప్రకారం లక్షకన్న హెచ్చుకాక తప్పదని చెప్పారు. పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంట్ ఏ విధంగా పబ్లిక్ వేస్ట్ డిపార్టుమెంట్‌గా పరిణమిస్తున్నదో సూచించడానికి ఇంతకన్న వేరే తార్కాణం ఏం కావాలి?

ఇది ఇలా ఉండగా ప్రకాశంగారికి ముఖ్యమంత్రితో అనేక సమయాలలో భేదాభిప్రాయాలు సహజంగా వస్తూనే ఉండేవి. బోర్డ్ ఆఫ్ రెవిన్యూలో ఒక సభ్యుడుగా శొంఠి రామమూర్తిగారిని వేయవలసిందని ప్రకాశంగారు కోరగా, ఎంత మాత్రమూ వీలులేదని రాజాజీ కొంతకాలం నిరాకరించారు. అంతకు పూర్వం సేలం జిల్లాలో మద్యనిషేధ శాసనం అమలుచేసే నాటికి శొంఠి రామమూర్తిగారు అక్కడ కలెక్టరు. అక్కడ అతనిని కాదని ఒక ఇంగ్లీషు ఐ.సి.యస్. ఉద్యోగిని మద్యనిషేధం అమలుపరచడానికి నియమించారు. ఇలా ఉండేటపుడు, నేనూ రాజాజీ ఒకే మోటారుకారులో సేలం వెళ్ళడం తటస్థించింది. ఆయన ఒకప్పుడు విశాఖపట్నం వచ్చి మా యింట్లో అతిథిగా ఉండడంచేతా, శాసన సభలో ప్రశ్నోత్తర సమయాలలో ప్రకాశంగారి వంతును నేను నడిపించే విధానం బాగుందని ఆయన మెచ్చుకుంటున్నాడనే విశ్వాసంచేతా, చనువుచేతా శొంఠి రామమూర్తిగారి విషయమై ఆయనను "సేలం జిల్లాలో, సద్గుణ వంతుడయిన హిందూ ఐ.సి.యస్. ను వదిలిపెట్టి, మద్యనిషేధంలో నమ్మకంలేని ఇంగ్లీషు ఐ.సి.యస్. ఉద్యోగిని వేయడం ఏమీ బాగాలేదు. అంతే కాకుండా, బోర్డు ఆఫ్ రెవిన్యూ మెంబరుగా ఉండడానికి అర్హతగల తెలుగు ఉద్యోగిని వెనుకకు నెట్టడం ఎందుచేత జరిగింది?" అని ప్రశ్నించాను.

వాదం హెచ్చడంచేత, ఆ బిల్లు కార్యరూపం ధరించలేదు. అలాగే మునిసిపల్ చైర్మన్లకు (పురపాలక సంఘ అధ్యక్షులకు) హెచ్చు అధికారాలు ఇవ్వాలని ప్రకాశంగారు తయారుచేసిన బిల్లుకూడా కార్యరూపం పొందలేదు. అసలు రెవిన్యూమంత్రికి వాటితో సంబంధ మేమిటనీ, ప్రభుత్వ కార్య నిబంధనలలో దానికి సంబంధించిన శాఖవారు తప్ప ఇతరు లీ ప్రమేయం పెట్టుకోరాదని వారు అడ్డుపెట్టారు. అందుచేత ముఖ్యమంత్రి కూడా వాటి విషయమై తూష్ణీంభావం వహించారు. పబ్లిక్ వర్క్సు విషయంలో కూడా, పి. డబ్ల్యూ. డి. అంటే పబ్లిక్ వేస్ట్ డిపార్ట్‌మెంట్ అని నలుగురూ అనుకునే మాట సత్యమైనదే నని ప్రకాశంగారి అభిప్రాయము.

మేము ఒకమారు బుక్కరాయపట్నం వెళ్ళడం తటస్థించింది. రాయల రాజ్యంనాటి రాతితో కట్టిన పెద్ద చెరువొకటి అక్కడుంది. ప్రకాశంగారు, నేను వెళ్ళినపుడు వృద్ధులైన కొందరు రైతులు వచ్చి, కొంచెం దూరంలో ఒక కొండవాగు ఉందనీ, దాని ద్వారా ఈ చెరువు నిండేదనీ, సెటిల్మెంటు సమయంలో ఈ చెరువు నీటి వనరు గలవిగా అనేక భూములను వ్రాసి ఉన్నారనీ, అయితే ఆ వాగు పూడిపోవడం వల్ల ఈ చెరువు ఎండిపోతున్నదనీ, దాని మరమ్మత్తుకు పదివేలరూపాయలు అవుతుందనీ, కాని పి. డబ్ల్యూ. డి. వారు మరమత్తుకు లక్షల కొద్ది అవుతుందనీ, తగిన రాబడి లేనందువల్ల ఆ పని చేయం అనడం వల్ల పదిహేను, ఇరవై ఏండ్ల నుంచి పాడుపెట్టి ఉంచిన భూములను, ఎండిన చెరువునూ మాకు చూపించి గోలపెట్టారు. ప్రజలు అనుకున్న లెక్కకు, పి. డబ్ల్యూ. డి. ఇంజనీరు వేసిన లెక్కకు పదింతల వార ఉంది. దానిపైన రైతులు ఆ పని తమకు అప్పగిస్తే, తమ లెక్కకు సరిపడేటట్లు ఆ కాలువను మరమ్మతు చేసుకుంటామని కోరగా, అతి కష్టంమీద ఇంజనీరు అభ్యంతరం పెట్టనని అనుమతించాడు. అదే ఒక బ్రహ్మాండమయిన సాయంక్రింద రైతులు సంతోషించారు.

తిరిగి సంవత్సరం తర్వాత ఏం జరిగిందో చూడడానికి ప్రత్యేకంగా మేము అక్కడికి వెళ్ళాము. చెరువునిండా నీరు, ఆ నీటి కెరటా

మీద ప్రతిబింబిస్తున్న సూర్యబింబం, ఆ క్రిందటి ఏడు ఎండిపోయి ఉన్న పొలాలే ఈ ఏడు సస్య సంపూర్ణమై పచ్చగా హృదయానంద కరంగా కనిపించాయి. రైతులను "మీ కెంత ఖర్చయిం"దని అడిగితే, ఏ డెనిమిది వేలయిం దన్నారు. ప్రక్కనున్న ఇంజనీరును, "మీరు పని చేయిస్తే ఎంతవుతుందయ్యా?" అని ప్రశ్నిస్తే, తమ ఎస్టిమేటు ప్రకారం లక్షకన్న హెచ్చుకాక తప్పదని చెప్పారు. పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంట్ ఏ విధంగా పబ్లిక్ వేస్టు డిపార్టుమెంట్‌గా పరిణమిస్తున్నదో సూచించడానికి ఇంతకన్న వేరే తార్కాణం ఏం కావాలి?

ఇది ఇలా ఉండగా ప్రకాశంగారికి ముఖ్యమంత్రితో అనేక సమయాలలో భేదాభిప్రాయాలు సహజంగా వస్తూనే ఉండేవి. బోర్డ్ ఆఫ్ రెవిన్యూలో ఒక సభ్యుడుగా శొంఠి రామమూర్తిగారిని వేయవలసిందని ప్రకాశంగారు కోరగా, ఎంత మాత్రమూ వీలులేదని రాజాజీ కొంతకాలం నిరాకరించారు. అంతకు పూర్వం సేలం జిల్లాలో మద్యనిషేధ శాసనం అమలుచేసే నాటికి శొంఠి రామమూర్తిగారు అక్కడ కలెక్టరు. అక్కడ అతనిని కాదని ఒక ఇంగ్లీషు ఐ.సి.యస్. ఉద్యోగిని మద్యనిషేధం అమలుపరచడానికి నియమించారు. ఇలా ఉండేటపుడు, నేనూ రాజాజీ ఒకే మోటారుకారులో సేలం వెళ్ళడం తటస్థించింది. ఆయన ఒకప్పుడు విశాఖపట్నం వచ్చి మా యింట్లో అతిథిగా ఉండడంచేతా, శాసన సభలో ప్రశ్నోత్తర సమయాలలో ప్రకాశంగారి వంతును నేను నడిపించే విధానం బాగుందని ఆయన మెచ్చుకుంటున్నాడనే విశ్వాసంచేతా, చనువుచేతా శొంఠి రామమూర్తి గారి విషయమై ఆయనను "సేలం జిల్లాలో, సద్గుణ వంతుడయిన హిందూ ఐ.సి.యస్. ను వదిలిపెట్టి, మద్యనిషేధంలో నమ్మకంలేని ఇంగ్లీషు ఐ.సి.యస్. ఉద్యోగిని వేయడం ఏమీ బాగాలేదు. అంతే కాకుండా, బోర్డు ఆఫ్ రెవిన్యూ మెంబరుగా ఉండడానికి అర్హతగల తెలుగు ఉద్యోగిని వెనుకకు నెట్టడం ఎందుచేత జరిగింది?" అని ప్రశ్నించాను.

అందుకు రాజాజీ "ఇది నీ వరకు కూడా వచ్చిందా? నువ్వు విశాఖపట్నం వాడివి. శొంఠి రామమూర్తి విశాఖపట్నంవాడు. నువ్వు అతని విషయమై చెబితే కొంత అర్థముంది. కాని, నాకు ఇదివరకే పది పదిహేను మంది అప్పుడే సిఫార్సు చేశారు. అతడు ఒట్టి పొలిటికల్ ప్రోపగాండిస్ట్ (రాజకీయ దృష్టిగల ప్రచారకుడు.) అటువంటి వారిని పెద్ద ఉద్యోగాలలో వేసుకుంటే నా మాట సాగుతుందా? మంత్రి మాట సాగుతుందా?" అన్నారు. రాజాజీ యీ మాటలు కనువిప్పు అయితే అర్హు డెవడైనా అణగద్రొక్కబడితే అతని విషయం ఎవరైనా ప్రభుత్వానికి చెప్పవచ్చునా? కూడదా? అన్నది మాత్రం ముఖ్యమైన ప్రశ్న. చెబితే ఉద్యోగిని, ప్రోపగాండిస్ట్ అంటారు. చెప్పకపోతే అడుగున పడిపోతాడు. ప్రకాశంగారు పట్టుపట్టడంవల్ల, బోర్డ్ ఆఫ్ రెవిన్యూ సభ్యుల సంఖ్య హెచ్చించి, శొంఠి రామమూర్తిగారిని అందులో సభ్యునిగా నియమించక తప్పలేదు రాజాజీకి. విద్యావిధానంలో కూడా, పాత సంప్రదాయాలపైన నూతనమైన విజ్ఞాన విధానమును రూపొందించడానికి ప్రకాశంగారు ఒక స్కీమును తయారు చేశారు. అయితే, అదికూడా రెవిన్యూకు సంబంధించకపోవడంచేత సచివాలయంవారు వెనక్కు త్రోసి వేశారు. మొదటి మంత్రివర్గం చేసిన పనులలో ముఖ్యంగా చెప్పుకోవలసినవి- మద్యపాన నిషేధ చట్టము, దానివల్ల ప్రభుత్వానికి తగ్గిపోయే రాబడిని పూరించేందుకుగాను సేల్స్‌టాక్సు విధించే శాసనము, దేవాలయాలలోనికి హరిజనులకు ప్రవేశాధికార మిచ్చిన శాసనము.

మద్యపాన నిషేధం బిల్లుకు కాంగ్రెసేతర సభ్యులనుంచి ప్రతికూలత ఉండేది. చాలా పత్రికలలో కూడా యిది జయప్రదం కానేరదనే శాపవాచకాలు రోజూ వ్రాయబడుతూండేవి. మద్యనిషేధ మన్నది ఎంత గొప్ప ఉద్యమమో అంత దురదృష్టోపహతమైనది. పాశ్చాత్య దేశాలలో కూడా ఆవేశంతో ప్రవేశపెట్టబడి, ఆశాభంగంతో ఉపసంహరింపబడడమే ఈ మద్యనిషేధ ఉద్యమపు సంక్షిప్త చరిత్ర. అదే మన దేశంలో కూడా చేస్తున్నాము.

## అమ్మకపు పన్ను చట్టం

ఇక, సేల్స్‌టాక్సు (అమ్మకపు పన్ను) బిల్లు విషయమై ఒక విషయం చెప్పాలి. సేల్సుటాక్సువల్ల రెవిన్యూ అధికమవుతుంది. కానీ, ప్రకాశంగారి చేతిలోంచి రెవిన్యూకు సంబంధించిన యీ విషయం (సబ్జక్టు) ముఖ్యమంత్రిగారు తమ చేతిలోకి తీసుకోవడమే కాక, ఇందులో ఇంగ్లీషు వర్తకులకుగల సౌకర్యాలు స్వదేశవర్తకులకు కలిగించకుండా బిల్లు నడిపిస్తున్నట్టుగా కింవదంతులు బయలుదేరాయి. ప్రకాశంగారు ఒక రోజున పట్టలేక వెళ్ళి సెలక్టు కమిటీ మీటింగులో కూర్చున్నారు. అప్పుడు రాజాజీ చాకచక్యంగా, "ఈ బిల్లు ప్రకాశం గారు నడిపించవలసింది. నా చేతి కప్పగించడంవల్ల నేను చేస్తున్నాను గాని," అని తొణుకు బెణుకు లేకుండా సభ్యులకు చెప్పారు. కాదన డానికి, అవుననడానికి వీలుకాని సమయం గనుక ప్రకాశంగారు ఊరు కోవలసి వచ్చింది. కాని, అప్పుడు స్వదేశ వర్తకులకు అన్యాయం జరుగకూడదని ఆయన ఒక మారు గట్టిగా చెప్పడంవల్ల ఆ బిల్లులో భాగాలు కొంత సర్దుబాటయినాయి. అలాగే, ఋణ విముక్తి బిల్లు విష యంలోకూడా బోర్డు అఫ్ రెవిన్యూవారు ప్రకాశంగారి ప్రమేయం లేకుండా ఒక బిల్లు తయారు చేస్తున్నట్టు, గవర్నరు ప్రకాశంగారితో మాట్లాడిన సందర్భంలో తెలిసింది. ఇటువంటిది ఎలా సాధ్యము? రాజాజీ ముఖ్యమంత్రి అయినపుడు మాత్రమే సాధ్యం అవుతుంది. ఈ విషయమై ప్రకాశంగారు రాజాజీని అడిగారట. "వాళ్ళేదో వ్రాసుకుం టారు. మనకేమి సంబంధ"మని ఆయన అన్నారట. రెవిన్యూకు చెందిన ఈ ఋణ విముక్తి శాసనాన్ని రాజాజీయే ఉంచుకున్నారు. ఈ విష యాలు మంత్రివర్గం ఏర్పాటయిన కొద్ది కాలంలోనే జరగడంవల్ల, మంత్రి మండలిని చికాకుపరచడం ఇష్టంలేక ప్రకాశంగారు-జాయింట్ రెస్పాన్సిబిలిటీ అనే సూత్రం నాశనమయి పోతున్నదని మాత్రం తన మినిట్లో వ్రాసి, అంతటితో ఆ విషయం చాలించుకున్నారు. ప్రకాశం గారి అభిప్రాయం ప్రకారం ఋణ విముక్తి శాసనంలో ఋణం తగ్గింపు విషయం మాత్రం ఏర్పడితే చాలదనీ, ఋణం తీర్చే విధానం పట్ల

కూడా ప్రభుత్వం బాధ్యత వహించవలెననీ ఉండేది. అయితే, అది ఫలించలేదు. ఇలాగే దేవాలయాల నిర్వహణ శాఖను రాజాజీయే నడిపించారు. దీనికి తోడు, ఇంకా అనేక విషయాలలోనూ రాజాజీ సహాయకారి కాకపోవడం తటస్థించింది.

వజ్రపు గనుల లైసెన్సు

మంత్రివర్గం ఏర్పాటయిన కొంత కాలానికి గిరిధర దాస్ నారాయణ దాస్ అనే ఆయన చెన్నరాష్ట్రంలో వజ్రపు గనులు జరిపించే నిమిత్తమై లైసెన్సుకోసం చెన్నరాష్ట్ర ప్రభుత్వానికి విజ్ఞప్తి చేసుకొన్నాడు.

అప్పట్లో ఆయన స్టేటు కౌన్సిల్లో, అనగా ఇప్పుడు రాజ్యసభ అని పిలవబడేదానికి ప్రత్యామ్నాయంగా స్వాతంత్ర్యానికి పూర్వం ఉండే సభలో సభ్యుడు. ఆయన కుటుంబం అంతకు రెండు వందల సంవత్సరాల ముందు నుంచి చెన్నపట్నంలోనే నివసిస్తూండేది.

వజ్రపు గనులకు లైసెన్సు విషయంలో, గవర్నమెంటు భూములకు సంబంధించి నంతవరకు రెవిన్యూశాఖ భూమి త్రవ్వకాలకు అనుమతి యివ్వాలి. ఆ రోజులలో శొంఠి రామమూర్తిగారు చెన్నపట్నంలో కలెక్టరుగా ఉండేవారు. ఆయన వజ్రపు గనులు నడిపించడానికి తగిన ధన బలం విజ్ఞప్తిదారుకుందని ఆమోదిస్తూ సాల్వెన్సీ సర్టిఫికేటు ఇచ్చారు.

ఈ వినతి పత్రం ఆలోచనలో ఉన్న సమయంలో, రామకృష్ణ డాల్మియా అనే ఆయన ఆ వజ్రపు గనికి తనకు లైసెన్సు ఇవ్వాలని ఒక దరఖాస్తు పెట్టుకున్నాడు. బాబూ రాజేంద్రప్రసాద్‌గారి వద్దనుంచి సిఫారసుపత్ర మొకటి ఆయన ముఖ్యమంత్రిగారి పేర తెచ్చుకున్నాడు. ఆయన చెన్నపట్నం చేరేవేళకు ముఖ్యమంత్రిగారి పక్షాన మంత్రి రామనాథంగారు సెంట్రల్ స్టేషన్ ప్లాట్‌ఫారంమీద ఆయనకు స్వాగతమిచ్చాడు. ఆనాటి మద్రాస్ మెయిల్ పత్రికలో ఈ ఆహ్వానాన్ని సూచించే ఛాయా చిత్రాన్ని, "ఉత్తర హిందూస్థానపు పారిశ్రామిక వేత్త (డాల్మియా)కు చెన్నరాష్ట్ర ప్రభుత్వం స్వాగతం ఇస్తున్నది" అన్న

అర్థంగల మాటలతో పెద్ద సైజు బొమ్మతోసహా అచ్చువేశారు. సచివాలయంలో అప్పటికే లైసెన్సు విషయమై నడుస్తున్న గ్రంథానికి మరొక ఉపగ్రంథం బయలుదేరింది. ఒకనాటి ఉదయం, అప్పట్లో "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" పత్రికకు సంపాదకుడుగా ఉన్న ఖాసా సుబ్బారావు ఒక మార్వాడీ పెద్ద మనిషిని వెంటపెట్టుకొని నా దగ్గరకు వచ్చారు. వచ్చి, దాల్మియా తాలూకు వజ్రపు గనుల లైసెన్స్ విజ్ఞప్తి విషయమై ప్రసంగించారు. ఈ రాష్ట్రంలోని భూగర్భంలో గల సంపద రాష్ట్రేతరులకు అప్పజెప్పడం నా కిష్టం లేదనీ, రాష్ట్రంలో గలవారికి ధన శక్తి చాలక పోయినట్టయితే ఆ గనులను ప్రభుత్వం వారే త్రవ్వించడం జరుగుతుందనీ చెప్పి, నా అభిప్రాయంతో ప్రకాశంగారు ఏకీభవించినట్టు చెప్పాను. నాతో లాభం లేదనుకొని, ఆ పెద్ద మనిషి సుబ్బారావును ప్రకాశంగారింటికి తీసుకు వెళ్ళాడు.

డాల్మియా విజ్ఞప్తి విషయం మాటవరుసకు ప్రసంగ ధోరణిలో చెప్పినట్టు చెప్పి, అయినా అది తన కదెందు కన్నట్లు ఆ ప్రసంగం మాని, ఆ మార్వాడీ పెద్ద మనిషి - ప్రకాశంగారితో, "మీకు నిడుంగాడి బ్యాంకివారు, స్వరాజ్య ప్రెస్సుకు సంబంధించిన ఏడెనిమిదివేల రూపాయల మొత్తం చెల్లించవలసిందని నోటీసు ఇచ్చినట్టు తెలిసింది. లోగడ, మీరు స్వాతంత్ర్య సమరంలో చేసిన త్యాగం చూసి మావంటి వారికి మీ పైన గురుభావము, భక్తి. మీకు తెలిసినా, తెలియకపోయినా మే మెప్పుడూ మిమ్మల్ని మా మనసులలో పూజిస్తుంటాము. మీరు మంత్రిగా ఉన్న ఇటువంటి సమయంలో ఆ బ్యాంకివారు నోటీసిచ్చి మిమ్మల్ని ఇబ్బంది పెట్టడం మంచిది కాదు," అని అంటూ తన చొక్కా జేబులోంచి కరెన్సీ నోట్ల కట్ట ఒకటితీసి, "ఈ పదివేల రూపాయలు నేను మీకు బ్యాంకి బాధ వదలగొట్టడానికి, పాద కట్నంగా ఇస్తున్నాను. స్వీకరించవలసింది," అనేసరికి, ఖాసా సుబ్బారావుకు మతిపోయినట్లయింది. ప్రకాశంగారు అనుభవజ్ఞుడైన క్రిమినల్ లాయరు గదా! ఇదివరలో ఎన్నడూ సాయం చేయని ఆయన ఈ రోజున ఇంత సద్బుద్ధితో రావడంలో కల్మషం ఉండక తీరదని క్షణంలో గ్రహించి,

"నీవు ఈ రోజున్నైతే ఇలాగు వచ్చావు కాని, ఇటువంటి పాడుపని ఇటుపైని తలపెట్టి చెడిపోకు. వెంటనే వెళ్ళిపో," అని చెప్పేసరికి ఆ పెద్ద మనిషి తాను చెప్పవచ్చిన పని మాట మాని, మరేమీ చెప్పక వెనుదిరిగి వెళ్ళిపోయాడు. ఆరోజు, తర్వాత నేను, ప్రకాశంగారు కలిసి కోటలో ఆఫీసుకు వెళ్లే సమయంలో త్రోవలో ఆ మార్వాడీ పెద్ద మనిషి నాకు డాల్మియా విజ్ఞప్తి విషయమై చెప్పడానికి వచ్చాడని చెప్ప నారంభించేసరికి, "ఆ దుర్మార్గుణ్ణి ఎందుకు రానిచ్చావు?" అని మంద లించినట్టు అన్నారు ప్రకాశంగారు. తర్వాత ఆయన నేను పైన చెప్పిన ఉదంతం పూసగ్రుచ్చినట్లు చెప్పారు. తర్వాత, నేను ఖాసా సుబ్బా రావుతో "అటువంటి మార్వాడీని నువ్వెలా తీసుకొవచ్చా. వయ్యా?" అని యథాలాపంగా అడిగితే, "నువ్వు కూడా రావలసిందని నాతో అంటే నేను వచ్చాను. అతని పనికి నాకు సంబంధం లేదని పక్కకు పిలిచి నీకు చెప్పాను గదా? ఎటొచ్చీ ప్రకాశంగారింటి దగ్గర అలా ప్రవర్తిస్తాడని ఊహించలేకపోయాను," అని విచార పూర్వకంగా చెప్పాడు. సచివాలయంలో ఈ వజ్రపు గని హక్కు విషయమై ప్రకాశంగారికి ముఖ్యమంత్రిగారికి చాలా వివాదం పెరిగింది. అయితే, ఆ దాల్మియా చాలా గడుసువాడు కావడంతో, ప్రకాశంగారికి తెలియ కుండా గిరిధర దాస్ నారాయణ దాసుకు ఏదో వాటా ఇవ్వడానికి రహ స్యంగా ఒప్పుకున్నట్టు తెలిసింది. గిరిధరదాస్, ప్రకాశంగారితో తన పైన ఒత్తిడి చాలా ఉండడంచేత తన పిటీషన్ ఉపసంహరించు కున్నట్టు చెప్పాడు. ఆంధ్ర కాంగ్రెస్ కమిటీ సిఫారసుపైన స్టేటు కౌన్సిలుకు సభ్యుడుగా వెళ్ళిన ఆ పెద్ద మనిషి ఇలాంటి రహస్య వ్యవ హారం చేసుకోవడం ప్రకాశంగారి కిష్టంలేక పోవడంతో, ఆయన విముఖులై, అతని విషయమై తర్వాత ఏ విధంగానూ కలుగచేసుకోలేదు.

## సాంబమూర్తిగారి ఇంగ్లండు ప్రయాణ భంగము

1937 లో స్పీకర్ సాంబమూర్తిగారు ఇంగ్లండులోని హౌస్ ఆఫ్ కామన్స్ కార్యపద్ధతి చూచేందుకు, పార్లమెంటరీ విధానాలు పరి శీలించేందుకు, ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయమని బ్రిటిష ప్రభుత్వాన్ని

అడగడానికి వెళ్ళవలెనని అనుకున్నారు. ఈ రోజుల్లో ఇటువంటి ప్రయాణాలు అతి తరచుగా జరుగుతున్నాయి. ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు కావలసిన మొత్తాలను అభ్యంతరం లేకుండా ఏర్పాటు చేస్తున్నారు. కాని, కాంగ్రెసు అధిష్ఠానవర్గం ప్రసక్తే ఉండదు. అయితే, 1937లో పద్ధతి వేరు. సాంబమూర్తిగారు వెళ్ళడానికి ముఖ్యమంత్రి రాజాజీ అంగీకరించి శాసన సభలో—ఆయన సుఖంగా వెళ్ళి తిరిగి రావాలని ఆకాంక్షిస్తూ తీర్మానం ప్రవేశ పెట్టారు. తీర్మానం చర్చ జరిగే సమయానికి కాంగ్రెసు అధిష్ఠానవర్గం దగ్గరనుంచి రాజాజీకి ఒక లేఖ వచ్చింది. వచ్చినా, విప్పి చూసుకోలేదని తర్వాత ఆయన చెప్పారు. శాసన సభలో ఆయన, ఆయనతోబాటు ప్రతిపక్ష నాయకులు సాంబమూర్తిగారిని ప్రశంసిస్తూ జోరుగా ఉపన్యాసాలు సాగించారు. అయితే, మర్నాడు పత్రికలలో సాంబమూర్తిగారు ఇంగ్లండు వెళ్ళడానికి వీలు లేదని అధిష్ఠానవర్గంవారు ఆదేశించి రాజాజీకి సందేశం పంపినట్లు వార్త పడింది. తమ ఆదేశానికి అధిష్ఠాన వర్గంవారు ప్రధాన కారణం చూపించారు. అది: స్పీకరు పదవిలో ఉన్న వ్యక్తి పరాయి ప్రభుత్వాన్ని ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయవలసిందని యాచించడానికి వెళ్ళగూడదు! దానిపై, సాంబమూర్తిగారు ఆ పదవికి రాజీనామా ఇచ్చి వెళతా మన్నారు. అందుకు అధిష్ఠానవర్గంవారు తమ అనుమతి లేకుండా రాజీనామా ఇచ్చి, పార్టీకి ఇబ్బంది కలిగించడానికి వీలులేదన్నారు. ఇంతేకాక, కాంగ్రెసు నాయకులలో అగ్రశ్రేణిలో ఉన్న సాంబమూర్తిగారి వంటివారు యాచనకై పరప్రభుత్వ ప్రాంగణంలో పాదం మోపకూడదన్నారు. ప్రకాశంగారు, నాతో ఈ విషయం ముచ్చటించినపుడు, దీనికి కారణాలు వేరు అని చెప్పారు. ఆయన "మొట్ట మొదట అధిష్ఠానవర్గంవారు తమకు ఇది చెప్పక పోవడం తమ పలుకుబడికి న్యూనత అనుకున్నారు. రెండవది—ఈ 'సాంబమూర్తి' తనతో ఎవరెవరిని తీసుకు వెళుతున్నాడో, వారిపేర్లు పత్రికలలో పడేలాగున ముచ్చటించాడు. ఆ వెళ్ళే వారిపైన మన చెన్నపట్నంలోనే ఒకరిద్దరికి ఇష్టంలేదు. అసలు ఈ వ్యతిరేకపు సలహా చెన్నపట్నంనుంచే బయలుదేరిందని నా నమ్మకము. అయినా,

తనతో వెళ్ళే వారిని తీసుకు వెళ్ళవచ్చుగాని, పత్రికలలో ప్రచురించడం ఎందుకయ్యా?" అని ఛలోక్తిగా అన్నారు.

ఈ ఉదంతమయిన తర్వాత సాంబమూర్తిగారు చాలా ఖిన్నులయినారు. కాని, సభా కార్యక్రమంలో అదేమీ కనపడనివ్వలేదు.

## డాక్టర్ లక్ష్మీపతిగారి కేసు

నేషనలిస్టు పాలన నడుస్తున్న రోజులలో, డాక్టర్ లక్ష్మీపతిగారు ఆరోగ్యవరంలో ఆరోగ్యకేంద్రం విస్తరింపు నిమిత్తమై ప్రభుత్వం వారి సహాయం కోరారు. అప్పటి మంత్రివర్గం నేషనలిస్టు అనుకునే వారు. ఆరోగ్యశాఖామంత్రి అయిన ముత్తయ్య మొదలియార్ అనే ఆయన ఆరోగ్యవరం వెళ్ళిచూచి, ఆ సంస్థ బాగా జరుగుతున్నట్లూ, ప్రభుత్వ సహాయం పొందడానికి అర్హత కలిగి ఉన్నట్లూ వ్రాసి, ఏడు వేల రూపాయలు మంజూరు చేశాడు.

డాక్టర్ లక్ష్మీపతి (బి.ఎ.,ఎం.బి.బి.ఎస్.,) ఇంగ్లీషు డాక్టరు అయినా, ఆయుర్వేదంలో గట్టి నమ్మకం కలవాడు. ఇంతేకాక, పెద్ద సంఘ సంస్కర్త- ఆయన భార్య రుక్మిణమ్మగారు సహాయ నిరాకరణోద్యమంలో పూర్ణంగా దిగి, పనిచేసిన మనిషి.

ఈ పరిస్థితులలో ముత్తయ్యమొదలియార్‌గారు మంజూరుచేసిన ఆ గవర్నమెంటు ఆర్డరు డిస్పాచ్ శాఖకు వెళ్ళింది. ఆ శాఖ ఉద్యోగికి—ఆర్డర్లను రిజిస్టరులో ఎక్కించి, అది ఎవరికి పంపాలో వారి అడ్రసు వ్రాసి స్టాంపు లంటించి పంపించడమో; ఊళ్ళోనే ఉన్న వారయితే మనిషిద్వారా పంపించడమో పని. అయితే, అక్కడ డాక్టర్ లక్ష్మీపతిగారికి ఆ ఆర్డరు పంపే విషయమై పనిచేసే డిస్పాచ్‌గుమాస్తా బ్రిటిషు గవర్నమెంటుకు ప్రియుడు కాబోలు! ఆ ఆర్డరు డిస్పాచ్ చేయక, ఇంకొక కాగితంపైన పి. ీషనరయిన లక్ష్మీపతిగారి భార్య అయిన రుక్మిణమ్మగారు ఉప్పు సత్యాగ్రహంచేసి అరెస్టయి జెయిలు శిక్ష పొందడంవల్ల, ఆమె భర్త అయిన లక్ష్మీపతిగారికి ప్రభుత్వం

ఏడువేల రూపాయలు మంజూరు చేసే ఆర్డరును తాను పంపవచ్చునో, పంపరాదో అన్న అనుమానము కల్గి, సందేహ నివారణార్థం విజ్ఞప్తి పంపుకుంటున్నానని వ్రాసి మీదకు పంపినాడు. ఆ కాగితం హోం మంత్రివరకు ప్రయాణమై ఆ మొత్తాన్ని మంజూరు చేసిన ఆరోగ్య మంత్రితో సంబంధం లేకుండా ఆయన జారీచేసిన ఆర్డరు నిలిపివేశారు.

1937 లో మంత్రివర్గం ఏర్పాటయిన తర్వాత, 1930 లో జరిగిన యీ విషయం వ్రాస్తూ లక్ష్మీపతిగారు, ముఖ్యమంత్రి అయిన రాజాజీకి పిటీషన్ పెట్టుకున్నారు. డబ్బు విషయమై వచ్చిన ఏ కాగిత మైనా ప్రప్రథమంగా త్రోసిపారవేయాలనే తన సూత్రప్రకారం ఆయన దానిని త్రోసిపుచ్చారు. ఆ నిరాకరణ అయినతర్వాత లక్ష్మీపతి గారు జరిగింది చెప్పడానికి ప్రకాశంగారి దగ్గరకు వచ్చారు. వారి దగ్గర పిటీషన్ పుచ్చుకొని ఫైలు తెప్పించారు. నేను మీద వ్రాసిన ఉదంతం ఆ ఫైలు చదివితేతెలిసింది. ఇది శుద్ధ అన్యాయమని, లక్ష్మీపతిగారికి ఆ ఏడువేలు మంజూరు చేయాలని ప్రకాశంగారు గట్టిగా వ్రాశారు. రాజాజీ ఇదివర కొకసారి నిరాకరించడం చేత ఫైనాన్సు డిపార్టుమెంటువారు ఆ కాగితం ఆర్థికమంత్రి అయిన రాజాజీ దగ్గరకు వెళ్ళకుండా ఆ కోరికను నిరాకరించి కాగితం వెనక్కు తిరిగి పంపించేశారు. దాని మీద ప్రకాశంగారు మరీ తీవ్రంగా వ్రాశారు. నేను ఆ ఫైలు పుచ్చుకొని రాజాజీ దగ్గరికి వెళ్ళి, "ఎవరైనా డబ్బు అడిగితే ఆలోచించకుండానే నిరాకరించ వలసిందని మీ ప్రథమ సూత్రం చెప్పారు. కోరినవారు పిటీషను పెట్టుకుంటే వారిలో కొంత ఆసక్తి ఉందని అనుకుని అపుడు పున రాలోచన చేయవచ్చు అని నాకు మీరు ఇదివరలో పాఠం చెప్పారు," అన్నాను. దానికి, "ఎవరి విషయమై అంటున్నా"వని ఆయన అడిగారు.

ఇది డాక్టర్ లక్ష్మీపతిగారి కేసు అన్నాను. ఎప్పుడో ఏడు సంవత్సరాలనాటి డబ్బు ఎలా ఇమ్మంటావని ప్రశ్నించారు. అపుడు ఆ కాగితాలు తీసి, "ఆ విషయంతో ఏమీ సంబంధంలేని డిస్పాచ్ గుమాస్తా పంపిన మెమోపైని రాజకీయ కారణంచేత ఆ డబ్బు ఇవ్వడం

ఆపారు. ఏ రుక్మిణమ్మగారు రాజకీయ శిక్ష అనుభవించడం ఆ నాడు లక్ష్మీపతిగారికి డబ్బు మంజూరు కాకుండా చేసిందో, ఆ రుక్మిణమ్మ గారే ఇప్పుడు మనకు డిప్యూటీ స్పీకరు అయ్యారు గదా! అందుచేత మీ సూత్రప్రకారం మీరు పునరాలోచించవలసిం"దని చెప్పాను. డిస్పాచ్ గుమాస్తా పెట్టిన పేచీని గ్రహించి ఆయన ప్రకాశంగారితో ఏకీభవిస్తూ, ఏడువేలు లక్ష్మీపతిగారి కివ్వాలని ఒప్పుకున్నారు. కాని, యీ నిర్ణయానికి వచ్చేలోపున చాలా రాద్ధాంత సిద్ధాంతాలు ప్రకాశం గారు, రాజాజీ, డాక్టర్ లక్ష్మీపతిగార్ల మధ్య జరిగి, పేరు ప్రఖ్యాతులు గన్న డాక్టర్ లక్ష్మీపతిగారు రాజాజీ గుమ్మందగ్గర సత్యాగ్రహం ప్రారంభం చేసేవరకు వెళ్ళింది. కాని, ఎవరికీ ఇబ్బందిలేకుండా సత్యాగ్రహం ఆరంభించకముందే డబ్బు మంజూరు కావడంవల్ల ఆ వివాదం అంతటితో పరిష్కారమయింది.

## హిందీ

ఇప్పుడు హిందీ భాష విషయంలో ప్రబలిన వ్యతిరేకాభిప్రాయాలు, 1937 లో మంత్రివర్గం ఏర్పాటయిన సందర్భంలో ఇంత తీవ్రంగా లేవు. జస్టిస్‌పార్టీ నాయకులు మాత్రమే దానికి వ్యతిరేకమైన ఆందోళన ప్రారంభించారు. దీనికి కారణం వారికి కాంగ్రెసుమీద నున్న వ్యతిరేకతయే. ధైర్యంగా అన్ని స్కూళ్ళలోను ఆనాడే హిందీ నేర్పడం ఆరంభిస్తే ఎలా ఉండేదో తెలియదు. ఎప్పుడయితే కొన్ని స్కూళ్లలో మాత్రం ప్రయోగాత్మకంగా ప్రారంభిస్తామన్నారో అప్పుడే వ్యతిరేకులకు బలము, ధైర్యము హెచ్చవడంలో ఆశ్చర్యంలేదు. పని పాటలులేని కొందరు చిన్నపిల్లలను, పెద్దవాళ్ళను చేరదీసి, అందులో అనేకులకు రోజుకింత అని కొంతకూలికూడా యిచ్చి హిందీ చెప్పే స్కూళ్ళ ఆవరణల్లోకి వెళ్ళి రాళ్ళు వేయడం, అసభ్యంగా కేకలు వేయడం మొదలైన అల్లరులు చేయించడం ఆరంభించారు. శాసన సభలో జస్టిస్ పార్టీ నాయకులు వాళ్ళకు బలం చేకూర్చేవారు.

అది అక్కడితో ఆగలేదు. రాజాజీ వసతిగృహానికి చుట్టూ బాగా ఘుష్కరులైన పెద్దలతోబాటు, పిల్లలు అనేకులుచేరి, రాళ్ళు రువ్వి

కేకలు వేయడమే పెద్ద ఉద్యమంగా సాగించారు. రాజాజీ ఉండే యిల్లు చాలా చిన్నది. ఇంటికీ, వీథికీ మధ్య పది అడుగులకన్నా తక్కువ దూరం ఉండేది. అందుచేత ఆయనకు దుర్భరమయిన పరిస్థితులు ఏర్పడ్డాయి. వీథిలో ఆ చివర, ఈ చివర పోలీసులను పెట్టుకుని కాల క్షేపం చేయవలసి వచ్చింది. ప్రజలమధ్యకు వచ్చి ప్రచారం చేసి, కాబినెట్‌లోని మంత్రులందరి సలహాకూడా పుచ్చుకుని, ఒక వాతావరణం కల్పించిన తరువాత, అన్ని స్కూళ్ళలోను హిందీని ప్రవేశపెట్టి ఉన్నట్లయితే—అప్పుడు కాంగ్రెసువారికున్న పలుకుబడితో మంచి వాతావరణం ఏర్పడేది. కాని, ఈ అల్లరవల్ల, అది ముందుకు సాగ లేదు. స్కూళ్ళలో కాకపోయినా, దక్షిణ భారత హిందీ ప్రచార సభ వారు ఏర్పాటుచేసిన శిక్షణ కేంద్రాలలో వందలు, వేలు హిందీపరీక్షలు పాస్ అవుతూనే ఉన్నారు. దాక్షిణాత్యులు బ్రతక నేర్చినవారు గనుక ఈ మధ్య హిందీకి వ్యతిరేకంగా జరిగిన ఆందోళనను బలపరచినట్లు కనిపించినా కేంద్రప్రభుత్వపు ఉద్యోగులకు ప్రమోషన్లు వగయిరాలకు హిందీ అవసరం గనుక వాటికి భంగంలేకుండా వారు హిందీ నేర్చుకుంటూనే ఉన్నారు.

అయినా, హిందీ ఒక గడ్డు సమస్య అయిపోయింది. భాష నేర్చుకోవాలని పెద్దలు చెప్పినంతకాలం హిందీకి ఎవరూ అడ్డురాలేదు. కాని, ఎప్పుడయితే హిందీరాకుంటే ఉద్యోగానికి భంగం వస్తుందని ప్రభుత్వంవారు అన్ననాటినుంచి హిందీపై తగని వ్యతిరేకత ప్రబలుతూ ఉంది. హిందీరానివాడికి ఏ విధంగా రాజ్యపరిపాలనాదక్షత తక్కువ కాగలదు? దేశంలో ఈ విషయమై అల్లర్లు, పోలీస్ లాటీ చార్జీలు, కాల్పులు అన్నీ జరిగిన తరువాత మనప్రాంతంవారు - ఇక మనకు ఇంగ్లీషు వద్దు అన్నంతవరకు, హిందీతోబాటు ఇంగ్లీషుకూడా పూర్వంలాగే రాజభాషగా ఉండాలనే శాసనంచేసిన విషయం అందరికీ గుర్తుండ వచ్చును. అయినా, కేంద్ర సర్వీసులలో హిందీపరీక్ష పాసు కాకపోతే జీతం హెచ్చింపులు, ప్రమోషన్లు నిలుపుదల అవుతాయన్న ప్రభుత్వ ప్రకటనలు, సూచనా పత్రాలు (నోటిఫికేషన్స్) ఇప్పటికీ

జారీ అయి, తెలుగు ఉద్యోగస్థులు బాధపడుతూనే ఉన్నారు. ఎప్పుడో అప్పుడు ఏదో అల్లరి బయలుదేరడానికి అవకాశా లున్నాయి.

## ఖద్దరు పరిశ్రమ - గ్రామ స్వరాజ్యము

చేతి వడకునూలు, చేనేతబట్ట గ్రామ స్వరాజ్యాన్ని పటిష్ఠం చేయడానికి మొదటి మెట్లు. ఇంటింటా తిరిగి రాట్నాలు పునః ప్రతిష్ఠాపన చేసి ఖద్దరు నేయించడం అనేది రాజకీయమైన స్వాతంత్ర్య సమర చిహ్నమనే భావం ఒకటి కాంగ్రెసువారికి అందరికీ ఉండేది. అందుచేత ప్రభుత్వంవారు తమ ఖర్చుపైన ఎక్కడ బట్టలు సరఫరా చేయవలసి వచ్చినా అక్కడ ఖద్దరు ఇవ్వటం మంచిదని కాంగ్రెసువారు భావించారు. అయితే, ఇది పోలీస్ డిపార్టుమెంటువారు, మిలిటరీవారు అంగీకరించ లేదు. కాని, మిగిలిన చోట్ల ఈ గుడ్డలే కొనియివ్వవచ్చు గదా! ముఖ్యంగా ఆస్పత్రులలోను, మిగిలిన శాఖలలోను సిబ్బందికి ఖద్దరుగుడ్డ లిచ్చుటకు యత్నములు జరిగినమాట వాస్తవమే. కాని, అంత పట్టుదల మంత్రులు చూపించలేదు. చూపించినట్లయితే మూడు నాలు గేండ్లలో అన్ని విధాలయిన కార్యాలకు ఉపయోగకరమైన, నాణ్యమైన ఖద్దరు ఉత్పత్తి కావడానికి అవకాశం ఉండేది. బట్టల మిల్లులకు ప్రభుత్వంవా రిచ్చే సదుపాయాలు, సహాయాలు, బలము మొదలైన వాటి విషయం దేశంలో సరిగా తెలియక వాటికి అయ్యే ఖర్చు ప్రజలే వహిస్తూండడం వల్ల - మిల్లుగుడ్డ హెచ్చు ఖరీదో, ఖద్దరు హెచ్చు ఖరీదో సరిగ్గా పోల్చుకోవడం చదువుకున్న వారికి కూడా కొంత కష్టము. ఇలాంటి పరిస్థితులలో ఈ రోజుదాకా కూడా ఖద్దరు వెనుకబడి ఉంది. పల్లెటూళ్ళలో, ముఖ్యంగా నాణ్యమైన ఖద్దరు తయారుచేసే ఉద్యమం అప్పట్నుంచి సాగిఉంటే - చేతిలో ఏ పనీలేని వారికీ, సరిపడినంత పనిలేని వారికీ ఖద్దరు ఆర్థికంగా ఎంతైనా ఉపకరించి ఉండేది. నేటికీ, గ్రామసీమలలో ఉద్యోగ సదుపాయాలు ఎలా చేయడమనేది ఆలోచనా స్థితిలోనే ఉంది. రాళ్ళు బద్దలు కొట్టించి, మన్ను మోయించి, కూలి యిచ్చి, నిరంతరం వారిని కూలీలుగా ఉంచి పెంచడం కన్న వడుకు నూలు, చేనేతబట్ట కేంద్రాలు హెచ్చు చేస్తే, వారికి కూలీ గిట్టుబాటు

కావడంతో బాటు, చేతిపనులలో నైపుణ్యమూ హెచ్చుయి, సంఘానికి ఆర్థికంగా బలం చేకూర్చడానికి వీలవుతుంది. కాని ప్రజలూ, ప్రభువులూ కూడా గ్రామసీమలలోని ప్రజలు సత్తువ సంపాదించడం కన్న పెద్ద పెద్ద మిల్లు యజమానులు బలపడడమే ముఖ్యమని అనుకోవడం వల్ల ఈ స్థితి కొన్నాళ్ళకు బాగా విషమించడానికి చాలా అవకాశాలు ఉన్నాయి. అయితే మిల్లు యజమానుల పరమయిన మన తత్వంతో ఉన్న మంత్రులకుగాని, ఆర్థిక శాస్త్రవేత్తలకుగాని - దీని ప్రమాదం 1939 లోనే తెలియనప్పుడు, కాంగ్రెసుకు నైతిక ప్రాబల్యం తగ్గిన యీ రోజులలో ఇటువంటి గ్రామీణ పునర్నిర్మాణ మహోద్యమాలకు చోటెక్కడ?

## "స్వరాజ్య" పత్రిక చరితార్థత

"స్వరాజ్య" పత్రిక పుట్టు పూర్వోత్తరాలు ఈ గ్రంథం పూర్వ సంపుటాలలో ఇదివరకు ప్రకాశంగారే వ్రాశారు. మంత్రివర్గం ఏర్పాటయేసరికి స్వరాజ్య పత్రిక యంత్రాల సంబంధమైన కొన్ని ఋణాలింకా మిగిలి ఉన్నవి. మంత్రిగా ఉన్నపుడు, లావాదేవీలలో పడడం ప్రకాశంగారి కిష్టంలేదు. అసలు అంతకు ముందు, ప్రొవిన్షియల్ కాంగ్రెసు కమిటీ అధ్యక్షుడుగా ఉండి, పత్రికకు వాటాలు వసూలు చేయడం మంచిది కాదని డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు చాలా అభ్యంతరం పెట్టారు. * అటువంటి సందర్భంలో మంత్రిగా ఉండినా, స్వరాజ్య పత్రిక కంపెనీని వాలంటరీ లిక్విడేషన్ చేసేసినట్లయితే బాగుంటుందని ఆలోచించి ఆ విధంగా చేసేశారు.

---

* డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు పార్లమెంటరీ బోర్డులోను, ఆలిండియా వర్కింగ్ కమిటీలోనూ సభ్యత్వం కలిగి ఉండి, కేంద్ర శాసన సభకు అభ్యర్థులను నిలబెట్టే సమయంలో తాను ప్రారంభించిన "శుభోదయ" పత్రికకు అభ్యర్థుల దగ్గర పెద్ద పెద్ద మొత్తాలు వాటా ధనం క్రింద వసూలు చేయడం నాకు స్వయంగా తెలుసు. అది సరిగ్గానే ఉందని ఆయన అనుకున్నారు.

ఈ స్వరాజ్య పత్రిక జాతీయ నినాదాలను దేశం మూల మూలలా మారుమ్రోగించింది. పత్రికలు నడిపేవారికి నిర్భయత్వం కలిగించింది. అపమార్గంలో వెళ్లేవారికి యమదండంగా పరిణమించింది. జాతీయోద్యమ వార్తలు ఇతర పత్రికలు ప్రచురించడానికి జంకినా, సెక్యూరిటీలు ఎన్నెన్నిమార్లు పోయినా వెనుకకు తగ్గకుండా స్వరాజ్య ప్రకటించేది. ప్రకాశంగారి సొంతడబ్బేగాక, వసూలు చేసిన వాటా ధనమే గాక, ప్రవాస భారతీయుల బాధలను గురించి ఆయన వ్రాసినది చదివిన బర్మా మలయా దేశాల భారతీయులు కేంద్ర శాసన సభ సభ్యుడుగా ఉన్న దినాలలో ఆయన అక్కడ పర్యటించి నపుడు అభిమానంతో విరాళాలుగా ఇచ్చిన లక్షలు కూడా ఈ పత్రికా నిర్వహణలో ఆహుతి అయిపోయినవి. చివరకు మిగిలింది పేరు ఒక్కటే. ఈ రోజున, ప్రకాశంగారి జీవితయాత్ర వ్రాసే సందర్భంలో, స్వరాజ్య పత్రికలు ఎక్కడైనా దొరకుతాయా అని వెతికితే ఎక్కడా దొరకలేదు. ఆయన ఆ పత్రికలో వ్రాసేటప్పుడు, పత్రికకు హాని కలుగకుండా, ప్రభుత్వంవారేదైనా చర్య తీసుకుంటే తనపైనే సంపూర్ణమైన, వ్యక్తిగతమైన బాధ్యత తీసుకునేటట్లు- అనేక వ్యాసాలు, నిర్భయంగా ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, తన పేరుమీద వ్రాసేవారు.

ఈ పత్రికా నిర్వహణలో, సంపాదకీయ వర్గంలో ఇంతో అంతో కాలం పనిచేసిన వారిలో ఈ క్రింది ప్రముఖులు ఉన్నారు:

వారు - కె. ఎం. ఫణికర్, పోతన్ జోసెఫ్, కోటంరాజు పున్నయ్య, కోటంరాజు రామారావు, కె. సంతానం, కోలవెన్ను రామకోటీశ్వరరావు, జి. వి. కృపానిధి, ఖాసా సుబ్బారావు మొదలైన వారు. ఇందులో చివర చెప్పిన ఇద్దరూ పత్రిక లిక్విడేషన్ అయ్యేవరకు జీతం అందినా, అందకపోయినా, దేశంమీద ఉన్న అభిమానంచేతా, ప్రకాశంగారిపై నున్న గురుభావంచేతా పత్రికను అంటిపెట్టుకుని ఉన్నారు.

## శాసన సభలో ప్రశ్నలకు జవాబులు

శాసన సభా కార్యక్రమం నడిపించడానికి, నామీద ప్రత్యేకమైన అభిమానముంచి, ఉత్తర ప్రత్యుత్తరాలు ఇచ్చే సమయంలో (అంటే ప్రతి దినం మొదటిగంట యావత్తూ) ఆయన పని నాకు అప్పజెప్పి, అవతల ఉండేవారు ప్రకాశంగారు. అలా అవతల ఉండవలసిన అగత్యం స్పీకరు సాంబమూర్తిగారివల్ల కలిగింది. ప్రకాశంగారు మొదట, ఒకటి రెండు రోజులు ప్రశ్నలకు జవాబులు చెప్పి, తర్వాతనే పార్లమెంటరీ సెక్రటరీని కాబట్టి ఆ జవాబులు నన్నే చెప్పమన్నారు. దానిపైన సాంబమూర్తిగారు ఒక రూలింగు ఇచ్చారు. ఆ రూలింగు ప్రకారం మంత్రి గారు సభలో హాజరయిఉంటే, పార్లమెంటరీ సెక్రటరీ ప్రశ్నలకు జవాబు చెప్పరాదు. అయితే, ప్రకాశంగారు దానికి జవాబుగా "ఇకమీద ప్రశ్నల సమయంలో నేను అవతల ఉండి, మిగిలిన కార్యక్రమం ఆరంభమయ్యేసరికి వస్తుంటాను. ప్రశ్నలకు జవాబులు పార్లమెంటరీ సెక్రటరీయే ఇస్తుంటా" దని చెప్పి, ఆ రోజు కాగితాలు నా చేతిలో ఉంచి, అవతలకు వెళ్ళారు.

ఇది ఇలా జరుగుతుండగా, అనవసరమైన ఒక చిన్న విమర్శ ఒక చిన్న వార పత్రికలో ఎవరో వ్రాశారు. అందులో, ప్రశ్నోత్తర సమయంలో ప్రకాశంగారు తప్పుకోవడమే బాగుందనీ, ఆయన పార్లమెంటరీ సెక్రటరీయే కార్యక్రమమంతా ప్రశంసనీయంగా నడిపిస్తున్నారనే భావం ఉంది. అయితే, ఈ విషయం నేను మొదట చూడలేదు. మామూలుగా నాకు వచ్చే ప్రశ్నలకు సంబంధించిన ఫైళ్ళు ఒక రోజు నా వద్దకు రాలేదు. గుమాస్తాలు పంపడం మరచిపోయినా రేమోనని, నేను ప్రకాశంగారి యింటికి వెళ్ళాను. ప్రకాశంగా రప్పుడు భోజనం చేస్తున్నారు. కచ్చేరీ గది బల్లపైన, ఒక వారపత్రికలోని వ్యాసం— మార్జినులో ప్రక్కగా ఎర్ర గీత ఉన్న దానిని నేను చూశాను. ఏదో పరిపాలనా విషయమేమోనని చూస్తే, అది ప్రశ్నోత్తరాలకు సంబంధించి నేను ఇంతకు ముందు పేర్కొన్న వ్యాసమే. ఆ కాగితం నేను తిరిగి అక్కడే ఉంచేశాను. ప్రశ్నలకు సంబంధించిన ఫైళ్ళు ఆ

ప్రక్కనే ఉన్నాయి. అంతలో ప్రకాశంగారు బయటకు వచ్చారు. మామూలు పద్ధతిలో, ఆయన కారులోనే నేనూ, ఆయనా అసెంబ్లీకి బయలుదేరాము. మా ఇద్దరిలో ఎవరూ ఆ వ్యాసం ప్రసక్తి తేలేదు. కొంతదూరం పోయిన తర్వాత "ఈ రోజు ప్రశ్నలకు నేనే జవాబులు చెప్తానులే," అన్నారు ప్రకాశంగారు. నేను "సరే" అన్నాను. కారణం ఆయన చెప్పలేదు. నేను అడగలేదు. ఆ పత్రిక వ్యాసమే కారణమయి ఉంటుందని ఊహించాను. అయితే, ఇటువంటి వ్యాసంవల్ల ప్రకాశంగారివంటి పెద్దవారు బాధపడ్తారా అని అనుకున్నాను. అలా రెండు మూడు రోజులు జరిగింది. ఆ తరువాత ప్రశ్నల పైళ్ళు ఆ మంత్రివర్గం ఉన్నంతవరకు నాకే వస్తూ ఉండేవి. ఒకటి మాత్రం నేను ఇక్కడ చెప్పాలి. మిగిలిన మంత్రులు తమ పార్లమెంటరీ సెక్రటరీలకు, ప్రకాశంగారు నాకు ఇచ్చినట్లు అవకాశాలు ఇచ్చేవారు కారు. అలా ఇచ్చిన అవకాశాలను నేను సద్వినియోగ పరచినట్లే సభలో అందరూ భావించేవారు. ఈ విషయంలో, కేంద్ర లోక్ సభలోను, రాజ్యసభలోను ఉన్న పద్ధతి. ఈ రాష్ట్ర శాసన సభలో పద్ధతికి భిన్నంగా ఉంటుంది. మంత్రి అక్కడే ఉన్నప్పుడు కూడా ఉప, సహాయ మంత్రులు జవాబు లివ్వడానికి అభ్యంతరంలేదు. అంతే కాదు. వారే ప్రథమంలో సచివాలయంవారు వ్రాసి నికరం చేసిన ప్రత్యుత్తరాన్ని చదువుతారు. అవసరం వచ్చినపుడు మంత్రి కూడా లేచి ప్రత్యుత్తరాన్ని విపులపరుస్తాడు. శాసన సభలో ఉపన్యాసా లిచ్చేటప్పుడు ప్రకాశంగారు మంద్ర స్వరంలో మెల్లిగా మొదలుపెట్టి తూచి తూచి మాట్లాడినా, ఉపన్యాసం గడచిన కొద్దీ వాక్యాలు వేగం అందుకుని అవసరాన్నిబట్టి ఉచ్చమైన స్వరంలోకి వెళ్ళడం జరిగేదని ఇదివరకే వివరించాను. తాను మాటాడుతున్నపుడు ఇతర సభ్యులెవరైనా విమర్శనా పూర్వకంగా ఏదైనా మధ్యలో అంటే, ఆయన దాన్ని వెంటనే అందుకుని, దాని జవాబును కూడా తన వ్యాఖ్యానంలో కలప గలిగేవారు. ఒక రోజున శాసన సభలో జమీందారీ ఎంక్వయిరీపై మాట్లాడే సందర్భంలో "పెర్మనెంట్ సెటిల్మెంటు రెగ్యులేషన్లోగల భాషయొక్క అర్థం ప్రీవీ కౌన్సిల్‌వారు

సరిగా గ్రహించలేకపోయా"రని ప్రకాశంగారు అంటే, శాసనమండలి సభ్యులైన సర్ కె. వి. రెడ్డినాయుడుగారు అందుకుని, "ప్రీవీ కౌన్సిల్ వారంతా ఇంగ్లీషువారు కదా! వారి ఇంగ్లీషు వారికే బోధపడలేదంటారా?" అని ఆశ్చర్యంతో ప్రశ్నించారు. వెంటనే ప్రకాశంగారు "అంతే! రెడ్డినాయుడుగారికి తెలుగు గ్రంథాలన్నీ అర్థమయ్యాయా?" అని ప్రశ్నించారు.

రెడ్డినాయుడుగారు, ప్రకాశంగారు చిన్నప్పుడు కలసి చదువుకున్న వాళ్ళు (క్లాస్‌మేట్స్). మొత్తంపైన ఆ రెండేళ్ళున్నర మంత్రివర్గ కాలంలో ప్రకాశంగారు ఏది మాట్లాడినా, దానికి ఒక విలువ, ఒక బరువు ఉండేవి. అందుకు ఆయన త్యాగశీలత ముఖ్యకారణము.

# 7

## మంత్రివర్గాల రాజీనామా

కాంగ్రెసు మంత్రివర్గాలు చురుగ్గానో, మందకొడిగానో కొన్ని కార్యకలాపాలు సాగించుకుంటూ వస్తూన్న రోజులలో యూరపు ఖండంలో ఒక మహాయుద్ధం ప్రారంభమైంది. ప్రథమ ప్రపంచ సంగ్రామానంతరం శాంతి సంప్రదింపుల మిషపైన ఓడిపోయిన జర్మనీని గెలిచినవారు అణగద్రొక్కగా, జర్మనీ ప్రజల హృదయాలలో ఉడుకు కలిగి, దూరదృష్టిలేని ఒక నాయకుని ఉద్ధతివల్ల ఈ యుద్ధం ఆరంభమయింది. జర్మనీవారు తమకు—ఇంగ్లండు, ఫ్రాంసు, అమెరికా వారు ముఖ్య శత్రువులనే భావం పెంచుకున్నారు. ఒక లంఘింపుతో హిట్లరు, ప్రక్కనున్న చిన్నదేశాల నాక్రమించుకుని, యుద్ధ భేరీ మ్రోగించాడు. ఇంగ్లండుపై యుద్ధం ప్రకటించాడు. మన దేశానికీ జర్మనీకీ మధ్య యుద్ధానికి ఏ విధమైన కారణమూ లేదు. కాని మన దేశం ఈ యుద్ధంలో తమకు సాయం చేయాలని ఇంగ్లండు పాలకుల వాంఛ. గాంధీగారేమో అసలు అహింసావాది. యుద్ధ విముఖుడు.

కాంగ్రెసు ఆయన నాయకత్వం క్రింద నడుస్తున్నది కదా! అందుచేత, ఆగస్టు మొదటి వారంలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సమావేశమై, భారత దేశాన్ని ఐరోపా సంగ్రామంలోకి దించగూడదని తీర్మానం చేసింది. దీనికి జవాబుగా 3-9-1939 నాడు, బ్రిటిషు రాజప్రతినిధి భారత దేశం యుద్ధంలో ఇంగ్లండు పక్షాన చేరినట్లుగా ఒక ప్రకటన చేశాడు. అప్పుడు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు, గాంధీగారి అహింసా తత్వం అటుంచి, వారం రోజులపాటు చర్చజేసి, ఆ నెల 14 వ తేదీన భారతదేశాన్ని స్వతంత్రమైన దేశం క్రింద గౌరవిస్తూ ఇంగ్లండు ప్రభుత్వంవారు తమ యుద్ధోద్దేశాలను ప్రకటించినట్లయితే వారికి సాయం చేస్తామని తీర్మానించారు. గాంధీగారిని కాదని ఈ విధంగా తీర్మానిస్తే, బ్రిటిషువారు కాంగ్రెస్ అభిప్రాయాన్నే గౌరవిస్తారని కాంగ్రెస్ వారనుకున్నారు. అయితే, బ్రిటిషువారు ఈ తీర్మానానికి ఎట్టి విలువా ఇవ్వలేదు. 22-10-39 న కాంగ్రెస్ కమిటీ తిరిగీ సమావేశమై, ఆత్మ పరీక్ష చేసుకుని, బ్రిటిష్‌వారికి యుద్ధంలో సహాయం చేయకూడదనీ, కాంగ్రెస్ మంత్రివర్గాలన్నీ రాజీనామా చేయాలనీ ఆదేశించారు. దాని ప్రకారం 26-10-1939 నాడు చెన్నపట్నంలో, శాసన సభలో మంత్రివర్గం రాజీనామా చేయాలని ప్రతిపాదించిన తీర్మానం అంగీకరింపబడింది. 29 వ తేదీన రాజాజీ మంత్రివర్గం రాజీనామా పత్రం గవర్నరుకి అందజేశారు. ఆ రోజే హోల్డ్సువర్త్ అనే రెవిన్యూ కార్యదర్శి ప్రకాశంగారి గదికి వచ్చి, బాగా నడుస్తున్న మినిస్ట్రి రాజీనామా చేయడం అంత వ్యవహార జ్ఞానంతో కూడిన పని కాదని సానుభూతి పరంగా అన్నాడు. ప్రకాశంగారి కేమో జమీందారీ బిల్లు పాసు కాకుండా రాజీనామా ఇవ్వడం ఇష్టంలేదు. కాని, ఆ రాజీనామా ఇవ్వడం మంచిదే అని పైకి ఆ కార్యదర్శితో అన్నారు. రాజీనామా ఇవ్వపోయినట్లయితే—గవర్నరు కాన్స్టిట్యూషనల్ గవర్నరుగా మాత్రం ఉండి, మంత్రుల సలహా ప్రకారం నడుస్తానని ఇచ్చిన మాట ఏ విధంగా నిలబెట్టుకో గలడు? యుద్ధానికి మన రాష్ట్రంలోంచి ఏ విధమైన సాయమూ చేయమని మంత్రివర్గం చెప్పినమాట ఎలా నిలబడు

తుంది? వెంటనే రాజీనామా చేయకపోతే కాంగ్రెసు నీతికి భంగంగా ఎన్నెన్నో ఆర్డర్లు మన మంత్రివర్గంవారు చేయవలసి వచ్చేది.

## ప్రకాశంగారి కాంగ్రెసు ప్రచారము

రాజీనామా ఇచ్చిన వెంటనే ప్రకాశంగారు తిరిగి కాంగ్రెస్ పని చేయడంలో నిమగ్నులయ్యారు. 1937 లో ప్రకాశంగారు మంత్రి అయిన తరువాత కాంగ్రెస్ అధ్యక్ష పదవి డాక్టర్ పట్టాభి సీతారామయ్య గారికి అప్పజెప్పారు. ప్రకాశంగారు రాజీనామాచేసి రాగానే సీతా రామయ్యగారు, రాష్ట్ర కాంగ్రెస్ సంఘపు అధ్యక్ష పదవిని ప్రకాశం గారికి సురక్షితంగా అప్పజెప్పారు. అప్పటికి కాంగ్రెసులో తీవ్రమైన అడ్డు కెరటాలు పుట్టలేదు.

ప్రకాశంగారు ఆ తర్వాత తెలుగు ప్రాంతాలలో మూల మూలలకు ప్రయాణం చేస్తూ—కాంగ్రెసు మంత్రివర్గ పాలనలో జరి గిన లోపాలను ప్రజలలో ఎవరైనా విమర్శిస్తే పరిపాలనను సమర్థిస్తూ, జమీందారీ బిల్లు మొదలయిన బిల్లు లెందుకు ఆలస్యమైనవో బోధపరుస్తూ, మంత్రివర్గం ఏ కారణంచేత రాజీనామా ఇవ్వవలసి వచ్చినదీ వివరిస్తూ గంభీరోపన్యాసాలిస్తూ రాష్ట్రంలో పర్యటన చేశారు. 1941 జనవరిలో నూజివీడులో జరిగిన రాష్ట్ర రాజకీయ సభకు ప్రకాశంగారే అధ్యక్షత వహించారు. స్వాతంత్ర్య సమరం గూర్చి మాట్లాడి, గ్రామస్వరాజ్యము. ఖద్దరు ప్రాముఖ్యము, హరిజనోద్ధరణము మొదలైన విషయాలపై ఆయన గంభీరోపన్యాసాలు చేశారు.

ఫిబ్రవరి నెలలో కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మరొకసారి సమా వేశమై, రాష్ట్రాలలో కాంగ్రెస్ మంత్రివర్గాలు తిరిగి స్థాపించే ప్రసక్తి వదులుకుని, గాంధీగారి నాయకత్వాన సంపూర్ణంగా బలపడడానికి తీర్మా నించుకున్నారు. మార్చిలో బీహారు రాష్ట్రంలోని రామ్‌ఘర్‌వద్ద అఖిల భారత కాంగ్రెస్ సాంవత్సరిక మహాసభ జరిగింది. సభ జరగడానికి ఏర్పాటయిన స్థలం చిన్న అడవి వంటిది. చాలా చెట్లను కొట్టి, కాంగ్రె స్‌కు వచ్చిన వారికి వసతులూ, సభా స్థలమూ ఏర్పాటు చేశారు. అసలు

సభ ఏమో బహిరంగ స్థలంలోనే జరగడానికి ఏర్పాటు జరిగింది. అయితే, దురదృష్ట వశాత్తు మధ్యాహ్నం రెండు గంటలవేళ అయ్యేసరికి మేఘాలు దట్టంగా కమ్మి, కుండలతో దిమ్మరించినట్టు వర్షం పడసాగింది. తడవకుండా ఉందామనే ఆశతో, కొందరు వేదికపై నున్న తివాసీల క్రింద జంబుకానాల క్రింద ప్రవేశించారు. అయితే ఆ రక్షణ వారికి ఒక పది నిమిషాలు మాత్రమే కలిగింది. తర్వాత ఆ పెద్ద పెద్ద తివాసీలు, జంబుకానాలు కూడా పూర్తిగా తడిసి బరువెక్కడంతో, వాటి క్రింద ఉక్కిరిబిక్కిరి అవుతున్న వారిని ఎలాగో కష్టంమీద పైకి లాగవలసివచ్చింది. అందులో చాలామంది అప్పుడలా చాలాసేపు తడవడంవల్ల జబ్బుపడ్డారు. చెన్నరాష్ట్రంలో పబ్లిక్ వర్క్సుమంత్రిగా పనిచేసిన యాకూబ్ హుసేన్‌గారు అలా తడియగా చేసిన జలుబు న్యూమోనియా క్రిందికి మారగా, జబ్బుపడి, చెన్నపట్నానికి తిరిగి వచ్చిన కొంత కాలానికి దివంగతులయ్యారు.

ఈ కాంగ్రెస్ పూర్తి అయిన తర్వాత నేను, డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు కలసి తిరుగు ప్రయాణం చేయడం సంభవించింది. ఆయనపై నాకు అపారమైన గౌరవ ముండేది. ఆంధ్ర ఉద్యమం ప్రారంభకాలంలో ఆయన మహానాయకత్వాన్ని వహించారు. నిశితమైన విమర్శనా శక్తి, వాడియైన వాగ్ధాటి గల ఆయన కాంగ్రెస్ అధిష్ఠాన వర్గంలో కొంతవరకు గాంధీగారికి ఆప్తుడు. 1935 లో కాంగ్రెస్ స్వర్ణోత్సవ సమయంలో కాంగ్రెస్ చరిత్రనంతా ఒక ఉద్గ్రంథంగా వ్రాసి ప్రశంసలు పొందారు ఆయన. అయితే, ఆయనకు మొదటి నుంచీ ప్రకాశంగారంటే కొంచెం ద్వేషం, మాత్సర్యం ఉండేవి. అవి అనేక సమయాలలో బయల్పడుతూ ఉండేవి. కబుర్ల ధోరణిలో, చెన్నరాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం ఎలాగు నడచిందో అని ఆయన అడిగిన ప్రశ్నలకు జవాబుగా, రాజాజీ ఐ.సి.యస్. ఉద్యోగుల చెప్పుచేతలలో ఉండేవారనీ, తాను ఎంచుకున్న మంత్రివర్గంపై అట్టే నమ్మకం కనబర్చేవారు కారనీ నేను సోదాహరణంగా చెప్పగా, సీతారామయ్యగారు "నువ్వు చెప్పిందంతా బాగుందయ్యా? అసలు మన

వాడు మంచివాడయితే సరిపోయేది కదా?" అన్నారు. ఆయన సూచించింది ప్రకాశంగారి విషయము. ఆ విధంగా ఆయన అనేసరికి నాకు ఆశ్చర్యం వేసి, "మీ రెందుకిలా అంటున్నా"రని అడిగాను. దానిపై పట్టాభిగారు "ఒక జమీందారుకి, కోర్టు ఆఫ్ వార్డ్సుకి జరిగిన వివాదంలో ప్రకాశంగారు పాస్‌చేసిన ఆర్డరు సంగతి నువ్వేమంటావు?" అన్నారు. అది విజయనగరం జమీందారుకు సంబంధించినది. ఆ ఫైలు విషయమై తెలిసినవారు రెవిన్యూ సెక్రటరీ, ప్రకాశంగారు, నేను, లా మినిష్టరయిన డాక్టర్ సుబ్బరాయన్‌గారు మాత్రమే. నాకు ఆ ఫైలుని గురించిన సంపూర్ణ విషయాలు తెలుసు గనుక, ఆ వివరాలు ఆద్యంతం ఆయనకు చెప్పి, "దీనిపైన మీరే ఆర్డరు వేయవలసివస్తే ప్రకాశంగారు వేసినట్లుకాక వేరుగా వేయగలరా?" అని ప్రశ్నించాను. దానిపైన ఆయన, "ఈ సంగతులన్నీ మాకు సరిగ్గా చెప్పేవా డెవడున్నాడయ్యా?" అన్నారు.

'మాకు' అంటే కాంగ్రెస్ కమిటీ పెద్దలకు అన్నమాట.

"ఉన్న సంగతులు చెప్పే వా రెవరున్నారని మీ రడుగుతున్నారు. లేని సంగతులను ఉన్నట్లు మీకు చెప్పిన వా రెవరో చెప్తారా? పోనీ, ఒకవేళ అనుమానం వస్తే ప్రకాశంగారిని కనుక్కోగూడదా? కాకుంటే, నన్నడగరాదా? ఏమీ లేకుండానే ఒక మహావ్యక్తి పైన ఇటువంటి అనుమానాలు మీలో మీరు పెంచుకోవడం మంచిదా?" అన్నాను.

అందుకు, "విశ్వనాథం! నువ్వింకా చిన్నవాడివి. లోకంలో అనేక సంగతులు జరుగుతాయి. నీకు తెలీదు," అన్నారు ఆయన. అది విని నా కాశ్చర్యం వేసి వివరాలు మళ్ళీ చెప్పవలసిందని రెట్టించగా, ఆయన "సరైన ఆర్డరు పాస్ చేయడానికి కొంతమంది డబ్బు పుచ్చుకుంటా రన్నది నీకు తెలీదులే," అని పూచీ పేచీలేని పద్ధతిలో మాట విసిరేశారు.

బేసబబైన మాటలకు వారి మాటే పరాకాష్ఠగా కన్పించింది నాకు.

అది మొదలు, వారితో సంభాషణ నేను వీలైనంత మట్టుకు

తగ్గించుకొంటిని. తర్వాత చరిత్రలో ప్రకాశంగారికీ, వీరికీ వైషమ్యాలు ప్రాణం పోయేవరకు హెచ్చిపోతూనే వచ్చిన మాట అందరికీ తెలిసినదే.

# 8

## వ్యక్తి సత్యాగ్రహము

గాంధీగారు స్వాతంత్రోద్యమాన్ని ఏ విధంగా కొత్తగా నడిపిస్తారో ఎవరికీ అవగాహన కాలేదు. "యుద్ధ సమయంలో, ఇంగ్లండు దేశం ప్రాణ సంకట సమయంలో ఉన్నపుడు నే నిబ్బంది కలుగజేయను," అన్న ఆయన వాగ్దానం అందరూ ఎరిగిందే. శత్రువుకు ఇబ్బంది కలిగించనిది ఉద్యమం ఎలా అవుతుంది? ఏదైనా చేసినా, అది ఉద్యమం అని అనిపించుకోవడానికి తగినదవుతుందా?

ఇలా ఉండగా, ఆయన ఒక ఆదేశం ఇచ్చారు. దాని ప్రకారం దేశంలో ప్రతి జిల్లాలోనూ సత్యాగ్రహ సంఘాలు ఏర్పాటు కావాలన్నారు. ప్రత్యేకమైన సంఘాల ఏర్పాటుకాక, జిల్లా కాంగ్రెస్ సంఘాలే సత్యాగ్రహ సంఘాలుగా మారవలసిందని మార్చి నెలలో రామ్‌ఘర్ కాంగ్రెస్ కాగానే ఆదేశం ఇచ్చారు. దాని ప్రకారం, 24-4-1940 నాడు విశాఖపట్నం జిల్లా కాంగ్రెస్ కమిటీ, విశాఖపట్నం జిల్లా సత్యాగ్రహ సంఘంగా మారడానికి తీర్మానించి, అలా మారిపోయింది. నెహ్రూగారు కూడా ఇంగ్లండు సంకటావస్థలో ఉన్న సమయంలో సివిల్ డిస్ ఒబీడియన్స్ (సాత్విక నిరోధం) పైన ఉద్యమం ఏదీ చేయకూడదని ప్రకటించారు. ఈ కట్టుబాట్లలో సుభాస్ చంద్రబోస్ ఎప్పుడూ ఇమిడి ఉండలేక పోయేవారు. ఆయన కాంగ్రెస్ ప్రెసిడెంటుగా ఎన్నికయినప్పుడు, గాంధీగారు ఆయనను వ్యతిరేకించి, సహకరించక పోవడంవల్ల-ఆయన తన స్వంత ప్రచారంలోనే ఉండేవాడు. ఆయనను జూలై 2 న అరెస్టు చేశారు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ మరొకసారి తిరిగి పూనాలో

సమావేశ మయింది. గాంధీగారి అహింసా సూత్రానికి భిన్నంగా ఒక తీర్మానం చేసింది. తాత్కాలికంగా కేంద్రంలో జాతీయప్రభుత్వాన్ని ఏర్పాటు చేసినట్లయితే యుద్ధంలో కాంగ్రెసు మంత్రివర్గాలు బ్రిటిషు వారికి, వారి మిత్రులకు సహాయం చేస్తాయని తీర్మానించారు. ఆ మీటింగులో ఈ విషయమై గాంధీకి, రాజాజీకి వివాదం వచ్చింది. గాంధీగారు "మనం మన దృక్పథాలలో ఒకరినుంచి ఒకరం దూర మవుతున్నామని నేను చాలా కాలంనుంచి గ్రహిస్తూ వస్తున్నాను," అని రాజాజీతో అంటే ఆయన, "మీ దృష్టి మందగించిం"దని ఒక విసురు విసిరారు. ఈ వాగ్వివాదం జరుగుతున్నప్పుడు ప్రత్యేకాహ్వానంపైన ఆ సమావేశంలో ప్రకాశంగారు హాజరయి ఉన్నారు. అయితే, చేసిన ఆ తీర్మానం చాలా పొరబాటయినదని ప్రకాశంగారు ఒక బహిరంగ సభలో చెప్పి, మరొక మాటకూడా అన్నారు—"కాంగ్రెస్ కమిటీవారు కొంతకాలంలోనే మోకాళ్ళమీద నిలబడి, నాయకత్వం వహించమని మళ్ళీ గాంధీగారినే ప్రార్థించే పరిస్థితి రాకతప్ప"దని.

ఆగస్టు 8 న పూనాలో, కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ అడిగిన ప్రకారం జాతీయప్రభుత్వం ఏర్పాటుచేయడం సాధ్యంకాదని వైస్రాయి ప్రకటించారు. కావలిస్తే, ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్ విస్తృతపరుస్తా నన్నారు. అంతేకాని, బాధ్యత అన్నది తన చేతిలోనుంచి జార విడ వడం మాత్రం సాధ్యం కాదన్నారు. సెప్టంబరు 12 న ప్రకాశంగారి నాయకత్వంక్రింద గుంతకల్లులో సమావేశమైన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ వైస్రాయి చెప్పినదానికి జవాబుగా దేశవ్యాప్తమైన శాసనోల్లంఘనా న్ని కాంగ్రెసువారు ఆరంభించవలసిందని అఖిల భారత కాంగ్రెస్ అధిష్ఠాన వర్గానికి సిఫారసు చేశారు. తరువాత మూడు, నాలుగు రోజు లకు కాంగ్రెస్ అధిష్టానవర్గం, అదివరకు జాతీయప్రభుత్వం ఏర్పాటు చేస్తే యుద్ధానికి సాయం చేస్తామని జూలైలో పూనాలో చేసిన వాగ్దా నాన్ని ఉపసంహరించుకుంటున్నామని చెప్పి, ప్రకాశంగారు కొన్నాళ్ళ క్రిందట చెప్పినట్లే వారి తప్పును వారే సవరించుకున్నారు. గాంధీగారు "ఆత్మనిగ్రహం అనేది ఆత్మనాశనం క్రింద పరిణమించడానికి వీలు

లేదు కదా?'' అన్నారు. తర్వాత ఆ నెల 28 న గాంధిగారు వైస్రా యిని సందర్శించారు. అప్పటి కప్పుడే 'వ్యక్తి సత్యాగ్రహం' అనే ఒక కొత్త ప్రక్రియ గాంధిగారి పదకోశంలో రూపొందటం ఆరంభిం చింది.

ఈ పూనా సమావేశం అయిన తరువాత, 18-10-40 నాడు ప్రకాశంగారు అనంతపురం బహిరంగ సభలో వ్యక్తి సత్యాగ్రహ ప్రక్రియా వివరాలు, దాని ప్రభావంగురించి గంభీరోపన్యాసం గావించారు.

అంతకుముందు రోజే, గాంధిగారు ఈ వ్యక్తి సత్యాగ్రహం అన్నది వినోబాభావే గారితో ప్రారంభిస్తామని ప్రకటించేసరికి, జవహ ర్లాల్ నెహ్రూ ప్రభృతులకు కోపం వచ్చింది. అది విప్లవం తేగలిగే ఉద్యమమే అయినట్లయితే అటువంటిదానికి తమకు అగ్రతాంబూలం ఇవ్వాలంటూ—''ఎవరీ వినోబా భావే!'' అని ప్రశ్నించారు.

''ఆయన సత్యా హింసలలో సంపూర్ణమయిన విశ్వాసం కల వ్యక్తి. నాతోనే ఆశ్రమంలో ఉండంవల్ల ఇతని పేరు పైకిరాలేదు. కాని, నేను తలపెట్టిన వ్యక్తి సత్యాగ్రహానికి ఆయనే తగిన వా''డని గాంధిగారు జవాబిచ్చారు. అంతేగాక, ఆ సత్యాగ్రహానికి నాయకత్వాన్ని తన ఒక్కరి చేతిలోనే ఉంచుకోవాలని గాంధిగారు నిర్ణయించారు. తాము చెప్పినవారే దేశంలో వ్యక్తి సత్యాగ్రహం చేయాలన్నారు. మొదట కొందరు అగ్రనాయకులు, వారి తరువాత కేంద్ర రాష్ట్ర శాసన సభలలోని కాంగ్రెస్ సభ్యులు, ఆపైన దేశంలోని అన్ని జిల్లాల కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు, డిస్ట్రిక్ట్ బోర్డు మొదలైన స్థానిక సంస్థల అధ్యక్షులు ఈ సత్యాగ్రహంలో పాల్గొనవలసిందని ఆయన ఏర్పాటు చేశారు. రాష్ట్రాలనుంచి పంపిన పేర్లవరుసలను ఆయన అనుమ తించిన తరువాతే సత్యాగ్రహంలో పాల్గొనవలసి ఉండేది.

ఈ విశాల భారతదేశ మంతటికీ ఏకైక నాయకుడుగా ఆయన చెప్పినట్లు సత్యాగ్రహులు దేశం నాలుగు మూలలనుంచి ఒక క్రమ శిక్షణతో రావడం అన్నది గొప్ప విప్లవాత్మకమైన, రాజకీయోద్యమ

ప్రక్రియ. అయితే, శీఘ్రంగా తిరిగి మంత్రి పదవులలోకి వెళ్ళడం తప్ప వేరే గత్యంతరం లేదనుకున్నవారికి గాంధిగారి మంత్ర రహస్యం అర్థం కావడం కష్టమయింది. "ఈ ఉద్యమం రేపే చప్పబడి పోతుంది" అని రాజాజీ వ్యాఖ్యానించారు. కానీ అది చప్పబడకపోగా, రాబోయే "క్విట్ ఇండియా" మహాసంగ్రామానికి మొదటి మొగ్గర ముగా పరిణమించింది.

గాంధిగారు ఇంకొక సూత్రంకూడా చెప్పారు సత్యాగ్రహానికి తాను నియమించే వ్యక్తులు తమకు తోచినట్టు ఉపన్యాసాలేవీ చేయక, తామిచ్చే రెండు వాక్యాలను—ముందుగా అధికారులకు సమయం, స్థలం తెలుపుతూ నోటీసు ఇచ్చి, అక్కడ అప్పుడు చదవాలన్నారు. ఆయన ఆదేశించినట్టు, అవి నిజానికి రెండు వాక్యాలు కాక ఒక వాక్యమే. అది—"ఈ యుద్ధములో బ్రిటిషువారికి మనుష్యులతోగాని, ధనముతోగాని సాయము చేయుట నీతి విరుద్ధము; దోష సహితము." మేమంతా ఈ ఒక్క వాక్యం చదివే సత్యాగ్రహం చేశాము. ఇది బహి రంగ సభలో జరిగేది. ప్రజలందరికీ సత్యాగ్రహ సందేశమిచ్చి, శాసనోల్లంఘనం చేయాలి.

అయితే, దీనికికూడా రాజాజీ వ్యతిరేకియే. ఆయన "ఇదంతా బహిరంగంగా చేయవలసిన అగత్యమేముంది? లాభమేముంది? యుద్ధ సంబంధమైన ప్రభుత్వంవారి ఉపసంఘ సభ్యులకు మనం ఎందుకు సహాయం చేయమో వివరిస్తూ ఉత్తరం వ్రాస్తే చాలదా?" అని వాదిం చారు. గాంధిగారు ఆయన బాధపడలేక, ఆయనను ఒక్కడినే అలా చేసుకోమన్నారు.

కాని, రాజాజీ మాత్రం తనలో ప్రత్యేక విశ్వాసంగల సభ్యుల చేత యుద్ధ సంఘ సభ్యులకు దీర్ఘమైన ఉత్తరాలను వ్రాయించారు. తెలుగు రాష్ట్రంలో ఒకరో, ఇద్దరో తప్ప ఆయన మాట ఎవరూ విన లేదు. ఈ విధంగా వ్యక్తి సత్యాగ్రహం ఆరంభించిన తర్వాత చెన్న రాష్ట్రంలోని వేలూరు, తిరుచినాపల్లి, కోయంబత్తూరు జెయిళ్ళు రోజు రోజుకూ సత్యాగ్రహ ఖైదీలతో నిండిపోతూ ఉండేవి. గాంధీవారి వద్ద

అనుమతి పొందిన ముగ్గురు నలుగురు తప్ప పేరుపడ్డ కాంగ్రెస్‌వాదులు ఎవరూ జెయిలు ఆవరణకు అవతల లేరు. వ్యక్తి సత్యాగ్రహాన్ని వ్యతిరేకించిన వారు—జెయిళ్ళలోకి ఎవరూ రారని తాము చెప్పినందుకు వ్యతిరేకంగా జరగడం కంటగింపు కాగా, జెయిళ్ళలోకి వస్తేమాత్రం ఏమి లాభమనే కొత్త నినాదాన్ని ప్రచారం చేయసాగారు.

# 9

# వేలూరు జైలు ముచ్చటలు

వ్యక్తి సత్యాగ్రహం చేయడానికి ప్రథమంగా నాకు అవకాశం ఇవ్వవలసిందని ప్రకాశంగారిని కోరాను. బహుశా ఆయనకు కూడా రాష్ట్రంలో తామే ప్రప్రథమంగా సత్యాగ్రహం చేయాలనే సంకల్పంతో ఉండడంచేత కాబోలు తామే సత్యాగ్రహం చేశారు. నాకు మొట్టమొదట కాకున్నా, ముందుగానే అవకాశం ఇచ్చారు. 26-11-40 నాడు నేను జిల్లా కోర్టు గుమ్మం దగ్గర, గాంధీగారు చెప్పిన వాక్యాలు చదివి శాసనోల్లంఘనం చేశాను. వెంటనే నన్ను అరెస్టు చేసి దూరంగా దువ్వాడ దగ్గరున్న ఫారెస్టు బంగళాలో అంతకు ముందే నా కోసం వచ్చి కూచున్న డిప్యూటీ కలెక్టరు ముందు హాజరు పెట్టగా, ఆయన నాకు ఆయన పద్దెనిమిది నెలల కఠినశిక్ష విధించాడు. అలా నేను అరెస్టయి వేలూరు జెయిలుకు వెళ్ళేసరికే, ప్రకాశంగారు అక్కడికి వచ్చి ఉన్నారు. త్వరలోనే ఒకరి తర్వాత ఒకరుగా మంత్రులు, శాసన సభ్యులు జైలుకు రావడం ప్రారంభించారు. తనకు వ్యక్తి సత్యాగ్రహంపైన నమ్మకం లేదన్న రాజాజీ కూడా వచ్చేశారు. మేము వెళ్ళేముందు, అక్కడ పదిమంది దాకా కమ్యూనిస్టులు ఖైదీలుగా ఉండేవారు. లోగడ వారిలో చాలామంది కాంగ్రెసులో ఉన్నవారే. రోజూ సాయంకాలం ఆరు గంటలయేసరికి మమ్మల్ని ప్రత్యేకమైన గదులలో పెట్టి తాళం వేసేసేవారు. "కోరి జైలుకు వచ్చిన మా యెడల యెందు

కీ అపనమ్మక?''మని ప్రశ్నించగా, జైలు సూపరింటెండెంటు మా సెల్లులకు దగ్గరగా ఉన్న జైలు ఆవరణ గోడను చూపించి, అందులో ఒక భాగం కొత్తగా మరమ్మత్తు చేసిన దానిని చూపించారు. ఆ భాగంలో కన్నం త్రవ్వి కొంతకాలం క్రింద నలుగురు కమ్యూనిస్టు ఖైదీలు పారిపోవడంచేత ప్రభుత్వంవారు ఇటువంటి జాగ్రత్త తీసుకోమని ఆదేశించినట్లు చెప్పారు. అయితే, మాతోబాటు అక్కడ మిగిలి ఉన్న కమ్యూనిస్టులు అలా పారిపోయే వారిలాగా తోచలేదు. అది వేరే **మాట.**

ఇంతలో, వ్యక్తి సత్యాగ్రహం చేసి జైలులోకి వచ్చేవారి సంఖ్య దినదినానికి పెరగడం ప్రారంభించింది. కాలక్షేపంకోసం పొద్దుట వేళ కొందరు రాజాజీ చుట్టూ చేరేవారు. అలాగే, కొందరు ప్రకాశం గారి చుట్టూ చేరేవారు. అయితే రాజాజీ, ప్రకాశంగారు అట్టే కలుసుకోవడంగానీ, మాట్లాడుకోవడంగానీ జరిగేదికాదు. విరామకాలం చాలా ఉండడంచేత సహజంగా గ్రంథపఠనం సాగేది. రామాయణము, భారతము, భాగవతము మొదలైనవి ఎక్కువగా చదివేవాళ్ళు. అంతకన్న హెచ్చుగా, దాదాపు అందరి చేతుల్లోనూ భగవద్గీత కనిపించేది. సరే! మిగిలిన రాజకీయ గ్రంథాల పైనా, రాజకీయాలపైనా వాదోపవాదాలు చెట్లనీడలలో గుంపులు గుంపులుగా చేరిన సత్యాగ్రహుల మధ్య బహాళంగా, ఒక్కొక్కప్పుడు తీవ్రంగా జరిగేవి. అందులో అందరి దృష్టిలోను పడేటట్లుగా రాజాజీ కూచున్న గుంపు, ప్రకాశంగారు కూచున్న గుంపు విడివిడిగా ఏర్పడినాయి. అందుచేతే-

''ఒకచోట రామాయణ కథా శ్రవణ పుణ్య
పదములు - వాల్మీకి అదరిపడగ;
ఒకచోట భాగవ తోదంత వ్యాఖ్యాన
తీవ్రత-పోతన్న దిగులుపడగ;
ఒకచోట భారతీయ కవితా వాహినీ
స్నాతులై కవులెల్ల సంచలింప;

ఒకచోట సామ్యవాద కలకలార్భటి
రవములు-లెనినును లజ్జపరుప,

రాజితాచార్య శాసన రక్షితమ్ము
ధీపత్రికాళ విభాషిత తీవ్రిఫణితి
విశ్వవేదాంత పీఠికా విలసితమ్ము
రాయవేలూరి నగర కారాగృహమ్ము."

అని 16-12-40 న నేను వ్రాయడానికి అవకాశం కలిగింది. ఇంతలో ప్రభుత్వం వారు తిరుచినాపల్లి జైలులో వ్యక్తి సత్యాగ్రహం చేసిన వారికని ప్రత్యేకమైన ఏర్పాట్లుచేసి, మమ్మల్ని దాదాపు మూడు-వందల మందిని అక్కడికి రవాణా చేశారు. మొదట్లో ఏర్పాట్లు సరిగా లేకపోయినా, రాను రాను కొంత వసతి కల్పించి, వేళపట్టున భోజ నాలు, స్నాన సౌకర్యాలు మొదలైనవి ఏర్పాటు చేశారు. ఆవరణ లోంచి ఎవరూ పారిపోవడానికి వీలులేకుండా చుట్టూ బార్బ్‌డ్‌వైర్ (ఇనుప ముళ్ళ తీగె)తో కంచెలా కట్టి, రాత్రివేళ ముఖ్యంగా దాన్ని విద్యుద్భరితం చేసేవారు. ఖైదీ లెవరూ దాన్ని దాటి పారిపోలేదు కానీ, సూపరింటెండెంటుగారి చూడచక్కని కుక్కమాత్రం ఆ కంచెలోని విద్యుదాఘాతం చేత హత మయింది.

వేలూరి జైలులో- రాజాజీ, ప్రకాశంగారలు తలవరులుగా ఏర్ప డిన ప్రత్యేక బృందాలు ఇక్కడ స్థిరపడినాయి.

తిరుచినాపల్లి జైలు ఆవరణలో పెద్ద పెద్ద చింతచెట్లు మెండుగా ఉండేవి. వాటి క్రింద, ఈ ప్రత్యేక సత్యాగ్రహ బృందాలు చేరి ముచ్చ టించు కొనడానికీ, వాదించుకొనడానికీ, పఠనాసక్తిని సంతృప్తిపరచు కొనడానికీ, ఇతరములైన మంతనాలకూ అవకాశాలు హెచ్చుగా ఉండేవి.

"గీతార్థసార విఖ్యాత ప్రదాతృ వి
ద్యాలయ ఘోషంబు లలము కొనగ,

లోకాభి రామయణాకలనంబున
    చీకటి దర్బార్లు చెలగుచుండ,
నెమ్మి ప్రేక్షక వాహినీ చిత్రవర్ణాల
    సంధ్యానురాగమ్ము సంతసిల్ల,
పాఠక జన బృంద పాండిత్య సేచనన్
    తింత్రిణీ వనరాశి తీపి గనగ,

విశ్వవేదాంత పీఠికా విస్తరంబు
తెలుగు తమిళ కర్ణాట కేరళ వినేత
లలవి నలరారు పరమ లీలాగృహమ్ము
తిరుచినాపల్లి కేంద్ర ఖైదీల గృహమ్ము." [10-1-1941]

నాయక, ఉపనాయక, రాజకీయ రణరంగ వీరుల సమూహ జీవనం నడిచే వేళలలో ప్రకాశంగారి బృందంలోని దాదాపు యాభై మంది దాకా ప్రతి దినం ఉదయంపూట, వారుండే గదికి ఎదురుగా ఉన్న పెద్ద చెట్టు దగ్గర సమావేశం కావడం ప్రారంభమైంది. ఆ బృందంలో చేరిన వారిలో గిరిగారు, అనంతశయనం అయ్యంగారు మొదలైన పెద్దలుకూడా ఉన్నారు. అలా సమావేశం కావడంచేత ప్రక్కన సంస్కృత గ్రంథాలను ఉంచుకుని, తెలుగు భారత భాగవతాలు ఒక పంక్తికూడా మిగల్చకుండా చదవగలిగినాము. వాల్మీకి రామాయణము చదివి అర్థం చెప్పడానికి అనంతశయనం అయ్యంగారు, నగరి కె. వరదాచారి, విద్వాన్ విశ్వం, మాడభూషి వెంకటాచారి మొదలైన వారు ఉండేవారు. మధ్యాహ్నాలలో బైబిలు పాత, క్రొత్త టెస్టమెంటులు మొదటినుంచి చివరిదాకా పూర్తిగా చదివాము. మహమ్మదలీ ఇంగ్లీషులోకి అనువదించిన ఖురానును గూడా పూర్తిగా చదివాము. ఇలా చదివేవారు చదువుతుండగా, అర్థ వ్యాఖ్యానాలు చేసేవారు చేస్తుండగా- ముప్పై, నలభై మందికి ఎప్పుడూ తక్కువగాని ఈ పాఠక బృందానికి అధ్యక్షులైన ప్రకాశంగారు ఒక ఎక్సర్‌సైజు పుస్తకంలో నోట్సు వ్రాసుకునేవారు.

రెండు నెలలయ్యేసరికి, ఆ కారాగృహావరణం రెండోభాగంలో రాజాజీ పీఠంకూడా గట్టిగా ఏర్పడింది. ఆయన అదివరకే గీత, ఉప నిషత్తులు మొదలైనవి అనువాదములు తడివి చూసినవారు. ఇక్కడ సంస్కృత పాండిత్యంగల సంతానం, ఎన్. ఎస్. వరదాచారి మొద లైనవారు ఆయన బృందంలో చేరి—గీతార్థ ప్రబోధాలకు, ఉపని షత్తుల భాష్యాలకు, విశిష్టాద్వైత పరంగా అర్థాలు చెప్పుకుంటూ ఉండే వారు. మరొకమూల టి. నాగిరెడ్డి మొదలయినవారి యువ కమ్యూనిస్టు బృందం (ఏడు, ఎనిమిది మంది) కమ్యూనిజం, సోషలిజాలకు సంబం ధించిన గ్రంథపఠనం మతావేశంతో చేసుకునేవారు.

పరస్పర సంభాషణలు, భాష్యార్థములు కాలక్షేపం కోసం చేసు కునేవారే కాని, ఒకరి మతం ఒకరు ఎన్నడూ అవలంబించలేదు. అద్వైతులు విశిష్టాద్వైతం విన్నా, విశిష్టాద్వైతులు అద్వైత భాష్యాలు విన్నా, కాంగ్రెస్‌వాదులు కమ్యూనిస్టుల మాటలు విన్నా ఎవరిమతం వారిదే. శక్తిపూజ విషయంలో మాత్రం—అంటే రాజకీయంగా జెయిళ్ల అనంతరం ఎవరికి పదవీ స్వీకార శక్తి హెచ్చుగా కలుగు తుందో అన్న విషయంలో మాత్రం- అట్టి శక్తికి మూల పురుషులను కొనబడేవారియెడల మతం మార్చుకునే సంఘటనలు జరుగుతూండేవి.

"ఈ వ్యక్తి సత్యాగ్రహ మనేది పనికిరాని బెడద" అని రాజాజీ స్తుతి నిందాపరంగా చెప్పుతుండడంతోబాటు శిష్యకోటిని చేకూర్చుకొనేందుకు యత్నం కూడా జరిపేవారు. వ్యక్తి సత్యాగ్రహం విప్లవ మార్గంలో మొదటి మెటని ప్రకాశంగారు, ఆయన చుట్టూ చేరినవారు నిశ్చితంగా అభిప్రాయపడడం జరిగింది ఇందులో, ఒక వ్యతిరేకాలంకార చమత్కృతి అందరికీ కనిపించేది. గాంధీగారికి అత్యంత సన్నిహితుడయిన రాజాజీ, తీవ్రమైన గాంధీ విమర్శకు లయ్యారు. గాంధీజీకి అత్యంతదూరులయిన ప్రకాశంగారు గాంధీని తీవ్రంగా ప్రశంసించే వారయ్యారు.

ఇటువంటి వాతావరణంలో హిందూ పత్రిక సంపాదకులైన కె. శ్రీనివాసన్ గారు ఒక రోజున రాజాజీని ప్రత్యేకంగా చూడడానికి

వచ్చారు. వచ్చి, మరికొందరిని కూడా చూశారు. రాజాజీతో ఆయన ఏమి మాట్లాడారో తెలియదు కాని, తర్వాత హిందూ పత్రికలోను, తక్కిన పత్రికలలోను—జెయిలులో ఉన్న పెద్ద నాయకులకు వ్యక్తి సత్యాగ్రహం నిష్ఫలమయినదన్న భావం కలిగినట్టూ, బ్రిటిషువారు జాతీయప్రభుత్వం ఏర్పాటుచేస్తే, తాము పాల్గొని యుద్ధం జయప్రదంగా సాగించడానికి సాయం చేస్తామని ఆ నాయకులు చెప్పినట్టూ, ఈ అభిప్రాయాలు లిబరల్ లీడరయిన తేజ్‌బహదూర్ సప్రూగారికి తెలియజేసినట్టూ వార్తలు వెలువడ్డాయి. బ్రిటిషుపార్లమెంటులో, ఈ కాంగ్రెసు నాయకుల అభిప్రాయాన్నిబట్టి ఏమైనా రాజీ జరుగుతుందా అని ఒక ప్రశ్న అడిగితే, ఇటువంటి మాటలలో తమ ప్రసక్తి లేదని ప్రభుత్వ ప్రతినిధి చెప్పాడు. ఇంతట్లో గాంధీగారు వ్యక్తిసత్యాగ్రహం చేసి జెయిలుకువెళ్ళిన తన అనుయాయులు కొందరికి అందులో నమ్మకం లేదని అన్నట్టు, హిందూ మొదలైన పత్రికలలో పడిన వార్తలనుబట్టి గ్రహించి, ఎవరి పేర్లూ చెప్పకుండా సలహా పూర్వకంగా ఒక ప్రకటన చేశారు. దాని సారాంశం ఇది: "ఎవరికైతే వ్యక్తిసత్యాగ్రహంలో నమ్మకం లేదో,వారు ఆ విషయం వారితో వీరితో అనడంకన్నా, తామున్న జెయిలు సూపరింటెండెంటుకు వ్రాసివేసినట్టయితే ఆయన వారిని వెంటనే విడుదల చేసే ఏర్పాట్లు చేస్తాడు. కావలసినవారు తమ సమస్యను ఆ విధంగా పరిష్కరించుకొనవచ్చును."

అయితే, కట్టుబాటుకు వ్యతిరేకంగా ఎవరూ అటువంటి అపాలజీ (క్షమాపణ) తో సమానమైన లేఖలు వ్రాసి బయటకు వచ్చినట్టు నాకు జ్ఞాపకం లేదు.

ఇలా ఉంటూండగా, కొంతకాలానికి ప్రకాశంగారు తమ నాయకత్వధోరణేకాని, తన తర్వాతి వారిని ముందుకు తీసుకురారన్న ఒక మాట చెవినుంచి చెవికి ప్రచారమయింది. ముందుకురాదగ్గ తెలుగు సభ్యులలోకూడా ఈ నిశ్శబ్దప్రచారం కొనసాగింది. సాయంకాలాలవేళ ఆరోగ్యదృష్ట్యా సత్యాగ్రహులు ఆవరణలో నడిచే సమయాలలో తెలుగు సత్యాగ్రహుల భుజాలపై తట్టి, "నీవంటి తెలివైనవాడు,

ఉత్తమ త్యాగి ప్రకాశం దృష్టికి ఎందుకు రాలేదు?'' అన్నమాట మెల్లగా అనడం, మరికొందరు తెలుగువాళ్ళతో కూడా ఒకరి విషయం ఒకరితో చెప్పడం—రెండు, మూడు పర్యాయాలు రాజాజీ కొందరి విషయా లలో చేయడంతో తెలుగు బృందంలో ఒక సంచలనం కలగడం ఆరం భించింది. దీనికితోడు, తాము ఉన్న హాలులోనే బసచేసిఉన్న, ఉప నాయక శ్రేణిలోఉన్న తెలుగు సత్యాగ్రహులతో ఆయన ఒక రోజున, "చూశారా? మీ ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీకి నాగేశ్వరరావుగారు, వెంకటప్పయ్యగారు, ప్రకాశంగారు—వీరినే స్థిరబుద్ధితో ఆరాధించి అధ్యక్షులుగా ఉంచుతున్నారు. తమిళరాష్ట్రంలో మార్పులు ఎప్పటి కప్పుడు జరుగుతాయి. స్థిరత్వం లేదు,'' అన్నారు రాజాజీ. ఈ మాట ఒకరిద్దరి తెలుగువారియెడ రాజాజీకున్న ప్రశంసాభావమని అనుకున్నారు. అయితే, నాయక పదవిని మనసులో ఆశించే ఒకరిద్దరు, వీరు తప్ప మీకు నాయకులు లేరు అన్న ఎత్తిపొడుపు క్రింద గ్రహించారు. జెయిలు నుంచి విడుదలయి తిరిగివెళ్ళిన తరువాత, ఆంధ్రదేశ నాయకత్వంలో మార్పు తేవాలన్న గాఢవాంఛ వీరిలో కొంతమందికి అంకురించింది.

ఇలా ఉంటూండగా, ఈ సవర్ణుల నాయకత్వమే ఎందుకు శాశ్వ తంగా ఉండాలని ఏ పెద్దవారో అనడంచేత హరిజన సభ్యులుకూడా ప్రత్యే కంగా సమావేశాలు ఆరంభించారు. వీటి ప్రభావం రానురాను చెన్న రాష్ట్ర రాజకీయాలపై బాగా కనిపించిన విషయం చారిత్రకంగా నిర్ధా రణ అయింది. దీనికితోడు, జాన్ గంతర్ అనే ఆయన వ్రాసిన "ఇన్ సైడ్ ఏషియా'' అనే గ్రంథంలో రాజాజీని గూర్చి వ్రాసిన నిందా వాక్యాన్ని రాజాజీ విముఖులుకొక ఆంధ్రమిత్రుడు చదివి వినిపించ నారంభించారు. దాంతో, తెలుగువారికి తమిళులకు మధ్యనున్న సామ రస్యము, ఇదివరకు చెడిపోక మిగిలినదికూడా చెడ నారంభించింది. ఒకే కాంగ్రెసులో ఒకే గాంధీగారి నాయకత్వం క్రింద ప్రకాశంగారు, రాజాజీ పనిచేస్తూన్నప్పటికీ; మంత్రివర్గాలు ఏర్పాటుకాకముందు, మంత్రి వర్గంలో కార్యకలాపాలు నడిపిస్తున్న సమయంలోనూ, చివరికి కారా గృహవాసం చేస్తున్న సమయంలోనూ ఇద్దరి జీవిత ప్రవాహాలు కలిపి

ఉన్నప్పటికీ, ప్రయాగలో గంగా యమునలు సంగమయిన తర్వాత కూడా కొంతదూరంవరకు తెలుపు తెలుపుగా, నలుపు నలుపుగా ఉండే విధంగా వీరి చరిత్రలు ఉండడంవల్ల రాష్ట్రరాజకీయాలు వీరి వ్యక్తిగత భేదాలకు అతీతం కాలేకపోయాయి. దీనికితోడు అపుడు వేలూరు జెయిలులో ఉన్న డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారికీ, ప్రకాశంగారికీ మధ్యఉన్న విభేదాలు కూడా ఈ పరిస్థితులను, ప్రజలను మరింత చీకటి త్రోవలవెంట పెడుతూండేవి. ఇటువంటి పరిణామమే రాకపోయిఉంటే, వారి విభేదాల విషయమై ఇక్కడ వ్రాయవలసిన అవసరమే లేకపోయి, సంతోషజనకమైన స్థితి కలిగి ఉండేది.

## వీడ్కోలుపులు - విందులు

కష్టాలలో ఉన్నప్పటికీ సర్దుకొనడానికి అలవాటు పడి, కష్టాల మధ్యనే సుఖ జీవనం చేయడానికి యత్నించడం మానవులకు సహజము. అందులో భారతీయుల కది ఉగ్గుపాలతో పెట్టిన మన స్తత్వము. ఆశాపాశములతో సతమత మవుతూ, బంధాలు కల్పించుకొని, ద్వేష రోష వహ్నుల వేడిని రాజనీతి పరిజ్ఞానమని భావించుకొని, భావి కాలంలో రాగల పదవులందు గల వ్యామోహమే ప్రాణశక్తిని ఇస్తూండగా కారాగృహ మందున్న సత్యాగ్రహులందరూ కలసి సోదర సత్యాగ్రహులు ఎవరైనా శిక్షాకాల పరిమితి ముగిసి విడుదల పొందేటప్పుడు, కారాగృహ నివాస స్థితిగత సదుపాయాల ననుసరించి, "తేనీటి విందు" ఏర్పాటు చేయడం మామూలయిపోయింది. అలాంటి సమయాలలో విడుదలైన వారిపై ఇష్టమున్న మిత్రులు, పెద్దలు వీడ్కోలు సూచకంగా కొన్ని వాక్యాలు చెప్పడం మామూలయింది. కారాగృహం లోనికి వెళ్ళిన ఆరునెలల తర్వాత ఇటువంటి ఉత్సవాలు ఆరంభ మయ్యాయి. ప్రకాశంగారు మాత్రం ఈ ఉత్సవాలలో పాల్గొనేవారు కారు. అటువంటి ఒకానొక సమయంలో విడుదలయిన కేరళ మిత్రు డొకడు * అన్నమాట ఇది: "నేను జైలులోకి రావడమిదే మొదటి

* ఈ కేరళ మిత్రు డిప్పుడు కేరళ శాసన సభకు అధ్యక్షుడుగా ఉన్నారు.

సారి. కాని, నా కిక్కడ చాలా మంచి అనుభవం కలిగింది. లోక జ్ఞానం వచ్చింది. పెద్దవారికి గల చిన్న మనసులను, చిన్నవారికి గల పెద్ద మనసులను ఇక్కడ చూడగలిగాను."

అంతటిలో, రాజాజీ విడుదల అయే సమయం ఆసన్నమయింది. ఆయన పెద్దవారు గనుక, ఆయన కిచ్చే టీ పార్టీల సంఖ్యకూడా పెరిగింది. అలా ఒక తేనీటి విందులో ఆయన ఉపదేశ వాక్యాల మధ్య "హిందూ ముస్లిమ్ సమస్య అన్నది నా చేతులలో వదలి పెట్టినట్లయితే, ఐదు నిమిషాలలో పరిష్కారం చేస్తాను" అన్నారు. ఈ మాటలు వినేసరికి, మాలో చాలా మందికి పరిష్కారంపై ఆశ, పరిష్కారం ఇంత సులభమా అన్న ఆశ్చర్యమూ కలిగినవి. నేను "ఆ రహస్య మేదో మాకు చెబితే, మీకు మేము సహాయం చేస్తాము గదా, చెప్పండి" అన్నాను.

దాని కాయన, "నువ్విప్పు డిలా అంటావు. రేపు గాంధీగారు వస్తే 'గాంధీగారు, గాంధీగా'రని ఆయన వెంట పడతావు. నీతో చెప్పి ఏమి లాభము?" అన్నారు.

ఉన్నత స్థాయిలో—ఆయనకూ, గాంధీగారికీ మౌలికంగా ఉన్న విభేదాలు తెలిసిన వారికి మాత్రం ఈ మాటలోని రహస్యం కొంచెం అర్థమయింది. మిగిలిన వారి కది రాజాజీ సహజ చమత్కార వాక్య సరళిగా మాత్రమే కనిపించింది.

చాలామందికి శిక్ష తొమ్మిది నెలల పరిమితి లోపలే ఉండడం చేత ప్రతి రోజూ ముగ్గురో, నలుగురో 1941 సెప్టంబరునుంచి విడుదల అయిపోతూ ఉండేవారు. ఏడాది శిక్షగలవారు ముప్ఫై నలభై మందికి ఎక్కువ లేరు. పద్దెనిమిది నెలల శిక్ష పొందిన వాడిని నేనొక్కడినే. ఇంతలో ప్రకాశంగారు విడుదలయ్యారు. (కొంత స్పెషల్ రెమిషన్ కారణంగా రాజాజీ, ప్రకాశంగారూ ఒకే రోజు విడుదలయి, తిరుచినాపల్లిలో మాజీ మంత్రి అయిన డాక్టర్ రాజన్ గారికి అతిథులైనారు.) వీడ్కోలుపులకు, విందులకు ప్రకాశంగారు పూర్తిగా విముఖులు. అందుచేత ఆయన జైలునుంచి వెళుతున్న రోజున

ఏ ఆర్భాటమూ లేకుండానే వెళ్ళారు. మేము కొద్దిమందిమే మిగిలి ఉన్నాము.

వర్షాకాలం అంతమై, చెట్లకూ మైదానానికీ ఒక కొత్త పచ్చదనం వచ్చి కంటికీ, మనసుకూ ఆహ్లాదం కలుగుతూండేది. దాదాపు రెండు వందల మంది ఉండిన స్థలంలో మేము ముప్పై, నలభై మందిమి మాత్రం మిగిలేసరికి ఆ స్థల వైశాల్యం చూస్తే ప్రపంచమంతా అకస్మాత్తుగా విశాలత్వం పొందినట్లనిపించింది. నిత్యవాదోపవాద శబ్ద వైఖరి తగ్గడంచేత, మనసులో కొంత శాంతి కూడా సమకూరినట్లయింది. అయితే, ఈ శాంత స్థితి అకస్మాత్తుగా ఒక రోజున వ్యత్యస్తమయింది. అందుకు కారణం పత్రికలలో వచ్చిన ఒక వార్త. రాజాజీ ఏదో కాన్వొకేషన్ (స్నాతక) ఉపన్యాసంలో—హిందూ ముస్లిం సమస్యను ఐదు నిమిషాల్లో పరిష్కరించ వచ్చనీ, అందుకు జిన్నా కోరినట్లు పాకిస్తాన్‌ను భారత దేశం నుంచి విడదీయడమే మార్గమనీ పేర్కొన్నట్టు ఆ వార్త సారాంశము. నిశ్చలమైన జలాశయంలో పెద్ద ఎత్తునుంచి బండరాయి పడవేస్తే ఏ విధంగా అది అల్లకల్లోలమవుతుందో, ఆ విధంగానే జైళ్ళలో ఉన్న మా మనసులనే శాంత జలాశయంలో రాజాజీ చెప్పిన పరిష్కారం బండరాయిలా పడి, అశాంతిని రేపింది. ఇరవై సంవత్సరాలకు పైగా గాంధీగారు చేసిన హిందూ ముస్లిం ఐక్యమన్న ప్రచారానికి ఫలం ఇదేనా? తన మార్గానికి వ్యతిరేకంగా, భారత దేశాన్ని బద్దలుకొట్టే ఉద్దేశం ఉన్న వారిని గాంధీగారు ఏలాగు తమ ప్రత్యేక శిష్యులుగా భావించుకుంటున్నారు? అని పరిపరి విధాలైన మనోవేదనా తరంగాలు అందరి హృదయ సరసులందును ఉప్పొంగ సాగాయి. ఏమైనా సరే, జైలులోంచి వెంటనే ఎలాగో విడుదలయి రాజాజీని ప్రతిఘటించాలన్న భావోద్రేకం కలిగింది. అంతటిలో రాజాజీ భావాలను ప్రకాశంగారు బహిరంగంగా ఖండించినట్టు పత్రికలలో వార్తలు పడేసరికి కొంత ఉపశాంతి కలిగింది.

ఇంతేకాక, ప్రకాశంగారి అధ్యక్షతను విశాఖపట్నంలో డిసెం

బరు నెలలో ఆంధ్ర మహాసభ జరిగింది. అప్పటికి నేను తిరుచినాపల్లి కారాగృహంలోని విశాలమైన ఆవరణంలో పెద్ద పెద్ద చెట్లనీడలలో ఏడు, ఎనిమిది మందితో ఉండేవాడిని. ప్రకాశంగారు ఆంధ్ర మహాసభలో అవకాశం తీసుకుని, 'హిందూదేశ విభజన సూత్రం పెద్ద లెవరూ ఆమోదించలేదనీ, గాంధీజీ దానికి సంపూర్ణ వ్యతిరేకులనీ, ప్రజలు అనవసరంగా నైరాశ్యమనే అంధకారంలో పడకూడదు' అనిన్నీ అన్న మాటలు పత్రికలలో పడినాయి. దానివల్ల మాకు కొంత ఉపశమనం కలిగింది.

## ఆంధ్ర రాష్ట్ర సమస్య

ప్రప్రథమంలో చెన్నపట్నం మొదలైన కొన్ని గ్రామాలను ఈస్టు ఇండియా కంపెనీ వారికి, వెంకటాద్రి నాయకుడు పట్టాగా ఇచ్చాడు. చెన్నపట్న మనేది కూవం నదికి ఉత్తరంగా ఉన్న భాగము. ఉత్తర ప్రాంతాలలో ఏవో రెండు వీధులలో తప్ప మిగిలిన ప్రాంతం సంపూర్ణంగా తెలుగు ఖండంగా ఉండేది. 17 వ శతాబ్దంలో ఈ చెన్నపట్నంలో మునిసిపల్ ప్రభుత్వం ఏర్పాటు చేసేటపుడు 212 వీధు లుండేవనీ, అవి పూర్తిగా తెలుగు వారితో నిండి ఉండేవనీ అప్పటి రికార్డుల మూలంగా మనకు తెలుస్తున్నది. అయితే, ఈస్టిండియా కంపెనీ వారు సెయింట్ థామస్ మవుంటులో సైన్యస్థావరం ఏర్పరచుకోవడం వల్ల, కోటనుంచి సెయింట్ థామస్ మవుంట్‌దాకా ఇరుప్రక్కలఉండే గ్రామాలను క్రమేణా చెన్నపట్నానికి కలుపుతూ రావడంవల్ల ట్రిప్లికేన్, మైలాపూరు మొదలైన గ్రామాలు ఈ పట్నంలో కలసిపోయినాయి. ఆ గ్రామాలలోని దాక్షిణాత్యులు చెన్నపట్నపు జనాభాలో కలసిపోవడం చేత క్రమేణా తమిళ జనాభావంతు హెచ్చవుతూ వచ్చింది. దానికి తోడు, చెన్నపట్నంనుంచి దక్షిణ జిల్లాలకే మొదట రైలుమార్గం పడింది. అందుచేత దక్షిణజిల్లాల వారికి—చెన్నపట్నానికి రావడానికి, వసతులు తొందరగా కల్పించుకోవడానికి అవకాశాలు కలగడంవల్ల, వారి జనాభా వేగంగా పెరిగింది. ప్రయాణసౌకర్యాలు హెచ్చడంవల్ల దక్షిణ జిల్లాలలో గవర్నమెంటు కళాశాలలలోనుంచి పాసయిన విద్యార్థులు చాలా

మంది ఉద్యోగాలకోసం చెన్నపట్నంవచ్చి స్థిరపడడం జరిగింది. ఇది ఇలాఉండగా, మౌంటురోడ్డుకు ఇరుప్రక్కలఉన్న తెలుగు భూస్వాములు, జమీందారులు తమ భవనాలను, ఆవరణలను అమ్మివేసుకొవడం మొదలు పెట్టారు. ఈ విధంగా జరిగి జరిగి, 1937 నాటికి పట్నంలో తెలుగువారి జనాభా తగ్గనారంభించింది.

చెన్నరాష్ట్రంలో, చెన్నపట్నంలో నూటికి 25 వంతులైనా, అంటే-మూడు, నాలుగు లక్షలమందైనా ఆంధ్రులు ఉండేవారు. అలాగునే మిగిలిన దక్షిణజిల్లాలలో నూటికి 15 వంతులు ఆంధ్రులే ఉండేవారు. అందుచేత కోస్తా జిల్లాలలోను, రాయలసీమ జిల్లాలలోను ఉన్న ఆంధ్రులే వీరి మద్దతుతో చెన్నరాష్ట్రం పరిపాలన తమ చేతులలో ఎప్పుడూ ఉంచుకోవలసింది. కాని, ఏ కారణంచేతనో ఆంధ్రులు వేరయితేనే అభివృద్ధిపొందే అవకాశం ఉందిగాని, ఉమ్మడి రాష్ట్రంలో మనం సగంపాలు ఉన్నా మనకు తగు అవకాశాలు లేవు; మన ప్రాంతాలు ఆర్థికంగా అభివృద్ధికావడానికి అవకాశాలు లేవు—అన్నభావం మన తెలుగు నాయకులలో గట్టిగా ఏర్పడింది. బెంగాల్, బీహార్, ఒరిస్సా రాష్ట్రాలు ప్రత్యేకంగా విభజించగానే ఈ భావం గట్టిపడింది. మనకు ఉత్తరంగాఉన్న ఒరిస్సావారు బీహారునుంచి విడిగా తమకు ప్రత్యేక రాష్ట్రం కావాలని ఆందోళన చేసేవారు. బొంబాయిలో, సింధు చిన్న భాగంగా ఉండేది. అందుచేత ఆ ప్రజలు తమకు విడి రాష్ట్రం కావాలని ఆందోళన మొదలుపెట్టారు. ఆంధ్రరాష్ట్రంకావాలా వద్దా అన్న ప్రశ్న తెలుగునాయకులను అయిదారేండ్లపాటు వేధించింది. మండలాభివృద్ధికై కొన్ని మండల సభ లేర్పరచడం, తర్వాత అన్ని మండలాల సభలు కలిపి ఏకంగానే పెద్ద ఆంధ్రసభ కావాలనే వాంఛ వెలిబుచ్చేసరికి, మొదట అఖిలాంధ్ర సభ ఒకటి 1912 లో ఏర్పాటయింది. అందులో మొదటి ఎజెండాలో ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకపరచాలన్న విషయం లేదు. కాని, దేశబాహుళ్యంలో ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయక తప్పదన్న వాతావరణం బలపడింది. ప్రకాశంగారు మొదట ఈ విషయమై సందిగ్ధంగా ఉన్నా, 1913 లో బాపట్లలో సమావేశమయిన మొదటి

ఆంధ్రమహాసభలో మాత్రం అభిరుచి హెచ్చుగా చూపించారు. అప్పట్లో ఆయన పెద్ద న్యాయవాదిగా ఉండేవారు. అప్పటినుంచి ఆయన ప్రతి ఆంధ్ర మహాసభలోను ప్రముఖ పాత్ర వహించేవారు. ఇంతలో 1917 ఏప్రిల్‌లో తెలుగుజిల్లా లన్నింటికి రాష్ట్రకాంగ్రెస్ కమిటీ ప్రత్యేకంగా ఉండాలని ఏర్పాటయింది. ఆ ఏడే మరొక ఆరు నెలల తర్వాత సింధుకు కూడా ప్రత్యేక రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ ఉండాలని తీర్మానమయింది. ఈ ఏర్పాట్లతో ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్రం కావాలా, వద్దా అన్న సందేహాలన్నీ నశించాయి. తర్వాత గాంధీగారి నాయకత్వం క్రిందికి దేశమంతా రావడమూ, కాంగ్రెస్ సందేశం దేశం మూలమూలలకు తొందరగా వ్యాపించడమూ జరిగి జాతీయభావం పెంపొందింది. భాషలను అనుసరించి, వివిధ రాష్ట్రాలుగా దేశమంతా విభజన చేయడం జాతీయ భావము పెంపుదలకు, స్వాతంత్ర్య సమరం శాస్త్రీయంగా నడపడానికి దోహదం చేసింది. ఒక భాషాప్రాంతంవారికి మరొక భాషాప్రాంతీయులపై విద్వేషంకాని, ఒక రాష్ట్రంవారు రెండో రాష్ట్రంలో ఉద్యోగ వర్తక వ్యాపారాలు చేసుకోకూడదన్న భావాలు ఆనాటి ఉద్యమంలో భాగాలుగా లేవు. ప్రాంతీయులకు ఉద్యోగాలు ఇవ్వవలసినదన్నది పునాది సూత్రమే. అయినా, ఆ రోజులలో భాషావిద్వేషం లేదు. అందుచేతే కాంగ్రెస్ ప్రచారంకోసం దేశాన్ని భాషారాష్ట్రాలుగా విభజించి, ఆ సూత్రంపైనే దేశ స్వాతంత్ర్యం లభిస్తే దేశంలో రాష్ట్రాల పునర్విభజన జరుగుతుందని—కాంగ్రెస్ అనేక సార్లు వాగ్దానం చేసింది.

1938లో మొదటి కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత 30-3-1938 న లెజిస్లేటివ్ అసెంబ్లీలోను, 31-3-'38 న కౌన్సిల్‌లోను ఒక తీర్మానం పాసు అయింది. దాని సారాంశం ఇది: చెన్నరాష్ట్రంలో గల తమిళ, తెలుగు, కన్నడ, మలయాళ ప్రాంతాలు ప్రత్యేక పరిపాలనా రాష్ట్రాలుగా ఏర్పాటుచేయడానికి బ్రిటిషు ప్రభుత్వం వారిని కోరవలసిందని గవర్నమెంట్ ఆఫ్ ఇండియాకు సిఫారసు చేయడానికి తీర్మానించబడింది. ఇంగ్లండులో ఉన్న ఇండియా కార్యదర్శికి యీ తీర్మానం అంద

జేయవలసిందిగా కోరుతూ గవర్నమెంట్ ఆఫ్ ఇండియాకు ఈ తీర్మానం పంపబడింది. ఆ సమయంలో చెన్నరాష్ట్ర ప్రభుత్వంవారు వ్రాసిన ఉత్తరంలో—అన్ని పరిస్థితులు అవగాహనలోనికి తెచ్చుకుని గవర్నమెంటువారు చెన్నరాష్ట్రాన్ని భాషాప్రాంతాలనే ప్రత్యేక పరిపాలనా రాష్ట్రాల క్రింద విభజించవలెనన్న సూత్రం ప్రభుత్వం అంగీకరిస్తున్నదని వ్రాశారు. అయితే ఇంగ్లండులో హౌస్ ఆఫ్ కామన్స్ సభలో కేరి అనే సభ్యుడు అడిగిన ప్రశ్నకు జవాబుగా ఇండియా కార్యదర్శి, ఇలా చెప్పాడు: "ఇండియాలో రాష్ట్రాలన్నీ భాషాప్రయుక్తంగా నిర్మాణం కావాలన్న కోరిక ఇండియాలో కలదని బ్రిటిషు గవర్నమెంటుకు తెలుసు." దానిపైన ఒక అనుబంధ ప్రశ్నకు సమాధానంగా కొత్తరాష్ట్రం ఏర్పాటుచేసే అధికారం చక్రవర్తిదని చెప్పారు. అంతేకాక, ఇండియా కార్యదర్శియైన జెట్‌లెండ్ అప్పట్లో నూతనంగా రాష్ట్ర విభజన, పునర్నిర్మాణం జరగడం ఇండియాకు మంచిది కాదని బ్రిటిషువారి అభిప్రాయం అని చెప్పారు. కామన్స్ సభలో యిచ్చిన యీ జవాబులు ఢిల్లీ గవర్నమెంటుకు చేరి, అక్కడినుంచి చెన్నరాష్ట్రపు గవర్నమెంటుకు అందగా, ఆ ఫైలుపైన 21-5-1938 నాడు రాజాజీ, "ప్రస్తుతం దీనిపై మనం చేయగలిగినదేమైనా ఉందా? ఇండియా కార్యదర్శి యిచ్చిన ప్రకటన వల్ల మనం వెనుకకు తగ్గవలసిన అవసరం లేదు. నాకు ముందడుగు వేయాలని ఉన్నది," అని వ్రాశారు. దానిపై 26-5-38 న గవర్నరు ఎర్‌స్కిన్ తన అభిప్రాయం వ్రాస్తూ, "ఏప్రిల్ 21నాటి పదవ నెంబరుగల ఉత్తరం ద్వారా ఇండియా కార్యదర్శికి గవర్నమెంట్ ఆఫ్ ఇండియా వారు మన శాసన సభా, శాసన మండలి తీర్మానాలను పంపారు. ఇండియా కార్యదర్శి ప్రత్యుత్తరం వచ్చేవరకు వేరేపని చేయడం నిలుపుల చేస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఇండియా కార్యదర్శిని ఈ క్షణంలో జాబులతో బాంబు చేయడంవల్ల ప్రయోజనం లేదు," అని వ్రాశారు.

ఇలా ఉండగా, ప్రకాశంగారు బందరు వెళ్ళినప్పుడు అక్కడి మునిసిపాలటీవారు ఆయనకొక స్వాగత పత్రం ఇచ్చారు. అందులో ఆంధ్రరాష్ట్ర ప్రసక్తి ఉంది. దానిపై 5-8-38 న ప్రకాశంగారు "రాబోయే

కాబినెట్ మీటింగులో ఏమి చేయగలమో ఆలోచించాలి. ప్రజల మనసులో ప్రత్యేకాంధ్రరాష్ట్ర వాంఛ బలంగా ఉంది,'' అని వ్రాశారు. దానిపైన రాజాజీ "ఇంకా ఏం చేయాలి?'' అన్న మాట కలిపారు. అంటే చేసేదేమీ లేదని ఆయన భావము. 14.7.38 న ఇండియా కార్యదర్శి నుంచి చెన్నరాష్ట్ర ప్రభుత్వానికి ఉత్తరం వచ్చింది. 11/F, 18/53/38-జీ. పి. - 7 మే, 7 జులై తేదీలలో వీరు వ్రాసిన ఉత్తరాలు, వాటితో పొందుపరచిన మార్చి 30, 31 తేదీల శాసన సభా మండలి తీర్మానాలు పంపిస్తూ, చెన్నరాష్ట్ర ప్రభుత్వం ఉత్తరాలు అందినట్లూ, అయితే వీరు వ్రాసిన మొదటి ఉత్తరం అందిన తర్వాత హౌవుస్ ఆఫ్ కామన్స్‌లో ఒక ప్రశ్నకు జవాబు ఇచ్చే సందర్భంలో కొత్త రాష్ట్రాల ఏర్పాటు విషయమై బ్రిటిషువారి అభిప్రాయం వివరించడం జరిగిందనీ, ఆ జవాబు దీంతోబాటు పంపుతున్నామనీ, కొత్త రాష్ట్రాల ఏర్పాటు భారత దేశానికి మంచిది అన్న వీరి అభిప్రాయంతో ఏకీభవించ లేనందుకు చింతిస్తున్నట్లూ వ్రాశారు. ఇది జరిగిన పిదప, చెన్నరాష్ట్రం కాబినెట్‌లో మరొక విషయం జరిగింది. తెలుగు జిల్లాలకు ప్రత్యేక పరిపాలనా యంత్రం, మిగిలిన జిల్లాలకు వేరే పరిపాలనా యంత్రం ఏర్పాటుచేసి, ఈ రెండింటికి తానే గవర్నరుగా ఉండి కార్యకలాపాలు నడిపిస్తాననే ఎర్స్కిన్‌గారి అభిప్రాయం చర్చింపబడడమూ, అలా కావాలనే కాబినెట్ ఒక తీర్మానం వ్రాపిందనే విషయమూ, అది ఇండియా కార్యదర్శికి పంపబడిన విషయమూ దేశంలో అందరికీ తెలిసింది.

1941 డిసెంబరులో జైలునుంచి వచ్చిన ప్రకాశంగారు విశాఖ ఆంధ్ర మహాసభలో బాంబువంటి ఒక మాట బయలుపెట్టారు. అప్పుడు అలా పంపిన ఆ విషయానికి చెన్నరాష్ట్రంలో అధికారంగల పెద్దలు కొందరే వ్యతిరేకులై, ఇండియా కార్యదర్శికి అధికార రీత్యా ఉత్తరం వ్రాయడంచేతే ఆ కార్యదర్శి ఏ పనీ చేయలేదని వెల్లడించారు. ప్రకాశంగారు ఎవరి పేరూ చెప్పకున్నా, అలా చేసింది రాజాజీ అని అర్థం చేసు

కుని ప్రకాశంగారు ఆయనను నిందించినట్లు పత్రికలు వార్తలు ప్రకటించాయి. దానిపై రాజాజీ యిది అబద్ధమని ప్రకాశంగారిపై పరువు నష్టం దావా వేస్తానని ప్రకటించారు. తాము ఎవరి పేరూ చెప్పలేదు గనుక, తమకా బాధ్యత లేదని ప్రకాశంగారు జవా బిచ్చారు. కొంత కాలానికి డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు రాజాజీ వ్రాసిన ఉత్తరాలను తాము చదివినట్టు ప్రకటించగా, ప్రజల అభిప్రాయానికి వ్యతిరేకంగా తామలా వ్రాయలేదని రాజాజీ ప్రకటించారు.

ఇంగ్లండు వెళ్ళి సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఆఫీసులో, రాఘవేంద్రరావు (కౌన్సిల్ మెంబరు) వ్యతిరేకంగా ఉన్న ఉత్తరం చూపగా, ప్రకాశంగారికి ఆ విషయం అందజేసిన వ్యక్తి, దాన్ని పురస్కరించుకుని ప్రకాశంగారు మాట్లాడి తగవులో పడ్డప్పుడు- అవును, కాదు అని ఏమీ అనకుండా మౌనంగా ఉండిపోవడంవల్ల, ఆ ఉత్తరంయొక్క గ్రంథకర్తృత్వము, ఉద్దేశము మొదలైనవి యిప్పటి వరకు, లోకానికి తెలియవు. * పట్టాభి సీతారామయ్యగారు కూడా ఆ ఉత్తరంలో ఉన్న వివరాలుగాని, దాని కర్త పేరుగాని- తన ప్రకటనలో బయట పెట్టలేదు.

'క్విట్ ఇండియా' ఉద్యమం వచ్చిన తరువాత జరిగిన జనరల్ ఎన్నికల పిదప ప్రకాశంగారు చెన్నరాష్ట్రానికి ముఖ్యమంత్రి కావడం, సంవిధాన సభ (Constituent Assembly) లో సభ్యులుగా ఉండడం జరిగింది. ఆ సందర్భంలో వారూ, దుర్గాబాయిగారు, అనంతశయనం అయ్యంగారుగారు, రంగాగారు కలిసి, ఆంధ్రరాష్ట్రం

---

* నేను ఆ వ్యక్తిని- ప్రకాశంగారి జీవిత చరిత్ర వ్రాసే సందర్భంలో, ఆ ఉత్తరం విషయం తెలియజేయగలరా అని ప్రార్థించగా, ఆయన ఇంతకాలమైనాక రాజాజీ మనసుకు ఎందుకు నొప్పి కలుగజేయాలంటూ, తన పేరును ఈ వివాదంలోకి తీసుకు రావద్దని చెప్పడంవల్ల, వారికి నేనూ, నాకు వారూ వ్రాసిన ఉత్తరాలు ఇందులో పొందుపరచడంలేదు. అవి ప్రచురించ వలసిందిగా పాఠకు లెవరూ నన్ను నిర్బంధించరని ఆశిస్తున్నాను.

పేరు సంవిధానం ముసాయిదాలో రాష్ట్రాల జాబితాలో చేర్చవలసిం దని కోరగా, ఆ ముసాయిదాలో మొదట ఆ పేరు చేర్చడ మయింది. అయినప్పటికీ, సంవిధాన సభవారు నివేదిక ప్రకటించి నపుడు, ఆ పేరు మినహాయింప బడింది. రాష్ట్రాల నిర్మాణంలో కావలసిన పూర్వరంగ కార్యక్రమంగా ఏ యే జిల్లాలు ఒక రాష్ట్రంలో చేరవలెనో నిర్ణయమై ప్రకటింపబడాలి. అలా జరగకుండానే ఆంధ్రరాష్ట్రం పేరు జాబితాలో కలిపితే—అది మిగిలిన రాష్ట్రాలవలె రాష్ట్రంగా నడుచుకొనే అవ కాశం లేనందువల్ల ఆ పేరు తీసివేయడమైందని ఆ నివేదిక పేర్కొ నింది. తరువాత యీ ఆంధ్ర రాష్ట్రం విషయమై 1952 లో అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు ప్రాయోపవేశం చేశారు. ఈ స్థితి కలగడానికి కారణం—మొదట కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు భాషారాష్ట్రాలు స్వాతంత్ర్యానంతరం ఏర్పాటు చేస్తామని చేసిన తీర్మాన, వాగ్దానాలకు ప్రధానమంత్రి నెహ్రూ వ్యతిరేకంగా ఉండడం వల్ల, అటువంటి ఏర్పాట్లకు ఎటువంటి పూర్వకార్యక్రమం జరగకపోవడమే. భాషారాష్ట్రా లకు ప్రధానమంత్రి వ్యతిరేకు లన్న సంగతి తెలిసే సరికి, రాష్ట్ర విభజన ఉద్యమం కుంటువడింది. విభజనకు గల అభ్యంతరాలు బల పడ్డాయి. భాషా విద్వేషాలు పెరగ నారంభించాయి. ఈ ప్రభావం, 1946 లో ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడుకూడా బాగా తల యెత్తింది. ఆయన ముఖ్యమంత్రిగా ఉండగానే, ఆయన మంత్రివర్గం లోని పి. డబ్ల్యూ. డి. మంత్రిగారు—చెన్నపట్నం మొదలుకొని ఉత్త రంగా తడ వరకు, నూటికి 75 నుంచి 95 శాతందాకా తెలుగు ప్రజ లున్న గ్రామాల పేర్లను అరవ అక్షరాలతో వ్రాయించడం మొదలు పెట్టారు. మైలు రాళ్ళమీద అరవ అంకెలు చెక్కించ నారంభించారు.

చెన్నపట్నంలో 'పాపయ్య వీధి' అని ఒక వీధి ఉండేది. ఆ పాపయ్య తూర్పు ఇండియా కంపెనీవారి పరిపాలనా కాలంలో- తెలుగు, ఇంగ్లీషు దుబాసి (ద్విభాషి) గా ఉండేవాడు. ఆయన ఇంటిపేరు 'అవధానం వారు'. ఆ వీధిపేరు ఇంగ్లీషులో పాపయ్య స్ట్రీట్ అని వ్రాసి ఉండగా, ఈ తగాదాలు బలమైనపుడు పాపయ్య అన్న మాటకు చివర

"ర్" అన్న అక్షరం ఒకటి చేర్చి, 'పాపయ్యర్ వీధి'గా మార్చారు. రెండువందల సంవత్సరాలపాటు తెలుగు నేర్పుతూ ఉన్న ఎన్నో స్కూళ్ళలో తెలుగు క్లాసులు మూసివేయబడ్డాయి. అయితే, ప్రకాశం గారికి తెలుగు నాయకులే వ్యతిరేకంగా ఉండడంచేత ముఖ్యమంత్రిగా ఎన్నికైనప్పటికీ, ఇటువంటి అవకతవకలను బలంగా అడ్డడానికి సత్తువ లేకపోయింది. ఇటువంటి పరిస్థితులలో అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు ఆంధ్రరాష్ట్రం ప్రత్యేకంగా కావాలనీ, అందులో చెన్నపట్నమూ చేర్చబడాలనీ ప్రాయోపవేశం చేశారన్న మాట అందరికి తెలిసిందే. ఆయన శానిటరీ ఇన్స్పెక్టరుగా ఉండి, సహాయ నిరాకరణోద్యమంలో ఆ పదవికి రాజీనామా ఇచ్చి, గాంధీగారి ఆశ్రమంలో చేరిన గాంధీవాది. ఆయన, ప్రభుత్వ కార్యాలయాలున్న కోటగుమ్మంవద్ద ప్రాయోపవేశం ఆరంభించగా, బులుసు సాంబమూర్తిగారు ఆ స్థలం మంచిది కాదని, ఆయనను తమ యింటికి తీసుకుపోయి, ఆ దీక్షాభంగం జరగకుండా తగిన ఏర్పాట్లు చేశారు. ప్రాయోపవేశం మాన్పించడానికి మారుగా— ప్రకాశంగారు, సాంబమూర్తిగారు ఆయన మంచంమీద కూచుని, ఆయన దీక్షను, పట్టుదలను హెచ్చుచేసి, ఆయన మరణానికి కారకులవుతున్నారని ఆంధ్ర వ్యతిరేకులు, మంత్రులు పలు విమర్శలు ప్రారంభించారు. ఏమైనా, అప్పటి ముఖ్యమంత్రి రాజాజీ మాత్రం ఉపవాస దీక్షలో ఉన్న శుద్ధ గాంధీవాది శ్రీరాములుగారిని ఒక్కమారైనా వచ్చి చూడలేదు. చివరకి ఆయన ప్రాణంపోయిన తరువాత కూడా—దహనానికి ముందుగాని, దహన సమయంలోగాని రాజాజీ రాలేదు; చూడలేదు; 'అయ్యో పాప' మని మాటయినా అనలేదు. బహుశా, అది రాజనీతి సంబంధమైన మౌనమేమో? యాభై రోజులు ఆలా ఉపవాసం జరిగేసరికి దేశంలో పెద్ద అలజడి ప్రారంభమయింది. యాభై ఎనిమిదో రోజున ఆయన దేహ త్యాగం చేసి, స్వర్గస్థులైనారు. దాంతో—తెలుగు జిల్లాలలో అనేక చోట్ల రైళ్ళను ఆపివేయడం, రైలు పట్టాలు తెగగొట్టడం, స్టేషన్లు కాల్చడం మొదలయిన అల్లర్లు కాల్పులు చాలా హెచ్చయినాయి. అయినా, అల్లరికి జడిసి, ఆంధ్ర

రాష్ట్రం ఏర్పాటు చేయనని ప్రధానమంత్రి కఠినంగా చెబుతూ వచ్చారు. చివరకు, 1953 వేసవికాలం తరువాత చెన్నపట్నం, బళ్ళారి మినహాయించి, మిగిలిన తెలుగు ప్రదేశాలతో ప్రత్యేక రాష్ట్రం ఏర్పాటు చేయడానికి నెహ్రూగారు అంగీకరించడం, సెప్టెంబరు నెలలో ఈ విషయమై ఒక ప్రత్యేక సంఘం ఏర్పాటు కావడం, అక్టోబరు 1 నాడు నూతనాంధ్ర రాష్ట్రానికి కర్నూలులో నెహ్రూగారే ప్రారంభోత్సవం జరిపించడం మొదలైన విషయాలు ముందు వివరిస్తాను. ఇక్కడ, ఆంధ్ర రాష్ట్ర అవతరణ విషయం క్లుప్తంగా చెప్పదమైనది.

# 10

## క్విట్ ఇండియా ఉద్యమము

వ్యక్తి సత్యాగ్రహ ఉద్యమం అనంతరం ఆగస్టు నెలవరకు కొంత విరామం కలిగింది. వ్యక్తి సత్యాగ్రహంలో కాంగ్రెస్ వాదులు చూపించిన క్రమశిక్షణ, కార్యదీక్ష దేశంలో నూతనోత్సాహాన్ని కల్పించాయి. జైలునుంచి విడుదలయిన తర్వాత రాజాజీ చేసిన పాకిస్తాన్ పక్ష ప్రచారానికి వ్యతిరేకంగా సమగ్ర జాతీయతావాదం-కేవలం కాంగ్రెసు వాదులలోనేగాక, ఎలాగో ఒకలాగు నిత్య జీవితాలను వెళ్ళబుచ్చే సామాన్య ప్రజలలోకూడా ప్రబలమైంది. ఇంతలో, 1941 డిసెంబరులో విడుదల కాకుండా మిగిలిన సత్యాగ్రహు లందరినీ జైళ్ళనుంచి విడుదల చేశారు. ఆ నెల ఆఖరున బార్డోలీలో, కాంగ్రెస్ కమిటీవారు మరొకసారి గాంధీగారితో భిన్నాభిప్రాయులై, కొత్త ఆలోచనకు దిగడం జరిగింది. అయితే, దేశ రక్షణకోసం ప్రభుత్వంతో సంబంధం లేకుండా రక్షణ సంబంధాలు ఏర్పాటుచేసే ఊహలుకూడా కలిగాయి. 1942 మార్చిలో ప్రకాశంగారి అధ్యక్షతన బెజవాడలో ఆంధ్రరాష్ట్ర కార్యసంఘం సమావేశమయింది. బ్రిటిషువారు మన దేశాన్ని రక్షించగల స్థితిలో లేరన్న భావం ఒకటి ఏర్పడి, ఆంధ్ర

దేశాన్ని నాలుగు భాగాలుగా ఏర్పాటు చేసుకుని, ఒక్కొక్క భాగానికి ఒక ప్రాంతీయ రక్షణ సంఘం ఏర్పాటు కావాలని తీర్మానించడం జరిగింది. అదే సమయంలో బ్రిటిషు ప్రభుత్వం తరపున సర్ స్టాఫర్డు క్రిప్స్ మార్చి 28 నాడు మన దేశానికి వచ్చారు. ఆయన రాక ఉద్దేశం: రాజ్యాంగంలో కొన్ని మార్పులుచేసి, భారతీయ నాయకులకు ప్రభుత్వంలో కొంత చోటివ్వడం వల్లనో, ఇంకొకలాగునో బ్రిటిషు ప్రభుత్వాన్ని ఇక్కడ శాశ్వతంగా ఉండేటట్లు చేయడమే. ఆయన ఇక్కడ ఉండగానే, ఏప్రిల్ 6 న జపాన్ వైమానికులు పది, పన్నెండు విమానాలలో వచ్చి, విశాఖపట్నం పైనా, కాకినాడపైనా బాంబులువేసి, కొంత ప్రాణ నష్టాన్ని, వస్తు నష్టాన్ని కలగజేశారు.

ఇది ఇలా ఉండగా, ప్రకాశంగారు ఎప్పటికప్పుడే, రాజాజీ చెప్పినట్లుగా దేశాన్ని ఖండించ రాదని, ఆయన వాదాన్ని ఖండిస్తూ చెన్నపట్నంలోనూ, మిగిలినచోట్లనూ ప్రచారం చేస్తూండేవారు. ఇంతలో ఏప్రిల్ 29 నుంచి, మే 22 దాకా అలహాబాదులో ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశ మయింది. అప్పుడు గాంధీజీ ఒక సూచన చేశారు. మన దేశానికి స్వాతంత్ర్యం ఇస్తే, స్వతంత్ర భారతదేశ ప్రభుత్వము వారు మిత్రరాజ్య సైన్యాలు యుద్ధం కొనసాగించడానికి అనుమతించ గలరని ఆ సూచనలోని భావం. 2-6-42 న చెన్నపట్నంలోని ఆర్యసమాజ భవనంలో రాజాజీ చేసిన పాకిస్తాన్ ప్రతిపాదన కొద్ది కాలంలోనే దానంతట అదే నశిస్తుందని ఆశించారు. 26-2-42 న ప్రకాశంగారు తిరిగి కాంగ్రెస్ వాదులలో ఐకమత్యం, మనో దృఢత్వం కలగడానికి—అఖిల భారత కాంగ్రెస్ కమిటీ వారు ఇచ్చే ఆదేశాలను తూచా తప్పకుండా అనుసరించవలసిందని ఆదేశించారు. వ్యక్తిగతమైన వాదనలు, విజృంభణలు చేయకుండా ఏకైక నాయకుడైన గాంధీగారి ఆదేశం ప్రకారం కాంగ్రెస్‌వారు యావన్మందీ నడచుకోవాలే కాని, స్థిరబుద్ధిలేని ఉపనాయకుల ఊపులకు లొంగకూడదని కూడా ఆయన గట్టిగా హెచ్చరిస్తూ వచ్చారు. 27-6-42 న చెన్నపట్నంలో—పాకిస్తాన్ ఇవ్వాలనే అభిప్రాయాన్ని సమూలంగా

మన మనసుల్లోంచి నిర్మూలించాలని ఒక బహిరంగ సభలో చెప్పారు. జూలై 25న, పాకిస్తాన్ కావాలని వాదించే కాంగ్రెసువారిని, కాంగ్రెసు నుంచి తొలగించవలసిన సమయంవచ్చిందని కాంగ్రెస్ అధిష్ఠాన వర్గానికి హెచ్చరిక చేశారు. అంతకు ముందు, జూలై 14 న వర్కింగ్ కమిటీవారు వార్ధాలో సమావేశమై, బ్రిటిషువారిని ఇండియాలోంచి వెళ్ళగొట్టడానికి జయం లభించేంతవరకు యత్నం చేయాలనే నిర్ణయానికి వచ్చారు. ఆ ఏప్రిల్ చివర అలహాబాదులో జరిగిన ఎ.ఐ.సి.సి. సమావేశంలో పాకిస్తాన్ వాదియైన రాజాజీ ఐదునిముషాలు మాట్లాడడానికి కూడా సభ్యులు అనుమతించలేదు. అంతకు పూర్వమే, కాంగ్రెసు అధ్యక్షులు కాంగ్రెస్ కమిటీ లోంచి ఆయన పేరు తొలగించారు. చెన్నరాష్ట్రంలో అన్ని చోట్లా ప్రజలను ముందుకు నడిపే శక్తి ఒక్క ప్రకాశంగారిలోనే ఉన్నట్టు—అన్ని పక్షాల కాంగ్రెస్ నాయకులు తమ అభిప్రాయాన్ని వెల్లడిస్తూండేవారు. కాంగ్రెస్ నాయకులలో పరస్పర భిన్నాభిప్రాయాల మాట అటుంచగా, 1941 జూన్‌లో హిట్లర్ రష్యాపై దాడి చేసిన నాటి నుంచి, రష్యావారిని సంతృప్తి పరచడం కోసమని, మన దేశంలో కమ్యూనిస్టులపై గల ఆంక్షలన్నీ ప్రభుత్వం వారు తొలగించడంతో— కాంగ్రెస్ నాయకత్వానికి వారు ఎదురు పక్షమయి, ప్రభుత్వాన్ని బల పరిచేందుకు సిద్ధపడ్డారు. కాని, ఏది యేమైనా దేశస్వాతంత్ర్యంకోసం, ప్రాణాలు బిగబట్టి, ముందుకు దూకవలసిన సమయం వచ్చింది. ఒక మారు దూకిన తరువాత, అందరూ స్వాతంత్ర్య పక్షవాదులు కాకతీర దనీ, అప్పుడు, అందరూ స్వాతంత్ర్య సమరానికి దోహదం చేయగల రనీ గాంధీగారి దృష్టి పథంలో గోచరించగా, ఆయన అగస్టు నెలలో 'క్విట్ ఇండియా' నినాదం చేశారు. దానికి కార్యరూపం ఇవ్వడానికి ఆగస్టు 6 నుంచి బొంబాయిలో ఎ. ఐ. సి. సి. సమావేశాలు ఏర్పాటయి నవి. చిన్నచిన్న భిన్నాభిప్రాయాలు వ్యక్తిగతంగా ఉన్నా, కాంగ్రెస్ వాదులందరికీ గాంధీగారు చెప్పిన కార్యక్రమంలో సంపూర్ణ విశ్వాసం ఉండేది. అందుచేత, ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షులైన ప్రకాశంగారి కార్యక్రమం సాఫీగానే సాగేది. వ్యక్తి సత్యాగ్రహ సమయంలో

డాక్టర్ పట్టాభిగారు మా అందరితోబాటు తిరుచినాపల్లి జైలులోగాక, వేలూరు జైలులో ఉండడం జరిగిందని మరొక చోట కూడా పేర్కొనడం జరిగింది. అప్పుడు అక్కడ ఆయనతోబాటు మరి కొందరు తెలుగు నాయకులుకూడా ఉండేవారు. వారిలో కళా వెంకటరావుగారు కూడా ఉండేవారు. ప్రకాశంగారిపై రాజాజీకున్న వ్యతిరేక భావంతోబాటు, ఆయనపై పట్టాభిగారికి గల ప్రతికూల భావం కూడా ప్రకాశంగారి కార్యక్రమాలకు అడ్డం వచ్చేది. అందువల్లనే, రాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి వారు అధ్యక్షులయినా—పట్టాభిగారు తమ చెప్పు చేతల్లోకి కళా వెంకటరావుగారిని తీసుకోనారంభించారు. ప్రకాశంగారికి తెలియకుండానే, తాను కార్యదర్శి కావడంవల్ల ఆయన ఏవేవో పనులు చేయడం కూడా ఆరంభించారు. దీని పరిణామాలు రాబోయే మరొక అధ్యాయంలో వివరిస్తాను.

## బొంబాయి ఏ. ఐ. సి. సి సమావేశము

బొంబాయిలో ఏ. ఐ. సి. సి. సమావేశం కాక పూర్వము ఒక రాత్రి నేను గుంటూరునుంచి విశాఖపట్నం వెళ్ళే త్రోవలో, విజయవాడ రైల్వే ప్లాట్‌ఫారం మీద సగం రాత్రప్పుడు కళా వెంకటరావుగారిని చూడడం జరిగింది. ఆయన నెల్లూరునుంచి బందరు వెళుతూ, అక్కడ బందరు రైలుకోసం కనిపెట్టుకుని ఉన్నట్టు చెప్పాడు. బందరు కెందుకని నే నడిగాను. అక్కడ పట్టాభిగారి యింట్లో కాంగ్రెసు నాయకుల సమావేశం జరుగనున్నదని చెప్పాడు. "నాకు నోటీసు అందలేదే," అని నే నంటే, అది ఇన్‌ఫార్మల్ మీటింగు గనుక అందరికీ నోటీస్ ఇవ్వలేదనీ, అయినా నన్ను రమ్మనీ ఆహ్వానించాడు. "ఏమిటి విషయ?" మని నే నడిగాను. జేబులోంచి ఒక రోనియో తైపు చేసిన కార్యక్రమ సూచికను తీసి చూపించాడు. అది నేను చదివి, "ఇలాంటి దెక్కడిది? ఎవరిచ్చిం" దని అడగ్గా, అది డాక్టర్ పట్టాభిగారు గాంధీగారు ఇచ్చిన సూచనల మేరకు తయారుచేసిన కార్యక్రమం అని చెప్పాడు. అందులో టెలిగ్రాఫు తీగలు టెలిఫోను తీగలు కత్తి

రించి వేయవలసిందనే సూచనను వెంకటరావుకు చూపించి, "గాంధీజీ దీనికి ఎన్నడూ ఒప్పుకోడయ్యా! నేను ఇలాంటి సూచనను గాంధీగారికి వ్రాస్తే, ఆయన 'నా మనస్సు ఆ మార్గంద్వారా నడవదు' అని నాకు జవాబు వ్రాశారు. అది నా దగ్గరుంది." అని అంటే, దాని మీదట, "బందరుకునీవు కూడా రా! ఇవన్నీ చర్చించవచ్చు," అన్నాడు ఆయన. నేను "అట్లా రావడానికి అవకాశం లేదని, విశాఖపట్నం వెళ్ళి, సామానులు సర్దుకుని నేరుగా బొంబాయికి వస్తా"ననీ అన్నాను. తర్వాత ఎవరి రైళ్ళు వారు ఎక్కాము.

బందరులో కొంతమంది కాంగ్రెసు మిత్రులు సమావేశమయారు. ఆ సమావేశం అధ్యక్షులయిన ప్రకాశంగారితో చెప్పి ఏర్పాటు చేసిందికాదు. అది వెంకట్రావు, పట్టాభిగార్లు తమలో తామే అనుకుని- ఇరవై, ముప్పై మంది కాంగ్రెసు మిత్రులకు మాత్రం తెలిపి ఏర్పాటు చేసింది. వారి వలెనే ప్రకాశంగారికీ తెలియజేయగా, వారూ హాజరయ్యారు. వెంకట్రావు నాకు చూపించిన కార్యక్రమం కాగితాన్ని గాంధీగా రిచ్చిన ప్రోగ్రా మని చదివాడట. దానిపైన ప్రకాశంగారు, దాని వైఖరి చూసి అది గాంధీగారిచ్చిన ప్రోగ్రాం కానేరదని వాదిస్తే, వాదోప వాదాలు బయలుదేరాయట. కొంత సేపయిన తర్వాత వేరే కాగితంపైన ఆ మీటింగులో జరిగిన ప్రొసీడింగ్స్ (కార్యక్రమ చర్చ) వ్రాసి, ప్రకాశంగారిని సభాధ్యక్షునిగా సంతకం పెట్టమన్నారట. కాని అందులో నిర్ణయా లేవీ లేవట. క్రమబద్ధంగా ఏర్పాటు అయిన సమావేశం కానపుడు సంతకం ఎందుకని ప్రకాశం గారు మొదట అడ్డు చెప్పారట. దానిపై అక్కడ ఆ రోజు జరిగిన చర్చలు గల కాగితం కాబట్టి, సంతకం చేస్తే అది రికార్డవుతుంది గదా, అంటే ఆయన సంతకం పెట్టారట.

ఈ సమావేశం తర్వాత ఏ. ఐ. సి. సి సభ్యులైన కాంగ్రెస్ మిత్రు లందరూ బొంబాయి చేరుకున్నారు. డాక్టర్ పట్టాభిగారు యథా ప్రకారం చావలి నాగేశ్వరరావుగారి యింట బస చేశారు. నేనూ విశాఖ పట్నంనుంచి 6 వ తేది ఉదయానికి బొంబాయి చేరి, అలవాటు ప్రకారం

అక్కడే బసచేశాను. ఒంటిగంటకు, వర్కింగు కమిటీ సమావేశం నుంచి భోజన విశ్రాంతి వేళకు పట్టాభిగారు తిరిగి వచ్చారు. నేను వెంటనే, "విజయవాడలో నేను చూసిన ప్రోగ్రాం విషయమై వర్కింగు కమిటీలో చర్చ జరిగిందా?" అని అడగ్గా, ఆయన, "లేదయ్యా! ఇదంతా ఎవరు పట్టించుకొంటూ రక్కడ? ఎవరి గొప్పలు వారు చెప్పు కోవడంతోనే కాలమంతా వ్యర్థమైంది" అన్నారు.

ఆ రాత్రి 9, 10 గంటల వేళప్పుడు భరతన్ అనే ఒక ప్రఖ్యాత వార్తాహరుడు పట్టాభిగారికి టెలిఫోన్లో, ఆ తెల్లవారుజామున వర్కింగు కమిటీ మెంబర్లను అరెస్టు చేయడానికి ఏర్పాటయినట్టు చెప్పారు. దానిపైన, పట్టాభిగారు వల్లభభాయిపటేలుగారింటికి ఫోను చేస్తే, పటేలు కుమారుడు ఫోన్ అందుకున్నాడు. అతనితో పట్టాభిగారు తెల్లవారే లోపుగా జరగబోయే వర్కింగ్ కమిటీ మెంబర్ల అరెస్టు సంగతి చెప్పి, పటేలుగారి చొక్కా జేబులోనుంచి తామిచ్చిన రోనియో కాపిని తీసి చింపివేయమని కోరారు. దానికి పటేలు కుమారుడు—అరెస్టులు జరగవనీ, ఏ. ఐ. సి. సి. క్విట్ ఇండియా తీర్మానాన్ని ఆమోదించేవరకు ఎవరినీ అరెస్టు చేయరాదని ప్రభుత్వంవారు నిశ్చయించారనీ చెప్పాడు.

## అగ్ర నాయకుల అరెస్టులు

ఆ రాత్రి కానీ, తెల్లవారుజామున కానీ అరెస్టులు జరుగలేదు. 7, 8 తేదీల వర్కింగ్ కమిటీ సమావేశాలలో కూడా తమ రోనియో కాపీ ప్రోగ్రాంపై చర్చ జరగలేదని పట్టాభిగారు నాకు మధ్యాహ్నం, రాత్రి కూడా చెప్పారు. 8 వ తేదీ రాత్రి ఏడెనిమిది గంటల వేళ, గాంధీగారు చేసిన చరిత్రాత్మకమైన ఉపన్యాసం తరువాత, "క్విట్ ఇండియా" తీర్మానాన్ని ఏ. ఐ. సి. సి. అమోదించింది.

ఆ తెల్లవారుజామున మూడున్నర గంటల వేళ నాగేశ్వరరావు గారి యింటికిద్దరు పోలీసు అధికారులు వచ్చి తలుపు తట్టగా, వారు అరెస్టు చేయడానికి వచ్చారని గుర్తించి, వారిని లోపలికి రమ్మని కూర్చోబెట్టాను. వారు పట్టాభిగారిని మాత్రమే అరెస్టు చేయడానికి వచ్చి

నట్టు చెప్పి, కాలకృత్యాలకు, స్నానపానాదులకు ఆయనకు ముప్పావు గంట వ్యవధి ఇచ్చామని చెప్పారు. పట్టాభిగారిని ఎక్కడికి తీసుకుపోతారో చెప్పడానికి వారు నిరాకరించారు. అయితే కొంతసేపటికి, ఆయనను విక్టోరియా టెర్మినస్ రైల్వేస్టేషనుకు తీసుకు వెళతారని గ్రహించ గలిగాను. వారు వెళ్ళేకారులోనే పట్టాభిగారితో బాటుగా నన్నూ విక్టోరియా టెర్మినస్ స్టేషను వరకైనా తీసుకు వెళ్ళవలసిందని ఆ పోలీసు ఉద్యోగిని అడిగితే, క్రింద సి.ఐ.డి. ఉన్నాడనీ, అందువల్ల అలా చేసే వీలులేదనీ అతడు చెప్పాడు. నేను క్రిందికి దిగి, ఆ సి. ఐ. డి. ని ఎలాగో ఒకలాగున ఒప్పించి, పట్టాభిగారు ఎక్కిన కారులోనే ముందు సీట్లో ఆ ఉద్యోగి ప్రక్కనే కూచుని, జయ జయ శబ్దసూచకమైన పక్షుల కలకలా రావాలతో తెలతెలవారుతూండగా విక్టోరియా టెర్మినస్ స్టేషను చేరుకున్నాను. ప్రత్యేకమైన ఒక ప్లాట్‌ఫారం మీద అప్పటికే అరెస్టయిన కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు కొందరు తమకోసం ఏర్పాటైన ప్రత్యేకమైన రైలు ముందు నిలబడి ఉండడాన్ని దూరం నుంచి చూడగలిగాను.

అంతలో భళ్ళున తెల్లవారినది. నేను, గాంధీగారు మొదలైన వారు అరెస్టయిన వార్త—అక్కడికి దగ్గరగానే ఉన్న అమృతాంజనము భవనంలోనికి వెళ్ళి, అక్కడున్న ఆంధ్ర డెలిగేట్ల (ప్రతినిధుల) తోను, ఆ ప్రక్కనే ఉన్న హోటలులో ఉన్న పంజాబీ బంగాళ ప్రతినిధులతోను చెప్పి, తిరిగి గిర్గాంలో ఉన్న నాగేశ్వరరావుగారి బసకు మెల్లిగా బయలుదేరాను. విక్టోరియా టెర్మినసునుంచి గిర్గాంకు పోయే త్రోవ దోభీతలావు ద్వారా పోతుంది. నేను దోభీతలావుకు నడచి వెళ్ళేసరికి, వందల కొద్ది ప్రజలు అక్కడి ట్రాఫిక్ సర్కిల్ (అంటే- వెళ్ళే బండ్లు, వచ్చే బండ్లు విడివిడిగా పోవడానికి వీలుగా, చుట్టూ సిమెంట్ స్తంభాలకు ఇనుప గొలుసులు వేసి, వలయాకారంగా ఏర్పాటు చేసిన స్థలము) వద్ద ఆ స్తంభాలు, గొలుసులు ఊడబెరికి, ఏవేవో పాత పెట్టెలు, బల్లలు మొదలైన వాటిని గిర్గాం పోయే రహదారి ముందు అడ్డంగా పెట్టేసి, దాన్ని బందు చేసేశారు. వారు మను

ష్యుల రాకపోకలను కూడా అడ్డుతున్నారు. అడ్డే వారెవరో, ఎందుకు అడ్డుతున్నారో తెలియదు. కాని నేను అక్కడికి వెళ్ళేసరికి, నా దుస్తులూ, వేషం చూసి, "నువ్వు కాంగ్రెసువాడివా?" అని హిందీలో అడిగారు. నేను అవునని, నా బస ఆ రోడ్డులో ఉన్నదనే సరికి, నన్ను వెళ్ళనిచ్చారు. అంతలో అక్కడికి వచ్చిన ఒక పోలీసు వాన్ వాళ్ళు అడ్డగించేసరికి తిరిగి వెళ్ళిపోయింది. విప్లవం ఆరంభమయింది.

బొంబాయిలో అన్ని వీధులలోకి ప్రజలు ఈ విధంగా వచ్చేసి రహదారులను బందు చేసేస్తున్నారు. అంతకు ముందు రోజున, శివాజీ పార్కులో జండా వందనం జరుగుతుందని ప్రకటించారు. అక్కడ ముప్ఫై, నలభై వేల మంది ప్రజలు గుమిగూడారు. హిందువులు బ్రిటిషు దొరల లాగున ధరించిన టోపీలు, నెక్టైలు, కాలర్లు; దొరికినంత మట్టుకు విదేశపు బట్టలు; బ్రిటిషు గవర్నమెంటు రాజు, మంత్రుల పేరిట తయారుచేసిన గడ్డి బొమ్మలు—పెద్ద పెద్ద నాలుకలతో వెలుగుతున్న అగ్నిహోత్రుడికి ఆహుతి చేయబడినాయి. అయినా, ఇంగ్లీషు వారిని ఎవరూ హింసించలేదు. గిర్గాంలో నేను బసచేసి ఉన్న నాగేశ్వరరావుగారింటి ప్రాంతంలో, పది గంటలయ్యేసరికి మెల్ల మెల్లగా రెండువందల అడుగుల కొక పోలీసు కానిస్టేబుల్‌ని నిల్చోబెట్టారు. బొంబాయి పోలీసుల చేతి కర్రలు మనవైపు పల్లెటూరి ప్రజల చేపాటి కర్రలలాగా ఉండేవి. వాటిపైన వారు గడ్డాలు మోపి నిలుచున్నారు. అంతలో మరొక పోలీస్‌వాన్ వచ్చింది. ఎక్కడినుంచో రాళ్ళువచ్చి దానిమీద పడ్డాయి. ఎక్కడినుంచి పడ్డాయి. ఎవరిమీద పడ్డాయి అని ఈ పోలీసువారు పట్టించుకున్నట్టే కనబడలేదు. కొంతసేపటికి ఒక వార్త ఆ ప్రాంతానికి వచ్చింది—ఒక సార్జెంటు దుర్మార్గం చేసి, ఖద్దరు టోపీతో ఉన్న దుకాణదారుని కొట్టాడని. వందలకొద్ది ప్రజలు మూగి పోయారు. అంతట్లో ఆ కొట్టిన సార్జెంటు ఒంటినిండా కిరసనాయిలు పోసి కాల్చేశారని మరొక వార్త వచ్చింది. ఈ పోలీసువారు మాత్రం కదలక, ఎక్కడి వారక్కడే నిలబడి ఉన్నారు.

ఆ మహా పట్నంలో ఇంకా ఏం జరుగుతున్నదో చూద్దామనే

కుతూహలం కలిగింది. నేనూ, అక్కడే ఏ. పి. పి. కంపెనిలో పని చేస్తూ ఉన్న ముసలగంటి భీమారావు అనే మిత్రుడు, అలా బయలుదేరి మొదట వల్లభాయి పటేలుగారింటికి వెళ్ళాము. తలుపు తీస్తూనే పటేలు గారి కుమారుడు ఏదో రహస్యంగా జరుగుతున్నట్టు సూచించి, మమ్మల్ని గదిలో కూచోపెట్టి, లోపలినుంచి ఒక పెద్ద కాగితాల కట్ట తెచ్చి, అదంతా ఏక్షన్ కమిటీ ఆదేశమనీ, అందులో ఉన్నట్టు నడిపించమనీ మాతో చెప్పాడు. అందులో శుద్ధ శాబటేజ్ ప్రోగ్రామ్ వ్రాసి ఉంది. 'ఆంధ్రా సర్క్యులర్' అన్న పేరిట తర్వాత ఆంధ్రుల కమిటీపైన నేరాలుగా మోపిన విషయాలన్నీ అందులో ప్రోగ్రాం పేరిట వ్రాసి ఉన్నాయి. ఎవరీ ఏక్షన్ కమిటీ? అంతా మా మిత్రులే గనుక, "అయ్యాయ్! ఇదంతా గాంధీగారి ప్రోగ్రాముకు వ్యతిరేకం కాదా?" అని అడిగితే, "గాంధీగారు అరెస్టయిన తర్వాత ప్రోగ్రాం మనదే. ఆయనకేం సంబంధం?" అన్న మోస్తరుగా ఒకరితో ఒకరు అనుకున్నారు. ఏమయితే నేమి? ప్రాణ- హింసారహితమైన శాబటేజ్ ప్రోగ్రాం దానంతట అదే పట్నంలో ప్రారంభమయింది. ఆ కాగితాల కట్ట తీసుకుని నేను, భీమారావు మేడదిగి, కొంచెం వెనక రోడ్డుకు వెళ్ళి ట్రామ్ ఎక్కాము. ప్రిన్స్ ఆఫ్ వేల్స్ మ్యూజియం దాటేసరికి, ట్రాములు, బస్సులు అన్నీ ఆగిపోయి ఉన్నయ్యక్కడ. అది చూసి, ఏదో డబుల్ డెక్ బస్సు ఒకటి దాదరువైపు వెళుతూంటే అందులో పైకి ఎక్కాము. అందులో ముగ్గురు, నలుగురు తెల్లవాళ్ళున్నారు. ఇక బస్సు కదులుతుందనగా కండెక్టరు పైకి వచ్చి, తెల్లవారిని దిగిపొమ్మన్నాడు. విప్లవం గట్టి పడుతోందని మాలో మేము సంతోషించాము. కాని, రెండు నిమిషాల తర్వాత ఆ తెల్లవాళ్ళు మళ్ళీ మీదకి వచ్చి కూచున్నారు. ఈ దిగడం, ఎక్కడం ఏమిటని వారిని మేము కుశల ప్రశ్న అడిగాము. అంతకు ముందు కొందరు తెల్లవాళ్ళు ప్రజల మూకలు తమపై పడతాయేమోనన్న భయంతో దిగి పోవడం చేత, కండక్టరు తాము కూడా అట్లా చేస్తారేమో అని అడగ్గా, ఒకరు తప్ప తక్కిన వారు భయంలేదని తిరిగి వచ్చినట్టు చెప్పారు. అంత

టిలో బస్సు కదిలి ఒక ఫర్లాంగుదూరం వెళ్ళేసరికి, యాభై అరవై అడుగుల వెడల్పున్న రాజవీథి కూడా కనుచూపు మేరవరకు ప్రజలతో నిండిఉండడంవల్ల మేమందరం తెల్లవారు, నల్లవాళ్ళం కూడా దిగవలసి వచ్చింది. అక్కడ నడుస్తూన్న ప్రజలు లక్షకు తక్కువ ఉండరు. అలా ఎందుకు నడుస్తున్నారో, ఎక్కడికి నడుస్తున్నారో ఎవరికీ తెలియదు. కాని, అందరి ముఖాలమీద, అందరి కళ్ళల్లోను ఏదో ఒక ఆశ; ఏదో ఒకటి సాధించామన్న భావం మూర్తీభవించినట్లు కన్పించింది. బస్సునుంచి దిగిన తెల్లవాళ్ళు మా ప్రక్కనే నడుస్తున్నారు. ఎవరూ వారిని పల్లెత్తుమాట అనలేదు. కాని, అంతటిలో ఆ ప్రక్కనే నెక్టై, కాలర్, హేటు ధరించిన భారతీయుడు కనిపించేసరికి, అతనిని ముట్టడించి, వాటి నిమ్మని అడిగారు. ఇవ్వకుంటే లాక్కునే లాగున కనిపించేసరికి అతడు అవి తీసి ఇచ్చాడు. వాటి గమ్యస్థానం శివాజీ పార్కులో ఏర్పాటైన విదేశ ప్రభుత్వం చితి. మేము చూస్తుండగా వందల కొద్ది హేట్లు, నెక్టైలు, కాలర్లు అక్కడికి వచ్చాయి. ఆ ప్రాంతంలో ఏదో ఒక మూల మాత్రం ఘాటింగు జరిగినట్లు వార్త. కల్బాదేవి రోడ్డులోని భాగ్యవంతులైన వెండి, బంగారం, రత్నాల వర్తకులు ప్రజా సమూహం తమపైన వచ్చి పడకుండా తామే రహదారులు బందు చేసుకున్నారు. సాయంకాలం నాలుగు గంటలయ్యేసరికి పట్నంలో అనేక స్థలాలలో కాల్పులు జరిగినట్లు నాలుగు వైపుల నుంచీ వార్తలు రాసాగినాయి.

ప్రకాశంగారు ఈ అల్లరులలో అరెస్టు కాలేదు. ఆ రోజున అక్కడున్న ఆర్డర్ప్రకారం కాంగ్రెసు నాయకులను వారి వారి రాష్ట్రాలలో అరెస్టు చేయాలని గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆదేశించినట్టు ఆ తర్వాత తెలిసింది. నాకు హైదరాబాదు, విజయవాడ వెళ్ళే రైలులో చోటు దొరకక; బొంబాయి నుంచి రాయపూర్ మీదుగా విశాఖపట్నం బయలుదేరాను. నా చేతినిండా, పటేలుగారింట ఏక్షన్ కమిటీ ఇచ్చిన శాబకేజ్ ప్రోగ్రాం కాగితాల కట్టలున్నాయి. నేను ప్రతి ప్లాట్‌ఫారంమీద అవి పంచుతూ, పార్వతీపురము స్టేషన్లో తాళ్ళపూడి కృష్ణమూర్తి అనే

ఆయనకు అవి ఒక నూరు దాకా ఇచ్చాను. ఆయన 1930లో నా సత్యాగ్రహ దళంలో జైలుకు వచ్చిన స్వాతంత్ర్య యోధుడు. బొంబాయిలో వర్కింగ్ కమిటీ మెంబర్లను అరెస్టుచేయడంవల్ల ప్రకాశంగారికి గాని, నాకుగాని అందులో ఎవరితోనూ ఏవిధమైన సంప్రతింపులూ చేసుకునే వీలు చిక్కలేదు. ఇలా ప్రయాణంచేసి నేను ఆగస్టు 13న విశాఖపట్నం చేరుకున్నాను. ఇంటికి వెళ్ళేసరికి, డిప్యూటి సూపరింటెండెంటు హాజరయి ఉన్నాడు. మీరు చెన్నపట్నం మెయిలుకు వెళ్ళేందుకు సిద్ధంగా ఉండండని చెప్పి, ఒకటిన్నరగంట వ్యవధియిచ్చి వెళ్ళిపోయాడు.

## క్విట్ ఇండియా ఉద్యమసమయ జైలు జీవితము

'క్విట్ ఇండియా' ఉద్యమం ఆరంభమైన రెండు, మూడు రోజులలోనే దేశం నాలుగు మూలలా కొంత హింసాత్మకమైన విప్లవ కార్యకాండ జరిగింది. గాంధీగారు అరెస్టయిన రోజున బొంబాయిలో జరిగిన సంఘటనలను గురించి ఇదివరలో వ్రాశాను. ఇక మన ప్రాంతంలో జరిగిన విషయాలు నాకు స్వయంగా తెలిసినంతవరకు వ్రాస్తాను.

నన్ను ఆగస్టు 13న అరెస్టు చేసినట్టు లోగడ వ్రాశాను. ఆ రోజున సూపరింటెండెంట్ ఆఫ్ పోలీస్ నన్ను ఒక సార్జెంటు చేతి కప్పజెప్పారు. అతనితోబాటు ఇద్దరు సాయుధులైన పోలీసులను సహాయంగా ఇచ్చారు. తలుపులన్నీ వేసిఉన్న రైలుపెట్టివరకు నన్నొక పోలీసువేనులో తీసుకువెళ్ళారు. నేను వెళ్ళిన పోలీసువాను కిటికీలుగూడా తెరలతో మూసివేయబడ్డాయి. అందుచేత, నేను పోలీసువానునుంచి కంపార్టుమెంటుకు ఎక్కడం ఎవరో ఒకరిద్దరు మాత్రమే చూసిఉంటారు. నేను ఎక్కిన రైలు—కలకత్తానుంచి చెన్నపట్నం వెళ్ళే మెయిల్ ట్రైను. నాకు అవసరమైన కాఫీ, భోజనం పోలీసు సార్జంటే తెచ్చిపెట్టేవాడు. ట్రెయిను నడవడం ఆరంభమైన తర్వాత నాపై జాలితో కిటికీ తలుపులు తెరిచాడు. కాని, అనకాపల్లి స్టేషన్ సమీపిస్తున్నదనగా తిరిగి కిటికీలను మూసేశాడు. ఈ విధంగా సాయంకాలం చీకటిపడే

వేళకు బెజవాడ చేరాము. విజయవాడలో భోజనం సార్జంటే తెచ్చాడు. భోజనం చేసి నిద్రపోయాను. తెల్లవారుజామున లేచి, సార్జెంటును లేపి, "అయ్యా! సూళ్ళూరుపేట వచ్చిందేమో! ఇడ్లీలు, కాఫీ తెప్పించం" దన్నాను. అంటే, ఆయన, "ఇది సూళ్ళూరుపేట కాదండీ! విజయవాడ స్టేషనే," అన్నాడు. "రాత్రి నన్ను ఇక్కడే అట్టిపెట్టేశారా? ఎందుచేత?" అని అడగ్గా "మిమ్మల్ని అట్టిపెట్టడంకాదు. రాత్రినుంచి రైలు కదలక ఇక్కడే ఉండిపోయింది," అన్నాడు. "అదేమి?" అని నేను ప్రశ్నించగా, "చెప్పడానికి వీలులేదండి," అన్నాడు. ఆశ్చర్యం వేసింది. "అయితే, ఎన్నిగంటలకు బయలుదేరుతా" మని అడిగాను. "అదికూడా చెప్పలేమండి," అన్నాడు. "కిటికీ తలుపులు తెరుస్తారా? ఒకమారు ప్లాట్‌ఫారంవైపు చూస్తా" నన్నాను. అతడు కొంచెం ఆలోచించి, కిటికీ తలుపెత్తి, "రెండు నిమిషాలు మాత్రమే చూడవచ్చు. మళ్ళీ వేసేయాలి, లేకుంటే నాకు మాట వస్తుం," దన్నాడు. అలా, ప్లాట్‌ఫారం మీద చూసేసరికి ఎక్కడో ఒకరిద్దరు మనుష్యులు తప్ప అంతా నిర్మానుష్యంగా ఉంది. నా కంపార్టుమెంటు ఆగినచోటికి ఎదురుగా అల్పాహారాలు, కాఫీ లభించే గది ఉంది. (ఇప్పుడున్న పెద్ద కట్టడంగాని, ప్లాట్‌ఫారం పైన కప్పుగాని అప్పుడు లేదు.) అందులోనూ ఆట్టేమంది మనుష్యులు కనిపించలేదు. అక్కడికి వచ్చినవారు తిని పారేసిన విస్తరాకులు అన్నివైపులా ఎగురుతున్నాయి. అవి తీసి, ఊడిచే మనుష్యులెవరూ లేరు. సార్జెంటును "రైల్ ఇంజను ఇబ్బందివల్ల ఆగిపోయామా?" అని అడిగాను. చెప్పడానికి వీలు లేదన్నాడు. ఇంతలో బ్రహ్మాండమైన చప్పుడుతో రెండు విమానాలు మా నెత్తిమీదగా పైన వలయాకారంగా రెండుసార్లు తిరిగి, వెళ్ళిపోయాయి. "ఇవేమిటో కనుక్కోండి" అని సార్జెంటుకు చెబితే, సి.ఐ.డీ.లు ఉన్నందున, తాను కదలడానికి వీలు లేదన్నాడు. "అయ్యా! ఆకలవుతున్నది. ఇడ్లీ, కాఫీ సంపాదించగలరా?" అని అడిగాను. ఆయన కొంత ప్రయాస పడి తెచ్చి ఇచ్చాడు. బాగా ఎండ ఎక్కనారంభించినట్టు కిటికీ కన్నాలలోంచి కనిపించింది. ఇదంతా చూచి, బొంబాయిలో నేను చూసిన విప్లవ సూచనలు విజయవాడ

ప్రాంతంలో ఫలించాయని గ్రహించాను. ఆ తొలినాటి రాత్రి విజయవాడ చెన్నపట్నాల మధ్యఉన్న పదిపన్నెండు రైలు స్టేషన్లను సామానులతో సహా కాల్చివేశారనీ, ఒకటి రెండు చోట్ల నగదుపెట్టెలు (Cash boxes) కూడా వందలకొద్ది ప్రజలు స్టేషనులోకి దూరి పట్టుకుపోయారనీ, అనేకచోట్ల రైలు పట్టాలను తప్పించారనీ, కొన్నిచోట్ల సిగ్నల్ స్తంభాలను పడగొట్టారనీ వార్తలు తెలిపినవి. మధ్యాహ్నం కావస్తూంది. ఆ సార్జెంటు ఎలాగో నాకు భోజనం తెప్పించి పెట్టించాడు. అన్ని గంటలసేపూ ఆ సెకండుక్లాసు కంపార్టుమెంటు కిటికీలు మాత్రం తెరవనేలేదు. తర్వాత రైలు తిరిగీ నడవడం ఆరంభించింది. గుంతకల్లు మీదుగా చెన్నపట్నానికి ఆ మర్నాడు సాయంకాలానికి చేరుకున్నాము. ప్రయాణ సమయంలో కొంచెం కిటికీలు తీయడం, రైలుస్టేషను సమీపించేసరికి మూసివేయడం యథాప్రకారంగా జరుగుతూనే ఉంది. చెన్నపట్నంనుంచి వెంటనే కాట్పాడికి పోయే మరొక ట్రైనులో నన్ను ఎక్కించి తీసుకుపోయారు. నగంరాత్రి దాటిన తర్వాత కాట్పాడి స్టేషనునుంచి బస్సులో వేలూరు తీసుకువెళ్ళారు. 1940 నవంబరులో వ్యక్తి సత్యాగ్రహంలో నేను అరెస్టు అయినపుడుకూడా అదే పోలీసు వానులో, ఆ డ్రైవరే నన్ను స్టేషనునుంచి జైలుకు తీసుకు వెళ్ళాడు. ఒకరి నొకరం జ్ఞాపకం చేసుకున్నాము. వేలూరికి తీసుకువెళ్ళిన తరువాత ఇంకా బాగా తెల్లవారక పోవడంవల్ల నన్నక్కడ ఒక పోలీసు లాకప్‌లోకి తీసుకువెళ్ళాడు. అక్కడున్న సబ్ ఇన్స్‌పెక్టరుతో నేనెవర్నో కొంచెం చెప్పుకుని, పైన ఆఫీసు రూములో పడుకోనివ్వమన్నాను. అతడు నా వేషభాషలు చూసి,ఎక్కడికీ పారిపోయేవాణ్ణి కానని గ్రహించి, రెండు ఆఫీసు బల్లలు చేర్చి నాకు చోటు చూపించాడు. అక్కడ నా ప్రక్కవేసుకుని ఆయన దయవల్ల హాయిగా నిద్రపోయాను. ఆ తెల్లవారు జామున, ఇదివరలో నాకు బాగా పరిచయమైన జైలులోకి మూడోమారు ప్రవేశించాను. నేను వెళ్ళేసరికే కొంతమంది మిత్రులు—తెలుగువారు, దాక్షిణాత్యులు, కేరళీయులు అక్కడికి చేరిఉన్నారు. మొత్తం సంఖ్య ముప్ఫైమందికి కొంచెం మించినది.

ఇందులో ప్రకాశంగారు, వి. వి. గిరిగారు, అనంతశయనం అయ్యంగారు, కళా వెంకటరావు, ఎం. పళ్ళంరాజు, ఎన్. సంజీవరెడ్డి, నేను మొదలైన తెలుగు వాళ్ళము; సత్యమూర్తి, కామరాజనాడార్, ముత్తురంగముదలియార్, భక్తవత్సలం మొదలైన దాక్షిణాత్యులు; కె. మాధవమేనోన్, ఆర్. రాఘవ మేనోన్ మొదలైన కేరళీయులు; కే. ఆర్. కరంత్ మొదలగు కన్నడిగులూ ఉండేవాళ్ళము. మేము ఆ రోజులలో డెటిన్యూల మయినప్పటికీ, మొదట్లో మాకు న్యూస్ పేపర్లు ఇచ్చేవారు కారు. పై నుండి వచ్చిన ఇతర రాజకీయ ఖైదీలతో మాకు సంబంధం లేకుండా చేశారు. దేశంలో ఏం జరుగుతున్నదీ తెలిసేది కాదు. మొదట అనుకున్న విప్లవం జరిగిందో, లేదో ఎవరి ఊహాగా నాలు వారు చేసుకునేవాళ్ళము. ఒక రోజున, వడ్రంగి పని ఏదో చేస్తూండగా, కొన్ని పెద్ద చప్పుళ్ళు మాకు వినిపించాయి. ఒకమారు గోడలు త్రవ్వుతున్నట్టు శబ్దం వినిపించింది. ఒకమారు పెద్దపెద్ద తలుపులు బ్రద్దలు కొట్టుతున్నట్టు అనిపించింది. మరొకమారు జెయిలు గుమ్మం త్రోసుకువచ్చే ప్రజా సమూహంపైన పేలుస్తున్న తుపాకీల చప్పుళ్ళలాగా వినిపించాయి. దానికితోడు, ఎలాగో జెయిలు అధికారుల కంట బడకుండా ఏ పొట్లానికో కట్టిన వార్తాపత్రికాభాగం ఒకటి లోపలికి సామానుతో వచ్చింది. అందులో రెండు మూడు పెద్ద అక్షరాలు చిరిగిపోయినా, గాంధీగారిని ఆఫ్రికా తీసుకుపోతున్నారన్న వార్తను అక్షరాలు కూడబలుక్కుని గ్రహించాము. విప్లవమేదో జయమయిందని, జెయిళ్ళ గేట్లను ప్రజలు బ్రద్దలుకొట్టి మమ్మల్ని పైకి తీసుకు పోతారని కొందరు ఊహించారు. కొందరు ఎందుకైనా మంచిది సిద్ధంగా ఉండాలని ఉన్న బట్టలు, సామానులు ఏ క్షణంలో పైకి వెళ్ళిపోతామో అని సర్దుకుని ఉంచుకునే వాళ్ళు.

ఇలా ఉంటూండగా, ఒక డిప్యూటి జెయిలరు పదకొండు గంటల వేళప్పుడు వచ్చి, మమ్మల్ని జెయిలునుంచి అవతలకు వెళ్ళ డానికి సామాన్లు సర్దుకోమని, ఒక గంట వ్యవధి యిచ్చి పోయాడు. మాలో కొందరు, మమ్మల్ని ఎక్కడికో బదిలీ చేస్తారని గ్రహించారు.

"ప్రజలు మనల్ని విడిపించేట్టయితే, ఈ జెయిలరు ఇంత సావకాశంగా మన దగ్గరికి ఎలా వస్తా?" దని అనుభవం పొందిన కొందరు పెద్దలనే సరికి—అది సరిగానే ఉందనిపించింది. కాని, ఏ విప్లవమూ రాలేదన్న ఆశాభంగం మాత్రం మాలో అటువంటిదానిని ఆశించిన వారందరికీ కలిగింది. ఏది ఏమైనా పన్నెండు గంటలయ్యేసరికి—మా సామానులు మోయడానికి ఇరవై మందిదాకా ఖైదీలు, ముగ్గురు నలుగురు వార్డర్లు హాజరయ్యారు. అంతటిలో ఎవరి మూలంగానో, మమ్మల్ని మరొక జెయిలుకు పంపి, మా స్థలంలోకి పై రాష్ట్రినుంచి డెటిన్యూలను తెస్తున్నారనే వార్త బయట పడింది.

అందుచేత, మాలో కొందరికి—రాబోయే డెటిన్యూలకు వెళ్ళిపోయిన డెటిన్యూ లెవరో తెలియడం కోసం మా పేర్లు గోడలమీద పెన్సిళ్ళతో వ్రాస్తే బాగుంటుందని తోచింది. సరేనని అలాగే చేశాము. కొందరు తమ జీవిత వివరాలుకూడా ఒకటి రెండు ఆ గోడలమీద ఎక్కించారు. ఆ విధంగా, కొంత విపులంగా వ్రాసుకున్నవారిలో నీలం సంజీవ రెడ్డిగారు ఒకరు. అలా వ్రాసుకోవలసిన అవసరం లేకుండానే తర్వాత ఈయన దేశవ్యాప్తమైన పేరు తెచ్చుకున్న విషయం అందరికీ తెలిసిందే. మేము వెళ్ళేసరికి, రెండు మూడు లారీలనిండా డెటిన్యూలు తమ సామాన్లతో జెయిలు ప్రవేశంకోసం వేచి ఉన్నట్లు పోల్చుకో గలిగాము. వారున్న బస్సుల కిటికీలు తెరలతో మూయబడి ఉన్నాయి. అయినా, ఒకమూలనుంచి రవిశంకర్ శుక్లా (మధ్య రాష్ట్రాల మాజీ ముఖ్య మంత్రి) ముఖం మాత్రం, ఆయన తెల్లని బొద్దు మీసాలవల్ల వెంటనే పోల్చుకో గలిగాము. మేము వారి బస్సులవైపు వెళ్ళడానికి పోలీసువారు ఒప్పుకోలేదు. బస్సులో వాళ్ళు తెరల సందులలోంచి మాలో ఎవరినైనా పోల్చుకో గలిగారో లేదో తెలియదు.

మమ్మల్ని అన్నీ సెకండు క్లాసు పెట్టెలున్న బండిలో చెన్నపట్నం తీసుకువెళ్ళి, ఆ రాత్రి పెనిటెన్షియరీ జెయిలులో ఉంచి, మర్నాడు ఉదయం సెంట్రల్ స్టేషన్లో గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఎక్కించారు. కాని, మమ్మల్ని ఎక్కడికి తీసుకు వెళుతున్నారో మా

రైలు పెట్టెలలో కూచున్న సార్జెంట్లకు కూడా తెలియదు. ఆ ట్రైనులో వస్తున్న ఒక పెద్ద పోలీసు ఉద్యోగి చెప్పిన స్టేషను వైపుకు బండి నడిపించడం తప్ప, ఆ బండి ఇంజను డ్రైవరుకుకూడా గమ్య స్థానం తెలియదు. ఈ పోలీస్ ఉద్యోగి స్టేషన్ కంట్రోలర్స్ ద్వారా మేము వెళ్ళే త్రోవ, సమయం, సిగ్నల్స్ వగైరాలు ఏర్పాట్లు చేసుకునే వాడు. మధ్యాహ్నం మా ట్రైను గూడూరు చేరినప్పుడు పెద్ద అల్లరి ఏదీ లేకుండానే మేము బండిదిగి రైల్వే హోటలుకు వెళ్ళి భోజనాలు చేశాము. అయితే, సాయంత్రం మేము విజయవాడ చేరేసరికి, పోలీసు వారికీ, మాకూ ఉన్న సౌజన్యం కొంత చెడింది. మేమున్న కంపార్టు మెంటులోకి భోజనాలు తేవడానికి సదుపాయాలు అక్కడ కనిపించ లేదు. మమ్మల్ని రైలు పెట్టెలనుంచి దిగవద్దంటాడు పోలీసు ఉద్యోగి. ప్లాట్‌ఫారంమీద నాలుగైదు వేలమంది ప్రజలు గుమిగూడారు. పోలీసు వారు, ప్రజలు ఒకరి నొకరు వెనక్కుతోసుకోవడంతో పెద్ద గలాటా బయలుదేరింది. మాలో కొందరికి భోజన సదుపాయాలు కలిగినవి. కాని, భోజనశాలకు దూరంగా ఉన్న మా కంపార్టుమెంటు, ప్రక్క కంపార్టుమెంటు వారికి ఆ సౌకర్యాలు కలగలేదు. మా కంపార్టు మెంటులో సత్యమూర్తి గారున్నారు. రైలు కదిలేసరికి, ఆయన "వీడెలా ముందుకు నడుస్తాడో చూస్తా"నని అలారం గొలుసు గట్టిగా లాగారు. ట్రైను ప్లాట్‌ఫారం విడవకుండానే ఆగిపోయింది. అప్పుడు రైల్వేలో పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసరుగా ఉన్న శర్మ అనే ఆయన మేమున్న కంపార్టుమెంటును—పోలీసు ఉద్యోగి వద్దంటున్నా వినక, భోజనాలశాలకు ఎదురుగా ఉండేటట్లు రైలును వెనక్కు నడిపించాడు. అప్పుడు అటూ ఇటూ పోలీసు సిబ్బంది నిలబడి, కార్డన్ (అడ్డు) కట్టగా, ఆ కార్డనులోనుంచి భోజనాలశాలకు వెళ్ళి, భోజనం చేయగలి గాము. ఆ రైల్వే ఆఫీసరు శర్మగారిని,ఇక్కడ సత్యమూర్తిగారిని— ప్రకాశంగారు అన్నదాతలని ప్రశంసించారు.

మరునాడు పది, పదకొండు గంటల వేళకు మేము నాగపూరు రైల్వేస్టేషనుకు చేరుకున్నాము. మేము నాగపూరు జెయిలులో పది

స్థితులు ఎలా ఉంటాయో, సౌకర్యాలు ఎలా ఉంటాయో అన్న చర్చలో పడ్డాము. అంతలో పెద్ద వర్షం వచ్చింది. మా సామానుల కోసం రెండు లారీలు, మేము కూచోడానికి రెండు బస్సులూ వచ్చాయి. రాదనుకొని బస్సుకప్పుపైన పెట్టిన సామానులు కొన్ని వర్షంలో బాగా తడిసిపోయినాయి. అవి తిరిగి సర్దేవరకు మేము కదలమన్నాము. చివరకు బయలుదేరిన బస్సులు నాగపూరు జెయిలు వైపు తిరుగలేదు. అవి ఎక్కడికి పోతున్నాయో ఎవరికి తెలియలేదు. పోలీసు ఉద్యోగులు అంతా, ఎంత అడిగినా తెలియదనే ఒక్కటే జవాబు చెప్పారు. చాలా నందుకు, అడపా దడపా వర్షపు చికాకు. ఎలాగైతే నేమి, రాత్రి పద కొండు, పన్నెండుగంటల వేళకు ఏదో జెయిలుగేటు చేరుకున్నాము. ఇది యే ఊరు అని అడిగితే, అంతదాకా తెలియదంటూ వచ్చిన సార్జెంటు మొదటిసారిగా ఆ మాట వదలి. 'అమరావతి' జెయిలన్నాడు. మే మక్కడికి ఏ రాత్రికైనా వస్తామన్న సంగతి అక్కడి జెయిలు అధికారులకు తప్పకుండా తెలిసే ఉండాలి కదా! అయినా, ఒక అర గంట వరకూ ఎవరూ కనిపించలేదు. వర్షపు తుంపరలలోనే మేమంతా ఉండవలసి వచ్చింది. మాలో- సత్యమూర్తిగారు వర్షంలో చేసిన ఈ ప్రయాణాన్ని తట్టుకోలేక పోయారు. దాంతో ఆయనకు తీవ్రంగా జబ్బుచేసింది. నెలా రెండు నెలలపాటు ఆ జబ్బు ఉద్ధృతమయ్యేసరికి, వారిని చెన్నపట్నం జెయిలుద్వారా అక్కడి జనరల్ ఆసుపత్రిలో చేర్చారు. పాపం, ఆయన అక్కడే స్వర్గస్థులయ్యారు. ఆ విధంగా బ్రిటిషువారి క్రౌర్యానికి ఆయన బలి అయిపోయారు.

ఈ అమరావతి జెయిలు వట్టి జిల్లా జెయిలు. అయినప్పటికీ దానికి రెండు ప్రాకారాలుండేవి. ప్రాకారపు గోడల ఎత్తు పదిహేను ఇరవై అడుగులకు తక్కువలేదు. లోపల, మా ముప్పైరెండు మందినీ ఒకచోట పెట్టడానికి విశాలమయిన భాగంకూడా లేదు. అందు చేత మాలో ఇరవై మందిని ఒక ఆవరణలోను, తక్కినవారిని మరొక ఆవరణలోను—ఎలెక్ట్రిక్ దీపాలుకూడా లేని జింకు కప్పులుగల

పాకలలో పెట్టారు. మర్నాడు లేచిన తర్వాత ఉన్నంత చోటులోనూ ఎలాగో సర్దుకున్నాము.

ఈ జైలుకు రాక పూర్వం, వేలూరు జైలులో ఉండగానే— కళా వెంకటరావు, నీలం సంజీవరెడ్డి, ఎం. పళ్ళంరాజు, ఎం. బాపినీడు మొదలైనవారు ఒక కట్టుగా ఉండి, ప్రకాశంగారికి ఏవైనా సౌకర్యాలు కలుగజేయాలనే విషయంపై ఎటువంటి ఆసక్తి చూపకపోవడమే కాకుండా, ఆయన ఏ సెల్లులో ఉంటానంటే, అది ఆయనకు ఇవ్వకుండా చేయడానికి కూడా ప్రయత్నించేవారు. అదే ద్వేషభావాన్ని వారు అమరావతి జైలుకుకూడా తమతోబాటు తీసుకువచ్చారు. గిరిగారు మాత్రం ఎలాగో జైలు ఉద్యోగస్థులతో మాట్లాడి, ప్రకాశంగారికి ఒక మూలగా, ఇతరుల బాధ లేనిచోట చోటు ఇప్పించారు. ప్రకాశంగారు వేలూరులోను, అమరావతిలోను కూడా తాను తెచ్చుకున్న మట్టి పాత్రలలో స్వయంగానే వండుకునేవారు. ఆయన ఇతరులతో సాంగత్యం అట్టే పెట్టుకోలేదు.

## 'ఆంధ్రా సర్క్యులర్'

ఇలా ఉంటూండగా, గాంధీజీ 'క్విట్ ఇండియా' ఉద్యమం పేరున బ్రహ్మాండమైన శాబటేజ్ ఉద్యమాన్ని నడిపిస్తున్నారని, దానికి తార్కాణంగా 'ఆంధ్రా సర్క్యులర్' అనేదానిని- మిగిలిన విషయాలు చాలా చేర్చి ఒక నేరారోపణ గ్రంథంగా అచ్చువేసి, మా అందరికి ప్రత్యేకమైన ఛార్జి షీట్లను పంపారు. ఇందులోని 'ఆంధ్ర సర్క్యులర్' అన్నది ఇదివరలో కళా వెంకటరావు నాకు బెజవాడ ప్లాట్‌ఫారం మీద చూపించిన కార్యక్రమమే అయిఉండెను. అయితే, అది ఆంధ్రా ప్రొవిన్షియల్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ యొక్క ఉత్తర శీర్షిక ఉన్న కాగితం (Letter-head) పైన రోనియోపైపు చేయబడి ఉండెను. అందుచేత, దానిని ఏ కాంగ్రెసు కమిటీ ఆదరించక పోయినా, ఆల్ ఇండియా వర్కింగ్ కమిటీ ముందు దాని ప్రసక్తే రాకపోయినా, దానికి 'ఆంధ్రా సర్క్యులర్' అనే ప్రఖ్యాతి మాత్రం వచ్చింది.

మా అందరికీ ఛార్జిషీట్లు వచ్చిన తర్వాత, ఎవరి యత్నంవల్లనో

తెలియదుగానీ—మేమంతా వాటికి ఏ జవాబు ఇవ్వాలో నిర్ణయించు కోడానికి ఒక చోట సమావేశమయ్యాము. అప్పటికింకా సత్యమూర్తి గారు ఉన్నారు. ఆ ఛార్జిషీట్లలోనివి చాలా మటుకు నిస్సారమయిన విషయాలే. అయినప్పటికీ, మేము వ్రాసేది ఏదీ విడుదలకోసం చేసే యత్నంలాగా ఉండకూడదు. వ్యక్తిగతంగా చెప్పిన వివరంలో ఏదైనా తప్పుంటే అది దిద్దవచ్చు. కాని, అది తప్పుకోడానికి చెప్పే జవాబు లాగా ఉండకూడదు. అందుచేత, మాలో చాలా మందిమి ఏ జవాబూ ఇవ్వక ఊరుకుందా మనుకున్నాము. అయితే, ప్రకాశంగారు మాత్రం ఆంధ్రా సర్క్యులర్ అనేది ఆంధ్రా ప్రొవిన్షియల్ వర్కింగ్ కమిటీ ఎన్నడూ ఇవ్వలేదనీ, ఇటువంటి ప్రోగ్రాం చర్చించడానికి ఆ కమిటీ అసలెన్నడూ సమావేశం కాలేదనీ వ్రాయవలసి వచ్చింది. ఈ విషయం మేము చేప్పేసరికి ప్రకాశంగారి మీద కళా వెంకటరావు విరుచుకు పడ్డాడు.

వెంకటరావు- తాను గాంధీ విధేయుడనీ, సత్యం తప్పనివాడనీ చెప్పి, 'ప్రకాశంగారు బందరు మీటింగు ప్రొసీడింగ్స్‌కి సంతకం పెట్టారా, లేదా?' అని కేకలు వేశాడు. బందరులో పట్టాభిగారింట జరిగిన సమావేశం వర్కింగ్ కమిటీ సమావేశం కాదనీ, ఏదో కొందరు మిత్రులు కలుసుకుంటారనీ తాను బెజవాడ ప్లాట్‌ఫారం మీద నాకు చెప్పిన విషయం మరిచిపోయాడు. తాను చూపించిన కాగితం గాంధీ గారి అనుజ్ఞక్రింద వ్రాసిందన్నమాట అసంభవమని ప్రకాశంగారు అడ్డు చెప్పిన మాట మరిచిపోయాడు. 'ప్రకాశంగారు ప్రొసీడింగ్స్‌కి సంతకం పెట్టారా, లేదా?' అని మరొక మారు అడిగాడు. "ఇన్‌ఫార్మల్ ప్రొసీడింగ్స్ వ్రాసిన కాగితం కాదుటయ్యా?" అని నే నడిగాను. "అది వర్కింగ్ కమిటీ మినిట్సు పుస్తకం" లోని కాగితం కానేకాదని జ్ఞాపకం చేశాను.

అసలు వెంకటరావు మనసులో ఈ భ్రమ కలగడానికి కారణం ఇది: బొంబాయి ఏ.ఐ.సి.సి. మీటింగు జరుగుతున్నప్పుడు తానే ఆంధ్రా ప్రొవిన్షియల్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ తాలూకు లెటర్‌హెడ్ల పైన

ప్రోగ్రామంతా రోనియో కాపీలు తీయించి, ఆంధ్రజిల్లాల కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులకు, కార్యదర్శులకు, ఆంధ్రనుంచి వచ్చిన ఏ.ఐ.సి.సి. సభ్యులకు కవరులో పెట్టి, చిరునామాలు వ్రాసి పోస్టుచేయ నారంభించాడు. నేను అతడు చేస్తున్న పనిచూసి, "ఇదేమిటయ్యా! మన వర్కింగ్ కమిటీగానీ, ఆల్ ఇండియా వర్కింగ్ కమిటీగానీ, పాస్ చేయని ప్రోగ్రాం ఎందుకు పంపిస్తున్నావు? డాక్టర్ పట్టాభిగారు వర్కింగ్ కమిటీలో ఈ ప్రోగ్రాం ఆలోచించలేదని మూడు నాలుగు రోజులుగా చెపుతూనే ఉన్నారు," అనగా, అందుకు వెంకటలావు, "వారెలాగా పాస్ చేస్తారు. పాస్ చేసిన తర్వాత నాకు ఈ ఉత్తరాలు పోస్టు చేయడానికి పైముండ" దన్నాడు.

ఈ విషయాలు అతనికి జైలులో జ్ఞాపకం చేసినపుడు, "ఏమో, నేను గాంధీ వాదిని," అన్నాడు. ఈ చర్చ అంతా జరుగుతూండగా— మాతో ఉన్న తమిళ, కేరళ, కన్నడిగ సత్యాగ్రహ సభ్యులు ఆశ్చర్య పోయారు. ఆ రోజున ఆ సమావేశంలో వచ్చిన వైషమ్యం వారి మధ్య ప్రాణాలు పోయేదాకా ఉండేది. ఆవేళ కళా వెంకటరావు చేసినది— ప్రకాశంగారి నాయకత్వాన్ని పడగొట్టడానికి ప్రథమ యత్నము.

ఈ ఆంధ్రా సర్క్యులర్ వ్యవహారంలో తర్వాతి ఘట్టం గాంధీ గారితో సంబంధించింది. ఆగాఖాన్ భవనంలో ఆయనతోబాటు, సరోజినీ నాయుడుగారుకూడా డెటిన్యూగా ఉండేవారు. అయితే, ఆమె ఆరోగ్యం చెడిపోవడంచేత, ఆవిడను తొందరగా విడుదల చేశారు. విడుదల అవుతున్న ఆవిడకు—ఆంధ్రా సర్క్యులర్ అనేది వర్కింగ్ కమిటీవారి యొక్కగాని, తనయొక్కగాని అనుజ్ఞపైన పుట్టిన కాగితం కాదని బహిరంగంగా చెప్పవలసిందని గాంధీజీ ఆదేశించారు. విడుదలకాగానే ఆమె అలా ప్రకటించారు. కాని, చాలామంది దానికి ప్రాముఖ్యమివ్వలేదు.

ప్రకాశంగారు అధ్యక్షులు గనుక, అది ఆంధ్రా కమిటీలో పుట్టలేదన్న మాట చెప్పక తప్పలేదు.

దీని తర్వాత ఘట్టం విజయవాడలో జరిగింది. 1945 లో

వర్కింగ్ కమిటీ మెంబర్లందరు విడుదలయిన తరువాత, బొంబాయిలో వర్కింగ్ కమిటీ సమావేశంలో పాల్గొని, డాక్టర్ పట్టాభిగారు విజయవాడ వచ్చారు. నేనుకూడా ఆ సమయానికి విజయవాడ వెళ్ళి ఉన్నాను. అక్కడ సాయంకాలం బహిరంగ సభలో ఆయన ఉపన్యసించారు. ఆ ఉపన్యాసంలో ఆంధ్రా సర్క్యులర్ అన్నది గాంధీగారి అనుజ్ఞపైనే తాను ప్రకటించినట్లు చెప్పి, పెద్దలే అన్నది కాదంటే తాను ఏమి చేయాలన్న ధోరణిలో మాట్లాడారు. అది మర్నాడు ఉదయం పేపర్లలో పెద్ద అక్షరాలలో పడింది.

ప్రకాశంగారు అదిచూచి, పట్టాభిగారిని కలుసుకొనేందుకు, వెంటనే విజయవాడ వచ్చారు. నేను ఆయనను కలుసుకొని, పట్టాభిగారు బందరు వెళ్ళినట్లు చెప్పగా, ఆయన వెంటనే బందరు వెళ్ళారు. పట్టాభిగారితో మాట్లాడి, పత్రికలలో పడ్డ విషయం సరైనదికాదని ఒక సవరణ స్టేట్మెంటు తీసుకువచ్చారు. ఆ ఉదయమే ఆయన, నేనూ గ్రాండ్ట్రంక్ ఎక్స్ప్రెస్‌లో వార్ధా వెళ్ళాము. మేము వార్ధా ఆశ్రమానికి వెళ్ళేసరికి చీకటి పడింది. గాంధీగారు తమ కుటీరం ముందుగా, నేలపైనే పక్కవేసుకుని పండుకొని ఉన్నారు.

ప్రకాశంగారు గాంధీగారికి నమస్కరించారు. వెంటనే గాంధీజీ ఆంధ్రా సర్క్యులర్ విషయమై ప్రసంగించారు. పట్టాభిగారి మాట తేగా, ఆయన ఉపన్యాసంపై వచ్చిన పత్రిక రిపోర్టు సరిగా లేదనీ, దానికి ఆయనే ఒక సవరణ ఇచ్చారనీ చెప్పి ప్రకాశంగారు తన జేబులోంచి పట్టాభిగారు ఇచ్చిన కాగితం గాంధీగారికి అందించబోతే, ఆయన "అసలు అన్నదానికన్న సవరణ మరింత అన్యాయంగా ఉన్న"దన్నారు. ఆ సవరణలో పట్టాభిగారు—ఆ కాగితంలో విషయాలు చర్చిస్తున్నపుడు గాంధీగారు, తక్కిన వర్కింగ్ కమిటీ మెంబర్లు ఎలా కూర్చున్నారో చెప్పడమే అందుకు కారణము. ఆయనదగ్గర మేము కూచున్నదల్లా నిమిషాలు—మహాత్మాజీ ఈ విషయంతప్ప మరొకటి మాట్లాడలేదు. అక్కడ కూచున్నంతసేపూ ప్రకాశంగారు పట్టాభిగారిని సమర్థిస్తూనే ఉన్నారు. ఎంత సమర్థించినా, గాంధీజీ విమర్శించడం మాన

లేదు. ఆ మర్నాడు ఉదయం (27-7-45 న) మేము ఆయన దగ్గర సెలవు పుచ్చుకొని బొంబాయి వెళ్ళాము. రమారమి ఉదయం తొమ్మి దిన్నర గంటలకు పటేలుగారిని చూడడానికి ఆయనఇంటికి పోయాము. మేము లోపలికి వెళ్ళి కూచున్నాము. కిటికీగుండా కొంత సూర్యరశ్మి మా మీద పడుతూంది. మేము కూచోగానే, పటేలుగారు చిన్న తుఫా నులా మాట్లాడడం ఆరంభించారు.

"ఏ మయింది పట్టాభికి? మతి చెడిందా?" అని పటేలుగారు ప్రశ్నించగా, ప్రకాశంగారు ఆయనతోగూడా పట్టాభిగారి ఉపన్యాసం పత్రికలలో సరిగా పడలేదని చెప్పి, పట్టాభిగారు పత్రికలకు సవరణ పంపిన సంగతి చెప్పారు. అందుకు పటేలుగారు, "మొదట బొమ్మ పగలగొట్టేశాడు. ఇపు డాయన సవరిస్తే ఏమిలాభం? మేము అహమ్మద్ నగరు కోటలో ఉండగా, మామీద ఛార్జిషీట్లు వచ్చినపుడు పట్టాభిగారిని అడిగితే—ఇది గాంధీగారితో చర్చించి, వర్కింగ్ కమిటీవారు కూడా చర్చించిన తరువాతే తాను ప్రోగ్రాం వ్రాసినట్టు వాదించాడు. దానిపైన, వర్కింగ్ కమిటీ మెంబర్లెవరూ ఇటువంటి చర్చ జరిగినట్టు తమకు జ్ఞాపకం లేదన్నారు. కాని, ఆయన అలా జరిగినదని చెప్తూ, అందరి జ్ఞాపక శక్తికన్నా తనదే మేలైనదని వాదించసాగాడు. ఆ రోజులు మమ్మలందర్ని దక్షిణాఫ్రికాకు రవాణా చేస్తారని కింవదంతులతో నిండినరోజులు. ఎన్నాళ్ళలా ఆ జెయిలులో కలిపి ఉండవలసి వస్తుందో తెలియదు. ఎందుకు పరస్పర భేదాభిప్రాయాలు పెంచుకోవాలని అప్పటి మటుకు ఆయనతో వాదించడం మానివేశాము. తరువాత జెయిళ్ళ లోంచి విడుదలయిన వెంటనే బొంబాయిలో వర్కింగ్ కమిటీ మీటింగు జరిగింది. ఆ మీటింగులో ఈ ప్రసక్తి మళ్ళీ వచ్చింది. పట్టాభిగారు తనమాట తనదేనని కూచున్నారు. పోనీ, ఎందుకయినా మంచిది గాంధీగారి అభిప్రాయం కనుక్కొందామని శంకరరావుదేవ్ గారిని ఆయన దగ్గరకు పంపడం జరిగింది.

గాంధీగారు ఆయనను 'పట్టాభే ఈ విధంగా చెప్పాడా?' అని ప్రశ్నిస్తే, ఆయన అవునని జవాబిచ్చాడట. దానిపై గాంధీగారు

'అయితే దైవమే శరణ్యం మన కందరికీ ఇటుపైన,' అన్నారట. తిరిగి వచ్చి శంకరరావుదేవ్‌గారు చెప్పిన మాటలు విని అందరమూ పట్టాభిగారు తన జ్ఞాపకశక్తిని కొంచెం సవరించుకోవలసిందని అన్నాము. "ఇంత జరిగిన తర్వాత విజయవాడలో ఆ విధమైన ఉపన్యాసం మతి ఉన్నవాడు చేయవలసిందేనా?" అని పటేలుగారు కఠోరంగా అన్నారు. అయితే, ప్రకాశంగారు పట్టాభిగారి మీది నింద తొలగించడానికి ఎంతయినా యత్నించారు. ఆ తరువాత కొంతసేపు ఇతర విషయాలు మాట్లాడి మేము బయలుదేరాము.

దీని తుది ఘట్టం - మహాత్మాగాంధీగారి 5-8-45 తేదీనాటి ప్రకటన. అందులో ఆంధ్రా సర్క్యులర్ పూర్వాపరాలు కొన్ని చర్చించి, చివర అది కాంగ్రెసు అనుమతిపైనగాని, తన అనుమతిపైన గాని ప్రకటింపబడలేదని ఆయన వక్కాణించారు.

ప్రకాశంగారు ఈ విషయంలో గాంధీగారి పేరు పోకుండా ఉండవలెననే తాపత్రియంతో ఉండేవారు. పట్టాభిగారు 20-7-45 న చేసిన ఒక పత్రికా ప్రకటనను బట్టి-ఆంధ్రా వర్కింగ్ కమిటీ అనుమతి లేకుండానే ఆ కాగితం "ఆంధ్రా సర్క్యులర్" పేర పుట్టిందని తెలిసింది. పట్టాభిగారు తమ ప్రకటనలో "నేను 14-7-1942 నాడు బందరులో ఆంధ్రా ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ మీటింగు సమావేశ పరిచాను. (ఆయన ఆంధ్రా ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు కాదు. బందరు ఆ కమిటీకి హెడ్డాఫీసూ కాదు.) 28 మంది కాంగ్రెస్‌వాదులు, ఆంధ్రదేశం నలుమూలలనుంచీ హాజరయారు. సర్క్యులరులో ఉన్న సూచనలన్నీ సమావేశం ముందుపెట్టాను. తరువాత బొంబాయిలో జరగబోయే ఆలిండియా కాంగ్రెస్‌కమిటీ సమావేశం తరువాత వాటిని అమలు చెయ్యాలని చెప్పాను," అన్నారు.

ఈ విధంగా ప్రకాశంగారిని త్రోసిరాజనడానికి వ్యక్తిసత్యాగ్రహం తర్వాత వెల్లూరు జైలులో వెంకటరావు, పట్టాభిగారు చేసుకున్న ఏర్పాటు ప్రకారంగా—అధ్యక్షులయిన ప్రకాశంగారికి తెలియకుండా కమిటీ మీటింగు అనడం, మాకు నోటీసు లేదేమని నావంటివాడు

అడిగితే, అది ఇన్‌ఫార్మల్ మీటింగు అనడం, మినిట్సు పుస్తకంతో సంబంధంలేని వేరే కాగితాంమీద ప్రొసీడింగ్స్ వ్రాయడం, ఆ ప్రొసీడింగ్స్‌లోనూ ఈ ఇన్‌స్ట్రక్షన్స్ విషయమై ఏ తీర్మానం లేకపోయినా, వాటిని కాంగ్రెస్ కమిటీ లెటర్ హెడ్డులపైన రోనియో కాపీ చేయించి, అధికారరీత్యా విడుదల అయినట్టు ప్రకటించడం, గాంధీగారికి సంబంధం లేకున్నా ఆయన పేరు దీనిలో కలపడం – ఇవన్నీ ఆంధ్ర రాజకీయాలలో పదవీవ్యామోహంతో, అసత్యమనే వాహనంపైన, అత్యాశాపరులు ఎంతదూరం పోగలరో చూపించేగలిగే తార్కాణాలు.

సవ్యమైన మార్గంలో ఏ పదవినైనా పొందడానికి ప్రయత్నించడం దోషంకాదు. కానీ, మార్గాలు వక్రమయితే రాజకీయాలు కలుషితమై, రాజకీయ జీవితాలను అప్రతిష్ఠ పాలు చేస్తాయి. ఈ విధమైన మార్గం, ఆంధ్రులను ఎక్కడికి తీసుకువెళ్ళినదీ తరువాతి అధ్యాయంలో వివరిస్తాను.

# 11

# 1946 లో రాష్ట్ర రాజకీయములు

ఆంధ్రప్రాంతంలో రాజకీయాల మాట కొంచెం ఆపి, అదే సమయంలోని తమిళ ప్రాంత రాజకీయాలను కొంచెం వివరిస్తాను. క్విట్ ఇండియా ఉద్యమంలో యావన్మంది కాంగ్రెసువాదులు జైళ్ళలోకి పోవడం, వారిలో కొందరు ఆస్తిపాస్తులను పోగొట్టుకోవడం జరిగిన సమయంలో—రాజాజీ పాకిస్థాన్ ప్రచారం చేయడం వల్ల, ఆయన పలుకుబడి సంపూర్ణంగా నశించింది.

1942లో ఆయన ఆ ప్రచారం ఆరంభించినపుడు, సత్యమూర్తిగారు కాంగ్రెస్ అధ్యక్షులయిన అజాద్‌గారికి, "రాజాజీపైన మీరు క్రమశిక్షణ చర్య ఎందుకు తీసుకోరు?" అని ఒక ఉత్తరం వ్రాశారు.

దానికి అజాద్‌గారు "ఆయనను వర్కింగ్‌కమిటీలోంచి బల

వంతంగా తొలగించేశాను,''* అని జవాబు వ్రాశారు. ఇది అయినతర్వాత ఆయన కాంగ్రెసు సభ్యత్వం పూర్తిగా వదలుకోవడంకూడా జరిగింది. ఆయన 'సన్‌డే అబ్జర్వర్' అనే పత్రిక సంపాదకునిమీద పరువునష్టం దావా తేవడం, అందులో- టి. అవినాశలింగంగారి డైరీలో రాజాజీ వ్యక్తిసత్యాగ్రహానికి వ్యతిరేకంగా ఇచ్చిన ఉపన్యాసాలప్రసక్తి సాక్ష్యంగా బయలుపడడం మొదలైన విషయాలు జరిగినవి. ఆ కారణంచేతా, అంతకుముందే సత్యమూర్తిగారు కారాగృహంలోఉన్న కాలంలోనే స్వర్గస్థులు కావడంచేతా, తమిళప్రాంతంలో సహజంగానే కాంగ్రెసు నాయకత్వం అంతరించింది. తరువాతి కోవలోఉన్న ఉపనాయకవర్గంలో ముఖ్యుడు కామరాజ నాడారుగారు. కాంగ్రెస్ సంస్థ ఆయన చేతిలోకి వెళ్ళింది. అయితే, చెన్నరాష్ట్రాని కంతటికీ నాయకత్వం వహించడానికి తన శక్తి పరిమితమైనదని తెలుసుకొని, ఆయన- ప్రకాశంగారికి నాయకత్వం అప్పజెప్పడానికి నిర్ణయించుకొన్నాడు. అయితే, ఇది జనరల్ ఎన్నికల తరువాత జరుగవలసిన విషయము.

ఈలోపున విధి బలీయమైనదని మరొకమారు ఋజువయినది. పైనచెప్పిన విషయాలవల్ల, రాజాజీకి తిరిగి కాంగ్రెసులో ఎటువంటి స్థానముగాని లభిస్తుందని ఎవరూ అనుకోలేదు. ఆయన, కాంగ్రెసులో తిరిగి సభ్యుడుగా చేరుదామంటే తమిళప్రాంత కాంగ్రెస్ కమిటీ వారెవ్వరూ అందుకు అంగీకరించలేదు. అంతవరకు, మానవప్రకృతి ప్రకారంగా జరిగింది. గాంధీ గారి ప్రకృతి వేరు. రాజాజీతో ఆయనకున్న సంబంధమే వేరు. అందుచేత, ఆయన ప్రోద్బలంవల్ల కాంగ్రెసు సాలుసరి చందా నాలుగు అణాలు—ఢిల్లీలో, కాంగ్రెసు అధ్యక్షులయిన అజాద్‌గారు (1942 లో బలవంతంగా రాజాజీని కాంగ్రెసునుంచి తొలగించిన అజాద్‌గారే) పుచ్చుకొని, రాజాజీని కాంగ్రెసు సభ్యునిగా చేర్చుకున్నారు.

---

* "I forced him out of the working committee."

1946 లో జనరల్ ఎన్నికలు రానున్నవి. అందుచేత రాజాజీ పైన చెప్పిన సభ్యత్వాన్ని పురస్కరించుకొని తమిళప్రాంతంలో తన వర్గాన్ని బలపరచుకొనడానికి గట్టియత్నం చేశారు. ఇంతకు కొంచెం ముందు, ఎన్నికల తర్వాతి విషయాలకు సంబంధించిన విషయం ఒకటి జరిగింది. కాంగ్రెస్‌వారు తిరిగీ ప్రభుత్వాలు చేపడితే పాత ముఖ్య మంత్రులే తిరిగి ముఖ్యమంత్రులు కాగలరనీ, చెన్నరాష్ట్రంలోకూడా ఆ సూత్రమే వర్తించగలదనీ గాంధీగారంటూ వచ్చారట. ఇదికూడా రాజాజీకి కొంత బలమిచ్చింది. కాని, అందుచేతనే ఆయన యెడల కామరాజ్ నాడారుగారి వ్యతిరేకతకూడా హెచ్చయింది. కనుక రాజాజీకి, నాడారుగారికి—ఈ విషయంలో ఒక రాజీమార్గం కుదిర్చి, రాజాజీకి అగ్రస్థానం కల్పించాలన్న గాంధీగారి సంకల్పాన్ననుసరించి కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారు యత్నించసాగారు.

ఆ సమయంలో అంతవరకు జరిగిన పరిస్థితుల కనుగుణంగా ప్రకాశంగారు, కామరాజ్ నాడారుగారికి తమ సంపూర్ణమయిన మద్దతు ఇచ్చారు. తాను రెవిన్యూమంత్రిగా—జమీందారీ ఎంక్వయిరీ కమిటీ నివేదిక రచించిన ఉత్తమ పురుషునిగా సంపాదించిన పేరు ప్రతిష్ఠల బలంతో దక్షిణ జిల్లాలలో పర్యటించి, నాడారుగారికి చెప్పుకోదగ్గ సహాయం చేశారు.

కాంగ్రెస్ అధిష్ఠానవర్గంవారు, తమలో ఒకరైన అసఫ్ అలీ గారిని* చెన్నపట్నం పంపించారు. రాబోయే ఎన్నికలలో రాజాజీకి గౌరవస్థానం కల్పించడం ఆయన సంకల్పము. చివరకు ఏలాగుననో నాలుగోవంతుకు పైగా, మూడోవంతుకు కొంత తక్కువగా స్థానాలు మాత్రమే—ఆయన వర్గంవారికి ఇవ్వడానికి ఏర్పాటయింది.

రాజాజీని తగ్గించిన ఈ ఏర్పాట్లు, గాంధీగారి మనసుకు ఏమీ సంతృప్తి నిచ్చినట్టు కనిపించదు. కామరాజ్, ప్రకాశంగార్ల మధ్య స్నేహం కుదరడం రాజాజీ భవిష్యత్తుకు భంగకరం కాబట్టి ఆయనకు అది కూడా నచ్చలేదు. రాజాజీపైన ప్రేమ ఉండడాన్ని సమర్థించవచ్చు.

* ఈయన తరువాత ఒరిస్సాకు గవర్నరుగా పనిచేశారు.

కాని, అది—రాజకీయంగా ప్రకాశంగారిపైన కోపంగా మారి, ఆయన అద్వితీయమైన త్యాగచరిత్రను గూడా మరపుకు తెచ్చేంత గాఢంగా ప్రబలింది.

విధి బలీయమై రాజాజీని ముందుకు తీసుకువెళ్ళింది. ఆ విధియే అంతకన్న బలీయమై, ప్రకాశంగారిని వెనక్కు—త్రోసుకు వెళ్ళింది.

## గాంధీగారి చెన్నరాష్ట్ర పర్యటనము

ఒరిస్సా ప్రాంతంలో పర్యటించిన గాంధీగారు ఆంధ్ర జిల్లాల మీదుగా, దక్షిణ భారత హిందీ ప్రచార సభ రజతోత్సవ సందర్భంగా చెన్నపట్నానికి వెళ్ళారు. అలా వెళుతూండగా జరిగిన చరిత్ర, ఆంధ్ర దేశ చరిత్ర స్వరూపాన్ని నూతనంగా రూపొందించింది. క్విట్ ఇండియా ఉద్యమం తర్వాత, ఆంధ్రా కాంగ్రెస్ కమిటీకి క్రొత్త ఎన్నికలు జరగలేదు. పూర్వంలోవలెనే కళా వెంకటరావుగారే కార్యదర్శులుగా ఉండిరి. గాంధీగారు ప్రయాణం చేసే రైలుబండి ఆంధ్రదేశం లోకి వచ్చేసరికే ఆయనకు స్వాగతం ఇవ్వడానికి వెంకటరావుగారు బరంపురంవరకూ వెళ్ళి, ఆయన ఉన్న స్పెషల్ కంపార్ట్‌మెంటులో ఎక్కారు.

ఇదివరలో వ్రాసినదానిని బట్టి, ఆంధ్ర ప్రాంత కాంగ్రెస్ కమిటీలో, పట్టాభిగారి నాయకత్వాన్ని పురస్కరించుకొని ఒక చిన్న వర్గం, ఒక చిన్న పాయగా నడుస్తున్న విషయం అందరికీ తెలిసిందే. దానికి, చేత బల్లెము పట్టుకొని ముందుకు నడిచే దళ నాయకుడుగా వెంకటరావుగారు ఉండడాన్ని చదువరులు గ్రహించియే ఉంటారు.

విశాఖపట్నం స్టేషనులో నేను గాంధీగారిని ఆహ్వానించాను. ఆయన రైల్వేస్టేషన్ ఆవరణలోనే ఉపన్యసించి, తమ కంపార్ట్‌మెంటులోకి వెళ్ళిపోయారు. ఆ మధ్యాహ్నం మరొక మెయిలు బండికి కలపడానికి దానిని వాల్తేరు స్టేషనునుంచి ఐదారు మైళ్ళ దూరంగా, జన సంబంధంలేని స్థలంలో నిలబెట్టారు. ఆయన స్నానపానభోజనాదులు ఆ కంపార్ట్‌మెంటులోనే ఏర్పాటయి ఉండెను. (అది ఒక మూడవ తరగతి

కంపార్ట్‌మెంటు.) అంతవరకు వెంకటరావుగారు, గాంధీగారితో ఏమి మాట్లాడారో మాకు తెలియదు.

## ఆంధ్రదేశంలో తుఫాను

ఇక్కడ మరొక విషయం వివరించాలి. ప్రకాశంగారూ, మిగిలిన కాంగ్రెసువారమూ క్విట్ ఇండియా ఉద్యమ ఫలితమైన కారాగృహ నిర్బంధంనుండి విముక్తులమయిన తర్వాత, ఆంధ్రదేశంలో—శ్రీకాకుళం జిల్లా మొదలుకొని బందరు వరకు ఒక బ్రహ్మాండమయిన తుఫాను, ప్రచండమైన వాయువుతో కూడి చెలరేగడంవల్ల ఆ ప్రాంతాలలో పర్యటించడం అవసరమయింది.

ఆ తుఫానులో తోటలు గట్టిగా దెబ్బ తిన్నవి. శ్రీకాకుళంజిల్లా ఉద్దానంలోను, తూర్పు గోదావరిజిల్లా మధ్య డెల్టా భాగంలోను, ఈ రెండింటి మధ్యగల ప్రాంతంలోను కొబ్బరి చెట్లు భారత యుద్ధంలో హతులైన సైనికులవలె ఎక్కడివక్కడ నిర్మూలములయి, భూదేవతకు సాష్టాంగంగా నమస్కరిస్తున్నట్లు పడిపోయాయి. వేలాది అరటిచెట్లు దాదాపు అన్ని జిల్లాలలోను గెలలతో సహా ఒకదానిమీద ఒకటిగా నేల వాలినాయి. అదేవిధంగా, ముఖ్యంగా పశ్చిమ గోదావరి, కృష్ణా జిల్లాలలో నారింజ, నిమ్మ, బత్తాయి తోటలు పడిపోయినాయి. డెల్టా చివరి భాగాలలో ఎక్కడి నీరు అక్కడ నిలిచిపోయి, పెరుగుదలకు వస్తున్న పంటలు మునిగిపోయాయి. ఈ తుఫానువల్ల కలిగిన జలప్రళయానికి పశువులు కొన్ని, మనుష్యులు కొందరూ బలి కావడంకూడా జరిగింది. కొన్ని కొన్ని చిన్న గ్రామాలు - ద్వీపాలుగా మారి, అక్కడ ప్రజలు రెండు మూడు దినాలు ఏ విధమైన సహాయమూ అందక, ఆకాశం వైపు చూస్తూ నిరాహారులై ఉండవలసిన పరిస్థితులు కూడా కలిగాయి.

ఇది సంభవించినపుడు ప్రకాశంగారు, ఇచ్ఛాపురం మొదలు బందరు వరకు—కారుమీద, కాలినడకను, రెండెడ్ల బండిమీద-ఎక్కడ ఏలాగు అవసరమైతే ఆలాగు ప్రయాణం చేశారు. వీరి పర్యటనలో తుఫాను బాధితుల సహాయార్థం డబ్బు వసూలు చేశారు; పంచిపెట్టారు. మిగిలిన కొంత ఆంధ్రా సైక్లోన్ రిలీఫ్ నిధి అనే అకౌంటున ఆంధ్రా

బ్యాంకులో జమ కట్టారు. అందులోనుంచి డబ్బు తీయడానికి కోశాధికారి అయిన గుంటూరు నరసింహారావుగారికి అధికారం ఇవ్వడం జరిగింది.

ఇది ఇలా ఉంటుండగా, విడుదలయిన వెంటనే ప్రకాశంగారు రాష్ట్రం అంతటా పర్యటించారు. ఆ పర్యటనలో ఏవో ఒకటి రెండు జిల్లాలు తప్ప, తక్కిన జిల్లా లన్నిటి పర్యటనలోను నేను ఆయన వెంట ఉన్నాను. శ్రీకాకుళం జిల్లాకు మేము వెళ్ళినపుడు—జైలులోంచి విముక్తులయిన స్వాతంత్ర్య యోధులను, వారి కుటుంబాలను; ఉద్యమ సమయంలో అండర్‌గ్రౌండు అయిపోయి, అజ్ఞాతంగా ఉండి ఉద్యమం నడిపించినవారిని సందర్శించడం మా ముఖ్యోద్దేశము.

అయినా సభల్లో కొందరు చిన్న చిన్న కవర్లలో డబ్బు తెచ్చి మా చేతుల్లో పెట్టడం మొదలు పెట్టారు. మాటల సందర్భంలో, "ప్రకాశంగారు తనుకున్న లక్షలన్నీ స్వాతంత్ర్య ఉద్యమ యజ్ఞంలో ఆహుతి చేసేశారు. వారికి, నిత్య జీవితయాత్ర నడవడానికి ధనం అవసరం కాబట్టి, ఇది దానికి వినియోగించండి," అని నాతో చెప్పేవారు. కొందరు ఏమీ చెప్పకుండానే చేతిలో డబ్బు పెట్టేసేవారు. ఈ పర్యటన సమయంలో, కొందరు కారాగృహ విముక్తులు, అజ్ఞాత ప్రచారకులు వచ్చి, ప్రకాశంగారితో తమ బాధ చెప్పుకోవడం తటస్థించేది. వెంటనే ప్రకాశంగారు—డబ్బు, వారి చేతిలో ఉన్నా, నా చేతిలో ఉన్నా తీసి వారి కిచ్చేసేవారు. ఈ ఇచ్చినవానిలో ఆయన వ్యక్తిగతమైన ఉపయోగాలకని చెప్పి ఇచ్చిన ధనమూ ఉందేది. ఏదీ నిర్దేశించకుండా ఇచ్చిన డబ్బూ ఉండేది. మేము శ్రీకాకుళంజిల్లా, విశాఖజిల్లా ఉత్తర భాగాలలోను పర్యటించి విశాఖపట్నం తిరిగి వచ్చి, రైలులో అనకాపల్లికి బయలుదేరుదామనే సరికి, ప్రకాశంగారికి ఇచ్చినదంతా పైన చెప్పిన విధంగా సంపూర్ణంగా ఖర్చయిపోయింది.

అప్పుడు నాకు, మరి కొందరు మిత్రులకు- ఇలా జరిగినట్లయితే ప్రకాశంగారికి స్వంత వినియోగంకోసం అభిమానులు ఇచ్చిన డబ్బు

కూడా మిగలదనీ, తిరిగి వారు చెన్నపట్నం చేరిన తర్వాత, ఏ రోజు వ్యవహారం ఆ రోజున ఎలాగో నడిపించుకోవలసి వస్తుందనీ గుర్తుకు వచ్చి, ఒక ఏర్పాటు చేశాము. ధన మిచ్చేవారు ప్రత్యేకంగా ప్రకాశం గారి వ్యక్తిగత ఉపయోగ నిమిత్తమని ఇవ్వదలచితే, ఆ విధంగా వ్రాసి ఒక కవరులో పెట్టి, వేరేగా ఇవ్వవలసిందని ఏర్పాటు చేశాము. ఆ విధంగా ఎక్కడో మేము చెప్పడం మరచిపోయినచోట తప్ప, మిగతా అన్నిచోట్లా ప్రజలు—సభలలో ఆ విధంగానే వ్రాతమూలకం గానో, వ్రాయడానికి వీలులేని సమయాలలో నోటిమాటగానో చెప్పి డబ్బు ఇచ్చేవారు. ఆ విధంగా ప్రత్యేకించి చెప్పకుండా డబ్బు మాత్రం ప్రత్యేకంగా ఉంచేవారు. అది చాలా కొంచెం మొత్తంగా ఉండేది. కాని మేము ఎక్కడా డబ్బు ఇవ్వవలసిందని—బహిరంగంగాగాని, రహస్యంగాగాని విజ్ఞప్తి చేయలేదు. అయితే, ప్రకాశంగారు మాత్రం తన జీవితం, బాధపడే ప్రచారకుల జీవితంకంటే వేరుకాదని, తనకు ఏర్పాటయిన డబ్బుకూడా తీసి, ప్రచారకులో, వారి కుటుంబంవారో ఎదురైనపుడు లెక్కా జమా లేకుండానే ఇచ్చేసేవారు.

ఇచ్చినదంతా ఇచ్చివేయగా, ఆయనకు ఇచ్చినదానిలో యాభై వేల రూపాయలు మిగలడం జరిగింది. మేము మొదట ఆ డబ్బు బాంకులో వేసి, ఆయనకు నియామకంగా ప్రతినెలా వేయిరూపాయల చొప్పున అందేటట్టు ఏర్పాటు చేద్దామనుకున్నాము. అయితే, స్వరాజ్య కంపెనీ తీర్చవలసిన బాకీ ఇంకా ఉంటూండగా ఈ డబ్బు ప్రత్యేకంగా బాంకులో వేయడం భావ్యం కాదనీ, తమ నిత్య జీవనంకోసం మేమంతా ఎటువంటి ప్రయాసా పడవద్దనీ, ఆ బాధ్యత ప్రజలు చూసుకుంటారనీ ఆయన చెప్పడంతో మేము చేయదలచుకున్న యత్నం వదులుకున్నాము.

## గాంధీగారి ప్రమేయము

తరువాత జరిగిన విషయాలనుబట్టి—కళా వెంకటరావుగారు, గాంధీగారితో రైలులో కలిసి ప్రయాణం చేసిన సమయంలో ఈ యాభై వేల రూపాయల విషయమై ఒక విపరీతార్థం కలిగేటట్టు ఆయ

నతో చెప్పినట్టు, అది సాకుగా చేసుకుని ఆయన ప్రకాశంగారిని నాయకత్వం వహించనీయకుండా చేయాలని యత్నించ సాగినట్టు అర్థమైంది. అది వివరించే ముందు మరొక విషయం చెప్పాలి.

హిందీ ప్రచారసభ రజతోత్సవము

గాంధీగారు చెన్నపట్నం చేరుకున్నారు. ఆయన చెన్నపట్నం రావడానికి పైన పేర్కొన్న ఉత్సవం కారణమని ఇదివరలో చెప్పడమయింది.

1921 లో ఆయన సహాయ నిరాకరణోద్యమం ప్రారంభించినపుడు, దేశంలో ఇంగ్లీషుకు బదులు హిందీ అంతర్రాష్ట్రీయ భాషగా పరిణమించాలని ఉద్దేశించారు. దాని ప్రకారం, చెన్నపట్నంలో దాక్షిణాత్యులందరికీ ఉపయోగపడేటట్టు మోటూరి సత్యనారాయణగారు ఈ ప్రచార సభను 1921 లో, మరి కొందరు పెద్దల సాయంతో ప్రారంభించారు. 1946 నాటికి వందలకొద్ది విద్యార్థులు హిందీలో శిరోమణి పరీక్షవరకు కూడా ఉత్తీర్ణులయ్యారు. ఆ సభ అప్పటికి పెద్ద భవనాలు కట్టుకోగలిగింది. ప్రచార సభలో ఆచార్యులుగా ఉండేవారికి వసతి భవనాలు కూడా కట్టుకోగలిగింది. చెన్నపట్నంలో త్యాగరాయనగర భాగంలో ప్రాముఖ్యం సంపాదించుకొన్నది.

ఈ కార్యకలాపాల మూలంగా సత్యనారాయణగారు—రాజాజీకి, గాంధీజీకి సన్నిహితులలో ఒకరుగా ఉండేవారు. ఆ కారణం చేతనే గాంధీగారు ఈ రజతోత్సవానికి తప్పకుండా హాజరయ్యారు. కొన్ని వేలమంది ఆ సభకు హాజరయ్యారు. గాంధీగారు కొంచెం అప్రస్తుతంగా—రాజాజీకి, దానికీ సంబంధం ఉండడంవల్లనే అన్నివేలమంది సభకు హాజరయ్యారని ఆయన అన్నారు. అనంగీకార సూచకంగా సభలో నవ్వులు, గుసగుసలు బయలుదేరాయి.

గాంధీగారు అంతటితో ఊరుకోక, చెన్నపట్నంలో ఒక ముఠా* బయలుదేరి, రాజాజీకి వ్యతిరేకంగా అల్లరి చేస్తున్నారని అన్నారు.

---

* గాంధీగారు ఇంగ్లీషులో వాడినది—'క్లిక్' (Clique) అనే పదము.

బాంధవ్య ప్రభావం కలిగినపుడు ప్రస్తుతాప్రస్తుతములు పాటింపుకు రావు గదా! సభలోని వ్యతిరేకత మరింత స్ఫుటమయింది. ఒకరిద్దరు, "ఇది రజతోత్సవ సభా? లేక రాజాజీపక్ష ప్రచార సభా?" అని కేకలు వేయడం మొదలుపెట్టారు. ప్రత్యేకంగా, అల్లరులు ఏవీ కాలేదుగాని, మహాత్మాగాంధీని ఆ విధంగా ఎదిరించేందుకు అదే ప్రథమ అనుభవము. బహుశా, అదే చివరిదీ అనుకుంటాను.

వయసులోను, అనుభవంలోను తమకన్న చిన్నవారైన నాడార్ గారిని 'క్లిక్' నాయకుని క్రింద గాంధీగారు సూచించిన దానిని ఖండించే బాధ్యత తమపై వేసుకొన్న ప్రకాశంగారు గాంధీగారిని రెండు మూడు చోట్ల విమర్శించారు. ఇటువంటి ఖండన న్యాయమైనా, గాంధీగారిని బాధించే ఉంటుంది. ఈ కారణాలనే సమిధలతో గాంధీగారి కోపం రగుల్కొని, మూడు నెలల తర్వాత ప్రకాశంగారి పైన తమ ప్రభావాన్ని, తీక్ష్ణతను చూపించాయి.

అంతకు ముందు జరిగిన చరిత్ర ముందుగా వివరించాలి.

# 12

# 1946 ఎన్నికలు - రాష్ట్రనాయకత్వ వివాదము

1946 లో అనుకున్న ప్రకారమే ప్రపంచ మహా యుద్ధం అంతం కావడంవల్ల దేశంలోగల రాష్ట్రాలన్నిటిలో గవర్న మెంట్ ఆఫ్ ఇండియా 1935 ఆక్టు ననుసరించి ఎన్నికలు జరిగాయి. తెలుగు ప్రాంతంలో హెచ్చయిన తగాదాలేవీ లేకుండా అభ్యర్థులను నిర్ణయించగలిగాము. తమిళ ప్రాంతంలో—ఇదివరలో చెప్పినట్టు, అసఫ్ అలీ వగైరాలు చేసిన ఏర్పాటు మేరకు రాజాజీ వర్గంవారు, తక్కినచోట్ల కామరాజ్‌వర్గంవారు అభ్యర్థులుగా నిలుచున్నారు. చెన్న రాష్ట్రంలో గల నాలుగు భాషల ప్రాంతాలలోను, ఏవో రెండు ప్రత్యేక నియోజకవర్గాలలో తప్ప, తక్కిన అన్నిచోట్లా కాంగ్రెసు అభ్యర్థులే

సంపూర్ణంగా విజయం సాధించారు. ముస్లిమ్‌లీగుకు ఏర్పాటయిన స్థలాలను వారే గెలుచుకున్నారు. నూట నలభై యారు నియోజక వర్గాలలో పై చెప్పినట్టు కాంగ్రెసువారే గెలుచుకున్నారు.

ఆంధ్రా ప్రొవిన్షియల్ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులయిన ప్రకాశం గారూ, తమిళ ప్రాంత కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు కామరాజ్‌నాడారు గారూ, కేరళ కాంగ్రెస్ కమిటీ అధ్యక్షులు కె. మాధవమేనోన్‌గారూ అప్పటికి కలసి మెలసి ఏకంగా ఉండేవారు.

ఎన్నికల తరువాత కాంగ్రెసు శాసన సభ్యులు తమ నాయకుని, అనగా కాబోయే ముఖ్యమంత్రిని ఎన్నుకోవలసిన ఘట్టం వచ్చింది. లోగడ 1939 లో కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా చేసినపుడు, అవసరమైతే శాసన సభ్యులను సమావేశ పరచడానికి కన్వీనరుగా నియమింపబడిన మాజీ పార్లమెంటరీ కార్యదర్శి భక్తవత్సలంగారు, పై ముగ్గురు కాంగ్రెస్ కమిటీల అధ్యక్షుల అనుమతితో, ఏప్రిల్ 7 న హిందీ ప్రచార సభ హాలులో కాంగ్రెసు శాసన సభ్యుల సమావేశం జరుగుతుందని నోటీసిచ్చారు.

ఈ లోపున, నలుగురు కాంగ్రెసువాదులు చెన్నరాష్ట్ర శాసన సభా నాయకత్వ విషయమై సర్దార్ వల్లభాయి పటేల్‌గారితో చెప్పుకోడానికి బొంబాయి బయలుదేరారు. ఆ నలుగురూ ఆంధ్రులే. ఈ వార్త పత్రికలలో చూసి, నేను ఒక ప్రకటన చేశాను. అందులో "పై విధంగా నలుగురు ఆంధ్రులు పటేలుగారి దగ్గరికి వ్యక్తిగతంగా వెళ్ళి ఉండాలి. ఆంధ్ర ప్రాంత శాసన సభ్యులకు వారెంత మాత్రమూ ప్రతినిధులు కానేరరు. చెన్నరాష్ట్ర శాసన సభ్యులకు స్వేచ్ఛగా తమ నాయకుని ఎన్నుకొనే హక్కుంది. పరోక్షంగాగాని, అపరోక్షంగాగాని ఎవరైనా వారిని నిర్బంధిస్తే, వారి హక్కులకు భంగం కలుతుంది," అని పేర్కొన్నాను. ఇలా ప్రకటించినట్టు నేను ప్రకాశంగారికి చెప్పలేదు.

ఇక్కడి నాయకత్వానికి భంగం కలిగించేందుకు నలుగురు ఆంధ్రులు పటేలుగారి దగ్గరికి వెళ్ళినట్టు వార్త తెలిసేసరికి, వాతావరణంలో ఒక ఉద్రిక్తత ఉద్భవించింది. రాష్ట్రం నాలుగు మూలలనుంచి

ప్రకాశంగారిని నాయకుడుగా ఎన్నుకోవలెననే తీర్మానాలతో, జిల్లా కాంగ్రెసు సంఘాలు తమ ఆమోదాన్ని ప్రకటించాయి. అలాగునే కొన్ని కార్మిక సంఘాలు, ఉపాధ్యాయ సంఘాలు కూడా ప్రకాశంగారికి శాసన సభ నాయకత్వం అప్పజెప్పాలన్న తీర్మానాలు చేసి ప్రకటించాయి.

## అడుగడుగునా అడ్డంకులు

ఇలా ఉంటుండగా, ఏప్రిల్ 6 న కాంగ్రెసు అధ్యక్షులయిన మౌలానా అబుల్ కలాం అజాద్‌గారినుంచి, ఏప్రిల్ 7 నాటి సభ అప్పుడల చేయమనీ; ఆంధ్ర తమిళ కేరళ కాంగ్రెస్ కమిటీల అధ్యక్షులు ఢిల్లీలో తమ్ము కలుసుకోవలసిందనీ—తంతివార్త వచ్చింది. ప్రజా రాజ్యానికి మొట్టమొదటి మెట్టులోనే హంసపాదు వచ్చింది. ప్రజా రాజ్యం కావాలనే సంస్థ ఈ విధంగా నూతన కార్యపద్ధతిని ప్రారంభించింది. "ఇది చాలా తప్పు. మనం ఢిల్లీ వెళ్ళగూడ"దని నేను ప్రకటించాను. కాని, చెన్నరాష్ట్రంలో ఇతర భాషా ప్రాంతీయులైన కాంగ్రెసువాదు లుండడంచేతా; వారు మంచి అయినా, చెడు అయినా కూడా కాంగ్రెసు అధిష్ఠాన వర్గాన్ని ఎదుర్కొనే లక్షణం లేనివారు కావడంచేతా; వారితో కలయిక అవసరమూ, కార్యసిద్ధికి మార్గమూ కావడంచేతా ప్రకాశంగారు కూడా మెత్తబడ్డారు.

ఏప్రిల్ 7 న ఆంధ్ర ప్రాంత కాంగ్రెసు శాసన సభ్యులందరు త్యాగరాయనగరులో సమావేశమయ్యారు. ప్రకాశంగారు—అజాద్‌గారి నుంచి వచ్చిన తంతి విషయం ముచ్చటించి, ఆ తంతిలోని ఆదేశాన్ని పటేల్‌గారు కూడా అంగీకరించి ఉన్నారని చెప్పి, ఇంకా ఇలా అన్నారు:

"ఉత్తర ప్రత్యుత్తరాల మూలంగా కన్నా, ముఖాముఖి ఇటువంటి విషయాలు తేల్చుకోవడం మంచిది. భేదాభిప్రాయా లన్నవి ప్రపంచంలో గల అన్ని సంస్థలలోను వస్తూంటాయి. అలాగే, మన చెన్నరాష్ట్రంలో కూడా వచ్చాయి. మానవ సంఘంలో ఇలాంటివి తప్పవు. అయితే, వాటిని సర్దుబాటు చేసుకోవడమన్నది ప్రాజ్ఞుల లక్షణము. ఆంధ్రుల మధ్య, ఇదివరలో పరస్పర భేదాభిప్రాయాలు అనేకసారులు వచ్చాయి.

అవి సర్దుకుంటూ వచ్చాము. ఇప్పుడు కూడా మనము ఏకమై ఉండాలి. ఈ తంతి పంపినది అజాదుగారయినా, నిజానికి ఈ పిలుపు మహాత్మాజీ దగ్గరనుంచి వచ్చిందని భావించాలి. అందు చేత, మన మీ కార్యాన్ని సర్దుకొనేందుకు కొంత గడువు తీసుకొని, తిరిగి 15 వ తేదీన సమావేశ మౌదాము.''

ఢిల్లీలో గాంధీగారివద్ద...

కథా రంగం చెన్నపట్నం హిందీ ప్రచార సభా మందిరంనుంచి ఢిల్లీలో భంగికాలనీకి మారింది. ఇక్కడి కాంగ్రెసు అధ్యక్షులు ముగ్గురూ గాంధీగారిని సందర్శించడానికి భంగికాలనీకి వెళ్ళారు. వెళ్ళిన క్షణం నుంచి వారు గాంధీగారి నోటివెంట విన్నది ఒక్కటే మాట. అది—

''మీరు రాజాజీని నాయకునిగా ఎన్నుకోవలసింది. ఎన్నుకోండి!''

లోగడ, దక్షిణ భారత హిందీ ప్రచార సభ రజతోత్సవ సభలో, ఆయన రాజాజీ ప్రసక్తి తీసుకురాగా, సభలో ఎవరో లేచి - ''మీరు రాజాజీని ముఖ్యమంత్రి చేయడం కోసమే ఇప్పుడిక్కడికి వచ్చి ఉన్నారా?'' అని గట్టిగా అడిగారు. దానికి జవాబుగా గాంధీగారు, ''ఆ పనికైతే నేనింత దూరం రావలెనా? తలచుకొంటే ఢిల్లీలోనే ఒక క్షణంలో ఆ పని చేయగలను,'' అని అన్నారు. ప్రశ్న, జవాబూ అప్పటి పత్రికలలో పెద్ద అక్షరాలలో పడినాయి. భంగికాలనీలో ఆయన రాజాజీని ఎన్నుకోమని చెప్పిన మాటను, హిందీ ప్రచార సభలో చెప్పిన మాటను మనము సమన్వయించుకోవచ్చు.

కాంగ్రెసు అధ్యక్షులు ముగ్గురితోనూ రాజాజీని ఎన్నుకోమని గాంధీజీ చెప్పగా, కామరాజ్‌గారు 'అది కుదర'దని వెంటనే తమిళంలో చెప్పారు. మాధవ మేనోన్‌గారు దాన్ని ఇంగ్లీషులోకి అనువదించారు. అయినా, మహాత్మాజీ అంతటితో ఊరుకోలేదు. చెన్నపట్నం వెళ్ళి, శాసన సభ్యుల సమావేశంలో రాజాజీ పేరు ఒక్కటే ప్రతిపాదించి, అందుకు అనుకూల, ప్రతికూల సభ్యుల సంఖ్యలను తమకు తెలియ జేయవలసిందనీ; మిగిలిన కార్యక్రమం తరువాత నిశ్చయింపవచ్చునీ ఆయన ఆదేశించారు.

ప్రజారాజ్యపు అధిష్ఠాన దేవత ఒక్క చిరునవ్వు నవ్వింది.

## శాసన సభ్యుల సమావేశము

ఏప్రిల్ 18 న తిరిగి శాసన సభ్యులందరు గిరిగారి అధ్యక్షతన హిందీ ప్రచార సభా మందిరంలో సమావేశం కావడం జరిగింది. అంతలో కాంగ్రెసు అధ్యక్షులయిన అజాద్‌గారినుంచి ఒక తంతి వచ్చింది. అందులో ఉన్న విషయాలివి:

"18 వ తేదీన జరిగే పార్టీసభకు వచ్చే శాసన సభ్యులకు ఈ సందేశం అందజేయవలసినది—

"పరిస్థితులన్నీ చక్కగా ఆలోచించి, సి. రాజగోపాలాచారిగారిని మీ నాయకునిగా ఎన్నుకోవలసిందని ఇందు మూలంగా నేను సలహా ఇస్తున్నాను. ఈ సలహా ఇవ్వడంలో మహాత్మాగాంధీగారు, వల్లభాయి పటేలుగారు నాతో ఏకీభవిస్తున్నారు. ఈ సలహా మీ నెత్తిపైన రుద్దుతున్నామని భావించవద్దు. మీలో బహుసంఖ్యాకు లయిన సభ్యులకు మా సలహా పాటించడానికి ఇష్టం లేకపోతే, అట్టివారు తోచినవిధాన తీర్మానించుకోవచ్చు. అయితే, ఆ బాధ్యత వారిదే అయిఉంటుంది."

అంతకు ఏడేండ్ల ముందు గాంధిగారికి ఇష్టంలేకుండా సుభాష్ చంద్రబోస్ కాంగ్రెసు అధ్యక్షుడయినప్పుడు—ఈ విధంగానే బోసు తన స్వంత బాధ్యతపైనే కార్యవర్గం ఏర్పాటు చేసుకోవాలని చెప్పడమూ, ఆయన అధ్యక్షపదవి వదిలిపెట్టడమూ జరిగినవి. ఈ విషయంలో ప్రకాశంగారు, నాడారు మొదలైనవారికి ఈ బాధ్యత తగిలింది. తర్వాత—ప్రకాశంగారు, నాడారుగారు, మాధవ మేనోన్‌గారు, భక్తవత్సలంగారు గ్రాండ్‌ట్రంక్ ఎక్స్‌ప్రెస్‌లో ఢిల్లీకి ప్రయాణమై వెళ్ళారు. తెలుగు జిల్లాలలో—ఆ బండి ఆగిన ప్రతిస్టేషనువద్ద వేలకొద్ది ప్రజలు గుమిగూడి ప్రకాశంగారికి, నాడారుగారికి జయజయ ధ్వానాలు పలికారు.

చెన్నరాష్ట్రంలో శాసన సభా నాయకత్వాన్ని గూర్చి ఉయ్యాలలు అటూ ఇటూ ఊపుతూంటే, ఇంగ్లండులో హవుస్ అఫ్ కామన్స్‌లో

ఒక సభ్యుడు ఈ విషయం ప్రస్తావిస్తూ, మన దేశాన్ని ఈ విధంగా హేళన చేశాడు:

"ఇండియా దేశము స్వరాజ్యం కావాలని కోరుతున్న ఈ సమయంలో—చెన్నరాష్ట్రంలోని కాంగ్రెసువారు తమ నాయకుని ఎన్నుకోలేకుండా నాయకత్వవిషయమై దెబ్బలాడుకుంటున్నారనీ, సంవిధానాత్మకమైన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకోలేకుండా ఉన్నారనీ మన ప్రభుత్వంవారు ఇక్కడ చెప్పుతున్నారు."

ఈ మాటలు తెలిసి భారతీయులు సిగ్గుపడ్డారు.

కాంగ్రెస్ వర్కింగ్ కమిటీవారు మొదట ఇచ్చిన తంతితో సంతృప్తిపడలేదు. ఇచ్చిన తంతి అర్థం స్పష్టంగా లేదని సభాధ్యక్షులయిన గిరిగారు, స్పష్టీకరించమని కోరగా, వారు స్పష్టీకరిస్తూ, మరొక వాక్యం కలిపారు—"మీరు రాజగోపాలాచారిని మీ నాయకునిగా ఎన్నుకున్నట్టయితే, మంత్రివర్గంలో తనకు కావలసిన వారిని మంత్రులుగా తీసుకుని, తక్కినవారిని వదలిపెట్టే స్వేచ్ఛ ఆయనకుంటుంది" అని.

ఏప్రిల్ 17 న దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు ఒక పత్రికా ప్రకటనలో—

"శాసన సభలో తమ నాయకుని ఎన్నుకునే అధికారం అధిష్ఠాన వర్గంవారు శాసన సభ్యులకే వదిలి పెట్టేశారు. పూర్వాపరములైన పరిస్థితులను ఆలోచించిన పిమ్మట మనము ప్రకాశంగారినే నాయకునిగా ఎన్నుకొనడం మంచిది. ప్రజానురాగం బహుళంగా పొందిన నాయకుడాయన," అని ఆయన ఉద్ఘాటించారు.

## శాసన సభ్యుల నిర్ణయం

ఏప్రిల్ 18 న తిరిగి కాంగ్రెసు శాసన సభ్యులు సమావేశమై రెండుగంటలాలోచించి, అధిష్ఠాన వర్గంవారి సలహా అంగీకరించడమా, వద్దా అన్న ప్రశ్నను వోటుకు పెట్టగా—నిరాకరించడానికి 148 వోట్లు, అంగీకరించడానికి 38 వోట్లు వచ్చినవి. అనగా, రాజగోపాలాచారి

గారికి అనుకూలంగా 38 వోట్లు, వ్యతిరేకంగా 148 వోట్లూ వచ్చా యన్నమాట. ఈ విషయం అజాద్‌గారికి, గాంధీగారికి తంతిమూలంగా తెలియజేయడమైనది. ఆ తంతిలో తరువాతి కార్యక్రమం ఏమని సలహా ఇవ్వవలసిందని కూడా ఉంది. మరునాడు తాము తిరిగి సమా వేశం అవుతున్నామనీ, ఆ లోపున అధిష్ఠానవర్గంవారు తమ సలహాను అందచేయవలసిందనీ, ఆ సమావేశ సమయానికి ఏ సలహా అంద కుంటే- తమకు తోచిన రీతిని నిర్ణయం తీసుకుంటామని గిరిగారు ఆ తంతిలో వ్యక్తం చేశారు.

ఏప్రిల్ 20 న మూడవ పర్యాయం తిరిగీ కాంగ్రెసు సభ్యుల సమావేశం జరిగింది. రోజు రోజుకూ సమావేశం పొడిగిస్తున్నందుకు గిరిగారు విచారం వెలిబుచ్చారు. 'అయితే కాంగ్రెస్ అధిష్ఠానవర్గాన్ని గౌరవించవలె గదా!' అని అన్నారాయన.

అంతటిలో, అజాద్‌గారి దగ్గరినుంచి మొదటిదానికన్న వింత అయిన మరి ఒక తంతివార్త వచ్చింది. అందులో, "మీ రిచ్చిన తంతి అందింది. నాయకులుగా ఉండడానికి ఒకరి పేరే సూచించవలెననే నిర్బంధం లేదు. ఎక్కువ పేర్లు సూచించి, మాకు పంపితే, ఏదో ఒక పేరు మే మిక్కడ ఖాయం చేస్తాము," అని ఉంది. ఆ విధంగా చేయ డానికి, సంవిధాన సంబంధమైన అభ్యంతరాలు పార్టీలో లేవాయని గిరి గారు అజాద్‌గారికి తంతి యిచ్చి, సమావేశాన్ని మళ్ళీ వాయిదా వేశారు. ఏప్రిల్ 21 న నాల్గవ పర్యాయం ఏ నిర్ణయం తీసుకునే అవ కాశం లేకపోవడంచేత సమావేశం మళ్ళీ వాయిదా పడింది.

ఈ పరిస్థితుల నిలా ఉండనిచ్చి, ఢిల్లీలో భంగీకాలనీలో ప్రకాశంగారు, నాడారుగారు, మాధవ మేనోన్‌గారు గాంధీగారిని కలుసు కొన్నప్పుడు జరిగిన మరొకటి రెండు విషయాలు ఇక్కడ చెప్పాలి.

రాజాజీ పేరు ఒప్పుకోము అని నాడారుగారు చెప్పగా, పట్టాభి గారి విషయమేమని గాంధీగారు అడిగారట. అందుకు నాడారుగారు, "మీరు స్వయముగా వచ్చి, మనిషి మనిషినీ వోటు అడిగినా ఫలం సందేహాస్పద" మని జవాబిచ్చారట.

ఈ సందర్శనమయిన తరువాత రాత్రి గాంధీగారు ప్రకాశం గారికి ఒక ఉత్తరం పంపించారు. ఆ ఉత్తరం సారాంశ మిది:

"కోర్టులో న్యాయవాద వృత్తి జరుపుతూ, ప్రకాశంగారు ప్రజాసేవ (పబ్లిక్‌వర్క్) ఎలా చేస్తున్నారని, నేను—ఒరిస్సా నుంచి చెన్నపట్నం హిందీ ప్రచార సభ రజతోత్సవానికి వస్తూండగా, రైలుబండి ఆంధ్రదేశం ప్రవేశించేముందే నాకు స్వాగతం ఇవ్వడానికి వచ్చి నాతోబాటు ప్రయాణం చేసిన రాష్ట్రి కాంగ్రెసు సంఘకార్యదర్శి కళా వెంకటరావుగారిని అడిగాను. మీరు ప్రాక్టీసు మానేశారనీ, ప్రజల సొమ్ము తిని జీవిస్తున్నారనీ ఆయన నాకు చెప్పాడు.* మీరు జైలులోంచి విముక్తు లయిన తరువాత, బహిరంగ సభలలో ప్రజలు మీకు చందా లిస్తే, ఆ ధనం కాంగ్రెసుకు జమ కట్టక మీరు స్వయంగా వాడుకున్నారట. ఇది చాలా అవినీతికరమైన పని. అందుచేత, మీరు శాసన సభలో ఉండడానికిగాని, నాయకత్వం వహించడానికిగాని వీలులేదు. కాబట్టి, మీరు మీ యత్నం మానుకోవలసినది."

దానిపైన ప్రకాశంగారు ఇచ్చిన ప్రత్యుత్తరపు సారాంశ మిది:

"ఈ దేశంలో ప్రజాసేవ చేసేవారు జీవించడానికి రెండు పద్ధతులున్నాయి. ఒకటి- ఎవరైనా గొప్పవారు అభిమానించి ఒక నిధి ఏర్పాటు చేస్తే, ఆ నిధినుంచి వెచ్చాలకు డబ్బు వాడుకునే పద్ధతి. రెండవది- ప్రజాసేవకుడికి ఎప్పటికప్పుడు ఏమి అవసరం వస్తే, దానికి సరిపోయేంత డబ్బు ప్రజలే ఖర్చు పెట్టడమో- లేక నెలకో, సంవత్సరానికో ప్రజలు అభిమానించి ఇచ్చిన డబ్బును ఖర్చు పెట్టే పద్ధతి. నాకు మొన్న వచ్చిన యాభై వేలు ప్రజలు ఈ రెండవ పద్ధతి ప్రకారం ఇచ్చినదే.

---

* 'He is living on public funds' అని వెంకటరావుగారు చెప్పినట్టు గాంధీగారు ఆ ఉత్తరంలో పేర్కొన్నారు.

"నేను రోజుకు వేయి రూపాయలు ఫీజు పుచ్చుకొని న్యాయస్థానాలలో న్యాయవాద వృత్తి సాగించి సంపాదించి నపుడు కూడా, ఆ డబ్బు ప్రజాధనమనే అనుకొనేవాడిని. ఏ పద్ధతి అయినా, ప్రజాసేవకుడు వాడిన ధనము ప్రజల ధనమే."

ఈ ఉత్తరం అందేసరికి గాంధీగారికి కోపం మరింత హెచ్చి నది. ఆయన శాసన సభలో ఎంతమాత్రమూ నిలుచోవద్దని ప్రకాశం గారికి ఆజ్ఞాపూర్వకంగా ఉత్తరం వ్రాసి, తమ్ముు చూడవలసిందని కామరాజుగారికి కబురు పంపించారు.

ఆ సాయంకాలం నాడారుగారు ప్రకాశంగారి దగ్గరికి వచ్చి, గాంధీగారు ప్రత్యేకంగా రమ్మని కబురు పంపడం గురించి చెప్పి, 'వెళ్ళవచ్చునా?' అని సలహా అడిగారు. ప్రకాశంగారు, "పెద్దవారు పిలిచి నపుడు వెళ్ళవలసినదే గదా! వెళ్ళిరండి," అన్నారు. తర్వాత ఇద్దరి మధ్య వేరే సంభాషణ ఏదీ జరగలేదు.

అప్పుడు వెళ్ళిన నాడారుగారు మరి రాలేదు. ఆ మర్నాడూ రాలేదు. అంతేకాదు, చెన్నపట్నం చేరి, నాయకుని ఎన్నికలో ప్రకాశం గారికి ప్రత్యర్థిగా ఇంకొకరి పేరు ప్రతిపాదించి, ఆ ప్రతిపాదన వీగి పోయిన తరువాతవరకు ఆయన ప్రకాశంగారిని మళ్ళీ చూడలేదు.

గాంధీగారు, నాడారుల మధ్య జరిగిన విషయం తర్వాత తెలి సింది. నాడారుగారితో గాంధీగారు అన్న మాటల సారాంశ మిది:

"ప్రకాశంగారిని నాయకత్వానికి పోటీ చేయవద్దని నే నాదే శించాను. ఆయన నిల్చునేందుకు సాహసింపజాలడు.* ఒకవేళ ఆయన అలా సాహసించితే, మీరు మరెవరి పేరో ప్రతిపాదించి ఆయనను ఓడించవలెను."

ఇది ఇలా ఉంటూండగా, పట్టాభిగారి తరఫున యత్నం జర గడం మానలేదు. గాంధీగారికి - కళా వెంకటరావు, గోపాలరెడ్డిగారు కలసి ఒక తంతి వార్త ఇచ్చారు. అందులో "మా చెన్నరాష్ట్రంలో

---

* "He dare not stand" అని గాంధీగారి వాక్యము.

ఉన్న పరిస్థితులనుబట్టి, పట్టాభి సీతారామయ్యగారిని నాయకునిగా ఎన్ను కొనేందుకు మీరు సలహా ఇవ్వవలసినది. పట్టాభి సీతారామయ్యగారికి కూడా చెప్పవలసినది,'' అని ఉంది.

గాంధీగారు, పట్టాభిగారికి ఈ విషయమై ఇచ్చిన సలహా సారాంశము:

''నువ్వు యత్నించే ముందు రాజగోపాలాచారిగారి సలహా తీసుకోవలసినది. ఆయన చిత్త స్థైర్యమందు నాకు నమ్మక మున్నది.* మీరు మాత్రం ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం కావాలన్న భావం వదులు కోండి.''

ఈ విషయాలు సూచావాచాగా పత్రికలలో పడడమేగాని, సంపూర్ణంగా సభ్యులందరికీ తెలియవు.

ఇక్కడ జరుగుతున్న గందరగోళంలో, మంత్రివర్గం సమ యానికి ఏర్పాటవుతుందో, కాదో అన్న అనుమానంచేత, గవర్నమెంట్ ఆఫ్ ఇండియావారి 1935నాటి ఆక్టు-93 సెక్షన్ క్రింద గవర్నరుకు రాజ్యాధి కారమప్పగిస్తూ, 1939లో చేసిన ఉద్ఘోషణ (Proclamation)ను పొడిగిస్తూ 1946 ఏప్రిల్ 16 న ఒక తీర్మానం హవుస్ ఆఫ్ కామ న్సులో ఆమోదమయింది.

## చెన్నరాష్ట్ర నాయకుడుగా ప్రకాశంగారి ఎన్నిక

ఏప్రిల్ 23 న హిందీ ప్రచార సభా మందిరంలో, శాసన సభ్యుల సభ జరిగింది. ప్రజలిచ్చిన యాభై వేల రూపాయలు ప్రకాశం గారు ఖర్చు చేసుకోకూడదని గాంధీగారు ఆంక్ష విధించినట్లు తెలియ గానే, సుప్రసిద్ధ నాయకులయిన దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు, నడింపల్లి లక్ష్మీనరసింహారావుగారు మొదలైనవారు ''ఆంక్ష తొలగిం చకపోతే, ప్రకాశంగారికి ప్రత్యేకంగా లక్ష రూపాయలు తాము వసూలు చేసి యిస్తా''మని, పత్రికా ప్రకటనలోనూ, గాంధీగారికి ప్రత్యక్షంగా

---

* ''I have not lost my trust in the sanity of his judgement,'' అని గాంధీగారి వాక్యము.

ఉత్తరంలోనూ తెలియజేశారు. అప్పటితో ఆ ప్రసక్తి ఆగింది. కాని, ప్రకాశంగారు నాయకుడుగా నిలబడగూడదన్న పట్టుదల మాత్రం గాంధీగారికి హెచ్చయింది.

ఇటువంటి పరిస్థితులలో, సాధారణ ప్రజల మనసులు అట్టుడికినట్టు ఉడుకుతుండగా, ఏప్రిల్ 23 నాటి సభలో ప్రకాశంగారి పేరు ప్రతిపాదింపబడింది. తర్వాత మాధవ మేనోన్‌గారు ముత్తురంగ మొదలియారుగారి పేరు ప్రతిపాదించారు. డాక్టర్ పట్టాభిగారి ప్రసక్తి రానేలేదు. అపుడు జరిగిన వోటింగులో, రాజాజీ వర్గంలో ఉన్నవారిలో హరిజనులు తప్ప మరెవరూ పాల్గొనలేదు. ప్రకాశంగారు, గాంధీగారి మాటకు వ్యతిరేకంగా నిలబడడమేగాక, గెలుపునుకూడా పొందారు. ధీరోదాత్త నాయకుడని అనిపించుకున్నారు. ఆంధ్రుల హృదయాలను ప్రఫుల్లం చేశారు.

మర్నాడు పత్రికలలో వోటింగు భాషానుసారంగా నడచిందని వ్రాశారు కాని, ఆలాగు జరగలేదు.

ప్రకాశంగారు ఎన్నికయ్యారని గిరిగారు వెల్లడించిన వెంటనే, పంతులుగారు శాసన సభా నాయకుని పీఠం ఎక్కి ఇలా అన్నారు:

> "యథేచ్ఛగా మన ఎన్నికలను మనము జరుపుకోవడానికి అవకాశం కల్పించిన కాంగ్రెసు అధ్యక్షులు అజాద్‌గారి రాజకీయ పరిజ్ఞానాన్ని, మనము ప్రశంసించాలి. కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి మన కృతజ్ఞతలను తెలియజేస్తున్నాను. ఈ క్షణంవరకు మనలో మనకు కలిగిన పరస్పర భేదాలన్నిటిని మనము మరిచిపోవాలి. జయాపజయాలనే భేదపుపలుకులు ఇకమీద ఉండకుండా, మనము యావన్మందిమి ప్రజలయెడల మనకున్న బాధ్యతలను, విధులను 'మనము ప్రజలకు సేవకుల'మని గ్రహించి సక్రమంగా నిర్వహించాలి."

### అధిష్ఠానవర్గ ఆగ్రహము

గిరిగారు, ఎన్నిక ఫలితం యథావిధిగా కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి తంతిమూలంగా తెలియజేశారు. వారికెంత ఆగ్రహం వచ్చిందో!

దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు—ప్రకాశంగారు ఎన్నికయ్యారనీ, అధిష్ఠానవర్గంవారు, మంత్రివర్గం ఏర్పాటు చేయడంలో తమ సలహాను ప్రకాశంగారికి పంపించవలసిందనీ తంతివార్త యిచ్చారు. అందుకు అజాదుగారు ఇచ్చిన జవాబులో, "మా సలహాను ధిక్కరించి ప్రకాశంగారిని నాయకుడుగా ఎన్నుకొన్న మీ పార్టీకి, మంత్రివర్గం ఏర్పాటు విషయమై మేము ఏ సలహాను ఇవ్వదలచుకో లేదు," అని ఉంది.

అధిష్ఠానవర్గంవారు ఎంత కోపావేశంలో మునిగిపోయారో, ఆ జవాబులోగల భాష చెప్పకే చెపుతున్నది.

నాటిమొదలు నేటివరకు—కాంగ్రెసువారి ప్రజారాజ్యం ఢిల్లీ నుండి నడిపే రాజ్యమే తప్ప మరొకటి కాదు.

# 13

# ప్రకాశం మంత్రివర్గం ఏర్పాటు

ఎన్నిక అయిన వెంటనే, యథాశాస్త్రంగా గవర్నరును చూడడానికి ప్రకాశంగారు వెళ్ళారు. మంత్రివర్గం ఏర్పాటు చేయడానికి కొంత వ్యవధి పుచ్చుకున్నారు. ఇంటికి తిరిగి వచ్చేసరికి, ఆ వీథి అంతా కార్యదర్శులు, పెద్ద ఉద్యోగులు, అభిమానులతో నిండిపోయింది.

ఆ రోజులలో ప్రకాశంగారికి ఎమ్. కె. వి. రెడ్డి, బొప్పన హనుమంతరావు అనే ఇద్దరు బారిష్టరులు చాలా సహాయకారులుగా ఉండేవారు. ప్రకాశంగారు బసచేసిఉన్న ఇల్లు పై చెప్పిన హనుమంత రావుగారిది. ఆ వీథి వీథంతా ముఖ్యంగా ఆంధ్రులతో నిండిపోయింది. అంతవరకు కంచెమీద అటా యిటా అని సందేహంతో నిల్చున్న కొందరు శాసన సభ్యులు కూడా (వోటింగులో వారేమి చేశారో తెలియదు) వచ్చి, ప్రకాశంగారిని అభినందించారు.

మరునాడు ఉదయం—మామూలుగా ఆరోగ్య పోషణార్థం

నిత్యమూ సాగించే పాదయాత్రకై వెళ్ళిన ప్రకాశంగారు, కొంతదూరం వెళ్ళి, ఎవరికీ తెలియకుండా గోపాలరెడ్డిగారి బసలోకి వెళ్ళారని ఒక వదంతి బయలుదేరింది.

నిన్నటిదాకా, పీకమీద కాలువేసి తాండవం చేస్తున్న అతని యింటికి ప్రకాశంగారు వెళ్ళడం, తమ పీకలమీద ఆయన కాలువేసి తొక్కేసినట్లే అని—ప్రకాశంగారిమీది అభిమానంవల్ల పుట్టిన ఆగ్రహంతో జనం ప్రకాశంగారి యింటి దగ్గరికి చేరి, "ఏరీ పంతులుగారు?" అని అడగసాగారు. కాని, ఆయన అప్పటికీ తిరిగి రాలేదు. ఆ వచ్చే జనం సంఖ్య క్షణక్షణానికి హెచ్చుతూ వచ్చింది.

అంతట్లో, రమారమి తొమ్మిది గంటలకు ఆయన ఇంటికి తిరిగి వచ్చారు. 'గోపాలరెడ్డిని మంత్రిగా చేస్తే మేము ఒప్పుకొనేది లే'దని అక్కడ చేరినవారు ఏక కంఠంగా కేకలు వేయగా, ప్రకాశం గారు వారిని సమాధాన పరచి, మెల్లిగా పంపించేశారు.

ఆ మధ్యాహ్నం, ఆయన నన్ను డాక్టర్ రాజన్‌గారి దగ్గరికి పంపారు. నేను వెళ్ళేసరికి ఆయనతోబాటు—మధురలో సుప్రసిద్ధ న్యాయవాది, త్యాగశీలుడు, శాసన సభా సభ్యుడు అయిన వైద్యనాథ అయ్యర్ కూడా ఉన్నారు.

వారితో, "తప్పకుండా మీరు మంత్రివర్గంలో చేరాలని మిమ్మల్ని ఆహ్వానించడంకోసం ప్రకాశంగారు మిమ్మల్ని కలుసుకో దలచుకున్నారు. మీ వర్గం తాలూకువారివి రెండుపేర్లు ఇచ్చినట్టయితే నేను ప్రకాశంగారికి అందజేస్తాను. రేపటికి మంత్రివర్గం పూర్తికావాలని ఆయన అభిలాష," అని చెప్పాను.

డాకర్ రాజన్‌గారు క్లుప్తంగాను, వైద్యనాథ అయ్యర్‌గారు బహుళంగాను—రాజాజీకి జరిగిన అన్యాయం గురించీ, ఆయనమీద కక్ష సాధించడానికి నాడారు బయలుదేరినా; వృద్ధులు, కార్యజ్ఞులు అయిన ప్రకాశంగారు నాడారుతో కలియడం రాజనీతి ప్రమాణాలను తగ్గించిందని ఏదేదో ఉపన్యాస ధోరణిలో పడిపోయి, చివరకు తాము

మంత్రివర్గంలో చేరడం రాజాజీకి అంగీకారం కాదని, అనుమానంలేని మాటలతో చెప్పివేశారు.

తిరిగివచ్చి, వారు చెప్పిన మాటలన్నీ యథాతథంగా ప్రకాశం గారితో చెప్పాను. అప్పటికే ఆయన కామరాజనాడారుగారితో మాట్లాడి ఉన్నారు. సాయంకాలం ఆయన చెప్పే పేర్లకోసమని, ఆయన దగ్గరికి వెళ్ళాను. ఆయన ఒకటో రెండో గంటల వ్యవధి కావాలని చెప్పారు. నే నింటికి వెళ్ళేసరికి, ప్రకాశంగారు—కేరళనుంచి రాఘవమేనోన్‌గారి పేరు, దక్షిణ కెనరానుంచి కె. ఆర్. కరంత్ పేరు ఏర్పాటు చేసుకొని ఉన్నారు. అంతలో, నాడారుగారు పంపిన మనిషికూడా వారి జాబితా అందజేశారు. అందులో అన్నీ దక్షిణ దేశీయులపేర్లే ఉన్నా, తమతో చేయి కలిపి, ప్రకాశంగారికి వ్యతిరేక నాయకత్వాన్ని సాధించడానికి యత్నించిన వారిపేర్లు లేవు. అయితే, వారు నాడారు వర్గంలో వారు కాబట్టి వారూవారూ చూసుకోవలసిన విషయం అది. తర్వాత, భాషా భేదాన్ని పురస్కరించుకోకుండా తమ వర్గానికి చెందిన భాష్యం అయ్యర్‌గారిని ప్రకాశంగారు తమ జాబితాలో వేసుకున్నారు.

ఏప్రిల్ 30 న ప్రకాశంగారి మంత్రివర్గం ఉద్యోగ స్వీకరణ ప్రమాణం తీసుకొన్నది. ఆయన మంత్రివర్గంలోని మంత్రులు పదకొండుగురిలోను తొమ్మిదిమంది న్యాయవాదులు.

## మంత్రివర్గము వెంటనే చేసిన పనులు

ప్రమాణ స్వీకారం జరిగిన వెంటనే, రాజకీయ ఖైదీలను విడుదల చేయడానికీ, గ్రామాలమీద వేసిన జుల్మానాలను గ్రామస్థులకు తిరిగి ఇచ్చివేయడానికీ ప్రకాశం మంత్రివర్గంవారు నిశ్చయించారు. క్విట్ ఇండియా ఉద్యమానికి సంబంధించిన అరవై తొమ్మిదిమంది రాజకీయ ఖైదీలను విడుదల చేస్తూ, మే 2 న ఆర్డరు పాసు చేశారు. ఒంగోలు బాంబుకేసులో లోగడ ఒక వ్యక్తిని దోషిగా నిర్ణయించి, అరెస్టు చేయమని పాస్ అయిన ఆర్డర్లను మే 9 న రద్దుచేశారు. ఆలాగుననే ప్రతివాది భయంకరం వెంకటాచారిగారికి స్థలమునుంచి

సలమునకు కదలుటలోగల ఆంక్షలను తొలగించారు. విశాఖపట్నం ఏజన్సీనుంచి రాజకీయ ఖైదీగా ఉన్న మట్టి కామయ్యను విడుదల చేశారు. క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో అప్పటి గవర్నమెంటు వారు చాలామంది ఉపాధ్యాయుల సర్టిఫికేట్లను కేన్సెల్ చేశారు. కొందరి ఉద్యోగాలు తీసేశారు. ప్రకాశం మంత్రివర్గంవారు మే 23 న అలా కోల్పోయినవారికి సర్టిఫికేట్లు, ఉద్యోగాలు ఇవ్వడానికి ఆజ్ఞలు జారీ చేశారు.

## స్పీకరు ఎన్నిక

ప్రకాశంగారు తమ శాసన సభా పార్టీ కార్య నిర్వాహక వర్గంలో అన్ని వర్గాలవారికి చోటు ఇచ్చారు. స్పీకరు, డిప్యూటీ స్పీకరులను, శాసన మండలి అధ్యక్ష ఉపాధ్యక్షులను ఎన్నుకోవలసిన సమయం వచ్చింది. శాసన సభకు నన్ను స్పీకరుగాను, శ్రీమతి అమ్మన్నరాజాను డిప్యూటీ స్పీకరుగాను; తంజావూరునుంచి వచ్చిన నటరాజన్ అనే అతనిని శాసన మండలి అధ్యక్షునిగాను, దక్షిణ ప్రాంతాలనుంచి వచ్చిన మరొకరిని ఉపాధ్యక్షునిగాను ఉంచడానికి కార్యనిర్వాహక సంఘంలో ఏకగ్రీవంగా నిశ్చయించారు.

అయితే, ప్రకాశంగారిని నాయకునిగా ఎన్నుకొన్నది లగాయితూ, ఎదురు వర్గాలవారు, అనగా—కామరాజనాడారుగారు, రాజాజీ, కళా వెంకటరావుగారల వర్గాలు ఏ విధంగా ప్రకాశంగారిని హింసిస్తే బాగుంటుందని ఆలోచిస్తూనే ఉన్నారు. అందుచేత, స్పీకరు ఎన్నిక సమయంలో ఆ మూడు వర్గాలవారు ఏకమయారు. రాజాజీ వర్గంవారు చాలామంది, నాయకుని ఎన్నికలో పాల్గొనలేదని ఇదివరలో వ్రాశాను. కానీ, ఇపుడు వారుకూడా వీరితో కలుసుకున్నారు.

నేను ఆ రోజులలో చెన్నపట్నం కాస్మాపాలిటన్ క్లబ్‌లో బసచేసి ఉండేవాడిని. గోపాలరెడ్డిగారుకూడా అక్కడే బసచేశారు. స్పీకరు ఎన్నిక జరిగేరోజున, ఆ విషయం మా సంభాషణలోకి వచ్చే సరికి, ఆయన—ఎగ్జిక్యూటివ్ కమిటీలో నా పేరు అంగీకరించినట్టు తమకు తెలియదన్నారు. అందుచేత, రాజాజీవర్గంనుంచి—హరిజను

లయిన శివషణ్ముగంపిళ్ళైగారిని ప్రతిపాదిస్తారేమో నన్నారు. ఎగ్జిక్యూటివ్ కమిటీలో జరిగిన నిర్ణయం ఒక పట్టుదల లేని విషయం అన్నారు.

ఇలా ఉండగా, నాడు పన్నెండు, ఒంటిగంట వేళప్పుడు కామరాజునాడారుగారు, ఫోర్ట్ సెంట్ జార్జిలోని ప్రకాశంగారి గదిలోకి వచ్చారు. అంతకు వారంరోజులక్రితం చెన్నపట్నంనుంచి తంజావూరుకు బదిలీ అయిన ఒక జిల్లా పోలీసు సూపరింటెండెంటు బదిలీ ఆర్డరును ఉత్తర క్షణంలో రద్దు చేయాలని నాడారుగారి కోరిక. మధ్యాహ్నం మీటింగు అయిన తరువాత కాగితాలు తెప్పించి చూస్తా నన్నారు ప్రకాశంగారు. మీటింగుముందే ఆ పని జరగాలని నాడారుగారు ఒత్తిడి చేశారు. మీటింగుకు, ఈ కోరికకు ఉన్న సంబంధం ప్రకాశంగారు గ్రహించలేకపోయారు. రుసరుసలాడుతూ, నాడారుగారు పైకి వచ్చేశారు.

అసలు ఆ రోజు జరిగే ఎన్నికలలో—పేరుకు వారికిగాని, వెంకటరావుగారికి గాని వ్యతిరేకత లేదు. ఆ రోజు ఎన్నికలో సూచింపబడే పేర్లలో, నా పేరు ప్రకాశంగారు తనకు ముఖ్యమని అనుకుంటారనీ, అందుచేత తాము ఏకమై నన్ను ఓడించినట్టయితే, నాయకుడుగా ఎన్నుకొనబడ్డ మూడువారాలకే ప్రకాశంగారికి ప్రథమ పరాజయం కలుగుతుందని వారు ఊహించుకున్నారు. శివషణ్ముగం పిళ్ళైగారు—రాజాజీవర్గంలో వారు కావడంచేత, హరిజనులు కావడడంచేత ఆయన పేరు ప్రతిపాదించడానికి ఏకమయ్యారు. ఆయన ప్రకాశంగారితో బాగా పరిచయమున్నవారే. 1932 లో ప్రకాశంగారు ఆయనను చెన్నపట్నం నుంచి పూనాకు ప్రత్యేకంగా తీసుకువెళ్ళారు. ఇటువంటి సంబంధమున్నప్పటికీ, ఆయన ప్రకాశంగారిని కలుసుకొని, తనకు స్పీకరుగా ఉండాలనే అభిలాష ఉందని చెప్పలేదు. నేను ఆయనను కలుసుకున్నప్పుడు నాతోకూడా ఈ ప్రసంగం తేలేదు. తెచ్చినట్టయితే ఏమయి ఉండేదో!

పార్టీ మీటింగు ప్రారంభమయి నా పేరు ప్రతిపాదించేసరికి— నాడారు, రాజాజీల వర్గాలవారిలో ఎవరో ఒకరు శివషణ్ముగం పిళ్ళెగారి పేరు ప్రతిపాదించారు.

ఓట్లు తీసుకొని లెక్కించే సమయంలో, కళా వెంకటరావుగారు వచ్చి, నన్ను కౌగిలించుకొని, "నీ పేరు ప్రకాశంగారు మాతో చెప్పనైనా చెప్పలేదు. ఇక్కడ నీకు వ్యతిరేకంగా ఓట్లు పడుతున్నట్లు కనిపిస్తున్నది" అని అన్నారు. అందుకు నేను, "పోనీ, నువ్వు చేయగలిగిన సాయమేదో నువ్వు చేయి," అన్నాను. దానికి "అదే చేస్తున్నాను" అని బదులుచెప్పి వెళ్ళిపోయాడు. ఆ మాట అర్థం నాకు బాగా తెలుసు. అ అర్థం నాకు తెలుసునన్న విషయం అతనికీ తెలుసు.

ఎన్నిక ఫలితం వెల్లడించారు. పిళ్ళెగారు ఒకేఒక ఓటుతో గెలిచారు. ఈ మొదటి ఓటమిని ప్రకాశంగారికి కలిగించామని వ్యతిరేక వర్గాలవారు బాహాటంగా పరస్పర సంతోషాన్ని ప్రకటించుకొన్నారు. మిగిలిన ఉపాధ్యక్ష, శాసన మండలి అధ్యక్షుల ఎన్నిక సందర్భంలో ఎదురుపక్షంవారికి పట్టుదల ఏమీలేదు. వారు అనుకున్న పేర్లే ఎగ్జిక్యూటివ్ కమిటీలో ఏర్పాటయినట్టు ఆమోదింపబడతాయని అనుకున్నారు.

ఎగ్జిక్యూటివు నిర్ణయం విశ్వనాథం విషయంలో పార్టీ త్రోసివేసినపుడు, శాసన మండలి అధ్యక్ష పదవికి నటరాజన్‌గారిని ఎందుకు ఆమోదించాలని చిత్తూరుజిల్లానుంచి వచ్చిన బి. రామకృష్ణరాజుగారు— తన పేరు ఎవరిచేతనో ప్రతిపాదింపజేసుకున్నారు. ఒక్కవోటుతో ఆయన గెలిచాడు. రామకృష్ణరాజుగారు ప్రకాశంగారిమీద అభిమానం కలవాడే. కాని, ప్రకాశంగారి అనుయాయులు యావన్మందీ ఎగ్జిక్యూటివ్ కమిటీ నిర్ణయం ప్రకారమే ఓటు చేశా రనుకుంటాను. అందుచేత ప్రకాశంగారికి, పార్టీలో ఏదైనా పట్టుదల వస్తే, సగంమందే తమవైపు ఉన్నట్టు తేలింది. అయితే, ఇది మంత్రివర్గ కార్యకలాపానికి అడ్డు రాగూడదనే ధైర్యంతోనే, మిగిలిన కార్యకలాపాన్ని నడిపించేవారు.

మరునాడు అసెంబ్లీలో పార్టీ నిర్ణయం ప్రకారం పిళ్ళైగారిని స్పీకరుగా ఎన్నుకోవడం జరిగింది.

## మంత్రివర్గము-ఇతర ఉత్తరువులు

క్విట్ ఇండియా ఉద్యమం సందర్భంలో కాంగ్రెసు జండాగాని, ఇతర రాజకీయపార్టీల జండాలుగాని, పురపాలక సంఘ భవనాలపైన, స్థానిక సంస్థల (District Boards) భవనాలపైన ఎగురవేయ కూడదనే ఆంక్ష వుండేది. జూన్ 5 న ఆ ఆంక్షను ప్రకాశంగారు రద్దు చేసేశారు.

ఆ ఉద్యమం సమయంలో గ్రామస్థులకు పాఠం చెపుదామనే ఉద్దేశంతో అప్పటి గవర్నమెంటువారు జుల్మానాలు విధించారు. అనగా, నేరంతో సంబంధం ఉన్నా, లేకపోయినా గ్రామంలో ఉన్న ప్రతి గ్రామస్థుడూ ఆ జుల్మానాలో భాగం ఇచ్చుకోవలసిందే. ఇటువంటి జుల్మానాలను 1942 ఆగస్టు నెలలో—పది లక్షల ముప్పై మూడువేల రూపాయలమేరకు విధించారు. 1946 జూన్ 10న వాటిని ప్రకాశంగారు రద్దు చేసేశారు.

1940, 41, 42 లలో సత్యాగ్రహాలపైన వివిధ ఉద్యమాల సందర్భంగా విధింపబడిన జుల్మానాల నన్నిటిని 1946 జూన్ 17 న రద్దు చేసేశారు.

అన్ని దేవాలయాలలోకి—అంతవరకు లోనికి పోగూడదని ఎవరిపై ఆంక్ష ఉన్నదో, వారందరూ ప్రవేశించడానికి హక్కు కల్పిస్తూ ఒక బిల్లు జూన్ 20 న కేబినెట్‌లో ఆమోదించారు.

అదేరోజున, యుద్ధ సందర్భంలో నిలుపుదల అయిన మద్య నిషేధ చట్టము తిరిగి—సేలమ్, ఉత్తర ఆర్కాడు, చిత్తూరు, కడప జిల్లాలలో ప్రవేశపెట్టడానికికూడా కేబినెట్ తీర్మానం జరిగింది.

అదే సమయంలో- మలబారు జిల్లాలో సర్వగ్రామవ్యాప్తంగా కొనుగోలు, ఉత్పత్తిదారుల కో-ఆపరేటివ్ సంఘాలు ఏర్పాటు చేయ డానికి కేబినెట్ తీర్మానించింది.

ఇక్కడ, మద్యనిషేధం విషయమై మరికొంత వివరంగా వ్రాయాలి. జూన్ 20 కి ముందే, ఈ మద్యనిషేధం రాష్ట్రంలోని ఇరవైనాలుగు జిల్లాలలోనూ ఒకేసారిగా తక్షణం ప్రకాశం ప్రభుత్వం అమలులోకి తేవలసిందని—వీథి వీథినీ రాజాజీ వర్గీయులు తీవ్ర ప్రచారం ఆరంభించారు. రాజాజీ ఇంతకన్నా బలంగా, ముఖ్య మంత్రిగా పలుకుబడి గలిగిన రోజులలో ఒక జిల్లాకు మించి ఈ చట్టాన్ని అమలుపరచలేకపోయారన్న విషయం అందరికీ తెలిసిందే.

యుద్ధానంతరం అనేక గడ్డుసమస్యలు ప్రజలను, ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్నాయి. అయినా, ఒక జిల్లాలో గాక, నాలుగు జిల్లాలలో మద్యనిషేధం అమలు జరపడానికి ప్రకాశం ప్రభుత్వం ఏర్పాటు చేసింది. కాని, ప్రకాశంగారికి గట్టిగా బాధ కల్పించడమన్నదే పార్టీలో ఎదురుగా ఉన్న మూడువర్గాలవారి ముఖ్యోద్దేశం గనుక, వారు ఏకమై, పార్టీలో - ఇరవైనాలుగు జిల్లాలలో మద్యనిషేధమనే నినాదం లేవదీశారు. ప్రకాశంగారు తాము మొదట చెప్పిన నాలుగు జిల్లాలలోనే గాక— అదనంగా కోయంబత్తూరు, అనంతపురము, కర్నూలు, బళ్ళారి అనే మరి నాలుగుజిల్లాలలోకూడా మద్యనిషేధం అమలుచేయడానికి అంగీక రించారు. దాంతో ఎదురుపక్షంవారు లేవదీసిన ప్రచండవాయువు పలచ బడింది.

ఈ విధంగా, ఎన్నికయిన మర్నాటినుంచి ప్రకాశంగారి వర్గం - ఎదురుపక్షంగా ఉన్న మూడువర్గాలతో నిత్యమూ మల్లయుద్ధాలు చేయ వలసి వస్తూండేది.

## గ్రామాభ్యుదయ కార్యక్రమము

పదవీ స్వీకారం చేసిన పదిహేను రోజులలోనే, అనగా 15-4-46 న ప్రకాశంగారు ఆహార పదార్థాల కొనుగోలు, సరఫరా విషయమై ఒక స్కీము రూపొందించారు. అది రెండునెలలకు గవర్నరు దగ్గరికి వెళ్ళింది. అప్పటి గవర్నర్ సర్ ఆర్థర్ నై 18-6-46 న ఆ ఫైలుమీద "నేను చాలా శ్రద్ధతో మీరు పంపించిన స్కీమంతా చదివాను. ఇది నిర్దుష్టంగా ఉన్నది," అని వ్రాశారు.

తమ స్కీము "యుద్ధానంతర పునర్నిర్మాణ సంఘంవారి స్కీముకన్నా ఉత్కృష్టమయిన"దని చెప్పిన ప్రకాశంగారు, దాన్ని గురించి ఇంకా ఇలా చెప్పారు:

"మన రాష్ట్రం ఆహార పదార్థాల విషయంలో స్వయం పోషకంగా ఉండాలి. 1937-39 లలో, నేను రెవిన్యూమంత్రిగా ఉన్న రోజులలోనే, త్వరలో మనకు ఆహారపు దినుసులకు సంబంధించిన గడ్డు సమస్యలు వస్తాయని ఊహించగలిగాను. ఇపుడు ఆహారశాఖవారు చేస్తున్న ప్రొక్యూర్‌మెంటు (ఆహారపు దినుసుల సేకరణ) సరఫరా విషయమై చేస్తున్న కార్యక్రమం—సమస్యా పరిష్కారాత్మకమైనది కాదు. మన ఉత్పత్తిలో నూటికి యాభైవంతులు ఆహారపు దినుసుల ఉత్పత్తే గనుక, మన రాష్ట్రంలో ఉన్న అన్ని గ్రామాలు కాకున్నా, కొన్ని ఫిర్కాలయినా స్వయంపోషకంగా చేయవలసిన బాధ్యత ప్రభుత్వశాఖ వహించాలి."

అందరు మంత్రులూ ఆ స్కీము ఆగస్టునాటికి ఒప్పుకోవడం జరిగింది. ఆ స్కీములో ముఖ్యసూత్రం క్లుప్తంగా చెబుతాను. ఫిర్కాల అభివృద్ధి, కొనుగోలు ఉత్పత్తిదారుల సహకార సంఘాలు, గ్రామ సీమలలో సాంస్కృతికాభివృద్ధి—ఈ మూడూ ఒకదాన్ని అంటిపెట్టుకొని మరొకటి ఉంటాయి.

మలబారులో ఈ సంఘాలు అప్పుడే ఏర్పాటుచేసినట్టు చెప్పి ఉన్నాను. వీటి తాలూకు ముఖ్యమైన పని ఉత్పత్తిదారుల దగ్గరఉన్న ఆహార దినుసుల సేకరణ, సరఫరాయేగాక—గ్రామస్థులకు నిత్యావసరాలైన కట్టుబట్టలు, కిరసనాయిలు, కట్టుపుల్లలు, పంచదార, ఎరువులు, వ్యవసాయ పనిముట్లు మొదలైన వస్తువులనూ సేకరించి, అవి కావలసినవారికి సరఫరా చేయడంకూడా. ఈ సంఘాల భవనాలు—గొడౌన్సుగాను, వేర్ హవుసులుగాను ఉండి, గ్రామస్థులకు కావలసిన—కంట్రోలు నిబంధనలో ఉన్న అన్నివస్తుల సేకరణ, వితరణ కార్యాలు చేయడమే గాక; వారికి కావలసిన బాంకింగు (పరపతి) సంస్థలుగానూ పనిచేయించ

డానికి ఏర్పాటయింది. ఇటువంటి పనులు ఏవైనా, వేరువేరుగా చేసే సంస్థలున్నా—వాటిని ఈ నూతన సంస్థలలో విలీనం చేయాలని నిర్ణయించారు.

మలబారులో ఈ సంఘాలు జయప్రదంగా సాగడం చూచి, ఈ స్కీము కోస్తా జిల్లాలలోకూడా అమలుజరిపించడానికి యత్నం జరిగింది. నాలుగు కోస్తా జిల్లాలలో 47 జనవరికి ఇటువంటివి 108 సంఘాలు ఏర్పడినాయి. ఈ స్కీముకు ముందు లక్ష టన్నుల సేకరణకూడా జరగని కోస్తా జిల్లాలలో, ఈ స్కీము అమలు జరిపిన తర్వాత, ఎవరినీ నిర్బంధించకనే మూడులక్షల నలభై వేల టన్నుల ధాన్యసేకరణ జరిగింది.

రేషనింగు విధానం బందోబస్తుగా జరిగింది. అయిదేసి మైళ్ళలో గల గ్రామాలన్నీ ఒక గ్రూపుగా ఏర్పాటు చేయబడినాయి. ఆ ప్రాంతంలోని ఉత్పత్తిదారులు, కొనుగోలుదారులు యావన్మందిని సహకార సంఘంలో వాటాదారులుగా తీసుకున్నారు. వాటా ధనం ఒక్కొక్క గ్రూపులోను నాలుగులక్షల రూపాయలకన్న మించకుండా ఏర్పాట్లు జరిగినాయి. ఖరీదులు వాటంతటవే పెరిగిపోకుండా ఉండడానికీ, నిర్ణీతమైన తేదీలోగా ప్రొక్యూర్‌మెంటును ఉత్సాహంగా జరిపించడానికీ బోనసులు ఏర్పరచబడినవి. ఈ సంఘాలలోను, ఒకటి ఇంకొకదానితో పోటీపడి, ఖరీదులు హెచ్చించడానికిగానీ, సేకరణ స్తంభింపజేయడానికిగానీ వీలులేకుండా నిబంధనలు చేయబడినాయి. అంతవరకు వ్యక్తికున్న ప్రాముఖ్యం తగ్గి, వ్యక్తులతోకూడిన సహకార సంఘానికి ప్రాముఖ్యం వచ్చింది. దురాశాపరులైన వ్యక్తుల కవకాశాలు సన్నగిల్లినవి. దినుసుల అమ్మకంవల్ల వచ్చిన లాభాలు వ్యక్తులకుగాక, సహకార సంఘాలకే చెందునట్లు ఏర్పాటయింది. అన్ని ప్రాంతాలలోను ఉన్న ధాన్యపుమిల్లులకు పనికలగడానికై, మిగులు ప్రాంతములకు పూర్వంవలె బియ్యంకాక, ధాన్యమే పంపడానికి నిబంధనలు చేయబడినవి.

ఈ స్కీమువల్ల హోల్‌సేలు వర్తకుల ప్రాముఖ్యం తొలగిపోయింది. వచ్చిన లాభమంతా ఉత్పత్తిదారులు, కొనుగోలుదారులే అను

భవించే వీలు కలిగింది. ఈ స్కీముపల్ల గ్రామస్థుల జీవనపద్ధతిలో ఒక విప్లవాత్మకమైన మార్పు కలిగింది.

## గోపన్నపాలెము -జోగన్నపాలెము

గ్రామ స్వరాజ్యం; గ్రామాలను స్వయంపోషకంగా అభివృద్ధి చేయడం అనేవి ప్రకాశంగారి మనసులోని గాఢమైన లక్ష్యాలని లోగడ వ్రాశాను. 1937 లో రెవిన్యూ మంత్రిగా ఉన్నరోజులలో, కాగితాల మీద కొన్ని స్కీములు వ్రాయడంతోనే సరిపోయింది. మంత్రివర్గం రాజీనామా చేసిన తర్వాత పశ్చిమగోదావరి జిల్లాలోని జోగన్నపాలెం అన్న గ్రామంలో "ఆదర్శగ్రామం" అనే లక్ష్యంతో నిర్మాణ కార్య క్రమం ప్రారంభించారు.

అక్కడే, గ్రామీణ విద్యాకేంద్రం (గ్రామ విశ్వ విద్యాలయం) అనే సంస్థను లేవదీసి, దానికి బాబూ రాజేంద్రప్రసాదుగారిని కులపతిగా ఏర్పాటు చేశారు. ప్రకాశంగారే దానికి ఉపకులపతి. గాంధిగారు చెప్పిన నిర్మాణ కార్యక్రమం, నూలు వడకడం, చేనేత, గ్రామ కుటీర పరి శ్రమలు మొదలైనవికూడా ఏర్పాటు చేయడమైనది. అయితే, రాను రాను అది క్షీణించింది. అయినా, ఇంకా సంపూర్ణంగా పోకుండా ఖాదీ పరిశ్రమ నడుస్తున్నట్టు తెలుస్తున్నది. 1946 లో ఆయన ముఖ్యమంత్రి అయిన తర్వాత గ్రామసౌభాగ్యం పెంచడంకోసమని అమలుపరచిన స్కీములలో ఒకటి గోపన్నపాలెం అనే గ్రామంలో ఉండేది. దానిపేరు గ్రామసేవకుల శిక్షణ కేంద్రము. ఈ శిక్షణ కేంద్రంలో- (1) ఖద్దరు విషయమై తీవ్రమైన కృషి; (2) హరిజనోద్ధరణ; (3) గ్రామీణులకు రవాణా; (4) మంచినీటి సరఫరా సౌకర్యముల విషయము; ఆరోగ్య సంరక్షణ మొదలైన వాటినిగురించి శిక్షణ ఇచ్చే ఏర్పాటు జరిగింది. *

ఇది ఉత్తర జిల్లాలలో ఏర్పాటయిన కేంద్రము. ఇదేవిధంగా దక్షిణ జిల్లాలలో టీ-కల్లుప్పటిలో ఏర్పాటు జరిగింది. గోపన్న పాలెంలో పైన చెప్పిన శిక్షణ కార్యక్రమమే కాక గ్రామ పరిశ్రమలకు మాడల్ కేంద్రంగా ఏర్పాటు చేసిన శిక్షణ ఇచ్చే కార్యప్రక్రియ కూడా

* జి. ఓ. నెంబర్ 757/ సెప్టెంబర్ 1946.

ఏర్పాటు చేశారు. ఈ కేంద్రంలో దాదాపు వేయిమందిదాకా కార్యకర్తలు శిక్షణ పొందారు. వరుసగా, ఒకేసారి సంవత్సరం శిక్షణ పొంది, కార్య రంగంలోకి వెళ్ళడం అనే పద్ధతిగాక, మొదటి మూడు నెలలు శిక్షణ, ఆ తర్వాతి మూడు నెలల్లో కార్యరంగంలో పని చేయడం అన్న పద్ధతి ఉండేది. అలా పని చేసివచ్చి తిరిగి రెండోమారు పొందే శిక్షణ మొదటిసారికన్నా హెచ్చుగా ఉండేది. అది కాగానే తిరిగీ కార్య రంగంలో ప్రవేశించేవారు. ఇందువల్ల మొదట సూత్రప్రాయంగా నేర్చు కొన్నది వెంటనే కార్యరంగంలో ప్రక్రియగా అమలు జరిపి, అందులో ఉన్న లోటుపాట్లను రెండోమారు శిక్షణద్వారా సరిదిద్దుకొని సక్రమ మైన పనులు చేయడానికి అవకాశం ఉండేది. ఈ శిక్షణ పొందినవారు రోడ్లు నిర్మించడం, నూతులు త్రవ్వడం మొదలైన కార్యాలన్నీ స్వయంగా చేసుకొనేవారు. కూరగాయలు, ఆహారపు దినుసులు పండించేవారు. ఒక క్రమపద్ధతిలో, వారిలో వారే కార్యక్రమాన్ని చర్చించుకొని, ఒకరి భావాలు మరొకరు తెలుసుకొని, కార్యక్రమాలు చక్కజేసుకొనేవారు. రాత్రివేళలలో వయోజన పాఠశాలలు నడిపే వారు. ఈ విధంగా ఒక్క గోపన్నపాలెంలోనేగాక, చుట్టుప్రక్కల గ్రామాలలోను ఒక నూతన చైతన్యం స్వయంపోషకమైన గ్రామ జీవనం ఏర్పాటు చేయడానికి ప్రాతిపదికలు వేశారు.

ఈ కేంద్రంలో హెచ్చు జీతాలు యిచ్చి ప్రొఫెసరులను నియ మించలేదు. కానీ, తమ రక్తనాళాలలో దేశభక్తి, ప్రజాసేవ జీర్ణించి ఉన్న మహనీయులు వచ్చి, వారి ప్రత్యేకాభిమాన విషయాలపై ఉద్బోధక ప్రసంగాలు చేశారు. గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు పుస్తక భాండాగార ఉద్యమం, తదనుబంధము లయిన ఉద్యమాలను గురించిన శిక్షణ ఇచ్చేవారు. గొల్లపూడి సీతారామశాస్త్రి గారు గాంధీ తత్వం గురించీ, దానిపై ఆధారపడిన గ్రామ పునర్ని ర్మాణం గురించీ చెప్పేవారు. అమరజీవి పొట్టి శ్రీరాములుగారు హరి జనాభ్యుదయ కార్యక్రమాలను గురించి ఉపన్యసించేవారు. వీరు సర్వాంధ్ర ప్రఖ్యాతి గన్న పెద్దలు. వీరికి జీతాలు ఇవ్వవలసివస్తే, వాటి

విలువ ఏ ప్రభుత్వంవారు కట్టగలరు? వీరుగాక, తల్లాప్రగడ ప్రకాశ రాయుడు, వేగిరాజు కృష్ణంరాజు, లింగంరాజు గోపాలరావు, మల్లి మడుగుల కోదండరామస్వామిగారలు-గాంధీ జీవనం, ప్రకృతివైద్యం, బేసిక్ ఎడ్యుకేషన్ (మౌలిక విద్యావిధానం), ఖాదీ ఉత్పత్తి, ఆర్థిక సంపద మొదలైన విషయాలను గూర్చి ఈ కేంద్రంలో బోధించేవారు. గ్రామాభ్యుదయానికి అవసరమైన రవాణా సౌకర్యాలు, మంచి నీటి సౌకర్యాలు మొదలైన పెద్ద పెద్ద పనులను కూడా గ్రామీణుల సహాయంతో తక్కువ వ్యయంతో చేయించేవారు. ముఖ్యంగా, హరిజన వాడల అభ్యుదయానికై గట్టి యత్నం చేశారు. 1946 లో ప్రకాశం గారు ముఖ్యమంత్రి అయి, మొదటి బడ్జటులో హరిజనాభ్యుదయానికై ఒక కోటి రూపాయలు లంప్‌సమ్ (అనగా, చేయబోయే స్కీము లేవో తెలియనక్కర లేకుండానే ఎంతయితే అంత ఇచ్చేందుకుగాను కేటాయించబడిన మొత్తం అని అర్థము) కేటాయించిన విషయం అందరికీ తెలిసిందే. ఆ కారణంచేత గోపన్నపాలెం ప్రాజెక్టులో, హరిజనాభ్యుదయానికి ప్రాముఖ్యం ఇవ్వబడింది.

అయితే, ప్రకాశంగారి ప్రభుత్వం పడిపోయిన తర్వాత- ఈ లక్ష్యాలను ఆయన అనుకున్న విధంలో సాధించకపోయినా, ఈ కేంద్రం, కమ్యూనిటీ డెవలప్‌మెంట్ (సమాజ వికాసం) కేంద్రాలనే క్రొత్త పథకంలో కలపబడింది. ప్రకాశంగారి ఉద్దేశాలకు, ఈ వికాస కేంద్రాల ఉద్దేశాలకు చాలా భేదముంది. ఆయన పథకంలో స్వయం పోషక గ్రామ స్వరాజ్యముంది. సమాజ వికాస కేంద్రాలకుగూడా గ్రామాల వికాసమే లక్ష్యమయినా, స్వయం పోషకత్వమనే లక్ష్యం లేదు. స్వయంపోషక గ్రామ స్వరాజ్య పథకంలో ఇతరగ్రామాల రాజకీయాల ప్రభావంగానీ, రాష్ట్రంలో జరుగుతుండే రాజకీయాల చదరంగపు ఎత్తులతో సంబంధంకానీ ఉండదు. వికాసకేంద్రాలు అటువంటి చదరంగం ఆడడానికి ముఖ్య కేంద్రాలుగా మారడంవల్ల, తరువాత పంచాయతీ రాజ్యభావంలో లీనమై, చివరకు పంచాయతీ రాజ్యం పార్టీ కక్షలకు కదనరంగంగా పరిణమించింది. ఇటువంటి దుష్పరిణామాలు రాకుండా

ఉండానికే గాంధీగారు, ప్రకాశంగారు స్వయంపోషక గ్రామస్వరాజ్య భావాన్ని పెంపొందించడానికి యత్నించారు. కాని, ఈ దేశం 'జాతకం' ఎలాగున సాగుతుందో వారు గ్రహించలేకపోయారు. దాని ఫలితమే, ఇపుడు దేశంలో రాజకీయరంగంలో అనేక సమరాలకు మూలమయింది.

### ఫిర్కా అభ్యుదయ ప్రణాళిక

గ్రామాభ్యుదయం కొంతవరకు ప్రక్రియాత్మకంగా జరిగితే తప్ప సార్వజనికమైన అంగీకారం పొందడం కష్టమని, అందుకు కావలసిన ధనము ఏర్పాటుచేసే సౌకర్యంకోసం జిల్లాకు రెండు ఫిర్కాల చొప్పున ఈ స్కీములో చేర్చబడినవి. ఫిర్కా అంతటినీ ఒక ఖండం క్రింద స్వయంపోషకంగా చేయడానికీ, సాంస్కృతికంగా అభ్యుదయం పొందేటట్టు చేయడానికీ—ఈ స్కీములను ఎంతో అభిమానంతో, ఉత్సాహంతో- ప్రకాశంగారి లక్ష్యములకు అనుగుణంగా పనిచేయ గలిగిన వారిని, మిగిలిన గవర్నమెంటు ఉద్యోగాల రాంకులతో సంబంధించకుండా, ఫిర్కా డెవలప్‌మెంట్ ఉద్యోగులుగా నియమించారు. ఇందులో చాలామంది స్వాతంత్ర్య సమర యోధులు.

రాను రాను, స్వయంపోషక సూత్రాన్ని మాత్రం వదిలిపెట్టి, కొన్ని కొన్ని ఫిర్కాలు ఒక బ్లాకుగా మార్పుచెంది, ఆ బ్లాకు లిప్పుడు సమితులుగా పరిణమించాయి. స్వయంపోషక సూత్రం మరుగు పడడమే గాక, గ్రామ స్వరాజ్యంతో సంబంధించని రాజకీయ సోపానాలుగా అవి ప్రస్తుతమున్న రూపాన్ని పొందాయి.

### ఖాదీ అభ్యుదయ ఉద్యమము

రాష్ట్రంలో ఖద్దరు ఉత్పత్తిచేసే కొన్ని కేంద్రాలలో ప్రత్యేకంగా, హెచ్చుగా ఖద్దరు వ్యాప్తి కావడానికి ఒక స్కీమును ప్రకాశంగారు ప్రతిపాదించారు. ఈ స్కీము క్రింద ప్రత్యేకింపబడిన కేంద్రాలలో మిల్లుబట్టవంతు, సంపూర్ణంగా ఖద్దరే ఉత్పత్తి అయి వినియోగమయేటట్టు ఏర్పాటు చేయబడింది.

ఇందుకు అనుబంధంగా మరొక పనికూడా చేయవలసి వచ్చింది. ప్రకాశంగారి మంత్రివర్గం ఏర్పాటు కావడానికి ముందే—మిల్లుబట్ట

అధికంగా ఉత్పత్తిచేయడానికి,బట్టల మిల్లులను రాష్ట్రంలో అభివృద్ధిపరచ డానికీ కేంద్రప్రభుత్వంవారు కొన్నివేల మరకదుళ్ళను (Spindles) కేటాయించగా, ఆ కార్యక్రమం సాగించడానికి అప్పటి గవర్నరు ప్రభుత్వం అంగీకరించింది.

ఆ విధంగా మిల్లులను విస్తృతపరచడం—ఖద్దరు ఉద్యమానికి విరుద్ధ కార్యక్రమం గనుక, మరకదుళ్ళు అక్కరలేదని ప్రకాశంగారు పైకి వ్రాసేశారు. కాబినెట్‌లో ముగ్గురు, నలుగురు మంత్రులు ప్రత్యేకించి ఈ విషయంలో ప్రకాశంగారికి వ్యతిరేకు లయ్యారు.

అంతకు ముందే, ప్రకాశంగారు పట్నంలో ఉన్న మోటార్ బస్సులను జాతీయం చేసేశారు. అందుచేత, పై స్కీములవల్ల రాజకీయంగా ఉన్న ఒడిదుడుకులతోపాటు వర్తకులు, రైసు మిల్లులవారు, బట్టల మిల్లుల యజమానులు, మోటారు బస్సుల యజమానులు—మంత్రివర్గానికి వ్యతిరేకమై పోయారు.

గ్రామస్థుల స్వయంపోషకత్వం, బస్సులను జాతీయం చేయడం, మరకదుళ్ళ తిరస్కారం, ఇవి అన్నీ కలిసి- ప్రకాశంగారికి ఇదివరలోనే ఉన్న గాంధీగారి విముఖత, రాజకీయంగా పార్టీలో ఎదురు పక్షాలవారి వైమనస్యానికి తోడయి, ఆయనను ఒక్కపాటుగా ఎదుర్కోవడం మొదలు పెట్టాయి.

## శాసన సభ ప్రథమ సమావేశము

1946 మే నెల 25 న అధ్యక్షుని ఎన్నికయిన తర్వాత, శాసన సభ ప్రథమ సమావేశం మే 27 న జరిగింది.

నాటి కార్యక్రమంలో మొదటి విషయం-మంత్రుల జీవితాలను హెచ్చించడానికి ప్రతిపాదింపబడిన బిల్లు. సహజంగా సభ్యుల వేతనాలు హెచ్చించే విధి కూడా అందులో ఉంది.

ఇటువంటి బిల్లు వచ్చినపుడు సభ్యులు వ్యతిరేక ప్రకటన చేయడం సంప్రదాయంగా వస్తున్న లాంఛనము. బిల్లు పాస్ అయిన తర్వాత ఎదురు పక్షంవారు కూడా దాని లాభం పొందుతారు గదా! అయినప్పటికి అందులో కొందరు, వారి పార్టీ సూత్ర ప్రకారంగా గట్టిగా ఎదిరి

స్తారు. వారు చాలా మైనారిటీలో ఉంటారు గనుక, బిల్లు పాసుకాదన్న భయం వారి కుండదు. బిల్లు పాసయిన లాభము, ఎదిరించిన లాభము కూడా వారు పొందుతారు. వేతనం పెంచడానికి ఒక బిల్లు వచ్చినపుడు నేను ఎదిరించాను. బిల్లు పాస్ అయిన తరువాత, అదనంగా పెంచిన వేతనాన్ని తీసుకోడానికి నేను నిరాకరించాను. వావిలాల గోపాల కృష్ణయ్యకూడా అలా నిరాకరించినట్టు నేను విన్నాను. ఇంతకు తప్ప, ఏ రాష్ట్రంలోనూ, ఏ శాసన సభ్యుడూ వేతనం పెంపుదలను ఎదిరించి, దాని లాభాన్ని నిరాకరించినట్టు నేను వినలేదు.

1946 లో అటువంటి బిల్లుకు వచ్చిన అభ్యంతరాలకు జవాబుగా, "దేశంలో ఉన్న పరిస్థితి కాంగ్రెసు అధిష్ఠాన వర్గం వారికి తెలుసు. పరిస్థితి ఆలోచించి, కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పాటు చేస్తున్నపుడు, కాంగ్రెసు మంత్రులు అలవెన్సులతో కలిపి, 1,500 రూపాయలు పుచ్చుకోవచ్చునని, శాసనంతో తగిన మార్పు చేయవలసిందని సలహా యిచ్చిన మీదటనే ఈ బిల్లు ఇక్కడ ప్రవేశ పెట్టడమైనది'', అన్నారు ప్రకాశంగారు.

బిల్లు సులభంగానే పాస్ అయిపోయింది.

ఆ ప్రథమ సమావేశంలోనే రాష్ట్రంలో ఆహార పరిస్థితుల విషయమై, ప్రకాశంగారు కొన్ని వివరాలు చెప్పారు. మన రాష్ట్రంలో ఆనాడు 49 లక్షల టన్నుల బియ్యం ఉత్పత్తి అయ్యేది. అది చాలక, 4 లక్షల 51 వేల టన్నులు మనము దిగుమతి చేసుకోవలసిన స్థితిలో ఉండే వాళ్ళము. భారత దేశం మొత్తం పైన చూపినట్టయితే (అనగా, బర్మా మన దేశంతో కలిసి ఉన్న పరిస్థితులలో) మనకు పై దేశాల నుంచి బియ్యం దిగుమతి చేసుకొనే అవసరం లేకపోయింది. కాని, 1941 డిసెంబరులో జపాన్ ప్రపంచ సంగ్రామంలో పాల్గొనడం ప్రారంభించి నప్పుడు పరిస్థితులన్నీ మారిపోయాయి.

ప్రకాశంగారు ప్రభుత్వంలోకి వచ్చే నాటికి, 68 వేల టన్నుల బియ్యము, లక్షా అరవై ఆరు టన్నుల ఇతర ఆహార ధాన్యాలు-కొరతగా ఉన్న పరిస్థితిలో ప్రభుత్వం చిక్కుకొని ఉంది.

రేషన్ నిబంధనలు గట్టి పరిచి, ఆహార పదార్థాలు వృథా కాకుండా ఉండడానికి గట్టి ఏర్పాట్లు చేయబడ్డాయి. ఆహార పదార్థాలను సేకరించే సంస్థలను పునర్నిర్మించి బలపరిచారు. ఆహారపు దినుసులను సేకరించే అధికారులకు వాటిని అమ్మడం పవిత్రమైన విధి అని రైతులకు బోధపడేటట్టు స్వయంగా ప్రకాశంగారే సమావేశాలలో చెప్పేవారు. డిసెంబరులోగా 3 లక్షల 36 వేల టన్నుల సేకరణ చేయడానికి నిశ్చయించి, ఆ లక్ష్యం సాధించారు. సాంఘిక న్యాయం కోసం, మన రాష్ట్రంలో రేషను ఇచ్చే మొత్తంలో బియ్యం కొంత తగ్గించారు. తక్కువ కాలంలో పండే ధాన్యానికి ఎకరానికి 15 రూపాయల చొప్పున బోనసు ఇచ్చారు. అలాగే పంట నూతులకు కూడా కొంత బోనసు ఇచ్చారు. విత్తనాలు, ఎరువులు తక్కువ ధరకు అమ్మే ఏర్పాట్లు చేశారు. దుంపలు, వేరు శనగతో చేసిన ఆహారాలు అందరికీ అందేటట్లు చేశారు. మాటిమాటికీ ధరలు మార్పు చెందకుండా ఏర్పాట్లు చేశారు.

ధాన్యం మిగిలి పోకుండా, సులభంగా సేకరించడానికి ఇరవై వేల గ్రామ ఆహార సంఘాలను ఏర్పాటు చేశారు. రాజకీయ, కులమత వర్గాలతో ఎటువంటి సంబంధమూ లేకుండా, గ్రామంలో నిజముగా ప్రాతినిధ్యమూ, పలుకుబడీ గలవారిని ఈ సంఘాలలో సభ్యులుగా చేర్చారు. ఆ సంఘాల అధ్యక్షులను ఆ సంఘాలవారే ఎన్నుకొనేవారు. ఆ గ్రామ సంఘాలలోంచి ఫిర్కా సంఘాలు, ఫిర్కా సంఘాలలోంచి జిల్లా సంఘాలు ఎన్నుకొనేటట్టుచేశారు. జిల్లాసంఘాలలో శాసన సభ్యులు, కేంద్ర శాసన సభ్యులతోసహా సభ్యులుగా ఉండేవారు. ఆహార సేకరణకు గ్రామంలోంచి రావలసిన ధాన్యం మొత్తం ఎంత అని రెవిన్యూ శాఖ వారు చేసే లెక్కలను ఈ గ్రామ సంఘాలు తనిఖీ చేసేవి. రైతుదగ్గర-అతని కుటుంబానికీ, వ్యవసాయపు ఖర్చులకూ కావలసినంతమటుకు వదలిపెట్టి, మిగిలిన ధాన్యాన్ని మాత్రం సేకరించే ఏర్పాటు చేశారు. దీంతో, లెక్కలలో పెద్ద పెద్ద తప్పులు, రెవిన్యూ సప్లై ఉద్యోగుల వ్యక్తిగతమైన లోటుపాట్లు బాగా తగ్గిపోయాయి. రైతుల దగ్గర అద

నంగా ఉండే ధాన్యం లెక్క వేయడమేగాక, రేషన్ నిబంధనల ప్రకారం ధాన్యం ఉత్పత్తిచేసే వృత్తిలోలేని జనాభాకు ఎంత ధాన్యం అవసరమో కూడా ఆ గ్రామ సంఘాలవారే నిర్ణయించేవారు. గ్రామస్థులు ఈ విధంగా పరిపాలనలో అనుకోకుండానే భాగస్వాము లయ్యారు. అదే విధంగా గ్రామస్థులకు కావలసిన ఇతర కంట్రోలు వస్తువుల అవసరాన్ని కూడా ఈ గ్రామ సంఘంవారు చూడడానికి ఏర్పాటు జరిగింది. అంతేకాక, గ్రామస్థుల పరపతి, అవసరాలు కూడా గ్రామ సంఘాలు మదింపుచేసే, ఏర్పాటు ఈ స్కీములో అంతర్భాగము.

గ్రామ సంఘాలనుంచి వచ్చిన రిపోర్టులనుబట్టి ఫిర్కాసంఘము ఫిర్కా సంఘాలనుంచి వచ్చిన నివేదికలనుబట్టి జిల్లా సంఘము, వీటి సలహాపైని సప్లై డిపార్ట్‌మెంట్‌వారును నడచుకోవడానికి - అనగా, సేకరణ, సరఫరా, పరపతి (రూరల్ క్రెడిట్) సదుపాయాలు సమగ్రంగా జరగడానికి ఏర్పాట్లు చేయబడ్డాయి. అంతేకాక, గ్రామాలలో క్రిమి కీటకాదుల బెడదలేని గిడ్డంగులు నిర్మించడానికి కూడా ఏర్పాట్లు జరిగాయి. గ్రామస్థులకు సరఫరా చేయగా మిగిలిన బియ్యం, పంచదార, కిరసనాయిలు, నూలు, బట్ట, వ్యవసాయ పనిముట్లు, బండ్లకు, ఇనుప పట్టాలు మొదలైనవి అదనంగా ఉంటే, వాటిని తాలూకా సంఘం అవసరమైన చోట్లకు పంపడానికి, అక్కడా అదనంగా ఉన్నవాటిని జిల్లా సంఘాలకు అప్పజెప్పడానికి ఏర్పాట్లు జరిగాయి.

ఇవి బహూళార్థ సాధక లక్ష్యాలుగల సహకార సంఘాలు (Multi-purpose Co-operative Societies) కావడం చేత- ప్రభుత్వం, ఈ సంఘాలు, ప్రజలు అనే మూడు పక్షాలు ఐకమత్యంతో ముందుకు నడవడానికి ఉపయోగపడతాయి. స్వయంపోషక గ్రామ స్వరాజ్య సంస్థాపనకు ప్రకాశంగారు ఏర్పాటు చేసిన ఈ బహూళార్థ సాధక సహకార సంఘాలు పునాదులు కాగలవని ప్రజలకు విశ్వాసం కలిగింది.

ఈ స్కీము విషయాలన్నీ ప్రకాశంగారు శాసన సభ ప్రథమ సమావేశంలోనే వెల్లడించారు.

ఆ తరువాత ప్రకాశంగారు, నేను దక్షిణ జిల్లాలలో పర్యటించి నపుడు- ఈ స్కీము వివరాలు వింటూ కొందరు యువకులు, దాన్ని అమలు పరిస్తే తాము కమ్యూనిస్టు పార్టీలో చేరబోమని ప్రకాశంగారికి యిచ్చిన విజ్ఞప్తి పత్రాలలో పేర్కొన్నారు.

## సమ్మెల పరిష్కారం - ప్రకాశంగారి చాకచక్యము

ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయిన వెంటనే, చెన్నపట్నంలో బకింగ్‌హామ్ కర్నాటిక్ మిల్లులో పదివేలమంది జరుపుతున్న సమ్మెను, మధురా మిల్లులలో జరుగుతున్న సమ్మెను- అలాగే దక్షిణ ఇండియా రైల్వే లేబరు జరుపుతున్న సమ్మెను-కేవలం తమ వ్యక్తిగతమైన పలుకుబడివల్ల పరిష్కరించ గలిగారు.

దక్షిణ ఇండియా రైల్వే వర్కరుల సమ్మె జరుగుతున్నప్పుడు ప్రకాశంగారి పలుకుబడి తగ్గించేందుకని, రాజాజీ గవర్నరు దగ్గరికి వెళ్ళి- ప్రధాన న్యాయమూర్తి, డాక్టర్ సుబ్బరాయన్, డాక్టర్ రాజన్ గారలు గల ఒక ఉప సంఘం నియమించి, దాని ద్వారా ఆ సమ్మెను పరిష్కరించవలసిందని సలహా ఇచ్చారు. గాంధీగారు లోగడ జరిపిన ఒప్పందం ప్రకారం- గవర్నరు, కేవలం కాన్‌స్టిట్యూషనల్ గవర్నరే అని తెలిసీ, రాజాజీ ఆయన దగ్గరికి వెళ్ళడం సరయిన పనికాదు.

గవర్నరు, ప్రకాశంగారితో ఈ విషయం చెప్పగా - ఆయన కీర్తి అయినా, అపకీర్తి అయినా తన బాధ్యతేకాని, ఇతర కమిటీలతో ఎట్టి ప్రమేయమూ పెట్టుకోనని చెప్పారు. ఆ మీదట గవర్నరు ఏమీ కలుగజేసుకోలేదు.

ఈ సమ్మె నాయక వర్గంలో నంబియార్ అనే శాసన సభ్యుడుండేవాడు. ఈ సమ్మెతోపాటు చాలా అల్లరులు, అరెస్టులు జరిగాయి.

అందులో ఒక రోజున ఆ నంబియారు కార్మికులముందు ప్రసంగిస్తూ, ఇలా అన్నాడు:

"ప్రకాశానికి 75 ఏండ్లు. ముసలివాడు. నాకు 28 ఏండ్లే. నన్ను అరెస్టుచేస్తే ఆయన ఎన్నాళ్ళు రాష్ట్రంలో ప్రధానిగా ఉండగలడో చూద్దాము. నేను శాసన సభ్యుణ్ణి, నేను అరెస్టయితే 1942 తిరిగీ ప్రవేశిస్తుంది. అసెంబ్లీలోనే ఆయన్ను చెప్పు పుచ్చుకొని కొడతాను. నేను అరెస్టయితే మృత్యుదేవత భూమిని ఆవరిస్తుంది.

"ఓ, రైనాల్డ్స్! నీవు దక్షిణ ఇండియా రైల్వేకి జనరల్ మేనేజరువి. నీవు జవహర్‌లాల్ నెహ్రూ దగ్గరికి వెళితే తాపులు తింటావు. నీవు ఉరికంబం ఎక్కుతావు.

"ఈ అధర్మ కాంగ్రెస్ ప్రభుత్వం నశిస్తుంది. దిక్కు లేని కార్మికులు కాల్చబడుతున్నారు. శాసన సభకు కార్మికుల్ని పంపిస్తాము. వారు ప్రకాశంగారి చేతులను కొట్టేస్తారు.

"హిట్లరుకు వ్యతిరేకంగా సోవియట్లు గొరిల్లా యుద్ధం చేశారు. ఆ యుద్ధం ఇటుపై ఇక్కడ సాగుతుంది. సమ్మెను పాడుచేసే కార్మికుడు (నల్ల కాలు) ఉంటే, వాడి కాలు ఎర్రబడి పోతుంది...."

ఈ విధంగా సమ్మె సాగించేవారిని, తమిళ ప్రాంత కాంగ్రెసు సంఘపు కార్మిక (లేబర్) ఉపసంఘంవారు తమ ధర్మ ప్రకారంగా అన్ని స్థలాలలో వీలైనంతమటుకు ప్రోత్సహిస్తూండేవారు.

అయినప్పటికి ప్రకాశంగారు, కార్మిక నాయకులైన గిరిగారు తిరుచినాపల్లికి వెళ్ళి, మేనేజ్‌మెంటును, కార్మికులను సమావేశపరిచి రాజీ చేసేశారు.

ఇంత పెద్ద సమ్మెలు ప్రకాశంగారు పరిష్కరించినపుడు, కాంగ్రెసులో వ్యతిరేకవర్గానికి సంతృప్తికి మారుగా మరింత మాత్స ర్యమే కలిగింది.

బకింగ్‌హమ్ కర్నాటిక్ మిల్లుల సమ్మె సందర్భంగా ఏంథోనీ అనే ఆయన అరెస్టయి ఉండెను. ప్రకాశంగారు, కచేరి గదిలోకి వెళ్ళిన మొదటిరోజునే ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ (ఆయన

పేరు బిషప్‌గారు) ఆయన్ను చూడ్డానికి వచ్చి మర్యాదగా, సూటిగా రెండు ప్రశ్నలు వేశారు.

మొదటిది-"మీరు ముఖ్యమంత్రి అయ్యారు గనుక, కమ్యూనిస్టుల విషయమై ప్రభుత్వం పాలసీ(నీతి)లో ఏవైనా మార్పులు కలుగవలెనా?" అన్నది.

అది విని, ప్రకాశంగారు, "నీవు లా అండ్ ఆర్డరుతో సంబంధించిన వాడవు కదా! రాజకీయ పార్టీల పేర్లతో సంబంధ మెందుకు? లా అండ్ ఆర్డర్, పార్టీలతో సంబంధం లేకుండానే అమలు పరచవలె గదా!" అన్నారు.

ఆ తర్వాత బిషప్ వేసిన రెండవ ప్రశ్న - "బకింగ్‌హామ్ కర్నాటిక్ మిల్లు సమ్మెలో కొందరిని తన వెంటబెట్టుకొని ఏంథోనీ అనే కార్మిక నాయకుడు అల్లరులు చేసి, చివరకు సమ్మెలో దింపాడు. అతడు ఇప్పుడు అరెస్టు అయి, ఖైదులో (under trial) ఉన్నాడు. అయితే, ఈ సమ్మె విషయమై ఏం చేయమన్నారు?" అన్నది.

అందుకు ప్రకాశంగారు, "ఆ ఏంథోనీ అనే ఆయనను ఇక్కడికి తీసుకురండి. పరిష్కారం చేద్దాము," అన్నారు.

దానిపై బిషప్, "ఈ విధంగా ఎన్నడూ జరగలేదండీ!" అన్నాడు.

"అయితే, కార్యదర్శి నీకు కావలసిన ఆర్డర్ల నిస్తాడులే," అన్నారు ప్రకాశంగారు.

కాని బిషప్, "సర్లెండి. అవన్నీ నేను చూసుకుంటాను. ఏంథోనీని ఇక్కడికి ఎప్పుడు తీసుకు రమ్మన్నారు?" అని అడిగాడు.

"వెంటనే తీసుకురండి," అన్నారు ప్రకాశంగారు.

ఒక రెండుగంటల తర్వాత, బిషప్ ఏంథోనీగారితో ప్రకాశంగారి గదిలో హాజరయ్యాడు. ప్రకాశంగారు సమ్మె వివరాలు అన్నీ తీసుకొని, మిల్లు యజమాన వర్గంతో మాట్లాడి, రెండు మూడు రోజులలో ఆ సమ్మె సమస్యను పరిష్కరించేశారు.

## గాంధీగారి ప్రశంస

ఇటువంటి పరిస్థితులలో సంవిధాన సభకు ఎన్నికలు జరపవలసి వచ్చింది. కేంద్ర ప్రభుత్వం వారు కొందరి పేర్లు పంపించి, వారిని చెన్నరాష్ట్ర శాసన సభవారు ఎన్నుకోవలసిందని సూచించారు. అందులో చాలా మంది నిజంగా గొప్పవారు కాబట్టి, (అందులో ఎస్. రాధాకృష్ణ, అల్లాడి కృష్ణస్వామి అయ్యరు గారల పేర్లు ఉన్నవి.) ఎన్నికలు జరిపించడం అంత కష్టం కాకపోయింది. అయితే, ప్రకాశం గారు—ఈ ఎన్నికయిన వారిలో సామరస్యం కోసం, కాంగ్రెసు పార్టీలో తమకు ఎదురు పక్షం ఉన్నవారికి స్థలాలు వదలి పెట్టడం జరిగింది. అయితే వారు ఎన్నికయిన తర్వాత పదే పదే ఢిల్లీకి వెళ్ళి, అదేపనిగా కాంగ్రెస్ అధిష్ఠాన వర్గంతో ప్రకాశంగారిమీద చాడీలు చెబుతుండేవారు

ముఖ్యంగా ఖాదీ స్కీము విషయమై వారు అక్కడ చెప్పగా, ప్రకాశంగారు—తాము అమలు జరుపుతున్న గ్రామ సౌభాగ్య ఉద్యమాలను, ఫిర్కా అభ్యుదయము, ఖాదీ ఉద్యమము, ఉత్పత్తి కొనుగోలు దారుల సహకార ఉద్యమము మొదలైన వాటిని అన్నిటినీ గాంధీగారికి బోధపరచడానికి ఒక అధికారిని పంపించారు. గాంధీగారు వాటిని చూపి, తమ అభిప్రాయ ప్రకారంగానే స్కీములు నడుస్తున్నాయని సంతోషించారు. ఖాదీ విషయమై ప్రత్యేక శ్రద్ధ చూపించి, ఆయన ఖాదీ కేంద్రాలలో, ఖాదీ అభివృద్ధి నిరోధకమైన మిల్లులను ప్రకాశంగారు నిషేధించినందుకు ప్రత్యేకంగా అభినందించారు. ప్రకాశంగారు నడిపిస్తున్న కార్యక్రమం జయప్రదమైతే భారతదేశ మంతటా అవలంబించడానికి మార్గదర్శి కాగలదని గాంధీగారు అన్నారు. ఆయనతో ఆ స్కీము వివరాలు చెబుతున్న ఉద్యోగి—ప్రకాశంగారికి ఇచ్చిన సలహా ప్రకారంగానే, ఆ మరునాడు ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ ప్రధానిగా పదవి స్వీకరిస్తున్న జవహర్‌లాల్ నెహ్రూగారికి కూడా ఈ స్కీము అమలు పరచవలసిందని సలహా ఇమ్మనగా, గాంధీగారు "ఓయి వెర్రివాడా! ఇటువంటిది ప్రకాశంగారి వంటివారే చేయగలరు. పండిట్‌జీ కాదు,"

అని బదులిచ్చారు. ప్రకాశంగారు మిల్లుదారము ఖాదీ కేంద్రాలలోకి రాగూడదని చేసిన నిషేధము, చెన్నరాష్ట్రం కోసం కేంద్ర ప్రభుత్వం కేటాయించిన మర కదుళ్ళను తిరస్కరించడం అనే రెండు పనులను గాంధీగారు సంపూర్ణంగా బలపరుస్తూ 'హరిజన్' పత్రిక కని ఒక వ్యాసం వ్రాశారు. కానీ, అది అచ్చుయ్యే సమయంలో, ఆ విధంగా ప్రకాశంగారిని పొగడడం తనకు మంచిది కాదని రాజాజీ చెప్పుకోవడం వల్ల, గాంధీగారు దాన్ని ప్రకటించడం మానుకున్నారని అక్కడున్న వారు, అది తెలిసినవారు చెప్పారు. అయితే ప్రకాశంగారికి మాత్రం ఆయనను బలపరుస్తూ గాంధీగారు ఉత్తరం వ్రాసి పంపించారు. దాన్ని ఏ కారణంచేతో ప్రకాశంగారు పార్టీ మీటింగులో చదవలేదు. కాని, శాసన మండలిలో బడ్జెటుకు జవాబిస్తూ, గాంధీగారి ఉత్తరం యావత్తూ చదివి వినిపించి, తాను అస్థానవర్గానికి వ్యతిరేకంగా తన త్రోవను తానొక్కడే పోతున్నాడన్న వాదం ఆధార రహితమని చెప్పారు.

## ప్రకాశంగారి ఆత్మగౌరవం

అయితే ఏమి? పార్టీలో ఎదురు పక్షం వారంతా అప్పటికే రాజకీయంగా తమకు ప్రకాశంగారిపై గల వైముఖ్యంతోపాటు, గ్రామ స్వరాజ్య ఫిర్కా అభ్యుదయ, ఉత్పత్తి క్రయవిక్రయ సహకార సంఘ ఉద్యమములు, ప్రత్యేక ఖాదీ ఉద్యమము మొదలైన వాటివల్ల వ్యక్తిగతంగా నష్టపడే మధ్యవర్తులకు సహాయదారులుగా ఉన్న శాసన సభ్యుల బలవత్తరమైన వైమనస్యతా కలిపి, ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉండగూడదన్న నిశ్చయానికి వచ్చేశారు.

చివరి రోజులలో రాజాజీ వర్గంవారికి రెండు మంత్రి పదవులు ఇచ్చి- మంత్రివర్గాన్ని విస్తృత పరిస్తే అది నిలిచి ఉంటుందని, మొదట వారికీ మంత్రివర్గంలో స్థాన మిచ్చే ఉద్దేశం ఉండినందువల్ల, ఈ పరిస్థితులలో వారు మంత్రివర్గంలో చేరడానికి ఒప్పుకున్నపుడు తప్పకుండా ఆ రెండు స్థానాలు ఇస్తామన్నారు.

పేర్లు అడిగేసరికి, మూడు స్థానాలు కావాలన్నారు. సంఖ్యా బలాన్నిబట్టి చూస్తే వారికి మూడు స్థానాలు చాలా హెచ్చు. అయినా

సరేనని మూడు స్థానాలు ఇవ్వబోయేసరికి, నాలుగు కావాలని కబురు చేశారు. నాలుగు ఇవ్వకపోతే కామరాజ నాడారుగారితో చేయి కలుపుతామన్నారు. ప్రకాశంగారు—ఇటువంటి బేరంలోకి దిగి ముఖ్య మంత్రి పదవి నిలబెట్టుకోవడం ఆత్మగౌరవానికి భంగకరమన్నమాట అలా ఉంచి, ప్రజారాజ్య తంత్ర ప్రక్రియకు అపారమైన నష్టం వస్తుందని అందుకు అంగీకరించక, మంత్రివర్గ పతనమే శ్రేయస్కరమని- దానినే అంగీకరించారు.

## వృత్తి విద్యాసంస్థల్లో విద్యార్థులను చేర్చుకొనే సమస్య

ప్రకాశంగారు ముఖ్య మంత్రిగా ఉన్న రోజులలో, వైద్య, ఇంజనీరింగు కళాశాలల్లో విద్యార్థులకు ప్రవేశం పెద్ద సమస్య అయింది. ఉద్యోగాలలో బ్రాహ్మణ, బ్రాహ్మణేతరులకు ప్రత్యేకంగా స్థానాలు కేటాయించినట్టే, ఈ రెండు రకాల వృత్తి విద్యల కాలేజీలలోను బ్రాహ్మణులను వారి జనాభా నిష్పత్తికి మించి చేర్చుకోరాదని ఒక ఏర్పాటు ప్రకాశంగారు మంత్రివర్గం అధికారంలోకి వచ్చేనాటికి అమలులో ఉంది.

మంత్రివర్గ పాలన ప్రారంభమయిన మరి రెండు నెలలకు కాలేజీలు తెరవబడతాయి. కాబట్టి, వెంటనే ఈ సమస్య పైకి వచ్చింది. విద్యలో ముఖ్యంగా సాంకేతిక విద్యలో కులమువారీ నిష్పత్తులపైన విద్యార్థులకు ప్రవేశ అవకాశాలు ప్రభుత్వం పరిమితంచేస్తే, ఆ నిష్పత్తులను అడిగేవారికే రానురాను నష్టం కలుగుతుందనిగాని, దేశంలో గల మేధాశక్తి భస్మం అవుతున్నదనిగాని, ఈ నిష్పత్తి కోరేవారు గ్రహించలేదు. విద్యార్థుల మేధాశక్తికి వారు పరీక్షలలో తెచ్చుకున్న మార్కులు ఒక విధమైన ప్రమాణము. ఆ ప్రమాణం నూటికి నూరుపాళ్ళు సరి అయిన ఫలితం ఇచ్చినా, ఇవ్వకున్నా, దానికి పర్యాయంగా వేరే ప్రమాణం దొరకలేదు. అందుచేత, ప్రకాశంగారు ఈ కాలేజీలలో ఒక పద్ధతి చెప్పారు. నూటికి యాభై సీట్లు మొట్టమొదట విద్యార్థుల మార్కులననుసరించి ఇవ్వవలసిందనీ, తక్కిన యాభై సీట్లను అప్పుడు అమ

లులో ఉన్న కులమువారీ నిష్పత్తి ప్రకారము ఇవ్వవలసిందనీ కేబినెట్ ముందు తీర్మానం ప్రతిపాదించారు. అయితే, కేబినెట్‌లో మంత్రులు నూటికి ఇరవై చోట్లే మార్కులనుబట్టి యివ్వవలసిందనీ, మిగిలిన చోట్లు కులమువారీ నిష్పత్తి ప్రకారము ఇదివరకు లాగానే ఇవ్వవలసిందనీ తీర్మానించారు.

## న్యాయ, కార్యనిర్వాహక శాఖల విభజన

ప్రభుత్వాలు, తమ పలుకుబడిని నిలబెట్టుకొనేందుకు, లా అండ్ ఆర్డర్‌తో సంబంధించిన అనేక విషయాలను, న్యాయస్థానాలకు వదలక, తమ చెప్పు చేతలలో ఉన్న మాజిస్ట్రేట్ల చేతులలో ఉంచడం మామూలు. అందుచేత, కాంగ్రెసువారు దాదాపు నలభై, యాభై ఏండ్ల నుంచి ఎగ్జిక్యూటివ్‌నుంచి జ్యుడిషియరీని (ప్రభుత్వ కార్యనిర్వాహకశాఖ నుంచి న్యాయశాఖను) సంపూర్ణంగా విడదీయవలసిందని కోరుతూ వచ్చారు.

రాజాజీ మంత్రివర్గంలో 29-3-38 న ఈ ప్రశ్న ఉదయించినపుడు, "ఈ సమస్య పరిష్కరించడానికి ఆర్థిక సంబంధమైనవీ, పరిపాలనా సంబంధమైనవీ అయిన అనేకమైన క్రొత్త సమస్యలు ఉద్భవిస్తాయి గనుక, వీటిని విడదీయాలని అసెంబ్లీలో ప్రతిపాదించిన తీర్మానాన్ని ప్రభుత్వం తిరస్కరిస్తున్నది" అని కాబినెట్ తీర్మానం వ్రాయించారు.

కానీ, ప్రకాశంగారు 1946 లో ముఖ్యమంత్రి కాగానే, భాష్యంతో చెప్పి, కుట్టి కృష్ణమేనోన్ అనే న్యాయవాది అధ్యక్షతను ఏర్పరచిన ఉపసంఘం సలహా ప్రకారం కాంగ్రెసువారి చిరకాల వాంఛను తీర్చి, ఆ విభజనను ఏమీ ఆర్భాటం లేకుండా అమలులోకి తెచ్చారు.

## ప్రకాశంగారి దృఢ చిత్తత

పార్టీలో ఉన్న తమ ఎదురు పక్షంవారు చేస్తున్న ప్రచారమెంత ముమ్మరంగా ఉన్నా, ప్రకాశంగారు కొంత సమత, సహన

భావాలను ప్రదర్శించేవారు. 1947 మార్చిలో, పార్టీలో ఆయనకు ఎదురు పక్షంలో ఉన్న మూడు వర్గాలవారూ ఏకమయ్యారనీ, ఆయనమీద విశ్వాసరాహిత్య తీర్మానం ప్రతిపాదిస్తారనీ పత్రికలలో వార్త పడగా, శాసన సభలో ప్రతిపక్షంవారు ఆ ప్రశ్న లేవదీశారు.

ఆ విషయంపై మాట్లాడుతూ ప్రకాశంగారు ఇలా అన్నారు :

"మాలో మాకు భేదాలున్నాయని మీరంతా అంటున్నారు. నేను ఒక మాట చెబుతాను వినండి. ఈ కాంగ్రెసుపార్టీకి తన పని ఎలాగు చేసుకోవాలో తెలుసు. భేదాలు ఒకప్పుడు ఉంటాయి. ఒకప్పుడు అవి అపమార్గం కూడా పట్టవచ్చు. కానీ, అధ్యక్షా! నే నొకటి మనవి చేస్తున్నాను. ముఖ్యమైన విషయాలపై మా పార్టీలో భేదాభిప్రాయాలు లేవు. ఈ మంత్రివర్గం ఎన్నాళ్ళుంటుందని ప్రతిపక్షంవారెవరో అడిగారు. ఇప్పుడిక్కడ ఉన్న మంత్రులు రేపు లేకపోయినా, రేపు వచ్చేవారూ కాంగ్రెసు వారేగాని ఇంకొకరు కారు. మాకు భేదాలు లేవని చెప్పాను. అందుచేత రేపు వారు కూడా ఇప్పుడు నడిపిస్తున్న విధానాలనే నడిపిస్తారు."

ప్రకాశంగారు ఈ మాటలు గాంధీగారు తమ స్కీములను ఆమోదించి, ప్రశంసించారన్న ధైర్యంతో చెప్పగలిగి ఉంటారు. కానీ, పార్టీలో తమ కెదురుగా ఉన్నవారు తమ్ముకాదన్నపుడు గాంధీగారు మరి మాట్లాడరన్న సంగతి ఊహించుకోలేకపోయారు. నా వంటి వాళ్ళము కూడా అది ఊహించలేకపోయాము.

ప్రకాశంగారు ఇంకా ఇలా అన్నారు :

"నేను ఈ ప్రజారంగంలో 26 సంవత్సరాలుగా పని చేస్తూ వస్తున్నాను. ఈ శాసన సభలో ప్రధాన మంత్రిగా కూర్చుండడమే ప్రధాన లక్ష్యంగా పెట్టుకొని పబ్లిక్ రంగంలో నే నా పని చేయలేదు. ప్రజాసేవకుడిగానే నేను పరిపాలన సాగిస్తున్నాను. నన్నిక్కడికి పంపించిన ప్రజలకు నేను ఎలా

రాజునౌతాను? మినిస్టర్ అన్న ఇంగ్లీషు క్రియకు 'ప్రజలకు కావలసిన అవసరాలు తీర్చు' అని అర్థము. అది తీర్చేవాడు మినిస్టరు. మినిస్టరు ప్రజలకు సేవకుడు. ఆ సేవాధర్మం సరిగా నిర్వహించకపోతే, మినిస్టర్లు అవతలికి పోవలసిఉంటుంది. అటు వంటి సేవ చేసే సమయంలో మాలో మా కేమైనా భేదాభి ప్రాయాలు వస్తే వాటిని సర్దుకొనే సమృద్ధి మాలోనే ఉదయించాలి. కాని, ఈ భేదాల దుష్పరిణామం పరిపాలనమీద పడకూడదు ''

ఈ సందర్భంలో గాంధీగారు, ప్రకాశంగారికి వ్రాసిన ఉత్తరం జ్ఞాపకం తెచ్చుకోవాలి. అది యిది :

"కేంద్రప్రభుత్వంవారు మీకు, మీ ప్రభుత్వం మరకదుళ్ళు తప్పక తీసుకోవాలి అని వ్రాసిన ఉత్తరం. మీ మీద సవాలు, చర్ఖా (రాట్నం) మీద చేసిన సవాలు, నోరూ వాయీలేని చెన్న రాష్ట్ర ప్రజలపై చేసిన సవాలు. ప్రజలు మీ పక్షమే ఉన్నారని నేను భావిస్తున్నాను. అందుచేత కేంద్రప్రభుత్వంవారు చేసిన సవాలును మీరు అంగీకరించండి. (అంటే, మర కదుళ్ళను తిరస్కరించమని భావము.) చెన్నరాష్ట్ర ప్రజలకేగాక, భారతీయ మానవ లోకమంతటికీ మీరు ఉపకారం చేసిన వారవుతారు."

గాంధీగారు తమ స్కీములవిషయమై ఇంత గట్టిగా వ్రాయడంచేతనే, తాము లేకున్నా తమ స్కీములు నడుస్తాయని ప్రకాశంగారు భావించారు.

మొదట్లో ఫిర్కా అభివృద్ధి ఉద్యమం పెద్దదేమోనని గాంధీగారు అభిప్రాయ పడ్డారు. అయితే, ప్రకాశంగారు ఇరవై ఐదు ఫిర్కాలలో పని సాగించడం ఒక పెద్ద కష్టం కాదన్నారు. గాంధీగారు తృప్తి పొందారు. తనకు స్కీములు వివరించి చెప్పడానికి వచ్చిన అధికారి (టి. రాఘవరావుగారి)తో, గాంధీగారు, "ప్రకాశంగారి స్కీము అంతా ఇదివరకు ఎవరూ అమలుపరచడానికి పూనుకోలేదు. చెన్నరాష్ట్రం ఈ

ప్రణాళికను సాధించి జయం పొందితే, భారతదేశమంతా దాన్ని సాధించి జయం పొందగలిగిందన్న మాటే. తమపైన వ్యతిరేక భావం నాకు లేదని ప్రకాశంగారితో చెప్పు'' అన్నారు.

ఈ విషయాలు ఇలా ఉంచి, మరొక విషయంలోకి వెళదాము. 1947 మొదటే పబ్లిక్ సేఫ్టీ అక్ట్ పాసు చేయవలసివచ్చింది. దీని నమూనా కేంద్రంనుంచి వచ్చింది. బిల్లు ప్రవేశపెట్టేముందు ఎవరినైనా ఒకరిని డిటెన్షన్ (కోర్టులో విచారణ జరపకుండా నిర్బంధము)లో ఉంచినట్టయితే, న్యాయా న్యాయాల పరిశీలనకై సలహా సంఘం (ఎడ్వైజరీ కౌన్సిల్) ఏర్పాటు చేయడానికి ఈ బిల్లులో ఒక సెక్షన్ కలిపి ప్రవేశపెట్టడం జరిగింది. ఈ విధంగా సలహా సంఘానికి ఏర్పాట్లు ప్రప్రథమంగా చెన్నరాష్ట్రంలోనే జరిగాయి. విదేశీయుల పరిపాలనలో జైళ్ళలో మగ్గిన కాంగ్రెసువాదులకు, ఇటువంటి శాసనం గొంతుకలో పచ్చి వెలగకాయ వంటిది. సెప్టెంబరులో పదవీ స్వీకారం చేసిన కేంద్ర మంత్రివర్గంలో హోమ్‌శాఖామాత్యులైన సర్దార్ వల్లభభాయ్ పటేలు గారు ఈ బిల్లు నమూనా పంపిస్తూ, చెన్నరాష్ట్ర ప్రభుత్వ ముఖ్యమంత్రి అయిన ప్రకాశంగారికి ఒక ఉత్తరం వ్రాశారు. దాని సారాంశం ఇది:

''రాజ్యపరిపాలన స్వీకరించినవారికి, అనధికారంగా పూర్వం వారు చెప్పిన సూత్రాలు కొన్ని, పరిపాలనా సమయంలో వర్తించవు. అధికారంలో ఉన్నపుడు సంఘ రక్షణ, ఆత్మరక్షణ చేసుకోవలసిన అగత్యం ప్రభుత్వానికి ఉంటుంది. ప్రభుత్వాన్ని పడద్రోయదలచుకొన్న వారు, సంవిధానమందు (కాన్సిట్యూషన్‌లో) చెప్పిన ప్రజాతంత్రానికి (డెమొక్రాటిక్ ప్రాసెస్‌కు) విరుద్ధంగా ప్రవర్తించినపుడు ప్రజాతంత్ర ప్రాతిపదికపైన నిర్మితములైన శాసనాలు వారి ప్రవర్తనను లొంగదీయడానికి సరిపోవు. సంవిధానానికి వ్యతిరేకంగా వెళ్ళేవారు అమలులో ఉన్న శాసనాలు చదువుకున్నవారే అయిఉంటారు. పట్టుబడకుండా సంవిధాన వ్యతిరేకమైన (అన్ కాన్‌స్టిట్యూషనల్) పద్ధతులు అవలంబించినపుడు, వెంటనే వారిని అదుపులోకి తేవలసిఉంటుంది. అయితే, వారి స్వేచ్ఛ కూడా ప్రధానంగా సంరక్షించవలసిన హక్కే కాబట్టి,

న్యాయవిరుద్ధంకానిపద్ధతిలో పోవడం ప్రతి ప్రభుత్వానికీ అత్యవసరము.''

దేశ పరిస్థితులే ఇటువంటి శాసనాలకు మూలకారణము. కాంగ్రెసు శాసన సభ్యుల పార్టీ సమావేశంలో తర్జన భర్జన కొంత జరిగిన తర్వాత, పటేలుగారి ఉత్తరాన్ని ప్రకాశంగారు చదివి వినిపించగా అందరూ బిల్లును ఆమోదించారు. శాసన సభలో, ప్రతిపక్షులు సంప్రదాయానుసారం అభ్యంతరాలు చెప్పినా, మొత్తంమీద ఆ బిల్లు నిరాటంకంగానే ఆమోదింపబడింది.

## రాజాజీ హాలు

ఫోర్టు సెంట్ జార్జిలో శాసన సభ జరుపుకునేందుకు, 1919 లో గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు ఆమోదమయిన తరువాత, ఒక హాలు నిర్మించారు. కాని, అది విస్తృతమైన అప్పటి శాసన సభను జరపడానికి ఎంత మాత్రమూ చాలదు. అది అలా ఉండగా, అప్పటికి శాసన సభ్యులకు సరి అయిన వసతి గృహాలు లేవు.

నగరంలో మౌంటురోడ్డు నానుకొని గవర్నరుగారి బంగళా ఆవరణ ఉండేది.

యుద్ధానంతరం గవర్నరు ఆ బంగళాలో నివసించేవారు కారు. చెన్నపట్నానికి ఎనిమిది, తొమ్మిది మైళ్ళ దూరంలో ఉండే గిండీలో నివసించేవారు.

ఇక్కడ గవర్నరు బంగళాను అనుకొని- విందులు జరుపుకొనేందుకు పెద్ద పెద్ద స్తంభాలతో ఒక ప్రత్యేకమైన భవనం ఉండేది. శాసన సభ సెనేటు హాల్లో జరుగుతున్నపుడు శాసన మండలి సమావేశాలు ఈ విందుల భవనంలో జరుగుతూండేవి. గవర్నరు ఆవరణ మొత్తం నూట పది ఎకరాలు ఉండేది. యుద్ధకాలంలో గవర్నరుకు దగ్గరగా ఉండవలసిన ఒకరిద్దరికి కూడా చిన్న భవనాలు ఆ ఆవరణలోనే నిర్మింపబడ్డాయి.

ఈ భవనంతో సహా, గవర్నరుగారు తన మౌంటురోడ్డు భవనము, ఆవరణ ప్రభుత్వ ప్రయోజనాలకని ప్రభుత్వానికి అప్పజెప్పాలని,

గవర్నరును రాజాజీ తాము ముఖ్యమంత్రిగా ఉన్నపుడు కోరారు. ఆ కోరిక ఫైలు రూపంలో గవర్నరు దగ్గరికి వెళ్ళింది. గవర్నరు దాని పైన, "నేను ఈ భవనము, ఆవరణ ఏదీ ప్రభుత్వానికి అప్పగింప దలచుకోలేదు. దీనికింత ఫైలు ఎందుకు పెంచారు?" అని వ్రాశారు. దాంతో ఆ ప్రసక్తి అప్పుడే వదలుకున్నారు.

ఎనిమిది, తొమ్మిది సంవత్సరాల తర్వాత, ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయినపుడు, అప్పటి గవర్నరు 'నై'గారితో ఆ ఆవరణ అంతా ప్రభుత్వానికి అప్పజెప్పవలసిందని చెప్పారు. ఆ రోజున గవర్నరుగారికి—ప్రకాశంగారు, వారితోబాటుగా నేను- ఫోర్టులోని సచివాలయం, శాసన సభ ఎంత ఇరుకుగా ఉన్నవో చూపించి, మౌంటు రోడ్డు భవనంలోకి వెళ్లాము. గవర్నరుకు బంగళా అన్ని అంతస్తులు చూపించాము.

విందుల హాలు ప్రస్తుతం గవర్నరుగారికి ఏమీ ఉపయోగం లేకుండా ఉన్నదనీ, ప్రభుత్వానికి అనేక విధాలుగా ఉపయోగకరం అవుతుందనీ చూపించాము. ఇంతేగాక, శాసన సభ్యుల వసతి సౌకర్యాలకు గల ఇబ్బందులను గూడా చెప్పాము. ఆయన ఆలోచించుకొనడానికి రెండు, మూడు రోజులు వ్యవధి కోరారు.

తరువాత ఆయన, "వాడుకొనేందుకైతే ఇస్తాము. మీ ప్రభుత్వపు ఆస్తి క్రిందకు ఎందుకు ఇవ్వా"లని ఒక ప్రశ్న లేవదీశారు. అప్పుడు, "ఆ విధంగా మేము వాడుకొంటే మరమ్మత్తులు వగయిరా ఖర్చులు గవర్నరు అకౌంటులోనే పెట్టుకొంటారా?"అని ప్రశ్నించాము. "వాడుక మీది, ఖర్చు నాది - ఎలా కుదురుతుంది?" అని ఆయన ప్రశ్నించారు.

"హక్కు గవర్నరు దయితే ప్రభుత్వంవారు మరమ్మత్తుల కెందు కంత ఖర్చుపెట్టాలి? అందులో క్రొత్త భవనాలు కట్టుకోవచ్చా, కూడదా? ఇంతకూ గిండీలో ఉండే గవర్నరుగారు పది మైళ్ళ దూరాన, తనకు వాడుకకు అక్కరకురాని మౌంటురోడ్డు భవనంపై ఎందుకు ఖర్చు పెట్టాలి? అపుడు, గవర్నరు కిచ్చే అలాట్‌మెంటు ఈ ఖర్చులు

భరించడానికి సరిపోతుందా?''—ఇత్యాది అనేక ప్రశ్నలు అనవసరంగా లేస్తాయనీ, ఇంతకూ గవర్నరు నివసించే బంగళాలు, భవనాలు పాత పద్ధతి ప్రకారం గవర్నరు పేరిట ఉన్నా, అవికూడా చెన్నరాష్ట్రపౌరులు పన్నుల మూలంగా ఇచ్చిన డబ్బుతో కొనబడినవే అనీ, మౌంటురోడ్డు ఆవరణ కొనినప్పటి లెక్కలు మొదలైనవి ఆయనకు ఒక రెండుగంటలు ప్రకాశంగారు ముఖాముఖి చర్చలో తెలియజేశారు.

ఆయన మరల, నిర్ణయించుకోవడానికి మరికొంత వ్యవధి అడిగారు.

ఆ తర్వాత, మరొకమారు ఈ విషయం ఒక పావు గంటసేపు మాటాడిన తర్వాత, మౌంటురోడ్డులోని గవర్నరు బంగళా, యావదాస్తి ప్రభుత్వంపేర నమోదు చేయడానికి ఆర్డరు జారీ అయింది.

ఇది జరిగిన కొంత కాలానికి ప్రకాశంగారి ప్రభుత్వం పడిపోయింది. తర్వాతి ప్రభుత్వంవారు, ఈ ఆస్తి నంతటినీ ప్రభుత్వపరంగా వ్రాయించిన ప్రకాశంగారి విషయం మరిచిపోయి, ప్రయత్నించి విఫలులైన రాజాజీ పేరిట ఆ విందుల హాలుకు 'రాజాజీ హాలు' అని నామకరణం చేశారు.

ఆ పేరుతోనే అది యిప్పటికీ ఉన్నది.

## విదేశాల్లో ఉన్నత విద్యకు స్కాలర్ షిప్పులు

ప్రకాశంగారి ప్రభుత్వం ఏర్పాటయిన కొద్ది రోజులకు ఒక ఫైలు వచ్చింది. పట్టభద్రతానంతర ఉన్నత విద్యా శిక్షణకై ప్రభుత్వం వారిచ్చే వేతనాలపైన, నూట నలభై మందిని విదేశాలకు పంపడానికి కేంద్ర ప్రభుత్వం వారి ప్రతిపాదన అందులో ఉన్నది. రెండు వందల పైగా విద్యార్థుల పేర్లు, వారి అర్హతలు వ్రాసి, అందులో ప్రభుత్వానికి తోచిన నూట నలభై మంది పేర్లు *ఖాయం చేయాలి.

మామూలు ప్రకారం సచివాలయంవారు, వారికి తోచిన సూచనలు చేశారు. అటువంటి వాటిలో సాధారణంగా మంత్రులు వ్యక్తి

* ఈ సంఖ్య నాకు సరిగా జ్ఞాపకం ఉండక పోవచ్చును.

గతంగా జోక్యం కల్పించుకోరు. ప్రకాశంగారి సంతకం కోసం ఆ ఫైలు అందిస్తున్నప్పుడు రెండు మూడు కాగితాలు అటూ ఇటూ తిప్ప డంలో విద్యాశాఖ మంత్రి వ్రాసిన మినిటు (ఫైలుమీద మంత్రులు వ్రాసే అభిప్రాయం లేక నిర్ణయము) కంటబడింది. అందులో ఒక పంక్తి కంట్లో కొట్టినట్టుగా పైపయి ఉంది. అది—"నెంబరు - పేరు గల అభ్యర్థి బ్రాహ్మణుడు. అతని పేరు తీసివేయండి. ఈ నెంబరుగల ఆసామి పేరు ఇక్కడ కలపండి," అని.

జస్టిస్‌పార్టీ మంత్రి అయినా బహుశః అలా వ్రాసి ఉండడు. ఎందు కిలా వ్రాశాడని ఫైలులో ఆ పేర్లుగల విద్యార్థుల అర్హతలు చూశాము.

తీసివేయవలసిందనే సూచనగల అభ్యర్థి ఆంధ్రా యూనివర్సిటీ నుంచి ఆనర్సు ఫస్ట్ క్లాస్‌లో పాసయిన విద్యార్థి. రెండవ అభ్యర్థి దక్షిణ జిల్లాలలోంచి మూడవ క్లాసులో పాసయివచ్చిన విద్యార్థి. ప్రకాశంగారు విద్యామంత్రిగారి సూచన కూడదని, తిరిగి సచివాలయం వారు చెప్పిన సూచననే సమర్థించారు.

కార్య నిబంధనల ప్రకారం ఈ ఫైలు విద్యామంత్రికి వెళ్ళింది. అప్పటికి ఆయన వివేకం తెచ్చుకొని, ప్రకాశంగారు చెప్పిన దానికి ఒప్పుకొని సంతకం పెట్టేశాడు. ఆ మంత్రే మెడికల్, ఇంజనీరింగు కాలేజీలలో మార్కుల ప్రకారంగా నూటికి యాభై స్థలాలు ఉంచాలని చెబితే కాదని, కులము వారీగా ఉండాలని వాదించిన వ్యక్తి.

## వానియంబాడి అల్లరులు

ఒక రోజు తెల్లవారు జామున మూడు గంటలప్పుడు, ప్రతిపక్ష నాయకుడైన ఇస్మాయిల్ సాహేబుగారు, మరి కొంతమంది ముస్లిం సోదరులూ కలిసివచ్చి, ప్రకాశంగారిని నిద్రనుంచి లేపారు. వారు - వానియంబాడిలో హిందువులకు, ముస్లింలకు తగాదా వచ్చి, ముస్లింల తోళ్ళ కర్మాగారాలు, గొడౌనులు తగుల పెట్టారని చెప్పి, అగ్నిజ్వాలలు రాత్రి మొదలు అప్పటి దాకా ఆకాశం ఎత్తున లేస్తున్నాయనీ, కనుక

ప్రకాశంగారు ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌కు ఫోన్‌చేసి వానియంబాడీ ముస్లింలకు తక్షణ రక్షణకు ఏర్పాట్లుచేయించవలెనని ప్రార్థించారు.

ప్రకాశంగారు, "ఇస్మాయిల్ సాహేబుగారు! మీరు ప్రతిపక్ష నాయకులు. నేను ముఖ్య మంత్రిని. ఈ పని మన ఇద్దరిదీ. మనము లేనిదే పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ ఏమి చేయగలడు? వెంటనే మనం ఇక్కడనుంచే బయలుదేరుదాము" అని వారితో చెప్పి, వెంటనే కారులోకి దూకారు. తాము అక్కడికి బయలుదేరి వెళుతున్నట్టుగా ఇన్‌స్పెక్టర్ జనరలుకు ఫోను చేయించారు.

వారిద్దరు వానియంబాడి చేరుకునేసరికి, పట్టపగలు సూర్యకాంతిలా పొగలు కమ్ముకుంటున్న ఎట్టని అగ్ని జ్వాలలు ఎత్తుగా లేస్తూనే ఉన్నాయి.

ఆ సాయంకాలం లోపున అక్కడ శాంత పరిస్థితులు కల్పించి, రాత్రికి మళ్ళీ ప్రకాశంగారు చెన్నపట్నం తిరిగి వచ్చారు.

ఇటువంటి సాహసం ఆయన కుండడంచేతే, తర్వాత ఆయనపై విశ్వాస రాహిత్య తీర్మానం వచ్చినపుడూ, ఆ తర్వాత ప్రకాశంగారు తమ్ము పదవిలోంచి దించివేసిన మంత్రులపై అధికార దుర్వినియోగం చేసిన నేరాలపై చర్చ జరిగినపుడూ ముస్లిం సభ్యుల సానుభూతి సంపూర్ణంగా ప్రకాశంగారి పైనే ఉండేది.

## డాక్టర్ బి. విశ్వనాథ్

డాక్టర్ బి. విశ్వనాథ్, డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్‌గా ఉండేవారు. ఆయన విజయనగర వాస్తవ్యుడు. ఇక్కడ పరీక్షలలో ఉత్తీర్ణుడయ్యే అవకాశాలు లేనందున, విదేశాలకు వెళ్ళి, వ్యవసాయ సంబంధమైన పెద్ద డిగ్రీలు పొంది, ఢిల్లీలోని పూసా వ్యావసాయిక మహా సంస్థకు పెద్ద అయ్యాడు. ఆ తర్వాత, యుద్ధ సమయంలో భోర్ కమిటీ అనే సంఘంలో దేశపు ఆహార, ఆరోగ్య విషయమై బాగా పరిశోధించినవాడు.

అంత పెద్ద అర్హతలుగల వానిని మన రాష్ట్రంలో వ్యవసాయ

శాఖకు పెద్దగా చేస్తే మనకు లాభిస్తుందని - ప్రభుత్వం ఆయనతో కొన్ని షరతులు కుదుర్చుకొని, డైరక్టర్ ఆఫ్ అగ్రికల్చర్‌గా నియమించింది. కృష్ణ, గోదావరి డెల్టాల భూసారం విషయంగాను, తంజావూరు డెల్టా భూసారం గురించీ చాలా పరిశోధనలు చేసి, నివేదికలు సమర్పించిన ఉద్యోగి ఆయన.

అప్పటి వ్యవసాయ శాఖ మంత్రి- రాజపాళయానికి చెందిన టి. ఎస్. కుమారస్వామిరాజా, తరువాత ప్రకాశంగారి మంత్రివర్గ పతన కారకులలో ఒకడు. ఆ తరువాత ప్రకాశంగారిని పడద్రోసిన రామస్వామి రెడ్డిగారిని పడద్రోసి, 1949 లో తానే ముఖ్యమంత్రి అయ్యాడు. ఆ తరువాత 1950 లో ఒరిస్సా గవర్నర్‌గా ఉన్నాడు.

అప్పటి వ్యవసాయ కార్యదర్శి సుందరం అనే ఐ. సి. ఎస్. ఉద్యోగి.

కుమారస్వామిరాజాగారు, చాలా చీటీలను ఉద్యోగుల నియామకం, బదిలీలు, ప్రమోషన్ల విషయంగా ప్రతిరోజూ డాక్టర్ విశ్వనాథ్ గారికి పంపిస్తూ ఉండేవాడు. అది మొదట్లో మా కెవరికీ తెలియదు.

ప్రకాశంగారి గదిలోకి విశ్వనాథ్‌గారు చనువుగా వెళ్ళడము, రావడము సుందరంగారు కనిపెట్టి కోపం తెచ్చుకుంటూండేవారు.

కుమారస్వామిరాజావారు పంపించిన సిఫారసులలో కొన్ని మాత్రమే డాక్టర్ విశ్వనాథ్‌గారు కార్యరూపంలో పెట్టగలిగేవారు. హెచ్చు భాగం త్రోసివేయడంవల్ల కుమారస్వామి రాజాకు కూడా విశ్వనాథ్‌గారిపై ఆగ్రహం పెరుగుతూ వచ్చింది.

ఈ అన్ని కారణాలు కలిపి- ఒక రోజున ఏవో చిల్లర కారణాలుగల ఒక ఆరోపణ డాక్టర్ విశ్వనాథ్‌గారిపై చేసి, ఆయనను డిస్మిస్ చేయవలసిందని సుందరంగారి నోటుపైన, కుమారస్వామి రాజాగారు అంగీకార సూచకంగా సంతకం పెట్టారు.

ఆ ఫైలు ప్రకాశంగారికి వచ్చింది.

అంతకు కొంచెం ముందుగానే ఈ వాసన తగిలి, డాక్టర్ విశ్వనాథ్‌గారు- తనకు కుమారస్వామి రాజాగారు పంపిన సిఫారసు చీటీలు

ఒక వందదాకా తెచ్చి, వాటిలో పదో పదిహేనో తప్ప తక్కినవి అంగీకరించక పోవడంవల్ల తనకా ఇబ్బంది కలుగుతున్నదనీ, ఢిల్లీలో అంతకన్నా పెద్ద ఉద్యోగం చేస్తున్నప్పుడు ఇటువంటి ఇబ్బందులు రాలేదనీ, తా నీ ఉద్యోగం వదలుకుంటాననీ చెప్పడానికి ప్రకాశం గారి దగ్గరికి వచ్చాడు.

ఇంతట్లో సుందరంగారినుంచి ఆయనను డిస్మిస్ చేయాలని ఫైలు మీద ఫైలు వచ్చింది. ఏ ఫైలులోను రెండు, మూడు కాగితాల కంటె ఎక్కువ ఉండేవి కావు. వారే నేరారోపణ చేయడము, వారే తీర్పు చెప్పివేయడము—అంతమాత్రమే అందులోని విషయము.

ఈ వ్యవహారం క్రమబద్ధం కానందున, విషాద పరిణామాలకు దారి తీయకుండా ఆపివేయడానికి వీలైనది.

## పార్లమెంటరీ సెక్రటరీలు

1937 లో మంత్రివర్గం ఏర్పడినపుడు, ఇంగ్లండులో వలెనే ఇక్కడా పార్లమెంటరీ సెక్రటరీల పద్ధతి ప్రవేశపెట్టడం జరిగింది. పరిపాలనలో వీరికి భాగం కల్పించాలని ప్రకాశంగారి ఉద్దేశము. కానీ, పై ఉద్యోగులుగా ఉన్న ఐ. పి. ఎస్. వారు దీనికి సంపూర్ణంగా వ్యతిరేకులు. వారి అభిప్రాయ ప్రకారంగా మంత్రులు ఒక రోజు ఉండి, మరొక రోజు వెళ్ళేవారు గనుకా, తాము ముప్పైఏండ్లబట్టి ఉద్యోగంలో ఉండడంవల్ల ప్రభుత్వపు పోకడలు పూర్వాపరాలు తెలియగలవు గనుకా, మంత్రులు వ్యవధిలేక చూడలేని కాగితాలను తామే చూసి, ప్రభుత్వమే ఆర్డరు జారీ చేసినట్టు చేసే హక్కు తమకు ఉండాలి.

ఈ అభిప్రాయప్రకారంగా నూటికి 75 పైళ్ళకుపైగా మంత్రులకు సంబంధం లేకుండా ఆర్డర్లు జారీ చేసే పద్ధతిలో పరిపాలన సాగుతూండేది. ప్రజారాజ్య సూత్రానికి ఎన్నికైన మంత్రులు ప్రభుత్వ పక్షాన నిర్ణయం తీసుకొని, ఆర్డర్లు జారీ చేస్తున్నారని ప్రజలు అనుకొనేవారు. వారి అభిప్రాయానికి ఈ అలవాటు వ్యతిరేకమైనది. ఇటువంటి అలవాటు మన సచివాలయాలకు ఇంగ్లండునుంచి దిగుమతి

అయింది. ఈ పద్ధతి తప్పు అని చెప్పడానికి నే నొక ఉదాహరణ చూపించాను.

పీనల్ కోడ్ ప్రకారం ప్రభుత్వపక్షాన కొన్ని ప్రాసిక్యూషన్లు (అనగా, మేజిస్ట్రేటు కోర్టులలో దోషులపై చర్యలు) తీసుకొనే ముందు, ప్రభుత్వంవారి శాంక్షను కావాలని ఆదేశింపబడి ఉన్నది. ప్రజాప్రభుత్వ మనే సూత్రం అమలులోకి రాకపోయినా, 1914 లో, ప్రకాశంగారు ప్రాక్టీసు చేస్తున్న రోజులలో, వరదరాజులు నాయుడుగారనే వారిపైన రాజద్రోహం చేశారనే నేరం ఆరోపింపబడి, మేజిస్ట్రేటు కోర్టులో చర్య ఆరంభమయింది.

విచారణ సమయంలో, ప్రభుత్వం—అనగా ఎగ్జిక్యూటివ్ కౌన్సిలర్‌వరకు ఫైలు వెళ్ళకుండానే, కార్యదర్శి సంతకంపైన చర్య లరంభమైనట్టు, కార్యదర్శి కోర్టులో దాఖలు చేసిన ఒక ఎఫిడవిట్టువల్ల బయట పడింది. ఈ విషయమై అప్పీలు వింటున్నప్పుడు హైకోర్టు వారు ప్రభుత్వం అని చెప్పినచోట కార్యదర్శి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలరు ప్రమేయం లేకుండా ఏ ఆర్డరు జారీ చేయలేడనీ, అటువంటి ఆర్డరు చెల్లదనీ తీర్పు చెప్పారు.

అటువంటి పరిస్థితులలో, ప్రజా ప్రభుత్వ సూత్రం అమలు పరిచే మనదేశంలో మంత్రిదో, పార్లమెంటరీ సెక్రటరీదో అయినా అనుమతి లేకుండా—కార్యదర్శులు ఆర్డర్లు పాస్ చేయజాలరనీ, మంత్రులకు వ్యవధి లేనప్పుడు ఏ ఆర్డరు పాస్ చేయాలో, పార్లమెంటరీ సెక్రటరీల ఎరుకపైగాని, అనుమతిపైగాని కార్యదర్శులు వ్యవహరించాలనీ చెప్పిన అభిప్రాయంతో ప్రకాశంగారు సంపూర్ణంగా ఏకీభవించారు.

దానిపై, ఐ. సి. ఎస్. ఉద్యోగులందరూ కలిసి, పార్లమెంటరీ సెక్రటరీ అనే అతనికి ఫైలులో విషయం మాట అటుంచి, అసలు ఫైలు ముట్టుకొనడానికే హక్కు ఉండకూడదని వాదించారు. అసలు, కార్యదర్శులకు ఆర్డర్లు పాస్ చేసే హక్కు ఏ శాసన పూర్వకంగాను సంక్రమించలేదు. అయినా, రాజాజీ ప్రకాశంగారితో ఏకీభవించలేదు. కాని, 1946 లో ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయినపుడు, పార్ల

మెంటరీ సెక్రటరీలకు ఆ హక్కును మంత్రివర్గంచేసే కార్యనిబంధనలకు లోబడి సంక్రమింపచేస్తారని అనుకున్నాము. అయితే ఆ సమయంలో శొంఠి రామమూర్తిగారు (ఐ.సి.ఎస్) ముఖ్య కార్యదర్శిగా ఉండేవారు. ఆయన ప్రజాహితైక జీవి. న్యాయబుద్ధి, విజ్ఞానము కలవాడే అయినా, ఇంగ్లీషు ఐ.సి.ఎస్. ఉద్యోగులకన్నా హెచ్చుగా ఐ సి. ఎస్. తత్త్వం ఆయనలో ఉండేది.

ఈ సమయంలో నేను, ప్రకాశంగారికి ఇంగ్లండులో జరిగిన ఒక ఉదంతం చెప్పాను.

ప్రపంచ యుద్ధమప్పుడు దేశ సంరక్షణ నిబంధనల క్రింద ప్రభుత్వం, ఏ వ్యక్తినైనా దేశరక్షణకు ప్రతికూలుడుగా ఉన్నాడని భావించితే, ఏ విచారణా లేకుండా కారాగృహంలో ఉంచవచ్చుననే నిబంధన ఉండేది.

ప్రభుత్వం (అనగా మంత్రి) ప్రమేయం లేకుండానే ఒక వ్యక్తిని కారాగృహంలో ఉంచడానికి ఒక కార్యదర్శి ఆజ్ఞ జారీ చేశాడు. ఆ వ్యక్తి ఇది అక్రమమని హైకోర్టులో రిట్ ఇవ్వవలసిందని పిటీషన్ దాఖలు చేసుకొన్నాడు. హైకోర్టువారు-ప్రభుత్వం, మంత్రి అన్నచోట కార్యదర్శి మంత్రి ప్రమేయం లేక ఎన్నడూ ఆర్డర్ పాస్ చేయలేడని తీర్పు ఇచ్చారు.*

1946 లో ఐ.సి.ఎస్. ఉద్యోగుల అభ్యంతరమే కాక, లోగడ 1938 లో పార్లమెంటరీ సెక్రెటరీగా ఉన్నపుడు పార్లమెంటరీ సెక్రటరీలకు హక్కులు కావాలని వాదించిన మిత్రుడు, 1946 లో మంత్రి అయి, ఆ హక్కులు కూడదని వాదించ సాగాడు.

ప్రకాశంగారికి, రామమూర్తిగారి అభిప్రాయమంటే మంచి నమ్మకము. దానికితోడు, పై చెప్పిన మంత్రికూడా ఐ.సి.ఎస్. ఉద్యోగుల అభిప్రాయాన్ని బలపరచినపుడు—ప్రకాశంగారు, మొత్తంపైన ఎన్నికై, సహచరులుగా ఉన్న పార్లమెంటరీ సెక్రెటరీలకు పైలుచూసే అధికారాలు ఉండవని కాబినెట్‌లో నిర్ణయించారు.

---

* ఆ వ్యక్తి విన్‌స్టన్ చర్చిల్ గారి అల్లుడని నాకు జ్ఞాపకము.

ఇప్పుడు కూడా అదే విధంగా, జీతం పుచ్చుకొని ఉద్యోగంలో ఉన్న ఉద్యోగులే ప్రభుత్వం పేరున. మంత్రుల ప్రమేయం లేకుండానే—పైలు మంత్రివరకు వెళ్ళేటంత ముఖ్యం కాదన్న నెపంపైనో, ఇటువంటి విషయముపై మంత్రి పూర్వం ఒకప్పుడు తన అభిప్రాయం చెప్పాడు గనుక, అదే విధంగా చేతిలోని పైలు కూడా నిర్ణయం కాగలదన్న నెపంపైనో కార్యదర్శులు తామే ఆర్డర్లు జారీ చేస్తుంటారు.

వారికికూడా వ్యవధిలేదన్న నెపంపైన వారి వరకు వచ్చే పైళ్ళలో సగం పైళ్ళను వారి ప్రమేయం లేకుండానే డిప్యూటి సెక్రటరీలు తమకు తోచిన రీతిని ఆర్డర్లు వేయవచ్చనీ, వారికీ వ్యవధిలేదన్న నెపంపైన అసిస్టెంటు సెక్రటరీలుగాని, అండర్ సెక్రటరీలుగాని ఆర్డర్లు పాస్ చేయవచ్చనీ సచివాలయం కార్య నిబంధనలలో వ్రాసి ఉంటుంది. ఈ కార్య నిబంధనలకు గవర్నరు ఆమోద ముద్ర వేస్తాడు. ఈ ఆమోద ముద్రే, శాసనాలు ఏవీ లేకున్నా తమకు అధికారాన్ని సంక్రమింప జేస్తున్నదని ఉద్యోగుల వాదము. మొత్తంపైన ఇపుడు వారి వాదమే ప్రబలమై, ఢిల్లీ ప్రభుత్వంలోను, రాష్ట్ర ప్రభుత్వాలలోను సాగుతున్నది.

ఇందుకు నా కొక మూలకారణం కనిపిస్తూంది. ఈ ప్రధానులు రాజాజీ అయినా, ప్రకాశంగారు అయినా, పండిట్ నెహ్రూజీ అయినా ఒకటే పద్ధతి. బలవంతంగా కొందరిని తమ మంత్రివర్గంలో చేర్చుకుంటారు. అటువంటి వారికి వారి అంగీకార, అనంగీకారాలతో ప్రసక్తి లేకుండా ఆ ముఖ్యమంత్రిగాని, ప్రధానిగాని తనకు తోచిన ఒక శాసన సభ్యుణ్ణి ఆ మంత్రి దగ్గర పార్లమెంటరీ సెక్రటరీగా నియమిస్తాడు. ఆ పార్లమెంటరీ సెక్రటరీ పైన ఆ మంత్రికి విశ్వాసముండదు. మంత్రి తనకు ఇష్టంవచ్చిన కాగితాలను మాత్రం పార్లమెంటరీ సెక్రటరీకి చూపించవచ్చనే రాజీ సూత్రంపైన ఏవైనా కొన్ని కాగితాలను చూపించవచ్చు. లేకుంటే లేదు. పరస్పర విశ్వాసంలేని మనుష్యులను ఒక కూటమిలో చేర్చడానికి యత్నించడంవల్ల, ఈ ప్రతి

కూలతలు ప్రారంభమై, కొన్ని సమయాలలో మంత్రివర్గాలకు చేటును గూడా కలిగిస్తాయి.

ఇన్ని కారణాలవల్ల, పార్లమెంటరీ సెక్రటరీల వ్యవస్థ అంతరించి పోయింది.

అయితే, కేంద్రప్రభుత్వంలో ఇటువంటి దుస్థితి కొంచెం కొందరు డెప్యూటి మంత్రుల విషయంలో ఉండడం కద్దు.

సామాన్య ప్రజానీకానికి మాత్రం, గవర్నమెంటు అనగా మంత్రివర్గం నుంచిగాని, గవర్నరువద్ద నుంచిగాని ఆర్డరు జారీ అయినట్టు ఉన్న కాగితాలు చూచినపుడు, అవి మంత్రుల అనుమతిపైన, ఎరుకపైననే జారీ అవుతున్నాయనే ఒక భ్రమ కదు.

ఆ కాగితాలు ప్రభుత్వం రహస్యంగా ఉంచడానికి శాసనాధికారం ఉండడంవల్ల, అసలు గుట్టు- ఏ వ్యవహారమైనా కోర్టు కెక్కినపుడుతప్ప, ఎవరికీ తెలియదు.

## పరిపాలనలో మరికొన్ని విశేషాలు

మంత్రివర్గం ఏర్పడిన తర్వాత నాడారు వర్గానికి, ప్రకాశంగారి వర్గానికి భేదాలు ఏవీ ఉండవని ఆశించాము. కాని, గాంధీగారు- ప్రకాశం గారితో బాటు గాక, ప్రత్యేకంగా నాడారుగారిని పిలిచిన సాయంత్రం ఏమి బీజం వేశారోగాని, ప్రకాశం నాడారుగార్ల మధ్య ఢిల్లీకి వెళ్ళేముందున్న సామరస్యం ఢిల్లీనుంచి తిరిగివచ్చిన తర్వాత వైమనస్యంగా మారింది. ప్రకాశంగారిలో ఉన్న దోషము లేవో కనిపెట్టడమే నాడారుగారి కార్యక్రమంగా మారింది.

ఇంతేగాక, ఆంధ్రులకు ప్రాముఖ్యం కలగడం తీవ్ర భాషావాదులైన తమిళ సోదరులు కొందరికి నచ్చలేదు. నాయకుని ఎన్నికయిన మరునాటినుంచి సంతోషం చేత ప్రకాశంగారిని అభినందించడానికి, తెలుగు జిల్లాలలోంచి, ముఖ్యంగా గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలనుంచి వచ్చి, ఫోర్టు సెంట్ జార్జిలో సచివాలయం నిండుగా మెండుకొనే ప్రేక్షక తరంగాలు—ఒక నూతన ఆంధ్రత్వాన్ని, పూర్వం

వెంకటాద్రి నాయకుడు ఇచ్చిన స్థలంలో అతడే అప్పుగా ఇచ్చిన డబ్బుతో కట్టిన కోటకు కలగజేశాయి.

ఆంధ్రులు ఒకమూల ప్రత్యేక రాష్ట్రం కావాలని కోరుతున్న సమయంలో, ఈ విధంగా చెన్నపట్నాన్ని తెలుగు వాతావరణంలో ముంచివేయడం ఏమి బాగుంది? ఇందుకు కారణం—కామరాజనాడారు గారు, రాజాజీ విడిపోవడమే గదా! కనుక, ఏలాగైనా వారిద్దరు మనసులు మార్చుకొని ఏకం కాకుంటే, ఆంధ్ర రాష్ట్రం ఏర్పాటయే వేళ చెన్నపట్నం ఆంధ్ర పట్నంగా మారిపోతుందనే భయం కలిగి వారిని కలపడానికి సర్వయత్నాలు సాగించారు.

రాజాజీ కేంద్రప్రభుత్వంలో మంత్రి అయినది మొదలు ఈ స్నేహం గట్టిపడింది. కాన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ (సంవిధాన నిర్ణాయక సభ) సమావేశాలు, వీరిరువురూ పదేపదే కలుసుకోడానికి అవకాశాలు కలిగించాయి. రాజాజీ, నాడారుగారలు గడుసువారు గనుక-కళా వెంకటరావు, గోపాలరెడ్డి వర్గాలను, తాము భాషా ద్వేషాలకు అతీతులని అంటూ తమతో కలుపుకున్నారు.

ఈ విధంగా, ప్రకాశంగారికి కాంగ్రెసులోనే ఎదురు పక్షం నెలనెలకూ గట్టిపడింది. చివరికి, వీరికి తోడుగా ప్రకాశంగారి స్కీముల వల్ల ఆర్థికంగా దెబ్బతిన్న వారంతా ఏకమయ్యారు.

1947 మార్చిలో, పార్టీ మీటింగులో ముప్పైమంది సంతకం పెట్టి, విశ్వాస రాహిత్య తీర్మానాన్ని చర్చించవలెనని నోటీసిచ్చారు. ఫిబ్రవరి 28 న జరిగిన సమావేశంలో ప్రతిపాదించిన ఆ తీర్మానాన్ని ప్రకాశంగారు చదవగానే రూల్ అవుట్ చేశారు. (అనగా, పార్టీ కార్య నిబంధనలకు అటువంటి తీర్మానం ప్రతిపాదించడం వ్యతిరేకమని తీర్పు చేశారు.)

అధ్యక్షునిగాని, కార్యదర్శినిగాని ఎన్నుకొనే పద్ధతి ఉన్న కార్య నిబంధనలలోనే ఆ నిబంధనకూడా ప్రత్యేకంగా వ్రాసి ఉంటే తప్ప విశ్వాస రాహిత్య తీర్మానం ప్రతిపాదించడానికి అవకాశం లేదు. ఏమేటా ఎన్నికైన అధ్యక్షునిపైన విశ్వాస రాహిత్యం అంటూ ఒక తీర్మానం

సంవత్సరం మధ్యలో ప్రతిపాదించడం పార్టీని బలహీనపరుస్తుందని, అటువంటి ఏర్పాటు మా కార్య నిబంధనలలో చేర్చలేదు.

ఈ పై చెప్పిన భాష్యం ఒక వాక్యంలో సూచిస్తూ, ప్రకాశంగారు ఆ తీర్మానాన్ని రూల్ అవుట్ చేశారు. సమావేశం ముగిసిందని ఆయన ప్రకటించారు. అపుడు, సమావేశంలోంచి ఒకరు లేచి, "మీరు సమావేశం ముగిసిందన్నారు గనుక, మేమంతా కలిసి సమావేశ మౌతున్నా" మన్నారు.

అందుకు ప్రకాశంగారు, "మీరు కూర్చున్నప్పటికీ, కార్య నిబంధనల ప్రకారంగా అది శాసన సభ్య సమావేశం కానేరదు. అక్రమ సమావేశమే అవుతుంది," అన్నారు.

అయితే నేమి, తమలో ఒకరైన రామస్వామి రెడ్డిగారిని ముందుకు తీసుకువచ్చి ఒక కుర్చీలో కూచోపెట్టారు. ప్రకాశంగారపుడు మరొక మాట కూడా అన్నారు: "సంవత్సరాంతంలో (మార్చి నెలాఖరులో) జరగవలసిన జనరల్ బాడీ (సర్వసభ్య) సమావేశాన్ని కొంత ముందుగానే సమావేశ పరుస్తాను. మీకు కావలసిన నాయకుణ్ణి అప్పుడు ఎన్నుకోండి. ఈ అక్రమమైన తీర్మానం ఎందుకు? అక్రమమైన నాయకుని ఎన్నిక ఎందుకు?"

కాని, వారది వినలేదు. ఇదంతా జరుగుతున్నపుడు, కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి చెందిన శంకరరావు దేవుగారు అక్కడే మౌనంగా కూచున్నారు. అక్రమంగా జరిగే సమావేశాన్ని వద్దని అయినా ఆయన వారించలేదు.

తరువాత, తప్పు సవరించుకుందామన్న బుద్ధి అధిష్ఠాన వర్గానికి పుట్టినట్టుంది. అఖిల భారత కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారు ఢిల్లీలో సమావేశమై, అధ్యక్షులయిన కృపలానీగారే చెన్నపట్నం వెళ్ళి, కాంగ్రెసు శాసన సభ్యుల సమావేశం జరిపి, క్రొత్తనాయకుని ఎన్నుకోడానికి ఏర్పాటు చేయాలని ఆదేశించారు.

ఆయన మార్చి 10 న చెన్నపట్నం వచ్చారు. 22 న నాయకుని

ఎన్నిక జరుగుతుందని నోటీ సిచ్చారు. అయితే, అంతవరకు, ప్రకాశం గారు ముఖ్యమంత్రిగా ఉండవలసి వచ్చింది.

ఈ విషయాన్ని గూర్చి ప్రకాశంగారు ఆ నెల 15 వ తేదీన శాసన సభలో ఇలా అన్నారు:

"ఈ రోజున నేను ఎలా ముఖ్యమంత్రిగా నిలుచున్నానో మీకు చెప్పవలసి ఉంది. నేను ఈ ఉద్యోగాన్ని అంటి పెట్టుకొని, వదలకుండా ఉన్నానని ఒక విమర్శ బయలుదేరింది. అయితే, నాకు ఆ ఉద్దేశం లేదు. నిన్న ఉదయం గవర్నరుకు నా రాజీనామా అందజేశాను. ఆయన వెంటనే దాన్ని అంగీకరించలే మన్నారు. ఆయన నాతో—'మరొకరు మీ పదవి స్వీకరించడానికి ఎన్నుకోబడి తయారుగా లేరు. కాబట్టి మీ రాజీనామా అంగీకరించి నట్టయితే గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు 93 వ సెక్షన్ ప్రకారం నేను రాజ్యాధికారం తీసుకోవలసి వస్తుంది. బడ్జెటు నేనే సర్టిఫై చేయవలసి ఉంటుంది. శాసన సభ్యుల ఆమోదం లేకుండానే అది గవర్నమెంట్ బడ్జెట్టే అని దానిమీద నా అనుమతి వ్రాయవలసి ఉంటుంది. ఇది నాకు మన స్కరించడం లేదు. మీ పార్టీ మీటింగు 22 న జరుగుతుంది కాబట్టి, అందులో ముఖ్యమంత్రి ఎన్నిక అయ్యేవరకు, మీరు ముఖ్యమంత్రి పదవి నిర్వహించవలసిం'దని అనడంవల్ల నా కిష్టం లేకపోయినా, ఇక్కడ - ఈ రోజున - మీ ముందు - ముఖ్యమంత్రిగా నిల్చున్నాను.

"93 వ సెక్షన్ క్రింద గవర్నరు పాలన రాకూడదని కృపలానీగారు కూడా అనుకున్నారు. ఇది ఫిబ్రవరి 28 నుంచి జరిగిన ముచ్చట. అందుచేత బడ్జెటు పాసయేవరకు మన సమావేశం సవ్యంగానే జరుగుతుంది. నా పార్టీలో ఉన్న వ్యతిరేకులకూ, నాకూ కార్యక్రమాలపట్ల భేదమేమీ లేదు కాబట్టి, మీరు చేయబోయే చర్చలు, ఉపన్యాసాలు క్రమబద్ధమైనవిగానే ఉండగలవు."

అది మొదలు, బడ్జెటు చర్చలో పదవీ విరమణ దాకా ఆయన చేసే ఉపన్యాస ధోరణిలో, పదవీచ్యుతి అవుతుందనే బాధగాని, ఆందోళనగాని ఏమీ వ్యక్తం కాలేదు. పార్టీలో ఆయనకు వ్యతిరేకులుగా ఉన్న వారందరు "శుద్ధ గాంధేయులు." కానీ, గాంధీ తత్వానికి కార్యరూపం కల్పించి, నడిపించగలిగిన ప్రకాశంగారు వారికి పనికి రాకపోయారు.

అంత ముఖ్యమయిన కార్యక్రమం మధ్య ప్రకాశంగారున్నప్పుడు నాయకత్వంలో మార్పు తేకూడదని, ఆ గాంధేయులతో గాంధీగారు కూడా అనలేదు. ఇదే మన రాజకీయాలలో విషాద ఘట్టము.

మరి ఒకరు దొరకక పోవడంవల్ల, గాంధీగారి నాయకత్వాన్ని ఈ "గాంధేయులు" ఒప్పుకున్నారు. అంతేకాని, ఆయన సూత్రాలలోగల నూతనమైన ఆర్థిక, సాంఘిక వ్యవస్థా పునర్నిర్మాణంలో వారికేమీ నమ్మకం లేదు. వాటిలో నమ్మకమున్న ప్రకాశంగారు అందుచేతనే వారికి పనికి రాలేదు.

# 14

# ప్రకాశంగారి మంత్రివర్గ అవసానము

**1947** మార్చి **25** న మధ్యాహ్నం 12-15 గంటలకు కోటలో ఉన్న శాసన సభలో మాట్లాడడానికి ప్రకాశంగారు తమ స్థలంలో నిల్చున్నారు. ఆ కోట 1639 లో పూనమల్లి వెంకటాద్రి చెన్నప్పనాయకుడు ఇచ్చిన భూమిమీద తూర్పు ఇండియావారు కట్టిన కోట. బ్రిటిషు ప్రభుత్వంవారి స్థాపనను, పెరుగుదలను చూపిన కోట. బ్రిటిషు సామ్రాజ్యం అంతరించడాన్ని కూడా ఆ కోట చూపింది.

అంతకు పది సంవత్సరాల క్రితం ఆ కోటలో నుంచే ప్రకాశంగారు రెవిన్యూ మంత్రి పదవి వహించి, జమీందారీ తత్వాన్ని అణచి ప్రజారాజ్య తత్వానికి అంకురార్పణ చేశారు. ఆ కోటలో నుంచే 1946 లో ముఖ్యమంత్రిగా, మధ్యవర్తుల ప్రాబల్యాన్ని అణచి, స్వయంపోషక గ్రామ స్వరాజ్యానికి బీజాలు వేశారు.

అయితే, ఆయన కూచున్న స్థలం అంతకు ముందు మామూలుగా కూచునే స్థలం కాదు. ఆ స్థలం ఆ నెల 22 నాడు మరొక నాయకుని వశమైంది. ఆ రోజు కూచున్న ప్రకాశంగారు దాని కెదురుగా ఉన్న బెంచీపైన కూచున్నారు. అది పదవిలేని శాసన సభ్యులు కూచునే స్థలము. ప్రకాశంగారికి అక్కడినుంచి మాట్లాడడానికి ఏమున్నది?

సభా నిబంధనల ననుసరించి, పదవికి రాజీనామా యిచ్చిన మంత్రులు తాము చెప్పుకొనదలచిన దేదైనా ఉంటే సభా ముఖంగా లోకానికి—తమ మనసులో ఉన్నదీ, పదవి విరమణకు సంబంధించిందీ చెప్పడానికి అవకాశం ఉన్నది. దానిపై చర్చ ఉండదు.

అప్పుడు, తన పదవీ విరమణ గూర్చి చెప్పదలచుకొన్నది ఏదో చెప్పడానికీ, ఆయన తనకు సహజమైన సద్ధతిని మెల్లిగా లేచే సరికి—శాసన సభా ప్రేక్షక భాగంనుంచి చప్పట్లు గట్టిగా బయలు దేరినవి. శాసన సభ్యులు తమ ముందున్న బల్లలపైని చేతులతో గట్టిగా తట్టడం మొదలు పెట్టారు. వారు చప్పట్లు కొట్టరాదని సంప్రదాయము. కాని, తమకు ఇష్టులయినవారు ఎవరైనా మాటాడితే, ఆ మాటలాడ వలసిన అవసరపు ప్రాముఖ్యమునుబట్టి, వారి ఉపన్యాస ప్రారంభమున స్వాగత పూర్వకంగా, సభ్యులు తమ ముందున్న వ్రాతబల్లపై అర చేతులతో కొట్టి చప్పుడు చేయడం అలవాటు. అయితే, ప్రేక్షకులు మాత్రం ఏ విధమయిన చప్పుడు చేయడానికీ వీఁలేదు.

అందుచేతనే, ప్రేక్షకుల గాలరీలోనుంచి చప్పట్ల చప్పుడు వినిపించే సరికి స్పీకరు శివషణ్ముగం పిళ్ళైగారు; అధికారం ధ్వనించే కంఠంతో, "ప్రేక్షకుల గాలరీలోనుంచి చప్పుడు వినిపిస్తే, ఇక ప్రేక్షకుల నందర్నీ గాలరీనుంచి అవతలకు పంపించి వేస్తాను!" అన్నారు.

వెంటనే కొంత నిశ్శబ్దత ఏర్పడింది. ఆయన 'తిరిగి ఆ మాటే చెబుతున్నాను,' అని మరొకమాటు చెప్పిన మాటనే చెప్పగా పూర్తిగా నిశ్శబ్దత ఏర్పడింది. ఆ సమయంలో నిశ్శబ్దత ఆవశ్యకం కదా!

అక్కడ ప్రధాని కూచునే స్థలంలో ప్రకాశంగారంత గాంభీర్యంకలిగి, ప్రజానురాగం పొందిన ప్రధాని ఇది వరకెన్నడూ కూచో

లేదు. అటువంటి ప్రధానిని ప్రజా వ్యతిరేక శక్తులు పదవీచ్యుతుని చేయగా, ఆయన చెప్పదలచిన మాటలను, భవిష్యత్తును సముద్ధరించు కొనడానికి శ్రద్ధగా వినవలసిన సత్యమయమది.

మంద్రమైన కంఠంతో, మాటకు మాటకు మధ్య కొంత విలంబనంతో, ప్రకాశంగారు మాట్లాడ నారంభించారు:

"అధ్యక్షా! ఈ నాయకత్వ మన్నది మాలో ఎవరో ఒకరు ప్రధాని కావడానికీ, మంత్రి మండలిని ఏర్పరచి పరిపాలన జరపడానికీ అధికారాన్నిస్తుంది. మన రాష్ట్రంలోనేగాక, ప్రపంచంలో అన్ని దేశాలలోను ఈ నాయకత్వానికి, పదవికిఆశించడం కలదు........

"ఈ రోజున నేను అసలు ఉపన్యాసమే చేయకుండా ఉంటే బాగుంటుం దనుకొన్నాను. కాని, శాసన సభలో కొన్ని విషయాలు తెలుసుకొనేందుకు కుతూహలత కన్పించింది. ఇంతేకాక, నేను ఏ పరిస్థితులలో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేశానో, ఏ పరిస్థితులలో మా మంత్రి పదవులను వదలుకో వలసి వచ్చిందో కొంచెం చెబుదామని నాకూ కోరిక ఉద యించింది........

"నేను కొన్ని విషయాలు సభ్యులకు చెప్పినట్లయితే సరి పోతుంది. రాజకీయ ఖైదీలుగా మేము కారాగృహంలో ఉన్న సమయంలోనే, అక్కడినుంచి విముక్తులయిన తరువాత, ఈ శాసన సభకు నాయకులు వారా వీరా అనే పోటీలు బయలు దేరాయి. ........

"ఒక్కమారు మేము తిరుచినాపల్లి కారాగృహంలో ఉండగా, మాలో ఒకరికి పైనుంచి ఎవరో వ్రాసిన ఉత్తరంలో- ఆంధ్ర దేశంలో నాయకత్వం మారవలెనన్న ప్రసక్తి ఉండెను....

"జనరల్ ఎన్నికలయిన తర్వాత, నాయకత్వానికి పోటీ చేసే పేర్లు ఒక్కొక్కటే మెల్లిమెల్లిగా బయటపడ్డాయి. నాయ కత్వ పదవికి ముగ్గురు పోటీ చేస్తున్నట్టు మూడు పేర్లు కూడా

పత్రికలలో పడ్డాయి. ఆ మూడిటిలో ఒకటి నా పేరు కావడం తటస్థించింది. నా మటుకు నేను ఎప్పుడూ ఒక చిన్నవాణ్ణిగానే భావించుకుంటూ వచ్చాను. ఆ విధంగానే ప్రజాసేవ (దేశసేవ) చేయడానికి వచ్చాను. ప్రత్యేకంగా బలం కలిగించే ఉన్నత మైన అధిష్ఠానవర్గం ఎన్నడూ లేదు. ఎప్పుడూ ఎవరో కొందరు పెద్దలతో నాకు తగాదాలు వస్తూనే ఉండేవి. వాటిని ఏదోవిధంగా పరిష్కరించి, బ్రతకగలిగి జీవితయాత్ర నడుపుకొంటున్నాను. ఎవరికైనా అజేయుడైన ప్రతిపక్ష నాయకునికింద నన్ను నేను భావించుకోలేదు. కాని, సామాన్య ప్రజాకోటికి నా యందు అభి మాన విశ్వాసాలు కలవన్న ప్రతీతి ఒకటి ఉంది.

"ఈ రోజు మార్చి 25 వ తేది. ఇంకొక అయిదురోజులకు 1947 మార్చి 30 వస్తుంది. అప్పటికి సరిగా ఒక సంవత్సరం క్రింద, అంటే 1946 మార్చి 30 న ఆంధ్రప్రాంతంనుంచి ఒక గౌరవ సభ్యుడు, చెన్నరాష్ట్రంలో గల రాజకీయ పరిస్థితులను గురించి అధిష్ఠానవర్గంలో ఉన్నతస్థానం వహించిన ఒకరితో చెప్పడానికి వెళ్లారు. వెళ్ళవలసిందని ఆయనను ఎవరూ పంపించ లేదు. స్వయంప్రతినిధిగా వెళ్ళారు. అధిష్ఠానవర్గంవారితో-చెన్న రాష్ట్రం తిండి కరువుతో, బట్ట కరువులతో, గడ్డు స్థితిలో ఉన్నదనీ, సరిఅయిన నాయకుణ్ణి ఎన్నుకొనకపోతే రాష్ట్రం ధ్వంసమయిపోతుందనీ వారు చెప్పారు. ఇంతేకాక, మరొక విషయం కూడా చెప్పారు. పోటీ పడుతున్న ముగ్గురు నాయకు లలో నన్ను తప్పించి, తక్కినఇద్దరూ చేతులు కలుపుకొనేలాగున అధిష్ఠానవర్గంవారు చేయవలసిందిగా కూడా గట్టిగా చెప్పారు. మంత్రివర్గంలో నాకు ఎదురుగా ఇప్పుడు కూచున్న ఒకరు * వెంటనే, అక్కడినుంచి తాను తనపై వేసుకొన్న దౌత్యం సఫలమయిందని రాజాజీకి ఒక ఉత్తరం కూడా వ్రాశారు. ఆ

* బి. గోపాలరెడ్డిగారు.

ఉత్తరంలో గాంధీగారు తనతో హృదయపూర్వకంగా అన్ని సంగతులూ మాట్లాడారనీ, అయితే, తనకు మాత్రం ఏ స్థానమూ చూపించలేదనీ కూడా అందులో వ్రాశారు....

"తరువాత, నాయకుని ఎన్నికలో ప్రతి క్షణమూ అధిష్ఠాన వర్గంవారు అతిగా జోక్యం కల్పించుకొంటూ వచ్చారు. అయినప్పటికీ, ఇప్పుడు ఎన్నికయిన రామస్వామిరెడ్డిగారిని ఆహ్వానించినట్టే అప్పట్లో నన్నూ మంత్రివర్గం ఏర్పాటు చేయడానికి గవర్నరు ఆహ్వానించడం జరిగింది....

"మంత్రివర్గం ఏర్పాటు చేయడానికి ముందు ఒక విషయం నా మనస్సును వేధించింది. ఏ రాష్ట్రంలోనూ లేని ఒక గట్టి ఇబ్బంది మనలను ఈ రాష్ట్రంలో బాధించింది. మనకు ఒక్కొక్కప్పుడు జ్ఞాపకశక్తి మందగిస్తుంది. అందుచేత, ఒక విషయం జ్ఞాపకం చేస్తాను.

"1942 లో, క్విట్ ఇండియా తీర్మానం ఆమోదింపబడడానికి పూర్వం మన రాష్ట్రంనుంచి నలుగు రైదుగురు పెద్ద మనుష్యులు, ఆ తీర్మానానికి తమ ప్రతికూలతను ప్రకటించి, నాయకునికి (గాంధీజీకి) ఒక హెచ్చరికవాక్యం వ్రాశారు.

"ఈ సాహసోద్యమం మీరు తల పెట్టకండి! ఇది చాలా కష్టాలను సృష్టిస్తుంది. మీరు ఈ పని చేయవద్దు అని....

"కానీ, ఆ నాయకులు ఈ ఉత్తరంలో వ్రాసినదాంతో ఏకీభవించక, ఆ పెద్ద మనుష్యులు తమ దగ్గిరికి వచ్చి తా మన్న మాటలను సమర్థించుకొనవలసిందని వ్రాశారు.

"అధ్యక్షా! ఆ క్షణంనుంచి, ఈ ప్రతికూలమైన ఉత్తరం వ్రాసినవారు- ఒక ప్రత్యేక ప్రతికూల దృష్టితో నడచుకొని వస్తున్నారు. కాంగ్రెసు సంస్థకు కారాగృహ ప్రాప్తి కలిగింది. కాని, ఈ పెద్దమనుష్యులు దానితో సంబంధం లేనివారుగా దూరంగా ఉండిపోయారు.

"కాంగ్రెసు నాయకులు (గాంధీ) కారాగృహ విముక్తు

లయిన తర్వాత అధిష్ఠానవర్గం ఎదుట, 1942 ఆగస్టులో క్విట్ ఇండియా ఉద్యమానికి వ్యతిరేకంగా వీరు వ్రాసిన ఉత్తరం ప్రసక్తీ, వీరి ప్రసక్తీ వచ్చినవి. ఇటువంటి విషయం, మరే రాష్ట్రంలోను జరగలేదు. ఆ సందర్భంగా కొందరిపైన క్రమ శిక్షణ చర్య తీసుకోబడింది. దీని మూలంగా రాష్ట్రంలో, ఒక భాషాప్రాంతంవారికీ, ఇంకొక భాషాప్రాంతంవారికీ మనస్పర్థలు పెరిగినవి. ఆ విధంగా మన రాష్ట్రంలో వారి వర్గం, వీరి వర్గం అంటూ ఏర్పడినవి.

"నేను నాయకుణ్ణిగా ఎన్నికైన తర్వాత, ఏయే వర్గాలు అప్పటికి ఉన్నవో, వాటిని పరిశీలించుకున్నాను. ప్రతి వర్గం నాయకుణ్ణి మంత్రివర్గం ఏర్పాటు చేయడానికి నాకు సహాయం చేయవలసిందని కోరాను....

(ఒక గౌరవ సభ్యుని చూపుతూ—)

"ఆ గౌరవ సభ్యునితో నేను చాలాసేపు ఆ విషయం చర్చించాను. వారూ, వారి వర్గమూ మంత్రివర్గంలో భాగ స్వాములు కావడానికి ఒక నిర్ణయానికి రాలేదనీ, అందుచేత వారి వర్గంవారు అప్పటికి మంత్రివర్గంలో చేరదలచుకోలేదనీ చెప్పినారు. ఇతర వర్గాల నాయకుల సలహా తీసుకొనే ముందు నేను వీరితో మాట్లాడి ఉన్నాను. తర్వాత రెండవ వర్గంవారితో మాట్లాడాను. నా కోరికపైన వారు ఇచ్చిన పేర్లలో ఒకటి తప్ప తక్కువవాటిని నేను అంగీకరించాను....

"ఆ రోజున నా బాధలు ఆరంభమయినాయి. ఆ పేరు అంగీకరించకపోవడానికి అప్పటికి నా కొక కారణముండేది. అయితే, అప్పుడున్న కారణం ఎప్పటికీ ఉంటుందని అనుకో కూడదు....

"నేను మంత్రివర్గంలో చేర్చుకున్న మంత్రులు నాతో ఏకీభ విస్తారని, నన్ను ఏ ముఖ్యవిషయంలోనూ దిగవిడవరనీ, ప్రజా హిత కార్యక్రమాలలో తప్పక నాతోనే ఉంటారనే గట్టి

భావంతో నా మంత్రివర్గ కార్యకలాపాలను ప్రారంభించాను. నాకు కలిగిన ఈ అభిప్రాయానికి ఆశాభంగం కలగలేదు. ప్రారంభించిన పది నెలలదాకా ప్రతి నెలా మా కార్యక్రమాలు సవ్యంగానే నడిచాయి. పరిపాలనానీతిలో ఏ భేదాభిప్రాయాలూ ఉండేవి కావు. ఒక్క మరకదుళ్ళ తిరస్కార విషయంలో ఏకీభావానికి రాలేకపోయాము. *

"అధ్యక్షా! ఈ మిల్లుబట్టల పరిశ్రమ ఇటుపైని విస్తృత పరచకూడదనే నీతికి సంబంధించి ఒక మంత్రి మిత్రుడు, మొట్టమొదట నాతో ఏకీభవించలేనని, వేరే ఒక చీటీమీద వ్రాసి పంపించాడు. అయితే, ఆ మిత్రుడుకూడా పార్టీ సమావేశంలో ఈ సమస్య చివరి చర్చలో ప్రభుత్వ నీతికి (పాలసీకి) వ్యతిరేకంగా చెప్పలేదు....

"మద్యపాన నిషేధ విషయమై కొంత గట్టి ప్రతికూలత మొదట్లో వచ్చింది. కొందరు మిత్రులు ఇరవైనాలుగు జిల్లాలలోనూ ఒకే పర్యాయం మద్యనిషేధ చట్టం అమలు పరచవలెననే అతివాదంలోనికి వచ్చారు....♦

"జమీందారీ బిల్లు చర్చకు వచ్చింది. సెలెక్టు కమిటీకి ఆ బిల్లు పరిశీలించడానికి పంపవలసిందనే షరతుమీద దానిని ప్రవేశపెట్టడానికి అంతా సమ్మతించారు. అసలు నా మీద మిత్రులు చేసే పెద్ద ఆరోపణ నేను ఏలాగున అయినా పదవిని అంటిపెట్టుకొని ఉందామన్న దురాశ కలవాడి నన్నది. ఇది దురదృష్టకరము. అయితే, నాకు కొంతకాలంగా అదృష్టము, దుర

* గాంధీగారు ఈ మరకదుళ్ళ విషయంలో ప్రకాశంగారితో ఏకీభవించడమే గాకుండా, అవసరమైతే కేంద్రానికి పరిహారం చెల్లించి అయినా వాటిని తిరస్కరించాలని అభిప్రాయ పడ్డారు.

♦ ఎనిమిది జిల్లాలలో దానిని విస్తృత పరిచేసరికి ఈ ఆందోళన తగ్గింది.

దృష్టమనే భేదభావాలు లేకుండా ఉన్నవి. జయాపజయాలు వ్యక్తి గతంగా నన్ను ఆందోళన పరచవు. ఈ రోజున ఆ స్థానం వారి కిచ్చి ఈ స్థలానికి నేను రావడ మన్న దానిని సంతోషపూర్వకం గానే చేశాను.

[హియర్! హియర్! వినుడు! వినుడు!-సభలో ప్రశంసలు]

"నేను ఎవరి చేతులలోకి ఈ పరిపాలనా యంత్రాన్ని అప్ప జెప్పానో- వారు, నా అనుభవములవంటి అనుభవాలు పొంద కుండా పని సాగించుకోవలెనని నా కోరిక....

"ఈ విశ్వాసరాహిత్య మన్న భావ మెలా వచ్చింది? నాలో ఏవైనా తప్పులున్నా, లేకున్నా ఒకటిమాత్రం చెప్పగలను. పరిపాలనా విధానంలో ఏవిధమైన అసంతృప్తి కలుగజేసి ఉన్నా నని నేను అనుకోను. వ్యక్తిగతంగా, సభ్యులను ఆదరించ డంలో ఏ లోటూ రానిచ్చాననీ అనుకోను. ఒకవేళ ఏదయినా లోటు ఉన్నా, అది అసంతృప్తిగా మారేంతగా ఉందని నేను అనుకోను.

"నేను ఒక బీద కుటుంబంలో జన్మించాను. నన్ను పెద్ద చేసి, శిక్షణ నిచ్చిన ఆయనకూడా బీదవాడే. నాకు స్వతహాగా ఎక్కువ మాటాడే అలవాటు లేదు. అయినప్పటికీ- నా విద్యార్థి దశలో కానీ, మునిసిపల్ జీవితంలో గానీ, తదువాత ప్రజా రంగంలో కాలిడిన తర్వాతగాని, ఈ నా స్వభావంవల్ల ఏ మిత్రుడూ నా యెడల అనాదరణ భావం కలిగి ఉండలేదు."

ఈ విధంగా ఆయన రెండురోజులు ఉపన్యసించారు. పిదప క్రొత్త ప్రభుత్వం పక్షాన డాక్టర్ సుబ్బరాయన్‌గారు ఇలా అన్నారు:

"కాంగ్రెసు అధిష్ఠాన వర్గానికి మనసులో ఉన్నదల్లా చెన్న రాష్ట్రశాసన సభ్యుల, తమ నాయకుని వీలైనంత వరకు ఏకగ్రీవంగా ఎన్నుకోవాలన్న భావమే. ఆ విధంగా వారు చేయ జాలనప్పుడు అధిష్ఠాన వర్గంవారు ఏమి చేస్తారు? చెన్నరాష్ట్రా నికి సంబంధించినంతమటుకు కలుగజేసుకోమన్నారు. అనగా,

కాంగ్రెసు సంస్థ అనే సాగరంలో చెన్నరాష్ట్రం ఒక ద్వీపం అయిపోయింది. అనగా, సంస్థతో సంబంధం తగ్గిపోయినదన్న మాట. గత ఇరవై అయిదు సంవత్సరాలుగా ఇందుకా మేము పనిచేస్తున్నది? స్వాతంత్ర్య యుద్ధం దాదాపు పూర్తి అయిపోయి, జయము ప్రాప్తించి, మేము ఎక్కిన ఓడ నౌకాశ్రయము చేరే సమయంలో ఒక ద్వీపంగా ఉండిపోవడానికి ఇంక మేము అంగీకరించలేము.''

అయితే ఇటువంటి జవాబు చెబుతున్నప్పుడు—ప్రకాశంగారు కాంగ్రెసువాదు లందరిలోనూ ఉత్తమోత్తమ కాంగ్రెసు వాదులనీ, ఉత్తమోత్తమ త్యాగధనులనీ, ఆయన పదకొండు నెలలపాటు నడిపించిన పాలన ఒక్కటి మాత్రమే భారతదేశంలో గాంధీ తత్వానికి అనురూపంగా జరిగిన దన్న దానినీ సుబ్బరాయన్‌గారు, ఆయన ప్రక్కన కూచున్నవారూ గ్రహించలేకపోయారు.

1946 లో సంస్థాపితమై, ఎడతెగని చురుకుదనంతో దాదాపు పదకొండు నెలలు నడచిన ప్రకాశంగారి ప్రజాప్రభుత్వజ్యోతి అలా అవసానము పొందినది.

ఆంధ్రప్రాంతంలో, ప్రజలకు - ప్రకాశంగారి ప్రభుత్వ పతన కారకులయిన ఆంధ్ర మంత్రులపైన అమితమైన ఆగ్రహం వచ్చి, అనుకోని పరిణామాలకు దారితీసింది. తెలుగుదేశంలో వారు అడుగు పెట్టిన ప్రతి చోటా వందలకొద్దిమంది ప్రజలు వీరిని చుట్టవేసి, అవాచ్యమైన భాషాప్రయోగాలతో అహింసాదూరమైన కార్యకలాపాలతో వారిని అవమానించారు. కళా వెంకటరావుగారు, బెజవాడ గోపాలరెడ్డిగారు, చంద్రమౌళిగారు ముఖ్యంగా ప్రజల ఆవేశానికి గురి అయ్యారు. నావంటివారి మాటకేమిగానీ, ప్రకాశంగారే ప్రజల కోపాన్ని రెండు మూడు నెలలు తగ్గించలేకపోయారు.

ఏమయినా, తమిళులు కోరిన కార్యం జరిగింది.

ఆంధ్రుల తమ భవిష్యత్తును తాముగానే కొంతకాలం వరకు భ్రష్టం చేసుకోవడం జరిగింది.

ప్రకాశం-సాంబమూర్తిగారల మధ్య విభేదము, ఫలితము

మన దురదృష్టం కొద్దీ, రాజాజీ పాకిస్తాన్ ఇచ్చివేయవల పిందని ఉపన్యసించిన ఒక సభకు బులుసు సాంబమూర్తిగారు అధ్యక్షత వహించారు, వెనక ఒకమారు. తర్వాత ఆంధ్ర రాజకీయాలలో, వీరిద్దరు కలిసి చేసిన ప్రచారపు దుష్ఫలితాలను గూర్చి తర్వాత వ్రాస్తాను. ఇక్కడ ఒకటి మాత్రం వ్రాయాలి. పై సంఘటనతో ప్రకాశం గారికి సాంబమూర్తిగారికి మధ్య ఒక అగాధం ఏర్పడింది. ప్రకాశం గారు తలచుకుని ఉన్నట్టయితే, స్థానికంగా ఉన్న ఉపనాయక వర్గం తనకు ఎదురు తిరిగి, తాను రాజాజీతోబాటు జరిపిన ప్రయాణ కార్యక్రమాన్ని అంత గట్టిగా నిరసించి ఉండరనీ, ప్రకాశంగారు రాజాజీపై ఉన్న కోపంతో పాత చరిత్రను గమనించకుండా తనకు కూడా ఇటు వంటి దుస్థితి కలిగించారనీ—సాంబమూర్తిగారు తర్వాత ఎప్పుడూ అంటూండేవారు. ఈ విషయంలో ప్రకాశంగారి చర్య తార్కిక వాదానికి సరిగా ఉన్నప్పటికీ, అంతదాకా తమకు అండ దండలుగా ఉండి, ఎప్పుడూ బలపరుస్తూన్న సాంబమూర్తిగారు ఆ తర్వాత సహాయం చేసే పరిస్థితులు లేకుండా చేసినది. సాంబమూర్తిగారి సహాయమే ఉన్నట్లయితే, 1946, 47 లలో ప్రకాశంగారు అంత తొందరగా శత్రువుల చేత పడేవారు కారు.

# 15

## ప్రకాశంగారి గుండెదిటవు

లోగడ ప్రకాశంగారి మంత్రివర్గ పతనకారకులైన తెలుగు మంత్రుల పైన ఆంధ్రదేశ ప్రజలకు చాలా ఆగ్రహం కలిగిందని వ్రాశాను.

ఇలా ఉండగా, 13-4-47 న, జలియన్‌వాలాబాగ్ దినమున *

---

* 1919 లో వ్యక్తి స్వాతంత్ర్యాన్ని అనేక విధాలుగా అణచివేయడానికని రౌలట్ బిల్సు అని రెండు బిల్లులను కేంద్ర

విజయవాడలో నేతాజీ సుభాస్ చంద్రబోసు కాంస్య విగ్రహాన్ని ప్రకాశం గారు ఆవిష్కరించారు. ప్రేక్షకులు చాలా మంది హాజరయ్యారు.

అంతక్రితం కాకినాడలో - ప్రకాశంగారి మంత్రివర్గ పతన కారకులలో ఒకరయిన పళ్ళంరాజు అనే ఆయనను బహిరంగసభలో, అక్కడ చేరిన ప్రేక్షకులంతా అల్లరి చేశారు. ఆ వార్త విజయవాడలో 13 వ తేదిన తెలుసుకొన్న కొందరు, కాకినాడలో జరిగినదానికి ప్రతీ కారంగా ప్రకాశంగారి ఉపన్యాస సమయంలో అల్లరి చేద్దామని యత్నించారట. ప్రకాశంగారి సభకు ఎవరూ వెళ్ళరాదని ఊళ్ళో ప్రచారం చేశారట.

సమావేశం ప్రారంభమయింది. వేదికమీద కదలకుండా కూచుని ప్రకాశంగారు ఇలా చెప్పారట:

"ఎవరికైతే ఎదురు పక్షంవారు వచ్చి కొడతారనే భయం ఉన్నదో వారు ఈ సభలోంచి వెళ్ళిపోవలసింది."

ఆ విధంగా ఆయన చెప్పినా, అక్కడ చేరిన డెబ్బై ఎనభై వేల మందిలో ఒక్కరూ కదలలేదట. అంతేకాకుండా, అల్లరి చేద్దా

---

సభలో ప్రభుత్వంవారు ప్రవేశపెట్టగా, దేశమంతటా ఆందోళన కలిగింది. ఆ బిల్లులు పాస్ చేస్తే, దేశంలో సాత్త్విక నిరోధం (Passive resistance) ప్రారంభిస్తామని గాంధీజీ ప్రకటించారు. దేశమంతటా ప్రచారం జరిగింది. అప్పుడు అమృతసరులో జలియన్‌వాలాబాగ్ అనే బహిరంగ స్థలంలో ఒక సమావేశం ఏప్రిల్ 13 న జరిగింది. ఆ ఆవరణకు ఒకటే త్రోవ. ఇటువంటి సభలు జరగడం ప్రభుత్వానికి ఇష్టంలేదు. అందుచేత జనరల్ డయ్యార్ అనే ఆయన అక్కడికి మెషీన్‌గన్ తెచ్చి, ఎవరినీ బయటికి పోనీక అడ్డుపడి, 1,500 మందిని దారుణంగా హత్యచేశాడు. 3, 4 వేల మంది గాయపడ్డారు. అప్పటినుంచి బ్రిటిషువారు జరిపిన ఆ అమానుష కృత్యానికి గుర్తుగా ఆ 13 వ తేదీన-జలియన్‌వాలా బాగ్ దినం జరపడం, సభలు చేయడం మన దేశంలో ఆచారంగా ఉన్నది.

మని (కాంగ్రెసుచే నియమింపబడి) వచ్చినవారిని తీవ్రంగా కొట్టి, సభ అవతలికి నెట్టేశారట.

ఆతర్వాత రెండుగంటలసేపు ప్రకాశంగారు యథేచ్ఛగా ఉపన్యసించారని, ఆయనకు సన్నిహితులైన ముదలి వెంకటేశ్వరరావుగారు నాతో ముచ్చటిస్తూ అన్నారు.

అటువంటి గుండె దిటవుకు ప్రకాశంగారు పెట్టినది పేరు.

1945 లో మేము జైలునుంచి విడుదలయి వచ్చిన తర్వాత కృష్ణా జిల్లాలో పర్యటించడం జరిగింది. అప్పటికి కాంగ్రెసునుంచి విడిపోయి, కమ్యూనిస్టులైన కొందరు మిత్రులు ఒక బహిరంగ సభలో ప్రకాశంగారిని తూలనాడ నారంభించారు. అక్కడి ప్రజలు అలా తూలనాడిన మనిషిని అదమాయిస్తూ ఉంటే, ప్రకాశంగారు, "అత నెవరో చిన్న కుర్రవాడు. ఏమీ అనకండి!" అని సర్దుబాటు చేశారు.

కాని, మేము తర్వాతి గ్రామం వెళ్ళేసరికి కమ్యూనిస్టు మిత్రులు హెచ్చు బలంతో వచ్చి అల్లరి చేయబోయారు. అక్కడేమో- ప్రేక్షకులు వారిని బలవంతంగా బయటికి త్రోసేశారు. మేము ఆ తర్వాత గ్రామానికి వెళ్ళేసరికి రమారమి పదకొండు గంటలు కావచ్చింది. ఎవరో ఒకరింటి ఆవరణలో సభ ఏర్పాటు చేశారు. వేయి మందికి సరిపోయే ఆ చోట దాదాపు నాలుగువేలమంది ఇరుక్కొని కూచున్నారు. మీటింగు ఆరంభమయేసరికి దాదాపు యాభై మంది కమ్యూనిస్టు మిత్రులు నినాదాలు చేస్తూ, బాణాకర్రలు త్రిప్పుతూ ఒక ప్రక్కనుంచి ప్రేక్షకుల మీదికి దుమికారు. ప్రజలు లేచిపోసాగారు. వారికీ వీరికీ జరిగిన సంకుల సమరం, ప్రకాశంగారూ నేనూ కూచున్న వేదికను సమీపించ నారంభించింది. సమావేశం ఏర్పాటుచేసిన పెద్దలు కొందరు ప్రకాశంగారి దగ్గరికి తొందరగా వచ్చి, "వారి బాణాకర్రలు, వీరి బాణాకర్రలు మీకు తగులుతాయి. మీరు లేచి గదిలో కూచోండి. మేము ఆ కమ్యూనిస్టులను తరిమివేసిన తర్వాత మీరు ఇవతలకు రావచ్చును," అన్నారు.

ప్రకాశంగారు—"దెబ్బలు ఎలా తగులుతాయో చూస్తానులే!

ఇక్కడే కూచుంటాను," అన్నారు. ఆయన కదలకపోయేసరికి నాకూ ధైర్యంవచ్చి, నేనూ కదలలేదు.

ఆ యుద్ధమంతా మాకు రెండు బారల దూరంలోనే జరుగుతున్నది. కొంత సేపటికి కమ్యూనిస్టు పార్టీ మిత్రులు తమ బాణాకఱ్ఱలతో వెనకకు పోయారు. ఆ తరువాత అక్కడ రెండు గంటల సేపు సభ జరిగింది.

అటువంటి ప్రకాశంగారు బెజవాడలో కాంగ్రెసువారు చేసిన అల్లరికి ఎందుకు లొంగుతారు?

ఆ కాంగ్రెసువారే తరువాత అక్కడినుంచి పోయారు.

## శాసన సభలో పాయింట్ ఆఫ్ ఆర్డరు

1947 ఆగస్టు 15న అఖండ భారతదేశం ఖండమై స్వాతంత్ర్య ప్రాప్తి పొందింది. చెన్నరాష్ట్ర అసెంబ్లీ 16-9-1947 న స్వాతంత్ర్యానంతరం ప్రథమ సమావేశం జరుపుకొన్నది.

నాడు, ప్రకాశంగారు ఒక పాయింట్ ఆఫ్ ఆర్డరు (అనగా- ఒక పని శాసన సభ కార్య సూత్రాలకు వ్యతిరేకంగా జరిగినపుడు దానిని గూర్చి సభాధ్యక్షునికి ఏ సభ్యుడైనా చేసే సూచన) లేవదీశారు.

ఆయన లేవదీసిన మొదటి పాయింటు ఇది: బ్రిటిషు హవుస్ ఆఫ్ కామన్స్‌లో పాసయిన, ఇండియన్ ఇండిపెండెన్స్ ఆక్టు (ఇండియా స్వాతంత్ర్య శాసనము)లో—ఇండియాలో అప్పటికి పనిచేయుచున్న కేంద్ర శాసన సభ ఏదో, అదే స్వాతంత్ర్యానంతరం శాసన సభగానూ, నూతన సంవిధాన నిర్మాణ సభగానూ ద్వివిధ శక్తులతో పనిచేయగలదని వ్రాసిఉంది. అందులో రాష్ట్ర శాసన సభల ప్రసక్తి లేదు. అందుచేత, అవి రద్దు అయినట్టుగానే భావించాలి. కనుక, చెన్నరాష్ట్రంలో పాత శాసన సభ ఆ రోజున శాసన సభగా పనిచేసే వీలులేదు.

ఇక రెండవ విషయము:

ఒకవేళ పనిచేసినా, శాసన సభ్యులు, మంత్రులూ స్వతంత్ర భారత ప్రభుత్వానికి తమ విధేయతను చూపించే ప్రమాణం చేయనిదే

శాసన సభలో వారు ఏ కార్యాలు చేసే వీలులేదు. ఇదివరలో వారు తీసుకొన్న ప్రమాణంలో- వారు, బ్రిటిష్ చక్రవర్తికి తమ విధేయతను చూపించగలమని ప్రమాణం చేశారు. అందుచేత, క్రొత్త ప్రమాణం అవసరము. ఇదే రెండవ పాయింటు.

ఢిల్లీలోని సంవిధాన సభ ఈ విషయమై ప్రత్యేకంగా శాసన దత్తత ఆదేశము (Adaptation order) పంపలేదన్న వాదం చెల్లలేదు. బ్రిటీషు గవర్నమెంటుకు సర్వ విధేయతలు చూపిస్తామన్న పాత ప్రమాణంతో, స్వతంత్ర భారతదేశ శాసన సభలో ఈ శాసన సభ్యులు ఎలాగు పనిచేయగలరు?

అసలు, అంతకు ఒక రోజు క్రితం ముగ్గురు శాసన సభ్యులు, క్రొత్తగా ప్రమాణం తీసుకోవలసి వచ్చినప్పుడు, భారతదేశ సంవిధానానికే తమ విధేయత ప్రకటిస్తూ ప్రమాణాలు చేశారు. అందుచేత శాసన సభలో అప్పుడు భారతదేశ సంవిధానానికి విధేయత చూపించే వారు కొందరూ; మనల్ని విడిచిపెట్టి వెళ్ళిన బ్రిటీష్‌వారి చక్రవర్తికే విధేయత చూపించి ప్రమాణం చేసినవారు మరి కొందరూ (చాలా మంది) ఉన్నారు. ఇది కూడదని ప్రకాశంగారు లేవదీసిన పాయింట్ ఆఫ్ ఆర్డర్‌ను సభాధ్యక్షుడు త్రోసివేశాడు. ప్రకాశంగారి పాయింటు సరి అయినది కాదని అధ్యక్షుడు ఇచ్చిన రూలింగు సరి అయినది కాదని నేను ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు.

ఈ పాయింటు లేవదీసినపుడు శాసన సభలో చర్చింపబడుతున్న విషయము—జమీందారీ రద్దు బిల్లు. ప్రకాశంగారు ఆ సందర్భంగా ఇలా అన్నారు:

> "కాంగ్రెసు అధిష్ఠాన వర్గంవారు ఈ జమీందారీ రద్దు బిల్లు చర్చించడానికి పూర్వం చెన్నరాష్ట్రపు మంత్రులు తమ దగ్గరికివచ్చి సలహా తీసుకోవలసిందని ఆదేశించారు. వారు చెప్పినట్టు ఈ ప్రభుత్వంవారు నడుచుకోవాలి.
>
> "అధ్యక్షా! కాంగ్రెసు అధిష్ఠాన వర్గంవారు మన ప్రభుత్వంలో ఇటువంటి అతి జోక్యం కల్పించుకోకూడదని నేను

ముఖ్యమంత్రిగా ఉన్న రోజులలో గట్టిగా ఎదిరించాను. స్వాతంత్ర్యం వచ్చిన తరువాత, సంవిధానంలో రాష్ట్ర ప్రభుత్వాలకని ఏర్పాటైన విషయాలలో, మన ప్రభుత్వానికి చెంది నంతమటుకు, సంవిధానానికి వ్యతిరేకంకాని పద్ధతిలో, మనకు తోచిన నిర్ణయం మనమే చేసుకోవచ్చును. మన సంవిధానానికి విధేయత చూపుతూ ప్రమాణం చేయమనడానికిదే కారణము."

ప్రకాశంగారు ఈ మాటలు చెప్పిన తేదీ 3-12-47. అప్పటికి స్వాతంత్ర్యం వచ్చి దాదాపు నాలుగు నెల లయింది.

అయినప్పటికీ, బ్రిటిషు ప్రభుత్వం ఎడల విధేయత చూపుతూ ప్రమాణంచేసిన వారు, ఢిల్లీ ప్రభుత్వానికి విధేయత చూపించాలని భావించారు కానీ, సంవిధానం విషయం వారి మనసుకు పట్టలేదు.

## ఇతర విశేషములు: 1947

ప్రకాశంగారి మంత్రిమండలి పతనానంతరము, ఆయన నివసిస్తున్న ఇంటినుంచి ఉత్తర క్షణం ఖాళీ చేయించడానికి చిన్న ఉద్యోగులు, సిబ్బందీ పూనుకొన్నారు. జ్ఞాతి వైరమంటే అలా ఉంటుంది. ప్రకాశంగారు మరొక ఏర్పాటు చేస్తేగానీ అక్కడినుంచి కదిలేది లేదన్నారు. కార్యదర్శులు కొందరు, ఈ సమస్య నెలా పరిష్కరించేదని గాభరా పడ్డారు.

గవర్నమెంట్ హావుస్ ఎస్టేటులో ఒకటి, రెండు ఇండ్లు ఖాళీగా ఉన్నాయి. మంత్రులైనా, కాకున్నా—ముఖ్యులైన శాసన సభ్యులకు అవి వసతి గృహాల క్రింద ఇవ్వడం పరిపాటి.

రెండు, మూడు దినాలు సిద్ధాంత రాద్ధాంతాలు జరిగిన తర్వాత, ఒక యిల్లు కేటాయించగా, ప్రకాశంగారు పాత యింటిని వదిలి, అందులోకి వెళ్ళారు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పాటై, కర్నూలుకు కదిలేదాకా ఆయన ఆ యింట్లోనే నివసించారు.

నూతన ఆంధ్రరాష్ట్ర స్వరూపం ఆ యింట్లోనే నిర్ణయమైనది.

## మంత్రులపై ఛార్జీలు

ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉన్న రోజులలోనే—బెజవాడ గోపాలరెడ్డిగారు, వారి కుటుంబంలో మరొక అయిదారుగురు, వారికి కొంత దూరపు బంధువులయిన ఇద్దరు కలిసి ఒక ప్రైవేటు కంపెనీగా ఏర్పడి, స్టేట్ ఎయిడ్ టు ఇండస్ట్రీస్ ఆక్టు క్రింద పది లక్షలు అప్పు ఇవ్వవలసిందని డైరెక్టర్ ఆఫ్ ఇండస్ట్రీసుకు అర్జీ పెట్టుకొన్నారు. వారు చేయదలచుకొన్నది—వేరుశనగనూనె తీయడానికి ఒక మిల్లు స్థాపించడము.

ఆ మిల్లు పేరు సుదర్శన ఆయిల్ మిల్సు.

ఆ శాసనం క్రింద ఇటువంటి ఋణాలు ఇవ్వడానికి వీలులేదని వారు నిరాకరించారు. దానిపై స్టేట్ ఫైనాన్సు కార్పొరేషన్ వారిని ఋణము కోరగా వారూ నిరాకరించారు. ఆ తర్వాత ఆ ఋణం ఇవ్వవలసిందని వారు ప్రభుత్వానికే అర్జీ దాఖలు చేసుకొన్నారు. ఇంతలో, ప్రకాశంగారి మంత్రివర్గం పతనమయింది.

తర్వాత, గోపాలరెడ్డిగారు ఆర్థిక మంత్రి అయ్యారు. బళ్ళారి నుంచి వచ్చిన హెచ్. సీతారామరెడ్డి అనే శాసన సభ్యులు పారిశ్రామిక శాఖా మంత్రి అయ్యారు వారు తమ యాజమాన్యం క్రింద నడిచే ఒక మిల్లుకు ఆరు లక్షలు కావాలని అర్జీ పెట్టుకోగా, ఆర్థిక మంత్రిగా గోపాలరెడ్డిగారు దానిని ఆమోదించి డబ్బు మంజూరు చేశారు.

పారిశ్రామిక శాఖా మంత్రి అయిన సీతారామరెడ్డిగారు అంతకు ముందు పదిలక్షల రూపాయలకోసం గోపాలరెడ్డిగారు పెట్టుకొన్న దరఖాస్తుపై డబ్బు మంజూరు చేయడం అర్హమేనని సిఫారసు చేశారు. ఆర్థిక మంత్రిగారు తమ దరఖాస్తుపై డబ్బు మంజూరు చేసుకొన్నారు.

ఆ సంవత్సరంలో స్టేట్ ఎయిడ్ టు ఇండస్ట్రీస్ ఆక్టు క్రింద ఋణాలు ఇవ్వడానికి కేటాయించిన సొమ్ము యాభై వేల రూపాయలు మాత్రమే. లక్షకు మించి క్రొత్తగా వ్యయం చేయవలసి ఉంటే, ఫైనాన్సు కమిటీ అనే ఉప సంఘం ముందు, వాటికి సంబంధించిన దరఖాస్తులు విచారణకై వెళ్ళాలి. అయితే, శాంక్షన్ అయిన ఈ దర

ఖాస్తులు ఆ కమిటీ ముందుకు వెళ్ళినట్టు లేదు. ఇది కాబినెట్‌కు అసలే తెలియదు.

ఇది అధికార దుర్వినియోగమని మంత్రులపై ప్రకాశంగారు చేసిన మొదటి ఛార్జి. *

తెనాలికి చెందిన శాసన సభ్యులు ఆలపాటి వెంకటరామయ్యగారు ♦ మోహన్ ఇండస్ట్రీస్ అనే ఒక సంస్థకోసం లక్ష రూపాయల ఋణం అడిగారు. ఆయన గోపాల రెడ్డిగారి వర్గానికి చెందినవాడు గనుక లక్ష రూపాయలు మంజూరు చేశారు. ఆ మోహన్ ఇండస్ట్రీసుకి సైను బోర్డు తప్ప, వేరే పరిశ్రమ అప్పుడూ లేదు, ఇప్పుడూ లేదు.

ఏ విధమైన హామీ (సెక్యూరిటీ) లేకుండా, తమ రాజకీయ మిత్రునికి లక్ష రూపాయలు ఇవ్వడం తప్పని ఎవరో శాసన సభ్యులు గట్టిగా అల్లరి చేసిన పిమ్మట, లక్ష రూపాయల విలువగల వేరే భూమి హామీగా ఇస్తున్నామని వారు పత్రం ఒకటి బలవంతాన వ్రాసి యిచ్చారు. ఆ అప్పు తీరలేదు. సెక్యూరిటీ ఇచ్చిన ఆ స్థిపైన ఋణాన్ని రాబట్టుకొందామనుకొంటే, ఆ పత్రమే చెల్లదు అనే మొదలైన వాదాలు లేవదీశారు.

అధికార దుర్వినియోగ నేరారోపణలో ఇది కూడా ఒకటి.

ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉన్నపుడు, ధాన్యసేకరణ చురుకుగా జరగడానికని ఎరువులు చవకగా దొరకడం కోసమని బస్తాకు ఒకటి చొప్పున బోనస్ చీటీలు ఇచ్చేవారు. బోనస్ చీటీకి ఇంత

---

* గోపాలరెడ్డిగారు సుదర్శన మిల్లుకు శాంక్షన్ చేసిన ఋణం, ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు తమిళ రాష్ట్రం వసూలు చేసుకోవలసిన ఋణాలలో చేరింది. వారికి ఆ మిల్లునంతా అమ్మినా ఆరులక్షలకన్నా ఎక్కువ రాలేదట.

♦ ఈ వెంకటరామయ్యగారు 1962 లో మంత్రి అయ్యారు. పాపం, హఠాత్తుగా మరణించారు. మంత్రిగా ఉన్న సమయంలో, తెనాలి పట్టానికి వీరు చాలా ఉపయోగాలు చేసుకోగలిగారు. అక్కడ ఆయనకు మంచిపేరే ఉండేది.

అని ఎరువులు గవర్నమెంట్ గొడౌనులలో కొనుక్కునేకుందుకు వీలు కల్గించారు. ఇటువంటి లాభం స్వయంగా ధాన్యం పండించి, ధాన్యం అప్పజెప్పే రైతులకే చెందవలెనని ఆదేశము. ఈ ఆదేశం ప్రకారం రైతులు బోనస్ చీట్లను సంపూర్ణంగా వినియోగించుకొనే సమయం రాకుండానే ప్రకాశంగారి మంత్రివర్గం పతన మయింది.

క్రొత్త మంత్రి వర్గంలోని వేముల కూర్మయ్యగారు, ప్రకాశం గారి మంత్రి వర్గంలోనూ ఉండిన వారే. పడత్రోసిన వారితో ఏకం కావడంవల్ల క్రొత్త మంత్రి వర్గంలో కూడా ఆయన మరల మంత్రి అయ్యారు.

విజయవాడలో, ఆయనకు సన్నిహితుడైన ఒక హోటలు ఖామందు ఉండేవాడు. ఆయన అమాయికులైన రైతులదగ్గర వందల కొద్ది టన్నుల ఎరువులు తేలిగిన బోనస్ చీటీలను సంపాదించాడు. అగ్రికల్చరల్ ఆఫీసరు దగ్గరికి వెళ్ళి, ఈ బోనస్ చీటీలన్నీ చూపించే సరికి, ఆ ఆఫీసర్ ఆ చీటీలకు కావలసిన ఎరువు విజయవాడ గొడౌన్లలో లేదనీ, చాలా గొడౌన్లనుంచి సేకరించినా సరిపోదని అభిప్రాయ పడ్డాడు.

ఆఫీసర్ అనవసరంగా ఆలస్యం చేస్తున్నాడని, ఆ హోటలు ఖామందు కూర్మయ్యగారితో చెన్నపట్నానికి వచ్చి చెప్పారు ఆయన వ్యవసాయ శాఖామంత్రి అయిన మాధవమేనోన్ గారిచేత- హోటలు ఖామందుకు ఆయన ఇచ్చే బోనస్ చీటీలనుబట్టి కావలసినంత ఎరువులు ఈయవలసిందనే ఆదేశం వ్రాయించి, ఒక కాపీ ఆయన చేతిలోనే పెట్టి పంపారు.

ఒక్కొక్క రైతుకు నిర్ణీతమైన బరువుగల ఎరువులకు మించి ఇవ్వరాదనే నిషేధం ఉండడంవల్ల, ఎంతమంది రైతుల పేర్లు కావలెనో అంతమంది పేర్లతో ఆయన అంతకు ముందే ఒక పట్టీ దాఖలు చేసి ఉన్నాడు. ఆ పట్టీ నిజమైనదో, అబద్ధమైనదో చూసిన వాడెవడూ లేడు.

ఆ హోటలు ఖామందు తాను రైతు కాకపోయినా, వందలకొద్ది

రైతుల కీయవలసిన ఎరువులను తాను బ్లాక్‌మార్కెట్ చేసుకున్నట్ట యితే, ఉత్త పుణ్యానికే అనేక వేల రూపాయల లాభం పొందగలడు.

అధికార దుర్వినియోగ దోషారోపణలలో ప్రకాశంగారు పేర్కొనవాటిలో ఇది ఒకటి. *

---

* ఆ హోటలు ఖామందు, కూర్మయ్యగారు ఇప్పించిన గవర్నమెంట్ ఆర్డరు కాపీ తీసుకువెళ్ళి, వెంటనే ఎరువు లిమ్మని విజయవాడ అగ్రికల్చరల్ ఆఫీసరు నెత్తిపైన కూచున్నాడు. ఆయ నేమో- గవర్నమెంట్ ఆర్డరు కాపీ తనకు అంది, ప్రభుత్వంనుంచి వచ్చే ఆదేశాలు మొదలైనవి నమోదుచేసే రిజిస్టర్లో ఎక్కించు కోకుండా ఎరువు లివ్వలేనన్నాడు. చెన్నపట్నంనుంచి ఆర్డరు అధికార మార్గంలో విజయవాడకు అందలేదు.

ఇంతలో ఈ వ్యవహారం చెన్నపట్నంలో సొక్కగా, వ్యతిరేక వర్గంవారు ముఖ్యమంత్రి రామస్వామి రెడ్డిగారి దగ్గరకు వెళ్ళి ఒక విజ్ఞప్తిపత్రం దాఖలు చేసుకొన్నారు. రైతుకాని ఒక హోటలు కీపరుకు మంత్రి కూర్మయ్యగారితో సన్నిహితత్వ మున్న దన్న కారణంతో అలా చేయరాదనీ, వ్యవసాయశాఖ మంత్రి వందలకొద్ది రైతులకు సరిపడే ఎరువులు ఒక నల్లబజారు ఆసామీకి ఇవ్వడం ఆపవలసిందనీ వారు విజ్ఞప్తిలో పేర్కొన్నారు.

వెంటనే ముఖ్యమంత్రిగారు, ఆ ఆసామీకి ఎరువులు ఇవ్వడం ఆపమని ఆఫీసరుకు 'స్టాప్ ఇష్యూ' అని తంతి యిచ్చారు. ఇవ్వమని పంపిన నకలు ఆదేశం అందిన మూడు రోజులకుగానీ ముఖ్యమంత్రి గారి నిషేధ ఉత్తరువు అందలేదు. కూర్మయ్యగారి మిత్రులు తల పెట్టిన అన్యాయం జరగలేదని ఉద్యోగి సంతోషించినా, ముఖ్య మంత్రిగారి ఉత్తరువు అందే మధ్య గవర్నమెంట్ ఉత్తరవు ధిక్కరించాడనే ఆరోపణతో కూర్మయ్య, మాధవ మేనోన్ గారలు అతనిని డిస్మిస్ చేశారు. గవర్నమెంట్ ఆర్డరు అందక ఇవ్వలేదన్న అతని మొర విన్నవారు లేరు. 1954లో ప్రకాశంగారు ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి అయి, అతని మెమోలు (అప్పీలు విజ్ఞప్తులు), చూచి, తిరిగీ ఉద్యోగంలోకి తీసుకొన్నారు.

ఈ విధంగా ఒక పది ఛార్జీలు కలిపి, మంత్రులు ఈ విధంగా అధికార దుర్వినియోగంచేస్తే, కాంగ్రెసు ప్రతిష్ఠకు భంగం కలుగుతుందని కాంగ్రెసు అధ్యక్షులు రాజేంద్ర ప్రసాదుగారు చెన్నపట్నం వచ్చినప్పుడు విజ్ఞప్తి పత్రం ఆయన చేతికిచ్చాము.

ఆ సమయంలో ఆయన నాతో ఇలా అన్నారు: "నీవు సంతకంపెట్టి ఇచ్చినప్పుడు, ఇందులో నిజమున్నదో లేదో అన్న చర్చ నాకు అక్కరలేదు. నీవు వ్రాసింది నిజమని నేను నమ్ముతాను. కాని, ఏ డెనిమిదిమంది మంత్రులతో సంబంధించిన దీన్ని చర్చిస్తే ప్రభుత్వపు ప్రతిష్ఠకు భంగం కలుగుతుంది. అందుచేత దీన్ని చర్చించాలని గట్టిగా అడగవద్దు."

"మీరూ మేమూ కలిసి పెంచిన కాంగ్రెసు ప్రతిష్ఠ మాట ఏమిటి?" అని నేను ఎదురు ప్రశ్న వేశాను.

ఆయన నవ్వుకుంటూ ఆ కాగితాలు ప్రక్కను పెట్టేసుకున్నారు. కాంగ్రెసు అధిష్ఠాన వర్గంవారు కలుగజేసుకోరని తెలిసిపోయింది.

అందుచేత ప్రకాశంగారే, ఈ విషయాలను శాసన సభలో చర్చించడానికై, శాసన సభ హక్కుల భంగమనే సూత్రం క్రింద ప్రివిలేజీ తీర్మాన మొకటి ప్రవేశపెట్టారు.

మంత్రులు అధికారం దుర్వినియోగం చేస్తే, దాన్ని శాసన సభ హక్కులకు భంగం క్రింద చర్చించే అవకాశముందా, లేదా? అన్నది స్పీకరు పదిహేను రోజులపాటు ఆలోచించి, చివరకు దానికి హక్కుల భంగంతో సంబంధం లేదని త్రోసివేశాడు. అయితే, ఆ విధంగా త్రోసి వేసినపుడు, ప్రత్యేకమైన తీర్మానం క్రింద నోటీసు ఇచ్చినట్టయితే ఆలోచిస్తానని ఒక వాక్యం అందులో వ్రాశాడు.

ప్రకాశంగారు ఆ సలహా తీసుకొని, ఆ దోషారోపణ పత్రంలోని విషయాలన్నీ శాసన సభవారు చర్చించి, దోషులయిన మంత్రుల మీద తగిన చర్య తీసుకొనేందుకు ప్రభుత్వానికి సిఫారసు చేయవలసిందనే తీర్మానమును ప్రవేశ పెట్టారు. ప్రవేశ పెట్టేముందు, అనవసరమైన అభ్యంతరాలు ఆఫీసువారు లేవదీయకుండా, ఆ ముసాయిదా పత్రాన్ని

సెక్రటరీగారికి చూపించి, ఆయన బాగున్నదన్న తర్వాతే కార్యనిబంధ నల ప్రకారంగా నోటీసిచ్చాము.

ఈ నోటీసిచ్చామన్న సంగతి తెలిసిన వెంటనే మంత్రివర్గం యావత్తూ ఆ బరువు స్పీకరుపైని మోపడం మొదలుపెట్టారు.

యథాలాపంగా మాట్లాడినట్లు ఒకమారు, సలహా అడిగినట్లు మరొకమారు; రాజేంద్ర ప్రసాద్‌గారే ప్రభుత్వం ప్రతిష్ఠకు లోటు వస్తుందని చెప్పినప్పుడు, కాంగ్రెసు పార్టీలో సభ్యులయిన ప్రకాశం గారు ఇటువంటి తీర్మానం ప్రతిపాదించడం న్యాయంగా ఉందా అని ఇష్టాగోష్ఠిగా చెప్పినట్లు ఇంకొకమారు; ఇంతకూ ప్రకాశంగారికి సంఖ్యాబలం లేకపోవడంవల్ల ఏలాగూ వీగిపోయే తీర్మానం చర్చకు తెచ్చి, శాసన సభా సమయమంతా వ్యర్థపరచడం భావ్యమా అని వేరొక్కమారు—అనేక విధాలుగా స్పీకరుగారిని ఒక మంత్రి వదిలితే ఇంకొక మంత్రి, వారి వర్గాలకు చెందిన శాసన సభ్యులూ వెళ్ళి ఆయనను నొక్కడానికి చాలా యత్నించారు.

ఆయన కూడా కార్యదర్శితో చాలా చర్చించి, ఆ తీర్మానం త్రోసివేయడానికి ఏ విధంగానూ వీలులేక పోవడంవల్ల దానిని గ్రహిస్తూ, ఎట్లయినా తీర్మానం వీగిపోతుంది గదా- బాధ ఎందుకని మంత్రులకు నచ్చజెప్పి, ఆ తీర్మాన్ని ఎజండాలోనికి తెచ్చేందుకు అనుమతించారు.

ప్రకాశంగారి ఉద్దేశం—తీర్మానం జయమవుతుందా, వీగి పోతుందా అన్నది కాదు. శాసన సభలో బాహాటంగా, ముఖాముఖి చర్చ జరిగితే, మంత్రులు చెప్పుకోగలిగినదంతా చెప్పుకున్న తర్వాత- మంత్రులుచేసిన పనులు, అధికార దుర్వినియోగంక్రింద తప్పకుండా వస్తాయని ప్రజలు గ్రహిస్తారనీ, అలా గ్రహించడంవల్ల రాబోయే ఎన్నికల్లో వారే అధికార దుర్వినియోగం చేసిన ఆ మంత్రులకు తగిన గుణ పాఠం చెప్తుతారనీ ఆయన ఆలోచన. అది పొరపాటు కాలేదు.

శాసన సభలోనూ, తర్వాత బహిరంగంగానూ ఆ మంత్రులు మొదటి సంవత్సరంలోనే చేసిన అధికార దుర్వినియోగాన్ని ప్రజలు

గ్రహింపగలిగారు. 1952 జనరల్ ఎన్నికలలో ఆ దోషారోపణ పత్రానికి గురి అయిన మంత్రులలో ఒక్కరూ తిరిగి ఎన్నుకోబడలేదు.

మొదట్లో, ఈ విషయాలను ప్రకాశంగారు బాగా నొక్కి-నొక్కి ప్రతి బహిరంగ సభలోనూ చెప్పాలని అనుకొన్నాము. కాని, ఎన్నికల సమయం వచ్చేసరికి, మేము వెళ్ళిన చోటల్లా ఈ మంత్రులు, వారి అధికార దుర్వినియోగం అన్న మాటలతోనే వాతావరణమంతా నిండి పోయింది. ఫలితం మీదచెప్పినవిధంగా ఆ మంత్రులందరి పరాజయంగా పరిణమించింది. ప్రకాశంగారీ విషయంలో చేసిన ప్రచారం వారి దూరదృష్టికి నిదర్శనము.

వీటి చరిత్ర యింతటితో ఆగలేదు. శాసన సభలో జరిగిన చర్చలు, గలాభాలు అన్నీ చూసి, అధిష్ఠాన వర్గంవారు వీటి విషయమై చర్చిస్తామని అన్నారు. మేము చేసిన ఆరోపణలు ఋజువు చేయడానికోసం, వాటికి సంబంధించిన కాగితాలు ప్రభుత్వంవారు మాకు చూపించవలసిందని కోరాము. అప్పటి ముఖ్యమంత్రి కుమారస్వామి రాజాగారు. ఆయన విషయం ఇదివరలో కొంత వ్రాసే వున్నాను. ఆయన, కాంగ్రెసు అధిష్ఠానవర్గంవారి ఆదేశాన్ననుసరించి, ఆ కాగితాలన్నీ మాకు చూపించారు. దానిపై ఆయన, ఇవేవో ఒకమారు అధిష్ఠాన వర్గంవారు కూడా పరిశీలించి తుదినిర్ణయం తీసుకొంటే, కాంగ్రెసుపార్టీ బలపడుతుందని వ్రాయడం తటస్థించింది. దానిమీద, అధిష్ఠాన వర్గంవారు వర్కింగ్‌కమిటీ సభ్యులైన శంకరరావు దేవుగారిని వీటిని పరిశీలించడానికి, నియమించి పంపించారు.

ఇంతటిలో, పట్టాభి సీతారామయ్యగారి వర్గంవారు—తాము కూడా ఏదో ఒక దోషారోపణ చేస్తే తమ వర్గంమీద చేసిన దోషారోపణల బలం తగ్గగలదని ఒక ఆరోపణ చేశారు.

వారు, 1945 లో ఆంధ్రదేశంలో తుఫాను చెలరేగినప్పుడు, తుఫాను బాధితుల సహాయార్థం వసూలుచేసిన డబ్బులో మిగులు ధనం, పాస్‌బుక్కు తమ వర్గానికి చెందిన కోశాధ్యక్షుని చేతిలోనే ఉండడంవల్ల—అందులో ఒక పెద్దమొత్తం ఇరవై వేల రూపాయలు,

ఒక ఆసామీ భవిష్యత్తులో ప్రకాశంగారు ముఖ్యమంత్రి అయితే తనకు ఏదో ఫారెస్టు కాంట్రాక్టులకు సహాయం చేస్తారనే ఉద్దేశంతో ఇచ్చిన లంచమని, ఆ మొత్తం ఆ వ్యక్తి ఏ బ్యాంకువారి ఏ నెంబరు చెక్కుమీద వ్రాసియిచ్చాడో వివరిస్తూ, తమ వర్గంమీది నేరారోపణ లను పరిశీలించేటపుడు, ప్రకాశంగారు పుచ్చుకొన్న యీ లంచం విషయంకూడా చర్చించాలనే ప్రతి విజ్ఞప్తి ఆ శంకరరావుదేవుగారి చేతిలో పెట్టారు.

శంకరరావుదేవుగారు రాగానే, ప్రకాశంగారు తనపై నున్న ఆరోపణలన్నిటికీ 'కాపీలుకాక అసలు కాగితాలనే చూపించ' మన్నారు. ఆయన, కాపీలు ఇచ్చినప్పుడు అసలుతో సంబంధమేమని అడిగారు.

"క్రిమినల్ కేసులో ముద్దాయికి అసలుకాగితం చూసే హక్కుంది. చూపించం"దని ప్రకాశంగారంటే, ఆయన, "కాపీలో ఉన్నదే అసలులో ఉంటుంది గదా! ఎందుకు అసలు కావాలని నొక్కి అడగడ" మని ప్రశ్నించారు.

అందుకు ప్రకాశంగారు ఇలా చెప్పారు :

"ఈ మంత్రులపై నేను ఆరోపణలు తెచ్చి, మూడేండ్లు కావచ్చింది. ఈ మూడేండ్లలో, ఇప్పుడు నాపై చేసిన ఈ ఆరోపణల ప్రసక్తి రాలేదు. ఇటువంటిది—నిజంగా వారు నా మీద చేయదలచి ఉంటే, 1946 లో నేను ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడే చేసి ఉండవలసింది.

"ఇవన్నీ రాజకీయాలు. అందుచేత, ఇంత ఆలస్యంగా వచ్చిన ఆరోపణ, అసలు ఎక్కడనుంచి పుట్టిందో తెలుసుకో వాలి. ఈ సంతకం పెట్టిన ఆసామీ కృష్ణాజిల్లావాడు. ఈ కాగితం కృష్ణాజిల్లాలో పుట్టలేదు. నాకు లంచమిచ్చాడని ఆరో పింపబడిన మనిషి చెన్నపట్నంవాడు. ఈ కాగితం చెన్న పట్నంలో పుట్టలేదు. ఇది ఢిల్లీలో పుట్టింది. అసలు కాగితం చూస్తే, అది ఎవరి ఇంటిలో పుట్టిందోకూడా చెప్పగలను. అందుకోసమే అడుగుతున్నాను."

"ఏమయినా సరే, ఇవ్వ" న్నారు శంకరరావుదేవుగారు.

అంటే, ఈ ఫిర్యాదు రాజకీయంగా వేసిన ఎదురెత్తేగాని, నిజం కాదన్నది ఆయనా గ్రహించే ఉంటాడు. అందుచేతనే—అసలు ఇవ్వవలసిందని మా పట్టుదల; ఇవ్వనని ఆయన పట్టుదలాను.

అధిష్ఠాన వర్గంలో ప్రకాశంగారికి ప్రతికక్షిగా ఉన్న ఒక ఉన్నత స్థానీయుని యింట యీ అభూత కల్పన జరిగిందని మా అందరి మనసులలోనూ ఉండేది.

ఇక, ఇక్కడ చెన్నపట్నంలో తమకు లంచమిచ్చాడని చెప్ప బడ్డ వ్యక్తిని పిలిపించి, ఆయన చెప్పే సాక్ష్యం తీసుకోవలసిందని ప్రకాశంగారు శంకరరావుదేవుగారిని బలవంతం చేశారు.

"ఎందుకు లేండి, అక్కరలేదు లేండి" అని ఆయన తప్పుకొన్నారు.

ఆ తర్వాత, శంకరరావుదేవుగారు—ముఖ్యమంత్రి కుమారస్వామిరాజాగారిచేత ఆరోపణపత్రంలో చెప్పిన బ్యాంకుకు ఉత్తరం వ్రాయించారు. ఆ బ్యాంకువారు, ఆ పేర్కొన్న వ్యక్తికి తమ బ్యాంకులో అకౌంటు లేదనీ, అందులో చెప్పిన నంబరుగల చెక్కు పుస్తకం తమ బ్యాంకువారు జారీ చేయలేదనీ వ్రాశారు. ఇంక ప్రకాశంగారిపైన దోష మేముంది?

అయితే, కుమారస్వామిరాజాగారు గానీ, శంకరరావుదేవుగారు గానీ—బ్యాంకువారి ఉత్తరాన్ని వెంటనే బయటపెట్టలేదు.

కొంతకాలమైన తర్వాత మేము ఢిల్లీ వెళ్ళవలసి వచ్చింది. ఈ తగువు తీర్చడానికి, కాంగ్రెసు అధిష్ఠాన వర్గంవారు—వల్లభాయి పటేలు, జవహర్లాల్ నెహ్రూ, మౌలానా అజాద్‌గారలు గల ఒక ఉపసంఘాన్ని నియమించారు.

బ్యాంకువారి ఉత్తరం సంగతి మాకు తెలియనీకపోవడంవల్ల, ప్రకాశంగారు మొదటి ధోరణిలోనే, తమపై గల ఆరోపణ మొట్టమొదట విచారించి, తాము దోషియో, నిర్దోషియో తేల్చవలసిందని బలవంతపరిచారు.

బ్యాంకు ఉత్తరం సంగతి తెలిసి ఉండికూడా, నెహ్రూగారు, "పరిశీలనకేముంది? పరిశీలనకేముంది?" అని పదిసార్లు తప్పించి మాట్లాడారు.

చివరకు, ఆ ఆరోపణ సరియైనది కాదని ఒక ఉత్తరం మూలంగానైనా అధిష్ఠానవర్గంవా రెవరూ తెలియపరచలేదు.

చివరకు నివేదిక వ్రాసేటప్పుడు మాత్రం, ప్రకాశంగారిపై వ్రాసిన ఫిర్యాదులో పేర్కొన్న వ్యక్తికి, అందులో చెప్పిన బ్యాంకులో అకౌంటు లేదని వ్రాశారు.

ఈ ఉత్తరం ఎక్కడ, ఎలా పుట్టింది? ఇటువంటి ఘోరమైన అసత్యారోపణలు చేసినవారిపై ఏమి క్రమశిక్షణ చర్య తీసుకోవాలి?— ఈ వ్యవహారాలు వారెవ్వరూ పట్టించుకోలేదు.

అటువంటి కాంగ్రెసువాదులూ, అటువంటి కాంగ్రెసు అధిష్ఠాన వర్గమూ ఉండడంచేతనే—సత్యాహింసాచక్రద్వయం పైని, మహాత్మా గాంధీగారు స్వాతంత్ర్య రథాన్ని నడిపించి సంపాదించిన స్వతంత్ర భారతదేశానికి, ఇప్పుడు మనమంతా చూస్తూన్న కడగండ్లు కలగడంలో ఆశ్చర్యం లేదు.

# 16

## సంవిధాన సభ: ఆంధ్రరాష్ట్రము

లోగడ ప్రకాశంగారి ఒత్తిడిపైన, మరికొందరు మిత్రుల ఒత్తిడి పైన—సంవిధానం ముసాయిదాలో ఆంధ్రరాష్ట్రం పేరు, మిగిలిన రాష్ట్రాలతోబాటు వ్రాశారనీ, కాని, 21-2-1948 న ప్రకటితమైన రెండవ ముసాయిదాలో ఆ పేరు వదిలిపెట్టేశారనీ వ్రాశాను. అలాగు వదిలిపెట్టడానికి, రాష్ట్రం ప్రత్యేకంగా కార్యనిర్వహణ జరుపుకోవలెనంటే, కొన్ని పనులు ముందుగా జరగవలెనని కారణాలు చెప్పారు. 1947 లో అమలులోఉన్న గవర్నమెంట్ ఆఫ్ ఇండియా ఆక్టు ప్రకారం క్రొత్త రాష్ట్రంయొక్క యంత్రాంగం సిద్ధం చేసుకొని

ఉండాలి. రాష్ట్రానికి కావలసినటువంటి అన్ని హంగులు, రాష్ట్రంలో చేరవలసిన భూభాగం సరిహద్దులు సిద్ధంగా ఉంచేనే సంవిధానం షెడ్యూలు (అనుసూచి) లో రాష్ట్రంపేరు ఉంచే లాభముంటుందని వారు చెప్పారు.

సంవిధాన సభలో ఈ విషయం వచ్చినప్పుడు ప్రకాశంగారు ఇలా అన్నారు :

"అధ్యక్షా! ఈ సందర్భంలో ఒక విషయం మీ దృష్టికి తెస్తున్నాను. ఇప్పటికి 36 సంవత్సరాలుగా, ఆంధ్ర ప్రాంతం నుంచి ప్రతినిధులుగా వచ్చిన డాక్టర్ పట్టాభి సీతారామయ్యగారు, ఆచార్య రంగాగారు, నేను మొదలైనవారము ఆంధ్ర రాష్ట్రం కావాలని వాదిస్తూనే ఉన్నాము. ఇప్పటివరకు మా కోరిక ఫలించలేదు.

"అయితే, ఈ రోజున మా సూత్రాన్ని కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారు ఆమోదించారు. జవహర్‌లాల్ నెహ్రూ, వల్లభాయి పటేలు, పట్టాభి సీతారామయ్యగారలకు ఈ సూత్రాన్ని అంగీకరించినందుకు నా కృతజ్ఞత. దీని విషయమైన పని ఈ రోజునే ప్రారంభం కావాలి. చెన్నపట్నం సంబంధించి తగాదా వచ్చింది. అది పరిష్కరించలేకపోయాము.

"అధ్యక్షా! మీరు థార్ కమిషనును నియమించారు. వారు దేశమంతా తిరిగారు. సమస్య బాగా పరిశీలించారు. కొన్ని సిఫారసులు చేశారు. వారు చేసిన సిఫారసులు ఆధారంగా చెన్నపట్నం-ఆంధ్రరాష్ట్రానికి కలపాలి అన్న వాదము; లేక పట్నం రెండుగా చేసి, రెండు రాష్ట్రాలకు చెరొక భాగం ఇవ్వాలనే వాదము ; లేక చెన్నపట్నాన్ని ప్రత్యేక రాష్ట్రంగా చేయాలన్న వాదము అటుంచి, ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుచేయాలని కోరాము. వర్కింగ్ కమిటీవారు ఈ సమస్య విషయమై ఏ పరిష్కారానికీ రాలేకపోయారు. కాని, సరిహద్దు కమిషను వారు ఈ విషయంకూడా ఆలోచించే అవకాశ ముండగలదని

తేల్చారు. అందుచేతనే, వర్కింగ్ కమిటీవారికి నా ప్రత్యేక మైన కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఆంధ్రప్రాంతానికి చేసిన ఈ విధమైన ఏర్పాటు భాషారాష్ట్రాలు కోరుతున్న ఇతర ప్రాంతాలకూడా చేయడం న్యాయము. భాషారాష్ట్రాలు ఐక మత్యమును తీసుకువస్తాయి గాని, అనైక్యమును తీసుకురావు. భాషారాష్ట్రాలు ప్రజలకు బలం చేకూర్చి, ప్రజావ్యతిరేక శక్తు లను ఎదిరించే శక్తి వారికి కలగజేస్తాయి."

ఇందులో ఇచ్చిన సలహాలనుబట్టి చెన్నరాష్ట్ర ప్రభుత్వం వా రొక రాష్ట్రవిభజన సంఘాన్ని (పార్టిషన్ కమిటీ) ఏర్పరచారు. ఆ సంఘంలో ప్రకాశంగారు తప్ప, తక్కిన ఆంధ్ర సభ్యు లిద్దరూ తమిళ సభ్యులు చెప్పిన సూచనలన్నిటికీ అంగీకారం ప్రకటించారు. అందులో ముఖ్యమైనది—చెన్నపట్నంమీద ఆంధ్రులు అధికారం వదలుకోవలె నన్న సూత్రము. ప్రకాశంగారు అది ఎంత మాత్రం అంగీకరించము అని అడ్డారు. ఆ కమిటీవారు చేసిన మిగిలిన కార్యక్రమమంతా— అనగా, అప్పులు, రాబడి పంపకములు, ఈ ప్రశ్నముందు స్వల్పంగా కనిపించాయి.

## ప్రకాశం — పట్టాభి

ఈ విషయమై మరొక ఉదంతం కూడా చెప్పాలి. వ్యక్తి గతంగా ఎన్ని భేదాలున్నా, డాక్టర్ పట్టాభిగారు కాంగ్రెసు అధ్యక్ష పదవికి పోటీచేసిన సందర్భంలో ప్రకాశంగారు తమ అనుయాయు లందరితోను కలసి, ఆయనను తమ వోట్లతో నెగ్గించవలెనని యత్నించి, ఆ కార్యం సాధించారు. పట్టాభిగారు అధ్యక్షులయిన తర్వాత, (ఆ రోజులలో అధ్యక్షుణ్ణి రాష్ట్రపతి అని పిలిచేవారు) ఆయన చెన్నపట్నం వచ్చినప్పుడు, నేను వారి బసకు గౌరవ సందర్శనం చేయడానికి వెళ్లాను. రెండు మూడు మాటలు కుశల ప్రశ్నలు సాగిన తర్వాత, ఆయన చటుక్కున లేచి, లోపలికి వెళ్ళి, ఒక అర ఠావు సైజు కాగితంతెచ్చి, దానిమీద సంతకం చేయమన్నారు. దానిమీద అప్పటికే ఆయన

సంతకం, కామరాజ నాడార్‌గారి సంతకం ఉన్నాయి. వారు సంతకం పెట్టిన భాగం పైన ఉన్న మాట లివి:

"చెన్నపట్నంమీద ఆంధ్రులు హక్కులు వదులుకో గలందుకును, తిరుపతిపై తమిళులు హక్కులు వదులుకో గలందుకును ఇందు మూలముగా అంగీకరించడమైనది."

ఇటువంటి కాగితంపైన—ఆయన, బుజ్జగింపు మాటల మధ్య నన్ను సంతకం చేయమని రెండు, మూడు పర్యాయాలు చెప్పగా, "మీ రీ విషయం ప్రకాశంగారితో చర్చించగూడదా?" అని ప్రశ్నించాను.

దానిపైన ఆయన, "ప్రకాశంగారితో ఎవరికి కుదురుతుంది? మా మటుకు మాకు ఆయన సంతకం కన్నా నీ సంతకమే ఎక్కువ విలువ గలది," అన్నారు.

కాని, నేను ఆయనకు తిరిగి మెల్లిగా నచ్చజెప్పి, "సాయంత్రం మీరు ఒకమారు స్వయంగా ప్రకాశంగారిని కలుసుకొంటే మనమంతా ఒక పద్ధతికి రాగలము గదా!" అన్నాను.

అందుకు, "సరే, ఎందుకు చెప్పావో! ఈ సాయంత్రం జరగబోయే మీ కాంగ్రెస్ శాసన సభ్యుల సమావేశంలో ఇందులో వ్రాసింది ఆమోదించడానికి, ఎజండాలో ఈ విషయం కలుపబడుతుంది. కాబట్టి, అక్కడే ప్రకాశంగారు ఉన్నారు గనుక, ఒక అరగంట ముందుగా వచ్చి ఆయనతో మాట్లాడుతానులే," అని ఆయన చెప్పారు.

ఏలాగో, ఆయన చెప్పినట్టు సంతకం చేయకుండా, ఆయన మనసుకు నొప్పి కలిగించకుండా, పరస్పర సుహృద్భావంతో బయట పడ్డాను.

అనుకున్నట్టు, పట్టాభిగారు ఆ సాయంకాలం వచ్చి, నా గది దగ్గిర కారు నిలిపారు. దిగివచ్చి, "ఏం విశ్వనాథం! నువ్వు చెప్పినట్టు వచ్చాను. ప్రకాశంగారు ఇక్కడ ఎక్కడున్నారు?" అని అడిగారు. ప్రకాశంగారు బసచేసిన మేడగదులు చేత్తో చూపించాను. అది గవర్నర్ భవనంకాక ప్రత్యేకంగా వేరే కట్టిఉన్న ఒక చిన్న మేడ భాగము.

పట్టాభిగారు, ప్రకాశంగారి గదిలోకి వెళ్ళడమనేది ఒక విశేష కార్యం క్రింద భావించి, పది పదిహేనుగురు సభ్యులు నా గది దగ్గరగా ఉన్న కారు చుట్టూ మూగారు.

మేము,—ప్రకాశంగారు, పట్టాభిగారు కలుసుకున్నప్పుడు ఎలా మాట్లాడుతారో ఊహాగానం చేయ నారంభించేంతలోనే పట్టాభిగారు ఒక చేత్తో జారిపోతున్న పంచె గోచీ సర్దుకుంటూ, రెండవ చేత్తో క్రిందికి మీదికి జారిపోతున్న కాగితాలను పట్టుకుంటూ కారు దగ్గరికి ఇలా కేక లేసుకుంటూ వచ్చారు:

"ఆ ముసలి మూర్ఖునితో ఎవరు వేగగలరు? ఛ....ఛ....విశ్వనాథం! నువ్వు సంతకం పెట్టనన్నావు! మీ పార్టీ మీటింగుకి నేను రానూ అక్కరలేదు, ఈ ఒడంబడిక కాగితం మీరు అంగీకరించనూ అక్కరలేదు. పోండి! మీకు చేతనైనది ఏదో చేసుకోండి!"

కఠోరమైన కంఠంతో ఈ మాటలు చెప్పి, అతి విసురుగా చేతులు ఊపి, కారులో తొందరగా ఎక్కి కూచుని, డ్రైవరుతో "తిప్పు కారు మన యింటికి," అని ఆదేశించి ఆగ్రహంగా వెళ్ళిపోయారు.

ఈ చెన్నపట్నం సమస్యే, తొలినుంచి చివరివరకు ప్రమగ్గిపోయి, చివరికి అమరజీవి పొట్టి శ్రీరాముల ప్రాణాన్ని కూడా హరించింది.

షెడ్యూలులో ఆంధ్రరాష్ట్రం పేరు కలుపుతామని చెప్పిన ఆ సమయంలో, అధిష్ఠాన వర్గాన్ని, ఆంధ్రుల చిరకాల వాంఛను ఈడే రిస్తూ ఉన్నందుకు నెహ్రూగారినీ-కాన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ (సంవిధాన సభ)లో ప్రకాశంగారు పొగిడారు. ఆ సందర్భంగా, తమకు చేదోడు వాదోడుగా ఉన్న ఆచార్య రంగా, డాక్టర్ పట్టాభి, అనంతశయనం అయ్యంగారు, శ్రీమతి దుర్గాబాయి మొదలగువారు చేసిన కృషినికూడా ఆయన ప్రశంసించారు.

ఇంతేకాక, ప్రకాశంగారు మరొకటి చెప్పారు :

"భాషాప్రయుక్తరాష్ట్రాలు ఏర్పడితే, భారతదేశం—బాల్కనైజు (Balkanise)* అయిపోతుందని కొందరు

* యూరపు ఖండపు ఆగ్నేయభాగంలో అనేక విధాల

మిత్రులు చేసిన వాదం వట్టి అపోహ. పరిపాలనాసౌకర్యము హెచ్చుగా కలిగి, ప్రజలు పరిపాలనలో భాగస్వాములై, దేశాన్ని మరింత బలిష్ఠముగా చేయడానికీ, దేశాభిమానము పెంచడానికీ పరమ సహాయకారులు అవుతాయి.''

చివరికి, పట్టాభిగారు, వల్లభభాయి పటేలుగారు, నెహ్రూగారు సభ్యులుగాఉన్న ఉప సంఘంకూడా చెన్నపట్నం సమస్యను సందిగ్ధంగా వదిలిపెట్టింది. చివరికి, 1952 లో సోషలిస్టు, కమ్యూనిస్టు పార్టీలలోని ఆంధ్ర సభ్యులు చెన్నపట్నంమీద ఆశ వదులుకోవడంవల్ల, ఆంధ్ర కాంగ్రెసుపార్టీవారు చెన్నపట్నం తమిళరాష్ట్రంతో కలిపివేయాలన్న నివేదికలో సంతకం చేయడంవల్ల—ప్రకాశంగారు, ఆయన అనుయాయులూకూడా చెన్నపట్నం లేకుండాఉన్న ఆంధ్రరాష్ట్రం ఏర్పడడానికి అంగీకరించవలసి వచ్చింది.

ఇలా చెన్నపట్నం మిగిలిన రాష్ట్రానికి వదలడానికి అంగీకరించగానే, అప్పటి ముఖ్యమంత్రి రాజాజీ సలహాపైన బళ్లారి జిల్లా కూడా ఆంధ్రభాగంలోంచి తప్పించారు.

1936 లో గంజాంజిల్లా ఉత్తరభాగం, జయపుర సంస్థాన భాగాలు—ఒరిస్సాలో చేరిపోయినవి. సేలంజిల్లాలో ఉన్న తెలుగు భాగాలు, మైసూరు రాష్ట్రంలో ఉన్న కోలారు వగైరా తెలుగుభాగాలు, మధ్యప్రదేశంలో చాందావరకు ఉన్న తెలుగు భాగములు - ఇవి ఏవీ తెలుగురాష్ట్రంలో చేరకపోవడమే గాక, మరికొన్ని తెలుగుభాగాలు కూడా పోగొట్టుకోవలసి వచ్చింది.

మిగిలిపోయిన తెలంగాణాతో కలిపి, విశాలాంధ్ర రాష్ట్రం ఏర్పడింది. అంతవరకు సంతోషించవలసినదే.

ఇప్పటికైనా, మనము ఐకమత్యంగా ఉండడం నేర్చుకొంటే,

---

రాజీపడి, ఆ భాగమంతా ప్రతినిత్యమూ పోరాడే, నిస్సత్తువగల చిన్న చిన్న దేశాలుగా మారినదానిని సూచిస్తుంది ఈ 'బాల్కనైజు' అన్న పదము.

మన ఆంధ్రరాష్ట్రం భారతదేశంలో ప్రధానరాష్ట్రంగా పరిణమింపడానికి చాలా అవకాశాలున్నాయి.

## మరల ప్రకాశంగారి పత్రికా వ్యాసంగము

మంత్రివర్గంనుంచి దిగినతర్వాత, ప్రకాశంగారు మొదట్లో "గ్రామ స్వరాజ్య" మనే వారపత్రికను ప్రారంభించారు. అయితే, ఆయన—తాము ఊహిస్తున్న స్వయంపోషక గ్రామ స్వరాజ్య సంస్థాపనా విషయిమై ప్రచారం చేయడానికి ఆ వారపత్రిక సరిపోదని గ్రహించారు. ఆ సమయంలో 'రినై జాన్స్ ప్రింటర్స్' అనేదానిని చెన్నపట్నంలో నడుపుతున్న దాసర్ల వెంకట్రావుగారు అనే పిఠాపురం వాస్తవ్యులకు, ప్రకాశంగారి త్యాగశీలతమీద ప్రత్యేకమైన అభిమానం పుట్టింది. ఆయన తనచేత నున్న అచ్చుయంత్రాన్ని ప్రకాశంగారికి "విజయప్రభ" అనే తెలుగు దినపత్రిక ప్రచురించడానికిగాను ఇచ్చి సాయం చేశారు. ప్రకాశంగారి యీ యత్న సాఫల్యానికై, ఎమ్. కె.వి. రెడ్డి, బొప్పన హనుమంతరావుగారలనే బారిష్టరులు, "విజయప్రభ" ప్రచురణ నిమిత్తం ఒక కంపెనీ ప్రారంభించారు. పత్రికకు సంపాదకుడుగా బరంపురం వాస్తవ్యుడు, స్వాతంత్ర్య యోధుడు అయిన న్యాపతి నారాయణమూర్తిగారిని నియమించారు. అంతకు ఒక సంవత్సరం ముందు ఆయన కేంద్ర శాసన సభలో సభ్యుడుగా ఉండేవారు. కొంతకాలం సంపాదకుడుగా పనిచేసి—ప్రకాశంగారి దగ్గర తమకున్న చనవు నాధారంగా చేసుకొని ఆచార్య రంగాగారి వర్గంవారు తన సంపాదకీయాలతో జోక్యం కలుగజేసుకొంటున్నారనీ, ఆ పరిస్థితులలో తాను సంపాదకుడుగా పనిచేయడం కష్టమనీ చెప్పి, ఆయన మానుకున్నారు. దాంతో, అసలు పత్రికాప్రచురణకే భంగం వచ్చింది. ఆ పత్రిక నడచినన్నాళ్ళు చాలా వేగంగా ప్రజల అనురాగాన్ని సంపాదించింది.

అప్పుడు, ప్రకాశంగారు "ప్రజాపత్రిక" అనే ఆంగ్ల వార పత్రికను ప్రారంభించారు. అదికూడా తొందరగా ప్రజల అభిమానాన్ని పొందగలిగింది. ఒకసారి ఆ పత్రికలో, ఆలపాటి వెంకటరామయ్య

గారి పైన ఆరోపణలతో ఎస్. సుబ్బారావు అనే ఆయన వ్రాసిన ఉత్తరం అచ్చయింది. (వెంకటరామయ్యగారి గురించి యివివరలో వ్రాసి ఉన్నాను.) వెంకటరామయ్యగారు, పత్రికను నిర్వహిస్తున్న ఎస్. వి. కొండపిగారిమీద పరువునష్టం దావా వేశారు.* ఆ దావా కోర్టువారు కొట్టేశారు.

అంతకుముందు, డాక్టర్ పట్టాభిగారు చాలా గొప్ప ప్రచార ఆర్భాటములు జరిపి, చెన్నపట్నంలో మౌంటుకోడ్డులో ఉన్న కిర్లంపూడి జమీందారుగారి భవనం కొని, అందులో బొబ్బిలిరాజా మొదలయినవారి సహాయంతో "శుభోదయ" అనే దినపత్రిక ప్రచురింప సాగారు. ఆయన అఖిల భారత కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు గనుక, గాంధీగారికీ, ఆయనకూ పరిచయ మెక్కువన్న పేరువల్ల, కాంగ్రెసు శాసన సభ్యులుగా ఉండదలచిన చాలామంది ఆ పత్రికలో పెద్ద పెద్ద మొత్తాలిచ్చి వాటాలు కొన్నారు. కానీ, ఆ పత్రిక దురదృష్ట వశాత్తు ప్రారంభంలోనే ఆగిపోవలసిన పరిస్థితికి (ఏ విధంగానో నాకు జ్ఞాపకంలేదు) వచ్చింది. కె. అప్పారావుగారు అనే ఆయన ఆ పత్రిక భవనాలకు, యంత్రాలకు యజమాని కావడం జరిగింది. ఆయనకు, ప్రకాశంగారిమీద భక్తి కుదరడంచేత, ఆ భవనంలోనుంచే ఆ అచ్చు యంత్రాలపై ముద్రింపబడి 'ప్రజాపత్రిక' తెలుగు దినపత్రికగా రూపొందింది. అప్పట్లో, క్రొవ్విడి లింగరాజు మొదలైనవారు సంపాదకులుగా ఉండేవారు. పత్రిక ప్రకాశంగారిది కావడంతో, పత్రికలో చదవదగిన వార్తలు, వ్యాసములు ఉండగలవన్న విశ్వాసంచేత మొదటి రోజునే తొమ్మిది, పదివేల కాపీలు చెల్లాయి.

అప్పటికి ప్రత్యేకాంధ్ర దేశమనే నినాదం నాలుగుమూలలా ఎగబ్రాకి ఉన్నది. అధికార దుర్వినియోగం చేసిన చెన్నరాష్ట్ర మంత్రి

---

* ఈ కొండపిగారు ఆ రోజులలో ప్రకాశంగారికి ప్రైవేటు సెక్రటరీగా ఉండి,ఆ పత్రికను నిర్వహించేవారు. ప్రస్తుత మాయన హైదరాబాదులో బాగా ప్రాక్టీసు చేస్తున్న న్యాయవాది.

వర్గం పేరుపోయి, వారికి వ్యతిరేకంగా ఎవరేమి వ్రాసినా చదవడానికి వందలకొద్ది పాఠకులు ఉండేవారు.

అప్పారావుగారు చాలా పెద్ద వ్యవహారజ్ఞులే అయినా, ఆ పత్రికను విస్తృతపరిచే ఊహ ఆయనకు లేకపోయింది. ఆ కారణంచేత ఆ పత్రికకూడా అచిరకాలంలోనే ఆగిపోవడం జరిగింది.

ఉత్పత్తి, కొనుగోలుదారుల సహకార సంఘములు

ప్రకాశంగారి అభిప్రాయ ప్రకారంగా ఈ సంఘాలను సాగనిచ్చి ఉంటే, మన సంఘ వ్యవస్థలో అహింసా మార్గంలో మన ప్రజా సామాన్యం మధ్యవర్తులనుంచి విముక్తి పొంది ఉండేది. అయితే, మధ్యవర్తుల ప్రాబల్యానికి లోబడినవారు ప్రకాశంగారి మంత్రివర్గాన్ని పడగొట్టారని యిదివరలో పేర్కొన్నాను.

ఈ సంఘాలు సరిగ్గా పనిచేయడం లేదని ప్రకాశంగారి తర్వాత వచ్చిన మంత్రుల నోట అనిపిద్దామని—వీటిని గురించి, వీటి పని విషయం గురించి ఒక సభ్యుడు ప్రశ్నించారు. అప్పుడు ఈ వ్యవహారానికి సంబంధించిన మంత్రి డాక్టర్ టి. ఎస్. రాజన్‌గారు. అప్పటికే ఈ సంఘాలు వ్యాపించకుండా అప్పటి మంత్రివర్గం కొన్ని ఆజ్ఞలు వేసిఉన్నది.

కాని, ప్రశ్న మలబారుకు సంబంధించింది గనుక, వారు అక్కడి సంఘాల యథాతథమైన పరిస్థితిని వివరించక తప్పలేదు. మలబారులో ప్రారంభించిన 107 సంఘాలలో ఏడు సంఘాలలో మాత్రం చిల్లర తప్పులు జరిగాయని చెప్పారు. తొమ్మండుగురు ఉద్యోగులపైన దోషారోపణ జరిగినా, అవి కోర్టులో నిలవలేదు.

అప్పుడు, అనుబంధ ప్రశ్నగా ఒక శాసన సభ్యుడు అడిగారు: "ఈ సంఘాలు ముఖ్యంగా మలబారులో బాగా పనిచేస్తున్నాయని, లోగడ ప్రభుత్వం వారన్నమాట సరిఅయినదేనా?"

దానిపై రాజన్‌గారు ఇలా జవాబిచ్చారు:

"అధ్యక్షా! సరిగ్గా అలాగుననే నేను జవాబు ఇచ్చి ఉన్నాను. మలబారు జిల్లాలో మొత్తంపైన ఈ సంఘాలు

సక్రమంగా పని చేస్తున్నాయని, ప్రజాభిప్రాయం వాటికి అను కూలంగా ఉన్నదని నేను గట్టిగా ఈ సభముందు చెప్పగలను.''

ప్రజల ఉపయోగంకోసం నిష్కల్మషంగా కార్యక్రమం జరిగించినప్పుడు, సత్ఫలితం కలిగినప్పుడు, కాదని శత్రుపక్షంవారు కూడా అనలేక పోయారు. కాని, సాధారణంగా నడుస్తున్న సహకార సంఘాల వల్ల, మధ్యవర్తి తత్వంగల వారికి లాభమువచ్చే ఉద్యమానికి, ప్రకాశంగారి ఉద్యమం వ్యతిరేక మయినది. అందుచేత, ఆయన దిగిపోయిన వెంటనే, క్రొత్త ప్రభుత్వంవారు ఈ సహకార సంఘాల [ఉత్పత్తి, కొనుగోలుదారుల సహకార సంఘాల] భవిష్యత్తును నిర్ణయించడానికి ఒక ఉప సంఘం ఏర్పాటు చేశారు. అప్పటి ముఖ్యమంత్రి అయిన రామస్వామిరెడ్డిగారికి—ఈ సంఘాల ఆదర్శాల మీద, కార్యక్రమాల మీద అభిమాన ముండేది.

అయితే, ఆయన వేసిన ఉప సంఘానికి అధ్యక్షుడు—లిమిటెడ్ కంపెనీల మేనేజింగ్ డైరెక్టరు లాగున సహకార సంఘాలను నడిపిస్తూ, సహకారోద్యమానికి నిపుణుని (ఎక్స్‌పర్ట్) క్రింద భావింపబడే రామలింగం చెట్టిగారు. ఆయనకు ప్రకాశంగారి సహకార సంఘాల పైన సహజంగానే వ్యతిరేకత ఉండేది. అందుచేత, ఒక విధమైన రాజీ మార్గంగా సంప్రదాయ సహకార సంఘాలు లేనిచోట ఇవి ఏర్పాటు కావచ్చును అని- నీటికి నీరు, పాలుకు పాలు కలిసిన ఒక సూత్రం ప్రతిపాదించారు. దాంతో, ప్రజా ఉద్యమంతో సంబంధించిన ప్రకాశంగారి సహకార సంఘాలు కొనసాగే సౌకర్యాలు లేక, రాను రాను క్షీణించినవి.

## ఆంధ్ర కాంగ్రెస్ రాజకీయాలు

1950 జనవరి 26 న ఇప్పుడు అమలులో ఉన్న సంవిధానం అమలులోకి వచ్చింది. అయితే, దాని ప్రకారం ఎన్నికలు జరగడానికి 1946 నుంచి లెక్క వేస్తే, 1952 తేలింది. అందుచేత, 1951 లో నుంచి కూడా అన్ని రాష్ట్రాల ప్రజల దృష్టి ఆ రాబోయే ఎన్నికలపైన పడింది. అప్పటికి ఆంధ్ర కాంగ్రెసు రెండు వర్గాలుగా విడిపోయింది.

1946 లో ప్రకాశంగారు, తాము ముఖ్య మంత్రి అయినప్పుడు, ఆంధ్ర కాంగ్రెసు కమిటీ యాజమాన్యాన్ని ఆచార్య రంగా గారికి అప్పగించారు. పట్టాభిగారు అది తమ చేతుల్లోకి తీసుకోడాని కెంతో యత్నించారు. వారి పక్షాన పనిచేయడానికి పూనుకొన్న ముఖ్యమైన వారు- ఆయన అనుయాయులు, మంత్రులూ అయిన కళా వెంకటరావు, బెజవాడ గోపాలరెడ్డి, నీలం సంజీవరెడ్డిగారలు.

కాంగ్రెసు కమిటీలో సభ్యులను చేర్చి, సవ్యమైన పద్ధతిలో కాంగ్రెసు కమిటీని వశం చేసుకోవడానికి యత్నిస్తే, అందులో తప్పు లేదు. కాని, వారి వర్గీయులు, సవ్యమైన మార్గాన సభ్యులు కావడానికి రంగాగారి (అనగా, ప్రకాశంగారి) వర్గంవారు అవకాశం ఇవ్వలేదన్న నెపంపైన, ఒక లక్ష పేర్లు జాబితాలుగా వ్రాసి, అవి కాబోయే సభ్యుల పేర్లని, నిర్ధారణ సూచకంగా వేలి ముద్రలు అనేకములైనవి తగిలించి, లక్ష మందికి కావలసిన చందా మొత్తం ఇరవై అయిదువేల రూపాయలు కాంగ్రెసు అధ్యక్షుని పేర ఢిల్లీకి పంపారు. ఇవన్నీ దొంగ జాబితాలని ప్రకాశంగారి వర్గంవారు వెంటనే కనిపెట్ట గలిగారు. ఈ పాతిక వేలూ, పావలా పావలా చొప్పున చందాదారు లిచ్చిన డబ్బు కాదు- ఒక రిద్దరు వర్తకులు, ఒక రిద్దరు జమీందారులు (అపుడు జమీందారీల రద్దు బిల్లు సెలక్టు కమిటీ * ఎదుట ఉన్న కాలము) ఇచ్చిన మొత్తాలు కలపగా పాతిక వేలయింది. అందులో ఆరువేలిచ్చిన జమీందారు పేరు నాకు జ్ఞప్తిలో ఉంది. ఈ విధంగా చేసిన ఆరోపణ లన్నీ కొంత కాలానికి చర్చకు వచ్చి, ఆ లక్ష సభ్యుల పేర్లు జాబితాలోంచి కొట్టివేయబడ్డాయి.

ఈ యత్నం విఫలం కాగానే, 1951 లో వారు తిరిగి మరొక

---

* ఒక శాసనం ప్రవేశపెట్టినపుడు, అందులోని భాగాలు బాగా పరిశీలించి చక్కదిద్దడానికి, అన్ని పార్టీల ప్రాతినిధ్యంతో కూడిన శాసన సభ్యుల ఉప సంఘాన్ని 'సెలక్టు కమిటీ' అంటారు. వీరి నివేదికపైనే శాసన సభలో తర్వాత ఆ శాసనం గురించి చర్చ జరుగుతుంది.

గట్టి యత్నం చేశారు. రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యులను మెల్లిగా లోబరుచుకొని, రానున్న సాంవత్సరికపు ఎన్నికలలో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్ష పదవి పొందగలిగి నట్టయితే—ప్రకాశంగారిని మంత్రివర్గం లోంచి పంపించినట్టుగానే కాంగ్రెసునుంచీ పంపివేయడమో, నిర్వీర్యులను చేయడమో ఏదో ఒకటి చేయవలెనని గట్టి పట్టు పట్టారు.

మంత్రులలో కళా వెంకటరావుగారు చాణక్యుని వంటివారు. తాము అధికారంలో ఉన్నారు గనుక, రాష్ట్ర సంఘ సభ్యులను ఏ విధంగా వశపరచుకోవడమో వారు కనిపెట్టారు.

ఆంధ్ర మంత్రుల చేతులలో—రెవిన్యూ, ఆర్థిక శాఖ, స్థానిక సంస్థలు, హరిజన సంక్షేమ శాఖ, మద్యనిషేధం, రెంట్ కంట్రోలు, సినిమా మొదలైన శాఖ లుండేవి. 1951 ఏప్రిలులో రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షుని ఎన్నిక జరగవలసి ఉన్నది. ఆ ఏడు బడ్జెటు చర్యల సమయంలో, రాష్ట్ర సంఘ సభ్యులను వశపరచుకొనేందుకు అనేక వాగ్దానాలు చేయబడినాయి. ఆర్డర్లు జారీ చేయబడ్డాయి.

## ఎన్నికల రంగస్థలము—విజయవాడ కాంగ్రెసు భవనము

ఆనాడు, ప్రభుత్వంవారు రాష్ట్ర సంఘాన్ని తమ వశం చేసుకోకుంటే, వారి వర్గం తిరిగీ తల యెత్తుకోలేని పరిస్థితులు ఏర్పడుతాయి. అందుచేత, తమ వర్గానికి వోటు బలము చేకూర్చుకోడానికి రాష్ట్ర సంఘ సభ్యులను, పశ్చిమ గోదావరి జిల్లాలోని ఒక గ్రామంలో, ప్రస్తుతం మంత్రిగా ఉన్న ఒకరి దివ్య భవనంలో షడ్రసోపేతమైన అన్నపానాదులతో, ఒక చోట చేర్చి పెట్టుకొన్నారు.

మరునాడు ఎన్నిక జరుగుతుందనగా, ఎన్ని లెక్కలు వేసుకొన్నా వారి వర్గం వారికి ఏడు వోట్లు తక్కువగా ఉన్నట్టు తెలిసింది. వారి అభ్యర్థి నీలం సంజీవరెడ్డిగారు. ఆయన మంత్రి పదవి వదులుకొని రాష్ట్ర సంఘ అధ్యక్షుడు కావాలని ఏర్పాటు జరిగింది. ప్రకాశం, రంగా గారల వర్గాల పక్షాన నిలబడ్డ వారు ఆచార్య రంగా గారు.

ప్రభుత్వం పక్షం వారు ఏం చేశారో తెలియదు గానీ, అంత వరకు ప్రకాశం గారంటే ప్రాణాలివ్వడానికైనా సిద్ధమని చెప్పిన నలు

గురు కృష్ణా జిల్లా సభ్యులు అటు దాటివేశారు.* ఎన్నిక తరువాత, ఏడు వోట్లతో గెలుస్తామనుకున్న రంగాగారు నాలుగు వోట్లతో ఓడిపోయారు.

ఆనాడు జరిగిన ఉదంతాలు ఆంధ్ర కాంగ్రెసు చరిత్రనేగాక, ఆంధ్ర రాజకీయ రంగ నిర్మాణ, పరిమాణాలను సంపూర్ణంగా మార్చి వేశాయి. ఆ రోజు ఎన్నిక ఫలితం చెప్పిన వెంటనే, మంత్రి గోపాల రెడ్డిగారు ఒక సూక్తి చెప్పారు.

మంత్రులుగా తాము, హెచ్. సీతారామరెడ్డి, కళా వెంకటరావు, కల్లూరి చంద్రమౌళిగారలు కావలసిన ఆదేశాలు ఇస్తుండగా, నీలం సంజీవరెడ్డిగారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులుగా ప్రభుత్వానికి సాయపడే ముఖ్య దళనాయకుడుగా తమ వర్గ సైన్యాలను ముందుకు నడిపిస్తే, ఆ రోజు వారికి ఎదురుగా పోటీ చేసిన ప్రతిపక్షంవారు అదృశ్యులై పోతారని ఆయన చెప్పిన మాటల సారాంశము.

దాక్షిణాత్యులతో చేయి చేయి కలిపి, కుతంత్రంవల్ల ప్రకాశం గారిని మంత్రివర్గంనుంచి దించిన తర్వాత, ప్రజా సామాన్యంలో తమపై ప్రతికూలత, దొంతరలు దొంతరలుగా ఎంత పెరిగిందో వారు తెలుసుకోలేకపోయారు.

జనరల్ ఎన్నికలలో పైన చెప్పిన మంత్రులందరు ఓడి పోయారు. మరొక విశేషం కూడా జరిగింది. మద్రాసు నగరంలో పోటీ చేసిన ప్రకాశంగారు కూడా ఓడిపోయారు! ఆయన ఓడారన్న ఫలితం ఎలా వచ్చిందో, ఎలక్షన్ పిటీషన్ లేక పోవడంవల్ల నిర్ధారణగా ఏమీ చెప్పలేము. కాని, ఒక వ్యక్తి మాత్రం వోట్లు లెక్కించే సమయంలో జరిగిన ఒక విశేషం చెప్పాడు.

ఆ వ్యక్తి, అతని భార్యా, మరొక ముగ్గురూ కలిపి వెళ్ళి, ఒకరు తర్వాత ఒకరుగా, ఒక బాలట్ బాక్సులో తమ వోట్లను వేశారు. వోట్లు లెక్కించే సమయంలో ఆ పెట్టె విప్పగా, అందులో ఒక్క వోటయినా లేదు. కౌంటింగ్ ఆఫీసరు ఆ బాక్సులో వోట్లు 'నిల్' అని వ్రాసుకొన్నాడు.

---

* అందులో ఒకరు-ఇప్పుడు మంత్రిగా ఉన్నారు.

ఏమి జరిగిందో! ఏ దేముడు బాలట్ పెట్టెలో దూరి వోట్ల భక్షణ కావించాడో! ఇప్పటికీ తెలియదు.

ఎలక్షన్ పిటీషను వేయమని మిత్రులు బలవంతం చేసినా, ప్రకాశంగారు తమ "రాజకీయ జీవితాన్ని ఎలక్షన్ పిటీషనులతో నడుపుకోలే" మన్నారు.

1951 లో, నీలం సంజీవరెడ్డిగారు ఎన్నికయినట్టు తెలియగానే, మంత్రివర్గీయులు కాంగ్రెసుభవనం ఆవరణ గోడలెక్కి లోపలికి దూకి, భవనం గదులలోఉన్న రంగాగారి వర్గీయులకు చెందిన సామానులను వాటినీ ఇవతల, అవతల విసిరివేయసాగారు.

రంగాగారి వర్గంలో ప్రతికూలచర్య తీసుకోడానికి సాహసము, బలమూ కలిగిన యువకులున్నా—తగాదాలు వచ్చినప్పటికీ ఒకే పార్టీ వాళ్ళము గనుక మూర్ఖులయెడల మూర్ఖత వహించడం మంచిది కాదని శాంతించారు.

ఏమైనా, ఆ రోజున మంత్రివర్గీయులు చూపించిన ముష్కరత్వానికి సమానమైనది మరెన్నడూ చూడలేను.

బహుశః ఢిల్లీలో 1970 లో క్రొత్త ప్రాత కాంగ్రెసులు విడిపోయిన తర్వాత, కాంగ్రెసు ప్రాంగణంలో జరిగిన ప్రహరణకాండ కొంచెం ఆ స్థాయికి వచ్చిందేమో!

# 17

## క్రొత్త పార్టీ స్థాపన

అప్పట్లో, చిరస్మరణీయులైన కాశీశ్వరరావుగారు* ప్రకాశంగారి పక్షంలో ఉండేవారు. మే మందరమూ (అంటే, ప్రకాశంగారు, రంగాగారి వర్గీయులమంతా) కలిపి వారి యింట్లో సమావేశమయ్యాము. చివరి క్షణంలో, మాలో నలుగురు అకారణంగా మంత్రి

---

* కాశీశ్వరరావుగారు విజయవాడలో, సుప్రసిద్ధ న్యాయవాదిగా ఉండి, గాంధీగారి ఉద్యమ ఆరంభంలోనే, సత్యాగ్రహ

వర్గం వారిలోకి మలినప్రవేశం చేయడంవల్ల కలిగిన ఓటమికి ఎవరూ నిరుత్సాహ పడకూడదనీ, మంత్రులుచేసే అధికార దుర్వినియోగం, దొంగ కాంగ్రెస్ మెంబరుల జాబితా నిర్మాణం ప్రజలకు బోధపరిచి నట్లయితే వారందరూ ఎన్నికలలో తిరిగి ఓడిపోగలరనీ అందరికీ దృఢవిశ్వాసం కలిగింది.

ప్రతి జిల్లాలోను ప్రకాశం, రంగా వర్గాల అనుయాయులు చేయవలసిన కార్యక్రమంకూడా కొంతవరకు వ్రాయడం జరిగింది. నేను విశాఖపట్నం వెళ్ళిపోయాను.

ఆ రాత్రి—బాగా రాత్రివేళ — మా వర్గాలకు చెందినవారు కార్యక్రమం వివరాలు ఆలోచించుకోడానికి కూర్చుంటూండగా, ఒక క్రొత్త సమస్య బయలుదేరిందట.

> "'కాంగ్రెసు మంత్రులు ఓడిపోతారు,' అని మన మంటున్నాము. వా రిప్పుడేమో అధికారంలో ఉన్నా, ఎన్నికలలో నిలబడతారు కదా! ఎవరిమీద మనం దోషారోపణ చేస్తున్నామో వారు ఎన్నికలలో నిలబడినప్పుడు, కాంగ్రెసు సభ్యులుగా ఉంటూ, వారిని ఓడించవలసిందని ప్రజలకు ఏ విధంగా చెప్పగల" మన్న ప్రశ్న ప్రకాశంగారినీ, రంగాగారినీ, కాశేశ్వరరావుగారినీ వేధించింది.

"మంత్రివర్గానికి వ్యతిరేకంగా దొంగతనంగా ప్రచారం చేయడం కాంగ్రెసు తత్వానికి వ్యతిరేకం .... పెద్దమనిషి తరహాకు ప్రతికూలం ...."

"అయితే, మనం మౌనంగా ఉండవలసిందేనా?"

---

సమరంలోకి దుమికిన అగ్రనాయక శ్రేణికి చెందినవారు. బెజవాడ పట్నానికి మునిసిపల్ ఛేర్మన్‌గా ఉండేవారు. మహా మేధావి, త్యాగశీలురు. ఉద్యమ సందర్భంగా అనేక పర్యాయాలు కారాగార శిక్షలు అనుభవించినవారు. చివరి రోజులలో ఆంధ్ర ప్రదేశ్‌లో స్పీకరుగా ఉండేవారు. సంఘ సంస్కర్త. చరిత్రకారులు.

"అలా ఊరుకున్నట్టయితే, అధికారదుర్వినియోగం చేసినవారికి 'ప్రజలపై దండెత్తి దోచుకు తినండి,' అని చెప్పినట్టవుతుంది గదా!"

ఇటువంటి ప్రతిబంధకాలు పరిశీలించగా, కాంగ్రెసునుంచి విడిపోవడం మంచిదనే ఒక భావం బయటపడింది.

ఆంధ్రదేశంలో కాంగ్రెసును పెంచిన దెవరు?

ఆ పెంచిన ప్రకాశం, కాశేశ్వరరావు, రంగాగారలు మొదలయిన త్యాగశీలురు యావన్మందీ వారు నిర్మించిన ఇల్లు విడిచి పోవలసిందేనా? పోకుంటేగానీ పరిష్కారమార్గం లేదా?

కాని, వేరే పరిష్కారమార్గం కనిపించలేదు. అధిష్ఠాన వర్గానికి పట్టాభిగారు, రాజాజీల మూలంగా ప్రకాశంగారి వర్గం ప్రతికూలమయింది. అది నిస్సందేహము.

చివరికి, కాంగ్రెసుకు రాజీనామా యిచ్చివేయడమే ప్రజారాజ్య సంరక్షణకు తరుణోపాయమనే నిశ్చయానికి వారంతా వచ్చేశారు.

అలా వచ్చినవెంటనే తెలుగుజిల్లాలలో ప్రకాశం, రంగాగారల వర్గాలవారందరూ కాంగ్రెసునుంచి విడిపోయారు.* తెలుగు జిల్లాల రాజకీయ స్వభావం ఆ క్షణంలో మారిపోయింది.

ప్రకాశంగారు, రంగాగారు వెంటనే 'ఆంధ్ర ప్రజాపార్టీ'ని క్రొత్తగా స్థాపించారు. ఈ పార్టీ తరఫున ప్రతి జిల్లాలోను, ప్రతి ముఖ్యకేంద్రంలోను తక్షణ కార్యక్రమోపక్రమణానికై చురుకుగా ఎడ్ హాక్ (తాత్కాలిక) సంఘాలు ఏర్పాటు చేయడం జరిగింది. దురదృష్టవశాత్తు, కొందరు ఉప నాయకులు హ్రస్వదృష్టితో ప్రకాశం, రంగాల

---

* విశాఖపట్నంలో ఉన్న నాకు ప్రకాశంగారు, రంగాగారు కాంగ్రెసు సభ్యత్వానికి రాజీనామా యిచ్చారని తెలిసి, వెంటనే నేనుకూడా రాజీనామా చేశాను. అప్పుడు నేను కాంగ్రెసు టికెట్టుమీద శాసన సభ్యునిగా ఉన్నాను. అలాగునే మునిసిపల్ ఛేర్మన్‌గాను ఉన్నాను. ఆ ఉత్తరక్షణంలో నేను ఆ రెండు పదవులకూకూడా రాజీనామా చేసేశాను.

వర్గాలు అనే అనవసరమైన, దేశ నష్టకరమైన విభేదాలు కల్పించారు. విభేద బీజాలు నాటగానే వేరుతన్నే శక్తిగలవై ఉంటాయి. అదే జరిగింది. తర్వాతి అధ్యాయంలో ఈ పరిణామాన్ని గురించి వ్రాస్తాను.

### కిసాన్ మజుదూర్ ప్రజాపార్టీ

1947 లో పార్టీ సభ్యులలోనే కొందరు ప్రతికూలురు, క్రమబద్ధంగా ఉండాలనే నిర్బంధం లేకుండా, గాంధీ తత్వానికి కార్యరూపం ఇవ్వడానికి ప్రారంభించిన ప్రకాశంగారిని పదవీచ్యుతుని చేసి పన్నుగడల సమయంలో—న్యాయ అన్యాయ సూక్ష్మతను గ్రహించలేని కాంగ్రెసు అధినేత కృపలానీగారికికూడా, 1951 నాటికి కాంగ్రెసు నుంచి వెలుపలికి పంపబడే అవకాశాలు వచ్చాయి.

1917 లో గాంధీగారు నూతన అహింసామార్గ ప్రతిష్ఠాపకులై, సాత్త్వికనిరోధ ప్రక్రియను బ్రిటిష్ నీలిమందు తోటల పెద్దలపై ప్రయోగించే సమయంలో—సింధు ప్రాంతంలో తాను ఇండియన్ ఎడ్యుకేషనల్ సర్వీసులో వహిస్తున్న ఉన్నతోద్యోగాన్ని వదలి, గాంధీగారి సహచరుడై పనిచేసిన పెద్దమనిషి కృపలానీగారు. ఆయన పన్నెండు ఏండ్లు కాంగ్రెస్ ముఖ్య కార్యదర్శిగా ఉండి, తరువాత కాంగ్రెసు అధ్యక్షులుగా ఎన్నికైన ప్రముఖుడు.

అటువంటి ఆయన స్వాతంత్ర్యం వచ్చిన నాలుగేండ్లకు కాంగ్రెసునుంచి విరమించుకోవలసి వచ్చింది. అలాగుననే, 1946 జనరల్ ఎన్నికల తరువాత బెంగాలుకు ముఖ్యమంత్రిగా పనిచేసిన డాక్టర్ పి. సి. ఘోష్‌కూడా కాంగ్రెసుకు రాజీనామా చేయవలసి వచ్చింది. లండనులో డాక్టర్ అఫ్ సైన్సు బిరుదు పొంది, కలకత్తా యూనివర్శిటీలో ప్రొఫెసరుగా ఉండి గాంధీగారి పిలుపు అందుకొని దేశంకోసం సర్వమూ త్యాగంచేసిన మహావ్యక్తి ఆయన.

1951 జూనులో, కృపలానీగారు—తనతోబాటూ, తనవలెనే కాంగ్రెసునుంచి విడిపోయిన వారినందరినీ పాట్నాలో సమావేశపరిచారు. వారందరూ కలిసి ఒక పార్టీగా రూపొందాలని నిర్ణయమైంది.

నాటి ఉదయం అక్కడ పార్టీపేరు నిశ్చయమైంది. సభలో ఎవరి సలహాపైననో 'ప్రజాపార్టీ' అనే మాటకు ముందుగా 'మజుదూర్' అనే మాట కలిపారు. రంగాగారి సలహాపైన దానికి ముందు 'కిసాన్' అన్న మాటకూడా కలిపారు. 'ప్రజాపార్టీ' అన్నది అందరి సభ్యుల ఆమోదాన్ని పొందడంచేత ఆ పార్టీకి—"కిసాన్ మజుదూర్ ప్రజాపార్టీ" అనే నామకరణం జరిగింది.

ఆ మధ్యాహ్నం మహాసభకు నాలుగైదువేలమంది హాజరయ్యారు. కృపలానీగారు కాంగ్రెసు సంస్థలో జరుగుతున్న పక్షపాతము, బంధుప్రీతి, అధికార దుర్వినియోగము మొదలైన పరిస్థితులు వర్ణించి, ఆ దుర్గుణాలు లేని రాజకీయ సంస్థ ఒకటి ప్రారంభించడం ప్రజలకు శ్రేయస్కరమని భావించి - తాను, ప్రకాశంగారు, పి. సి. ఘోషుగారు మొదలైనవారు ఆ సమావేశాన్ని ఏర్పాటు చేసినట్టు చెప్పి, పార్టీకి ఆ ఉదయం పెట్టిన పేరు వగయిరా విషయాలు వివరించి, పార్టీ ఇతర వివరాలు, ప్రోగ్రాము వ్రాయడానికి నలుగురితో కూడిన ఒక ఉపసంఘం ఏర్పడేటట్టు చెప్పారు. అందులో తాను, ప్రకాశంగారు, కిద్వాయిగారు,* డాక్టర్ పి. సి. ఘోషుగారు సభ్యులనీ ఆయనే చెప్పారు. సాదిక్ అలీ అనే యువకుణ్ణి (ప్రస్తుతం పాత కాంగ్రెసు సంస్థలో ముఖ్యుడు) కార్యదర్శిగా నియమించారు.

కృపలానీగారు ఉప సంఘ సభ్యుల పేర్లు చెపుతున్నప్పుడు, వెనకనుంచి ఒక మిత్రుడు లేచి, అందులో రంగాగారి పేరు ఉంచాలని కేక వేశాడు.

"ఇది చిన్న ఉప సంఘము. దక్షిణ ప్రాంతీయులకు ప్రాతినిధ్యానికి ప్రకాశంగారి పేరు ఉండనే ఉంది గనుక, రంగాగారి పేరు

* ఈయన నెహ్రూ కుటుంబానికి ఆప్తుడు. నెహ్రూ కాబినెట్ లోని తన మంత్రి పదవికి రాజీనామా యిచ్చి, క్రొత్త పార్టీలో చేరేటట్టు కృపలానీగారికి మాట యిచ్చినా, ఆ క్షణంలో మంత్రిపదవి రాజీనామా చేయలేదు. ఆ తర్వాతనూ చేయలేదు.

పార్టీ కార్యనిర్వాహకవర్గం ఏర్పాటు చేస్తున్నపుడు వేసుకొంటా" మని కృపలానీగారు చెప్పారు.

కార్యదర్శిగా సాదిక్ అలీ పేరు చెప్పినప్పుడు, తిరిగీ అదే మిత్రుడు, 'రంగాగారిని కార్యదర్శిగా అయినా వేయండి' అని కేకలు వేశాడు.

అందుకు కృపలానీగారు, "నేను చేస్తున్న పని నాకు తెలుసు. నాకు కార్యదర్శి అంటే నేను చెప్పేమాటలు, ఉత్తరాలు వ్రాసుకొంటూ నావెంట తిరిగే మనిషి. రంగా పెద్దవారు. ఆయనకు ఇవ్వవలసిన స్థానము ఎలాగూ ఇస్తాము. మీరు అనవసరంగా ఇక్కడ గలభా చేయకండి," అన్నారు.

ఆ విషయం అంతటితో ఆగిపోయింది.

మిగిలి కార్యక్రమం సాఫీగా జరుగుతున్నది. కాని, రంగాగారు చడీచప్పుడు లేకుండా ఆ హాలులోంచి ఏదో పనిమీద అవతలకు వెళుతున్నట్టుగా వెళ్ళారు. అక్కడ ఒక పత్రికా విలేఖరిని ఆవరణలోకి పిలిచి, అక్కడ ఏర్పాటయే పార్టీ ఏమీ పనిచేసే పార్టీ కాదన్న భావం వెలిబుచ్చి, దాంతో తన సంబంధాన్ని అప్పుడే వదలుకొంటున్నట్టు చెప్పి, కలకత్తా వెళ్ళిపోయారు.

అక్కడ—క్రొత్తపార్టీతో సంబంధం వదులుకోవడమే గాక, ఆంధ్రజిల్లాలలో ప్రకాశంగారితో కలిసి తాను ఏర్పరచిన 'ఆంధ్ర ప్రజాపార్టీ'నుంచి గూడా విడిపోతున్నట్టు పేర్కొని, "కృషికార్ లోక్ పార్టీ" అనే క్రొత్త పార్టీని తాను స్థాపిస్తున్నట్టు ప్రకటించారు.

## ఎన్నికలలో అద్భుత విజయము

ప్రకాశంగారు తిరిగివచ్చి చెన్నరాష్ట్రంలో అన్ని జిల్లాలు తిరిగారు. 1952 ఎన్నికలకు అభ్యర్థులుగా తెలుగు జిల్లాల్లోను, చెన్నపట్నంలోను మాత్రం లోక్‌సభకు, రాష్ట్ర శాసన సభకు 117గురు అభ్యర్థులను నిలబెట్టారు. ఇదిగాక, దక్షిణ జిల్లాలనుంచిగూడా అనేకులను నిలబెట్టారు. ఇందులో సర్కారు జిల్లాలనుంచి అనేకులు గెలిచారు. ప్రకాశంగారు

చేసిన ప్రచారంవల్ల లాభం పొంది, 'కిసాన్ మజుదూర్ ప్రజాపార్టీ' గెలవని చోట్ల కమ్యూనిస్టులుగానీ, స్వతంత్ర సభ్యులుగానీ గెలిచారు. కాంగ్రెసు పేరున గెలిచినవారు ఏమాత్రమైనా ఒక్క రాయలసీమలోనే గెలిచారు.

అప్పటివరకు, ఆంధ్రులు ఏకచ్ఛత్రాధిపత్యం వహిస్తున్న కాంగ్రెసు పార్టీకి చెన్నరాష్ట్ర శాసన సభలో మెజారిటీ పూర్తిగా పోయింది. కాని వారికి కృషికార్ లోక్ పార్టీ, ముస్లిమ్‌లీగు సహాయంగా ఉండేవి. మూడు పార్టీలు కలిసినా వారి బలం 150 దాటక పోయింది. ప్రతిపక్షంలో 164 సభ్యులు ఉండేవారు. ప్రకాశంగారు ఆ ఎన్నికల్లో మద్రాసునుండి పోటీచేసి ఓడిపోయారని ఇదివరకే వ్రాశాను. కాని, తమ వ్యక్తిత్వాన్నిబట్టి ఆయన ఆ 164 సభ్యులను ఏకంచేసి యునైటెడ్ ఫ్రంటు అనే సమాఖ్య క్రింద శాసన సభా కార్యక్రమం కోసం ఏర్పాటు చేయగలిగారు. ఆ సమాఖ్య కార్యక్రమం ప్రారంభించినపుడు నేను ప్రతిపక్ష నాయకుడుగా ఉండడానికి అందరూ అంగీకరించారు. ఆ సమాఖ్యలో కమ్యూనిస్టులు, కిసాన్ మజుదూర్ ప్రజాపార్టీ, మద్రాస్ టాయిలర్స్ పార్టీ, ఇంకా ఏవో వేరే పార్టీలు, స్వతంత్రులు ఏకమయ్యారు.

చెన్నరాష్ట్రానికి అంతవరకు గవర్నరుగా ఉన్న భావనగర్ రాజాగారి కాలపరిమితి ముగియగా, కేంద్ర ప్రభుత్వంవారు 'శ్రీప్రకాశ' అనే ఆయనను నియమించారు. ఈ శ్రీప్రకాశగారు చాలా మేధావి. నెహ్రూగారికి ఆప్తులు. పెద్ద పెద్ద యూనివర్సిటీ డిగ్రీలు పొందినవారు. 1946లో నెహ్రూగారు కేంద్ర ప్రభుత్వం ఏర్పాటు చేసినపుడు ఆయన మంత్రిగా ఉండేవారు. అయితే, ఆయన కొంత స్వతంత్రంగా ఆలోచించుకొనే లక్షణం గలవారు గనుక, నెహ్రూగారు ఆయనను గవర్నరుగా పంపివేశారు. అంతకుముందు కరాచీలో హైకమిషనర్‌గా ఉండి, ఆయన చెన్నరాష్ట్రానికి గవర్నరుగా వచ్చారు. ప్రకాశంగారంటే గురుభావం కలవా రాయన.

కాంగ్రెసువారికి మెజారిటీ లేదని ఇదివరలోనే వ్రాశాను. పైగా

ఆ గెలిచిన వారిలో, రాష్ట్రంలో గౌరవ ప్రతిష్ఠలున్న పెద్ద నాయకు లెవరూ లేరు.

1946 లో రాజాజీని చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రిగా చేసే యత్నంలో గాంధీగారు ప్రకాశంగారి చేతులలో ఓటమి పొందిన దిది వరకే వ్రాశాను. రాజాజీ ఆశాభంగ నైరాశ్యలోకంలో ఉండడం గాంధీ గారికి అసంతృప్తికరంగా ఉండడంచేత, రాజాజీకి కాంగ్రెస్ పార్టీలో సభ్యత్వం చిక్కనప్పుడు కాంగ్రెసు అధ్యక్షులే నేరుగా పావలా చందా పుచ్చుకొని ఆయనను సభ్యుణ్ణిగా చేర్చుకొనేటట్టు చేసినది యిదివరలో వ్రాశాను.

రాజాజీలో ఏదో ఇంద్రుని అంశ ఉంది. అందుచేతే, తాను పాకి స్తాన్ వాదియైనా, గాంధీగారి ఆశీస్సులతో నెహ్రూగారి మంత్రివర్గంలో దేశ పరిపాలనలో భాగస్వామి అయ్యారు. స్వాతంత్ర్య ఘోషణ జరిగిన నాటికి ఇంత మేధావి లేడని నెహ్రూగారి మనసును వశం చేసుకొన్నారు. స్వాతంత్ర్యం వచ్చిన పిదప బెంగాల్ గవర్నరుగా వెళ్లారు. అక్కడి నుంచి, మౌంట్ బాటను ప్రభువు గవర్నర్ జనరలు పదవినుంచి విర మించగానే భారతదేశానికి తాను గవర్నర్ జనరలు అయ్యారు. 1950 జనవరి 26 న భారత దేశ నూతన సంవిధానం అమలులోకి వచ్చేదాకా ఆ పదవిలో ఉండి, తర్వాత చెన్నపట్నంలో విశ్రాంతి తీసుకుంటూ ఉండేవారు.

ఆయన కేంద్ర మంత్రిగా, ఢిల్లీలో, తన వర్గాన్ని ఓడించి ముఖ్య మంత్రి అయిన ప్రకాశంగారిమీద ఒక విధమైన అధికారంగల పదవి లోకి వెళ్ళారు. ఒకసారి చెన్నరాష్ట్రంలో ఉన్న అడవి కలప కేంద్ర ప్రభుత్వంవారు కొనవలసిన అగత్యం వచ్చింది. ప్రకాశం ప్రభుత్వం వారు ఏదో ఒక ధర అడిగారు. కేంద్రశాఖవారు అంత ధర ఇవ్వమని వాదించారు. ఇది శాఖల స్థాయిలో జరిగిన వ్యవహారము. అపుడు రాజాజి ప్రకాశంగారికి అర్ధాధికార పూర్వకమైన (Demi - official) ఉత్తరం వ్రాశారు. అందులో ఇలా ఉన్నది:

"ప్రకాశంగారూ! ప్రతిదినమూ మీ ప్రభుత్వం మా ప్రభుత్వం

దగ్గర ఏవేవో గ్రాంటులు కావాలని చేయి జాచుతూ వస్తూంది కదా! అలా చేయి జాచే ప్రభుత్వానికి బేరంచేసే తాహతు ఉన్నదా?''

రాష్ట్రంలో కాంగ్రెసు రాజకీయాలలో నాయకత్వ శూన్యమైన అవస్థ వచ్చిందని పైన వ్రాసే ఉన్నాను. ఆ సమయంలో ఎవరి ఊహో, ఎవరి తంత్రమో, చెన్నపట్నంలో పుట్టిందో, ఢిల్లీలో పుట్టిందో ఇప్పటి దాకా సరిగ్గా తెలియదు కాని, మహేంద్ర పదవి అనుభవించి వచ్చి విశ్రాంతి తీసుకొంటున్న రాజాజీని ఈ చెన్నరాష్ట్రం ముఖ్యమంత్రిగా తీసుకువస్తేతప్ప, కాంగ్రెసు సంస్థ రాష్ట్రంలో నామ మాత్రావశిష్టమై నశిస్తుందనే ఊహారచన జరిగింది. ఆ ఊహారచన తమదే అన్నట్టుగా శ్రీప్రకాశగారు తమ జీవిత చరిత్రలో వ్రాసుకొన్నారు.

సంవిధానం ప్రకారం లెజిస్లేటివ్ కౌన్సిలు (శాసన మండలి)లో కొందరు సభ్యులను నియమించే హక్కు గవర్నరుకు ఉంది. దాన్ని పురస్కరించుకొని గవర్నరు రాజాజీని శాసన మండలి సభ్యులుగా నియమించారు.

తరువాత వెనువెంటనే, ఢిల్లీనుంచి కాంగ్రెసు అధిష్ఠాన వర్గం వారు, శాసన సభ కాంగ్రెసుపార్టీ వారికి—కాంగ్రెసు శాసన సభ్యులను సమావేశపరిచి, రాజాజీని నాయకునిగా ఎన్నుకోవలసిందని ఆదేశించారు. వారు అలాగే సమావేశమై రాజాజీని తమ పార్టీ నాయకునిగా ఎన్నుకొన్నారు. గవర్నర్ జనరలుగా పనిచేసిన రాజాజీ చిన్న పదవి అనుకోకుండా, సంతోషంగా ఆ పదవి స్వీకరించారు.

ఇదిచూసి, ప్రకాశంగారు—యునైటెడ్ ఫ్రంటుకు చెందిన 164 సభ్యుల సంతకాలతో ఒక విజ్ఞప్తి గవర్నరుగారికి పంపించారు.

రెండు ఇతర పార్టీలతో కలిసినప్పటికీ కాంగ్రెసు మైనారిటీలో గనుక ఆ పార్టీ నాయకుని ముఖ్యమంత్రి పదవికి ఆహ్వానించక, యునైటెడ్ ఫ్రంటు నాయకునికే అటువంటి ఆహ్వానం పంపించవలసిందని ఆ విజ్ఞప్తిలో సూచింపబడింది.

శ్రీప్రకాశగారు పెద్దమనిషే అయినా, ఆ విజ్ఞప్తిలోగల విషయాన్ని మాట్లాడడానికైనా ప్రకాశంగారిని ఆహ్వానించలేదు. రెండు,

మూడు రోజులు ఆ విజ్ఞప్తి ఆయన తన దగ్గిరే అట్టిపెట్టుకొని, అంతట్లో రాష్ట్రికన్యను వివాహ మాడడానికి సిద్ధపడ్డ రాజాజీని ఆహ్వానించారు.

పత్రికా విలేఖరులు, "ఇది సంవిధానానికీ, సంప్రదాయానికీ విరుద్ధం కాదా?" అని అడిగితే, "ప్రకాశంగారి పార్టీ కలగాపులగం పార్టీ గనుక పిలవ లే" దన్నారు.

"అయితే, రాజాజీ పార్టీ కూడా కృషికార్ లోక్, ముస్లింలీగు పార్టీల సహాయంతోనే కదా ఉన్నది?" అని వారు వేసిన ప్రతిప్రశ్నకు, ఆయన - "శాసన సభలో ఉన్న పార్టీ లన్నింటిలోనూ రాజాజీ పార్టీ సంఖ్యా దృష్ట్యా పెద్ద" దని ప్రత్యుత్తర మిచ్చారు.

"మైనారిటీ పార్టీకి రాజ్యం అప్పగించకూడదు. అలా చేసినట్టయితే ప్రభుత్వంవారు తమతో అంతకు ముందువాకా కలియని సభ్యులకు ప్రలోభాలు చూపించి, తమలో కలుపుకోడానికి అవకాశాలు కల్పించడం జరుగుతుంచి. దీన్నే పాశ్చాత్య దేశాల రాజకీయాల్లో అశ్వ విక్రయ (హార్స్ ట్రేడింగ్) విధాన మంటారు. అది జరగడం మంచిది కాదుగదా!" అని విమర్శకులు చెప్పగా—

"ఇక్కడ అటువంటిది జరగదు" అన్నారు శ్రీప్రకాశగారు.

మంత్రివర్గం ఏర్పడి, మొదటి శాసన సభా సమావేశం కాకుండానే, యునైటెడ్ ఫ్రంటులో నలుగురి సభ్యులతో భాగంగా ఉన్న ఒక చిన్న పార్టీ రాజాజీ పక్షం వైపు వెళ్ళడమూ, ఆ నలుగురికీ నాయకుడైన మాణిక్యవేలు నాయకరుగారిని రాజాజీ ఒక మంత్రిగా తీసుకోవడమూ జరిగాయి.

శ్రీప్రకాశగారు జరగదన్న అశ్వ విక్రయం చెన్నరాష్ట్రి రాజకీయ విపణిలో ఆదిలోనే ఆరంభమయింది.

## గవర్నరు ప్రసంగానికి ప్రకాశంగారి అధిక్షేపణ

శ్రీప్రకాశగారు- సంవిధానపు 176 వ అనుచ్ఛేదము (ఆర్టికల్) క్రింద ఉభయ శాసన సభలకు తమ సంబోధ(అడ్రెస్)నోపన్యాసము చేయడానికి నిలుచున్నారు.

వెంటనే, ప్రకాశంగారు ప్రతిపక్ష నాయక స్థానంలో నిలబడి, గవర్నరును సంబోధిస్తూ—

"గవర్నరుగారూ! ఒక వ్యవస్థా విషయము (పాయింట్ ఆఫ్ ఆర్డర్) చెప్పడానికి నిలుచున్నాను,"

అనేసరికి, గవర్నరు శ్రీప్రకాశంగారు తటాలున తమ కుర్చీలో కూచున్నారు.

ఈ విధంగా, గవర్నరు (రాజ్యపాలుడు) ఉభయ శాసన సభా సభ్యులను సంబోధించే సమయంలో, పాయింట్ ఆఫ్ ఆర్డరు లేవదీయడ మన్నది ఏ రాష్ట్రంలోనూ జరగలేదు.

గవర్నరుకు చెరొక ప్రక్క కూచున్న శాసన సభ స్పీకరూ, శాసన మండలి అధ్యక్షుడు అది విని దిగ్భ్రాంతులయ్యారు.

ఆ దిగువ శాసన సభా కార్యదర్శి దేశంలో శాసన సభా కార్య విధాన నిపుణుడని పేరు పొందినవాడు. ఆయన, 'మే' దొరగారు వ్రాసిన 'పార్లమెంటరీ విధాన'మనే గ్రంథంలో పుటలు అటు ఇటు త్రిప్పి, తొందరగా పరిశీలించసాగాడు. అందులో ఇటువంటి విషయం ఉండదన్న విషయం వారు మరచిపోయారు.

ప్రకాశంగారు తన వ్యవస్థా విషయం వివరిస్తూ ఇలా చెప్పారు:

"మీరు సంవిధాన ప్రకారంగా నడిచే 'రాజ్యపాల్.' అనగా, ప్రభుత్వం సలహాపైన నడుచుకొనే గవర్న రన్న మాట. అలా సలహా యివ్వడానికి ఒక ప్రభుత్వముండాలి. అది సంవిధాన క్రమబద్ధమై ఏర్పడిన ప్రభుత్వమై ఉండాలి. మన సంవిధానపు నిజతత్వ ప్రకారం శాసన సభలో మెజారిటీ (బహుమతము) ఉన్న నాయకుని క్రింద ఏర్పాటయిన ప్రభుత్వ మని దాని అర్థము. మీ కున్న లెక్కల ప్రకారమూ, నేను మీకు లోగడ మా యునైటెడ్ ఫ్రంటు పార్టీ తరఫున మా 164 సభ్యుల సంతకాలతో అందజేసిన విజ్ఞప్తివల్లా, మీరు తీసుకువచ్చి ముఖ్యమంత్రిగా కూచోబెట్టిన రాజగోపాలాచారి గారికి బహుమతము లే దన్నమాట నిస్సందేహము.



"అటువంటప్పుడు, మీరు కూచోబెట్టినంత మాత్రాన అయన ముఖ్యమంత్రి కానేరడు. ఆయన ఏర్పాటుచేసిన మంత్రి వర్గం సంవిధాన బద్ధంగా ఏర్పడిన ప్రభుత్వం కానేరదు. ఆయన కేవలం అక్రమ ఆక్రమణదారుడు. ఆయన సలహాపై మీరు పిలచిన ఈ శాసన సభా సమావేశం క్రమ బద్ధం కాదు. క్రమ బద్ధంగా మా యునైటెడ్ ఫ్రంటు నాయకుని ఆహ్వానించి, ప్రభుత్వం ఏర్పాటు చేయించేంతవరకు ప్రజాప్రతినిధులమైన మేము ఈ అక్రమ సంబోధనా కార్యక్రమంలో మెజారిటీలో ఉండి పాల్గొన జాలము. అందుచేత, మా ప్రతికూలతను తెలియజేయడానికి మేమంతా ఈ సభలోనుంచి బయటకు వెళ్ళిపోతున్నాము."

ఇలా చెప్పి ఆయన బయటకు నడవ నారంభించేసరికి, తక్కిన యునైటెడ్ ఫ్రంటు సభ్యులందరూ ఆయన వెంట శాంతంగా బయటికి వచ్చేశారు.

అలా సగంపైగా స్థలాలన్నీ ఖాళీ అయేసరికి, ఆదిలోనే 'నాగవల్లి మరునాడున్న పెళ్ళి ఇల్లు' మోస్తరుగా సభ వెలవెల బోయింది.

ప్రకాశంగారు మాట్లాడుతునప్పుడు గవర్నరుగారు నిశ్చేష్టులై వినడం తప్ప మరేమీ చేయలేకపోయారు.

మేమంతా లేచి వచ్చేసిన తర్వాత, ఆయన తన ఉపన్యాసంలో నాలుగు ముక్కలు చదివేసి, సభ ముగించుకొని వెళ్ళిపోయారట.

## అమరజీవి పొట్టి శ్రీరాములు

1913 లో బాపట్లలో ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగింది. 1917 లో ఆంధ్ర ప్రాంతాలకు ప్రత్యేకంగా రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటయింది. 1939 లో కాంగ్రెసు వర్కింగ్ కమిటీ—దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కాంగ్రెసు పనికై ఏర్పడిన రాష్ట్రాలను భాషా రాష్ట్రాలుగా సంవిధానంలో ఏర్పాటు చేయడానికి తీర్మానించింది.

1948 లో వ్రాసిన సంవిధానం మొదటి ముసాయిదాలో ఆంధ్ర రాష్ట్రం చేర్చబడింది. రెండవ ముసాయిదాలో అది తీసివేయబడింది.

"అటువంటప్పుడు, మీరు కూచోబెట్టినంత మాత్రాన ఆయన ముఖ్యమంత్రి కానేరడు. ఆయన ఏర్పాటుచేసిన మంత్రి వర్గం సంవిధాన బద్ధంగా ఏర్పడిన ప్రభుత్వం కానేరదు. ఆయన కేవలం అక్రమ ఆక్రమణదారుడు. ఆయన సలహాపై మీరు పిలచిన ఈ శాసన సభా సమావేశం క్రమ బద్ధం కాదు. క్రమ బద్ధంగా మా యునైటెడ్ ఫ్రంటు నాయకుని ఆహ్వానించి, ప్రభుత్వం ఏర్పాటు చేయించేంతవరకు ప్రజాప్రతినిధులమైన మేము ఈ అక్రమ సంబోధనా కార్యక్రమంలో మెజారిటీలో ఉండి పాల్గొన జాలము. అందుచేత, మా ప్రతికూలతను తెలియజేయడానికి మేమంతా ఈ సభలోనుంచి బయటకు వెళ్ళిపోతున్నాము."

ఇలా చెప్పి ఆయన బయటకు నడవ నారంభించేసరికి, తక్కిన యునైటెడ్ ఫ్రంటు సభ్యులందరూ ఆయన వెంట శాంతంగా బయటికి వచ్చేశారు.

అలా సగంపైగా స్థలాలన్నీ ఖాళీ అయేసరికి, ఆదిలోనే 'నాగవల్లి మరునాడున్న పెళ్ళి ఇల్లు' మోస్తరుగా సభ వెలవెల బోయింది.

ప్రకాశంగారు మాట్లాడుతునప్పుడు గవర్నరుగారు నిశ్చేష్టులై వినడం తప్ప మరేమీ చేయలేకపోయారు.

మేమంతా లేచి వచ్చేసిన తర్వాత, ఆయన తన ఉపన్యాసంలో నాలుగు ముక్కలు చదివేసి, సభ ముగించుకొని వెళ్ళిపోయారట.

## అమరజీవి పొట్టి శ్రీరాములు

1913 లో బాపట్లలో ప్రథమ ఆంధ్ర మహాసభ జరిగింది. 1917 లో ఆంధ్ర ప్రాంతాలకు ప్రత్యేకంగా రాష్ట్ర కాంగ్రెసు సంఘం ఏర్పాటయింది. 1939 లో కాంగ్రెసు వర్కింగ్ కమిటీ—దేశానికి స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కాంగ్రెసు పనికై ఏర్పడిన రాష్ట్రాలను భాషా రాష్ట్రాలుగా సంవిధానంలో ఏర్పాటు చేయడానికి తీర్మానించింది.

1948 లో వ్రాపిన సంవిధానం మొదటి ముసాయిదాలో ఆంధ్ర రాష్ట్రం చేర్చబడింది. రెండవ ముసాయిదాలో అది తీసివేయబడింది.

తెలుగు భూమిపైన, తెలుగు నాయకుడు కొలుకు ఇచ్చిన పట్టాను బట్టి కట్టిన ఫోర్టు సెంటు జార్జి, దానికి ఉత్తరంగా ఉన్న పట్నం తెలుగు ప్రాంతంలో చేరునా, చేరదా అనే సందిగ్ధ స్థితి ఏర్పడింది.

ఈ ఆలస్యము, ఈ సందిగ్ధావస్థా గాంధీగారి ఆశ్రమంలో శిక్షణ పొందిన పొట్టి శ్రీరాములుగారి కేమీ నచ్చలేదు. ఆయనసహాయ నిరాకరణోద్యమంలో (నాన్ కో-ఆపరేషన్) ప్రారంభ దశలోనే పాల్గొన్నవారు. పట్టుదలకు ఆయన పెట్టినది పేరు.

చెన్నపట్నంతో కలిపి ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు చేయకపోతే, నిరాహార దీక్ష తీసుకొంటానని—ఆయన చెన్నరాష్ట్ర ప్రభుత్వానికీ, జవహర్‌లాల్ నెహ్రూగారికి హెచ్చరికలు (నోటీసులు) అందజేశారు. కాని, వారు శ్రీరాములుగారినిగానీ, ఆయన చెప్పిన విషయాన్నిగానీ తమ దృష్టికి తెచ్చుకోలేదు.

శ్రీరాములుగారు మాత్రం, తాము సూచించినట్టు ఫోర్టు సెంటు జార్జి గుమ్మంవద్ద నిరాహార దీక్ష ప్రారంభించారు. బులుసు సాంబ మూర్తిగారు, ప్రకాశంగారు నిరాహార దీక్షకు కోటగుమ్మం తగినస్థలం కాదని, మైలాపూరులో సాంబమూర్తిగారు నివసిస్తున్న వసతి గృహానికి ఆయనను తీసుకు వెళ్ళారు. ఇది అక్టోబరు నెల మూడవ వారంలో ఆరంభ మయింది.

మొదటి రోజులలో పట్నంలోని ప్రజలు దీన్ని అంతగా పట్టించుకోలేదు. శాసన సభలో ఎవరో ఈ ప్రసక్తి తెచ్చినపుడు, ముఖ్య మంత్రి రాజాజీ చులకనగా మాట్లాడారు. కాని, రానురాను-పట్నం లోను, శాసన సభ్యుల మనసులలోను, తెలుగు జిల్లా లన్నిటిలోను, 'శ్రీరాములుగా రే మవుతా'రన్న ఆందోళన ఉదయించింది.

ఉపరాష్ట్రపతి అయిన రాధాకృష్ణగారు ప్రమేయం కలిగించుకోవా లని చెన్నపట్నంనుంచి శాసన సభ్యులు,పెద్దలు ఆయనకు తంతివార్తలు ఇవ్వడం ఆరంభమయింది. కాని, ఆయనకు నెహ్రూగారి మనసును త్రిప్పే శక్తి ఉన్నట్టుకనిపించలేదు. మాకు జవాబుగా అనునయ వాక్యాలు మాత్రం టెలిఫోనులో చెపుతూ ఉండేవారు.

శ్రీరాములుగారి నిర్దుష్టమయిన ఉపవాస దీక్ష రోజురోజుకూ, ఆంధ్రుల హృదయాలలో ఆందోళన కలిగించ సాగింది. ప్రజల భావాలలో ఒక వేడిని పుట్టించింది. ప్రకృతి అనుకోనటువంటి ఉష్ణతను ధరించింది. కార్మికులలోను, విద్యార్థులలోను- ఆంధ్రరాష్ట్రవిషయమై గాక, శ్రీరాములుగారి ప్రాణవిషయమై చాలా మనస్తాపం కలిగింది.

ముఖ్యమంత్రిగారు మాత్రం, శాసన సభలో ఈ ప్రసక్తివస్తే చులకనగాను, తేలికగాను మాట్లాడేవారు. ఉపవాసం ఆరంభమయిన యాభై రోజులకు, పట్నంలో గల వాతావరణాన్ని తపింప జేసింది. ఋషులు తీవ్రమైన తపస్సు చేస్తే,భూమి గజగజలాడుతుందని పురాణాలలో చదువుకోవడమే గాని, అంతకుముందు మాలో ఎవరికీ అనుభవం లేదు. కాని, అప్పుడు 50 వ రోజు దాటి 51 వ రోజు, 51 వ రోజు దాటి 52 వ రోజు—ఈ విధంగా ఉపవాస దీక్ష జరిగేసరికి చెన్నపట్నం రాజవీథులన్నీ గజగజలాడుతూన్నట్టు అనిపించేది.

నెహ్రూగారు ఏమీ మాట్లాడలేదు. ఆందోళనా ఫలితంగా ఏ నిర్ణయమూ తీసుకోకూడదని సచివాలయపు ఐ. సి. ఎస్. ఉద్యోగులు కరడుగట్టిన మనసులతో చెప్పిన సలహా వాక్యాలు, ఆయనకు వేద వాక్యాలయ్యాయి.

దినములు, క్షణములు గడచిన కొద్దీ సామాన్య ప్రజానీకం సాంబమూర్తిగారి యిల్లున్న వీథిలో నిండిపోయేవారు. ఆయన యిల్లు చాలా చిన్నది.

యాభై ఆరవ దినము సగము రాత్రివేళ సమస్య పరిష్కారమవుతుందని, అందుచేత శ్రీరాములుగారు ఉపవాస దీక్ష విరమించవలసిందని రాధాకృష్ణగారు ట్రంక్ కాల్ ద్వారా చెప్పినట్టు, శ్రీరాములుగారికి ఎవరో మెల్లిగా చెప్పారు.

ఆయన చిన్న కంఠంతో—

"ఈ వార్త జవహరులాలుగారు అన్నదా? లేక రాధాకృష్ణగారు తమంతట తామే ఈ ఆశను వెలిబుచ్చారా?" అనే అర్థంతో అడిగారు.

అది రాధాకృష్ణగారు తమ మాటగానే చెప్పినట్టు, టెలిఫోను

వార్త తెచ్చిన ఆయన చెప్పాడు. అందుకు శ్రీరాములుగారు "ఉపవాస దీక్ష విరమించవలసిన అవసరం కనపడదు," అని చాలా మెల్లిగా చెప్పారు.

ఆ మాటలో ఆయన దృఢనిశ్చయం వెల్లడి అయ్యేట్టు ఆయన చేతులతోను, కళ్ళతోను సూచించారు.

ఈ విధంగా ఉపవాస దీక్ష సాగించి, 58 వ రోజు రాత్రి, 59 వ రోజు వచ్చేముందు ఆ మహాత్యాగి అసువులు బాశారు.

ఒక్కమారుగా ఆంధ్రదేశం పెనుబొబ్బ పెట్టింది. సాయం కాలంవరకు ఆయన భౌతిక దేహాన్ని, ప్రజలు చూడడానికి వీలుగా సాంబమూర్తిగారి యింటి బయట ఎత్తయిన వేదిక ఏర్పరచి ఉంచారు.

మైలాపూరునుంచి రెండెడ్ల బండిపైని ఆ భౌతిక దేహాన్ని ఉంచి, మౌంటురోడ్డునుంచి జార్జిటవును వీథులగుండా, వెనుక లక్షల కొద్ది ప్రజలు నడుస్తుండగా, ఏడెనిమిది గంటల వేళకు దహన భూమికి తీసుకు వెళ్ళారు. ఆ రెండెడ్ల బండి నొగపై ప్రకాశంగారు, సాంబ మూర్తిగారు చివరివరకు కూచున్నారు.

ఆధునిక కాలంలో, ఇచ్ఛా మరణం పొందిన మహర్షి వలె, పొట్టి శ్రీరాములుగారు-ఐదు, ఐదున్నర అడుగుల పొడవుగల అల్ప మైన భౌతిక దేహాన్ని వదిలి, సర్వ భారత దేశవ్యాప్తమైన అమరజీవిగా వర్ధిల్లారు. నేడు భారతదేశంలో ఏర్పాటయిన భాషా రాష్ట్రాలు, నిజ ముగా ఆనాడు ఆయన చేసిన మహాత్యాగ ఫలితాలే.

ఆయన అమరులైన ఆ సమయంలో-అనేక శాసన సభ్యులు, ప్రభుత్వం వైఖరికి నిరసనగా, తమ సభ్యత్వాలకు రాజీనామా ఇచ్చారు. శ్రీరాములుగారు డిసెంబరు 16 న అస్తమించారు. ఆ తర్వాత, తొమ్మిదిన్నర నెలల తర్వాత ఆంధ్ర రాష్ట్రం ఉదయించింది. ఆ తరు వాత మూడేండ్లు ముప్పై దినాలకు విశాలాంధ్రగా విస్తరిల్లింది.

## ప్రజా సోషలిస్టు పార్టీ

1952 లో ఎన్నికలయిన తర్వాత అప్పటికి నాల్గు సంవత్సరాల ముందు కాంగ్రెసులోంచి విడిపోయిన ఆచార్య నరేంద్రదేవ్, జయ

ప్రకాశ్ నారాయణ్‌గారల యాజమాన్యాన నడిచే 'సోషలిస్ట్ పార్టీ'— కృపలానీ, ప్రకాశంగారల నాయకత్వాన నడిచే 'కిసాన్ మజుదూర్ పార్టీ' లో విలీనం కావడానికి బొంబాయిలో సంయుక్త సహాసభ ఒకటి ఏర్పరచి, అక్కడ తీర్మానించినట్లు రెండు పార్టీలను కలిపి "ప్రజా సోషలిస్టు పార్టీ" అనే క్రొత్తపార్టీని రూపొందించారు.

ఈ మార్పు ఆంధ్రప్రాంతానికి సంబంధించినంత మటుకు అనర్థదాయకంగా పరిణమించింది. చివరికి, ఈ సోషలిస్టులలో వేళ్ళ మీద లెక్కపెట్టదగినంతమంది తప్ప, తక్కిన వారందరు కాంగ్రెసులో చేరిపోయారు. పై రాష్ట్రాలలో కూడా వీరిలో చాలామంది ప్రత్యేకంగా సోషలిస్టు పార్టీగా విడిపోయారు. ఆ విడిపోయినవారూ ఇప్పుడు మళ్ళీ రెండు భాగా లవుతున్నారు.

అది అలా ఉంచి, 1952 లో ఆంధ్రలో జరిగిన విషయము చూద్దాము. ప్రకాశంగారు, వారి అనుయాయులమైన మేము- ఆంధ్ర రాష్ట్రం ఏర్పరచినపుడు, బళ్ళారిజిల్లాలో హెచ్చు భాగాన్ని, మైసూరు ప్రాంతాలలోని తెలుగు భాగాలను, చెన్నపట్నం అంతా, లేకపోతే ఉత్తరభాగం ఆంధ్రరాష్ట్రంలో కలిపిఉంచాలని అప్పటికి ముప్ఫైసంవత్సరాలనుంచి అనుకుంటూ ఉండేవాళ్ళము. అయితే, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి ఏర్పాట్లు జరిగే సమయంలో మాతో పలీనమైన సోషలిస్టులు— బళ్ళారి, చెన్నపట్నం ఆంధ్రలో చేరకపోతేనేమి అని వాదించి, పత్రికలలో కూడా వ్రాసేవారు. అందుచేత, పార్టీలో వారికి మాకు కొంత భేదదృష్టి ప్రతికార్యములోను కనిపించేది.

వారి యీ అభిప్రాయానికి కారణమేమని వారినే అడగగా, వారు- తాము సోషలిస్టుపార్టీగా ఉండేరోజులలో బళ్ళారి అంతా కన్నడిగులకు చెందినదని, చెన్నపట్నంమంతా తమిళులకు చెందినదని తీర్మానం వ్రాసుకొని ఒప్పుకొన్నాము అని బయటపెట్టారు.

ఇంతేకాక, కాంగ్రెసు పార్టీ వారు (ఇది 1952 నాటి విషయమని పాఠకులు జ్ఞాపకముంచుకోవలెను.) ప్రజాభ్యుదయకరమైన త్రోవ పట్టారు గనుక, కాంగ్రెసులో కలిసిపోవడమో, లేక వారితో చేయి కల

పడమో చేసుకోవాలని వారు వాదించి, పార్టీ ప్రతి సమావేశంలోను ఏదో ఒక తగాదా లేవదీస్తూండేవారు. ఆ తగదా లేవదీసిన నాయకుడే ఆ తర్వాత కాంగ్రెసుతో కలిసి, మంత్రికావడం ఒకేక్షణంలో జరిగిందని యిదివరలో సూచించాను. అందుచేత ఆంధ్రరాష్ట్ర సమస్యపై పార్టీలో ప్రకాశంగారి అభిప్రాయాలే బహుమతస్వీకారమై ఆంధ్ర హృదయాన్ని ప్రతిబింబిస్తున్నా, పార్టీనుంచి ఏక కంఠమైన మాట రాకపోవడంవల్ల దాని ప్రతిష్ఠ తగ్గడమేగాక, చివరికి అది రెండు ముక్కలుగా చీలి పోవడంకూడా జరిగింది.

ఆ రోజులలో గోపాలరెడ్డి, కళా వెంకటరావుగారల వర్గం— ప్రకాశంగారు, ఆంధ్రప్రజలు పెట్టుకొన్న ప్రత్యేక ఆంధ్రరాష్ట్రస్థాపన లక్ష్యాన్ని అంతగా ఆమోదించే స్థితిలో లేరు. 1952 ఎన్నికలలో వారు ఓటమి చెందినా, అంతకుముందు మంత్రులుగా ఉన్నపుడు- రాష్ట్రవిభజన కమిటీలో, చెన్నపట్నం తమిళరాష్ట్రానికి చెందుతుందన్న సూత్రానికి, వారు స్వహస్తాలతో ఆమోదముద్ర వేశారు.

మా పార్టీలో కలిసిఉన్న సోషలిస్టుల వైఖరి పైన సూచించాను. ఈ విషయంలో, యునైటెడ్ ఫ్రంటులో భాగస్వాములుగా మాతో కలిసి పనిచేస్తున్న కమ్యూనిస్టుల వైఖరికూడా, సోషలిస్టుల వైఖరి ఉన్నట్టే ఉండేది.

ప్రజాసామాన్యం మనసులో అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములు గారి ప్రాయోపవేశానంతరము, ఏదో ఒక విధంగా ఆంధ్ర రాష్ట్రమంటూ ఒకటి ప్రత్యేకంగా దేశపటంలో తన రూపం కనిపించేటట్టు ఏర్పడాలనే ఆందోళనా భావం ఉండేది. ప్రకాశంగారు ఇదంతా కనిపెట్టి, నీలం సంజీవరెడ్డి గోపాలరెడ్డి, కళా వెంకటరావుగారల వర్గంవారే అయినప్పటికీ, తమ అభిప్రాయాలతో కొంచెం అనుకూలంగా కనిపించేటట్టు ఏదో బహిరంగ సభలో మాట్లాడినట్టు పత్రికలో చూపి, ఆయన తమతో ఒకసారి వచ్చి మాట్లాడవలసిందని కబురుపెట్టారు.

ఇది—ఆ సంవత్సరం ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికై పెట్టిన మొదటి అడుగు.

# 18

# ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణము (1953)

ప్రకాశంగారి కబురు అందుకొనివచ్చి, సంజీవరెడ్డిగారు ఆయనను చెన్నపట్నంలో కలుసుకొన్నారు. రెండు పర్యాయాలు కలిపి చర్చి చిన ఫలితంగా, జవహర్‌లాల్ నెహ్రూగారితో ఈ విషయం చర్చించ డానికి నిర్ణయించారు.

సంజీవరెడ్డిగారు ఇలా ప్రకాశంగారితో కలుసుకోవడం, ఆయన సీనియరులైన గోపాలరెడ్డి, వెంకటరావుగారలకు ఇష్టంలేదు. అలాగే ప్రకాశంగారు సంజీవరెడ్డిగారితో ముచ్చటించడం, ప్రకాశంగారి అను యాయులకు చాలా మందికి ఇష్టంలేదు.

ఇష్టంలేకపోయినా- ప్రకాశంగారు, నేనూ వారందరినీ ఒప్పించ గలిగాము.

పార్టీసమావేశ మొకటి ఏర్పాటుచేసి, ప్రకాశంగారి చర్యను ఆమోదిస్తూ, ఆ చర్యలు శాంతంగా సాగించవలసిందని తీర్మానం వ్రాసుకొన్నాము.

దీంతో ఆంధ్రదేశంలో అందరినీ ఆవరించిన స్తంభనంపోయి, నిర్మాణాత్మకమైన ఒక సంచలనం కలిగింది. తమిళ జిల్లాలలోకూడా కలవరము, సంతోషమూ రెండూ కలిపి, రాజకీయవాదుల మనస్సులను బాధించసాగాయి. కొందరికి సంతృప్తి కలిగింది.

ఆ తర్వాత రంగస్థలం ఢిల్లీకి మారింది.

## ఢిల్లీలో ప్రకాశం, నెహ్రూగారల కలయిక

జవహర్‌లాల్ నెహ్రూగారు నిర్ణయించిన తేదీకి ప్రకాశంగారు, నేనూ ఢిల్లీ వెళ్ళాము. అక్కడ కాన్స్టిట్యూషన్ హౌసులో బస చేశాము. సంజీవరెడ్డిగారు అంతకు ఒకరోజు ముందుగానే వెళ్ళారు.

ఆ తర్వాత రోజున నెహ్రూగారిని సంజీవరెడ్డిగారు కలుసుకో డానికి వెళ్ళారు. నెహ్రూగార్లు రెడిగారితో, "ఏమయ్యా సంజీవరెడ్డి!

మీ ముసలివానితో వేగడం చాలా కష్టము. ఆయన ఈ రోజున వస్తాడని నా ఇతర కార్యక్రమాలన్నీ రెండు గంటలు వాయిదా వేసుకొన్నాను. ఆయన వచ్చాడు కాడు. చూశావా ఆయన వైఖరి?'' అన్నారు.

అందుకు సంజీవరెడ్డిగారు, ''అదేమిఅలాగు అంటారు? ఆయన మిమ్మల్ని పదకొండు గంటలకు కలుసుకోవడానికి, వచ్చి సిద్ధంగానే ఉన్నారు. ఆయన యిక్కడికి వస్తున్నట్టు మీ పేర తంతివార్తకూడా యిచ్చారు,'' అన్నారు.

నెహ్రూగారు ''నాకు ఏ తంతివార్తా అందలేదు,'' అన్నారు. అందుకు ''ఆ తంతివార్త యిచ్చినప్పుడు నేను వారి దగ్గర ఉన్నాను. అందకపోవడం ఏలాగు జరిగింది?'' అని ప్రశ్నించారు రెడ్డిగారు.

నెహ్రూగారు తమ పెర్సనల్ అసిస్టెంటును వెంటనే పిలిచి, ''ప్రకాశంగారి దగ్గరనుంచి తంతివార్త వచ్చిందా?'' అని ప్రశ్నిస్తే, ఆయన ''వచ్చింది,'' అన్నాడు.

''ఎప్పుడు?'' అని నెహ్రూగారు మళ్ళీ అడిగారు. ''మొన్న'' అని ఆయన జవాబిచ్చాడు. అది విని, ''సరే: వెళ్లు,'' అన్నారు నెహ్రూగారు.

తనకు తంతివార్త ఎందుకు చూపించలేదని నెహ్రూగారు ఆయనను అడగనైనా అడగలేదు.

అవి, బహుశః ఢిల్లీ నగర సచివాలయ మర్యాదలు కాబోలు!

సంజీవరెడ్డిగారు వెంటనే కాన్స్టిట్యూషన్ హౌసుకు వచ్చి, అక్కడ జరిగిందంతా మాకు చెప్పారు.

ఏర్పాటు చేసిన ప్రకారం ప్రకాశంగారు, సంజీవరెడ్డిగారు, నెహ్రూగారు కలుసుకొన్నారు. ఒక గంటసేపు చర్చించిన ఫలితంగా విభజన కార్యక్రమానికి కావలసిన ఏర్పాట్లు చేయడానికి ఒక ఉపసంఘాన్ని నియమించడానికి అంగీకరించారు. లెక్కలు వగైరాల విషయమై, పూర్వము విభజన సంఘము చేసిన ఏర్పాట్లు ఆధారంగా తీసుకొని కచేరీల విభజన, ఉద్యోగస్థుల పంపకము, క్రొత్త రాష్ట్రంలో

చేసుకోవలసిన ఏర్పాట్లు మొదలైన విషయాలు ఈ సంఘానికి పనిగా అప్పజెప్పారు.

అయితే, అంతకుపూర్వం శాసన సభ్యులు నూతన ఆంధ్ర రాష్ట్రానికి తాత్కాలిక రాజధాని పట్నంగా ఏదో ఒక పట్నాన్ని నిర్ణయించుకోవాలి. ఇదికూడా పూర్వము విభజన సంఘం చేసిన సూచనలలో ఒకటే.

అపుడు, సవ్యంగా సరిఅయిన రాజధాని పట్నం ఏర్పాటు చేసుకొనే వరకు, చెన్నపట్నంలో తాత్కాలికంగా ఆంధ్ర ప్రభుత్వం నడపడానికి అవకాశం ఇవ్వవలసిందని, ఆ విభజన సంఘంలో ప్రకాశంగారు గట్టిగా పట్టుపట్టారు. తమిళ సభ్యులు దానికి అంగీకరించలేదు. మిగిలిన ఆంధ్ర సభ్యులు తమిళులతో ఏకీభవించారు. అప్పుడు విభజన ఆగిపోవడానికి ఇదికూడా ఒక పెద్ద కారణము. ఇది అయిన సంవత్సరం తర్వాతనే కదా శ్రీరాములుగారు ప్రాయోపవేశము చేసినది!

ఆయన ప్రాయోపవేశం జరిగిన తర్వాత, చెన్నపట్నం వదులుకోవడానికి ఒప్పుకొన్న తర్వాత 'శుభస్య శీఘ్రం' మని మా కనిపించింది. ఇప్పుడు శాసన సభ్యులు తాత్కాలిక రాజధాని పేరు సూచించగానే, ఈ విభజన సంఘం పని ఆరంభించగలదని నెహ్రూగారు, ప్రకాశం గారితో ఆ సమావేశంలో అన్నారు.

తాత్కాలిక రాజధానిని సూచించడానికి ఆంధ్రప్రాంతానికి చెందిన శాసన సభ్యుల సమావేశం ఏర్పాటు చేయడానికి అధికారరీత్యా ఆదేశం పంపుతామని ఆయన చెప్పారు. మేము తిరిగి వచ్చేసరికి, ఆ ఆదేశం చెన్నరాష్ట్ర ప్రభుత్వానికి అందింది. దాని ప్రకారం చెన్నరాష్ట్ర శాసన సభామందిరంలో శ్రీ ప్రకాశంగారి అధ్యక్షతన ఆంధ్ర శాసన సభ్యుల సమావేశం జరిగింది. ఈ సమావేశానికి పూర్వం ముందుగా ప్రకాశంగారు- కృషికార్‌లోక్ పార్టీ తరఫున గౌతులచ్చన్న గారినీ, కమ్యూనిస్టు పార్టీ తరఫున టి. నాగిరెడ్డిగారినీ ఆహ్వానించారు.

శాసన సభ్యులు నూతన రాజధానిని సూచించాలి అనే ప్రతిపాదన

బయటపడిన నెలరోజుల దగ్గరినుంచి, అన్ని జిల్లాలలోను ఈ తాత్కాలిక రాజధాని 'మా పట్నంలో' ఉండాలంటే- మా పట్నంలో ఉండాలి' అన్న తీవ్రమైన వాగ్వివాదాలు బయలుదేరాయి.

సహజంగా ప్రకృతి సౌందర్యాన్నిబట్టి, ఉండే సౌకర్యాలనుబట్టి విశాఖపట్నం అనువైన స్థలమని విశాఖపట్నం శాసన సభ్యులమంతా అనుకొన్నాము.

గోదావరి జిల్లాల ప్రసక్తి రాలేదు.

కృష్ణా, గుంటూరు జిల్లాలు కమ్యూనిస్టు సభ్యుల సంఖ్య హెచ్చుగా ఉన్న జిల్లాలు గనుక, తాత్కాలిక రాజధాని ఆ ప్రాంతంలో ఉండాలనీ, అది విజయవాడ- గుంటూరుల మధ్య ఎక్కడో ఏర్పాటు కావాలనీ- కమ్యూనిస్టులు అతి తీవ్రమైన ప్రచారం లేవదీశారు.

సంజీవరెడ్డిగారు మాట్లాడడంలో అప్పుడు ఎంతో ఆత్మనిగ్రహం కనబరిచారు. అయితే, రాయలసీమ సభ్యులలో, కమ్యూనిస్టు పార్టీకి చెందిన ఒక రిద్దరు తప్ప మిగిలినవా రంతా- 1938 లో సర్కారు జిల్లాల వారికీ, రాయలసీమ జిల్లాల వారికీ జరిగిన ఒడంబడిక ప్రకారం ఆంధ్రా యూనివర్సిటీ కోస్తా జిల్లాలలో ఏర్పాటయింది గనుక, తాత్కాలిక రాజధాని అయినా రాయలసీమలో ఏర్పాటు కావాలనీ, అలా కాకుంటే తాము చెన్నరాష్ట్రంలోనే ఉండిపోతామనీ దాదాపు అందరూ సంతకం పెట్టిన కాగితం జేబులో పెట్టుకుని, సమయం వస్తే సభలో చదవడానికి సిద్ధమై కూచున్నారు.

లోగడ, వీరు విద్యా విషయంలో ఆంధ్రా యూనివర్సిటీ యాజమాన్యం ఒప్పుకోమని మద్రాసు యూనివర్సిటి యాజమాన్యంలో ఉండిపోయిన విషయం పాఠకులకు తెలిసే ఉంటుంది. ప్రాంతీయాభిమానాలు చాలా బలీయములైనవి కదా!

ఈ పరిస్థితులలో, రాజధానిని సూచించడానికి పై చెప్పిన అధికార సమావేశాన్ని ప్రకాశంగారు తమ యింటిదగ్గర ఏర్పాటు చేశారు.

అనేక పట్నాలనుంచి, ఆ యా పట్నాలకు చెందిన మిత్రులు, తమ పట్నాలలో గల సౌకర్య సంపదల ఛాయా చిత్రాలను తెచ్చి, ఆ

సమావేశ సభ్యులకు చూపించి, ప్రచారాలు చేసుకో నారంభించారు.

ఉదయం ప్రకాశంగారి యింటిలో జరిగిన సమావేశంలో దీర్ఘమైన చర్చ జరిగింది.

విశాఖపట్నం విషయమై నేను ఆ సభలో ఉండడము మిగిలిన జిల్లాల సభ్యుల నందరినీ ఏకంచేసి, "మీకు హార్బరు ఉంది. షిప్ యార్డు ఉంది. ఈ విషయంలో మీరు విశాఖపట్నం పేరు చేబితే మేము ఒప్పుకొనేది లేదు," అని వారు చెప్పడానికి కారణమైనది.

రాయలసీమకు, శ్రీబాగ్ ఒప్పందం ప్రకారం తాత్కాలిక రాజధాని యివ్వవలసిందే. అది, తిరుపతిలో ఉన్నట్లయితే చిత్తూరు జిల్లా మనతో కలిసి వస్తుందనీ, లేకుంటే కలిసిరాదని తిరుపతిలోగల భవనాల బొమ్మలు చూపుతూ మిత్రులు గౌతు లచ్చన్నగారు వాదించారు.

కడపలోగల భవనాల చిత్రాలు చూపుతూ, కె. కోటిరెడ్డిగారు చాలాసేపు చెప్పారు.

తాత్కాలిక రాజధాని యిచ్చినంత మాత్రాన రాయలసీమకు ఒరిగేది ఏమీ లేదు గనుక, దానిని గుంటూరు- బెజవాడ మధ్య ఉంచాలని కమ్యూనిస్టులు వాదించారు.

రాష్ట్రం ఏర్పాటులో ఒక విధమైన ప్రధానపాత్ర వహించడం వల్ల, సంజీవరెడ్డిగారు—అనంతపురం, రాయలసీమ ప్రాంతాలలో కొంచెం సమ శీతోష్ణ వాతావరణం గల స్థలమయినా, తాను ఆ విషయం ప్రచారం చేసుకోవడం భావ్యం కాదని ఊరుకున్నారు. దానికి తోడుగా, అనంతపురం ప్రసక్తి వచ్చినపుడు, ప్రకాశంగారు "సంజీవరెడ్డి అనంతపురం విషయమై ప్రచారం చేసుకోడులేండి"అని, సంజీవరెడ్డిగారికి ఒకవేళ మాట్లాడుదామన్నా అవకాశం ఇవ్వలేదు.

అలాగుననే విశాఖపట్నం విషయమై, "విశాఖపట్నంకోసం వేరేప్రచార మెందుకయ్యా?"అని అట్టే చర్చ అక్కరలేకుండానే వదిలిపెట్టారు.

చివరికి ఒంటిగంట అయినా, ఏ నిర్ణయానికీ రాలేకపోయాము. ఇక నిర్ణయానికి రాలేము అన్న భావం ఒకటి మా అందరికీ కలిగింది.

కాని, ఆ రోజు ఆ నిర్ణయం చేసుకోక తప్పదన్న అత్యంత అవసరమును కనిపెట్టి, ప్రకాశంగారిపైనే ఈ నిర్ణయభారం వదిలివేద్దామని ఎవరో మెల్లిగా అన్నారు. అందరు గట్టిగా ఆ అభిప్రాయంతో ఏకీభవించారు.

"అయితే, మీరంతా మూడు గంటలకు రండి. తిరిగి సమావేశమవుదాము. అందులో నా నిర్ణయం చెపుతాను," అన్నారు ప్రకాశం గారు.

మూడు గంటలకు తిరిగి ప్రకాశంగారి గదిలో కూచున్నాము. ప్రకాశంగారు, "లచ్చన్నగారూ! ఒక కాగితం, పెన్సిలూ పట్టుకోండి," అన్నారు. తర్వాత "నా నిర్ణయం చెప్తాను. ఆ పేరు కాగితంమీద వ్రాయండి," అన్నారు.

అక్కడ కూడిన ఏడెనిమిది మందిమీ ఒక కన్ను ప్రకాశం గారిమీదా, రెండవది లచ్చన్నగారి పెన్సిలుపైనా ఉంచి చూస్తున్నాము.

ప్రకాశంగారు, "వ్రాయండి! 'కర్నూల్' అని వ్రాయండి" అన్నారు.

అందరూ ఆశ్చర్యంతో నిశ్శబ్దంలో మునగడం జరిగింది.

కాగితంమీద 'కర్నూల్' అని వ్రాయక తప్పదని, లచ్చన్నగారు వ్రాశారు.

నవ్యాంధ్ర రాష్ట్ర తాత్కాలిక రాజధాని జన్మ, నామకరణం ఆ క్షణంలో జరిగింది.

అందరూ లేచి ఎవరి మానాన వారు వెళ్లారు.

శాసన సభా కార్యదర్శికి- ఆంధ్ర శాసన సభ్యులు సమావేశంలో తాత్కాలిక రాజధానిగా కర్నూలును ప్రతిపాదిస్తున్న తీర్మానం,నోటీసు టైపు చేయించి పంపారు.

ఇది రాయలసీమలో ఏర్పాటయినది గనుక, సంజీవరెడ్డిగారు ప్రతిపాదిస్తున్నట్లు సంతకం వద్దనుకొన్నారు. ఇవి కోస్తా జిల్లాలవారి సంతకంతో ఉండడం భావ్యమని భావించారు.

"గౌతు లచ్చన్నగారు ఒక పార్టీ అధినేత గనుక, ఆయన ఈ నోటీసుమీద సంతకం పెడితే బాగుంటుంది," అన్నాను నేను.

"నువ్వు ఉన్న పార్టీ అంతకన్నా పెద్దది కాబట్టి నువ్వే ఈ నోటీసుపై సంతకం పెట్టాలి," అని నాతో అన్నారు ప్రకాశంగారు.

శాసన సభ్య సమావేశంలో, నేను ప్రతిపాదించిన తీర్మానానికి ప్రత్యామ్నాయంగా, ప్రతిపక్షంవారు మరొక తీర్మానం పంపించారు. సభాప్రారంభంలో నా తీర్మానం మొదట ఎజండాలోకి తీసుకొన్నారు గనుక, వారి తీర్మానాన్ని నా దానికి ఎమెండ్‌మెంట్(సవరణ)గా తీసుకోవాలని నా వాదన. రెండు తీర్మానాలూ సమానస్థాయిలో చర్చించ వచ్చని వారి వాదన.

శాసన సభా కార్యనిబంధనలలో ఒకే కాలమందు ఒకే ప్రతి పాదన చర్చించవచ్చుగానీ, రెండు స్వతంత్ర ప్రతిపాదనలను చర్చించ కూడదని ఉండడంచేత అది కూడదని నా వాదన.

మొత్తంమీద- కాంగ్రెసు పార్టీ, కృషికార్ లోక్‌పార్టీ, ప్రజా సోషలిస్టుపార్టీ, కొందరు స్వతంత్ర సభ్యులు ఒకవైపునఉండి మెజా రిటీలో ఉండడంవల్ల, నా ప్రతిపాదన ప్రకారం కర్నూలా, లేక వారి సవరణ ప్రకారం విజయవాడ- గుంటూరుల మధ్యభాగమా అన్నది తేలవలసి ఉంది. అందులో ఒకటి ఆమోదిస్తే, రెండవది వీగిపోయిం దనేమాట నిశ్చయమే గనుక, అంతగా దెబ్బలాడుకోవలసిన విషయం కాదు.

అయినా, చాలా తీవ్రమైన వివాదం సాగింది. అసలు ముందు రోజు ప్రకాశంగారి నిర్ణయానికే రాజధాని పేరు వదులుతా మన్నవారు, ఆ రోజు ఆ నిర్ణయానికి బద్ధులై ఉండవలసింది. కానీ, ఆ విధంగా బద్ధులమయి ఉండవలెనని, శాసనరీత్యా నిర్బంధ మేమీ లేదుకదా?

ప్రశ్న తిరిగి లేవదీయడంవల్ల అనవసరమైన వాదోపవాదము లకు చోటివ్వడం జరిగింది. ప్రకాశంగారి నిర్ణయం ఏకగ్రీవంగా ఒప్పుకొనిఉంటే, అనవసరమైన తగవులతో వ్యయం చేసిన మేధాశక్తి ఎంతో నిర్మాణాత్మకమై ఉండేది. కానీ ఇటువంటి తగాదాలన్నీ చారి త్రాత్మకంగా అగత్యాలవలె తోస్తూ ఉన్నవి.

శాసన సభ్యుల చర్చ మూలంగా, దేశంలో ముఖ్యంగా బెజ

వాడలో ప్రతిపక్షులకు గల స్థానబలము, అంగబలములకు తోడు, అక్కడి ప్రజల సహజ స్వనగరాభిమానము కూడా తోడై, రాజకీయ మైన ఉష్ణతను అత్యుగ్రతకు తీసుకువెళ్లాయి.

రాత్రి అయ్యేసరికి, ప్రకాశంగారికి విజయవాడ అభిమానులవద్ద నుంచి ట్రంక్ కాల్స్, తంతి వార్తలు రాసాగాయి.

తీర్మానం మార్చకపోతే, ప్రకాశంగారి కంచు విగ్రహం ప్రజలు బద్దలు కొట్టేస్తారనే భయం కలుగుతున్నదని కూడా ఆ వార్తలలో చెప్పారు.

ప్రకాశంగారు, "ఆ కంచు విగ్రహం పెట్టవలసిందని నే నెవరి నైనా కోరానా? దాన్ని పెట్టిన ప్రజలకు, దాన్ని బద్దలు కొట్టుకొనే హక్కు తప్పకుండా ఉంటుంది కదా?" అన్నారు.

ప్రకాశంగారి నిర్లిప్తత బెజవాడలో ప్రజల ఆవేశాన్ని పూర్తిగా తగ్గించివేసింది.

కర్నూలు పేరు ఆయన చెప్పడానికి కారణ మిది : "విశాలాంధ్ర రాష్ట్రం త్వరలో ఏర్పడడానికి అవకాశముంది. భాషారాష్ట్రాల ఏర్పాటు విషయమై, నెహ్రూగారు ఒక ఉపసంఘం వేశారు. అందుచేత, త్వరలో- విశాలాంధ్రరాష్ట్రం రావడము తప్పదు. అప్పుడు హైదరాబాదు మన రాజధానికాక తప్పదు.

"కర్నూలు, హైదరాబాదుకు వెళ్ళే త్రోవలో ఉంది. మరొక కారణమూ ఉంది. ఒకటి రెండు సంవత్సరాలు తాత్కాలికంగా రాజధాని అక్కడ ఉండినట్లయితే, రాయలసీమ జిల్లా కేంద్రాలన్నిటిలోను చాలా వెనుకబడ్డది కావడంచేత, రాజధాని ఉన్న రెండు, మూడు ఏండ్లయినా, అది అభివృద్ధి పొందడానికి వీలు కల్పించిన వాళ్ళ మవుతాము."

కర్నూలు తాత్కాలికంగా రాజధాని అనడంలో హైదరాబాదు మనకు వచ్చినా, రాకపోయినా, మన మన్ని పరిస్థితులను సావకాశంగా ఆలోచించి, శాశ్వతమైన రాజధానిని ఏర్పరుచుకోవాలన్న భావం ఇమిడి ఉంది.

ఇపుడు పాఠకుల దృష్టిలోకి ఇంకొక విషయం తేవాలి.

'రాబోయే ఆంధ్రరాష్ట్రానికి కాబోయే ముఖ్యమంత్రి ఎవరు?' అనే ప్రశ్న పుట్టవలసిన అగత్యమే లేకపోయింది. అంతమందీ- ప్రకాశంగారే ముఖ్యమంత్రి కావాలనీ, అవుతారనీ అనుకున్నారు.

అయితే, కొందరు శాస్త్రీయవాదులు ప్రకాశంగారిలో కన్నా తమలోనే హెచ్చు కాంగ్రెసు తత్వమున్నదనే తీవ్రవాదులై, కాంగ్రెస్ పార్టీ నాయకుడు తప్ప మరొకరు ముఖ్యమంత్రి కాకూడదన్న వాదం లేవదీశారు.

ఇతర రాష్ట్రాలలో కాంగ్రెసు బలం హెచ్చుగా ఉండడం చేతనూ, కేంద్రంలో కాంగ్రెసు ప్రభుత్వమే నడుస్తూ ఉండడం చేతనూ, ఆంధ్ర శాసన సభ ఏర్పాటయినపుడు, ప్రకాశంగారి ప్రజా సోషలిస్టు పార్టీలో కన్నా, కాంగ్రెసులోని శాసన సభ్యుల సంఖ్య కొంచెము ఎక్కువగా ఉంటుంది గనుకనూ- ప్రకాశంగారు కాంగ్రెసులో కలిస్తే తప్ప ముఖ్యమంత్రి కాకూడదన్న హ్రస్వదృష్టిగల కాంగ్రెసు వాదులు అభ్యంతరం పెట్టడం మొదలు పెట్టారు. ఈ సమస్య అంతా ఢిల్లీకి వెళ్ళింది.

వార్తా పత్రికలలో "ప్రకాశంగారు కాంగ్రెసులో చేరుతారా?" అనే ప్రశ్నతో వార్తలు పడ నారంభించాయి. ప్రకాశంగారు మాత్రం, ఆ విషయమై ఏమీ వ్యాఖ్యానం చేయక మౌనం వహించారు. అయితే, ఆయన- తన అనుయాయులకు, తాను కాంగ్రెసులో చేరడం ఇష్టం లేదన్న సంగతి గ్రహించారు.

నెహ్రూగారు కూడా అట్టే విశాలదృష్టి చూపించలేదు. ప్రకాశంగారు- కాంగ్రెసులో చేరకపోయినా ప్రజాసోషలిస్టుపార్టీని వదిలి- ఏ పార్టీకి చెందని వ్యక్తిగా, తన వ్యక్తిగతమైన ఔన్నత్యంతో పార్టీలకు అతీతులుగా, సకలాంధ్రులకు ఏకైక నాయకులుగా వ్యవహరించాలని ఆయన బుజ్జగించారు. ప్రకాశంగారు, మాతో ఎవరితోను చెప్పక నెహ్రూగారికి అలాగేనని మాట యిచ్చేశారు.

ఆ దెబ్బతో మా పార్టీ పలుకుబడి కొంత తగ్గిపోయింది. అయి

నప్పటికీ ఆయనమీద వ్యక్తిగతంగా ఉన్న గౌరవంచేత, ఆంధ్రరాష్ట్రమవతరిస్తున్నదన్న ఆత్మతృప్తిచేత పార్టీలో ఉన్నవారు అట్టే గలభా చేయలేదు.

కాంగ్రెసుకు ప్రత్యామ్నాయపక్షంగా ఉండి, ప్రజాస్వామ్యంపై నమ్మకంగల పెద్ద పార్టీ దీనితో క్షీణదశకు వచ్చింది. ఇంతేగాక, మరి కొంతకాలానికి ప్రజాపార్టీతో కలిసిన సోషలిస్టులు విడిపోయి కాంగ్రెసుతో కలసిపోవడంవల్ల మొదటి కె. ఎమ్. ప్రజాపార్టీ వారెవరో, వారు మాత్రం మిగిలారు. 1956 వరకు, వారికి మంత్రివర్గంలో ఒక స్థాన ముండేది. ఇపు డదికూడా లేక పార్టీ నామమాత్రావశిష్టమైంది.

అయినా, అందులో- సత్యాహింసలపైన పూర్తి నమ్మకం గల వారు, ప్రకాశంగారిలాగే దేశముకోసం త్యాగం చేసినవారు, ఆయన వలెనే స్వయంపోషక గ్రామ స్వరాజ్య ప్రాతిపదికపై దేశ శాంతి, సామ్యస్థితి, మానవతాగౌరవములను సంస్థాపన చేయడంలో నమ్మక మున్నవారు ఉండడంవల్ల, గౌరవంగా, నిరాడంబరంగా రాజకీయ రంగంలో మిగిలి ఉంది.

ఇక ప్రస్తుత విషయము:

ఆంధ్రరాష్ట్రానికి కావలసిన ముఖ్యమంత్రిత్వము ప్రకాశంగారికి చేకూరగా, కాంగ్రెసు తరఫున సంజీవరెడ్డిగారికి ఉప ముఖ్య మంత్రిత్వము ఢిల్లీలో తెరవెనుకనే ఏర్పాటయింది.

తరువాత, వేయవలసిన అడుగులు తొందరగానే పడ్డాయి. సంజీవరెడ్డిగారు, గౌతు లచ్చన్నగారు, ప్రకాశంగారి వంతున నేను ఉన్న ఒక చిన్న ఉప సంఘాన్ని, పంజాబు గవర్నరుగా పనిచేసి విశ్రాంతి తీసుకొంటున్న సి. ఎమ్. త్రివేదిగారి అధ్యక్షత క్రింద నెహ్రూగారు నియమించారు.

మాకు కార్యదర్శులుగా పనిచేయడానికి, ఇద్దరు ఐ. సి. ఎస్. ఉద్యోగులను ఇవ్వవలసిందని చెన్నరాష్ట్ర ప్రభుత్వాన్ని ఆదేశించారు. దానిపై ఓ. పుల్లారెడ్డి, వి. కె. రావు గారలనే ఇద్దరు ఐ. సి. ఎస్. ఉద్యోగులను మా ఉప సంఘానికి కార్యదర్శులుగా నియమించారు.

క్రొత్త రాష్ట్రానికి ఎంతమంది ఐ. సి. ఎస్., ఐ. ఏ. ఎస్. ఉద్యోగులు ఉండవలెనో సూచిస్తూ, వారి పేర్లతో సహా మా సలహా సంఘంతో ప్రమేయం లేకుండానే ఏర్పాట్లు చేశారు. ఇక మేము చేయవలసిన పని- మిగతా శాఖలలో సీనియారిటీని బట్టి ఉద్యోగులను అన్ని శాఖలకు ఎన్నుకోవడము; వారు ఒప్పుకోకపోయినా, లేక చెన్నరాష్ట్ర ప్రభుత్వంవారు వారిని విడుదల చేయము అన్నా మరి ఒకరిని ఎన్నుకోవడము.

ఈ యత్నంలో, సహజంగా తెలుగు ఉద్యోగస్థులు పెద్దా చిన్నా యావన్మంది కూడా ఆంధ్ర రాష్ట్రానికి కేటాయింపు అయ్యారు.

క్రొత్త హైకోర్టు ఆంధ్రలో పెట్టడానికి నిర్ణయింపలేదు గనుక, హైకోర్టు విభజన విషయమై మేమేమీ చేయవలసిన పని లేకపోయింది.

ఆంధ్రదేశానికి, మిగులు చెన్న రాష్ట్రానికి మధ్య విభజించిన గవర్నమెంటు పరిశ్రమలు, అప్పులు-ఆస్తుల పట్టీలు అన్నీ ఇదివర లోనే తయారయిపోయి ఉండడంవల్ల, ఆంధ్రరాష్ట్ర శాసనం ఆలస్యం కాకుండా ఢిల్లీ శాసన సభలో పాసయింది.

ఉద్యోగుల విభజనేగాక, రికార్డులన్నీ విభజించాలి. సచివాలయ గ్రంథాలయం విభజించాలి. ఉద్యోగులతో బాటు రావలసిన కుర్చీలు, బల్లలు వగైరాలు విభజించాలి. వీటికి తగిన సూత్రాలన్నీ మేము సలహా సంఘంలో వ్రాస్తూ ఉంటే, ప్రభుత్వం తదనుగుణంగా ఆర్డర్లు జారీ చేయాలని ఏర్పాటు.

సెప్టెంబరు 1 న, మా ఉప సంఘం పని, ఫోర్టు సెంటుజార్జి సచివాలయంలో గవర్నరుకు ఏర్పాటుచేసిన గదిలో ప్రారంభించాము.

ఎవరో కొందరు తెలుగు ఉద్యోగులు మాత్రమే చెన్నరాష్ట్రం క్రిందే ఉండిపోతామని ఉండిపోయారు. ఐ.సి.ఎస్; ఐ.ఏ.ఎస్. ల జాబితాలో తెలుగువారు తక్కువమందే ఉండిరి. ఐ. పి. ఎస్., ఉద్యోగులు ముగ్గురే ఉన్నట్టు జ్ఞాపకము. ఇతర రాష్ట్రాలలో పెద్ద ఉద్యోగాలలో ఉన్న కొందరిని ఆంధ్రరాష్ట్రంలోకి తీసుకురావడానికి యత్నించాము. కానీ, ఆ ప్రభుత్వాలు అంగీకరించలేదు.

ఈ సందర్భంలో ఒక ముచ్చట చెప్పాలి. బొంబాయిలో పి. డబ్ల్యూ. డి. నీటిపారుదల చీఫ్ ఇంజినీరు ఆంధ్రుడు. ఆలిండియా ఇంజనీరింగ్ శాఖకు చెందినవాడు. ఆయనను ఆంధ్రరాష్ట్రానికి ఇవ్వ వలసినదని, బొంబాయి ముఖ్యమంత్రి మొరార్జీ దేశాయిగారిని మేము కోరాము. త్రివేదిగారు- మా సంఘానికి అధ్యక్షులు గనుక, కాబోయే గవర్నరు గనుక ఆ చీఫ్ ఇంజనీరును మాకు ఇవ్వవలసిందని కోరగా, వారు 'తెలుగు రాజ్యానికి తెలుగువాడే ఉండాలని ఎందుకు మీకు పట్టు దల?' అంటూ నిరాకరించారు.

డాక్టర్ కె. ఎల్. రావుగారు ఢిల్లీలో పెద్ద ఉద్యోగములో ఉన్నప్పటికీ, ఆలిండియా ఇంజనీరింగ్ శాఖకు చెందినవాడు కాడు గనుక, తెలుగు రాష్ట్రానికి చీఫ్ ఇంజనీరుగా తీసుకొనేందుకు వీలు లేదన్నారు.

చివరికి చెన్నపట్నంలో చీఫ్ ఇంజనీరుగా పదవీ విరమణ చేసి, విశ్రాంతి తీసుకొంటున్న ఎల్. వెంకటకృష్ణయ్యగారిని చీఫ్ ఇంజనీరుగా కాంట్రాక్టుపైన తీసుకోవలసి వచ్చింది.

మనకు అనేక శాఖలకు అధిపతులుగా (హెడ్స్ ఆఫ్ డిపార్ట్ మెంట్స్) ఉండడానికి అర్హతకలిగినవారు లేకపోవడం జరిగింది.

ఇక్కడి ఉద్యోగాల విషయమై ఈ పనులు చేస్తూ, కర్నూలులో అక్టోబరు 1 నాటికి కావలసిన ఏర్పాట్లు చేయడానికి ఉద్యోగులను నియ మించడం జరిగింది.

కర్నూలులో వసతులు కల్పించడానికి, అవసరమైనచోట్ల రోడ్లు వేయించడానికి, వెడల్పు చేయించడానికి, ఎలక్ట్రిక్ సప్లయి చేయించ డానికి, మంచినీటి సరఫరా చేయించడానికి, సచివాలయం పెట్టడానికి అనువుగా కర్నూలు కలెక్టరు ఆఫీసు భవనంలో తగిన మార్పులు చేర్పులు చేయడానికీ, పెద్ద ఉద్యోగులకు వసతి గృహాలు, సచివాల యంలో పనిచేసే అన్ని తరగతులవారికి భవనాలు, అవి కుదరనిచోట డేరాలు నిర్మించడానికి నలభై లక్షల రూపాయలు మంజూరు చేశారు.

పై చెప్పిన ఏర్పాట్లను చురుకుగాను, సవ్యంగాను జరిపించే బాధ్యత మా సంఘంపైనే పడింది.

ప్రభుత్వంవారు ఆర్డర్లు పాస్ చేయడం తప్ప, ఎక్కువ ప్రమేయం కల్పించుకోలేదు.

ఇలాఉండగా, ఫోర్టు సెంటుజార్జిలో బల్లల విషయమై, రికార్డుల విషయమై, పుస్తకాల విషయమై, గుమాస్తాలకు గుమాస్తాలకూ మధ్య చాలా తగాదాలు వస్తున్నాయనీ, మంచిబల్లలు వారుంచుకొని, విరిగిన బల్లలు, కుర్చీలు ఆంధ్రరాష్ట్రాని కిస్తున్నారనీ, పుస్తకాలు రెండేసి కాపీలు ఉన్న ఒక కాపీ అయినా అందనీయకుండా ఉన్నారనీ అరగంట కొకసారి మా ఉప సంఘానికి ఫిర్యాదులు వస్తూండేవి.

జ్ఞాతులు ఆస్తులు పంచుకొనేటప్పుడు, పై చేయిగలవారు ఏ విధంగా ప్రవర్తిస్తారో ఆ విధంగా తెలుగు ఉద్యోగులయెడల తమిళ ఉద్యోగులు వ్యవహరిస్తున్నారని వచ్చి మాకు చెపుతూండేవారు.

ప్రభుత్వంలో పెద్ద ఉద్యోగంలో ఉన్న పుల్లరెడ్డిగారు, క్రొత్త రాష్ట్రంలోకి వెళ్ళిపోతున్నారనే వార్త ఎప్పుడైతే రూఢి అయిందో, అప్పటినుంచి తమిళ ఉద్యోగులు ఆయన మాటకూడా అట్టే పాటించే వారు కారు.

కేవలం తెలుగు జిల్లాలకు సంబంధించిన రికార్డులేవైనా ఉంటే వాటి అసలు కాపీలే తెలుగు రాష్ట్రానికి ఇచ్చివేయవలసిందనీ, తెలుగు తమిళ రాష్ట్రాలు రెంటికీ సంబంధించిన కాగితాలుంటే అసలు వారు ఉంచుకొని, వాటికి నకళ్లు వ్రాసి మన కివ్వాలనీ సూత్రీకరించాము.

ఆ విధంగా పని జరగడం ప్రారంభమయినా, ఇప్పుడు ప్రకాశంగారి జీవితచరిత్ర వ్రాసే సందర్భంలో, అనేక రికార్డులు కావాలని మన ప్రభుత్వాన్ని అడిగితే, వారు వెతికించగా, అవి చెన్నపట్నం నుంచి నేటివరకు రాలేదని తేలింది. అందుచేతనే, నేను వ్రాసిన విషయాలకు సంబంధించిన గవర్నమెంటు ఆదేశాల సంఖ్యలుగాని, తేదీలు గాని యివ్వకుండా వాటిలోని విషయాలు మాత్రం సూచింపగలుగుతున్నాను.

రికార్డులన్నీ భవిష్యత్తులో సమగ్రంగా పరిశీలించగలిగే అవకాశము ఎవరికైనా కలిగితే, ప్రకాశంగారి జీవితచరిత్ర, దానితో అవినాభావ సంబంధంకల ఆంధ్రదేశచరిత్ర ఇంతకన్నా సమగ్రంగా వ్రాయడానికి వీలవుతుంది. ఆ విధంగా వ్రాయవలెకూడా.

అక్టోబరు 1 నాటికి ఒక దినం ముందుగానే, శాసన సభ్యులు, ప్రకాశంగారు, గవర్నరుగారు, ఆహ్వానితులైన అనేకమంది పెద్దలు కర్నూలు వెళ్ళారు. ఒక లక్షమందికిపైగా ప్రజలు గుమిగూడారు.

మంత్రివర్గం ఏర్పాటు సందర్భంగా ఏవో భేదాభిప్రాయం వచ్చి రంగగారు హాజరు కామన్నారు.

ఎగ్జిక్యూటివ్ ఇంజినీరు భవనం ఒకదాన్ని గవర్నర్ బంగళా క్రింద మార్చడం జరిగింది. నెహ్రూగారు, రాధాకృష్ణన్‌గారు బస చేయడానికి తాత్కాలికంగా రెండు వసతి గృహాలు కట్టి, ఆధునికమైన ఏర్పాట్లు, సౌకర్యాలు కలగజేశారు. పట్నానికి కొంచెం దూరంలో నెహ్రూగారు, రాధాకృష్ణగారు వచ్చే విమానం దిగడానికి కూడా ఏర్పాట్లు చేశారు.

ఆంధ్రరాష్ట్ర అవతరణోత్సవ సమయంలో ఆంధ్రదేశమంతా ఉప్పొంగింది.

అంతకు ఒకవారం ముందునుంచి, అక్టోబరు 1 న గాక, ఒక రోజు ముందుకాని, ఒకరోజు తర్వాతగాని యీ అవతరణోత్సవం జరుపవలసిందని జ్యోతిష్కులూ, జ్యోతిషం తెలిసిన పెద్దలూ ప్రకాశం గారికి ఉత్తరాలపైన ఉత్తరాలు వ్రాయడం మొదలు పెట్టారు.

లెక్కల సౌకర్యంకోసం ఒకటవ తేదీ నిర్ణయింపబడిందనీ, అది మార్చితే లెక్కల ఇబ్బందులు వస్తాయనీ ఉద్యోగుల ఆక్షేపణ రెండో ప్రక్కనుంచి వచ్చింది.

ప్రకాశంగారేమో, "జ్యోతిష్కులు చెప్పిన అభ్యంతరాల ననుసరించి, రాజ్యాలు నడిపించే కాలము కా"దన్నారు.

అసలు జ్యోతిష్కులు చెప్పినదానిలో తనకు వ్యక్తిగతంగా నష్టం వస్తుందని ఉన్నదేగానీ, ఆంధ్రదేశ జాతకానికి నష్టం వస్తుందని

లేనందున, తనకు వచ్చే నష్టం ఒక లెక్కలోది కాదన్నారాయన.

"ఎంత శుభ సమయాన, జ్యోతిష్కులు చెప్పినట్టు మంత్రి అయినా, కలకాల మెవరూ మంత్రిగా ఉట్టి కట్టుకు ఊగబో"దన్నారు. కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన తేదీకి తాను అడ్డు రానన్నారు.

## ఆంధ్రరాష్ట్ర శుభారంభము

జవహర్‌లాల్ నెహ్రూగారు దాదాపు ఇరవై అడుగుల ఎత్తు వేదికపైనుంచి, రాజ్యావతరణ దీపం వెలిగించి, సహజ గాంభీర్య వచన రచనలతో ఉపన్యాసము సాగించారు. రాధాకృష్ణగారు ఆశీర్వదించారు. వారి ఉపన్యాసంలో ఏ విధమైన లోటూ లేదు. కాని, అతి జాగ్రత్తగా 'అమర జీవి పొట్టి శ్రీరాములు' అనే అక్షర క్రమం తమ మాటలలోకి రాకుండా మాట్లాడగలిగారు.



తొలి ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గం ప్రమాణ స్వీకరణ సందర్భంలో ముఖ్యమంత్రి ప్రకాశంగారు, శ్రీయుతులు డి. సంజీవయ్య, కోటిరెడ్డి, గవర్నర్ త్రివేది, తెన్నేటి విశ్వనాథం, ఉప ముఖ్యమంత్రి నీలం సంజీవరెడ్డి. (Courtesy: P. I. B.)

రాష్ట్రమే మా క్రొత్తది. రాష్ట్ర విభజనలో అప్పుల పంపకమే అయింది. ధనరూపకమైన ఆస్తి నిల్వ లేవీ లేవు. అయినా, రాజ లాంఛనాలతో, ఆ సమయానికి తగినట్టుగా, ఆ స్థలానికి వీలైనట్టుగా ఉపరాష్ట్రపతిగారికి, భారత ప్రధానిగారికీ- గవర్నరుగారు, ప్రకాశంగారు, సంజీవరెడ్డిగారు అతిథి మర్యాదలు నడిపించారు.

ప్రకాశంగారు, ఆ తెల్లవారుజామున నా కొక ఉత్తరం వ్రాసి పంపించారు.

"నేను ఏర్పాటు చేయబోయే మంత్రి మండలిలో నిన్నొక మంత్రిగా తీసుకుంటున్నాను. అనుమతి పంపించవలసింది," అని ఉన్నది అందులో.

మాటల్లో ఈ విషయం అంతకు ముందు అనుకోకపోయినా, ఉప సంఘంలో నన్ను సభ్యునిగా వేసినపుడే ఇటువంటి ఏర్పాటు కాగలదని మే మనుకొన్న విషయమే. గౌతు లచ్చన్నగారు ఒప్పుకోక పోవడంవల్ల ఆ రోజున మంత్రిమండలిలో ఆయన పేరు గవర్నరు గారికి, ప్రకాశంగారు ఇవ్వలేకపోయారు.

నెహ్రూగారికి, ప్రకాశంగారు తమ పేరు, సంజీవరెడ్డిగారి పేరు, నాపేరు చూపి, త్వరలో మరొక నలుగురు మంత్రులను వేసు కొంటామని చెప్పారు.

ప్రకాశంగారు నా పేరు ఇచ్చినప్పుడు, నెహ్రూగారు "విశ్వ నాథాన్ని కాంగ్రెసులో చేరమని మీరు అడగ కూడదా!" అన్నారట. అందుకు ప్రకాశంగారు "నేను అతనిని చేరమని అడగను. అతను చేరనూ చేరడు. ఈ విషయం మనము అలాగే ఉంచేయవలసిందే," అన్నారట. ఈ విషయం నాకు రాధాకృష్ణగారు చెప్పారు.

శాసన సభలో మాకున్న మెజారిటీ మొదట్లో బాగా ఉందను కున్నా- మాలో ఉన్న కొందరు, తమలో ఉన్న ఒకరికి మంత్రి పదవి ఇవ్వలేదన్న కారణం మనసులో ఉంచుకొని, ఆదర్శ భేదాలు నెపంగా చెప్పి, ప్రతిపక్షంలో కలిసిన తర్వాత, ప్రభుత్వానికి సంఖ్యాబలం తగ్గింది.

రాష్ట్రావతరణ దినాన నే నున్న పార్టీలో 27 మంది సభ్యు లుండేవారు. ఆ సాయంకాలం ఇందులో 25 గురు మా యింటి దగ్గర సమావేశమై, నేను మంత్రి పదవి స్వీకరించడం అత్యవసరమనీ, మంచిపని చేశాననీ అభినందిస్తూ, ఒక తీర్మానంకూడా వ్రాసి ఆమో దించారు.

అయితే, ఇందులో కొందరు ఒక నెల రోజులు గడిచేసరికి, ఆ రోజున సభకు రాని మిత్రుని అభిప్రాయానుసారం నానుంచి విడి పోయారు.

అందుచేత, ప్రభుత్వ పక్షాన మాకు పదికన్నా హెచ్చు సంఖ్యా బల ముండేదికాదు.

శాసన సభా కార్యక్రమంలో సంఖ్యాబలం, నైతిక బలంకన్నా హెచ్చయినది. అందుచేతనే, పరిపాలనా విధానంలో నైతిక బలం ఫలించడం కోసమని చెప్పి, ముఖ్యమంత్రులు, ప్రధానులు సంఖ్యా బలం కోసం పలు పాట్లు పడుతూ ఉంటారు. కొందరు సంఖ్యాబలమే ప్రధానంగా చూచుకొని నైతిక బలాన్ని ధారపోస్తారు. పదవీ సౌభాగ్య మనుభవిస్తారు.

మరికొందరు (ఇట్టి వారు కొందరే ఉంటారు!) నైతిక బలానికే ప్రాధాన్యమిచ్చి, సంఖ్యాబలం కోసం యత్నించక పతన మవుతారు.

ఇందులో మొదటి తెగవారు రాజకీయ ప్రమాణాలు దిగజార డానికి అవకాశా లిస్తారు.

రెండవ తెగవారు నైతిక ప్రమాణాన్ని, ఔన్నత్యాన్ని దిగజార నివ్వరు. వీరు ఒక్కొక్కప్పుడు పదవీచ్యుతు లౌతారు కూడా. పదవి పోయినా, ప్రజల హృదయాలలో ప్రేమాను బంధితులై ఉంటారు.

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు ఈ రెండవ తెగకు చెందినవారు.

అట్టివారే జీవితచరిత్ర కథనానికి అర్హులు.

# 19

# ప్రథమ ఆంధ్ర శాసన సభ-ప్రకాశంగారి నాయకత్వము

కర్నూలులో ఉన్న కోర్టు భవనాన్ని శాసన సభా మందిరంక్రింద మార్చడం జరిగింది. ప్రభుత్వ మేర్పాటయిన ఒక నెల తర్వాత ప్రథమ శాసన సభాసమావేశము జరిగింది.

అంతకు ముందు, నా పార్టీకి చెందిన—నల్లపాటి వెంకట్రామయ్యగారినీ, పసల సూర్యచంద్రరావుగారినీ క్రమంగా స్పీకరు, డిప్యూటి స్పీకరుగా ఎన్నుకోడానికి ప్రభుత్వపక్షాన ఉండే శాసన సభ్యుల సమావేశంలో నిర్ణయింపబడింది.

శాసన సభ స్పీకరు ఎన్నిక కాకపూర్వము, సభ్యులు యావన్మందీ భారత సంవిధానము ఎడల శ్రద్ధానిష్ఠలు కలిగి ప్రవర్తిస్తామని ప్రమాణ స్వీకరణ చేయవలెను. సభ్యులలో అందరికన్నా వృద్ధుడైన సభ్యుని తాత్కాలిక అధ్యక్షునిగా గవర్నరు నియమిస్తారు.

ఈ సందర్భంలో, గుంటూరునుంచి ఎన్నికైన నడింపల్లి వెంకటలక్ష్మి నరసింహారావుగారిని గవర్నరు తాత్కాలిక అధ్యక్షునిగా నియమించారు. ఆయన బారిస్టరు. ప్రకాశంగారే ఆయన హైకోర్టులో న్యాయవాద వృత్తి ఆరంభించడానికి, బారిస్టరు పట్టీలో ఆయన పేరు చేర్చడానికి హైకోర్టులో ప్రతిపాదించారు. తరువాత, గాంధీగారి ఉద్యమం ప్రారంభమైన సందర్భంలో తాను సంపన్న గృహస్థుడైనా ఆస్తిపాస్తులు పోతాయన్న జంకులేకుండా దేశస్వాతంత్ర్యసమరంలో ధైర్యంగా దుమికిన స్వాతంత్ర్య యోధుడాయన. కొంతకాలం గుంటూరు మునిసిపల్ ఛైర్మన్‌గా కూడా ఉండేవారాయన.

ఆయన—చిన్నది, చక్కనిది అయిన శాసన సభ ప్రారంభోపన్యాసంచేసి, సభ్యులందరినీ ఒకరి తరువాత ఒకరికి సభ్యత్వ ప్రమాణ స్వీకారం (ఓట్ ఆఫ్ ఆఫీస్) తీసుకోమన్నారు.

అది అయినతర్వాత, పైనచెప్పిన నల్లపాటి వెంకటరామయ్య గారు స్పీకరుగా ఎన్నికయ్యారు. ప్రతిపక్షంవారు [illegible] ఒక అభ్యర్థిని పోటీపెట్టారు. వారి అభ్యర్థికి 18 వోట్లు, వెంకట్రామయ్య గారికి 86 వోట్లు వచ్చాయి. వెంకట్రామయ్యగారు గెలిచారు.

ప్రకాశంగారు ఆయనకు అభినందనలు తెలియజేస్తూ, పక్షపాతం లేకుండా స్పీకరు ఉద్యోగాన్ని నిర్వహించగలరని ఆశీర్వదించారు.

ఆ సమయంలో ప్రకాశంగారు మరొకమాటకూడా అన్నారు:

"అనేకమైన కష్టనష్టాల కోర్చి ప్రత్యేకాంధ్రరాష్ట్రము నిర్మించుకోగలిగాము. ఈ నిర్మాణ కార్యక్రమంలో నేనుకూడా కొంత భాగస్వామినై ఉన్నందుకు, నాకు అత్యంతమైన సంతృప్తి కలుగుతున్నది. మనలో మనకు భేదాభిప్రాయాలు ఎన్నో ఉన్నా, వాటిని సర్దుబాటు చేసుకొని, కలిసి ఈ రాష్ట్రం ఏర్పాటు చేసుకొన్నాము."

ఈ విధంగా మాట్లాడి, ఇదే ప్రకారంగా కలిసి మెలిసి పని చేసుకుంటూ వస్తే, ఆంధ్రరాష్ట్రం ముందడుగు వేయగలదని ఆశించారు.

దీర్ఘోపన్యాసమేమీ చేయలేదు.

గవర్నరు శాసన సభ్యులను సంబోధిస్తూ చేసిన ఉపన్యాసానికి, శాసన సభ్యుల కృతజ్ఞతను తెలియబరిచే తీర్మానం ప్రభుత్వపక్షాన ఉన్న శాసన సభ్యులలో ఒకరు 1953 నవంబరు 26 న ప్రతిపాదించారు.

తీర్మాన ప్రతిపాదన కాగానే, ప్రకాశంగారు శాసన సభ్యులకు ఒక విషయం చెప్పడానికి లేచి, ఇలా చెప్పారు:

"మన రాష్ట్రగవర్నరు సి. ఎమ్. త్రివేదిగారు తమకు రావలసిన జీతంలోంచి 1,200 రూపాయలు స్వచ్ఛందంగా వదులుకున్నారు. మాటలు పది చెప్పినా, డబ్బు విషయంలో చాలా మందికి చేయి సంకుచితమైపోతుంది. కాని, వీరు ఔదార్యంతో ఇంత వేతనము వదులుకోవడం చాలా ప్రశంసనీయ

మైన విషయము. వారికి ప్రత్యేకంగా మన కృతజ్ఞతలను తెలియజేస్తున్నాను.''

ప్రతిపక్షులు పట్టుదల కలవారు. వెంటనే, కృతజ్ఞతా తీర్మానానికి—గుంటూరు, విజయవాడల మధ్య తాత్కాలిక రాజధానిని ఏర్పాటు చేయనందుకు తమ విచారాన్ని వెలిబుచ్చుతూ ఒక సవరణ ప్రతిపాదించారు. ఈ సవరణ న్యాయంగా చర్చకు తేవడానికి వీలులేదు. అది ప్రభుత్వం చేసిన ఏర్పాటు కాదు. ఆంధ్ర శాసన సభ్యులందరు బహుమతంతో చేసిన నిర్ణయము.

అయితే నేమి? స్పీకరుగారు సందిగ్ధమైన మన సత్వంగల మనిషి కావడంచేత, ఆ సవరణను చర్చించడానికి అనుమతించారు.

చర్చ ప్రారంభ దశలో, సభ్యుల మనసులలో విషయం తేటగా ఉండడానికని, ప్రకాశంగారు లేచి మాట్లాడారు. దాని సారాంశమిది:

''కర్నూలు పట్నం శాశ్వత రాజధాని కాదు. ఇది తాత్కాలికమయినదని చెన్నపట్నంలో ఆంధ్ర శాసన సభ్యులు కలిసి చేసిన తీర్మానంలో ప్రత్యేకంగా వ్రాసిఉన్నది. అందుచేత, మనమంతా సావకాశంగా ఆలోచించుకొని 'శాశ్వతమైన' రాజధానిని యిటుపైని ఏర్పాటు చేసుకోవాలని దాని అర్థము. ఇది నిస్సందేహమయిన పరిస్థితి. ఇంతేగాక, త్వరలోనే భారత దేశంలోగల రాష్ట్రాలను భాషారాష్ట్రాలుగా పునర్విభజన చేస్తామని భారతప్రధాని మాట యివ్వడమేగాకుండా, దానికి సంబంధించి ఉన్నతాధికారమున్న పరిశీలనా సంఘాన్నికూడా ఏర్పాటు చేస్తూ ప్రకటన చేశారు. త్వరలో విశాలాంధ్ర ఏర్పడగలనన్న విశ్వాసము నాకున్నది. అప్పుడు హైదరాబాదు మనకు శాశ్వత రాజధాని కాగలదు. అది జరగడానికి రెండు మూడేండ్లకన్నా ఎక్కువ కాలము పట్టదు. ఈలోపున బాగా వెనకబడ్డ కర్నూలు కొంచెం బాగుపడడానికి చేసిన యీ ప్రయత్నాన్ని మీరంతా ఎందుకు అడ్డుతారు? ఇదికూడా మన ఆంధ్రప్రాంతమే కదా? కనుక, కోపతాపములు లేకుండా చర్చ సాగనివ్వండి.''

అయితే, చర్చ మామూలు విధాన్నే ప్రతిపక్షంవారు అనుకున్న అప్రస్తుత పద్ధతిలోనే సాగింది. అయినప్పటికీ 28-11-1953 నాడు ఆ తీర్మానము బహుమతముగా ఆమోదమయింది.

కానీ, ఒకటిమాత్రం స్పష్టంగా తేలింది. అదేమిటంటే—ప్రభుత్వం సాఫీగా నడవడానికీ, శాశ్వత సత్కార్యక్రమంలో ముందంజ వేయడానికీ మనశ్శాంతిలేని ప్రభుత్వాధిపతిగా ప్రకాశంగారు నడుకోవ లసి వచ్చింది అంతకుముందు రెండు నెలలక్రింద జ్యోతిష్కులు చెప్పిన బాధలు ప్రారంభమయినాయి. అయితే, ప్రభుత్వ పక్షానఉన్న 67, 68 మందీ సభ్యులూ చివర విశ్వాస రాహిత్య తీర్మానం వచ్చే వరకు ప్రభుత్వపక్షాన్ని బలపరుస్తూనే వచ్చారు.

30-11-1953 న ప్రతిపక్షులు తిరిగి ఈ రాజధాని ప్రశ్న లేవ దీశారు. ఈ రోజున స్పీకరు వెంకట్రామయ్యగారు పరస్పరమూ ప్రతి కూలములయిన రెండు, మూడు రూలింగు లివ్వడం తటస్థించింది.

దాంతో, ఉపముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారికి చీకాకువేసి, "అధ్యక్ష స్థానం ఎడల నాకేమీ అగౌరవములేదుగానీ, పరస్పర ప్రతికూలమైన రూలింగుల బాధ పడలేను" అని చెప్పి పైకి వెళ్ళిపోయారు.

వెంకట్రామయ్యగారు ఆ విధంగా ఒక నిర్ణయానికి రాలేని మనిషి అని ఆయనను అధ్యక్ష పదవికి ప్రతిపాదించినపుడు తెలుసుకో లేక పోయాము అసలే ప్రభుత్వం పెద్ద మెజారిటీ లేని స్థితిలో ఉంది. దానికితోడు అసందిగ్ధమైన నిర్ణయాలతో తీర్పు చెప్పలేని సభాధ్యక్షుడు కూడా ఉన్నట్టయితే, ఆ ప్రభుత్వం దుస్థితి యిక వేరే చెప్పాలా?

ఆ రోజు సభ వాయిదా వేసిన తర్వాత, ప్రకాశంగారు సభ లోంచి మెల్లిగా బయటకు వస్తున్నారు. ఆయన వస్తూన్న వరండా అట్టే వెడల్పులేదు. అంతట్లో 'స్పీకరుగారు వస్తున్నారు, స్పీకరుగారు వస్తున్నారు' అని దఫేదారు అంటున్న మాటలు ప్రకాశంగారు విన్నారు. ప్రకాశంగారిని చూసి, స్పీకరు కొంచెం వెనక్కు తగ్గి మెల్లిగా అడుగులు వేశాడు.

ప్రకాశంగారు వెనక్కు చూడకుండానే, నవ్వుతూ, "ఏమయ్యా

వెంకట్రామయ్యా! మా ప్రభుత్వం ఎప్పుడైనా పడిపోతే, నీ రూలింగుల వల్లనే పడిపోతుందిలే!'' అన్నారు.

దీనిపై స్పీకరుగారు, ఆ మాటలు విన్న అంతమందీ గొల్లున నవ్వారు.

కాని, నిజానికి మరి పదకొండు నెలల తర్వాత, ప్రకాశం ప్రభుత్వంపై వచ్చిన విశ్వాసరాహిత్య తీర్మానంపైన జరిగిన చర్చలు, ఆ రోజున స్పీకరు ఇచ్చిన పరస్పర విరుద్ధమయిన రూలింగులు చదివి నట్టయితే, ప్రకాశంగారన్నట్లు పైన పేర్కొన్న మాటలు భవిష్యత్సూచకములైన మాటలని తెలియగలదు.

ప్రకాశంగారు ఒక్కొక్కప్పుడు డొంకతిరుగుడుగా మాట్లాడే టట్టు కనిపించేవారు. కాని, అది ఆయన బుద్ధిపూర్వకంగానే మాట్లాడే విధానము. ప్రభుత్వమేమి చేసినా అభ్యంతరము చెప్పే ప్రతిపక్షం ఎదురుగా కూచున్నప్పుడు, వారి మనసు తిరగడానికి అటువంటి విధాన మవలంబించేవారు.

ఆ సమయంలో నిల్చుని మాట్లాడవలసిన ముఖ్య మంత్రి మన స్థితి, ముందుగానే మనసులో ఒక తీర్పు నిర్ణయించుకొన్న హైకోర్టు జడ్జీముందు వాదించే న్యాయవాది మనస్థితి, పద్ధతీ ఒకే విధంగా ఉంటాయి.

విషయానికి సంబంధించకుండా, విషయానికి మరీ దూరంగా పోకుండా—సర్వజనాంగీకారమైన కొన్ని మాటలతో ప్రారంభించి, మెల్లిగా ప్రతిపక్షుల ముఖవైఖరిలో కొంచెం మార్పు కలిగిన తర్వాత అసలు విషయంలోకి దిగాలి.

అటువంటి సమయాలలోనే ప్రకాశంగారు కొంచెం డొంక తిరుగుడుగా మాట్లాడేవారు.

కర్నూలు శాసన సభలో ఉన్న ప్రతిపక్షులు ఏకంగా మాట్లాడే వారు చాలామంది ఉండేవారు. కాని వారు కార్య నిబంధనలతో అట్టే సంబంధం పెట్టుకొనేవారు కారు. వారు గట్టిగా మాట్లాడితే, స్పీకరు వెంటనే మెత్తబడుతూండేవారు. అందుచేత అడ్డు, అపులేని వారి విజృం

భణ శాసన సభా సంప్రదాయ బద్ధులమైన మా వంటివారికి కొంత కష్టం గానే ఉండేది.

1954 లో స్థానిక సంస్థల శాసనాలను సవరించడానికిగాను, ప్రభుత్వ పక్షాన స్థానిక సంస్థల మంత్రి అయిన తిమ్మారెడ్డిగారు * ప్రతిపాదించారు.

అయితే, అదే సమయంలో, ఈ స్థానిక సంస్థల బిల్లు వెంటనే ప్రవేశపెట్టలేదని ప్రతిపక్షంవారు అభిశంసన పూర్వకంగా ప్రతిపాదన ఒకటి చేశారు.

తిమ్మారెడ్డిగారు బిల్లుకు నోటీసు ఇచ్చి ఉండడంచేత, వారి ప్రతిపాదనకు తావులేదు. ఆ విధంగానే పాపం, స్పీకరుగారు రూలింగు కూడా ఇచ్చారు.

అయితే నేమి? ప్రతిపక్షులకు సంఖ్యాబలం హెచ్చుగా ఉంది కదా! శాసన సభలో జ్ఞానమంతా సంఖ్యాబలంతో పరిసమాప్తి చెందు తుంది. అందుచేత, ప్రతిపక్షం వారు బాగా జోరుగా మాట్లాడుతూంటే, ప్రకాశంగా రీ విధంగా అన్నారు:

> "అధ్యక్షా! నిన్న సభ వాయిదా వేస్తూ, సభ్యులంతా అలిసి పోయారని మీ రన్నారు. కాని, ఇక్కడ కూర్చున్న మాలో ఎవ్వరూ అలిసిపోలేదు. అలిసిపోము. మనమంతా ఒక మహా కార్య నిర్మాణం మధ్య ఉన్నాము. మనము ఎంత సృజనాత్మక మైన కార్యము చేస్తున్నామో అందరూ గ్రహించినట్టు కనిపిం

---

* ప్రభుత్వం ముగ్గురు మంత్రులతో ఏర్పాటయినదని వెనుక వ్రాశాను. తర్వాత- తిమ్మారెడ్డిగారు, సంజీవయ్యగారు, కోటిరెడ్డి గారు, పట్టాభిరామారావు గారలను త్వరలోనే మంత్రి మండలి లోకి తీసుకొని దాన్ని విస్తృత పరచడమైంది. మొదట నిరాకరిం చినా, తర్వాత చేరడానికి అంగీకరించి, గౌతు లచ్చన్నగారు కూడా మంత్రి అయ్యారు. అయితే, మరికొంత కాలానికే ఏదో భేదాభి ప్రాయం కలిగి ఆయన రాజీనామా యిచ్చి వెళ్ళిపోయారు.

మిగిలిన వాళ్ళము ప్రభుత్వ పతనంవరకు కలిసి ఉంటిమి.

చదు. ప్రతిపక్షంవారు, 'అభిశంసన' 'అభిశంసన' అని పదిమార్లు అంటున్నారు. ఎవరు, దేనికి అభిశంసన తెస్తున్నారు? నేను ఇంత సేపూ మౌనంగా కూచున్నాను. ఎవరైనా నిర్మాణాత్మకంగా మాట్లాడుతారేమోనని శ్రద్ధగా వింటున్నాను. చర్చలు క్రమబద్ధమైన ఒక త్రోవలోకి వస్తాయేమో అని ఆశిస్తున్నాను.........

"ఎండబాధ, వానబాధ మమ్మల్ని ఏమీ ఇబ్బంది పెట్టజాలవు. కాని, ఏదైనా పార్లమెంటరీ సంప్రదాయ మార్గంలోకి మనమంతా రాగలమేమోనని చూస్తున్నాను.

"మేము బిల్లు ప్రవేశపెట్టడమే వారు చేసే 'అభిశంసన'కు రుజువు అని వారంటే, ఇటుపైని ఇక్కడ మీరు, నేను కూచునేది ఎలాగు? పనిచేయకుండా మనము వెళ్ళిపోలేము గదా! అందుచేత, మన చర్చలు అసలు చర్చనీయాంశంలోకి వెళ్ళేలాగు చేయండి."

మరికొంత చర్చ సాగిన తర్వాత—అయినదానికి కానిదానికి ప్రతిపక్షులు వాదిస్తున్న సమయంలో, ఆయన మరో మారు లేచి ఇలా అన్నారు:

"మాటలు చెప్పడంలో ప్రతిపక్షులు మహా ఘటికులు. ఆ కీర్తి వారిదేనని నేను ఒప్పుకుంటాను. అధ్యక్షుడు కుర్చీలో కూచున్నారనే విషయం కూడా, మన ప్రతిపక్షుల దృష్టిలో ఉండదు గదా! శాసన సభలో కానివ్వండి, శాసన సభ వెలుపల కానివ్వండి, వారి మాటే చివరిమాట కావాలంటారు. వారు చెప్పేదే, జ్ఞానానికి అవధి అంటారు.

"ఓ మారు రాజగోపాలాచారిగారు ఎప్పుడో చెప్పిన మాటలు చదివి వినిపిస్తారు. ఓ మారు తిమ్మారెడ్డిగారు చెప్పిన మాట లేవో తీసి చదివి వినిపిస్తారు. అలాగే, అంతులేకుండా, వారు చెప్పిందీ, వీరు చెప్పిందీ చదివి వినిపిస్తూంటారు. స్వంతంగా చెప్పవలసిన విషయం లేకపోబట్టే, వారి మాటలూ వీరి మాటలూ చదివి సభలో కాలక్షేపం చేస్తారు."

ప్రకాశంగారి ఈ మాటలను బట్టి పాఠకులకు నాటి కర్నూలు ప్రభుత్వ మే స్థితిలో ఉందో తెలుస్తుంది.

అయినప్పటికీ, ఉన్న 13 నెలలలోనూ, ఐదారేండ్లు ఉంటేగానీ ఏ ప్రభుత్వమూ చేయలేని పనులు చేయగలిగారు.

మధ్యకాలంలో సంజీవరెడ్డిగారికీ, వారికీ మధ్య మనస్పర్థలు పెరిగినా ప్రభుత్వపు చురుకుదనం మందగించలేదు.

తమ ప్రభుత్వ కాలంలో—13, 14 నీటిపారుదల ప్రాజెక్టులు స్థాపించారు; శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయాన్ని సంస్థాపించారు; ఆంధ్ర హైకోర్టు (ఉన్నత న్యాయస్థానము) నెలకొల్పారు; తిరుపతి దేవ స్థానం నిర్వహణకు కావలసిన మార్పులు శాసన రూపంలో చేశారు.

## ఖైదీలందరికీ విముక్తి

ఆంధ్ర ప్రభుత్వం ఏర్పాటయిన కొద్ది కాలంలోనే, కమ్యూనిస్టు పార్టీ సభ్యులనుంచి—తమ పార్టీకి చెందిన ఖైదీలను, డెటిన్యూలను విడుదల చేయవలసిందని అర్జీలు శరపరంపరగా రాసాగాయి. అందు చేత, ఆ విషయం కాబినెట్‌లో చర్చించవలసిన అగత్యం కలిగింది.

ఉద్యోగులు—ఈ అర్జీలను పరిశీలించి, రాజకీయ కారణాలవల్ల జైలులో ఉన్న కమ్యూనిస్టుపార్టీ ఖైదీలను, డెటిన్యూలను రెండు శాఖలక్రింద విభజించారు. ఒక శాఖలో అపాయకారులని కొందరినీ, రెండవ దానిలో అంత అపాయకారులు కారన్న వారినీ పేర్కొన్నారు. అయితే అనపాయకారు లని వారు సూచించిన కొందరిపై హత్యా నేరాలు ఆరోపింపబడి ఉండెను.

వారు వచ్చిన జిల్లాలలో నుంచే మంత్రివర్గంలో ఒక మంత్రి కూడా ఉండేవారు. ఆయన- వారు చాలా అపాయకారులు గనుక, వారిని వదలడానికి వీలులేదని వాదించారు.

మరొక మంత్రి, "హత్యచేసిన వారినే అనపాయకారులుగా ఉద్యోగులు భావించగా, మిగిలిన వారిని ఖైదులో ఎందుకు ఉంచాలి?" అని వాదించారు.

మరొకరు, "సాధారణ హత్యలకన్నా రాజకీయ హత్యలు సంఘ విద్రోహకరమైనవి గనుక, వారిని అసలే విడిచి పెటకూడదు"అన్నారు.

ఇంకొకరు, "హత్యానేరానికి గాక, ఇతర నేరాలకు ఖైదులో ఉంచబడినవారి సంఖ్య తక్కువగా ఉంది" అన్నారు.

అందుకు మరొక మంత్రి "హత్య చేసినవారు 'రాజకీయ వాదులు' కాబట్టి వదిలి పెడతామంటే, రాజకీయవాదులు కాకుండా హత్యచేసినవారు చేసిన పాపమేమిటి?" అని ప్రశ్నించారు.

ఇంతేకాక, హత్యచేసిన రాజకీయవాదులను ఖైదునుంచి విడుదల చేస్తే చిల్లర మల్లర నేరాలకు శిక్షింపబడిన వారంతా విడుదలకాక శిక్ష ననుభవిస్తూనే ఉండవలసి వస్తుంది.

అందుచేత, ఇంకొక మంత్రి అప్పుడు అందరినీ వదలిపెట్ట వలసి వస్తుందే అని తన మాటగా అన్నారు.

అంతవరకు మాట్లాడకుండా ఉన్న ప్రకాశంగారు, కన్నులు తెరిచి, అందరివైపు చూసి-

"అందరినీ వదిలేస్తే తప్పేమిటి?" అన్నారు.

చర్చ ఫలితంగా వచ్చిన సిద్ధాంత వాక్యం తర్క సమ్మత మైనదే; కానీ, వాదించిన వారి కందరికీ అది అత్యాశ్చర్యకరంగా తోచింది. వారి వాదాలు సవరించుకో నారంభించారు.

ప్రకాశంగారు, "బాగా ఆలోచించండి. సభ వాయిదా వేద్దాము" అని, సభ వాయిదా వేసేశారు.

అప్పటికే మూడుగంటలు కూచున్నాము.

మరునాడు, తిరిగి కాబినెట్ సమావేశ మయ్యేసరికి ఏడుగురు మంత్రులలో ఐదుగురు ప్రకాశంగారితో ఏకీభవించారు.

కాని, ప్రకాశంగారు అటువంటి తీర్మానానికి బహుమతము (మెజారిటీ) చాలదనీ, సర్వ సభ్య అంగీకారము (యునానిమిటీ) కావాలనీ అన్నారు.

మంత్రులు, ముఖ్య కార్యదర్శి ముందు వెనుకలు కొంతసేపు గదిలో, కొంతసేపు వెలుపల ఆలోచిస్తూ దాదాపు రెండుగంటలు కాలయాపనం చేయగా, ప్రకాశంగారు తిరిగి సమావేశం మర్నాటికి వాయిదా వేశారు.

మర్నాడు కలుసుకొనేసరికి, ఏడుగురు మంత్రులు ఏకీభావం లోకి వచ్చారు.

ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి కూడా- సంతృప్తి, అసంతృప్తుల మధ్య డోలాయమాన మానసుడై, ఆ ఖైదీలలో కేంద్ర ప్రభుత్వ ఖైదీలుగా ఉన్న కొందరిని కేంద్రం అనుమతిలేక విడిచిపెట్టే వీలు లేదన్న అభ్యంతరం సూచించాడు.

ఆ మధ్య కాలంలోనే, నేను ఒకమారు జంకుతూ, "తుది నిర్ణయం తీసుకొనేముందు ప్రధాన మంత్రితో మీరు ఒకమారు ఈ విషయాలు మాట్లాడితే బాగుంటుందేమో!" అన్నాను ప్రకాశంగారితో.

అందుకు ఆయన వెంటనే, "ఇది మన బాధ్యత. మరొకరి సలహా తీసుకొనే పరిస్థితి వస్తే, ముందుగా రాజీనామా యిచ్చేయడం మంచిది," అన్నారు.

ఆ మాటతో, నేను సంవిధాన సూక్ష్మతను గ్రహించి, నేను చెప్పిన మాటలు మరెవరూ వినకుండా నేనే ముందడుగు వేయడం మంచిదని ప్రధాన కార్యదర్శితో, "ఆంధ్రరాష్ట్ర అవతరణ సందర్భంగా ప్రభుత్వంవారు కారాగారవాసు లందరినీ విడుదల చేయడానికి నిశ్చయించారు—అని తీర్మానం వ్రాయండి" అన్నాను.

రాజకీయాలతో ప్రసక్తి లేకుండా ఆ విధంగా, దేశ చరిత్రలో ఎన్నడూ జరగని మోస్తరుగా, సర్వ కారాగృహవాసులకు విముక్తి కలిగించాము.

ఆ క్షణాన కోర్టులలో విచారింపబడుతున్న వారిని కూడా విముక్తులను చేయడం జరిగింది.

ఆ తరువాత 48 గంటలకు కారాగృహ శిక్ష పొందిన ఖైదీ లెవ్వరూ ఆంధ్రరాష్ట్ర కారాగారాలలో లేరు.

అయితే, తల్చుకుంటే ఇప్పటికీ గుండె దడదడలాడే ఒక దుస్సంఘటన జరిగింది.

కాబినెట్‌లో మేము చేసిన తీర్మానం తంతి వార్తలద్వారా అన్ని జైళ్ళకు పంపించుంటే ఆ దురంతం జరిగిఉండేది కాదు.

మర్నాడు ఉదయమే ఉరిశిక్షకు పాత్రుడయిన ఒక ఖైదీ విశాఖ పట్నం జైలులో ఉండెను. అక్కడి జైలరుకు ప్రభుత్వ తీర్మానం అందకపోవడంవల్ల, తన డ్యూటీ ప్రకారం అతడా శిక్షను అమలు పరిచాడు.

ఘోరము జరిగింది. కాని ఎవరమూ ఏమీ చేయలేకపోయాము.

ఈ సర్వకారగారవాసుల విముక్తి విషయం బయటపడేసరికి చాలామంది సంతోషించారు. కొందరు విభ్రాంతు లయారు.

భారతదేశం స్వాతంత్ర్యం పొందినప్పుడు, నెహ్రూగారుకూడా ఇంత సాహసకార్యం చేయలేదని- స్వాతంత్ర్య వాదు లనేకులు ప్రకాశంగారిని ప్రశంసించారు.

వ్యక్తిగతంగా, ప్రకాశంగారికి వ్యతిరేకులు కొందరున్న విష యము అందరికీ తెలిసిందే.

ఇలా ఉండగా, నెల్లూరిలో బెజవాడ గోపాలరెడ్డిగారి మామగారి యింట్లో దొంగలు పడి, బంగారపు వస్తువులను దొంగిలించారన్న వార్త పత్రికలలో పడింది.

వెంటనే ఈ దొంగలు, ప్రకాశంగారివల్ల విడువబడ్డవారేనని నిశ్చయించి, ప్రకాశంగారు చేసినంత తెలివితక్కువ పని ఎవరూ చేయ రని ఆయన వ్యతిరేకులు వాదించారు.

గవర్నరు నన్ను పిలిచి, 'చూశావా ఈ వార్త' అని ముదర కించారు.

వెంటనే, మేము ప్రభుత్వపక్షాన దర్యాప్తు జరిపించగా,ఆ దొంగ తనము చేసినవారు "ఫస్ట్ అఫెండర్స్," (అనగా అప్పుడే మొదటి నేరము చేసినవారు)గా తెలియవచ్చింది.

ఆ తర్వాత ఈ పై విధంగా విముక్తి పొందిన వారెవరూ తిరిగి నేరాలు చేశారన్న రిపోర్టులు ప్రభుత్వానికి రాలేదు. పత్రికలలోనూ అటువంటి వార్తలు పడలేదు.

అయితే, ఈ విషయానికి సంబంధించిన ఒక ముచ్చట చెప్తాను.

భాషారాష్ట్రాలు ఏర్పాటు చేసిన సందర్భంలో, ప్రకాశంగారు

చేసినట్టు అన్ని రాష్ట్రాలలోని ఖైదీలను ఆయా రాష్ట్రాల ముఖ్య మంత్రులు విడుదల చేయవలసిందన్న సూచన ఎవరో లోక్ సభలో తీసుకువచ్చారు.

కర్నూలు కాబినెట్‌లో ఈ విముక్తి విషయమై జరిగిన దీర్ఘ చర్చల విషయం నెహ్రూగారికి తెలిసిఉండదు. తెలుసుకొనేందుకు యత్నించి కూడా ఉండరాయన. ఆయన తత్వ మటువంటిది.

లోక్ సభలో ఆయన ఇలా అన్నారు: "ప్రకాశంగారు అకస్మాత్తుగా రాత్రికిరాత్రే ఒక ఆలోచన తెచ్చుకొని అలాంటి పనిచేశారు. అలాంటిది మనమంతా ఎలా చేస్తాము?"

## నీటిపారుదల ప్రాజెక్టులు.

ప్రత్యేకాంధ్రరాష్ట్రం కావాలని కోరినపుడు చాలామంది మనసులలో సువ్యక్తమయిన ఒక కారణముండేది. అది- ఆంధ్రప్రాంతాలలో నీటిపారుదల ప్రాజెక్టుల విషయమై ఉమ్మడి ప్రభుత్వం శ్రద్ధ తీసుకోలేదని

ఉదాహరణకు, అప్పటికి నాలుగు సంవత్సరాల ముందునుంచీ ప్రభుత్వపు కాగితాలలో ఆలోచనలో ఉన్నట్టు కనిపించిన 'వంశధార ప్రాజెక్టు' కాగితాలలోనే ఉండిపోయింది.

ఇంతేకాక, 1930 ప్రాంతాలలో చక్కగా పరిశీలించి, అన్ని విధములయిన వివరాలతో నివేదిక తయారై ఉన్నప్పటికీ కృష్ణానదిపై పులిచింతలవద్ద రిజర్వాయరు నిర్మాణం ప్రాజెక్టు ఆగిపోయింది.

అది అయిన కొంతకాలానికి, శాసన సభలో ఎవరో దాన్ని గురించి ప్రశ్నించగా, అపుడు అధికారంలో ఉన్న పి. పి. రామస్వామి అయ్యరుగారు చెప్పిన జవాబు ఇది: "నేను పదవి స్వీకరించేనాటికి నా చేతికి రెండు ప్రాజెక్టుల రిపోర్టులు వచ్చాయి. ఒకటి మెట్టూరు ప్రాజెక్టు (తంజావూరు జిల్లా). రెండు పులిచింతల ప్రాజెక్టు (కృష్ణా జిల్లా). ఈ రెండిట్లో ఏదో ఒకటి తీసుకోవాలి. రెండింటిని తీసుకోడానికి ప్రభుత్వం దగ్గర ధనము లేదు. కనుక రెండు స్కీములలో ఏదో ఒకటి తీసుకోవలసి ఉండగా, మెట్టూరు ప్రాజెక్టు తీసుకొంటిని."

ఆంధ్రప్రాంతంలో గల నీటిపారుదల ప్రాజెక్టులపై ఉమ్మడి ప్రభుత్వం దృష్టి ఆ విధంగా చులకనగా ఉండేది.

ఆంధ్రప్రభుత్వం ఏర్పడిన వెంటనే జిల్లాలలో గల శాసన సభ్యులనే గాక, ఇతర మిత్రులను కూడా పిలిచి 17 మధ్య తరగతి ప్రాజెక్టులు (మరీ హెచ్చుగా ఖర్చు కానివి) శాంక్షను చేయడము, [వీటిలో నాగావళి, వేగవతి, స్వర్ణముఖి (శ్రీకాకుళం జిల్లా), స్వర్ణముఖి (కాళహస్తి దగ్గర), గంభీరము గెడ్డ, పాలేరు, సగిలేరు, పెన్నారు, ఏలేరు నదులపై కట్టవలసినవి ఉన్నాయి.] అప్పటి లెక్కలలో 6½ కోట్ల రూపాయలు ఖర్చు పెట్టి, అదనంగా లక్షా యాభై వేల ఎకరాల భూమి సాగులోకి తీసుకురావడానికి ఏర్పాట్లు జరిగాయి.

ఇదికాక, పులిచింతల ప్రాజెక్టు వదులుకొని, హైదరాబాదు ప్రభుత్వంతో కలిసి, పులిచింతలకు ఎగువగా నందికొండవద్ద మొత్తం పైన 30 లక్షల ఎకరాలు సాగులోకి తెచ్చే స్కీము, జాయంటు నివేదిక తయారుచేసి, ఆంధ్రప్రభుత్వం తరపున నేను, సంజీవరెడ్డిగారు, హైదరాబాదు ప్రభుత్వం తరపున డాక్టర్ మేల్కోటే (మంత్రి) ముగ్గురమూ స్వయంగా వెళ్ళి, కేంద్ర నీటిపారుదల మంత్రి అయిన నందాగారికి అందజేశాము.

ఈ స్కీము విషయమై వేరే తిరిగి వ్రాస్తాను.

# 20

## ప్రకాశం బారేజ్

మనము ఉమ్మడి రాష్ట్రంలో ఉన్న సమయంలోనే, విజయవాడ దగ్గర—కృష్ణా ఆనకట్ట కుడిఒడ్డుకు కొంచెం దగ్గరగా కొంత భాగం అకస్మాత్తుగా జారిపోయింది. అప్పటికే ఆ ఆనకట్ట కట్టి వంద ఏండ్లకుపైగా అయింది. దానిక్రింద 11 లక్షల ఎకరాల వరిపంట ఉంది. భారతదేశంలోని ప్రాజెక్టులలో ఇది ఒక పెద్ద ప్రాజెక్టు.

ఆనకట్టకు దెబ్బతగిలినదని సగము రాత్రివేళ తెలిసి, అక్కడ

ముఖ్య ఇంజనీరుగా ఉన్న వేపా కృష్ణమూర్తిగారు, మరి కొందరు సిబ్బందితో — ఇసుకతో నింపిన బస్తాలుతోను, నావలతోను, గండిపడినచోట అడ్డువేయడానికి యత్నించారు. ఆ యత్నంలోనే ఆయన, మరి ఇద్దరు చిన్న ఉద్యోగులు, కొందరు కళాసీలు — నదీవేగానికి ఆగలేక ప్రాణా లర్పించి, ఆంధ్రుల నందరినీ కన్నీటముంచిన దుస్సంఘటన సంభవించింది.

పాత ఆనకట్ట పనికిరాదనీ, క్రొత్త బారేజ్ (ఇప్పుడు ఉన్నదే) నిర్మాణం కావాలని, ఢిల్లీ నుంచి వచ్చిన నిపుణులు ఇచ్చిన సలహాపైని, బారేజ్ నిర్మాణానికి రాతకోతలు జరిగాయి. కాని, పనికి శాంక్షను రాలేదు.

ఆంధ్రులకున్న తొందర, చెన్నరాష్ట్ర ప్రభుత్వానికి లేక పోయింది. అటువంటి దుస్థితిలో ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది.

ఉత్తరాలతో, తంతివార్తలతో పనికాకపోవడం చేత, నేను ప్రకాశంగారి నడిగి ఢిల్లీ వెళ్ళాను. అక్కడ నెహూృగారిని సందర్శించగా, నన్ను ఆయన ప్లానింగ్ కమీషన్ వైస్ ప్రెసిడెంటు అయిన వి. టి. కృష్ణమాచారిగారిని చూడమన్నారు. ఆ కృష్ణమాచారిగారంటే నెహ్రూగారికి చాలా విశ్వాసము. ఆయన బ్రిటిషుగవర్నమెంటుకాలంలో బిరుదులు సంపాదించిన వ్యక్తి. 1937 లో కాంగ్రెసువారు గెలిచి ప్రభుత్వం ఏర్పాటుచేస్తారనేవి తథ్యమయినపుడు, బ్రిటిషు గవర్నమెంటులోని పెద్ద ఉద్యోగులతో తాను కాంగ్రెసువారి క్రింద పనిచేయలేనని చెప్పి, కొంచెం ముందుగానే ఒక స్వదేశ సంస్థానానికి దివానుగా వెళ్ళిపోయారు. అక్కడినుంచి యుద్ధకాలంలో మెట్టుపై మెట్టుగా ఎక్కి, యుద్ధానంతరం బ్రిటిష్‌వారికి అనువైన యుద్ధానంతర పునర్నిర్మాణ కార్యక్రమం (Post-war Re-contruction scheme), పెద్ద ఉద్యోగముల పునర్వ్యవస్థీకరణ (Services reform) గురించి నివేదికలు వ్రాయడం, మొదలయిన పనులు చేయడంలో, భాగం వహించి భారతదేశ స్వాతంత్ర్య ప్రాప్తినాటికి ప్రభుత్వదృష్టిలో ఉన్నతుడుగా ఉండేవారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ప్లానింగ్ కమీష

న్‌కు అధ్యక్షులయిన నెహూర్రిగారు కృష్ణమాచారిగారిని దాని ఉపాధ్య క్షులుగా నియమించారు.

కృష్ణమాచారిగారికి ఆంధ్రదేశానికి కొంత పూర్వపరిచయ ముంది. ఆయన విశాఖపట్నం జిల్లాలో విజయనగరం జమీందారీకి, డిప్యూటీ కలెక్టరు హోదాలో ఉండగానే ట్రస్టీ దివానుగా పనిచేశారు. కాబట్టి, విజయవాడ ఆనకట్ట మనదేశంలో వరిపంట కెంత ముఖ్యమై నదో తెలియనివారు కారు. అక్కడ జరిగిన దుస్సంఘటన సంగతీ తెలియనివారూ కారు. ప్రతిక్షణం జాగరణలో ప్రజలూ, ప్రభుత్వమూ ఆనకట్ట ఇంకేమి ప్రమాదానికి గురిఅవుతుందో అని గుండెలు చేత పట్టుకొని ఉన్న విషయమూ ఎరుగనివారు కారు.

ఇన్నీ తెలిసిన ఆయన—నేను వెళ్ళగానే కూచోబెట్టి, కాఫీ యిచ్చి, నేను చెప్పిన మాటలన్నీ యోగీంద్రునిలాగా తూష్ణీంభావంతో విని, "వీటన్నిటికీ డబ్బు ఎక్కడ ఉంది?" అని ప్రశ్నించారు.

నేను మరికొంతసేపు వాదించిన పిదప, "కరువు ప్రాంతాలకు కేటాయించిన మొత్తంతో ఆ బారేజ్‌కు అవసరమైన ఖర్చు పెట్టు కోండి. నేను అభ్యంతరం పెట్టను," అన్నారు.

ఇంతకు మేము అడిగింది అప్పు.

ఉమ్మడి రాష్ట్రంలో ఉండిఉండగా, పని చురుకుగా జరిగితే, ఉమ్మడి రాష్ట్రపు డబ్బే దీనికి ఖర్చు అయిఉండును.

మనము ఉమ్మడి రాష్ట్రంలో ఉన్న నాటికి, కృష్ణా ఆనకట్ట-దానిపై పెట్టిన ఖర్చులు, వడ్డీలు అన్నీ పోగా 12 కోట్ల రూపాయల రాబడికి చేకూర్చిన స్కీము.

రాష్ట్ర విభజన అప్పుడు, దీనికైన 2 కోట్ల, 20 లక్షల రూపా యలు ఆంధ్రరాష్ట్రం తీర్చుకోవలసిన అప్పుల పట్టీలో చేర్చారు. కానీ— ఖర్చులు, వడ్డీలు పోను వచ్చిన రాబడిని మనకు జమ చేయలేదు.

కృష్ణమాచారిగారు చెప్పిన విషయం ప్రకాశంగారికి చెప్పగానే ఆయన—దేశావసరములదృష్ట్యా, అసలు ఆనకట్ట పరిస్థితి దృష్ట్యా, ఒక క్షణం కూడా ఆలస్యం చేయడానికి వీలులేదనీ, కేంద్రప్రభుత్వం

వారు అప్పు ఇవ్వకపోతే, రాష్ట్రానికి గల ఇతర ఖర్చులైనా మానుకొని, పని వెంటనే ప్రారంభించవలసిందనీ ఇరిగేషన్ శాఖ చూస్తున్న సంజీవరెడ్డిగారితో చెప్పి, బారేజ్‌కు పునాదిరాయి వేయడానికి తేదీ, లగ్నము నిశ్చయించమని ఆదేశం ఇచ్చేశారు.

"డబ్బు విషయం తూగగలవా?" అని ఆర్థికమంత్రియైన నన్నడిగినప్పుడు, "దీనికి ఖర్చు మూడు కోట్లు. పని పూర్తి కావడానికి 2½ ఏండ్లు అవుతుంది. డబ్బు విషయమై ఇబ్బంది ఉండదు," అన్నాను నేను.

ఈ విధంగా, అంత పెద్ద మేజర్ ప్రాజెక్టుకు కావలసిన అత్యవసరమైన విషయాలలో కూడా, కేంద్రప్రభుత్వంవారు—తాము వద్దన్నా ఏర్పడిన ఆంధ్రరాష్ట్రం విషయంలో తూష్ణీంభావాన్ని ప్రకటిస్తూ వచ్చారు.

అయినప్పటికీ, మన అదృష్టంకొద్దీ కేంద్రంలో దేశ్‌ముఖ్‌గారు ఆర్థికమంత్రి అయిఉండడంవల్లా, ఆయనకు ఆంధ్రరాష్ట్రంపై ఆదరబుద్ధి ఉండడంవల్లా, ఆర్థికంగా మనము ఇబ్బందులలో పడకుండా సర్దుకొని వచ్చేవారు.

నందికొండ ప్రాజెక్టు విషయమై మరొక విషయం కూడా—ఎన్ని అవస్థలు పడవలసివచ్చిందో సూచించడానికి వ్రాస్తున్నాను.

తిరిగీ కృష్ణమాచారిగారిని చూడక తప్పింది కాదు. ఈ పర్యాయం నందికొండ ప్రాజెక్టు (తరువాత ఇదే నాగార్జున సాగర్) విషయమై వెళ్ళాను. ఆయనను ఇంటిదగ్గర చూడవలసివచ్చింది. ఈ విషయం ఎత్తగానే, "అయ్యా విశ్వనాథముగారూ! మీ ఆంధ్రులకు నేనంటే నమ్మకం లేదు" అని వాతావరణమంతా కలుషితం చేయబోయారాయన.

నేను, "నమ్మకం, అపనమ్మకంతో—ఏమైనా, వ్యక్తిగతమైన వ్యవహారాలకు రాలేదు గదా!" అని చెప్పి, నందికొండ ప్రాజెక్టు కాంక్షను అలస్యం చేయవద్దని చెప్పాను.

అయితే, ఆయన నా కేమీ అర్థం కాదన్న ఉద్దేశంతో, "రిజ ర్వాయరు డామ్ 425 అడుగుల ఎత్తువరకే నిర్మించడానికి నువ్వు ఒప్పుకుంటే, వెంటనే ఈ స్కీము శాంక్షన్ చేస్తా"నన్నారు.

అందుకు నేను ఒప్పుకోనన్న ఉద్దేశంతో ఆయన అలా అన్నారు. నేను వెంటనే, "సరే, ఒప్పుకొంటున్నాను లెండి" అన్నాను.

అందుకు కారణ ముంది. 425 అడుగులు కట్టకట్టితే, కాలువల లోకి ఒక నీటిచుక్క అయినా మళ్ళించలేము. కట్ట ఆ ఎత్తున ఆపి నట్టయితే ఆ స్కీము ఉట్టి దండగపని అవుతుంది. 425 అడుగులకు ఒప్పుకున్న తర్వాత, అంతవరకు చేసిన ఆ ఖర్చు పనికి రావడం కోసం మరొక 100 అడుగుల ఎత్తు కట్టకుండా ఏ ప్రభుత్వమూ పని ఆపదు గదా అనే ఉద్దేశంతో నేను సరేనన్నాను.

ఆయన అంతవరకు ఒప్పుకుంటే, మిగిలిన పని నెహ్రూగారితో చెప్పి సర్దుబాటు చేసుకోగలనని నా మనసులో ఉన్న విశ్వాసాన్ని గ్రహించక, కృష్ణమాచారిగారు, "నువ్వు ఒప్పుకుంటే, బొంబాయి గవర్నమెంటువారు ఒప్పుకోరు- నన్నేం చేయమంటావు?" అన్నారు.

ఆయన చెప్పిన మొదటి మాట ఎంత పేచీ మాటో- రెండవదీ అంతే పేచీ మాట.

నేను నెహ్రూగారి దగ్గరికి వెళ్ళి, స్కీము డిజైన్లు చూపించి, ఉన్న పరిస్థితి బోధపరిచాను.

ఆయన కది నచ్చినట్లే తోచింది. కానీ ఆయన వెంటనే "ఇది నాకు నచ్చితే ఏమి ప్రయోజనము? కృష్ణమాచారిగారు ఒప్పుకోవాలి గదా!" అన్నారు.

సరిలే! ఇది ఢిల్లీ ప్రభుత్వం పద్ధతి అనుకొని, ప్లానింగ్ కమీ షన్ సభ్యులూ, ఆర్థికమంత్రీ అయిన దేశ్‌ముఖ్‌గారి దగ్గరికి వెళ్ళాను. ఆయన వెంటనే, కృష్ణమాచారిగారు పెట్టిన అభ్యంతరం డబ్బుతోకానీ, సాంకేతికమైన విషయంతోకాని సంబంధంలేని మరొక విషయమని సూక్ష్మం గ్రహించి, ప్లానింగ్ కమీషనులో మరొక సభ్యులైన యోగి గారిని చూడమని నాతో చెప్పి, ఆయనకు టెలిఫోన్ చేశారు.

వారు ప్లానింగ్ కమీషన్‌లో ఈ విషయం సరిచేస్తామనీ, కృష్ణమాచారిగారి అడ్డు ఉండదనీ చెప్పినమీదట నేను కర్నూలు తిరిగి వచ్చేశాను.

మరికొన్ని రోజులకు ప్లానింగ్ కమీషన్ వైస్ ప్రెసిడెంట్ హోదాలో కృష్ణమాచారిగారినుంచి ముఖ్యమంత్రి ప్రకాశంగారికి ఒక ఉత్తరం వచ్చింది. అందులోని సారాంశ మిది: "కృష్ణానదిపై, ఏ మేజరు ప్రాజెక్టు కావాలో మీ రిదివరకు ప్లానింగ్ కమీషనుకు తెలియ జేయలేదు. కాబట్టి, మీ కేదైనా స్కీము ఉంటే, తొందరగా తెలియ జేయ వలసింది."

ఈ ఉత్తర మెంత అసందర్భమైనదో వేరే చెప్పనక్కరలేదు. కానీ, అది వచ్చేసరికి ఆంధ్రప్రభుత్వ పరిస్థితులు విషమస్థితిలోకి వచ్చే శాయి. పైన చెప్పిన వివరాలతో ఆయనకు జవాబు వ్రాశాము.

అంతట్లో ఆంధ్రప్రభుత్వం పతనమయింది.

తరువాత, పత్రికలలో—ప్రకాశంగారి (ఆంధ్ర) ప్రభుత్వం నందికొండ ప్రాజెక్టుపై ఇదమిత్థమని నిర్ణయం చేయలేదనీ, గవర్నరు త్రివేదిగారు తమకున్న పలుకుబడితో ప్లానింగ్ కమీషనువారిని కలుసుకొని స్కీము శాంక్షను చేసి తెచ్చుకొన్నట్లుగానూ వార్త పడింది.

గవర్నరు ప్రభుత్వం ముగిసిన తర్వాత, సంజీవ రెడ్డిగారు ముఖ్యమంత్రిగా ఉండగా, నెహ్రూగారు స్వయంగా వచ్చి— ఆ ప్రాంతంలోనే నాగార్జునుడనే ప్రపంచ విఖ్యాత బౌద్ధ విద్వాంసుడూ, రసాయన శాస్త్రవేత్తా తపస్సు చేసిన పవిత్ర పర్వతం ఉండడంవల్ల ఆయన పేరిట, మొదట అనుకొన్న 525 అడుగుల ఎత్తుతో, శాంక్షను అయిన జలాశయానికి పునాదులు వేశారు.

## ఆంధ్ర హైకోర్టు వ్యవహారం*

మన సంవిధానం ప్రకారంగా—ఏ రాష్ట్రమైనా హైకోర్టు ఏర్పాటు చేసుకోకుండా ఉంటే, ఆ ప్రక్క రాష్ట్రం హైకోర్టుకు క్షేత్రాధి

* ఈ అధ్యాయంలో కొటేషన్ మార్కులలో ఉంచిన మాటలు, అసలు మాట్లాడిన మాటలకు సారాంశము.

కారం (జ్యూరిస్డిక్షన్) అప్పుడెప్పే ఏర్పాటు చేసుకోవచ్చునని ఉంది. ఆ కారణంచేతనే, ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు, వేరే హైకోర్టు ఏర్పాటు చేసుకోకుండా, మద్రాసు హైకోర్టుకే మన రాష్ట్రంపై క్షేత్రాధికారం ఇవ్వడం జరిగింది.

ఇటువంటి పరిస్థితులలో, హైకోర్టు జడ్జీలను నియమించే సమయంలో, క్షేత్రాధికారం ఇచ్చిన రాష్ట్ర ప్రభుత్వపు ఉద్దేశాలను గూడా గమనించవలసిందని, "వాంఛూ" అనే చీఫ్ జస్టిసుగారు వ్రాసిన నివేదిక కాపీ చెన్నరాష్ట్ర ప్రభుత్వందగ్గర ఉంది.

కాని, ఆంధ్ర ప్రభుత్వంతో ప్రమేయం లేకుండానే మద్రాసు హైకోర్టుకు జడ్జీలను నియమించడం జరిగింది. ఇది ఆంధ్ర రాష్ట్ర మేర్పడిన మూడు నెలలలోగానే జరిగింది.

నేను, ప్రకాశంగారితో చెప్పి, ఈ విషయంలో చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రి రాజాజీని కలుసుకొని మాట్లాడడానికి వెళ్ళాను. ఆయన చాలా ఆప్యాయంగా మాట్లాడారు.

కాని, తమ హైకోర్టు జడ్జీల నియామకంలో బాధ్యత—పరాయి ప్రభుత్వంతో పంచుకోవడం ఎల్లా? అని ప్రశ్నించి, అటుపై జరిగే జడ్జీల నియామకంలో కూడా ఆంధ్ర ప్రభుత్వానికి సంబంధం ఉండదన్నట్టు మాట్లాడారు.

దానిపై, నేను ఢిల్లీ వెళ్ళి, కేంద్ర హోమ్ మంత్రి కట్జూ గారిని చూశారు. ఆయనతో నాకు చాలా కాలంగా పరిచయముంది. 1928 లో లక్నోలో అఖిల పక్ష సమావేశంలో నెహ్రూగారి రిపోర్టును చర్చిస్తున్నపుడు, ఆయన- నేను నెహ్రూగారి బలపరచినప్పటినుంచి మా యిద్దరికీ బాగా పరిచయముండేది.

ఆయనను నే నిలా అడిగాను: "మద్రాసు హైకోర్టు జడ్జీలను నియమించినపుడు, ఆంధ్ర ప్రభుత్వాన్ని సలహా అడగాలని మీ కెందుకు తోచలేదు?"

"నిజమే. అడగవలసిందే కానీ, నాకు తోచలేదు" అని, ఆ సమయంలో దగ్గరగా ఉన్న హోమ్‌శాఖ కార్యదర్శి ఎ. వి. పాయ్‌గారిని

చూసి, "ఏమి పాయ్‌గారూ! మీకూ ఈ విషయం తోచలేదా?" అని ప్రశ్నించారాయన.

పాయ్‌గారు తమకూ తోచలేదన్నారు.

దానిపైన, కొంత ఇష్టాగోష్ఠిగా మాట్లాడుకున్నాము. అందులో, ఆంధ్రరాష్ట్రం వేరే హైకోర్టు పెట్టుకోవడం ఉత్తమమని తేలింది.

కర్నూలుకు తిరిగి వచ్చిన తర్వాత ప్రకాశంగారి కీ విషయమంతా చెప్పాను. ఇంతేకాక, చెన్నపట్నంలో వృత్తి నడుపుకొంటున్న తెలుగు న్యాయవాదులకు కూడా పరిస్థితులన్నీ వివరంగా బోధపరచి, మన హైకోర్టు మనకు వేరే ఉండడమే శ్రేయస్కరమని నచ్చజెప్పాను.

అందుచేత, ఆంధ్రరాష్ట్రం ఏర్పడేటప్పుడు అనంగీకారము సూచించినవారు, మనకు ప్రత్యేకంగా ఉన్నత న్యాయస్థాన స్థాపనకు సుముఖత చూపించారు. దీనివల్ల దాదాపు 200 మందికి పైగా ఆంధ్ర న్యాయవాదులు శాశ్వతంగా చెన్నపట్నంలో ఇళ్ళు, వాకిళ్ళు, తక్కిన సంబంధాలు అన్నీ వదులుకుని పోవలసి వస్తుంది.

అయినా వారూ, నేనూ కూడా విశాలాంధ్ర వచ్చేవరకు తాత్కాలికంగా హైకోర్టు విశాఖపట్నంలో ఉంటే బాగుంటుందను కున్నాము.

ప్రకాశంగారు ఈ విషయమై శాసన సభలో ప్రతిపాదించారు. 22-6-1954 న ఆంధ్రా హైకోర్టు స్థాపించాలనీ, దానికి విశాఖపట్నం కేంద్రమనీ తీర్మానం ప్రతిపాదించారు.

విశాఖపట్నం విషయంలో- నా సంబంధంగా ఏది వచ్చినా, కాదనడానికి విశాఖపట్నం జిల్లానుంచి వచ్చిన ఒకరిద్దరు శాసన సభ్యులుండేవారు. వారి సాయంతో నడింపల్లి నరసింహారావుగారు విశాఖపట్నం అనే మాటముందు తాత్కాలికంగా అన్నమాట సవరణ చేశారు. నా మనసులో ఉన్నది కూడా అంతేకాబట్టి, వెంటనే లేచి ఆ సవరణ ఒప్పుకున్నాను.

తిరిగి 1-3-54 న, విశాఖపట్నం అనే మాటకు బదులు గుంటూరు అన్నమాట చేర్చవలసిందని సవరణ ప్రతిపాదించారు.

విశాఖపట్నం జిల్లానుంచి వచ్చిన వారే ఒకరిద్దరు గుంటూరు అన్న సవరణకు కూడా ఒప్పుకున్నారు. వోటింగులో గుంటూరుకు అనుకూలంగా 67 వోట్లు, ప్రతికూలంగా 66 వోట్లు రావడంచేత, గుంటూరు అనే మాటతో తీర్మానం పాసయింది.

మళ్ళీ నరసింహారావుగారు, తాత్కాలికం అన్నమాట తీసివేయాలని సవరణ చేయడానికి ప్రయత్నించి విఫలులైనారు.

తీర్మానం పాసు కాగానే నేను ప్రతిపాదించిన విశాఖపట్నం పేరు వీగిపోవడంచేత, నేను రాజీనామా ఇస్తానా అని ఒక రిద్దరు ప్రతిపక్షులు ప్రశ్నించారు.

నేను ఈ తీర్మానంలో ప్రధానమైన అంశం ఆంధ్ర రాష్ట్రానికి హైకోర్టు ఏర్పాటు చేయడమనీ, అది సభవారు అంగీకరించారనీ, కేంద్రం అన్నది తాత్కాలికం గనుక అప్రధానమనీ చెప్పి, నేను రాజీనామా యివ్వక పోవడమేగాకుండా, గుంటూరులో హైకోర్టు ఏర్పాటుకు అవసరమైన 8 లక్షల రూపాయలు ప్రభుత్వం మంజూరు చేస్తున్నదని వెంటనే వెల్లడించాను.

అయితే- ప్రకాశంగారూ, నేనూ అనుకోనటువంటి కొన్ని భేదాభిప్రాయాలు మంత్రి మండలిలో కొందరినీ, సచివాలయంలో కొందరినీ బాధించినవి.

ఆ రోజునుంచి, మిగిలిన విభజన కార్యక్రమం నడిపించడానికి కేంద్ర ప్రభుత్వం వారొక ప్రత్యేక ఉద్యోగిని, ఏర్పాటు చేయవలసి ఉంటుంది. అటువంటి ప్రత్యేకోద్యోగి ఆ హైకోర్టు స్థాపించిన తరువాత ప్రధాన న్యాయమూర్తిగా నియుక్తుడయే అవకాశమున్నది.

ఆంధ్రా హైకోర్టుకు వచ్చే తెలుగు జడ్జీలలో అందరికన్నా సీనియరయిన వారిపైన సచివాలయంలో ఎవరి మూలంగానో ఏ తత్వాన్ని అనుసరించో ఒక ప్రతికూలత పుట్టింది. అది నేను కానీ, ప్రకాశంగారుకానీ గ్రహించలేక పోయాము.

హైకోర్టు ప్రత్యేకంగా స్థాపించాలన్న తీర్మానం కాబినెట్ మంత్రులందరూ ఏకగ్రీవంగా ఒప్పుకొన్నది కావడంచేత సచివా

లయంలో కాగితాలు కదలడంలో జాప్యమవుతుందని గ్రహించలేక పోయాము. ఆ కారణంచేత- నేను గానీ, ప్రకాశంగారు కానీ కాగితాలు తొందరగా కదులుతున్నాయో లేదో కనుక్కోవడం తటస్థించలేదు.

ఇతర కారణాలవల్ల కూడా, ప్రభుత్వ వర్గాలలో వ్యక్తుల ఉద్యోగాల విషయమై మనస్పర్థలు పెరగడమెలా అలవాటో ఆ విధంగానే ఆంధ్ర ప్రభుత్వంలో ప్రకాశంగారు, సంజీవరెడ్డిగారల మధ్య వైమనస్యం పెరగడం జరిగింది.

ఇంతట్లో వేసవికాలం వచ్చింది. శాసన సభ సమావేశం వాల్తేరులో ఏర్పాటు చేశాము.

ఆ శాసన సభలో చర్చించిన ముఖ్యమైన శాసనము- శ్రీ వేంకటేశ్వర యూనివర్సిటీ శాసనము.

దీనిపై దాదాపు 19 రోజులపాటు చర్చలు జరిగిన తర్వాత సభవారు ఆమోదముద్ర వేశారు.

ఇదికాక, మిగిలిన సేల్సుటాక్సు (అమ్మకం పన్ను) బిల్లుల సవరణలు, ధర్మాదాయ మత సంస్థల సవరణ బిల్లు, వాచక పుస్తకాలను జాతీయం చేయడం మొదలైన వాటితో మంత్రి మండలి కాలం సరిపోయేది.

ఒక పర్యాయం, నేను ఈ హైకోర్టు విషమై ప్రకాశంగారితో గట్టిగా చెప్పడం తటస్థించింది:

"తీర్మానం ఆమోదించి అప్పటికే మూడు నెలలపైగా అయింది. మనము వెంటనే కేంద్ర ప్రభుత్వానికి వ్రాయకపోయినట్లయితే— ప్రత్యేక ఉద్యోగి నియామకం; రికార్డులు, లైబ్రరీ మొదలైన వాటిని విభజించే కార్యక్రమం ఆరంభం కాకుంటే, జూలై మొదటి వారంలో హైకోర్టు స్థాపించడం కష్టము. అది జరగక పోయినట్లయితే, ఇంత ప్రయత్నంచేసిన మనసు చూసి నలుగురు నవ్వుతారు."

ప్రకాశంగారు ముఖ్య కార్యదర్శిని పిలిచి, ఒక రాత్రి కాబినెట్ మీటింగ్ ఏర్పరచారు. ఆ సమయంలో, ఇదివరకు రెండు, మూడు పర్యాయాలు జరిగినట్లే అందరు మంత్రులూ నిశ్శబ్దంగా కూచున్నారు.

నేను, ఆలస్యమయితే లాభంలేదని, అందులో ఎవరో ఒక మంత్రిని పేరుపెట్టి పిలిచి, ఇలా అన్నాను:

"ఫలానా తేదీనాడు మనం హైకోర్టు ప్రారంభించక తప్పదు. గుంటూరులో కావలసిన ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నాయి. మనం స్పెషల్ ఆఫీసర్‌ను నియమించవలసిందని, కేంద్ర హోంశాఖామంత్రి కట్జూగారికి వ్రాయాలి. ఆలస్యంచేస్తే, మనము వేసవి సెలవుల అనంతరం అనుకున్న తేదీకి కోర్టు ప్రారంభించకపోతే బాగుండదు."

మళ్ళీ అందరూ నిశ్శబ్దంగా ఊరుకున్నారు.

అందులో ఒకరు మెల్లిగా, "ఆ స్పెషల్ ఆఫీసర్ ఎవరు కాగలరు?" అని ఏదో ఇబ్బంది ఉన్న భావంతో ప్రశ్నించారు

నేను, "న్యాయమూర్తి కె. సుబ్బారావు" అన్నాను.

ప్రకాశంగారు, "అవును. అనుమానం ఏమిటి?" అన్నారు.

మంత్రులలో ఒకరు, "అయితే ఇబ్బంది ఏమీలేదు" అని వారి మనసులో బాధ వదిలిపోయినట్టుగా ప్రక్కనున్న మంత్రి మిత్రులతో అన్నారు.

వెంటనే చీకటి అంతా వెలుగై ప్రకాశించింది.

ముఖ్య కార్యదర్శిని తీర్మానం వ్రాయుమని, విషయం చెప్పాను. సుబ్బారావుగారిని స్పెషల్ ఆఫీసర్‌గా వేయమనీ, 5-7-1954 న హైకోర్టు ప్రారంభమవుతుందనీ అందులో వ్రాయించాము

దీని తర్వాత జరుగవలసిన కార్యక్రమం, ఆంధ్ర సచివాలయానికి సంబంధించినంత మట్టుకు చురుకుగానే జరిగింది.

చెన్నపట్నంలో, 1953 సెప్టంబరులో- సచివాలయ విభజన సందర్భంగా జరిగిన చరిత్ర తిరిగి హైకోర్టు విభజన సందర్భంలో జరగ నారంభించింది.

చెన్నపట్నం హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి రాజమన్నారుగారు, మనం చెప్పుకున్న సుబ్బారావుగారికి బావమరదులే. అయినా, ఇక్కడకూడా ఉద్యోగుల కేటాయింపులో ఊగులాటలు, గ్రంథాలయ

విభజనల్లో, పుస్తకాలు ఒకరి చేతిలోనుంచి మరొకరు లాగుకోవడాలు కూడా జరగవలసి వచ్చిందట.

ఏదోవిధంగా విభజన కార్యక్రమం చురుకుగానే నడిచింది. మనము కోరినట్లు కేంద్రప్రభుత్వం సుబ్బారావుగారిని స్పెషల్ ఆఫీసరుగా నియమించింది. నేను అంతకుముందుగానే గుంటూరుకు పోయి, అక్కడి కలెక్టరు ఆఫీసు వేరే భవనంలోకి తరలించి, కలెక్టరు ఆఫీసులో కావలసిన మార్పులు, చేర్పులు చేయడానికి బిల్డింగ్స్ చీఫ్ ఇంజనీరును నియమించడం జరిగింది. భవనంలో చేసే ఏర్పాటులు, కట్టడములు, ఏయే గదులు ఏయే పనులకోసం కేటాయించవలసింది మొదలైన విషయాలలో స్పెషల్ ఆఫీసరుగారి ఆదేశాలప్రకారం నడుచుకోవలసిందని చీఫ్ ఇంజనీరుగారిని ప్రభుత్వం ఆదేశించింది.

ఇది ఇలా ఉంటుండగా, తెరవెనక మరొక ముచ్చట జరిగింది. అప్పటికి అమలులో ఉన్న కేంద్రప్రభుత్వ హోమ్‌శాఖ ఆదేశాన్ని అనుసరించి- ఆంధ్రప్రభుత్వం సుబ్బారావుగారిని ప్రధాన న్యాయమూర్తిగా నియుక్తం చేయవలసిందనీ, మరో ఇద్దరి జడ్జీల పేర్లతో సహా, గవర్నరు సలహాతోబాటు కేంద్రప్రభుత్వానికి పంపింది.

ఇక్కడనుంచి, ఈ వ్యవహారంగురించి నేను వ్రాయబోయేది- హైకోర్టు సంస్థాపన తర్వాత, రాష్ట్రపతి రాజన్‌బాబుగారిని కలుసుకొన్నప్పుడు, వారు చెప్పిన విషయాలను బట్టి వ్రాస్తున్నాను.

సుప్రీంకోర్టు ముఖ్య న్యాయాధిపతికి వేరే భావాలు ఉండడంచేత కాబోలు, ఆయన రాష్ట్రపతికి ఈ విషయమై సిఫారసు చేయలేదు. అదివరలో అటువంటి ఆలస్యాలు జరుగలేదు

హోం మంత్రి కట్జూగారిని కనుక్కుందామంటే, ఆయన ఢిల్లీ వదిలి, ఒరిస్సాలో పర్యటించడానికి వెళ్ళారు. ఆయన అక్కడినుంచి అటే 5-7-54 న గుంటూరుకు వచ్చేటట్టు తీర్మానింపబడడంచేత ఆయనను కనుక్కునే అవకాశమే లేకపోయింది.

సుప్రీంకోర్టు రిజిస్ట్రారును అడిగితే, ముఖ్య న్యాయమూర్తి

దీనికి సంబంధించిన కాగితాలు తమదగ్గరే ఉంచుకొని, ఏదో చల్లటి స్థలానికి వెళ్ళిపోయారని- తమకు తెలిసిన భోగట్టా చెప్పారు.

ఆ చల్లటి స్థలంనుంచి ఆయన సిఫారసు పంపిస్తారో, పంపించరో అన్న అనుమానం కలిగి, రాష్ట్రపతిగారు ఆ ఫైలుమీద తమ ఆజ్ఞ వ్రాశారు. దాని సారాంశ మిది:

"ఆంధ్రా హైకోర్టు ప్రారంభ దినం 5-7-1954. అందుకు నేటికి నాలుగు రోజులే వ్యవధి ఉంది. సుప్రీంకోర్టు ముఖ్య న్యాయమూర్తి సిఫారసు ఇంకా అందలేదు. అయినా, ఆంధ్ర ముఖ్యమంత్రి, గవర్నరు ఇద్దరూ ప్రస్తుతం స్పెషల్ ఆఫీసరుగా పనిచేస్తున్న మద్రాసు హైకోర్టు జడ్జి కోకా సుబ్బారావుగారి పేరే సూచించారు. అందుచేత, కోకా సుబ్బారావుగారిని 1954 జూలై 5 నుంచి, ఆ రోజున ప్రారంభ మవుతున్న ఆంధ్రరాష్ట్ర ఉన్నత న్యాయస్థానానికి ముఖ్య న్యాయమూర్తిగాను, తక్కిన ఇద్దరిని జడ్జీలుగాను నియమించడమైనది."

దీనిని, మామూలు పద్ధతిగా- రాష్ట్రపతి జారీచేసే ఆదేశాల ఇతర లాంఛనాలతో, కావలసిన ఇతర ఉద్యోగులు సంతకాలతో జారీచేసిన ఆదేశాన్ని 4-7-54 నాటికే గుంటూరులో ఆంధ్రప్రభుత్వానికి స్వయంగా ఇవ్వడానికి ఒక ప్రత్యేక ఉద్యోగిని పంపించారు.

గుంటూరులో, ఈ ఆదేశం అందగానే అంతదాకా ప్రభుత్వాని కున్న ఆందోళన నివారణ మయింది.

ఇక్కడినుంచి ఆ తర్వాత గుంటూరులో జరిగిన విషయాలు వివరిస్తాను.

మర్నాడు ఉదయం, 3, 4 వందల న్యాయవాదుల సమక్షంలో ప్రత్యేకంగా ఏర్పాటు చేసిన సభామందిరంలో, ప్రకాశంగారు- ప్రారంభోపన్యాసం చేయడానికి కట్జూగారిని ఉచితమైన వాక్యాలతో ఆహ్వానించారు.

కట్జూగారి ప్రారంభోపన్యాసము, మిగిలిన సంప్రదాయాను సారమైన ఉపన్యాసాలు జరిగిన ఉత్తరక్షణంలో, ముఖ్య న్యాయమూర్తి

కోకా సుబ్బారావుగారు తమ న్యాయస్థానంలోకి చురుకుగా నడిచి వెళ్ళిపోయారు.

మేము భవనం వదలి తిరిగిపోతూన్న సమయంలో, కారులో, కట్జూగారు నాతో అన్నారు: "ఏమి విశ్వనాథము! మీ ప్రధాన న్యాయమూర్తి మాటవరసకైనా ఓ మారు కోర్టు భవనంలోకి రావలసిందని నన్నుగాని, నిన్నుగానీ, చివరికి మనందరికీ పెద్ద అయిన ప్రకాశం గారినిగాని పిలవలే దేమయ్యా?"

ఆయన అది అడగడానికి ముందు నా మనసులో నేనూ అదే అనుకున్నాను.

'న్యాయమూర్తుల పంథాలు ఇలా ఉంటాయి కాబోలు' అని మాలో మేము అనుకున్నాము. కోర్టు భవనాలలోకి వెళ్ళకుండానే మా బసలకు వెళ్ళిపోయాము. చిరకాల వాంఛితమైన ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ప్రధాన న్యాయస్థానము, ఆ రోజు స్థాపన జరిగిన సంతృప్తిలో మాకు మరేమీ కనిపించలేదు.

# 21

# శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము

**1946 లో,** ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు, తిరుపతి దేవస్థానం సాయంతో తిరుపతిలో విశ్వవిద్యాలయం స్థాపించడానికి ఒక బిల్లు తయారు చేశారు. అప్పట్లో కె. కోటిరెడ్డి గారు దేవాదాయ, ధర్మాదాయ శాఖ మంత్రిగా ఉండేవారు. తిరుపతి దేవస్థానం వారు 10 లక్షల మూలధనం ఇవ్వడానికి అంగీకరించారు. కాని, బిల్లు తయారయేసరికి, మంత్రివర్గం పతనమయే స్థితిలో ఉంది. శాసన ముసాయిదా, ప్రకాశంగారి మంత్రివర్గంమీద విశ్వాసరాహిత్య తీర్మానం వచ్చిన తర్వాత అందింది.

1953 లో ముఖ్యమంత్రికాగానే, ప్రకాశంగారే దాన్ని మళ్ళీ

పునరుద్ధరించారు. అప్పటి మంత్రివర్గంలోని ఏడుగురు మంత్రుల లోను, నలుగురు రాయలసీమకు చెందినవారే. అందుచేత, వారు దీన్ని సంతోషంగా అంగీకరించారు. ఇక మిగిలినవారిలో విద్యాశాఖ మంత్రి పట్టాభిరామారావుగారు ఒకరు. ఆయన రాజాజీ మంత్రివర్గంలో కూడా మంత్రిగా ఉండేవారు. అందుచేత, కొంత నిదానం అలవాటు చేసుకొన్నవారు.

ఆయన- అప్పటి కప్పుడే- రాధాకృష్ణన్ కమిటీ, క్రొత్త విశ్వవిద్యాలయాలను స్థాపించడానికి తొందరపడగూడదని చేసిన సిఫారసును, ఒక అభ్యంతరంగా చూపారు.

నా వాదం ఇది: ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆనర్సు తరగతులలో, విజ్ఞాన శాఖలలో 11, 12 స్థలాలు (సీట్లు) తప్ప హెచ్చుగా లేవు. హెచ్చు చేయమంటే, యూనివర్శిటీ అధికారులు ఒప్పుకోరు. పోనీ, రాయలసీమ ప్రాంతంలో ఒక కాలేజీలో ఆనర్సు తరగతులు ప్రారంభించమంటే, విశ్వ విద్యాలయకేంద్రంలో తప్ప, ఆనర్సు తరగతులు పెట్టడానికి వీలులేదన్నారు. అందుచేత—దక్షిణ, పశ్చిమ జిల్లాలలోనుంచి వచ్చే విద్యార్థులకు, అందులో ధనాభావంగల విద్యార్థులకు—అవకాశాలు తక్కువ అనే విషయం గుర్తించి తిరుపతిలో విశ్వవిద్యాలయం స్థాపించడమే మార్గ మనుకున్నాము.

అయితే, లోగడ 10 లక్ష లిస్తామన్న తిరుపతి దేవస్థానం వారు, అప్పట్లో ఆరు లక్షలు మాత్రమే ఇవ్వగల మన్నారు. ఏమయినా, విశ్వవిద్యాలయం స్థాపించక తీరదనుకున్నాము. ఇందుకొక నివేదిక తయారుచేయడానికి, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో కళాశాల ప్రిన్సిపాలు అయిన కె. రంగధామరావుగారిని నియమించడం జరిగింది. విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ వి. ఎస్. కృష్ణగారి సలహా సంపత్తితో, వారొక నివేదిక సమర్పించారు. దానికి రెండుకోట్లు ఖర్చు చూపించారు.

చెప్పకేమి! ఈ ఖర్చుకు భయపడి అయినా, ఈ క్రొత్త విశ్వ

విద్యాలయాన్ని వదులుకుంటామని పట్టాభిరామారావుగారు సంతోషించారు.

కాని, డబ్బు విషయమై బాధపడనక్కరలేదనీ, రెండు, మూడేండ్లలో ఈ రెండుకోట్లు సంపాదించగలమనీ, ధైర్యంతో శాసన ముసాయిదా తయారుచేయించాలని కాబినెట్‌లో తీర్మానించాము.

ముసాయిదా సరిచూడడానికి- వి. ఎస్. కృష్ణ, కె. రంగధామ రావుగారలతో నేనే కూచోవలసి వచ్చింది. విద్యాశాఖ మంత్రి అయినా, పట్టాభిరామారావుగారు- అది ఎలాగూ జరగని పని అని, నన్నే చూసుకోమని, కార్యభారం నాపైన వేశారు.

తిరుపతిలో విశ్వవిద్యాలయ కేంద్రం పెట్టడంలో మా కొక ప్రత్యేక ఆశయముండేది. దక్షిణ ఆసియా దేశాలన్నిటిలోనుగల ప్రాచ్య కళాకేంద్రాలకు, ఇక్కడ స్థాపించబోయే విశ్వవిద్యాలయం మహాకేంద్రంగా ఉండే విధంగా దానిని ఏర్పాటు చేయాలని నిశ్చయించాము.

కాని, నివేదిక తయారుచేసిన యిద్దరూ, ఆంధ్ర విశ్వవిద్యాలయ శాసనాన్ని నమూనాగా తీసుకొని ముసాయిదా తయారుచేయడం వల్ల, పై ప్రాచ్యకళా మహాకేంద్రపు ఏర్పాట్లకు తగినంత అవకాశం లేకపోయింది.

ఎలాగయితే నేమి, మొదటి ఆశయంలో మాత్రం సంస్కృత సాహిత్యము—తత్సంస్కృతుల ప్రబోధ విస్తారములని వ్రాయడం జరిగింది.

తిరుపతి దేవస్థానంవారు ఏటేటా (అప్పుడున్న కొద్దిపాటి రాబడినిబట్టి బహుశః 15 వ వంతు అయిఉంటుంది) 2 లక్షల 50 వేలు విశ్వవిద్యాలయానికి కేటాయింపు చేయవలసిందని యిందులో వ్రాశాము. తిరుపతి దేవస్థానం శాసనాన్ని ఆ విధంగా సవరించడానికికూడా యిందులోనే ఏర్పాటు జరిగింది. శాసనసభలో బిల్లు ప్రవేశపెట్టడానికి, విద్యాశాఖమంత్రి ఒప్పుకొన్నారు.

వేసవికాలంలో, వాల్తేరు విశ్వ విద్యాలయంలో శాసన సభ జరుగుతున్నప్పుడు, చల్లని సముద్రపుగాలి తగులుతూ ఉండగా, తిక్క-

వరపువారి పేరున ఉన్న సభామందిరం (మీటింగ్ హాలు) లో—ఈ బిల్లు చర్చ, శాంతంగా జరిగింది. 12-5-54 న పట్టాభిరామారావుగారు ఈ బిల్లును శాసన సభలో ప్రవేశపెట్టారు. 15-5-54 న, శాసన సభ్యుల పరిశీలనా సంఘం (సెలక్టు కమిటీ) పరిశీలన నిమిత్తమై వెళ్ళింది. 26-5-54 న, పరిశీలనా నివేదిక శాసన సభలో ప్రవేశపెట్ట బడింది.

ఈ బిల్లులో- విశ్వవిద్యాలయానికి, రాష్ట్రగవర్నరు ఉద్యోగ రీత్యా 'ఛాన్సలర్' గా ఉంటారని వ్రాయడం జరిగింది. కొన్ని విశ్వ విద్యాలయాలలో ఆ రాష్ట్రపు ముఖ్య న్యాయమూర్తి ఛాన్సలర్‌గా ఉండడం కూడా కద్దు.

అనేక సందర్భాలలో - విశ్వవిద్యాలయ వ్యవహారములు, న్యాయస్థానాలలో వాదోపవాదాలకు వస్తువులుగా పరిణమిస్తున్న కాలంలో, అటువంటి వివాదాలలో వాదులు, ప్రతివాదులు ముఖ్యన్యాయ మూర్తిపేరు లాగకుండా ఉండడంకోసమని, మేము గవర్నరు ఛాన్స లరుగా ఉంటే బాగుంటుందనుకున్నాము.

అయితే, ప్రతిపక్షులు మా భావాలకు ప్రతికూలభావం కలవారు కాబట్టి- ఉద్యోగాలు మొదలయిన విషయాలలో మంత్రుల సాన్ని ధ్యాన్నీ, పలుకుబడిన అనుసరించి గవర్నరులు మంత్రుల తాలూకు మనుషులనే ప్రోత్సహిస్తారనే సాధారణ జనాకర్షణీయమైన వాదం లేవ దీసి, 31-5-54 న ఆ శాసనం 10 వ విధిలో 'గవర్నరు' అన్న పదా నికి బదులు, 'ముఖ్య న్యాయమూర్తి' అనే పదం సవరణగా ప్రతి పాదించి, నెగ్గారు.

ఆ సవరణతోబాటు 1-6-54 న శాసనం ఆమోదమయింది.

నేను, బిల్లును రాష్ట్రపతి ఆమోదానికై 'రిజర్వు' (రాష్ట్రపతి విచారణార్థము రక్షితము) చేసినట్టు గవర్నరుగారి సంతకం అయిన వెంటనే, ప్రత్యేకమైన ఉత్తరంతో సహా—వేసవికాలపు సెలవులు పూర్తికావడానికి ముందుగా రాష్ట్రపతి అనుమతి యిప్పించవలసిందని, కేంద్ర హోమ్ మంత్రి కట్జూగారికి పంపించాను.

ఆయన దగ్గరినుంచి వారం, పది రోజులదాకా ఏ వార్తా రాలేదు.

విద్యాశాఖ మంత్రిగారిని, ఢిల్లీ వెళ్ళి, సరిచేసుకొని అనుమతి తేవలసిందని చెప్పగా, ఆయన "ఇలాంటి బిల్లుకు కేంద్రం ఒప్పుకోదని నేను ఇదివరకే చెప్పాను. మీరు నా మాట వినలేదు. ఆ బాధ ఏదో మీరే పెళ్ళిపడండి," అన్నారు.

అప్పుడు కట్జూగారికి బిల్లుకాపీ మరొకటి చేర్చి, ప్రత్యేకంగా మరొక ఉత్తరం వ్రాసి, వారికి బిల్లు పరిశీలన చేయడానికి వ్యవధియిచ్చి, ఫలానా రోజున వస్తున్నానని తంతియిచ్చి, ఆ రోజుకు ఢిల్లీ వెళ్ళి, ఆ ఉదయమే వారి సందర్శనానికి వెళ్ళాను.

ఆయన ప్రత్యుత్థానముచేసి, తేనీరు వగయిరాలన్నీ ఆరగింపు చేయించి, నన్ను "ఏమైనా పనిమీద వచ్చారా?" అని అడిగారు.

నాలుగు రోజులక్రింద విశ్వవిద్యాలయ శాసనం కాపీ ఆయనకు పంపినదీ, ఆ ఉదయం ఆయన సందర్శనానికి వస్తున్నట్టు తంతియిచ్చినదీ చెప్పగా, ఆయన ఆ తంతివార్తగాని, బిల్లుగానీ అందలేదన్నారు.

"మీ పెర్సనల్ అసిస్టెంటును పిలిచి కనుక్కోవలసింది," అని నేను అడిగినమీదట, ఆయన తన పెర్సనల్ అసిస్టెంటును పిలిచి, నాపేరు ఆయనకు చెప్పి, నా దగ్గరనుంచి తమకేదైనా తంతివార్త, బిల్లు వచ్చాయా అని ప్రశ్నించారు. ఆయన 'వచ్చిం'దన్నాడు.

నేను "ఎప్పుడు మీకు అందాయి?" అని అడగగా, ఆయన "మూడురోజులయింది," అన్నాడు.

కట్జూగారూ, నేనూ ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నాము. ఆయన పెర్సనల్ అసిస్టెంటును వెళ్ళమన్నారు. అంతకుమించి ఆ విషయం తమకెందుకు చెప్పలేదన్నమాట నోటితో అడగలేదు సరి కదా, కంటిచూపులతోనయినా సూచించలేదు!

నేను మరొక్కసారి 'ఇది కదా ఢిల్లీ పంథా!' అనుకున్నాను.*

ఈ ముచ్చట అయినతర్వాత, ఆయనకు ఆ బిల్లు వివరాలు

---

* అంతకు ముందు సంవత్సరం, నెహ్రూగారికి ప్రకాశం గారు పంపిన తంతి వార్త విషయమై ఇలాగే జరిగిన సంఘటన ఇదివరలో వ్రాశాను.

చెప్పాను. ఆయన నన్ను హుమయూన్ కబీర్‌గారితో మాట్లాడవల సిందని చెప్పారు.

అప్పట్లో హుమయూన్ కబీర్‌గారు కేంద్ర విద్యామంత్రి అయిన అజాద్‌గారికి విద్యాశాఖలో కార్యదర్శిగా ఉండేవారు.†

కట్జూగారితో, "నేను, ప్రకాశంగారు అంతకుముందు అజాద్ గారితో ఈ విశ్వవిద్యాలయ విషయమై మాట్లాడినప్పుడు ఆయన అనుమతించారు. మ రిప్పుడాయన విదేశాలలో పర్యటిస్తున్నారు కదా! ఎలాగా?" అన్నాను.

అందుకు, కట్జూగారు మళ్ళీ ఇలా అన్నారు: "అజాద్‌గారి అనుమతి ఒక అనుమతి కాదయ్యా! కబీరుగారిని ఒకసారి చూడు."

కబీరుగారు 1930 ప్రాంతాలలో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రొఫెసరుగా పనిచేసివున్నారు. కాని, అప్పటికి ఆయనతో నాకు ప్రత్యే కంగా పరిచయం లేదు. అందుచేత, అప్పుడు మంత్రిగావున్న గిరి గారితో, "కబీరుని కలుసుకోవాలి. ఆయనకు నేను వస్తున్నానని ఒక మారు చెప్పండి," అన్నాను.

ఆయన "కబీరు మనకు బాగా తెలిసినవాడే. నేనే స్వయంగా తీసుకువెళతాను," అని, నాతోబాటు కబీరుదగ్గరికి వచ్చారు.

కబీరు, బ్రహ్మాండంగా సంతోషించి, "డాక్టర్ భట్నగర్‌గారు చాలా అభ్యంతరం చెప్తున్నారు. అవి పరిశీలిస్తున్నాను," అన్నారు.

నే నప్పుడు- ప్రకాశంగారికీ, భట్నగర్‌గారికీ ఈ బిల్లు విష యంలో అంతకు వారంరోజులక్రింద జరిగిన చర్చ సంగతి చెప్పాను. ఆ చర్చ జరిగినపుడు నేనుకూడా వున్నాను.

---

† అజాద్‌గారి మరణానంతరం ఈయన రాజకీయ రంగం లోకి దిగారు. 1967 లో నాతోపాటు, పార్లమెంటులో నా గ్రూపులో సహచరులుగా ఉండేవారు. అయితే, ఆనాడు పశ్చిమ బెంగాలులో కలిగిన రాజకీయపు సుడిగాలులతో త్రోవలు తప్పి, తర్వాత ఎవరూ అనుకోకుండా మరణించారు. ఈయన విద్వాం సుడు; ఆంగ్ల, బంగ్లా భాషలలో కవిత్వ రచన చేసినవారు.

ప్రకాశంగారు, నేను- భట్నాగర్‌గారి యింటికి వెళ్ళి, ఈ బిల్లు విషయం ఎత్తేసరికి, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఎందుకూ పనికిరానిదని, అనేక చిల్లరమల్లర దోషారోపణలు చేశారు.

అపుడు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆయన సూచించిన దోషాలు సవరిస్తాము కాని, మేము వచ్చింది క్రొత్త విశ్వవిద్యాలయ విషయంగానని చెప్పాము.

దానిమీద, ఆయన చెప్పిందే మళ్ళీ చెప్పడం మొదలుపెట్టారు. విశ్వవిద్యాలయంలో సైన్సు లేబరేటరీలు ఏ విధంగా ఏర్పాటు చేయాలో వర్ణించసాగారు.

విశ్వవిద్యాలయం స్థాపించడానికి అనుమతిస్తేనే కదా కట్టడముల విషయం వస్తుందని మే మన్నాము. కాని, ఆయన- కట్టడాల విషయమై నిశ్చయం కానిదే, తాను విజ్ఞాన సలహాదారుగా ఉన్నంత కాలం అనుమతించడం ఎలాగని వాదించారు.

అది అప్పుడప్పుడే చీకటిపడుతున్న సమయము. ఆయన ధోరణి ఆయనదే. కాని, మాకు ఒక ధ్వనిమాత్రం కనిపించింది.* ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు తన్ను గుర్తించలేదని ఆయన మనసులో ఒక బాధ వున్నట్టు గుర్తించాము.

---

* భట్నాగర్ గారి సంభాషణలో మేము కనిపెట్టిన ధ్వని, విశాఖపట్నం వచ్చినప్పుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ కృష్ణగారికి తెలియజేశాను. ఢిల్లీలో జరిగిన ఒక కాన్ఫరెన్సులో తాను కూడా అది గుర్తించినట్టు చెప్పి, భట్నాగర్ గారిని ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఒక మారు స్నాతకోత్సవంలో కాన్వొకేషన్ అడ్రెస్ ఈయవలసిందని పిలిస్తే వ్యవహారం చక్కబడ వచ్చన్నారు. ఆహ్వానించగానే, కృష్ణగారు అనుకున్నట్టుగానే భట్నాగర్ గారు దృష్టి మార్చుకొన్నారు. అయితే, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఆ కాన్వొకేషన్ రోజున పెద్ద వర్షం పడి, ఆహ్వానితు లందరూ, వేదికపై ఉన్నవారితో సహా తడిసిపోయారు. ఆనాటి శైత్యం 'న్యుమోనియా' వంటి జబ్బుగా మారి, దేశంలోగల పెద్ద విజ్ఞాన శాస్త్రవేత్త అయిన ఆయన అసువులు బాశారు.

భట్నగర్‌గారితో, ఆయన చెప్పినదంతా చేస్తామని చెప్పి వచ్చేశాము.

ఇదంతా కబీరుగారికి చెప్పి, నేను ఇంకా మరొకటి చేశాను.

మన సంవిధానం ప్రకారంగా విశ్వవిద్యాలయాల సంస్థాపన రాష్ట్రప్రభుత్వాల హక్కు కాగా, విశ్వవిద్యాలయాలలో జరిపించే వైజ్ఞానిక, సాంకేతిక పరిశోధనా విషయాలను, ఉన్నతవిద్యల ప్రమాణాలను నిర్ణయించడం మాత్రం కేంద్రప్రభుత్వం హక్కు అని, సంవిధానం 7 వ షెడ్యూలు, యూనియన్ లిస్టులో గల 66 వ ఖండమూ, స్టేట్ లిస్టులో గల 11, 32 ఖండాలూ ఆయనకు చూపించి బోధపరచగా, "అవును. శాసనం ఆమోదించే సందర్భంలో మా ప్రమేయమేమీ లేదు. ఒప్పుకున్నాను," అన్నారు.

దానిమీద నేను ఆయనకు ఫైలు చూపిస్తూ, "ఇంత ఫైలు ఎందుకు పెంచారు?" అని అడిగాను.

ఆయన "ఫైలు నా టేబిల్‌మీదికి వచ్చింది. అందుచేత నేను వ్రాస్తున్నాను," అన్నారు.

"అయితే అనుమతించడానికి మీ అభ్యంతరం లేదని వెంటనే వ్రాయండి," అన్నాను.

ఆయన ఆ విధంగా వ్రాసుకోగా, హోమ్ సెక్రటరీకి ఆ విషయం కొంత తెలియజేయమన్నాను. ఆయన వెంటనే ఆ పని చేశారు.

తరువాత కట్జూగారి దగ్గరికి వెళ్ళితే, ఆయన సెక్రటరీని పిలిచి అడిగారు. ఆయన వచ్చి, లా డిపార్ట్‌మెంట్‌వారి అడ్డు ఇంకా ఉందని చెప్పారు.

వారు చూపిన అడ్డు ఇది: "దేవస్థానం డబ్బు హిందూమతానికి సంబంధించని విద్యపై ఖర్చుపెట్టవచ్చునా?" దానిపై వారు ఆలోచిస్తున్నారట.

'లా' సెక్రటరీతో చర్చిస్తే, ఈ విషయంలో ఆయన గట్టిగా పట్టు పట్టాడు. ఆయనతో నేను చెప్పినదాని సారాంశ మిది: "ఈ శాసనం ప్రకారం, ఇదివరకు అనేక సంవత్సరాలుగా అదే దేవస్థానం

వారు తమ డబ్బుతో నడిపిస్తూన్న కాలేజీలను, విశ్వవిద్యాలయంగా విస్తృతపరుస్తున్నాము. ఆ విషయం అందులో స్ఫుటంగా వ్రాయబడి వుంది. ఆ కాలేజీలలో, ఇతర కాలేజీలలో జరుగుతున్నట్టుగానే విద్యా బోధన జరుగుతున్నది.

విద్యార్థులకు అన్ని విషయాలూ బోధిస్తున్నారు. ఏ నిషేధమూ లేదు ఈ కాలేజీలమీద వ్యయం కాకూడదని ఏ భక్తుడూ అనలేదు. అడ్డుపెట్టలేదు.

సంవిధానం వచ్చి ఆరేండ్లయినా ఎవరూ వ్యాజ్యం వేయలేదు. అందుచేత, ఇప్పుడు పురిటిలో మీరు అడ్డుపెట్టడం ఎందుకు? ఎవ రయినా అడ్డుపెట్టదలచుకుంటే దాని మంచిచెడ్డలు ఆలోచించే బాధ్య తను సుప్రీంకోర్టుకు ఎందుకు వదలరు మీరు?'' అని నేను చెప్పినా, ఆయన తనకే న్యాయశాస్త్ర ప్రావీణ్యమున్నట్టు మాట్లాడసాగాడు.

అప్పట్లో కేంద్ర న్యాయశాఖామంత్రి- కలకత్తా హైకోర్టులో జడ్జీగా పనిచేసి, పదవీ విరమణ చేసిన చక్రవర్తిగారు.

ఆయనతో నే నీ విషయాలు చెప్పేసరికి, అవలీలగా గ్రహించి, కార్యదర్శి దగ్గర వున్న ఫైలు తాను తీసుకొని, ఆయనను పంపించేశారు.

ఆ తరువాత ఆయనా నేను ఒక కారులో బయలుదేరాము. దారిలో చక్రవర్తిగారు, "న్యాయశాఖకు కార్యదర్శులైనవాళ్లు ఒకప్పుడు న్యాయవాదులే అయినా, సచివాలయంలోకి వచ్చి, కొంతకాలం ఉండే సరికి పాలకవర్గ మనస్తత్వంలోకి పడిపోతారు,'' అంటూ కారులోనే ఆ ఫైలుమీద, 'అనుమతి ఈయవ'చ్చని వ్రాసేశారు.

ఈ రెండు గండాలు దాటిన తరువాత, ఏడుకొండల వేంక టేశ్వరుని పేరిట స్థాపించిన విశ్వవిద్యాలయ శిశువు దినదిన ప్రవర్ధ మానమై, నేడు అగ్రశ్రేణి విశ్వవిద్యాలయాలలో ఒకటిగా విరాజిల్లు తూంది.

## ప్రకాశం మంత్రివర్గం చేసిన ఇతర సాకర్యములు

మంత్రివర్గం అధికారం స్వీకరించిన కొద్ది నెలలలోనే, నేత మగ్గాలపై వేసిన పన్ను, రెండెడ్లబండ్లపై వేసిన పన్ను రద్దు చేశాము.

ఆ తర్వాత రానున్న ఫసలీనుంచి అమలులోకి వచ్చేటట్టుగా పది రూపాయలకన్న తక్కువ భూమిశిస్తు చెల్లించేవారి శిస్తు రద్దు చేశాము. ఆంధ్రా యూనివర్సిటీకి, వారు ప్రత్యేకంగా కోరకుండానే ఏటేటా ఇవ్వవలసిన గ్రాంటు అప్పటికున్నదానికన్న లక్షరూపాయలు పెంచాము.

కర్నూలులో ఆంధ్రప్రభుత్వం రాజ్యంచేస్తున్న కాలంలో- కేంద్రప్రభుత్వం ఇస్తున్న ఉత్పాదన సుంకాల వంతూ, అలాగే ఆదాయపు పన్ను (ఎస్టేట్ డ్యూటీ) లో వంతూ, సంపత్తి శుల్కంలో ఇచ్చే భాగంతో కలిపి మొత్తం రాబడి ఇరవై కోట్లకన్నా తక్కువగా ఉండేది.

విదేశాలనుంచి ఋణాలప్రవాహం అప్పటికి వెల్లువికి రావడం ప్రారంభించలేదు. భూమి సిస్తుకూడా అప్పుడు 5 కోట్లకన్నా తక్కువగా వుండేది. ఇటువంటి పరిస్థితులలో పెద్ద పెద్ద మొత్తాలు అవసరమయ్యే పెద్ద ప్రాజెక్టులు ప్రారంభించడానికి అవకాశం తక్కువగా వుండేది.

చెన్నరాష్ట్రంవారు- గోదావరి, కృష్ణా, పెన్నారు ప్రాజెక్టులు కట్టడానికి ఉమ్మడిరాష్ట్రంవారు చేసిన ఋణం మొత్తం, ఆ ప్రాజెక్టుల వల్ల వచ్చిన డబ్బులోంచి చెల్లించక, ఆ ఋణం మొత్తాలు ఆంధ్ర దేశం చెల్లించవలసిన పబ్లిక్ డెట్ (లోక ఋణం) గా చూపించారు. ఆ ప్రాజెక్టులవల్ల వచ్చిన రాబడి- ఖర్చులు, వడ్డీలు పోను మిగులు 30 కోట్ల రూపాయలున్నా, అది మన రాష్ట్రానికి ఆస్తికింద ఇవ్వము అని తీర్మానించారు.

అందుచేత, రాష్ట్ర విభజన నాటికి మన రాష్ట్రానికి 33 కోట్ల పబ్లిక్ ఋణం తగులుకుంది.

ఇటువంటి ఆర్థిక స్థితిలో మనరాష్ట్రం ఆరంభమైంది. అయినప్పటికీ, అందులోనుంచే సంవత్సరానికి 50 లక్షల రూపాయల చొప్పున కేటాయించి, క్షామ నివారణ నిధి పెంపుదలకు ఏర్పాటు చేశాము.

దురదృష్టంకొద్దీ, ప్రారంభించిన సంవత్సరంలోనే, విశాఖ

పట్నం, తూర్పు- పశ్చిమ గోదావరులు, నెల్లూరు, అనంతపురం జిల్లాలలో పరదలు వచ్చి అపార నష్టం కలగజేయడంవల్ల, అనుకోకుండానే అందుకు 4 కోట్ల 60 లక్షలకు పైగా అవాంతరపు ఖర్చు వచ్చిపడింది.

భూమిసంస్కరణ ఆలోచనలోకి వచ్చి, ఆ విషయమై 1954 ఆగస్టులో డాక్టర్ లక్నోగారి అధ్యక్షతన ఒక లాండ్ రిఫార్మ్ కమిటీని నియమించడం జరిగింది. అయితే, ఇప్పుడు వున్న 'సీలింగు' అనే భావాలు, ఆనాడు విస్ఫుటంగా లేవు. కాని, అందులో- కమతం ప్రమాణం ఎంత ఉండాలి? ప్రమాణానికి మించివున్న భూమిని ఏ విధంగా పంపకం చేయాలి? అన్న సూచనలుమాత్రం వ్రాయబడి వున్నాయి.

తుంగభద్రా నీటిపారుదల ప్రాజెక్టు క్రింద, తొందరగా సాగు విస్తరణ చేయడానికి ప్రభుత్వం చురుకైన ఏర్పాట్లు చేయడం ఆరంభించింది. ఇంతేకాక, ఆ ప్రాంతాలలోవున్న భూములలో ఎత్తుపల్లాలు తగ్గించి, సమతలంగా చేయించడానికిగూడా ప్రభుత్వం యత్నించ నారంభించింది.

మద్యనిషేధం ఉండవలెనా- వద్దా? అనే ప్రశ్న ఆ రోజులలో సభ్యులను చాలా బాధించింది. ఇదివరకేదో సందర్భంలో, ఎప్పుడో ఒకప్పుడు మద్యనిషేధ శాసనం రద్దుచేయాలని చెప్పినవారి సంఖ్య శాసన సభలో హెచ్చుగా వుంది. అయితే, ప్రభుత్వవర్గంలో వున్న పార్టీలలో—కాంగ్రెసు పెద్ద పార్టీ. వారికి శాసనం రద్దు చేయడంలో ఏకాభిప్రాయం లేదు. అందుచేత, ఏమి చేయడానికీ తోచని సందేహస్థితిలో శాంతి రామమూర్తిగారి అధ్యక్షతను- ఈ మద్యనిషేధ శాసన పరిపాలన ఏ విధంగా చక్కదిద్దాలో సూచించడానికి, ఒక ఉప సంఘం ఏర్పాటయింది.

''సంశయాత్మా వినశ్యతి!'' చివరికి ఈ సంఘం నివేదికలో గల సిఫారసులు అమలు చేయలేదన్న కారణం చూపెట్టి, ప్రతిపక్షం వారు ప్రభుత్వంపైన విశ్వాసరాహిత్య తీర్మానం తేవడము, ప్రభుత్వ

పక్షంలో వున్న నలుగురు ఎదురుతిరిగి ఆ తీర్మానానికి అనుకూలంగా వోటు చేయడము, తన్మూలంగా చకచక ముందుకు నడుస్తూన్న ప్రకాశం ప్రభుత్వం పడిపోవడము - చరిత్రాత్మక విషయాలు. అవన్నీ తర్వాత వ్రాస్తాను.

ఈ ఇబ్బందులకుతోడు, ఆంధ్రరాష్ట్రం - మొదటి పంచవర్ష ప్రణాళిక సగం జరుగుతూండగా స్థాపించబడడంవల్ల, ఆంధ్రప్రభుత్వం తన అభిప్రాయాలనుబట్టి తయారుచేసుకొన్న ప్రణాళిక లేదు. ఉమ్మడి రాష్ట్రంలోంచి విడిపోయిన భాగాల జనాభానుబట్టి కేటాయింపులన్నీ విభజించడం జరిగింది. క్రొత్తరాష్ట్రం కదా అనే కరుణచేత, ఈ కేటాయింపులకు అదనంగా, 3 కోట్ల 84 లక్షల రూపాయలు మొత్తంగా ఇచ్చారు.

ఆ రోజులలో ఆరంభదశలో వున్న సమాజ వికాస కేంద్ర ఉద్యమాన్ని తొందరగా విస్తృతపరచడం జరిగింది.

ఇంతేకాక, రెండవ పంచవర్ష ప్రణాళికకు అంచనా తయారు చేయడానికి ప్రభుత్వం చురుగా యత్నాలు జరిపింది. ఉద్యోగ అవకాశాలు పెంచడానికి, వ్యవసాయ విస్తృతికి అవసరమైన నీటిపారుదల ప్రాజెక్టులను అభివృద్ధి చేయడానికి గట్టి ఆలోచనలు ఆరంభింపబడ్డాయి.

ఈ ప్రణాళికలను, ప్రజాప్రణాళికలుగా మార్చడంకోసం ప్రభుత్వం గ్రామ ప్రణాళికా సంఘాలను, ప్రాంతీయ ప్రణాళికా సంఘాలను ఏర్పాటు చేసింది. హరిజన, గిరిజన సంక్షేమం కోసం పెద్ద యత్నాలు చేసింది.

మహిళాభ్యుదయ ఉద్యమం విస్తృతం చేయడంకోసమని, మహిళా ఉద్యమ సంక్షేమ ఉద్యోగిని ప్రత్యేకంగా నియమించింది.

## ఖాదీ అభివృద్ధి

1946 లో, ప్రకాశంగారు ఉమ్మడిరాష్ట్ర ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు తయారుచేసిన ఖాదీ స్కీములు ఆ మధ్యకాలంలో పూర్తిగా

నశించలేదు. అయినా, ఈ స్కీములు పెట్టిన స్థలాలలో, మిల్లుగుడ్డల వ్యాపారంకూడా జరుగుతూండడంవల్ల వీటి ప్రాధాన్యం నశించింది.

ప్రకాశంగారు - ఈ ప్రత్యేక ఖద్దరు కేంద్రాలను ఏర్పాటు చేసిన సమయాలలో, మిల్లుబట్ట నశించాలని చేసిన ఏర్పాట్లను సమర్థిస్తూ గాంధీగారు ఇలా అన్నారు: "మరకదుశ్ళ - ప్రకాశంగారు తిరస్కరించక తప్పదు. మిల్లుబట్టల నిషేధం తప్పదు. ఈ పని చేస్తేనే, ఏదో క్రొత్త ఉద్యమం నడుస్తున్నట్టు ప్రజలు గ్రహించగలరు."

అయితే, తర్వాత వచ్చిన ప్రభుత్వంవారు - గాంధీజీ సమర్థించి, ప్రకాశంగారు నడిపించిన కార్యక్రమాన్ని, తాము 'గాంధేయులు' అయినప్పటికీ రద్దు చేశారు. అందుచేతనే ఈ ఖాదీ ఉద్యమం కుంటుపడింది.

అందరూ ఖాదీకట్టి, బట్టల విషయంలో ఆ గ్రామాలు స్వయం పోషకంగా వుండాలనే ఆశయం కాగితాలమీద మాత్రం రద్దు పరచకుండా వుంచారు.

చవకగా రాట్నాలు, దూది మొదలైనవి వారికిచ్చేవారు. వారు వడికిన నూలు మొట్టమొదట ప్రభుత్వంవారే కొనుక్కొని, దాంతో బట్టలు నేయించి, ఆ బట్టలు గ్రామస్థులకు అమ్మడానికి ఏర్పాటు చేశారు.

ఆ స్కీముక్రింద విశాఖపట్నం, తూర్పుగోదావరి జిల్లాలు కలిపి తుని కేంద్రం, గుంటూరుజిల్లాలో కొన్నిగ్రామాలు కలిపి సంతనూతలపాడు కేంద్రం, ఇలాగే మరికొన్ని గ్రామాలు చేర్చి, ఎఱ్ఱగొండపాలెం, కోయిలకుంట్ల కేంద్రాలు - మొత్తంపైన నాలుగు కేంద్రాలు నడుస్తూండేవి.

ఆంధ్రప్రభుత్వం మళ్ళీ ఏర్పడడంవల్ల ఈ కేంద్రాలలో చురుగ్గా ఖద్దరు ఉత్పత్తి, గ్రామాలలో ఖద్దరు ధారణ తిరిగి హెచ్చాయి.

నూలు వడికేవారికీ, నేసేవారికీ కూలీకూడా కొంత పెంచడమయింది. ఖద్దరు విస్తృతపర్చడంకోసమని, ఈ కేంద్రాలలోనే గాక, అనేక కేంద్రాలలో - రాట్నాలు, దూది చవక ధరలకు ఇవ్వడం జరిగింది.

మొత్తంపైన—నూలు వడికే 23 వేలమంది, ఖద్దరు నేసే 1,180 మంది, వీరితో సంబంధించిన దూది ఏకేవారు, బట్టలు తెలుపు చేసే చాకళ్ళు, బట్టలపైన రంగులు అద్దే కళాకారులు లాభం పొందారు.

## ఆంధ్ర సరిహద్దుల విషయము

రాష్ట్రం ఏర్పాటు చేసినపుడు సరిహద్దులలో ఇంకా కొన్ని సర్దుబాట్లు చేయవలసి ఉంది. ఇంతేకాక, కేంద్రప్రభుత్వం ఫజలాలీ అనే న్యాయమూర్తి అధ్యక్షతన సెప్టెంబరులో రాష్ట్ర పునర్విభజన సంఘాన్ని నియమించింది. ఆ సంఘంలో హృదయనాథ్ కుంజ్రూ, ఫణిక్కర్ అనే మరి ఇద్దరుకూడా ఉండేవారు.

వారు కర్నూలు వచ్చినప్పుడు, ఒరిస్సా, ఆంధ్ర సరిహద్దుల విషయము; బళ్ళారి విషయము; చెన్నపట్నం, మైసూరు రాష్ట్రంలోని కోలారు విషయములు - వీటినిగూర్చి ఆంధ్రప్రభుత్వం అనేక వివరాలతో విజ్ఞప్తి దాఖలు చేసింది. ప్రకాశంగారు భాషారాష్ట్రాల చరిత్ర యావత్తూ, సమగ్రంగా ఆ సంఘ సభ్యులకు బోధపరిచారు.

ఈ భాషారాష్ట్రాల తత్వ మేమిటోగానీ, పెద్దపెద్ద మహనీయులనుకూడా వక్రమార్గంలోకి దించేస్తాయి.

మరొకప్పుడు, బళ్ళారి విషయమై మిశ్రా అనే న్యాయమూర్తిని స్పెషల్ ఆఫీసరుగా నియమించి, ఆయన బళ్ళారి వెళ్ళే సమయంలో - ప్రకాశంగారు గానీ, ఇతర ఆంధ్ర మంత్రులుగానీ బళ్లారికి వెళ్లగూడదని నెహ్రూగారు ప్రార్థనాపూర్వకభాషలో ఆంక్ష విధించారు.

## ఫ్రెంచి యానాములో ప్రజారాజ్యం

పోర్చుగీసువారు, గోవా ప్రాంతాలలో చేస్తున్న దురంతాలు, మార్గదర్శకంగా తీసుకొని ఫ్రెంచివారుకూడా దక్షిణాదిన పుదుచ్చేరిలోను; ఆంధ్రలో తూర్పుగోదావరి జిల్లాకు అనుకొనిఉన్న యానాములోను - స్వాతంత్ర్యాభిలాషులైన భారతీయులను హింసించసాగారు.

యానాము చాలా చిన్న భూభాగము. యానాము, గోదావరి భూభాగంనుంచి ఒక కాలువ అంత ప్రమాణంగల నదిచేత వేరు

చేయబడి ఉన్నది. కాకినాడనుంచి అక్కడికి దక్షిణంగా ఉన్న యానాం పోవడానికి గంట మోటారు ప్రయాణంకన్నా ఉండదు.

అక్కడి ఫ్రెంచి ఉద్యోగికి గవర్నరుహోదా ఉండేది. అక్కడి ఫ్రెంచివారు, యానాము భూభాగంలో ఉన్న ప్రజలను, పౌరహక్కులు లేకుండా అణిచివేసే ప్రయత్నంలో, నదికి ఇవతలఉన్న ఆంధ్రరాష్ట్ర ప్రజలపైనకూడా తుపాకులు కాల్చి, గాయపరచసాగారు.

ఆ ప్రజల సంరక్షణకోసం ఆంధ్రప్రభుత్వం సాయుధ పోలీసు దళాన్ని సరిహద్దు రక్షణకు నియమించింది.

ఈ విషయం ఎవరి మూలంగా తెలిసో నెహ్రూగా రొక ఐ. సి. ఎస్. ఉద్యోగిని ప్రత్యేకంగా కర్నూలుకు పంపించారు. ఆయన ప్రకాశంగారితో, తనను నెహ్రూగారు పంపడానికి కారణం మేము యానాముకు ఎదురుగుండా సాయుధ పోలీసు దళం ఉంచడమే నని తేల్చారు.

అందువల్ల, అంతర్జాతీయ సమస్యలు లేస్తాయి గనుక, మేము ఫ్రెంచివారితో ఏ తగవూ తెచ్చుకో కూడదని ఆయన మాటగా చెప్పారు.

ఆంధ్ర ప్రజలను ఫ్రెంచివారు తుపాకులతో కాలుస్తూంటే ప్రజలకు ఆ ఇబ్బంది లేకుండా చేయడానికి సాయుధ పోలీసును పంపాము కాని, ఫ్రెంచివారితో తగవు తెచ్చుకొనే ఉద్దేశం మాకు లేదని మాట ఇచ్చాము.

ఆ సమయంలోనే ఫ్రెంచి పోలీసులు ఒత్తిడి హెచ్చుచేయడం మొదలుపెట్టారు. మేము రిజర్వు పోలీసు దళాన్ని బలపరిచి, వారి ఖర్చుల నిమిత్తం మరొక పదివేల రూపాయలు మంజూరు చేశాము.

నేను-యానాముదాటి అవతలకు వెళ్ళేలాగు టూరు ప్రోగ్రాం వేసుకొని, యానాములో ఉన్న ఫ్రెంచి పెద్ద ఉద్యోగికి మర్యాద ప్రకారంగా ఆ ప్రోగ్రాం ప్రకారం యానాము దాటి వెళుతున్నానని ఉత్తరం పంపించాను. ఆ ప్రకారంగా, నేను యానాము దాటుతున్న సమయానికి ముందురాత్రే ఆ ఉద్యోగి, ఆయనతో ఉన్న ఫ్రెంచి జాతికి

చెందిన పౌరులు యానాము వదిలి, స్టీమరులో పుదుచ్చేరివైపు వెళ్ళిపోయారట.

నేను యానాము దాటే సమయంలో అక్కడ ఐదారుగురు ఫ్రెంచి పోలీసులు గార్డ్ ఆఫ్ ఆనరు పంటిది ఇచ్చారు. నేను యానాము దాటి అవతల వెళ్ళి, అసలు ప్రత్యేకమైన పనిలేకపోవడంవల్ల, అటు వైపున ఉన్న మన గ్రామస్థులను కలుసుకొని, రెండు, మూడు గంటలలో తిరిగి వచ్చి, మన సాయుధ పోలీసులకు ఉత్సాహవాక్యాలు కొన్ని చెప్పి, కాకినాడ వచ్చి, ఒక మిత్రునియింట స్నేహితుల నందరినీ చేరదీసి వారికి ఒక కార్యక్రమం సూచించాను.

ముందు కొంత నిశ్శబ్దమయిన ప్రచారంచేసి, యానాము మూడు వైపుల నుంచి ఒక వెయ్యిమంది చొప్పున యానాము కాందిశీకులు యానాములోకి ప్రవేశించాలి. వారికి ఇబ్బంది లేకుండా మన సాయుధ పోలీసుదళం అవసరమైతే సాయపడగలదని ఏర్పాటుచేసి కర్నూలు తిరిగి వచ్చేశాను.

ఒక వారం రోజులలో నేను ఢిల్లీకి వెళ్ళవలసి వచ్చింది. ఒక రోజు ఉదయం నేను ప్రధాని నెహ్రూగారిని చూడవలసి ఉన్నది.

ఆ తెల్లవారుజామున మూడు గంటల వేళ కర్నూలు ప్రభుత్వ కార్యదర్శి నుంచి వైర్‌లెస్ సందేశం వచ్చింది.

పౌరులు వందలకొద్దిగా వెళ్ళి శాంతంగా యానాములో- మునిసిపల్ ఆఫీసు, మిగిలిన ప్రభుత్వ కార్యాలయాలు ఆక్రమించుకొన్నారనీ, అక్కడున్న ఫ్రెంచి పోలీసులు మాటవరసకు ప్రజలను అద్దేభావంతో పేల్చి, వెంటనే శరణు వేడుకున్నారనీ, అక్కడ ప్రజాప్రభుత్వం *

* కాకినాడ వాస్తవ్యులు, పదవీ విరమణ చేసిన జిల్లా జడ్జి, నాకు న్యాయకళాశాలలో సహాధ్యాయి అయిన కస్తూరి సుబ్బారావుగారిని, అక్కడ కార్యకలాపాధికారములుగల పురపాలక సంఘాధ్యక్షుని(మేయర్)గా ఎన్నుకొన్నట్టు తర్వాత వార్త వచ్చింది.

ఏర్పాటు చేయడానికి అప్పుడే సన్నాహాలు జరుగుతున్నాయనీ ఆ సందేశంలో ఉంది.

నేను అనుకొన్నట్టు పని 15 రోజులవరకు అక్కర లేకుండా, వారం రోజులలోనే ప్రజలు సఫలీకృతము చేసి, భారతదేశంలో మిగిలి ఉన్న ఫ్రెంచి, పోర్చుగీసువారి చేతులలో ఉన్న భూ భాగాలను పునరాక్రమణ చేసుకోడానికి మార్గదర్శకు లయ్యాలని నేను ఉప్పొంగి పోయాను.

తెల్లవారేసరికి, పత్రికలలో- చూపుడువేలు ప్రమాణంగల అక్షరాలతో-ప్రజలు యానాము ఆక్రమించుకున్నారనీ, ఫ్రెంచి ప్రభుత్వం వారు పారిపోయారనీ వార్తలు పడ్డాయి.

నేను 10, 11 గంటల వేళప్పుడు నెహ్రూగారిని చూడడానికి వెళ్ళాను.

వెళ్ళగానే, యానాము ఆక్రమణ ప్రసంగం వచ్చింది. "మీ ప్రభుత్వం ఇలాంటి పనులు చేస్తే, అనవసరమైన అంతర్జాతీయ సమస్యలు బయలుదేరితే ఎవరు బాధ్యత వహిస్తారు?" అని కొంచెం చీకాకు చూపించే ముఖంతో అన్నారు. *

అది విని నేను, "ప్రభుత్వ సిబ్బందిలో ఒక్క మనిషయినా అంతర్జాతీయ సరిహద్దు దాటి యానాములోకి వెళ్ళలేదు. యానాము కాందిశీకులు తమ పట్టణం తాము పునరాక్రమణ చేసుకొంటే మన మేలాగు అడ్డగలము?" అన్నాను.

అయినా, ఆయన ఇలా అన్నారు: "ఏమైనాసరే, యానాం మీ రాష్ట్రంలో కలుపుకోకూడదు. ఫ్రెంచి తత్వం, ఫ్రెంచి సంస్కృతి మనం రక్షించాలి."

---

*స్వాతంత్ర్యం వచ్చి అప్పటికి 6 ఏండ్లయినా, మన ప్రజలు దెబ్బలు తింటున్నా, పోర్చుగీసు, ఫ్రెంచి ప్రభుత్వాల నుంచి మన భూభాగాలు మనము తీసుకుంటే అంతర్జాతీయ సమస్యలు వస్తాయని భావించే 'దీర్ఘ సూత్రుడు' ప్రధాని నెహ్రూగారు.

"సరే, అలాగే కానివ్వండి" అని నేను వచ్చిన పనేదో సవ్యంగానే చేసుకున్నాను. *

## గవర్నరు త్రివేది

బ్రిటిష్ ప్రభుత్వం ఉద్ధృతంగా జరిగే రోజులలో త్రివేదిగారు ఐ. సి. ఎస్. పరీక్షలో ఉత్తీర్ణుడై, అందరు ఐ. సి. ఎస్. ఉద్యోగుల లాగే - అసిస్టెంట్ కలెక్టరు, డివిజనల్ మేజిస్ట్రేటు మొదలైన చిల్లర ఉద్యోగాలతో ప్రారంభించి, సోపానక్రమంగా వెళ్తూ, 1939 లో ఆరంభించిన ప్రపంచ సంగ్రామ కాలంలో ఇండియా కేంద్రప్రభుత్వ కార్యదర్శి వర్గంవరకు పై మెట్లు ఎక్కాడు.

స్వాతంత్ర్యానంతరం, ఎలాగో ప్రభుత్వం సద్భావాన్ని సంపాదించుకొన్నాడు. ఆంధ్రరాష్ట్ర గవర్నరు కావడానికి ముందు పంజాబు గవర్నరుగా ఉండేవాడు. గవర్నరు పదవిలో ఉన్నా, కార్యదర్శి తత్వం ఆయనను వదిలిపెట్టలేదు. దానికితోడు, అధికార వాంఛాపరుడు కూడా.

అందుచేత, పంజాబులో గవర్నరుగా ఉన్నప్పుడు మంత్రులకు

* ఈ ఉదంతానికి పూర్వం పుదుచ్చేరిదగ్గర, గోవాదగ్గర, మన ప్రజలు విదేశ ప్రభుత్వాలను వెళ్ళగొట్టడానికని సరిహద్దు ప్రాంతాలలో సత్యాగ్రహాలు మొదలు పెట్టారు. అపుడు ఆ ప్రభుత్వాల వారు, మన దళనాయకులను హింసించడమే కాకుండా, యునైటెడ్ నేషన్స్ భద్రతా సమితికి, భారత ప్రభుత్వం తమ రాజ్య భాగాలపై దాడి చేస్తున్నదని ఫిర్యాదులు చేశారు. అందుచేతనే, యానాములో భారతీయ సత్యాగ్రహులు గాక, యానాము కాందిశీకులే పునరాక్రమణ చేసే ఏర్పాటు జరిగింది.

యానాము విషయమై ఫ్రెంచి ప్రభుత్వం భద్రతా సమితికి ఫిర్యాదేమీ చేయలేదు. చేసినట్టు వార్తలు రాలేదు. కాని, నేటికీ నెహ్రూగారి ఏర్పాటుక్రింద యానాము ఆంధ్ర భూభాగంలో చేర్పబడక, సంఘక్షేత్రం (యూనియన్ టెరిటరీ) గానే ఉంది.

మంత్రులకూమధ్య పరస్పర భేదాభిప్రాయాలు పెంచడంలో కొంత ముఖ్య పాత్ర వహించాడు. ఆయన, ఆంధ్రరాష్ట్ర గవర్నరు కాగానే పంజాబు మంత్రి మిత్రుడు ఒకాయన మాతో అన్నాడు: "ఈ త్రివేది అసాధ్యుడు. మంత్రులమధ్య సామరస్యం ఉండ నివ్వడు. మీరు జాగ్రత్తగా ఉండాలి సుమండీ!"

ఆయన అన్నది ముమ్మాటికీ నిజం అయింది. విభజన సంఘంలో కూచున్నపుడే, రోజుకు ఒకటి రెండు పర్యాయాలైనా చర్వితచర్వణంగా, తాను పంజాబులో గవర్నరుగా ఉండగా, మంత్రు లందరూ తన సలహాపైనే కార్యకలాపాలు నడిపేవారని మాకు చెప్పేవాడు.

గవర్నరు అయిన తర్వాత, ఏవో విషయాలు చర్చించాలన్న నెపంపైన మంత్రులను తన యింటికి ఆహ్వానించడం, పరిపాలనా అనుభవంగల గవర్నరు ఉన్నప్పుడు, వారి సలహాపై నడచుకోవడం మంత్రులకు మంచిదని పదే పదే చెప్పడం చేసేవాడు. ఒక పెద్ద పుస్తకంలో ఏయే మంత్రికి ఏయే పాఠాలు చెప్పాలో ముందుగా విషయసూచిక వ్రాసుకొనేవాడు. ఆ క్రమ ప్రకారంగా మాట్లాడ సాగే వాడు. ఒక పదిహేను రోజులు అయ్యేసరికి ప్రతి మంత్రికీ ఆయనంటే గట్టి విముఖత ఏర్పడింది.

ఆయన ప్రకాశంగారిని మాత్రం పిలవడానికి భయపడేవాడు. తాను చెప్పే ప్రకారం వినే తత్వం ప్రకాశంగారికి లేదని ముందే తెలుసుకున్నాడు.

అందుచేత, ప్రకాశంగారిపై ప్రతి 15 రోజులకు ఒకసారి— ప్రధానమంత్రికి గవర్నరులు వ్రాసే రహస్యపు ఉత్తరాలలో ఏవేవో వ్రాసేవాడు.*

---

* స్వాతంత్ర్యానంతరంకూడా గవర్నరులు, పూర్వం గవర్నర్ జనరల్ పేరిట వ్రాసే రహస్యపు ఉత్తరాల లాగా తన పేరిట 15 రోజుల కొక ఉత్తరం చొప్పున, రాజ్యపరిపాలనకు సంబంధించి వ్రాసేటట్టు నెహ్రూగారు ఒక పద్ధతి ఏర్పరిచారు.

ప్రకాశంగారికి, ప్రధానిగారు వ్రాసే ఉత్తరాలు చదువుకొన్నప్పుడు, మాకు - గవర్నరుగారు వహించే పాత్ర అర్థమైంది. ఆ తర్వాత ఆయన, ప్రకాశంగారిని వదిలిపెట్టి, సంజీవరెడ్డిగారిని చేరదీయడానికి యత్నించాడు. కాని ఆయనా ఒక కొరకరాని కొయ్య అని రెండు నెలలు అయ్యేసరికి అర్థం చేసుకున్నాడు.

ఆయన మాకు తెలియకుండానే కార్యదర్శులను ఏవేవో రిపోర్టులు తయారుచేయవలసిందని ఉత్తరువులు పంపేవాడు. మాకు తెలియకుండానే అటువంటి రిపోర్టులు కొన్ని సచివాలయంనుంచి గవర్నరుకు వెళ్ళాయి. దానిపై మేము సచివాలయం వారికి ఒక ఆదేశం ఇచ్చాము. గవర్నరుగారు ఏ విషయం అడిగినా, ఉన్న భోగట్టా అంతా వారు పంపించాలి. కాని ఆ పంపే భోగట్టాకానీ, నివేదికగాని అందుకు సంబంధించిన శాఖ మంత్రి ముందుపెట్టి మరీ పంపాలని ఆదేశించాము.

ఆ తర్వాత, గవర్నరు దగ్గరనుంచి, తన దగ్గరకు వెళ్ళిన ఫైళ్ళకు సంబంధంలేని నివేదికలు కావాలనే ఉత్తర్వులు చాలావరకు తగ్గిపోయాయి.

ఇలా ఉంటుండగా, ఒక రోజున, విద్యాశాఖామంత్రి నన్ను ఇలా అడిగారు: "విశ్వవిద్యాలయం నామినేషన్ల విషయమై, నాకు తెలియకుండానే మీ 'లా' సెక్రటరీగారిని గవర్నరుకు హక్కులు గలవని నివేదిక వ్రాయమంటే, ఆయన అలాగే గవర్నరుకు హక్కు ఉందని ఆధారాలు చూపిస్తూ నివేదిక పంపించారు. గవర్నరు ఈ విషయం

---

రాజ్యపాలనకు సంబంధించి ఏయే విషయాలలో రాష్ట్రాల మంత్రి మండలికి స్వాతంత్ర్యముందో, వేటిలో కేంద్రప్రభుత్వం ప్రమేయం కల్పించుకోవాలో - మన సంవిధానంలో స్ఫుటంగా ఉన్నాయి. అందులోని 355, 356 అనుచ్ఛేదాల ప్రకారం గవర్నరులు అవసరమైతే తప్ప కేంద్ర ప్రభుత్వానికి ఉత్తరాలు వ్రాయవలసిన అగత్యం లేదు. అందుచేత, ప్రధాని రహస్యపు ఉత్తరాలు వ్రాయడానికి చేసిన ఏర్పాటు సంవిధాన తత్వానికి విరుద్ధమని వేరే చెప్పనక్కరలేదు.

నాతో మాట్లాడలేదు. మీ సెక్రటరీగారు నాతో చెప్పలేదు. మీకేమైనా చెప్పారా?''

'లా' సెక్రటరీ నాకుకూడా ఆ విషయం చెప్పకపోవడంవల్ల, నేను ఆయనను పిలిచి ఆ సంగతి అడగగా, ఆయన- నివేదిక పంపించి నట్టు ఒప్పుకున్నాడు.

అప్పుడు నేను ఇలా అన్నాను: ''అయ్యా, కార్యదర్శిగారూ! మీరూ, గవర్నరుగారూ - మాకు తెలియకుండా కార్యకలాపం ఇలా నడిపిస్తే, మన రాజ్యంలో గవర్నరుగారి దొకటి; మంత్రివర్గాని దొకటి, రెండు ప్రభుత్వాలు ఏర్పా టవుతాయి. ఒక రాజ్యంలో రెండు ప్రభుత్వాలు - సాగడం కుదురదుగదా, మన సంవిధానం ప్రకారంగా!''

నేను చెప్పింది సరయిందని గ్రహించి, కార్యదర్శిగారు జరిగిన దానికి మన్నించమన్నారు.

అప్పుడు నేను- గవర్నరుగారు ఏ రిపోర్టు అడిగినా, రిపోర్టు వ్రాయవలసినదే కాని, అది నా ద్వారానే పంపించాలని ఆదేశం ఇచ్చాను. తర్వాత కార్యదర్శి ఫైలు నా ద్వారా పంపించినట్టు, గవర్నరుగారు చూసి, అప్పుడు నాతో ఈ విషయం చర్చిస్తానని ఆహ్వానించారు.

నాతో తాను యూనివర్శిటీ ఛాన్సలర్ అవడంవల్ల, మంత్రి వర్గానికి తెలియకుండా, ఆ పని చేసుకొనే హక్కు తనకు గలదని వాదించాడు. మంత్రి మండలి ప్రసక్తిలేకుండా నివేదికలు వ్రాయమని సచివాలయాన్ని తాను అడగవలసిన అగత్యం లేదు కదా! అన్నాను. ఇంతేకాక, యూనివర్శిటీ పరిపాలన విషయాలలో గవర్నరు చేసిన కార్యం ఏదైనా విశ్వవిద్యాలయ సభ్యులకు అసంతృప్తిగా ఉంటే, విశ్వవిద్యాలయం స్థాపించడం, నడిపించడం పూచీ ప్రభుత్వానిదై నప్పుడు, దానికి సంబంధించి గవర్నరు నామనిర్దేశనాలు (Nominations) చేసినా వాటి పూచీ ప్రభుత్వం భరించవలసి ఉంటుంది గనుక, ప్రజా ప్రభుత్వంలో 'గవర్నరు' అన్న పదం యొక్క-

వినియోగం కాన్స్టిట్యూషనల్ గవర్నరు అనే ఉండాలని నా అభిప్రాయంగా చెప్పాను.

దానికి ఆయన — బొంబాయిలో మంత్రివర్గ ప్రమేయం లేకుండా, గవర్నరు నామినేషన్లు చేస్తున్నాడని, 'లా' సెక్రటరీ ఇచ్చిన నివేదికలో ఉన్నదని నాకు చూపించాడు. దానికి నేను "ఈ రాష్ట్రం, మద్రాసు రాష్ట్రంలోంచి విభజన అయివచ్చింది. మద్రాసు రాష్ట్రంలో, లోగడ మీ స్థానంలో ఉన్నవారు, అనగా గవర్నరుగారు పెట్టిన సంప్రదాయంకూడా చూడండి. యుద్ధసమయంలో 'హోప్' అనే గవర్నరు ఉండేవాడు. నామినేషన్ల విషయమై, ఆయనకు స్వయంగా చేసుకొనే హక్కు ఉందా? లేక మంత్రులున్నట్లయితే, మంత్రుల సలహాపైన చేయాలా? అనే సమస్య చర్చిస్తూ, ఒక పెద్ద ఫైలు ఆయన దగ్గరికి వెళ్ళింది. ఆ నాటికి దేశానికి ఇంకా స్వాతంత్ర్యం రాలేదు. ప్రస్తుత సంవిధానం తయారు కాలేదు. అయినప్పటికీ ఆయన, 'ఈ చర్చతో నాకు సంబంధం లేదు. మంత్రులుంటే, మంత్రి చెప్పిన సలహాపైనే నేను నడచుకొంటాను,' అని వ్రాశాడు. అది మీరు చూడండి," అని ఆ విషయం గవర్నరు దృష్టికి తెచ్చాను.

ఇది—గవర్నరు ప్రతివిషయంలోనూ తనకే అధికారం కావాలి అనే భావంలో ఉండేవాడనడానికి ఉదాహరణగా వ్రాశాను.

ఆయన ఇంతకన్నా ప్రమాదకరమైన పని ఇంకోటి చేశాడు. హైకోర్టులో అదనంగా జడ్జీలను వేయవలసిన అవసరం వచ్చింది. గవర్నరు - జడ్జి నియామకం ఫైలులో ముఖ్య న్యాయమూర్తి సూచించిన పేరుగాని, ముఖ్యమంత్రి సూచించిన పేరుగాని, తనకు అంగీకారం కాకపోతే, తాను సూచించే పేరు వ్రాయడం తప్ప, వేరే చర్చలు చేయడానికిగాని, తాను స్వయంగా వేరే ఫైలు ప్రారంభించడానికిగాని కార్య నిబంధనలు ఒప్పుకోవు.

అయినప్పటికీ, ముఖ్యమంత్రికి తెలియకుండా, ఆ విషయమై, ఒక ప్రత్యేక ఫైలు ఆరంభించడమూ, సచివాలయంలో— అది, ముఖ్యమంత్రిగారికి వచ్చిన ఫైలుతో సంబంధంలేకుండా నడవడమూ జరిగింది.

ఇది సచివాలయంవారు సరిగ్గా కనిపెట్టలేదు. ఒక రోజు అక స్మాత్తుగా, మధ్యాహ్నం 12 గంటల వేళప్పుడు, రాష్ట్రప్రభుత్వ సిఫా రసు కేంద్రప్రభుత్వానికి వెళ్ళడానికి ఇంక వ్యవధి లేదని, సచివాలయం నుంచి కాగితాలు ప్రకాశంగారి దగ్గరికి, నా దగ్గరికి వచ్చేసరికి - అందులో, ఈ వ్యవహారంలో గవర్నరుగారు అనవసరంగా ప్రమేయం కల్పించుకొని ప్రారంభించిన ప్రత్యేక ఫైలు బయటపడింది.

తక్షణం ప్రకాశంగారు ముఖ్యకార్యదర్శిని పిలిపించి, "ఈ వ్యవహారంలో గవర్నరుగారికి, మనకు ఏమి పరిష్కారం కాగలదు?" అని అడిగారు.

అప్పటి కప్పుడే మంత్రివర్గం రెండు భాగాలు అవుతున్న పరి స్థితి ఏర్పడుతూంది. దానికి తోడు గవర్నరుగారు, ఈ క్రొత్త తంటా తీసుకొస్తే ఏమి చేద్దాము అన్నారు ప్రకాశంగారు. అయితే, ఈ ఫైలుకు సంబంధించినంత మటుకు మంత్రులం నేను, ప్రకాశంగారు ఇద్దరమే కావడంవల్ల, ఇది పరిష్కరించే మార్గం సులభమయింది.

"ఫైళ్ళమీద వ్రాత వ్రాసుకోవడంకన్నా, గవర్నరుగారి దగ్గరికి మీరు వెళ్ళి, ఈ ఫైలు ఆయనే ఉపసంహరించినట్టుగా చేయగలరు. చేయండి," అని ముఖ్య కార్యదర్శిగారికి సూచించాను. ముఖ్య కార్య దర్శిగారుకూడా కార్య నిబంధనలు బాగా తెలిసిన వ్యక్తి గనుక, ఆయన గవర్నరుగారి దగ్గరికి వెళ్ళి విషయం బోధపరిచాడు.

దానిపై గవర్నరుగారు, ఆ ఫైలుమీద 'ఈ విషయం ఇటు పైన నడవక్కర లేదు,' అని వ్రాయడమేకాక - ముఖ్య న్యాయమూర్తి, ముఖ్యమంత్రి నిర్దేశించిన పేర్లు తనకూ అంగీకారమే అని, వాటికి సంబంధించిన ఫైలుమీద వ్రాసి, సంతకం చేసేశారు.

# 22

## విశ్వాసరాహిత్య తీర్మానము

అన్ని రంగాలలోను చురుకుగా ముందడుగు వేస్తున్నప్పటికి కూడా, ప్రతిపక్షంవారికి- రాష్ట్రాభివృద్ధి పైని ఆసక్తికన్న, ప్రకాశం

ప్రభుత్వంపై తాము తేగలిగిన విశ్వాసరాహిత్య తీర్మాన వ్యామోహము బలీయమైనది.

చివరికి, 1954 అక్టోబరు చివరలో రెండు విశ్వాస రాహిత్య తీర్మానాలు ప్రతిపాదిస్తామని నోటీసిచ్చారు.

ఆ తీర్మానాలలో ఒకటి యిలా ఉన్నది: "ఈ ప్రభుత్వంలో విధాన సభకు విశ్వాసం లేదు." రెండవ తీర్మానం ఇలా ఉన్నది: "మద్య నిషేధంగూర్చి, రామమూర్తి సంఘం చేసిన సిఫార్సులను అమలు జరపకపోవడంచేత, ఈ ప్రభుత్వంలో విధాన సభకు విశ్వాసం లేదు."

ఇదివరకు ఒక సందర్భంలో, విధాన సభ చర్చలో ఏదైనా ఒక విషయం ఉన్నప్పుడు, ఆ విషయం ఆమోదింపబడడమో, తిరస్కరింపబడడమో, వాయిదా వేయబడడమో—ఈ మూడింట్లో ఏదో ఒకటి జరిగితేకాని, మరొక విషయం ప్రతిపాదించడానికి వీలు లేదని వ్రాశాను.

చర్చించే విషయానికి సంబంధించిన మరేదైనా అది దానికి సవరణగా చర్చకు తేవచ్చును. కాని, ప్రత్యేక విషయంగా సభ ముందుకు తేవడానికి వీలులేదు. ఈ నిబంధనలు చాలా అనుభవంపైన ఏర్పాటు చేసినవి.

ఆ రోజున, స్పీకరుగారు—ముందు వెనుకగా నిర్ణయాలు చేసేవారన్న విషయం ప్రతిపక్షంవారు గ్రహించి, మీద చెప్పిన రెండు తీర్మానాలూ ప్రతిపాదిస్తామని పట్టుబట్టారు.

రెండూ—ఒకే పర్యాయం, ఒకదానికి రెండోది సవరణగా తప్ప, రెండు ప్రత్యేక ప్రతిపాదనలుగా చేయకూడదన్న అభ్యంతరం నేను ఎంత గట్టిగా చెప్పినా, స్పీకరు మామూలు పద్ధతిని, "ఏదో సంసార పక్షాన పోదాము. వోటింగు సమయంలో ఈ విషయం చూసుకొందాము లెండి" అని రెండింటిమీద ప్రత్యేక తీర్మానాలుగా చర్చ చేసుకోవచ్చు అని తన నిర్ణయం తెలిపారు.

చర్చ చాలాసేపు జరిగింది. ప్రతిపక్షంవారు, ప్రభుత్వంపైన చేసే విమర్శలు అలవాటైన పద్ధతిలోనే ఆరంభమయ్యాయి. వోటింగు సమయం వచ్చేసరికి మళ్ళీ పాత చర్చ రెండు తీర్మానాలు ప్రత్యేకంగా వోటుకి పెట్టాలని ప్రతిపక్షంవారు, అలాగు వీలులేదని నేనూ వాదించు కోవడంలో కాలం వృథా అయిపోయింది.

"ఏ తీర్మానం ముందు వోటుకి పెట్టాలి?" అని స్పీకరుగారు నన్నడగగా- అది ప్రతిపక్షంవారికే మేము వదిలి పెట్టేశా మని, ప్రభుత్వ పక్షాన నేను చెప్పాను.

రెండు తీర్మానాలనూ ప్రతిపాదించినవారు, పైన పేర్కొన్న వాటిలో మొదటి దానిని వోటుకి పెట్టాలని అడిగారు.

ఆ మొదటి తీర్మానం సూటిగా ఉంది; అన్ని కారణాలు అందులోనే లీనమై ఉన్నవి.

వోట్లు లెక్కించగా ప్రభుత్వానికి 7 వోట్లు మెజారిటీ వచ్చింది. విశ్వాసరాహిత్య తీర్మానం ఓటమి చెందింది.

స్పీకరుగారు ఎజెండాలో ఉన్న తర్వాత అంశానికి వెళ్ళడమో, లేక సభ వాయిదా వేయడమో చేయవలసి ఉంది. ప్రతిపక్షంవారు, స్పీకరు వైఖరి తెలిసినవారు కాబట్టి రెండవ తీర్మానం వోటుకు పెట్టాలని కేకలు వేశారు - అది ఎంతమాత్రం చెల్లదని మేము ప్రభుత్వ పక్షాన వాదించాము. ఓడిపోయినది - రెండవ తీర్మానంకన్నా బలమైనది; హెచ్చు విస్తారత కలది అన్నది న్యాయశాస్త్ర ప్రతిపాదితమైన సూత్రము.

ఆ కారణమే వారికి బలీయమని తోచిన యెడల - వారు. మొదటిదానికి రెండవదానిలో ఉన్న మాటలు సవరణగా ప్రతిపాదించి ఉండవలసింది కాని వారలా చేయలేదు. ఇంతేకాక, ఈ సమావేశం (సెషన్)లోనే—ఈ కారణం చెప్పి, గవర్నరు సంబోధనోపన్యాసానికి చేసే కృతజ్ఞతా తీర్మానంలో, 'రామమూర్తి కమిటీ సిఫార్సులు అమలు పరచలేదు కనుక చింతిస్తున్నా' మన్నమాట చేర్చాలని వారు సవరణ సూచించడము, అది ఓడిపోవడము కూడా జరిగినవి.

అందుచేత, ఈ రెండవ తీర్మానాన్ని వోటుకు పెట్టడానికి వీలు లేదు అన్న అభ్యంతరంకూడా మరొక శాసన సభ్యులు సహేతుకంగా చెప్పి వాదించారు.

ఏ శాసన సభా చరిత్రలోను లేని విషయం అప్పుడు జరిగింది. 45 నిమిషాలు మా స్పీకరుగారు అక్కడ కూచునే ఆలోచించడం మొదలుపెట్టారు. ఈ లోపున ఎవరికి తోచింది వారు, రెండువైపులా మాట్లాడడం మొదలుపెట్టారు.

ఈ ఆలస్యం అదను చూసుకొని ప్రతిపక్ష నాయకులు, మా పక్షంలో ఉన్న నలుగురు సభ్యులను ఒకరి తర్వాత ఒకరిని చీడీలోకి తీసుకువెళ్ళి, చతురోపాయములని చెప్పిన వాటిలో రెండు, మూడు ఉపాయాలను అవలంబిస్తూన్నట్టు మాలో కొందరు కనిపెట్టారు. కాని, ఆ పరిస్థితులలో ఎవరూ ఏమీ చేయగలిగింది లేదు.

కాంగ్రెసు పార్టీలో ఉన్న ఒకరు లేచి, "మాకు ప్రభుత్వంమీద ఏమీ కోపంలేదు. కాని, సంజీవరెడ్డిగారి అహంభావానికి మా తిరస్కారం తెలియజేయడానికి విశ్వాస రాహిత్య తీర్మానానికి అనుకూలంగా తాను వోటు చేస్తున్నట్టు ప్రకటించాడు.*

మరి ముగ్గురు సభ్యులు, మొదటి తీర్మానానికి ప్రభుత్వ పక్షాన వోటు చేసిన వారు, అయినా, ఈ రెండవ తీర్మానానికి ప్రతిపక్షానికి అనుకూలంగా వోటు చేశారు.

ఏడు వోట్లతో మొదటి తీర్మానంలో గెల్చిన ప్రభుత్వం, ఈ రెండవ తీర్మానంలో ఒక వోటుతో ఓటమి చెందింది.

ఆంధ్రరాష్ట్ర ప్రథమ ప్రభుత్వం పతనమైంది.

ప్రకాశంగారు- కొన్నాళ్ళ క్రిందట, ఎప్పుడైనా ఓడవలసి వస్తే స్పీకరుగారి తప్పుడు రూలింగు వల్లనే ఓడిపోతామని హాస్యధోరణిలో చెప్పిన జోస్యం నిజమైంది.

ప్రతిపక్షం వారి ముఖాలు వికసించాయి. అంతకన్న హెచ్చుగా

---

* ఆ 13 నెలలలోను, ఆయన- నలుగురూ విసేలాగు మాట్లాడింది అదే ప్రథమం అనుకుంటాను.

గవర్నరు త్రివేదిగారి ముఖం వికసించిందని వెంటనే చూసినవారు చెప్పారు.

ప్రతిపక్షుల బలంవల్ల కాకపోయినా, నలుగురు స్వపక్షీయుల దొంగపోటువల్ల, అనుకోడానికి వీలులేని క్షణంలో, ప్రభుత్వం పతన మయింది.

ఈ సంఘటన జరిగిన తర్వాత, మంత్రిమండలి ప్రకాశంగారి యింట్లో సమావేశ మయింది. ఆ సమావేశంలో తీర్మాన పూర్వకంగా గవర్నరు గారికి ఒక లేఖ వ్రాశాము: "ఈ రోజున, శాసన సభలో- మా ప్రభుత్వంపైని, విశ్వాస రాహిత్య తీర్మానం ఒకటి ఆమోదింప బడింది. అందుచేత, ఇందుమూలంగా వెంటనే మా ప్రభుత్వం రాజీ నామా దాఖలు చేస్తున్నది. ప్రస్తుతం శాసన సభలో వివిధ పార్టీల సంఖ్యాబలం బట్టి చూస్తే, ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పడ గలిగే పరిస్థితులు లేవు. అందుచేత, శాసన సభ రద్దుచేసి, త్వరలో క్రొత్త ఎన్నికలు జరిపించవలసిందని మా సలహా. మా రాజీనామా, మా సలహా అంగీకరించవలసిందని మా కోరిక."

ప్రకాశంగారు ఈ ఉత్తరంమీద సంతకం పెట్టి, సంజీవరెడ్డి గారి చేతికిచ్చి, ఆయనను స్వయంగా వెళ్ళి గవర్నరుకు అందజేయమని కోరారు. ఆయన వెంటనే గవర్నరు దగ్గరికి వెళ్ళి, ఆ లేఖ అంద జేశారు. విశ్వాస రాహిత్య తీర్మానం రెండుగంటల తర్వాత పాసయి నట్లు జ్ఞాపకము. మా రాజీనామా 5 గంటల లోపునే పంపించేశాము.

నేను ఇంటికి వెళ్ళేసరికి, మాకు వ్యతిరేకంగా ఉన్నవారిలో కొందరు వచ్చి, "ఎవరూ అనుకోని దుష్ఫలితం ప్రాప్తించింది. మీరు రాజీనామా ఉపసంహరించవలసింది. మేము, మీ ప్రభుత్వాన్ని బల పరుస్తాం" మని చెప్పారు.

కాని, వారి అభిమానానికి కృతజ్ఞత తెల్పి, "ఉపసంహరించే లక్షణం మంత్రివర్గంలో ఎవరికీ లేదు. ప్రకాశంగారికి అసలే అటువంటి భావం ఉండదు. మీరు మాకు నచ్చజెప్పే ప్రయత్నం మానుకోండి," అన్నాను.

అందుచేత, ఈ రెండవ తీర్మానాన్ని వోటుకు పెట్టడానికి వీలు లేదు అన్న అభ్యంతరం కూడా మరొక శాసన సభ్యులు సహేతుకంగా చెప్పి వాదించారు.

ఏ శాసన సభా చరిత్రలోను లేని విషయం అప్పుడు జరిగింది. 45 నిమిషాలు మా స్పీకరుగారు అక్కడ కూచునే ఆలోచించడం మొదలుపెట్టారు. ఈ లోపున ఎవరికి తోచింది వారు, రెండువైపులా మాట్లాడడం మొదలుపెట్టారు.

ఈ ఆలస్యం అదను చూసుకొని ప్రతిపక్ష నాయకులు, మా పక్షంలో ఉన్న నలుగురు సభ్యులను ఒకరి తర్వాత ఒకరిని చీడీలోకి తీసుకువెళ్ళి, చతురోపాయములని చెప్పిన వాటిలో రెండు, మూడు ఉపాయాలను అవలంబిస్తూన్నట్టు మాలో కొందరు కనిపెట్టారు. కాని, ఆ పరిస్థితులలో ఎవరూ ఏమీ చేయగలిగింది లేదు.

కాంగ్రెసు పార్టీలో ఉన్న ఒకరు లేచి, "మాకు ప్రభుత్వంమీద ఏమీ కోపంలేదు. కాని, సంజీవరెడ్డిగారి అహంభావానికి మా తిరస్కారం తెలియజేయడానికి విశ్వాస రాహిత్య తీర్మానానికి అనుకూలంగా తాను వోటు చేస్తున్నట్టు ప్రకటించాడు.*

మరి ముగ్గురు సభ్యులు, మొదటి తీర్మానానికి ప్రభుత్వ పక్షాన వోటు చేసిన వారు, అయినా, ఈ రెండవ తీర్మానానికి ప్రతిపక్షానికి అనుకూలంగా వోటు చేశారు.

ఏడు వోట్లతో మొదటి తీర్మానంలో గెల్చిన ప్రభుత్వం, ఈ రెండవ తీర్మానంలో ఒక వోటుతో ఓటమి చెందింది.

ఆంధ్రరాష్ట్ర ప్రథమ ప్రభుత్వం పతనమైంది.

ప్రకాశంగారు- కొన్నాళ్ళ క్రిందట, ఎప్పుడైనా ఓడవలసి వస్తే స్పీకరుగారి తప్పుడు రూలింగు వల్లనే ఓడిపోతామని హాస్యధోరణిలో చెప్పిన జోస్యం నిజమైంది.

ప్రతిపక్షం వారి ముఖాలు వికసించాయి. అంతకన్న హెచ్చుగా

* ఆ 13 నెలలలోను, ఆయన_ నలుగురూ వినేలాగు మాట్లాడింది అదే ప్రథమం అనుకుంటాను.

కాంగ్రెసుపార్టీ అంగీకరిస్తే భవిష్యత్తు ఉంటుంది. లేకపోతే, 'ఎవరికి వారే యమునా తీరే' అన్నట్టు, అందరూ చీకాకు పడవలసిన అవస్థ వస్తుంది.''

నాకు తోచిన పై విషయాలు వారితో చెప్పగా, వారు వెంటనే అంగీకరించారు. పత్రికలు కూడా సుముఖతను చూపించాయి. అయినా రాష్ట్రపతి ఉద్ఘోషణ 6 నెలలు అమలు జరగడానికి ఏర్పాటు కావడం చేత, 4, 5 నెలల వరకు అన్ని పార్టీలవారు తమ తమ ఎన్నికల సన్నాహాలు చేసుకొనే అవకాశం వచ్చింది

ఎన్నికల కాలం వచ్చేసరికి, కాంగ్రెసు పార్టీవారు తమ యత్నం తాము చేసుకుంటూ ఉన్నారు. నేను చెప్పిన సూత్రం- ఆ తేదీ నాటికి, రాష్ట్ర కాంగ్రెసు సంస్థలో అధికారంలో ఉన్నవారు పాటించడానికి ఇష్టులుగా లేరు. అయితే, మరో ప్రక్కనుంచి ప్రకాశంగారిని కాంగ్రెసులో కలిసిపోవలసిందని, ఆయనమీద అభిమాన మున్నవారు వత్తిడి చేయడం మొదలు పెట్టారు.

ఇలా ఉండగా, గుంటూరులో కాంగ్రెసుపార్టీ సమావేశం జరిపారు. ప్రజాపార్టీ సమావేశాన్ని అదే సమయంలో గుంటూరులో ఏర్పాటు చేశాను. మా సమావేశం జరుగుతూండగా, కాంగ్రెసు పార్టీవారి ఆదేశ ప్రకారం ముగ్గురు నలుగురు కాంగ్రెసు సభ్యులు మా సమావేశ వేదికకు ఏదో సందేశం ఇవ్వడానికి వస్తామని కబురు పెట్టారు. వారిని నేను ఆహ్వానించాను.

ఆ వచ్చిన వారిలో—శ్రీమతి అమ్మన్నరాజా, శ్రీమతి కడప రామసుబ్బమ్మగారు ఉన్నారు. వారు చెప్పిన సందేశ సారాంశం ఇది: "ప్రజాపార్టీవారు, కాంగ్రెసువారు కలిసి 13 నెలలు రాజ్యం నడిపించారు. హెచ్చయిన భేదాభిప్రాయాలు ఇద్దరి మధ్యనూ కనిపించలేదు ప్రజాపార్టీలో ఉన్నవారు 90 శాతం పూర్వ కాంగ్రెసువాదులే. కనుక, మొత్తంమీద, ప్రజాపార్టీ అంతా కాంగ్రెసులో పునః ప్రవేశించవలసింది.''

లోగడ జరిగిన కొన్ని విషయాలవల్ల, ప్రజాపార్టీలో ఎవరూ

కాంగ్రెసులో కలియడానికి అప్పుడు అంగీకరించలేదు. అందుచేత, రాయబారులు వారి సభకు వెళ్ళిపోయారు.

ఆ రాత్రి, ప్రకాశంగారిని చూడడానికి, ఆయన బసకు వెళ్ళిన పార్టీ సభ్యులు కొందరు, ఆయనను, 'కాంగ్రెసులో కలిసిపోతున్నారన్న వార్త వాస్తవమేనా?' అని ప్రశ్నించారు. ఆయన 'చేరితే ఏం ప్రమాదమూ?' అని మారుప్రశ్న వేశారు.

ఆయన నన్ను, "ఏమి! కాంగ్రెసులో చేరకూడదా నువ్వు?" అని అడిగారు. పార్టీలో ఎవరికీ ఇష్టం లేదని జవాబిచ్చాను. "సరే, అలాగయితే మీరు అనుకున్నట్టే చేసుకోండి," అన్నారు ఆయన

తర్వాత కొంత కాలానికి ఆయన ఢిల్లీ వెళ్ళడం తటస్థించింది. అది డిసెంబరు నెల. ఆయన ఢిల్లీనుంచి నా కొక తంతి యిచ్చారు. అందులో "తనను కలుసుకోమని నెహ్రూగారినుంచి ఆహ్వానం వస్తే, నువ్వు తిరస్కరించబోకు సుమా!" అని ఉంది.

మరి రెండుమూడు రోజుల్లో అలాగే నెహ్రూగారి నుంచి, అందులో వ్రాసిన తేదీకి వచ్చి, తనను కటకంలో కలుసుకోవలసిందని ఆహ్వానం వచ్చింది. నేను ఆయన అన్న తేదీకి కటకం చేరుకున్నాను.

మధ్యాహ్నం- నెహ్రూగారు, నేను ఒకరి నొకరు పలకరించుకోవడం, గవర్నరుగారి బసలో జరిగింది. నెహ్రూగారు, నన్ను మొదట బలవంతరాయ్ మెహతా*తో మాట్లాడవలసిందనీ, రాత్రి భోజనానంతరం కలిసి కూర్చుందామనీ చెప్పి, మెహతాగారిని, నన్ను ఒక గదిలో కూచోపెట్టి వెళ్ళిపోయారు.

మెహతాగారు చెప్పిందే చెప్పుతూ, రెండు గంటల సేపు, నన్ను కాంగ్రెసులో చేరమని మనోక్షోభనం చేయసాగారు. కాని, అటువంటిదానికి లొంగే లక్షణం నాలో లేదని ఆ రెండు గంటలతర్వాత ఆయన గ్రహించారు.

---

* ఆయన ఆలిండియా కాంగ్రెస్ కమిటీకి ఒక జనరల్ సెక్రటరీగా ఉండేవారు. తర్వాత, భాషా రాష్ట్రాలు ఏర్పడిన పిదప గుజరాత్‌కు ముఖ్యమంత్రి అయ్యారు. అలా ఉన్నప్పుడే పాకిస్థాన్‌కు, మనకు ఒక చిన్న యుద్ధం ప్రారంభమయింది. రాష్ట్ర

అప్పుడు ఎన్నికల విషయమై చర్చ ఆరంభించగా, నేను- ఒకే ఎలక్షన్ ప్రణాళిక (మానిఫెస్టో), ఒకే సెలక్షన్ కమిటీ అన్న నా సూత్రాన్ని చెప్పగా, ఆయన తొందరగానే దానిలోని బలం గ్రహించి, అంగీకరించారు.

రాత్రి భోజనానంతరం నెహ్రూగారు, బలవంతరాయ్ మెహతా గారు, నేను- గవర్నరుగారి డ్రాయింగ్ రూములో కూచోడానికి వెళ్ళాము.

ఒక కుర్చీపైని రంగు రంగుల శాలువ వంటిది కనిపించగా, నెహ్రూగారు దానిలో కూచోబోయేసరికి, చటుక్కున క్రిందికి దిగజారారు. ఆయన, ఆ రోజుల్లో బలంగా ఉన్నవారే గనుక, ఆ ప్రక్కనున్న మేము వెంటనే ఆయనకు సాయపడి నిల్చోబెట్టడంలో కష్టమేమీ లేకపోయింది. అప్పుడు, బాగా ఉన్న సోఫాచూసుకొని ఆయన కూచున్నారు.

ఆయనకు- నన్ను పేరుపెట్టి పిలిచేటప్పుడల్లా, నా పేరు చివర ఉన్న 'ధం' అన్న అక్షరాన్ని బలంగా, గట్టిగా ఉచ్చరించడం పూర్వపు అలవాటు. నేను కాంగ్రెసు వదిలిన తర్వాత మేము తరచుగా కలుసుకోకపోయినా, నన్ను ఆ విధంగా పిలవడాన్ని ఆయన మరిచిపోలేదు. పేరుపెట్టి పిలిచి, ఆయనే సంభాషణ ప్రారంభించారు: ''నీకేమో కాంగ్రెసులో పునఃప్రవేశం చేయడానికి మానసికమైన అభ్యంతరాలున్నాయని బలవంతరాయ్ మెహతా అంటున్నాడు. అది ఎంతవరకు సరి అయిన అభిప్రాయం?''

దానిపై నేను,''మనం కలుసుకున్నది,ఎన్నికల వ్యూహం పన్నడం కోసం కదా? పార్టీ విడిచిపెట్టి, మీ పార్టీలో చేరాలన్నట్లయితే- అది ఏదో సహజమైన, చారిత్రక ప్రవాహంలో జరగవలసిన పని. కాని, ఎన్ని

---

పరిపాలనా కార్యక్రమ సందర్భంలో, ఆయన వెళుతున్న విమానాన్ని పాకిస్తాన్ వారు కూల్చివేశారు. ఆయన అసువులు బాశాడు. భారతదేశం అనుపమాన దేశభక్త రత్నాన్ని కోల్పోయింది.

కలకోసం పార్టీ మారడంవల్ల ప్రజలకు అంతకుముందు మాలో ఉన్న విశ్వాసం తగ్గికూడా పోవచ్చు. అందుచేత, కాంగ్రెసులో కలియడం అన్న చర్చ వదలిపెట్టి, ఎన్నికలలో మనం చేయవలసిన కార్యక్రమం గూర్చి నిర్ణయానికి వస్తే మంచిది. ఏడీ పార్టీలుగా మనం పరస్పరం నియోజక వర్గాలు పంపకం చేసుకొంటే, ప్రజలలో నైతికంగా హెచ్చు విశ్వాసం కలగడానికి అవకాశం లేదు. అందుచేత, నేను బలవంత రాయ్ మెహతాగారితో సూచించిన సూత్రం మీకు వివరిస్తాను. ఏయే పార్టీలు ఈ 13 నెలలు ఆంధ్రలో కలిసి రాజ్యం చేశాయో, అవి- ఏక మైన ఎన్నిక ప్రణాళికతో, ఏకమైన సెలక్షన్ కమిటీ ఏర్పాటు చేసుకొని, ప్రజల ముందుకు ఏకగ్రీవంగా వెళ్ళినట్టయితే మనకు విజయం తప్పదు," అన్నాను.

నా ఈ మాటలు విన్నతర్వాత, ఆయన సూక్ష్మగ్రాహి గనుక, వెంటనే- అంగీకరించా నన్నమాట ప్రత్యేకంగా అనక, "మీ కల యికలో ప్రొఫెసర్ రంగాగారి పార్టీని కలిపితే బాగుంటుందా?" అని యథాలాపంగా అడిగారు.

నేను వెంటనే, "ఆయన ఈ పార్టీలతో కలియడం దేశానికీ, మన ఎన్నికలకూ కూడా చాలా మంచిది. ఆయనను తప్పకుండా కలియ వలసిందని ఎలాగూ కోరదలుచుకొన్నాను," అన్నాను.

దానిపై నెహ్రూగారు "నేను త్వరలో ఇండోనేషియా ప్రాంతా లకు వెళ్ళిపోతున్నాను. నేను వెళ్ళేముందు, మీరు ఢిల్లీ వచ్చి కలుసుకొంటే- లాల్ బహదూర్ శాస్త్రీనీ, మౌలానా సాహేబునీ, మిమ్మల్ని కలిపివేస్తాను. నీవు చెప్పినట్టు మిగిలిన కార్యక్రమం వారితో నడిపించవచ్చును. నేను విదేశ పర్యటననుంచి తిరిగి వచ్చేసరికి, కొంత కార్యక్రమం సాగ నివ్వండి," అన్నారు.

తర్వాత మామూలుగా కరచాలనాలు మొదలైన వీడ్కోలు లాంఛ నాల అనంతరం, సగం రాత్రివేళ, ఎవరి త్రోవన వారు వెళ్ళిపోయాము.

తెల్లవారే సరికి—నెహ్రూగారికి, నాకు మధ్య జరిగిన ఏర్పాట్లు

పెద్ద అక్షరాలతో పత్రికలలో పడ్డాయి. చెన్నపట్నం పత్రికలలోనూ పడే ఉంటాయి.

అప్పటికి, ఏలూరులో రాష్ట్రకాంగ్రెసు కమిటీవారు సమావేశం కావడానికి ఏర్పాటు జరిగింది. ఇక్కడ వీరు, "ఈ విశ్వనాథం ఎవరు? ఈయనతో, మాకు ఒడంబడిక ఏమిటి? పత్రికలలోపడ్డ వార్తలు నమ్మడం ఎలా? మాకు స్వయంగా నెహ్రూగారినుంచి కబురువస్తే తప్ప, మా ఏర్పాట్లు మావే," అని పత్రికలవారి ముందు చెప్పగా, మర్నాడు పత్రికలలో ఆ వార్తలన్నీ పడ్డాయి.

పరిస్థితి చెడిపోకముందే, బలవంతరాయ్ మెహతాగారు—కళా వెంకటరావు ప్రభృతులకు కటకం ఏర్పాట్లు వివరించడానికి ఒక కాంగ్రెసు పెద్దను పంపడం జరిగింది.

ఆ పైని కాంగ్రెసు పార్టీవారు సజావుగా నాతో మాట్లాడి, మిగిలిన కార్యక్రమం సాఫీగా జరపడానికి అంగీకరించారు.

నే నీలోపునే ఆచార్య రంగాగారికి జరిగినదంతా చెప్పగా, భవిష్యత్ దృష్ట్యా, ఆయన ఈ కలయికలో భాగస్వామి కావడానికి వెంటనే అంగీకరించారు.

సోషలిస్టు నాయకులైన పి. వి. జి. రాజుగారినికూడా ఈ కలయికలో చేరవలసిందని నేను ఆహ్వానించినా, ఆయన నిరాకరించారు.

### ఢిల్లీలో నెహ్రూగారితో సమావేశము

నెహ్రూగారు చెప్పిన తేదీకి మేము ఢిల్లీ వెళ్ళాము. అక్కడ, రంగాగారు కూడా హాజరయి ఉన్నారు. సమావేశంలో లాల్‌బహదూర్ శాస్త్రిగారు కూడా కూచున్నారు.

కర్నూలులో ప్రభుత్వం జరుగుతున్నప్పుడు—కాంగ్రెస్ పార్టీకి చెంది, విశ్వాసరాహిత్య తీర్మానం వోటింగులో ప్రభుత్వానికి వ్యతిరేకంగా వోటు చేసినవారిని తప్ప, మిగిలిన వారందరిలో ఎవరు చేరినా చేర్చుకోవచ్చునన్నారు నెహ్రూగారు.

దానిపై రంగాగారు అటువంటి ఒక పేరు చెప్పారు. కాంగ్రెస్ పార్టీకి చెంది, విశ్వాసరాహిత్య తీర్మానానికి వ్యతిరేకంగా వోటు చేసిన

ఒకరి పేరు చెప్పి, ఆ వ్యక్తిని ఈ ఏర్పాటులోంచి తప్పించగూడ గూడదన్నారు.

ఆ పేరు చెప్పేసరికి, నెహ్రూ గారు మండిపడి, "ఆ.... పేరు మీరు ఎత్తకండి" అని కోపంగా, మరి మారుమాట చెప్పడానికి వీలు లేదన్నట్టు అన్నారు.

నెహ్రూగారు అంత కోపంగా ఏ వ్యక్తి గురించి అయినా అప్పుడు అన్నమాట మరే సందర్భంలోనూ నేను ఆయన నోటి వెంట వినలేదు.

ఇది అయిన తర్వాత, నెహ్రూగారు మమ్మల్ని లాల్‌బహదూర్ గారికి అప్పజెప్పారు.

అప్పుడింకా పార్లమెంటు జరుగుతున్న రోజులు. పార్లమెంటు భవనంలో గల శాస్త్రిగారి గదిలో మిగిలిన కార్యక్రమం ఆరంభమయింది. మేనిఫెస్టో (ప్రణాళిక)లో ఏయే అంశాలు చేర్చుకోవాలనే విషయంపై పది నిమిషాలు చర్చించాము అది నిశ్చయం కాగానే, మర్నాడు కలుసుకుందామని అప్పటికి విడిపోయాము.

మర్నాడు శాస్త్రిగారి గదిలోకి నేను వెళ్ళేసరికి, ఆయన ఒక ప్రణాళిక ముసాయిదా తయారుచేసి ఉన్నారు. అది దీర్ఘమైనది కాదు. మూడు పార్టీలకు అంగీకారమైన భాషలో వ్రాసి ఉంది.

అయితే, ఈ మూడు పార్టీలకూ కలిపి ఆయన "సంయుక్త కాంగ్రెసు విధానమండలి పార్టీ," అని పేరు పెట్టారు. నేను ఆ పేరు వద్దన్నాను. మేము కాంగ్రెసులో విలీనం కానపుడు, మా పార్టీ సభ్యులు, దానికి అంగీకరించరని నేను చెప్పాను. ఈ సమస్య చాలాసేపు తేల లేదు. శాస్త్రిగారు- ఒక మనిషి నిచ్చి, మౌలానా అజాద్‌గారి గదికి పంపించారు.

అజాద్‌గారితో నాకు చను వెక్కువ లేకున్నా నన్ను, ఆయన- 1926 నుంచి ఆలిండియా కాంగ్రెస్ కమిటీ సమావేశాలలోను, తర్వాత 1946 లో ప్రకాశంగారి మంత్రివర్గ నిర్మాణ సంబంధమయిన తగాదాలోను తరచుగా చూస్తూండడంవల్ల, నా విషయం తెలిసినవారే. ఆయన

కొంత చనువు తీసుకొని నాతో అన్నారు: "మీ రెండు పార్టీలు-అంటే, ప్రజాపార్టీ, కృషికార్ లోక్‌పార్టీ కాంగ్రెసు పార్టీకన్నా తక్కువ సంఖ్యాబలం కలవి. అందుచేత, కాంగ్రెస్‌పార్టీ పేరు శాస్త్రి గారు ఉంచారు. మీతో కలియడంవల్ల 'సంయుక్త' అన్నమాట చేర్చారు. మీ పార్టీల వ్యక్తిత్వం ఇందులో పోలేదు. కాంగ్రెసు పార్టీ-మీ శాసన సభలలో ఉన్న పార్టీ లన్నిటికన్నా పెద్దది. దాని పేరే లేకుండా చేయడం మీ ఉద్దేశమా? ఈ సమయంలో అందరూ కొంత ఉదారంగా వ్యవహరించాలి."

కె. ఎల్. పి. ప్రతినిధి ఈ పేరు విషయం అంతగా పట్టించుకో లేదు. ఆ పరిస్థితిలో—అంతవరకు వచ్చిన కలయిక 'పేరు' కోసం నా ప్రతిపాదనవల్ల పాడు చేయడం మంచిదికాదని నా మనసులో ఊహించుకొని నేను కూడా అంగీకరించాను. దీంతో మూడు పార్టీల కలయిక, ఒకే ఎలక్షన్ మేనిఫెస్టో అన్న నా ఎన్నికల వ్యూహం—అంతవరకు జయప్రదమైంది. ఇక మిగిలినవి అభ్యర్థులను ఎన్నుకొనే సంఘం ఏర్పాటు చేయడము; కూచుని కార్యక్రమం ఆరంభించడమూ.

## సెలక్షన్ సంఘము - కార్యక్రమము

సెలక్షన్ సంఘంలో కాంగ్రెసు తరపున పార్టీ అధ్యక్షులయిన గోపాలరెడ్డిగారు, ప్రజాపార్టీ తరపున నేను, కె. ఎల్. పి. తరపున రంగాగారు పంపిన కందుల ఓబుల్‌రెడ్డిగారు సభ్యులము. మా కార్యక్రమం జరుపుకోడానికి విజయవాడలో జి. ఎస్. రాజుగారి భవనాన్ని రంగస్థలంగా ఎన్నుకున్నాము.

జి. ఎస్. రాజుగారు సంపన్న గృహస్థు. ఔషధాల ఉత్పత్తి పరిశ్రమ ఒకటి అప్పుడే స్థాపించి, అభివృద్ధి చెందుతూన్నవారు. తర్వాతి రోజులలో కాంగ్రెసులో చేరి, శాసన మండలికి ఉపాధ్యక్షుడుగా కూడా కార్యభారం వహించిన ప్రముఖులు. ఆయన తన భవనం మా సమావేశానికి ఇవ్వడమేగాక, అక్కడి సమావేశానికి వచ్చిన మాలో చాలామందికి, ఆతిథ్యం కూడా ఇచ్చేవారు.

మా ఉపసంఘంలో మొదట ఒక తీర్మానం చేసుకున్నాము.

మాలో ఎవరు ఏ పేరు చెప్పినా ముగ్గురి అంగీకారంపైననే ఆ పేరు గల వ్యక్తిని అభ్యర్థిగా నిర్ణయించాలి. ఏ పేరు విషయంలోనైనా మాలో భేదాభిప్రాయాలు వస్తే, దాని విషయం ఢిల్లీలో లాల్ బహదూర్ శాస్త్రిగారి సముఖాన చర్చించాలనీ, అక్కడా నిర్ణయం కాకుంటే,ఆ విషయం శాస్త్రిగారి తీర్పుకు వదిలిపెట్టాలనీ తీర్మానించాము.

1948, 49, 50 లలో ఏయే తెలుగు మంత్రులపై, ప్రకాశం గారు—అధికార దుర్వినియోగం చేశారని ఆరోపించారో, వారిని అభ్యర్థులుగా ఉంచరాదని నేను ప్రతిపాదించాను.

ఆ సంబంధించిన మంత్రులు 1952 ఎన్నికలలో, ఆ ఆరోపణలవల్ల ఓడిపోయి, మూడేండ్లకు పైగా శాసన సభ్యత్వం పోగొట్టుకున్నారు కనుక- ఆ ప్రసక్తి తిరిగి ఇప్పుడు తేవడం కూడదని, కమిటీ సభ్యులేగాక, ఇతర పెద్దలు నలుగురూ ఏకమై అనడంవల్ల నా ప్రతిపాదన వీగిపోయింది.

వారికి ఈ ఎన్నికలలో ప్రయోగించిన క్రొత్త వ్యూహం, దాని పలుకుబడీ ఉపయోగపడి, వారందరూ జయంపొందడమేగాక, యథాతథంగా పెద్ద పెద్ద పదవులు పొందగలిగారు.

జిల్లావారీగా తీసుకొని మేము 60, 70 శాతం అభ్యర్థులను బెజవాడలోనే నిర్ణయించగలిగాము. వివాదాస్పదమైన అభ్యర్థుల విషయం నిర్ణయించడానికి అనుకున్నట్టుగానే ఢిల్లీ వెళ్ళాము. అది విపరీతమైన చలికాలము. ఢిల్లీలో శాస్త్రిగారి భవనంలో పగలు కొంతసేపు, రాత్రి కొంతసేపు చర్చలు జరిపాము.

అక్కడ చర్చలు జరుగుతుండగా, కాంగ్రెసు పక్షం పేర్లు రెండు విధాలుగా ఉన్నట్టుగా మాకు కనిపించాయి. వారిలో కొందరు గోపాలరెడ్డిగారి పలుకుబడివల్ల, కొందరు సంజీవరెడ్డిగారి పలుకుపడి వల్ల ముందుకు త్రోసుకు వస్తున్నట్టు మాకు కనిపించింది.

రంగాగారి పార్టీవారు తమ అభ్యర్థుల పేర్లను చెపుతున్నప్పుడు, గోపాలరెడ్డిగారు తమ అభ్యర్థుల పేర్లను చెపుతున్నప్పుడు ఒకరి నొకరు హెచ్చుగా మద్దతు చేసుకుంటున్నట్టు పైకి కనిపించేది.

వివాదాస్పదమైన కొన్ని పేర్లు శాస్త్రిగారికి వదిలినప్పుడు, ఆయన వ్రాతపూర్వకంగా తన తీర్పు చేసేవారు. అందులో చాలా తీర్పులు నా వాదాన్ని త్రోసిపుచ్చేవిగానే ఉండేవి.

ఎలాగయితేనేమి 196 సీట్లకు (స్థలాలకు) 167 నియోజక వర్గాలలో అభ్యర్థులను నియమించాము. ఈ 167 నియోజక వర్గాలలో, 138 ఏక సభ్య నియోజక వర్గాలు.

ఎన్నికల్లో, నావల్ల ప్రతిపాదింపబడ్డ ఎన్నికల వ్యూహం చాలా బాగా పనిచేసింది. 196 సీట్లలోనూ, 147 యునైటెడ్ కాంగ్రెస్ లెజిస్లేచరీ పార్టీకి సంప్రాప్తించినవి. పాత శాసన సభలో దాదాపు 40 సీట్లదాకా ఉన్న కమ్యూనిస్టు పార్టీకి, ఈ మారు 14 సీట్లే దక్కాయి.

నేనుమాత్రం నా ఎన్నికలో ఓడిపోయానని ఇదివరలోనే వ్రాశాను.

తొందరపడి మా మీద విశ్వాసరాహిత్య తీర్మానం తేకపోయి ఉంటే, ఇంకా ప్రతిపక్షంవారు తమ మాట జరిపించుకుంటూ ఉండగలిగేవారు. ప్రగతిపథాన పయనించే ప్రకాశంగారి మంత్రివర్గం జరుగుతూండడానికి అవకాశం ఉండేది. ఆ విధంగా, ఆయన ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలోనే విశాలాంధ్ర ఏర్పాటయి, ప్రాంతీయఖండాలు లేనట్టి విశాలాంధ్ర పరిపాలన సామరస్య సౌష్ఠవాలు కలిగిఉండేది.

అయితే, జరగవలసిన చరిత్రను ఎవరు మార్చగలరు?

## నాయకుని ఎన్నిక విషయము

ఢిల్లీలో ఉన్న కాంగ్రెసు అధిష్ఠాన వర్గం వారికి, తమ బలవత్తరమైన ప్రమేయం లేకుండా, పార్టీ శాసన సభ్యులు నాయకుని ఎన్నుకోవడం ఇష్టంలేదు. అందుచేత, లాల్‌బహదూర్ శాస్త్రి, కాంగ్రెసు అధ్యక్షులు దేబర్ గారలు విజయవాడకు వచ్చారు. వారు- చర్చలు, సలహాలు వారితో వీరితో చేశారే కానీ, ప్రకాశంగారితో ఏమీ చర్చించలేదు.

ప్రజాపార్టీనుంచి వచ్చిన సభ్యులమంతా రామమోహనరాయ్ హాలులో సమావేశ మయ్యాము. మంచి ఎండవేళ. ప్రకాశంగారు ఆ హాలు దగ్గరికి వచ్చి, లోపల ఉన్న నాకు కబురు చేశారు.

నేను దిగి వచ్చేసరికి ఆయన- కారులో, తడి తువ్వాలు ఒకటి నెత్తిపైన వేసుకుని, దగ్గరగా ఉన్న ఒక పల్లెటూరికి వెళ్ళుతున్నట్లు చెప్పారు.

ఉమ్మడి రాష్ట్రంలో మేమంతా ఉన్నప్పుడు, ఒక తెలుగు మంత్రిపై, ఒక డెటన్యూ సంబంధంలో ఆయన చేసిన అధికార దుర్వినియోగం గూర్చి, ప్రకాశంగారికి ఎఫిడవిట్ (వ్రాసిన విషయాలు సత్యమనే ప్రమాణ) పూర్వకంగా ఆ గ్రామంలో ఒకరు ఫిర్యాదు చేశారు.

అయితే- ఆరేడేండ్ల క్రింద జరిగిన వ్యవహారం గనుక, అప్పుడు ఆ విషయాలను గూర్చి దోషారోపణ చేసినవారు యిప్పుడు అవసరమైతే సమర్థిస్తారో లేదో నిర్ధారించుకొనేందుకు, ఆ మండు ఎండలో, అట్టి వ్యవధిలేని ఆ రోజున, అత్యవసరంగా ఆయన బయలుదేరారు.

83 సంవత్సరాల వయసులో ఆయన కున్న పట్టుదల, రాజ్యం పెద్దరికంలోకి రావలసినవారు, అధికార దుర్వినియోగం చేయనివారు కావాలనే దీక్ష అక్కడ ఉన్న మా కందరికీ ఆశ్చర్యం కలిగించాయి.

ఆ ఎండలోనే తిరిగి వచ్చి, ఆయన తాము బసచేసిన పి. డబ్ల్యూ. డి వసతి గృహంలో నిద్రపోయారు.

ఆ సమయంలో నేను అక్కడికి ఫర్లాంగు కన్న తక్కువ దూరంలో ఉన్న ప్రభుత్వ అతిథి గృహానికి (స్టేట్ గెస్ట్ హౌస్) దేబరుగారిని, శాస్త్రిగారిని చూద్దాని కని వెళ్ళాను.

ప్రకాశంగారు బసచేసిన గదికి ప్రక్కగదిలోనే తామూ బస చేసినా- సంజీవరెడ్డిగారు, ఆయనతో అట్టే దోస్తీగా మాట్లాడుతున్నట్టు కనిపించలేదు. సంజీవరెడ్డిగారు తన మటుకు తాను, తానే నాయకుడుగా ఎన్నిక కావాలనే యత్నంలో ఉన్నట్టు కనిపించింది.

కాని, కాంగ్రెసు పక్షంవాడు గనుక, ఆయన- దేబర్, శాస్త్రి గారలతో మంచిగా ఉండడానికి యత్నించడం సహజము.

నేను- దేబర్, శాస్త్రిగారలను చూడ్డానికి స్టేట్ గెస్ట్ హౌస్‌కి వెళ్ళగా, వారు ఈ విషయంలో నా అభిప్రాయం తెలియజేయవలసిందని కోరారు.

అందుకు, ప్రకాశంగారితో మీరు మాటాడినట్టు కనిపించదే, అన్నాను.

"లేదు. ఇంకా మాట్లాడలేదు. ఆయన పెద్దవారయిపోయారు గదా!" అని, ప్రకాశంగారిని త్రోసిపారేశామని ధ్వనించేటట్టు వారు మాట్లాడారు.

అప్పుడు నేను ఇలా చెప్పాను: "మీ మాట ఆశ్చర్యకరంగా ఉంది. ఈ విషయాలు మనం చర్చించడంకన్న మీ ఎవరి పలుకుబడీ అనవసరంగా వినియోగించ నక్కరలేకుండా- శాసన సభ్యులకే వారు యథేష్టంగా వ్యవహరించుకొనే అవకాశం వదిలివేయడం అత్యున్నతమైన పద్ధతి."

దానికి వారు, "మీరు చెప్పినమాట వాస్తవమే. కాని, మా పార్టీ పెద్దది గనుక మేము ఎవరిదో ఒక పేరు మా సభ్యులకు సూచించాలి గదా!" అన్నారు.

దాని కిలా జవా బిచ్చాను: "ఒక విశ్వాస రాహిత్య తీర్మానం సభలో ఆమోదింపబడినమీదట ప్రకాశంగారి ప్రభుత్వం పతనమయింది. పతనానంతరం, ఈ ఎన్నికలలో ప్రకాశంగారు, సంజీవరెడ్డిగారు, వారితో ఉన్నవారందరూ- నేను ఒక్కణ్ణి తప్ప, తిరిగి ఎన్నికయ్యారు. నాయకత్వం సహజంగా ప్రకాశంగారికి సంక్రమించాలి గదా!"

అందుకు వారు, "ఆయన చాలా పెద్దవారయిపోయారు" అన్నారు. నేను అందుకు ప్రత్యుత్తరంగా, "ఆయన పెద్దవారైతే, పని చేయడానికి ఆయనతోబాటు చిన్నవారంతా ఉన్నారు కదా! ఒక వేళ, ఆయన పేరు మీరు కాదనదలచుకొంటే, ఆయనతోపాటే ఉప ముఖ్య మంత్రిగా పని చేసిన సంజీవరెడ్డిగారున్నారు గదా! మీరు, నేను ఈ భాగం చర్చించే ముందు, ప్రకాశంగారితో మాట్లాడకుండా మీరు ఏమీ చేయడం మంచిది కాదు," అన్నాను.

నేను, దేబరుగారు, శాస్త్రిగారు మాట్లాడుతున్న సమయంలో రంగాగారు మా మాటలు వింటున్నారో లేదో తెలియదు. ఆయన మరేదో ఆలోచిస్తూ కూచున్నట్టుగా, కొంచెం ఎడంగా ఉన్నారు. ఆయన, గోపాలరెడ్డి విషయం చెప్పడానికి వచ్చినట్టుగా నాకు తెలుసు. ఆ వసతి గృహంలో ఆతిథ్యపు ఏర్పాట్లు కూడా, గోపాలరెడ్డిగారి నాయకత్వాన్ని బలపరచడానికి యత్నిస్తున్న వి. రామకృష్ణగారే చేశారు.

నేను అన్నదానిపైన దేబరుగారు నాతో, "పోనీ, ప్రకాశంగారితో మీరు మాట్లాడిరండి," అన్నారు.

"మీరూ వస్తే బాగుంటుంది గదా," అని నేనంటే, "అక్కరలేదు. మీరు వెళితే చాలును," అన్నారు.

ఆయనతోను, శాస్త్రిగారితోను- "నేను ప్రకాశంగారితో మాట్లాడి వచ్చి, ఆయన చెప్పినది మీతో చెప్పే వరకు, మీరు ఏ పేరూ సూచించకుండా ఉండాలి సుమండి!" అంటే, దేబరుగారు "అలాగే, మీరు వచ్చేవరకు ఏ పేరూ పైకి చెప్పబోము," అని అసందిగ్ధంగా చెప్పారు.

నేను రోడ్డు అవతల ఉన్న విశ్రాంతి భవనానికి, ప్రకాశంగారితో మాట్లాడడానికి వెళ్ళాను.

ఎండలో తిరిగి తిరిగి రావడంవల్ల, ఆయన నిద్రపోతున్నారు. ఆయనను లేపడానికి యత్నించాను. ఆయన లేవలేదు. ప్రక్కగది లోకి వెళ్ళి, సంజీవరెడ్డి గారితో, "దేబర్‌గారు ఏదో ఆలోచనలో ఉన్నట్టుంది. మీరు మాత్రం మెత్తపడకండి," అని ఆ ఒక్క ముక్క మాత్రం చెప్పి, తిరిగివచ్చి ప్రకాశంగారిని లేపాను.

ఆయన మెల్లిగా కళ్ళు విప్పి, "ఏమి జరుగుతున్నదయ్యా?" అని నన్నడిగారు. ఆయనతో- నేను దేబర్‌గారితో మాట్లాడిన విషయం గురించి రెండు మూడు వాక్యాలు చెప్పేసరికి, లాల్ బహద్దూర్‌శాస్త్రి గారు గది గుమ్మందగ్గరికి వచ్చేశారు. నేను ఆయనను చూసి, "ఏమిటి శాస్త్రిగారూ! అపుడే మీరిక్కడికి వచ్చేశారేమిటి?" అని ప్రశ్నించాను. ఆయన, "దేబర్‌జీ-గోపాలరెడ్డిగారి పేరు వెల్లడించారు," అన్నారు.

నేను, ఆశ్చర్యంతో—"నేను, ప్రకాశంగారితో మాట్లాడి, మీ దగ్గరికి తిరిగి వచ్చేవరకు ఏ పేరు సూచింపబోము అని మాట ఇచ్చారుగదా!" అని అడిగాను.

శాస్త్రిగారు, "నిజమే! కాని, దేబర్‌జీ పేరు ప్రకటించేశారు," అని చెప్పి, ప్రకాశంగారి మంచం దగ్గరికి నడవ నారంభించేసరికి, దేబర్‌గారుకూడా ఆ గదిలోకి వచ్చేశారు. వీ రిద్దరూ రావడంచూసి, ప్రకాశంగారు మంచంమీదినుంచి లేవబోతూంటే, దేబర్‌గారు, "మేము గోపాలరెడ్డిగారిని నాయకుడుగా, మీ పార్టీవారు ఎన్నుకోవాలని ప్రకటించేశాము. మీరు ఆయనకు మీ ఆశీర్వాదాలు ఇవ్వాలి," అని కొంత వినయంగానే అడిగారు.

ప్రకాశంగారు కనుబొమలు కొంచెం పైకెత్తి, తమకు స్వాభావికమైన మంద్రస్వరంలో, "మీరు గోపాలరెడ్డిగారి పేరు ప్రకటిస్తే, ఆయన ఎన్నికవుతాడు. నా ఆశీర్వాదాలు ఎందుకు?" అన్నారు.

దేబర్‌గారు గతుక్కుమన్నారు. నేను ఆయనను ఒక అడుగు అవతలికి తీసుకువెళ్ళి, "నేను వచ్చేవరకు ఏ పేరు చెప్పకుండా ఆగుతామన్న మీరు ఎందుకింత తొందరపడ్డారు?" అని అడిగాను.

ఆయన, "ప్రకటిస్తే ఏం ప్రమాదం?" అన్నారు.

నేను, "ప్రకాశంగారు ఎదురు తిరిగితే చాలా ఇబ్బందులు వస్తాయికదా!" అన్నాను.

ఆయన, "అయితే, మీరు ప్రకాశంగారిని కొంచెం సమాధానపరచండి. మీరు ఢిల్లీకి రండి. అన్ని సంగతులు సమగ్రంగా చర్చించుకుందాము," అని నాతో అని, ప్రకాశంగారివైపు తిరిగి, "విశ్వనాథంగారు ఢిల్లీ వస్తారు. ఆయనతో అన్ని సంగతులు మాట్లాడుతాను. ఇప్పటికి సెలవు ఇవ్వండి," అనగానే—ప్రకాశంగారు ఏ మాటా అనకముందే, 'దండము' అని చెప్పి గదిలోంచి వెళ్ళిపోయారు.

శాస్త్రిగారుకూడా "సెలవు" అని చెప్పి వెళ్ళిపోయారు.

దేబర్‌గారు కోరినట్టు నేను ఢిల్లీ వెళ్ళాను. ఇంతట్లో విజయవాడలో, ఎవరి ప్రోద్బలంవల్లనో తెలియదుగాని, ప్రకాశంగారు అప్పుడున్న పరిస్థితులపై ఒక ప్రకటన చేయబోతున్నారని పత్రికలలోపడింది.

నేను ఆ విషయం దేబర్‌గారికి చెప్పి, ప్రకాశంగారికి ఒక తంతి వార్త ఇప్పించాను. దాని సారాంశమిది: "ఆంధ్ర పరిస్థితులు మేమంతా ఆలోచిస్తున్నాము మీరు తొందరపడి ఏ ప్రకటనా చేయవద్దని మా కోరిక."

ప్రకాశంగారుకూడా కొంత సమాధాన పరచుకొని, తామిచ్చిన ప్రకటనలో, ప్రజలను రెచ్చగొట్టే వాక్యాలేవీ వ్రాయలేదు. కాని, అక్కడ ఢిల్లీలో దేబర్‌గారు, శాస్త్రిగారు వారు ఇదివరలో అన్నమాటలలో ఏ విధమైన మార్పుకీ అంగీకరించే ధోరణిలో లేరు.

## గోపాలరెడ్డిగారి ముఖ్యమంత్రిత్వము

నాయకుని ఎన్నుకునే దినం ప్రకటింపబడింది. నాడు కాంగ్రెసు భవనం పరిసర ప్రాంతాలన్నీ ఒక పర్వదినపు రూపదర్శనం ఇచ్చినవి. బ్రహ్మాండమైన ఎన్నికల విజయం తర్వాత శాసనసభ్యులు సమావేశం కావడం అదే మొదలు.

దానికి రెండు రోజులుముందు సంజీవరెడ్డిగారు ఢిల్లీ వెళ్లారు. ఎన్నిక సమయానికి తిరిగివచ్చారు. ఆయన ఎన్నిక హాలులోకి ప్రవేశించక పూర్వంనుంచి, ఆయనకోసం ఎదురుచూస్తున్న నేను, ఆయనను ఎదుర్కొని, "మీరు గట్టిగా ఉండండి. మేమంతా ఉన్నాం గదా," అన్నాను.

ఆయన చెవులు ఈ మాటలువిన్నా, కళ్ళుమాత్రం పరధ్యానంగా ఉన్నట్టు నిశ్చయమయింది. ఆయన తొందరగా సభామందిరంలోకి వెళ్ళిపోయారు. కార్యక్రమం ప్రారంభించేసరికి, గోపాలరెడ్డిగారి పేరు వినబడేసరికే ఆయన అంగీకారం చూపించారు. ఆ పైన ప్రకాశంగారు, నేను చేయవలసింది ఏమీ లేకుండా పోయింది. గోపాలరెడ్డిగారు ముఖ్యమంత్రి అయ్యారు. పూర్వంలాగునే సంజీవరెడ్డిగారు ఉపముఖ్యమంత్రి అయ్యారు.

కొన్ని నెలల తర్వాత సంజీవరెడ్డిగారు విశాఖపట్నం రావడం జరిగింది. తంతి తపాలా శాఖకు సంబంధించిన ఏదో నూతన కార్యక్రమ ప్రారంభ సందర్భంలో ఆయన వచ్చారు. ఆ సభలో ఏదో

సందర్భం చూసుకొని, ఉపన్యాసంలో ఇలా అన్నారు: "నేను ప్రకాశంగారు ముఖ్యమంత్రిగా ఉండగా, ఉపముఖ్య మంత్రిగా ఉండేవాడిని. ఇప్పుడూ ఉపముఖ్యమంత్రిగానే ఉన్నాను. ఇప్పటి మాటకేమిలెండి. చేస్తే ప్రకాశంగారితో కలిసే మంత్రిపని చేయాలి. ఆ వేగం, ఆ కార్య దీక్ష, ఆ ప్రజా సంక్షేమప్రేమ—మరే ముఖ్యమంత్రి పరిపాలనలోను కలుగవు అని నా మనస్సులో నిశ్చయమైంది!''

ఆ వేళ నిజంగా ఆయన మనసులో ఉన్నది ఉన్నట్టు చెప్పారు.

ఒకక్షణం ప్రకాశంగారి పరిపాలనా రథం—ప్రేక్షకులకు, శ్రోతలకు కళ్ళకు కట్టినట్టు కనిపించింది.

# 24

# విశ్రాంతి ఎరుగని కర్మవీరునికి సుదీర్ఘ విశ్రాంతి

అప్పటికే ప్రకాశంగారు వృద్ధులైపోయారు. ఆయన 1954 లో బెంగుళూరు ప్రైవేటు హాస్పిటలులో కేటరాక్టు (కంటితిమిరం)కు సంబంధించిన శస్త్ర చికిత్స చేయించుకున్నారు. దృష్టి కొంచెం తగ్గినట్టుగా ఇతరులకు అనిపించేదిగాని, ఆయన కన్ను నిండా తెరవకుండానే దూరంగా ఉన్నవారిని బాగా పోల్చుకోగలిగేవారు. ఇతరులు చెప్పింది అవగాహన చేసుకోవడంలో ఎటువంటి మాంద్యమూ ఉండేది కాదు. చదువుకోడానికి కాగితం కంటికి బాగా దగ్గరగా పెట్టుకోవలసిన అవసరం మాత్రం వచ్చింది. అయినప్పటికీ, కాగితంలో ఏ భాగంలో ఏ విషయం ఉందో ఆయనకు బాగా జ్ఞాపకముండేది.

ఒక రోజున కాబినెట్ మీటింగులో, నెహ్రూగారి దగ్గరినుంచి వచ్చిన ఒక ఉత్తరం చదివి వినిపిద్దామనుకొన్నాము. మాతో- తాను స్వయంగా చదవలేనందుకు ఏమీ అనుకోవద్దని, పర్సనల్ అసిస్టెంటును పిలిచి చదవమన్నారు.

ఆ చదవమనడంలో, మా కోరిక ప్రత్యేక విషయం చెబుదామని ఆయన ఉద్దేశం. పెర్సనల్ అసిస్టెంటు ఆ కాగితం చదువుతూ,

ఆ విషయానికి రాలేదు. "నువ్వు ఇంతసేపూ మొదటి పేజీలోనే ఉన్నావు. నాకు కావలసింది రెండవ పేజీలో చివర, ఒక క్రొత్త పేరాగ్రాపు ఆరంభంలో ఉన్నది. అది చదువు," అన్నారు.

ఆయన కాగితాలు స్వయంగా చదువుకోలేరని ఆయనపై జవహర్‌లాల్ నెహ్రూగారికి గవర్నరు 'ఉత్తరాలు వ్రాసిన రోజులవి.

ఆ ఉదంతం జరిగి ఏడాది అయిపోయింది.

పూర్వం రోజుకు రెండుగంటలు నడిచే ప్రకాశంగారు, ఇప్పుడు ప్రొద్దునవేళ, సాయంకాలంవేళ పది నిమిషాల నడకతో సంతృప్తి చెందవలసి వచ్చింది.

అయినా, హైదరాబాదు, విజయవాడ, చెన్నపట్నాల మధ్య పర్యటించడం, పాత మిత్రులను కలుసుకోవడానికి యత్నించడం ఆయన మానలేదు.

అన్ని కార్యాలలోను మనిషి సాయం కావలసిన రోజులు వచ్చాయి. కాని, అటువంటి పరిస్థితిలోనే, నేను ఢిల్లీలో ఉండగా, ఆయన- కొడుకూ అతని పిల్లలూ, ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారూ, మొదలైనవారితో కలిసి వచ్చారు.

నేను ఎంత కోరినా మా యింటి దగ్గర బస చేయక, కొడుకు ప్రోద్బలంవల్ల, నాకు అనవసరంగా కష్టం కల్పించడం ఇష్టం లేదనే నెపంమీద, 'ఇంపీరియల్' హోటలులో దిగారు. 3, 4 రోజులుండి, గోవిందవల్లభ పంత్‌గారితో మాట్లాడి విజయవాడ తిరిగి వెళ్ళారు.

ఆ రోజుల్లోనే ఉప్పులూరి వెంకటకృష్ణయ్యగారు తాను కోర్టు వేలంలో కొనుక్కున్న స్వరాజ్య ఆఫీసు భవనాలు అమ్మి, అందులో తాను ఖర్చు పెట్టిందిగాక అదనంగా వచ్చిన డబ్బు, ప్రకాశంగారి కొడుకు హనుమంతరావుకు అంతో, ఇంతో ఇస్తానని వ్రాసిన కాగితం నాకు చూపించారు. నేను అది బాగానే ఉన్నదని ఆయనను ప్రశంసించాను. కాని, తరువాత మాత్రం అలా జరిగినట్టు కనిపించలేదు.

ప్రకాశంగారు- సహజంగానే, సభావేదికమీద మాట్లాడవలసి వచ్చినప్పుడు, కొంతసేపటివరకు మాట్లాడ నారంభించక పోవడం

అందరికీ తెలిసిందే. అప్పుడు కూడా కొన్ని వాక్యాలు మాట్లాడిన తర్వాత, మధ్య మధ్య ఆగడం కూడా జరుగుతూండేది. అయినప్పటికీ, ఉపన్యాస వస్తువుకూ, క్రమానికీ ఏమీ భంగం ఉండేది కాదు.

వయసులో ఉన్నప్పటిలాగే ఎండల్లో కారు ప్రయాణాలు చేయడం ఆయన మానలేదు.

ఇంతలో విశాలాంధ్ర ఏర్పడింది. సంజీవరెడ్డిగారు ముఖ్య మంత్రి అయ్యారు. ఆంధ్రుల ప్రతిభ ప్రకాశవంతమైనదనే సంతృప్తితో ప్రకాశంగారు దేశం నలుమూలలకూ పర్యటిస్తూండేవారు.

1957 మే లో ఆ విధంగా అతి తీవ్రమైన ఎండలలో ఒంగోలు ప్రాంతంలో పర్యటించి, వడదెబ్బ తిని కారులోనే హైదరాబాదు చేరుకున్నారు. కొందరు మిత్రులు, ఆయన పడుతున్న బాధ చూసి హాస్పిటలులో చేర్చితే మంచిదని తీసుకుపోయి ఉస్మానియా హాస్పిటలులో చేర్చారు.

## అంత్య దృశ్యము

ఆ విధంగా, ప్రకాశంగారు 18 రోజులు ఆసుపత్రిలో ఉన్నారు. 19 వ రోజున చికిత్స చేయడానికి, అక్కడున్న వైద్యులు ఆయనకు ప్రాణవాయువు ఇవ్వడానికి, ప్రయత్నించారు. ప్రకాశంగారు లోగడ ప్రకృతి చికిత్సలోను, విద్యుత్ చికిత్సలోను మాత్రం నమ్మకమున్నవారు గనుక, ప్రాణవాయువు తీసుకోడానికి నిరాకరించారు.

కాని, 20 వ తేది ఉదయం ఆయనని చూడడానికి అక్కడికి వచ్చిన మంత్రి వి. బి. రాజు ప్రోద్బలంవల్ల ఆక్సిజన్ ఇవ్వడానికి తిరిగి ప్రయత్నించారు. అప్పటికే ప్రకాశంగారికి ఆ చికిత్సను నిరాకరించే శక్తి తగ్గిపోయింది. ఆ ప్రాణవాయువు ఆ రోజు ప్రకాశంగారికి ప్రయోజనకారి కాలేకపోయింది.

ఆయన నాడి అతి బలహీనమై పోయింది. కఫం కమ్ముకొని రా సాగింది. ఊపిరి తిత్తులు వ్యాధిపూరితము లయ్యాయి.

సాయంకాల మయింది.

అక్కడ ప్రక్కన వైద్యనిపుణులయిన కె. ఎస్. రావు, వెంకటస్వామి, దయాళ్‌దాసు, తాహి, చారి, బహదూర్‌ఖాన్, సయ్యద్, శ్రీమతి భారతి, శ్రీమతి లక్ష్మిగారలు మొదలైన ప్రఖ్యాతులంతా చుట్టూ ఉన్నారు.

ప్రకాశంగారి కొడుకు హనుమంతరావు- భార్య, పిల్లలతో మంచం ప్రక్కన నిల్చున్నాడు.

7-35 అయేసరికి- సామూహికంగా, దుఃఖసూచకంగా పెద్ద కేకలు అనుకోకుండా అందరి గొంతుకలలోంచి వినబడ్డవి.

అంతవరకు దేహస్థంగా ఉన్న ప్రకాశంగారి ఆత్మజ్యోతి, ఈశ్వర జ్యోతిలో కలిసిపోయింది.

ప్రక్క గదిలో నున్న అల్లూరి సత్యనారాయణరాజు, తనకున్న జబ్బుతోనే ప్రకాశంగారి మంచం దగ్గరికి ఒక్క గెంతులో వచ్చి, "అమ్మో" అని కేక వేశాడు.

అంతక్రితం, ఒక పది నిమిషాల ముందు వచ్చిన గోపాలరెడ్డి గారు అక్కడే ఉన్నారు. గోపాలరెడ్డిగారు వచ్చారని హనుమంతరావు తండ్రి చెవిలో చెప్పగా, ఆయన కళ్ళు సగం తెరిచి మాట్లాడడానికి యత్నించారు. కాని, యత్నించిన మాట రాకుండానే కన్నులు అలాగు ననే మూతపడ్డాయి.

అప్పటికప్పుడే హాస్పిటలు ఆవరణలోకి ఈ మరణ వార్త విని వందలకొద్ది ప్రజలు ప్రవాహంగా వచ్చేస్తున్నారు.

మేడమీదినుంచి, శరీరాన్ని క్రిందికి తెచ్చి, మంచుగడ్డల పేర్పు మధ్య పెట్టారు.

అంతలో, ఆంధ్రప్రదేశ ప్రభుత్వ ముఖ్య కార్యదర్శి ఎమ్. పి. పాయ్‌గారు అక్కడికి వచ్చారు. ఆ సమయంలో చిత్తూరులో పర్య టిస్తున్న ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు, ఈ వార్త విని- పర్యటన

కార్యక్రమం రద్దు చేసుకొని, తెల్లవారేసరికి వస్తున్నట్టు తంతివార్త ఇచ్చారు.

ప్రకాశంగారిపై గౌరవ సూచకంగా, ప్రభుత్వ కార్యాలయాలకు ఆ రోజు సెలవు ప్రకటించారు. ఉదయం రేడియోలో- ప్రకాశంగారు స్వర్గస్థులైనారన్న వార్త విని, ఉస్మానియా హాస్పిటలు ఆవరణలో వేలకొద్ది ప్రజలు క్రిక్కిరిసి పోయారు. ఒక్క అరగంటలో ఆ పరిసరాలలో గల రస్తాలన్నీ బహుజన సంకీర్ణములైనాయి.

జీవితకాలంలో, విశ్రాంతి అన్న మాట వినడానికి సహించని నాయకమణి, ఇపుడు దీర్ఘ విశ్రాంతి తీసుకుంటున్నట్టు- ప్రకాశంగారి ముఖము కనిపించింది. వడదెబ్బకు తట్టుకోలేక ఆసుపత్రికి చేరిన ఆ శరీరము, అతి శీలమైన మంచు పలకల మధ్య ఆ వడదెబ్బను పోగొట్టు కుంది.

అప్పటికి 56 సంవత్సరాల క్రిందట, స్వాతంత్ర్యోద్యమంలో చేరిననాడు, ఆయనను విడిపోయిన చందనాది పరిమళ ద్రవ్యాలు, సుగంధ కదంబ పుష్ప మాలికలు- ఇప్పుడు ఆయన ముఖం తప్ప మిగిలిన శరీర భాగాలన్నిటినీ ప్రీతితో తమలో ఇముడ్చుకున్నవి.

అంతలోనే- గోదావరి, కృష్ణా, గుంటూరు, ఖమ్మం మొదలైన జిల్లాలనుంచి దొరికిన రైళ్ళలో, బస్సులలో, కార్లలో వచ్చిన వేలకు వేలు ప్రజలు హైదరాబాదు నగరంలో నిండిపోయారు.

ఉదయం 8 గంటలయింది. ప్రకాశంగారి భౌతికదేహాన్ని వహించే భాగ్యం పొందిన అంబులెన్సు బండి ఆ దేహంతో గాంధీ భవనం, చేరుకుంది. గాంధీ భవనం, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సంఘ భవనము.

సాయుధ పోలీసు దళాలు అంబులెన్సు ముందుగా నడిచాయి. వారి వెంట మంత్రులు, కార్యదర్శులు, ఉద్యోగులు నడిచారు. వారిని ప్రజా తరంగాలు అనుగమించాయి.

అఫ్జల్ గంజి, సిద్ది అంబర్ బజారు, ఉస్మాన్ గంజి, ముజమ్ షాహి రాజపథము మొదలైన రస్తాల గుండా ప్రకాశంగారిని తీసుకు వెళ్ళే అంబులెన్సు బండీ వెళ్తున్నప్పుడు రెండు ప్రక్కల ప్రజలు దట్టమైన వరుసలలో నిల్చున్నారు. వారి ముఖాలలో, కళ్ళల్లో- చెప్పలేని ఆర్తి, స్పష్టంగా వ్యక్తమయే భక్తి కనిపించాయి.



విశ్రాంతి ఎరుగని కర్మవీరునికి సుదీర్ఘ విశ్రాంతి
(Courtesy: Director of Inf. & Pub. Relations, Govt. of Andhra Pradesh.)

గాంధీ భవనం దగ్గర ఒక ఎత్తయిన వేదిక కట్టారు. దానిమీద మంచుదిమ్మలు పరిచారు. వేదికకు నాలుగువైపుల రంగు రంగుల ముగ్గులు పెట్టి, నాలుగు మూలలా నాలుగు దీప స్తంభములు నిలిపారు. చుట్టూ పువ్వులు వరుసల్లో పేర్చారు. వలయాలుగా చుట్టుకుంటూ, వేదిక చుట్టూ ఉన్న అగరువత్తి ధూపములు, అఖండంగా సుగంధాన్ని వ్యాప్తం

చేశాయి. తుపాకులు తలక్రిందుగా తిప్పి పట్టిన సాయుధపోలీసులు నలు వైపుల నిలుచున్నారు.

మరణము దుఃఖకరమైనదే. కాని, పూర్వ వైరాలను మరపిస్తుంది. జన్మాంతర సౌహృదాలను పునరుద్భవింప జేస్తుంది.

కళా వెంకటరావుగారు—ప్రకాశంగారి భౌతిక దేహాన్ని అంబులెన్సు బండినుంచి దించి వేదికపై పెట్టడానికి చేయిసాయం చేశారు.

కస్తూరిబాయి విద్యాలయంనుంచి వచ్చిన ఆడపిల్లలు 'రామ భజన' చేశారు. మరికొందరు పెద్దలు 'గీతాపఠనం' చేశారు. వేద పండితులు 'వేద పఠనం' చేశారు.

పండిత జవహర్‌లాల్ నెహ్రూగారి పేరిట ఒక పెద్ద పువ్వుల దండను నీలం సంజీవరెడ్డిగారు మొట్టమొదట ప్రకాశంగారి భౌతిక దేహంపై పెట్టారు. తరువాత గవర్నరుగారి పేరిట, ఆయన కార్యదర్శి రెండవ పువ్వులదండ పెట్టారు. మూడవది పండిట్ గోవింద వల్లభ పంత్‌గారి పేరిట కళా వెంకటరావుగారు పెట్టారు. ఆ తర్వాత— ఐ. సి. ఎస్. ఉద్యోగులందరి పేరునా ముఖ్య కార్యదర్శి ఎమ్. పి. పాయ్ గారు; పోలీసుదళాల పక్షాన ఇన్స్పెక్టర్ జనరల్ నంబియారుగారు, ఆంధ్రాకాంగ్రెసు పక్షాన అల్లూరి సత్యనారాయణ రాజుగారు; తెలంగాణా కాంగ్రెసు పక్షాన నూకల నరోత్తమరెడ్డిగారు; హైదరాబాదు కాంగ్రెసు పక్షాన వాసుదేవ నాయక్‌గారు; కార్మిక సంఘాల పక్షాన రావి నారాయణరెడ్డిగారు; శాసన, శాసన విధాన, శాసన మండలుల సభ్యుల తరపున బద్దం ఎల్లారెడ్డి, మద్దం మొహిదీన్, అంజయ్య గారలు ప్రకాశంగారి దేహంపై పూలమాలలు ఉంచారు.

ఆ విధంగా సాయంకాలం నాలుగు గంటలదాకా పౌర జన ప్రవాహం నిరంతరంగా ప్రవహించసాగింది.

ఉదయమే, ప్రకాశంగారి తమ్ముడు శ్రీరాములుగారి కూతురు

ప్రఖ్యాత గాయనీమణి కుమారి సూర్యకుమారి అన్నదమ్ములతోబాటు వెక్కి-వెక్కి- ఏడుస్తూ, అడుగులు తడబడుతూ మంచుపలకలతో పేర్చిన ఆ మహావేదిక నెక్కి-, పెదతండ్రి ప్రకాశంగారి భౌతిక దేహదర్శనం చేసింది.

## కడసారి భూతలయాత్ర

సాయంకాలం నాలుగు గంటలయింది. చండభానుని ఉగ్రత తగ్గ నారంభించింది. ప్రకాశంగారి దేహాన్ని మంచుపలక వేదిక పైనుంచి దించి, పోలీసు దళానికి చెందిన ఒక మోటారు వాహనంలో ఉంచారు. ఆ వాహనానికి ముందుగా చాలా పెద్ద పూవుల దండ అమర్చారు.

ప్రకాశంగారి భౌతికదేహం భూతలంపై కడసారి యాత్రకు తరలింది.

ముందుగా ముఖ్యమంత్రి సంజీవరెడ్డిగారు, మంత్రులైన కళా వెంకటరావు, బసవరాజు గారలు, వెంట ముఖ్యకార్యదర్శి పాయ్‌గారు, ఆ ప్రక్క-నే అల్లూరి సత్యనారాయణ రాజుగారు, సచివాలయంలోగల పెద్ద ఉద్యోగులు, పౌర ముఖ్యులు—ఆ వాహనం ముందుగా నడిచారు.

వారి వెంట మోటారు సైకిళ్ళపై పోలీసు ఉద్యోగులు, వారి వెనుక పోలీసు బాజా బజంత్రీలు (బేండ్), వారి వెనుక పదాతులైన పోలీసు దళాలు, వారి వెనుక శాసన సభ్యులు, పౌర ముఖ్యబృందములు, వారి ననుసరించి వేలాది ప్రజాసామాన్యము ఆబిడ్స్ రాజమార్గం, బేంకురస్తాల గుండా కాచిగూడా రస్తాలమీదుగా నడిచి అంబర్‌పేట శ్మశానవాటిక చేరారు.

"ఎంత మనిషి పోయాడండీ!" "ఇంతటి అతను మరొకడు మళ్ళీ మనమధ్య పుడతాడా?" అనే మాటలుతప్ప ఇతరమైన మాటలు రాలేదు.

ప్రకాశంగారి భౌతికదేహాన్ని చివరిసారిగా చూడడానికి వచ్చిన లక్షల ప్రజల నోళ్ళనుండి అనుకోకుండానే ఈ మాటలు వెలువడడం జరిగింది.

సాయుధ పోలీసుదళములు మూడుసార్లు సామూహికంగా తుపాకులు పేల్చారు. స్వర్గస్థులయిన ప్రకాశంగారికి కడపటి వందన మది. ఆ సమయంలో అంత్యనాద వాద్య (Last bugle) బృందం, ప్రకాశంయుగం అంతమైందని భారత ప్రజలంతా వినేటట్టుగా, దశ దిశలు మారుమ్రోగేట్టు ప్రకటించారు.

రాజాజీ—భారతదేశ స్వాతంత్ర్య సమరంలో ప్రక్క-ప్రక్కగా నిలబడి, ప్రకాశంగారూ తానూ నడిపించిన కార్యాలకు స్మృతిచిహ్నంగా, ప్రకాశంగారి చితిపై ఉంచడానికని ప్రత్యేకంగా, మంచి గంధపు చెక్కను, పిడికెడు బియ్యాన్ని పంపారు. చితి అంటించేముందు బంధుమిత్రులు స్వర్గస్థులైన వారినోట బియ్యంవేయడం దక్షిణ హిందూదేశ ఆచారము.

శ్మశానవాటికలో 'భుగ, భుగ' మండే అగ్నిజ్వాలలు స్వర్గస్థులైనవారి చితిని దహించే వేళ, ఉపన్యాసా లిచ్చేవేళ కాదు.

అయినా, పాశ్చాత్య పద్ధతుల ననుసరించి—సహచర రాజకీయ నాయకులు స్వర్గస్థులైనవారి భౌతిక దేహదహన సమయమున, ప్రశంసాపూర్వకమైన ఉపన్యాసాలు ఇవ్వడాన్ని, స్వాతంత్ర్యానంతరం మననాయకులు అదొక బలవత్తరమైన అలవాటుగా చేసుకున్నారు.

గవర్నరు త్రివేదిగారు పంపిన సందేశం ముఖ్య కార్యదర్శి పాయ్‌గారు చదివారు. సంజీవరెడ్డి, కళా వెంకటరావు, అల్లూరి సత్యనారాయణరాజు గారలు భౌతికదేహాన్ని స్వర్గవాహకమైన చితిపై అమర్చారు. అప్పటి వేదోక్త కార్యక్రమాన్ని మైలవరపు లక్ష్మీనారాయణ గారు నడిపించారు.

సంజీవరెడ్డి, పద్మభూషణ్ మాడపాటి హనుమంతరావు, అయ్యదేవర కాళేశ్వరరావు, కొండా వెంకటరెడ్డి, కళా వెంకటరావు, నూకల నరోత్తమరెడ్డి, అల్లూరి సత్యనారాయణరాజు, వి.వి. రాజుగారలు—ప్రకాశంగారి నాయకత్వ లక్షణాలను, ఆయన జీవితంలోగల కృతార్థతను 'నభూతో, న భవిష్యతి' అని, పలువిధములుగా భాషాపటిమతో ప్రశంసించారు. వారి ప్రశంసా వాక్య సందేశాన్ని స్వర్గసీమకు తీసుకు

పోతున్నాయా అన్నట్టు, చితిపై అగ్ని జ్వాలలు, ఆకాశమార్గానికి ఎగిసి వెళ్లాయి.

ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంగారి ఆత్మజ్యోతి, విశ్వజ్యోతిలో కలిసిపోయింది.

ఆంధ్ర హృదయాలలో చీకటి సుడులు తిరిగింది.

## లోక్‌సభలో జోహార్లు

21 వ తేదీనాడు లోక్‌సభలో గోవింద వల్లభపంత్‌గారు ఇలా అన్నారు:

### ''నూతనాంధ్ర నిర్మాత''

''ఈ ఉదయం పత్రికల్లో ప్రకాశంగారి మరణవార్త పడింది. ఇది అతి విషాదకరమైన వార్త. ప్రకాశంగారి జీవితం, దేశ సేవకే అంకితమైన జీవితం. స్వాతంత్ర్య సమరంలో, ఆయన ప్రముఖమైన పాత్ర వహించారు. త్యాగాలు చేశారు. కష్టాలు పడినారు. ఎప్పుడూ సమరవాహినిలో ముందుగానే నడిచేవారు. ఆంధ్రదేశానికి ఆయనయందుగల అభిమానం, గౌరవం అపారములు.

ఆయన నూతన ఆంధ్రదేశానికి నిర్మాత. ధైర్యసాహసాలకు పెట్టింది పేరు. నిర్మాణ కార్యప్రతిపాదనాత్మకమైన అభిజ్ఞత ఆయనకుండేది. జీవితంలో ప్రతిక్షణం—ఆయన మేధస్సులోని ఊహా వైశిష్ట్యం, దేహమందుగల శక్తి భారత దేశసేవకూ, ముఖ్యంగా ఆంధ్ర ప్రజాభ్యుదయానికీ వినియోగించారు.

ఆయన కుటుంబానికి లోక్‌సభ సానుభూతి అందజేస్తున్నాను.''

### ''త్యాగదీక్ష, కార్యదక్షత గల మహావ్యక్తి''

ఆయన తర్వాత, భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు ఇలా అన్నారు:

"హోమ్ మంత్రిగారు చేసిన ప్రశంసకు అదనంగా నేను చెప్పగలిగింది లేదు. నాకు జ్ఞాపకమున్నంతవరకు 1920 ప్రాంతాలనుంచి 35 సంవత్సరాలుగా ప్రకాశంగారితో నాకు సాహచర్యం ఉన్నది. ఒక్కొక్కప్పుడు సంపూర్ణంగా మే మిద్దరం ఏకీభవించకపోయినా, ఆయన గుణసంపత్తిని నేను ఎప్పుడూ ప్రశంసాభావంతోనే గ్రహించేవాడిని.

నిత్య జాగరకమైన ఒక శక్తి, నిస్సందేహంగా ఆయనలో ఉండేది. వయోవృద్ధులైన తర్వాత, మానవులకు సహజంగానే కొంత శక్తి తగ్గడం చూస్తుంటాము. అయినప్పటికీ ప్రకాశం గారు కార్యాచరణలో చూపించే జాగృతి, శక్తి, త్యాగదీక్ష, కార్యదక్షత మన స్మృతిపథంలో స్ఫుటంగానే ఉన్నాయి.

మహా వ్యక్తి మన మధ్యనుంచి వెళ్ళిపోయారు. ఆయన మహత్వం ఆంధ్రదేశ నిర్మాతగా మాత్రమే కాదు. భారత రాజకీయ రంగమందంతటా ఆయన ప్రభావ ముండేది. ఆయన కీ రోజు మనం, ఈ విధమైన ప్రశంసాపూర్వకమైన అంజలి చేయడం చాలా ఉచితమైన పని."

"బ్రిటిష్ తుపాకులకు గుండె చూపిన సాహసి"

ఆయన తర్వాత లోక్ సభ అధ్యక్షుడు (స్పీకరు) శ్రీమాన్ మాడభూషి అనంతశయనం అయ్యంగారు ఇలా అన్నారు:

"ప్రధాన మంత్రిగారు హోమ్ మంత్రిగారూ చెప్పిన మాట లతో నేను సంపూర్ణంగా ఏకీభవిస్తున్నాను. వ్యక్తిగతంగా కూడా నాకు చాలా దుఃఖంగా ఉన్నది. ప్రకాశంగారితో కలిసి, ఆయన నాయకత్వాన పని చేసే అవకాశాలు నాకు చాలా కలి గాయి. ఆయన సంపన్నమైన పరిస్థితులలో తన జీవితం ప్రారంభించకపోయినా, రానురాను అత్యున్నతంగా పెరిగి, ఆంధ్రదేశానికి అగ్రనాయక స్థానం పొందారు. ఆయనకు గల దృఢ నిశ్చయం కార్యదీక్ష అనుపమాన మైనవి.

మనం సైమన్ బాయ్‌కాట్ (1928) చేసిన సమ

యంలో, చెన్నపట్నంలోగల ఇతర నాయకులు సైమన్ రాకను ఎదిరించలేక చెన్నపట్నం వదిలి వెళ్ళిపోయారు. ప్రకాశంగారు ముందుకు వచ్చారు.

మిలటరీ పోలీసులు ప్రజావాహినిని అడ్డబోయినపుడు, చొక్కా విప్పి, తనపై తుపాకి గుండును వారు పేల్చుకో వచ్చని గుండె చూపించిన సాహసి ప్రకాశంగారు. ఆయన తన సర్వస్వం (దేశస్వాతంత్ర్య సమరంలో) త్యాగంచేసిన మహావ్యక్తి. ఆయన బారిష్టరు. ప్రముఖ న్యాయవాదిగా వృత్తి చేసి గొప్ప ఆస్తి సంపాదించారు. నిన్న ఆయన మరణించిన నాటికి ఒక రాగి పాత్ర అయినా మిగలలేదు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికై ఆయన నిరంతర యత్నం చేశారు. ప్రజాసేవకు, త్యాగనిరతికి ఆయన పెట్టినది పేరు.

ఆయన ముఖ్య మంత్రిత్వము అయిన తర్వాతకూడా, ఆంధ్రప్రభుత్వం ఆయన సలహా సంపత్తిని ఆశిస్తూనే ఉండేది.

సకలాంధ్ర దేశం ఈ రోజున దుఃఖంలో నిమగ్న మయింది.

ప్రధానమంత్రి, ఆర్థిక మంత్రిగారలు మంచి ఔచిత్యం ప్రదర్శించారు.

సభ్యులు యావన్మంది ఒక్క నిమిషం నిశ్శబ్దంగా లేచి నిలవ వలసిందని కోరుతున్నాను.''

లోక్ సభ సభ్యులందరు లేచి తమ స్థానాలలో నిశ్శబ్దంగా నిలుచున్నారు.

ఆంధ్రదేశం నిశ్శబ్దమైంది.

## సానుభూతి సభలు, విగ్రహ ప్రతిష్ఠాపనలు

సానుభూతి సభలు, తీర్మానాలు అసంఖ్యాకంగా జరగడంలో ఆశ్చర్యంలేదు. ఆయన పేరిట యువజన సభలు స్థాపన కావడంలోనూ వింతలేదు.

కొంతకాలం తర్వాత, రాజమహేంద్రవరం పౌరులు, ఆ

పట్టణం కోట గుమ్మందగ్గర ఆయన కాంస్య విగ్రహాన్ని స్థాపించారు. ఆ విగ్రహాన్ని ఆవిష్కరించిన అప్పటి ముఖ్యమంత్రి బ్రహ్మానందరెడ్డిగారు, ప్రభుత్వపక్షాన హైదరాబాదులో శాసన సభా భవనానికి ఎదురుగా ప్రకాశంగారి మరొక కాంస్య విగ్రహాన్ని స్థాపించారు.

ఆయనకు ప్రకాశంగారి యెడల గురుభావముంది.

# 25

## ప్రకాశంగారి శతజయంతి

**1971** సెప్టెంబరు 10 న, ముఖ్యమంత్రి బ్రహ్మానంద రెడ్డిగారు ప్రకాశంగారి శతజయంతి ఉత్సవం జరపడానికి నిశ్చయించి, అప్పటిమటుకు లక్షరూపాయలు మంజూరుచేసి, ప్రారంభ సమావేశంగా, హైదరాబాదులోగల జూబిలీ మందిరంలో మంత్రులు, శాసన సభ్యులు, పౌరముఖ్యులు, కార్మిక పక్ష నాయకులు, రాజకీయ నాయకులతోకూడిన ఒక మహా సభను ఏర్పాటు చేశారు.

''అతిదూరదృష్టిగల మహామానవుడు''

ఆ సభకు ప్రారంభోత్సవం చేసిన రాష్ట్రపతి వి. వి. గారు తమ ప్రారంభోపన్యాసంలో ఇలా అన్నారు:

''ప్రకాశంగారు ప్రజా సంరక్షకులు. ఉజ్వలమైన శక్తిగల వ్యక్తి. బ్రతికి ఉన్నంత కాలం మనుష్యులమధ్య, అతి ప్రమాణమైన మహామానవుడుగా సంచరించేవారు. ప్రజా సమూహమును కూడగట్టుకొని, కదిలించి, నడిపించే శక్తి ఆయనలో హెచ్చుగా ఉండేది. వేలాది ప్రజలను అన్నివేళలా ఆకర్షించగలిగిన గుణవైశిష్ట్యము ఆయనలో ఉండేది. నిరుపమానమైన త్యాగశీలత ఆయన ముఖ్యగుణం........

''1916 లో నేను ఇంగ్లండునుంచి బారిష్టరుగా తిరిగి వచ్చినప్పుడు కార్యకారి, ముఖ్య న్యాయమూర్తి, శేషగిరి అయ్యర్‌గారల ఎదుట నన్ను న్యాయవాదిగా, బారిష్టరు పట్టీలో

చేర్పించవలసిందని ప్రకాశంగారు ప్రతిపాదించారు........

"ఆయన జ్ఞానం, అనుభవం నన్ను ఉత్తేజపరిచినవి. ప్రజారంగ మందు ప్రవేశించి, ఆయనతోబాటు పని చేయగలిగిన లాభం నాకు సమకూరింది. ఆయనా, నేనూకూడా మహాత్మా గాంధీగారి నిర్మాణ కార్యక్రమంలో ఉత్సాహం కలిగిన వారమే.

హరిజనాభ్యుదయం, చర్ఖా పరిశ్రమ విస్తరణ, ఉత్పత్తి వినియోగదారీ సంఘోద్యమం, ఫిర్కా అభ్యుదయ ఉద్యమములు ఆయన ముఖ్యమంత్రిగా ఉండగా స్థాపించబడ్డాయి.

"ప్రకాశంగారికి దూరదృష్టి హెచ్చుగా ఉండేది. కొన్ని సంవత్సరాల ముందుగా భవిష్యత్ కార్యక్రమం సాధించవలసిన లక్ష్యాలు ఆయన గ్రహించ గలిగేవారు.

"మన నాయకులలో పెద్దవారికి ఆ దూరదృష్టి ఉండేది కాదు."

రాష్ట్రపతి చెప్పిన మాటలు ముమ్మాటికీ సత్యం.

నవ్యాంధ్ర జనకుడు

భారత ప్రధాని ఇందిరాగాంధీగారు-

"స్వాతంత్ర్య జ్యోతిని సాహసంతో వెలిగించిన దేశ భక్తాగ్రశ్రేణికి చెందినవారు ప్రకాశంగారు. ముందు వెనుకలు చూడని ధైర్యము, దాతృత్వములవల్ల ఆయన ఒక పురాణ పురుషులయ్యారు. ఆయన ప్రవర్తనవల్ల వందలాది అనుయాయులు, దేశ స్వాతంత్ర్యంకొరకు త్యాగాలు చేశారు. నవ్య ఆంధ్రప్రదేశ జనకుడు ఆయన. భారత జాతీయోద్యమ నాయకుల శ్రేణిలో అగ్రశ్రేణికి చెందిన నాయకుడు" అని ఆ సందర్భంలో ఆమె వ్రాశారు.

నేను ఇంతవరకు చెప్పడానికి యత్నించిన బహుళ గ్రంథమును, ఆమె సంక్షిప్త సూత్రంగా చెప్పారు.

ప్రకాశంగారు ఆంధ్రప్రాంతాలలో పుట్టిన భారత జాతిరత్నం.

స త్య మే వ జ య తే